# మహతి

స్వాతంత్ర్య యుగోదయం (1947-'72) లో

తెలుగు తీరు తెన్నులు

**సమీక్షావ్యాస సంకలనం**

భారత స్వాతంత్ర్య రజతోత్సవ ప్రచురణ


సంపాదకవర్గం :

**డా. జి. వి. సుబ్రహ్మణ్యం**

**ఇరివెంటి కృష్ణమూర్తి**

**వంగపల్లి విశ్వనాథం**


ప్రచురణ





రిజిస్టర్ నెం : 1/64

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**MAHATHI**
YUVABHARATHI PRESENTS
A COLLECTION OF ESSAYS ON THE
POST-INDEPENDENCE TRENDS IN
TELUGU LANGUAGE, LITERATURE, &
CULTURE ON THE OCCASSION OF
SILVER JUBILEE CELEBRATIONS OF
INDIAN INDEPENDENCE


యువభారతి

ప్రచురణ : 9
ప్రథమముద్రణ : 12,000 ప్రతులు.
ఆగస్టు 14, 1972
ముఖపత్రరచన : శీలా వీర్రాజు
అక్షరాలంకరణ : సుధామ
ముద్రణ :
డి. ఎన్. ఎంటర్ప్రైసెస్, హైదరాబాదు-20.
ముఖచిత్రముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

**5 కింగ్స్‌వే, సికింద్రాబాదు - 3.**

ప్రచురణకు పూర్వం ఏడురూపాయలు విరాళ మిచ్చిన సాహితీప్రియులకు అందజేయబడింది.

వెల : ఇరవై రూపాయలు.

# మహతి

# ప్రేరణ

"ఏ దేశ మేగినా, ఎందు కాలిడినా...." – దేశాభిమానం అలాంటిది. పడరాని వాళ్ళూ, సహించనివాళ్ళూ 'దురభిమానం' అంటారు గానీ, ఏదో కొద్ది మోతాదులోనయినా ఆ అభిమానం మనసులో ఉండకపోతే అసలు పనులు సాగవు. అభిమానం విపరీతమై, విఱ్ఱవీగే స్థితి చేరనంతవరకూ ఎట్టి ప్రమాదమూ లేదు. "నా దేశం" అన్న అభిమానం ఉన్నందువల్లనే, నలుగురిలోనూ కలిగించగలిగినందుకే, దేశాన్ని పరహస్తాలనుండి విడిపించుకొని, స్వతంత్ర వాయువులు పీల్చటానికి మన కవకాశం కలిగింది. అది 25 ఏళ్ళక్రిందటిమాట. అందరూ ఎరిగిన చరిత్ర.

స్వాతంత్ర్యం వచ్చిన తొలిక్షణాన కెవ్వుమని మొదటికేకవేసిన పసిపాప ఇప్పుడు పాతికేళ్ళ యౌవనంలో పిటపిటలాడుతూ ఉంటాడు. మనిషికి ఉన్న జీవిత ప్రమాణంలో పాతికేళ్ళు పెద్దసమయమే. కానీ, ఒక దేశచరిత్రలో, జాతి గమనంలో, అదేమంత పెద్దసమయం కాదు. అయినా_ధ్యేయరహిత సంరంభంలో ఊరికే బ్రతికేస్తున్నవారిని మినహాయిస్తే _ ఎవరి మనుగడ దేశానికి ముఖ్యమో, వారి పాతికేళ్ళ జీవితమూ లెక్కింపదగినదే అవుతుంది.

"దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్ !" అని తెలుసు కోవడానికి ఇంకా ఎన్నాళ్ళు పడుతుందో మరి !

ఈ పాతికేళ్ళలోనూ మనదేశంలో చాలా మార్పులు వచ్చాయి. ఆలోచనా సరళి మారింది. జీవనపద్ధతులు మారాయి. అభిరుచులు, విలువల గురించిన అభిప్రాయాలు, నమ్మకాలు మారాయి. జనాభా విపరీతంగా పెరుగుతోంది. నిరక్షరాస్యత తగ్గించలేకపోయాం. నిరుద్యోగుల సంఖ్య దిగ్భ్రమను కలిగించే స్థితిని ఎన్నడో దాటింది. ధరలు ఆకాశాన్ని ఛేదించుకుని మరింకెటో, విశ్వాంతరాళంలోకి దూసుకుపోతున్నాయి. (1947 ధరల ప్రకారం లెక్కవేస్తే ప్రస్తుతపు రూపాయి కొనుగోలు విలువ కేవలం నలభై పైసలు మాత్రమే). నీతిమాలిన సంరంభం అంతటా తాండవిస్తోంది. మేధావివర్గం మన్నుతిన్న పాములవలె పడి ఉన్నారా అనిపిస్తోంది. నీతిమాలిన బ్రతుకులు చూసి, ఆశ్చర్యపడటం, బాధపడటం మానుకునే స్థాయికి జనం ఎదిగారు. ఒక నిర్లిప్తస్థితి, నిర్వికార పరిస్థితి, అస్తవ్యస్తపరిస్థితే సాధారణస్థితి అనుకునే మనస్థితి నేటి ఆలోచనాస్థితి. ఆలోచించడం మానుకోలేని వాడి రోదన వినే నాధుడున్నాడో, లేడో తెలియదు. నినాదాల చిరుతిళ్ళతోనే జనం మత్తుగా, గమ్మత్తుగా జోగుతున్నారు. నిజానిజాలు ఎన్నడు తెలుసుకుంటారో ? ఐదేళ్ళ కొకసారి – కొన్ని గంటల కాలం దీపావళిమతాబులవలె కొంతవెలుగు, నాలుగురోజులు అటూ, ఇటూ కొట్లాటలూ, పోట్లాటలూను– ఇదీ చైతన్యానికి చిహ్నం. ఇది బొరుసు.

జాతి జీవిత వ్యవస్థ చిత్రంగా తయారైంది. ఉత్సాహంతో, ఆదర్శాలతో, జీవితం ఆరంభించవలసిన యువకులుసైతం – నిర్వీర్యులవలె మారిపోతున్నారు. ఇంతకన్న జాతిభవిష్యత్తుకు గొడ్డలిపెట్టు మరింకేంకావాలి ! గతం వారి కుత్సాహా న్నివ్వడంలేదు. వర్తమానంలో ఆసక్తిలేదు. భవిష్యత్తుపై నమ్మకంలేదు. "నిర్జీవప్రతిమలు నయం" అనిపించేలా, "ఎందుకు వచ్చిందీ స్వాతంత్ర్యం ?" అనేలా వున్నాయి వేలాడుతున్నముఖాలు. ఎంత దురదృష్టం! ఎన్నోమార్పులు రావాలి. ముఖ్యంగా మనిషిమనిషిగా, మర్యాదగా, బ్రతికేందుకు అవసరమైన వాతావరణం సృష్టింపబడాలి. కనీస విలువలపై నమ్మిక మానవతా మర్యాదలపై విశ్వాసం కలిగేలా బోధనావిషయాలలో మార్పురావాలి. అట్టి వ్యక్తులకు అనువైన పరిసరాలను, అవకాశాలను సృష్టించి దోహదం చేయడం సమిష్టిగా సంఘం బాధ్యత.

నిజమే! బొరుసు బాధపెట్టేదిలా ఉన్నా, భయపెట్టే నల్లమబ్బులా వున్నా ఆ మబ్బుకు కనీసం అక్కడక్కడా తెల్లని జరీబోర్డరులా వెలుతురు రేకలూ ఉన్నాయి. ఇది బొమ్మ. బొమ్మ అంత అందంగా లేకపోవచ్చు. ఆశించిన ఒంపుసొంపులను సంతరించుకోలేకపోయి ఉండవచ్చు. కానీ, అన లంటూ బొమ్మ వుంది. బొమ్మలో ప్రాణం వుంది. ఎదిగే నైజం వుంది. ఇప్పు డైనా కనువిప్పి, జాగ్రత్తపడితే దేశాన్ని భూలోకస్వర్గం చేసుకోవటానికి అవసరమైన బీజం వుంది.

కోట్లాదిరూపాయలు వ్యవసాయం,పరిశ్రమలు,విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, రవాణా, విద్య, తదితరసంక్షేమ కార్యకలాపాలకు కార్యరంగాలలో వెచ్చించ బడ్డాయి. ఆహారవస్తువుల ఉత్పత్తి రెండింతలు పెరిగి "శ్యామలవిప్లవా"న్ని సాధించిపెట్టింది. ఏవో కొన్ని మరీ అధునాతనమైన వాటిని మినహాయిస్తే చాలా మటుకు స్వయంసమృద్ధిని సాధించగలిగాము. యుద్ధాలు – నేర్పినగుణపాఠాలు ఉన్నా –అవసరమైన చైతన్యాన్ని కలిగించి, ఆత్మస్థైర్యానికీ, జాతిసమైక్యానికి దోహదం కల్పించాయి.

వివిధ కీలకరంగాల్లో ఉత్పత్తి పెరిగింది. సాంకేతికంగా సవాలుచేయ గల స్థితికి చేరుకుంటున్నాం. సడలిన మూఢనమ్మకాలు మనిషిని కార్యోన్ము ఖుణ్ణి చేస్తున్నాయి. మానసికంగా జనం ఎదిగారు. అయినా చాలదు. వారిని కుంగదీసే పరిస్థితులు పెరిగాయి. హక్కులు గుర్తున్నంతగా బాధ్యతలు గుర్తు రావటంలేదు. సమ్మెలనీ, పోరాటాలనీ ఏదో ఒక అలజడి. ప్రతిపనికీ ఆది లోనే హంసపాదు. ఆర్థిక అసమానతలు సృష్టించే అసంతృప్తి ఎంతటి తీవ్ర తరమైనదో అందరికీ తెలిసినా ఎవ్వరికీ పట్టనట్లు ఊరుకుండి పోతున్నారు. ఏది ఏమైనా పరిస్థితి అన్యాయంగా ఉందనిపించినా "చీకటితెర తొలగునులే" అనే నమ్మకం కనీసం యువతరానికైనా ఉండాలి. ఆ నమ్మకాన్ని వాస్తవం చేసు కునేందుకు అవసరమైన ఓర్పు, నేర్పు సంతరించుకోవాలి. వివరిస్తూపోతే ఈ చీకటిలోతుల అంచనాలు, చిరుదివ్వెలు వెదజల్లుతున్న వెలుగు కిరణాల కాంతి, చాలాదూరం విస్తరిస్తుంది. అందుకే – వివరించిన పరిస్థితి దేశం మొత్తానికి చెందినదైయుండగా కాస్త అటూఇటూగా తెలుగుజాతికీ, తెలుగు

భూమికీ వర్తిస్తుంది. పాతికేళ్ళకు ముందు ఎలా ఉన్నామో? ఎక్కడ ఉన్నామో?? ఈ పాతికేళ్ళలో మధురమైనవి, మరపురానివి, మరచిపోవలసినవి, మార్చుకోవలసినవి, గమనించి, గుర్తుంచుకుని, గమనాన్ని సరిదిద్దుకుని, గమ్యం వైపు సాగాలి – అన్న అభిప్రాయమే మా యీ "మహతి" ప్రచురణకు ఊపిరి సలపనివ్వని తొందరపెట్టింది.

అందుకే "స్వాతంత్ర్య యుగోదయంలో తెలుగు తీరుతెన్నులు"-నూరు సమీక్షా వ్యాసాల సంకలనం "మహతి"గా రూపొందుతోంది.

* * *

'పెళ్ళి చేసిచూడు, ఇల్లు కట్టిచూడు' అంటూ ఆయా పనులలోని కష్టాన్నీ, ఆ పనులు సక్రమంగా నిర్వహించడానికి కావలసిన అనుభవాన్నీ, ధనాన్నీ సూచిస్తూ, తెలుగులో నాటికీ, నేటికీ సామెతలో ప్రస్తావించబడ్డ విషయం వాస్తవమే। తనకు వాస్తవమైన అనుభవాలకు యువభారతి సామెతల ప్రతిపత్తి కలిగించలేదు గానీ, వ్యాసాలు సేకరించటములోనూ, పుస్తక రూపంలో ఒకచోట అచ్చుపోయటంలోనూ, కావలసిన డబ్బును తెలుగుసోదరులనుంచి వసూలుచేసుకోవటంలో వైఫల్యం పొందటంలోనూ, మాకు కలిగిన అనుభవాలు "పగవాడికైనా వద్దు" అనేలా ఉన్నాయి. ఈ అనుభవాలను వివరించటం సమావేశకర్తగా నా బాధ్యతగా భావిస్తున్నాను. కేవలం మా కష్టం చెప్పుకుందామనీ, ఎక్కడైనా సహాయ సహకారాలు దొరుకుతాయనీ, స్వీకరిద్దామనీ మాత్రమేకాదు ఈ గోడు వెళ్ళబోసుకోవడం. సమాజ స్థితికీ, నేటి పరిస్థితులకూ చాలామటుకు తోటి తెలుగువాడే కారణం అని అనిపిస్తోంది. జాతి గమనానికి అవసరమైన బరువు బాధ్యతలు తమ నెత్తిపై వేసుకుని, మార్గదర్శకులవవలసిన మేధావివర్గంలో చాలామంది ఇంతటి అలసభావంతో, ఒకింత అసూయతో, మరింకింత స్తబ్ధతతో, చేతకానివాడి నిర్లిప్తతతో, కేవలం మాటలేతప్ప కార్యరూపం దాల్చని ఆరంభశూరత్వంతో వెలుగుతూండగా దేశస్థితీ, ప్రజల పరిస్థితీ మరింకోలా ఉండటాని కవకాశం ఉండదు.

"మహతి"లో నూరువ్యాసా లుండాలని నిర్ణయించి, ఏ యే విషయాలపై వ్యాసాలుండాలో మనసులో స్థూలంగా అనుకొని, ఆయా విషయాలపై ఎవరు

వ్యాసం వ్రాయటానికి అర్హులో, సమర్థులో నిర్ణయించుకుని వా రొప్పుకొనక పోతే ప్రత్యామ్నాయంగా రెండవ, మూడవ మనుష్యులుగా ఎవరి నభ్యర్థించాలో నిర్ణయించుకుని, ప్రతి విషయానికీ "ఇన్ని పేజీలు" అని కేటాయించి, మొత్తం పథకాన్ని "వ్యాసాల సేకరణ, అచ్చుపని పూర్తి వివరాలతో సహా" ఫిబ్రవరి 1972 నాటికి సిద్ధపరిచాం.

కొందరు వ్రాయ మన్నారు. కొందరు వ్రాయలేమన్నారు. కొందరు సూచించబడ్డ విషయంలో మార్పు కోరారు. మిగిలిన వ్యాసకర్తల విషయంలో "ఉచిత" సలహాల నిచ్చారు కొందరు. ఎలాగైతేనేం_దాదాపు రెండువందల పైచిలుకుమందిని ఈ సందర్భంలో కలుసుకోవటం, వ్యాసకర్తల విషయంలో తుది నిర్ణయం జరిపి, వారి ఆమోదాలు పొంది, "మహతి" ప్రత్యేక కరపత్రం విడుదలచేయటం జరిగింది. ఈ కార్యక్రమం రెండునెలలు పట్టింది. ఎప్రిల్ నెలలో కరపత్రం విడుదల చేశాం. అది ఒక అనుభవం.

వ్రాయటాని కొప్పుకున్న వాళ్ళని దాదాపు ప్రతిపదిరోజుల కొకసారి-"వ్యాసం వారు వ్రాయాలన్న విషయాన్ని గుర్తుచేస్తూ - ఉత్తరాలు వ్రాసి, వెళ్ళి కలసి _ విసిగించాం. అందరూ "విషయసేకరణలో పడివున్నా" మని మనవి చేసినవారే. చాలామంది గడువుతేదీని ఖాతరు చేయులేదు సరికదా, ఆగ్రహించినవారూ ఉన్నారు. వ్రాయలేమని కబురంపి, ప్రత్యామ్నాయపు ఏర్పాట్లు చేసుకోమని సూచించిన పెద్దలూ ఉన్నారు. వీలున్నంతవరకు మాటయిచ్చిన నూరు విషయాలపై వీలున్నన్ని వ్యాసాలు సేకరించగలిగాం. చెప్తేబాగుండదు కానీ, ఇంతవరకూ చెప్పి మొహమాటాలకు లోబడి, మానుకోవటం ఇష్టంలేదు. నగటున ఒక్కొక్కరూ పదేసి సార్లైనా తిప్పించుకున్నారు; చెప్పించుకున్నారు; "వ్యాసం ఇదిగో, అదిగో" అంటూ అయిదారు టెలిగ్రాము లిచ్చిన సందర్భాలు ఉన్నాయి. ఒక్క ఉదాహరణ మనవిచేస్తాను. ఆగస్టు 7 వ తేదీన ఒక ఉత్తరం అందుతుంది. అందులోనివిషయం-"వారం, పదిరోజుల్లో వ్యాసం పంపుతాను; ఎదురు చూడగలిగితే చూడండి" అంటూ. 700 పేజీల పుస్తకం అచ్చువేసి, 14 వ తేదీనాడు ఆవిష్కరించి, ఆనాడు రసీదులు తీసుకువచ్చేవేలాది మందికి పుస్తకాన్నివ్వటంలో ఉన్నశ్రమను అంచనా వేయగలిగిన ఏవ్యక్తి ఇలాంటి సమాధానం ఇచ్చి మనస్సును బాధపెట్టడు. దాదాపు అయిదు నెలల సమయ మిచ్చినా

వ్యాసం ఇవ్వని పెద్దలూ ఉన్నారు. ఆగస్టు 11 వ తేదీవరకూ అందిన వ్యాసాల్ని కూడా ఇందులో ముద్రిస్తున్నాం. నాలుగు పేజీలు వ్రాయమంటే 30 పేజీలు సుదీర్ఘవ్యాసాల్ని పంపిన సహృదయులూ ఉన్నారు. పెద్దలందరూ పంపినవి పంపినట్లుగా అచ్చువేస్తే "మహతి" దాదాపు 2000 పేజీల గ్రంథంగా తయారై ఉండేది. 700 పేజీల పుస్తకాన్ని 7 రూ॥ల కందించటంలో ఉన్నసాధక బాధకాలను అర్థంచేసుకోగల అనుభవమున్న వ్యక్తులకు మాపరిస్థితులు బోధ పడుతాయి. వ్యాసాలను సంక్షిప్త పరచక తప్పింది కాదు. "వ్యాసకర్త లేమను కోన్నా సరే" అని మొండికెయ్యాల్సి వచ్చింది. కొన్నిసందర్భాలలో సూచించిన విషయ మొకటైతే, వ్రాసి పంపిన విషయం మరొకటి. అసలు విషయానికి ప్రాముఖ్యాన్ని తగ్గించి, కబుర్లతో కాలక్షేపం చేసినవారు ఉన్నారు.ఎలాగైతేనేం మొత్తానికి విసిగించి, వ్యాసాలు సేకరించాం. మాపాట్లు భగవంతుడికే ఎరుక.

అనావృష్టివల్ల అసలే బంగారంలా రాజ్యం చేస్తున్న కాగితం దాదాపు కనపడకుండా మాయమైంది. ఎక్కువ డబ్బిద్దామన్నా దొరకదు కాగితం. కావలసిన తెల్లకాగితం సంపాయించటంలో విపరీతమైన మానసికశ్రమకూ, వ్యథకూ లోనయ్యాం. అచ్చుపోస్తామని మాటిచ్చినవారి అంచనాల తారుమార్ల వల్ల, అనేక అనివార్య కారణాలవల్ల సమయానికి తీసుకురాగలగటం మహా ప్రళయమైంది. ఇదొక అనుభవం. ఇవన్నీ ఇలా ఉండగా "అబ్బే ! ఈ పుస్తకం మాకేందుకండీ?" అన్న సహృదయులే ఎక్కువమంది తారసిల్లారు. "క్రిందటి సంవత్సరమేకదా రెండురూపాయ లిచ్చాం మీకు" అంటూ గత సంవత్సరం వారు "కావ్యలహరి"కి ఉదారంగా ఇచ్చిన 2 రూ॥ల విరాళాన్ని మరోసారి మాకు జ్ఞప్తికి తెచ్చి చల్లగా ఊరుకున్నవారూ ఉన్నారు. "ఏం ! మీ రీపని చేయకపోతే ఏం మునిగి పోయింది? ఎందుకిలా జనాన్ని వేధించుకు తింటారు?" అంటూ హెచ్చరించిన సహృదయులూ కనపడ్డారు.

ఇలా చెప్పుకుంటూపోతే ఇది నిజంగా మరో భారత మౌతుంది.అందుకే ఇక్కడ వదిలేస్తున్నాను. ఇంతకూ చెప్పదలచిన దేమిటంటే"జనం ఎందుకిలా ప్రవర్తిస్తారో" మాకు అంతుపట్టలేదు. యువభారతి కేవలం నిమిత్తమాత్రం. కృషి నిరంతరాయంగా జరుగుతూ ఉండాలి. కానీ ఇలాంటి చేదుఅనుభవాలు ప్రతిసారీ తారసిల్లితే మరింకెవ్వరూ సాహసించటానికి పూనుకోరు.

నాకుగానీ, మా యువభారతీయులకుగానీ కోపం రాలేదు. నవ్వుదా మంటే నవ్వు రావటంలేదు. మాబాధల్లా "ఏందుకిలా ఉన్నారు తెలుగువాళ్ళ"నే. తెలివితేటల్లో తీసిపోరు. అయినా దేశంలో సముచితస్థానాన్ని పొందలేక కేవలం ఐకమత్యం లేని, నిర్మాణాత్మకదృక్పథం లోపించిన జాతిగా ప్రతి కేయాల్సివస్తోంది. ఎవరు, ఎప్పుడు ఈ మత్తును విడగొట్టగల్గుతారోగానీ, ఆ శుభదినంకై ఓపికున్నంతవరకూ యువభారతీ, అందులోని మేమూ కృషి చేస్తూ ఉంటాం.

1970 లో "మారుతున్న విలువలు – రచయితల బాధ్యతలు" గోష్ఠి, ఆగోష్ఠి వ్యాసాల సంకలనం "రచన" పెద్దల మన్ననలను పొందింది. మాపై బాధ్యతా పెరిగింది.

స్వాతంత్ర్యరజతోత్సవ సందర్భంగా ఏదైనా పెద్దఎత్తున తలపెట్టమని మాకుచూచాయగా సూచించి, మా ఆలోచనలకు బీజంవేసినవారు మిత్రులు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు. ఈసమయంలో వారిని జ్ఞప్తికి తెచ్చుకొని మాకృతజ్ఞతలను తెలియ చెప్పుకొంటున్నాం.

యువభారతికి అర్థబలం ఎలాగూ లేదు. ఉన్నఅంగబలమూ అంతంత మాత్రమే. ఈ బృహత్ కార్యాన్ని ఆరంభించాలా వద్దా అన్నఆలోచనతో కొట్టుమిట్టాడుతున్న సమయంలో "పదండిముందుకు. మీకు భయమెందుకు ? పూర్తిసహాయ సహకారాలుంటా" యని ధైర్యంచెప్పి ఆద్యంతమూ మాట నిల్పుకున్న మనీషి డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారు. వారు లేకుంటే ఈ కార్యక్రమం యువభారతి తలపెట్టి ఉండేది కాదు; ముగించిఉండేది అంతకన్నా కాదు. కృతజ్ఞతలు చెప్పుకోవటానికి మాటలుచాలవు. వారుచేసిన సహాయం అలాం టిదీ, అంతటిదీను. కృతజ్ఞతల కక్షరరూపం ఇచ్చి వారిసహృదయానికి లెక్క కట్టదల్చుకోలేదు నేను.

"మహతి" న్యాయానికి పెద్దఎత్తున ప్రభుత్వంనుండి ప్రత్యేకగ్రాంట్లు పొంది ఒక రీసెర్చిప్రోజెక్టుగా కొనసాగి ఉండవలసినంతటి బృహత్ప్రణాళిక. ఎందుకోగానీ ప్రభుత్వవర్గాలవారు అంత ఆదరంగా స్వీకరించలే దీ ప్రణాళి కను. ప్రభుత్వవర్గాలలోని పెద్దలు సాదరంగా ఆహ్వానించలేదు. సహాయానికై మేము పెట్టుకున్న దరఖాస్తు (ఈనాటికి నాలుగు నెలలు దాటింది) ఇంకా పరిశీ

లనలోనే ఉంది. ప్రజ లెన్నుకున్న ప్రభుత్వం కాబట్టి ప్రజల్నే అనాలికాబోలు. మే మెవర్నీ ఏమీ అనదల్చుకోలేదు. మా అదృష్టంగురించి కాదు మా బాధ. తెలుగువారిగురించి మా ఏడుపు.

ఈ చీకట్ల కీకారణ్యంలో మాకు కనపడ్డ వెలుగు లేక మా హితవరుల నుండి లభించిన ప్రోత్సాహసహకారాలు. ఈ ప్రణాళికకు రూపం ఇవ్వటంలో సహృదయాన్నీ, తమ అనుభవాన్నీ రంగరించి సలహాల నొసగి సహకరించిన పెద్దలు సర్వశ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, దివాకర్ల వేంకటావధానిగారు, డా. సి. నారాయణరెడ్డి గార్లకి మా మనఃపూర్వక కృతజ్ఞతాంజలులు.

యువభారతి తలపెట్టిన భారతస్వాతంత్ర్య రజతోత్సవాలకు అధ్యక్షులుగా ఉండటాని కంగీకరించి ఇతోధికప్రోత్సాహాన్నందించిన శ్రీ అక్కిరాజు వాసుదేవరావుగారికి ప్రత్యేకంగా కృతజ్ఞత లందజేస్తున్నాను.

తెలుగువారు తోటివారితో కలిసి పాతికేళ్ళ స్వతంత్ర జీవితం గడిపారు. తెలుగువారి జీవితానికి మేం ఎత్తిపట్టిన చిన్న అద్దం మహతి. పాతికేళ్ళ స్వతంత్ర జీవితం ఇలాగే వుంటుందా? అన్న విషయం పెద్దలు గమనించాలి. మేం వేసిన అంచనా చూసి, అవసరమైన మార్పులకు నాంది పలుకగలుగుతే మంచిది. తెలుగువారికి ఐకమత్యం అవసరమనీ, నిర్మాణాత్మక దృక్పథం అలవర్చుకోవాలనీ, సమాజాభ్యుదయానికి సంఘటితంగా పునరంకితం కావాలనీ తెలుగు సోదరులు గమనిస్తే—మా కదే చాలు.

వంగపల్లి విశ్వనాథం
సమావేశకర్త.

యువభారతి

# ఎందరో మహానుభావులు ....

అలలన్నీ కలిసి కడలిగా కలిసి వుంటాయి. ప్రతి అలా అంద మొలికిస్తూనే వుంటుంది. కానీ, అలల కూడలి విన కడలి అందం వేరు. ఏ అల కాఅల అందంగానే వుంటుంది. యువభారతికి, మహత్తరమయిన ఈ కృషిలో ఎందరో తోడ్పడ్డారు. మహతి_శతతంత్రీ విపంచి. నిజమే. శతాధిక విషయాలలో, వంద లాది సహృదయుల మనస్ఫూర్తి సహకారాలు లభించాయి. ఇవన్నీ కలిసినా చాలకపోయిందన్న విషయం వేరు. అంతమాత్రాన, సాయంచేసినవారికి కృతజ్ఞ తలు చెప్పక వూరుకోలేము గదా!

ముందుగా, మహతి ప్రణాళికకు సూచన నిచ్చిన, డా॥ అక్కిరాజు రమాపతిరావుగారికి, ప్రణాళిక రచనలో, నిర్వహణలో తోడ్పడిన, మహతి హితవరులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, ఆచార్య దివాకర్ల వేంకటావ ధానిగారు, డా॥సి.నారాయణరెడ్డిగార్లకు మనఃపూర్వ కృతజ్ఞతలు.సంపాదకత్వపు బరువు బాధ్యతలను నిర్వహించిన సంపాదకవర్గానికి, ముఖ్యంగా డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి కృతజ్ఞతలు.

"మహతి"కి తమ వ్యాసాలను ఇచ్చి, ఈ ప్రణాళిక సాహిత్యపరంగా జయప్రదమయ్యేందుకు సహకరించిన సాహితీవేత్తలకు, వ్యాసకర్తలకు హృదయ పూర్వక అభివాదములు.

"మహతి" హితవరులుగానే గాక వారికి మాపై వున్న అభిమానంకొద్దీ అనేకవిధాల సలహా సహకారాలతో సాయపడిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి మా మనఃపూర్వక కృతజ్ఞతలు.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాల అధ్యక్షులుగా వుండుటకు అంగీకరించిన శ్రీ అక్కిరాజు వాసుదేవరావుగారికి, ఆ సంఘంలో సభ్యులుగా నుండి సహకరించిన ఇతరులు శ్రీ పి. వి. రాజగోపాల్, శ్రీ జి. ఎల్. సంఘి, శ్రీ కె. బి. సత్యనారాయణగార్లకు మా ధన్యవాదాలు.

"మహతి"ని ఆవిష్కరించిన సహృదయులు, సాహితీవేత్తలు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ పి. వి. నరసింహారావుగారికి, ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన విద్యాశాఖామాత్యులు మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారికి మా కైమోడ్పులు.

ఆవిష్కరణ సభలో పాల్గొని, "స్వాతంత్ర్య యుగోదయంలో సాహితీ సందర్శనం" పై తమ ఉపన్యాసాన్ని కావించిన మహాకవి దాశరథిగారికి, మా కృతజ్ఞతలు. 'మహతి' సందర్భంగా మేము నిర్వహించిన వక్తృత్వ, వ్యాసరచన పోటీల విజేతలకు బహుమతులను అందజేసిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి కృతజ్ఞతలు.

ప్రచురణపూర్వవిరాళాలను సేకరించడంలో పందలాది మిత్రులు తోడ్పడ్డారు. వీలున్నంతవరకు, గుర్తున్నతవరకు వారి పేర్లు ప్రకటించాము అనుబంధంగా. పొరబాటున కొందరిని విస్మరిస్తే, మన్నించండని మనవిచేస్తూ-వారందరి సహకారంవల్లనే, ఈ మాత్రమైనా చేయగలిగామని, కృతజ్ఞులమని మనవి చేస్తున్నాము.

అవసరమైన ఆర్థికవనరుల సేకరణలో సహకరించిన శ్రీ అక్కిరాజు వాసుదేవరావు, శ్రీ కుర్మా వేణుగోపాల స్వామి, శ్రీమతి ఇ. వసుమతిరెడ్డి, శ్రీ జి. యల్. సంఘిగార్లకు మా హృదయపూర్వక వందనములు.

అచ్చుకు కావలసిన కాగితం సమకూర్చిన, ఆర్. ఎమ్. త్రివేది కంపెనీ వారి శ్రీరాజమణిగారికి కృతజ్ఞతలు. ఆర్థికంగా ఆదుకున్న శ్రీ జి. యల్. సంఘి, శ్రీ ఏ. శ్రీరామశర్మ, శ్రీ వి. రామకృష్ణయ్య, శ్రీ ఎస్. పాండురంగారెడ్డి, శ్రీ కె. బి. సత్యనారాయణ, శ్రీ. కె. విఠల్‌రెడ్డిగార్లకు మా కృతజ్ఞతలు. సమావేశం నిర్వహణలో తోడ్పడిన ఆంధ్రసారస్వత పరిషత్‌వారికి,ముఖ్యంగా శ్రీహరి కిషన్‌రావుగారికి మా నమస్సులు.

"మహతి"కి అంకెలతో ఆకృతి నిచ్చి, మామనస్సుల నాకట్టుకున్న సహృదయులు, చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజుగారికి కృతజ్ఞతలు. అవసరమైనచోట అక్షరాలంకరణ కావించి తోడ్పడిన మానఘ్యులు శ్రీ సుధామకు కృతజ్ఞతలు. అన్నీ ఒకఎత్తు పుస్తకం అచ్చుపేయడం ఒక ఎత్తు. శ్రీ దాసు నరసింహారావు గారికి, శ్రీ అప్పారావుగారికి కృతజ్ఞతలు తెలియ చెప్పుకోవాలి. ఇదే సమయంలో, ఆపదలో ఆదుకుని అంతిమ విజయానికి ఎంతో దోహదం చేసిన శ్రీ నారాయణరావుగారికి, శ్రీ బడేసాహెబ్‌గారికి, శ్రీ గండయ్యగారికి ఋణపడి వుంటాము.

అట్టను అచ్చులో సింగారించిన శ్రీ విస్టాప్ ప్రెస్ వారి శ్రీ నారాయణ గారికి కృతజ్ఞతలు. తదితర అచ్చుపనులకు సాయపడిన శ్రీ విజయశ్రీప్రెస్ వారికి కృతజ్ఞతలు. బ్లాకులు తయారు చేసిన శ్రీ మోహన్ ప్రోసెస్ వారికి కృతజ్ఞతలు.

700 పేజీల 'మహతి'ని ఏడు రూపాయలకే అందిద్దామని వూసుకున్న మాకు, అనుకున్నంతగా ప్రోత్సాహ సహకారాలు లభించకపోయినా, విరాళాలు అందించిన వేలాదిమందికి మాకృతజ్ఞతలు. విరాళాలు సేకరించిన వందలాది మిత్రులకు మరోసారి కృతజ్ఞతలు తెలియ చెప్పుకుంటున్నాము.

మరెందరో మహానుభావులు...

# అందరికీ మా వందనములు

# * సంపాదకీయం

మహతి మ్రోగుతోంది।

సప్తస్వర విన్యాసం వినిపిస్తోంది।
సమకాలీన సారస్వత సంరంభానికి ప్రతీకగా పలుకుతోంది।
సమన్వయ రాగాలాపనకు స్వరమేళలు కల్పిస్తోంది।
సరిక్రొత్త సాహిత్య సమారోహానికి సామగానం సారిస్తోంది।
స్వాతంత్ర్య రజతోత్సవాలకు సరిక్రొత్త కానుక అందిస్తోంది।

సమకాలీన సారస్వత సమాలోచనం సామాన్యంగా తగాదాల పుట్ట। విభిన్న గళాలతో, వినూత్న ప్రయోగాలతో, వేయి గొంతుకలు, వేల మార్గాలలో తమ వైలక్షణ్యాన్ని వినిపించి వికసింపజేసుకొనే విక్రాంతిశీలం సమకాలీన సారస్వత రంగంలో సర్వసాధారణం। స్వాతంత్ర్యం వచ్చిందని సరసగీతాన్ని పాడేవారు కొంతమంది, మన కింకా పారతంత్ర్యం వదల్లేదని విరసంగా విప్లవ గీతాల్ని వినదించేవారు మరికొంతమంది. మనం మనంగా బ్రతకాలని మనుగడ మాటవల్లించేవారు కొంతమంది; మనం ప్రపంచాగ్నిలో మరొకసమిధగా ఆహుతి కావాలని ప్రబోధించేవారు మరి కొంతమంది. భూలోకానికీ సువర్లోకానికీ సంప్రదాయ సందేశంతో ఛాందస సంబంధాన్ని శాశ్వతం చేద్దామని ధ్వని చేసేవారు కొంతమంది; మన్నులో మనిషి బ్రతకటమే మరోప్రపంచ మని మహాప్రస్థానం

చేసేవారు మరికొంతమంది. గతాన్ని హతంచేసి సారస్వత సవనంలో సురభిళ ధూమరేఖను వర్తమాన లలాటతిలకంగా తీర్చిదిద్దే సోమయాజులు కొంతమంది; గతాన్ని హతంచేసి మతంతో మాటుపెట్టి ఎత్తుపల్లాల్ని సమంచేసి రక్తసిందూరంతో రాజ్యం చేద్దామనేవారు కొంతమంది. ఇందులో ఎవరూ తక్కువ తిన్నవారు కారు; తమ లోపాన్ని మభ్యపెట్టినా, తమ ఆశయాన్ని తాటిచెట్టెక్కించి, చిత్తశుద్ధి లేకపోయినా శివకీర్తనం సాగించి, భక్తసమాజాలను బజారులో నడిపించి, కలాన్ని వీలునుబట్టి వత్తిగా, కత్తిగా, సుత్తిగా చూపించి సమాజంలో సంఖ్యాబలాన్ని సాధించే సమరవీరులు। మన సాహిత్యకారులు।

సంఘర్షణ సమాజ చైతన్యానికి ప్రగతిశీలం। సాహిత్యంలో విస్ఫులింగాల వియల్లాస్యానికి వినూత్నావకాశం। ఆవేశాలకు, అలజడులకు అవకాశమున్నా అడుగున పడిపోయిన అనర్ఘసత్యాన్ని అన్వేషించటాని కది ఒక అమూల్యావకాశం। కాని, సంఘర్షణ వ్యక్తిస్పర్ధలకు, వర్గలాభాలకు, రాజకీయ ప్రయోజనాలకు, ఇజాలబుజాలకు, బలాన్నిచ్చే బానిసైపోతే జాతి నిర్వీర్యమైపోతుంది; సాహిత్యం అరాజకానికి గురియైపోతుంది. ఇది సమకాలీన సాహిత్యం మనకు చెప్పిన — చెపుతున్న గుణపాఠం।

నేటి కవితారంగంలో పద్యం పరమపదసోపానా న్నెక్కుతుంటే, వచనం వీరవిహారం చేస్తోంది. పదిశతాబ్దాల పద్యం పరమపదిస్తున్న విషాద తరుణంలో అంతిమసందేశా లింకా అందుతూనే ఉన్నాయి. వచనం విరిగిన పాదంతో నడుస్తుంటే లోకం వింతగా చూస్తున్నది. పద్యం ముసలిదై చస్తోందా? మనవాళ్ళే మందుపెట్టి చంపుతున్నారా? మనోగతిని మనోహరంగా మలచుకొన్న పద్యం మనదేశంలో తనంతట తాను చావటానికి వీల్లేదే? అయితే మనవాళ్ళే ఆపుణ్యం కట్టుకున్నారు. పద్యం ఎత్తుకుంటే చాలు ప్రబంధ లే పలకాలనీ, పొట్టకూటికికూడా పద్యాన్ని పాథేయంగా వాడుకోవాలనీ, యతులు కలిస్తే చాలు మతిపోయినా ఫరవాలేదనీ మనవారు పద్యానికి పడరానిపాట్లు పెట్టారు. పట్టుమని పదిమంది పద్యకవులున్నా పద్యాన్ని పరమార్థంకొరకో, ప్రబోధంకొరకో ప్రణయభావానికో పరిమితంచేసి పతితజనోద్ధరణంకొఱకు వరప్రసాదంగా

అందించలేకపోయారు. అందువల్లనే తిరుగుబాటు మొదట పద్యంమీద వచ్చింది; ఆ తరువాత వస్తువుమీద నడిచింది. గేయం కొంతకాలం సోయగంగా నడచినా కాలగతిని అందుకోలేని మందగతి అయిపోయింది. అభ్యుదయశక్తులకు ఆవేశం ఎక్కువ. అరచేతిలో స్వర్గం కనపడాలి వారికి. పదంలో అదను కన్న పదును కావాలి వారికి; ఉక్తిలో రక్తి కన్న శక్తి కావాలి వారికి; నిదానం కన్న నినాదం కావాలి వారికి. అందువల్ల ప్రతికవీ కవితను వచనంలో స్వవచనంగా వ్రాస్తున్నాడు. సర్వవాచ్యాలని వారన్నా కొన్ని జనాంతికాలు, కొన్ని అపవారితాలు, కొన్ని ఆకాశభాషితాలు కూడా అందులో ఉన్నాయి. సామాన్యునికామనకు సామ్రాజ్యం కట్టింది వారి సాధన. సామ్యవాదసిద్ధాంతానికి సమరశంఖంలా సన్నద్ధమైంది వారి ప్రబోధన. సామ్యవాదం శాంతపరిణామంగా సాగిద్దామని కొందరు, రుధిరజ్వాలగా వెలిగిద్దామని కొందరు శాంతికాముకులు అభ్యుదయ భేరులైతే, జ్వాలాముఖులు విప్లవకారు లయ్యారు. జాతిని తట్టి లేపుదామంటా రొకరు, జాతిని తిట్టి లేపుదామంటా రొకరు. కొట్టినా సహిస్తుంది లోకం। కాని తిట్టితే తిరగపడుతుంది। తిట్టినా తిరుగబడలేని తెలివి జాతికి లేకపోతే దానిని దేవుడుకూడా రక్షించలేడు. తెలుగుజాతి అంత దిగజారిపోయిందని మే మనుకోవటంలేదు. అందువల్లనే ఉగ్రవాదులఔద్ధత్యం ఉగ్గులోనే నిగ్గుకప్పుకొంటున్నది. తిట్లు తినకుండానే గట్టి యత్నంచేసి సామ్యవాద గమ్యం సాధించాలని నవచైతన్యం క్రొత్తకేక వేస్తున్నది. విమర్శమార్గంలో వినూత్న వివేక విప్లవం జాతికి వినిపిస్తున్నది. ఇజాల ఇనుప సంకెళ్ళనుండి స్వతంత్రప్రతిభ మరో స్వాతంత్ర్యోత్సవంకోసం ఎదురుచూస్తున్నది. మహతి ఈ మహనీయ జాతీయ గీతాన్ని మంజులంగా నినదిస్తున్నది.....

–పద్యం చదివితే పరవశించే ప్రజలను వీక్షిస్తున్నది; గేయం పాడితే గగుర్పొడిచే రాగలహరిని తిలకిస్తున్నది; వచనంలో విప్లవ గీతం వినసొంపుగా వినపడితే వివేకించి వికసిస్తున్నది. కమిటెడ్‌గా కలం నడిపితే కవితకు పడే నిగళాలకు నిశ్వసిస్తున్నది; కన్నీటి గాథలు కసరుగా చెప్పినా మున్నీరై విలపిస్తున్నది; అనుసరింపని ఆదర్శాలను అందరికోసం చెప్పి రాజకీయాల రాణివాసంలో కవితాకన్యను మదుపుపెట్టి, మా పార్టీలో చేరితేనే, మా రంగద్దాలు

తగిలించుకుంటేనే మరో లోకానికి టిక్కెట్టిస్తామనే ట్రిక్కులకు మహతి తన అపశ్రుతులను ప్రయోగిస్తున్నది. అపశ్రుతుల అన్యదేశీయ సంగీతంలోకూడా శాంతిశ్రుతులను మేళవించి జాతీయమైన క్రొత్త బాణీలను సిద్ధం చేస్తున్నది. ఈ మిశ్ర సంగీతం స్వాతంత్ర్య రజతోత్సవ సమయంలో నవచైతన్య ప్రబోధ గీతంగా మహతి మన జాతికి వినిపిస్తున్నది.

సృజనాత్మక సాహిత్యంలో నూత్నప్రయోగం సాగినంత వేగంగా కళా ప్రయోజనం సాధింపబడటంలేదు. ఉక్తివైచిత్రితో, ఉడుకెక్కించే సూక్తులతో సాహిత్యం కలకాలం బ్రతుకదు. ఉక్తికి శక్తి నిచ్చేది కవితావ్యక్తి. సాంఘిక వ్యక్తిని సారస్వతంలో సాక్షాత్కరింపజేయవలసివచ్చినప్పుడు, సమాజానికి అద్దం పట్టితేనే చాలదు. దానికి కళాతేజస్సును కల్పించాలి. అప్పుడే అది కలకాలం నిలుస్తుంది; జాతిలో కళాదృష్టిని, కవితారక్తిని కలిగింపజేస్తుంది. స్వాతంత్ర్యోదయంలో సూర్యుడుదయించాడు కాని పద్మాలు వికసించటంలేదు.

కవితలో విమర్శ, విమర్శలో ప్రశంస, పరామర్శలో పక్షపాతం, నిజంలో భయం, భయంలో అభినయం – ఇవన్నీ మన కళాక్షేత్రాల్లో పెరుగుతున్న కలుపుమొక్కలు. వాటిని పెరికివేసి పైరుపంటలు పండించటమే నవతరం కృషి। ఈ కృషీవలులకోసం మహతి పలికించేది ఒక వినూత్న గ్రామిక గీతం।

* * *

తెలుగులో సమకాలీన సాహిత్య చరిత్ర లేదు. ఈ నడుమ సాహిత్య అకాడమీవారు స్వాతంత్ర్యానంతరాంధ్ర సాహిత్యంపై పోటీ రచనల నాహ్వానించారు. కాని, ఒక్క సాహితీవేత్త కూడా తన రచన నందించలేదు. దానికి కారణాలు ఎన్నో ఉండవచ్చు. వర్తమానాంధ్రమేధావు లందరూ క్షణం తీరిక లేకుండా సతమత మౌతూండటం కావచ్చు. ఆకాశాన్నంటుతున్న జీవన వ్యయానికి తట్టుకొనే దిట్టతనం లేక జీవితయాత్రలోనే తమసాహితీ వ్యాసంగాన్ని సంతకు పెట్టియుండవచ్చు. లేకపోతే – తమ స్వరూపస్వభావ తాత్త్విక సమన్వయాలను సమగ్రంగా రూపు కట్టించలేని అధునాతనాంధ్ర సాహిత్య ప్రక్రియా వైవిధ్యాలను ఏకసూత్రంమీద నడిపించే సమన్వయశక్తి కల రచయిత లేకపోయి యుండవచ్చు. ఉన్నా 'తోటివారి నేమంటే యేంచిక్కో' నని

జంకి వెనుకకు తగ్గి ఉండవచ్చు. ఒక వేళ ధైర్యంతో ముందుకు వచ్చినా తగినంత వస్తుసామగ్రి లభించటం కష్టసాధ్యమై యుండవచ్చు. ఏమైనా, సమకాలీనాంధ్ర సారస్వత శాఖలనన్నింటినీ తలస్పర్శగా చదివి ఒక్కవ్యక్తి ఆసాహిత్యవ్యక్తిని మూర్తి కట్టించటం సాధ్యంకాదన్న సత్యం బయట పడింది.

ఈ సత్యమే మహతి ప్రచురణకు బీజం! వివిధ సారస్వత శాఖలలో నిష్ణాతులైన విజ్ఞులపరిజ్ఞానాన్ని పదిలంచేసే ప్రయత్నం యువభారతి చేపట్టింది. విభిన్న దృక్పథాలు ప్రతిబింబించే సారస్వత వేదికను గ్రంథసంపుటిగా, సమాహారం చేయాలని యత్నించింది. దీనితో స్వాతంత్ర్య రజతోత్సవం కలిసివచ్చింది; ఈ పర్వంలో మహతిని జాతికి కానుకగా సమర్పింప సమకట్టింది. సమీక్షా క్షేత్రమైన ఈ పాతికేళ్ళ సారస్వతం పరిమాణంలో పెద్దదే. సారస్వతాని కంగభూతాలైన సాంస్కృతిక, రాజకీయ, వైజ్ఞానిక, సాంఘి కాంశాల సంవిధానం సమన్వయానికి అవసరం. అందువల్ల ప్రణాళిక పంచ వర్ష ప్రణాళికంత అయింది.

నూరుగురు ప్రసిద్ధాంధ్ర రచయితల వెలుగు రచనలతో వెలువడుతున్న వ్యాససంహిత ఈ మహతి. కవిత, నవల, కథానిక, నాటకం, విమర్శ, భాష-వివిధ సారస్వత సాంస్కృతి కాంశాల మీద సహృదయ సమీక్షను మహతి సాధింప యత్నించింది. సమకాలీన సాహిత్య చైతన్య మూర్తి కిది యొక మణిదర్పణం! ఆధునిక సారస్వత పరిణామ చరిత్ర రచన కిది-ప్రధాన ఆధారగ్రంథం కాగల దని మా విశ్వాసం. ఇతర భారతీయ భాషలలో ఇంత భారీ యెత్తున యిన్ని సార స్వతాంశాలమీద సమకాలీన సాహిత్య ప్రగతిని సమీక్షించే గ్రంథాలు ఉన్నవని నాకు తెలియదు. ఉన్నా ఒకటో, అరో. భారతీయ భాషలను వదలిపెడితే తెలుగులో ఇటువంటి ప్రయత్నం ఫలవంతమై వెలుగుచూచిన ప్రచురణ ఇదియే మొదటిదేమో!

అన్నిరంగాలలో స్పెషలైజేషను ఎక్కువైన రోజు లివి. సాహిత్యం అంతా అలాఉంచి చూస్తే కవితలో కృషిచేసేవాడు సామాన్యంగా ఇతరశాస్త్రాలు చదవటంలేదు. అలాగే నవలాకర్తలు, కథానికాకర్తలు, విమర్శకులూ ఇత్యా

దయః. రచయిత తన రచనలుతప్ప యితరుల రచనలు చదివే తీరికలేని సందర్భాలు సర్వసామాన్యం. కాని నేటిమేటి రచయితల రచనల్లో బహువిధ శాస్త్రపాండిత్యం, లౌకికవ్యుత్పత్తి కనపడుతుంది. పఠితకు వాటితో పరిచయం లేకపోతే సాహిత్యం కొరుకుడుపడదు. అందువల్ల తెలుగుపఠితకు కనీసం నడుస్తున్న తెలుగుజాతి సాహిత్యసాంస్కృతిక జీవితాన్ని పరిచయంచేసే ఒకవ్యాససంపుటి కావాలి। దానిని సిద్ధంచేసి సరసమైన ధర కందించే యత్నమే యీ గ్రంథసంవిధాన లక్ష్యం।

సంకలనగ్రంథాలను సిద్ధంచేయటం ఎంతకష్టమో సహృదయులకు తెలుసు. నూరుగురు తెలుగురచయితలవ్యాసాలను ప్రోగుచేయటం, ప్రచు రించుటం అంత తేలికైనపనికాదు. సహృదయులైన రచయితల మ్రాప్రయత్నం లోని చిత్తశుద్ధినీ, దేశానికి ఇటువంటి గ్రంథం కావలిసిన ఆవశ్యకతనూ గుర్తించి మమ్ములను ఆశీర్వదించి, మాతో సహకరించి, యీగ్రంథసంకల నంలో - నియతాంశాలపైననైనా - తమ ఉత్తమ రచనలను అందించి యీ సాహిత్యసవన ఋత్విజులుగా నిలిచి, మహతిని రూపొందించారు. వారికి ధన్య వాదాలు చెప్పుటకు మా మాటలు చాలవు.

మహతి స్వరాలను మేము ముందే కరపత్రాలద్వారా ప్రజలకు పరిచయం చేసినాము. అందులో పేర్కొన్న రచయితలలో కొద్దిమంది తమవ్యాసాలను కారణాంతరాలవల్ల పంపజాలకపోయినారు. ప్రత్యామ్నాయపు ఏర్పాట్లను చేయటానికికూడ కొన్నింటికి కాలవ్యవధి చాలలేదు. అందువల్ల కొన్నిమార్పులు చేర్పులు జరగటం తప్పనిసరియైంది. ప్రజలకు ముందే వాగ్దానము చేసిన ప్రధానాంశాలేవీ వదలబడకుండా, మహతి స్థాయి తరుగకుండా తగుజాగ్రత్తతీసి కొన్నాము. మహతిలో యువతీయువకులు పాల్గొనే అవకాశం కల్పించే నిమిత్తం నాలుగంశాలపై వ్యాసరచనపోటీలను, యువతులకు వక్తృత్వపు పోటీలనూ నిర్వహించటం జరిగింది. ప్రతిఅంశంపై ప్రథమబహుమానము అందుకొన్న వ్యాసాలను మహతిలో పొందుపరుస్తున్నాం. ప్రౌఢకళాకారులతో పాటు యువకళాకారుల రచనలు చేరటంతో మహతి అన్నివర్గాలవారికి ప్రాతి నిధ్యాన్నిస్తున్నది.

లు–అనే అధ్యాయ సప్తకాన్ని భావించాము. 'ప్రస్తావన'
'ప్రవేశం'లో స్వాతంత్ర్యయుగోదయ సందర్భాన్ని
కవితామూర్తులు, సంప్రదాయ, విప్లవకవిత్వాలనాయ
శ్రీల వ్యాసాలనుసంతరించాము. 'ప్రయోగం'లో వివిధ
క్రియా సమీక్షను విశ్లేషణాత్మకంగా పొందుపరచాము.
విమర్శ–భాషా పరిశోధన విశేషాల సమీక్షవ్యాసాలను
ు. 'ప్రస్తారం'లో వివిధసారస్వత ప్రక్రియా విస్తార
సాహిత్య-సమాజముల పరస్పర ప్రభావమును వివేకిం
మేము భావించటంలేదు. సమగ్రతను సాధించటంకూడా
పరిమిత పరికరాలతో ఇట్టిప్రయత్నానికి పూనుకోవటం
య జగత్తులోని సౌజన్య శక్తినే మాశక్తిగా భావించి
మహతి శ్రుతులను మీముందు మేళవించి పెట్టుతున్నాము.

ప తంత్రుల మంజులనిక్వాణం మీమనసు నేకొంత
ంత్నం సఫలం।

# రచయితలకు మా లేఖ

తేది.... .... .... .... .... ....

శ్రీ........................................................................ గారికి,

నమస్సుమనస్సులు.

యువతరంలో సాంస్కృతిక పునరుజ్జీవనాన్నీ, సారస్వత సంస్కారాన్నీ, సమ్యక్ పరిశీలన పాటవాన్నీ కలిగించాలని గత ఎనిమిది సంవత్సరాలుగా యథాశక్తి కృషి చేస్తున్న 'యువభారతి' – మీ ఆదరాభిమానాలను పొందగలదని భావిస్తున్నది.

ప్రాతలోని గొప్పను ప్రకటించే ప్రయత్నమే కాక యువభారతి క్రొత్తలోని సత్తువను క్రోడీకరించడానికి ప్రయత్నిస్తున్నది. 1970 జూలైలో "మారుతున్న విలువలు – రచయితల బాధ్యతలు" అన్న చర్చావేదిక నిర్వహించి, 'రచన'ను ప్రకటించి, సమాజంలో, సాహిత్యంలో, సమకాలీనములూ, సార్వకాలీనములూ అయిన విలువలను ప్రసిద్ధరచయితల 37 విలువైన వ్యాసాలలో వెలయించింది.

ప్రాచీన అధునాతన సాహితీ రీతులపై పరిచయాత్మక సారస్వతాన్ని ప్రచురించి సహృదయలోకంలో సాహిత్యాభిరుచిని కల్పించటానికి, 1971 లో ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి 'కావ్యలహరి' ఉపన్యాస మంజరిని వెలయించింది.

1972 లో నవమ వార్షికోత్సవ కార్యక్రమాలుగా, రెండు కార్యక్రమాలను సంకల్పిస్తున్నది.

1. సాహిత్యప్రగతికి రథసారథ్యం వహించి, తమ ప్రతిభాప్రభావాలతో తరతరాలను తీర్చిదిద్దిన కవితల్లజులు – తిక్కన, పాల్కురికి, శ్రీకృష్ణదేవరాయలు, వేమన, గురజాడల కవితాచైతన్యాన్ని చిత్రించే 'చైతన్యలహరి'.

2. స్వాతంత్ర్య యుగోదయంలో (1947–72) 25 ఏళ్ళ స్వతంత్ర జీవితంలో తెలుగువారు సాధించిన సాంస్కృతిక సాహిత్యప్రగతిని సమీక్షించి సమన్వయరాగంగా, సమీక్షా వ్యాస సంకలనంగా మ్రోయించాలని – 'మహతి'.

విభిన్నగళాలతో, వివిధ సాహిత్య ప్రక్రియలతో, వినూత్న ప్రయోగాలతో స్వీయప్రభవప్రభావాలను ప్రతిపాదించుకుంటూ ప్రవర్తిల్లుతున్న వర్తమాన సారస్వత కళావీచికలను ప్రసిద్ధాంధ్రరచయితల పరిశీలనాత్మకవ్యాసాలతో సమీక్షింపజేసి, వాటిని 'మహతి'లో మహనీయరాగలహరిగా ఆవిష్కరించాలని 'యువభారతి' ఈ ప్రచురణకు పూనుకొన్నది ఈ ప్రణాళికకు జీవంపోసి, చైతన్యవంతంగా తీర్చిదిద్దగలిగిన మీవంటి సాహితీబంధువుల సహకారాన్ని అభ్యర్థిస్తున్నది.

స్వాతంత్ర్యోదయానంతరం ఈ పాతికేళ్ళలో ప్రవర్తిల్లిన తెలుగు తీరుతెన్నులను తేటపరిచే వ్యాసాల సంకలనగ్రంథం 'మహతి'. వివిధాంశాలపై విస్తరించిన దాదాపు 100 వ్యాసాలను, 600 పుటల్లో సమీకరించి సమకాలీన సారస్వత సమగ్ర సమీక్షాగ్రంథ సంపుటిగా తెలుగులో వెలయింపనున్న వ్యాససంహిత ఈ 'మహతి'.

విషయవిభాగం చేసి 'మహతి' సప్తస్వరాధ్యాయాలను సాధిస్తున్నది. అందులో స్వాతంత్ర్య యుగోదయంలోని తెలుగు సాహిత్య ప్రక్రియల్లోనూ, సామాజిక సాంస్కృతిక శాఖల్లోనూ జరిగిన ప్రగతిని ప్రత్యేకశీర్షికల క్రింద పరిశీలిస్తున్నది. సమీక్షాక్షేత్రమూ విస్తారమైనది. అందువల్ల విషయవిశ్లేషణంలో కూడా వైవిధ్యం ఏర్పడింది. ఆయా శాఖోపశాఖల్లో అపారపరిచయం ఉన్న రచయితల కృషిక్షేత్రాన్ని దృష్టిలో ఉంచుకొని, వారి సౌహార్దాన్ని ఆసరగా తీసుకొని, వ్యాసరచనకై వారిని 'యువభారతి' ప్రార్థింప తలపెట్టింది.

కష్టసాధ్యమైన ఈప్రణాళికకు రచయితలైన మీ చేయూత లేనిదే సాఫల్యం లేదు. పండిన సాహిత్యానుభవం ప్రతిఅక్షరంలోనూ ప్రతిబింబించే మీరచన ప్రచురించందే ఈ సంచికకు ప్రామాణికత్వం రాదు. విజ్ఞులైన మీ సామర్థ్యానికి మే మభ్యర్థిస్తున్న విషయం పరిమిత పరిధిలోనిదే కావచ్చు. ఈ గ్రంథప్రణాళిక ననుసరించి నిర్దేశింపబడిన పుటలసంఖ్యకూడా పరిమితమే కావచ్చు. కాని, అందులోనే మీరు వివేకించి, విశ్లేషించి సారభూతంగా ప్రతిపాదించే ప్రతివిషయం యువతరాని కొక ఉజ్జ్వల కరదీపికగా వెలుగు నిచ్చి, సమగ్రసాహిత్యసమీక్ష కొక సమ్యక్‌దృష్టిని ప్రసాదిస్తుందని 'యువభారతి' గాఢంగా విశ్వసిస్తున్నది.

మీరు మనసులో మథించి, గ్రంథించి అమృతంలా ఆవిష్కరించే మీ రచన మా 'మహతి' కొక మహనీయోపాయనం. మీ ఉపకృతికి ప్రతికృతిగా

మే మేమివ్వగలం? అయినా చంద్రుని కొక నూలుపోగులా మీవ్యాసానికి పారితోషికం రూ. 20/- మాత్రమే ఇచ్చుకొనుశక్తి మా కున్నదని సవినయంగా మనవిచేసుకొంటున్నాము. ఇప్పుడిప్పుడే ఇగుళ్ళు వేస్తున్న 'యువభారతి'ని సాదరంగా వీక్షించి, మీసమ్మతిని తెలియపరచ వలసిందిగా ప్రార్థిస్తున్నాము.

వ్యాసాంశం..........................................................................

...................................................................పుటలు..................

అంగీకారము పంపవలసిన తేదీ-ఫిబ్రవరి 29, 1972.

వ్యాసము మాకు చేరవలసిన తేదీ-మార్చి 15, 1972.

'మహతి' ఆవిష్కరణమయ్యే తేదీ-ఆగస్టు 15, 1972.

తేదీ దాటకుండా మీ అంగీకారం, రచనా మా కందేటట్లు చూడ ప్రార్థన. సకాలంలో అందించే రచనలే 'మహతి' కి మీరంపే అక్షరాశీస్సులు !

విధేయులు,

'మహతి' సంపాదకవర్గం.

యువభారతి

## మహతి స్వరాలు

| | | |
|---|---|---|
| స | ప్రస్తావన | ప్రేరణ - సంపాదకీయం |
| రి | ప్రవేశం | స్వాతంత్ర్యయుగోదయ సందర్శనం |
| గ | ప్రతిభ | విశ్వనాథ * శ్రీశ్రీ |
| మ | ప్రయోగం | సృజనాత్మక సాహిత్యసమీక్ష |
| ప | పరిశీలనం | విమర్శాత్మక సారస్వత విలోకనం |
| ద | ప్రస్తారం | వివిధ సారస్వత శాఖాప్రస్తారం |
| ని | ప్రభావం | సారస్వతం - సమాజం - పరస్పరప్రభావం |

# అనుక్రమణిక

## ప్రస్తావన



## ప్రవేశం

కథానిక :



రూపకం :



## పరిశీలనం

విమర్శ :

## ప్రస్తారం

## ప్రభావం

*

## యువభారతి

మా గురించి

మా యువభారతీయులు

సాహితీమిత్ర

# ఇందులో . . .

# పాతికేళ్లు పండించిన పర్వాలు

శ్రీ దేవులపల్లి రామానుజరావు

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు,
ఓరుగల్లున రాజవీరలాంఛనముగా
పలు శస్త్రశాలలు నిలుపునాడు,
విద్యానగర రాజవీథులన్ కవితకు
పెండ్లి పందిళ్ళు కప్పించునాడు,
పొట్నూరికి సమీపమున ఆంధ్రసామ్రాజ్య
దిగ్జయ స్తంభ మెత్తించునాడు,

ఆంధ్రసంతతి కే మహితాభిమాన
దివ్యదీక్షా ముఖ స్ఫూర్తి తీవరించె,
ఆ మహావేశ మర్థించి యాంధ్రులార!
చల్లు డాంధ్రలోకమున నక్షతలు నేడు.

అని భారతదేశానికి స్వాతంత్ర్యం రావడానికి మూడు దశాబ్దాలకు ముందు, ఆంధ్రప్రదేశ్ అవతరణకు నాలుగు దశాబ్దాలకుముందు, కవివాణి ప్రబోధించినది. ఆనాడు ఈ ప్రబోధము ఎంత సార్థకమో, యీనాడు కూడ అంతే సార్థకము. సుమారు నూరు సంవత్సరాల పోరాటం తరువాత, అనేక త్యాగాల ఫలితంగా, 1947 వ సంవత్సరం ఆగస్టు 15 వ తేదీనాడు భారతదేశం బ్రిటిషు పరిపాలన నుండి విముక్తి పొంది ప్రపంచ రాజకీయ వ్యవస్థలో స్వతంత్ర దేశంగా అవతరించినది. చరిత్రాత్మకమైన యీ సంఘటన జరిగి యిప్పటికి పాతిక సంవత్సరాలు గడచి పోతున్నవి. అందుచేత మహత్తరమైన యీ సందర్భాన, ఆలోచనాశీలియైన ప్రతి పౌరుడు యీ పాతిక సంవత్సరాల ప్రగతిని గూర్చి ప్రశ్నించుకొని సమీక్షించుకోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. ఈ పాతిక సంవత్సరాల స్వతంత్ర భారతదేశంలో రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతి

కంగా సాధించిన అభివృద్ధిని తక్కువగా అంచనా వేయడానికి వీలులేదు. మన దేశం యెదుర్కొంటున్న సమస్యలను గమనించినప్పుడు మనం సాధించిన సర్వతో ముఖ అభ్యుదయం నిస్సందేహంగా సామాన్యమైనదికాదు. ఈ పాతిక సంవత్స రాలలో మూడు మారులు పాకిస్తాన్‌తో, ఒకసారి చైనాతో పెద్ద యెత్తున యుద్ధం ముంచుకొచ్చింది. మన సరిహద్దులలో యీ యుద్ధజ్వాలలు రగుల్కొన్న ప్పుడు ఆసేతుశీతనగ పర్యంతము సమస్త భారతజాతి యేకవ్యక్తిగా నిలిచి జాతీయ సమైక్యతను ప్రదర్శించింది.

శ్రీలు పొంగిన జీవగడ్డయి - పాలు పారిన భాగ్యసీమయి
వ్రాలినది ఈ భరతఖండము - భక్తి పాడర తమ్ముడా !
దేశ గర్వము దీప్తి చెందగ - దేశ చరితము తేజరిల్లగ
దేశ మరసిన ధీర పురుషులు - తెలిసి పాడవె చెల్లెలా !

భారత రాజ్యాంగ పరిషత్తు సిద్ధంచేసిన రాజ్యాంగము 1950 జనవరి 26 వ తేదీనాడు ఆచరణలోనికి వచ్చినది. భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించింది. ఈ రాజ్యాంగం ప్రకారం ప్రజాస్వామిక పద్ధతిలో, యిప్పటికి అయిదు పర్యా యాలు సాధారణ ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలు దేశంలో రాజకీయ సుస్థి రత్వానికి రాచబాటలు వేసినవి. ప్రపంచములోని అన్నిటికన్న పెద్ద ప్రజా స్వామిక సమాజము ఈనాడు భారతదేశములో సువ్యవస్థితమవుతున్నది. ఈ ప్రజాస్వామ్యములో అత్యధిక సంఖ్యాక ప్రజల అభిప్రాయము శాసన స్వరూపము దాల్చు చున్నది; అయినా అల్పసంఖ్యాకులకు సంపూర్ణరక్షణ లభించినది. మత సామరస్యము మన లౌకిక రాజ్యాంగ వ్యవస్థ ప్రథానాశయము. స్వాతంత్ర్యం లభించిన తరువాత ఒక సంవత్సరం లోపల స్వదేశ సంస్థానాలు కూడ విముక్తి పొందినవి. రాజకీయంగా యిది మరొక మహత్తరమైన సంఘటన. ఆ తరువాత కొన్ని సంవత్సరాలలోనే భాషారాష్ట్రాల యేర్పాటు జరిగినది తత్ ఫలితంగా 1956 నవంబర్ ఒకటవ తేదీనాడు ఆంధ్రప్రదేశ్ రూపు దాల్చింది. ఆంధ్రప్రదేశ్ అవతరించి పదునైదు సంవత్సరాలు గడచిపోయినవి.

ఏ దేశమేగినా ఎందు కాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

అను మాటలకు అనుగుణంగా ఆంధ్రమహాజనులు అతి క్లిష్ట పరిస్థితులలో సైతం భారతీయులుగా వ్యవహారించినారు. ఇతర రాష్ట్రాలలో అప్పుడప్పుడు తలయెత్తిన కొద్దిపాటి మత సంఘర్షణాల నీడలు గూడ యీ పదునైదు సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్‌కు వ్యాపించలేదు. శాసనసభలో అల్ప సంఖ్యాక వర్గాలకు తగు ప్రాతినిధ్యము లభించినది. వారికి అవసరమైన విద్య, వసతి తదితర సౌకర్యాలు లభించినవి. ఆంధ్రప్రదేశ్ యేర్పడి నప్పటినుండి యిప్పటి వరకు సుస్థిరమైన మంత్రివర్గాలు పరిపాలన నిర్వహించినవి. రాజకీయ అస్థిరత్వానికి అవకాశం కలుగలేదు. నిజానికి ప్రతిపక్షాలు బలహీనపడినవనే చెప్పవచ్చును. సుస్థిర మంత్రివర్గాలు సౌభాగ్యానికి సాధనాలైనవా ? అని కొందరు ప్రశ్నిస్తున్నారు. ఇది కొంత ఆలోచించవలసిన అంశమే. భాషా రాష్ట్రాల ఉద్యమానికి ఆంధ్రులు మార్గదర్శకులయినప్పటికీ కొన్ని తెలుగు ప్రాంతాలు, మద్రాసు, మైసూరు మహారాష్ట్రాలలో విలీనమైనవి. ఈ తెలుగు ప్రాంతాలను గురించి నాయకులు అంతగా పట్టించుకోలేదను భావము ఒకటి ప్రబలియున్నది. కనీసం మదరాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ గ్రంథాలయములోని ఉద్గ్రంథాలనైనా ఆంధ్రప్రదేశ్ సంపాదించలేక పోయింది. ప్రాంతీయ అసమానతలను గురించి తీవ్ర అసంతృప్తి ప్రకటితమైనది. విశేషించి ప్రభుత్వోద్యోగులలో యీ అసంతృప్తి అత్యంత ప్రబలంగా కనిపిస్తున్నది. ఈ అసంతృప్తి, తదితర కారణాలవలన ప్రత్యేక తెలంగాణా ఉద్యమం పతాకస్థాయిలో విజృంభించినది. నాయకత్వంలో తగినంత దూరదృష్టి ప్రదర్శితం కాలేదన్న భావం ఆలోచనాపరులలో, మేధావివర్గాలలో గాఢంగా ఉన్నది. రాష్ట్రేతర ఆంధ్రులసమస్యలనుగూర్చి ఆలోచనలేజరుగలేదు. మారిషస్, ఆఫ్రికా మొదలైన విదేశాలలోని తెలుగువారికి అవసరమైన సదుపాయాలు కలుగజేయలేదను భావముగూడ వ్యాపించియున్నది. యువకులలో నిరాశా నిస్పృహాలు భయానకంగా తాండవిస్తున్నవి. దిగంబరకవులు, తీవ్రవాద రచయితలు, నక్సలైటు ఉద్యమం యిందుకు ఉదాహరణలు. నక్సలైటు ఉద్యమం తెలుగు దేశంలోని శ్రీకాకుళం, వరంగల్ వంటి కొన్ని ప్రాంతాలలో ఉధృతంగా ఉన్నట్లు స్పష్టమగుతున్నది.

కడచిన పాతిక సంవత్సరాలలో పంచాయతీరాజ్య పరిపాలన యేర్పాటు ఒక ముఖ్యమైన సంఘటన. గ్రామస్వరాజ్యం, అధికార వికేంద్రీకరణ ఆదర్శాలుగా స్థానిక స్వపరిపాలనా వ్యవస్థ అవతరించినది. జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితులు, గ్రామ పంచాయతీలు స్థాపితమైనవి. అభివృద్ధి పథకాల అమలు

బాధ్యత యీ సంస్థలకు అప్పగించ బడినది. సిద్ధాంతరీత్యా యిది హర్షించ దగినదే అయితే సముద్ర మథనం జరిగినప్పుడు మొట్టమొదట హాలాహలము వచ్చినట్లుగా ఈ అధికార వికేంద్రీకరణ కొన్ని విషమ పరిస్థితులకు దారితీసింది. అవినీతి, అసమర్థత వంటి అపశ్రుతులు వినబడుతున్నవి. విశేషించి విద్యారంగంలో అవకతవకలు అగుపిస్తున్నవి. ఈ లోటుపాటులను సవరించడానికి త్వరలో తగు చర్యలు తీసుకోబడునని కొన్ని వార్తలు తెలుపుతున్నవి. ప్రజాస్వామిక వ్యవస్థలో పంచాయతీ పరిపాలన అనివార్యమైనదే కాని అందుకు అవసరమైన కట్టుబాటులు కూడ తప్పక చేయవలసినవి. భారతదేశానికి అన్నపూర్ణవంటిది ఆంధ్రప్రదేశ్. కృష్ణా, గోదావరీ నదులు మనకు పెన్నిధులు. మనది వ్యవసాయం ప్రధానవృత్తిగా కలిగిన రాష్ట్రము.

మోటుపల్లీ తీరమున లంగరేసి ఓ
డలు సుంక మర్పింప నిలుచునాడు
రాయలసీమ రా రాయబార్లు వసించి
చిత్ర చరిత్రల్ రచించునాడు,
పాకాల చెఱువు చెంపల పండుధాన్యముల్
అన్యదేశాధీశు లడుగునాడు,
అద్దంకి కోడెల నాబోతులకు నయి
దూరాగతుల కొని త్రోలునాడు

ఖండ ఖండాంతరములన్ ప్రకాశమయ్యె
తెనుగుతల్లి లలాటికా తిలకదీప్తి
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె ?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లి చిన్నె ?

కృష్ణా గోదావరీ నదుల జలాలను సక్రమంగా వినియోగించుకుంటే, మనరాష్ట్రంలో దుర్భిక్షమే ఉండదు. అధికోత్పత్తికి అవసరమైన కృషి జరిగితే భారతదేశానికి ధాన్యాగారము కావలసినది మన రాష్ట్రం. ఈ పాతిక సంవత్సరాలలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణము ప్రథమదశ పూర్తి అయినది. పోచంపాడు ప్రాజెక్టు- సమగ్ర స్వరూపముతో కాకపోయినప్పటికి కొంత ఆలస్యంగానైనా కొనసాగుతున్నది.

ప్రత్యేకించి విద్యుచ్ఛక్తి ఉత్పాదన పథకంగా శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణమవుతున్నది. ఇది ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి అత్యంత ప్రయోజనకరమైన

నిర్మాణము. అయితే కడచిన కొన్ని సంవత్సరాలలో మనరాష్ట్రంలో కరువు కాటకాలు తప్పడంలేదు. చిన్ననీటి వనరుల అభివృద్ధికి యిప్పటికన్న యెక్కువ శ్రద్ధ తీసుకోవలెనన్న అభిప్రాయం ప్రబలంగా ఉన్నది. ప్రస్తుతం కృష్ణా గోదావరీ నదుల జలాలను నూటికి ఏడు లేక ఎనిమిది వంతులు మాత్రమే మన రాష్ట్రము ఉపయోగించుకుంటున్నది. చిన్ననీటి వనరులయిన బావులు, చెఱువులను అభివృద్ధి పరచక తప్పదు. అధికోత్పత్తికి యెరువులు అవసరం. రెండు మూడు యెరువుల కార్మాగారాలు ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్పబడినవి. అవసరమైన వ్యావసాయిక ఉత్పత్తికి తగిన పరిమాణంలో యింకా యెరువులు లభించడంలేదు. ఈ నాడు మన రాష్ట్రంలో నీటి ఎద్దడి, విద్యుచ్ఛక్తి కొరత తీవ్రస్వరూపం ధరిస్తున్నవి. ఈ కొరతను నివారించడానికి పెద్దస్థాయిలో ప్రయత్నం జరుగకపోతే ఆంధ్ర ప్రదేశ్ భవిష్యత్తు ఆశాజనకంగా ఉండదని అన్నచో అతిశయోక్తి కాజాలదు.

పొరుగు రాష్ట్రాలతో పోల్చి చూచినప్పుడు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా వెనుకబడినదని చెప్పక తప్పదు. కడచిన దశాబ్దంలో భారీ పరిశ్రమలు కొన్ని మనరాష్ట్రంలో యేర్పాటు అయినవి. భారత హెవీ ఎలక్ట్రికల్స్, సింథటిక్ డ్రగ్స్, హిందుస్తాన్ మెషిన్ టూల్స్ వీనిలో పేర్కొనదగినవి. ఇందులో స్థానికులకు ఉద్యోగావకాశాలు తగినంత దొరకలేదని ఒక విమర్శ; కొంత అసంతృప్తి. ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్, స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్ యేర్పాటువలన చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధికి కొంత ప్రోత్సాహం లభిస్తున్నది. విశాఖపట్టణంలో నౌకా నిర్మాణ పరిశ్రమ విస్తృతికి, అభివృద్ధి కొరకు కేంద్రప్రభుత్వం శ్రద్ధ తీసుకుంటున్నది. ఇక్కడ ఉక్కు కర్మాగారంకూడా యేర్పాటు చేస్తున్నారు. రామగుండం, కొత్తగూడెం థర్మల్ స్టేషన్లు విస్తృతం కావించబడినవి. కొత్త యూనిట్లు స్థాపితమైనవి. పంచదార, కాగితం, కర్మాగారాలు కూడా కొన్ని మన రాష్ట్రంలో పనిచేస్తున్నవి. వరంగల్‌లో అజంజాహి మిల్స్ పని చేస్తున్నది. అయితే యిది అంత తృప్తికరంగా పనిచేయడం లేదు. ఆంధ్రప్రదేశ్ యేర్పడిన కొన్ని సంవత్సరాల తరువాత దక్షిణమధ్య రైల్వే యేర్పాటు జరిగినది. ఈ యేర్పాటువలన ప్రజలు ఆశించిన సత్ఫలితాలు ఇంత వరకు పూర్తిగా కలుగలేదు. ఇకముందు ఈ విషయంలో తగు చర్యలు తీసుకోవడం జరుగగలదని ఆశించవచ్చును.

సామాజిక కార్యక్రమరంగాలలో కొంత అభివృద్ధి గోచరిస్తున్నది. ఆహార విహారాలలో, వేషభాషలలో వర్ణ ప్రతిబింబము కనిపించడంలేదు. కాని రాజకీయ

రంగంలో కులతత్వాలు ప్రబలంగా ఉన్నవని చెప్పబడుతున్నవి. ఎన్నికలలోను, మంత్రివర్గ నిర్మాణములోను యీ కులతత్వాల ప్రభావం ప్రసరిస్తున్నదని ఒక అభిప్రాయం-ప్రచురితమై ఉన్నది. వర్ణాంతర వివాహాలు అక్కడక్కడ జరుగు తున్నప్పటికి వరకట్నాల వంటి దురాచారాల వికటాట్టహాసం యింకా వినిపి స్తున్నది. ఇతర రంగాలలో యెట్లున్నప్పటికి విద్యారంగంలో అవినీతి గోచరి స్తున్నదని మరొక అభిప్రాయం ప్రబలడం సంతాపకరమైన సంగతి. విద్యాప్రమా ణాల అభివృద్ధికి, తత్ఫలితంగా దేశాభ్యుదయానికి యీ అవినీతి గొడ్డలిపెట్టు.

ఈ పాతిక సంవత్సరాలలో విద్యాభివృద్ధి అవకాశాలు నిస్సందేహంగా అధికమయినవి. ప్రాథమిక పాఠశాలలు, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు చాలా స్థాపితమైనవి తిరుపతి విశ్వవిద్యాలయం స్వాతంత్ర్యానంతరఫలం. ఆంధ్ర ప్రదేశ్ వ్యావసాయిక రంగంలో జరిగిన అభివృద్ధిలో వ్యవసాయ విశ్వ విద్యా లయం యేర్పాటు గణనీయమైనది. కేంద్ర ప్రభుత్వపు ఇంజనీరింగు కళాశాలతో పాటు మరికొన్ని ఇంజనీరింగు కళాశాలలు వైద్య కళాశాలలు కొత్తవి స్థాపితమై పనిచేస్తున్నవి. సాంకేతిక విద్యా సంస్థల సంఖ్య పెరిగినది. మూడు ప్రాంతా లలో మూడు పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రాలు ఏర్పాటు అయినవి. త్వరలో ఒక సాంకేతిక విశ్వవిద్యాలయం స్థాపితం కానున్నట్టు తెలుస్తున్నది. ఒక సంస్కృత విశ్వ విద్యాలయ స్థాపన వార్తలుకూడ వినవస్తున్నవి. అరవింద విశ్వ విద్యాలయాన్నిగూర్చి చర్చలు జరుగుతున్నవి. ఆర్ట్స్, సైన్సు, ప్రాచ్య కళా శాలలు తగు సంఖ్యలో స్థాపితమైనవి. ఇవన్నీ నిజంగా అభ్యుదయానికి సూచ నలే. కాని విద్యా ప్రమాణాల స్థాయి తగ్గుదల గురించి వినవస్తున్న విషయాలు భయంకరంగా ఉన్నవి. శీల నిర్మాణానికి విద్యాసంస్థల దోహదము ఏమి? అను ప్రశ్న ఉత్పన్నమవుతున్నది.

సాంస్కృతిక రంగంలో గమనించ దగిన అభివృద్ధి గోచరిస్తున్నది. కేంద్ర సాహిత్య అకాడమి దేశభాషల అభివృద్ధికొరకు అనువాదాల ద్వారా, బహు మతుల ద్వారా కృషిచేస్తున్నది. రాష్ట్రంలో గూడ సాహిత్య అకాడమి, సంగీత అకాడమి, లలిత కళల అకాడమి, సైన్సు అకాడమి స్థాపితమై పనిచేస్తున్నవి. తెలుగు భాషా సమితి పక్షాన విజ్ఞాన సర్వస్వముల ప్రచురణ యించుమించుగా పూర్తి అయినది. ప్రస్తుతం అచ్చులో ఉన్న రెండు సంపుటాల ప్రచురణ జరిగితే యీ విజ్ఞాన సర్వస్వము పని పూర్తికాగలదు. హైదరాబాదులో సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము పని కూడ పూర్తి అయినది. చరిత్ర, భూగోళముల విజ్ఞానకోశ

ముల పని కూడా కొనసాగుతున్నది. ఆంధ్ర సారస్వతపరిషత్తు, నవ్యసాహితీ సమితి, విశ్వసాహితి, యువభారతి, చైతన్య భారతి మొదలైన సాహిత్య సంస్థలు ప్రశంసనీయమైన కృషి జరుపుతున్నవి. అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు అయిదు పర్యాయములు సమావేశమై రాష్ట్రేతర ఆంధ్రులతో, విదేశాల లోని ఆంధ్రులతో సాంస్కృతిక సంబంధాలు కల్పించుకొన్నవి. ప్రపంచ తెలుగు మహాసభలు సత్వర భవిష్యత్తులోనే జరుగగలవని ఆశించబడుతున్నది. రవీంద్రుని శతవార్షికోత్సవ సందర్భంలో రవీంద్ర భారతి నిర్మాణము జరిగినది. సంగీతము, నాటకము, చిత్రకళల అభివృద్ధికి దేశంలో ప్రత్యేక సంస్థలు స్థాపితమై పని చేస్తున్నవి. విప్లవ రచయితలు ఒక ప్రత్యేక వేదికను యేర్పాటు చేసుకున్నారు. తెలుగు రచయితలు వివిధ ప్రక్రియలలో సాధన చేస్తున్నారు. ఆధునిక అవసరాలకు అనుగుణంగా తెలుగుభాషావికాసం జరుగుతున్నది. తెలుగు పత్రికలు యిందుకు దోహదముచేస్తున్నవి. సినిమారంగంలో విశిష్టమైన సాహిత్యం నిర్మాణమవుతున్నది. తెలుగులో మంచి సినిమాలు వస్తున్నవి. రేడియోలో తెలుగు సాహిత్యానికి, తెలుగు భాషకు ప్రాధాన్యము లభిస్తున్నది. తెలుగు పుస్తకాలు అధిక సంఖ్యలో ప్రకటితమవుతున్నవి. స్థానిక పరిపాలనా సంస్థల ప్రాతిపదిక మీద ప్రతి జిల్లాకు ఒక గ్రంథాలయ సంస్థ యేర్పడి పనిచేస్తున్నవి. హైదరాబాదులో ఒక జాతీయ గ్రంథాలయం స్థాపనను తెలుగు ప్రజలు గాఢంగా అభిలషిస్తున్నారు. త్వరలోనే ప్రభుత్వ సహకారంతో యీ పని జరుగగలదని ఆశించవచ్చును. కడచిన పాతికేళ్ళలో పండిన పర్వాలలో సాంస్కృతిక రంగములో జరిగిన కృషి ఒక మహాపర్వము.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగును అధికార భాషగా ప్రకటించింది. ఈ ప్రకటన అమలుకు కావలసిన యేర్పాట్లు మాత్రం కొంత మందంగా జరుగుతున్నవని అనిపిస్తున్నది. ఈ కార్యక్రమం యింతకన్న వేగంగా జరుగగలదని ఆశించబడుతున్నది. ఒక ప్రామాణికమైన తెలుగు టైపురైటర్ యింకా అందుబాటులో లేదు లినో టైపు యేర్పాటు యింకా జరుగలేదు. సత్వర భవిష్యత్తులో యీ పనులు జరుగవలసి ఉండును. విశ్వవిద్యాలయాలలో కూడ బోధన తెలుగులో జరుగవలెనని సర్వత్రా అంగీకరించబడినది. తెలుగులో విశ్వవిద్యాలయ స్థాయి పాఠ్యగ్రంథాలు ప్రకటింపబడుతున్నవి. ఇందుకు కేంద్రప్రభుత్వం నుండి తగినంత సహాయం లభిస్తున్నది.

కడచిన రెండున్నర దశాబ్దాలలో ఆంధ్రులు భారత పరిపాలనారంగంలో

అనేక ముఖ్యబాధ్యతలు నిర్వహించినారు. ఇప్పటివరకు రాష్ట్రపతి పదవిని ఆంధ్ర ప్రదేశ్ విజ్ఞానులు ముగ్గురు అలంకరించినారు. ఇందులో యిద్దరు తెలుగు వారు. అరడజనుకుపైగా గవర్నరు పదవులలో మన రాష్ట్రీయులు నియమితులైనారు. ఇందులో నలుగురికిపైగా తెలుగువారు. ఇద్దరు తెలుగువారు స్పీకరు పదవులకు ఎన్నిక అయినారు. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా తెలుగు విజ్ఞాని పనిజేసినారు. ఇతర ఉన్నత స్థానాలు మరికొందరి తెలుగు ప్రముఖులకు లభ్యమయినవి. అఖిల భారత కాంగ్రెస్ కమిటి అధ్యక్షపదవి వరుసగా ఇద్దరు తెలుగు నాయకులకు లభించినది. అఖిల ప్రపంచ కథానికల పోటీలలో తెలుగు రచయితకు బహుమతి దొరికినది, జ్ఞానపీఠ్ అవార్డు తెలుగు కవిసమ్రాట్‌కు లభించినది. ఈవిధంగా తెలుగువారు అనేక బాధ్యతలను ప్రతిభావంతంగా నిర్వహించి కీర్తిగాంచినారు. ఇకముందు కూడా ఆంధ్రాభ్యుదయం నిర్విఘ్నంగా కొనసాగ గలదని ఆశించవచ్చును. అయితే యిందుకు అనుగుణంగా తెలుగు ప్రజల అభివృద్ధి, తెలుగు దేశపు అభివృద్ధి జరిగినదా అని కొందరి ప్రశ్న.

జారిన దేశ గర్వమును చక్కన దిద్ది మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ పాలన చేసి సమాన రాష్ట్రిముల్
కూరిమి నాసచేయ తెనుగున్ బుడమిన్ గయిసేతురయ్యా దీ
క్షారతి నాంధ్ర పుత్రులు, జగజ్జన ధర్మమె దృష్టి నిల్పుచున్.

తెలుగు లిపి అందమైనది; సమగ్రమైనది. భారతదేశ భాషలలో తెలుగు లిపికి ఉన్న ఉచ్చారణ సౌలభ్యము మరొక లిపికి లేదని ప్రొఫెసర్ హాల్డెన్ ప్రభృతులు ఉద్ఘాటించినారు. తెలుగుభాష తీయనిది. తెలుగు వాఙ్మయము శక్తివంతమైనది. తెలుగుసీమలోని ప్రకృతి సంపద పుష్కలమైనది. వ్యావసాయికంగా, పారిశ్రామికంగా సర్వతోముఖాభ్యుదయానికి సమస్త సదుపాయాలు ఈ రాష్ట్రానికి ఉన్నవి. కడచిన పాతికేళ్లలో యిందుకు కావలసిన ఆలోచనలు జరిగి, ఆచరణరంగములో కూడ కొంత పురోగమనము గోచరిస్తున్నది. దరిద్రాన్ని నిర్మూలించి, సౌభాగ్యాన్ని సాధించడానికి సమస్త సౌకర్యాలు ఉన్న తెలుగుదేశము భవిష్యత్తులో సర్వతోముఖ అభివృద్ధి పొందవలెనని ప్రతి పౌరుని ఆకాంక్ష.

"మేలికిన్నర మేళవించీ-రాలు కరగగ రాగమెత్తీ
పాలతీయని బాల భారత-పదము పాడర తమ్ముడా!
సమరసమ్ముల నాట్యమాడగ-చివురు పలుకుల చెవుల విందుగ
కవిత అల్లిన కాంతహృదయము-గారవింపవె చెల్లెలా!"

# ప్రజాస్వామ్యం
# ఆదర్శాలు - ఆచరణలు

ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య

గత 25 సంవత్సరాలుగా, దేశంలో ఇతర రాష్ట్రాలలో ఉన్నట్లే, ఆంధ్ర ప్రదేశ్‌లోకూడా ప్రజాస్వామ్యం అమలులో ఉంది. కాని రాష్ట్రంలోని పరిపాలన విధానం ఆచరణలో ప్రజాస్వామిక ఆదర్శాలకు అనుగుణంగా ఉన్నదా, లేక ఆదర్శాలు ఆచరణలకు మధ్య అంతరం ఏర్పడిందా, ఏర్పడితే ఈ అంతరం ఏలాటిది, ఎంతటిది అనే ప్రశ్నలు బయలుదేరాయి. వీటికి సమాధానాలను సంక్షిప్తంగా సూచించడమే ఈ వ్యాసంయొక్క ఉద్దేశం.

## 1

ప్రజాస్వామ్యానికి ఇతర స్వామ్యాలకు - రాచరికం, నియంతృత్వం మొదలైనవాటికి అనేక భేదాలున్నాయి. వాటిలో నాలుగు ప్రధానములు. (1) ప్రజాస్వామ్యంలో పరిపాలనాధికార పదవులకు పౌరులలో ఎవరంటే వారు-కొన్ని స్వల్ప మినహాయింపులకు లోబడి - పోటీచేసి విజయాన్ని సాధించవచ్చు. రాచరికంలో ఉన్నత పదవులు రాజవంశానికి చెందినవారివే. నియంతృత్వంలో బలప్రయోగం చేయగలవారికే అధికార పదవులు. (2) పోటీచేసేవారిలో ఎవరు అధికారంలోకి రావలసినది నిర్ణయించేవారు ప్రజలు. వయోజనులందరు స్వేచ్ఛగా పాల్గొనే ఎన్నికలు దీనికి సాధనం - ప్రజామోదం లేక ఎవరుకూడా అధికారంలోకి వచ్చుటకు సాధ్యంకాదు. అందుచేతనే ఈ పరిపాలనా విధానానికి ప్రజాస్వామ్యం అనే పేరు సార్థకమైనది. (3) అధికారంలోకి వచ్చినవారు ప్రజాభిప్రాయానుసారం పరిపాలనను సాగించడం ప్రజాస్వామ్యానికి మూడో లక్షణం. అందుచేతనే ప్రజాస్వామిక లన్నిటితో వాక్స్వాతంత్ర్యం, ప్రకటనా స్వాతంత్ర్యం, సమావేశ స్వాతంత్ర్యం, సంఘ నిర్మాణ స్వాతంత్ర్యం మొదలైనవి మౌలిక హక్కులుగా పరిగణింపబడతాయి. ప్రజాభిప్రాయాన్ని రూపొందించి,

దానిని పరిపాలకులకు తెలియ పరచుటకు ఇట్టి హక్కులు ప్రజలకు ఉండడం అవసరం. ఈ అభిప్రాయం పరిపాలకులను సమర్థించేదిగా ఉండవచ్చు; లేదా విమర్శించి ఖండించేదిగా ఉండవచ్చు. ఈలాటి స్వాతంత్ర్యం ఇతర స్వామ్యాలలో ఉండదు. (4) ప్రజాస్వామ్యంయొక్క ఆదర్శం ప్రజలలో కొందరి శ్రేయస్సేగాక అందరి శ్రేయస్సును వృద్ధిచేయడం, ప్రధానంగా స్వయం సహాయం చేత వృద్ధికి రాలేని బలహీన వర్గాల శ్రేయస్సు పెంపొందించడం, అందుచేతనే ఈనాడు ప్రజాస్వామ్యాలన్నీ శ్రేయోరాజ్యాలుగా పరిగణింపబడడం.

మన రాష్ట్రంలో ఈ నాలుగు సూత్రాలు ఎంతవరకు ఆచరణలో ఉన్నవో మనం తెలుసుకొనవలసి ఉంది.

## 2

అధికారానికి పోటీచేసే హక్కు ప్రజలందరికీ ఉన్నా, అన్ని ప్రజాస్వామికాలలో దానిని వినియోగించుకొనేవారి సంఖ్య చాలా తక్కువ. అందరికీ అధికార వ్యామోహం ఉండదు. అధికారాన్ని వాంఛించే వారిలో అందరికీ దానిని సంపాదించుటకు కావలసిన శక్తి సామర్థ్యాలు సమానంగా ఉండవు. కొందరికి ఇవి పుట్టుకతోనే లభిస్తవి. సహజంగా ఈ శక్తి సామర్థ్యా లుండే వారిలో కొందరికి మాత్రమే అధికార సంపాదనమునకు కావలసిన సాధన సంపత్తి ఉంటుంది. ఎన్నికలలో పోటీచేయువారిలో ఆస్తి, ధనం, పలుకుబడి, కులం, అంతస్తు – ఈలాటి సాధనాలు ఎక్కువగా కలవారు విజయాన్ని సాధిస్తారు. ఈలాటి సాధనాలు లేనివారు, ఇవి స్వల్పంగా కలవారు ఓడిపోతారు. ఈ కారణాలన్నిటిచేత పోటీచేసేవారి సంఖ్య స్వల్పంగా ఉండడం, వారిలో విజయం సాధించేవారి సంఖ్య మరీ స్వల్పంగా ఉండడం జరుగుతుంది. అందుచేత ప్రజాస్వామ్యంలో పోటీచేసే హక్కు అందరికీ ఉన్నా దానిని వినియోగించుకోగల అవకాశం కొందరికే ఉండడం అన్ని ప్రజాస్వామికాలకు లక్షణం.

కాని ఇందులో ఒక సూక్ష్మం ఉంది. పరిణతిగాంచిన ప్రజాస్వామ్యాలలో – ఇంగ్లండు మొదలైన పశ్చిమ యూరపు దేశాలలో – పారిశ్రామిక విప్లవం ఫలితంగా జాతీయ ఆదాయం హెచ్చింది – దారిద్ర్య బాధను అనుభవించవలసినవా రెవరూలేరు – వ్యక్తుల ఆదాయం ఎక్కువగా ఉంటుంది. అన్ని వృత్తులలోనివారికి మంచి ఆదాయం లభిస్తుంది. కులభేదం ఏలాటిదీలేదు. అన్ని వర్గాలవారు విద్యను అభ్యసిస్తారు. ఈ కారణాలచేత అన్ని వర్గాలవారు అధికా

రానికై పోటీచేయగల అవకాశం ఉంది. కార్మికులుకూడా పోటీచేసి విజయం సాధిస్తారు. రాజకీయ పార్టీల నిర్మాణంకూడా సౌష్టవంగా ఉండడంచేత అర్హత గల ధనహీనులు పోటీచేయదలచినప్పుడు వారికి కావలసిన సాధన సంపత్తిని పార్టీలు సమకూర్చడం సర్వ సాధారణం.

మన ప్రజాస్వామ్యం బాల్యావస్థలో ఉండడమేగాక మన దేశంలో దారిద్ర్యం ఎక్కువగా తాండవమాడుతూ ఉంద. ఎన్నికలలో ఖర్చుపెట్టుటకు కావలసిన ధనం గలవారి సంఖ్య చాలా తక్కువ. ఇదిగాక కులతత్వ ప్రభావం చాలా ఎక్కువగా ఉంది. అనాదిగా గ్రామాదులలో కొన్ని కులాలవారే పెత్తనం చేస్తూ వచ్చారు. తక్కిన కులాలవారు వారి యాజమాన్యాన్ని అంగీకరించుటకు అలవాటు పడినవారు - వారిని కాదని స్వతంత్రంగా ప్రవర్తించే అలవాటుగాని ధైర్యంగాని వారిలో లేదు. కొంతవరకు వారి పేదరికం, మరికొంతవరకు వారిని సంఘటిత పరచగల నాయకులు, రాజకీయ పార్టీలు లేకపోవడం దీనికి కారణం.

అందుచేత గత 25 సంవత్సరాలలో కొన్ని కులాలకు చెందిన భూస్వాములే మన రాష్ట్రంలో అధికార పదవులకై పోటీచేయడం, వాటిని సంపాదించడం జరిగింది. ముఖ్యమంత్రి పదవి, ఇతర మంత్రుల పదవులు, శాసన సభల సభ్యత్వం, పంచాయతీరాజ్య సంస్థలలోని పదవులు మొదలైనవన్నీ ఎక్కువగా ఆ కులాల వారే అనుభవించడం పరిపాటి అయింది. ఈ కులాలలో ప్రధానంగా గుర్తించ దగినవి కమ్మకులం, రెడ్లకులం. పరిశోధనలవలన తేలిన విషయం ఏమంటే పరిశోధనఫలితాలుకొన్ని రజని కొఠారి సంపాదకత్వాన మద్రాసులోని ఓరియంట్ లాంగ్మాన్‌ను ప్రకటించిన భారత రాజకీయాలలో కులం (Caste and Indian Politics)

Carolyn M. Elliot: Caste and Faetuar among the Dominant Caste : The Reddis and Kammas in Andhra in Rajni Kothari (Ed) Caste in Indian Politics. Orient Longmans, 1970. జనసంఖ్యలో వీరి శాతం 25 అయినా 1962 లో శాసనసభ స్థానాలలో 39 శాతం, మంత్రి మండలిలో 53 శాతం, వారి వశంలో ఉండింది. పంచాయతీ సమితుల అధ్యక్ష పదవులలో 39 శాతం, జిల్లా పరిషత్తు అధ్యక్ష పదవులలో 55 శాతం ఒక రెడ్ల వశంలో ఉండినవి. అధికార పదవులలో బ్రాహ్మణులు వైశ్యులు మొదలైన అగ్ర వర్గాలకు గల ప్రాతినిధ్యం చాలా తక్కువ. బలహీన వర్గాల ప్రాతి

నిధ్యంకూడా ఈలాటిదే. శాసన సభలో కొన్ని స్థానాలను రాజ్యాంగం హరి జనులకు షెడ్యూల్డు జాతులకు కేటాయించడంచేత వారికి కొంత ప్రాతినిధ్యం లభించింది. తక్కిన అధికార పదవులలో వారికి గల ప్రాతినిధ్యం చాలా స్వల్పం. ఆంధ్రప్రదేశ్ నిర్మాణం 1956 లో జరిగింది. ఈ 16 సంవత్సరాలలో దామోదరం సంజీవయ్యగారు ముఖ్యమంత్రిగా ఉండిన రెండు సంవత్సరాలు, పి. వి. నరసింహారావు ముఖ్యమంత్రిగా ఉన్న ఆరు నెలలు మినహాయిస్తే తక్కిన $13\frac{1}{2}$ సంవత్సరాలలో ముఖ్యమంత్రి పదవి రెడ్ల వశంలోనే ఉండింది.

ఆదర్శ దృష్ట్యా ప్రజాస్వామికంలో అన్ని కులాలవారికి అన్ని వర్గాలవారికి అర్హులందరికి అధికార పదవులను సంపాదించే అవకాశం ఉండడం అవసరమైనా ఆచరణలో ఈ అవకాశం ప్రధానంగా భూస్వాములకు, వారిలోకూడా రెడ్డి కమ్మ కులాలకు చెందిన వారికి లభించినదనీ, అందుచేత గత 25 సంవత్సరాలుగా ఆంధ్రరాష్ట్రంలోని పరిపాలన స్వామ్యం ఈ రెండు కులాలకు చెందిన భూస్వా ముల స్వామ్యం అని చెప్పదగియున్నది.

# 3

ప్రజాస్వామ్యానికి రెండవలక్షణం ఎన్నికలలో ప్రజామోదాన్ని పొందిన వారు అధికారంలోనికిరావడం. ఈ దృష్ట్యా ప్రజలువారిపాత్రను ఆదర్శవంతంగా నిర్వహించారా ? అనే ప్రశ్నకు సూటిగాసమాధానం చెప్పడం సాధ్యంకాదు. సమాధానంచెప్పడానికి జరగవలసిన పరిశోధన జరగకపోవడం దీనికికారణం, కాని కొంతవరకు సమాధానం చెప్పవచ్చు. (1) ఎన్నికలలో పోటీచేసే హక్కు గల ప్రజలందరు పాల్గొనుటకు బదులు కొందరుమాత్రమే పాల్గొనడంచేత అధి కారానికి వచ్చినవారు ప్రజలలో కొందరి ఆమోదంతోనే వచ్చినట్లు చెప్పవలసి ఉంది. ఆంధ్ర ప్రదేశ్ అవతరించిన తర్వాత 1957, 1962, 1967, 1971, 1972లో సాధారణ ఎన్నికలు జరిగాయి. వీటిలోవరసగా వోటర్లలో 45, 64.70, 64.79, 59.4, శాతంమాత్రం వోటుచేశారు, ఇప్పటికికూడా దాదాపు 40 శాతం ఎన్నికలలో పాల్గొనకపోవడం విచారించదగిన విషయం వారికి రాజ కీయాలలో ఏలాటి ఆసక్తి లేదని చెప్పవలసివస్తుంది. (2) ఎన్నికలు అన్నిట్లో కాంగ్రెసు పార్టీకి అత్యధిక (Majority) బలం శాసనసభలో లభించి మంత్రి మండలిని నిర్మాణంచేసి, రాష్ట్రాన్నిపాలించే అధికారం లభించినమాట వాస్తవ మైనా, వోటర్లలో అల్పసంఖ్యాకుల ఆమోదమే వీరి అధికారానికి ఆధారం అని

చెప్పవలసివస్తుంది. ఉదాహరణకు 1962 లో మొత్తపు వోటర్ల సంఖ్య 190 లక్షలు; వారిలో ఓటుచేసినవారు 116 లక్షలు. వీరిలో కాంగ్రెసు పక్షం వోటు చేసినవారు 55 లక్షలు-అంటె మొత్తపు వోటర్లలో 29 శాతం. వీరి ఆమోదంతో కాంగ్రెసు శాసనసభలోని 300 స్థానాలలో 177 స్థానాలు సంపాదించి రాష్ట్రాన్ని పాలించింది. ప్రజలలో మెజారిటీ ఆమోదంతోకాక 29 శాతం ఆమోదంతో అధి కారంలోకి వచ్చిందన్నమాట. (3) ఎన్నికలలో పాల్గొనేవోటర్లు రాజకీయ రంగంలో ఉత్పన్నం అయ్యే సమస్యలదృష్ట్యా స్వతంత్రంగా ఆలోచించి వివిధ పార్టీల అభ్యర్థులకు వోటుచేయక, ఎవరోకొందరు భూస్వాములు ఇతరపెద్దలు చెప్పినట్లు వోటుచేసే అలవాటులో ఉన్నారు. ఇప్పుడిప్పుడు ఇందులో కొంత మార్పువచ్చినట్లు కనుపిస్తుంది. ప్రజలు స్వతంత్రశక్తిని సంపాదించినగాని అధి కారంలోకి వచ్చేవారు ప్రజా మోదంతో వచ్చినట్లు చెప్పుటకు ఆధారం ఉండదు. ఇదిగాక వోటర్లలో కొంతభాగం అవినీతికి పాల్పడి, వోటుచేస్తున్నారు. ఇది కూడ వోటుయొక్క ప్రాధాన్యాన్ని విలువను సంకుచిత పరుస్తుంది. (4) కాని రెండుమూడు విషయాలలో ఆంధ్ర ప్రదేశ్ వోటర్లు విచక్షణతో ప్రవర్తించి నట్లు చెప్పవచ్చు. రాష్ట్రంలో స్థిరప్రభుత్వం అధికారంలోకి వచ్చేటట్లు కాంగ్రెసు పార్టీకి మెజారిటీ బలం చేకూర్చారు. సంకీర్ణ మంత్రి వర్గాల అవసరంలేకపోయింది. ఇది ప్రశంసింపతగ్గ విషయం. ఇదిగాక మత ప్రాతిపదికపైన ఏర్పడిన రాజకీయపార్టీలను అభిమానించక, లౌకికదృక్పథంతో వ్యవహరించే పార్టీలకుమాత్రమే వారు వోటుచేయడంకూడా ప్రశంసాపాత్రమే. మన పరిపాలన వ్యవస్థకు లౌకికసిద్ధాంతం ఆధారం. ఆంధ్ర వోటర్లు దీనిని చక్కగా అర్థం చేసుకొన్నారు. ఈ సందర్భంలో ఇంకొక విషయం కూడా గుర్తించడం అవసరం. మనది ప్రజాస్వామ్యం అయినా ప్రజాస్వామ్యానికి విరోధంగా పనిచేసే రాజకీయ పక్షాలు కొన్ని ఉన్నాయి. వాటిలో కమ్యూనిష్టు పక్షాలు ప్రధానములైనవి. వోటర్లు ఈ విషయాన్ని గ్రహించారు. ఒకప్పుడు కమ్యూనిష్టు పక్షాలకు ప్రాబల్యం ఉండినా క్రమ క్రమంగా అది తగ్గింది. ఈ దృష్ట్యాకూడా ప్రజలు వివేకంతో ప్రవర్తించారని చెప్పవచ్చు. (4) ప్రజాస్వామికం సౌష్టవంగా పనిచేయుటకు సంఖ్యాబలంగల ప్రతిపక్షం ఒకటి శాసనసభలో ఉండడం ఎంతైనా అవసరం. అధికారపక్షాన్ని చక్కగా విమర్శించగల ప్రతిపక్షంఉన్నప్పుడే ప్రభుత్వం బాధ్యతతో ప్రవర్తించడం ప్రజాభిప్రాయాన్ని గౌరవించడం జరుగుతుంది. కాని వోటర్లు ఈ అవసరాన్ని

తీర్చలేకపోయారు. ప్రతి పక్షాలకు ఏ ఎన్నికలలోకూడా తగిన సంఖ్యాబలం లభించ లేదు. అయితే ఇందులో లోపంప్రజలది కాదు. రాజకీయ పార్టీలదే. ప్రతిపక్ష పార్టీలసంఖ్య పెరగడం, వాటిమధ్య సామరస్యం కుదరక పోవడం ఈ పరిస్థితికి కారణం. ప్రతిపక్షపార్టీలసంఖ్య తగ్గడం, ప్రజలను ఆకర్షించగల కార్యక్రమా లను అవి సమర్థించి, వాటిని గురించి ప్రచారంచేయడం జరిగినగాని ప్రజా స్వామ్యం సక్రమంగా సాగజాలదు. అది ఒకవిధమైన నిరంకుశత్వంగామారే ప్రమాదం ఎంతైనాఉంది. ప్రజాస్వామ్యం అనే ముసుగుతో ఏకపక్షనియం తృత్వం స్థాపితంకావచ్చు. ప్రజలు, ప్రతిపక్షాలు ఈ విషయమై ఎక్కువశ్రద్ధ వహించినప్పుడే ఈ దృష్ట్యా ప్రస్తుతం ఆశయాలకు ఆచరణలకుమధ్య ఏర్పడిన అంతరం సంకుచితం కాగలదు.

## 4

ఎన్నికలు అయిదు సంవత్సరాల కొకపర్యాయం జరిగేవి. కాని ఈ మధ్య కాలంలోకూడా ప్రజాభిప్రాయం వ్యక్తంకావడం, దాని ననుసరించి ప్రభుత్వం పరిపాలనను సాగించడం అవసరం, ప్రజాభిప్రాయన్ని వ్యక్తం చేయగల ప్రధాన సాధనాలు వార్తా పత్రికలు, రాజకీయ పార్టీలు, వీటిలో మొత్తంమీద ఆంధ్ర ప్రదేశ్‌లో వార్తా పత్రికలు వాటిబాధ్యతను చక్కగా నిర్వహిస్తున్నవని చెప్ప వచ్చు. ఒక్కలోపంమాత్రం కనుపిస్తుంది. ఏ పార్టీకిచెందక, నిష్పక్షపాతంగా రాజకీయాలను పరిశీలించే పత్రికలు లేనేలేవని చెప్పవచ్చు. ఇంగ్లండులోని న్యూ స్టేట్సుమన్ (New States man), గార్డియన్ (Guardian) వంటి పత్రి కలు ఆంధ్ర ప్రదేశ్‌లో ఏవిలేవు. ఈ లోపాన్ని పూరించవలసిన అవసరం ఎంతై నా ఉంది. రాజకీయ పార్టీలుకూడ ప్రజాభిప్రాయాన్ని రూపొందించి వ్యక్తం చేయండంలో తమ బాధ్యతను సంతృప్తికరంగా నిర్వహించడం లేదు. ఆర్థిక స్థోమతలేని కారణానో, అంగబలం లేనికారణాననో ప్రతిపక్షాలు పల్లెప్రాం తాలలో తమ శాఖలను నిర్మించి ప్రజలతో సన్నిహితం కాలేకపోయినవి. ఇతర ప్రజాస్వామ్యాలలో వార్తాపత్రికలు రాజకీయ పార్టీలేగాక రచయితలు, సినీమా ప్రొడ్యూసర్లు, రేడియోద్వారా ప్రసంగాలుచేసేవారు ప్రజాభిప్రాయాన్ని రూపొందించి వ్యక్తంచేయడంలో గొప్పపాత్రను వహిస్తున్నారు. నవలలు, నాటకాలు, కథానికలు ఈ సందర్భంలో ఎంతో ప్రాధాన్యం వహిస్తున్నవి. మన రాష్ట్రంలో ఈలాటిరచనలను చేసేవారి సంఖ్య చాలాతక్కువ. ఇదిగాక వ్యక్తు

లనేకులు— మేధావులు తదితరులు- వార్తాపత్రికలకు, శాసనసభలోని ప్రతినిధు లకు, ఉత్తరాలువ్రాయడం మామూలు. మనదేశంలోను రాష్ట్రంలోను ఇట్టి వారు చాలాఅరుదు. శాసనసభా సభ్యులుకూడా ఎన్నికల అనంతరం తమతమ నియోజకవర్గాలలో పర్యటించి, తమ్ము ఎన్నుకొనిన వారితో సంప్రతించి, వారి అవసరాలను తెలుసుకొని, వాటిని తీర్చడం తమవిధి అని అనుకొనడంలేదు. ఈ లాటి కారణాలమూలంగా ప్రజాభిప్రాయం అనేది రూపొందడానికిగాని, వ్యక్తం కావడానికిగాని రాష్ట్రంలో అవకాశాలు చాలాతక్కువగా ఉన్నాయి. ప్రజాభి ప్రాయమే రూపొందనప్పుడు దాని ననుసరించి పరిపాలనను సాగించడమనేదానికి ప్రసక్తేలేదు. ఈ దృష్ట్యా మన ప్రజాస్వామ్యం శైశవదశలో ఉంది. ప్రజా స్వామ్యం బదులు భూస్వాములస్వామ్యం అమలులో ఉండడానికి ఇదేకారణం. రాజకీయాలలో వారి అభిప్రాయానికే విలువ. ఆదర్శాలకు ఆచరణలకు మధ్య అంతరాయం ఉండుటకు ఇదికూడా కారణం.

సవ్యమైనట్టి సక్రమమైనట్టి ప్రజాభిప్రాయం ఏర్పడుటకు కావలసిన సాధ నాలు లేకపోవడం చేతను, ఉన్నా అవి పటిష్టంగా పని చేయక పోవడం చేతను, తమ అభిప్రాయాన్ని పరిపాలకులకు తెలియపరచి తమ అవసరాలను తీర్చుకొన గోరు వారు ప్రత్యక్ష చర్యలలోకి దిగి, సమ్మెల సాధనానను, బలప్రయోగంతో కూడిన దౌర్జన్యచర్యల ద్వారాను ప్రభుత్వంపై వొత్తిడికి పూనడం మామూ లయింది. ప్రజాస్వామ్యంలో ఈలాటి చర్యలకు స్థానం ఉండరాదు. కాని దేశం లోను మనరాష్ట్రంలోను మంత్రివర్గాల దృష్టిని ఆకర్షించుటకు ఇవియే పటిష్ఠ సాధనాలైనవి. వీటిని ఉపయోగించేవారికే ప్రభుత్వం మూలాన లభించవలసిన ప్రయోజనాలు లభిస్తున్నాయి. చట్టబద్ధమైన సక్రమమార్గాలను అనుసరించేవారి మొరలను ఆలకించు అధికారులు లేరు. వారిది అరణ్యరోదనంగా పరిణమిస్తున్నది. ఇది క్రమంగా అరాచక పరిస్థితులను తెచ్చిపెట్టే విధానం. ప్రజాస్వామ్యాదర్శా లకు అనుగుణమైనట్టిది కాదు. ఇందుచేత ప్రజాభిప్రాయాన్ని చక్కగా రూపొం దించి వ్యక్తం చేయగల సాధనాల అవసరం ఎంతైనా ఉంది.

## 5

ప్రజాస్వామ్యంయొక్క లక్ష్యం ప్రజలలో కొందరి శ్రేయస్సును మాత్రమే గాక అందరి శ్రేయస్సును వృద్ధి చేయడం. కాని ఈ దృష్ట్యా కూడా ఆశయాలకు ఆచరణలకు మధ్య అంతరాయం ఏర్పడి ఉన్నది ధనికులు

దరిద్రులు మధ్య తరతరాలుగా ఏర్పడిన తారతమ్యం 25 సంవత్సరాలుగా ప్రజాస్వామ్యం అమలులో ఉన్నా తగ్గుముఖం పట్టలేదు. ధనికులు మరింత ధని కులు కావడం పేదలు మరింత పేదలు కావడం జరుగుతూ ఉన్నట్లు పరిశోధకుల అభిప్రాయం. అధికారంలోకి రాగలిగిన వర్గాలవారు తమ అధికారాన్ని వర్గ ప్రయోజనాలకు వినియోగించుకొనడం సర్వసాధారణమయినది. పన్నుల భారం పెరిగి, ప్రభుత్వానికి లభించే ఆదాయం 25 సంవత్సరాల మధ్య ఎంతో పెరిగింది. కాని ఇందులో చాలాభాగం ప్రభుత్వోద్యోగుల జీతబత్యాలకై వినియోగమౌ తున్నది. ప్రజలశ్రేయస్సుకై వినియోగమయ్యే భాగం చాలా తక్కువ. ఈ తక్కువ భాగంలోకూడా విస్తారం అధికారులు, ఉద్యోగులు, కంట్రాక్టర్లు మొద లైన వారి వశం అవుతున్నది. అవినీతి, లంచగొండితనం విపరీతంగా పెరిగి పోవ డం దీనికి కారణం. ధరలు విపరీతంగా పెరుగుతున్నా, నిరుద్యోగుల సంఖ్య పెరుగుతున్నా, ప్రజలలో అత్యధిక భాగానికి కనీసఅవసరాలు లభించక పోయినా వీటిని గురించి ఆత్మశుద్ధితో పట్టించుకొన్న ప్రభుత్వం రాష్ట్రంలో ఇది వరకు ఏర్పడలేదు. భూమి కమతాలగురించి, రైతులు చెల్లించ వలసిన మక్తాల గురించి శాసనాలు చేయబడినా అవి అమలులోకి రాలేదనే విషయం అందరికి తెలిసిందే. వ్యవసాయకూలీల స్థితిగాని బలహీనవర్గాల స్థితిగాని శ్రేయోరాజ్య దృష్ట్యా ఏలాటి మార్పును చెందలేదు. పంచాయతీ రాజ్యం ద్వారా బాగుపడిన వారు ధనవంతులైన భూస్వాములే. సోషలిజం అనేది ఒకనినాదంగా తయార యింది. ఇది మాటలలోను ఉపన్యాసాలలోను వినిపించే సోషలిజమే కాని, క్రియా రూపంలో కనుపించే సోషలిజం కాదు. 1947లో మనకు రాజకీయస్వాతంత్ర్యం లభించిందిగాని ఆర్థిక స్వాతంత్ర్యం లభించలేదు. వెనుకబడిన ఇతరదేశాలు సాధిం చిన ఆర్థికాభివృద్ధిని కూడా మనం సాధించలేక పోయాం. అందుచేత ప్రజలమధ్య అనాదిగా ఏర్పడిన తరతమ భేదాలు అలాగే ఉండిపోయాయి. ఈ దృష్ట్యా మన ప్రజాస్వామ్య ఆశయాలు ఆశయాలుగానే ఉండిపోయాయి. ఆచరణలోకి రాలేక పోయాయి. ప్రజలు, వారిపై నాయకత్వం వహించిన వారు, రాజకీయ పార్టీలు దీనిని గుర్తించి, అందరి శ్రేయస్సు సత్వరం వృద్ధిగాంచుటకు అనువైన కార్యక్ర మాలను ఆచరణలోకి తేవలసిన అవసరం వెంటనే తీరవలసి ఉంది. ఇందులో ఏ పాటి ఆలస్యం సంభవించినా ప్రజాస్వామ్యం దాని స్థిరత్వాన్ని కోల్పోతుంది.

# ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి

డా. ఎ. నాగరాజ్

రెండో ప్రపంచయుద్ధ కాలంలో గుండుసూదులకు బదులుగా ముళ్ళు (Thorns) వాడేవారని మన పెద్దలు చెబుతూ ఉంటారు. అందుకు కారణం - మన దేశంలో వాటి ఉత్పత్తి తగిన పరిమాణంలో జరగక పోవడమే. గడ్డం చేసుకొనే బ్లేడ్లు ఉత్పత్తి అయ్యేవికావు. బ్లాక్ మార్కెట్‌లో అతి కష్టంమీద ఒక పాకెట్ బ్లేడ్లు లభించేవి. కాస్ట్రో గడ్డం ఫ్యాషన్‌బుల్ కాదు. ఇప్పుడు మనం కార్లు, రైల్వే ఇంజన్‌లు, విమానాలు తయారు చేస్తున్నాము. మన ఆర్థిక బలం అంతంతమాత్రమైనది కాదనే సత్యాన్ని మొన్న జరిగిన పాకిస్థాన్ యుద్ధం నిరూపించింది.

ఇట్లాంటి ఆర్థిక ప్రగతిమధ్య ఇంత నికృష్టమైన దారిద్ర్యం మనచుట్టూ ఎందుకు అలముకొని ఉంది ? మన రాష్ట్ర రాజధాని నగరంలో ఎక్కడ చూసినా బిచ్చగాళ్ళమయమే. ప్రతి పాన్‌షాప్ దగ్గర కష్టమర్లచుట్టూ బిచ్చగాళ్ళు మూగి వారిని విసిగిస్తూ ఉంటారు. హైదరాబాద్ నగర వీధులలో కొన్ని వందల మంది కుష్టురోగులు తిరుగుతూ బిచ్చమెత్తుకొంటూ ఉంటారు. ఈ విపరీత మేమిటి ? మన మెన్నో వస్తువులు తయారుచేస్తున్నాము. మన హెచ్. ఎమ్. టి. ఫ్యాక్టరీ తయారుచేసే వస్తువులు తూర్పు యూరప్ దేశాలకు ఎగుమతి అవుతున్నాయి. మన రైల్వే వాగన్లకు విదేశాలలో మంచి మార్కెట్ ఉంది. మన సాంకేతిక నైపుణ్యం తూర్పు దేశాలలో ఘనమైన పొగడ్త లందుకొన్నది. అయితే ఏం...... ?

ప్లానింగ్ ప్రక్రియలు తప్పుడు మార్గంలో పడినాయా ? వనరుల కొరత ఉందా ? ప్లానింగ్, అభివృద్ధి రంగాలు అధిక సంఖ్యాకులైన పేదవర్గ ప్రజలను వదిలివేసి సంఘంలోని ఉన్నత వర్గాలవారికి తోడ్పడినవా ? ఇట్లాంటి ప్రశ్న లెన్నింటికో మనం వెంటనే సమాధానం చెప్పుకోవలసిన అవసరముంది.

మన ప్రణాళికా విధానంలో కొట్టవచ్చినట్లు కనిపించే కొన్ని లోపాలను మొదట పరిశీలిద్దాము. ఒక ఆర్థికవేత్త అన్నట్లు, ద్రవ్యమనే మేలిముసుగులో నుంచి మనం చూస్తూ ఉంటాము. ద్రవ్యానికే ఎంతో అలవాటుపడిన మనం ప్రతి ప్రక్రియను చివరికి ప్రతి ఆలోచనను ద్రవ్యం దృష్టితోనే చేస్తూ ఉంటాము. సామాన్య పౌరులమాట అటుంచి ఆర్థికవేత్తలకుకూడా ఆర్థిక ప్రక్రియలను వాస్తవికస్వభావాన్ని వాస్తవిక దృష్టితో పరిశీలించడం కష్టమవుతుంది. ఉదాహరణకు, భారీయంత్రాల ఉత్పత్తి కర్మాగారమైన రాంచీకర్మాగారంలో అనుపయోగశక్తి (unused capacity) ఉంది. మన ఇంజనీర్లు ఎందరో నిరుద్యోగులుగా ఉన్నారు, దేశంలో లభ్యమయ్యే వనరులన్నీ వినియోగింపబడలేదు. ఇది ఒక వింతవైపరీత్యంగా తోస్తుంది. ముడిసరుకులు అందుబాటులో ఉన్నాయి. అంగబలం అధికంగానే ఉంది. వీటి సహాయంతో యంత్రాలు తయారుచేయవచ్చు. కాని ఆర్థిక ప్రగతి మందకొడిగా సాగుతూఉంది. కారణమేమిటి ? మన ఆలోచనా విధానం సరిఅయింది కాకపోవడమే దీనికి కారణమనిపిస్తుంది. ఏ పథకానికైనా "ద్రవ్యం కొరత" అనే పరిమితులను చూపడం అలవాటైపోయింది. అదనపు ద్రవ్యంకోసం మన ఆర్థికమంత్రి కేంద్రాన్ని అర్థిస్తాడు. కేంద్ర ఆర్థిక మంత్రి ఎప్పటి కప్పుడు ఆంధ్రప్రదేశ్ చెల్లించవలసిన R. B. I. ఓవర్ డ్రాఫ్ట్‌లు చూపిస్తాడు. ద్రవ్యం విషయంలో తగిన క్రమశిక్షణ అవసరమని సలహా ఇస్తాడు. వీటి ఫలితంగా మన ఆర్థికమంత్రి అనుకొన్నదానిలో కొంత భాగాన్నే తీసుకొస్తాడు. ఇట్లాగే మిగతా పథకాలలోకూడా జరుగుతూ ఉంటుంది. ఆర్థికాభివృద్ధి విషయంలో అదనపు వనరులు వెతకడం, అదనపు ద్రవ్యం సమకూర్చుకోవడం చెయ్యవలెనని కేంద్రం రాష్ట్రాలకు సలహాలిస్తుంది.

మనదగ్గర ఎక్కువ డబ్బే ఉంటే పెద్దపెద్ద పథకాలు వేసేవాళ్ళమని అంటూ ఉంటారు. ద్రవ్యాభావం అనేది మనకు మనం ఏర్పరుచుకొన్న అర్థంలేని పరిమితి మాత్రమే. కొత్తనోట్లు ముద్రించి, ప్రగతిని శీఘ్రతరం చేయవచ్చు గదా ? అనవచ్చు. కాని, కొత్తగా నోట్లు ముద్రిస్తే ఆర్థిక వ్యవస్థ ద్రవ్యోల్బణానికి గురిఅవుతుందని ఆర్థికవేత్తలు హెచ్చరిస్తారు. అట్లా అధికమైన నోట్ల చెలామణివల్ల ధరలు పెరగడం, మొత్తం వ్యవస్థలో అస్తవ్యస్త పరిస్థితులు ఏర్పడడం జరుగుతాయని భయపెడతారు. ఇట్లా హెచ్చరించే ఆర్థిక వేత్తలు ఎవరు ? సంప్రదాయ పద్ధతులలో ఆలోచించే వయసుమళ్ళిన ఆర్థికవేత్తలు. ఈనాటి యువతరం ఆర్థికవేత్తలకు పైన చెప్పినదంతా తప్పని తెలుసు. కాని

వారి మాట వినిపించుకోరు. వారికి ప్రభుత్వంలో పలుకుబడి లేదు. కాని ఆర్థిక వ్యవస్థ మాత్రం దెబ్బతింటూనేఉంది. కొన్ని ప్రత్యేక పరిస్థితులలోనే అధిక ద్రవ్యం చలామణిలోఉంటే ద్రవ్యోల్బణం ఏర్పడే ప్రమాదము ఉంది. ఒక ఉదాహరణ తీసుకొని చూద్దాము.

60°c. ఉష్ణోగ్రత ఉన్న 10 గాలన్‌ల వేడినీళ్ళు 20°c. ఉష్ణోగ్రతఉన్న 10 గాలన్‌ల చల్లనీళ్ళు కలిపితే 40°c. ఉన్న 20 గాలన్‌ల నీళ్ళు వస్తాయను కొందాము. 60°c ఉష్ణోగ్రత ఉన్న 1000 గాలన్‌ల వేడినీళ్ళు, 20°c ఉష్ణోగ్రత ఉన్న 1000 గాలన్‌ల చల్లనీళ్ళు కలిపితే 40°c ఉన్న 2000 గాలన్‌ల నీళ్ళు వస్తాయి. అంటే ఫలిత ఉష్ణోగ్రత (resultant temperature) ఎప్పుడూ స్థిరంగా ఉంటుందని తెలుతుంది. వేడినీళ్ళు చల్లనీళ్ళు సమాన అనుపాతంలో కలిపితే 60°c, 20°c, 40°c ఉన్న నీళ్ళు వస్తాయి. పై ఉదాహరణ నుంచి మనం తెలుసుకోవలసిన ఒక చక్కని గుణపాఠం ఉంది.

ఆర్థికవ్యవస్థలోని అన్నిరంగాలు పరస్పరం ఆధారపడేవే. వ్యవసాయం పరిశ్రమలపైన, పరిశ్రమలు గనులపైనా – ఇట్లాగే మిగిలిన పరిశ్రమలు కూడా పరస్పరం ఆధారపడి ఉంటాయి. సబ్ సెక్టార్ లుకూడా పైవిధంగానే ఆధారపడి ఉన్నవే. వ్యవసాయం, పరిశ్రమల మధ్య సంబంధం సామాన్యంగా 1:2 నిష్పత్తిలో ఉంటే వ్యవసాయరంగంలో రు. 100 కోట్లు, పరిశ్రమలరంగంలో రు. 300 కోట్లు పెట్టుబడి పెడితే ద్రవ్యోల్బణం తప్పక ఏర్పడుతుంది. ఎందుకంటే పెట్టుబడి నిష్పత్తి 1:3 కాబట్టి. అట్లాకాకుండా వ్యవసాయరంగంలో రు. 10,000, కోట్లు పారిశ్రామిక రంగంలో రు. 20,000 కోట్లు పెట్టుబడి పెడితే కూడా పెట్టుబడి పెద్ద ఎత్తున సాగినా – ద్రవ్యోల్బణానికి దారి తీయదు. దీనినిబట్టి చూస్తే వివిధ రంగాలలో జరిగే పెట్టుబడుల అనుపాతం అత్యంత ప్రధానమైన అంశమని తెలుస్తుంది. ఇంతవరకు మనం రెండు రంగాలను దృష్టిలో ఉంచుకొనే మాట్లాడినాము. అనేక రంగాలు ఉన్నాకూడా ఇదేసూత్రం వర్తిస్తుంది.

వివిధరంగాల మధ్య కేటాయించిన పెట్టుబడుల నిష్పత్తులను తగిన విధంగా ఉండేటట్లు చూస్తే ధరలలో విపరీతమైన మార్పులు ఏర్పడవు. ఈ విషయంలో ద్రవ్యరాశి (quantity of money) కన్న పెట్టుబడుల నిష్పత్తి, అత్యంత ప్రధానమైనదని చెప్పవచ్చు. దురదృష్టమేమంటే లోటుబడ్జెట్ విధానం (dificit financing) ద్రవ్యోల్బణానికి దారి తీస్తుందని, పన్నుల విధానం,

ఋణసేకరణ విధానాల వల్ల అటువంటి ప్రమాదం లేదని మన ప్రభుత్వం భావిస్తూఉంది.

ఇప్పుడు ప్రభుత్వ ఋణసేకరణను పరిశీలిద్దాము. ప్రభుత్వం ప్రజల దగ్గర, సంస్థల దగ్గర ఋణాలు తీసుకొని, బాండ్లను ఇస్తుంది. అట్లా సేకరించిన ధనాన్ని ప్రభుత్వం ఖర్చుపెడుతుంది. ఆరూపంలో తిరిగి సంఘానికే లభిస్తుంది. అట్లాంటప్పుడుకూడా సంఘంలో కొంతద్రవ్యం ఉండనే వుంటుంది. దానికితోడు బాండ్లు కూడాఉంటాయి. ప్రభుత్వం ఇచ్చే బాండ్లు ద్రవ్యంతో దాదాపు సమానము. ప్రజల దగ్గర ఉన్న బాండ్లను ఇనపబీరువాలో భద్రపరుస్తా రనుకొందాము. అందువల్ల సంఘంలో చలామణి అయ్యే ద్రవ్యం పరిమాణం మారకుండా స్థిరంగా ఉంటుందన్న వాదంలో సత్యం లేకపోలేదు. కాని బాండ్లు ఉన్నవారు వాటిని తాకట్టు పెట్టి ద్రవ్యం చేసుకొంటే ఆర్థికవ్యవస్థలోని ద్రవ్యత్వం-(liquidity) ద్రవ్యం + ద్రవ్యంతో సమానమైనటువంటివి కలిపి-అధికమయి ప్రభుత్వవ్యయం సంతులితమైనదిగా ఉండేటట్లు చూస్తే తప్ప ద్రవ్యోల్బణం ఏర్పకుండా కాపాడటం కష్టమవుతుంది. దీనినిబట్టిచూస్తే నోట్లముద్రణ ఎంతప్రమాదకరమో, ప్రభుత్వ ఋణ విధానంకూడా అంతే ప్రమాదకరమైనదని స్పష్టమవుతుంది. అంతేకాదు ప్రభుత్వం చేసే ఋణాలకు వడ్డీ కూడా చెల్లించ వలసి ఉంటుంది. ఇన్ని లోపాలు ఉన్నా ప్రభుత్వం ఇట్లాంటి విధానం ఎందుకు అనుసరిస్తుందో తెలుసుకోవడం ఏమంత కష్టంకాదు – ఆర్థిక విషయాలకు సంబంధించి మన ఆలోచనలు లోపభూయిష్టంగా ఉండటమే దీనికి కారణమని స్పష్టమవుతుంది.

ఆర్థికాభివృద్ధి ప్రక్రియను మరింత సూక్ష్మంగా పరిశీలిద్దాము. ప్రతి అభివృద్ధి ప్రక్రియలోను గ్రామీణ ప్రజలు తక్కువ సంఖ్యలోను పట్టణ ప్రజలు అత్యధికంగాను ఉంటారు. ఇట్లాంటిది అన్ని దేశాల ఆర్థికవృద్ధికి వర్తిస్తుంది. మన రాష్ట్రంలో దాదాపు 80% ప్రజలు గ్రామప్రాంతాలలో నివసిస్తూ ఉన్నారు. పారిశ్రామిక రంగంలో తగినన్ని ఉపాధి అవకాశాలు కల్పించడం జరగలేదు. ఇట్లాంటిది జరిగినప్పుడే భూమి యాజమాన్యం విషయంలో వ్యవస్థాపూర్వకమైన మార్పులు ఎన్ని తెచ్చినా అవి ఆర్థిక వ్యవస్థ నంతటినీ ప్రభావితం చేయ లేని రాజకీయ - సాంఘిక ప్రయోగాలు మాత్రమే అవుతాయని బాగా అర్థంచేసుకొనవలె. ఇట్లా అనేవాడు అభివృద్ధినిరోధకుడని, సమసమాజస్థాపనకు వ్యతిరేకి అని అనుకోకూడదు. 1945లో అమెరికా ఆక్రమిత ప్రభుత్వం జపాన్‌లో విప్లవాత్మకమైన భూసంస్కరణలు ప్రవేశపెట్టినప్పుడు 20% జనాభా - గ్రామాలలో

నివసించేవారు- పట్టణప్రాంతాలకు వలసరావటం ప్రారంభమయింది. పారిశ్రామిక ప్రాంతాలలో ఉపాధి అవకాశాలు ఎక్కువగా కల్పించడం ప్రారంభమైంది. కాని మన రాష్ట్రం విషయంలో అట్లా జరగడం లేదు. పారిశ్రామిక రంగంలో పెద్ద పథకాలను, భూకమతాల విషయంలో విప్లవాత్మకమైన సంస్కరణలను ఏక కాలంగా చేపట్టడమే మన ప్రభుత్వం అసలు చేయవలసిన పని. ఇట్లాచెయ్యక పోతే, ఎటువంటి సోషలిస్టు శాసనాలు రూపొందించినా ఆర్థిక వ్యవస్థ స్తబ్ధతకు గురిఅవుతుంది. కేవలం ఒకే రంగంలో మార్పులు తెచ్చినందువల్ల ఏర్పడే ఫలితాలు నామమాత్రంగా మాత్రమే ఉంటాయి.

అభివృద్ధిపథకాల అమలు విషయంలో ప్రభుత్వానికి ఉన్న ద్రవ్య సంబంధమైన సమస్యలపట్ల మనకు సానుభూతి ఉంది. రాష్ట్రాలు అదనపుద్రవ్యం సృష్టించలేవు. పన్నులద్వారా లభించేరాబడి విద్య, వైద్య, ఆరోగ్య రంగాలలో పెట్టే ప్రభుత్వం ఖర్చుకుకూడా సరిపోవడంలేదు. ప్రయివేట్ వ్యక్తులు పరిశ్రమలు నెలకొల్పవలెనని ప్రభుత్వం అంటూ ఉంటుంది. కాని ప్రయివేట్ సంస్థలకున్న ద్రవ్య వసతులు పరిమితంగా ఉంటాయి. వీటన్నిటి ఫలితంగా చెప్పుకోదగినంత ఆర్థికాభివృద్ధి జరగదు. పై సమస్యలకు పరిష్కారం తేలికయినదే. ఆర్థికవ్యవస్థలో వాస్తవికమైన వనరులు- భౌతికమైన వనరులు (real resources) పుష్కలంగాఉంటే ద్రవ్యాన్నిగురించి అంత తీవ్రంగా ఆలోచించవలసిన అవసరంలేదు. డబ్బు అనేది పారిశ్రామికాభివృద్ధి అనే యంత్రానికి స్నేహకము (lubricant) మాత్రమేకాని ఆ యంత్రాన్ని నడిపించేఇంధనము (fuel) కాదు. కమోడిటీ బ్యాలెన్స్‌ను అంచనా వేసేటప్పుడు పెట్టుబడుల అనుపాతాన్ని దృష్టిలో ఉంచుకొంటే ద్రవ్యోల్బణం ఏర్పడటానికి ఎట్లాంటి అవకాశము ఉండదు. కాని ద్రవ్యంపైన కేంద్రానికే సంపూర్ణాధికారంఉంది. అది లోపభూయిష్ఠమైన సూత్రాల వలలో చిక్కుకొనిఉంది. ఈ మధ్య చేసిన ప్రణాళికాసంఘ పునర్వ్యవస్థీకరణవల్ల యువతరం ఆర్థికవేత్తలకు ప్రభుత్వానికి సలహాఇచ్చే అవకాశం లభించదని భావించడం జరిగింది. ఆర్థికవిధానం సరి అయిన పంథాలో నడుస్తుందని, కొత్త పోకడలు కనిపిస్తాయని ఆశించినాము. కాని ఆర్థికమంత్రి శ్రీ చవాన్ చేసిన ప్రకటనలో పరిశీలిస్తే ఆలోచన తీరులలో మార్పులు వచ్చినట్లు కనబడవు. అంతకుపూర్వం ఉన్న ఆర్థికమంత్రులు మాట్లాడిన ధోరణిలోనే శ్రీ చవాన్ కూడా ప్రసంగిస్తూఉన్నారు. లేదంటే ఆదాయవ్యత్యాసాలు తగ్గించవలెనని, సమసమాజం నిర్మించవలెనని ఉద్ఘాటిస్తున్నారు. అధిక సంఖ్యాక

ప్రజలు శ్రీచవాన్, శ్రీమతి ఇందిరాగాంధి అభిప్రాయాలను మెచ్చుకొంటు న్నారు. కాని వారి ప్రకటనలతో అర్థిక వేత్తలను కలవరపెట్టేదంతా సమసమాజ స్థాపనతోపాటు, ఉత్పాదక కార్యక్రమాలను పెద్దఎత్తున కొనసాగించవలేననేదే. కాని దీనికి పరిష్కారం మన రాష్ట్ర ప్రభుత్వం చేతులలో లేదు. అది పూర్తిగా కేంద్ర ప్రభుత్వంపై ఆధారపడి ఉంటుంది. ముఖ్యంగా ఆలోచనా పద్ధతిపై ఆధారపడి ఉంటుంది.

క్లుప్తంగా చెప్పవలెనంటే, మనరాష్ట్ర అభివృద్ధికానీ, మరి ఏ ఇతర రాష్ట్రాల అభివృద్ధికాని, ఆయారాష్ట్రాల విధానాలపై కాక లోటుబడ్జెట్‌ను గురించి, వ్యావసాయ ఉత్పత్తిని గురించి కేంద్ర అర్థికమంత్రి ఎట్లా ఆలోచిస్తున్నాడో అనే దానిపై ఆధారపడి ఉంటుంది. వ్యవసాయరంగంలో రు. 20,000 కోట్లు పెట్టు బడిపెట్టి 150 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాలు పండించగలిగితే-అంటే సాలీనా 10 మి. టన్నుల చొప్పున – ఆ రంగంలో పెట్టుబడి పెట్టడం మంచిదే. వ్యవసాయదారులకు ఇచ్చే ఋణాలు తిరిగి రాబట్టకుండా ఉండవచ్చు. ఇట్లా చేసినాఆర్థికవ్యవస్థ ఏమాత్రం దెబ్బతినదు. మామూలు వడ్డీ వ్యాపారుల మాదిరి ప్రభుత్వం ప్రవర్తించకూడదు – వడ్డీవ్యాపారి తాను ఋణంగా ఇచ్చిన రు. 10 ల కోసం అప్పుతీసుకొన్న వాడిచుట్టూ పదిమాట్లు తిరిగి, విసిగించి వడ్డీ వసూలు చేస్తాడు. ప్రభుత్వానికి అట్లాంటి దృష్టి ఉండకూడదు. ఇతర రాష్ట్రాలమాదిరిగానే మన రాష్ట్రంలో పనిచేస్తున్న భూమి తనఖా బ్యాంకులు అనుసరించే విధానం కూడా సరి అయినది కాదు. ఋణం తీసుకొన్నదాని ఫలితంగా రైతు పంట ఎక్కువగా పండించగలిగితే తీసుకొన్న ఋణం తిరిగి చెల్లించడానికి అతనికి అన్ని సదుపాయాలు కల్పించవలె. ఋణాలు తిరిగి చెల్లించడమనేది భవిష్యత్తులో ఇచ్చే ఋణాలకు ప్రాతిపదిక కాకూడదు. రైతులకు ఇచ్చేఋణాలకు స్వల్పకాలంలో ఉత్పత్తి పెంచగలగడంతోనే సంబంధం ఉండవలెనేకాని తీర్చేపద్ధతిలో కాదు. ప్రస్తుతం ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం, మామూలు వడ్డీ వ్యాపారి అనుసరించే పద్ధతులకన్న ఏమాత్రం మెరుగైనది కాదనే చెప్పవచ్చు. ప్రభుత్వం వడ్డీ వ్యాపారస్తుని స్థానం అక్రమించింది. వాటి మధ్యఉన్న తేడా అంతా తక్కువ వడ్డీ తీసుకోవడంలోనే ఉంది. ప్రభుత్వం వడ్డీ వ్యాపారస్తుని కన్న తక్కువ వడ్డీ వసూలుచేస్తుంది. కాని ఇచ్చిన డబ్బు రాబట్ట వలెననే దృష్టిమాత్రం అట్లాగే ఉంది. ఇట్లాంటి వైఖరి అంత సరి అయినది కాదు. భూమి తనఖా బ్యాంకులు మొదలయిన ద్రవ్యసంస్థల సామర్థ్యాన్ని అవి అందించిన ద్రవ్యంవల్ల వ్యవసాయ

రంగంలో ఏర్పడిన అభివృద్ధి దృష్టితో చూడవలెనే కాని, ఇచ్చిన ఋణాలలో ఎంత మేరకు తిరిగి రాబట్ట గలిగి నాయనే దృష్టితో చూడకూడదు. వ్యవసాయరంగంలో గణనీయమైన అభివృద్ధి సాధించగలిగితే రైతుల కిచ్చిన ఋణాలను వారి కిచ్చిన కానుకగా భావించి వదిలివేయవచ్చు. ఇట్లాంటి కొత్త ఆలోచనే మనరాష్ట్ర ఆర్థికాభివృద్ధిని శీఘ్రతరం చేయగలదు.

పైన చెప్పిన సాహసోపేతమైన పథకం అమలు జరవడానికి మన రాష్ట్ర ప్రభుత్వానికి తగినంత ఆర్థికస్తోమత లేనందువల్ల కేంద్రప్రభుత్వంపై ఆధారపడవలసి ఉంటుంది. కాని బూజుపట్టిన భావాలున్న కేంద్ర ప్రభుత్వం అంత ఉదారంగా అవసరమైన అదనపు ద్రవ్యం రాష్ట్రాలకు ఇస్తుందనే నమ్మకంలేదు. ఇట్లాంటి పరిస్థితులలో బ్రిటిష్ ప్రభుత్వం జారీచేసిన కాన్‌సల్ (consul) వంటి ఋణ పత్రాలు జారీచేయవలసి ఉంటుంది. కాన్‌సల్ అంటే ఒకరకమైన ప్రజా ఋణాలసేకరణలో ఉపయోగించేవి. కాని, మాములు ప్రజాఋణాలకు దీనికి ఒక ముఖ్యమైన తేడాఉంది. కాన్‌సల్‌ల విషయంలో అసలు చెల్లించకుండా కేవలం వడ్డీని మాత్రమే శాశ్వతంగా చెల్లించడం జరుగు తుంది. కాన్‌సల్ విషయంలో గడువు అనేది ఉండదు.

అతి దీర్ఘ కాలంలో ( seqular period ) - 20, 30 సంవత్సరాల కాలంలో ధరలు పెరగడం తథ్యం కాబట్టి ఒకతరం నుంచి మరొక తరంనాటికి ద్రవ్యభారం అట్లాగే ఉన్నా వాస్తవికమైన భారం తక్కువ అవుతూవస్తుంది. పైసలవా పాటిస్తే సమర్థవంతంగా ప్రణాళికలు వేయడానికి అవసరమైన అదనపు ద్రవ్యం లభిస్తుంది. ఎందుకంటే ఋణాలు తిరిగి చెల్లించవలసిన అవసరం ఏదశలోను ఏర్పడదుకాబట్టి.

అంతేకాక జనాభా పెరుగుదలను అదుపులో ఉంచడానికి తీవ్రంగా ప్రయత్నించవలె. ఈ సందర్భంలో భారత జనాభా పెరుగుదలలోని పోకడలను కొన్నింటిని పరిశీలిద్దాము. ఈ పోకడలు మనరాష్ట్రం విషయంలోకూడా దాదాపు యదార్థమే అవుతాయి. 1921 లో మన దేశంలో జనము సాలుసరి పెరుగుదల 4.92%, మరణాలరేటు 4.86% ఉండేవి. జనాభా 0.06% చొప్పున పెరుగుతూ ఉండేది. ఇట్లాంటి పెరుగుదల అత్యల్పమైన పెరుగుదలే అని భావించవచ్చు. కాని, వైద్య, ప్రజారోగ్య సౌకర్యాలు ఎక్కువ కావడంవల్ల 1971 నాటికి మరణాలరేటు 1.4% పడిపోయింది. జననాల రేటుకూడా 3.9% తగ్గింది. కాని జననాలరేటు 1.4% తగ్గితే, మరణాలరేటు 3.9% తగ్గింది. అందుకే

కాని జననాలరేటు 1.4% తగ్గితే, మరణాలరేటు 3.9% తగ్గింది. అందుకే జనాభా 2.5% చెప్పున పెరుగుతూ ఉందని అంటున్నాము. మరణాలరేటు తీవ్రంగా పడిపోవడంవల్లనే జనాభా హఠాత్తుగా అత్యధికంగా పెరిగింది. మరణాలరేటు ఎప్పుడూ అసలేలేకుండా ఉండదు. అసలు మరణాలే లేకుంటే మనమందరం అమరుల మవుతాము! మరణాలరేటు 1% స్థాయిలో స్థిరపడిపోతుంది. ఈలోపుగా జనాభా పెరుగుదలరేటును తీవ్రమైన ప్రచారంద్వారా అరికట్టవలసి ఉంది. కుటుంబ నియంత్రణపై ఎంత డబ్బు ఖర్చుపెట్టినా సమర్థనీయమే అవుతుంది. వనరుల కేటాయింపులో కుటుంబ నియంత్రణపై పెట్టే పెట్టుబడి అత్యుత్తమమైనదని చెప్పవచ్చు.

చివరికి ఒక్కమాట చెబుతాను: సత్వరాభివృద్ధి సాధించడానికి మన రాష్ట్రం కుటుంబ నియంత్రణపైన, వ్యవసాయంపైన పెట్టుబడి పెట్టడం మంచిదని సలహా ఇవ్వవచ్చు. ఆర్థిక వ్యవస్థనంతా ప్రభావితం చేసేటంత పెద్దమొత్తాలు పెట్టుబడి పెట్టడం మంచిది. పై రెండు రంగాలలో అల్పకాలంలో అభివృద్ధి సాధిస్తే ఆహార ధాన్యాల ధరలు పెరగవు. కాని పరిశ్రమల అభివృద్ధికోసం పెట్టుబడి తగిన ప్రమాణంలో పెట్టకపోతే ఇతర వినియోగ వస్తువుల ధరలు పెరగవచ్చు. పారిశ్రామిక రంగంలో పెద్దఎత్తున పెట్టుబడి పెట్టకపోయినా ఆర్థిక వ్యవస్థకు అంత తీవ్రమైన నష్టం కలగదు. కారణం, మార్కెట్ శక్తులే ఆర్థికవ్యవస్థలో ఏర్పడే ఒడుదుడుకులను సరిదిద్ది సంతులనం ఏర్పరుస్తాయి.

# తెలుగువారి సాంస్కృతికాభ్యుదయము

శ్రీమతి వి. సీతాకల్యాణి

స్వతంత్ర పాలనా ప్రతిపత్తిలోని సర్వతోముఖాభ్యుదయమే భారతజాతి స్వాతంత్ర్య సముపార్జనా మహోద్యమమునందలి ప్రధానలక్ష్యము. నాటి మహో నాయకుల మహనీయ తపఃఫలంగా భారతీయవిహాయసంలో స్వాతంత్ర్య సూర్యుడుదయించి నేటికి పాతిక వత్సరాలు నిండుతున్నవి.........

ఈ రెండున్నర దశాబ్దులకాలంలో స్వతంత్రభారతం సాధించిన సర్వతోముఖాభ్యుదయం ఎలాంటిది ?......

ఒకసారి సింహావలోకనంచేసి చూసుకోదగిన శుభావసరమిది!......

అసంఖ్యాకములయిన జీవితరంగాలలో ప్రజల మానసిక, భౌతిక జీవన విధానము నందలి వికాస విజృంభణమే సాంస్కృతికాభ్యుదయం.

ప్రజాజీవితమునందలి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతిక, విద్యా, వైజ్ఞానిక కళాసాహితీ రంగాలలో ప్రవహించిన అనేక చైతన్య స్రవంతుల సంగమ తీర్థమే సాంస్కృతిక స్వరూపం,

మనదేశంలో ప్రజాస్వామ్యం నెలకొన్న యీ పాతికేళ్ళలో వచ్చిన పరిణామాలలో మొదటిది ప్రజాశక్తికి బ్రహ్మరథం పట్టిన రాజకీయచైతన్యం.

ప్రభుత్వానికీ ప్రజలకూ నడుమ ప్రభు భృత్య సంబంధం గతకాలపునీతి కాగా నేడు నెలకొన్నది సమగ్రాధికార సమన్వితమైన ప్రజాశక్తి. ఈ శక్తి ప్రభుత్వాలను నిర్మిస్తుంది, విచ్ఛిన్నం చేస్తుంది. ప్రతిభారతీయుడూ యీ సామూహిక రాజకీయ చైతన్య తాండవంలో తానొక విస్ఫుట విన్యాసమై వెలుగొందుతూన్నాడీనాడు...

ప్రజలందరిదీ ఒక సామూహిక శక్తియై ప్రభుత్వయంత్రాంగాన్ని నిర్మాణాత్మక పథంలో పురోగమింపజేయాలనే గుర్తింపు, ఆ గుర్తింపును సక్రమ పథంలో ఆచరణసాధ్యంచేసి ప్రపంచరాజ్యాలలో భారతదేశాని కొక ప్రత్యేకమైన మనికినీ ఉనికినీ సాధించాలనే తహతహ, యీనాడు దేశపరివ్యాప్తాలై బహు

ముఖంగా ప్రజ్వలించి వున్నవి ప్రతిపౌరుడూ తనకు తెలిసినంతవరకూ ప్రభుత్వపు లోటుపాట్లను బాహాటంగా విమర్శించటానికి వెనుకాడటంలేదు. తోచినంతవరకూ సక్రమమార్గం ప్రబోధించటానికి సందేహపడటంలేదు. ఆంధ్రదేశంలో యింతటి రాజకీయ చైతన్యం ఇతఃపూర్వపు చరిత్రప్రకరణాలలో కననిది! విననిది !!...

జాతిసమైక్యభావం యావద్భారతానికీ స్వతంత్రంతో సంక్రమించింది. ఈ సమైక్యభావపు బోదెలో పెరిగి పల్లవించినదే రాష్ట్రీయభావం భాషాసూత్రపు ప్రాతిపదికపై రాష్ట్ర నిర్మాణం జరగాలన్న ఆందోళనలో ఆంధ్రులదే అగ్రస్థానం. దేశ వ్యాప్తంగా జరిగిన భాషారాష్ట్ర నిర్మాణంలో మొదటిది ఆంధ్రరాష్ట్రం. కొన్ని భాషారాష్ట్ర వర్గాలలోవలె భారతజాతి సమైక్యభావాన్ని విస్మరించి అతిశయించిన రాష్ట్రాభిమానం కాదు ఆంధ్రప్రజలది. ఆంధ్రుల సౌభాగ్య నగరమైన యీ భాగ్యనగరం అనేక జాతుల, మతాల, మనస్తత్వాల వ్యక్తులకు సంచారభూమియైనది. విభిన్నరీతుల, విభిన్నతత్వాల. విభిన్న భావ సంస్కృతులకు సంగమక్షేత్రమై నాన్యతోదర్శనీయమైన ఒకానొక మనోహర సమన్వయ సంస్కృతీ దర్శనాన్ని ప్రబోధిస్తున్నది. ఉత్తర దక్షిణాది విభేదం యీ ప్రాంతంలో అంతగా భాసింపదు. కాబట్టే ఒక ప్రక్కన భారతీయ భావాన్ని పోషించుకుంటూ యేతత్సమన్వయపథంలో ఆవిష్కృతమైన రాష్ట్రీయభావ జాగృతి ఆంధ్రప్రజల సంస్కృతిలో ప్రత్యేకంగా ప్రశంసార్హమౌతున్నది. ఇక ఆంధ్రప్రదేశంలో ఇటీవల విభిన్న ప్రాంతాలలో ఏర్పడిన అపోహలకు ఫలితంగా జరిగిన విడిపోవాలనే ప్రయత్నాలను తిరిగి సమన్వయపరచి, సమయానుకూల ప్రబోధంతో సమన్వయ మార్గంలో మరలించి ఐక్యభావ పరిపుష్టికై పనిచేసిన నాయకుల కృషి అభినందనీయమైనది.

ఆంధ్రప్రదేశం వ్యావసాయికదేశం. ఈ దేశపు ఆర్థిక సంపదలు చాలా భాగం కృషిమీదనే ఆధారపడివున్నాయి. మనదేశాభ్యుదయ ప్రణాళికలలో వ్యవసాయానికివ్వబడిన ప్రాధాన్యం అనితరతుల్యము. ప్రజల ఆస్తులతో నిర్మితాలయిన నాగార్జున సాగరంవంటి ప్రాజెక్టులు దేశంలో లక్షలకొలది యెకరాల భూమిని సస్యశ్యామలంచేస్తున్నాయి. వివిధ ప్రణాళికలు, విదేశీయ నిపుణుల సలహాలు, విశ్వవిద్యాలయాల పరిశోధనలు, రేడియోవంటి అద్భుత ప్రచార సాధనాలు దేశంలోని రైతుల కృషికి అపారమైన దోహదాన్నిస్తున్నాయి. ఆంధ్ర

దేశపు జీవన సౌభాగ్యానికి వెన్నెముక వంటి రైతు జీవితం కళకళలాడటం, అభ్యుదయ పథంలో నిరాఘాటమైన దేశపురోగమనానికి చిహ్నం. ఆంధ్రలో పారిశ్రామిక పురోభివృద్ధి యిటీవల కొంత చురుకుగా సాగడం గమనిస్తున్నాము.

వ్యక్తిత్వ సంస్కారానికి ఒరిపిడిరాయివంటిది విద్య. నవభారతంలో ఆంధ్ర దేశం విద్యారంగంలో సాధించిన ఘనవిజయం సంస్మరణీయము. మనదేశంలో ప్రస్తుతం మూడు విశ్వవిద్యాలయాలున్నాయి. వ్యావసాయిక విశ్వవిద్యాలయ మొకటి ప్రత్యేకంగా వున్నది. కొన్ని విశ్వవిద్యాలయాలు వ్యవస్థాపించే తీవ్ర ప్రయత్నాలు సాగుతున్నాయి. సాంకేతికంగా, వైజ్ఞానికంగా, కళాసాహిత్య పరంగా ఈనాడు విశ్వవిద్యాలయాలు చేస్తున్న పరిశ్రమ చాలాగొప్పది. ఆంధ్రదేశం మొత్తంమీద యీనాడు స్కూలులేని కుగ్రామంకూడా లేదు. హైస్కూళ్ళులేని తాలూకాలు, గ్రామాలు లేవు. కాలేజీలులేని జిల్లా లసలు లేవు. ఇదికాక, వయోజన విద్యాకేంద్రాలు, సాయంకళాశాలలు, స్త్రీ విద్యా సంక్షేమ పథకాలు–ఇత్యాదులన్నీ దేశంలో మూకఉమ్మడిగా సాగుతూన్న విద్యావ్యాప్తికి నిదర్శనాలు. స్త్రీ జనాభ్యుదయ వ్యవస్థ ఆంధ్రమహిళాసభ దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ పెట్టినభిక్ష. ఈ సభ ఆధ్వర్యాన నిర్వహింపబడుతూన్న పాఠశాలలు, కాలేజీలు, అనాథశరణాలయాలు, ప్రసూతిశాలలు, ఆసుపత్రులు, ప్రగతి పథంలో తీర్చిన జ్యోతులై వెలుగుతున్నాయి. విద్యవలన కలిగే వ్యక్తిత్వ వికసనం ప్రజల మానసిక, భౌతిక జీవన సంస్కారాలకు ఉన్నత ప్రమాణాల నందిస్తుంది.

మనిషి జీవితంలో సౌందర్యారాధనం ఒక ప్రముఖ భాగం. ఈ ఆరాధన భావం సంస్కరింపబడి రూపొందింపబడిన బాహ్యరూపము వివిధ లలిత కళా ప్రక్రియలు.

కళలను పోషించటంద్వారా కళాకారుల అంతర భావసంస్కృతిని జాగరితం చేసి సువ్యవస్థీకరించటం ప్రభుత్వపు కర్తవ్యాలలో ఒకటి. ఆంధ్రసాహిత్య, సంగీత, నృత్యనాటక అకాడెమీలనే శక్తివంతములయిన సంస్థలీ పనిని నిర్వహిస్తున్నాయి. సాహిత్య అకాడెమీ ఆధ్వర్యాన ప్రాచీన ప్రబంధాలు ఎన్నో పునర్ముద్రణ భాగ్యాన్ని నోచుకుని స్వల్పధరలకు ప్రజల చేతుల కందుతున్నాయి. ఈ విషయంలో ఎమెస్కో ప్రచురణల కర్తల కృషికూడా శ్లాఘనీయమైనది. క్రొత్త గ్రంథాలు వ్రాయింపబడుతున్నాయి. గ్రంథకర్తలకు ధనసహాయం జరుగుతున్నది. ఉత్తమ సాహితీవేత్తలు సన్మానింపబడు తున్నారు. ఆడిటోరియంలు

నిర్మింపబడుతున్నాయి. సంగీత నాటక పోటీలు జరుపబడుతున్నాయి. ఉత్తమ కళాకారులు బహూకృతు లవుతున్నారు. ఈ కళారంగాలలో ప్రత్యేక కళాశాలలు నిర్విరామకృషి జరుపుతున్నాయి. మొత్తంమీద యీ అకాడెమీల నిర్వాహణంలో దేశవ్యాప్తమైన ఒకానొక ఉన్నతసాహితీసంస్కృతి సంచలనం కలుగుతున్నదనటం అతిశయోక్తి మాత్రంకాదు. ఇతరములయిన కొన్ని సాహితీ, సాంస్కృతిక సంస్థలుకూడా శ్లాఘనీయమైన కృషిచేస్తున్నాయి.

ఈనాటి ప్రజాజీవితంలో సినిమాలు చూడటం, రేడియో వినటం, పత్రికా పఠనం, చాలాముఖ్య పాత్రను వహిస్తున్నాయి. ప్రజలదృష్టిని సుదూర ప్రాంతాలకు ప్రసరింపజేసి, వారి ఆలోచనా పరిధులను సువిశాలంచేసి, వారి దృక్పథాలను బహుముఖంగా వెలిగించి, ఒకానొక విశ్వజనీన భావ చైతన్యం ప్రేరేపించటంలో, యీ సినిమాలు, రేడియోపత్రికలు చేస్తూన్న ప్రచారకృషి అమోఘమైనది. వినోదంతోపాటు బహుముఖ విజ్ఞానం అందించటమే వీనిప్రత్యేకత. నవయుగంలో యీ సాధనాలు పొందుతున్న ప్రజాదరణ అపారమైనది.

మనదేశంలో విద్యారంగంలో యీనాడు స్త్రీపురుష తారతమ్యం దర్శింపబడటంలేదు. స్త్రీలు పురుషులతోపాటు అన్ని జీవితరంగాలలోను, సమ ఉజ్జీలుగా పోటీపడి పాటుపడుతున్నారు. ఈ పాతికేళ్ళలో భారత స్త్రీజీవితంలో మహత్తర పరివర్తనం భాసిస్తున్నది. ఈనాడు సగటున ఒక పురుషుడు చేసేపనికన్నా నాగరిక స్త్రీ ఎక్కువపని చేస్తున్నదని చెప్పవలసివస్తున్నది. చదువులలోనేమి, ఉద్యోగాలలోనేమి, రచనావ్యాసంగములలో నేమి, ప్రజాసేవలోనేమి, ఇతర వ్యవహారాలలోనేమి. ఈనాడు స్త్రీలు పాల్గొనని జీవితరంగాలు చాలా తక్కువ. ఇల్లును చక్కబెట్టుకోవటంతోపాటు, అర్థ సముపార్జన మొదలు అన్ని జీవితరంగాలను తన ప్రతిభా విలసనంతో సుసంపన్నం చేస్తూన్న ఆంధ్ర వనితాలోకపు జాగృతి అనిదం పూర్వదృశ్యమానం!

చదవాలనే అభిలాషతోపాటు చెప్పాలనే ఆసక్తికూడా ప్రజలలో అధికంగా విజృంభిస్తున్నది. దానిఫలితమే పత్రికలు, పుస్తకాల ప్రచురణలోని విపరీతమైన పెరుగుదల. రచయితలు, రచయిత్రులు అసంఖ్యాకులుగా ఈనాడు ఆంధ్ర ప్రజల దైనిక జీవన సంస్కృతిలో చర్చనీయస్థానాన్ని పొందుతూవున్నారు. అతి సామాన్యులలో కూడా తర్కంతో సంబంధంలేని మూఢ దృక్పథాలు వెల్లగింపబడుతున్నాయి. హేతువాదదృష్టి ప్రబలమౌతున్నది.

మొత్తంమీద నవభారత యుగోదయంలోని సాంస్కృతిక పరివర్తనాన్ని పరిశీలిస్తే కొన్నిఅంశాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

నగరాల జీవన వసతులు గ్రామాలకు కూడా అందుతున్నందు వలన క్రమ క్రమంగా గ్రామీణ సంస్కృతికీ, నాగరిక సంస్కృతికీ నడుమ అంతరాలు మాసి పోతున్నాయి. సంప్రదాయాల పట్టింపులు సడలి పోతున్నాయి. అవసరాన్ని బట్టి అనుకూల్యాన్నిబట్టి ఆచరింపబడుతున్నాయి. వ్యక్తి జీవితంమీద సంఘ ప్రభావం రానురాను సన్నగిల్లుతున్నది. అవసరాన్ని అవకాశాన్నిబట్టి జీవన పద్ధతులు మార్చుకోడాని కెవరూ వెనుకాడటంలేదు. ఒకవైపున పాశ్చాత్య దేశాల ఆధిభౌతికదృక్పథాలు (Materialistic Views)మనదేశంలో కాలూను తూంటే మన ఆధ్యాత్మిక భావనాధోరణులపై వారి మోజు హెచ్చుతున్నది.

వ్యక్తి జీవితంలో ఆర్థికసమస్య ప్రధానమై ప్రాపంచికావసరాల భర్తీ కోసం మనిషి పాటుపడుతూండగా నీతిసూత్రాలు కొన్ని పాఠ్యగ్రంథాలకే పరి మితమౌతున్నాయి. మన ప్రజలలో ఆస్తికత కొరవడినదని కాదు. బాబాభక్తులు చిన్మయానందాదుల అనుయాయులు, శంకరాచార్య శిష్యప్రశిష్యులూ మన ప్రజలలో అసంఖ్యాకులుగా వుంటూనే వున్నారు. కొండలమీద దైవతాలు కోట్ల కొలదీ ప్రజలను ఆకర్షిస్తూనే వున్నారు.

వేషభూషాలంకరణ విషయంలో దేశీయతా ముద్ర అంతగా భాసించటం లేదు. ఎవరి అభిరుచినిబట్టి వారు వర్తిస్తున్నారు. నగరాలలో యీ వాతా వరణం మరీ బలంగా కనిపిస్తుంది...

మన సంస్కృతీ పరిణామ చరిత్రలో ఇది ఒక దశ ... వివిధ దేశాలలో జరుగుతూన్న శాస్త్రీయ వైజ్ఞానిక పరిశోధనల మూలంగా ఆయా సంస్కృతులు కూడా మారుతూన్నవి. ఈ సంస్కృతీ పరిణామం ఏకైక విశ్వసంస్కృతీ సమీ కరణ పథంలో ఎంతవరకు పురోగమించగలదో భావి తరాలవారు నిర్ణ యించాలి.

# గ్రామీణసంస్కృతి-
# మారుతున్న ధోరణులు

శ్రీ జె. వి. రాఘవేంద్రరావు

ఆంధ్రప్రదేశ్‌లో ఒకటే మహానగరం ఉంది. అది హైదరాబాదు. విజయవాడ, విశాఖ పట్టణం, వరంగల్లు, గుంటూరు, రాజమండ్రి మొదలగు అనేక పెద్ద నగరాలు కూడ ఉన్నవి. కాని ఈ నగరాలలో ఉండే జనాభా మొత్తం జనాభాలో 17.4% మాత్రమే. అంటే నాగరీకరణ ప్రక్రియ ఎక్కువ వేగాన్ని పుంజుకోలేదన్నమాట. 82.6% జనాభా ఆంధ్రదేశంలోని 21 జిల్లాలలోని 28,997 గ్రామాలలో నివసిస్తున్నారు. మొత్తం గ్రామీణ జనాభాలో 38.5% మంది పెద్ద గ్రామాలలో (2,000 - 4,999 జనాభా) నివసిస్తున్నారు; 28.9% మధ్యరకం (1,000 - 1,999) గ్రామాలలో, మిగిలినవారు చిన్న గ్రామాలలో నివసిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణ జనసాంద్రత చాలా పెద్దది. గ్రామం ఒక్కంటికి సగటున 1,097 మంది ప్రజలు నివసిస్తున్నారు. వేరే రాష్ట్రాలతో పోల్చి చూస్తే (కేరళ, మద్రాసు మినహాయించి) ఈ రాష్ట్రంలో గ్రామీణ జనసాంద్రత ప్రగాఢమైంది. మొత్తం జనాభాలో పనిచేసే వారి సంఖ్య తీసుకుంటే 70% మంది వ్యవసాయదారులుగా కాని వ్యవసాయ కూలీలుగా కాని పనిచేస్తున్నారు. వీరు సుమారు 26.65 మిలియన్ల ఎకరాల భూమిని సాగుచేస్తూ జీవిస్తున్నారు. పైన పేర్కొన్న వివరాలను బట్టి ఆంధ్రదేశం అనేక గ్రామ సముదాయాల సమూహంగానూ, ఆంధ్ర సంస్కృతి గ్రామీణ సంస్కృతిగానూ భాసిస్తున్నది.

ఆధునికీకరణ (Modernisation) నిర్వచనాలు భిన్న భిన్నంగా ఉన్నవి. సిరిల్ బ్లాక్, మెక్లీలండ్, రాబర్ట్ వుడ్ మొదలగువారు తమ అభిరుచికనుగుణంగా కొన్ని అంశాలకే ప్రాధాన్యతనిస్తూ ఆధునికీకరణాన్ని నిర్వచించారు. విల్బర్ ఇ. మూర్ దృష్టిలో ఆధునికీకరణ అంటే ఆధునిక శాస్త్రీయ, సాంకేతిక

విజ్ఞానాన్ని ఉపయోగించి ప్రజల జీవిత ప్రమాణాలను అభివృద్ధిపరచడమే. ఆధునికీ కరణాన్ని ప్రక్రియగా భావిస్తే సాంప్రదాయిక సంస్కృతిని వీడి ఆధునిక సంస్కృతిని అనుసరించడానికి అనుగుణంగా మానవ, రాజకీయ, ఆర్థిక, సాంకేతిక రంగాలలో రూపొందించుకునే నవతలే ఆధునికీకరణమని నా అభిప్రాయము. ఆధునికీకరణ ప్రక్రియ ఆంధ్రప్రదేశ్ గ్రామీణ సంస్కృతిని ఏ విధంగా ప్రభావితం చేసిందో, అందు మూలంగా ఎటువంటి మార్పులు అవతరించాయో ఆ మార్పుల ప్రవృత్తులను విశ్లేషించడమే ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశ్యము

ఇతర రాష్ట్రాలలోవలె స్వాతంత్ర్యానంతరం ఆంధ్రప్రదేశ్‌లోకూడ తగు వేగంతో గ్రామీణ సంస్కృతి అనేక మార్పులకు గురి అయింది. దీని ఫలితంగా వ్యవసాయ ఉత్పత్తిలో, పంట విక్రయంలో గ్రామీణ సంబంధాలలో రహదారుల రవాణా, సాంఘిక వసతుల నిర్మాణంలో, గ్రామీణ జనాళి ఆలోచన, అభివృద్ధులలో, విలువల ప్రమాణాలలో, నడవడి నమూనాలలో విశేషమైన పరివర్తనలు రూపొందినవి. గత రెండు దశాబ్దాలలో ఆంధ్రదేశంలోని వ్యవసాయ విధానంలోనూ, పద్ధతులలోనూ బృహత్తరమైన మార్పులు వచ్చినవి. వేరే ప్రభుత్వ కార్యక్రమాలు కొంతవరకు దోహదం చేసినా, ఈ మార్పులు ముఖ్యంగా సమాజ అభివృద్ధి పథకాల ద్వారా, పంచాయతీరాజ్య విధానంద్వారా అవతరించినవని చెప్పవచ్చు. సమాజాభివృద్ధి పథకం సాధించిన విజయాలలో ముఖ్యమైనది వ్యవసాయ విప్లవం. ఈనాడు ఆంధ్రదేశంలో పూర్వకంటె అధికంగా ట్రాక్టర్లను, ఇనుపనాగళ్ళను, ఇతర యాంత్రిక పరికరాలను వాడుతున్నారు. కృష్ణ, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాలలోనూ, తెలంగాణలోని కరీంనగర్, వరంగల్, నిజామాబాదు మొదలగు జిల్లాలలోనూ, గ్రామీణులు ట్రాక్టర్లను విరివిగా వాడుతున్నారు. దున్నడం, నేల చదునుచేయడం, విత్తడం, నూర్పడమే కాకుండా ట్రాక్టర్లను మార్కెట్లో సరుకులు చేరవేయడానికి ధాన్య విక్రయానికి వాడుతున్నారు. కేంద్ర స్థాయిలోను, రాష్ట్రస్థాయిలోను వ్యవసాయ పరిశోధనా కేంద్రాల వినూత్న ప్రయోగాల ఫలితంగా అనేక మేలురకం విత్తనాలు వ్యవసాయదారులకు లభించినవి. HR 35, SLO 16, ఈనాడు పాతబడిన మేలురకం విత్తనాలుగా చెప్పుకుంటున్నారు, తైచుంగ్, తైనాన్ విత్తనాలనుకూడ రైతులు వాడి అధిక దిగుబడి సాధించినారు. కోస్తా జిల్లాలలో

IR 8, జయ, పద్మ, విత్తనాలు వాడి ఎకరాకు 54-60 క్వింటాల్‌ల ధాన్యం పండించిన ఉదాహరణలెన్నో ఉన్నాయి

ధాన్యంపంటలే కాకుండా వాణిజ్యపు పంటలుకూడా పూర్వకంటె అధిక ప్రచారంలోకి వచ్చాయి. మిరప, చెఱకు, పొగాకు, ప్రత్తి, పసుపు మొదలగు వాణిజ్యపు పంటలుకూడ ఎక్కువ క్షేత్రాలలో పండిస్తున్నారు. వరిపంటలకే కాకుండా, పొగాకు, పసుపు, మిరప పంటలకు డెల్టాజిల్లాలలోని సారవంతమైన భూములు, లంకలు చాలా ప్రసిద్ధికెక్కినవి తెలంగాణ, రాయలసీమ జిల్లాలలో కూడ ఈ పంటలపట్ల రైతులు ఎక్కువ శ్రద్ధ, ఆసక్తి చూపుతున్నారు దీనికి కారణం రైతులకు అధిక ఆదాయం లభించడమే

వ్యవసాయంలోని ఆధునికీకరణం వల్ల ఉత్పత్తి స్థాయి పెరగడమే కాకుండా రైతుల జీవన ప్రమాణస్థాయి కూడ పెరిగింది. కోస్తా జిల్లాలలో 5 ఎకరాలకు పైబడిన రైతులు మధ్యకారు రైతులుగా, అంతకు తక్కువగా ఉన్న రైతులు సన్నకారు రైతులుగా, 20 ఎకరాలకు పైబడి ఉన్న రైతులు మోతుబరి రైతులుగా చలామణి అవుతున్నారు. ఆదాయం పెరగడంవల్ల ఆధునిక జీవనానికి సంబంధించిన హంగులను, వస్తువులను రైతులు తమ నిత్యజీవితంలో అమర్చుకుంటున్నారు రేడియోలు, ట్రాన్సిస్టర్లు, స్టేన్‌లెస్ స్టీల్ పాత్రలు, వేడినీళ్ళ బాయిలర్లు, ఫ్యాన్లు మొదలగు ఆధునిక జీవితావసర వస్తువుల్ని విరివిగా వాడుతున్నారు. నిశితంగా పరిశీలిస్తే తెలుగు రైతుల ముఖ్యం సన్నకారు మధ్యకారు రైతుల జీవనశైలిలో విశిష్టమైన, వాంఛనీయమైన పరివర్తన కనిపిస్తున్నది.

ఆధునిక వ్యవసాయ విప్లవం ఫలితంగా గ్రామీణ సమాజంలో మౌలికమైన మార్పులు ప్రసరించలేదని పరివర్తనా ప్రక్రియ ప్రవృత్తుల విశ్లేషణద్వారా చెప్పే అవకాశమున్నది. భూ, సామాజిక సంబంధాల దృష్ట్యా మనకు రెండు ప్రక్రియలు స్పష్టంగా కన్పిస్తవి :

1. బూర్జువా కరణము (Embourgeoisiement) 2. శ్రామికీకరణము (Proletarianisation) ఆధునిక వ్యవసాయ పద్ధతుల మూలంగా లాభపడినవారు ఆస్తిపాస్తులు, అంతస్తులున్న భూస్వాములే. భూమి మీద వచ్చిన ఆదాయం ఫలితంగా వీరి చరాస్తులు పెరగడమేకాకుండా, భూ ఆస్తి కూడ అధికంగా పెరిగింది. సన్నకారు రైతులు ఆధునికీకరణ పద్ధతులను అవలంబించ

డానికి కావలసిన ఆర్థిక వనరులు లోపించడంవల్ల భూస్వాముల నుండి అప్పులు తీసుకోవడం ఆ అప్పుల్ని తీర్చలేక భూమిని విక్రయించడం కూడా జరిగింది. డబ్బున్న భూస్వాములు సన్నకారు రైతుల భూమిని స్వంతం చేసుకుని, వాటి సేద్యం ద్వారా తమ ఆస్తిపాస్తులను ఆదాయాన్ని పెంచుకున్నారు. సన్నకారు రైతులు పొలాల నమ్ముకుని భూస్వాములవద్ద కూలీలుగా చేరి పొట్ట పోసుకోవడం తరచుగా కన్పిస్తుంది. ఆంధ్రప్రదేశ్ లోకాని, దేశం మొత్తం మీదకాని లభించే లెక్కల ప్రకారము ఒక విషయం స్పష్టంగా గోచరిస్తున్నది. ఆధునికీకరణం ద్వారా ఒక వైపు వ్యవసాయ దిగుబడి అభివృద్ధి చెందితే ఇంకో వైపు వ్యవసాయ కూలీల సంఖ్య కూడా పెరుగుతూనే ఉంది దీనినిబట్టి వ్యవసాయ ఉత్పత్తి విధానంలో వచ్చిన మార్పులు సామాజిక నిర్మితి, ప్రకార్యాలలో ప్రతిబింబించలేదనే చెప్పవలె

స్వాతంత్ర్యానంతరము జమీందారీ విధానాన్ని, జాగిర్దారీ విధానాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చట్టాలద్వారా నిర్మూలించినవి అటుతర్వాత నామ మాత్రంగా భూసంస్కరణలను కూడ అమలుపరచినారు. సార్వజనీన వయోజన ఓటింగు వాక్కుపద్ధతిని ప్రవేశపెట్టడంతో ప్రభుత్వాన్ని ఎంపికచేసే అధికారము ప్రతిపౌరునికీ లభించింది. ఈ ప్రక్రియల ఫలితంగా పెద్ద భూకామందుల ఆధిపత్యం కొంతవరకు తగ్గి మధ్యరకం భూస్వాముల ఆధిపత్యం పెచ్చింది. కాని పరిపాలనా వ్యవస్థ మాత్రం కేంద్రీకృతంగానూ, యాంత్రికంగానూ ఉండిపోయింది. కేంద్రీకృత పరిపాలన దేశ అభివృదికి అవరోధమని, ప్రజాస్వామ్య విజయానికి ఆటంకమని బల్వంత్‌రాయ్ మెహతా కమిటీ అభిప్రాయ పడింది దీనిఫలితంగా దేశంలో విశాలప్రాతిపదకపై పంచాయతీరాజ్య వ్యవస్థ నిర్మాణం జరిగింది. 1959 నవంబర్ ఒకటవ తేదీనాడు ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీరాజ్య వ్యవస్థను ప్రవేశపెట్టినారు. ఈ సంస్కరణద్వారా సహభాగిత ప్రజాస్వామ్యాన్ని పెంపొందించవలెనని ప్రభుత్వ ఉద్దేశ్యము.

ఆధునికీకరణ ప్రక్రియవల్ల, సమాజ అభివృద్ధి పథకాల, పంచాయతీ రాజ్య కార్యాకలాపాలవల్ల కొన్ని ఉపాంతమైన మార్పులు వచ్చినవి, వీటిని ఇక వివరిస్తాం. రోడ్ల నిర్మాణంవల్ల రవాణా సౌకర్యాలు పెరగడంవల్ల, పరిశుభ్రమైన కుళాయినీళ్లు అనేకగ్రామాలకు సరఫరాచేయడంవల్ల, విద్యుదీకరణాన్ని (Electrification) విశాల స్థాయిలో అమలుపరచడంవల్ల, గ్రామీణ

ప్రజలలోనూ, వారి జీవితాలశైలిలోనూ గణనీయమైన మార్పులు వచ్చినవి. వ్యవసాయరంగంలో వ్యాపారధోరణి (Commercialisation) ఈనాడు ఎక్కువగా కన్పిస్తున్నది. రైతులు తమ కుటుంబ అవసరాలకే కాకుండా, జాతీయ మార్కెటుకు కావలసిన దినుసులను, తినుబండారాలను ఉత్పత్తిచేస్తున్నారు. నగరాలలో రాకపోకలు పెరగడంవల్ల ఆధునిక వ్యవసాయ విజ్ఞానానికి సంబంధిన విషయాల్ని వీరు తెలుసుకుంటున్నారు. విద్యుచ్ఛక్తిని వ్యవసాయ ప్రయోజనాలకే కాకుండా గృహ జీవితంలో ఆనందానికి, సౌఖ్యానికి అనుకూలంగా ఉపయోగిస్తున్నారు.

1961 జనాభా లెక్కల ప్రకారం 21.5% జనాభా ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యులుగా ఉన్నారు. కాని గ్రామీణజనాభాలో 71.3% రైతులు 87.6% వ్యవసాయకూలీలు నిరక్షరాస్యులుగా ఉన్నారు. అయితే గ్రామాలలో పూర్వం కంటే ఇప్పుడు విద్యావంతులు అధికంగా ఉన్నారని చెప్పవచ్చు. ప్రభుత్వ, స్వచ్ఛంద సంస్థల చొరవవల్ల అనేక గ్రామాలలో పాఠశాలలు,అనేక తాలూకాలలో కళాశాలలు వెలసినవి. దీనిఫలితంగా గ్రామాలలో పిల్లలను చదివించాలనే ఆకాంక్ష, దీక్ష పెరిగినవి. ఈనాడు ఆంధ్ర దేశంలోని కోస్తా జిల్లాలలోని దాదాపు అన్ని గ్రామాలలో, ఉన్నతవిద్య నభ్యసించిన డాక్టర్లు, శాస్త్ర వేత్తలు మొదలగు పట్టభద్రులు చాలామంది కనిపిస్తారు.

విద్యతోపాటు రవాణా సౌకర్యాలు కూడా గ్రామీణుల నగర ప్రవాసానికి ప్రవాసులు వ్యవసాయేతర వృత్తులలో స్థిరపడటానికి సహాయపడినవి. అయితే ఆంధ్రదేశంలో నాగరిక ప్రవాస ప్రమాణము (Rate of urban Migration) చాలాతక్కువ. అందుకే ఈ నాటికే ఎక్కువ మంది పెద్ద గ్రామాలలో కాని, మధ్యరకం గ్రామాలలో కాని నివసిస్తున్నారు.

ఆధునికీకరణ ప్రక్రియ ఫలితంగా గ్రామములోని ఆరోగ్యవైద్యస్థితి చాలా మెరుగు పడినది. ఈ నాడు 1961 జనాభా లెక్కల ప్రకారం 1,027 వైద్యసంస్థలు, 208 ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు నెలకొల్పబడి విజయవంతముగా పనిచేస్తున్నవి. ఈ ప్రదేశ్శలో ఈ వసతులు ఇంకా పెరిగి ఉంటవి. ఈ శతాబ్దపు యాభైలలో మలేరియా, మశూచికము, కలరా మొదలగు వ్యాధులు ఆంధ్ర ప్రాంత గ్రామాలలో తీవ్రంగా వ్యాపించి ఉండేవి. అనేకమంది వ్యాధిగ్రస్తులై మరణిస్తుండేవారు. 1961 జనాభా లెక్కల ప్రకారం 1959 లో మలేరియావల్ల

1,000 మందికి 0.15 రోగులు మరణిస్తే, 1960 లో వీరి సంఖ్య 0.14 కు తగ్గింది. 1959 లో మశూచికమువల్ల 1,000 మందికి 0.068 రోగులు మరణిస్తే 1960లో వీరి సంఖ్య 0.051 కు తగ్గుతుంది. అలాగే 1959 లో కలరావల్ల 1,000 మందికి 0.023 రోగులు మరణిస్తే 1960 లో వీరి సంఖ్య 0.006 కు తగ్గింది. ఈ అంకెలను బట్టి ఈ వ్యాధులు దాదాపు అంతరిస్తున్నాయని చెప్పవచ్చు. అందుకే గ్రామీణ జనాభాలోని మరణానుపాతము తగ్గి జనన అనుపాతము చాలావరకు హెచ్చింది.

ఆంధ్రప్రదేశ్‌లోని అనేక గ్రామాలలో ప్రభుత్వం కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను విస్తారంగా ప్రవేశపెట్టింది. కుటుంబ నియంత్రణకు సంబంధించిన విజ్ఞానము, ఆచరణ చాలా పెద్ద స్థాయిలో మనకు కన్పిస్తున్నది. స్త్రీలు, పురుషులు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లను చాలా ఉత్సాహముతో అమలు పరుస్తున్నారు. ఇతర సంతాన నిరోధ పద్ధతులను కూడ విరివిగా వాడుతున్నారు. కొన్ని గ్రామాలలో కుటుంబ సంక్షేమానికి అనుకూలంగా గర్భస్రావాన్ని కూడ వాడవచ్చునని ప్రజలు అభిప్రాయపడినారు.

వైద్యానికి సంబంధించిన అభివృత్తులలో కూడ చాలా మార్పులు వచ్చినవి. పూర్వం వ్యాధులు వ్యాపించినప్పుడు ప్రజలు గ్రామదేవతలను, ఇష్టదేవతలను కొలిచి, పశువులను బలిచేసి, మంత్రతంత్రాది ఉపాయాలద్వారా రోగ నివారణకై పాటుపడుతుండేవారు. కాని ఈనాడు రసాయనిక ఔషధాలకు, ఆధునిక వైద్య వసతులను వాడి వ్యాధులను నిరోధించడానికి ప్రయత్నిస్తున్నారు. దయ్యాలలో,భూతాలలో క్రమేపీ గ్రామీణప్రజలలో నమ్మకము సన్నగిల్లుతున్నది. భయం, కల్పనకు బదులు హేతుకత, శాస్త్రీయదృష్టి కొంతవరకు పెరుగుతున్నవని చెప్పవచ్చు.

ఆధునికీకరణ ప్రక్రియ వల్ల గ్రామీణ ఉమ్మడి కుటుంబ వ్యవస్థ క్రమేపీ విభజింపబడుతున్నది. పెద్ద కుటుంబాలకు బదులు భార్యాభర్తలు పిల్లలతో కూడిన చిన్న కుటుంబ ప్రమాణాలు ప్రజలలో ప్రాచుర్యాన్ని ఆదరణను పొందుతున్నవి. కుటుంబ వ్యవస్థలో కొంత వరకు వచ్చినా కుటుంబ ఆచారాలలో, వ్యవహారాలలో పెద్ద మార్పులేమీ రాలేదనే భావించవలె. సకుల వివాహాలు కులపంక్తి భోజనాలు ఈనాటికీ గ్రామీణ ప్రజల సంప్రదాయ విశ్వాసానికి, నిష్ఠకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. బాల్య వివాహ పద్ధతులు చాలావరకు

తగ్గినా, వరకట్న సంప్రదాయం మాత్రం దినదినము బలాన్ని పుంజుకొంటున్నదే కాని తగ్గడం లేదు. చదువు ఉద్యోగస్థాయి పెరిగిన కొద్దీ వరుడి మార్కెటు ధర కూడ అంక నిష్పత్తిలో పెరుగుతున్నది. వివాహాలలో పాటించే ఆచారాలు వ్యయ ప్రమాణాలు కూడ మార్పుకు గురి కాలేదు అయితే ఇవి కులాల యొక్క అంతస్తును, ఆచారాన్ని బట్టి నియంత్రితమై ఉంటవి

గ్రామీణ జీవితంలో ఒకవైపు ఆధునిక సాంకేతిక పద్ధతుల పట్ల ప్రజలు ఆసక్తి చూపుతున్నారు. ఇంకోవైపు మతపరమైన విశ్వాసాలను, దైవభక్తిని పెంచుకుంటున్నారు. ఒకవైపు ఆధునిక వైద్య సదుపాయాలను వాడుతూ, ఇంకోవైపు బాధ ఉపశమనానికి తిరుపతివెంకటేశ్వర్ల కటాక్షాన్ని కోరుతూ మొక్కులు చెల్లించుకుంటున్నారు బాబా ఆరాధన- (Babaism) సత్యసాయి బాబా-బషీర్ బాబా శిష్య పరంపర- ముమ్మరంగా పెరుగుతున్నది. అసలు మన సమాజంలో కర్మవాదానికీ, ఆత్మవిశ్వాసానికీ, శాస్త్రీయ హేతుత్వానికీ, దైవ భక్తికీ మధ్య ఉండే వైరుధ్యాన్ని ప్రజలు ఆమోదించరు. ఇది కేవలం ఆంధ్ర గ్రామీణ సంస్కృతి ప్రత్యేకత కాదు; భారతీయులందరికీ వర్తిస్తుంది.

గ్రామీణ సంస్కృతిలో ఉపాంతమైన మార్పులే కాకుండా మౌలికమైన మార్పులు రావడం చాలా అవసరం. లేకపోతే సామాజిక సంబంధాలలో వ్యత్యాసాలు, అసమానతలు పెరిగి, దారిద్ర్యం ఆకలి, నిరుద్యోగ సమస్యలు అతిశయించి, సమాజాన్ని సంక్షోభంవైపు నడిపస్తవి ఈ దృగ్విషయాన్ని కొంతవరకు శ్రీకాకుళం సాయుధఉద్యమంలో చూసినాము.

ఇందిరాగాంధీ నాయకత్వాన్ని అనుసరిస్తున్న నరసింహారావు కాంగ్రెసు ప్రభుత్వము క్రొత్తనీటి, విద్యుచ్ఛక్తి పథకాలను, బలహీన వర్గాల వారికి గృహ నిర్మాణ, ఉద్యోగ పథకాలను, గ్రామీణ సంస్కృతిని మార్చే భూసంస్కరణలను అమితవేగంతో అమలు పరచడానికి ప్రయత్నిస్తున్నారు. వీటియొక్క ప్రభావం ఆంధ్రగ్రామీణ సంస్కృతి సంఘటనకు తోడ్పడుతుందా, విఘటనకు తోడ్పడుతుందా అనే ప్రశ్నకు జవాబు భవిష్యత్తే చెప్పగలదు.

# తెనుగునాట కనిపించే తెనుగుదనము

శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రులు పేర్కొనబడినారంటే, నామటుకు నేను హర్షింపలేకున్నాను ; ఎందుకంటే- మనజాతిని పుళిందాది ఆరణ్యకజాతుల క్రింద చేర్చిపెట్టినారు. ఇక మహాపండితుడు- కాంచీపురవాసి- అప్పయ్య దీక్షితులు అన్నమాటకే ఒళ్లు పులకరించి, మనసు పరవశిస్తుంది. ఓం నమశ్శివాయ మంత్రంతో అక్షరాభ్యాసం చేయించే తెనుగు జాతిలో తాను పుట్టలేకపోయి నందులకు ఆ ద్రావిడ పుత్రుడు వాపోయినాడు. కాని, యీ గుంట ఓనమాలను మరచి కిండర్ గార్టన్ విధానానికి దిగిన ఆంధ్రత్వాన్ని ప్రగతి అనాలనో పెడమొగ మనాలనో తెలియకున్నది. మంచి చెడ్డలు పడుగు పేకలవంటివిగదా! మన పెద్దలు మనకు సంక్రమింపజేసిన లగ్గుకుపొంగి ఎగ్గుకు క్రుంగకుండా భావికర్తవ్యలగ్నమానసులమై దీక్ష బూనుదాము.

**తెనుగుదనం :—** ఇప్పటి తెనుగుదనం- అనే శీర్షిక సాపేక్షికము. కాబట్టి వెనుకటి తెనుగుదనం ఎట్లా విప్పారినదో తెలిసికొంటేనేగాని, నేటి రేపటి తెనుగుదనాన్ని ఆకళించుకొని ఊహించుకోలేము.

మనం ఆంధ్రులమో తెనుగువారమో అనే వివాదం అటుండనిచ్చి, ఆ జమిలి పేరున వ్యవహరింపబడే మన పాతచరిత్ర గర్వకారణం! భావి కార్యోపదేష్ట! అనక తప్పదు. ప్రాచీన సంస్కృతినందు పునః ప్రతిష్ఠ చేయాలనేవాదం, దేశకాలానుకూలంగా ఇమిడేదిగాదు. అయినా, దానిని పూర్తిగా విస్మరించిన జాతి ఎముకల గూటిని పట్టుకొని ప్రాకులాడినట్లుండును. గతాన్ని స్మరించి, వర్తమానాన్ని అనుసరించి, భవిష్యత్తును ఊహించి పురోగమించే జాతే ఆధునిక ప్రపంచమున మని మన్నింపబడ గలదు.

**ప్రాక్తన ఔన్నత్యం:—**ఓరుగల్లు పతనానంతరం హిందూధర్మ పునరుత్థా

నానికి మూలపురుషుడు- విద్యారణ్య స్వాములవారు మరల మన కీర్తిధ్వజ మెత్తినారు. వేదభాష్యం తమ్ముడు-సాయణునిచే వ్రాయించినాడు. మల్లినాథుడు ఉత్తరాదికావ్యాలన్నిటికి వ్యాఖ్యానాలు వ్రాసినాడు. జగన్నాథ పండితరాయలు ఢిల్లీ ఎఱ్ఱకోటలో తెనుగు తులిపితనాన్ని యవన సుందరి అంక పీఠాన నెలకొల్పి ఆంధ్రపాండితిని మెరపించినాడు. నింబాల్కర్ వల్లభాచార్యులు ఆంధ్ర ఆధ్యాత్మిక పీయూషమును పరరాష్ట్ర భక్తులకు పంచిపెట్టినారు. అంతకుముందేగదా బౌద్ధ వేదాంత విజ్ఞానము, శిల్పకళలు తెనుగునాటిని ఉజ్జీవింపజేసి యుండినది. విజయపురిలో నాగార్జునుడు ఆంధ్రుల కీర్తికి అస్తమించని దినమణి అయినాడు.

**తమిళాంధ్ర పరస్పర ప్రభావము**:— చుట్టుప్రక్కలవారితో నూరి కలిపి నట్లుకలసిపొయ్యే అపూర్వగుణము తెనుగువారిసొత్తు. మహామహుడు-రాజేంద్ర చోళచక్రవర్తి రాజనరేంద్రునికి పిల్లనిచ్చిన మామ అయినాడు. నరేంద్రుని కొడుకు-రాజేంద్రుడు, మేనమామ-దేవేంద్రచోళునికి అల్లుడై, ఉభయ కులోత్తుంగ చోళుడై, తెనుగు అరవజాతులను ఒకటిగా కలిపివేసి, జాతీయ సమైక్యత అనే నేటి నినాదానికి బీజావాపం చేసినాడు. తంజావూరులోను మధురలోను నాయక రాజులు, తమిళనాటి నడిబొడ్డులో తెనుగుసీమను నెలకొల్పి, ఆంధ్రకీర్తి లక్ష్మికి కల్యాణమండపాలు నిర్మించినారు. త్యాగరాజు తన మధుర వాణితో అరవ జాతిని పాటకులుగా, గేయకారులుగా దిద్దినాడు.

ఈ సంప్రదాయం ఇంతటితో నిలిచిపోలేదు. ఈ శతాబ్దంలో దక్షిణాపథంలో పెనవేసి తీగసాగి పూచిన ఉద్యమాలకు ఆంధ్రులేనాయకులైనారు.

ఆర్. ఎస్. ఎస్. సంస్థాపకులు, నాగపూరు డాక్టర్ హెడ్గవర్ ఆంధ్రుడు. తమిళనాడులో విపరీత కులాభిమానమును భాషా వేశమును రేకెత్తించి, ప్రజలకు "స్వయం మర్యాదమ" గరపిన ఇ. వి. రామస్వామి నాయకర్ తెనుగు బలిజబిడ్డ. ఆయన శిష్యుడు- మహావక్త అన్నాదురై డి. ఎం. కె. నిర్మించినాడు; ఈయన తెనుగు బంగారమ్మ గారాబుపట్టి. మహారాష్ట్ర ముఖ్యమంత్రి అయిన కన్నెంవారు ఆంధ్రుడు. బ్రహ్మసమాజ స్థాపకుడు- కందుకూరు వీరేశలింగం వంగదేశంలో కేశవచంద్రసేనుడంతటి వాడని లెక్క బడినాడు. మాంట్ ఫర్డ్ సంస్కరణాల అనుగుణంగా ఏర్పడిన ప్రథమ దేశీయ ద్వంద్వ ప్రభుత్వమున మంత్రి అయినది కదలూరు సుబ్బరాయలురెడ్డి. జస్టిస్ పక్షమును స్థాపించి, నాయకుడైనది- ఆంధ్ర దేవాంగ కులదీపకుడు పిట్టి త్యాగ

రాయశెట్టి. అద్భుత మేధాసంపన్నుడు కోయంబత్తూరు జి. డి. నాయుడు, ఆంధ్రదేశమునుండి వలసబోయినవాడు.

కాంగ్రెసు జెండా పెళపెళలాడకముందు, మదరాసు రాష్ట్రంలో రాజ్యతంత్రము నడిపినది ఆంధ్రనాయకులు: పానగల్లురాజ, బొబ్బిలిరాజ, పాత్రో, వెంకటరెడ్డి నాయుడు. మునుస్వామినాయుడు. కాంగ్రెస్ రాజ్యంలో ముఖ్యమంత్రులైన ఓమందూరు పెద్దరామస్వామిరెడ్డి, కుమారస్వామిరాజ తమిళ తల్లి స్తన్యం ద్రావి, కన్నతల్లిని పెంపుడు తల్లిని మరువని తెనుగుతల్లి అనుగుబిడ్డలు. రాష్ట్రపతులు రాధాకృష్ణన్, గిరి; తెనుగు వాసనలు గలిగిన జాకిర్ హుస్సేనులు రాచరికాల నెరపినా అధికారం మాత్రం అరవలచేతులలోనే ఇరుక్కొనిపోయి ఉండినది.

**వార్తా పత్రికారంగము :—** చిర్రావూరు యజ్ఞేశ్వరదత్త చింతామణి అలహాబాదులో, కోటంరాజు పున్నయ్య కరాచిలో, భోగరాజు పట్టాభి సీతారామయ్య బందరులో, భైరవరవు హనుమంతరావు బొంబాయిలో, ఖాసా సుబ్బరావు మదరాసులో, లంకా సుందరం ఢిల్లీలో, రామరావు లక్నోలో, ఇప్పుడు ఢిల్లీలో గునుపాటి కేశవరామరెడ్డి (జి. కె. రెడ్డి) జర్నలిజానికే ప్రతిష్ఠను గూర్చి మనపేరు నిల్పినారు. ఆంధ్రకేసరి "స్వరాజ్యను" స్థాపించినాడు.

1920 లో అమానుషమైన రౌలట్ చట్టాన్ని ప్రతిఘటిస్తూ, బయ్యా నరసింహేశ్వరశర్మ సర్ బిరుదమును, కేంద్రమంత్రి పదవిని విసర్జించి గర్జిస్తూ బయటకు నడచినాడు.

**ఆంధ్రుల దేశభక్తి :—**జాతీయత, దేశభక్తి పరాయణత, ఆంధ్రులకు ప్రాణవాయువులు. బెంగాలీల ఉత్సాహశక్తికి తీసిపోమని జాతీయోద్యమం ప్రారంభించినారు. జాతీయత పుణ్యఆంధ్ర రోదసిని దట్టంగా అలముకొనినది. కోపల్లి హనుమంతరావు బందరులో ఆంధ్రజాతీయ కళాశాలను స్థాపించి, ఠాకూరు శాంతినికేతనానికి ఒక ప్రతిరూపాన్ని నిర్మించినాడు. మహారాష్ట్రుల క్రియాశక్తిని అలవరచుకొని, జాతీయ పునర్నిర్మాణమునకు పూనుకొన్నది- ఆంధ్రజాతి, భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్రవాదానికి ఏరువాక సాగించినాడు-తెనుగుబిడ్డ లోకమాన్య తిలకు హిందూధర్మబుద్ధికి ముగ్ధులై, ఆయన గావించిన స్వరాజ్య శంఖారావానికి చకితులై, పులకితగాత్రులై, పావనగోదావరీ కృష్ణ పినాకినీ నదీజలాలను జాతీయ నినాదాలతో తరంగితము చేసినారు.

గాంధీ మహాత్ముని త్యాగోద్యమ భానుడు, దివ్యదీధితులతో పరిత్యాగ లాంఛన మైన గైరికవర్ణంలో ఉదయించినాడు. తెనుగునాట నాలుగు చెరగులు దేశా రాధన తత్పరములై, ప్రజలు కార్యదీక్షా కంకణమును ధరించి, స్వాతంత్ర్య సమరంలో ముందుకునడచినారు. అఖిలభారత స్థాయినందు కొనిన ఎందరో ప్రజానాయకులను పెంచి పెద్దజేసినది- ఆంధ్రమాత.

ఆంధ్రప్రజావళి ఉత్సాహం పున్నమనాటి వారాసివలె ఉప్పొంగినది. వేలు వేలుగా జయిళ్ళను నింపినారు. ఆత్మ రక్తదానంతో మాతృదేవి పూజా వితర్దిని అలికి, కీర్తిముత్యాలతో ముగ్గులు బెట్టినారు.

జాతీయ వాఙ్మయం, పద్యాలతో గేయాలతో నిండుదనంతో, చవి సారంతో ఆంధ్రభారతికి నూతనాలంకారములను సంతన పరచినది. గీతావళి ప్రజను ఉత్తేజ పరచినది. కవులు, గాయకులు, నటకులు, ఆ ఉత్సాహ మధుమా సంలో శుకపికకూజితాలను ఆలపించినారు. ఇట్లా ఆంధ్రుల యశస్సు పిండార బోసినట్లు ఆంధ్రదేశమును వెలిగించి, పక్కరాష్ట్రాలకు డాలుకొట్టినది.

ఇదీ, స్వాతంత్ర్యానికిముందు, ఆంధ్రజాతి కీర్తిమండిత చరిత్ర !

**స్వాతంత్ర్యానంతరం:**—ఇక స్వరాజ్యం వచ్చినతర్వాత, స్వదేశపాలనలో వెలసిన తెనుగుదనాన్ని అరసి, భావికర్తవ్యాన్ని ఊహించుకొందాం.

బలుపో వాపో ఆంధ్రజాతి అన్ని రంగాలలో అభివృద్ధిచెందినట్లే కనబడు చున్నది. నవ్యవికాసాన్ని జూపింది. దేశీయ విదేశీయ వాసనలను అభిరుచులను కలగలుపుగ అలవరచుకొన్నది. కాని, నా జాతిది "ఇదీ" అని చూపగలిగిన ప్రత్యేకత ఏదీ కనిపించదు. అంతర్జాతీయ ఆధునికత ఎట్లా ఆక్షేపనీయాలుగావో అట్లే జాతీయతను విడనాడుట మాత్రం ఆక్షేపనీయం కాగలదు. ప్రపంచపు దూరభారాలు సంకుచితములైపోయిన యీ అంతర్జాతీయ యుగంలో, మడి గట్టుకొని కూర్చుండుట వాంఛనీయం కాదుగాని, మన ప్రత్యేకత విశిష్టత లవ లేశం గూడా లేకపోవుటగూడ వాంఛనీయంకాదు. కొత్తపాతల సమన్వయం, దేశవిదేశీయాల సామరస్యములే యీనాటి అవసరాలు. ఈ దృష్టితో చూచినచో తెనుగుదనానికి ఎక్కువపాళ్లు క్షతి జరిగినది.

అనాడు త్యాగాగ్ని గుండంలో దూకిన వీర దేశభక్తులు నేడు దేశ-జాతి ప్రగతులను జూచి నిరాశోపహతులగు దుస్థితి ఆంధ్రుల కొక్కరికేదాపు

రించినది గాదు. That white cap is full of black lies-అని డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఆనాడు పలికిన పలుకు యీనాడు దేశ వ్యాప్తంగా అన్వయించుకోవలసి ఉన్నది. అయితే మాత్రం ఆంధ్రుల కిది ఒక ఊరటా? వీటిని కోల్పోయిన జాతి, పోటీలుపడే ప్రపంచంలో నిలిచి మనలేదు. నేడు ధరలతో బాటు పెరిగినది అవినీతి ఒక్కటేనని అంటే అది స్వజాతిదూషణ మనిపించుకోదు. ఇది అభివృద్ధికి మార్గమైన ఆత్మవిమర్శనం అవుతుంది. ''ఆంధ్రదేశపు మట్టి అది మాకు కనకంబు'' అనిన గీతలయొక్క పరిశుద్ధ తత్త్వం మన భావనలలో లుప్తమైపోయి, చివరకు దేశమంటే ఒట్టి మట్టే అయినది. ఆ బాలగోపాలాన్ని ఉత్తూతలూపించిన ఆనాటి ఆంధ్రావేశం ఆవిరై పోయింది. ఆవేశంతోబాటు ఆదర్శంలేని భూతలవాసులమైనాము. ఆంధ్రాభిమానము సమగ్ర జాతీయతా భావ విచ్ఛేదకమని, అంతర్జాతీయతకు శత్రువని తూలనాడ సాగినాము; కానీ, జాతీయతే నేటి ప్రపంచ రాజకీయాలకు ఆయువుపట్టని, కీలకమని తెలిసిగూడ తెలియనట్లు నటించే ఉదారతా వేషధారులమై ఉన్నాము. గగన విహారం చాలించి, భూసంచారం గావించిననేగాని, యీ సంకుల భావసమ్మర్దంలో నేడు ఏ జాతిగాని రెక్కొకనలేదు.

**దుస్తులు - అలంకారాదులు :—** ఆనాడు ఆంధ్రుడు, ఆ పల్నాటి కద్దరుతో పేటంచు కట్టుపంచ, పై పంచతో భారతదేశసభలలో పరివేసినట్లు కనబడేవాడు. ఇప్పుడు ఆ వల్లెవాటు అంగవస్త్రాన్ని, నలమహారాజు అంగవస్త్రాన్నివలె ఏ పావురమో ఎగరదన్నుకొని పోయింది.

అరువుదెచ్చుకొన్న అమెరికాస్లాకు, బిగువు గొట్టపు ప్యాంట్లతో చిన్న పెద్ద ఒకటే అయినారు. దర్శనీయమైన ఆ అలంకారమును త్యజించి, ఒకే అచ్చులో బోసిన రూపాంతరాన్ని పొందినారు- యీ తరమువారు. పురుషాంతర వ్యత్యాసం అనవచ్చును గాని, మనది అనే పొడఅయినా లేకపోవుట ఏమంత మేలుకాదేమో! జపానువారివలె ప్రత్యేకమైన కార్యాలపట్టునైనా అలంకరణంలో ఆంధ్రత్వమును నిలుపుకొనుట అనంత భిన్నత్వంలో ఏకత్వమును సాధించుకొనుటే కాగలదేమో! నెల్లూరివారికి దోవతిపోయి అరవల అడ్డకట్టు (దట్టి) ఫ్యాషన్ అయింది; నెఱజాణల అభిరుచే దెబ్బదినిపోయింది.

స్త్రీలుమాత్రం సభ్యతను గోల్పోవని చీర చవికలతో ఉన్నారు. "చీరే శృంగారమంద్రు" అనిన సుమతి శతకపద్యం విదేశాలకు గూడ ప్రాకుతున్న

కారణమేమో యీ అభిమాన హేతువు! అందరు అధునాతన భారతీయ నారీ మణులకువలెనే మనవారికీ, కచభారం కుచభారం కృత్రిమాలైనవి; అసలు పోయిన నకిలీరాజ్యాంగదా ఇది! యువతీజనంలో కొందరు కాశ్మీరం మొదలు కనడా వరకుగల వస్త్రాలంకారవిధానమును అనుకరించి, ఒక సంకర నాగరకతను సృష్టిస్తున్నారు. ఇది ఇంగ్లీషు బ్యాండులో త్యాగరాజు కీర్తన వాయించి నట్లుంటున్నది.

**తిండిలో అరవల అలవాట్లు** :—ఉత్తరాది పూరి, మైసూరు వారి పాకు ఎప్పుడో తెనుగువారివంటయిల్లు చేరి యుండినవిగాని, ఇప్పుడు అరవల ఇడ్లి సాంబారురసం, కేరళుల కొబ్బెరచమురు అవియల్ పెద్దఎత్తున దండయాత్ర చేసి, ఆవకాయను, గోంగూరను ఒక మూలకు నెట్టినవి. ఆహారంలో మిగిలి ఉన్న ఆంధ్రత్వం ఇదే.

**ఆంధ్రభాష**:— ఆంధ్రభాష ఎదిగినది. విదేశపదాలను సొంతంచేసుకొనే ప్రతిభ యీ భాషకు, వాటినన్నిటిని శుద్ధంగా వ్రాయగలిగిన నేర్పు యీ లిపికి గలవు కాని, ఎయిర్-చాంబరు మొదలగు అపభ్రంశాలను దూరనివ్వడం స్ఫోటకపు మచ్చలకు ముఖం మురిసిపోయినట్లుంటుంది. ఇప్పుడు పత్రికలను రేడియోను ఒకే ప్రాంతంవారు చేజిక్కించుకొని, జీవంతో తొణికే వివిధ ప్రాంతీయభాషలను అనాగరకమని తోసిపుచ్చుట సరస్వతీదేవికి దాపురించిన మహామారులలో ఒకటి. ఇదే అభ్యుదయం అభివృద్ధి కానేరదు. అన్యప్రాంత భాష అర్థంగాక ఎగతాళి చేయడం మొరటుదనం. భాష-వ్యావహారికమే గానీయండి, తప్పులు తడకగా స్పెలింగు తప్పులతో అపశబ్దాలతో వ్రాయడమే ఫ్యాషన్ అయితే ఆ జాతికి మోక్షముండబోదు. ఇంగ్లీషులో తప్పు స్పెలింగులున్నవా? దానిలో గ్రాంథికానికి గ్రామ్యానికి అంత వ్యత్యాస మున్నదా? వారి శ్లాంగ్ గూడ మనవారి శిష్ట వ్యావహారికంకంటె పై స్థాయిలో లేదా? ఈ దుర్గుణం అరవలకున్నదా? కన్నడులకున్నదా? ఏ ఇతర భారతీయ భాషకైనా ఉన్నదా? అయితే ఈ తెగులు తెనుగు ఒక్కదానికే చుట్టుకోనేల?

భాష వివిధత్వ రామణీయకతకు ఒక దృష్టాంతంగా గోజాతి రమ్యతను పరికించండి: మనదేశంలో రాష్ట్ర రాష్ట్రానికి జిల్లా జిల్లాకు ఆవులు ఎద్దులు ఆకారంలో వర్ణంలో భేదించి, కొమ్ముపాటంలో - మలుగుల తీరులో - మూపు రాల పొంకంలో కన్నుల పండువుగా, ఎంత చూచినా చూపుకు వెగటులేకుండా

కనబడును. ఇక యూరవు దేశంలో అన్ని దేశాల పశువులు ఒకే మో స్తరు బుంగ కొమ్ములతో - చదరమైన వెన్నుతో - బట్టవన్నెలతో సొంపులేక కనుచాల కుండును. ఇట్లే ఒకే ప్రాంతీయ భాషానిరంకుశము వివిధ ప్రాంతాల భాషను నిర్జీవంగా చేయును.

కవిత్వము నవ్యమార్గాల ద్రొక్కినది ! నవ్యరీతులను చేపట్టినది ! నిజమే! ఇది కాల స్వభావం. భాషా చరిత్రలో ఇట్టి కుదిలింపులు బెదరింపులు సంభవించు చునే ఉన్నవిగాని, కాల ప్రవాహంలో కొట్టుకొనిపోకుండా నిలిచి సాగివస్తు న్నది - అధిక సంఖ్యాకులకు ఆమోదమైన భాషే !

అభ్యుదయ కవిత్వము విప్లవ కవిత్వము ఒక భాషాయానంలో అప్పు డప్పుడు కలిగే ఒడుదుడుకులే ! నిరాశోపహతులు దేవుని, దయ్యాన్ని అందరిని అశ్లీలంగా తిట్టడం అభివృద్ధిని చేకూర్చడం కానేరదు. సమృద్ధితో వర్తమాన స్థితిని వదలక భవిష్యత్తులోనికి జాతిని నడిపించగలిగిన కవిత్వమే అప్పటమైనది. క్రిందా మీదా పడినా, కాలక్రమేణా. ఆంధ్రభాష ఒక విశిష్ట స్పష్టరూపాన్ని పొందగలదు. నేటిరూపం మన భాషావికాసంలో పేరీపేరని స్థితి.

పూర్వం ద్విపదకవిత్వం-దేశికవిత్వం వంటిదే నేటి గద్యకవిత్వం. సర్వజనా మోదకరమైన విలువలనుబట్టి నిలువగలిగినదే నిగ్గయిన కవిత్వం. పదికాలాల పాటు నిలువగలిగినదికూడ అదే!

**ఆంధ్రుల ఆవేశం:**—ఆంధ్రులకు ఆవేశానికి తగిన ఆచరణశక్తి తక్కువ. సోడాబుడ్డి కొట్టగానే బుస్సని చల్లారిపోవునట్లు ఆంధ్రుని ఉత్సాహానికి ఆటు పోటులు ఎక్కువ. భాషావికాసానికి తగినట్లుగా నిలువగలిగిన కవిత్వం తెనుగున ఇంకా పుట్టలేదేమో అని అనిపిస్తున్నది. ఇది ఒక ప్రయోగస్థితి. (ఎక్స్పెరిమెంటల్ స్టేజ్) పొరుగున ఉండే తమిళులు, భాషారంగమున సాధించిన ప్రగతిని గమనించండి: ఎన్ని దినపత్రికలున్నవో అన్నీ లక్ష సర్క్యు లేషన్ దాకొన్నవి. "కుముదం" అనే వారపత్రిక ఇంచుమించు ప్రతి సంచికకు నాలుగు లక్షల ప్రతులను అచ్చువేసి అమ్ముతున్నదంటే; మనసుకు తెచ్చుకోండి అరవల భాషాభిమానము-వఠనాసక్తి! అందగత్తెల వన్నెచిన్నెల బొమ్మలు వేసినా (కవర్ గర్ల్సు) మన వారపత్రికలన్నీ గలసి ఒక కుముదానికి ఎంతో కీతగా నున్నవి. అసలు తెనుగువారి దంతా చేబదులు చదువు. యోగ్యమైన పుస్తకము

కొనే అలవాటు అంతగా లేనప్పుడు పత్రిక కొనబోతాడా వీరాంధ్రుడు! ఒకే ఒక దినపత్రిక ఊరంతా పేటంతా సర్క్యులేట్ అవుతుంది. మనవారికి వార్తలు గూడ, ఆవకాయవలెనే ఎంత పాతబడితే అంత మేలైనట్లున్నది.

**సినిమాలు-నాటకాలు** :—ఇప్పుడు తెనుగుదనం బొత్తుగా కనుపించకుండా పోయింది-నాటక సినిమా రంగాలలోనే. గ్రామీణులను ఇంపుతో సొక్కించిన యక్షగాన రూపమైన వీధిభాగవతము, పామరపండిత జనరంజకమైన తోలుబొమ్మలాట (లెగర్ టాకీస్ అందామా?) పసుగెత్తిపోయి గుహాలలో దాగుకొన్నవి. మహారాష్ట్రులు,''తమాషా''అనే యిట్టి నాట్యవిధానాన్ని, తమ పెద్దలు సంక్రమింపజేసిన కాణాచిగా కాపాడుకొనుచున్నారు. జంగం కథలు బుఱ్ఱకథలనే నామాంతరంతో రాజకీయాలకు పనికివస్తున్నవి. ఆనాడు ఆంధ్రనాటకరంగం దక్షిణా పథమంతటిలో. నటన కళావైదుష్యంచేత అగ్రగణ్యంగా ఉండినది. బళ్ళారి రాఘవ, నెల్లూరు నాగరాజరావు, కందాడై శ్రీనివాసన్ (దొరసామయ్యంగార్) డి. వి. సుబ్బరావు, పర్వతరెడ్డి రామచంద్రరెడ్డి, యడవల్లి సూర్యనారాయణ మొదలగు మహానటులు, ఆంధ్రనాటక వియత్తలాన్ని వెలిగించిన ఉజ్జ్వలతారలు. ఇప్పుడు నాటక ప్రయోగాలకే కరువైనది. ఉన్నా సంగీతం గాడిద గాంధర్వమైనది. పద్యంలో మూడుమాటలుచెప్పి ముప్పైమూర సంగీతం, కొండవీడుచేంతాడువలె లాగిలాగి విసుగెత్తిస్తున్నారు. ఎవరు పాడినా ఒకేరాగం ఒకేస్థాయి ఒకేమూర్ఛన! కర్ణకఠోరతే శ్రోతలకు కర్ణామృతము.

ఇక, సినిమారంగం నాటకరంగాన్ని చెడగొట్టి తానూ చెడి, విదేశ అనుకరణాలైన బొంబాయి ఫిలిములకు నిర్జీవ ప్రతిబింబాలై తెనుగుతనాన్ని ఆ వాతావరణాన్ని, అచ్చపు గ్రామీణతను నిర్వాసమంపినవి. ఫిలిములకు డబ్బు రావచ్చు - తారలు మెరయవచ్చు కాని, తెనుగు వెండితెర సత్తుతెర అయినది. పూర్వం ఉండిన ఏకొద్దిఆంధ్రత్వం కూడా మలమలమాడిపోయినది. గుఱ్ఱం + అశ్వం = గుశ్వమన్నట్లు, పరదేశ పరరాష్ట్ర సభ్యతలను పిసికి ముద్ద జేసినట్లు ఒక గసాభాసస్థితి ఏర్పడి ఉన్నది. సత్యజిత్‌రాయి, వనకుదురు శాంతారాం (తెనుగు వాడా ?) సృష్టులను కల్పించలేకపోవచ్చుగాని, వ్యక్తిత్వంగల ఆంధ్రులు వికారపు పేర్లతో చిత్రాలనిర్మించి, పామరజన రంజకానికిగా కాసులకుగా, కళను బలిబెట్టినారు. మహాశక్తివంతమైన యీ ప్రచారక సాధనం అరచదువు ఆంధ్రులను చాలామందిని చెడగొట్టుచున్నదనేవారు చాలమందిగలరు. ఇక వీటి సంగీతం-

అనంతకోటి కంఠాలకు ఒకే గొంతై సంగీతలక్ష్మిని కొరత వేసినది. ఇవి ఆదర్శ ప్రాయమైన ఆనందాన్ని గూర్చే దెప్పుడో!

**స్థానిక దురభిమానం :—** ఆంధ్రులకు అవగుణమో అరిష్టమో అనదగినది స్థానిక దురభిమానం! కృష్ణ పెన్నారు ప్రాజెక్టు సర్కారులవారు వద్దు, నాగార్జున సాగర్ కావాలంటారు; గోదావరి వారు ఇది వద్దు రామపాద సాగరం గావా లంటారు; ఇక నెల్లూరువారు ఇవి రెండూ వద్దు సోమశిల కావాలంటారు. దీని వల్ల అది ఇదీ అన్నీ ఊడ్చుకొని పోతున్నవి. ఇక తమిళులు చూడండి- అది కావాల ఇదీ కావాల అని అందరూ ఐక్యకంఠంగా బలికి, అన్నీ సాధించుకొంటు న్నారు. దీనికి తోడుమాటసాగిన అధికారులు అరవలకు గుట్టుగా పనులు సరిజేసి పెట్టుతున్నారు. కాబట్టి తమిళులు అన్ని పరిశ్రమలు అన్ని ప్రాజక్టులు దక్కించు కొని బాగుపడుతున్నారు. ఇక తెనుగువారు ఐక్యతలేకుండా అన్నీ చెడగొట్టు కొనుచున్నారు. ఆంధ్రులు ఆవేశమూర్తులేగాని కార్యశూరులు గారు. ఆంధ్ర అన్నపూర్ణ! నిజమే-మానవునికి అన్న మొక్కటేగాదు జీవితావసర వస్తువు

**భాషాప్రయుక్త రాష్ట్ర సాధన:—** ఆంధ్రుల చరిత్రలో అన్నిటి కంటె విషాదకరాంశము—యీమధ్య విలయతాండవంచేసిన భాత్ృహంత కోద్యమము! ముక్కోటి ఆంధ్రులు ఒకపంచన కుదుట పడాలని ముక్తకంఠంతో అరవై ఏండ్లుగా ఆందోళనచేసినాము. భాషారాష్ట్రోద్యమానికి ధ్వజారోహణం గావించి నాము. ఈవాదాన్ని భారతదేశానికంతా నేర్పినాము. ఆంధ్రనగరి అని పేర్గాం చిన ఓరుగంటిసామ్రాజ్య ధవళాతపత్ర ఛాయలక్రింద శాంతిసౌభాగ్యాలనుభవించి 600 ఏండ్ల తర్వాత, మరల యీనాడు నాలుగుకోట్ల ఆంధ్రులందరము ఒక రాష్ట్రంగా ఒక ప్రభుత్వం క్రింద ఏర్పడినాము పొట్టి శ్రీరాములుబోటి ఆత్మ బలిదాతల అకళంక పవిత్రరక్తం యీఐక్యతను పునీతం చేసినది. ఈభాషారాష్ట్ర విభజన సంకుచితభావమని, భారత సమైక్యతకు భంగమని మృషా జాతీయ వాదులు కేకలిడినా, ఇది మానవ ప్రవృత్తిని భాషాభిమానము అభేద్య అదృశ్య బంధమని ఇప్పుడు దేశదేశాలు చాటుచున్నవి. ఐర్లండు స్కాట్‌ల్యాండు, వేల్సు తమతమ కెల్‌టిక్ భాషలను పునరుద్ధరించుకొనినవి. మతముకంటె భాషే గట్టిదనీ బంగ్లాదేశ స్వాతంత్ర్యసమరం చాటింది.

**తెలంగాణాలో రక్తఋతువు :—** కాని, హైదరాబాదునగర వీధులలో యీమధ్య ఆంధ్రసోదరులు స్వజన రక్తంతో వసంతమాడిన దారుణ పైశాచిక

దృశ్యం, ఆడవారి పరువును గోడల మీదికి ఎక్కించిన అనాగరకబుద్ధితోడి, ఆంధ్రుని ద్వేషించి అన్యుల కౌగలించుకొనిన విపరీతప్రవృత్తి - ఆంధ్రులకేకాదు మానవజాతి వినీతసభ్యతకే మాయని కళంకము.

దుష్టరాజకీయ శక్తులు కానీయండి ఆంధ్రేతరుల లాభాపేక్ష కానీయండి తెలంగాణా వేర్పాటు పోరాటంవల్ల ప్రపంచంలో ఆంధ్రజాతి కీర్తి దూషితమైనది. ఈద్వేషానలం ఇంతటితో చల్లారిపోవుట ఖావిసంతతి అదృష్టం. ఆ ఆక్రోశం వల్ల బావుకొన్నది ఏమీలేదు - మిగిలినదంతా అపకీర్తియే.

ఈ దురంతాన్ని క్షణికంగా, తేలిపొయ్యే తొలకరి మబ్బుగా విస్మరించి, ఆంధ్రగౌరవమును మరల నిలబెట్టుకొందుముగాక !

# తెలుగువారి భక్తిప్రపత్తులు-
# తాత్త్వికచింతన

శ్రీ గూడ సుందరరామయ్య

'మహతి' ని మ్రోగించిన నారదమహర్షి భక్తిసూత్రాలు, విష్ణుపురాణము, భాగవతపురాణము, వైష్ణవ ఆగమాలు, ఆళ్వారుల భక్తిగేయాలు, ప్రస్థాన త్రయంలో ఉపాసన కాండను తెలిపేభాగాలు భక్తిసాహిత్యానికి నిధులు. భక్తి లేకుండా భగవంతుని పొందటం అసంభవమని మతత్రయకర్తల్లో శ్రీరామానుజుల వారు, మాధ్వాచార్యులు చెప్పినారు. జగద్గురువులు అపరోక్షానుభూతివల్ల మోక్షం లభిస్తుందనినారు. ఆత్మనివేదన, ఆత్మార్పణ, కింకరత్వము, కించిత్వము, భక్త్యావేశము, దాసదాసీత్వము, ఆధార-ఆధేయత్వము - వీటిని వైష్ణవ భక్తి సంప్రదాయము గుర్తించింది. రౌద్రభక్తి దీనికి భిన్నంగా ఉంటుంది. శరీరాన్ని హింసించడంవల్ల ఆత్మ ఈశ్వరార్పితమవుతుందని వీరశైవులు నమ్మిరి. వీరశైవంలో భక్తి మరోరూపేణ ఆచరింపబడుతుంది. ప్రస్థానత్రయంలోని ఉపాసన కాండ శ్రవణమననిదిధ్యాసాదులను భక్తికి ప్రథమసోపానంగా చెబుతుంది. ఈ ఉపాసనా కాండను ఆధారంగా శ్రీ వైష్ణవము, పాంచరాత్రము, విశిష్టాద్వైతము సత్వగుణ ప్రధానమైన భక్తిని ప్రతిపాదించినాయి. ఇక్కడ ధ్యేయం ఒక్కటే కాని మార్గాలు వేరు. సాయుజ్యానికీ, సామీప్యానికీ, సారూప్యానికీ వైష్ణవభక్తులు తహతహలాడినారు. కైవల్యానికై శైవులు చిందులు తొక్కినారు. భజన నామసంకీర్తనము, దాస్యము, స్తుతి, సేవ, సఖ్యత్వము, వందనము, ప్రేమానురాగాలు-ఇత్యాదులను భక్తిస్వరూపాలుగా సంప్రదాయము గుర్తించింది. మానవుడు తన మనోదౌర్బల్యంచేత అంధీభూతుడై తనహృదయ కుహరంలో నుంచి మొరపెట్టుకొన్నపుడు మనకు తెలియని కృపాభయ హస్తము మనకు తెలియకుండానే రక్షిస్తుందనీ విశ్వాసం ఉండాలి. ఆ నమ్మకంతోనే భక్తుడు జీవయాత్ర చేస్తాడు. అలాంటి కృపాభయ హస్తం అద్వైతంలో ఖండింప

బడింది. నిర్గుణ, నిరాకార, నిరంజన, నిరవయ బ్రహ్మను మానవుడు శరణు వేడడు అప్రాకృత దివ్యదేహ ధారియగు పరమాత్మను సాకారంగానూ, సగుణం గానూ చిత్రించుకొని తనగోడు వింటాడనే ఆశతో పదేపదే విన్నవించుకొంటాడు. సత్యం శివం సుందరం భగవంతుని మూర్తులుగా ఊహిస్తాడు. ఆ రూపాన్ని దర్శించాలనీ, ఆయన ప్రేమకు పాత్రుడు కావాలనీ, ఆయన కృపారసం తనపై చిలకాలనీ, ఆయన సాన్నిధ్యం పొందాలనీ ఆరాట పడుతాడు.

కాలప్రవాహంలో ప్రాచీనమైన ఈ భక్తి అనేక రూపాలను సంతరించు కొన్నది, స్వాతంత్ర్య యుగోదయం మన సమీక్షా క్షేత్రము.

(1) సంప్రదాయభక్తి : ఆంధ్రదేశంలో ప్రబలంగా ఉన్న మతోద్యమా లను, ప్రజలుచూపే భక్తిప్రపత్తులనూ నాలుగు రకాలుగా విభజించవచ్చు. (1) సంఘంలో గొప్పవారూ, విద్యాధికులూ, శ్రేష్ఠులు, సంస్కారము కలవారు ఆచరించే పద్ధతి. వీరు పూర్తిగా సంప్రదాయ పద్ధతులను తు.చ. తప్పకుండా ఆచరించరు. కాని సంప్రదాయాన్ని అనుసరిస్తున్నామనే నమ్మకం వీరిలో దృఢంగా ఉంటుంది. భగవద్గీత పారాయణ, సుందరకాండ పారాయణ, పురాణ కాలక్షేపణ, వ్రతాచరణ, (అనగా సత్యనారాయణ వ్రతము, గౌరీనోము వ్రతము, ధనుర్మాస వ్రతదీక్ష ఇత్యాదులు) శాంతి కర్మలు, (జాతకర్మ, నక్షత్ర జపము, బాలగ్రహశాంతి, నవగ్రహారాధన పూజలు) మ్రొక్కుబడులు, (తిరుపతి శ్రీవేంకటేశ్వర స్వామివారికి, అన్నవరం సత్యనారాయణ స్వామివారికి, సింహాచలం నృసింహస్వామివారికి) అంజనేయ ఉపాసన, శ్రీచక్ర ఉపాసన, సమారాధనలు (కాశీకిపోయివచ్చి, తిరుపతికి పోయివచ్చి, శ్రీశైలం పోయివచ్చి, శ్రీరంగంపోయివచ్చి, రామేశ్వరం పోయివచ్చి)—మొదలగు కర్మకాండద్వారా సంప్రదాయాన్ని వీడీవీడకుండా, అమరా విక్షేపములవలె వీరు సాధన చేస్తారు. వీరి కర్మవెనుక మీమాంసకులు ప్రతిపాదించిన తత్త్వమున్నది. మీమాంసకులు కర్మద్వారా మోక్షాన్ని (స్వర్గము లేక శాశ్వతానందాన్ని) పొందవచ్చన్నారు, జైమిని, శబరుడు, కుమారిలుడు, ప్రాభాకరుడు ఈవిధమైన కర్మవాదాన్ని ప్రాచీన కాలంలో శంకరుని బ్రహ్మవాదానికి పోటీగా బోధించినారు. కాని ఇక్కడ మనం ఒక ముఖ్యమైన విషయాన్ని గ్రహించవలె. ఈవిధమైన కర్మను భక్తిగా మార్చివేసిరి. కారణాలు అనేకం ఉన్నాయి. ఈకర్మను ఆచరించేవారికి ప్రాచీన సంప్రదాయమందు నమ్మకమున్నదే కానిదాని లోతులకు తెలిసికొనే సామర్థ్యము

వీరికి లేదు. జైమిని మీమాంస సూత్రాలనుకాని, కుమారిలుని తంత్రవార్తిక, శ్లోకవార్తికాలనుకాని, శబర భాష్యాన్నికాని వీరు అర్థంచేసుకోలేరు. కనుక కర్మ ప్రధానంగా సాధనబోధించే గురువులే వీరికి శరణ్యాము. అంతేగాక మఠాధిపతులు, పీఠాధిపతులనుండి కూడా వీరు నిత్యనైమిత్తిక కామ్యకర్మల స్వరూపాన్ని తెలిసికొన్నవారై వాటిని ఆచరిస్తారు.

స్మార్తులు, మాధ్వ బ్రాహ్మణులు, శృంగేరి, కామకోటి పీఠాధిపతులనను సరించేవారు ఇలాంటి సాధన ద్వారా మోక్షాన్ని పొందటానికై యత్నిస్తారు.

(2) నూతన సమాజ సాధనభక్తి (Recently found cult)

(అ) 'రామకృష్ణ మిషన్' శ్రీరామకృష్ణ పరమహంసను ఆరాధ్య దైవంగా ఎన్నుకొని 'రామకృష్ణ మిషన్' లేక రామకృష్ణ మఠముల స్థాపనలో హిందూమతము మరొక నూతనమైన మలుపును సంతరించుకొన్నది. వివేకానందుని చేత ఇది దిగంతాలకు వ్యాప్తి చేయబడినది. మద్రాసులో మైలాపూరు, చికాగో, న్యూఢిల్లీ ఈ 'మిషన్' కు కేంద్రాలు. ప్రాచీన సంప్రదాయాన్ని అన్వయం చేయడం తమధ్యేయంగా వీరు భావించినారు. మన ఆంధ్రదేశంలో వైజాగ్, గుంటూరు, రాజమండ్రి, హైదరాబాదు నగరాల్లో వీరి 'మిషన్'లు (ఆశ్రమాలు) ఉన్నాయి. రామకృష్ణ పరమహంస పటమును పెట్టి భజనచేస్తారు. మాత పట మును కూడా పెట్టి పూజిస్తారు. ముఖ్యంగా ఎర్రటి పూలతో పూజిస్తారు. అనేక గ్రంథాలను తెలుగులోనూ, హిందీలోనూ, ఇంగ్లీషులోనూ ప్రచురించి నారు. అద్వైత గ్రంథాలను ఎక్కువగా వీరు ప్రచురించినారు.

(ఆ) దివ్యజ్ఞాన సమాజం :— (Theosophical lodge) ఈశ్వర స్వభావము దాని ప్రక్రియలు–వీటిని గురించిన ప్రత్యేకమైన అంతరదృష్టి కలదని చెప్పుకొను దార్శనిక, మతచింతనను దివ్యజ్ఞానమనిరి. హెచ్.యస్. ఆల్కాట్, హెచ్.పి. బ్లవాట్స్కి, ఆయన సతీమణి, తదితరులు 1875 లో అమెరికాలో ఈ సమాజమును స్థాపించిరి. అనిబిసెంట్ ఈ సమాజానికి అధ్యక్షురాలుగ నుండెను. సర్వమానవ సౌదర్య కేంద్రాలను స్థాపించటమూ, దర్శనశాస్త్ర, మత తార తమ్యామశీలనను అభివృద్ధి చేయుట, ప్రాణద్రవ్యముల రహస్యశక్తులను గురిం చిన పరిశీలన చేయుట, ఈ సమాజమువారి ముఖ్య లక్ష్యములు. టిబెట్‌లోని సిద్ధులద్వారా ఈ రహస్యసిద్ధాంతము వీరికి సంక్రమించినది. పునర్జన్మయందు వీరికి పూర్తినమ్మకమున్నది. విశాఖపట్టణంలోనూ, గుంటూరులోనూ, కాకినాడ లోనూ వీరి సమాజాలున్నాయి.

(ఇ) బ్రహ్మసమాజము : రామమోహన్ రాయలు 1828 వ సంవత్సరమున ఏకేశ్వరోపాసన మందిరముగా, సర్వతోముఖ మానవ ప్రగతి సాధనముగా బ్రహ్మసమాజమును స్థాపించినాడు. అన్యమతద్వేషము పనికి రాదన్నాడు. త్యాగము, వినయము, భక్తి ద్వారా భగవంతుని పితృత్వాన్ని గుర్తించవలె. మానవ సౌభ్రాతృమును అనుభూత మొనరించుకొనవలె. దురాచారములను, మూఢాచారములను పారద్రోలుటకై బయలుదేరిన ఈ ఉద్యమం, మనదేశంలో విద్యావిస్తృతి చెందిన కారణంగా, అంతరించింది. కాకినాడలోనూ, విజయవాడలోనూ దీని ఛాయలు కనిపిస్తాయి. సతీసహగమనమును నిర్మూలించుట, బాల్యవివాహములను రద్దుచేయుట, వితంతు వివాహాలను సంఘంలో ప్రవేశపెట్టుట - ఈ ఉద్యమం లక్ష్యాలు.

(ఈ) ఆర్యసమాజము :... దయానంద సరస్వతి 1875 అక్టోబర్‌లో బొంబాయిలో ఆర్యసమాజాన్ని స్థాపించినాడు. దాన్ని 'పండిత గోపదేవ్' అభివృద్ధిచేయ యత్నించినాడు. షడ్దర్శనాలను తెలుగులో వ్రాసి బహుగ్రంథకర్తగా వాసికెక్కినాడు. వీరి సిద్ధాంతము : ఈశ్వరుడు ఒక్కడే. ప్రతీకరూపమున కాక మానసికముగనే ఈశ్వరుని ఆరాధింపవలె. వేదాలు అపౌరుషేయాలు. అవి ఈశ్వరప్రోక్తాలు. జన్మపరంపరను, కర్మను వేదాలు అంగీకరిస్తాయి. జననమరణ చక్రబంధమునుండి విముక్తియే మోక్షము. హిందూమత పునరుద్ధరణ, గోసంరక్షణోద్యమము, అన్యమత ఖండన, వీరి ముఖ్యలక్ష్యములు.

(ఉ) బ్రహ్మంగారి మతము, కూచివూడి యక్షగాన సంప్రదాయం, క్రైస్తవ సంస్థలు ఇవికూడా మన ఆంధ్రదేశంలో కొల్లలుగా కనిపిస్తాయి. సాధారణంగా ప్రతిగ్రామంలోనూ బ్రహ్మంగారిమఠాలు కనిపిస్తాయి. అలాగే క్రైస్తవ దేవాలయాలు కూడా కనిపిస్తాయి. ఇక్కడ దైనందిన జీవితం మతం మీద ఆధారపడి ఉంటుంది. గుంటూరు నగరంలో 'రైట్ రెవరెండు ఇగ్నేషియస్' గారు 'అలగాజనాన్ని' ఉద్ధరించడానికై క్రైస్తవ మతాన్ని ప్రచారంచేయటం సంతోషకరమైనపని. ఏమతమైనా జనోద్ధరణతో బయలుదేరుతుంది. కాని అది ఎంతవరకు విజయాన్ని సాధించింది అనేది ప్రజలకు ముఖ్యము.

(3) ఇటీవలి మతోద్యమాలు :— భగవంతుని లక్షణాలను మానవుడికి అంటకట్టడం ఈ రోజుల్లో ఫాషను. 'Deification of the Man is the fashion of the day' తత్ఫలితంగా మనం అనేకమంది 'Deified Men'

(భగవదాంశులను) చూస్తాము. వీరిలో కొందరు తాము భగవంతుని చూచినా మనీ, కొందరు భగవంతునితో మాట్లాడినామనీ, మరికొందరు తాము భగవంతుని దూతలమనీ అంటారు. తమ మాటలపై సామాన్య ప్రజానీకానికి నమ్మకం కుదరడానికై అసామాన్యమైన అద్భుత చర్యలను ప్రదర్శిస్తారు. ఈప్రదర్శనలతో వీరికి ప్రాపగాండా లభిస్తుంది. మతోన్మాదులు, భావావేశపరులు, ధనికులు, ఆర్తులు – అంతా వీరి చుట్టూ చేరుతారు అద్భుతవిషయాలకు ప్రచారం చేయ డానికి వీరు సందేహించరు. సంఘంలో తమకున్న పలుకుబడి ద్వారా వీరు ఈ ఉద్యమాన్ని ప్రచారం చేస్తారు. తామర తంపరలుగా ఈ విషయానికి విలువ పెరుగుతుంది. విలువ పెరిగినదేదీ కూడా విరివిగా దొరకదు. అందుకని అసలు విషయాన్ని (Mystery) గా ఉంచుతారు. ఆసక్తి పెరగినకొద్ది ఆరాటము, ఆరాటం పెరిగినకొద్ది అభిమానం పెరుగుతుంది. అభిమానం రకరకాలుగా అభి వృద్ధి చెందుతుంది. దాన్ని అనేక రూపాల్లో వ్యక్తం చేస్తారు. అలా తమ ఆవేశాన్ని భక్తిరూపంలో వెల్లడిచేసినామని సంతోషిస్తారు.

మానవునికి దైవత్వాన్ని ఆపాదించినంత మాత్రాన భక్తుల 'ఈగో' (Ego) సంతోషించదు. కనుక వారు 'భక్తులనే' బిరుదాన్ని తగిలించుకొంటారు. సత్యసాయిబాబా భక్తులుగా కొందరూ, మాతభక్తులుగా కొందరూ, హరనాధ బాబా భక్తులుగా కొందరూ తయారవుతారు. వీరు నమ్మిన 'స్వామివారికి' పూజామందిరాలు కట్టిస్తారు. భజనలు ఏర్పాటు చేస్తారు. గ్రంథాలు వ్రాస్తారు. గ్రంథముద్రణకు ద్రవ్యసహాయం చేస్తారు. ఉపన్యాసాలు చెప్పిస్తారు. కథలు గేయాలు వ్రాసి స్వామి తత్త్వాన్ని ప్రచారంలోకి తెస్తారు. మెల్లో స్వామి లేక అమ్మ బొమ్మ ఉంటుంది. ఉన్మాదులవలె స్వామి 'కల్ట్' ను ప్రచారంచేసి అందులో (కొందరు) తమ స్వార్థాన్ని చూస్తారు. దైవత్వం ఆపాదింపబడినవారు మన ఆంధ్రదేశంలో చాలా మంది ఉన్నారు. (అతి ప్రసిద్ధులైనవారిని గురించి మాత్రమే తెలిసికొందాము. మెహర్‌బాబాను, అవతార పురుషుడన్నారు. అవిద్యా కామకర్మలతో అంధీభూతులైనవారిని మేల్కొలుపటానికి తాను వచ్చా నన్నాడు, ముమ్మడివరంలో 'బాలయోగి'ని శుకమహర్షి అంశమన్నారు. కాకినాడలో 'పాము' ను సుబ్రహ్మణ్యం అవతారమన్నారు. ఓంకారస్వామిని సర్వమత సమదర్శిని అన్నారు. జిల్లేళ్ళమూడిలో 'అమ్మను' రాజరాజేశ్వరి అవతారమన్నారు. తోట్లవల్లూరులో 'చిన్నమ' పలుకులు శాంతిదూత పలుకు లన్నారు. ఇలా వీరినిగురించి చెప్పటానికి స్థలంచాలదు.

వీరు కాక మహర్షి మహేష్ యోగిభక్తులు కూడా ఉన్నారు. Instant భక్తి, Transcendental భక్తి వీరి బోధనలు. వీరి కేంద్రాలను విశాఖలో కూడ చూడగలము.

మధుర భక్తికి బెంగాల్ వైష్ణవ సంప్రదాయము నాసిగాంచినది. శ్రీకృష్ణ చైతన్య మహర్షి అంచింత్యా భేదాభేద వాదాన్ని ప్రచారం చేసినాడు. కాల క్రమేణ అది 'భక్తి వేదాంతంగా' మారి భక్తి వేదాంత స్వాములవారి ద్వారా ఖండాంతరాల్లో కూడా వ్యాప్తి చెందింది. శ్రీకృష్ణుని లీలలను, తరంగాల ద్వారా ప్రచారం చేసారు. 'హరేకృష్ణ హరేరామ' అంటూ గొంతు పగిలేలాగా అరుస్తూ భక్తి మాధుర్యంతో ఒళ్లు తెలియకుండా చిందులు తొక్కుతారు.

పైన చెప్పినవారు ఒక తెగవారు. వారుకాక కేవలం తత్త్వ ప్రచారం చేసేవారు కూడా ఉన్నారు. స్వామిచిన్మయానంద 'Mission', గౌడీయ మఠ్, రామకోటి వ్రాసేవారు, మస్తాన్ పుష్యాకు మ్రొక్కు బడులిచ్చేవారు - ఇలా రకరకాల ఉద్యమాలు బయలుదేరి ప్రజలను 'Instant' భక్తులుగా చేసినాయి. శివానందుడు స్థాపించిన 'Divine life society' కూడా ఈ కోవకు చెందినదే.

4. జానపదుల్లో భక్తి :— సాంప్రదాయపు మత ప్రక్రియల్లో వీరికి ప్రవేశము చాలా తక్కువగా ఉంటుంది. శ్రీశైలపు తిరుణాల, భద్రాచలం తిరునాళ, సింహాచలం తిరునాళ, పొలేరమ్మ జాతర, అంకమ్మజాతర-ఇత్యాదుల్లో వీరి ఆవేశాన్ని మనం చూడవచ్చు. జాతర్లు, తిరుణాలలు వారి ముఖ్యాశయాలు. ఆవేశంతోకూడిన భక్తిని ప్రదర్శిస్తారు. కోటప్పకొండ తిరుణాళ్ళలో ప్రదర్శింపని కళ అంటూ ఉండదు. 'డాన్సులు, నాటకాలు, భజనలు, కోలాటాలు, ఎద్దుల పందెములు, ఉపవాసాలు, సమారాధనలు, ఒక్కమాటలో చెప్పవలెనంటే 'అన్నీ' ఉంటాయి. వ్యవసాయపు కూలీలు, పారిశ్రామిక కూలీలు, పట్టణాల్లో ఉండే కూలీలు, రైలుకూలీలు, వీరందరూ ఇలాంటి భక్తిలో ఆసక్తిని చూపు తారు. వీరి ఆశయాలు వేరు. వీరి ఆలోచనలు వేరు. వీరి వైఖరి వేరు. అందుకని వీరి పద్ధతికూడా వేరుగానే ఉంటుంది.

భారతీయ చింతనా మహతిని మ్రోగించిన మహనీయులు మన ఆంధ్ర దేశంలో అనేకులున్నారు. వారు తాత్త్విక చింతనకై చేసిన కృషి మరువరానిది. వీరికృషిని మూడువిధాలుగా విభజించవచ్చును. (1) అంతర్జాతీయ ఖ్యాతిని, గాంచిన ఆంధ్రతాత్త్వికులు కొందరు. (2) సంస్కృతంలో ప్రాచీన గ్రంథాలకు

స్వంతంగా వ్యాఖ్యానాలు కాని, టీకలుకాని వ్రాసినవారు కొందరు. (3) తెలుగులో దర్శన శాస్త్ర గ్రంథాలను వ్రాసినవారు, సంస్కృత గ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేసినవారు కొందరు. ఆంగ్లంలో ఉన్న దర్శన గ్రంథాలను అనువదించినవారు కొందరు. వీరు తత్త్వశాస్త్ర సాహిత్యానికి చేసిన సేవను గురించి పరిశీలిద్దాము.

సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు, శ్రీ పి. టి. రాజు, శ్రీ కె. సచ్చిదానంద మూర్తి–వీరు ముగ్గురు విశ్వవిఖ్యాతిగాంచిన ఆంధ్రదార్శనికులు. రాధాకృష్ణుని రచనలన్నీ ఆధునిక ప్రపంచ సమస్యల పరిష్కారమునకై వినియోగింపబడినవి. ప్రాచ్యప్రతీచ్య భూఖండములలో ఉదారదార్శనిక దృక్పథములు వెలసిన చోట్ల ఈతని భావములు అంగీకృతములు. ఆధునిక దార్శనికశాస్త్ర చరిత్రయందు ఇతనికి కల స్థానము నిరుపమానము. శ్రీ పి. టి. రాజుగారు లండన్‌లో కింగ్సు కాలేజీలో దర్శనాచార్యులుగా పనిచేసిరి. గ్రీకులు, క్రైస్తవులు, హిందువులు–మానవుని ఏ విధంగా చిత్రించినది వీరు తెలిపినారు. ఇండియన్ ఫిలాసఫీని వీరు పాశ్చాత్య విశ్వవిద్యాలయాల్లో బోధించిరి.

శ్రీ సచ్చిదానంద మూర్తిగారు బహుముఖ ప్రజ్ఞాశీలురు. వీరిలో దార్శనిక గాంభీర్యము – వ్యక్తి గాంభీర్యం ఒకదానితో మరొకటి పోటీ పడుతాయి. 'రీజన్ అండ్ రివలేషన్' అనే గ్రంథము అద్వైతంలో వీరికి గల పాండిత్యానికి నిదర్శనము. 'ఇండియన్ స్పిరిట్' వీరి విమర్శనాత్మక దృష్టికి నిదర్శనము.

ఆంధ్రులకు సాహిత్యంలోనే కాక దర్శనశాస్త్రంలో కూడా అపార పాండిత్యమున్నదని నిరూపించడానికై పై వారిని ఉదాహరించినాము. సంప్రదాయ బద్ధమగు దార్శనిక చింతన అవిచ్ఛిన్నముగా నుండుటకై కొందరు ఆంధ్రులు సంస్కృతంలో దర్శన గ్రంథాలు వ్రాసిరి. అద్వైతమతాన్ని అనుసరించి కొందరూ, బౌద్ధాన్ని అనుసరించి కొందరూ సంస్కృతంలో వ్రాయటం ముదావహం. శ్రీ ఆర్. లింగన సోమయాజులుగారు పంచదశిని, ఉపనిషత్తులకు వ్యాఖ్యను సంస్కృతంలో వ్రాసిరి. శ్రీ కొండూరు సోమశేఖరశాస్త్రిగారు మహాయాన బౌద్ధమతశాఖ దర్శనా చార్యుడగు నాగార్జునని మాధ్యమిక కారికను సంస్కృతంలో వ్రాసిరి.

స్వాతంత్ర్యానంతరము దర్శన శాస్త్రంలో అవిరామంగా కృషిజరిగిందని చెప్పవచ్చు. అనేకమంది ప్రాచీనగ్రంథాలను తెలుగులోకి అనువదించీ, స్వతంత్ర

రచనలుచేసీ, ఆంగ్ల గ్రంథాలను అనువదించీ, సంప్రదాయబద్ధమని తాత్త్విక చింతనను పటిష్ఠముచేసిరి. అందులో అతిముఖ్యులను మాత్రమే చూద్దాము. సర్వశ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రిగారు పతంజలి యోగభాష్యాన్ని తెలుగులోకి అనువదించి యోగాన్ని పునరుద్ధరించిరి, జమ్మలమడగ మాధవరాయశర్మగారు తంత్రశాస్త్రంపై వ్రాసి తంత్రాన్ని సంస్కరించిరి. స్వామి చిరంతనానందస్వామి వివేకానంద గ్రంథావళిని తెలుగులోనికి అనువదించిరి. ఆర్. యస్. ప్రకాశశాస్త్రి మీమాంస గ్రంథాలను వ్రాసిరి. వేదార్థ సంగ్రహాన్ని కూడా వ్రాసిరి. స్వామి కేశవతీర్థ తులసీదాస్ రామాయణాన్ని రామతీర్థ గ్రంథాలను తెలుగులో వ్రాసిరి. స్వామి జ్ఞానానంద యోగదర్శనాన్ని వ్రాసిరి. సాధన గ్రంథమండలివారు శంకర గ్రంథావళిని తెలుగులో ప్రచురించిరి, డా. జి. వి. కృష్ణారావుగారు నాగార్జునుని 'విగ్రహవ్యావర్తిని' గ్రీకు తత్త్వవేత్త యగు ప్లేటో 'రిపబ్లిక్' జర్మను తత్త్వవేత్తయగు కాంటీ దర్శనాన్ని తెలుగులోకి అనువదించిరి. బౌద్ధవాఙ్మయ బ్రహ్మగా వాసికెక్కిన దుగ్గిరాలబలరామకృష్ణయ్యగారు బహుగ్రంథకర్తలు. వ్యాసాశ్రమ గ్రంథమాలవారు కూడా అద్వైతమత గ్రంథావళిని ప్రచురణచేసి జనసామాన్యానికి అద్వైతం అందుబాటులో ఉండేటట్లు చూస్తున్నారు. వేలూరు చంద్రశేఖరంగారు అరవిందుని రచనలను అనువదించిరి. శ్రీ కె. సచ్చిదానందమూర్తిగారు ఆంగ్లములోనేకాక తెలుగులో కూడా బహు గ్రంథకర్తలు. నీహారిక, కఠోపనిషత్తు, భగవద్గీత, రామానుజ దర్శనము, విజ్ఞానసర్వస్వము - మతము - దర్శనము - అను గ్రంథానికి సంపాదకులేగాక, 225 పుటల్లో సర్వమత సమీక్షను కూడ చేసిరి. జయంతిపురం రాజా దుర్గాసదాశివేశ్వర ప్రసాద్ బహద్దూర్ వారి తంత్రంపైనా, బౌద్ధమతంపైనా చాలా వ్యాసాలు వ్రాసినారు. ధమ్మపదాన్ని అనువదించినారు.

తత్త్వాన్ని అవిచ్ఛిన్నంగా ఉండేటట్లు అనేకమంది కృషిచేసినారు. సంస్థలు ఆశ్రమాలుకూడా ఇదేరకం కృషి చేస్తున్నాయి. మళయాల స్వాములవారు స్థాపించిన వ్యాసాశ్రమం చాలా గొప్పది. అలాగే కాకినాడ దగ్గర శంఖవరంలో స్వామి ఓంకార్ స్థాపించిన శాంతి ఆశ్రమంకూడా చాలా పెద్దది. మాసపత్రికలు కూడా తత్త్వప్రచారానికై కృషిచేయుచునే ఉన్నాయి. ముముక్షువు, శాంతి, గీతావాణి, ఆరాధన, శైవవాణి, మాధ్వ మహామండలివారు ప్రచురించే పత్రికలు-ఇవన్నీ రకరకాల తత్త్వాలను ప్రచారంచేస్తున్నాయి.

# తెలుగువారి సాహిత్యాభిరుచులు

శ్రీ రామవరపు సుబ్రహ్మణ్యశాస్త్రి

"వాచామాంధ్రమయీనాం యః
ప్రవక్తా ప్రథమో భవత్
ఆచార్యం తమ్ కవీంద్రాణాం
వందే వాగనుశాసనమ్ !"

పదకొండో శతాబ్దానికి పూర్వం కూడా తెలుగు భాషా పదజాలం శాసనాల్లో చెదురు మదురుగా వాడబడుతున్నా తెలుగుభాషా పదసంచయానికి సువ్యవస్థిత సుస్వరూపాన్ని కల్పించి గ్రంథస్థం కాదగిన దశ నిరూపించిన శబ్దశాసనుడు పరమపూజ్య నన్నయభట్టారకుల వారికి తెలుగు సాహితీ జగత్తు శాశ్వత నివాళులర్పిస్తున్నదని 'యువభారతి' తన మధుర హృదయ వీణానాదంలో స్పందింప జేస్తోంది.

అలనాటి పదకవిత్వంతో, పాటలతో ప్రారంభమై ఆంధ్రసాహితీ జీవన వాహిని నన్నయనుండి నేటిదాకా తెలుగు దేశాన్ని, తెలుగు జాతిని పునీతం చేస్తూ అనుస్యూతంగానే ప్రవహిస్తోంది. ఇన్ని సంవత్సరాలుగా ఆయా యుగాలలో ఆయా కవికుమారులు ఛందోబంధాలలో అలంకారాలలో కట్టబెట్టిన పట్టుసెల్లాలతో రంగారిన తెలుగు సాహితీ వధూటి పాతకాలపు టాభరణాలను విసర్జించి క్రొమ్మెఱుగు భూషణాలను సంతరించుకుంటూ వస్తోంది. ఆధునిక యుగంలో అతివేల సాహితీ ప్రక్రియలతో ఆదిశక్తిగా సహస్ర కిరణ కాంతులతో స్వతంత్ర తెలుగుజాతి జీవనాడిలో వెలుగు వెల్లివిరుస్తోంది.

స్వాతంత్ర్యానికి పూర్వం జాతి సమరాంగణంలో నిలిచి ఉన్నపుడు తెలుగువాడి సాహితీ వైతాళిక గీతమాలపించి తెలుగువారి గుండెల్లో దేశభక్తిని నింపి జాతిని ప్రబోధించింది. అప్పుడే అనేకుల హృదయాల్లో భావజ్యోతి రగిలింది - భావనా పటిమ పెరిగింది-సమైక్యతా దృష్టి సచేతనమైంది. ఆనాడు రవీంద్ర కవీంద్రుని కవితా శక్తి తెలుగుజాతి కవితావ్యక్తికి మార్గదర్శకమైంది. దేశభక్తి, జాతి ప్రబోధం, సంఘ సంస్కరణా నాటి సాహితీ ప్రక్రియలకు ఉపాదేయాలు కాగా ప్రతి హృదయం కదిలింది-ప్రతి మనసు కవినింది-

అపుడే ఆంగ్ల సాహిత్య పరిచయంతో అలవడిన భావకవిత్వం కూడా తెలుగు సాహితీ రంగంమీద దేవులపల్లి మొదలగు వారి ఆసరాతో గజ్జెకట్టింది. అయినా రాయప్రోలు, గురజాడ, కందుకూరు లాంటి సాహితీ సుగతులు సామాజిక పరిస్థితులకు వలసిన బాధ్యతల వహించి నిర్వర్తించిన కర్తవ్య పరాయణత్వం చరిత్ర ప్రసిద్ధమైంది.

మనదేశంలో ఆంగ్లేయుల అస్తమయంతో ఉదయించిన స్వాతంత్ర్య దీప్తులు ప్రసరించగనే తెలుగు సాహితీపరులలో కొందఱు సంతృప్తిగా ఆనందోత్సాహాలతో పడక కుర్చీల్లో మేనువాల్చడం జరిగింది. మరి కొందఱు తెలుగువాడి స్వాతంత్ర్యం " లేటు " అయినందుకు విచారించి నిజమయిన స్వాతంత్ర్యం సిద్ధించేదాకా నిద్రపోకూడదని ప్రబోధించడం జరిగింది. దేశానికి 1947లో స్వాతంత్ర్యం వస్తే తెలుగు వారి స్వతంత్ర రాష్ట్రం 1953 లో గాని అవతరించలేదు. తెలుగువాడు స్వరాష్ట్రం కోసం మిక్కిలి కృషిచేయడం ప్రారంభించాడు అప్పుడే అభ్యుదయ రచయితల సంఘం, నవ్య సాహిత్య పరిషత్తు, తెలంగాణ రచయితల సంఘం మొదలగు సాహితీ సంస్థలు తెలుగు సాహితీ స్రవంతిని ప్రజల్లోకి ప్రవహింపజేశాయి. దీనితో తెలుగు వారి సాహిత్యాభిరుచులు క్రొత్తపుంతలు త్రొక్కనారంభించాయి. చెలం గారి స్వేచ్ఛా ప్రణయానికి చెలియలి కట్టలు నిర్మించారు విశ్వనాథవారు. స్వాతంత్ర్యానికి పూర్వం బీజప్రాయంగా ఉన్న విభిన్న సాహిత్య సిద్ధాంతాలు స్వాతంత్ర్యానంతరం అంకురితములై, పల్లవితములై పుష్పితములై వర్ధిల్లసాగాయి.

జాతి జీవితం సనాతనధర్మంపై నడవాలనే సనాతనవాదులూ, ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధనాఫలితాల కనుగుణమై నవీన జీవన పద్ధతి కలిగి ఉండాలనే అభ్యుదయ వాదులూ రచనలు సాగించారు. ఈ కాలంలో తెలుగువారి అభిరుచులు చలనచిత్రాలు, రేడియో, వార్తాపత్రికల ప్రభావానికి సామ్యవాద సిద్ధాంత ప్రోద్బలానికి అధికంగా ఆకర్షింప బడ్డాయి. రెండవ ప్రపంచ యుద్ధానంతర పరిస్థితులలో అధునిక యూరపు దేశాల నాగరికత భరత జాతిపై చూపుతున్న ప్రభావం తెలుగువాడి నాగరికతాభిరుచులపై కూడ విశేషంగా కలిగి ఉంది. ఈ ప్రభావాలను సాహిత్యంలో ప్రతిబింబించకుండ ఏ రచయితా ఉండలేదు. దీనికి తోడు రేడియోలు, వివిధ వార్తా పత్రికలు, చలన చిత్రాలు తెలుగువారి అభిరుచుల్ని శరవేగంతో మార్చివేశాయి- తత్ఫలితంగా ప్రేక్షణీయమైన దృశ్యనాటకాల స్థానంలో శ్రవ్య నాటకములు, నాటి

కలు, కథలు, కథానికలు కాక స్కెచ్‌లు, సమీక్షలు, బాలగేయాలు, డిటెక్టివ్ నవలలు, శృంగార సాహిత్యం బహుళవ్యాప్తిలోకి వచ్చాయి. స్వేచ్ఛాప్రియత్వం, విశృంఖలత్వం, తిరుగుబాటు మొదలగు సిద్ధాంతాలు సాహిత్యంలో చోటు చేసికొని నేటి తెలుగువారి భావాలకు ప్రతీకగా నిలుస్తున్నాయి.

ఈ తరుణంలో సనాతనవాదులయిన సంప్రదాయ సాహితీవరులకు విశ్వనాథవారు నాయకత్వంవహిస్తే అభ్యుదయ వాదులకు శ్రీశ్రీ యుగపురుషుడని చెప్పొచ్చు. సనాతనవాదులు ఛందస్సుల బందోబస్తుతో అలంకార శాస్త్ర సామగ్రితో రాయలనాటి పద్య గద్య ప్రబంధాలనే ఇంచుమించు అదే వస్తువులతో సాహిత్యం ఉత్పత్తి చేస్తున్నారు. ఇందులో కొందఱు వస్తువులో మాత్రం నవ్యత్వం స్వీకరించి గద్య పద్య ప్రబంధాలనే సృష్టిస్తున్నారు. వీరిధోరణి

"పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవమిత్యవద్యం
సంతః పరీక్ష్య అన్యతరత్ భజన్తే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

అన్నట్లు ఉంటుంది. ఇట్టివారు వస్తువులోను సన్నివేశములోను మార్పునకు అంగీకరిస్తారేగాని చెప్పే విధానం మాత్రం ప్రాచీన ఛందోలంకార పద్ధతినే అనుసరిస్తారు. విశ్వనాథ, గడియారం, మధునాపంతుల, వానమామలై, తుమ్మల మొదలగువారు యీ కోవకు చెందినవారు.

ఇక రెండో కోవకు చెందిన వారిలో శ్రీశ్రీ అగ్రనాయకుడు. ఆరుద్ర, నారాయణ బాబు, బాల గంగాధర తిలక్, దాశరథి, కాళోజి, వరవరరావు మొదలయినవారు అభ్యుదయ వాదులు-వీరు ఆధునిక విజ్ఞానశాస్త్ర ఫలితాల దృష్ట్యా ప్రాచీన దురాచార దురంతాలను నిగ్గు దేల్చి మంచిని స్వీకరించి చెడును పరిత్యజించి, అభ్యుదయకర విధానాలను సాహిత్యంలో ప్రతిబింబించి ప్రాచీన ఛందోలంకార శాస్త్ర పరిష్వంగాలను వదలి విశృంఖలంగా

"పడిగా, పడిపడిగా
వెలువడియై పరుగిడియై
యెదలో ఆడుగిడి"

నట్టి భావాలకు రూపమిచ్చి తెలుగుజాతి సాహితీ "మహాప్రస్థానా"న్ని వెలయింపజేస్తున్నారు. ఇందుకు నిదర్శనం మహాప్రస్థానంతోబాటు "మహాంధ్రోదయం",

"అమృతం కురిసినరాత్రి" మున్నగు రచనలు పేర్కొనవచ్చు ఇంతే గాక యితర ప్రక్రియల్లోకూడ సంప్రదాయవాదులూ అభ్యుదయవాదులూ అనేక రచనలు చేస్తున్నారు. అనువాదాలతో ప్రారంభమైన నాటక సాహిత్యం పౌరాణిక, చారిత్రక నాటకాలనేగాక సాంఘిక నాటకాలను గూడ వెలయించి తెలుగునాట నాటకాభిరుచిని యినుమడింపచేసింది. పద్యాలతో గూడిన నాటకాలేగాక కేవల వచన నాటక నాటికలను చూడ్డానికి ఉవ్విళ్ళూరేట్టు ప్రజల యొక్క అభిరుచుల్ని మలిచింది. పాండవోద్యోగ విజయాలనుండి 'మా భూమి' 'ముందడుగు' 'కులం లేని పిల్ల', 'N. G. O.' దాకా నాటక సాహిత్యం అభివృద్ధి చెందుతూ వచ్చింది.

నవలా సాహిత్యంలో బహుధా రచయిత్రుల సంఖ్య పెరిగి కేవల కుటుంబ కథలు, విభిన్న మనస్తత్వ చిత్రీకరణతో ప్రధానంగా ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. కథాసాహిత్యంలో పెద్ద కథలు, చిన్న కథలు, సాంఘిక యితివృత్తం ఆధారంగా రచింపబడు తున్నాయి. ఇటీవలి కాలంలో "ముత్యాల సరాల" మూసలో మాత్రా ఛందస్సులో ప్రారంభమైన గేయం తుదకు వచన గేయంగా పరిణామం చెందింది. వచన పద్యాలవలె వచన గేయాల సంపుటులు మేటవేసుకు పోతున్నాయి. మాత్రా ఛందస్సుతో రచింపబడిన గేయాలు కొన్ని నియమాలకు, నిబంధనలకు, సంప్రదాయానికీ, కట్టుబాట్లకు లొంగి ఉండడం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు గొడ్డలిపెట్టుగా తలంచి కొందఱు నవ్యులలో నవ్యులు వచనగేయ కవితలు సాహిత్యంలో ప్రవేశ పెట్టారు. స్వాతంత్ర్యానికి పూర్వం గిడుగువారు ప్రారంభించిన భాషా సంస్కరణోద్యమంలో నుంచి వ్యావహారిక భాషా ప్రయోగం బహుళ వ్యాప్తిలోకి వచ్చినా ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నా గ్రాంథికవాదులు యింకా వ్యావహారిక భాషా వాదాన్ని ఎదిరించడం చెప్పుకోదగిన ఒక విచిత్ర పరిస్థితి. అభ్యుదయవాదుల్లో సుండే దిగంబర, విప్లవ రచయితలుగా కొందఱు బయలు దేరారు.

సమాజంలో ఉన్న కళ్మలాన్ని మర్మంలేకుండా, ముసుగులేకుండా బాహాటంగా ప్రక్షాళన చేస్తూ సామాజికుడ్ని విప్లవంవైపు ఉద్రిక్త పరచడం దిగంబర కవుల లక్ష్యం. వీరికి భాషా సౌందర్యం, శబ్ద శబలత, సుకుమార భావ ప్రకటనకూడ అనవసరం. ఉన్నదున్నట్టు చిత్రించడమే వీరి ధ్యేయం. వీరికి వరంగల్లు, విశాఖపట్నం, హైద్రాబాద్ ముఖ్య కేంద్రాలు. డా. సుప్ర

సన్నాచార్య, వరవరరావు, చెరబండరాజు, నిఖిలేశ్వర్, నగ్నముని మొ. వారు ప్రసిద్ధులు

ఇటు పిమ్మట కొందఱు అభ్యుదయవాదులు సమాజంలో విప్లవ చైతన్యం ప్రజ్వలింప జేయాలనే ధ్యేయంతో విప్లవ రచయితల సంఘంగా విడివడి ప్రత్యేక సాహిత్యాన్ని సృజిస్తున్నారు. ఈ వి. ర. సం. వారికి శ్రీ శ్రీ నాయకుడైతే అ ర. సం. వారికి ఆరుద్ర, దాశరథులు నాయకత్వం వహిస్తున్నారు. ఇటీవల వి. ర. సం. వారిలో ఒకడైన కొడవటిగంటి వారి "ఇపుడు వీస్తున్న గాలి" అనే పుస్తకాన్ని ప్రభుత్వం నిషేధించి ప్రతులను స్వాధీనం చేసికొంది.

కావున ఏ సాహిత్యం ఎన్నాళ్లు మన గలుగుతుందో ఏ గ్రంథం ఎంత కాలం జీవిస్తుందో ప్రజాభిరుచులే నిర్ణయిస్తాయి. ఏది ఏమయినా Mathew Arnold చెప్పిన "నిత్య పల్లవ శీలమైన సాహిత్యం మోడువారదు" అన్న వాక్యం తథ్యం. జాతి ఉన్నంతకాలం సాహిత్యం చిరస్థాయిగ మనగలదు. లోకకళ్యాణంకోసమే సాహిత్యం. "సహితస్య భావః సాహిత్యం". జాతి సంక్షేమాన్ని సంపూర్ణంగా సాహిత్యంతో సమాయత్తపరచి తెలుగుజాతి పురోభివృద్ధికి యితోధికంగా సాహిత్య సేవతో ఎనలేని కృషి చేస్తున్న తెలుగు సాహితీ సమితి, సాహిత్య అకాడమీ, ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తెలుగు భాషా సమితి, యువభారతి మొదలగు సహృదయ సాహితీ సంస్థలను తెలుగువారు మరువలేరు– ఇన్ని ఆలంబనలతో తెలుగువారి సాహిత్యాభిరుచులు మరింత సుదృఢమవాలనీ దానితో సాహిత్య సురుచిర నవరత్నాలతో తెలుగు సారస్వతసౌధ నిర్మాణం శోభాయమానంగా జరగాలని ఆశిస్తున్నా–

*'శుభమితి'*

*"కవితా యద్యస్తి రాజ్యేన కిమ్ ః"*

# సమకాలీన ప్రసిద్ధభాషాసాహిత్యాలు-తెలుగు

డా. కొత్తపల్లి వీరభద్రరావు

మానవుడి జీవితంలో అన్ని రంగాలమీద తన ప్రభావాన్ని చూపించిన ఇరవయ్యో శతాబ్ది ముఖ్యలక్షణం, దేశాలమధ్య ప్రజలమధ్య దూరాలు తగ్గిపోవడం. ఈ శతాబ్దిలో మానవుడు సాధించిన సాంకేతిక విజయాలవల్ల ఇది సాధ్యమయింది. దీనివల్ల భావప్రసరణం బాగాజరిగి, ప్రపంచంలో నాలుగు మూలల్లో ఉన్న మనుష్యులు వివిధ దేశాలలో ప్రచారంలో ఉన్న ఉద్యమాల్ని గురించి తెలుసుకోవడానికి అవకాశం లభించింది. ఈ అవకాశ ప్రభావం కళాసాహిత్యరంగాలలో, రాజకీయార్థిక రంగాలలో-ప్రపంచంలో ప్రతి దేశంలోను-స్ఫుటంగా కనబడుతుంది. అయినా కాకిపోయినా, "యెల్ల లోకము వొక్కయిల్లై" వర్ధిల్లాలని కవులు ఆశించడానికి, "లోకమంతయు యేకమై'' రాజ్యాధికారాదుల్ని చక్కబెట్టుకోవాలి అని రాజకీయ వేత్తలు ప్రయత్నించడానికి, వీలు చిక్కింది.

సాహిత్య రంగంలో ప్రపంచభాషా సాహిత్యాల ప్రభావం తెలుగు సాహిత్యం మీద ఎంత వరకూ పడిందో సంపూర్ణంగా వివరించాలి అంటే అనేక సంపుటాలు వ్రాయవలసి ఉంటుంది. అదిగాక, ఆ పని ఏ ఒక్క వ్యక్తి చేపట్ట వలసిందీకాదు. అయితే, ప్రపంచ సాహిత్యాల్ని తీర్చిదిద్దిన ఉద్యమాలు, తాత్త్విక దృష్టులు తమ ప్రభావాల్ని ఏ విధంగా ప్రసరింప జేశాయో, ఆ ప్రసరణ తెలుగు సాహిత్యం విషయంలో తెచ్చిన పరివర్తనల్ని కొంతకు కొంత పరిశీలించవచ్చు. ఇక్కడ కూడా తెలుగు సాహిత్యాన్నంతనీ అవలోడనంచేసి చూడాలంటే అయ్యే పనికాదు. తెలుగు కవిత్వం మీద వివిధ ఉద్యమాల ప్రభావం ఎలా పనిచేసిందో, చేస్తుందో దిఙ్మాత్రంగా చూపించడం ఇక్కడ నా ఆశయం.

సాహిత్యం మీద ప్రభావాన్ని చూపించే ఉద్యమాల్ని స్థూలంగా— రాజకీయ ప్రాతిపదికమీద ఆధారపడినవనీ, శిల్ప సంబంధమైన ప్రాతిపదిక మీద ఆధారపడినవనీ-విభజించవచ్చు. ఈ రెండింటికి వెనక తత్త్వచింతన ఉంటుంది. తాత్త్విక దృష్టిలో వచ్చిన మార్పు రాజకీయ భావాల్నే మార్చివేసి

నూతనమైన ఆర్థిక విధానాల్ని. సామాజిక రీతుల్ని ఆయా దేశాలలో ప్రవేశ పెట్టుతుంది ఈ మార్పులు ఆ దేశవాసుల జీవితంలో సమస్త రంగాలలోను వచ్చేవే. ఈ విధంగా వాళ్ల సాహిత్యాలలో మార్పు వస్తుంది. నవ్య దృష్టి ప్రచలితం అవుతుంది. ఈ విధంగా మార్పు తీసుకొని వచ్చిన ప్రధాన తాత్త్విక దృష్టి మార్క్సు భావాల ప్రాతిపదికమీద ఆధారపడినది. దీని ప్రభావం-అను కూలంగాగాని, వ్యతిరేకంగాగాని-సోకని సాహిత్యమనేది నేటి ప్రపంచంలో లేదంటే సత్యదూరంకాదు. అయితే, ఈ దృష్టి భిన్నభిన్న దేశాలలో భిన్నభిన్న రీతుల్లో ప్రసరించింది. అన్ని సాహిత్యాలలోను అన్ని దేశాలలోను ఒకే పద్ధతిలో దీని ప్రభావం కనబడదు. దీని అవగాహన విషయంలోనూ అభిప్రాయభేదాలు ఉన్నాయి.

ఇంక శిల్ప సంబంధమైన ప్రాతిపదిక మీద ఆధారపడిన ఉద్యమాల్ని గ్రహించాలి. వీటిలో మొట్టమొదటిది కాల్పనికోద్యమం (Romantic movement). దీని వెనకకూడ, ఇదివరకే నేను చెప్పినట్లు, తాత్త్వికచింతనఉంది. పంధొమ్మిదో శతాబ్దిలో పాశ్చాత్య సాహిత్య ప్రపంచాన్ని-ఇంచుమించుగా మొదటి యాభై సంవత్సరాలూ-ఈ ఉద్యమం ఏలింది. దీనికి వ్యతిరేకంగా బయలుదేరిన ఉద్యమాలికి కూడా ఇదే ప్రోత్సాహకారి. మొట్టమొదట జర్మనీలో బయలుదేరిన ఇది, ప్రపంచం అంతా వ్యాపించింది. ఇంగ్లీషు కాల్పనిక కవులలో—కీట్స్, షెల్లీ, బైరన్, కోల్‌రిడ్జి, వర్డ్స్‌వర్త్ మొదలైన వారు—మనకి పరిచయమే.

'రొమాంటిసిజమ్' తరవాత 'రియలిజమ్' (Realism) పాశ్చాత్య సాహిత్యాలలో రాజ్యం చేసింది. దీనికి ప్రారంభం ఫ్రాన్స్‌లో జరిగిందనీ ప్రారంభకుడు స్టెందాల్ (1783-1842) అని విమర్శకులంటారు. తరవాత బాల్‌జాక్ (1799-1850) భాషలోను భావంలోనూ కూడా ఈ విధమైన రచనలు ఫ్రెంచి భాషలో చేసే ఈ ఉద్యమానికి ప్రచారం తెచ్చాడు. ఇంగ్లీషులో ఈ ప్రభావం డికెన్స్‌తో ప్రారంభం అయి, థాకరీ (1811-1863) లో వికాసాన్ని పొందిందని విమర్శకుల ఊహ. అయితే. ఈ పద్ధతి ననుసరించి అత్యుత్తమ నవలలు వ్రాసినవారు తుర్గెనీవ్ (1818-1883, దాస్తవిస్కీ (1821 1881), టాల్‌స్టాయ్ (1828-1910) అనే రష్యా దేశస్థులు.

క్రమక్రమంగా ఈ ఉద్యమం మార్పు పొందుతూ వచ్చి 'నాచురలిజమ్' (Naturalism) గా పరిణతి పొందింది. ఫ్రాన్స్‌లో దీన్ని ప్రారంభించి

నడిపిన కీర్తి జోలా (1840-1902)కి దక్కింది. దీనికి జర్మనీలోను, బ్రిటన్ లోను కూడా ప్రోత్సాహం లభించింది ఇంగ్లీషులో టామస్‌హార్డి (1840-1924) ఈ రకమైన రచనలు చేశాడు. అయితే, అమెరికాలోను బ్రిటన్‌లోను జర్మనీ లోను నాచురలిజమ్‌ను ప్రదర్శించే అత్యుత్తమ రచనలు ఇరవయ్యో శతాబ్దిలో వచ్చాయి అని విమర్శకుల ఊహ.

ఈ ఉద్యమాలతో బాటు, పంధొమ్మిదో శతాబ్దిలోనే బయలుదేరి విశేష ప్రచారాన్ని పొందుతూవచ్చినఇంకో ఉద్యమం 'సింబలిజమ్' (Symbolism). ఫ్రాన్స్‌లో ఈ ఉద్యమం బాగా కొనసాగింది. ఫ్రెంచి భాషలో మలార్మే (1842-1898), వెర్లైన్ (1844-1896) మొదలైన వారు దీనిలో ఉత్తమకవులు, ఈ ఉద్యమాల ప్రభావం కింద వివిధ సాహిత్య ప్రక్రియలలో రచనలు బయలుదేరినా, ఒక్కొక్క ఉద్యమం కింద ఒక్కొక్క ప్రక్రియ విశేష ప్రాచుర్యాన్ని పొందింది. 'సింబలిజమ్' ప్రభావం కింద కవిత్వం ప్రాచుర్యానికి వచ్చినట్లే, 'రియలిజమ్' కింద నవల ప్రచారంలోకి వచ్చింది.

ఈ ఉద్యమాలన్నీ ఇలా ఉండగా, పంధొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థం లోను ఇరవయ్యో శతాబ్ది-పూర్వార్థంలోను ముఖ్యంగా 1920 కి ముందు అనేక మనో విజ్ఞాన సంప్రదాయాలు (Schools of Psychology) బయలుదేరి, మానవుడి ప్రవర్తనని వివిధ దృక్పథాలనుంచి విశ్లేషించడం ప్రారంభించాయి. మనోవిశ్లేషణానికి మూల పురుషుడు సిగ్మండ్ ఫ్రాయిడ్ (1856-1939) దీని ప్రభావం సాహిత్యంలో కూడా కనబడుతుంది. ఈ ప్రభావం కింద బయలు దేరిన సాహిత్య రూపాలే - ఒక్కొక్కప్పుడు వికటరూపంతో దర్శనమిచ్చే- సర్రియలిజమ్, డాడాయిజమ్ మొదలైనవి. ఇవేకాక, చైతన్య స్రవంతిని ప్రదర్శించే ఉత్తమ రచనలకు కూడా మనోవిజ్ఞానశాస్త్ర ప్రగతి కారణం. ఈ విధంగా ప్రపంచ సాహిత్యంమీద, వివిధ విధాలైన ఉద్యమాల భావాల ప్రభావం అడుగడుగున కనబడుతుంది. ఈ ప్రభావాలన్నీ మెల్లిమెల్లిగా భారత సాహిత్య ప్రపంచంమీద ప్రసరించి, ఇక్కడ కూడా మార్పుల్ని తీసుకొని వచ్చాయి

మొట్టమొదట్లో ఈ మార్పులు రావడం ఆలస్యమయింది. ఉదాహరణగా కాల్పనికోద్యమాన్ని గ్రహించవచ్చు. పాశ్చాత్య ప్రపంచంలో 1850 నాటికి కాల్పనికోద్యమం చప్పబడి పోయింది. అప్పటికే ఇంగ్లీషులో, వర్డ్స్‌వర్త్ తప్ప మిగిలిన ప్రఖ్యాత కాల్పనిక కవులందరూ కాలం చేశారు. కాని, తెలుగులో

ఈ ఉద్యమ ప్రభావం ఇరవయ్యో శతాబ్ది మొదటి మూడు దశకాలలోనే విజృం భించింది. మన కాల్పనిక కవులందరూ అప్పుడు ప్రారంభించి వ్రాసినవారే. ఇదే స్థితి హిందీ మొదలైన సాహిత్యాలలోనూ కనబడుతుంది. ఒక్క వంగ సాహిత్యంలో మాత్రం కొంచెం ముందునుంచీ ఈ ప్రభావం కనబడుతుంది. అక్కడయినా, ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలోనే దీని విజృంభణ

కాని, తరవాతరవాత- వార్తా ప్రసారసాధనాలు అధికం కావడంతో, రెండో ప్రపంచ సంగ్రామ కాలంనుంచి, విదేశాలలో బయలుదేరిన ఉద్యమాలు తొందర తొందరగా మనకి అందడం మొదలైంది దేశ స్వాతంత్ర్యంకోసం చేసిన పోరాటంవల్ల ప్రజలలో నవీన రాజకీయభావాల ప్రసారమూ అధికమ యింది. దీనితోబాటు పాశ్చాత్య దేశాలలో మార్క్సు సిద్ధాంతాల్ని ఆచరణలో పెడుతున్న వివిధ దేశాల సాహిత్యాలతో విధానాలతో మనకి సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఇది మొదట్లో రష్యాకు మాత్రమే పరిమితమైనా, తరవాత తూర్పు యూరప్ దేశాలతో చైనాతోకూడా సంబంధం ఏర్పడింది. ఈ ప్రభావాలవల్ల మన భారతీయ సాహిత్యాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. హిందీలో ప్రేమ్‌చంద్ మొదలైన రచయితలు బయలుదేరినట్లే మన తెలుగు లోనూ వాస్తవికత గూడుకట్టుకొన్న రచనలు బయలు దేరాయి.

ఈ ప్రభావం కిందనే అభ్యుదయ రచయితల ఉద్యమం మన తెలుగు దేశంలో ప్రారంభం అయింది. తెలుగులో బయలుదేరిన కాల్పనికోద్యమాన్ని నవ్యసాహిత్యోద్యమం అనవచ్చు. ఆనాడు నవ్యసాహిత్యపరిషత్తు దీనికి నాయ కత్వం వహించింది. తెలుగులో కాల్పనిక కవులుగా పేరు పొందిన వారంతా- రాయప్రోలు, కృష్ణశాస్త్రి, విశ్వనాథ ప్రభృతులు దీనితో సంబంధం ఉన్నవాళ్లే. నవ్యసాహిత్యోద్యమానికి గిడుగువారి వ్యావహారిక భాషావాదం చాలా సాయ పడింది అంతకి ముందు వీరేశలింగం పంతులు, వెంకటరత్నం నాయుడు మొదలైన వారంతా చేసిన సంఘసంస్కరణ కృషికూడా ఈ ఉద్యమానికి సాయపడింది గురజాడ రచనలు వ్యావహారిక భాషకి గౌరవాన్ని పెంచాయి. క్రమ క్రమంగా ఈ ఉద్యమం సన్నగిల్లింది. దీనికి తగిన 'సామాజిక దృక్పథం' లేకపోవడమే ఈ క్షీణతకి కారణం అన్నారు విమర్శకులు.

దీని తరవాత అభ్యుదయ సాహిత్యోద్యమం బయలుదేరింది. ఇది భారత దేశంలోని మిగిలిన భాషలలోనూ బయలుదేరినదే. పేర్లల్లో మార్పులుంటాయి అంతే. వంగ దేశంలో ఠాకుర్‌కి వ్యతిరేకంగా బయలుదేరిన ఉద్యమం ఇలాంటిదే.

అభ్యుదయ రచయితల ప్రభావం కింద—గురజాడ, గిడుగు, కందుకూరివారికి. అంతకి పూర్వంలేని స్థానం లభించింది. నవ్యసాహిత్యోద్యమంలో ఉన్న వారు. వీరిని గౌరవించినా దృష్టిలో వారికీ అభ్యుదయోద్యమంలో ఉన్న వారికీ కొంత భేదం ఉంది. అభ్యుదయోద్యమంలో ఉన్నవారిలో చాలా మంది మీద మార్క్స్ ప్రభావం ఉంది. లేని వారూ దానిలో ఉన్నారనుకోండి. ఈ ఉద్యమంలో ఉన్న చాలా మందికి-రాజకీయ విషయాలలో, సామాజిక విషయాలలో, సాహిత్య విషయాలలో కొన్ని నిర్దిష్టమైన భావాలు ఉండేవి. కాల్పనిక కవుల తరవాత దేశంలో నేడు పేరు ప్రఖ్యాతులు పొంది ఉన్న శ్రీ శ్రీ ప్రభృతులు దానిలో ఉన్నవారే.

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత స్థిరపడిన కవితా పరిస్థితులు, ఇతర విషయాలు నచ్చక, దిగంబర కవుల ఉద్యమం బయలుదేరింది. వీరికో తిరుగుబాటు ఉన్నంతగా సృష్టిలేదని విమర్శకులంటారు. మన తెలుగు దేశంలో వచ్చినట్లే మార్పులు హిందీ, వంగ, పంజాబ్ మొదలైన భాషాసాహిత్యాలలోనూ వచ్చాయి. ఒక మూల ఈ మార్పులు, ఇంకో మూల ఈ మార్పులులేని పరిస్థితి మనకి కనబడతాయి

ఇప్పుడు మన తెలుగు దేశంలో విప్లవ రచయితల రచనలు కనబడుతున్నాయి. అభ్యుదయోద్యమంలో ఉన్న శ్రీ శ్రీ ప్రభృతులు కొందరూ, దిగంబర కవులు కొందరూ ఈ రచనలు చేస్తున్నారు. ఈ రచనలకు కొన్ని కొన్ని రాజకీయాభిప్రాయాలు, సాంస్కృతిక విశ్వాసాలు మూలకందం, పరిణామశీలత జీవలక్షణం, సాహిత్యం జీవుల సృష్టి గనక మార్పులు కనబడడం సహజమే. ఏమార్పులు, ఎంత వరకూ గ్రాహ్యాలో నిర్ణయించడం ప్రజలే చేస్తారు. ఇది కాలం చేసేపని. ఇప్పుడు మన తెలుగు సాహిత్యంలో ఉద్యమాలు ఈ విధంగా నడుస్తున్నాయి. వాటి ప్రభావం అడుగడుగునా కనబడుతూనే ఉంది. అయితే, ఈ మార్పులకు లోనై రచనలు చేస్తున్నవారి సంఖ్య చాలా పరిమితంగా ఉంది. సాహిత్యరంగంలో బయలుదేరుతున్న సంచలనాల్ని చిత్రించేటప్పుడు, ఎక్కువ ప్రభావం చూపే వాటిని, పరిమితమైన వాటినీ కూడా చూపించడం విమర్శకుని కర్తవ్యం. విరసం కవుల దృష్టిలో సమన్వయమనేది కుదరదు. కొత్త పాతల కలయికే-అదిమేలైనా, ఏదైనా-లాభం లేదు. కొంత స్తబ్ధత వహించి ఉన్న సాహిత్యరంగంలో వీరి భావాలు సంచలనాన్ని

తెచ్చి ; కవులు, సహృదయులు సాహిత్యరంగాన్ని సింహావలోకనం చేసే టట్లు చేశాయి.

ఈ కవుల సరసనే, "కొత్త పాతల మేలు కలయిక" చేసి, జనాదర ణాన్ని పొందుతూ ఉన్న నారాయణరెడ్డి, దాశరథి ప్రభృతులైన కవులూ ఉన్నారు.

ఈ విధంగా, సమకాలీన ప్రసిద్ధ భాషా సాహిత్యాల్ని ప్రభావితంచేస్తున్న భావపరంపరల ప్రసరణాన్ని తానూ పొందుతూ, తెలుగు సాహిత్యం-ముఖ్యంగా కవిత్వం-పురోగమిస్తోంది. ఏ సాహిత్యమైనా, తనసాహిత్యధర్మాన్ని విడిచి పెట్టనినాడే, పురోగమిస్తుంది. విశ్వశ్రేయస్సుకి తోడ్పడుతుంది.

# తెలుగుసాహిత్యం-మార్క్సిజం ప్రభావం

శ్రీ కె. వి. రమణారెడ్డి

"స్వతంత్ర భరతవర్ష వాస్తవ్యుడా మానవుడు
అర్ధనగ్నంగా ఆకాశాన్నే కప్పుకొని
నిండని కడుపులో మండుతూన్న కళ్ళతో
ఇలా ఎంతకాలం ఇంకా నిలబడతా డా ప్రాణి?
అతణ్ణి జాగ్రత్తగా చూడండి
స్వతంత్ర భారత పౌరుడు,
అతని బాధ్యత వహిస్తామని
అందరూ హామీ ఇవ్వండి.
అతని యోగక్షేమాలకు
అంతా పూచీ పడండి,
అతికించండి మళ్ళీ
అతని ముఖానికి నవ్వు!
స్వాతంత్ర్యం ఒక చాలా సున్నితమైన పువ్వు,
చాలా వాడైన కత్తి, విలువైన వజ్రం,
స్వాతంత్ర్యం తెచ్చే వెన్నెన్నో బాధ్యతలు
సామర్థ్యంతో నిర్వహిస్తామని సంకల్పం చెప్పుకుందాం."

స్వాతంత్ర్యం వచ్చింది సౌఖ్యం రాలేదు. "ముివ్వన్నెలజెండా పండుగ" మూన్నాళ్ళ ముచ్చట అయింది. అంతేకాదు ఇల్లు అలకగానే పండుగకాదనే విషయం 1947 మొదలు 1972 వరకు స్వతంత్ర భరతవర్ష వాస్తవ్యులకు స్వానుభవానికి వస్తూనే ఉంది. కోటానుకోట్లమంది మనుషుల ముఖాలకు సహజమైన నవ్వు ఇంకా అతుక్కోవలసే ఉంది. స్వాతంత్ర్యం రాజకీయాధికారాన్నీ ఆర్థికాధికారాన్నీ, సంఖ్యలో అల్పవర్గానికి మాత్రమే దఖలు పరిచింది. పాలకవర్గంలో వచ్చిన ఈమార్పు పాలితులలో అట్టడుగు వరకు దిగబారేందుకు మరెన్ని రజతోత్సవాలు జరగాలో? ఈ కొరత, ఈ వెలితి, మన స్వతంత్ర

జీవనాన్ని 'మేడిపండు'గా మారుస్తూందని మార్క్సిస్టు ప్రభావానికి లోబడని బుద్ధిజీవులుకూడా అనుకోకతప్పలేదంటే, మార్క్సిస్టు ప్రభావానికి లోనైనవాళ్ల మాట చెప్పడమెందుకు?

కరి మింగింది వెలగపండు,
కాదు కాదంటే పోనిండు
మన స్వతంత్రం మేడిపండు
మన దరిద్రం రాచపుండు.

ఈ మాటలనింది ఆరుద్ర ఒక్కడే గాని ఆనాటి ఆరుద్ర యువకవుల్లో తన ప్రతిధ్వనులు వెదుక్కోగలిగేవాడు. తిలక్ కూడా అంతే. 1956 లో కూడా "ఆర్తి" పొందుతూ ఉన్నాడు. అది సౌధాంతాలకు పయనింపలేదు. రాజకీయ వేత్త గుండెలను స్పృశింపలేదు. భోగవంతుణ్ణి విచలింపజేసి భగవంతుడికి నివేదించుకోజాలని ఆర్తి. అందుచేత స్వాతంత్ర్య యుగోదయంకూడా సమాజంలోని అస్థిమితాన్నీ, రచయితలలోని ఆరాటాన్నీ తుడిచిపెట్టలేక పోయింది. తెలంగాణా రైతాంగం వెలిగించిన రక్తజ్యోతి కవుల, కథాకారుల, నవలా రచయితల కలాలు అయుధాలైనట్లు భ్రమగొలిపింది, కమ్యూనిస్టు ఉద్యమం కత్తితో నన్నీతో అద్భుతమైన ఒక అధ్యాయాన్ని రచించింది. దురంతం పాలైనాసరే, అది సాహిత్యంమీద చెరగని ముద్రను వెయ్యగలిగింది.

అగ్నిపర్వతం ఒకటి చల్లబడినట్లుగా అప్పటికే 'మహా ప్రస్థానం' ముగించి శ్రీశ్రీ పక్కకు తప్పుకొన్నాడు. 'అరుణోదయం' లాంటి నవలలు మళ్ళీ కుటుంబరావు కలంనుండి వెలువడకుండా వచ్చాయి. వచనమూ కవిత్వమూ ఇలా కొంతకాలం నాయకులు కనిపించని నాటక ఘట్టాల్లా బీదపడినట్లు అనిపించసాగింది. అయితే త్వరలోనే ప్రతిభావంతులైన కొత్త రచయితలు వచ్చి ఆలోటు పూరించారు. 'అల్లుల్లో మల్లు' అన్న సామెతగా, వీరిలో కొందరు ఆ గొప్ప రచయితల బుజాలవరకైనా ఎదిగిరాగలిగారు.

నైజాము నవాబుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటానికి ముందుగానే దేశ్ ముఖ్‌లనూ జాగీర్దార్లనూ ఎదిరించి తెలంగాణా గ్రామీణజనం కెరటాలు కెరటాలుగా తిరగబడి సాయుధ పోరాటం నడిపింది. ఒకటి కర్షకుల వర్గ పోరాటము, మరొకటి ప్రాంతీయ, లేదా ఉపజాతీయ తత్వంతోటి విద్యాధికులూ, నంపన్నులూ, వృత్తిజీవులూ, వగైరా నానావర్గాల జనం ఉమ్మడిగా జరిపింది. ఆంధ్ర జాతీయతావ్యక్తి దీన్ని రూపుదిద్దింది.

ఈ ఘర్షణ తెలుగు సాహిత్యానికి బాగా పనికి వచ్చింది. దాశరథి లాంటి కంఠీరవాలొకవంక, వట్టికోట ఆళ్వారుస్వామి లాంటి నిండుకుండ లింకొకవంక, నైజాము వ్యతిరేక పోరాటానికి సాహిత్యచిత్రణ చేశారు. ఇద్దరి లోనూ సామాన్య ప్రజల మూగకోరికలకు అక్షర రూపం ఇచ్చేశక్తి పుష్కలంగా ఉండేది. కవి కాబట్టి దాశరథిలో ఆర్భాటం నాటికీ నేటికీ ఎక్కువే. ఇది సహజం. పద్యాన్నైనా ఇష్టాధీనంగా పలికించగల శక్తి అతనిది. తాను 'ఉద్యమకవి'. ఆ ఉద్యమం వెనువెంటనే మరొక దశకు చేరుకొన్నప్పుడు కూడా ప్రారంభంలో దాశరథి రచనలు దానితోటి సమసించాయికూడా. అభ్యుదయ రచనోద్యమం ఏ కొత్త రచయితనీ స్పృశించకుండానైనా ఆరోజుల్లో వదల్లేదు. తమతమ అభిమానాలు ఏతెన్నులో ఉన్నా, మాటవరసగానైనా కవులు బీదాబిక్కి గురించి జాలీ, ఆకలిగురించి శోకం ప్రదర్శించేవాళ్లు. దాశరథి కూడా ఇలా కొన్ని మంచిరచనలే చేశాడు. జాతీయ "అహంకార దర్శనం"- రాయప్రోలునుండి దాశరథిదాకా సాగింది.

ఆళ్వారుస్వామి జాతీయవాదానికి మూలం ప్రజలు, ప్రజాజీవితం అతని రచనావస్తువు. ప్రజల మనుషులు అతని నాయకులు. అధికారులూ, ఖామందులూ అతని దుష్టపాత్రలు. పోరాటం అతని రచనల్లోని కథాక్రమం తాను మార్క్సిస్టో కాదో తెలియదుగాని, మార్క్సిజం ప్రభావం మాత్రం అతని భావలోకంమీద స్ఫుటంగా కనిపిస్తుంది. వాస్తవవాద దృక్పథం అతని 'ప్రజల మనిషి', 'గంగు' వగైరా నవలలకూ, గిర్దావరు రమణయ్య లాంటి కథలకూ, చాలా బలాన్నీ బటువునీ ఇస్తుంది.

అప్పుడు వెలువడింది సంవిధాన చాతుర్యం నిండారుతూ ఆరుద్ర త్వమేవాఽహమ్'. శ్రీశ్రీ పర్యవేక్షణలో మాత్రమే ఆరుద్ర కవిగా పెరిగి ఉంటే, ఈ కావ్యం కొరకరానికొయ్య అయిఉండేదికాదు. విజయనగరంలో చాగంటి, నారాయణబాబు, ప్లస్ శ్రీశ్రీ, డిటో ఆరుద్ర స్థాపిద్దామనుకొన్న "స్వజేశజం" అనే తెలుగు అధివాస్తవిక సాహిత్య సంప్రదాయం ఈ కావ్యాన్ని సోకింది. ఈ వరకే నారాయణబాబు మార్క్సుని ఫ్రాయిడ్‌తోటి అనుసంధానించి ఉన్నాడు. యుద్ధంవచ్చి శ్రీశ్రీనీ ఆరుద్రనీ తనవెంట దేశాలుగాకపోయినా పలుప్రాంతాలు తిప్పిన రోజుల్లో, ఆరుద్ర తన బ్రేక్‌ఫాస్ట్‌లో సాల్వడోర్‌డలీ వంటి చిత్రకారుల్నీ అనేక సర్రియలిస్టు రచయితల్నీ నంజుకొంటూవచ్చాడు. వతాభి చమత్కారాలనూ, శ్రీశ్రీ మిరియాలనూ నూరుకూ రంగరిస్తూపోయాడు.

వీటన్నిటికి పుట్టిన అబ్బురపాటు కలిగించేబిడ్డ "త్వమేవాఽహమ్". ఇందులో వైథాగరాస్‌సిద్ధాంతమేగాక కాలేజిలోనూ, హైస్కూల్లోనూ, ఇతరత్రానూ తనకు తెలియవచ్చిన విజ్ఞానశాస్త్ర విషయాలు కూడా పోగుబడ్డాయి. "ధ్వజంకొన నిరంతర సమధర్మం. చూస్తాం" 'అనే ముక్తాయింపుతో ముగించడంలోనేగాక, "వేదనాశకలం"లో నిర్వేదంగాక సామ్యవాదం సుదూర గగనతారగా నిలిచి ఊరిస్తుంది. "భూమిపయి దేవతల భూమి విహరించవలె"ననీ, లేమిగలవారల కామితాలు తీరవలెననీ కవి కోరుకొంటాడు. ఒక పునీతమైన నూతన వ్యవస్థ కోసం "వామపక్షవిధానాల"లో చరించమంటాడు.

కవిగా జన్మించినప్పటినుంచి ఆరుద్ర పోరాటాలకూ ఆరాటాలకు మననయ్యాడు. సాదా అభ్యుదయకవిలా ఎన్నో ప్రబోధ గేయాల్లాంటివి రాశాకనే తెలుగుమీరి 'త్వమేవాఽహమ్' రచించడం జరిగింది. ఆరుద్ర హృదయం గురించి ఏ అనుమానమూ లేకపోవచ్చుగాని అతని మేధస్సు చిత్ర మైనది. అది యుక్తులమారిది. 'వైచిత్రి'సిద్ధాంతం ముందుంచుకొని అదివెయ్యని గంతులంటూలేవు. "సంవిధానం" అనే మేధఃపరిశ్రమ కూడా ఆరుద్ర "త్వమేవాఽహమ్"తో బాటుగా "సినీవాలి"ని గూడా "హైబ్రో"గా నిలుపు తున్నది. కవిత్వలోకంలో ఎప్పటికప్పుడు మార్పుచెందే "ఫేషన్లు" ఆంధ్రీ కృతం కావడానికి ఆరుద్ర చాలావరకు బాధ్యుడు. దానికితోడు, వెనకటి రాజకీయ విశ్వాసాలు సడలుబాటు చూపేసరికి, వినోదంకోసం కొన్ని రచనలు చెయ్యక తప్పలేదు. అయినా ఆరుద్ర సాంఘిక దృక్పథం మూలంలో మార్క్సిజం ప్రభావం బలీయమే అనాలి. "సినీవాలి"కి సామాన్యుడైన క్లార్కు సూర్యారావు రోజువారీ బతుకు ఎలా కొడిగట్టి కొడిగట్టి చివరికి ఆత్మహత్య ద్వారా ఎలా ఆరిపోయిందీ, కథావస్తువైంది. ఆధునిక సంకీర్ణ నాగరికతకు జీవధాతువైన నగర జీవితంలోని అన్యవర్గ భావాలు సూర్యారావు మనస్సును తొలిచివేశాయి. బూర్జువాభ్రమల్లోపడి, యథార్థ జీవిత సత్యాన్ని మార్చేశక్తి గానీ మార్చాలనే కోరికగానీ లేకుండా, కనీసం ట్రేడ్‌యూనియన్ కార్యకలా పాలవైపైనా దృష్టి సారించకుండా, కేటాబడిన నగటువ్యక్తిగా ఎలాదురంతం కోరితెచ్చుకొందీ చూస్తే, సాంఘిక సంఘర్షణల గురించిన మార్క్సిస్టు వైఖరి నుంచి ఆరుద్ర చాలా దూరంవెళ్లి, శూన్యవాదంలో నిలిచాడని తీర్మానించక తప్పదు. బూర్జునా వ్యక్తివాదంలోని దౌర్బల్యం సూర్యారావుని ఆశ్రయించు

కొంది. అతనికి వర్గభావన అలవడనేలేదు. ఈ దృష్టితో చూస్తే, "త్వమేవాఽహమ్" నుంచి "సినీవాలి" వెనకడుగే.

కుందుర్తి ఆంజనేయులు నైహూ 'చారిస్మా' (సమ్మోహనం)లో తన నవయవ్వనదశను గడిపినందుచేత, అతని సోషలిస్టుభావనమీద నైహూముద్ర- అంటే ఒక దశలో అభ్యుదయకరమైన వామపక్ష జాతీయవాద ముద్ర- స్పష్టంగా కనిపిస్తుంది. "చైతన్య ధనుష్ప్రాణులైన" ప్రజలు తెలంగాణా ప్రాంతంలోని గ్రామ సింహాలమీద ఎలా "సంఘం" ద్వారా తిరగబడి పోరాడిందీ చెబుతూ, ఈ ఇతివృత్తాన్ని నైజాము వ్యతిరేక పోరాటచరిత్రకు ముడివెయ్యడంలోనే ఈ ద్వంద్వాత్మక వైఖరి బయటపడతుంది దాశరథిలా రెండవదానికి మట్టుకే తన "తెలంగాణ"లో కుందుర్తి అంటిపెట్టుకోలేదు. "నయాగరా" (1944) దశలోని కుందుర్తే ఈ కావ్యంలోనూ కనిపిస్తాడుగాని అంత చండప్రచండంగానిప్పులుచెరుగుతూకాదు. మరింత స్థిమితం అలవడింది. లౌక్యం కాకపోయినా, లోకం గురించిన స్పృహగూడా అతిశయించింది. కావచ్చు. తెలంగాణా రైతాంగం, కూలిజనం, "యూనియన్ సైన్యాలకు స్వాగతం" చెప్పారంటే మాత్రం, చరిత్రను తారుమారు చేయడమే అవుతుంది. నైజాముపాలన నుంచి విడుదల కలిగి ఉండవచ్చుగాని, దేశ్‌ముఖ్‌లూ, జాగీర్దార్లూ, పటేళ్లూ పట్వారీలు దీనివల్ల లాభపడ్డారు. పోరాటం ద్వారా ప్రజలు సాధించుకొని సాగు చేసుకొన్న నేల మళ్లీ వాళ్ల వాతబడింది. దీనికి యూనియన్ సేనలేగాక బలగం కూడా వత్తాసి అయింది. తెలుగుజాతి మళ్లీ ఒకటిగా అతుక్కొంది నరే, "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" ఏర్పడవలసిందల్లా పోలీసు రాజ్యం ఏర్పడింది చరిత్ర వెనక్కు నడిచింది. గంగినేని, సోమసుందర్, రమణారెడ్డి లాంటి కవులకూ కుందుర్తిలాంటి కవులకూ ఇక్కడ భేదంఉంది. "ఉదయిని" "వజ్రాయుధం", "అడవి"లాంటి కావ్యాలు ప్రధానంగా సోషలిస్టు వైఖరికి అంకితమయ్యాయి. శ్రామిక జన అంతర్జాతీయత, మార్క్సిస్టు ప్రాపంచిక వైఖరి, వర్గ పోరాట దృక్పథం కొంత మేరకైనా ఈ రచనలను ప్రభావితం చేశాయి. బొల్లిముంత శివరామకృష్ణ రాసిన నవల "మృత్యుంజయులు"గాని, మహీధర రామమోహనరావు "రథచక్రాలు" "ఓనమాలు" "కత్తులవంతెన" నవలలు, పొట్లపల్లి రామారావు వగైరాల కథలు, ఈ కోవకు చెందినవే.

"మీతోనె ఉంటాను మీతోనె వస్తాను
అడగడుగునా మీకు అండగ నిలుస్తాను"

అంటూ ఎఱ్ఱ జెండాతో అభేదం పొంది కమ్యూనిస్టు ఉద్యమంలో కూడా భాగస్థుడైన అనిసెట్టి సుబ్బారావు మొదటినుంచీ తన కవిత్వంలో జీవ కారుణ్యదృక్పథాన్ని ప్రదర్శిస్తూ వచ్చాడు. ఇది శుష్కమైన హృదయవాదంగా పరిణమిస్తుందని గ్రహించలేదో, కవి అయినవాడు ప్రతి ఒక్కడూ విధిగా 'సెంటిమెంట్సు'ను సమాదరించవలెనని భావించాడో, ఏమోగాని, మెత్తానికి మెత్తదనానికీ మెతకదనానికీ సరిగా అంతరం గ్రహించలేకపోయాడు. నవ్య సాహిత్యపరిషత్తు తరపుకవుల్లో నాయని ప్రభావం తనమీద బలంగా పడి ఉండ బట్టి కూడా ఈ వైఖరి ఏర్పడి ఉంటుంది. పైగా, సామాన్య వస్తువులను కూడా Mystify చేసే ఒకలాంటి మార్మికవాదం, ఇతని కవిత్వంలో ప్రకృతినీ భూమినీ తల్లినీ పరతత్వంతోటి భావించడం కనిపిస్తుంది. మనిషిని మనిషిగా కాకుండా, ఒక దేవతగానో వట్టి ఆదర్శమూర్తిగానో చూపడం జరుగుతుంది. కాల్పనిక మనస్కత నుంచి అనిసెట్టి తప్పుకోలేకపోయాడు. కవి అన్న వాడికి భావుకత్వం అవసరమేగాని భావుకత్వమూ కాల్పనికతా ఒక్కటి మాత్రం కావు. వాస్తవ విషయపరమైన మార్క్సిస్టు దృక్పథం, దానికి మూలకందమైన భౌతికవాదం, వస్తువులను విశ్లేషించి చూపుతుందిగాని వాటిని ఆదర్శీకరించదు.

సామరస్యాన్నేగాని సంఘర్షణను సుతరామూ ఒప్పని కీ॥ శే॥ బాల గంగాధర తిలక్ అభ్యుదయ రచనోద్యమం ప్రభావ ఫలితంగానైనా, సాంఘిక ప్రమేయాలను పట్టించుకొన్నాడు. అయితే తన తత్వం, సిద్ధాంతాలకూ ఇజాలకూ ఒదగని, వాదాలకూ వివాదాలకూ లొంగని, వైయక్తిక తత్వం. దాని పరమావధి అందం, ఆనందం. జీవితాన్ని సుఖంగా సౌందర్యమయంగా సంతృప్తిగా అనుభవానికి తెచ్చుకోగోరే కవి కాబట్టి, తిలక్ తెలుగు కవులలో విశిష్టవ్యక్తిగా కనిపిస్తాడు. కరుణాభరణుడు కాగోరాడు. అయితే జీవితంలోని వికారం, విషాదం, తిలక్‌నుకూడా సంచలింపజెయ్యక పోలేదు. సంఘదుస్థితి అతణ్ణి కదిలించి, కన్నీరుగా కరిగించక పోలేదు. వీటికి తాను చూపిన పరిష్కారం హృదయ సంస్కారం మాత్రమే. సంఘ సమస్యలకు వైయక్తిక పరిష్కారం సరైన పరిష్కారం కాదు. జీవితయాథార్థ్యం తిలక్ నిరసననే నోచుకొన్న దనడం కూడా నిజంకాదు. ఎందుకంటే, ఏరికోరి జాతీయవాదాన్నే తిలక్ వరించాడు. అందులోనూ నెహ్రూ తత్వం, నెహ్రూ వ్యక్తిత్వం తిలక్‌కు బాగా ఇష్టం. అయినా అతనిది ప్రధానంగా స్వప్నలోకం.

6)

## 2

వ్యక్తి చైతన్యం సంఘానికీ సంఘ చైతన్యం వ్యక్తికీ మార్పిడీ అయ్యే దశలో వ్యక్తి శక్తికి పర్యాయపదం కాగలుగుతాడు. "వ్యక్తికి బహువచనం శక్తి" కాగలుగుతుంది. అయితే ఆదశ 1947 తర్వాత ఎంతోకాలం కొనసాగ లేదు.

అభ్యుదయ రచయితల సంఘం ఆశయపరంగా ఏమోగాని, ఆచరణ పరంగా మాత్రం హోల్డాల్‌లా మారి తాను పుట్టిన నాటి చారిత్రకావసరాన్ని తన పెరుగుదల క్రమంలో తారు మారు చేశాకనే, స్వతంత్ర భారత ప్రభుత్వం దాన్ని అంక్షపాలు జేసింది. సిద్ధాంతాలకోసం కంటె ఎక్కువగా, లేదా అందులో భాగంగా, వ్యక్తిగత రాద్ధాంతాల కోసం కమ్యూనిస్టు పార్టీయే దాని తలను ఉత్తరించి వేసింది. కార్యశూరుడైన చదలవాడ పిచ్చయ్య ఖాళీచేసిన కార్యదరి స్థానాన్ని మరెవ్వరూ భర్తీ చెయ్యలేదు. పిచ్చయ్య కార్యదర్శిగా చెయ్య గలిగిన కంగాళీ అంతా చేసిపోయాడు. ఆంధ్రోద్యమ విజయంతోటి అఖిలాంధ్ర రచయితల సంఘ స్థాపనకు ప్రయత్నాలు జరిగాయి. అనధికారస్థాయిలో జరిగిన ఈ ప్రయత్నాలు ఫలించలేదుగాని. అధికారికంగా అకాడెమీ ఏర్పాటు గౌరవాలకోసం దిన భత్యాలకోసం ప్రాపకాలకోసం ప్రసంగాలకోసం మొగం వాచి ఉండిన వృద్ధ రచయితలను సింహాసనం దగ్గరకు తీసుకెళ్లింది. దానికి తోడు, ఎన్నికల తిరుణాళ్ల సామాన్యులను పోరాట సంధానుంచి విజయవంతంగా తప్పించింది. ప్రజాతంత్ర వ్యవస్థ భ్రమలనెన్నో సృష్టించింది. కమ్యూనిస్టు వ్యతిరేకతను ఒక్క పెట్టున 'మేధావులకు' కలిగించడానికి ఆంధ్ర దినపత్రికలు పనిగట్టుకు మరీ సంకల్పించాయి.

అభ్యుదయ రచయితల సంఘం సంఘంగా అంతరించినా, వ్యక్తులను ఆశ్రయించుకొని 1955 వరకు అజ్ఞాతవాసం చేసింది. ఆ సంవత్సరంలో మళ్లీ (1947 తర్వాత) మహాసభ జరిపింది. అయినా ఇది శవానికి ప్రాణం పొయ్యడం లాంటి నిష్ఫల ప్రయత్నమే అయింది. కమ్యూనిస్టు ఉద్యమంలోనే జాతీయ వాదంతోటి రాజీపడిపోయే ధోరణి తలెత్తసాగింది- ప్రజాసమీకరణకు బదులు పార్లమెంటరీ పద్ధతులకు 'విప్లవాశయం' గల పార్టీయే పూనుకోక తప్పనంతగా జాతీయ బూర్జువావర్గం తన అధికారాన్ని గట్టిగా స్థాపించుకొంది.

ఈ కొత్త చారిత్రక దశలో రచయితలుగా కలం పట్టిన యువకులకు మార్క్సిస్టు దృక్పథం కాదుకదా, సామాజిక భావనకూడా లేకుండా పోయింది.

పాశ్చాత్య యువలోకంలో పొటమరించిన మనోవికారాలు నాటు దుస్తుల్లో మన కుర్రకారునుగూడా సోకాయి. ఇజమ్ అంటేనే ఉలికిపాటు మొదలైంది. నిబద్ధత దాన్యంగా గణనకు వచ్చింది. ఆరుద్రలాంటి రచయితలుకూడా 'ప్రజాతంత్రం' వైపు మొగ్గుచూపారు. పార్టీలకూ, ఇజాలకూ "తాళికులు" కాకుండా విశృంఖలంగా నైనానరే స్వతంత్రంగా, వెలయాలిలాగానైనా నరే కాకుండా దాని, తమ భావాలను బలాదూరుగా చరింపజెయ్యడం అనేకుల్లో మొదలైంది.

అయితే మార్క్సిస్టుతత్వ ప్రభావం తెలుగు సాహిత్యంమీద పూర్తిగా ఈ దశలోకూడా పడకుండా ఉండలేదు. ఇలా అనడానికి గజ్జల మల్లారెడ్డి దూషక, విదూషక గేయాలేగాక, బడితె కర్రల్లాంటి సి. విజయలక్ష్మి కావ్యాలు పనికివస్తున్నాయి. పదిమంది ముందుకిరాకపోయినా, రాచమల్లు రామచంద్రారెడ్డి కథలు "అలసిన గుండెలు" నంసార పరిధిలోకి కన్నీళ్లనూ వాటి, వెనకనున్న అక్రమాలనూ ప్రదర్శించాయి. అంతకంటె ఎన్నోరెట్లు శక్తిమంతంగా రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలు జీవితంలోని కర్కశత్వాన్ని, గొప్పవారి తప్పుడు పనుల్ని, పనిబాటలవారి అలగామాటల తెగింపునీ, చిత్రించాయి. ప్రకృతిలోనూ మానవప్రకృతిలోనూ అణువణువునా కనిపించే అక్రమం, ఆదిమ ప్రవృత్తిలో నిండారిన స్వార్థం, సమిష్టి జీవితరంగాలలో జరిగే అనుక్షణ నంఘర్షణ- వీటిని ఇంత గొప్పగా ఘనంగా చిత్రించగలిగిన రచయిత మరొకడు లేడన్నంతగా విశ్వనాథశాస్త్రి రాయగలిగాడు. అప్పటివరకు పరిచితమైన కథారూపాన్ని వధించాడు. తెలుగు కథ ఆకృతినీ, అంతస్సునీ విప్లవీకరించాడు. కాళీపట్నం రామారావు విశ్వనాథశాస్త్రిలా గడసరికాడు గాని. సామాజిక వాస్తవాన్ని రామారావుకా విశ్వనాథశాస్త్రికూడా నవివరంగా, సూక్ష్మాంశా నహితంగా, నిండుగా, నిబ్బరంగా చిత్రించలేదు. పైగా, రామారావులా విశ్వనాథశాస్త్రికి గ్రామీణ జీవిత వృక్షమూలాలు తెలియవేమో. విశ్వనాథశాస్త్రి వన్నీ, దాదాపు అన్నీ. నగర జీవితశాఖనుండి కుళ్లి, లేదా మగ్గి రాలిపోయిన పళ్లు. అయినా వీటిలో ఇంకా చెడని కండనే ఆయన పైకెత్తి చూపుతాడు. మిగిలి ఉన్న మానవీయతను ఉజ్వల వర్ణాలతో ప్రదర్శిస్తాడు. వ్యక్తుల నంఘర్షణకుగల సాంఘిక రూపాలను, పాత్రల వ్యక్తిత్వానికి ఏలోటూ రానీయకుండానే బహుమెళకువగా సూచించగలుగుతాడు. మార్క్సిజం సిద్ధాంతాలు వల్లె వెయ్యవలసిన పని రచయితకీ లేదు. కావలసింది జీవిత వాస్తవాన్ని చైతన్యవంతంగా అవగాహన చేసుకొని సాహిత్య రూపంగా లోకానికి అందివ్వటమే.

ఈ సంకల్పం మళ్ళీ కొందరు రచయితలకు కలిగింది. Negative గానే సంఘాన్ని విమర్శిస్తూ ఉండిన 'దిగంబర కవులు, పాఠకలోకానికి విద్యుచ్చికిత్స చేయడంలో కృతార్థులయ్యారు. గండ్ర గొడ్డళ్లలాగా అవినీతిమీద విరుచుకు పడ్డారు. కోపం వాళ్లది ఉన్మాదానికిగల తీవ్రతను సంతరించుకొంది. ఏ రంగం తొక్కినట్టు అక్షరలోకాన్ని భయభ్రాంతం చేశారు. విలువలను అన్నిటినీ నిరాకరించే 'నిహిలిస్టు' ధోరణిగా అనిపించినా, దీనివెనక బలీయమైన మానవీయత నిలిచింది. అందుచేతనే, వాళ్లలో కొందరైనా మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆమోదించకలిగారు. అంతకు ముందే, దేశంలో ఒకమూల మొదలైన సాయుధ పోరాటం నుండి కావ్యోత్సాహం పొందిన మరికొందరు రచయితలు "తిరుగబడు" అని పిలుపిచ్చారు, 'మార్చ్' అన్నారు. తెలుగు సాహిత్యంలో వచన విభాగానికీ కవిత్వవిభాగానికీ మార్క్సిజం ప్రభావాన్ని అనన్యంగా కలిగించిన కుటుంబరావు, శ్రీశ్రీ, ఈ యువరచయితల ఉద్రేకాన్ని తామూ పొందారు; విప్లవ రచయితల సంఘం దాపరికం లేకుండా మార్క్సిజాన్ని తన ధ్యేయంగా ప్రకటించింది.

మార్క్సిజం ఆధునిక భావచేతనలో ఒక ప్రధానమైన అంశం. వర్గాలు వాటి మధ్య ఘర్షణలు ఉన్నంతకాలం, మార్క్సిజానికి కాలదోషం పట్టదు భౌతిక వాస్తవాన్ని గ్రహించడంలోనూ, దాన్ని మార్చేందుకు క్రియాశీలతను అలవరచుకొని శ్రామిక ప్రజల్ని పోరాటాలకు మళ్లించడంలోనూ, మార్క్సిజం ఏక కాలంలో శాస్త్రమూ శస్త్రమూ కాగలుగుతుంది. దాన్ని కళలకు అన్వయించడానికి, సిద్ధాంతాన్ని గుర్తెరిగి ఉంటే మంచిది. సిద్ధాంత పరిజ్ఞానం లేకున్నా, సాహిత్యంలో ప్రజా వైఖరి, వాస్తవవాదదృక్పథం ఉంటే, గుడ్డిలో మెల్ల.

# ప్రవాసాంధ్రుల వాఙ్మయసేవ

## శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

స్వస్థలం విడిచిపెట్టి పరస్థలానికి వెళ్లాలంటే తెలుగువారికి మనస్కరించదనే అపప్రథ ఒకటి ఉన్నది. ఇందులో కొంతవరకూ నిజం లేకపోలేదు. దాక్షిణాత్యులలో తమిళుల మలయాళీల వలె, ఔత్తరాహులలో గుజరాతీలవలె, తెలుగువారు ఎక్కడికిపడితే అక్కడికి అంత త్వరగా వెళ్లరు, ఉన్న ఊరు విడిచిపెట్టి. ఇందుకూ ప్రబలమైన కారణం లేకపోలేదు. తెలుగునేల బంగారునేల. తెలుగునాడు పైడిపంటల కొటారం. శ్రమించాలిగాని, తెలుగు తల్లి ప్రసాదించని సంపద యేముంది? అందువల్లనే నిన్నమొన్నటిదాకా విద్యాధికులైన తెలుగువారు కూడా తమ పల్లెపట్టుల్ని నమ్మి మనుగడ సాగించేవారు. భూలక్ష్మిని సేవిస్తూ కాలం గడిపేవారు. కాని దేశకాల పరిస్థితులలో మార్పు వచ్చింది. భూమాతమీద మోజు తరిగింది. ఉద్యోగాలమీద మోజు పెరిగింది పైపెచ్చు, తరతరాలుగా వస్తున్న స్థిరాస్తులు కారణాంతరాలవల్ల నానాటికి తీసికట్టు నాగంభట్టు కావడంతో. సంగీత సాహిత్యాదులలో ప్రవేశమున్నవారూ ఉన్నత విద్యాభ్యాసం చేసినవారూ పట్టణాలకూ పర రాష్ట్రాలకూ వెళ్లి, కొందరు అక్కడే స్థిరనివాసాలు కూడా ఏర్పరుచుకున్నారు. కనుకనే యీనాడు మనదేశంలో ప్రతి రాష్ట్రంలోనూ తెలుగు కుటుంబాలు ఎన్నో కనిపిస్తున్నవి.

ప్రవాసాంధ్రులనగానే ముఖ్యంగా తమిళనాడులో చాలాకాలంగా నివసిస్తున్న తెలుగువారు జ్ఞప్తికి రావడం పరిపాటి. దక్షిణాంధ్రులు కేవలం భాషాభిమానులుగానే గాక కావ్య నిర్మాతలుగాకూడా ప్రసిద్ధి కెక్కిన విషయం సాహితీవేత్తలకు తెలిసిందే. నిజానికి దక్షిణాంధ్ర యుగంలో తెలుగు సాహిత్యానికి పెండ్లి పందిళ్ళు వెలసినవి. తెలుగు మాటకూ తెలుగు పాటకూ ఒక కొత్త సోయగం చేకూరింది ఆనాళ్లలో మధుర, తంజావూరు, పుదుక్కోట, మైసూరు మొదలైనవి ప్రముఖ సాహిత్య పీఠాలు. ఆనాటి పాలకులైన నాయక రాజులూ, వారి సామంతులూ, చివరకి తంజావూరు నేలిన మహా

రాష్ట్ర భూపతులూ ఆంధ్ర భాషాభిమానులు కావడం పేర్కొనదగిన విషయం, అందువల్లనే యీనాటికీ ఆంధ్రభాషాభిమానులు పలువురు దక్షిణాపథంలో కని పిస్తారు. తమిళులైన సుబ్బరామ దీక్షితర్, టి. యస్. మురుగేశంపిళ్లై ప్రభృతులు తెలుగులో రచనలు వెలయించి, తెలుగు భాషాభివృద్ధికి కృషి చేశారు. మొన్నమొన్నటిదాకా మదరాసులో తెలుగు పుస్తకాలు ప్రకటించిన ప్రముఖ ప్రకాశకులలో చాలామంది తమిళులే!

ఎన్నో తరాలుగా నివసిస్తున్నవారే కాక, చలనచిత్రరంగం మొదలైన వాటిలోనూ ప్రభుత్వోద్యోగాలలోనూ పనిచేస్తూ తమిళనాడులో స్థిరపడిన తెలుగువారు చాలామంది వున్నారు. ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత కూడా తెలుగువారి సంఖ్య తగ్గలేదు, మదరాసు నగరంలో తమిళం తర్వాత తెలుగుదే పైచేయి. 1961 జనాభా లెక్కల ననుసరించి మదరాసులో 2,44,632 మంది తెలుగువారున్నట్లు స్పష్టమయింది. ఇతర భాషలవారిలోనూ తెలుగు తెలిసినవారు చాలామంది ఉన్నారు. కాని తెలుగు రచయితల సంఖ్య మాత్రం తగ్గుముఖం పడుతోంది

మదరాసులోని సుప్రసిద్ధ రచయితలనగానే నాకు ప్రప్రథమంగా జ్ఞాన వయోవృద్ధులైన డా॥ పాకాల వెంకట రాజమన్నారు గారు గుర్తుకి వస్తారు. రసవత్తరములైన నాటికలూ నాటకాలూ, ఎన్నో సంతరించిన ప్రజ్ఞామూర్తి రాజమన్నారుగారు. ఆయన రేడియో నాటికలు కూడా తీర్చిదిద్దినట్లు వుంటాయి. సర్వాయిపాపడు ఈ కోవకు చెందిన చక్కని నాటిక.

నాటక రచయితలుగా ప్రసిద్ధికెక్కిన శ్రీయుతులు ఆచార్య ఆత్రేయ, డి. వి. నరసరజు, పినిసెట్టి శ్రీరామమూర్తి ప్రభృతులు ప్రవాసాంధ్రులే. వీరు కాక శ్రీ పాలగుమ్మి పద్మరాజు, డా. గాలి బాలసుందరరావు, బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు మొదలైనవారు రేడియోకీ పత్రికలకూ నాటికలు వ్రాస్తున్నారు.

విశ్వం పెళ్లి, పెద్దమనుషులు మొదలైన చక్కని నాటకాలు ఎన్నో వ్రాసిన శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారిని కూడా ఈ సందర్భంలో పేర్కొనడము సమంజసం. వీరి రచనలలో నాటక శిల్పంతో పాటు నవనీతం వంటి హాస్యం చోటుచేసుకోవడం గమనింపదగిన అంశం. నాటకానికి జిగినీ బిగినీ ప్రసాదించేవి పాత్ర సృష్టి, సంభాషణ చాతురీని. ఈ రెండూ వీరి రచనలలో

కనిపిస్తాయి. తెలుగు దేశానికి దూరంగా, బొంబాయిలో నివసిస్తున్నా, శాస్త్రిగారి రచనలో సజీవమైన తెలుగు నుడికారం తొణికిసలాడుతూండడం హర్షించదగిన విషయం. బొంబాయి ఆంధ్ర సంఘం కార్యనిర్వాహకులలో వీరు ప్రముఖులు కూడా.

నాటక రచయితలవలె, సుప్రసిద్ధ కవులకు కూడా మదరాసు ఆలవాల మన్నా అతిశయోక్తి కాదు. సర్వశ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, విద్వాన్ విశ్వం, ఆరుద్ర, దాశరథి, అనిసెట్టి సుబ్బారావు, వి. గణపతిశాస్త్రి, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బి. వి. సింగరాచార్య ప్రభృతులు కవిత లెన్నో వెలయించిన విషయం సాహితీ జిజ్ఞాసువులకు తెలిసిందే. విద్వాన్ విశ్వం వ్రాసిన "ఒకనాడు", దాశరథి వెలయించిన "కవితా పుష్పకం", ఆరుద్ర కవితా సంపుటి "త్వమేవాహం", 'వెన్నెల-వేసవి' సింగరాచార్య రచించిన "గీతాంజలి" మొదలైనవి పేర్కొనదగిన కొన్ని రచనలు.

ఎంతో శ్రమించి, మనోహరమైన శైలిలో శ్రీ ఆరుద్ర 1965 నుంచి వ్రాస్తున్న సమగ్ర ఆంధ్ర సాహిత్యం ముఖ్యంగా ఉదాహరింపదగిన రచన. అనుకున్న అన్ని సంపుటాలూ వెలుగులోకి వచ్చినప్పుడు, ఈ రచన తెలుగు సాహిత్యానికి సమగ్ర చరిత్రగా భాసిస్తుందనడంలో సందేహంలేదు.

కథానికా రంగంలోనూ పేరుప్రఖ్యాతులు గడించిన రచయిత లెందరో మనకు మదరాసులో కనిపిస్తారు. శ్రీయుతులు కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజు, ముళ్లపూడి వెంకటరమణ మొదలైన రచయితలు కథానికలతో పాటు ఉత్తమ నవలలు కూడా వ్రాశారు. కుటుంబరావు గారి "అనుభవం", పద్మరాజు గారి "బ్రతికిన కాలేజి", "రెండవ అశోకుడి మూణ్ణాళ్లపాలన", వి. గణపతిశాస్త్రిగారి "కాశ్మీర పట్టమహిషి", మహీధర రామమోహనరావు గారి "కొల్లాయి గట్టితే నేమి" మొదలైన నవలలు స్వాతంత్ర్యానంతర సాహిత్యంలో పేర్కొనదగిన రచనలు.

సాహిత్య విమర్శ, వ్యాసం మొదలైన శాఖలలో అపారమైన కృషి చేసిన పెద్దలు మదరాసు రచయితలలో చాలామంది కనిపించడం ఒకవిశేష మనే చెప్పవచ్చు. శ్రీయుతులు వేదం వేంకటకృష్ణశర్మ, బులుసు వేంకట రమణయ్య, వేదం వేంకట రాయశాస్త్రి ప్రభృతులు తమ అమూల్య రచనల ద్వారా తెలుగు సాహిత్యానికి ఎంతో సేవ చేస్తున్నారు. వేంకట కృష్ణశర్మ గారి శతకవాఙ్మయ సర్వస్వము వేంకటరమణయ్య గారి ఆంధ్రాలంకార

వాఙ్మయ చరిత్ర, ఆంధ్ర కవి సప్తశతి, వేంకటరాయశాస్త్రి గారి నన్నెచోడుని కవిత్వము మొదలైనవి ప్రశస్త రచనలు. ప్రసిద్ధ వైయాకరణులైన శ్రీరావూరి దొరస్వామిశర్మగారి తెలుగులో తిట్టుకవిత్వము, చల్లా రాధాకృష్ణశర్మ వ్రాసిన తెనుగు విందు, మదరాసు తెలుగు మొదలైన భాషా సాహిత్య వ్యాసనం పుటాలు, శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తి గారి ఆంధ్ర నాటకరంగచరిత్ర మొదలైనవి పేర్కొనదగిన మరికొన్ని రచనలు. మిక్కిలినేని గారి నట రత్నాలు (ప్రస్తుతం ఆంధ్రప్రభ, సచిత్రవార పత్రికలో వారం వారం వెలు వడుతున్నవి) కూడా ప్రశస్త రచన అనవచ్చు.

బాల వాఙ్మయంలో కృషిచేస్తున్నవారు కొందరు లేకపోలేదు. శ్రీయుతులు బి. వి. సింగరాచార్య, చల్లా రాధాకృష్ణశర్మ ప్రభృతులు పిల్లల రచనలు ప్రకటించారు. శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్ రచించిన దేవతా వస్త్రాలు, రాధాకృష్ణశర్మ వ్రాసిన చరిత్ర కెక్కిన చరితార్థులు, వానకురిసింది మొదలైనవి ఈ కోవకు చెందిన కొన్ని రచనలు.

సుప్రసిద్ధ రచయిత్రులు కూడా చాలామంది మదరాసులో ఉండటం పేర్కొనదగిన మరొక అంశం. శ్రీమతులు భానుమతీ రామకృష్ణ, రామలక్ష్మి ఆరుద్ర, మాలతీచందూర్, రేవనూరి శమంత మొదలైన రచయిత్రులు తమ కథానికల ద్వారాను నవలలు నవలికల ద్వారాను ఆధునికాంధ్ర వాఙ్మయాన్ని పరిపుష్టంచేస్తున్నారు. భానుమతీ రామకృష్ణగారి అత్తగారి కథలు, రామలక్ష్మిగారి ప్రేమించు ప్రేమకై మొదలైన నవలలు, మాలతీచందూర్‌గారి లావణ్య, మేఘాల మేలిముసుగు మొదలైన నవలలూ, శమంతగారి రత్నకంబళం, హుసేన్‌సాగర్, గీతామాల మొదలైన రచనలూ తెలుగు పాఠకలోకానికి పరిచితమైనవే. ఈ మధ్య రామలక్ష్మి ఆరుద్ర గారు సంతరించిన "తాళ్లపాకవారి పలుకుబళ్లు" ముఖ్యంగా పేర్కొన దగిన రచన. ఈ నాళ్లలో ఇటువంటి గ్రంథాల ఆవశ్య కత ఎంతైనా వున్నది.

ప్రసిద్ధ అనువాదకులైన శ్రీమద్దిపట్లసూరి (బెంగాలీ నుంచి), శ్రీఆరిగ పూడి రమేష్ చౌదరి, శ్రీ బాలశౌరిరెడ్డి (హిందిలోకి), శ్రీవిద్వాన్ విశ్వం (కన్నడం నుంచి), శ్రీ డి. ఆంజనేయులు (ఇంగ్లీషులోకి), శ్రీమతి హేమలత ఆంజనేయులు (హిందీలోకి), డా॥ వి. యన్. శర్మ (జర్మన్ నుంచి), శ్రీవేదం వేంకటకృష్ణశర్మ, శ్రీ బులుసు వేంకటరమణయ్య (సంస్కృతం నుంచి), చల్లా రాధాకృష్ణశర్మ (తమిళం నుంచి, తమిళం లోకి) మొదలైనవారూ,

ప్రసిద్ధ పత్రికా రచయితలైన శ్రీకప్పగంతుల సత్యనారాయణ (ఈ మధ్య వీరి 'రమణి రాసిన ఉత్తరం' అనే కథానికా సంపుటం వెలువడింది), శ్రీ యస్. ఆర్. చందూర్ (బహు గ్రంథకర్తలు) మొదలైన వారూ మనకు మదరాసులో కనిపిస్తారు. వీరుకాక శ్రీయుతులు ముద్దా విశ్వనాథం, వల్లమన్నాటి కుటుంబరావు, సెట్టి ఈశ్వరరావు, వి. యస్. అవధాని, భమిడిపాటి రాధాకృష్ణ, బి. సి. కామరాజు, డి. రామలింగం, ఎల్లోరా, శార్వరి, బి.యస్.ఆర్. కృష్ణ, 'జంగోరె' మొదలైన రచయితలు, శ్రీయుతులు తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, యామిజాల పద్మనాభస్వామి మొదలైన విద్వత్కవులూ మదరాసులో నివసిస్తున్నారు.

ఈ మధ్య కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకమును శ్రీ ఆరుద్ర పీఠికతోనూ శ్రీ బాపు, చిత్రాలతోనూ సర్వాంగసుందరంగా ప్రకటించిన శ్రీ వి. ఎ. కె. రంగారావు శ్రీ ఘంటసాల పాడిన పాటలను భువనవిజయ మనే పేరుతో ఒక చక్కని సంపుటం ప్రకటించారు. సినిమా సంగీతంపట్ల శ్రీ రంగారావుగారు చూపుతున్న అభిమానం ప్రత్యేకంగా పేర్కొనదగింది. సినిమా పాటలను గురించి పరిశీలన చేయదలచిన వారికి వీరివద్ద సామగ్రి పుష్కలంగా లభిస్తుంది.

పలువురు పండితులూ కవులూ రచయితలు గ్రంథప్రకాశకులు మదరాసులో ఉండడం, భారతి వంటి ప్రముఖ సాహిత్య మాస పత్రికా, ఆంధ్ర పత్రిక దిన, వార పత్రికలూ, ఆంధ్ర ప్రభ సచిత్రవార పత్రికా మొదలగునవి మదరాసు నుంచి వెలువడడం – ఈ విషయాదికాన్ని పరిశీలిస్తే మదరాసు నగరం ఇంకా తెలుగు భాషా సాహిత్యాలకు ప్రముఖ కేంద్రంగా ప్రతిభాసిస్తున్నదని పేర్కొనడం అతిశయోక్తి కాదు. యం. శేషాచలం కంపెనీవారు నవలలు కథానిక సంపుటాలు మొదలైన వాటితోపాటు ప్రాచీన కావ్యాలను కూడా చక్కని పీఠికలతో ముద్రించడం ముదావహం.

మదరాసులో వలె, ఢిల్లీలోనూ ప్రస్తుతం చాలామంది రచయితలు మనకు కనిపిస్తారు. శ్రీయుతులు వేమరాజు భానుమూర్తి, మహీధర నళినీ

మోహన్, వాకాటి పాండురంగరావు, ఇలపువులూరి పాండురంగారావు, బలివాడ కాంతారావు, గరిమెళ్ల వెంకట సీతారాం, ద్వివేదుల విశాలాక్షి, వి యస్. రమాదేవి, ఉషారాణి భాటియా మొదలైన రచయితలు రచయిత్రులు తమ రచనల ద్వారా తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నారు. శ్రీయుతులు బలివాడ కాంతారావు, వాకాటి పాండురంగరావుల కథానికలు, శ్రీమతి విశాలాక్షిగారి గ్రహణం విడిచింది మొదలైన నవలలూ, కథానికలు తెలుగు పాఠకులకు కొత్తవి కావు.

శ్రీయుతులు ఇలపావులూరి పాండురంగారావు, వేమూరి ఆంజనేయ శర్మ, పులిగడ్డ విశ్వనాథరావు, రెంటాల రాఘవరావు మొదలైనవారు తెలుగు సాహిత్యం గురించి హిందీలో ప్రశస్తమైన రచనలు చేస్తున్నారు. తెలుగు రచనలను హిందీలోకి అనువదించి, తర్వాత తెలుగు సాహిత్యాన్ని హిందీ పాఠకులకు పరిచయం చేస్తున్నారు. అలాగే శ్రీయుతులు వి. ఎస్ ప్రకాశరావు, జి.యస్. భార్గవ, వి. పతంజలి మొదలైనవారు తెలుగు సాహిత్యం గురించి ఇంగ్లీషులో వ్రాస్తున్నారు. ఇది ఎంతైనా హర్షింపదగిన విషయం.

ఈ సందర్భములో తెలుగు సాహిత్యాన్ని ఇతర భాషలవారికి పరిచయం చేస్తున్న మరికొందరు ప్రవాసాంధ్రులను గురించి చెప్పడం చాలా అవసరం. గురజాడవారి కన్యాశుల్కం నాటకాన్ని రాజపాళయం వాస్తవులు శ్రీ జగన్నాథ రాజా యథాతథంగా తమిళం చేశారు. మదరాసు వాస్తవ్యురాలు శ్రీమతి యం.యస్. కమల బాపిరాజుగారి నారాయణరావును తమిళంలోకి అనువదించారు. చల్లా రాధాకృష్ణ శర్మ తెలుగు సాహిత్యం గురించి తమిళంలో వ్యాసాలు ప్రకటించడమే గాక, విశ్వనాథవారి వేయిపడగలు కథను 'ఆయిరం తలై నాగం' అనే పుస్తక రూపంగా ప్రకటించారు. శ్రీ పి వి. సుబ్రహ్మణ్యం శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అల్పజీవిని తమిళం చేశారు. శ్రీమతి సీతాదేవి ఎన్నో తెలుగు కథలను తమిళం చేసి వాటిని ప్రముఖ తమిళ పత్రికలలో ప్రకటించారు. శివగంగ వాస్తవ్యులూ ప్రముఖ తమిళ రచయితలూ అయిన శ్రీ రుద్ర తులసీదాస్ తమిళంలో తెలుగు కథానికాసంపుటం ఒకటి ప్రకటించారు. ఈ విధంగా దక్షిణాదిని నివసించే తెలుగువారు తెలుగు సాహిత్యాన్ని తమిళులకు పరిచయం చేస్తున్నారు.

అలాగే కన్నడ భాషాభిజ్ఞులయిన తెలుగువారు కొన్ని తెలుగు రచనలను కన్నడంలోకి పరివర్తించారు. బెంగుళూరు వాస్తవ్యులైన శ్రీ కె యస్. జానకి రామయ్యగారు బాపిరాజుగారి నారాయణరావునీ, మైసూరు వాస్తవ్యులూ ప్రముఖ కన్నడ విద్వాంసులూ అయిన శ్రీ కె. వెంకటరామప్పగారు నోరి నరసింహశాస్త్రి గారి రుద్రమదేవినీ, శ్రీ జి. ఎ. రెడ్డి దంపతులు శ్రీ ముద్దు కృష్ణ సంకలితమైన తెలుగు నాటికలనూ, శ్రీ స్వామి శివశంకరులు కూర్చిన తెలుగు కథానికలను శ్రీ కె. చెన్నబసప్పగారు కన్నడం చేశారు. ఇలా తెలుగు సాహిత్యాన్ని ఆంధ్రేతరులకు పరిచయంచేస్తున్న రచయితల కృషిని కొనియాడక తప్పదు. వారిని ప్రోత్సహించడం తెలుగువారి కర్తవ్యం.

ఢిల్లీలోని తెలుగు సాహితి అనే సంఘం నెల నెలా సాహితీ సమావేశాలు ఏర్పాటు చెయ్యడంతో పాటు సుప్రసిద్ధ రచయితలైన విశ్వనాథ, శ్రీ శ్రీ, మొక్కపాటి, కొడవటిగంటి, దేవులపల్లి, రాచకొండ ప్రభృతుల్ని సన్మానించింది, విశ్వనాథ, కృష్ణశాస్త్రి సంచికలను కూడా వెలువరించింది. ఇంత చక్కని పనిని నిర్వహిస్తున్న యిటువంటి సాహిత్య సంఘాలను వట్టి మాటలతో కాక ఆర్థిక సహాయంద్వారా ప్రోత్సహించడం తెలుగువారి కర్తవ్యమని సవినయంగా మనవి చేస్తున్నాను.

మధ్యప్రదేశ్‌లోని సాత్పురా ప్రవాసాంధ్ర సంఘంవారు ప్రవాసాంధ్ర అనే త్రైమాస పత్రికను 1966 నుంచి సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు. ఇది మెచ్చుకోదగిన విషయం. జెమ్‌షెడ్‌పూరులో 1945లో స్థాపితమైన ఆంధ్ర విజ్ఞానసమితి కూడా ప్రవాసి అనే మాసపత్రికను 5 సంవత్సరాలపాటు నడపగలిగింది. నదుపాయాలు తక్కువైన కారణాన, ప్రవాసి సంచికలూ ప్రవాసి ప్రచురణలూ అన్న పేర్లతో కొన్ని పుస్తకాలూ, కొన్ని ప్రత్యేక సంచికలూ వెలుగులోకి తీసుకువచ్చారు. ఉత్తరాదిని తెలుగు ముద్రణాలయములు లేకపోయినా, వ్యయప్రయాసలకు లోనై పత్రికలూ పుస్తకాలూ ప్రచురించడానికి పూనుకున్న యీ ప్రవాసాంధ్ర సాహిత్యోపాసకుల కృషిని మాతృభాషాభిమానమునూ ఎంతగా ప్రశంసించినా తప్పులేదు.

గ్వాలియర్, భోపాల్, రాంచి, కలకత్తా, తిరువనంతపురం ఇంకా పెక్కు పట్టణాలలో స్థాపించబడిన ఆంధ్రసంఘాలు తెలుగు భాషా సంస్కృ

తుల పరిరక్షణకు పాటుపడడమేకాక, వాటిని ఆయాప్రాంతములవారికి తెలియ జేయడానికి కూడా విశేషంగా కృషి చేస్తున్నవి. ఈ నడుమనే నాగపూరులో 1911లో స్థాపితమైన ఆంధ్ర అసోసియేషన్ వజ్రోత్సవం జరుపుకుంది. ఆ సందర్భంగా అసోసియేషన్‌వారొక ప్రత్యేక సంచికను వెలువరించారు. ఆంధ్ర సంఘం కూడా చెప్పుకోదగిన సేవ చేస్తున్నది. శ్రీయుతులు ఇచ్ఛా పురపు జగన్నాథరావు (ప్రస్తుతం మదరాసులో ఉన్నారు), రావి సూతల సత్యనారాయణ ప్రభృతులు అక్కడ కృషిచేస్తున్నవారిలో పేర్కొనదగినవారు. 'త్రిపుర' అనే లేఖిని నామంతో త్రిపుర (అస్సాం) నుంచి ఒక రచయిత రచనలు చేస్తున్నారు.

ఈ మధ్య బరంపురం తెలుగు రచయితల సంఘం "వికాసం" (వికాసాంధ్ర సాహితీ సంస్కృతీ సంవేదిక) మనం మనం బరంపురం అనే పద కొండు కథల సంపుటం ప్రకటించింది. సంకలన కర్త శ్రీ అవసరాల రామ కృష్ణారావు. ప్రముఖకవులైన శ్రీ వజ్ఝల వేంకటేశ్వర్లు గారు ఒరియాలోకూడా రచయితలు. ఆయన తమ నౌకాభంగమును (కావ్యం) ఒరియాలోకి అనువదించారు ప్రవాసాంధ్ర రచయితలలో శ్రీ వజ్ఝల కాళిదాసుగారు కూడా సంభావ్యులు.

దక్షిణా పథంలో బెంగుళూరు, మైసూరు, తిరువనంతపురం, మదరాసు మొదలైన విశ్వవిద్యాలయాలలోనూ, ఉత్తరాదిని అలీగఢ్, ఢిల్లీ, కాశీ, అలహాబాదు, ఆగ్రా మొదలైన విశ్వవిద్యాలయాలలోనూ తెలుగు భాషాబోధన జరుగుతోంది. ఈ విశ్వవిద్యాలయాలే కాక, దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి ఢిల్లీ శాఖ, లక్నోలోని మోతీలాల్ మెమోరియల్ సొసైటీవారూ తెలుగు తరగతులు నిర్వహిస్తున్నారు.

మైసూరు విశ్వవిద్యాలయంలోని శ్రీ బాడాల రామయ్య లేపాక్షి శిల్ప సౌందర్యాన్ని లేపాక్షి స్వప్నదర్శనమనే కమనీయ కావ్యంలో వర్ణించారు. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో పని చేస్తున్న డా. తంగిరాల వేంకటసుబ్బారావు వీరగాథా వాఙ్మయం మీద చక్కని పరిశోధన చేశారు కోలారు జిల్లా, చింతామణిలో ఆంధ్రోపన్యాసకులుగా పని చేస్తున్న శ్రీ ఆర్వీయస్. సుందరం వ్రాసిన తెలుగు సాహిత్యములో దేశి కవిత, శ్రీ అంబటి సుబ్బరాయగుప్త గారి

శ్రీ గాంధి మాహాత్మ్యం అనే బృహత్కావ్యం మొదలైనవి కూడా స్వాతంత్ర్యానంతర సాహిత్యంలో చెప్పుకోదగిన రచనలు.

తెలుగు భాషా సాహిత్యాలలో కృషి చెయ్యటమే గాక, తెలుగు సాహిత్య సంస్కృతులను ఇతర భాషలవారికి పరిచయం చేస్తున్న ప్రవాసాంధ్ర రచయితల, రచయిత్రుల కృషి బహుధా ప్రశంసార్హం. వారిని తెలుగువారు సముచితరీతిని ప్రోత్సాహించడం చాలా అవసరం. ముఖ్యంగా తెలుగుదేశానికి సుదూరంగా ఉన్న ప్రాంతాలలో నివసిస్తున్న రచయితలకు తమ రచనలను ముద్రించుకునేందుకు తగిన వసతులు కల్పించాలి. ప్రవాసాంధ్రులు నిర్వహిస్తున్న పత్రికలను ప్రోత్సహించాలి. తెలుగు సాహిత్యంగురించి యితర భాషలలో రచనలు చేస్తున్నవారిని గుర్తించి. ప్రోత్సహించాలి. ఢిల్లి, కలకత్తా మదరాసు, బొంబాయి మొదలైన పట్టణాలలో ఉన్న ఆంధ్ర సాహిత్య సాంస్కృతిక సంఘాలకు చేదోడు వాదోడుగా తెలుగువారూ తెలుగు ప్రభుత్వమూ సహాయపడాలి. అప్పుడే వాటికి తగినంత బలం కలుగుతుంది; సాహితీ ప్రియులు ఔత్సాహికులు, అయిన వ్యక్తుల కృషి మూడు పువ్వులు ఆరు కాయలూ అవుతుంది.

సాహిత్యసేవ చేస్తున్న ప్రవాసాంధ్ర రచయితల నందరినీ ఈ వ్యాసంలో పేర్కొన లేక పోయినందుకు చింతిస్తున్నాను. వారిని గురించిం వివరాలు నాకు తెలియక పోవడమే యిందుకు కారణం.

# ప్రభుత్వం - అధికారభాష

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

"తేటల్ దేరెడు కాంతిపూరముల నుద్దీపించు ముత్యాల ము
ప్పేటల్ వోలె త్వదీయ కంఠమున శోభింపుల్ నిగారించు, చే
నాటన్ జీవన శోషణన్ గనని కృష్ణా గౌతమీ పెన్నలన్
గాటంపుం దమి త్రావువార మిదె కాంక్షాక్షీర మాంధ్రావనీ."

పరపాలననుండి బయటపడి నేటికి ఇరవైఅయిదు సంవత్సరములు గడచినందుకు రజతోత్సవము జరుపుకుంటున్నాము. భారత రాజకీయ రంగంలో స్వాతంత్ర్య ప్రజ్వలన లార్డు కర్జను ఏనాడు బెంగాలు ప్రజలను చీల్చి భాషా ప్రాతిపదిక కాకుండా హిందూ ముస్లిం మత ప్రాతిపదికగా రాష్ట్రాలు నిర్మించాడో, ఆనాడే ప్రజానీకం జాగరితమై, పరపాలన అంతమొందించవలెనను ఆవేశంకలిగింది. బెంగాలు అవిభాజ్యమని, బెంగాలు ప్రజానీకం సింహగర్జన చేసింది. పరభాషకు వ్యతిరేకంగా బెంగాలులో బెంగాలు భాష, మహారాష్ట్రలో స్వదేశీ, ఆంధ్రలో జాతీయోద్యమబీజాలు నవజీవనోద్యమం సాగించింది. అంతా కలిసి వందేమాతరం ఉద్యమం అయింది. 1906 లో విభజింపబడిన బెంగాలు 1912 లో సమైక్యత సాధించింది.

భాషాధారకరాష్ట్రాలు స్వాతంత్ర్యానికి, జాతీయతకు ప్రాతిపదిక అంటూ ప్రథమంగా పరిపాలన ప్రజలభాషలో జరుగవలెనని,విద్యాబోధన మాతృభాషలో నేర్పబడవలెనని ఆంధ్రోద్యమంప్రారంభమైంది. 1913లో ప్రథమంగా బాపట్లలో ఆంధ్రమహాసభ జరిగింది. శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఆంధ్రజన సమావేశంలో ఉద్ఘాటించినట్లు ఆంధ్రోద్యమం ఉద్యోగాలకై కొట్లాట కాదు. పదవులకు ప్రాకులాటకాదు. పరిపాలన, విద్యాబోధన మాతృభాషలో జరిగితే, పరభాషలో జరిగితేను, తల్లిచనుబాలతో పెరిగిన బిడ్డకు, పోతపాలతో పెరిగిన బిడ్డకు ఉన్నంత తేడా ఉంటుందని ఘంటాపథంగా నుడివారు. ఆంధ్రోద్యమం జాతీయోద్యమానికి పునాది అయింది. ఆంధ్రప్రజలకు అప్పటికే ఒక సంస్థ, కార్యకర్తలు, జాతీయభావం, ప్రజాఉద్యమానికి పునాదిఅయింది. ఆనాటి ఆంధ్రోద్యమానికి ఆదర్శం శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు చూపారు.

జాతీయోద్యమంలో భాగంగా వున్న వందేమాతరం ఉద్యమంలో హోంరూల్ ఉద్యమంలో, కాంగ్రెసు ఉద్యమంలో ఆంధ్రులందరు కలిసి ఆంధ్ర

ప్రాంతానికి (అప్పటికి బ్రిటిషుపాలనలో వున్న జిల్లాలను కలిపి) ఒక రాష్ట్ర సంఘం ఏర్పడి పాలనా భాగంగా గౌరవం సాధించారు.

గాంధీజీ రాజకీయ రంగంలోకి రావడంతో హిందీ భారతదేశానికి రాష్ట్రభాషగా వుండవలెనని ఉద్బోధించారు. దేశానికి హిందీ రాష్ట్రభాష, అధికార భాషగా తమ ఆశయం ప్రజానీకం ప్రకటించింది.

పరప్రభుత్వం చీలించి పాలించమన్నట్లు బ్రిటిషు ప్రభుత్వానికి అండగా వున్నందున ఒరిస్సా, సింధు రాష్ట్రాలను 1935లో నిర్మించింది. జాతీయోద్యమ ప్రభావం ఉన్నందున ఆంధ్రులకు రాష్ట్రం లభించలేదు. కర్ణాటకము, మహారాష్ట్రము తమకు తమ భాషారాష్ట్రాలు కావాలని కోరారు.

శ్రీ లాలాలజపతిరాయ్ నాయకత్వాన పంజాబు ఉద్యమం, లోకమాన్య బాలగంధరతిలక్ నాయకత్వాన మహారాష్ట్ర ఉద్యమం, రాజేంద్రప్రసాద్ నాయకత్వాన బీహారు ఉద్యమం, శ్రీ రవీంద్ర కవీంద్రుని నాయకత్వాన బెంగాలు ఉద్యమం,ఆంధ్రమహాసభ నాయకత్వాన ఆంధ్రోద్యమం. తమ భాష కొరకు, తమ ఉనికికొరకు, తమ వ్యకిత్వం కొరకు వివిధరూపాల చైతన్యస్రవంతులు ప్రవహింప సాగినవి. ఆది జాతీయ ఉద్యమంలో భాగాలుగా ఉపనదులు మహానదిలో చేరినట్లు లీనమై, స్వాతంత్ర్య ధ్యేయంతో ముందుకు సాగాయి. తమతమ భాషావ్యక్తిత్వాలు నిలుపుకుంటూ – నిలుపుకొనుటలో నవజీవనోద్యమాలు సాగిస్తూ, బ్రిటిషుప్రభుత్వాన్ని ప్రతిఘటించుటకు కావలసిన ఐక్యతను సాధించుకొను గమనపరిజ్ఞానం ఇంగ్లీషులోపొంది, సమైక్య ఉద్యమాలు సాగించి స్వాతంత్రోద్యమఫలితంగా ఇరవై అయిదు సంవత్సరాల క్రితం సాధించ గలిగారు. కాని 1906 లో బెంగాలును మతప్రాతిపదిక మీద విభజించి, పాలించదలిచి, 1912 లో విఫలమైన ఇంగ్లీషు రాజనీతి, 1947 లో బెంగాలునే కాక భారతదేశాన్నే, మతప్రాతిపదికమీద చీల్చి భారత పాకిస్తానులు చేసి రెండు దేశాలు నిర్మించి, రెంటికి ప్రాధాన్యం ఇచ్చామంటూ వైతొలగారు.

భాషాప్రాతిపదికమీద యేర్పడిన జాతీయోద్యమమే స్థిరపునాదులమీద నిలబడగలదని, మతప్రాతిపదికమీద స్వాతంత్ర్యం తాత్కాలికమేనని పాకిస్థాన్ ఇరవై అయిదు సంవత్సరాల చరిత్ర ఋజువు చేసింది. మతావేశంలో ప్రారంభమై నామరూపాలు కలిగించుకొన్న పాకిస్థాను 1969 కల్లా మతంకన్నా భాష ప్రాధాన్యమని ముజిబుర్‌రహమాన్ నాయకత్వాన ప్రారంభమైన బెంగాలు ఉద్యమం సర్వ స్వతంత్ర సమాన ప్రజాస్వామ్యంగా బంగ్లాదేశ్ యేర్పడి, బెంగాలీ భాషను రాజభాషగా, బోధనా భాషగా నిర్ణయించుకుంది.

భారతదేశం స్వాతంత్ర్యం సాధించి 25 సంవత్సరాలైనా, దేశానికి స్వతంత్ర భాషావిధానం యేర్పడకపోవడం స్వాతంత్ర్యానంతరం నవోజ్జీవం సన్నగిలడం కారణం. స్వాతంత్ర్యం లభించిన తర్వాత అలవాటుక్రింద అధికారులు ఇంగ్లీషు వ్యామోహంలో పడిపోవడం – స్వాతంత్ర్యప్రకటననాడే దేశభాషను ప్రకటించని బలహీనత ఇంగ్లీషు ప్రాబల్యానికేగాక, ఇంగ్లీషు మీదనే అధికమోజు ఏర్పడి, స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన రెండు మూడు తరాల జనానికీ కూడ అలవాటుక్రింద ఇంగ్లీషు వాడుకలోపడిన అలవాటులో మాతృభాషపై అభిమానంసన్నగిల్లసాగింది.

ఆంధ్రోద్యమ సందర్భంగా శ్రీ అమరజీవి పొట్టి శ్రీరాములు బలిదాన ఫలితంగా కర్నూలు రాజధానిగా, ఆంధ్రరాష్ట్రం 1953 అక్టోబరు 1 వ తేదీన ఏర్పడింది. నిజంగా ఆంధ్రరాష్ట్రం యేర్పడిన వెంటనే, ఆంధ్రశాసనసభ తమ అధికార భాష తెలుగు అని ప్రకటించి ఉండవలసింది. అంతత్వరలో అతిసాహసంతో, ప్రభుత్వం ఏర్పడగనే తమ అధికార భాష బెంగాలీ అని ప్రకటించిన కీర్తి బంగ్లాదేశ్‌కే చెందుతుంది. అయినా ఈ వ్యాసరచయిత ప్రతిపాదించిన 'రాజ్యాంగ నిబంధనలను అసంగతంగా లేనంతవరకు, ప్రభుత్వ వ్యవహారాలను తెలుగులోనే నిర్వహించాలనేతీర్మానం శ్రీ అయ్యదేవరకాళేశ్వర రావుగారి 'సాధ్యమైనంత త్వరలో' అనే సవరణతో 1955 సెప్టెంబరు 29 తేదీన ఏకగ్రీవంగా ఆమోదింపబడింది. ఈ వ్యాసరచయిత ప్రతిపాదించిన బిల్లుమాత్రం త్రోసివేయబడింది.

1946 ప్రాంతంలో యేర్పడిన మద్రాసుకాంగ్రెసు మంత్రివర్గం ఆంధ్ర జిల్లాలలో తూర్పుగోదావరిజిల్లాలో, తమిళనాడులో తంజావూరుజిల్లాలో, విద్యా బోధన జిల్లాస్థాయివరకు మాతృభాషలోనే నిర్వహించవలెనని ప్రభుత్వం ఆదేశించింది. అమలుజరపటానికి ప్రయత్నించింది. కాని తీవ్రప్రయత్నం మాత్రం జరగలేదని చెప్పవచ్చు. అందుకే ఈతీర్మానం 'సాధ్యమైనంత త్వరలో' అని ఉండడంతో, నత్తనడకతో ప్రారంభంఅయింది. ఒక ఉన్న తాధికారిని వేశారు. ఇంతలో విశాలాంధ్రను సాధించడం జరిగింది.

నైజాం నిరంకుశ పాలనక్రింద ఉర్దూభాషరుద్దబడిన ఆంధ్రప్రజానీకం నైజాం ఆంధ్రమహాసభ ఆధ్వర్యాన శ్రీమాడపాటి హనుమంతరావు నాయకత్వాన ఆంధ్రభాషాభివృద్ధికి, ఆంధ్రప్రజల సముజ్జీవనానికీ, ఆంధ్రోద్యమం నడిచి, తెలుగు భాషాభివృద్ధికీ, సంస్కృతీ పరిరక్షణకు మహదుద్యమాలు

నడచినవి. నైజాం నిరంకుశత్వమే కాకుండా, నైజాం ప్రభుత్వాన్నే తొల గించుకో గలిగారు. అందరు తెలుగువారు ఒకటిగా అనేక శతాబ్దాల అనంతరం చేరగలిగారు. ఆంధ్రమాతకౌగిలిలో అనుంగు బిడ్డలుగా ఆశ్రయం పొందగలిగామని మహదానందపడ్డారు.

విశాలాంధ్ర ఏర్పడగనే ప్రథమకర్తవ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగును అన్ని స్థాయిలలో అటు అధికారభాషగా చేసిఉండినట్లయితే విశాలాంధ్ర సాధించినందుకు నిజమైన సార్థకత ఉండేది. అదికాకుండా, మద్రాసు రాష్ట్రంనుండి విడిపడినమననాయకత్వం ఇంగ్లీషునువదలలేక, నైజాంపాలననుండి బయటపడ్డ నాయకత్వం ఉర్దూనుండి బైట పడలేక తెలుగును అధికారభాషగా అమలు జరుపుటకు సాహసంతో నిర్ణయించుకో లేకపోవడంతో, అటు యిటు అధికారులు ఇంగ్లీషు అధికారభాషగా, బోధనాభాషగా అమలుజరుపుటలో తమ శక్తి సామర్థ్యాల్ని వినియోగించి రెండు వర్గాలలోను ఇంగ్లీషును అలవాటు చేశారు. విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పడిందనే సంతోషంతో, సంతృప్తిచెంది, అంతకుముందు ఈ రెండుప్రాంతాలలోను నడచిన ఆంధ్రోద్యమాలను ఆంధ్ర పునరుజ్జీవన ఉద్యమాలు మరుగునపడినవి. ఇటు బయట సాంస్కృతిక ఉద్యమం సజీవంగా నడవని సమయంలో, అటు అధికారులు, రాజకీయ నాయకత్వం తెలుగుపై పట్టుదల వహించక, ఇంగ్లీషునే ప్రోత్సహించడం, ఇంగ్లీషు లేకపోతే బ్రతుకలేమనే మనోదౌర్బల్యంతో పనిసాగిపోతే, అధికారుల చేయి పైచేయిఅయి అంతా ఇంగ్లీషులోనే సాగింది. అటు బ్రిటీషు పాలననుండి విడివడిన ఆంధ్రులుగాని, యిటు నైజాంనుండి బయటపడిన ఆంధ్రులుగాని తామాసించిన తెలుగుభాషలో పరిపాలన, బోధన జరిగి, తమ మాతృస్థానం అనుకోగలిగిన సాంస్కృతిక వారసత్వం - భాషాభిమానం ఎప్పుడూ అమలు జరగలేదే. ఇక మిగిలింది ఉద్యోగాలు, అధికారాలు, స్వార్థలాభాలు. వీటితో ఆంధ్రుల సమైక్యతకు ప్రధానమైనశక్తి వమ్ము అయింది. ఇతర ఆలోచనలు సాగినవి. అధికారంలోని అధికారులలో వచ్చిన వివాదాలు, స్వార్థాలు, ఆంధ్రప్రదేశ్ విచ్ఛిన్నతకు దారితీసినవి. అదృష్టవశాత్తు విచ్ఛిత్తికి దారితీసినవేకాని విచ్ఛిత్తి కాకపోవడం ఆంధ్రుల అదృష్టం.

ఈ పోకడలు ఒకవైపు యిటు జరుగుతుంటే, ఆంధ్రప్రదేశ్ శాసనసభలో తెలుగును అధికారభాషగా అంగీకరించ వలెనని దాదాపు తొమ్మిది మారులు అనధికారబిల్లు రూపంలోనేమి, తీర్మానం రూపంలోనేమి అదేపనిగా

ఈవ్యాసరచయిత ప్రతిపాదిస్తూ వచ్చాడు. చివరకు బిల్లురూపంలో అచ్చుకావటానికైనా నోచుకొని పరిస్థితి నుంచి 1964 లో అచ్చుకావడానికి ప్రభుత్వం అంగీకరించింది.

ఈ బిల్లు ప్రజాభిప్రాయానికి పంపబడింది. ప్రజాభిప్రాయ ప్రకటన సందర్భంగా దినపత్రికలలో ఆంధ్రప్రభ చూపినంత ఉత్సుకత ఇతరపత్రికలు చూపకపోవడం దురదృష్టం. పలువురు తమ అభిప్రాయాలు వెలిబుచ్చి ప్రోత్సహించారు. తర్వాత సెలెక్టు కమిటీకి పోయింది. సెలెక్షను కమిటీ స్థాయిలో ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు, నేటి ముఖ్యమంత్రి నాటి విద్యామంత్రిఐన శ్రీ పి. వి. నరసింహారావుగారు, అనధికార బిల్లుబదులు అధికారబిల్లును ప్రతిపాదించ నిశ్చయించారు. తర్వాత ఆఅధికారబిల్లు 1966లో శాసనం అయింది.

ఈ శాసనంలో ప్రతిపాదించిన సూచనలు ఎంతవరకు అమలు జరుపబడినవో వాటి ప్రగతి యే విధంగా ఉందో పరిశీలన చేయటానికి శ్రీ పి. వి. నరసింహారావుగారి అధ్యక్షతను ఒక పరిశీలన సంఘాన్ని నియమించారు. ఆ సంఘం 1970 లో తన నివేదికను ప్రభుత్వానికి అందజేసింది. శాసనంలో నిబంధింపబడినమేరకు అధికారభాషగా తెలుగు అమలును భాషాకమీషను వెంటనే చేయవలెనని సిఫారసు చేసింది. ఈశాసనం ప్రకారం శాసనం అయిన రోజునుండి అయిదు సంవత్సరాలకు ఒకభాషాకమీషను నియమించవలెనని నిర్దేశింపబడింది.

ఈ శాసనం వచ్చిన తర్వాత బోధనాభాష విషయంలో తెలుగులో ఇంటర్ మీడియట్ ప్రారంభించడం, బి. ఏ. లో తెలుగు బోధనాభాష చేయడం జరిగింది. కొఠారి కమీషను మాతృభాషలో విద్యాబోధన చేయవలెనని చేసిన సూచనకూడా కలిసి వచ్చింది. తమిళనాడు, కేరళ, మహారాష్ట్ర, పంజాబు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహారు, గుజరాతు రాష్ట్రాల్లో బోధన, పాలన మాతృభాషలో జరుపుటలో ప్రగతిలోనడుస్తున్నవి. కన్నడం ముద్రణా సౌకర్యం సాధించడానికి లినోటైపు సాధించింది. మహారాష్ట్ర, బెంగాలు, తమిళంలో ఇదివరకే ఉన్నవి, మళయాళం కూడ పూర్తి చేసింది. మనది ఆలోచనలో ఉంది, కాని ఆచరణకు ఇంకారాలేదు.

భాషారాష్ట్రాలు అనర్థకాలనేవారు – అసలు భాషారాష్ట్ర పాలనలో అమలు జరపకపోవడంవల్ల ఇబ్బందిని గ్రహింపకపోవడం దురదృష్టం. 'దేశభాష

లందు' తెలుగులెస్స, అనేఖ్యాతిగాంచి, Italian of the East గా విశ్వవిఖ్యాతి గణించి, సాంకేతిక పరిజ్ఞానంను ఇంగ్లీషు ఫ్రెంచి భాషలకన్న మిన్నగా సమ న్వయింప గలిగినది తెలుగు అని ప్రొఫెసరు హాల్డీన్‌చే గుర్తించబడి, 5 కోట్ల ప్రజలు గలిగి, భారతదేశంలో రెండవభాషగా గణుతికెక్కిన తెలుగు ఈ నాటికి పరిపాలనలో, బోధనలో సముచిత స్థానం పొందకపోవడం మనదురదృష్టం. భాషా ఉద్యమాల్లో, కర్ణాటక, మహారాష్ట్రల కన్న ముందేప్రారంభిచాం. అమ లులో అందరికన్నా వెనక ఉన్నాం. భారతస్వాతంత్ర్యం సాధించిన తర్వాత భాషారాష్ట్రంగా ప్రథమస్థానాన్ని సంపాదించుకున్నాం. దీనిఫలితంప్రభావంగా భాషారాష్ట్రాలు ఏర్పడ్డాయి అటుపై మహారాష్ట్ర, గుజరాతులుకూడ ప్రకటించ బడినవి. భాషావివాదాలు వచ్చినవని బెదురు చూపుచున్నారు. నిజమే. భాషా ప్రాంతాలను గ్రామజనాభా ప్రాతిపదికగా కలిసిఉన్న ప్రాంతాలు ఒకరాష్ట్రంలో చేర్చడం అయితే ఇన్ని వివాదాలు వచ్చేవి కావు. ఆనాటిఅధికారుల అభిమాన, దురభిమానాలతో సరిహద్దులు నిర్ణయించితే వివాదాలు పరిష్కారం ఎట్లా అవు తాయి? ఒకభాషపై మరొకభాష రుద్దదలంచితే వివాదాలు పెరగకుండా ఎట్లా ఉంటాయి? ఆవేశం ఎక్కువై అది పిచ్చిఆవేశంగా మారిన తర్వాత దానిని అదుపు చేయడం ఎంత అసాధ్యమో ముందే ఊహించాలి. తన భాషమీదప్రేమ పరభాషమీద ద్వేషంగా మారకూడదు. మరోభాషమీద గుడ్డిద్వేషంతో వ్యవ హరిస్తే, హిందీమీదకోపంతో తమిళనాడు ఇంగ్లీషుకు ప్రాధాన్య మిచ్చి నెత్తిన ఎక్కించుకుంటే చివరకు హిందీమీద ద్వేషం ఇంగ్లీషుమీద ప్రేమగా మారి, మాతృభాషతమిళంమీదకూడ కోపగించిన సంఘటనలు మనకు గుణపాఠాలు కావాల్సిఉంది. ఇంగ్లీషు అధికార భాషగా ఉన్నన్నాళ్ళు పాంతీయభాషలు అభి వృద్ధిచెందవు, చెందే అవకాశం ఉండదు. ఇంగ్లీషుమీద ద్వేషం మనకు ఉండ కూడదు. అధికారభాషపైన ద్వేషం ఉండకూడదు. తల్లిపైప్రేమ ఉందంటే ఇతరుల తల్లులపైద్వేషంఅనగలమా? మాతృభాషమీద ప్రేమలేనివాడు ఏభాష మీదకూడా ప్రేమకలిగి ఉండజాలడు. ఉన్నాడంటే అసంభవం.

గ్రామసీమల్లో అనేక నానుడులతో మాతృభాషలు సుసంపన్నం అయి ఉన్నవి. అధికచదువులు చదివి, వివిధభాషలలో పుస్తకజ్ఞానం సంపాదించిన వారు పెద్దలు కారనడం సబబుకాదు. అయితే వారికి గ్రామసీమలలో పల్లెపదాల క్రింద ఆకులో ఆకులై, నునులేతమొగ్గలుగా వుండిపోయిన పదాలు వారి అను భవంలో లేవు. ఈ అనుభవం లేనికారణంగా అసలు తెలుగులో పదాలు లేవనే వారు కొందరు. ఇంగ్లీషు లేకపోతే బ్రతుకుతామా అనేవారు కొందరు. ఇంగ్లీషే పనికిరాదనేవారు కొందరు, హిందీ జాతీయభాష అనేవారుకొందరు, అసలు హిందీ పనికిరాదనేవారు కొందరు. అసలు వీరందరు రెండవవైపు చూడనివా రనక తప్పదు. అన్నిభాషలు కావలసిందే. అన్నీ అందరకూ కావలెనా-దాని

ప్రయోజనం అతనికి ఎంత - గ్రామసీమల్లో రాష్ట్రోద్యోగాలలో నిలిచిపోయే వారినికూడ ఇతరరాష్ట్రాలకు, దేశాలకు పోవలసినవారికి అవసరమైన భాషలు లేకపోతే యెట్లా అంటే ఏమనాలె? భాషావివాదలు వెనుకపడినతనానికి చిహ్నాలనేవారు ఎంత వెనుకబడి ఉన్నారో। బెల్జియంలో వచ్చిన భాషావివాదం ఫలితంగా వారి రాజ్యాంగాన్నిమార్చిన సంగతి తెలియదనుకుంటా. ఫ్లాండరు భాషను అంగీకరించక తప్పలేదే. కెనడాలో ఇంగ్లీషుకు ఫ్రెంచితో సమాన స్థానం ఇవ్వవలసివచ్చిందని మరిచిపోతే ఎట్లా? అస్సాం ప్రజలపై బెంగాలీ రుద్దవలెనని ప్రయత్నించినపుడు జరిగిన సంఘటనలు మరువగలమా।

ఏమైనా, సహజసిద్ధమైన మాతృభాషలో, సామాన్యప్రజలభాషలో, ప్రథమదశలో అవని పరిధులు, అవకాశాలు గమనించితే మాతృభాషలో విద్యాభ్యాసం, పరిపాలన జరిగితీరవలె। లేకపోతే ప్రజాస్వామ్యం ఎట్లా అనగలం? వివిధ భాషలు గలిగిన భారతదేశంలో మైనారిటీ భాషలకు రక్షణ, పోషణయిస్తూ రాష్ట్రాల్లో బోధనకాని, పాలనకాని మాతృభాలోనే జరుగవలసివుంది.

ఇది ఆంధ్రప్రదేశ్‌లో ప్రయత్నం అయితే వివిధ రాష్ట్రాలలో ఆయా ప్రభుత్వాలు ఆర్డినెన్సులద్వారానూ, బిల్లుల రూపంగానూ, శాసనాల రూపంగానూ తమ తమ మాతృభాషలను అధికారభాషగా చేయటానికి కృషిచేశాయి.

ఆంధ్రప్రదేశ్‌లో శాసనం చేయడం జరిగింది గాని, ఆచరణలో కదలిక లేదు. పరిశీలన కమిటీలు వివిధజిల్లాలలో పర్యటించి నపుడు చూచిన అనుభవం ఇందుకు నిదర్శనం. అనేకశాసనాలు, జి. ఓలు జారీచేశారు. అది ప్రభుత్వం తీవ్రంగా అమలు జరుపుతుందని భావించడానికిచిహ్నం-అటుతర్వాత అనుదినం ఏమయిందని-కనుక్కోవటం అవసరం- పైఅధికారులుకూడ, దీని అమలును ప్రభుత్వం తీవ్రదృష్టితోనే గమనించుతుందనే భావంతో ప్రవర్తించడం అవసరం అని బోధపడింది.

అన్ని ఉద్యమాలలో, అన్ని త్యాగాలలో, మాతృదేశాభిమానంలో ముందుండి నాయకత్వంవహించినట్లే, భాషాఉద్యమంలో బోధనలో పాలనలో కూడ ముందుండి స్వాతంత్ర్య రజతోత్సవమునుండి ముందుకు కదలి ఐదారు సంవత్సరములలో, ఆంధ్రప్రదేశ్ పేరులోనేగాక, పాలనలో, బోధనలోకూడ ఆంధ్రప్రదేశ్ అని ఋజువుచేసి దేశభాషలందు తెలుగులెస్స అనిపిస్తారని విశ్వసిస్తున్నాను.

"జారిన దేశగౌరవము చక్కనదిద్ది మహాంధ్ర మండలీ
భారము శ్లాఘనీయముగ పాలనచేసి సమానరాష్ట్రముల్
కూరిమి నాసజేయ తెనుగుం బుడమిన్ గయిసేయవయ్య, దీ
ధారతి నాంధ్రపుత్రులు జగజ్జన ధర్మము దృష్టి నిల్పుచున్-"

# తెలుగులిపిలో తేవలసిన సంస్కరణలు

శ్రీ తిరుమల రామచంద్ర

మన లిపి ప్రాచీనతను ఇప్పుడు ప్రత్యాఖ్యానం చేసేవారెవరూ ఉండరనుకుంటాను. కనుక, దానినిప్పుడు పునస్సిద్ధాంతీకరించడం చర్వితచర్వణం. కొన్ని వేల సంవత్సరాలకు ముందే – కనీసం ఋగ్వేదకాలానికే – వ్రాత ఉందని, కాని, అది సంఘంలోని కొందరి సొమ్మే అయిఉండి, ప్రజాసామాన్యంలో మతప్రచారం చేయ తలపెట్టిన జైన బౌద్ధాచార్యులవల్ల వ్యాప్తి చెందిందని పలువురు పరిశోధకులు విశ్వసిస్తున్న సంగతి. అందువల్ల ప్రచార పరిణామగతుల పరంపరను నేడు ఏకరువు పెట్టనవసరంలేదు. తెలుగు వర్ణమాలా వరవర్ణిని సౌందర్య సౌష్ఠవాలను కాదనేవారూ కానరారు గనుక వాటి మీమాంసా మనకు అనవసరం.

ఇప్పుడు మనకు అవసరమైంది మన వర్ణమాలలో ఎప్పుడో ఎందుకో చొరబారిన అశాస్త్రీయతను తొలగించి. సౌలభ్య సౌకర్యాలు కలిగించుకోడం. ఈ సౌలభ్య సౌకర్యాలు సర్వసమ్మతాలు కావడంకూడ అవసరం. సర్వసమ్మతమంటే, నా దృష్టిలో నేటి ప్రజాస్వామ్య పద్ధతిలో – అంటే బహుమతసమ్మతం.

ఇది యంత్రయుగం. అన్ని యంత్రాలతోపాటు ముద్రణయంత్రమూ ఎంతో అభివృద్ధి చెందింది. కాని, తెలుగు ముద్రణ మాత్రం అంతేమీ ముందుకు పోలేదనవచ్చు. ప్రపంచంలోని అన్ని భాషల ముద్రణ ఒక ఎత్తు; తెలుగు ముద్రణే ఒక ఎత్తు. ఇదొక గారడీవంటిది. తెలుగు అక్షరాలు కూర్చడానికి కంపోజిటరు దాదాపు ఏడు వందల దిమ్మలు (గళ్ళు) జ్ఞాపకం పెట్టుకోవాలి. ప్రతి కంపోజిటరు శతావధాని, సహస్రావధాని కావాలి. ఈ చిక్కును తొలగించడానికి ఏ రోమన్ లిపినో మన లిపికన్నా చాల రెట్లు ఎక్కువగా అభివృద్ధి చెందిన దేవనాగరి లిపినో అనుసరించరాదా? – అనుకుంటే, అనూచానంగా వచ్చిన ఈ లిపిని వదలుకోవడానికి మనసు ఒప్పదు అక్షరాల స్వరూపం మార్చుకోడానికీ పలువురు ఇష్టపడరు. ఈ ధ్వని సంకేతానికి ఈ అక్షరం అని అలవాటుపడ్డాము. ఇప్పటి అక్షర స్వరూపాలు దాదాపు వేయి సంవత్సరాలుగా మనకు అలవాటులో ఉన్నవంటే అక్షర శాస్త్రజ్ఞులూ అంగీకరిస్తారు – దాదాపు వేయి సంవత్సరాలుగా ఇప్పటి వర్ణమాల వాడుకలో ఉంది. కనుక, శాస్త్రజ్ఞులూ,

లూ ఎంత చెప్పినా, ప్రజాసామాన్యం పెదచెవిని పెడు
ాలు తెలుసుకోడానికి కొన్ని తరాలు కావాలి. విద్యా
ంలోనూ, అధికారానికి వచ్చిన ప్రతి పాలకపక్షమూ
పాదయిన పరిస్థితి మరీ అధ్వాన్నమౌతుందనే విమర్శా

్యం ఉన్న అక్షరాలు ఇప్పుడున్నయా? మారుతూనే
ు, చేర్పులకు ఒప్పుకొనకపోవడం ఏమిటి? – అన
మార్పుచెందడమేకాదు; అప్పటిది ఇప్పటిదేనా అన్నంత
పిస్తుందనడంలో సందేహంలేదు. కాని, మార్పు క్రమ
జనం ఇష్టంపడుతుంది; అకస్మాత్తుగా, ఆకాశంనుంచి
ఇష్టపడకపోగా, ప్రతిఘటిస్తుంది. మార్పులవుద్దేశం,
ాటి పిడుగుపాటు కాదుకదా!

వ్రాయడంలో శాస్త్రీయమైన లోపాలున్న మాట ఇంగిత
ా ఒప్పుకొంటాడు. సమానత, లేఖనసులభత లేవన
ప్రతి భాషలిపికీ విశిష్టత ఉంటుంది. మూలం ఒకటయినా
దేశకాలప్రవృత్తి సాధనాభ్యాసాలనుబట్టి మారిపోయి
ట్లా అవుతుంది? – అనే సందేహమూ కలిగిస్తాయి
లిపిమాలలో కొన్నిస్వరూపాలు శాస్త్రీయంగా పరిణ
కొన్ని లేఖకశిల్పుల పొరపాట్లతో ఏర్పడినవీ వున్నాయి.
్యనికీ వున్న సంబంధమూ, ధ్వని గతివికారాలు అక్షరాల
మయిన పద్ధతీ చర్చించడం, సిద్ధాంతీకరించడం ఇప్పుడు
శాస్త్రీయమయిన స్వరూపాలు తెలుపడం, వాటిని
వేయడం ఉచితం కాకపోవచ్చునేమోననడం అవసరమని
కను వుట్టంకిస్తాను.

దీర్ఘం సూచించడానికి అశోకుని శాసనాల కాలంనుంచీ
పై అడ్డుగీత. ఆ అని అకారదీర్ఘం ఉచ్చరించినప్పుడు
ో అడ్డంగా సాగినట్టవుతుంది. ఇ అన్నప్పుడు, గొంతు
గుతుంది. ఇకార దీర్ఘం ఉచ్చరించేప్పుడు గొంతులో
ి సాగినట్టవుతుంది. ఉకారోచ్చారణలో పెదవులు రెండు
ముందుకు తోసుకొనివస్తుంది. ఉకారదీర్ఘంలో తోసుకొని

వచ్చిన ధ్వని మరింత ముందుకు సాగుతుంది. ఋకారోచ్చారణలో నాలుకకొన అంగిలికి తగిలి, ఈల వేసినటు ధ్వని పక్కకు వెళ్లుతుంది. ఏకారోచ్చారణలో ధ్వని గొంతులోపుట్టి పక్కవాటుగా వెనుక్కుపోయినట్టవుతుంది. ఐకారోచ్చారణలో గొంతులో పుటినధ్వని కిందికి అదుముకొని పోయినట్టవుతుంది. ఓ కారోచ్చారణలో ధ్వని అంగిట్లో ప్రతిధ్వనిస్తూ, పైకి వెళ్ళినట్టవుతుంది. ఔకారోచ్చారణలో అంగిట్లోధ్వనిని కొలిమితిత్తిని అదిమినట్టవుతుంది. ఈ ఉచ్చారణ ప్రతిబింబాలయిన గుర్తులు అశోకుని కాలంనుంచి కొద్దిపాటి కళాత్మకమైన మార్పులతో నేటి వరకు వివిధ భారతీయ లిపులలో కనిపిస్తున్నాయి. కనుక, ఇవి పూర్తిగా శాస్త్రీయాలు. మార్పులు చేయవలసినవస్తే, వీటిలో జరిగే అవకాశం తక్కువ.

మనలిపిమాలలో అశాస్త్రీయమైనది ఒత్తులపద్ధతి. ఒత్తులవయ్యారాలకు ముగ్ధులం కాకుండా, వీటిని తొలగించేసి, అర్ధాక్షరాల పద్ధతి అనుసరిస్తే, హిందీలో లాగా, బాగే. కాని, ఒత్తులు ప్రాతవి. రెండువేల యేళ్ళకుముందున పూర్ణాక్షరాల ప్రాచీనరూపాలు అనేవారిని సంతృప్తి పెట్టడానికి వీటిని అట్టే ఉంచినా, పెద్దగా జరిగే ప్రమాదంలేదు. అయినా, ఈ ఒత్తులు వ్రాసేపద్ధతి ఎలా ఏర్పడిందని తెలుసుకొంటే తీసివేయడానికే చాలమంది సుముఖులవుతారు.

ఒత్తక్షరాలంటే ద్విత్వాక్షరాలు. వీటిలో పూర్వం అప్రధానం; పరం ప్రధానం. పూర్వం ప్రాణంలేని హల్లుమాత్రమే. పరం ప్రాణం కల అక్షరం కనుక దానికే గుణింతాలు, ఒత్తులు ఇవ్వాలి. కాని,[*] అశోకుని శాసనాలు మొదలుకొని, పూర్వమైన, అప్రధానమైన మీది అక్షరానికి గుణింతాలు ఇవ్వడం కనిపిస్తుంది. క్రమంగా ఈ పొరపాటును లేఖకులు గ్రహించారు కాబోలు; ప్రధానమైన పరాక్షరానికి గుణింతాలు ఇవ్వడమూ అలవాటులో పెట్టారు.

ఈ పద్ధతివల్ల-పక్క అక్షరాలకు కొన్నివ్రాతలలో కిందిఅక్షరాలకు గుణింతాలుఇవ్వడంవల్ల ఒకగట్టిచిక్కు ఏర్పడివుంటుందనుకుంటాను;అకారణంగా పై అక్షరాలకు అంటే, పూర్వాక్షరాలకు గుణింతాలు పెట్టడమే ఉచితమని, వ్రాతలో సులువని పండితులు అభిప్రాయపడిఉంటారని నేననుకొంటాను. ఆచిక్కేమిటి? అప్పటికే మనలిపిమాలలో తలకట్టుపద్ధతి బాగా స్థిరపడింది. ఒత్తులుగా పెట్టిన కొంచెం కిందివరుస అక్షరాలకు గుణింతాలు ఇవ్వడంవల్ల చదివేటప్పుడు రెండు

వరుసలు చూచితడుముకోడం, తప్పులు చదవడం ఏర్పడిఉంటాయి. తలకట్టుతో పూర్తిగ పెద్దగా కనిపించే అక్షరానికి మార్పులేమీలేక ఒత్తుగా ఇచ్చిన కింది వరుస అక్షరానికి గుణింతాలు ఇచ్చామనుకోండి. పూర్ణాక్షరంగా తలకట్టుతో పైవరుసలో కనిపించే అక్షరమే చదువుతాడు సామాన్య పాఠకుడు. కిందిది- అంటే పరమైన ముఖ్యాక్షరం మరిచిపోతాడు, లేక చూపు తప్పుతుంది. తప్పులు చదువుతాడు. కనుకనే పై అక్షరానికి - అంటే ద్విత్వాక్షరంలో పూర్వాక్షరభాగానికి గుణింతాలు ఇవ్వడం నన్నయ కాలంలో ఒకస్థిరరూపానికి వచ్చింది. కాని పాతవాసనను బట్టి యావత్తువంటి వాటికీ గుణింతాలూ ఇచ్చే వారు. తిక్కనకాలానికి ఒత్తులైన ప్రథానాక్షరాలకు గుణింతం ఇచ్చేపద్ధతి పూర్తిగాపోయి అంటేచాలవరకూ పోయి అందాము- యాఒత్తు వంటిదానిలో మాత్రమే మిగిలింది. ఈ పద్ధతి పూర్తిగా అశాస్త్రీయం గనుక, దీనిని తొలగించి అర్ధాక్షరాల వాడుకకు సుముఖత చూపడం అవసరం.

కాని, మార్పు, సంస్కరణో రెమ్మ మొగ్గతొడిగి, పూవురేకులు విప్పారి నట్టు వుండాలిగాని, గారడివాని మామిడిచెట్టులాగ వుంటే, ఆశ్చర్యానుమానాలు కలిగించగలదేకాని, సత్ఫలంమాత్రం కలుగదు. ఈ సంస్కరణలు, నేడు ముద్రణదృష్టితోను, టైపురైటరు దృష్టితోను సాధ్యమైనంత అనుకూలంగా వుండాలి. ఇప్పటి లిపిస్వరూపం దాదాపు వేయిసంవత్సరాలుగా ఒకతీరుగా స్థిర పడింది. పెద్ద మార్పులు ప్రజల ఆగ్రహావేశాలకు కారణమవుతాయి గనుక ఇప్పటిలిపి స్వరూపసౌందర్యాలు చెడగొట్టని పద్ధతిని "మనలిపి పుట్టుపూర్వోత్తరాలు"లో సూచించాను. దానినే శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అధ్యక్షతను ఏర్పడిన లిపిసంస్కరణ సంఘ సమావేశంలో వివరించాను; నేటి ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు విద్యామంత్రిగా వున్నప్పుడు ఏర్పాటు చేసిన లిపిసంస్కరణ సదస్సులో తెలుగుకన్నడ లిపుల ఏకీకరణ సంఘం సమావేశకర్తగా, శ్రీ మద్దాలి రాఘవరామచంద్రరావుతోపాటు విపులీకరించాను. దానినే మరొకమారు విస్తరించి చెబుతాను.

అక్షరాల పౌనఃపున్యం - అనేసూత్రం ఆధారంగా ఈ సంస్కరణ సూచనలు చేశాను.

మన తెలుగులో సాధారణంగా ఎక్కువగా వచ్చేవి తలకట్టు గల అక్షరాలు. ఒక్క కన్నడంతప్పితే, దాదాపు భారతదేశంలోని లిపులలో ఇతరఅచ్చు గుర్తులను - గుణింతాలను - తలకట్టు గల అక్షరానికే చేరుస్తున్నారు. తెలుగు

లోనూ ఇదే పద్ధతిని అనుసరించవలెనని అనేకులు అనేకసూచనలు చేశారు. కాని, అవన్నీ ప్రజలలో ఎక్కువ మందికి హర్షదాయకం కాలేదు. అందువల్ల అక్షరస్వరూపం చెడకుండా వ్రాతలోను, అచ్చులోను అక్షరస్వరూపాలకు దగ్గరసంబంధం ఉండేలాగ అచ్చుదిమ్మలు సూచించాను. దీనివల్ల కలిగిన మార్పును ప్రజలు గుర్తించలేరు. పెట్టుబడి పెట్టడం తక్కువై అచ్చులకూర్పు వేగంగా జరిగినప్పుడు పుస్తక ప్రచురణకూడ సులభం. అందువల్ల ఈ వ్యాసంచివర సూచించిన మార్పులవల్ల ఆ ఆశయం నెరవేరుతుంది. అక్షర ముద్రలసంఖ్య 300 లకు తగ్గుతుంది. ఇవికాక సంఖ్యలు, విరామపు గుర్తులు కలిసి మొత్తం 350 వరకు అవుతాయి. ఈ దిమ్మల సంఖ్య ఇంకా తగ్గించవచ్చు. అయినప్పటికీ 700 అచ్చుముద్రలను వేగంలో తేడా లేకుండా తగ్గించడం, లిపిస్వరూపం చెడకుండా వుండడం, ముఖ్యంగా ముద్రణ సంస్థలయజమానులకు హర్షదాయకం.

మన తెలుగు కంపోజిటర్ల గళ్ళల్లో దాదాపు 700 దిమ్మలుంటాయి. వీటిని తగ్గించాలంటే, లిపిని చాలవరకు మార్చుకోడం గాని, వాటిని ముక్కలు ముక్కలుచేసి కూర్పులు తిరిగి అతుకుకోవడం గాని అవసరం. లిపిని మార్చుకోవాలంటే చాలమందికి గిట్టదు. కనుక రెండవ పద్ధతే మంచిది. గళ్లు తగ్గించడంవల్ల రెండు ఉపయోగాలున్నాయి. ముద్రణాలయం పెట్టేవారు అచ్చులు కావలసివచ్చినప్పుడు కిలోల లెక్కన కొంటారు. దీనివల్ల అవసరంలేని దిమ్మలు తూకంలో ఎక్కువగా రావచ్చు. దీనిని నివారించడానికి ఏదో ఉపాయం ఆలోచించాలి. ఏ అక్షరం పూర్తి స్వరూపాన్నయినా పెక్కు ముక్కలుచేసి తిరిగి ఆ ముక్కలను అదే క్రమంలో అతికితే ఆ అక్షర స్వరూపం పూర్తిగా అలాగే ఉంటుంది. ఈ పద్ధతిలో మన తెలుగు అక్షరాలను అనేక భాగాలుగా విడగొట్టవచ్చు. అలాచేసినా కంపోజింగు వేగంలో లోపం రాకూడదు. అక్షరాల దిమ్మల సంఖ్య తగ్గినప్పుడు అక్షరాలు కూర్చే కంపోజిటర్లు ఎక్కువ ప్రదేశాన్ని ఉపయోగించుకొనవలసిన అవసరం తగ్గుతుంది; వేగమూ ఎక్కువవుతుంది. మార్పులు చేసి, దిమ్మలు తగ్గించిన పట్టిక ఇది :

| | | | | | |
|---|---|---|---|---|---|
| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ |
| ఎ | ఏ | ఐ | ఒ | ఓ | ఔ |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| క్ | క | కా | కి | కీ | కె | కే | |
| ఖ్ | ఖ | ఖా | ఖి | ఖీ | ఖె | ఖే | |
| గ్ | గ | గా | గి | గీ | గె | గే | |
| ఘ్ | ఘ | ఘా | ఘి | ఘీ | ఘె | ఘే | |
| చ్ | చ | చా | చి | చీ | చె | చే | |
| ఛ్ | ఛ | ఛా | ఛి | ఛీ | ఛె | ఛే | |
| జ్ | జ | జా | జి | జీ | జె | జే | |
| ఝ్ | ఝ | ఝా | ఝి | ఝీ | ఝె | ఝే | |
| ట్ | ట | టా | టి | టీ | టె | టే | |
| ఠ్ | ఠ | ఠా | ఠి | ఠీ | ఠె | ఠే | |
| డ్ | డ | డా | డి | డీ | డె | డే | |
| ఢ్ | ఢ | ఢా | ఢి | ఢీ | ఢె | ఢే | |
| ణ్ | ణ | ణా | ణి | ణీ | ణె | ణే | |
| త్ | త | తా | తి | తీ | తె | తే | |
| ద్ | ద | దా | ది | దీ | దె | దే | |
| ధ్ | ధ | ధా | ధి | ధీ | ధె | ధే | |
| న్ | న | నా | ని | నీ | నె | నే | |
| ప్ | ప | పా | పి | పీ | పె | పే | |
| ఫ్ | ఫ | ఫా | ఫి | ఫీ | ఫె | ఫే | |
| బ్ | బ | బా | బి | బీ | బె | బే | |
| భ్ | భ | భా | భి | భీ | భె | భే | |
| య్ | య | | | | యె | యే | |
| ర్ | ర | రా | రి | రీ | రె | రే | |
| ల్ | ల | లా | లి | లీ | లె | లే | |
| వ్ | వ | వా | వి | వీ | వె | వే | |
| శ్ | శ | శా | శి | శీ | శె | శే | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ష్ | ష | షా | షి | షీ | షె | షే | |
| స్ | స | సా | సి | సీ | సె | సే | [illegible] |
| హ్ | హ | హా | హి | హీ | హె | హే | |
| ళ్ | ళ | ళా | ళి | ళీ | ళె | ళే | [illegible] |
| ఱ్ | ఱ | ఱా | ఱి | ఱీ | ఱె | ఱే | ఱ |
| క్ష్ | క్ష | క్షా | క్షి | క్షీ | క్షె | క్షే | [illegible] |
| ఝ | ఝు | ఝ | ఝా | ఝు | ఝూ | | |
| జు | జూ | ఫు | ఫూ | ఫు | ఫూ | | |
| వు | వూ | త్రి | ు | ూ | ఝా | | |
| ా | ొ | ో | ౌ | ం | ( | ః | |
| ల | లా | ౢ | | | | | |

ఈ సూచనలు ఎంతో పరిశ్రమతో, ఇప్పటి లిపి స్వరూప సౌందర్యాలు చెడరాదన్న దృష్టితో చేసినవి. సహృదయులు పరిశీలిస్తారని నమ్మినాను.



# నేటి జాతక కథలూ, కాశీమజిలీలూ

శ్రీ గోరాశాస్త్రి

మధిర సుబ్బన్న దీక్షితులుగారు మహానుభావుడు. సందేహం లేదు. గొప్పవాడు. ఇవాళ ఆంధ్ర మహాజనులలో చాలామంది ఆయన పేరుకూడా తెలియని దుస్థితిలో ఉన్నారంటే, అది వాళ్ళ దురదృష్టం గాని దీక్షితులుగారి గొప్పతనానికి మచ్చ కాదు. పాపం, ఇప్పు డాయన లేరు. ఇహలోకాన్ని విడిచి చాలా కాలమైంది. తారీఖులూ వగైరాలు అనవసరం. దేనికి? మనకి కావలసినదీ, కృతజ్ఞతాపూర్వకంగా తలుచుకోవలసిందీ, దీక్షితులుగారు సృష్టించి అందించిన సాహిత్యం. నేటి శతాబ్దం వార్ధక్యంలో పడింది. అది తరళతారుణ్యంలో ఉన్నప్పుడు దీక్షితులుగారు దీక్ష వహించి, "కాశీమజిలీ కథలు" కుప్పలు కుప్పలుగా రాసి సంపుటాలుగా ప్రకటించారు. అబ్బో ఎన్ని సంపుటాలు! ఎన్నెన్ని కథలు! అల్లిక జిగిబిగిలో ఆయన సిద్ధహస్తుడు. సాహిత్య భుజబలంలో ఆయనకు ఆయనే సాటి.

"కాశీమజిలీ కథలు" కేవలం కాలక్షేపం కథలే కావచ్చును. ఆంధ్ర సాహిత్య సమీక్షలలో దీక్షితులుగారి పేరు కనబడకపోవచ్చును. అయితేనేం, ఒక దినుసు సాహిత్యం కాలక్షేపానికి పనికొచ్చినా, అదెంతకాదు? అభూత సంఘటనలతో, అసహజ వ్యక్తులతో గమ్మత్తు కథలు అల్లుకుంటూ పోవడానికి అదొక రకం ప్రతిభ కావాలి.

శివశంకరశాస్త్రిగారు అనువదించిన "జాతక కథలు" కూడా అలాంటివే. శాస్త్రిగారి భాష సారస్వత పరిమళాలను వెదజిమ్ముతుంది. వ్యత్యాసం అంత వరకే. ఐతే, కాశీమజిలీ కథలే ఎక్కువ రుచివంతంగా ఉంటాయి. చదివే వాళ్ళను ఆకట్టుకుంటాయి.

"బ్రహ్మమానసపుత్రుడు" అంటారే, అలాగే మధిర దీక్షిత మానస పుత్రులు, పుత్రికలు, ఇవాళ ఆంధ్ర సాహిత్య రంగంలో శతాధికంగా వెలిసి, వీరవిహారం చేస్తున్నారు. సారస్వత క్షేత్రాన్ని భీషణంగా దున్నేస్తున్నారు. కథలు, కథానికలు, నవలలు పండించేస్తున్నారు. రచయిత్రులు మరీ మరీ విజృంభించారు మరుగున పడిన పాతకాలపు ఇంగ్లీషు నవలలు, కథల సంపుటాలు గాలించి వెదికి, బూజు దులిపి, వాటిలోని ఇతివృత్తాల్ని, పాత్రల్ని తీసి

కాని, కాస్తంత "స్వదేశీయత" ద్రావకంలో ముంచి, రసాయనిక ఎరువులవలె ఉపయోగించి, కథల పొట్లకాయలు, నవలల గుమ్మడికాయలూ పండిస్తున్నారు. సాంద్ర వ్యవసాయం జోరుగా సాగుతోంది. లారీలకొద్దీ పొట్లకాయలూ, గుమ్మడికాయలూ, ఆనపకాయలూ తెలుగు సాహిత్య మార్కెటులోకి తరలిస్తున్నారు. దుకాణాలు కళకళలాడుతున్నాయి. దుకాణాలవాళ్ళు తమ దినుసుల్ని తెగ పొగుడుతున్నారు. సాహిత్యం కొనుక్కునేవారిని రకరకాలుగా ఆకర్షించి మొహమాట పెడుతున్నారు ఓ సాహిత్య గుమ్మడికాయ కొంటే నాలుగు దొండ కాయలు ఉచితంగా యిస్తామంటున్నారు.

ఈ రకం "సాహిత్య పంట" సంరంభంలో అకాడమీలూ, ప్రభుత్వాలూ, తలదూర్చాయి. వ్యవసాయ ఖర్చులకు ఋణాలిస్తున్నాయి. పండించిన బుట్టెడు వంకాయల్లో రెండు కిలోలు విధిగా కొంటున్నాయి. మొత్తంమీద తతంగం యావత్తూ మూడు పళ్ళూ, ఆరు కాయలుగా సాగుతోంది.

క్షేత్రాలు సారవంతంకావు. ఊసరక్షేత్రాలకు అమాంతము ఉత్సాహము వచ్చింది. గాలిలో తేలి వచ్చిపడిన పుచ్చు చచ్చు విత్తనాలకు మొలకలూరు కొస్తున్నాయి. ఈరకం సాహిత్య దినుసు చూడ్డానికి బాగుంటుంది. విశిష్టత అంతవరకే. రసాయనిక ఎరువుల దోహదంతో పండాయేమో, నిగనిగ మెరుస్తాయి. ఐతే, పొట్లకాయ గునపంలా ఉంటుంది. త్రవ్వకానికి పనికిరాదు. పోనీ పొట్లకాయ అనుకుంటే తినడానికి బాగుండదు. గుమ్మటంలాంటి గుమ్మడికాయ దూదివలె మెత్తగావున్నా, రాయివలె గట్టిగావున్నా, దేనికీ కొరగాదు. రుచీ, పసా రెండూ అభావం. చప్పగా, నిస్సారంగా ఉంటుంది.

రుచిలేని సాహిత్యదినుసుల్ని, అభిరుచి పరిజ్ఞానంలేనివాళ్ళ ఉత్సాహంగా ఆరగించి, "బాగున్నాయి, బాగున్నాయి" అంటున్నారు. సరుకుల ప్యాకింగు ఆకర్షణీయంగా వుంటోంది. సాంకేతికరంగంలో వచ్చిన అభివృద్ధి ధర్మమా అని, ప్యాకింగుపద్ధతులు పసందుగా ఉన్నాయి.

మారుతున్న సమాజాన్నీ, జీవనవిధానాన్నీ దగ్గరగా చూస్తున్నా, అందులోనేవుంటూ, ఆటుపోటులకు గురియవుతూ, తలాతోకా బోధపడక, ఉక్కిరిబిక్కిరై, కలంచేతబట్టి, కల్పనాసాహిత్యాన్ని బనాయిస్తున్నవారు కాశీమజిలీలనే అనుసరిస్తున్నారు.

కాశీమజిలీ రాజకుమారుడు సప్తసముద్రాలు దాటి, దుర్గమారణ్యంలోని మంజుఘోష సరస్సు అడుగుననున్న ముత్యాలహారం సంపాదిస్తాడు. నేటి రాజ

కుమారుడు - అనగా ప్రేమలోపడిన చిట్టితల్లి మేనత్తకొడుకు - అమెరికావెళ్ళి "అయోవా" యూనివర్శిటీలో రీసెర్చిచేసి డిగ్రీలాక్కొస్తాడు. అతడికోసం చిట్టితల్లి నిరీక్షిస్తుంది. తలిదండ్రులు వేరే సంబంధాలు చూస్తారు. వద్దంటుంది. ట్రాజెడీవిత్తనాలు పడ్డాయి. లేదా రాజకుమారుడు అమెరికానుండి తిరిగొచ్చాక, "నిన్నుప్రేయసిగా భావించి ఎప్పుడూ ప్రేమించలేదు శైలజా! (సుహాసిని! అనితా! అరుణా! ఒకుళాభరణా! శేషాలినీ!) నాది సోదరప్రేమ!"_అనేస్తాడు. చిట్టితల్లి అమాంతం మొగాళ్ళస్వార్థంమీద లెక్చెరు దంచేస్తుంది. అన్నీ ప్రేమకథలే. నదరురసానికి స్థాయిభావం వివాహం.

కాలేజీస్నేహాలు, మేనరికాలు, అమ్మానాన్నలు, బామ్మలు, "హనీమూన్"లు, స్నేహితురాళ్లు, కాశ్మీర్, లండన్, న్యూయార్క్ - అక్కడనుండి చేటపర్రు, పాచిపెంట, పిడుగురాళ్ళ - మద్రాసు మెరినాబీచి, హైద్రాబాదు ట్యాంక్‌బండ్ వరకూ స్థలాన్ని ముడివేస్తారు. ఆఫీసుప్రేమలూ, సెక్రటరీలు, ఆసుపత్రిప్రేమలు, త్యాగాలు - వస్తుగుణంలో అన్నీ కాశీమజిలీలే, పేదరాశిపెద్దమ్మ ఉపాఖ్యానాలే.

కల్పనాసాహిత్య పేజీల నదస్సులో ఎంతదూరం వెళ్ళినా,చీలమండదాటి లోతువుండదు. గడచిన పదిపదిహేను సంవత్సరాలలో కుప్పతెప్పలుగా వస్తున్న కల్పనాసాహిత్యం రెండుతరాల తెలుగువారి సాహిత్యాభిరుచుల్ని దయనీయంగా దిగజార్చివేసింది.

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యంవచ్చి 25 సంవత్సరాలు నిండాయి. సంతోషంతో ఉత్సవాలు చేసుకుంటున్నాము. ఒక్కసారి వెనక్కితిరిగిచూస్తే, పాతిక సంవత్సరాలలోనూ జాతీయజీవనంలో వచ్చిన మార్పులను సింహావలోకనంచేస్తే, ఆనందించవలసిన అంశాలెన్నో ఉన్నాయి. అన్నిరంగాలలోనూ సాధించిన అభివృద్ధి బ్రహ్మాండమైనది. వస్తూత్పత్తిలోనేకాదు, నిర్మాణంలోనే కాదు, సాంఘికజీవన విధానంలోనే దేశచరిత్రలో మున్నెన్నడూ లేనంతగా రసాయనికమైనమార్పు వచ్చింది. ప్రేరణలు, అనుస్పందనలు, దృక్పథాలు అన్నీ కొత్తవి. పరిణామ గుణంతోపాటు పయనిస్తోన్న మనసున నాటి, నేటి సాంఘిక వ్యవస్థలవ్యత్యాసం పూర్తిగా అవగాహనలోనికి రాలేదు.

అలనాడు - స్వాతంత్ర్యానికి పూర్వంవరకూ సమాజంలోని ఒకటోరకం మేధావుల్ని సృజనాత్మకశక్తి, ఉపజ్ఞా, వ్యుత్పత్తీ, సమస్తమూ నిండుగా ఉన్నవారిని సాహిత్యరంగం ఆకర్షించింది. అప్పటివారికున్న అవకాశాలు

చాలాతక్కువ. సాంఘిక శ్రేయస్సు, ఉన్నతీగురించి ఆలోచించగలిగే చైతన్య వంతులు సంఘ సంస్కరణ కార్యక్రమానో్న, రాజకీయస్వాతంత్ర్యోద్యమానో్న సాహిత్యేద్యాది కళాఖండాలనో చేపట్టేవారు. సాంకేతిక, వైజ్ఞానికరంగాలలో కృషిచేసేవారు సకృత్తుగా వుండేవారు, అవకాశాలేవీ ? - ఇప్పుడున్నన్ని యూనివర్శిటీలు, కాలేజీలు, ప్రభుత్వయంత్రాంగంలో శాఖలు, అన్నీ పరిమితం. మేధావి వర్గాలవారు తమ ప్రతిభ నిరూపించడానికి చోటు యిరుగ్గావుండేది. రాజకీయరంగం — అనాడు — ప్రమాదకరమైనది. అగ్నితో చెలగాటము. అన్నివిధాలా భస్మీపటలమవడానికి సిద్ధపడినవాళ్ళే అందులో దూకేవారు. తక్కినవాళ్ళు లాయర్లుగానో, టీచర్లుగానో, ఉద్యోగులుగానో, స్థిరేపడేవాళ్లు. వైద్యం, ఇంజనీరింగు, సైన్సు రంగాలు చిన్నవి.పోనీ, పరిపాలనా దక్షులుగా ప్రతిభ నిరూపించాలన్నా, తెల్లదొరలు అనుమతించేవారు కాదు.

అంచేత సాహిత్యాది కళారంగాలే శరణ్యామయ్యాయి. ఒకటోరకం మేధావులు, సహజప్రతిభావంతులు వాటిలో ప్రవేశించేవారు. విశ్రాంతికి లోటు లేదు. అనాడు సామాజిక జీవనంలో నేడున్నంతవడీ, వేగమూ, ఆందోళన, అసంతృప్తి, తహతహ, తృష్ణా లేనేలేవు. అంచేత, ప్రతిఫలాపేక్ష లేకుండా, యావచ్ఛక్తి వినియోగించి శ్రమించేవారు. అందువల్లనే సాహిత్య క్షేత్రాల్ని సుసంపన్నం చేయగల్గారు.

పాతికేళ్ళలో అత్యంతోద్దీప్తమైన విప్లవం వచ్చింది. దేశానికి లక్షలాది సాంకేతిక నిపుణులూ, పరిపాలనా దక్షులూ, డాక్టర్లూ, ఇంజనీర్లూ, సైంటిస్టులూ కావలసి వచ్చారు. అవకాశాలు పెరిగాయి. 1947 నుండి 1960 వరకూ యువత రానికి అదొక బంగారంవంటి అవకాశాలసమయం. యువతీ యువకులందరూ టెక్నికల్, అడ్మినిస్ట్రేటివ్, రంగాలవైపు దౌడుతీశారు. ఒకటో రకం ప్రతి భావంతులు అవసరమయారు. విదేశాలలో ఉన్నతవిద్య అందుబాటులో కొచ్చింది. జాతి పునర్నిర్మాణ కార్యక్రమం జోరుగా సాగిన సమయమది. ఉన్నతికి మార్గాలు తెరుచుకున్నాయి. రెండు మూడు తరాల ప్రతిభావంతులు ఐ.ఏ.యస్., ఐ.పి.ఎస్. రంగాలకు పరిగెత్తారు. వైద్య, ఇంజనీరింగు, సైన్సు, రీసెర్చి, బ్యాంకింగు, ఆర్థికశాస్త్రం, పారిశ్రామికరంగం - ఒకటేమిటి, అన్ని రంగాలు ప్రతిభావంతుల్ని ఆకర్షించాయి.

ప్రేరణలలోనే మార్పువచ్చింది. అటుచూస్తే ప్రభుత్వయంత్రాంగం శాఖోపశాఖలు పెంచుకొని విస్తరించుకొంది. ప్రతిభావంతులైన యువకుల్ని

ఏర్పాటు చేసింది. అందుచేత వెన్నా, నవనీతము
ాటి వాళ్ళని సాహిత్యరంగం ఆకర్షించలేదు. అందులో
కంటె కలక్టరవడం పోయికదా! నవనవోన్మేషంగా
"బెస్ట్‌బ్రెయిన్స్" ని సాహిత్యేతర రంగాలలోకి లాగే

ుగిలినవారి మీదపడింది. అక్షరాస్యత పెరిగినకొలదీ
, గిరాకీ హెచ్చింది. ఎక్కువ సరుకుకావాలి. తయారు
ు కావాలికదా! "వాక్యూమ్" లోకి యువకులు ప్రవే
ంజరిగిందో సమగ్రంగా, లోతుగా, సమ్యక్ దృష్టితో
నివేదించ గలిగేశక్తి కొరవడింది గనుక, ఇంకా
సరసాలు, ప్రేమ పురాణాలు, విఫల ప్రణయాలు
సికంగా పసివారు అంతకంటె ఏంచేస్తారు! కళాత్మక
రిచయం లేనివారు చదివి ఆనందిస్తున్నారు. స్వాతం
కలుగా ఉండి, సాహిత్యదండాన్ని చేపట్టిన యోధాన
నవారై, అలిసిపోయి కూర్చున్నారు. కొత్తగా వచ్చిన
చనాలతో చూస్తూ, అదేమిటో బోధపడక, అయో
వాళ్ళలో రెండురకాల వాళ్ళున్నారు. నూతనత్వాన్ని
రు. అర్థం తెలియకుండానే దీవిస్తున్నారు, శపిస్తున్నారు.
చ్చింది. కొత్తయుగం బోధపడదు. అంచేత నేటి
ర్దారిణులూ, కాశీమజిలీ పాత్రలకు టైట్ ప్యాంట్లు,
న్నారు.

# తెలుగువారి రాజకీయచైతన్యం

శ్రీ అక్కిరాజు వాసుదేవరావు

ప్రపంచ చరిత్రలోనే భారతీయ స్వాతంత్ర్య సమరం పరమాద్భుతమైనది. భారతీయుల స్వాతంత్ర్య సముపార్జనలో ఆంధ్రులపాత్ర గణనీయమైనదీ విశిష్టమైనదీ కూడా. తొలినాళ్ళలో కాంగ్రెస్‌పార్టీ చరిత్రాత్మకమైన తీర్మానాలు చేస్తూ, జాతీయ చైతన్యాన్ని ఉద్దీపింపజేస్తున్న సంరంభదశలో పనప్పాకం ఆనందాచార్యులుగారు జాతీయకాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించారు. లండన్‌లో చదువుకొనే రోజుల్లో కాంగ్రెస్ సంస్థాపకులలో ప్రముఖులైన దాదాభాయినౌరోజీ, శ్యాంజీకృష్ణవర్మ మొదలైనవారితో మన ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు కలిసి పనిచేశారు. అఖిల భారత స్థాయిన పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం ప్రఖ్యాతి కెక్కింది. అల్లూరి సీతారామరాజు పరాయిప్రభుత్వాన్ని గడగడలాడించాడు. దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులు, విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు, మహా మేధావి పట్టాభి, రాజర్షి బులుసు సాంబమూర్తి, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య మొదలైన వారంతా స్వాతంత్ర్యోద్యమ దీప్తిని తెలుగునాట ప్రసరింపజేసిన విషయం సువిదితమే.

స్వాతంత్ర్యానంతరం తెలుగుల చరిత్రలో చెప్పుకోదగిన ప్రధాన ఘట్టాలు రెండు. అవి పొట్టి శ్రీరాములు ఆత్మార్పణంతో ఆంధ్రరాష్ట్రం సిద్ధించడం, అటుతరువాత ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావం. ఆధునిక భారతదేశ రాజకీయ చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖించవలసిన ఘట్టం స్వాతంత్ర్యానంతరం ఏర్పడ్డ తొలి భాషాప్రయుక్త రాష్ట్రం ఆంధ్ర రాష్ట్రం. ఆ తరవాత అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు, మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు ప్రభృతులు తెలుగువాళ్ళను ఏకంచేశారు.

తెలుగువాళ్ళలో రాజకీయ చైతన్యం ఒక్కొక్కసారి అపరిమితంగా కూడా పెల్లుబుకుతుంది. దురదృష్టకరమైన ప్రాంతీయ అసమానతలవల్ల, వెనకబడిపోయిన కారణాలవల్ల, ఇటీవల కొద్దికాలం క్రితం, తెలుగుదేశంలో సంక్షోభం కూడా చెలరేగింది. కాని రాజకీయవేత్తల విజ్ఞతవల్ల సమస్యా పరిష్కారమై నూతనాధ్యాయమే ప్రారంభమైంది.

స్వాతంత్ర్యానంతరం తెలుగుదేశంలో రాజకీయ సుస్థిరతను ప్రదర్శించింది ఒక్క కాంగ్రెసుపార్టీ మాత్రమే. మరీ ఇటీవల కాలంలో అఖిలభారత స్థాయిలో జరిగినట్లే తెలుగుదేశంలో కూడా అతివాద, మితవాద రాజకీయపార్టీలు తమ ప్రతిపత్తిని కోల్పోయినాయి. ఏ రాజకీయపక్షమైనా, అది పాలకపక్షమైనా సరే, ప్రజలతో సన్నిహిత భాగస్వామ్యం లేకుండా, ప్రభుత్వాన్ని ఏర్పరిచే దృష్టితో మాత్రమే తమ కార్యక్షేత్రాన్ని విస్తరిస్తే ప్రజాస్వామ్యం సుస్థిరం కాజాలదు. అత్యంత ప్రధానమైన నిర్ణయాలన్నీ అగ్రనాయకులే తీసుకొంటున్నారు. ప్రజలలోంచి తాదాత్మ్యభావం కనపడ్డంలేదు. ఏ రాజకీయ పార్టీ అయినా ప్రజలకు సన్నిహితంగా లేకపోతే నేలవిడిచి సామే అవుతుంది. ఇటీవల పార్లమెంటుకు జరిగిన మధ్యంతర ఎన్నికలలోను, రాష్ట్ర శాసనసభల ఎన్నికలలోను, ఒక అపూర్వమైన రాజకీయ చైతన్యం ప్రజలనుంచి ప్రస్ఫుటమైంది.

అయితే సాంఘికార్థికాది రంగాలలో, అనేకమైన సమస్యలు ఎదుర్కోవలసి వస్తున్నాయి. నిర్మాణాత్మకమైన కృషితో, పరిణతమైన అవగాహనతో, సమస్యలను పరిష్కరించుకోవాలి. వర్తమానకాలంలో, ఒక జిజ్ఞాస ప్రజలలో కనపడుతున్నది. సభ్యదేశాలలో మన ఉనికినీ, మనికినీ స్థిరంచేసుకోవాలన్నదే ఆ ఆరాటం. ఇందిరాగాంధీ నాయకత్వంలో, ఆమె నడిపించే ప్రగతి పథంలో, సామాజిక శ్రేయస్సును, సాంఘిక న్యాయాన్ని, సాధించుకోగలమని భారతప్రజ విశ్వసిస్తున్నది.

తెలుగువాళ్ళలో రాజకీయ చైతన్యం సమృద్ధి. భారతదేశంలో ఆధునిక కాలంలో పుట్టి పెరిగిన అన్ని రాజకీయపక్షాలలోను, తెలుగువారి పాత్రగణ్యమే. అగ్రగణ్యమే. అన్ని రాజకీయ పక్షాలలోనూ సిద్ధాంతవేత్తలూ, కర్తలూ

నాయకత్వ చాతుర్యం కలవాళ్ళు ఎందరో వున్నారు. ఉద్యమాలు నడిపించారు.

అయితే ఆధునిక కాలాన, నిర్మాణాత్మకమైన కృషితో, ఒక్కత్రాటిమీద స్వస్థాన వేషభాషాభిమానంతో, సురుచిర స్వప్నాలన్నీ నిజమయ్యేట్లు తెలుగు వాళ్ళు కృషిచేయాలి. అగ్రగామిత్వానికి గాని, చైతన్యానికిగాని తెలుగువాళ్ళలో లోటులేదు. అన్ని ఉద్యమాలూ తెలుగులను ఆకర్షిస్తాయి. అందులో పాలు పంచుకొన్నారు. సర్వోదయోద్యమంలో భూదానంకూడా తెలుగుదేశంలోనే ప్రారంభమైంది.

ఇది స్వాతంత్ర్య రజతోత్సవ వత్సరం. భారతదేశం ప్రపంచదేశాలలో సమర్థమైన స్థానాన్ని సంపాదించే కృషిలో తెలుగువాళ్ళ సర్వతోముఖమైన వికాసానికి మనం పునరంకితమవుదాం.

# తెలుగు రచయితల తీరని సమస్యలు

శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి

స్వాతంత్ర్య సముపలబ్ధితో మనదేశము తన సమస్యలను తానే పరిష్క రించుకొనవలసిన బాధ్యతలను స్వీకరించినది. సమాజమునందలి యన్ని తరగతులలోను అక్షరాస్యత నానాటికి పెరిగిపోవుచుండుట వలన కేవలము కవిత్వమేకాక ఇతర రంగములకు సంబంధించిన జ్ఞానమును గ్రంథ ములద్వారా అందించవలసిన యవసర మేర్పడుటచేత నీ నడుమ రచయితలలో వైవిధ్యము కానవచ్చుచున్నది.

రచయితలు చదువుకొన్నవారు. విచక్షణాజ్ఞానము కలవారు. తమ భావ ములను నితరులకుఁ దెలుపుటలో సిద్ధహస్తులైనవారు. ప్రజాస్వామ్య సమా జమున రచయితలు — కవులు, పాత్రికేయులు, నిర్వహించవలసిన పాత్ర ఇంతంత చెప్పనలవికాదు. కాని భారతదేశమునందు రచయితలకు ననువైన యవకాశములు లేవు. ప్రాచీన కాలమునందువలె కేవలము రచనలుచేసి బ్రతుకుదెరువు చూచుకొనువారిప్పుడు క్వాచిత్కముగ నున్నారు. ఏదో ఒక వృత్తి చేసికొనుచు తోడ్తో రచనావ్యాసంగము చేసికొనవలసినవారే మన దేశమున నున్నారు. రచయితలను వెనుకబడిన వర్గములో చేర్చవలయునో, ముందున్న వర్గములో చేర్చవలయునో యెవరికిని తెలియదు. రచయితలది దయనీయ జాతి. కడు జాగరూకతతో నేర్పాట్లు చేసికొన్ననేగాని యొక రచయిత యొక గ్రంథమును రచించినట్లు పత్రికలమూలమున తెలివిడికాదు. గ్రంధరచన ప్రచురణార్హమైన యంశముకాదు. దొంగతనము, వింత పుట్టు కలు, మోసము, హత్యలు, సినిమాది వినోద ప్రదర్శనముల కున్నంత ప్రాముఖ్యము ఈ సాత్త్వికృషికి లేదు. ఏ సంస్థనో ఆశ్రయించి, ఆవిష్క రణ సభ పెట్టించుకొని, తన పూలమాల తానేకొని ఏ యమాత్యవృషభునినో యావిష్కర్తగా పిలచి సంరంభము చేసిననేగాని నలుగురికి తెలియదు. కవులు, రచయితలు, పండితులు, అధికారులు, నాయకులు పుస్తకాలు కొనరు. చదువరు

కూడ. వారు చదువకున్నను సరియే. కాంప్లిమెంటరీ ప్రతులను వీరికంద జెయ్యవలె రచయిత. అధికారములేనివాడు, పలుకుబడి లేనివాడు. పుస్తకము కొనవలసినవాడు, పుస్తకము కొనకపోవుట ఒకవిధమైన ప్రెస్టీజ్. ఈవిధముగా రచయిత కొన్నివందల ప్రతులను పంచిపెట్టవలయును. ఆపిదప విక్రేతల కడకు తీసికొనిపోవలె. ఆ విక్రేతలు 40 శాతం అమ్మినందు కియ్యవలయు ననియును అమ్మిన తరువాతనే ఇత్తుమనియును చెప్పుదురు. ఈ తిరుగుళ్లకు డబ్బుచాలదు, అప్పుచేసిఅచ్చువేసికొనుట అప్పుచేసి, విక్రేతలచుట్టు తిరుగుట. చివరకు మిగులునవి యప్పులే. గ్రంథము కొని చదువు నలవాటులేని జాతిలో రచయితకు మోక్షములేదు. పుస్తక విక్రేతలకు కమీషన్‌మాత్ర మీయవలసి వచ్చునని రచయితలు ధరలను పెంచియే ప్రకటింతురు. ముద్రణవ్యయము, ప్రచారము, విక్రేతల కమీషను పోగా రచయితకు మిగులున దేమి? స్వాతంత్ర్యమునకు పూర్వ మీపరిస్థితియే యుండెను. ఇప్పుడును అంతియ. పేరు మోసిన రచయితలుకూడ నష్టపడుచునే యున్నారు. నిప్పచ్చరముతోఁ బ్రతిభావంతులు సైత మగచాట్లపాలగుచున్నారు. ప్రచురణకర్తలు, పుస్తకవిక్రేతలు రచయితలను దోచుకొనుచున్నారన్న సంగతి పాఠకులకుఁ దెలియకపోవచ్చును కాని రచయితల కందరకును తెలియును.

ముద్రణము తెనుగున ఇబ్బంది కలిగించుచునే యున్నది. విస్తృత ప్రచారమునకు నోచుకొనని పాతరోజులలో మన లిపివలన కలుగు కష్టనష్టములు గురుతుకురాలేదు. ఏబదియారక్కరములు. 36 హల్లులలో నొక్కొక్క హల్లునకుఁ బదునారేసి గుణింతములు, ఇందుమీదుగా వత్తక్షరములు. ముద్రణమునకు కాలము పట్టును. ముద్రారాక్షసములు కంటిలో వత్తివేసికొని చూచినను పొడకట్టితీరును.

ఇక విమర్శకులు పుస్తకము నామూలాగ్రముగ చదువక పరిచయమునకుఁ బూనుకొనువారు కొందరు. రచయిత కులగోత్రాలను, అంతస్థులను, అధికార ప్రాభవాలను బట్టి విమర్శచేయువారు మరికొందరు. తప్పులను మాత్రమే యెత్తి చూపువారు కొందరు. పండితాభిప్రాయములను చూచి వాక్యములను మార్చి వ్రాయువారు కొందరు. మొత్తానికి పుస్తకమును సహృదయంతో చదివి ఇతరులనుకూడ చదివింపఁజేయవలెన నుద్దేశముతో విమర్శ చేయువారే కొందరో.

రచయితలు సంఘములను స్థాపించు కొనుచున్నారు. స్వాతంత్ర్యము నకుఁ బూర్వముకూడ నీ సంఘములు లేకపోలేదు. అప్పుడా సంఘములలో రచయితలు మాత్రమే యుండి కార్యకలాపములను సాగించెడివారు. ఇప్పుడు రచయితల సంఘాలకు ప్రాయికముగా నరచయితలు, అధికారులు, పలుకుబడి గలవారు కీర్తికాముకులు నేతృత్వమును నెరపుచున్నారు. రచయితల సంఘములు రచయితల కష్టముల నెంతవరకు పరిష్కరించుచున్నవో చెప్పలేము కాని రచయితలకుఁ గ్రొత్త సమస్యలను తెచ్చిపెట్టుచున్నవనుటలో నత్యుక్తి యుండదు. రచయితలు సహకార సంఘములు కూడ నిర్వహించుచున్నారు. కాని తాము స్థాపించుకొన్న సంఘముతో సహకరించుటకు తరచుగా వారి 'ప్రతిభ' పూనుకొననీయదేమో తెలియదు.

ఇటీవల అకాడెమీలు, పరిషత్తు లేర్పడినవి. కాని యవి రచయితల సమస్యలను పరిష్కరించుట కింకను పూనుకొనుటలేదు. ప్రామాణికమైన, ఉత్తమమైన పరామర్శ గ్రంథములను ప్రచురించుచు, పోటీలు నిర్వహించుచు సాహితీవికాసమునకుఁ దోడ్పడుచున్నవే కాని రచయితల మనుగడకు దగిన పరిస్థితులు కల్పించుటలేదు. పరిషత్తు లీమాత్రమే చేయగలవు. ప్రజలు ముందుకువచ్చి గ్రంథములు కొని చదువుటకు ప్రయత్నించవలయును. గ్రంథము లమ్ముడుపోయినచో రచయితలకు నష్టముండదు.

ఇటీవల కొందరు రచయితలు చింతలు లేక బ్రతుకగలుగుచున్నా రనిపించును. కొందరు పేరుమోసిన పాత్రికేయులును, నితరవృత్తులలో నుండి రచనకుఁ బూనుకొన్నవారును నీతరగతికిఁ జెందినవారు. అంతియే కాని రచనలవలననే బాగుపడిన బాబతుకాదు. వ్యక్తిత్వముగల రచయిత నేటికిని భవభూతియే ! అనుభూతి లేక స్పందనగుణము లేక రచనలు సాగించుచున్న వారు క్రొత్తరకపు వ్యాపారులేకాని రచయితలుకారు. వారి రచనలు సమాజము నకు దీప్తిని కలిగించలేవు. వారికి సమస్యలు లేవు. తీరవలసిన యగత్య మంతకంటెను లేదు. ప్రతిభాశాలురైన రచయితలను వారెదుర్కొనుచున్న కష్టములను దృష్టియందుంచుకొని యీ వ్యాసమును వ్రాసితిని.

కీ॥ శే॥ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తమ 'సాక్షి'లో పేర్కొన్న పరిస్థితులలో నేటిమార్పును రాలేదు. అవిదాస్య తమస్సులలోఁ

గొంతుమిట్టాడిన దినములని సరిపుచ్చుకొనవచ్చును. మరి యీ పాతికేళ్లలో రచయితల తీరుతెన్ను లెట్లున్నవో విచారించిన నాథుడు లేడు. రచయితల బాధలను వర్ణించు వ్యాసములు, కవితలు వెలువడినమాట నిజమే; కాని అవి యన్నియు రచయితను దయనీయవ్యక్తిగా చిత్రించు ప్రయత్నమే చేసినవి. హాస్యరచనల కోవలో చోటుచేసికొన్నవి.

ఇప్పటి రచయితకు సమాజముననున్న మిథ్యామర్యాదను బట్టబయలు చేసి 'వినాయకుని బొడ్డులో తేలున్న' సంగతిని తెలిపినవారు శ్రీ భమిడిపాటి రాధాకృష్ణగారు. ఆయన 'కీర్తిశేషులు' నాటకము తెలుగు రచయితల తీరని సమస్యలకు దర్పణము. ఆ నాటకమును చదివిన, వినిన, చూచిన వారికి మంగళమహాశ్రీ.



# సమాజంమీద సినిమాప్రభావం

శ్రీ అశ్వినీకుమార్

విజ్ఞాన, వినోద ప్రచార సాధనాల్లో సినిమానిమించినది భారతదేశంలో ఇంకా లేదు. నాటకాలరాజ్యం చెల్లిపోయింది. టెలివిజన్ ఇంకా అడుగిడలేదు. ప్రపంచంలో యాదృచ్ఛికంగానో, ఇతరంగానో మరి రష్యా, చైనా, భారత దేశం చలనచిత్రాల్లో ముందు వరుసలో వున్నాయి. సమసమాజ వ్యవస్థ ఈ దేశాల ప్రజలు కోరుకుంటున్నారు. సినిమా అన్ని ప్రచార, వినోద సాధనల్లోకి తలమానికం అనడం నిర్వివాదాంశం మనదేశంలో.

చలనచిత్రం తనలో ఏమి యిముడ్చుకోగలదు? అది ఏ కళకి, ఏతీరుకి సమర్థవంతమైన ప్రక్రియ? ఒకేక్షణంలో మనిషి నడవడిని, అభిప్రాయాల్ని, మార్పుని, అలవాట్లని, అంతరంగాన్ని - అన్నిటినీ - దృష్టాంతంగా, ధ్వని రూపంలోకూడా బహుముఖంగా ప్రదర్శించగల ప్రక్రియ సినిమా.

సినిమా-తదితర కళల్లాగే - తనచుట్టూవున్న ప్రపంచంనించి అంశాన్ని సేకరించి, తన్ను తా రూపొందించుకొని, ఆప్రపంచం కళ్ళముందే నిలబడు తుంది. ఒకరకంగా సినిమా మన అద్దంఅన్నమాట. సమర్థవంతుడిచేతిలో అది మార్గదర్శకతకూడా వహించగలదు. ఆర్థిక, సాంఘిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్యపు విలువలనన్నింటినీకూడా అది ఆకళించు కొని, ఒకదారిని చూపెట్టగలిగే శక్తి కలిగివుంది.

స్వాతంత్ర్యం రాకపూర్వం చలనచిత్రాలు అనేకం- మూకీచిత్రాలు కూడా-ప్రజాజీవితాల్ని ప్రతిబింబించాయి. 'వందేమాతరం', 'మాలపిల్ల'వంటి చిత్రాలు అపూర్వమైన రాజకీయ, సామాజిక చైతన్యాన్ని కల్గించాయని చెబు తారు. 'మాలపిల్ల'మీద దురహంకారులూ, మూఢులూకలిసి తిరగబడేవారంటే, సినిమాకి వున్నశక్తి తెలుస్తుంది.

*

స్వాతంత్ర్యంతర్వాత చలచిత్రం ఎలాఉంది? దానిప్రభావం ఎంత, ఎటువంటిది? ఈప్రశ్నలకి సమాధానాలు అంత సంతోషదాయకం మాత్రం కావు. దీనికి ఒక్కటే నిదర్శనం; 'మహత్తరమైన' ఘట్టమైన భారత స్వాతంత్ర సంగ్రామం గూర్చి సమగ్రమైనచిత్రం ఒక్కటీలేదు. ఇతర

దేశాల్లో అటువంటివి కోకొల్లలు. మన చలనచిత్రాలకి అటువంటి 'స్పృహ' లేనట్టేకదా! స్వతంత్రభారతదేశంలో అనేకసమస్యలమీదకూడా-భాషారాష్ట్రాలు, నిరుద్యోగం, అసమానత, కులతత్వం-చిత్రాలు సరియైనవి రాలేదు. సమకాలీన సమస్యల్ని ప్రతిబింబించని సినిమాలు సమాజంమీద ప్రభావం చూపుతాయను కోడం కేవలం భ్రమకాక వేరుకాదు.

మన సినిమాలు 'పుష్టి' గా ఉండటంలేదు. ఎందుకు? మన సినిమాలు సామాజిక, సామూహిక ధార్మికతని ఎప్పుడూ కలగి వుండటంలేదు. వాటి 'సమస్యలు' ఎప్పుడూ 'వ్యక్తి' పరిమితి దాటటంలేదు, 'సెక్స్' ని ట్రీట్ చేసే పరిణత సినిమాల్లో ఉన్నవారికి ఉన్నట్టుకన్పించదు. ఇటీవల దస్తక్, సారాఅకాశ్ వంటి చిత్రాల్లో అటువంటి ప్రయత్నం వుంది. సస్పెన్స్, క్రైమ్ చిత్రాలు వచ్చి, సినిమాని వినోదం స్థాయినించి Time Pass స్థాయికి దించేశాయి. అవి చాలవన్నట్టుగా అభూతకల్పనలు, అసహజ ఘటనలు, కలల కందని భ్రమలూ దట్టించి వుంటున్నాయి. నల్లమందు ప్రభావం మనకు తెలియందికాదు. సునిశిత హాస్యం సంగతి మర్చిపోయిన సినిమాలు వినోదం స్థాయికికూడా సరిపడవు. గ్రామాలు మనదేశంలో అధిక జనాభాలో ఉన్నాయి. కానీ గ్రామీణ జీవితాన్ని రూపుదిద్దిన చిత్రాలు కూడా చాల తక్కువ. ఇంత అసమగ్రంగా, అపరిపూర్ణంగావున్న సినిమాల ప్రభావం అంతకన్నా వుండ బోదు.

అయితే సినిమాల ప్రభావం వుండకమానదు. అందులోనూ ప్రాథమిక దశల్లో కళగా మనగలిగిన సినిమా,ఇవాళ ఆర్థిక సంబంధాల్లో వ్యాపారం రూపంసంతరించుకుంది. ఇది సినిమా ప్రభావాన్ని ఒక ప్రత్యేక మార్గాన పెట్టిన ప్రభావం. పెట్టుబడి చేతిలో గలగల లాడినప్పుడు గుర్తొచ్చే వ్యాపారాల్లో సినిమా ఒకటిగా గుర్తొస్తోందివాళ. ఇది ఓ ముఖ్యమైన మార్పు.

వీళ్ళ చేతుల్లో తయారయిన సినిమా పట్టణ జనాభాకి దగ్గిర చుట్టం. ఓమోస్తరుగా పెరిగిన ఊళ్ళన్నిట్లో సినిమా పాదుకుంది, మహోకళ అందు బాటులో లేనికారణంగా అందరూ దీనిమీద ఆధార పడుతున్నారు. సినిమాలకి మధ్యతరగతి ఎక్కువగా ఎగబడేది. ఇప్పుడు అంతకంటే తక్కువ వాళ్లు కూడా సినిమాలు చూస్తున్నారు.

నెలసరి ఉద్యోగాల వాళ్ళమీద సినిమా ప్రభావం ఒక్కటే. పక్షానికో నెలకో ఒకసారి పొద్దుపుచ్చడానికి సాధనంగా మాత్రమే సినిమా చలామణీ

అవుతోంది. అందిన గడ్డికొరకడం ఆనవాయితీగా వున్న మధ్యతరగతి కీసినిమాని మించిన ఎండుగడ్డిలేదు. వాళ్ళలో అమనస్తత్వం బాగా పెరిగి పోయింది. "బాగా బోర్ కొట్టింది గురూ! ఎదురుగ్గా 'లతా' కన్పిస్తే 'వన్‌ఫోర్' లో నిలబడిపోయాను" "ఆఁ! సినిమా బాగోదమేమిటీ, బాగో పోడమేమిటీ ఇంత తగలేశాక!" "ఆ! అంత ఆలోచించను సార్! ఏదో సినిమా అంటే టైమ్‌పాస్". ఈ గుమాస్తా క్లాసుమీద సినిమా ప్రభావం అంతకు మించిలేదు. ఆర్థికంగా దిగజార్చబడ్డవాళ్ళు 'కరప్ట్' ఆలోచనవాళ్ళూ అయిన వాళ్ళకి ఇంకేముంటుంది?

సినిమాలకి మరో పోషకదారులు యువకులు, విద్యార్థులూ. ఈ జనానికి సినిమాని మించిన 'హాబీ' లేదు. ఈ యువకులు 'ఎలాగోలాగు' తమ స్థాయి నించి పైస్థాయికి ఎగబ్రాకాలని చూసే మధ్య తరగతినించి ఎక్కువగా వుంటు న్నారు. (అ పై వర్గాలవాళ్ళకి సినిమాతో కూడిన ఇతర వ్యాపకాలున్నాయి.) తీగెమీద ద్రాక్షగుత్తుల్ని ఊహించుకుంటూ వుంటున్నారు వీళ్లు. వీళ్ళమీద సినిమా ప్రభావం అంతా ఇంతా కాదు. సమష్టి ప్రయోజనాల్నించి, జీవితాన్నించి వీళ్ళని ఇరుకు వ్యక్తివాదంలోకి దింపడంలో సినిమాలు బాగానే తోడ్పడ్డాయి. రోజుకి అరవై పైసలు ఖర్చుపెట్టలేనివాళ్ళే ఎక్కువగా వున్న ఈ దేశంలో 'ఒక్క స్కూటర్ కొనుక్కుంటే' అనే చిన్నకలలు కంటూంటారు వీళ్ళు. జీవితం అంతా అదృష్టాలతో, హఠాత్సంఘటనలతో నిండి వుంటుంది. మనం చేయ గలిగింది అట్టేలేదు అనే భావాలు సినిమాలవల్ల బాగా బలపడ్డాయి. చౌకబారు మాటలు 'నోటి మాటలు'గా మారడం మించి సినిమా ప్రభావం లేదు.

స్త్రీలు వెనకబడి వుండటానికి సినిమాలు తోడ్పడినంత ఇంకేమీ తోడ్ప డటం లేదనుకుంటాను. స్త్రీని ఓ పతివ్రతగా చూపి, వారికి కొన్ని లక్షణాల్ని ఆపాదిస్తున్నారు. ఎంత 'విప్లవం' చూపించామనుకున్నా. స్త్రీలు పురుషుడిమీద ఆధారపడేట్టు చిత్రిస్తున్నారు, అంతటితో ఆగినా బాగుణ్ణు. భారతదేశంలో స్త్రీలకి గౌరవం చాల వున్నదనీ, 'అంతిమ విజయం' ఉత్తమ స్త్రీదే అనీ భ్రమలు కల్గించే సినిమాలు వస్తున్నాయి. ఆడవాళ్ళ పాత్రలు చాలా ఉదాత్తంగా వుండి, వారిని ఏడిపింపజేసే సినిమాలు బాగానే మెప్పు పొందుతున్నాయి. చదువుకున్న, చదువుకుంటున్న అమ్మాయిలమీద సినిమా ప్రభావం ప్రత్యేకంగా వుంది. జీవితం కలర్ పిక్చర్‌లో ఊహించుకుంటారు. దానికీ, ఏ మంచి వరుడో వచ్చి తమ పాణిగ్రహణంచేసి, పువ్వుల్లో పెట్టి పూజిస్తాడని, కనీసం పూజించాలని

అనుకుంటారు. బొత్తిగా సామాజికవిషయాల స్పృహలేని వర్గం వీళ్ళదే. వ్యక్తిగత ప్రేమగాథలు వీళ్ళదగ్గర చాలా డబ్బు చేసుకుంటున్నాయి. అయితే మన 'సంస్కృతి' ఆడదాన్ని చిన్నప్పట్నించీ 'ఓ ఇంటి ఆడది'గా చూస్తోంది. సినిమాలు మరోలా ఎందుకుంటాయి ?

సినిమాల ప్రభావం చాలా కొద్దిగా పడ్డది గ్రామీణ ప్రజలమీద. ముఖ్యంగా తక్కువ వర్గాలమీద. సినిమాగూర్చి కొద్దిగా వేలంవెర్రి ఉన్నా వాళ్ళ జీవితాల్లో సినిమా ప్రభావం అట్టే లేదు. అలాగే 'మేధావి' వర్గంమీద కూడా. మన సినిమాలవల్ల విసిగిపోయి, చాలామంది మేధావులు మన సినిమాకి దూరమయిపోయారు. పైగా వాళ్ళని ప్రభావితం చేసేంత గొప్ప సినిమాలుకూడా మనకి లేవు.

పైన చెప్పినవాటన్నిటికీ Exceptions లేకపోలేదు. అయితే అది మరో మాట।

మొత్తంమీద సినిమాల ప్రభావంగా ఒకటి చెప్పుకోవచ్చు. సినిమాలు సామాజిక స్పృహని కలిగించడంలేదు; వ్యక్తి వాదాన్ని మరింత బలపరుస్తున్నాయి. సామాజికమైన మార్పులేకుండా వ్యక్తి 'పైకి' రావాలంటే, జీవితంలో 'చౌరవ' తీసికోడం ఓ మార్గం, సినిమాలు అదీ చేయడంలేదు. అవి చూపిస్తున్న మార్గమల్లా జీవితంలో ఏదో హఠాత్తుగా మేలు కలిగినప్పుడు మనం బాగు పడతాం అని. ధనస్వామ్యంలో 'వ్యక్తి'గా నిలవదలుచుకొన్న 'వ్యక్తివాది'కి అదృష్టం ఒక్కటే దారి। జీవితంలో అర్థంలేని విలువల్ని, 'Decency' ని సినిమాలు చూపెడుతున్నాయి. గాజుపెట్టెల్లో దాచుకోవలసిన పాతివ్రత్యపు విలువల్ని (మగవారికికూడా) సృష్టిస్తున్నాయి.

సాహిత్యంమీద, ప్రజల భాషమీద సినిమా ప్రభావం బాగానే వుంది. ప్రజల భాషమీద కొన్ని సినిమా జాతీయాలు (Idioms) బాగానే ప్రసరించాయి. సినిమాల్లో 'మాటల్ని' కొన్నింటిని (Coinages) బాగా ఉపయోగిస్తుంటారు. సినిమాలు అనేకులకి ఉద్దేశింపబడిన 'కళ' కాబట్టి సినిమాల భాష అందరికీ అర్థమయ్యే భాషగా వుంటోంది. సినిమాకి వెళ్ళడానికి కలలు కనే రచయితలు మనకి చాలామందే వున్నారు. ముఖ్యంగా భావాల విషయంలో అటువంటి రచయితలకి సినిమా పెద్ద Boost ఇచ్చింది. జీవితానికి దూరంగా వుండే రచనలు, వ్యక్తిగత సమస్యల్ని చిత్రించే రచనలు మనకు లెఖకు మిక్కిలి. రచయిత్రులు కొందరిమీద ఈ ప్రభావం చెప్పక్కర్లేదు. నిజానికి కొందరు తమ రచనల్ని సినిమాకి పనికొచ్చేట్టుగా ప్రయత్నించి రాస్తున్నారు.

సినిమా పాటలు పెద్ద సాహిత్యంగా తయారయాయి. ఇవాళ పట్టణ జనానికి నోటిపాటలన్నీ సినిమా పాటలే. సినిమా పాటల్లోని సంగీతంగూర్చి ఓ తమాషా జరిగింది. మొదట్లో సినిమా సంగీతం శాస్త్రీయానికి దగ్గిరగా వుండేది, కాకపోతే భావవ్యక్తీకరణ ప్రధానంగా పెట్టుకుని సూటిగా వుండేవి. సహజంగా ఆ సంగీతాన్ని ఆస్వాదించాలంటే కొద్ది తీరిక, appreciation వుండాలి. రాను రాను సినిమా సంగీతంలో శాస్త్రీయం పాలు తగ్గుతూ వచ్చింది. అంతమాత్రంలో తప్పుందని కాదు. అడివిలో అనేక ధ్వనుల్ని 'మనం' వినాలి. కర్మాగారంలో చప్పుడు 'మనం' వినకపోయినా విన్పిస్తుంది; చెవుల్లోకి దూసుకొస్తుంది. ఇవాల్టి సినిమా సంగీతం, ఈ లక్షణం సంతరించుకుంది. పాశ్చాత్య సంగీతం ప్రభావం దీనిమీద బాగా వుంది. తీరికలేని పట్టణ జీవితానికి ప్రతీకల్లాంటి ఈ పాటలు ప్రచారం బాగానే పొందుతున్నాయి. అయితే కొద్ది మంది జనం ఇంకా శాస్త్రీయ వాసనలున్న పాటల్ని సినిమాల్లో ఆనందిస్తూనే వున్నారు. ఈ ధోరణి సినిమాల్లోంచి శాస్త్రీయ సంగీత వాసనల్ని పూర్తిగా తరిమేస్తుందేమో చూడాలి.

*

కొన్ని మంచి చిత్రాలు వచ్చాయి. ముఖ్యంగా బెంగాలీ, మళయాళం లలో. ఇటీవల హిందీ, కన్నడ భాషల్లోకూడా వచ్చాయి. ఈ సినిమాల ప్రచారం బాగానే వుంది. కానీ అవి చాలా కొద్దిచోట్లమాత్రమే ఆడుతున్నాయి. నల్లమందు ప్రేక్షకుల్ని తిరిగి సంపాయించే (Redeem) ప్రయత్నంలో వున్నాయి.

బెంగాలీ, మళయాళం సినిమాలు బాగుంటున్నాయి. సత్యజిత్‌రాయ్ ఈ విషయంలో బాగా కృషిచేసినవాడు. తన పథేర్ పాంచాలి (The Song of the Road) నించీ అతడి చిత్రాలు మంచి దృక్పథంతో వుంటున్నాయి. 'దేవి' లో మతమౌఢ్యాన్ని, 'మహానగర్' లో పట్టణాల్లో ఉద్యోగినులని, 'కాపురుష్ _ మహాపురుష్'లో దొంగస్వాముల్ని అతడు తన సబ్జెక్ట్‌గా తీసుకున్నాడు. 'గూపీ గాఁయేఁ–బాఘూబాఁయేఁ'లో ప్రపంచంలో యుద్ధాన్ని గూర్చి, శాంతి ఆవశ్యకతనిగూర్చి, అంతర్లీనంగా చెబుతాడు.

నేటి నిరుద్యోగులగూర్చి, చదువుకున్న యువకుల గూర్చి, వారిలో ఆలోచనాతీరులని గూర్చి రాయ్ తన 'ప్రతిధ్వంది'లో అనితరమైన రీతిలో చిత్రించాడు. 'ఈ శతాబ్దంలో ప్రముఖ ఘట్టమేది?' అన్నప్రశ్నకి ఆ యువకుడు 'వియత్నాం' అంటాడు. చంద్రమండలం విజయాన్ని అతడు ఇంత ప్రముఖమైనదిగా లెఖచేయడు. అదే చిత్రంలో ఓ 'హిప్పీ' గుంపుని చూపిస్తాడు. తరువాతిక్షణంలో ఒకవాచీ రిపేరింగ్ షాపులో "ఇది Balance తప్పింది." అని వ్యాఖ్య! చివర ఇంటర్వ్యూ దగ్గిర అశాంతిలోంచి ఓదృశ్యం

ఆవిర్భవిస్తుంది. విద్యార్థి 'ఛేటుల్'వి ఒక్కపళాన తిరుగదోస్తాడు. అస్తవ్యస్తమైన సామాజిక వ్యవస్థని తిరుగ ద్రోయబోతూన్న యువతరం శక్తిని lagical conclusion గా Symbolic గా చూపుతాడు.

ఇంకా కొన్ని-'ఇంటర్వ్యూ', 'సాగిన మహతో' వంటివి వచ్చాయి. ఇవన్నీ బాగోడానికి ఒక్కటే కారణం అవి నిత్య జీవితంలోంచి వచ్చాయి. సామాన్య ప్రజల్లోంచివచ్చాయి. చిత్రదర్శకుడి ప్రతిభ మనమీద ప్రభావం కలిగిస్తుంది.

కళ జీవితంలోంచి పుట్టి జీవితానికే ఒరవడి నిస్తుంది. మన సినిమా జీవితానికి దూరంగా పుడుతోంది. పైగా తెరవెనుక నల్లధనాన్ని గూర్చీ, సెక్స్ గూర్చి ప్రజల్లో కొంత Stigma వుంది. ఉన్నపళాన సినిమాకి మంచిప్రభావం కల్గించే Morales లేదు. అయితే ఈస్థితి మన వ్యవస్థకి ప్రతిబింబమే. అయితే కళ కొంతమార్గదర్శకత్వం కూడా వహిస్తుంది. వహించాలి. సినిమా ఆపని చేయడంలేదు.

సినిమా ఇప్పుడు ఎవరి చేతుల్లో వుందో వాళ్ళచేతుల్లో వుంటే మరో రకమైన సినిమా వచ్చే అవకాశంలేదు. మేధావులు, ప్రజాజీవితాల్ని అర్థం చేసికున్నవాళ్లు అయినవాళ్ళచేతుల్లోకి సినిమా నిర్మాణం రావాలి. ఇదిమన వ్యవస్థతో ముడిపడ్డ విషయం. దీన్ని ఛేదించాలంటే మేధావులు, కళాకారులు సినిమా 'ఫ్యాక్టరీ' లో కొంత స్వతంత్రత సంపాదించుకోవాలి. సినిమాని'కళ'గా మార్చాలి. ప్రజల కళగా మన సమాజంలోని అవకతవకలు, అసమానతలు: దారుణాలు, కులతత్వాలు, ఇంకాచావని రాజరికపు, ఫ్యూడల్ అహంకారాలు-సినిమాకి 'సబ్జెక్టు'గా వుండాలి. వీటిని కూల్చివేసే దారిచూపే సినిమారావాలి.

ఇవాళ ప్రహసనంగా మారిబోయిన 'ప్రజాస్వామ్యాన్ని' రాజకీయాల్ని సరియైన దృక్పథంతో విశ్లేషించి, దారిచూపే చిత్రాలు రావాలి.

ప్రజలనించి వచ్చే ఏకళైనా ప్రజలకు మేలుచేస్తుంది. ధనస్వామ్యంలో ప్రజలకళలు త్రొక్కివేయబడటమే కాక, ప్రజల్ని, నిర్వీర్యుల్నిచేసే నల్లమందు కళలు రుద్దబడటంకూడా జరుగుతుంది. ఈ చక్రాన్ని ఛేదించడం మన వ్యవస్థని మార్చకుండా జరుగదు. దానికి సామాజక, రాజకీయ ప్రయత్నం అవసరం. అటువంటి ఉద్యమాన్ని ప్రతిబింబించే కళ అవసరం.

మన జీవితం, దాన్నిమార్చే ఉద్యమం, కళ-అన్నీముడిపడి వున్నాయి.

# స్వతంత్రభారతంలో సాహిత్యం

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

నవభారత సాహిత్యంలో ప్రధానంగా ప్రస్ఫుటంగా కవిపిస్తున్న లక్షణం 'మానవత'. ప్రాచీన సాహిత్యంలో కూడా మానవత్వానికి సంబంధించిన విషయాలు ప్రస్తావన చేయబడ్డా చాలమటుకు దైవం, మతం, భయం, భక్తి, అనే విషయాలకే పరిమితం. స్వర్గంవైపుదృష్టి, పారలౌకిక విషయాల పట్ల ఆపేక్ష పాతకాలపుసాహిత్యంలో కనబడతాయి. అప్పటి సాహిత్యం ముఖ్యోద్దేశం ముక్తి. భవబంధాలనుండి విడివడి, మాయాజగత్తు, మోహవలయాన్ని భేదించుకొని ఐహిక ప్రలోభనకు గురికాకుండా, సంసారబాధలనుంచి శిక్షల నుంచి విముక్తి-ముక్తి. ఈ జీవితంనుండి విమోచనం. ఆత్మను పరమాత్మలో ఐక్యంచేసి సచ్చిదానందానుభూతిని పొందడం ఆ సాహిత్యలక్ష్యం. ప్రాచీన సాహిత్యంలోని ఈ భావాలకు భిన్నంగా నూతన భారత సాహిత్యం మనిషిని మానవతను లక్ష్యంగా వరించింది. ఈ లోకానికి, ఈ లోకంలోని జీవితానికి ఈలోకంలోని మానవాళికి చెందిన అన్నివిషయములతో అనుబంధం పెంచుకొన్నది. దేవునిపట్ల ఆధ్యాత్మిక విషయాలపట్ల వైముఖ్యం చూపకపోవచ్చు. ఒకక్షణం కరుణను, మరోక్షణంలో క్రోధం, తలపునకు కూడా తట్టని రూపమున్న దేవునిపట్ల వైముఖ్యం లేకపోవచ్చు. దేవుడు కాదు మానవుడుముఖ్యం, అవి దేనికైనా కొలమానంగా మానవుణ్ణే ఈ నవసాహిత్యం నమ్ముతుంది. ఈ నూతన సాహిత్యభావాలకు ప్రవక్త ఇక్బాల్

> "Even if one iota is to be diminished from may being,
> I shall not accept life immortal at this Rice".

ఇంకా ఒక అడుగుముందేసి ఇలా ఉద్ఘోషిస్తాడు.

> "The pangs of yearning constitute a priceless commodity,
> I shall not exchange my humanity even for divinity"

ఈనూతన సాహిత్యం ఈసమున్నత భావాలకు అనుగుణంగా ఉన్నదన డానికి వీలులేదు. అస్పష్టంగానూ, గూఢంగానూ ఉన్నదాన్ని వదిలిపేద్దాము. ఇందులో ఏ గుణంవున్నా అది యుగోచితో స్ఫూర్తికి విరుద్ధం, కనుకనే ప్రగతికి నిరోధం. ఇక ఇందులో దోషమంటారా? శ్రవణదారుణం, మొరటు, అశ్లీలావహం. ఇక మిగిలినదంతా సంగ్రహితం, నిరాశా సంవృత్తం.

ఒక ప్రతిభావంతుడైన విమర్శకుడిలా అన్నాడు.

"It is Freud and marx is uneasy alliance, with Freud as the dominant Partner"

స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాతనైనా ఒక వినూత్న ఆశాభావం ఉద్దీనం చేయగలశక్తి భారతీయ సాహిత్యం సంతరించుకోగల్గి వుండాల్సింది. ఎందుచేత ఇవి మృగ్యమైనవి ? ఒకవేళ ఉన్నా ఎందుకు అణచబడినవి ? ఎందుకు పరాభూతమైనవి ? కృష్ణకృపలానీ ఈ విషయంలో ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ ఇలా అన్నారు.

"The Prevalant mood is one not of faith So much as of despair, not of daring as of defiance, not passion as of morbidity"

స్వాతంత్ర్యం లభించగానే దేశంలో చెలరేగిన హత్యాకాండవల్లనో, యాతనలవల్లనో, ద్వేషానల ప్రజ్జ్వలనంవల్లనో, గాంధీజీ హత్యవల్లనో కలిగిన సిగ్గు, పశ్చాత్తాపాలవల్లనో ఈ పరాభూత వాతావరణం ఏర్పడియుండవచ్చు. బ్రిటిషువాళ్ల నిర్గమనంతో భారతదేశం భూతలస్వర్గంగా మారిపోతుందనే కలలు నిజంకాకపోవడంకూడా దీనికికారణం కావచ్చు. కారణాలేవైనాకావచ్చు కానీ భారతదేశంలో ఇంతవరకు ప్రజాస్వామ్యం మనిషిని ఉద్దీప్తుణ్ణిచేసి ఒక పరమ లక్ష్యంవైపు పురోగమింపజేసే ఒక 'వాల్ట్ విట్ మన్'ను, స్వేచ్ఛాగేయాలుపాడే విహంగాన్నీ ఎగురవేయలేకపోయింది.

అయినా మనం నిరుత్సాహ పడవలసిన అగత్యంలేదు, సాహిత్య అకాడమీ (The National Acadamy of literature ) గుర్తించిన ఇంగ్లీషుతో సహా ప్రధానమైన 16 భాషలన్నింటిలోనూ మానవతాదృక్పథంతో వెలువడిన నూత్నసాహిత్యం సృజింపబడుతున్నది. కాని భారతీయ రచయితల్లో టాగోర్, ఇక్బాల్‌ల స్థాయికి చేరుకోక పోవటమటుంచి ప్రేమ్‌చంద్, శరత్‌చంద్రుల స్థానాన్ని సైతం ఎవరుగాని అందుకోలేకపోయారు. ఈ నలుగురు సాహితీ సాలప్రాంశులు, మహితాత్ములు స్వాతంత్ర్యోద్యమకాలంలో భారతీయ సాహితీరంగాన్ని పుష్కలంగా ప్రభావితం చేసిన ప్రతిభామూర్తులు. కాని ఇటీవల రచయితల్లో ప్రపంచ దృష్టిని ఆకర్షించుకోగల్గినంత సామర్థ్యం, ఔన్నత్యం కొందరిలో లేకపోలేదు.

1948లో డా॥ డి.పి. ముఖర్జీ తనగ్రంథం "Modern Indian Culture"ను కొన్ని మార్పులతో ద్వితీయ ముద్రణగా ప్రచురించారు. అందులో........

modern Indian literature is characterized by an increased emphasis on social content. The scope of the subject for novels, stories and poems has been considerably enlarged. It is now far away from mere social reform. Mostly, the situations relate to conflict, and their treatment is sociological. Various problems are discussed, of maladjustment between the husband and the wife, between the individual with his new values of personal welfare and the society with its ancient code of static morality, between the educated youth which his romantic notions and the stern realities of life incarnated in his mother. The urban encroachment upon the social economy of village life has also formed the subject matter of some significant stories and novels. The fall of the landed gentry, the rise of the petty **bourgeoisie,** the life of the unfortunate men and women in the cities and of peasents in the village have also crept in recently, while class consciousness has also been indicated and stressed. In a word, social conflict is the modern literary theme.

ఇప్పటికీ ఇదే కథ. ప్రస్తుత స్థాయిని అధిగమించగలిగిన ఉత్తమ దృక్పథం, చైతన్యాత్మకమైన సృజనాత్మకమైన ఆలోచనా విధానం, సాహసస్ఫూర్తి, పరాజయాన్ని కాదనగల్గే దృఢసంకల్పం - వీటన్నిటికంటే ముఖ్యంగా భారతీయుల భవిష్యత్తు పట్లనే కాకుండా యావద్విశ్వ మానవుల పట్ల సజీవమైన, సముజ్జ్వలమైన, అంచచలమైన విశ్వాసం - ఇంకా కొరవడి ఉండడం కనిపిస్తున్నది. ఆ విశ్వాసం ఇంకా బలీయం కావచ్చు. ఒక నూత్న ప్రజాస్వామ్యజీవితంలో ఇరువైయైదు సంవత్సరాలు ఏమంత పెద్దకాలం కాదు. కనుక మనము సుదూరంగా లేని ఉజ్జ్వల భవిషత్తుకోసం ఎదురు చూడవచ్చు. అప్పుడు మానవతా దృక్పథం కల్గిన నవభారత సాహిత్యం ఇంకా పటిష్ఠమైన జాజ్జ్వల్యమానమైన, ఆశావహమైన సిద్ధులను సాధిస్తుంది.

(స్వేచ్ఛానువాదం : శ్రీవంగపల్లి విశ్వనాథం
శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి)




యువభారతి

# ప్రతిభ

## స్వాతంత్ర్య యుగోదయంలో...

## విశ్వనాథ * శ్రీశ్రీ

# 1947 - 1972

# నేనూ - నా సాహిత్య రచనలు

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

'నేను -కడచిన పాతికేళ్లలో నాసాహిత్య రచనలు' అనే విషయాన్ని గురించి మీరు నన్ను వ్రాయమన్నారు. ఇది నావంటివాడి కిచ్చే ప్రశ్న కాదు. ఎవళ్లో అల్పరచనలు చేసేవాళ్లను అడగవలసిన విషయము. నా కిప్పుడు 77 ఏండ్లు. నేను పుట్టింది 1895 లో. 77 లో పాతిక తీసిపారేస్తే 52 ఏండ్లు. 1947 ఆ ప్రాంతాలలో నాకు 52 ఏండ్లు వచ్చిఉండవలె.

అప్పటినుంచి ఇప్పటివర కన్నమాట!

నేను ఈ బెజవాడ కళాశాలకు 1938 లో వచ్చాను. ఈ కళాశాలకు వచ్చిన తరవాత 9 ఏండ్లు గడిస్తేనేకాని మీ తారీఖు అందుకునేటట్లు లేదు. ఎంత లేదన్నా ఆ తొమ్మిదేండ్లలో రామాయణం మొదటి రెండు కాండలే పూర్తిచేసి ఉంటాను. లేదా 3 కాండలు. అంటే కిష్కింధ, సుందర, యుద్ధకాండలు నిస్సందేహంగా ఈ పాతికఏళ్లలోవే! అరణ్యకాండ కూడా ఈ కాలంలోదే.

నేను చాలా సోమరిని. నా S.S.L.C. సర్టిఫికేట్ కూడా నా దగ్గరలేదు. F.A. సర్టిఫికేట్ లేదు. B.A. సర్టిఫికేటూలేదు. M.A. అసలు పుచ్చుకోలేదు. నా పుట్టినతేదీ తెలుసుకోటానికి ఒక ప్రిన్సిపాల్ చాలా ఇబ్బందిపడ్డాడు— నాకు ఉద్యోగవిరమణ ఇవ్వడానికి. ఇల్లా వుంటుంది నాకథ!

మరి నేను ఎంతసోమరిని అంటే– నిజానికి నేను 'వేయిపడగలు', 'మా బాబు', 'చెలియలికట్ట', 'ఏకవీర' వ్రాసి నవలాకారుణ్ణి అయినాను. తత్పూర్వం నేను అచ్చంగా కవిని. ఇప్పుడు చాలామంది 'ఆయన నవలాకారుడే కాని కవి కాదు' అనేవా రున్నారు. ఇందులో భిన్నాభిప్రాయా లున్నాయి. తత్పూర్వం నేను వ్రాసిన కవిత్వం వారికి తెలియకపోవచ్చు. నేను వ్రాసిన కవిత్వం కవిత్వం కాదని కూడా అనుకోవచ్చు.

ఏది అయితేనేమి? నేను 1934 సం॥ నాటికి దేశము పట్టనంత కవినని కీ.శే. మల్లాది రామకృష్ణశాస్త్రి గారు 'ఆనందవాణి'లో వ్రాశారు. అంటే అప్పటికి నేను ఏకవీరతప్ప మరింకోనవల వ్రాయలేదు. ఇప్పటి సాహిత్యవేత్తలలో

చాలామంది అప్పటికి పుట్టియే వుండరు. కనక భారతి, శారద మొదలైన అనేక సాహిత్యపత్రికలలో నేను శరపరంపరగా వ్రాసిన పద్యాలను వారెరగరు. 'కవి భృంగము', 'ఆకాశవాణి', 'శ్రీహర్షుడు' మొదలైనవి అనేకము అప్పటి పద్యాలన్నీ సంకలనం చేశాయి. పుస్తకంగా వేస్తే కనీసం నా రామాయణంలో సగం అవుతాయి. నేను సంకలనం చెయ్యలేదు. సోమరిని. అక్కడక్కడ కొందరు స్నేహితులు చేశారు. అవేవో రెండు చిన్న పుస్తకా లవుతాయి. ఈమధ్య ఒకటి అచ్చువేశాను.

అదంతా పోనిస్తే ప్రధానంగా ఈ పాతికేండ్లలో నా 'రామాయణం' నాలుగు కాండలు ఈ పాతికేండ్లలో వ్రాసినవే కిదాః గుణాలు అట్లా ఉంచి, ఒట్టి సంపుటిదృష్టితో చూస్తే పాతికఏండ్లలో కల్పవృక్షాలు నాల్గుసంపుటాలు వ్రాయటం గొప్పయే. మరిన్నీ ఈ రామాయణం 1961 లో పూర్తిచేశాను. అంటే పూర్తయి 10 ఏండ్లయింది. ఈ పదేళ్లు ఏమి వ్రాశావు అని ప్రశ్న. అసలు ఇంతకూ ఈ దేశంలో పూర్వమార్గాన వ్రాసేది పనికి రాకపోతోంది. కాగా ఎంతవ్రాస్తే ఏమి లాభం? మీ రడిగిన ప్రశ్నను బట్టిచూస్తే మీకు ఇంత వ్రాశాడన్నది ప్రధానమల్లే కనిపిస్తున్నది. నీకు కాదా అని మీరు నన్నడిగితే నేను వ్రాసింది నాకూ ప్రధానమే. దీనికి 2, 3 కారణా లున్నాయి. మొదటిది నేను ఏమి వ్రాస్తానో నేను తెలిసికొని వ్రాస్తాను గనక. నేను వ్రాసిన దానికి అనంత విషయములు నేను చొప్పించి వ్రాస్తానుకనక. అనాదినుంచీ ఈదేశంలో ఒకటి జ్ఞానం అనిపించు కొంటూవస్తున్నది. ఆ జ్ఞానం నా పాఠకులకు కల్పించి నేను సఫలుణ్ణయి వాళ్ళని జ్ఞానవంతులను చేస్తున్నాను అనేభావం నాకు ఉన్నదకనక. ఈభావం ఉన్నవాళ్ళు చాలామంది ఉన్నారని నాకు తెలుసును కనక. పూర్వ సాహిత్యం ఒకటి ఉన్నది. నేను పోతే నాతో పోయే వాళ్లు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన్న, పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలయినవారు. ఊరికే ఒట్టి పూర్వకవులని కాదు— పద్యరచనాసామ్రాజ్యపట్టభద్రులు; కథాకథన శిల్పనూత్నాచార్యులు; వేదవేదాంగాది మహాగ్రంథస్థలు; మహావిషయనిర్ణేతలు; బహువిషయవ్యాఖ్యాతలు; కావ్యకథాశిల్ప రహస్యవేత్తలు; అనే దృష్టితో ఆ పూర్వకవులను నిలబెట్టుకొంటే అప్పుడు నేనూ నిలుస్తాను. నేను చేసినపని అటు వంటిది. రోజులు మారిపోయి తెలియటంలేదు.

ఇది అహంకారము కాదు. పొగరుబోతుతనం కాదు. అసలీ దేశంలో అహంకారం ఎట్లా వుంటుందో తెలియదు. స్వశక్తిని చెప్పుకుంటే అహంకార మనుకుం.

టారు. ఒక మహాశిల్పియొక్క శక్తిని గ్రహించేశక్తి పోయింది. వాని శిష్యు లలో చాలామంది వాడు చెబితే తెలుసుకొన్న వాళ్లే. అది శిష్యు లతో చెబితే చదువు, ఇతరులతో చెబితే అహంకారము. 2వ తరగతిలో అహం కారం ఎందుకయిందో తెలుసునా— వాళ్ళకి అక్కరలేదుకనక. వాళ్ళు తెలుసు కుందామని పుట్టినవాళ్ళు కారు. ఆ మహాకవిని ఎట్లాగో ఒకట్లా తిడదామని పుట్టినవారు.

ఈ పాతికేండ్లలో నేను వ్రాసినవి ఒక జాతి జాతిగా తీసి చెబుతాను. మొట్టమొదట రామాయణం నాలుగుకాండలు; ఏ తెలుగు పద్యంయొక్క శక్తి చేత ఇందాక చెప్పిన పూర్వఆంధ్రమహాకవులు బ్రతికి ఉన్నారో ఆ శక్తి ఏమిటి? అందరు కవులనీ చెప్పలేను నేను. ఆ పదిమందిని చెప్పాను. వాళ్ళు ఒట్టి గణ యతిప్రాసలు కూర్చినవారు కారు.

అనేకజాతు లుంటవి. అన్నిజాతులలో అందరు వ్యక్తులూ ఆర్థికంగా సమానం నిస్సందేహంగా చేయబడవలయునేకదా; అందరికీ అన్నోదకము లుండవలసిందే; సర్వజనులకూ అన్నోదకాలు లేకుండా చేసెడి రాజు నాకు విరోధి. వాడు నాకూ అన్నోదకాలు లేకుండా చేస్తాడు కనక.

ఇల్లాంటి విషయం ఎత్తుకొని వ్రాయవలెనంటే తీగె కదిపితే డొంక కదులుతుంది. వ్యవహారం పుట్టు-పూర్వోత్తరాల దగ్గరకు పోతుంది.

పాపం ఈ కాలంలో సర్వదేశముల యందలి ప్రజలు కారణాన్ని బట్టి కార్యం ఉంటుం దని తెలియని వారు. పాశ్చాత్యదేశాలలో ఈ కాల మేం చేసి దంటే ఊహకి కొక్కు పెట్టి గణితశాస్త్రానికి పట్టం కట్టింది, ఆ గణితశాస్త్రంలో ఊహలేనట్లు. అది మనకెందుకు? తేలదు కదా; వినేవాళ్లు లేరు కదా; పైగా మీదపడి కరుస్తారు కదా; ఇపుడు అపూర్వమహాకవుల పద్యరచన ఏమిటో చెబుతాను. వాళ్ల పద్యరచన అంటే జాతిలో ఉండే శిష్టులు, ఉత్తమ కులజులు, విద్యావంతులు, సంప్రదాయజ్ఞులు అయిన వాళ్ల జీవలక్షణాన్ని, ప్రాణలక్షణాన్ని, వాక్యవిన్యాస వైఖరిని, కంఠస్వరములో ఉండే హెచ్చు తగ్గులని, ఈ రీతిగా ఆ జాతియొక్క పరమశిష్టమైన, నాగరకమైన, జీవునిలోనుండి వచ్చెడి వాగ్వ్యాపారమునకు రూపకల్పనము.

ఇంకొక రహస్యము కూడ నున్నది. త్యాగరాజులవారు తాను బహు రాగములను కల్పించి (కొన్ని పూర్వమున్నవే), వానికి మార్చన లుండగా, తాను వ్రాసెడి కృతినే ఒక షడ్జమములోననో, ఒక పంచమములోననో ఎత్తి

కొనును. మూర్ఛన క్రిందినించి ఉండును. ఎందుకు ఎత్తికొనును? ఆ రాగము లోని భావన అది. తెలుగుభాషయొక్క పలుకుబడి అది. ఈ రహస్యము కృతి నిర్మాణ సమయమున త్యాగరాజ మహర్షికి ఎంత తెలియునో, పద్యరచనా సమయమున మన ఆంధ్ర సాహిత్యమునందున్న పద్యరచనాశిల్పుల కంత తెలియును. ఇది అంతయూ ఉదాహరణ పూర్వకంగా చెప్పవలసిన విషయము

కావ్యమునందు కథయొక్క ఆరంభము, అవసానము, సర్గలయొక్క ఆద్యంతములు, లోకమును చిత్రించుట, శబ్దచమత్కారములు చేయుట, ఆవేశము కలిగియుండుట, ఇటువంటివి వందలైన శిల్పములు కలవు. ఈ పద్య రచనాశిల్ప మన్నది వానిని మించినది. ఇది మనస్సుచేత, తెలివిచేత, పదిచోట్ల నేర్చుకొనుటచేత, ఆ రచయిత చేసినాడు—ఈ రచయిత చేసినా డని గ్రహించుట చేత వచ్చెడిది కాదు. ఇది ఒక జాతియందు ఒక మహాకవి ఉద్భవిల్లినచో, వాడు పద్యరచయిత యయినచో, ఛందస్సులోని రహస్యము వానికి తెలిసినచో, భాషకు, ఛందస్సునకు, జీవుని లక్షణమునకు కల యవినాభావసంబంధము వానికి పరమేశ్వరానుగ్రహము వలన పూర్వజన్మసంస్కారవిశేషమువలన సహజమైనచో తెలిసెడిది. (ఇందుకు కార్యకారణము లున్నచోట వదలిపెట్టవలసిన విషయ మిది. జీవుడు, కర్మ, సంస్కారము, జన్మపరంపర ఇదియొక ప్రావాహికమైనఊహాపద్ధతి. దీనిమీద ఆధారపడి భారతీయ నాగరకతయొక్క మహా సౌధ నిర్మాణము జరిగినది. ఈ సంపుటి లేదన్నవానికి ఇవి ఏవియు లేవు. మన నాగరకతకు ఈనాడు మన భిన్న ప్రాంతములయందు, భిన్నములైన అల్పాల్ప కాలములయందు జరిగిన యాపద ఇక్కడ. దీన్ని కప్పిపుచ్చి శత్రువు లెం కెక్కడో మాట్లాడుచున్నారు. ఇది వారికికూడ తెలియని విషయము. వారు విశ్వసింతురు, విశ్వసింపరు.) ఆంధ్రమహాకవులయొక్క పద్యరచనాశిల్పము యొక్క ఆయువుపట్టు ఇక్కడ నున్నది. ఆ పట్టునకు పరమేశ్వరానుగ్రహము వలన చిక్కినది. నా పద్యరచన అక్కడనుండి చూడవలెను. పద్యలక్షణము లన్నియు సమృద్ధిగానే యుండును. ఆత్మ అక్కడిది అని మనవి చేయుచున్నాను.

ఈ రామాయణమును వదిలిపెట్టినచో 1961 వ సం॥వరకూ ఒక ప్రక్క రామాయణము వ్రాయుచునే యున్నను—ఇంకొక ప్రక్క పద్యకావ్యములు కూడ వ్రాయుచునే యున్నాను. ఈ పదునాకేండ్లలో వ్రాసిన పద్యకావ్యములనుగూర్చి కొంత చెప్పెదను.

మొదటిది 'ఝాన్సీరాణి'. నా కావ్యములకు ప్రబోధకములు మూడు విషయములు. మొదటిది, ఎవడో నా కీ కావ్యము వ్రాసిపెట్టు అని యడగటం. రెండవది, అంతఃప్రబోధము. మూడవది. మనసులో కొన్ని భావములు పేరుకొనవాని కొక గ్రంథరూప మీయవ లెననుకొనుట. ఎవరికో ఒకతనికి వారము దినములలో నొక పద్యప్రబంధము కావలని వచ్చెను. ఈ యూరిలో చాలామంది కవులు, వారముదినములలో మాకు చేతకా దన్నచో మాకు చేతకా దన్నారట. ఆ విశ్వనాథ సత్యనారాయణ ఉన్నాడు. ఆయనకు వారముదినములు కూడ నక్కరలేదు. ఆయనదగ్గరకు పొమ్మన్నారు. వచ్చాడు. కథ ఝాన్సీరాణి. కనీసమునాలుగైదువందల పద్యాలైనా వ్రాయవలెను.నాలుగుదినములకన్న నెక్కువ లేదు. సరే వ్రాయవచ్చును కాని, ఇందులో కథానాయకుడు లేడు. లక్ష్మీబాయి కూడ చివర ఓడిపోవును. నాయకుడు కాదు సరికదా: కథానాయికకూడా కాదు. ఇది యామెను గూర్చిన ఒట్టి కథ యగుచున్నది. ఉన్నది ఇది. ఏదో చేయవలయును. అంత పరాక్రమవంతురాలుగదా: భారతీయదృష్టితో అంతటి ధర్మమును చేసెను గదా: ఆమె ఎందు కోడిపోవలయును? ఆమె సమకాలికులైన ఇతర భారతదేశపు రాజులు ఆంగ్లేయులకు దాసానుదాసులైరి. సీ: సీ: కాలముయొక్క మహిమ. లేనిచో నామె కథానాయకురాలై యుండెడిది. విజయము పొందెడిది. కావ్యము వీరరసకావ్యమై యుండెడివి. అందుచేత ఈ కావ్యమును నేను అధ్యాయములుగా విభజించి, ప్రతి అధ్యాయముల ఆద్యంతములయందు కాలమును వర్ణించితిని. గ్రంథాదియందు కాలముయొక్క స్వరూపమును, దాని యవలక్షణములను, దాని యుగధర్మముల ననుసరించి నడిచెడి పద్ధతిని వివరించితిని కొంత దోషము పోయినట్లేగదా: ఒకాయన ఋతువులను వర్ణించినచో కవిత్వము కాదని యన్నాడట. మరి దేనిని గురించి వర్ణించినచో కవిత్వము:కవిత్వ మనగా వర్ణన. ఉచితముగా, సమర్థముగా, దేనినిగురించి వర్ణించినను కవిత్వమే. వర్ణనయనగా ప్రకృతివర్ణనయే వర్ణన యని అనుకొందురు. కథను చెప్పుటగూడ వర్ణనయే. కథలోని భిన్న విషయములు వర్ణింపబడుచున్నవి.

మరియొకరు కుమారస్వామికథనుగూర్చి వ్రాసిపెట్టుమన్నారు. ఆయనకు నే నాకావ్యమును వ్రాసిపెట్టినచో సంతానము కలుగునని యాశ. వ్రాసితిని; అంకిత మిచ్చితిని. ఆ గ్రంథము పేరు కుమారాభ్యుదయము. తృణమో పణ మో పుచ్చుకొంటిని. ఈ కావ్యము మాత్రము కథానాయకు డెవ్వ రన్న సందేహమును పుట్టించలేదుగదా: కుమారస్వామి షణ్ముఖుడు. ఆయన కిద్దరు భార్యలు. ఒకామె

దేవసేన, రెండవయామె వల్లి. ఈ కావ్యములో నొక పెద్ద కల్పన చేసితిని. దేవసేనయు, కుమారస్వామియు శృంగార రసమును నడుపుదురు. వారు కర్షకులు. వారి శృంగారరసము పంటచేలవెంట, జొన్న కంకులు, మొక్కజొన్నకంకులు తినుచు, మిగుల మెత్తగా నుండును. వల్లియొక్క పెండ్లి మరియొకరీతి. ఆమెకు దేవసేనకు పడదు. ఆమె వెడలి పోయినది. కాని యామె నదులమీద వంతెనలు కట్టించి, ఆ పొలములు సాగుచేయుటకు చాలా సాహాయ్య పడినది. ఈ నాటి పంటలు, సాగులు, వంతెనలు మొదలైన పథకములు, స్త్రీలు సంఘమున కెట్లు పయోగ పడుదురో, వారు తలచుకొన్నచో నెన్నెన్ని పనులు చేయగలుగుదురో అవియన్నియు దీనియం దభివర్ణితములు. మొదటిసారి దేవసేనను స్వామి, తల్లి దగ్గరకు తీసుకొనిపోవును. కొత్తకోడలు వచ్చుట, అత్తగారిమురుపు చాలా విచిత్రముగా వర్ణితములైనవి. ఇది ఇట్లుండగా కుమారస్వామిని గూర్చి ద్రావిడ దేశమునందు బహుకథలు గలవు. గొప్ప గొప్ప సంప్రదాయములు కలవు. అవి యన్నియు ఈ గ్రంథమునందు పాటింపబడినవి. ఆంధ్రపత్రికలో కాబోలు 'రామచంద్ర'యన్న పేరుగల చక్కనివిమర్శకుడు దీనినిగురించి వ్రాసినాడు.

మరి తరువాత వ్రాసినది 'విశ్వనాథమధ్యాక్కఱలు'. తెనాలివద్ద మున్నంగి యను గ్రామ మున్నది. ఆ ఊరిలో వేణుగోపాలస్వామి విగ్రహ మున్నది. శిథిలావస్థలో నున్నదట. అచ్చట పెద్దలు వచ్చి నన్ను కోరిరి- ఆ స్వామివారిమీద నొక శతకమును వ్రాసిపెట్టు మని. ఆ శతకమునకు మకుటము "మున్నంగి వేణుగోపాల!" అని యుండవలయును. ఏ పద్యానికి చివర ఇది వచ్చుటకు వీలులేదు. మధ్యాక్కఱయైనచో చక్కగా కుదురును. అందుచేత 108 మధ్యాక్కఱలు వ్రాసి శతకము చేసితిని. ఇచ్చట నింకొక చమత్కార మున్నది. మా యూరిలో, అనగా నా స్వగ్రామమైన నందమూరిలో, శివకేశవాలయములు రెండును గలవు. శివాలయము మా నాయనగారు నిర్మించిరి. మా స్వామి వారి పేరు విశ్వేశ్వరస్వామి. విష్ణ్వాలయములో నున్న స్వామి వేణుగోపాలస్వామి. మాఇద్దరు స్వాములు నన్ను పెంచినవారు; పెద్దవానిని చేసినవారు; నా దారిద్ర్యములో న న్నాదుకొన్నవారు; నన్ను బాగుచేసినవారు; నాకు సర్వజ్ఞానమును కుదిర్చినవారు; నాలో కవితాభావమును నింపినవారు. కనుక మున్నంగి వేణుగోపాలస్వామిని గూర్చి వ్రాయుచు, మనస్సులో మాయూరిలోని సంతాన వేణుగోపాలస్వామిని గురించియు భావించుచునే యున్నాను. మున్నంగి శతక మైపోయినది. ఆ మున్నంగి వెళ్ళితిని. మున్నంగి వేణుగోపాలస్వామివారి

చరణసన్నిధిని ఆ శతకము నర్పించి వచ్చితిని. కాని, శ్రీసంతానవేణుగోపాల స్వామివారు అనగా మా యూరిలోని స్వామివారు, నా ప్రాణములమీద కూర్చుండిరి. వారినిగూర్చి కూడ మరియొకశతకము వ్రాయనిచో ఆయన నన్ను బ్రతుకనీయడే! ఆయన మీద కూడ మరల మధ్యాక్కఱలే వ్రాసితిని. ఆ స్వామి నాకు స్వప్నములో కనిపించి యొక వాగ్దానము చేసినాడు. నేను చనిపోకముందు ఆ వాగ్దానమును చెల్లించు నని ప్రతీక్షించుచున్నాను. అది వేరేమాట! ఇంతలో నర్సారావుపేట దగ్గర నెకరుకల్లు అను గ్రామము కలదు. అందులో భూమిలో పాతిపెట్టబడిన శివాలయ మొకటి కనిపించినది. ఆస్వామి చాలమహత్తులు ప్రకటించినాడు. వెళ్లి నేను ఆ స్వామిని దర్శించి వచ్చితిని. వారిమీదకూడ మరియొక మధ్యాక్కఱ శతకము వ్రాసితిని. శ్రీశైలము, కాళహస్తి, భద్రాద్రి, తిరుపతి వేంకటేశ్వరస్వామి, మా కులదైవమైన శ్రీ విశ్వేశ్వరస్వామి, ద్రాక్షారామ భీమేశ్వరస్వామి, ఈ రీతిగా నివి పదిమధ్యాక్కఱశతకము లైనవి. వేయిపద్యములైనవి. దానికే ఢిల్లీలోని కేంద్రసాహిత్యపరిషత్తువారు బహుమాన మిచ్చిరి. నా కేబహుమానము వచ్చినను సరే, దానికెంతో హంగామా జరగ వలయును. ఆ బహుమానము కొందరు నాకు రాకుండచేయుదురు. కొన్ని ఏండ్లు జరుగును. వారు కొంత యప్రతిష్ఠ బడుదురు. అప్పటికి నాయందు అభిమానము కలిగినవారికి బలము చేకూరును. తక్కినవారు నోరెత్తలేని స్థితిలో నుందురు. అప్పుడు బహుమానము వచ్చును. ఇది నా జాతక లక్షణము. నా ఉపాస్య దైవములు నాకు ఎక్కువ యాధ్యాత్మికముగా, తక్కువ లౌకికముగా ఉపయోగింతురు.

నేను వ్రాసిన గ్రంథముల పేర్లన్నియు నాకు గుర్తుండవు. ఏవి అచ్చు వేయుదునో అవి మాత్రమే గుర్తు. అన్నట్లుగా 'విశ్వనాథ పంచశతి' యన్న గ్రంథము వ్రాసితిని. నాకు విరోధు లెక్కువమంది. ఎందుకో నాకర్థము కాదు. నన్నెరుగనివాండ్రు నేను దుర్జనుడ నందురు. ఎరిగినవారు చాలమంచివా డందురు. నేను చాలమందికి నా చేతనైనచో ఉపకారములే చేయుదునుతప్ప అపకారములు చేయనే చేయను. నా కిది వ్రతము. అవతలివానికి అపకారము జరిగెడి అబద్ధము చెప్పనే చెప్పను. నేను ఎవరినైనా ఏదైనా అంటే వాళ్ళు నాకు చాలా అపకారము చేస్తే అంటాను. ఒక్కటి మాత్రము ఉంది. నేను అనటం ఘాటుగా ఉంటుంది. ఘాటుగా ఉంటుంది కనకనే తరువాత దానిని గురించి నాకు జ్ఞాపకముండదు. ఎవళ్ళ కర్మను వాళ్ళు పోతారు నాకేమి!

మనస్సునకు ఏదో వెట్ట పుట్టినప్పుడు పూర్వము 'మా స్వామి' అన్న విశ్వేశ్వర శతకం వ్రాసితిని. ఈ పాతికయేండ్లలో, మొదటి పదునొకండేండ్లలో ఒక 4 దినములు కాబోలు, 'విశ్వనాథ పంచశతి' 500 పద్యములు వ్రాసి, వెంటనే అచ్చువేయించితిని.

ఈ పాతికేండ్లలో మొదటి పంద్రెండేండ్లు పోగా మిగిలిన పది ఏండ్లున్నవి. అప్పటికి రామాయణరచన పూర్తియైపోయినది. 1961 లోననే యుద్ధకాండము పూర్తి చేసితిని.

ఈమధ్య సంస్కృతభాషలో చాల వ్రాసితిని. తత్పూర్వమే 'మృతశర్మిష్ఠ' మన్న సంస్కృతనాటకమును వ్రాసితిని. 'దేవీత్రిశతి' యని అమ్మవారిమీద సంస్కృతములో 300 శ్లోకములు వ్రాసితిని. మరియు 'శివసహస్ర'మని వ్రాయుద మని ప్రారంభించి మూడు నాలుగు వందల శ్లోకములు వ్రాసి అట్టిపెట్టితిని. చిల్లరమల్లర సంస్కృతకావ్యములు చాలా వ్రాసితిని. అవి యన్నియు నట్లే అపరిశోధితములు, అముద్రితములు నై యున్నవి.

మరి 'గోపికాగీతలు', 'భ్రమరగీతలు' అన్న రెండు గ్రంథములు వ్రాసితిని. ఇవియు నెవరో వ్రాసిపెట్టు మని యడిగిరి. భ్రమరగీతలు వంద పద్యాల పుస్తకము. గోపికాగీతలు మూడువందలు. భ్రమరగీతలు సంస్కృత భాగవతములో మూడు నాలుగు శ్లోకములలో ఉన్నవి. పోతన్నగారే ఏడెనిమిది పద్యములు వ్రాసినారు. నేను వందపద్యములు వ్రాసితిని. హిందీభాషలో నొకకవి యెవరో భ్రమరగీత అన్న పేరుతో కొంచె మెక్కువగా వ్రాసినా రని విన్నాను.

తరువాత మూడు నాలుగు ఏండ్లక్రింద రెండు విలక్షణములైన గ్రంథములను వ్రాసితిని. ఒకదానిపేరు 'శ్రీకృష్ణసంగీతము.' ఇవి 109 శీర్షికలు. ఇందులో సుమారు డెబ్బది ఎనిమిది మంది గోపికలు శ్రీకృష్ణదేవుని యుపసరింతురు. ఆ మార్గములు భిన్నభిన్నముగా వ్రాయబడినవి. అనగా నెనుబది విదములైన గోపికలు వర్ణింపబడి రని యర్థము. ఇవి యన్నియు గీతపద్యములు గీతపద్యచరణము లొక్కొక్కశీర్షికయందు నలుబది యుండును. పద్యములు విడివిడిగా నుండవు. ప్రతిదినము నొక గీతమాలిక. వ్రేపల్లె శ్రీకృష్ణదేవుని సంగీతము. ఆ గొల్లపల్లెలో నున్న గోపికలు కొందరు కాపురమునకు వచ్చి చాల దినములైనది. కొందరు క్రొత్తగా వత్తురు. కొందరు గాయనులు, కొంద రహంకారవతులు, కొందరిని భర్త లదుపులో పెట్టెదరు— ఇందులో సంస్కృతసమా

సము లుండవు. అన్నియు దేశీయములైన శబ్దములే. గొల్లపల్లెలలో జానపదులు వాడుకొను శబ్దములు. తెలుగు నుడికారములు. ఒక స్నేహితు డన్నాడుకదా— మరల కిన్నెరసాని పాటలవంటి గ్రంథమును వ్రాసినారండీ— అని. నేను కిన్నెరసాని పాటలు వ్రాసిన నా చిన్నప్పుడు తెలుగు దేశము చచ్చిపోలేదు. సంప్రదాయము చచ్చిపోలేదు. పూర్వకవిత్వపు వాసనను చంపుటకు నేడు జరిగిన, జరుగుచున్నంత బ్రహ్మప్రయత్నములు చేయబడలేదు. తెలుగుభాష, తెలుగు నుడికారము, తెలుగు సామెతలూ దేశీయములైన కొన్ని అందచందాలొలికెడి మాటలు అన్నియు వెనుకబట్టినవి. అందువల్ల నా శ్రీకృష్ణసంగీతమునకు తగిన ప్రతిష్ఠ రాలేదు. ఎవరికి నష్టము ?

చెప్పదలచుకొన్న వానిలో చివరిది 'రురుచరిత్రము' ఇదియొక గొప్ప ప్రబంధము. ఏడెనిమిది వందల పద్యముల ప్రబంధము. రురుడు, ప్రమద్వర అన్న కథ భారతములో నున్నది. ఐదారు పద్యములలోనిది. రురుడు భృగువంశీయుడు. అతడు ప్రమద్వర అన్న అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయిని ఒకపాము కరుస్తుంది. ఆమె చచ్చిపోయింది. ఈ రురుడు కనపడ్డ ప్రతిపామునీ చంపటం మొదలు పెట్టినాడు. చివరి కితనికి ఒక ఋషి కన్పించి, నీ ఆయుస్సులో సగం ఆ అమ్మాయి కిస్తే బ్రతుకుతుం దన్నాడు. ఇచ్చాడు బ్రతికింది. ఇది భారతంలోని కథ. దీనిని నేను చాలపెంచాను. ఈ రురుణ్ణి ఒక యోగిని చేశాను. అతడు చావు లేదంటాడు. చావుని మనుష్యులే చేసుకొంటా రంటాడు. మృత్యువనేది మనుష్యుని చేతిలో ఉందని అతని నిశ్చయము. అటువంటప్పుడు, నీ ఆయువులో సగము నీ భార్య కిస్తే ఆమె బ్రతుకుతుంది—అన్న మాట కుదరదు. అప్పు డితని యాయుర్దాయము పూర్వమే నిర్ణయింపబడి ఉండాలి. ఉంటే ఇతని సిద్ధాంతం తప్పు

ఇతని యోగము ప్రపంచదమైన యోగము. జంతువులన్నీ ఇతణ్ణి చూచి భయపడుతూ ఉంటాయి. ఒక మహాసర్పం కారణం లేకుండా ఇతనితో విరోధం పెట్టుకుంది. దేవతలుకూడా ఇతని హఠాన్ని తగ్గించవలె నంటే, ఇతడు ప్రేమించిన ప్రమద్వరకు మృత్యువు తేవాలి

ఇటువంటి యోగము నేడు మన తెలుగుదేశంలో ఒకటి ఉన్నది. ఆసిద్ధాంతము అంత నిజముకాదని చెప్పటకోసముకూడ నే నీగ్రంథము వ్రాశాను.

ఈ కావ్యంలో జంతువుల స్వభావము, క్రూర మృగాల లక్షణము ఎంతో ఎంతో వ్రాశాను. వేటకాండ్రు వ్రాసిన చాలగ్రంథములు నేను చదివినవాణ్ణి.

అడవులు, అడవిమృగాలు—వాటినిగురించి ఆ గ్రంథాలలో ఎంతో ఉన్నది. నేనే స్వయముగాఎన్ని అడవులు తిరిగానో ఎన్నికొండలు ఎక్కానో చెప్పలేను. అనా స్వంత అనుభవాలు, అయా గ్రంథాలలో ఉన్న విషయాలు, రామాయణంలో వ్రాశాను. నా నవలల్లో తెగవ్రాస్తాను. అనలు నా కవిత్వంలో నూరు వర్ణనలు నేను చేస్తే తొంబదియైదు నా సొంతములు. ఉత్ప్రేక్షలు, ఉపమలు, పూర్వకవులవి సామాన్యంగా ముట్టుకోను. ఈ లక్షణము ఈ రురుచరిత్రనిండా ఉన్నది. పద్యరచన కూడా చాలా క్రొత్తక్రొత్త మార్గాలలో చేశాను. రామాయణంలో పద్యరచనకంటె కూడా రురుచరిత్రలోని పద్యరచన కొన్ని కొన్ని చోట్ల చాలా విచిత్రంగా చేశాను. రురుని భార్యకు మరల నైదారుగురు పిల్లలు పుట్టి పోతారు. పాములను చంపితే సంతానం నష్టమవుతుందని ఒక ప్రథ ఉన్నది. దానిని అనుసంధించి చేశాను. ఆ ప్రమద్వర గర్భిణిగా ఉంటే, ఆ గర్భిణీస్త్రీని వర్ణించాను. ఆ వర్ణనలు పూర్వకవులు చేసినవి కావు.

ఇది చాలా గొప్ప ప్రబంధము. ఈ రోజుల్లో ఎవరికి కావాలి. తేలికగా వ్రాస్తేనే అర్థంకాదు కదా! మే మందరికీ అర్థమయ్యేటట్లు వ్రాస్తా మని వ్రాసేవారి రచనే అందరికీ అర్థంకాదు కదా! ఒక్కొక్కప్పుడు వాళ్ళకే అర్థంకాదుకదా!

అర్థం కాపటమంటే ఏమిటి అన్నది వేరే విచారణ. ఒక శబ్దానికి అర్థం ఎలా వస్తుందో తెలిసికోవాలి. శబ్దం ఎందుకు పుడుతుందో తెలిసికోవాలి.

ఇంకొకవిషయం చెప్పి ఈ పద్యాలకథ వదిలిపెడతాను. ఒక ఏడాది క్రింద నాకొకజబ్బు చేసింది. అది ఒంటికి సంబంధించిందన్నారు. తత్పూర్వము సంస్కృతంలో మరియొక నాటకం వ్రాశాను. దానిపేరు 'గుప్త పాశుపతము'. ఇది ఒక నాటకము. ఈ నాటకములోని విషయము మహాభారతయుద్ధముమీద ఒక భాష్యము, ఒక మహావ్యాఖ్యానము. మనదేశములో చాలమంది పండితులు విన్నారు; వినిపించాను. 1972 జూన్ 29 న అనుకొంటాను—విజయవాడ రేడియోలో ఈ నాటకంలో కొంతభాగం ప్రసారితం చేశారు.

'ప్రద్యుమ్నోదయ'మను ఇంకొక వాక్యము కలదు. గుంటూరు జిల్లాలో గొడవర్రు అను ఊరు ఉన్నది. ఆ ఊళ్ళో జంధ్యాల వెంకటేశ్వర్లు గారని ఒక సంపన్నగృహస్థు కలడు. ఆయనకి నా కవిత్వమంటే పరమ ఇష్టము. ఆయన, ఆయనభార్యా కలిసి నన్ను వాళ్ళ ఊరు తీసికెళ్లి ఒక వెయ్యిన్నూటపదహార్లిచ్చి సన్మానం చేద్దా మనుకొన్నా మని నాతో చెప్పారు. ఊరికే చెయ్యట మెందుకు బాబూ; నీకో పుస్తక మంకిత మిస్తాను. అని ఈ కావ్యం వ్రాశాను. ఇందులో

కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకురావటం, వాళ్ళకి ప్రద్యుమ్నుడు పుట్టటం, ఆయనకి అనిరుద్ధుడు పుట్టటం కథ. రురుచరిత్రశైలి ఎట్లా విలక్షణమైనదో ఈ శైలి ఇంకొకట్లా విలక్షణమైనది. నేను సుకుమారంగా వ్రాసినా సరే, మధురంగా వ్రాసినాసరే, పద్యరచనలో జిగి తప్పదు, ప్రౌఢి తప్పదు. కాని ఇందులో విశిష్టాద్వైతములోని వ్యూహములు సంతరింపబడినవి. పండితులైనవారు, భావుకులైనవారు దీనిని తెగ మెచ్చుకొన్నారు. ఇది చాల సొగసైన ప్రబంధము. ఇందులోని శయ్య, శశిదూతములోని శయ్యవలె నుండును. అంతకంటె సుకుమారముగ నుండును.

ఇంక నవలలను గురించి చెప్పవచ్చును. 'తెఅచిరాజు', 'స్వర్గానికి నిచ్చెనలు' ఇవి రెండూ ఈ పాతికేండ్లలో మొదటనే పడతవి. బందరులో మంజులూరి కృష్ణారావని ఒక మహానటుడు ఉండెడివాడు. పూర్వపు కూచిపూడి వాళ్ళలో పరదేశి మొదలైన వాళ్లు ఎటువంటి అభినేతలో ఆయన అటువంటి వాడు. నాకు అభినయం చాలా తెలుసు. అదంతా అతనిని చూచి తెలుసు కొన్నదే. అత డొక విచిత్రమైన పురుషుడు. అతని నాట్యకౌశల మంతా 'తెఅచి రాజు' నిండా వ్రాసినాను. ఆహార్యకము, వాచికము, ఆంగికము, సాత్త్వికము మనకు పేర్లు తెలుసు. పెద్ద నటకుల మనుకునే వాళ్లకు కూడా పేర్లు మాత్రమే తెలుసు. ఈ నాటకాలు వేసే వాళ్లలో ఈ నాలుగూ సర్వంకషంగా తెలిసినవా డతడొక్కడే (పూర్వపు కూచిపూడి భాగవతులను వదిలిపెట్టి). తెఅచి రాజులో అతను ఎంత ఉన్నాడో, అతను కానిదీ అంత ఉన్నది. ఒక నవల వ్రాస్తూఉంటే మనము ఎరిగున్న మనుష్యుణ్ణే తీసుకొంటాము. కథ, భావము, రసము, పాత్రపోషణ మొదలైన వానిని పురస్కరించుకొని వ్రాస్తూ ఉంటే ఆ ఎరిగి ఉన్న పురుషుడు మారిపోతాడు. చాలా మారిపోతాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డాక్టర్ బి. వి. కుటుంబరావని ఉన్నాడు. అతను తెలుగు నవలలను గురించి ఒక పరిశోధకవ్యాసం వ్రాసి డాక్టరేట్ పట్టం పొందాడు. ఆయన వ్రాసినట్లు-ఏకవీరలో నేను ప్రారంభించిన త్యాగేంద్రియస్పర్శ లక్షణము, తెఅచిరాజులో మరల నెత్తికొని వ్రాశాను.

రెండవది 'స్వర్గానికి నిచ్చెనలు': ఇది ఒక చిత్రమైన నవల. మతము పేరకూడాను, దుర్జనులు ఇతురులను వంచింతురు. ఇతరులను వంచించుట ఈ లోకమునం దొక మహావిద్య. అదొక శిల్పము. ఈ శిల్పవేత్తల సంఖ్య అనంతము. దేవుడు లేడని వంచింతురు. ఉన్నా డని వంచింతురు. ఒక మహా

విషయమును, అది మహావిషయము కాదని ఇతరులను వంచింతురు. ఈ వంచకులలో ప్రధానముగా రెండు రకాలు. మొదటి రకము-అది వంచన అని తెలిసి దోషము కానిదానిని దోషమని చెప్పును. రెండవ రకము దీని తలలో జేజెమ్మ. ఆ రకమునకు అది యథార్థమని తెలియదు. అది యథార్థము కాదనిచెప్పు చుండును. మరి వంచన ఏమి యున్నది ? మూలవస్తువే వంచన. వంచనయొక్క సగము దోషము చేసెడి పద్ధతిలో నుండును. ప్రచారములో నుండును. తన కిష్టము లేనిదానిని దుమ్మెత్తిపోయుటలో నుండును. పదిమందిని కూడగట్టుకొని లోకమును ప్రతారించుటలో నుండును. ఈ 'స్వర్గానికి నిచ్చెన'లన్న నవల దైవము అన్న విషయములో ఆస్తికులమనువారు చేసెడి వంచన సర్వస్వము ఉన్నది.

చిన్న చిన్న నవలలు చాల యున్నవి. వాని నట్లుంచి, మూడు రకములైన నవలలను గురించి చెప్పెదను. ఒకటి, 'పురాణ వైరగ్రంథమాల' పన్నెండు నవలలు. రెండు, 'నేపాళరాజ చరిత్ర' ఆరు నవలలు. మూడు, 'కాశ్మీరరాజ చరిత్ర' ఆరు నవలలు. ముందు వీనిని గురించి చెప్పెదను.

అనాదినుండీ, అనగా నా చిన్నప్పటినుండీ, ఇంగ్లీషువాడు నేర్పెడి వాని చరిత్ర మన చరిత్రలో పాఠ్యగ్రంథములుగా చదివినప్పటినుండీ, 'Hindu Period' అను పాఠ్యగ్రంథాలలో చెప్పబడే పరిమితవుటలు గల చరిత్ర చదివినప్పటినుండీ, మన పురాణములు పుక్కిటికథ లని మొదలైన ఎన్నో అబద్ధములు చరిత్రలో చదివి చదివి నాకు విసువెట్టినది. తరువాత శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు. భావరాజు కృష్ణారావు గారు, నేలటూరి వేంకటరమణయ్యగారు, ఈ మొదలైన చరిత్రపరిశోధకులతో నాకు మిక్కికి దగ్గరితన మేర్పడినది. ఈ చరిత్రను గురించి నేనెంతయో నేర్చుకొంటిని. భారతయుద్ధము రెండువేల యేండ్లక్రింద జరిగిన దని, రామాయణము కొంచెమించుమించుగా జరిగినదని చదువలేక, వినలేక, నా బొమికెలు చిట్లెము కట్టెను. ఇట్లుండగా నేబదిఏండ్ల క్రిందను, అంతకుముందును నర్సారావు పేటలో నడింపల్లి జగన్నాథరావుగారని ఒక వకీలు 'మహాభారత యుద్ధకాలము' అను ఒకచిన్న గ్రంథము వ్రాసినారు. అందులో సంస్కృత మహాభారతములో భీష్మ నిర్యాణ దినము-మకర సంక్రమణ దినము-విస్పష్టముగా చెప్పబడి యున్నది. ఈ సంక్రాతి ప్రతి సంవత్సరమును వచ్చును. అప్పటినుండి లెక్క వెయ్యబడినవి. ఒక పాతికయేండ్ల క్రిందవరకు ఫ్రాన్సుదేశవు రాజధానియైన

పారిస్ నగరములో నుండెడి గణితశాస్త్రజ్ఞులు అఖండులు. వాళ్ళు లెక్కలు తేల్చి చూచిరి. విషయము రుజువు చేయబడినది. ఐదేండ్ల కొకసారి సంవత్సర పరిమితి కొన్ని సెకండ్లో, ఒకటి రెండు నిమిషములో తగ్గుట ఖండకాల ప్రమాణ స్వరూపము. ఒక ముప్పది ఏండ్లక్రిందినాటి ఈ లెక్క ప్రకారము చూడగా భీష్మ నిర్యాణ సమయమున మకరసంక్రమణ మెప్పుడయినది? 1937 సం॥న మకరసంక్రమణ మెప్పుడు జరిగినది? ఈ జరిగిన దానికిని దానికిని మధ్య కాల మెంత ఉండినది. ఆ కాలమును ఐదైదేండ్లకు కొన్ని కొన్ని సెకండ్లకు తగ్గెడి కాలముతో విభజించెడిచో, భీష్మ నిర్యాణము జరిగి, మన పంచాంగములలో వ్రాయబడుచున్న మకర ప్రవేశమునకు, తత్పూర్వము నలుబది ఏండ్లకు పూర్వము మహాభారతము యుద్ధము జరిగిన దనుటకు సరిపోవుచున్నది. దీనిని పారిస్‌లోని మహాగణితశాస్త్రజ్ఞు లంగీకరించిరి.

ఈ విషయమునుగురించి తత్పూర్వమే మద్రాసులోని ఒక తమిళ పండితుడు, ప్లీడరు — ఆయనపేరు నారాయణయ్యర్ అనుకొంటాను-ఆయన 'శంకరుని కాలనిర్ణయ' మను నొకగ్రంథము వ్రాసెను.

పాశ్చాత్య చరిత్రకారులు మన పురాణములయం దున్న విషయములన్నియు వాళ్ల ఇష్టమువచ్చినట్లు మార్చివేసిరి. వారు మార్చిన దానికి కారణములతో మన కవసరములేదు. ఈ పైనచెప్పిన లెక్కలప్రకారము మన పురాణములలో నున్న రాజవంశములయొక్క కులములు సరిపోవుచున్నవి. ఇవికాక, మనదేశములోనే 'మగధరాజ వంశావళి', 'నేపాళరాజవంశావళి' మొదలైన పూర్వగ్రంథములు కలవు. ఇవికాక, కల్హణుని 'రాజతరంగిణి' కలదు. మనకే చరిత్రగ్రంథములు చాల కలవు. విజయవాడలో శ్రీ కోట వెంకటాచలంగారని ఒక మహాపురుషుడు ఈ మహాపరిశోధన అంతయు జేసి, ఆ నారాయణయ్యర్ గారు, ఈ జగన్నాథం పంతులుగారు చేసిన పరిశోధనలకు చెట్టు కట్టించి, పూయించి, కాయించి, పండించిరి. ఆయన చాలా గొప్పగ్రంథములను వ్రాసెను వానికి ప్రశస్తి ఎందుకు రాలేదనగా మనము బానిసజాతియై పోయినాముగనుక. నాకొకవిషయము జ్ఞాపకము వచ్చుచున్నది. ఫిలిప్పైన్ ద్వీపముకింద మాండెనో అని ఒక ద్వీపమున్నది. ఆ ద్వీపమున మంటితో పుట్టిన జను లున్నారు. స్పెయిన్‌మొదలైన దేశములవారు నాలుగువందల ఏండ్లక్రిందనే ఆ ద్వీపమును కూడ ఆక్రమించినారు. అక్కడ ఆదిమవాసులు తివోలీజాతి. వాళ్ళ ఆచారములు ఇప్పటికికూడా తెలుగువాళ్ళ ఆచారములు. వాళ్ళ భాషపేరు తెగలాగ్-తెలుగు

గలాగ్ నాయకు డన్నాడట— "మనము పాశ్చాత్యులను వాళ్ళ నీడ అన్నమాట. నీడకి నామరూపాలు లేవు. నీడని ఆస్థితికి వచ్చాము" అని.

షయాన్ని పురస్కరించుకొని 'పురాణవైరగ్రంథమాల' అని వ్రాశాను. నేటి ఆంధ్రచరిత్రనుబట్టి చూస్తే ఇక్ష్వాకులు, పల్ల లు, ఇటువంటిపేర్లు, వాళ్ళు పాలించిన కొద్ది కొద్దిభూభాగాలు. తిగా మన యాంధ్రచరిత్ర ధ్వంసమైపోయినది.

యుద్ధమైన తరువాత మగధ సామ్రాజ్య మున్నది. మున్నది. గిరివ్రజము రాజధానిగా రెండువేలయేండ్లు మహా శమును సామ్రాజ్యముగా పాలించిరి. అందులో ఆరువందల శాతవాహనులు గిరివ్రజమునుండి భారతదేశసామ్రాజ్యము లయొక్క తరతమభేద నిరూపక వ్యాకరణ' మని కాల్డ్వెల్ వ్రాశాడు. పాప మా కాల్డ్వెలు శాసించలేదు. పండితులను డు. మనదేశములో అది ప్రమాణగ్రంథమై పోయినది దనే జరుగుచున్నవి. ఇట్టివి యెన్నియున్నవి? అది వదలి ఆఫ్గన్‌స్థానములో బ్రాహూయీ అను ఒకభాష యున్నదనీ గుభాషకూ పలువిషయాలయందు సామ్య మున్నదని వ్రాసి లాంధ్రులు- వారు భారత సామ్రాజ్యమును పాలించి తములందలి అధిపతులందరు నాంధ్రులైయుందురు. ఆనాటి డో ఆంధ్రుడు అధిపతియై, ఆ ఆటవికులచేత మన భాష దీనిలక్షణములు అక్కడ పాతుకుపోయినవి.

రే యున్నది. ఈ మగధరాజ్యము, మౌర్యచంద్రగుప్తుడు, ము, గుప్తచంద్రగుప్తుడు. అలెగ్జాండర్ మనదేశముమీదికి ప్తచంద్రగుప్తునికాలములో. మౌర్య చంద్రగుప్తుని కాల చంద్రగుప్తుని కాలములో నని 1200 ఏండ్లు పాశ్చాత్య త్రను వెనుకకు త్రోసివేసిరి. అంతదూరము పోనక్కర ఎన్ని అబద్ధములు వ్రాసిరి? కలకత్తా బ్లాక్‌హోల్ అన్నది చరిత్రకారులు రుజువు చేయగా, పాఠ్యగ్రంథములనుండి

మన చరిత్ర విస్పష్టముగా నున్నది. మన పురాణములయందలి మగధ రాజ వంశాదులయందలి యథార్థచరిత్ర ననుసంధించి నేను పురాణవైగ గ్రంథ మాలను పండ్రెండు నవలలను వ్రాసితిని. అందులో 'చంద్రగుప్తుని స్వప్న' మన్న నవల గుప్తచంద్రగుప్త, మౌర్యచంద్రగుప్తుల భేదమును చెప్పునది.

రెండవ ఆరు నవలలు కాశ్మీర చరిత్రము. కల్హణ పండితుని రాజతరంగిణి కలదు. దీనిని జహ్వార్‌లాల్ పండితుని బావమరిదియైన ఆర్. ఎస్. పండిట్ ఇంగ్లీషులో వ్రాసినాడు. జహ్వార్‌లాల్ పండితుడు ఆ గ్రంథమునకు పీఠిక వ్రాసినాడు. ఇది కాక, గోరఖ్‌పూర్‌లోనూ, చౌకాంబాలోను 'కాశ్మీర చరిత్రము' సంస్కృతములో దొరుకును. నేను దానిని కూడ తెప్పించితిని. కల్హణుడు కల్యాదవిషయములందు పొరబడినాడు. అవి ఆరు నవలలు వ్రాసినాను.

మరి యింకొక ఆరునవలలు నేపాళరాజచరిత్రను గూర్చి వ్రాసితిని.

ఈ ఇరువదినాల్గు నవలలో మన పురాణములలో ఆయాచరిత్రములలో నున్న యంశములు తారీఖుల ప్రకారము కాలమును చూపించితిని. సందర్భములను వివరించితిని. చరిత్రలోని ప్రధానాంశములను వదలిపెట్టలేదు.

అందరునూ నేను పడ్డశ్రమ పడరు. ఈ నాడు పాఠకులకు శ్రద్ధ ఎక్కడిది? విజ్ఞాన మక్కరలేదు, పాండిత్య మక్కరలేదు. స్వజాతిభావ మక్కర లేదు. ఇది వేదభూమి యన్న అభిమానము ఉండుట తప్పుగా కనిపించుచున్నది.

ఇన్ని నవలలో చరిత్రాంశములను తీసివేయ, కథలన్నియు నేను కల్పించినవే. వందలాది విలక్షణమైన పాత్రలు నేను సృష్టించినవే. కథ, కథచెప్పెడి సొగసు, శిల్పము బూడిద బుగ్గి— ఒక గొప్పనవలకు కావలసిన సామగ్రి యంతయు ప్రతి నవలలో సమకూర్చితిని. ఒక నవలవలె ఇంకొక నవల యుండదు. అనంతమైన కల్పనా వైవిధ్యమున కంతులేదు. భాషయా, ఎక్కడ ఏ భాష ఉచితమో, ఆ భాషయే వ్రాయబడెను. నా పద్యప్రపంచక మెటు వంటిదో, నేను నిర్మించిన గద్యప్రపంచకము నట్టిదే; ఎంగిలికూడు లేదు. నాజాతి, నా తెలుగువాళ్ళు, తెలుగుభాష నాది. వాళ్ళు—నేను తెలుగువాణ్ణి కాదు. నేను భారతీయుణ్ణి కాదు అంటే నేను చేసేది లేదు కాని, వాడు ఈ రెండూ కాక పోతే మాత్రం వాడు శ్రమలేకుండా నా నవలలు చదివి మనోజ్ఞానమును సంపాదించవచ్చు. నేను వ్రాసిన సుమారు అరువది నవలలలో ఏవిషయాన్ని గూర్చి వ్రాయలేదు? పాశ్చాత్యులయొక్క సైన్సుయొక్క చరిత్రలో విషయాలు

ఉంటవి. వాళ్ళ ఫిలాసఫీ యొక్క విషయాలు ఉండవి. వాళ్ళ సాహిత్యములోని రహస్యాలు ఉంటవి. వాళ్ళ శాస్త్రాలలోని మహావిషయాలన్నీ ఉంటవి. వృక్ష శాస్త్రము, పశుశాస్త్రము, చివరకు 'మనీ' (Money) మారకం—అవసరమయితే ఇది ఉంటుంది అది ఉండదని ఉండదు. ఇటు చూస్తే వేదాలు, ఉపనిషత్తులు, భాష్యాలు, తర్కాలు, వ్యాకరణాలు—అటు చూస్తె పాశ్చాత్య విజ్ఞానములలో నేను నిద్రాహారాలు లేకుండా సంపాదించిన విజ్ఞానమంతా నానవలలలో; నా పుస్తక ములలో ఉంటుంది.

పాశ్చాత్యుల భూగర్భపరిశోధన ఉన్నది. వాళ్ళ డార్విన్ థియరీ ఉన్నది. ఈ డార్విన్ సిద్ధాంతములో అనుస్యూతంగా, తెగిపోకుండా ఉన్న సాక్ష్యం ఒక్కటే. అది గుఱ్ఱం. వాళ్ళ ఇనుపయుగము—రాతి యుగము—అప్పటి నుంచి ఇప్పటివరకూ అనుస్యూతంగా వచ్చేది అశ్వము. ఇక్కడ మనకు అశ్వ మేధయాగ మున్నది. బృహదారణ్యకంలో ఆయాగమును గూర్చి చెప్పెడి ఉపనిషత్పంక్తులకు శంకరాచార్యులవారు వ్రాసిన భాష్యము చదివినచో ఆ అశ్వ మేమియో తెలియును.

వాళ్ళ త్రవ్వకా లున్నవి. వాళ్ళత్రవ్వకాలలో బయటకు తీసినవాటిల్లో మకుటాయమానంగా ఉన్నది ఈజిప్టుయొక్క నాగరకత.

నేను 'ఆరునదు'లన్న నవల వ్రాసి కృష్ణాపత్రికలో ప్రకటించితిని. అందులో నీ పరిశోధన యంతయు వ్రాసితిని. మన పురాణకథలు పుక్కిటి కథలని చెప్పినట్లే పాశ్చాత్యులు, గ్రీకుపురాణాలని కూడా చెప్పారు. కానీ అక్కడ చాలా పరిశోధనలు జరిగినవి. ఫర్గ్యూస్ అన్న గ్రీకు వీరుడు ఎద్దు తలకలిగిన ఒక రాక్షసుని భూగర్భములోనున్న త్రోవలోనుండి పోయి వధించినా డన్న కథ కలదు. అది నిజమని, ఆ భూగర్భములోని వంకర టింకర త్రోవను త్రవ్వి చూపి ఒక అమెరికన్ దేశస్థుడు నిరూపించినాడు. ట్రాయ్ అన్న నగర మున్నదన్న సాక్ష్యములు భూగర్భశాస్త్రవేత్తలు చూపించినారు. ఈమహా విషయమంతయు నేను ఆరునదులలో వ్రాసినాను.

'పునర్జన్మ' యని మరియొక నవల వ్రాసితిని. మాండూక్యోపనిషత్తు లోనుండి తీసి, పునర్జన్మ ఎట్లు సాధ్యమో నిరూపించినాను.

కడచిన నాల్గైదు వందల యేండ్లుగా యూరపుఖండము రాజకీయముగా చిత్ర చిత్రములైన విప్లవములు చేసుకొన్నది. రాజు—ప్రతినిధి రాజ్యము—పరిమిత

సంఖ్యాకుల రాజ్యము-ప్రజారాజ్యము-నియంత-ఎన్ని విధములైన రాజ్యాంగ ములు, విప్లవములు-క్రొత్త రాజ్యాంగములు ! ఈ మహావిషయమును గూర్చి 'సముద్రపు దిబ్బ' యను నవల వ్రాసితిని.

హిందూస్తానీ సంగీతమును గూర్చి, దాని చరిత్రలు, తాన్‌సేన్ నాటి సంగీతము మారి మారి ఖ్యాలులలోనికి దిగినది. ఆ సంగీతము మహారాష్ట్రదేశ ములో కొంత మారినది. ఈ చరిత్రయంతయు 'మ్రోయు తుమ్మెద' యన్న నా నవలలో వ్రాసితిని.

దయ్యములనుగూర్చి 'బాణావతి' యన్న గ్రంథమును వ్రాసితిని. ఈ కథను నేను కల్పింపలేదు. ఒక నా శిష్యుని ఇంటిలో జరిగినకథ. అతనిఅన్న గారు దినచర్యగా వ్రాసుకొన్న విషయము. వాళ్ల కుటుంబము అనుభవించిన విషయము. దయ్యాలు లేవనుట ఎంత తేలిక. దయ్యాలూ లేవు; దేవతలూ లేరు. రేడియోస్టేషన్‌లో పాడుతూ ఉంటే, మనఇంట్లో గ్రహణయంత్రం ఉంటే వినిపిస్తున్నదే. ఇది ఆ యంత్రం కనిపెట్టినవాడి గొప్ప కావచ్చును. గాలిలో ప్రసరించు నినాదతరంగములను ఈయంత్రనిర్మాత సృష్టించినాడా? అక్కడ పాడిన సంగీతము ఇక్కడ వినిపించుచున్నది కదా! సమకాలమునందు వినిపించు చున్నది. అసలు కాలమునందు పూర్వ మెప్పుడో మాటాడినమాటలు ఈనాడు వినిపించకూడదా! తెలిసినదానికి నీవు కర్తవు కాదు. తెలియనిదానికి నీవు కర్తవు.

ఇవి కాక, ఈకాలపు రాజ్యము నడిచేపద్ధతి, నడుపబడేపద్ధతి ధనమూల మిదం జగత్తన్న అర్థమునకు సామ్రాజ్య పట్టాభిషేకము చేయబడిన ఈ నాటి పరిస్థితిలో రాజ్యములో ఊళ్లూ మంత్రులూ ఎట్లున్నారో 'దమయంతీ స్వయంవర' మన్న ఒక నవల వ్రాసితిని

నేను పూర్వాచారపరాయణుడను; ఆధునికుడను కాను; ప్రవాహమున కెదురీదుదును— ఈమాటలు నన్నుగూర్చి అజ్ఞులైనవారు చెప్పుదురు. ఆచెప్పుట ఇందాక చెప్పిన వంచనాశిల్పములోని భాగము. ఆ విద్యలో వారు అందెవేసిన చేతులు. ఈ మాట ఎందుకు వ్రాయుచుంటిననగా నేను ఏది చదివిననూ సర్వం కషముగా దానిలోని లోతులన్నియూ నా మనస్సునకు తృప్తి కలుగునట్లు చదివె దను. ఇట్లే ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము— మూడుభాషలను చదివితిని. అక్షర మెచ్చటనుండి పుట్టుచున్నది? ఎట్లు పుట్టుచున్నది! ఏ భాషయొక్క వర్ణ సమామ్నాయ మెట్లున్నది? దేనిశక్తి యెంత? ఇక్కడినుంచి అక్కడ వాల్మీకి-వ్యాసులు, ఇక్కడ నన్నయ్య- తిక్కనలు, అక్కడ హోమర్- వర్జిల్-షేక్స్

వియర్ల దాకా పరమేశ్వరుడు నా కిచ్చిన శక్తిని బట్టి (అది అల్పమని నే నను కొనుటలేదు) తరచి తరచి చూచితిని. ఇంగ్లీషుభాష మనకు పనికిరాదు. దీనిని 'విష్ణుశర్మ ఇంగ్లీషుచదువు' లో వ్రాసితిని.

ఆంధ్రచరిత్ర త్రవ్వితవ్వి పరమరహస్యములు కొన్ని 'ఆంధ్రప్రశస్తి' లో, కొన్ని నవలలుగా 'స్నేహఫలము' 'చందవోలురాణి' మొదలైన గ్రంథములలో వ్రాసితిని. అందుకనియే నా శరీరములో ఎన్నిజన్మల ఆంధ్రరక్తము ప్రవహించుచున్నదో యని నా ఆంధ్రప్రశస్తిలో వ్రాసితిని. ఇచట కొందరు ఆధునికులకు నత్యంతర మున్నది. సర్వహానవు లొక్కటియే- ఈ భేద ముండరాదని ఒక్కొక్క విషయమునుగూర్చి విచారించినచో కాగితాలు చాలవు.

ఇంక మిగిలినది నా విమర్శనలు. 'ఒకడు నాచనసోమన్న', 'శాకుంతలము యొక్క అభిజ్ఞానత', 'అల్లసానివాని అల్లిక జిగిబిగి'— ఇవి పూర్వము వ్రాసినవి. తత్పూర్వము వ్రాసిన నన్నయకథ చెప్పుటలేదు.

ఒక ఏడాదికింద 'సాహిత్యమీమాంస' యన్న పేరుతో 'కావ్యానందము అన్న విమర్శగ్రంథము వ్రాసితిని. దీని వరుసలో మరి మూడు గ్రంథములు వ్రాయవలయును. ఇట్టి విమర్శగ్రంథములు మరియును గలవు. 'కావ్య పరిమళము' గలదు. 'సాహిత్య సురభి' యనునది గలదు. ఎమెస్కోవారు ప్రచురించు ఆంధ్రప్రబంధముల పీఠికలు కలవు. అవి పది పీఠికలు.

ఇప్పటికే చాలపెద్దవ్యాసమైనది.

కాని ఒక్కటి చెప్పి వదిలిపెట్టెదను. ఒకటి అనగా రెండు. ఈరెంటిలో మొదటి దేమనగా నేనువ్రాసిన పద్యముల సంఖ్య, ప్రకటింపబడినవాటి సంఖ్య, సుమారు ఇరువదివే లుండవచ్చును. నేను చించివేసినవి ఒక ఏబదివే లుండవచ్చును.

లోక మింత మారుతూ ఉంటే వీ డెందుకు మారడు? కొండలు, నదులు మారవు.

కవిత్వము ఛందస్సులోనే వ్రాయవలయును. అట్లు వ్రాయనిచో కవిత్వము కాదు. ఈ ఛందస్సన్న శబ్దము రెండుధాతువులనుండి పుట్టుచున్నది. 'ఛంద్- ఆహ్లాదనే'. రెండవ ధాతువు 'ఛది- ఆచ్ఛాదనే'. ఒకటి ఆహ్లాదనము చేయుచున్నది గనుక; రెండవది కప్పుచున్నది గనుక. అందుకని వేదమునకు ఛందస్సనిపేరు. వేదము పాడబడినది. జీవునియొక్క మాయను కప్పుచున్నది. ఆహ్లాదమును కల్పించుచున్నది. అందులో సంగీత మున్నది. లయ యున్నది. లయయు, సంగీతమును- అనగా రాగచ్ఛాయయును దానియందున్నవి. సామ

వేదమునందే లేదు, ఋగ్వేదమునందు నున్నవి. ఈ రహస్యము తెలిసినత్యాగ రాజుల వారు-

'నాద తను మనిశం శంకరం
నమామి మే శిరసా మనసా!'

అన్నారు. అనగా నాదము శివునియొక్క శరీరము. సంగీతవిద్యలో నున్న రాగములన్నీ శివునిశరీరము. కనుక ఛందస్సు శివుని యొక్క శరీరము. శివుడు లేనిచో దేవుడు లేడుకదా! ఛంద స్సక్కరలేదు.

మరి రెండవ విషయము- కవిత్వము నాల్గువిధములు. ప్రబంధకవిత్వము, ఆశుకవిత్వము, బంధకవిత్వము, చాటు కవిత్వము. చాటుకవిత్వానికి అనాది నుండి మన దేశములో తక్కువ వెల; ప్రబంధకవిత్వానికి ఎక్కువ వెల. ఈ ఇంగ్లీషు చదువులో Minor Poetry వృద్ధి పొందినది. ఖండికలు వచ్చినవి. అవి కవిత్వం కావటం మొదలుపెట్టింది. కావ్యము, శిల్పము, మహాపద్యరచనా శిల్పము, పాత్రపోషణము, అనంతవిజ్ఞానము ఒకజ్ఞానభాండారముగా నగుచున్న మహాకావ్యము, కవియొక్క అనంతశక్తి- మొదలైనవన్నియు ఉప్పునీళ్ల చల్లు కొని పోయినవి.

చాటుకవిత్వమువంటిదానికి ప్రాశస్త్యము వచ్చినది. పూర్వము మన దేశములో నిది వినోదమునకైన కవిత్వము-రససిద్ధికైన కవిత్వము కాదు. ఏవో నాల్గు పద్యములు వాయుట- ఆట్టిపద్యము లోకగ్రంథముగా ప్రకటించుట— వాడు కవి. నిర్దుష్టమైన శబ్దమక్కర లేదందురు. వదలిపెట్టుదము. ఔచిత్య మక్కరలేదా? ఉచితమైన యర్థ మక్కరలేదా?

ఈ రీతిగా మనదేశములో నున్న మహాదివ్యకవితాభావనయే రూపుమాసి పోయినది. ఇపు డాపద్యానికి కూడా ముప్పువచ్చినది.

ఇంకొక్క మాట చెప్పి మానివేసెదను. ప్రపంచకము- సర్వమానవ సౌభ్రాతృత్వము- ఏదోమిల్లి నీకు వచ్చునట! దానిమాట అట్లుంచి, ప్రపంచకమున ఇన్నిదేశము లున్నవి; ఇన్ని భాష లున్నవి. ఇన్నిదేశము లెందుకు? ఇన్ని భాష లెందుకు? ఎక్కడివాడు అక్కడనే చచ్చుచున్నట్లున్నాడే!

నిజానికి శిల్పముకాని, సాహిత్యము కాని, జాతీయమై యుండవలయును. విజాతీయమై యుండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివినవానికి రక్తి, ముక్తి. ఎంత సముద్రముమీద ఎగిరినను, పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము!

# 1947 - 1972

# నేనూ - ఈ పాతికేళ్ల సాహిత్యం

—శ్రీశ్రీ

**1947** ఒక కొండగుర్తు. ఆయేడు మనకి స్వాతంత్ర్యం వచ్చిందంటారు (చరిత్రకారులు). బ్రిటిష్‌వాళ్లు దీన్ని "ప్రదానం" చేశామంటారు. కాంగ్రెస్‌వాళ్లు దీన్ని అహింసతో, సత్యాగ్రహంతో సాధించామంటారు. నేను మాత్రం మన కింకా "స్వ"రాజ్యం రాలేదంటాను.

మనం తెలుగువాళ్ళం. 1947 లో ముక్కోటి ఆంధ్రులం. ఇప్పుడు నాలుగు కోట్లదాకా పెరిగాం. మన ప్రదేశం ఫ్రాన్సుకన్నా పెద్దది. (మన భాషమాత్రం ఫ్రెంచికన్నా గొప్పదికాదు.) ఒకప్పుడు తెలుగుభాష దక్షిణాపథం అంతటికీ రాజభాషగా ఉండేది. ("దేశభాషలందు తెలుగు లెస్స"). మనం కడచిన వెయ్యేళ్ళలో ప్రపంచానికి కనీసం ముగ్గురుమహాకవులను ప్రసాదించాం. (తిక్కన, వేమన, గురజాడ).

ఇప్పుడు మనం 20వ శతాబ్దంలో ఉన్నాం. ఈ శతాబ్దం నాది! (తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు!) నేను 1910లో పుట్టేను (తోకచుక్క లాగ). మూడుమార్లు మృత్యువుతో పోరాడి గెలిచాను. 1918 లో మొదటి గీతం రాశాను (గణయతిప్రాసలంటే ఏమిటో తెలియకుండా!). 1920 లో మొదటి నవల (వీరసింహ విజయసింహులు) రాసిపారేశాను. 1925లో మొదటి నవలిక (పరమాణు రహస్యం) అచ్చయింది. దాని ప్రతులు ఇప్పుడు లేవు. విశాఖపట్టణం హిందూ రీడింగురూము లైబ్రరీలో ఉండేది.

1928 లో మొదటి ఖండకావ్య సంపుటి (ప్రభవ) మా నాన్నగా రిచ్చిన డబ్బుతో రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్‌లో అచ్చువేయించాను. దీని ముద్రణ వ్యవహారమంతా మిత్రుడు పురిపండా చూసుకోవడమేకాక, కృష్ణశాస్త్రి కృష్ణపక్షాన్ని శివశంకరశాస్త్రి లోకానికి పరిచయం చేసినట్లు, నా తొలి కవితను తన ఉపోద్ఘాతంతో లోకంమీదికి వదిలేడు.

1930 లో నేను 68 రోజులు టైఫాయిడ్ జ్వరంతో బాధపడ్డాను. జీవితం మృత్యువుతో ఎలా పోరాడుతుందో స్వయంగా తెలుసుకున్నాను ("ఇక లాభం లే"దని నన్ను మంచంమీదనుంచి కిందకు దింపెయ్యడం నాకు బాగా జ్ఞాపకం). ఇది నా రెండవ మృత్యువు. 1955లో మెంటల్ క్లినిక్‌లో ఉండడం మూడవది. మొదటిసారి నేను పుట్టిన తొలినెలల్లోనే చచ్చిపోవలసింది. మాబంధు వొకాయన చుట్టచురకలతో నాటువైద్యం చేసి నన్ను బతికించాడట. దీనికి గుర్తుగా నా నుదుటిమీదా, మెడ వెనకాతలా, చేతి మణికట్లమీదా మచ్చలున్నాయి.

1930 దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది. ఆ తర్వాతనుంచీ దాన్ని నేను నడిపిస్తున్నాను. అప్పటినుంచీ తెలుగు సాహిత్యం చరిత్ర శ్రీశ్రీ స్వీయచరిత్ర. ఈ శతాబ్దపు తొలిపాదంలో జమీందారీకవిత్వంమీద భావ కవిత్వం తిరుగుబాటు చేసింది. చిన్నప్పటినుంచీ తిరుగుబాటు మనస్తత్వం గల నేను భావకవిత్వాన్ని మనస్ఫూర్తిగా ఆహ్వానించాను. (నాకు బాగా జ్ఞాపకం, ఆ రోజుల్లో మా బంధువొకాయన నా కవితాశక్తిని తెగమెచ్చుకుంటూ, నేనొక సలక్షణమైన మహాప్రబంధం రాస్తే బాగుంటుం దని సిఫార్సు చేశాడు. ఆ సిఫార్సును నేను బుట్టదాఖలా చేశాను).

1925 నుంచి 50 దాకా సాగిన రెండో పాతికేళ్ళలో భావకవిత్వంమీద యువకవుల తిరుగుబాటు సాగింది. ఈ పాతికేళ్ళలోనే రెండో ప్రపంచయుద్ధం ప్రారంభం కావడం, పోవడం. మనకి స్వరాజ్యం రావడం జరిగాయి. స్వరాజ్యం వచ్చిన కొత్త రోజుల్లో-"భావకవిత్వం: ఒక శవపరీక్ష" అనే వ్యాసం రాద్దా మని నేను చాలా ఉబలాటపడ్డాను. వ్యాసం అయితే రాయలేదుకాని భావకవిత్వం మాత్రం సాహిత్యరంగంనుంచి నిష్క్రమించిం దన్న యథార్థాన్ని ఋజువు చెయ్యవలసిన అవసరం లేకపోయింది.

అలా నిష్క్రమించిన భావకవిత్వం స్థానాన్ని అభ్యుదయ కవిత్వం ఆక్రమించింది. ఆక్రమించి ఈకొత్త కవిత్వం ఏమిటి సాధించింది? ఈ ప్రశ్నకి నాకన్నా, నా కవితాసోదరుడు సోమసుందర్ చక్కని, సమగ్రమైన జవాబివ్వ గలడు. నే నిక్కడ చెప్పదలిచింది ఒకేఒక్క విషయం మాత్రం. అభ్యుదయో ద్యమం తెలుగు సాహిత్యంలో గ్రాంథికభాషకు శాశ్వతంగా ఉద్వాసన చెప్పింది. నవలల్లో, నాటకాల్లో, పత్రికాసంపాదకీయాల్లో, రేడియోప్రసం గాల్లో సర్వత్రా వ్యావహారికభాష విజయపతాకం ఎగురవేసింది. కవిత్వంలో

గణబద్ధచ్ఛందస్సుల ప్యూడలిజం నడ్డి విరగ్గొట్టి మాత్రాబద్ధచ్ఛందస్సుల ప్రజాస్వామ్యాన్ని స్థాపించింది.

ఆ రోజుల్లో నేను—

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి..."

అంటూ సింగిల్ పన్నాకవిత్వాలు రాస్తూ ఉంటే అబ్బూరి రామకృష్ణారావుగారు హాస్యాని కొక వచనగీతం ఉదాహరించేవారు.

"కాశీ పే
కేజీ పె
ట్టెలూ అ
మ్మబడును."

ఇదో కర్రల అడితీవద్ద బల్లమీద స్థలం చాలకపోవడంవల్ల నిలువుగా వ్రాసిన ప్రకటన. దీన్ని—

"కాశీ పేకేజీ పెట్టెలు అమ్మబడును" అని చదువుకోవాలి. తెలుగులో వచనగీతానికి ఈవిధంగా హుషారిచ్చినవారు శ్రీ అబ్బూరి రామకృష్ణరావు గారు. (నా కవిత్వాన్ని ఎంత వేళాకోళం చేసేవారో నా కంత ప్రోత్సాహంకూడా ఇచ్చేవారు.) చాలాకాలంకిందట నేను వ్రాసిన "పొలాలనన్నీ హలాల దున్నీ" అనే గేయాన్ని మెచ్చుకుంటూ అభ్యుదయ రచయితల లండన్ మానిఫెస్టో సారాంశం అంతా ఇందులో దించేశావోయ్ అన్నారు. ఇది నా మనస్సులో పదిలంగా దాచుకున్న పొగడ్తలలో ఒకటి."

"ఇంకోటి ఇక్కడే చెప్పాలని వుంది. ఈ సింగిల్ పన్నా గేయాలు రాసే రోజుల్లోనే ఒకసారి అడివి బాపిరాజుగారు భీమవరంలో ఒక కవిసమ్మేళనం ఏర్పాటు చేశారు. అందులో నేను కవితాపఠనం చేస్తూ ఉంటే వెనకనుంచి ఒక పదిపన్నెండేండ్ల కుర్రాడు, "ఓస్, ఇదే కవిత్వం అంటే ఇలాంటిది నేనూ రాసెయ్యగలను" అనడం వినిపించింది. ఆ వయస్సు కుర్రాడిచేత అలా అనిపించగల కవిత్వం వ్రాసినందుకు ఇప్పటికీ నేను గర్విస్తున్నాను.

(పికాసో చిత్రాన్ని చూసిన ఒక అమెరికన్ కోటీశ్వరుడు, "ఓస్; ఇలాంటి చిత్రాన్ని నా పదేళ్ళకొడుకుకూడా గీకెయ్యగలడు" అన్నాడట. పక్కనే ఉన్న ఇంకో కోటీశ్వరుడు-"చిత్రలేఖనం అంటే ఏమిటో తెలిసినవాడు

పికాసో చిత్రాన్ని మాత్రం లక్షల ఖరీదుకి కొంటాడని మరిచిపోకు బ్రదర్" అన్నాడట !

మొన్న ఈమధ్యనే, హైద్రాబాదు వీరశైవ హాస్టల్‌లో విప్లవ రచయితల సంఘం ద్వితీయ వార్షికోత్సవం జరిగినప్పుడు శ్రీ అబ్బూరి రామకృష్ణరావు గారు నాకు మరో యోగ్యతాపత్రం ప్రసాదించారు. "you are waging a heroic battle" అన్నారు. "నువ్వు వీరోచితంగా పోరాడుతున్నావు" అన్నారు. సాహిత్య అకాడమీలో సభ్యత్వంకన్నా మిన్నగా దీన్ని ఎన్ను కుంటాను

అన్నట్టు వి.ర.సం. దాకా ఇంకా రాలేదుకదూ ! అ.ర.సం. తొలిరోజుల్లోనే ఉన్నాంకదూ! ఆ రోజుల్లో— స్వరాజ్యం వచ్చిన కొత్త దినాల్లో నెహ్రూగారి చమ్కీ ఉపన్యాసాల మధ్య భారతదేశంలో సామ్యవాద భానూదయం అయిపోతున్నట్టుగానే అందరమూ భ్రమపడ్డాం. నెహ్రూప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా తెలంగాణా ఉద్యమాన్ని అణగద్రొక్కినా కాంగ్రెస్‌మీదా, గాంధీగారిమీదా ప్రజల్లో ఉన్న భక్తి ఏమాత్రమూ చెక్కుచెదరలేదు. కాంగ్రెస్ ద్వారా సామ్యవాదం సిద్ధిస్తుందని ఇంకా నమ్ముతున్న అమాయకులు ఇప్పటికీ ఉండడమూ, అందులో అభ్యుదయ రచయితలు అగ్రేసరులుగా నిలబడడమూ ఈనాడు చరిత్ర మనమీద ప్లే చేస్తున్న ప్రాక్టికల్ జోక్స్‌లో ముఖ్యమైనది. 25 సంవత్సరాల కాంగ్రెస్ పరిపాలన తర్వాత కూడా సాహిత్యంలో సమ్రాట్టులూ, సార్వభౌములూ, చక్రవర్తులూ ఉట్టికట్టుకుని ఊరేగుతున్నారంటే భూస్వామ్య వ్యవస్థ పునాదులింకా చెక్కుచెదరకుండా నిలిచే ఉన్నాయన్నమాట. ఈ పునాదులను పెల్లగించడంకోసమే వి.ర.సం ఆవిర్భవించింది నిస్సందేహంగా తన చారిత్రకకర్తవ్యం నిర్వహిస్తుంది

75 శాతం నిరక్షరాస్యులమీద 25 శాతం అక్షరాస్యులూ, 90 శాతం దరిద్రులమీద 10 శాతం ధనవంతులూ పరిపాలన సాగిస్తున్న వ్యవస్థ మనది. ఇదే ప్రజాస్వామ్యం అనుకోవడమంత సిగ్గుచేటు ఇంకోటి ఉండదు. ఈ వ్యవస్థను మార్చాలని ఉద్ఘోషించడంకన్నా ఇంకో ఉత్కృష్టధర్మం ఏ సాహిత్యపరుడికైనా ఎలా ఉంటుందో నే నూహించలేను. మరి ఈ వ్యవస్థకి రకరకాలుగా కొమ్ముకాచే రాతగాళ్ళంతా నా దృష్టిలో ప్రజాద్రోహులే.

ఈ వ్యాసంలో ఇకమీద ఏంవ్రాసినా విప్లవ సాహిత్యం మీదనే వ్రాయవలసి ఉంటుంది. వి.ర.సం. గ్రంథాలను నిషేధిస్తూ, వి.ర.సం. రచయితలను

నిర్బంధిస్తూ విప్లవసాహిత్యాన్ని ప్రదర్శించే వీరయ్యలమీద కూడా దాడిచేస్తూ ఈ ప్రభుత్వం ఎలా సామ్యవాదాన్ని స్థాపించగలదో నా కర్థంకాదు. ఒకటి మాత్రం నిశ్చయం. యువతరం బేషరతుగా విప్లవాన్ని ఆహ్వానిస్తోంది. ఆ తరానికి మన పాలకవర్గం దూరమై ఆకాశహర్మ్యాల్లో నివసిస్తోంది. యువ తరం విజృంభించడం, దాని ఫలితంగా పాలకవర్గం పతనం కావడం త్వరలోనే తప్పనిసరి అని చెప్పడానికి ఏ మీనమేషాలను గుణించనక్కరలేదు.

1970 లో నా షష్టిపూర్తి జరిగింది. అప్పుడే తెలుగు సాహిత్యం ఒక పెద్ద మలుపు తీసుకుంది. ఆయేడే విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. దానికి నన్ను అధ్యక్షుడుగా ఎన్నుకున్నవారందరికీ నా ధన్యవాదాలు.

ఇండియాకు రాష్ట్రపతి కావడంకన్నా, వి.ర.సం. అధ్యక్షుణ్ణి కావడమే నాకు మహదానందకరం. తెలుగు కవితారంగంలోనూ, కథానికారంగంలోనూ విప్లవ రచయితలు జేగీయమానంగా ముందుకుపోతున్నారు. ఇతర క్షేత్రాల్లో కూడా ఎన్నిక చెయ్యదగ్గ విజయాలు సాధించడానికి ఎంతోకాలం పట్టదు.



"కదలేది కదలించేదీ,
మారేది మార్పించేదీ,
పాడేది పాడించేదీ,
పెనునిద్దుర వదలించేదీ,
మునుముందుకు సాగించేదీ,
పరిపూర్ణపుబ్రతు కిచ్చేదీ
కావాలోయ్ నవకవనానికి",

*    *    *

"ప్రపంచ మొక పద్మవ్యూహం।
కవిత్వ మొక తీరనిదాహం।"

—శ్రీశ్రీ




మహతి

# ప్రయోగం

## సృజనాత్మక సాహిత్యసమీక్ష

స్వాతంత్ర్యయుగోదయంలో

* కవిత * నవల

* కథానిక * రూపకం

# కవితా సమీక్ష

# స్వాతంత్ర్య యుగోదయంలో తెలుగు కవిత

శ్రీ ఆరుద్ర

మనకు స్వాతంత్ర్యం వచ్చినకొత్తలో నా 'త్వమేవా'హానికి టిప్పణిరాస్తూ శ్రీశ్రీ ఆదిలోనే ఇలా చెప్పాడు:

"జ్ఞాపకం పెట్టుకోవలసిన రెండువిషయాలు:

౧. భారతదేశం అంతట్లోకి రాజకీయంగా ఎక్కువచైతన్యం చూపిస్తున్న ప్రదేశం ఆంధ్రభూమి.

౨. నవ్యకవిత్వానికి ఈనాడు ఇండియా అంతటికి అగ్రస్థానం తెలుగుభాషది.

ఈ రెండు విషయాలకీ సన్నిహితమైన పరస్పరసంబంధం ఉంది".

ఈ హెచ్చరిక రెండుపుష్కరాల కిందటిది. అప్పుడు జ్ఞాపకం పెట్టుకోవలసిన రెండు విషయాలనూ ఇప్పుడు విస్మరించకూడదు. ఇప్పటికీ రాజకీయ చైతన్యంలో, నవ్యకవిత్వంలో ఆంధ్రభూమి ప్రథమశ్రేణిలోనే ఉంది. జాతీయంగానైనా అంతర్జాతీయంగానైనా ఏ ప్రధానరాజకీయసంఘటన జరిగినా దాని ప్రభావం తెలుగుసాహిత్యలోకంలో ప్రస్ఫుటంగా కనబడుతూనే ఉంది. ఆధునికులు గతంలో బతకరనీ, వర్తమానంలో స్పందిస్తూ భవిష్యత్తుకు ఎదురు చూస్తారని ఇది స్పష్టం చేస్తూంది. అంతే కాదు; సాహిత్యం రాజకీయాలకు అతీత మని ప్రగతివాదులు ఎన్నడూ పొరపడరనికూడా హెచ్చరిస్తుంది. సాహిత్యమైనా రాజకీయాలైనా ప్రజలలోంచి వచ్చేవే.

సామాజికప్రయోజనాలకోసం సాహిత్యాన్ని వినియోగించాలన్న సత్యం వీరేశలింగంగారికి తెలుసు. గురజాడ అప్పారావుగారికి తెలుసు. మూఢాచారాల పీడకలలో పలవరిస్తున్న జాతిని వెన్నుతట్టి లేపింది ఒకరు. ఫ్యూడలువ్యవస్థలో జీవిస్తున్నప్పుడే రాజభక్తికన్నా దేశభక్తి దొడ్డదని గుర్తించింది వేరొకరు. తెలుగుసాహిత్యానికి జాతీయదృక్పథాన్ని గురజాడ నేర్పితే, అంతర్జాతీయ తత్త్వాన్ని మప్పింది శ్రీశ్రీ. రాజకీయంగా దేశస్వాతంత్ర్యంకోసం ఉద్యమాలు

సాగుతున్నప్పుడు భాషాస్వాతంత్ర్యంకోసం సాహిత్యరంగంలో సమరాలుచేసిన ఉద్దండుడు గిడుగు రామ్మూర్తిగారు. వీళ్ల విజయాలే మన అభ్యుదయ వారసత్వం.

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినప్పటికి ఆంధ్రదేశంలో అభ్యుదయ రచయితలఉద్యమం ముమ్మరంగా ఉంది. నిజమైనప్రగతివాదులే కాక సాహిత్యమితవాదులు, సనాతనులూ, ఛాందసులూ, కరడుకట్టిన అభివృద్ధి నిరోధకులూ-ఒకరేమిటి అందరూ అభ్యుదయవేదికమీదకు వచ్చారు. ఇంతమందిని ఒక్కతాటిమీదకు తీసుకురావడం ఒకఘనతే కానీ అందుకే అతాడు అతరవాత తెగింది. ఐక్యసంఘటనల్లో అవకాశవాదం ఎప్పుడూ అనర్థమే

స్వాతంత్ర్యావతరణ జరిగినవెనువెంటనే రజాకార్ల విజృంభణా, ప్రజాశక్తులప్రతిఘటనా, పోలీసుచర్యా, తెలంగాణాసాయుధపోరాటం, కమ్యూనిస్టుపార్టీపైనిషేధం, అభ్యుదయరచనలపై ఆంక్షలూ ప్రగతిశక్తులను అభిమానించే ప్రజలపై పోలీసుదురాగతాలూ, మొదలైన సంఘటనలన్నీ తెలుగుసాహిత్యం పైన, ముఖ్యంగా కవిత్వంమీద తమప్రభావాన్ని చూపెట్టాయి. అనిసెట్టి 'అగ్నివీణ'ను శ్రుతిచేయడం, దాశరథి 'రుద్రవీణ'ను మీటుతూ 'అగ్నిధార'లు కురిపించడం, సోమసుందర్ 'వజ్రాయుధా'న్ని ఎత్తడం, రెంటాల 'సంఘర్షణ'ను చిత్రించడం, నేను 'త్వమేవాహమ'ని ప్రజానీకానికి చెప్పడం, గంగినేని 'ఉదయిని'ని సందర్శించడం మొదలైన సాహిత్యసుకృతాలకు ఈ రాజకీయ చైతన్యమే ప్రోద్బలం. తెలంగాణాసాయుధపోరాటం తెలుగుసాహిత్యంలోమాత్రం సత్ఫలితాలనే ఇచ్చింది. ఈఉద్యమంలో ప్రగతిశక్తుల పాత్రనుకూడా ప్రజలు మరిచిపోలేదు. అందుకే వాళ్ళను 1952 లో జరిగిన ఎన్నికలలో ఘనంగా గెలిపించారు ఈగెలుపు ఒక పెద్దమలుపు.

ఆశయసిద్ధికోసం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్నికూడా ఒకఆయుధంగా ప్రగతిశక్తులు స్వీకరించాక, ఉద్యమస్వభావాలు మారకతప్పదు. కొత్త విఘాతాలను ఎదుర్కొనక తప్పదు. ప్రగతిశక్తులు ఎన్నికలరంగంలో ప్రవేశించడమే ప్రజాస్వామ్యానికి అత్యంతప్రమాదమని అభివృద్ధినిరోధకులు ఎలుగెత్తి గోలపెడతారు. అవకాశవాదులు దానికి తోడవుతారు. 1955 లో ఇదే జరిగింది అభివృద్ధినిరోధకులకూటం ప్రజాస్వామ్యరక్షణకోసం ఒకమహాజరును ఎన్నికలముందు సిద్ధం చేశారు. లోగడ అభ్యుదయవేదిక ఎక్కిన మితవాదులు, సనాతనులు, ఛాందసులు-ఒకరేమిటి సామ్యవాదానికి కట్టుబడని రచ

యితలందరూ దానిమీద సంతకాలు పెట్టారు. ప్రజాస్వామ్యాన్ని సంరక్షించ డానికి పూనుకొన్న ఈ పెద్దలంతా కాటూరుయలమర్రులలో ప్రజలకు మానభం గాలు జరిగినప్పుడు నోరుతెరవలేదే మని నార్ల చిరంజీవి వేసినప్రశ్నకు ఒక్కరూ సమాధానం చెప్పలేదు

1955 లో జరిగిన ఈసంఘటన తెలుగుకవిత్వంమీద ఒకపరోక్షప్రభా వాన్ని చూపెట్టింది. అప్పటి యువతరం రాజకీయవైముఖ్యాన్ని అవలంబిం చింది. దీనికి అంతర్జాతీయకారణాలు కూడా లేకపోలేదు. స్టాలిన్ హయాంలో జరిగిన కొన్ని అపకతవకలగురించి కృశ్చేవు చేసిన రహస్యకథనం వెల్లడి కావ దంతో మేధావులలోనూ యువకులలోనూ ఒకరకమైన 'రివిజనిజం' ప్రారంభ మైంది. తిలక్ 'పులి చంపిన లేడినెత్తురు'ను పులుముకోలే నన్నాడు. కుందుర్తి 'ప్రజాస్వామ్యమే నిజమైన నందనం' అన్నాడు. నాకు 'గంటస్తంభం చూపెట్టే కాలం త'ప్పనిపించింది.

తెలుగుకవిత్వంలో ఉద్యమధోరణి తగ్గింది. విశాలాంధ్ర ఏర్పడింది. ప్రగతిశక్తులు పెట్టినపేరు, చేపట్టిన ఉద్యమం కనుక మనసంపూర్ణరాష్ట్రానికి 'విశాలాంధ్ర' అని పిలవకుండా ఆంధ్ర ప్రదేశ్ అన్నారు పాలకులు. ఎట్టకేలకు ఆంధ్రుల కొక నగరం లభించింది. 1939 లోనే పఠాభి ప్రారంభించిన 'నాగ రిక' కవిత్వం తెలుగునాట ప్రవేశించింది. పద్యాలనడుములు విరగదన్నడానికి పఠాభి చేపట్టిన వచనపద్యా లనే దుడ్డుకర్రలు ఇప్పటికి ఆధునికకవులు దిగు మతి చేసుకొన్నారు. వచనకవిత్వం ఉత్తరోత్తరా ఉద్యమరూపం సంతరించు కొంది. వస్తువులో మార్పు వచ్చినప్పుడు ఛందస్సులో మార్పు రాక తప్పదు.

దేశమంటే మనుషు లని అప్పారావుగారు చెప్పారు. ఆమనుష్యులు కష్ట జీవులే అని శ్రీశ్రీ నొక్కిచెప్పాడు. 'శరీరకష్టం స్ఫురింపచేసే కమ్మరికొలిమి కుమ్మరిచక్రం' వగైరాలనే ఉపమానాలుగా స్వీకరించాడు. అయితే 1955 తర్వాత తెలుగుకవిత్వంలో శ్రామికులకన్నా ఎక్కువగా మధ్యతరగతిజనం కనబడ తారు. ఎన్జీవో కావ్యనాయకు డయ్యాడు. 'కోటీశ్వరరావు, వీరేశ్వరరావు, జోగేశ్వరరావు' ఎవరైతేనేం? ఈగుమాస్తాలంతా గొంగళిపురుగులు. (వీళ్ల లోంచి రేపు సీతాకోకచిలకలు వస్తాయి!) ఉద్యోగులే కాదు నిరుద్యోగులుకూడా తెలుగుకవిత్వనాయకు లయ్యారు. నిరుద్యోగి వెంకట్రావు నడుస్తున్నంతమేరా చెట్లుకూలుతున్నదృశ్యాలనే అజంతా చూశాడు.

అజంతా ఒకరకంగా నారాయణబాబులాంటివాడు. తనతరంలోని మిగతా కవులందరూ శ్రీశ్రీలోని చిత్రశబ్దాలకు ఎగబడితే అజంతా ఒక్కడు నారాయణబాబులోని శబ్దచిత్రాలకు వారసత్వాన్ని మౌనంగా ప్రకటించుకొన్నాడు. అజంతా కవిత్వంమీద హైదారాబాదుజీవితప్రభావం ఉన్నట్టే. హైదారాబాదు యువకవులలో అజంతాప్రభావం కొంత లేకపోలేదు. అయితే జీవితంపట్ల వీళ్ళకు ముభావం లేదు. రాజకీయ చైతన్యంకన్నా మానసికసంవేదన ఈ యువకవులరచనలలో కనబడుతుంది. అందుకే కేశవరావు 'ఉదయించని ఉదయాల'ను చూడగలిగాడు. మాదిరాజు రంగారావు 'మేల్కొన్నఆకాశా'న్ని దానిలోని 'కిర్మీరా'లను దర్శించగలిగాడు. గోపాల చక్రవర్తి 'కలంకలలు' కన్నాడు. అవిరాల విశ్వం 'కాలంగీస్తున్న గీతలు'ను స్వీకరిస్తే, వాటిని బాపురెడ్డి 'చైతన్యరేఖలు'గా గుర్తించగలిగాడు. అభ్యుదయరచయితలఉద్యమం నిద్రపోతున్నా ప్రగతి మేల్కొనే ఉంది.

1952 లో ప్రగతిశక్తుల కొక విజయం లభిస్తే 1962 లో పెద్ద షాకు తగిలింది. చైనా మనమీదా దాడిచేయడంతో సామ్యవాద దేశాలకు సైతం అంతర్జాతీయ సౌమనస్యంకన్నా జాతీయ ప్రయోజనాల సంరక్షణే ముఖ్యమన్న సంగతి తేలిపోయింది. భారతదేశంలోని ప్రగతివాదులలో చాలామంది మన జాతీయ ప్రయోజనాలపై దృష్టి మళ్ళించసాగారు. తెలుగుకవిత దేశభక్తిని ఒంటికి పట్టించుకొంది. ప్రగతిశక్తులలో చీలికలు బయలుదేరాయి. సమాజంలో పరాజయం సామ్యవాదానికే పరాజయమన్నట్టు అభివృద్ధి నిరోధకులు భావించసాగారు. జాతీయవాదం పెచ్చుపెరిగి తెలుగు కవితలో మతవాదులూ మితవాదులూ భుజం భుజం కలిపారు. ప్రగతివాదం మీదనే ధ్వజమెత్తారు.

"అభ్యుదయోద్యమానికి మూలభూతమైన తత్త్వం దేశీయమైనది కా"దనీ "దేశాన్ని విడిచి మరోప్రపంచంవైపు పరుగులెత్తే ధోరణి తొలగి స్వదేశీయులు సౌభాగ్యసాధనలో కవి కంఠమెత్తి పలుకడం" జరుగుతూందని 'జనధర్మ' పరాయణులు అపోహపడడం ప్రారంభించారు. శ్రమజీవనంలో దేశీయ విదేశీయం అనే తేడాలు లేవు. ఆ శ్రమను దోచుకొనే వర్గాల స్వభావాలనుబట్టీ ధర్మాలూ, దర్శనాలు, సంస్కృతీ సాహిత్యాలు ఉత్పన్నమవుతాయి. శ్రమజీవుల దర్శనమే మార్క్సిజం. దాని మూలసూత్రాలు ఏ సమాజంలోనైనా విజాతీయాలు కావు. ఈ అవగాహన లేకపోబట్టే "మన సారస్వతాన్ని విమర్శననూ అన్నివిధాలా జాతీయం చేయవలని ఉన్నది. ఈ జాతీయాకరణం

వల్ల సారస్వతంలోని ఎన్నో అనారోగ్య లక్షణాలు వాటంతట అని తొలగిపో గలవు" అని జనధర్మీయులు హెచ్చరించసాగారు.

ఈ జాతీయాకరణంవల్ల నవయువకులు ముదిగొండ లయ్యారు. ప్రగతి ఉద్యమాలు పడుకున్నందుకు సంతసించారు. అయితే ఈ ప్రమాదం త్వరలోనే సర్దుకొంది. ప్రగతిశక్తులు చీలిపోయినా అందులోని ఒక వర్గంలో కవులు రాజేన్న ఉపద్రవాన్ని పసికట్టారు. 'విషాదభావనాన్ని' కళ్ళారా చూశారు. 'అభ్యుదయ కవిత్వం పీడావిరగడైం'దని 'కలలుగన్న పెద్దన్నల కలల్ని కల్లలు జేసేంది'కి మహోద్రేకంతో 'ప్రతిపళక్తుల్ని చెండాడి ప్రగతిని పరిరక్షిం చేందుకోసం ప్రళయరుద్రునిలాంటి నరుడు'తెరిచాడు 'కవిత్వ త్రినేత్రం'. ప్రగతి శక్తులు మళ్ళీ 'కారుచీకట్లలో కాంతికామా'ల్ని చూడగలిగాయి.

సి. విజయలక్ష్మి కవితలో కసి కనిపించినా సంఘంమీద కక్షమాత్రం దానికి కారణంకాదు. సమాజంమీద కక్ష కట్టినవాళ్లు దిగంబరులు. ముఖ్యంగా మధ్యతరగతిమీద వీళ్లు కత్తిదూశారు. ఆ ప్రజలని చూసి "మీ రెప్పుడో చచ్చి రోడ్లపక్కన బురదగుంటల్లో దొర్లుతున్నా'రని ఆరోపిస్తారు. వీళ్లు చేసేది అభ్యుదయరచన కాదు, 'జాగృతికోసం ధ్వంస రచన' చేస్తారు. నేటి వ్యవస్థ వీళ్ళ దృష్టిలో కుష్ఠువ్యవస్థ. ఇందులో చిక్కుకున్న అసహాయులమీద జాలి కన్నా కోపమే దిగంబరులలో కనబడుతుంది. అందుకే వీళ్ళలో ఉన్న మంచి కవిత్వాన్ని ఆవేశాలూ, అశ్లీలాలూ కప్పేశాయి. 'శోకమే శ్లోక మైనట్టు బాధే కవిత్వానికి పర్యాయపదం' అన్న సత్యం సి. విజయలక్ష్మికి తెలుసు. ఆ కోవ లోని యువకవులందరికీ తెలుసు.

బాధ గుండెల్లోనుంచి వస్తే వేదన మెదడులో పెరుగుతుంది. యువ కవిత్వానికి గుండెలూ మెదడూ కూడా ఉన్నాయి. కొత్త సంకేతాలు, కొత్త సంగీతాలు, కొత్త ప్రతీకలు కొత్త సంవిధానాలు, వేయిపువ్వులు విచ్చుకున్నట్టు వచనపద్యం ఉద్యమంలాగ విప్పారించి, సామాజిక చైతన్యంతోపాటు మళ్ళా రాజకీయ చైతన్యం కవిత్వంలో ప్రవేశించింది.

ప్రగతిశక్తుల చీలికల్లో అతివాములూ మితవాములూ మాత్రమేకాదు ఉగ్ర వాదులుకూడా ఉన్నారు. వీళ్ళ విధానాలూ నినాదాలూ యువకవులను ఆకర్షిం చాయి, అందుకే వరవరరావులాగ ఆదిలో 'విశ్వాంతరాళంలో ఏ గోళంలోనూ విధ్వంసంకాదు విక్రాంతి కోరుకున్న' కవులందరూ చివరకు 'ఆదర్శం ఆమో

దించిన హింస' వద్దకు పయనించారు. కవులను వెన్నుతోపాటు గన్ను పట్టు కొనమన్నారు.

శ్రీశ్రీ షష్టిపూర్తి సంవత్సరంలో రెండు దశాబ్దాల సాహిత్య ప్రగతిని సమీక్షించుకొనడానికి ఒక అభ్యుదయ సాహిత్య సదస్సు ఏర్పాటయింది. దీనిని సాహిత్య ఉగ్రవాదులు బాయ్‌కాట్ చేశారు. అభ్యుదయ రచయితల సంఘంనుంచి విడిపోయి విప్లవ రచయితల సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఉద్రేకవంతులకు నూతనోత్సాహం వచ్చింది.

ఝుంఝు వీచింది. విప్లవ కవులు 'లే' లెమ్మన్నారు. 'రా'రమ్మన్నారు. 'తిరగబడు' మన్నారు. అభ్యుదయ కవులను ఆనాడు తెలంగాణా సాయుధ పోరాటం ఉత్తేజితుల్ని చేస్తే విప్లవకవులను ఈనాడు శ్రీకాకుళం గెరిల్లా సమరాలు ఉత్సాహ వంతుల్ని చేస్తున్నాయి. ఆనాడు అభ్యుదయ రచనలను నిషేధించినట్టే ఈనాడు విప్లవకవితాసంకలనాలను ప్రభుత్వం నిషేధించింది. కవులను ఖైదు చేసిన అపఖ్యాతి నేడు ఆంధ్రప్రభుత్వానికే దక్కింది. కవిత్వంమీద తీర్పు విమర్శకులు కాక హైకోర్టు న్యాయమూర్తులు ఇవ్వడంకూడా ఇక్కడే జరిగింది.

'విప్లవ కవిత్వం ఎంతమాత్రం అపాయకరం కాదు. ఇది ప్రజలకు బోధ పడదు' అన్న తీర్పు యువకవుల కళ్ళు తెరిపించింది. ప్రజలకు దగ్గరగా వెళ్ళి వాళ్ళ భాషలో వాళ్ళ అవగాహనకు వీలైన రచనలు చేయాలన్న దీక్ష కొందరిలోనైనా కనబడుతుంది. కట్టుబాటు కార్యాచరణకు కీలకం.

వి.ర.నం. నినాదాలలో 'కమిట్‌మెంట్' ప్రముఖమైనది. రచయితలకు కట్టుబాటు ఉండాలా? అభ్యుదయ రచయితలందరూ మార్క్సిస్టులై తీరాలా? మొదలైన విషయాలపై వివిధదృక్పథాలు గలవాళ్ళు చాలామంది చర్చలు చేశారు. 'కట్టుపడ్డ మనిషి రచయిత కాలేడు' అని కాళోజీ అంటున్నాడు. 'అభ్యుదయకవి మార్క్సిస్టు అయి ఉండాలి అని నిర్వచించడంలో చాలా చిక్కులున్నాయి' అని మోటూరి హనుమంతరావుగా రంటున్నారు. సాహిత్య రంగంలో ఒక ఐక్యసంఘటన రూపొందాలనీ అందరూ కలసి రావాలంటే "అంతిమ ఆశయాన్నే గీటురాయిగానూ పరీక్షగానూ అభ్యుదయకవులకూ విప్లవకవులకూ పెట్టవద్ద'ని మోటూరి వారే చెప్తున్నారు. ఐక్యసంఘటన వాంఛనీయమేగానీ ఆశయాలలో ఏకీభావం లేని వాళ్ళందర్నీ కలుసుకొంటే 1947లో చేసిన తప్పే మళ్ళీ చేయడమవుతుంది. అందుకే శాస్త్రీయ సామ్యవాద దృక్పథంతో సామ్యసంఘ స్థాపనకు దోహదకారులైన రచనలు చేసే సాహితీ

పరుడే అభ్యుదయ రచయిత అని నిర్వచనంచేస్తూ దేశం నాలుగు చెరగుల నుండీ ఆంధ్ర అభ్యుదయ రచయితలు మళ్ళీ సంఘటిత మవుతున్నారు. మళ్ళా ప్రగతి శక్తులు విజృంభించాలి.

మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన తరవాత ఈ పాతికేళ్ళలోనూ నవ కవిత ఏ విధంగా పరిణామం చెందినదీ విహంగవీక్షణంలాగ చూసే ప్రయత్నమే ఈ వ్యాసంలో చేశాను. నవీనులు ఈ విధంగా సాగుతూ ఉంటే సనాతనులూ, సంప్రదాయానికి విధేయులూ, వాళ్ళ పాత ధోరణిలో పాతవిలువలతో, పాతవృత్తాలలో పాత ఇతివృత్తాలను అల్లుకుంటున్నారనీ, వాటిని పరస్పరం వాళ్ళలోవాళ్ళు మెచ్చుకొంటూ అదే కవిత్వమని చెప్పుకొంటున్నారని మనం గమనిస్తేచాలు! సనాతనులను తృప్తిపరచడానికీ వాళ్ళ మెప్పును పొందడానికీ నవీనులు ఆశతో తంటాలు పడ్డారు. 'పాత ఛందో నియమాలు మేమూ పాటించగలం. వృత్తాలు మీ అంత చక్కగా సమాసభూయిష్ఠంగా మేము వ్రాయగలం" అని కుందుర్తిలాంటివాళ్ళు వృత్తరచన చేస్తూ వచనకవితా ఉద్యమాన్ని ఒకప్పుడు నడిపినా ఇప్పటి యువకవులు మాత్రాఛందస్సులను సైతం స్మరించడంలేదు. నేటి నవకవులు నారాయణ బాబును మళ్ళా డిస్కవర్ చేస్తున్నారు. సాహిత్య ఉగ్రవాదులు సత్యాలను తెలుసుకుంటున్నారు. నిమగ్నత నుండి నిబద్ధతదాకా వచ్చారు. "మన కళాకారులూ, రచయితలూ వాళ్ళవాళ్ళ రంగాల్లోనే పనిచేయాలి; అవి కళాసాహిత్యాలే" అన్న మావో ఉపదేశం ఇప్పటికి అనుభవంలోనికి వచ్చినట్టుంది. అనుభవాన్ని మించిన అధ్యాపకుడు ఉండడు. ఈ పాతికేళ్ళ తెలుగు కవిత్వ పరిణామాన్ని రింగుసైడ్ సీటులో కూర్చొని వీక్షించగలగడం గొప్ప అనుభవం.

*

**''ఎప్పటికయినా మానవ పథికుడు చేరుకునే**
**గొప్ప విశ్రాంతి మందిరం కవిత''**

—ఆరుద్ర.

# సంప్రదాయకవిత: కల్పవృక్షము

డా. కేతవరపు రామకోటి శాస్త్రి

ఈ ఇరవయ్యోశతాబ్దంలో ప్రపంచదేశాల నన్నింటినీ కలగలుపుచూ వ్యాపించిన ఒకానొకనూత్నచైతన్యశక్తి సోషలిజము. రాజకీయఆర్థిక సామాజిక వ్యవస్థలలో ప్రత్యక్షముగాగానీ, పరోక్షముగాగానీ దాని ప్రభావమునకు లోనుగాని దేశ మిప్పటిప్రపంచంలో లేదు.

మనం స్వతంత్రులమైన తరువాత మనప్రజాస్వామ్యవ్యవస్థ సోషలిస్టు భావవిప్లవమును లక్ష్యముగా చేసికొని ప్రవర్తించునది యైనది. రాజకీయమైన ఈసామ్యవాదప్రభావం మనజీవితంమీద మిక్కిలిగా పడ్డది. ఈదశలో మన సాహిత్యం రెండుపాయలుగా ప్రవహించటం స్పష్టంగా కనిపించసాగింది. ఒకటి దేశీయమైన ప్రాచీనసంస్కృతిసంప్రదాయాలమీది అభిమానం నుండి పుట్టి బయలుదేరింది. రెండోది సోషలిస్టువిప్లవోద్యమాల తాత్పర్యశక్తినుండి పుట్టి బయలుదేరింది. ఇక్కడ గమనించవలసిన ఒకముఖ్యవిషయం ఏమిటీ అంటే మొదటిపాయమీద రెండోపాయప్రభావం ఉన్నంతగా రెండోదానిమీద మొదటిదానిప్రభావం కానరాదు. మొదటిది సంప్రదాయమార్గం. రెండోది అభ్యుదయమార్గం. కావ్యభాషలో ప్రసిద్ధమైన ఛందోమార్గాన పురాణేతిహాసాలనుండి, చరిత్రనుండి వస్తువును గ్రహించి పరంపరగా వస్తున్న రచనావిధానాన్ని అవలంబించి చేసే రచనలన్నీ సంప్రదాయమార్గంలోవి. దీనికి అభ్యుదయకవిత్వానికీ నడుమగా వచ్చిన భావకవిత్వం స్వాతంత్ర్యానంతరం బాగా వెనుకబడిపోయింది. అందువల్ల సంప్రదాయమార్గమూ, అభ్యుదయమార్గమూ రెండే ప్రక్కప్రక్కగా సాగుతున్నాయి. ఒకదానికి విశ్వనాథ సత్యనారాయణ, మరొకదానికి శ్రీరంగం శ్రీనివాసరావు నాయకులు. ఈఇద్దరూ ఒకజాతీయసంప్రదాయంలోనుండి వచ్చినవాళ్ళే. విశ్వనాథ అవిచ్ఛిన్నసంప్రదాయార్థి. శ్రీ శ్రీ. జగదభ్యుదయాభిలాషి. సంప్రదాయము అభ్యుదయము పరస్పరం విరుద్ధలక్షణలక్షితాలు కావు. అవునన్న ప్రచారంమాత్రం గట్టిగా జరిగింది. ఇబ్బంది అంతా అక్కడినుండే వచ్చింది. అభ్యుదయానికి బలం సంప్రదాయం సంప్ర

దాయానికి గతి అభ్యుదయం. అభ్యుదయానికి గతి విప్లవం. అది సాయుధ విప్లవమే కానక్కరలేదు.

## 2

అవిచ్ఛిన్నంగా వస్తూవున్న ఈమనసంప్రదాయం ఏమి ప్రబోధంచేస్తూ వున్నది ? 'దైవీ స్వస్తిరస్తునః— స్వస్తి ర్మానుషేభ్యః—' ఈదేవతలు, ఈమనుష్యులూ భిన్నజాతులవారు కారు. వీరే కాదు రాక్షసు లున్నారుకదా. వారూ కారు. ఎవ రీరాక్షసులు ? మానవాభ్యుదయమార్గములకు ముళ్లకంపలు కొట్టేవాళ్లు. వాళ్లు భూమికి భారం. 'విఘ్నకర్తార స్తే నశ్యంతు శివాజ్ఞయా'. వాళ్ళను నశింపు చేయక తప్పదు. శివాజ్ఞ అట్లున్నది. అలా నశింపు చేసే శక్తి కల మానవులకు దేవత లనిపేరు. మనిషి తనలోని దైవీశక్తి చేత తనలోనిరాక్షసత్వమును నశింపు చేసికోనే ప్రయత్నానికే జీవితపోరాటం అని పేరు. రాక్షసత్వంమీద మానవుడు సాధించిన తొలివిజయాన్ని కీర్తించినగ్రథం రామాయణం. ఆ విజయం వల్లనే ఆమానవుడు దేవుడైనాడు. అనగా వానిలో దైవీప్రకృతి వెలికి వచ్చినదని యర్థము. మనిషి మంచికి పోతే దేవుడు. చెడుకు పోతే రాక్షసుడు. మంచి ఎవరికి ? చెడు ఎవరికి ? మానవమనుగడకు. అనగా సమాజమునకు. అది సరే గాని— ఈరాక్షసత్వమునకు నశింపు నిజముగా లేదా ? లేదు. దైవము విజృంభించినపుడు ఆధాటికి అణగిపోవుటయే గాని నశించిపోవుట లేదు. ఉన్నచో రాక్షసశక్తిబారినుండి మానవులను రక్షించుట కిన్నిసార్లేల దైవ మవతరించవలెను ? దైవ మనగా భావనిష్ఠుడు. రాక్షసు డనగా దేహనిష్ఠుడు. దేహనిష్ఠ క్రూరతను పెంచును. భావనిష్ఠ బుద్ధివైభవమును పెంచును. క్రూరత ప్రవృత్తి లక్షణము. బుద్ధి నియతిలక్షణము. రాక్షసులంతా దైవముచేతులోనే పోవుటకిదియే హేతువు. ఈదైవరాక్షసభావములసంఘర్షణానికి రంగభూమి మానవుడు. రాక్షసభావలక్షణముమీద దైవభావలక్షణముతో ఎదురుతిరిగి మానవుడు విజయాన్ని పొంది మానవధర్మాన్ని నెలకొల్పి సమాజాన్ని నడిపించటానికి ప్రేరణ యిచ్చేటట్లుగా కవులు కావ్యాలు వ్రాయాలి. ఈపరమతాత్పర్యంవిషయంలో విశ్వనాథ శ్రీశ్రీ లది ఆంతర్యం ఒకటే. భేదం ఎక్కడున్నదంటే— ఈనాడు మనకు కావలసింది ఏనాడో చెప్పబడ్డది. దాన్ని మనం ఈనాడు మనకు కావలసినట్లుగా వ్యాఖ్యానం చేసుకుందాం. భాష్యాలు వ్రాసుకుందాం. భాసకాళిదాసభవభూతులు, దిఙ్నాగుడు, మురారిభట్టు వీళ్లంతా ఆయాకాలాల్లో

రామకథాభాష్యకారులు. వాళ్లలాగే మనం- అని విశ్వనాథ అంటే శ్రీ శ్రీ అంటాడుగదా ఆప్రాచీనకథను స్వీకరించి దానిఅంతర్యాన్ని మన ఇప్పటి అవసరానికి అనుకూలంగా భాష్యం రచించి భారంచేయటంకంటె ఇప్పటి అవసరాలకు అనుగుణంగా ఆ నాలుగుముక్కలూ సూటిగా మనం చెప్పలేమా ఏమిటి! ఈలా చెబిడే ప్రజలభాషలో చెప్పవచ్చు. భాష్యాలకు ప్రౌఢభాష కావాలి. ప్రజాస్వామ్యంలో ప్రజాభాషల కున్నగిరాకీ ప్రౌఢభాషల కుండదు. మీ రిక్కడ ఉండండి. మీభాష్యార్థాలను ఏలాగో ఒకలాగు ప్రజ లందుకొనే టట్లు మాకృషి మేం చేస్తాం. మనసంప్రదాయం ఇల్లా అవిచ్ఛిన్నంగా కొనసాగడం మాకూ ఇష్టమే- కానీ మీమాటలు వేరు. మామాటలు వేరు. అందువల్ల మీరు వేరు. మేము వేరు- అని. అయితే కావచ్చు.

## 3

స్వాతంత్ర్యోత్తరకాలాన వచ్చిన సంప్రదాయకావ్యం శ్రీమద్రామాణకల్ప వృక్షం ! అంటే ఇదొక్కటే అని అర్థంకాదు. దీన్ని చెప్పినచో దాదాపు సంప్రదాయకావ్యాల నన్నింటినీ చెప్పినట్లే అవుతుంది. ఇంకా చెప్పవలసివస్తే విశ్వనాథవారిదే మరొకకావ్యం శ్రీ కుమారాభ్యుదయాన్ని గురించి చెప్పాలి. స్వల్పమైన పౌరాణికగాథను ఆధారంగా తీసుకొని సమసామాజికదృక్పథాన దాన్ని తీర్చి దిద్దడం జరిగింది. ఆధునికచైతన్యాన్ని పుక్కిలించిన సంప్రదాయ కావ్యమార్గాన వెలసినకృతి అది. అందలి ఆరుకననాలకు విశ్వనాథ పెట్టిన పేర్లు చూచి ఆలోచిస్తే దానిమహనీయత గోచరిస్తుంది. సేనానమీకరణము, సేనాగ్రహణము, శత్రుపరాజయము, శత్రుసంపద్గ్రహణము, నిరంతరాభ్యుదయము, ఐహికాముష్మికసంపాదనము- ఇవి ఆరుపేర్లు. విశ్వశ్రేయస్సు నభిలషించినకవి వ్రాసినది శ్రీకుమారాభ్యుదయము. మనపురాణకథలను నూత్నసందేశములకూ, ప్రబోధములకూ వాహకాలుగా చేసి దేశకాలాలను గుర్తించి రచించటమే రచించటం. స్వాతంత్ర్యమునందిచ్చ, జాతీయతాభావము, దేశభక్తి, వీరయువతీజన కీర్తనమునందు తాత్పర్యము, ఈమొదలైన సల్లక్షణాలతో ప్రజాస్వామ్యదేశాల్లో కవిత రావలసిఉన్నది. తెలుగుభాషాకవిత్వం అలాగే వచ్చింది. సంప్రదాయబలం ఉంటేగాని అభ్యుదయసౌధం లేవదు. పూర్వ మెప్పుడో శ్రీ శ్రీ అన్నారు- "వెనుకటిగ్రంథాలను చదవని వాడెవ్వడూ ఈ నాడు సరసమైన సాహిత్య రచన చెయ్యలేడు. గతచరిత్రను ప్రస్తుతప్రయోజనం కోసమూ, భావిఅభివృద్ధి

నిమిత్తమూ ఏవిధంగా పఠించకతప్పదో అదేవిధంగా పూర్వసాహిత్యాన్ని సవిమర్శంగా సాకల్యంగా చదవకపోతే సారస్వతసృష్టికి అవకాశమే ఉండదు. ఇదివరకు వెయ్యబడిన గట్టిపునాదులమీనే ఈనాటిసాహిత్యసౌధం నిర్మించబడుతున్నది. సారస్వతపరిణామాన్ని శ్రద్ధగా గమనిస్తున్నవా రెవ్వరూ దీనిని కాదనలేరు." (తెలుగుతల్లి. మార్చి 1946. పుట. 14) ఆధునికఅభ్యుదయాంధ్ర సాహిత్యానికి వెన్నుబలంగా సంప్రదాయసాహిత్యం కొనసాగివస్తూనే ఉన్నది మనసంప్రదాయంలోని కావ్యవైచిత్రిని మనకళ్లముందు తెచ్చి ప్రదర్శించింది కల్పవృక్షము.

కవిత్వం సంప్రదాయకవిత్వంగా వ్రాసేవాళ్లసంఖ్య అసంఖ్యాకంగానే వుంది. కాని వాళ్లఅందరికృతుల్లో ప్రస్తుతసామాజికావసరాలకు అనువైనసందేశాలు అంతగా కానరావటంలేదు. నూత్నచైతన్యమును అవి వెలువరించటంలేదు అందువల్ల సాహిత్యప్రయోజనాలన్నీ- ప్రజలను విజ్ఞానఘనులుగా చేయటం, సమాజముయొక్కనడకను గురించి ఆలోచించేటట్లు చేయటం, మనిషికి మనిషి సంపూర్ణంగా అవగతం అయ్యేటట్లు చేయటం ఈ మొదలైన చాకచక్యలక్షణాలు సంపూర్ణంగా కలిగి జాతీయతాముద్ర అడుగడుగునా కనిపించే కమనీయకృతి- కల్పవృక్షం. విశ్వనాథశారదఅంతా ఇల్లాగానే ఉంటుంది. "ఒకజాతిజాతీయతకు దానిసంప్రదాయము పునాది"- ఈ వివేకముతోనే విశ్వనాథశారద విశ్వరూపమును ప్రదర్శించింది. ఇంతే కాదు- "కవిప్రతిభలోన నుండును కావ్యగతశతాంశములయందు తొంబదియైనపాళ్లు." అంతటిసంప్రదాయమును ఇంతటి ప్రతిభ లోగొని కల్పవృక్షమును తయారు చేసింది.

మనకు స్వాతంత్ర్యము వచ్చిన తదారభ్యా ఇంతవరకూ అగ్రగామినడక నడుస్తూనే వస్తున్న సంప్రదాయకవితలో ప్రథమంగా పేర్కొనదగింది రామాయణకల్పవృక్షమే. దివ్యాదివ్యభావసంఘర్షణమె యిందు చిత్రింపబడింది. విశ్వశ్రేయోదాయకమైన దివ్యభావదీప్తిని దర్శనీయముగా చేయుటయే ఇదిచేసినపని. వెనుకటితరాలు ముందుతరాలవాళ్లకు తమతమ జవసత్వాలను పనికివచ్చేట్లు ఎలా అందిస్తవో ఒకచోట చూడాలంటే కల్పవృక్షాన్నే చూడాలి. సంప్రదాయకవితలో ఇది ప్రభువు. ప్రభువును చెప్పినచో ప్రజలను చెప్పినట్లే!

# సంప్రదాయ కవిత్వము

**ఆచార్య డా. దివాకర్ల వేంకటావధాని**

ఆంధ్రవాఙ్మయము తొలుత ననువాదములతో నారంభించినది. మొదట సంస్కృతమునందలి పురాణేతిహాసములును తరువాత నందలి కొన్ని కావ్యములును తెలుగున కనువదింపబడినవి. రాయలయుగమున ప్రఖ్యాతవృత్తములు, ధీరోదాత్తనాయకములు, శృంగారరసప్రధానములు, అలంకారికరచనాప్రచురములునైన ప్రబంధము లని పిలువబడు స్వతంత్రకావ్యములు రచింపబడినవి. కొంచెమించుమించుగాపందొమ్మిదవశతాబ్దియారంభమువఱకును ప్రబంధరచన సాగుచునే వచ్చినది. కాని క్రమముగా పలువురుకవులయం దనుకరణబాహుళ్యమును, శబ్దాలంకారప్రీతియు పెచ్చుపెరిగినది. వారు కావ్యాత్మ యని చెప్పదగిన రసమునకుగాని ధ్వనికిగాని ప్రాధాన్య మొసంగక శబ్దాలంకారమయమైన చిత్రకవిత్వమునెడ మొగ్గుచూపదొడంగిరి. కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారి సరస్వతీనారదసంవాద మను ఖండకావ్యమును పరికించిననప్పటి యాంధ్రకవిత్వము స్వరూపము తేటతెల్లమగును.

దేశమున నాంగ్లప్రభుత్వము స్థిరపడినప్పటినుండియు క్రమముగా నాంగ్లభాషాభ్యాసము పెంపొందుటయు, భారతీయ యువకులు కళాశాలలలో నాంగ్లమహాకవులరచనలను జదువుటయు సంభవించెను. వారు టెన్నిసన్, షెల్లీ, కీట్సు, వర్డ్సువర్తు మున్నగు నాంగ్లకవులకవిత్వము పఠించి అట్టికవిత్వము భారతీయభాషలలోఁగూడ వ్రాయుటకు మొదలుపెట్టిరి. ఆంధ్రదేశమున నాయుత్సాహము భావకవితోద్యమమునకు దారితీసెను. తరువాత నభ్యుదయకవిత్వము భావకవిత్వముస్థానము నాక్రమించెను. ఇటీవల యువకవులలో వచనకవితాప్రీతి హెచ్చుగా కానవచ్చుచున్నది. ఈవిధముగా నిరువదవశతాబ్దియారంభమునుండియు ఆంధ్రకవితారచనావిధానమున కొన్నిమార్పులు గోచరించుచున్నను ప్రాచీనకవితాభిమానము కలవారు అమార్గమును విడువక అందు రచనలు సాగించుచునేయున్నారు. పురాణేతిహాసముల ఆంధ్రీకరణము, ప్రబంధరచన, ప్రఖ్యాతేతివృత్తములను, చారిత్రకసాంఘికాంశములను గ్రహించి సలక్షణమైనభాషలో స్వతంత్రములైన లఘుకావ్యములను వెలయించుట యిప్పుడు

కూడ గోచరించుచునేయున్నది. ఇట్టి రచనలసముదాయమునే సంప్రదాయ సాహిత్య మని పేర్కొనుచున్నారు. ప్రఖ్యాతవస్తువు, గ్రాంథికభాష, జాత్యుప జాతివృత్తములతో గూడినఛందస్సు— ఈ సంప్రదాయసాహిత్యముయొక్క ప్రధానలక్షణములు.

చిన్నయసూరిబాలవ్యాకరణము రచించినప్పటినుండియు నది పాఠశాలా కళాశాలలలోనే కాకుండ పండితలోకమునకూడ విశేషప్రచారము గాంచినది. దాని నాదర్శముగా గ్రహించి ప్రాచీనకవుల మార్గమును విడువక గడచిన తరమున నుత్తమగ్రంథముల రచించినవారిలో కీ.శే. వావిలకొలను సుబ్బారావు, కందుకూరి వీరేశలింగం, జనమంచి శేషాద్రిశర్మ, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చివుకుల అప్పయ్యశాస్త్రి, తిరుపతి వేంకటకవులు, కొక్కొండ వేంకట రత్నం పంతులు, వడ్డాది సుబ్బారాయుడు, దాసు శ్రీరామకవి, ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి, పిసుపాటి చిదంబరశాస్త్రి, వేంకటరామకృష్ణకవులు, మేడేపల్లి వేంకటరమణాచార్యులు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి మున్నగువారు ముఖ్యులు. వస్తురచనావిధానములందు కొంత వైలక్షణ్య మున్నను రాణా ప్రతాపసింహచరిత్ర, శివభారతము, సౌందరనందము, ఆంధ్రప్రశస్తి, శశి దూతము మున్నగుకావ్యములుకూడ సంప్రదాయసాహితీమార్గమునకు చెందినవే. స్వాతంత్ర్యలాభమున కించుకపూర్వ మీమార్గము ననుసరించి కావ్యరచన కావించినవారిలో దువ్వూరి రామిరెడ్డి, జాషువా, కరుణశ్రీ మున్నగువారు పేర్కొన దగినవారు.

స్వాతంత్ర్యలాభానంతర మాంధ్రమున సంప్రదాయకవితామార్గము ననుసరించి రచనలు సాగించినవారిలో ముఖ్యులనుగూర్చి యీవ్యాసమున నించుక ప్రస్తావించెదను. ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవులును, శతాధికగ్రంథకర్తలునైన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు భారతరామాయణభాగవతములనే కాక 1961 వ సంవత్సరమున తాము కీర్తిశేషులగువఱకు గ్రంథరచన కావించుచునేయుండిరి. భారతదేశమునందలి ప్రముఖవ్యక్తులనుగూర్చియు నుద్యమములనుగూర్చియు పద్యాత్మకముగా రచించిన గ్రంథము వారి తుదిరచన. వారిశిష్యులును, ప్రథమాంధ్రప్రదేశాస్థానకవులును, తిరుపతివేంకటకవులలో నొకరైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారుకూడ రోగగ్రస్తులై యుండియు 1950 వఱకు రచనలు కావించుచు "కవనార్థం బుదయించితిన్" అను ప్రతినను సార్థకము చేసియుండిరి. ఓంనమశ్శివాయస్తోత్రము, శివస్తవము, శివభక్తి, సుశీల అనునవి

వీరి చివరిరచనలు. ఈగ్రంథము లంత్యదశలో వారిహృదయమున నెలకొన్న పారమార్థికచింతాప్రవణతకు నిదర్శనములు. కీ.శే. విశుపాటి చిదంబరశాస్త్రి గారు రచించిన పద్మపురాణము వారి మరణానంతరము వారిసోదరులచే ప్రచురింపబడినది. వారిశైలి నిర్దుష్టము, ప్రౌఢమునై సర్వవిధముల పూర్వకవుల రచనలతో పోటీ చేయుచుండును.

స్వాతంత్ర్యలాభానంతరం వెలసిన సంప్రదాయసాహితికి మకుటాయమాన మని చెప్పదగినది కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణకల్పవృక్షము. జ్ఞానపీఠము వారి లక్షరూప్యములబహూకృతి గత సంవత్సరము లభించుటయే దానిప్రశస్తిని చెప్పకచెప్పుచున్నది. దానినిగూర్చి యీసంపుటమున ప్రత్యేకవ్యాసము ప్రచురింపబడినది. శ్రీ సత్యనారాయణ గారి "విశ్వనాథమధ్యాక్కర"లను మధ్యాక్కరావృత్తములో రచింపబడిన పదిశతకములసంపుటమునకు కేంద్రసాహిత్యఅకాడమివారి యైదువేల రూప్యముల జాతీయబహుమానము లభించినది. ఈశతకములలో శ్రీ సత్యనారాయణ గారి తాత్త్వికభావములు వ్యక్తీకరింపబడినవి. ప్రద్యుమ్నచరిత్ర మనునది వారిటీవలనే ప్రచురించిన ప్రబంధము. ఇది యాధునిక ప్రబంధముల కొజ్జబంతి యని చెప్పదగినది.

సంప్రదాయసాహితి కలంకారమని చెప్పదగిన మఱొక రసవత్కావ్యము శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రపురాణము. ఇందుదయపర్వము మొదలు నాయకరాజపర్వమువఱకును గల తొమ్మిదిపర్వములలో నాంధ్రచరిత్ర వర్ణింపబడినది. శుష్కమైనచరిత్రకూడ శ్రీ శాస్త్రిగారి రచనామహిమచేతను ప్రతిభాప్రకాశముచేతను రసవన్మనోహరమైన మహాకావ్యముగా పరిణమించినది. వారిటీవల తామప్పుడప్పుడు రచించిన ఖండకావ్యములను శ్రీఖండ మనుపేర నొకసంపుటముగా ప్రచురించియుండిరి.

ఇటీవల సంప్రదాయమార్గము ననుసరించి బహుగ్రంథములు రచించిన వారిలో శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగా రగ్రగణ్యులు. వా రరుంధతీశిక్షము, అష్టావక్రసంహిత మున్నగు చిన్నకావ్యములనే కాక మహాభారతము, భాగవతము, అధ్యాత్మరామాయణము అనుగ్రంథములను నిర్వచనముగను సంక్షేపరూపముగను అనువదించి ప్రచురించియుండిరి. వారిశైలి సరళము, సరసము, సర్వసుబోధమునై యలరారుచుండును. శ్రీవాజపేయయాజుల రామసుబ్బారా

యుఁడుగారు రచించిన ప్రసన్నభారతమును కూడా నీసందర్భమున పేర్కొనవలయను.

శ్రీ మొలుగు చంద్రమౌళిశాస్త్రిగారు లింగపురాణాద్యనేక గ్రంథములను రచించి సరసకవి సార్థకబిరుదము సంపాదించియుండిరి, వారిజీవలనే పూర్వోత్తరభాగములతోడను మొత్తము పంద్రెండాశ్వాసములతోడను గూడిన ఆంధ్ర కూర్మమహాపురాణమును ప్రచురించియుండిరి. వీరిరచన సరసమధురమై, యథామూలమై, హృద్యముగా నుండును. కీ. శే. అనుముల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రచించిన భార్గవరామచరిత్ర మను చంపూకావ్యము 1955 వ సంవత్సరమున ప్రచురింపబడినది. ఇందు పదాశ్వాసము లున్నవి. వారద్వైత రసానుభూతిని గలిగింపుమని వేడుచు నీయుద్గ్రంథమును హరిహరబ్రహ్మమున కంకితము కావించిరి. నిరుపమైనశైలియందును పాండితీమండితమైన ప్రౌఢియందును ఈగ్రంథము సర్వవిధముల ప్రాచీనాంధ్రకవులగ్రంథములతో సరి తూగుచున్నది. శుక్లపక్ష, భువనవిజయాదిగ్రంథకర్తలైన శ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారుకూడ భార్గవరామాయణ మనుపేర పరశురామునిచరిత్రము నవతారాభ్యుదయసుచర్యసయాత్రాయాగాశ్రమకాండములను నాలుకాండములుగా రచించియుండిరి

అభినవతిక్కన బిరుదాంచితులును తెలుగులెంక యని పేరువడసినవారు నగు శ్రీతుమ్మల సీతారామమూర్తిచౌదరిగా రాధునిక కవిపుంగవులలో నతి ప్రఖ్యాతి గాంచినవారు. వారి రాష్ట్రగానము, పరిగెపంట, శబల మున్నగుచిన్న కావ్యములే కాక మహాత్మునిస్వీయచరిత్రకు పద్యరూపాంధ్రీకరణము కూడ సర్వాంధ్రజనపరిచితమైనది. వారిజీవలనే మహాత్ముని యుత్తరజీవితమునుగూడ రచించి ప్రచురించియుండిరి. దానికి కేంద్రసాహిత్యఅకాడమివారు బహుమానము నొసంగియుండిరి. ఈసందర్భమున శ్రీప్రతివాది భయంకర వేదాంతచార్యులుగారు రచించిన ఆచార్య జగదీశచంద్రబోసుజీవితచరిత్రముకూడ పేర్కొనఁదగినది. శాస్త్రజ్ఞునిజీవితచరిత్రము నింతసరసమనోహరముగా రచించినవా రన్యులు లేరు.

సంప్రదాయకవితామార్గమున కృతహస్తులైన తెలంగాణమునందలి కవి వంతసులలో శ్రీమాన్ వానమామలై వరదాచార్యులుగారు ముఖ్యులు. వారి పోతనచరిత్రకావ్య మత్యంతరసవంతమై పలువురుపండితప్రకాండుల ప్రశంసల నందు కొన్నది. గుంటూరునివాసులు, కవిరాజులు, వైద్యశేఖరులునైన శ్రీదివి

నరసింహాచార్యులవారు శ్రీకృష్ణాతిమానుషతత్త్వ మను కృష్ణమహాత్మ్యప్రేరక మైన గ్రంథమును ప్రౌఢసుందరముగా రచించియుండిరి.

ఇటీవల ప్రచురింపఁబడిన తాత్త్వికములైన యుద్గ్రంథములలో శ్రీమద్దూరి సాంబయ్యగా రనువదించిన ఆంధ్రయోగవాసిష్ఠమును ముందు పేర్కొనవలయును. తత్త్వప్రధానమైన గ్రంథమునుగూడ రసవంతముగా తీర్చిదిద్దుటలో శ్రీసాంబయ్య గారు ప్రదర్శించినకౌశలము ప్రశంసింపదగియున్నది. ఈసందర్భమున శ్రీద్వి వేది సత్యనారాయణసూరిగారు రచించిన ఆత్మీయమును, శ్రీమతి బుర్రా కమలా దేవిగారు మందాక్రాంతవృత్తములలో రచించిన ఆదిఆంధ్రవాఙ్మయ చరిత్రాత్మక మైన పద్యగ్రథమును బేర్కొనవలసియున్నది. శ్రీమతి కమలాదేవిగారు ఛందో హంసి అనుపేర నొకఛందశ్శాస్త్రగ్రంథమునుగూడ రచించియున్నారు.

సుప్రసిద్ధ దేశభక్తులు రాజకీయవేత్తలునైన శ్రీ ఆత్మకూరి గోవిందా చార్యులుగారు గోవిందరామాయణ మనుపేర రామాయణమునంతను రచించిరి. వీ రుత్తరరామాయణమును స్వాతంత్ర్యలాభమునకు పూర్వమే ప్రచురించి యుండిరి. ఈ రామాయణము వాల్మీకిరామాయణమున కనువాదముకాదు. సంస్కృతమునందలి పెక్కు రామాయణములను బఠించి వా రందలి నూతనాం శముల నెన్నిటినో యిందు చొప్పించి యుండిరి. కవిగారికి సహజమైన భక్తి యీ రామాయణమున ననేక సన్నివేశములందు గోచరించుచుండును. సుప్ర సిద్ధులైన వేంకట పార్వతీశ్వర కవులు రచించిన రామాయణ మింకను ముద్రి తము కాలేదు. కీ.శే. తిరుపతి వేంకటేశ్వర కవుల శిష్యులైన శ్రీ తంగిరాల జగన్నాథ శాస్త్రిగారు జగన్నాథ రామాయణ మనుపేర నొక రామాయణమును బ్రచురించిరి. శ్రీ సోమంచి వాసుదేవరావుగారు సుందరకాండమును నిర్వచన సుందరకాండ మనుపేర హృద్యముగా ననువదించియుండిరి. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రచించిన సుందరకాండ మింకను ముద్రితము కాలేదు. కవి హంస బిరుదాంకితులైన శ్రీ వేదుల వేంకటశాస్త్రిగా రద్భుత రామాయణము నాంధ్రీకరించియుండిరి. కళాపూర్ణోదయమునందలి నారదగానమాత్సర్యవృత్తాం తమునకు మూల మనందగిన యుదంత మిందు గోచరించుచున్నది.

ఇటీవల నొకరు శ్రీకృష్ణదేవరాయల చరిత్రమును శ్రీకృష్ణ భారత మను పేర విపులముగా రచించియుండిరి. శ్రీ పోతరాజు పురుషోత్తమరావుగారలు రచించిన పురుషోత్తమ చరిత్రమును, విద్వాన్ టీర్నిడి ప్రసన్నగారు రచించిన పృథ్వీభాగవతమును శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆంధ్ర సామ్రాజ్యము

ను ఇటీవల ప్రచురింపబడినచరిత్రాత్మక కావ్యములలో ముఖ్యములైనవి. పృథ్వీ భాగవతము సంయుక్తా పృథ్వీరాజుల వివాహమును వర్ణించు ప్రబంధము కీ.శే. జాషువాగారు రచించిన క్రీస్తుచరిత్రముకూడ సంప్రదాయ సాహితికి సంబంధించినదే. శ్రీ కల్లూరు వేంకటనారాయణరావుగారి అశోకసమ్రాట్ విద్యారణ్య చరిత్రలు చరిత్రాత్మకములయ్యును మిక్కిలి సవంతములైన సద్గ్రంథములు.

ఆధునిక కాలమునందలి విద్వత్కవిశేఖరులలో శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు ముఖ్యులు. వారు శంకరాచార్య చరిత్రము, మునిత్రయ చరిత్రము అను గ్రంథములను ప్రౌఢసుందరమైన శైలిలో రచించిరి. నీలకంఠ దీక్షితుని నీలకంఠవిజయచంపువును శ్రీరూపావతారం నారాయణశర్మ గారును, శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రిగారును వేరువేరుగా అనువదించియుండిరి. గంగాదేవి రచించిన మధురావిజయ కావ్యమును శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారు రసభరితముగా ననువదించియుండిరి. శ్రీ ముదివర్తి కొండమాచార్యులుగారు బుద్ధచరిత్రనేకాక నారాయణమ్మ యను సతీసహగమన గాథను జాతీయప్రబంధముగా సంతరించిరి. ఇటీవలనే ధర్మవరనివాసులైన శ్రీ గుంటి సుబ్రహ్మణ్య శర్మగారు బుద్ధచరిత్రను మహాప్రబంధముగా రచించిరి.

సంప్రదాయ మార్గము ననుసరించి మహాగ్రంథములు రచించినవా రాధునిక యుగమున నింకను పలువు రున్నారు. నా యెరుకకు నచ్చిన ముఖ్యులను మాత్రమే నే నిచ్చట పేర్కొనియుంటిని. సంప్రదాయమార్గము నవలంబించి ప్రశస్తమైన లఘుకావ్యములను రచించినవారు శతాధికులుగా నున్నారు. వారిలో శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లు(కాళిందీ పరిణయము), శ్రీ నోరి నరసింహశాస్త్రి (శ్రీ దేవీ భాగవత భాగము), జ్ఞానానందకవి, కరుణశ్రీ, అష్టావధాని వెలిది సత్యనారాయణమూర్తి (విశ్వనాథనాయకుడు, తిక్కన), శ్రీ వేముగంటి నరసింహాచార్యులు (తిక్కన), ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, (దక్షారామము) శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, విశ్వనాథ నరసింహం (హరివంశము), డా. కే వి.ఆర్. నరసింహం (సుజాత), వఝ్ఝల వేంకటేశ్వరులు, కాళిదాసు, అందే వెంకటరాజము, ఏతద్వ్యాసకర్త (మధువనము, త్రింశతి), శ్రీ బాడాల రామకవి మున్నగువారు ప్రముఖులు. దీనినిబట్టి సంప్రదాయ కవితావాహిని పూర్తిగా నింకిపో లేదనియు కృశించియు నది నిర్మలముగా ప్రసరించుచున్న దనియు గ్రహింప వచ్చును.

సంప్రదాయకవిత్వమునుగూర్చి చెప్పునప్పు డవధానములనుగూర్చి కూడ నించుక తడవుట అనుచితము కాదు. అవధాన మొక సారస్వతవినోదము. ఈవిద్య ఆంధ్రదేశమున వర్ధిల్లినట్లు మఱెచ్చటను పెంపొందియుండలేదు. ఆధునికయుగమున శ్రీమాన్ మాడభూషి వెంకటాచార్యులవారును, శ్రీతిరుపతి వేంకటేశ్వరకవులును దీనిని పునరుజ్జీవింపజేసియుండిరి. శ్రీతిరుపతి వేంకటేశ్వరకవులు ఆంధ్రదేశమునందలి పలుప్రదేశములందును, రాజాస్థానములందును అష్టశతావధానము లాచరించి బహుళములైన సత్కారములను పొందిరి. శ్రీపోకూరికాశీపతిగారును, శ్రీపతి త్ర్యంబకరావుగారును అనేకములైన అష్టశతావధానములను విజయవంతముగా నిర్వర్తించి కీర్తిగడించిరి. తిరుపతి వేంకటేశ్వరకవులశిష్యులలో అగ్రగణ్యులైన వేలూరి శివరామశాస్త్రిగా రవధాన విద్యలో నారితేరియుండిరి. హైదరాబాదునివాసులైన శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు శతావధానమునేకాక సహస్రావధానమును, పంచసహస్రావధానమును గూడ చేయగలసమర్థులు. మహాకవులైన శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి గారి కవధానిపంచానన యనుసార్థకమైన బిరుదమున్నది. ఇటీవల శతావధానము లరుదైనను అష్టావధానములు విరివిరిగా సాగుచున్నవి[1]. శ్రీ సి. వి. సుబ్బన్న, శ్రీ డా. ప్రసాదరాయ కులపతి, శ్రీ కుక్కుటేశ్వరరావు. శ్రీ బాలబ్రహ్మచారి, శ్రీ భూతపురి బాలసుబ్రహ్మణ్యశర్మ శ్రీ అవధానం చంద్రశేఖరశర్మ, శ్రీ నారపరెడ్డి, శ్రీ కోట వీరాంజనేయశర్మ, మున్నగువా రష్టావధానములను తఱుచుగా నిర్వహించుచు సహృదయుల నలరించుచున్నారు. ప్రతిభ, పాండిత్యము, ధారణాశక్తి, సమయస్ఫూర్తి, కవితాకౌశలము మున్నగు గుణవిశేషముల సూచించు అవధానవిద్య నాంధ్రులును ఆంధ్రప్రభుత్వమును దోహద మొసంగి పెంపొందింపవలసిన ఆవశ్యక యెంతైననున్నది.



1, ఆచార్యవర్యులు, వాఙ్మయదివాకరులు, వాగ్మిశేఖరులునైన డా. దివాకర్ల వేంకటావధానిగారు ఇటీవల అష్టావధానములు పెక్కుచేసి తమ పేరును సార్థక మొనరించు కొనుటయే కాక, పండిత ప్రశంసల నందుకొనిరి. (సంపాదకవర్గం)

# గేయకవితాప్రస్థానం

శ్రీ మిరియాల రామకృష్ణ

ఈ 20 వ శతాబ్దిలో గేయకవితాప్రస్థానానికి ప్రవర్తకుడు గురజాడ అప్పారావు. వస్తువు, భాష, ఛందస్సు—ఈ మూడు కవిత్వాంగాల్లోనూ ఆయన దేశిపద్ధతు లవలంబించిన గేయకవి. భావకవుల్లో కొందరు ఛందస్సులో మాత్రమే దేశికవులు; కొందరు వస్తుచ్ఛందస్సుల్లోనే దేశినంప్రదాయాభ్యాగులు; కొందరు మాత్రమే పూర్తిగా గురజాడ అడుగుజాడల్లో నడిచినవారు. అలాంటివారిలో కవికొండల వేంకటరావు, నండూరి వేంకటసుబ్బారావు, బసవరాజు వేంకట అప్పారావు ప్రభృతులు గణనీయులు. వీరి తరవాత గేయకవితాప్రస్థానంలో కొత్తి మల్పులు చూపి విద్యుద్దీపాలు వేయించిన వాడు శ్రీశ్రీ.

వస్తుపరంగా గేయకవితాప్రస్థానంలో మూడు ముఖ్యదశ లున్నాయి. 1910-32 సంవత్సరాల మధ్యకాలంలో గేయం భావకవుల ఆత్మపరమైన స్వప్నాలకు, జాతీయమైన ఆదర్శాలకు రేఖాచిత్రాలు గీసింది. 1933-49 ల మధ్య అభ్యుదయకవుల సమాజపరమైన వేదనలకు, రోదనలకు బొమ్మలు చిత్రించింది. 1950-72 ల మధ్య నానారసభావశబలితాలైన వర్ణచిత్రాలను సృష్టించింది. ఈ 62 ఏళ్ళలోనూ గేయంలో గ్రాంథిక వ్యావహారిక భాషలు పరాచికా లాడుకున్నాయి. స్పర్థను పెంచుకున్నాయి. మొత్తంమీద వ్యావహారిక భాష గేయకవితాశశిమండలంలో తన జెండా ఎగరవేసుకున్నది.

తెలుగుగేయంయొక్క లక్షణాలు మన ప్రాచీనలాక్షణికులు చెప్పిన రగడల్లో కనిపిస్తాయి. రగడలు మాత్రాగణప్రధానాలే అయినా ప్రాచీన లాక్షణికులు మాత్రాపంమితిని కూడా అక్షరగణాల ద్వారనే నిర్దేశించారు. దానితో రగడ రచన కూడా వృత్తరచనవలె జటిలమే అయిపోయింది. యతి ప్రాసాది అక్షరనియమాలు, అనుప్రాసనియమము, పాదనియమము గేయాలకు (రగడలకు) కూడా తప్పనిసరి అన్నారు. అలాగే కాబోలు నని ప్రాచీన కవులు వీటి నన్నింటినీ పాటిస్తూ పద్యకవిత్వంలో మధ్యే మధ్యే మాత్రమే పదకవిత్వం చేరుస్తూ వచ్చారు. ఒక్క ద్విపదకవిత్వం మాత్రం పద్యకవిత్వానికి జతగా గాక, స్వతంత్రంగా వర్ధిల్లింది. కేవలం రగడల్లోనే కావ్యమంతా రచించిన ప్రాచీన

కవులు కనిపించరు. ఉన్నారూ అంటే వారి పేర్లు తెలియవు. వారంతా జానపద కవులు. వారి కీలాక్షణికుల కఠోరనియమాలతో నిమిత్తం లేదు.

ఈ వివేకం గల మొదటి తెలుగు కవే గురజాడ అప్పారావుగారు. ఆయనది ప్రజల ఉద్యమం. దేశిసాహితీరీతు లాయన ఉద్యమానికి బలమైన చేతులు. అందువల్ల ఆయన మాత్రాచ్ఛందస్సముద్రం మధించి రగడల చెంకు గడలను విరిచి 'ముత్యాల సర'మనే గేయ నవనీతాన్ని నవానీతం చేయగలిగారు. వస్తు-భాషా-చ్ఛందస్సులు మూడింటా- సామాజికవస్తువును, వ్యావహారిక భాషలో గేయరూపంలో సృష్టించి-కొత్తపోకడ పోయారు.

అందుకే అన్నాను, గేయకవితాప్రస్థానానికి ప్రవర్తకుడు గురజాడ అప్పారావు అని !

'ముత్యాలసరం పూర్వమే ఉంది ! వసుచరిత్రలో లేదా ? యక్షగానంలో లేదా' అనేవా రున్నారు. అప్పారావు గారు చేసిం దేమిటి ? ఆద్యంతప్రాస, యతినియమాల నుంచి గేయాన్ని కాపాడారు ; గ్రాంథిక వ్యాకరణ శృంఖలల నుంచి గేయాన్ని విడిపించారు ; ముత్యాలసరమనే నామకారణం చేశారు; ముందు తరాలవారందరి కళ్లను తన వెనక రప్పించుకున్నారు.

ఇలాంటి గేయాన్ని భావకవుల్లో కొందరు తిరిగి శృంఖలాంకితం చేయగా విడిపించినవారు అభ్యుదయ కవులు. ముత్యాలసరంలోంచి ముప్ఫయి రకాల గేయాలను బయటికి లాగిన ఐంద్రజాలికులు అభ్యుదయ కవులు ! మిశ్రగతి (ముత్యాలసరం)తోపాటు మరిన్నిగతులలో గేయ పల్యంకికను మోసినవారు ఆధునిక కవులు.

ఇంతకూ, ప్రాచీన లాక్షణికులు చెప్పిన గేయాల (రగడల) లక్షణా లేమిటి ?

| గేయం పేరు | పాదానికి | పాదసంఖ్య | గతి |
|---|---|---|---|
| హయప్రచార రగడ | 3 × 4 మాత్రలు | 4 | త్ర్యస్ర |
| తురగవల్గన | 3 × 8 మాత్రలు | 4 | ,, |
| విజయమంగళ | 3 × 16 మాత్రలు | 4 | ,, |
| ద్విరద గతి | 5 × 4 మాత్రలు | 6 | ఖండ |
| జయభద్ర | 5 × 8 మాత్రలు | 6 | ,, |

| గేయం పేరు | పాదానికి | పాదసంఖ్య | గతి |
|---|---|---|---|
| మధురగతి | 4 × 4 మాత్రలు | 4 | చతురస్ర |
| హంసగతి | 4 × 8 మాత్రలు | 4 | ,, |
| వృషభగమన | 3 + 4 (భగణం) × 4 | 4 | మిశ్ర |
| హరిణగతి | 3 + 4(నల,భ,స,గగ) × 4 | 4 | ,, |
| | (అనంతుని ఛందం చూడండి) | | |

గురజాడ అప్పారావుగారు హరిణగతిరగడనే సంస్కరించారను కుంటాము. ఆయన యతిప్రాసల నిర్బంధాన్ని తిరస్కరించి వాటిని వైకల్పికం చేసుకున్నారు. నాలగు పాదాలుగానే గాక ఎక్కువ పాదాలుగా కూడా వ్రాశారు. చివరిపాదాన్ని లేదా ఏ పాదాన్ని అయినా గానానురూపంగా ఇష్టమైన చోటికి కత్తిరించారు. ఈ సంస్కరణ తాలూకు జీవనాడిని గ్రహించిన వారంతా ముత్యాలసరంనుంచి మూడుపువ్వులూ ఆరుకాయలూ బయటికి లాగారు. ఇది ఆదర్శంగా తక్కిన గతుల గేయాలలో కూడా విపుల సంస్కరణలూ విశిష్ట పరిష్కరణలూ చేసి, ఆధునికులు అతి చాతుర్యంతో ప్రయోగించారు. ఇదంతా ప్రయోజనదృష్టితో జరిగిన సంస్కరణమే.

గేయకవితాప్రస్థానానికి శ్రీశ్రీ ఇచ్చిన కొత్త వెలుగుల్లో పేర్కొనదగినది చతురస్రగతి గేయం. తెలుగు మాటల్లో, వాక్యాల్లో గూఢంగా చతురస్రగతి అమరి ఉంటుంది. 'కవితా ఓ కవితా' అనే శీర్షికతో వ్రాసిన గేయం చతురస్ర గతిలోదే। ఇది అతి సహజంగా ఉంటుంది కనకనే 'వచన గేయం' అనడం. అయితే చతురస్రగతి గేయాలకు గతివైవిధ్యంతోపాటు గతివైచిత్రి కూడా కావాలంటే ఈ గణాలమీద కొసరు మాత్రలు ఒకటి రెండు మూడు వేస్తూ పోవడమో లేక లోపింపజేయడమో చేస్తే సరిపోతుంది. వృత్తాల్లో వలెనే గేయాల్లో కూడా పాదనియమాన్నిబట్టి సమగేయాలు, విషమగేయాలు, ఉండ టానికి ఆస్కార మున్నదని ఈ 62 ఏళ్ళ ప్రయోగాలు రుజువు చేశాయి.

ప్రకృత వ్యాసంలో 1947- 72 ల మధ్య మన గేయకవితాప్రస్థానాన్ని ఒకమారు వస్తుశిల్పాలదృష్ట్యా సింహావలోకించడం మనధ్యేయం।

స్వాతంత్ర్యయుగోదయంనాటికి శ్రీశ్రీ అనుయాయులైన ఒకకొత్తతరం వారు సామ్యవాదప్రియంభావుకులై సమకాలీన సమాజాన్ని కదిలించే వస్తువును

తదనుగుణమైన రూప-శిల్పాలతో వర్ణించి అప్పుడప్పుడే రంగమెక్కుతున్నారు. ఈ తరానికి చెందిన పదిపదిహేనుమంది కవుల్లో చాలామంది గేయాన్ని తమ కవితారూపంగా స్వీకరించినవారే; పద్యాన్ని పూర్తిగా కాకపోయినా తమవస్తువు కది సరిపోసిదని కొంతవరకు విడిచిపెట్టినవారు; వచనగేయ మింకా పూర్తిగా రూపొందని రోజులవి: 1948 నుంచి 1965 వరకూ గేయం అగ్రాసనాధిపత్యమే వహించి, ఆ తరవాత వచనగేయాని కాస్థానాన్ని ఇచ్చి, తాత్కాలికంగా విశ్రాంతి తీసుకున్నట్లు కనిపిస్తూ సంగీతప్రధానాలైన సినిమా, రేడియోలలో అగ్రస్థానం వహిస్తున్నది. అయితే భావప్రధానమయిన కవితారంగంలో గేయంయొక్క వెలుగు అప్పుడే అస్తమితమవుతున్నదనడానికి వీలులేదు. ఫ్యాషన్‌లు మారడం వంటిదే ఇదీని; 1965 తరవాత కూడా వచనగేయంతో సమాంతరంగా రాశిలోనూ గుణంలోనూ పెరుగుతూనే ఉన్నదనడానికి చాలినన్ని ఉదాహరణలు లభిస్తున్నాయి. 1948- 72 ల మధ్య వచ్చిన గేయకవిత్వాన్ని పరిశీలిస్తే తేలే విషయాల్లో ప్రధానమైనది- గేయాన్ని సమస్త కవితాప్రక్రియలకూ వినియోగించడం. కథాప్రబంధం, ఖండకావ్యం, ముక్తకం, శతకం, నాటిక వంటివన్నీ గేయరూపంలో వచ్చాయి. అంతేగాక అబాలగోపాలానికి గేయసాహిత్యం రకరకాల పురులు విప్పుకుని సద్యఃపరనిర్వృత్తిని కలిగిస్తున్నది.

## 2

సంఘసంస్కరణ ప్రయాణపతాకలైన కథలను వాస్తవికతా రుచిరంగా గేయాలలో రచించడం గురజాడతోనే మొదలయింది. శ్రీశ్రీ బాటసారి, భిక్షు వర్షీయసి కథలను గేయరూపంలో రచించి ఈ ప్రక్రియను పునరుద్ధరించారు.

1956 లో 'కవిత' అనేపేర వెలువడిన నారపరెడ్డి కావ్యాలలో ఇట్లాంటి కథలు రెండున్నాయి. మొదటిది 'కథ గాదిది వధ'. ఇది ఆ కథాశీర్షిక. సమాజాన్ని దోచుకునే వడ్డీవ్యాపారుల బారినిపడి అష్టకష్టా లనుభవించిన శ్రామికుని మృతిని ఈ గేయం కరుణ రసోల్బణంగా వర్ణించింది. రెండోకథ పేరు 'రజని'. మతం మానవత్వాన్ని ఎలా ధ్వంసంచేస్తుందో నిరూపించిన కథ యిది. వస్తు నిర్వహణలో నిస్తులశిల్పం నివ్వటిల్లింది. ముత్యాలసరంలో ముద్దుగుల్కింది.

విఖ్యాతకవి విద్వాన్ విశ్వంగారు రచించిన పెన్నేటిపాట (1956) పద్యంతోపాటు గేయాన్నికూడా ఆదరిస్తూ కొత్తపాతల మేలికలయికను సాధించింది. రాయలసీమ గ్రామీకజన జీవితాన్ని రంగన్న గంగమ్మల పాత్రలలో రంగరించి

ప్రదర్శించారు కవి. మధ్యే మధ్యే చేర్చిన గేయాలు కవి ఆవేశానికి కొలబద్దలు. వారి విరతుల విరువుల్లో అనుప్రాసల మలుపుల్లో గేయం ఒక ఒయారాన్ని ఒలక పోసింది. వెన్నెటిపాట 5 సర్గల రసవత్కావ్యం.

ఇటీవల వానమామలై వరదాచార్యులు గారు వెలువరించిన విప్రలబ్ధ (1970) కావ్యంకూడా సాంఘికేతివృత్తంతో సమీచీనమైనదే। స్వతంత్రభారత దేశంలో ఉపాదేయమవుతున్న మతాంతరవివాహం కథాసూత్రంగా తీసుకోవడం ఇందులోని ప్రత్యేకత. ఒక మహమ్మదీయయువతికీ రైతుయువకునికీ జరిగిన ప్రణయపరిణయాలూ, సరసదాంపత్యమూ, సమాజంలో వా రెదుర్కొన్న సమస్యలూ, నేటినవల, కథానికల్లోవలె మల్చుకుని గేయాలలో రచించారు. అయితే కథలోని కొన్ని ఘట్టాలను, సన్నివేశాలను మాత్రమే ఖండకావ్యాలుగా రచించి, వీటిద్వారా కథాసమాహారాన్ని సంధానించడం వరదాచార్యకృత నూత్నశిల్పము. ఇలాంటివి 52 ఖండికలున్నాయి ఈ కావ్యంలో. వివిధ మాత్రాచ్ఛందస్సులలో వ్యావహారిక భాషలో జానపదీయమైన వస్తువుతో తదనురూపమైన భావనతో వెల్లివిరిసిన సంపూర్ణదేశికావ్య మిది. పల్లెటూరి వాతావరణాన్నీ కర్షకజీవనప్రపంచాన్నీ కవి స్వతంత్రప్రతిభతో చిత్రించారు. 'విప్రలబ్ధా' నామకరణంలో చాతురీప్రదర్శనం చేశారు. సాంఘికప్రయోజనాన్నే గాక జాతీయప్రయోజనాన్ని కవి భావించారు.

1969 లో ఆంధ్రదేశంలో ప్రళయాయితంగా వచ్చిన 'తుఫాను' నాగభైరవకోటేశ్వరరావుగారిచేత ఒక 'కన్నీటిగాథ' (1969) ను పాడించింది. తుఫానుబాధలకు గురిఅయిన ఒక కుటుంబవృత్తాంతాన్ని గేయంగా కవి పాడారు. వాస్తవికతకు అద్దంపట్టే వర్ణనలు చేశారు. అంతేగాక ప్రకృతి పీడితులపట్ల ఔదార్యమనే మిషతో స్వార్థపరులు చేస్తున్న దగాకోరుతనాన్ని అధిక్షేపించారు. అందువల్ల ఇది సాంఘికకావ్యమే అవుతున్నది. వివిధ గేయగతుల్లో కరుణ బీభత్సవర్ణనలతో సాగిన 4 ప్రకరణాల కావ్యం కన్నీటిగాథ.

## 3

చారిత్రకేతివృత్తం గల గేయకావ్యాలు లేని లోటుకూడా ఈ యుగంలోనే తీరింది. ఈ లోపాన్ని తీర్చడానికుద్యమించిన ప్రతిభాశాలి సి. నారాయణరెడ్డి గారు. ఈయన రచించిన మూడు చారిత్రకకావ్యాలు ఆంధ్రులచరిత్రలోని వివిధ యుగాలకు చెందిన రసవత్కథలను లోబరుచుకున్నాయి.

మొదటిది 'నాగార్జునసాగరం' (1955). ఇది బౌద్ధయుగ వాతావరణానికి నిలువుటద్దం. నారాయణరెడ్డిగారి ప్రతిభలో ఒక అంశమైన 'కాల్పనికత' ఈ కావ్యంలో శిల్పాలను చెక్కింది. ఆయన రససిద్ధి కిది ఉదాహరణప్రాయమైన తొలి కృతి. మహాకవుల శిల్పవిశేషాలను తన లేఖినికి మషీరసాలుగా చేసుకునేమౌలిక ప్రజ్ఞ ఈయనదని ఆనాడే రుజువైంది. వర్ణనలను కథాగతిలో ఒక కళాంశంగా చేసే మనీష. నాటకీయశిల్పాన్ని, శ్రవ్యకావ్యంలో పొదిగించగల ధిషణ నాగార్జునసాగరంలో కోరకదశలో ఉన్నాయి. తరవాతి రెండింటిలోనూ ఈ ప్రజ్ఞావిశేషాలు పూరా విప్పారాయి. 'నాగార్జునసాగరం' పంచతరంగాలుగా విభక్తం. గేయంలో ఖండగతి పాలెక్కువ. పాదనియమంలో స్వేచ్ఛను పాదుకొల్పారు. రక్తివిరక్తులకు సంఘర్షణ కథాసూత్రం.

రెండవది కర్పూరవసంతరాయలు. కవికి లలితకళమీద ఉన్న అపార ప్రేమకు ప్రసవాలుగా ఒక్కొక్కప్పుడు అతని కృతులు వెలువడుతాయి. నారాయణరెడ్డిగారి నాగార్జునసాగరంలో శిల్పచిత్రకళలు, 'కర్పూరవసంతరాయలు' లో నృత్యగానకళలు అంతర్వాహినులుగా ప్రవహించాయి. 'కర్పూరవసంతరాయలు'లో లకుమాకుమారగిరుల ప్రణయేతివృత్తం ఎంత రసనిర్భరంగా వర్ణిస్తాడో లకుమాత్యాగశీలాన్ని అంత విన్నాణంగా నిరూపిస్తారు కవి. పాత్రశీలాలకు ఇలాంటి ఔచిత్యాన్ని సిద్ధింపజేయటం అందరికీ చేతగానిది. చారిత్రకగేయకావ్యాలలో శాశ్వతంగా ఉన్నతస్థానమే అలంకరించగల శిల్పం గల కావ్య మిది. ప్రాబంధికోత్తమశిల్పం వెన్నెలలు కాసిన రసమయజగత్తు 'కర్పూరవసంతరాజీయం'. ఇందులో ఒకేరసమైన గేయగతిలో కొన్నిచోట్ల మాత్రలను పెంచడం, కొన్నిచోట్ల తగ్గించడం, వెంటవెంటనే గతులు మారుస్తూ పోవడం వంటి ఛందశ్శిల్పాన్ని ప్రదర్శించారు కవి. ఇవన్నీ సహృదయపాఠకుల కుల్లాసాన్ని కలిగించే శయ్యావిశేషాలు. ఈ గేయాల్లో యతిప్రాసలకు బదులు అంత్యనియమాలను పాటించి శ్రవ్యకావ్యత్వాన్ని పోషించారు.

ఇక మూడవకావ్యం 'విశ్వనాథనాయడు'. తంజాపురాంధ్రరాజులనాటి కథ అయినా కృష్ణదేవరాయలకాలంనాటికి కూడా ఇది చెందుతుంది. ఇలాంటి కథలకు చారిత్రకవాతావరణాన్ని విశ్వసనీయంగా సృష్టించడం ఈ కవికి తెలుసు. వస్తువుకు, పాత్రలకు ఔచిత్యాన్ని సిద్ధింపజేయడం కూడా ఈయన ఎరిగిన సాహిత్యశిల్పమే! ఈ కావ్యం వీరరసనిర్భరం. లోకంలోని మమతావాత్సల్యాలను, భక్తిప్రేమలను భావనచేసి చిత్రించడంలో ఈ కవి దక్షుడని ఈ కావ్య

నిర్వహణ నిరూపిస్తుంది. ఈ కృతిలో నాటకీయశిల్పాన్ని మించిన 'సినిమా టెక్నిక్కు' తొణికిసలాడింది. భిన్న స్థలాలలోని భిన్నపాత్రల అనుభవాల నొకేమారు వర్ణించడం, దృశ్యసాక్షాత్కరణం చేయడం, ఎదుటిపాత్ర మీద తతిమ్మాపాత్రల మనోభావవికారాలను రసవత్తరంగా చిత్రించడం చలనచిత్ర శిల్పంగా మెరుస్తుంది. గేయరచనలో 'విశ్వనాథనాయడు' మరోమెట్టు పైకెక్కింది. అంత్యనియమాల్ని విడిచింది. అన్నిగతుల్నీ ఆదరించింది. రసానుగుణ పదబంధాల్ని శయ్యాపాకాల్ని రీతివృత్తుల్ని అనుసరించడంలో 'గేయౌచిత్యం' అనే ప్రయోగం ఫలవంతమయింది. కథలో వేగాన్నీ పాత్రలద్వారా యావేగాన్నీ ప్రదర్శించవలసివస్తే గణవైచిత్రి (యగణ, జగణాలు) తో కూడిన చతురస్రగతిని వాడటం కనిపిస్తుంది. ఈ కృతి ఆరుఖండాలుగా విభక్తం.

నారాయణరెడ్డి తీసిన ఈ చారిత్రక గేయకావ్యం మరి కొందరిని ఆకర్షించింది. తంజాపురాంధ్రనాయకుల కథల్లోంచి రంగాజమ్మకథను సంగ్రహించి నాగభైరవకోటేశ్వరరావుగారు గేయంలో నిర్వహించినారు. బౌద్ధగాథల్లోంచి ఒక ప్రణయవృత్తాన్ని తీసుకొని ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారు గేయంలో రచించారు.

'రంగాజమ్మ' (1963) కావ్యంలో నాగభైరవకోటేశ్వరరావు వస్తూన్మీలనంతో పాటు కథాకథనశిల్పంకూడా ప్రదర్శించి, తమ భావుకత్వాన్ని ప్రకటించుకున్నారు. 10 ప్రకరణాల ఈ కథాకావ్యం వివిధగేయగతుల్లో సురుచిర శయ్యతో పఠితలను అలరిస్తుంది.

ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి కావ్యం 'శిలామురళి' (1970). ఈ కావ్యంలో ఇతివృత్తం ప్రణయసంబంధియే. శర్మగారి ప్రకృతిచిత్రణ, వాతావరణకల్పన ఈ కావ్యంలో ముగ్ధంగా ఉంటుంది. ప్రకృతికి రసాకృతి నిస్తూ అచేతనాలకు చేతనత్వావాప్తి కలిగిస్తూ ఈయన రంగులు వేస్తారు. గేయరచన శర్మగారిచేతిలో ఒక సహజనవ్యతను సంతరించుకుంది. వ్యావహారికభాషను సహజసుందరంగా గేయంలో పొదిగించడం శర్మగారి ప్రత్యేకత. దానివల్ల గేయాని కొక వచనత్వ మబ్బింది.

## 4

జీవితచరిత్ర, స్వీయచరిత్ర చరిత్రలోని భాగాలుగానే వాఙ్మయవేత్తలు భావిస్తారు. జీవితచరిత్రను తొలిసారిగా గేయకావ్యంగా సంతరించిన ఘనత

నారాయణరెడ్డిగారికే దక్కింది. నెహ్రూజీవితకథలోని ప్రధానసన్నివేశాలను 14 ప్రకరణాలలో గేయ, వచనగేయ ఉభయరీతులలో వర్ణించిన కావ్యం 'జాతి రత్నం'. ఒక గులాబిపువ్వు కపికె ఈ ఘట్టాల్ని వినిపిస్తూన్నట్లు చెప్పడం కవి వస్తువిధాన శిల్పానికి నిదర్శనం. ఉక్తిచాతుర్యం, భావగాంభీర్యం, శబ్దమాధుర్యం ఇందులో త్రివేణిగా సంగమించి ప్రవహించాయి.

స్వీయచరిత్రనో వ్యక్తిగతానుభూతులనో గేయకావ్యంగా నిబంధించిన వారిలో విద్వాన్‌విశ్వం, సోమసుందర్ మొదటితరంవారు. భావకవిత్వంలో కూడా చాలాభాగం ఆత్మాశ్రయమే అయినా ఆ వస్తువు ప్రధానంగా ప్రణయపరము, ఖండకావ్యపరిమితము. విద్వాన్‌విశ్వంగారి 'నా హృదయం' అనేపెద్ద కావ్యం వివిధచ్ఛందస్సుల్లో హృదయానుభూతిని వ్యంజించింది. సామాజిక దృక్పథము, అభ్యుదయకవితాశీలము ఈ రచననాటికి విశ్వంగారిలో సంక్రమించాయి.

సోమసుందర్‌గారు రచించిన 'మేఘరంజని' (1963) ఆయన జీవితంలోని ప్రణయవిరహానుభవాలకు వ్యాఖ్యాప్రాయమైనకావ్యం. వాస్తవికతా కాల్పనికతలసమ్మేళనంగా సాగింది ఈ కవిత్వం. 6 ప్రకరణాలు గల ఈ కావ్యమంతా చతురస్రగతిలో నడిచింది.

సృష్టి, వ్యవస్థలనుగురించి జిజ్ఞాసతో తాత్త్వికనేత్రం తెరుస్తూ తనకుతానే వేసుకున్న ప్రశ్నలూ, చెప్పుకున్న జవాబులూ 'సోమరసం-సుందరకాండ' అనే కావ్యంలో సోమసుందర్‌గారు ఆవిష్కరించారు. ఇది తెలుగులో సరికొత్త రకమైన వస్తువుగల కావ్యం. 5 భాగాలు గల ఈ కావ్యం (1963) కూడా చతురస్రగతిలోనే నడిచింది.

## 5

వర్ణనాత్మకగేయకావ్యాలకు ఆధునికుల్లో ఆద్యులుగా విశ్వనాథ(కిన్నెర), పుట్టపర్తి (శివతాండవం) గార్లను చెప్పుకోవచ్చు. స్వాతంత్ర్యయుగంలో ఇలాంటి కావ్యాలను రచించినవారిలో సోమసుందర్, నారాయణరెడ్డి, ముకురాల రామారెడ్డి గణనీయులు.

సోమసుందర్‌గారు రచించిన 'గోదావరి జలప్రళయం' (1953) కరుణరసాత్మకమైన ధోరణిలో ప్రజాజీవితాన్ని చిత్రించింది. వరదలకు గురిఅయిన ప్రజలకష్టనిష్ఠురాలను గురించి ఆక్రోశిస్తూ గోవదారి నధిక్షేపించిన వర్ణనకావ్య

మిది. సమకాలీన సంఘటనలను, పురాచరిత్రను ప్రసక్తానుప్రసక్తంగా అభిము ద్రించిన ఈ గేయాలు వివిధగతుల్లో 7 తరంగాలుగా విభక్తమయ్యాయి.

ప్రకృతిలోని అతిసూక్ష్మరహస్యాలను అతిమనోజ్ఞదృశ్యాలను తనఆత్మీ యానుభూతులతో మేళవించి ఋతువులను చిత్రించిన గేయకావ్యం నారాయణ రెడ్డిగారి ఋతుచక్రం (1964). దృశ్యసాక్షాత్కార నైపుణ్యం ఈ కావ్యంలో పరాకాష్ఠ చెందింది. తెలంగాణ పల్లెటూళ్ళలోని రైతుయువకుని జీవితానుభూతు ల్ని సామాన్యీకరిస్తూ ఆత్మవృత్తాంతమిషతో వర్ణించా రీ కావ్యంలో. సాంసారిక జీవితానికి భావనాత్మకభాష్యాలు పలుకుతూ కథాసూత్రాన్ని సాగించడం ఈ ఋతుచక్రంలోని శక్రచాపసౌందర్యం.

హృదయద్రావకమైన పురాస్మృతుల్నీ హృదయస్పందకమైన భావ చిత్రాల్నీ రూపొందిస్తూ తెలంగాణలోని ప్రాచీనశిథిలమైన దేవరకొండ దుర్గాన్ని వర్ణించిన లఘుకావ్యం ముకురాల రామారెడ్డిగారు రచించిన దేవరకొండదుర్గం. పాదనియమాల్లో స్వేచ్ఛను అవలంబించి, లయను సాధించడం ఈ గేయపు విశిష్టగుణం.

### 6

ఒక గ్రీకుపురాణకథ నాధారంగా చేసుకుని 'మాధురీరుచిప్రియ' ప్రణయ వృత్తాంతాన్ని గేయప్రబంధంగా నిబంధించినవారు వఝల వేంకటేశ్వర్లుగారు ఆ కావ్యమే 'అమరవీణ' (1958). జానపదగేయరీతుల్ని అవలంబించి కథాశిల్పా నికి కొత్తహారంగును సమకూర్చారు. 12 శ్రుతులుగా కావ్య విభక్తం.

ప్రసిద్ధపౌరాణికకథ అయిన మేనకావిశ్వామిత్రాన్ని గేయవృత్త-ఉభయ కావ్యంగా రచించారు మడిపడగ బలరామాచార్యగారు. 'మేనకావిశ్వామిత్రము' (1961) లో కవితాలూకు లలితకళల అభిరుచి, అభినివేశాల నీడలు, గేయఫణి తులజాడలు మనోజ్ఞంగా నెలవుకొన్నవి.

### 7

గేయనాటిక శివశంకరులు, కృష్ణశాస్త్రి, రజని, మల్లవరపు ప్రభృతుల లాలనలంది, పెరిగి పెద్దదై ఈ యుగాన నృత్యకింకిణులను ప్రమోగించసాగింది. గేయనాటికా రచయితల్లో నారాయణరెడ్డి, నారపరెడ్డి, బాపురెడ్డి, కె.వి.ఆర్. నరసింహం, యస్వీ జోగారావు ప్రభృతులు ఈ యుగంవారినిగా పేర్కొన వచ్చు. గేయనాటిక ఆకాశవాణి ఆలంబనంతో తీగలు సాగింది.

నవ్వనిపువ్వు, వలపురేడు, దగ్ధశాంతి, భిన్నస్వరాలు, అజంతాసుందరి, వెన్నెలవాడ, రామప్ప-నారాయణ రెడ్డిగారు రచించిన రమణీయ గేయరూపకాలు. మొదటి రెండూ ఆయన యౌవనారంభ కవితారంభ వేళల్లోనివి. సౌందర్యాభివ్యక్తికి నిద్దమైన అద్దాలవి. ప్రణయపిపాసకు ప్రపాశాలలవి. తరువాతిరెండూ ఆయన అభ్యుదయ దృగంకురాలకు తొలకరిజల్లులు. శాంతికోసం మనిషి పొందే తపన, శ్రామికజనసేవకు కళాజీవి చేసే త్యాగము వాటిలో చిత్రితాలు. ఐదవది నిగ్రహరహితమైన కళారాధన వ్యర్థమనే సత్యానికి నిరూపణ. రామప్ప అన్నింటికన్నా బహుళప్రచారం పొందిన నాటిక. ఒక తెలంగాణ శిల్పక్షేత్రానికి సజీవకళాప్రతిబింబం.

కె. వి. ఆర్. నరసింహంగారు రచించిన ఉషోరాగం, శోణితపారణ (1955) అనే గేయనాటికల్లో మొదటిది పౌరాణికకల్పన, రెండోది చరిత్ర వృత్తం. ఈ రెండూ కవి సృజనాత్మకప్రతిభకు పతాకలు. శబ్దాలంకార చారువులైన గేయగతుల్లో ఈ కవి ప్రదర్శించిన చాతుర్యం ప్రశంసనీయము.

ఒకపక్క ఛాందసపండితులకు,వేరొకపక్క విప్లవకవులకు మధ్యనలుగుతున్న కవితాకన్య ఈ యిద్దరినీ తిరస్కరించి కవినే వరించిందన్న సత్యాన్ని నిరూపిస్తూ రచించిన గేయనాటిక 'కవిత'—నారపరెడ్డి రచన (1956).

## 8

ఈ యుగంలోని గేయకవితకు అధిక్షేపము, అవహేళన ఒక వస్తువుగా రూపొందింది. అయితే వీటి ప్రయోజనం సమాజకాలుష్యక్షాళనం.

ఈశాఖలో బలమైన కంఠాలు కాళోజీ, గడ్డం మల్లారెడ్డిగార్లవి. 'నా గొడవ' అనే మిషతో సమాజంలోని బురదను క్షాళించే ఇందుపగింజలవంటి గేయఖండికల్ని కాళోజీ 7 సంపుటుల్లో వెలువరించారు. 'క్రైతచేత మేల్కొలుపకున్న కాళోజీ కాయము చాలింక' అని చెప్పగల్గిన వీరావేశం కాళోజీ నారాయణరావుగారిది. ఆయన పలికిన ప్రతిగేయపాద మొక లోకోక్తి కాగలిగినంత సూక్తి సురుచిరంగా ఉంటుంది. సామాన్యంగా సమకాలీన వస్తువును మాత్రమే ఈయన వరిస్తారు. ఈయనే కాదు, మల్లారెడ్డిగారుకూడా అలాంటివారే; సమకాలీన రాజకీయాలు, విద్యావిధానం, విశ్వాసాలు, మతం, రేడియో, అకాడమి, మంత్రులు— అన్నింటినీ ఈయన వక్రోక్తి మనోహరంగానూ ఛురికాప్రాయంగానూ అధిక్షేపించగల శక్తిమంతుడు. కళాస్పర్శ కోల్పోవని స్పర్శవేది

మల్లారెడ్డి అల్లరి. విధిరూపంలో ప్రబోధించినా, ఆ మాటలకు నిషేధం అర్థం కావడం ఈయన వైచిత్రి. మాటల్లో కార్టూన్లు, పాటల్లో పేరడీలు, ఈయన మాత్రాచ్ఛందస్సులు. మల్లారెడ్డి గేయాలు, శంఖారావం— ఈయన కృతులు.

ఇటీవల ప్రచురితమైన 'నవ్వే కత్తులు' అనే కావ్యంద్వారా ముకురాల రామారెడ్డిగారుకూడా సమాజ విమర్శకు కత్తులు దూశారు. సంకుచిత స్వార్థాల కోసం రకరకాల ఆలోచనల్నే ఆయుధాలుగా వాడుతున్నవారిని కవి అధిక్షేపిస్తూ శ్రీ వేంకటేశ్వరస్వామి ముందు ప్రశ్నలను కత్తులుగా మారటం ఈ కావ్యంలోని వైలక్షణ్యం. పద్యగేయ ఉభయమైన ఫణితిలో రచన రమ్యంగా సాగింది. వ్యాజనింద కవి కభిమానపాత్రమైన విద్య.

## 9

గేయరూపంలో ముక్తకాలు, శతకాలుకూడా ఈ యుగంలో వచ్చాయి. ఈ శాఖలో ఆరుద్ర, నారాయణరెడ్డి లబ్ధప్రతిష్ఠులు. ఆరుద్ర కూనలమ్మ పదాలు మకుట నియమం పాటించిన, అనుప్రాస విన్యాసం చేసిన సరికొత్త గేయశతి. ఆయన ప్రతిగేయ మొక సూక్తి. ప్రతిగేయ మొక సత్యం. ప్రతి గేయంలో వ్యంగ్యం. ప్రతిగేయంలో కార్టూన్! కూనలమ్మ జానపద గేయసాహిత్యంలోని ఊహాపాత్ర

నారాయణరెడ్డిగారి 'సమదర్శనం' నిర్మకుటగేయ శతక చక్రవర్తి. సమాజంలోని మంచి చెడ్డల్ని సున్నితంగా వేళాకోళం చేయడం, సమాజ రక్త శుద్ధికి సాహిత్యంపేరిట కొత్త టానిక్కు వ్రాసి యివ్వడం ఈ సమదర్శనవాది నిర్వహించిన ఉద్యోగం.

నారాయణరెడ్డిగారు రచించిన మరొక శతకాభాస గేయకృతి 'గాంధీయం'. ఇది జాతిపిత సూక్తులకు జాజ్వల్యమానమైన సంగీతశ్రుతి!

## 10

తెలంగాణ విముక్త్యుద్యమాన్ని పురస్కరించుకుని గేయాల్లో ఖండికలు రచించిన ప్రముఖు లిద్దరు కనిపిస్తున్నారు. ఒకరు సోమసుందర్, రెండు దాశరథి.

సోమసుందర్‌గారి 'వజ్రాయుధం' (1949 మార్చి) లోని 'బానిసల దండయాత్ర' అనే భాగంలో గేయాలు వీరావేశపూరితాలు. వీటిలో 'ఖబడ్దార్', గేయం బహుళప్రచారం పొందింది. జనగామ గెరిల్లా నాయకుని వర్ణనతో వలు

పురిని పులకలెత్తించా డీ కవి. ప్రజల్లో చైతన్యాన్నీ పాలకవర్గంలో సంచల నాన్నీ కలిగించడంలో 'గేయం' కన్నా ప్రముఖ సాధనం లేదని నిరూపించాడీ కవి.

దాశరథిగారి 'అగ్నిధార' (19౹౹9 ఆగస్టు) లో ఈ ఉద్యమపరంగా రచించిన గేయాల్లో 'నడిగడ్డ', 'పదేపదే అనేస్తా' అనే శీర్షికల్లో కవి కోపాగ్ని శాపోక్తులు తాండవించాయి.

## 11

ఆంధ్రరాష్ట్రోద్యమానికి గేయకవితనే అందించిన వారిలో సోమసుందర్ విశిష్టుడు. ఆయన 'కాహళి'లో ప్రతిగేయ మొక హర్తాల్; ప్రతిగేయ మొక ఆందోళన; ప్రతిగేయంలోనూ రాష్ట్రవాంఛాభిముఖమైన ఆవేదన. కేంద్ర రాజకీయాల్లోనూ ఉమ్మడి మద్రాసుప్రభుత్వంలోనూ 'రాష్ట్రసిద్ధి'కి కలిగిన అవరోధాలను వేలెత్తి చూపిస్తారీయన గేయాల్లో. జానపదగేయరీతుల్ని, వాడుక భాషనీ, నుడికారాన్నీ ప్రయోగించడంద్వారా ఈ గేయాలను ప్రజల ఉద్యమ సాధనాలుగా రూపొందించారు.

## 12

సామ్యవాదకాంక్షను వ్యక్తీకరించడానికీ, వర్గకలహానికి అంకురార్పణ చేయడానికీ అభ్యుదయకవులు గేయాన్నే తమ ఆయుధంగా వాడుకున్నారు. అనిశెట్టి సుబ్బారావు, రెంటాల గోపాలకృష్ణ, ఆరుద్ర, సోమసుందర్, దాశరథి, రమణారెడ్డి, రాంషా, నారాయణరెడ్డి మొదలైన కవులు రచించిన ఖండకావ్యాలన్నింటా గేయకవిత్వం ఈపనుల్ని తలకెత్తుకుంది. శ్రామికజనజీవితాన్ని, శ్రమైకజీవితసౌందర్యాన్ని గేయం కళ్లకు కట్టించింది. ఆగర్భశ్రీనాథుడ్నీ అనాథుడ్నీ చూపి.ప్రశ్నలు రేకెత్తించింది. కొందరు గేయంలోనే నినాదాలిచ్చారు.గుండెలుచీల్చేఅక్షరసత్యాలను విసిరారు. సమసమాజంకోసం కలలుగన్నారు కొందరు. కొందరు వాస్తవికతకు పట్టంకట్టారు; ప్రజాస్వామ్యానికి పునాదులు త్రవ్వారు.

## 13

ఆధునిక గేయకవులు ఎన్నో నూత్నకవితా వస్తువులను దర్శించారు. వాటిలో అంతర్జాతీయ దృక్పథ మొకటి. దేశదేశాల స్వాతంత్ర్యసమరాలు, వాటి విజయాలు, విజ్ఞానపరిశోధనలు, అంతరిక్షయానాలు, అణ్వస్త్రాలు, నియంతలదురాశలు—ఇవన్నీ గేయకవితావస్తువు లయ్యాయి. సోమసుందర్ వంటి

వారు 'మలయాప్రభంజనం' అనే పేరుతో వ్రాసిన గేయాలు. దాశరథి రమణా రెడ్డి వంటివారు వ్రాసిన కొన్ని ఖండికలు పరశీలించదగినవి.

## 14

అంతర్జాతీయవస్తువులాగే జాతీయవస్తువు కూడా గేయకవులకు విరివిగా ఈయుగంలో లభించింది. చైనా పాకిస్తాన్‌ల దండయాత్రలు, పంచవర్ష ప్రణాళికలు, దారిద్ర్యనిర్మూలన, శాంతియుత సహజీవనం, కుటుంబ నియంత్రణం, సామాజిక వికాసం, ఎన్నికలు—వంటివి ఒకప్రక్క, వరదలు, క్షామాలు, లంచగొండితనం, నల్లబజారు, సిఫార్సులు, నిరుద్యోగసమస్య వంటివి మరొకపక్క ఆవేశ-ఆక్రోశపూరితాలయిన గేయాలను వ్రాయించాయి.

పండగలకు, పర్వాలకు పత్రికలు వేసే ప్రత్యేకసంచికలు ఈగేయాలను ప్రజల కందించి భావసంచలనానికి దోహదం చేస్తున్నాయి.

గురజాడ, రాయప్రోలుల తర్వాత దేశభక్తి ప్రబోధకాలైన జాతీయ గీతాలను రచించినవారు అధికసంఖ్యలోనే ఉన్నారు. కృష్ణశాస్త్రి, వేదుల, రజని, శ్రీశ్రీ ఆరుద్ర, సోమసుందర్, పైడిపాటి, ఇంద్రగంటి, పిలకా, దాశరథి, భీమన్న, నారాయణరెడ్డి, శశాంక మొదలైనవారు భారతమాతకు నీరాజనాలిచ్చారు; ఆంధ్రమాతకు ఆరాత్రికాలు సమర్పించారు; మాతృమూర్తికి జయగీతాలు పాడారు.

## 15

స్త్రీవర్ణన, ప్రణయము, శృంగారము నేటికీ గేయకవితలో విశేషంగా కనిపిస్తూనే ఉన్నాయి. దాశరథి 'కవితాపుష్పకం' లలితమైన ప్రణయభావనను విశేషంగా విరజిమ్మిన గేయఖండికాసంపుటి. సోమసుందర్‌గారి 'క్షీరాబ్ధి', యస్వీజోగారావుగారి పంచకళ్యాణి ఇల్లాటిగేయాలను ప్రచురించాయి. సినిమా గేయాలలోకి ఈశృంగారవస్తువు ఈనాడు అధికంగా వలసవెళ్లింది. రేడియో, గ్రామ్‌ఫోనులు సైతం సినీగేయాలకు అధికప్రాధాన్య మిస్తున్నాయి. నాగరకులూ జానపదులూ వాటిని ఆస్వాదిస్తున్నారు. అయితే ఇందులో గేయానికి ఆస్వాద్యత అధికంగా సంగీతవిశేషంవల్ల కల్గుతున్నది. కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, దాశరథి, నారాయణరెడ్డి, కొసరాజు, ఆరుద్ర ప్రభృతులు రచించే సినిమాపాటల్లో కళా రుచిరాలు చాలా ఉన్నాయి. రాశిలో కూడా ఇవి గణనీయాలే।

భావప్రధానమైన కవితారంగంలో నేడు మానవతాభావన, స్నేహ, వాత్సల్య, కారుణ్యాది ముగ్ధభావాలు, హింసపట్ల నిరసన, శాంతిప్రియత మొదలైనవి జీవనాడులుగా గేయాలు వెలుస్తున్నాయి.

ఈపాతికేళ్లలోనూ మొత్తంమీద ఖండకావ్యమే గేయశాఖలో కూడా అపారంగా వర్ధిల్లింది. ఖండకావ్యంలో వస్తువుకు నిర్దిష్టత ఉండదు. అది సంకీర్ణ వస్తుకము, గేయకవులు తమ జీవితాల్లోని విచిత్రానుభూతుల్నీ, విశేషావేశాల్నీ, రసవత్తర సన్నివేశాల్నీ భావిస్తూ రచిస్తున్నారు. కవిత్వానికి వస్తువు కానిదేదీ ఈనాడు లేదు. స్నేహం, స్వేచ్ఛ, వినయం, కృతజ్ఞత, వంటి చిరంతన మానవ మానస లక్షణాలను కొందరు రమణీయార్థ ప్రతిపాదకాలుగా తీర్చిదిద్దుతున్నారు. నారాయణరెడ్డివంటి సాహితీమర్మవేత్తలు కొందరు భౌతికాతీతమైన దివ్యానుభూతికోసమైన అన్వేషణనూ తాత్త్వికచింతననూ కవితాస్పర్శవేదితో సువర్ణీకరిస్తున్నారు. రవీంద్ర, కందుకూరి. గురజాడ, నెహ్రూ, గాంధీవంటి మహాపురుషుల జయంతులకు వైజయంతిక లెత్తుతున్నవారు కొందరు కెన్నెడీ, నెహ్రూలమీద ఎలిజీలను పలుకుతూ కల మెత్తినవారు కొందరు.

ప్రజావిప్లవాల్లో ప్రాణా లర్పించిన అజ్ఞాతవీరులకు స్మృతినీరాజనా లర్పిస్తూ, వేడిగా, వాడిగా పలికేవారు ఒకరిద్దరున్నారు. అట్టివారిలో రమణారెడ్డి అగ్రేసరులు.

నగరజీవితాన్ని గేయరూపంలో వ్యంగ్యధోరణిలో వర్ణించినవారిలో నారపరెడ్డి, ఆరుద్ర ముఖ్యులు.

## 16

అన్యభాషలలోంచి కావ్యానువాదులకు పూనుకున్నవారు కూడా గేయాన్ని స్వీకరించడం ఈయుగంలో కన్పిస్తున్నది. వేదులవారు రవీంద్ర బాలసాహిత్యాన్నీ, దాశరథిగారు గాలిబ్ గీతాల్నీ, కాళోజీగారు ఖలీల్ జీవనగీతాన్నీ, ముకురాల రామారెడ్డిగారు కాళిదాసమేఘాన్నీ గేయరూపంలో పునఃసృష్టి చేశారు.

## 17

బాలసాహిత్యంలో గేయప్రక్రియ బహుళంగా సంప్రయుక్తమయింది. కవిరావు, నార్ల, న్యాపతి రాఘవరావు, చల్లా రాధాకృష్ణశర్మ, బి.వి. నరసింహారావు, దాశరథి, నారాయణరెడ్డి, మిరియాల రామకృష్ణ, మసూనా, ఉత్పల,

రజని, నళిని, కరుణశ్రీ, ఎల్లోరా, సుశీలాదేవి, మాల్యశ్రీ, వంటివారు బాల గేయాలను వివిధగతుల్లో విన్యసించారు.

## 18

ఆధునిక గేయకవితా ప్రస్థానానికి గురజాడ మార్గదర్శికాగా భావ, అభ్యుదయకవులు ఆమార్గాన్ని సుగమం, సుఖదం, సుందరం చేశారు. సినిమా, రేడియో, ముద్రాయంత్రం గేయకవితాధ్వాన్ని వెలిగించాయి. కొందరి కది 'యశసే, అర్థకృతే' కాగా అందరికీ సద్యఃపరనిర్వృతినీ, సందేశాన్నీ ఇస్తున్నది.



''ఏదేశచరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం ?
నరజాతిచరిత్ర సమస్తం
పరపీడనపరాయణత్వం.''

''ఇతిహాసపుచీకటికోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావా లిప్పుడు
దాచేస్తే దాగనిసత్యం.''

—శ్రీశ్రీ

# వచన కవిత్వం

డా. సుప్రసన్న

తెలుగుభాషకు సంబంధించినంతవరకు వచనంగా కవిత్వం అవతరించడం ప్రయోగవాదులు చేసిన ప్రయత్నాలకు ఫలం. ఈ ప్రయోగవాదులతో సమాంతరంగా ఉద్యమరూపంలో కవితారచన సాగించిన ప్రగతివాదకవులేమో ప్రజలు పాడుకునేపాటలబాణిల్లో కవిత్వంకూడా ఉండాలనీ అది కర్షకులకు, శ్రామికులకు దగ్గరగా పోవాలనీ ప్రయత్నంచేశారు. కాని ఈప్రగతివాద కవుల్లో చాలామంది మధ్యతరగతివర్గానికి చెందినవారు కావడం, సామాన్యప్రజలకు యోజనాలదూరంలో విలసిల్లే ఆంధ్రకవితాసంప్రదాయ కావ్యభాషకు చెందినవారు కావడంవలన, ఇంకా సైద్ధాంతికంగానే కాని హార్దికమైన అనుబంధం ప్రగతివాదం ప్రపంచించే శ్రామికవర్గంతో లేకపోవడం కారణంగా ఈప్రయత్నం కేవలం సిద్ధాంతరూపం దాటి దూరం రాలేదు.

భావకవులకాలంలో బహువిధాలప్రయోగం పొంది పరిణతరూపాన్ని పొందిన 'గేయం', స్వాతంత్ర్యోదయవేళ కొత్తకవులకు'ఫాషన్'. కాని, భావకవిత్వంమీద సాగిన తిరుగుభాటులో ప్రయోగవాదులు బాహిరరూపాన్ని మార్చడంలో అనేక ప్రయత్నాలు సాగించారు. శిష్ట్లాప్రయోగాలు ఈఉద్యమప్రారంభ సంకేతాలు. ఈమార్గంలో శ్రీ శ్రీ- నారాయణబాబు- రుక్మిణీనాథశాస్త్రి- పఠాభి ఈనల్గురూ దీనికి ఆధార స్తంభాలుగా ఈఉద్యమం కొనసాగింది. మరికొందరు ఈ ప్రయోగాలను కొనసాగించినవారుకూడా ఉన్నారు.

నలభైలలో వచనకవిత్వం విరళంగానైనా రచన సాగుతూనే వచ్చింది. 'జ్వాల'లో ముద్దుకృష్ణకూడా ఈప్రయోగాలకు స్వాగతంచెప్పాడు. పూర్వతరానికి చెందిన రచయితలుకూడా ఈమార్గంలో కలాన్నికదలించారు. చలం 'విన్నపాలు' ఈకాలపురచనలే. విశ్వనాథ 'విప్లవం'అనే పేర ఒకవచనపద్యం 'జ్వాల'లో ప్రకటించాడు.

కొందరు కవులు- చాలామందిప్రముఖులు- ప్రయోగవాదప్రగతివాద శిబిరాల్లోనూ ఉండటంవలన ప్రగతివాదంలోనికి సహజంగా ఈవచనపద్యం చొచ్చుకువచ్చింది. శ్రీశ్రీ అధివాస్తవికరచనల్లోనే కాక మహాప్రస్థానరచనల్లోనూ

ఈవచనపద్యం చోటుచేసుకున్నది. తరువాత'నయాగరా'కవులు ఈమార్గాన్ని ఎన్నుకొన్నారు. కొందరు చెదురుమదురుగా రచన చేస్తూనే ఉన్నారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రంగంమీద నిల్చిన కొత్తకవులు దాశరథీ, ఆరుద్రాను, దాశరధి వృత్తాలు, గేయము, వచనము తనపద్యాలకు ఉపయోగిస్తూనే ఉన్నాడు. ఆరుద్ర త్వమేవాహం ఈమార్గంలో వచ్చినశక్తిమంతమైనకావ్యం. దీనిలో గేయవృత్తాదులు క్వాచిత్కంగా లేకపోలేదు. తెలుగుకవిత్వం ఆధునికతా ముద్ర నంతరించుకున్నది. ఇంచుమించుగా ఆరుద్ర'త్వమేవాహం'లో ననే చెప్పాలి. శబ్దందగ్గరనుంచి కావ్యసమగ్రస్వరూపందాకా ఏదోకొత్తపద్ధతిని సంతరించే ప్రయత్నం ఆరుద్ర ఇందులో చేశారు. అయితే ఈపద్ధతిగా ఆయనచేసినప్రయత్నం వెంటనే ఎక్కువమందిపాఠకులఆమోదాన్ని పొందలేదు. కాని ప్రయోగాలుగా మాత్రం ఆరుద్రప్రయత్నాలన్నీ ఇతరకవులకు కొత్తమార్గాలలో పోయేందుకు ప్రేరణ నిచ్చినవి.

ఇందులో ఆరుద్రప్రయోగాలు ఇంకా పెరిగి ఖండికలుగా కూడా ఎన్నో రకాలు సాగినవి. వచనపద్యం ఒకసుస్వరూపాన్ని నంతరించుకొన్నది. తత్పూర్వం వచనకవిత్వాన్ని గేయగుణం, దానికి సంబంధించిన వాక్యనిర్మాణాదికాలు వదలిపెట్టలేదు.

ఇంతలో దాశరధి రంగంమీదకు విజృంభించాడు. కొత్తప్రయోగాలు అభివ్యక్తిలో చేసేందుకు ఎక్కువ వెసులుబాటు ఉంటుందని ఆయన ఈరూపాన్ని వాడటం ప్రారంభించాడు. 'మస్తిష్కంలో లేబరేటరీ'అనే ఒక దీర్ఘరచన ఈ మార్గంలోకూడా ఆయన గొప్పరచనలు చేయగల దని చూపింది. ఈపద్ధతిలోనే 'పునర్నవం' అన్న పేర ఒకవచనపద్యాల కవితాసంకలనం వెలువరించాడు.

ఈవిధంగా యాభైలు నగం దాటేప్పటికి వచనపద్యం ఒకరూపం సంతరించుకున్నదనే చెప్పాలి. అబ్బూరి ఛాయాదేవి సంపాదకత్వాన 'కవిత' అనే సంకలనం 'వచనపద్యం' బహుళంగా ప్రచురించే మూడుసంచికలు వెలువడ్డవి. ఈ పత్రికకు మొత్తంమీద ప్రయోగవాదులతోడి అనుబంధమే ఎక్కువ. శ్రీశ్రీ-ఆరుద్రలు, అజంతా- బైరాగులు, కుందుర్తి- ఎల్చూరి పీశ్లేకాక కవిరాజమూర్తి, వరద, తిలక్, రాజశేఖర్ మొదలైనకవులు ఈ పత్రికలో రచనలు చేశారు. నలభైలలో విరివిగా రచనలు చేసిన తిలక్ మధ్యలో ఆగి మళ్లాయాభైలనడుమ విజృంభించాడు. ఈ కొత్తరచనల్లో ఆయన ఎక్కువ వచనపద్యరచనలు చేశాడు. దాదాపు పదిపన్నెండేళ్లు ఆయన మరణించేదాక సాగించిన ఈ రచనలు

వచనకవిత్వానికి ఒకఆకర్షణ తెచ్చిపెట్టాయి. సుకుమారపదబంధము, సుందరమైన రూపకాలపరంపర, వైదర్భీశైలి- ఇవి తిలక్‌రచనలు. భావకవుల నాటి కృష్ణశాస్త్రిరచనల్లా ఎక్కువమందని ఆకర్షించేట్టు చేశాయి.

ఈ కాలంలో అజంతా చేసినవి కొద్దిరచనలే అయినా నూతనాభివ్యక్తి లక్షణంచేత చప్పున ఆకర్షించాయి. ఆయన బింబకల్పనవిధానం (ఇమేజరీ) అత్యంతనవీనంగా ఉండింది. బైరాగి 'నూతిలో గొంతుకలు' అనే రచనలో ఈ కాలంలో అంతర్ముఖీనంగా మానవునివేదనను వ్యక్తంచేసే ప్రయత్నం చేశాడు.

ఇంతరచన జరుగుతున్నా యాభైలలో కొత్తకవులు పద్యరచన గేయరచన పుష్కలంగానే చేస్తూవున్నారు. నారాయణరెడ్డి గేయాలలో కథాకావ్యరచన ప్రారంభించాడు. పద్యరూపంలో ఎన్నో ఖండకావ్యాలు ఆధునికమానవుని అంతర్వేదనను వెల్లడించేవిగా వెలువడుతూ వున్నవి. ఎక్కువమంది ఈ రచయితలు మనోమయలోకంనుంచి అధ్యాత్మమార్గంలోకి చొరబడే ప్రయత్నం చేస్తూన్నారు.

'నయాగరా'లో వచనకవిత్వం రాసి నాటినుంచీ ఎన్నోరచనలు చేస్తూవున్న కుందుర్తి రాబోయేకవితారూపం వచనపద్యం అని నిశ్చయించుకున్నాడు. 'తెలంగాణా' ఈ కాలంలో చేసినరచనయే.

'తెలంగాణా' రచనలో వచనకవిత్వానికి ఒకస్థితి కలిగింది. అది ఒక కావ్యస్వరూపాన్ని సంతరించుకొన్నది. ఆ కావ్యంకూడా ఆధునికఅభివ్యక్తితో కథాకథన ప్రధానమైంది కాక, కొత్తరూపకాలతో సన్నివేశాలను, సమస్యలను స్ఫురింపజేస్తూ ఒకరాజకీయోద్యమాన్ని, అంతకంటే బలంగా దానివెనుక ఉన్న సాంఘికసిద్ధాంతాలబలాన్ని వ్యాఖ్యానిస్తూ ఒకసమగ్రదీప్తితో వెలువడింది.ఇంతకాలంగా సాగినప్రయోగాలన్నీ ఒకసార్థకత సంతరించుకున్నట్లయింది.

కుందుర్తి ఈరచనలో ఆరుద్ర చేసినవిధంగా ఆంగ్లభాషాగ్రంథబంధురం చేయలేదు. కొత్తఅభివ్యక్తికోసం సాంకేతికప్రతీకలను విరివిగా గుప్పించి పాఠకుణ్ణి ఉక్కిరిబిక్కిరి చేయలేదు. పరంపరగా రూపకాలు వాడుతూ వచ్చినా అవి తెలుగుపాఠకుడికీ అతనినిత్యజీవితానికీ దూరమైనవి కావు. అంతకుపూర్వం రచనల్లో ఉన్న బౌద్ధికవ్యాయామం కుందుర్తి చేయలేదు. తెలంగాణాలో తెలుగుజీవితం, నేటి తెలుగుచరిత్ర ఒకవిధంగా రూపొందింది. ఈ సఫల ప్రయత్నం చెయ్యడం కారణంగా కుందుర్తి తరువాతిదశాబ్దంలో రూపొందిన వచనకవిత్వోద్యమానికి సారధిగా, ప్రేరకుడుగా నిలబడ్డాడు.

యాబైలలో రచన ఆరంభించి వచనకవిత్వమే ఆధునిక కవితావాహికగా పనికివస్తుం దనే విశ్వాసంతో రచన చేస్తున్నవాళ్లు మాదిరాజు రంగారావు, గోపాలచక్రవర్తి. ఈ ఇద్దరిలో రంగారావు బహుళంగానూ, గోపాలచక్రవర్తి విరళంగానూ రచన చేస్తూవున్నారు.

రంగారావురచన దాదాపు పదిహేనుసంవత్సరాలుగా సాగివస్తున్నది. ఆయన ఈ మార్గంలో చేసినరచన రాశిలోనూ, గుణంలోనూ విశిష్టమైందే. కిర్మీరందగ్గరనుంచి ఇటీవలవెలువడ్డ 'ముక్తధాత్రి' దాకా ఒక్కొక్కరచనలోనూ ఒక్కోవిధమైన వైలక్షణ్యాన్ని చూపేలక్షణం ఉన్నది. ఈయనరచనలు ప్రధానంగా భావనాప్రధానమైనవి. ప్రత్యక్షంగా లోకజీవనం కన్పించదుకాని తనవైన ప్రతీకలద్వారా, లోకలక్షణాన్ని లోతుగా సున్నితంగా వ్యాఖ్యానం చేస్తాడు. ఈయనలో ప్రధానమైన ప్రతీకలు ప్రకృతిలోనివి, కాలాన్ని చెప్పేవి. ఈ సంకేతాలు అనేకవిధాలుగా ఉపయోగించి వందలాదిభావాలను అభివ్యక్తం చేస్తాడు. ఈ సంకేతభాషయొక్క పరిజ్ఞానం ఉంటే ఈయనకవిత్వం ఆలోచనామృతంగా పాఠకుడికి దీప్తమైన అనుభూతిని కలిగింపజేస్తుంది.

మాదిరాజు రంగారావు కవిత్వంలో వస్తువు మానవుడు. ఈ మానవుడు దిక్కాలముల కతీతుడైనవాడు. వాడిలో దేవతలు, రాక్షసులు ఉంటారు. ఈ మానవీయజీవనంయొక్క వివిధకళలు మనోలోకంనుంచి కొత్తకొత్త దృశ్యాలుగా చిత్రీకరిస్తూ వుంటాడు కవి. ముక్తకా లనే కొత్తప్రక్రియను సఫలంగా ప్రవేశపెట్టి వచనకవిత్వంలో నూతనమార్గాన్ని వేశాడు. కుందుర్తి 'తెలంగాణా' వస్తువుగా కావ్యం రాస్తే బంగ్లాదేశ్ స్వాతంత్ర్యోదయం వస్తువుగా ఒకచిన్న కావ్యాన్ని రచన చేశాడు. ఇదికూడా ఆయనకు సహజమైన ఆలోచనాప్రధానమైనరచనాపద్ధతివల్ల 'తెలంగాణా' లాగా త్వరగా బొమ్మకట్టడంలేదు. ఆలోచనా లోకంలో రూపొందించుకోవలసిందే.

గోపాలచక్రవర్తిరచన ప్రధానంగా చమత్కృతి ప్రధానమైంది శబ్దాల మీదశ్లేషలు చేస్తూనే ఎక్కడనించో పొంచి ఒక జీవనతత్త్వాన్ని వ్యాఖ్యానం చేస్తాడు.

ఇది ఇలా ఈ శతాబ్దపు ఆరోదశాబ్దం ప్రవేశించింది. కవిత్వానికి వచనమే ప్రధానరూపం అయింది. కొత్తకవులు ఈ మార్గాన్నే స్వీకరించారు. యాభైలలో రచన ప్రారంభించిన కవులు పద్యాలు గేయాలు రాస్తూ వున్నవారు కూడా క్రమంగా ఈ మార్గంలోకి వచ్చి చేరారు.

ఈ దశాబ్దంలో కవులను స్థూలంగా రెండుమార్గాలలోనివారుగా పేర్కొన వచ్చును. ఒకమార్గం ఆంతరమైన చైతన్యాన్ని, దానిలో వచ్చే సంఘర్షణలను వెల్లడించేదీ; రెండోది బాహిరమైన లోకవృత్తాన్ని వెల్లడించేదీ. లౌకికమైన సుఖ దుఃఖాలు ప్రత్యక్షంగా వెల్లడించడం ఈ మార్గంలో ఉన్న లక్షణం.

చైతన్యపు లోతులను వ్యాఖ్యానించే కవులు ప్రధానంగా 'ఆధునిక ఆంగ్లేయ అమెరికన్ కవితా ప్రభావంతో ముందుకు వచ్చినవారు వర్తమాన కల్లోలంనుంచి విముక్తికోసం మానవుడు చేసే మహాన్వేషణ ఈ కవితాయాత్ర. అందువల్ల ప్రధానంగా ఆధునికకవిత్వం అంతా బుద్ధిప్రధానమైందే. ఆలోచ నలో లోతులలోకి వెళ్ళి దాని సుసూక్ష్మభేదాలను అందుకుని వ్యాఖ్యానించే ప్రయత్నం జరుగుతున్నది. ఇలియట్‌నించి ఈనాటివరకు చాలామంది కవులు ఈ త్రోవలో నూతనావిష్కారాలు చేసినవారే.

కవిత్వంలోనికి ఈ విధంగా ఆలోచనాశీలమైన ప్రవృత్తి ప్రవేశించింది. మానవుడి భౌతిక, మానసిక, అతిమానస దశల్లో పురోగమనాన్ని ఏకకాలంలో కాంక్షించేవారు కావడంవల్ల లౌకికమైన సుఖదుఃఖాల పరిధులను దాటని కవుల కన్నా వీరు విలక్షణంగా కానవచ్చారు. అనంతవైవిధ్యం గల అనుభూతులను విపరించే ప్రయత్నంలో వీళ్లు తమ కావ్యభాషను కొత్తగా నిర్మించుకోవలసి వచ్చింది. ఆధునిక శాస్త్రీయ, తాత్త్విక విచారణలో గాఢమైన అనుబంధం ఉండటం వలన ఈ కవులు ఆయాచోట్లనుంచి కొత్తసామగ్రి తెచ్చుకోక తప్పలేదు. మన సామాన్య కవితా పాఠకుడికి ఇది చాలాదూరంగా అయో మయంగా భాసించడంలో కొత్తవింతేమీ లేదు.

ఈ త్రోవలో రంగారావు మాత్రమేకాక వేగుంట మోహన్ ప్రసాద్, అరివిరాల విశ్వం, రాధాకృష్ణ, దుర్గానంద్, మొదలైన కవులు మరికొంతమంది రచన చేస్తూ వున్నారు.

ఈ కాలంలోనే రాస్తూ ఉన్న మిగతా కవులంతా ఇంచుమించు రెండో మార్గానికి చెందినవారుగా పేర్కొనవచ్చును. సి. విజయలక్ష్మి, శీలా వీర్రాజు, సి.వి. కృష్ణారావు. దిగంబర కవులు, వేర్వారం జగన్నాథం, నరసింహారెడ్డి, సంపత్కుమార్, వరవరరావు, శివారెడ్డి, ముదిగొండ శివప్రసాద్, అద్దేపల్లి రామమోహనరావు— ఇంకా పేర్కొనవలసిన పేర్లు ఎన్నో ఉన్నాయి— మొదలైనవాళ్లు అనేక మంది రచన సాగిస్తూనే ఉన్నారు. అందరినీ ఒక వర్గంగా స్థూలంగా పేర్కొన్నా మళ్ళీ సుసూక్ష్మభేదాలు ఉండనే ఉన్నవి.

ఇటీవలికాలంలో బహుధా చర్చితమైన ఒక సమిష్టి కవివర్గం దిగంబర కవులది. వాళ్ల ప్రధానంగా మొదట్లో, కసితో, ద్వేషంతో, జుగుప్సావహాలైన ప్రతీకలు వాడటంతో ఒక గుర్తింపు పొంది, క్రమంగా మార్క్సిస్టు అవగాహనము అంగీకరించి విప్లవకవిత్వ మనే కొత్త ఉద్యమం రావడానికి కారణమైనారు. ఈవర్గం క్రమంగా పాత అభ్యుదయ కవులను తోసిరాజని మార్క్సియ అవగాహన ప్రధానంగా రాసే కవులకు ప్రాతినిధ్యం వహించే సంస్థగా రూపొందుతున్నది. ఈ మార్గంలో అంతర్భవించిన కవులు వరవరరావు, విజయలక్ష్మి మొదలైనవాళ్ళు.

అంత గందరగోళం చేయకపోయినా సాహిత్యరంగంలో అందరినీ ఆకర్షించిన సమిష్టి కవి కృషి మరొకటి చేతనావర్త సంపుటాలది. మానవుని సర్వతోముఖ పురోభివృద్ధి, ప్రజాస్వామ్యము, జాతీయ దృక్పథము, ఆధునిక భావచైతన్యం ప్రధాన లక్షణాలుగా ఈ సంపుటాలు ఆధునిక కవిత్వంలో తమ వ్యక్తిత్వాన్ని ప్రధానంగా నిరూపించుకున్నవి. ఇందులో కవుల కంఠాలన్నీ ఎవరికీ ప్రతిధ్వనులు కావు. తమలో తమకు కూడా.

ఇలా ఈ పాతికేళ్ళలో వచన కవిత్వం సాగి సాధించిన దేమిటి? అన్న ప్రశ్న ఆలోచించవలసింది. ఇందుకు సమాధానం అంత త్వరలో చెప్పలేం. అయినా స్థూలంగా ఇలా సమీక్షించుకోవచ్చును.

తెలుగు కావ్యభాష వెయ్యేళ్ళ తరువాత సంపూర్ణంగా పరివర్తన చెందింది. ప్రజలు మాట్లాడుకునే భాష స్వయంగా కావ్యంలోకి ప్రవేశించింది. అభ్యుదయ కవిత్వంనాటికంటే సామాన్య మానవుడి జీవనానికీ, అతని సమస్యలకు విస్తృతమైన వాస్తవమైన ప్రవేశం లభించింది ఈ శతాబ్దపు తొలి యాభై యేళ్ళలో వచ్చిన కొత్త ప్రతీకలు, రూపకాలు, కొత్త వాక్యనిర్మాణం, నూతనపదబంధాలు— వీటన్నింటికంటే ఎన్నోరెట్లు అధికంగా ఈ ఇరవయ్యేళ్ళ కవిత్వంలో ప్రవేశించి కవియొక్క అభివ్యక్తి పరిధుల్ని ఊహించినదానికంటె మిక్కిలి విస్తృతం చేసినవి. వస్తువు ధార్మిక జాతీయ పరిధులుదాటి అంతర్జాతీయమైంది.

ఒకవైపున ఉద్యమతీవ్రతలో నినాదాలు, దూషణలు కవిత్వంగా ప్రకటించడం జరుగుతూ వున్నా మొత్తంమీద అనుభూతి, ఆలోచన ఇవిప్రధానంగా వాటితత్త్వాన్ని వ్యాఖ్యానించడం జరిగి కవిత్వానికి బుద్ధిప్రాధాన్యం లభించింది.

వచనమే రూపం కావడంతో దాన్ని వచనత్వం నివారించేందుకు కవులు చేసే నానాప్రయత్నాలవల్ల వాక్యనిర్మాణంలో మార్పులు, ఆద్యంతప్రాసలు, కొత్తయమకాలు, భాషలోని కాకువు ఇవన్నీ చోటుచేసుకుంటున్నవి.

భీమన్న, నారాయణరెడ్డివంటి పూర్వపు తరంకవులు వచనపద్యమే సాధనచేస్తున్నారు.

వచనకవిత్వం ఖండకావ్యరచనకే కాకుండా కథానిర్మాణయోగ్యమైన కావ్యరూపంగా పరిణతి చెందాలనే ప్రయత్నాలు కూడా సాగినవి. భావనప్రధానంగా కొందరుకవులు కొన్నికావ్యాలు నిర్మించారు శీలా వీర్రాజు కొన్నికథలను వచనకవితగా సమకూర్చాడు.

వచనకవిత్వానికి ఒకలక్షణనిర్మాణం చేసే ప్రయత్నము జరిగింది. రమణారెడ్డి, సంపత్కుమార్, కుందుర్తి, అరిపిరాల విశ్వం, చేకూరురామారావు, ప్రభృతులు ఈవిషయంలో విస్తృతమైన చర్చలు చేశారు.



"అసలు ప్రతియింట్లోనూ వంటగది ఉన్నట్లె పుస్తకాల గదొకటి ప్రత్యేకంగా ఉండాలి. మనిషి అయినవాడికి కడుపుమేత ఒకటేచాలదు. మెదడుకు కూడా మేతకావాలి...చదవటం ఎంత అవసరమో, చదివినదాన్ని గురించి ఆలోచించడంకూడా అంత అవసరమే. లేకపోతే ఆ చదువు నిరర్థకం అవుతుంది...దేశంలో వాతావరణం ఎట్లా ఉన్నా చదవటం అడుగంటాలని ఎక్కడా లేదు. మందుతాగే ఓపికకూడా లేనంతగా రోగి క్షీణించవచ్చు. కానీ ఆస్థితిలో మందు మరింత అవసరము. అట్లాగే ఈ స్థితిలో లోకానికి రచనలు కావాలి. బాధల్లో చికాకుల్లో సైతం ఒక నిమిషంసేపైనా చదవడమో, ఆలోచించడమో మంచిది"

—శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

# కవిత - సాహిత్యకళాసిద్ధాంతాలు

డా. అడపా రామకృష్ణారావు

భారతదేశం రాజకీయంగా స్వతంత్ర మయ్యేనాటికి తెలుగుకవితలో ముఖ్యంగా మూడుశాఖలు వ్యాప్తిలో ఉన్నట్లు కనిపిస్తుంది. అన్నిటిలోనూ ఆనాడు అధిక ప్రచారంలో ఉన్నది అభ్యుదయ కవిత. అది అంతకుముందు తెలుగునాట ఒక ఉద్యమంగా కొంతకాలం కొనసాగిన భావకవితపై ధ్వజమెత్తి కవుల దృష్టిని తియ్యని ఆంతరంగిక వేదనలమీదినుంచి కటువైన సామాజిక సమస్యల మీదికి మరల్చడానికి యత్నించింది. ఐనా అప్పటికీ ఇంకా మల్లెపువ్వు లనూ, మనసు మమతలనూ మధురంగా, లలితంగా వర్ణించే గీతాలూ, కావ్యాలూ వెలువడడం నిలిచిపోలేదు. ఇక తెలుగులో మొదటినుంచి తెంపు లేకుండా సాగుతూనే వస్తున్న సాంప్రదాయిక కవిత నాడుకూడా వ్యాప్తిలో ఉన్నది. మనకు స్వరాజ్యం సిద్ధించిన తరువాత తెలుగులో వెలసిన కవితలో కూడా కొంత రూపభేదంతో ఈ మూడు శాఖల ఉనికి మనకు కనిపిస్తుంది.

"మదగజరాజముల్ చనిన మార్గమునం గడునింపు నింపవే మదగజ రాజయాన మదమంథరబంధురయానమానముల్" అన్న ప్రశ్నతో సంకుసాల నృసింహకవి సంప్రదాయానుసరణాన్ని సమర్థించాడు. ఇతివృత్తాం ఎన్నికలో, భావవ్యక్తీకరణంలో, భాషలో, ఛందస్సులో పూర్వకవులు చూపిన మార్గాన్ని అనుసరించేది సాంప్రదాయిక కవిత. అయితే "తాత తాతంనాటి కథలను" ఇతివృత్తంగా ఎన్నుకొన్నా, కవి ప్రతిభవల్ల కావ్యంలో కొంత నవ్యత, విశిష్టత కనిపించకపోదు. ఐనా ఆ కవితలో సంప్రదాయ ముద్ర స్పష్టంగా ఉండి తీరుతుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ శాఖలో ఎన్నో సుదీర్ఘ కావ్యాలు, లఘు కృతులు వెలువడ్డాయి. విశ్వనాథ సత్యనారాయణగారి "రామాయణ కల్పవృక్షము" ఈ కాలంలోనే పూర్తి అయింది. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి "ఆంధ్ర పురాణము", వానమామలై వరదాచార్యులుగారి "పోతన చరిత్రము", తుమ్మల సీతారామమూర్తిగారి "మహాత్మకథ", ఉప్పాడ రాజారావుగారి "మధూదయము", మోటూరి వెంకటరావుగారి "సింహబలి"

వంటి విస్తృత కావ్యాలూ, వఝ్ఝల కాళిదాసుగారి "ఆంధ్ర మహావిష్ణువు" అనే ద్విపదకావ్యమూ సాంప్రదాయిక మార్గంలో సాగిన రచనలే. ఈ విధంగానే కోవెల సుప్రసన్నాచార్యులు గారి "దుఃఖయోగిని" దాశరథిగారి "మహాబోధి" స్ఫూర్తిశ్రీగారి "అహల్య", ఎమ్మనూరి చినవెంకటరెడ్డిగారి "మేనక", "రంభ"వంటి లఘు కావ్యాలు కూడా ఈ శాఖకు చెందినవే.

సిద్ధాంతపరంగా చూస్తే, సునిర్దిష్టమైన సాహిత్యకళా సిద్ధాంతాల కనువుగా సాగిన రచన ముఖ్యంగా మనకీశాఖకు చెందిన కవితలోనే స్పష్టంగా కనిపిస్తుంది. సాంప్రదాయక కవితకు ప్రాతిపదిక భారతీయ లాక్షణికులు నిర్దేశించిన కావ్యశిల్పం. భరతుడు మొదలుగా సంస్కృతాలంకారికులు రూపొందించిన కళా సిద్ధాంతాలు- రసం, శబ్దార్థాలంకారాలు, అర్థరమణీయత, ధ్వని, వక్రోక్తి, ఔచిత్యం వంటివి— ఈ శాఖకు చెందిన కవితకు లక్షణాలనీ, కాళిదాసాది కవులు సంస్కృత కావ్యాలలోనూ, నన్నయాదులు తెలుగు కృతులలోనూ పోయిన పోకడలు వీనికి లక్ష్యాలనీ చెప్పవచ్చును. ఈ విధంగా స్వాతంత్ర్యానంతరం వెలువడిన తెలుగు కవితలో కొంత భాగం భారతీయ సాహిత్యకళా సిద్ధాంతాల ననుసరించి వెలవడిన సాంప్రదాయక రచనకాగా, మిగిలిన భాగంలో కొంత వరకు పాశ్చాత్యుల తాత్త్విక సిద్ధాంతాల ప్రభావమూ వారి కావ్యశిల్పరీతుల అనుకరణమూ మనకు కనిపిస్తుంది

తెలుగులో భావకవిత్వానికి కొంతవరకు 19వ శతాబ్దారంభంలో ఇంగ్లీషు సాహిత్యక్షేత్రంలో వెలసిన వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్స్‌వంటి కాల్పనికోద్యమకవుల రచనలూ, మరికొంత కాళిదాస, రవీంద్రుల కృతులూ ప్రేరణ నిచ్చాయి. ఫ్రెంచ్ విప్లవం జరిగిన తరవాత యూరప్ ఖండపు కవులలో స్వేచ్ఛాస్వాతంత్ర్యాల పట్ల గాఢమైన ఆకాంక్ష ప్రబలింది. ఇది ఇంగ్లీషు సాహిత్యంలో అప్పటికి వ్యాప్తిలోఉన్న సాంప్రదాయికరచనామార్గంపట్ల విముఖత కలిగించి, దానికి విరుద్ధంగా కాల్పనికోద్యమం ప్రారంభం కావడానికి పరోక్షంగా తోడ్పడింది. తెలుగునాటకూడా అటువంటి పరిస్థితులలోనే భావకవిత్వం ఉద్యమరూపంలో వ్యాప్తికి రావడం గమనించదగినది. ఒకవంక విదేశపాలనను అంతంచేయడానికి దేశంలో సాగుతున్న జాతీయోద్యమమూ, మరొకవంక ప్రతిభావ్యుత్పత్తులు లేని కవులపాలై సాంప్రదాయికకవితాశాఖ రసస్వతంత్రబంధాలకు నీరసమైన అనుకరణాలను సృష్టిస్తూ పాఠకుల అభిమానాన్ని కోల్పోవడమూ భావకవిత్వావిర్భావానికి అనుకూలించాయి. 1910 నుంచి 930 వరకు తెలుగుకవితను

సంవన్నంచేసిన ఈ ఉద్యమం తరవాత వెనుకబడింది. అయినా స్వాతంత్ర్యా నంతరంకూడా ఇతివృత్తాలలోనూ, భావవ్యక్తీకరకరణంలోనూభావకవితాధర్మం స్పష్టంగా గోచరించే రచనలు వెలువడుతూనే వచ్చాయి. విద్వాన్ విశ్వంగారి "పెన్నేటి పాట", నారాయణరెడ్డిగారి "నాగార్జున సాగరం", "కర్పూరవసంత రాయలు" వంటి కథాత్మకగేయకావ్యాలు, దాశరథిగారి ఖండ కావ్యా లనేకం, రజనీకాంతరావుగారి గేయాలు, నాయని సుబ్బారావుగారి "విషాద మోహనము" వంటి స్మృతికావ్యం ప్రధానంగా ఈశాఖచిహ్నాలు కనిపించే రచనలే. తాత్త్విక దృష్టికూడా భావకవిత్వపు లక్షణమే. అందుకే పూర్వపు భావకవులవలె మాత్రా బద్ధమైన ఛందస్సును స్వీకరించకపోయినా అంపిరాల విశ్వంగారి "మనస్", బోయి భీమన్నగారి "అనాదికొసనుంచి అనంతత్వంలోకి". మోహనప్రసాద్ గారి "చితి—చింత", చేతనావర్తకవుల కృతులవంటి రచన లెన్నో ఇతివృత్తా నికి సంబంధించినంతవరకు ఈశాఖ కవితాలక్షణాలు కలిగినవేనని చెప్పవచ్చును బాలగంగాధర తిలక్‌గారి "అమృతం కురిసిన రాత్రి" భావకవిత్వానికీ. అభ్యు దయ కవిత్వానికి మధ్య వంతెన వంటిది?

భావకవిత్వానికి ప్రేరణ నిచ్చిన శక్తులు- కాల్పనికత, మానవతావాదం— తాత్త్వికమైనవే కాని కేవల సాహిత్యకళాసిద్ధాంతాలు కావు. ఇంగ్లీషు సాహి త్యంతో కలిగిన పరిచయం మన కవు లీ సిద్ధాంతాలను స్వీకరించడానికి కొంత వరకు కారణమైనా కాల్పనికత, మానవతాదృష్టి మనకు చిరపరిచితమైనవే కాని విదేశాలనుంచి దిగుమతి చేసుకొన్నవికావు.

ఇక అభ్యుదయం సంగతి. అభ్యుదయ కవిత్వ లక్షణాన్ని గురించి ఆంధ్రదేశంలో ఆ రచయితల సంఘంలోని సభ్యులై సాహిత్యోద్యమంలో ప్రముఖభూమిక వహించిన వారిలోనే ఏకీభావం లేదు ఒకవంక వారిలో కొందరు నన్నయ కాలానికి నన్నయ అభ్యుదయ కవి అని వాదించడమూ, ఆ సంఘం నిర్వహించిన మహాసభలలో విశ్వనాథగారినీ, కృష్ణశాస్త్రిగారినీ పాల్గొనేటట్లు చేయడమూ కనిపిస్తుంది. మరొకవంక మార్క్సిసిద్ధాంతాలను మనసార నమ్మి, మార్క్సిస్ట్ దృక్పథాన్ని తమ రచనలలో ప్రకటించేవారు మాత్రమే అభ్యుదయ రచయిత లని ఖండితంగా చెప్పే మరొకవర్గంకూడా వారిలో కనిపిస్తుంది.

ఏమైనా, మార్క్సిజం కూడా ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరమైన తాత్త్విక సిద్ధాంతమే కాని సాహిత్య కళాసిద్ధాంతం కాదు. ఐతే సాహిత్యాన్ని బూర్జువా తరగతికి చెందిన పాఠకులకు గిలిగింతలు పెట్టే వినోద సామగ్రిగా

ఉండనీయరాదని, సమాజంలో వర్గకలహం వల్ల విధిగా చెలరేగే విప్లవంలో బ్రహ్మాస్త్రంగా దానిని రూపొందించాలని, విప్లవం తల యెత్తడానికి సాహిత్యం ఉపకరించాలని మార్క్సిస్ట్ రచయితల ఆశయం. తెలుగులో నేడు "విరసం" సభ్యుల రచనలలో సాహిత్యంద్వారా ఈ ప్రయోజనాన్ని సాధించాలనే ప్రయత్నం కనిపిస్తుంది.

నేటి తెలుగుకవితలో కానవచ్చే ప్రయోగవాదశాఖకు కూడా స్వాతంత్ర్యానికి పూర్వం వెలువడిన పఠాభి, శిష్లా, శ్రీశ్రీ, నారాయణబాబు ప్రభృతుల రచనలలోనే ఒరవడి కనిపిస్తుంది. స్వరాజ్యం వచ్చిన తరువాత అభ్యుదయ సాహిత్యోద్యమం వెనుకబడింది. ప్రయోగశీలత ప్రధానలక్షణంగా కావ్యాలు వెలువడ్డాయి. ఇతివృత్తం అభ్యుదయ కవిత్వానికి సంబంధించినదే అయిన ప్పుడు కూడా భావవ్యక్తీకరణంలో ప్రయోగశీలత కనిపిస్తుంది. ఆరుద్ర గారి "త్వమేవాహం" ఇందుకు చక్కని ఉదాహరణం. బైరాగిగారి "నూతిలో గొంతుకలు", దుర్గానంద్‌గారి "అంతర్ఘోషాలు" ప్రయోగవాదకవితాశాఖకు చెందిన విశిష్టరచనలు.

పాశ్చాత్య కావ్యశిల్పంలో ఈ శతాబ్దంలో కొంతకాలం ఎక్కువగా ఆదరణపాత్రమైన ప్రతీకవాదం మన కవులదృష్టి నాకర్షించింది. వాతావరణాన్ని సృష్టించడమే కళల ప్రాధాన లక్ష్యమనీ, శబ్దం భావాన్ని సూచించ వలెనే కాని స్పష్టంగా వెల్లడించనక్కరలేదనీ ప్రతీకవాదుల విశ్వాసం. కాగా మాటలు భావాన్ని సూటిగా ప్రకటించడానికి గాక సూచించటానికి సంకేతాలుగా ఉపయోగపడతాయన్నమాట. ఆరుద్రగారి "త్వమేవాహం" కావ్యంలో రకరకాల గడియారాలు సమాజంలోని వివిధ వర్గాల మనుష్యుల మనస్తత్వాలకు ప్రతీకలుగా రూపొందాయి. ఆ విధంగానే నగరజీవనాన్ని చిత్రించే 'సినీవాలి' కావ్యంలో నగరజీవంలోని హైన్యాన్నీ, దైన్యాన్నీ సూచించే ప్రతీకలు కావ్యంలో అంతటా కనిపిస్తాయి. ఈ విధంగా పాశ్చాత్య సాహిత్యంలోని శిల్పరీతులూ, తాత్త్విక సిద్ధాంతాలూ భారతీయ కవితాశిల్పరీతులతోపాటు ఇటీవలి తెలుగు కవితలో చోటు చేసుకొన్నవి.



# స్వాతంత్ర్యానంతర కవిత్వంలో ప్రకృతి

డాక్టర్ అరిపిరాల విశ్వం

కవితానుభూతికి హద్దుల్లేవు. కవిత్వానికి హద్దులు పెట్టడంకూడ ఓ రకమైన చారిత్రక అజ్ఞానం. కాలావధుల్ని దాటే అనుభూతినొక కవిత అయితే– అది తాత్త్వికాలోచన. కవితారచనకి పౌర్వాపర్య పర్యాలోకనం కేవలం చారిత్రకం. అంటే ఖండకాల సంబంధి. ఆ దృక్పథంనించే–పరిమితిని విధించుకొని–కవితాదర్శనం చేయటానికి ఇక్కడ చేయబోయే ప్రయత్నం– పుట్టకముందు–పుట్టిన తర్వాత కూడ అసమగ్రమేనని నేనే ఒప్పుకొని– ఈ రకమైన సమీక్షకి పూనుకొంటాను.

కవిత నేటి వాస్తవం మాత్రమే కాక భవిష్యత్ వాగ్దానం కూడ. గతపు వెలుగు కూడ అవుతుంది. రూప– అరూప కవితలు– గణమాత్రాక కవితలు– నియమోపగత ఛందస్సంగీతపు కవితలు– భావలయాత్మక కవితలు– శ్రుతి సురభిళకవితలు ఎన్ని ఎన్ని విభాగాలు :– అన్నీ ప్రకృతిలోనో– ఆంతరిక ప్రకృతిలోనో– ప్రభవించి– రసాత్మలో పర్యవసించేవే. భావనలు, కామనలుకి వేదనలు, స్వప్నాలు, నిర్లిప్తత– విప్లవం– నిరాశ అన్నీ ఒకే ఆత్మస్పందన, అనేక వివర్త రూపాలు. వేదనని– వాదనలోకి దించితే– దాన్ని కించపరచటమే అవుతుంది.

అలంకార శాస్త్రాలు, సాహిత్య నిదర్శనాలు, శుష్కతర్క– పరిశోభితాలై శాస్త్రవాదప్రభంజనాలై– కవితా– వృక్షాన్ని– ఊపివైచిన సందర్భాలే ఎక్కువ. అలాంటి ప్రయత్నం నే నిక్కడ చేయను. నేను కవిని కనక మరొకరి కవితలోని ఊరిదీపాన్ని ఊదేసే పాపచర్యకు ఒడిగట్టను.

ఎప్పుడో తప్ప విమర్శలోకి దిగని– నావంటివారి సమీక్షల్లో– ఓపద్ధతి ఉండదని– శాస్త్రీయులు అంటే– మీరు చెప్పే నిజం నేను ఎప్పుడో ఒప్పుకొన్నదే అవుతుంది.

ఇక ప్రస్తుతం——

గతపు వెలుగు ఊపిరితో ఉద్భవించి– వర్తమాన విశ్వాత్మని జాగృతం చేసి– భవిష్యత్ ద్వారాలని తెరిచిన కవుల కవిత్వాన్ని– కాలఖడ్గంతో తునకలు

చేయటం మహాపచారం. ఇచ్చిన సమస్యని ఎలాగో పూరించాల్సిన అష్టావధాని యొక్క దుస్థితి ఇక్కడ తప్పదు. అనుభూతి ఒక అఖండ పరీవాహం. అది నిత్య చైతన్య ప్రతీక. కాంతి శలాక.

"తూరుపుదాకా పాకిం దపుడే
వాలిన చంద్రుడి జింక-
ఎఱ్ఱని వేకువ చుక్కకు
మెలకువ వచ్చింది రాకరాక.
కీచురాళ్ళింకా చీకటి పంకా
"కిర్రుని లాగుతున్నాయి."

—పురిటిపాట —శ్రీ పాలగుమ్మి పద్మరాజు

"కీచురాళ్ళు చీకటినిపంకాని లాగుతున్నాయి"
ఎఱ్ఱని వేకువచుక్కకు మెలకువ వచ్చింది రాకరాక."

ఫ్రెంచిమహాకవి జాక్వెస్ ప్రీవెర్ట్ 'How to paint the portrait of A Bird' అన్న కవితలో—

'Sometimes the bird comes quickly
but it can also take many years
before making up its mind
Do'nt be discouraged
Wait
Wait if necessary for years'

నాల్గో శతాబ్దపు చైనీస్‌మహాకవి లూచీ ఇలా అంటాడు—

'We poets knock upon silence for an answering muse,
We enclose boundless space
in a square foot of paper,
We pour out deluge from the inch Space of the heart
The poet is one who traps heaven and Earth in a cage of form."

కవి-లోక- స్వర్లోకాలు రెండింటినీ రూపక- పంజరంలో బంధిస్తాడు పైకవిత అలాంటిదే.

"కాశ్మీరనగస్సులో పడవల్లాగ
కాలప్రవాహంలో కలరాశవాలు కొన్ని".

—శ్రీ నారాయణబాబు

ఈప్సితానికి– జుగుప్సకు– సౌందర్యానికీ– శ్మశానానికి ఇక్కడె ముడి పడింది.

అందుకే కవిత ఒక సౌందర్యదర్శనం.

"దూరంగా ఆల్ప్సుమీద మంచు
దుఃఖంలా కరుగుతోంది."

—శ్రీ తిలక్

'శిలలు ద్రవించి యేడ్చినవి.' అన్నట్లే నీదుఃఖం సృష్టిదుఃఖంగా భాసిస్తుంది.

"చలిగాలి గుండెలమీద
కత్తిలా తెగింది"

—తిలక్

ప్రేయవిరహం– కత్తిలాంటిచలిగాలిలో అభేదమై మనోవ్యధని పెంచుతోంది.

"రాబందు గొంతులో సెలయేరు ఖైదీ
గాలి ఒక బందీ".

—శ్రీ రమణారెడ్డి

సెలయేరు, గాలి స్వేచ్ఛకు చిహ్నాలు. రాబందు– దమననీతికి ప్రతీక. కాలాన్ని– అంతర్మానవ ఆవేదననీ– ప్రకృతికి అభేదం చేయటంవల్ల వచ్చిన సొగసు ఇది.

"సగంసగం తిన్న కలల్ని నెమరువేస్తూ
నిద్రపోయింది గొంగళిపురుగు."

—తిలక్

పరిణామపేశలమైనసృష్టి– ఓక్షణం భరించలేని వేదనతో పవ్వళించింది. దైన్యాన్ని విప్పటానికి కపిచేసిన కళాత్మకశిల్పం ఇది.

"ఇక్కడ నీఉద్యోగానికి మళ్ళీ
జ్వరం తిరగబెట్టలేదుకదా!"

—శ్రీ కుందుర్తి

పని– ప్రకృతిపొదిగే అవకాశం. అది జబ్బునపడింది. ఇక అంతరాత్మ సంగతి అడగాలా?

"పేదరికంలాగా బిగుసుకొన్న ఆకాశం
నాపైన కనకవర్షం కురిపించదు."

—శ్రీ రాజశేఖర్

కన్ను చీల్చుకున్నా కనిపించని, చీకటిలాంటి భవిష్యత్తు- గీయదలచిన మనిబొగ్గుబొమ్మ జీవితం అయితే- అంతా నిరాశే.

"మనరుధిరంలో కెంపెక్కిన ఆకాశం
మనగుండెల మంటలతో నీలితనం
కోల్పోయిన ఆకాశం." —శ్రీ ఎ. మురళీధర్

ప్రకృతి- నీమనసునీడలబొమ్మ. ఒక కాన్వాస్.

'నీలాకాశ గుహాముఖమునుండి
బయల్వెడలిన కాంతిసింహం.'

—శ్రీ మాదిరాజు రంగారావు

బయటి ఆవేశం, ఏదో వెలుగు తెల్పుతోంది. లోని నిరాశ ఎక్కువైతే- బయటిప్రకృతిలోంచీ ఆనందాన్ని అప్పు తెచ్చుకొని అయినా జీవించు.

కిన్నెరసాని పాటలు పేర్కొనక తప్పదు. కొంత వెనక్కి వెళ్ళి.

'బొట్టుబొట్టు కొకవేయి యెదలుగా
తరగతరగ కొకవేయి నోళ్ళుగా
ఒడలి నీరమే యేడుపుమయమై.'

—శ్రీ విశ్వనాథ

తాను ఓపలేని నిర్బంధదుఃఖం- కడలికంటె ఘనమైనది. ఎదకంటె లోతైనది. ఎందునా ఇమడనిది.

'చిన్ని కిన్నెరాసన్నని యెలుగులు
విన్నగాలి కెరటాల చొచ్చునూ
ఎన్నడో వెనుకటి బ్రతుకున మిక్కిలి
విన్నవాటివలె విరవిం బోవును. — శ్రీ విశ్వనాథ

దీపం దీపాన్ని, దుఃఖం దుఃఖాన్ని వెలిగిస్తుంది.

'శిశువుకు దక్కనిస్తన్యం లాగ
ప్రవహిస్తున్నాయి గోదావరి నీళ్ళు.' —శ్రీశ్రీ

అంతరిక ప్రకృతిని అధఃకృతం చేసుకుంటే— నీవు కోల్పోయేది ఒక సృష్టి.

'నింగిదవ్వులోని పువ్వు
భంగికదా నీ కోరిక!' —పఠాభి

ఆకాశంలాగ అందని ఆశల ఆవేదన యిది:

'విపణివీధి తపోవనం
చాకిరేవు శాసనసభ
సానికొంప, సాధుమఠం
మూత్రశాల, యాత్రాస్థలి
ఎచటైతేనేం?
పోటిపడి కాటులాడ?' —శ్రీ కాళోజీ

ప్రకృతి మానవ స్వార్థానికి ఒక కురుక్షేత్రం. అలాగే పరమార్థానికికూడ ప్రాతి పదిక 'యో యదిచ్ఛతి తస్య తత్.'

'నిదుర మున్గిన లకుమ నీలాలకలతోడ
కోడెగాడువులు దాగుడుమూతలాడె'. —శ్రీ నారాయణరెడ్డి

'పాలిపోయిన నీ కపోలాలపై వ్రాలి
నీలాలకలు రహస్యా లెవో చెవినూద.' —శ్రీ వేదుల

మనస్సులోని మధనాన్ని, ప్రకృతిపై ముద్రవేయటం అదో ఓదార్పు.

'లక్ష ముళ్ళ పొదల్ని భరించి
ఒక్కతోటైి పెంచుకొందాం
లక్ష అపస్వరాల్ని సహించి
ఒక్కపాటైనా పాడుకొందాం'. —శ్రీ భీమన్న

జీవితం— చెప్పలేని నిర్వచనం, విప్పలేని నిర్వేదం పైన పెంచుకొన్న మమతల మహోదయం.

"ఇవిగో! ఇవియే మహా-
ర్ణవమి కోలాటాల
జడకొప్పులో- మట్టి-
జడలలో మెలివోయె." —శ్రీ ముకురాల

గత వైభవాన్ని— ప్రస్తుత దైన్యంలో నీడగా క్రోడీకరించటం.

'శిథిల శిలలు
మూగవోయిన బురుజులు
కాలం గాలిరాపిడికి
కలకాలం రాలుతున్న
స్మృతులు— ఆకులు— రాళ్ళు'. —శ్రీ యాదవరెడ్డి

కాలం తుడవలేని కన్నీళ్ళు శిధిలావశేషాలు.

'ఊహ మొనలుదేరి ఉలియై పలుకరింప
మనసునచ్చి శిలలు చనువు నిచ్చె
శిల్పకు శిల్పికున్న శ్రీమదద్వైతమ్ము
కళలగుండె వాడు తెలియగలడు'.

—దక్షారామము - శ్రీ ఇంద్రకంటి

నిశ్చైతన్య శిల— చైతన్యరథంలా కదలిపోతుంది. ఊహ తెలిపిన ఉలి పలకరింపులకు.

కవిత సింపిన వెలుగు గుర్తుల్ని పట్టుకొని వచ్చిన యీదారి, యింకా వేయవలసిన దూరం ఎంతో ఉంది.

కవుల సంఖ్య అసంఖ్యాకం. ఇలాంటి వింకెన్నో. అతిస్థూలంగా చెప్ప టానికి తప్ప, అతిలోతుకు వెళ్ళటం ఇక్కడ సాధ్యంకాదు.

కవిత నిరంతరం ఈయాత్ర సాగుతూనే ఉంటుంది. జీవాన్ని దైవాన్ని నిలబెట్టి— నిగ్గతీసి ఎదురు ప్రశ్నలు వేస్తుంది.

స్వాతంత్ర్యం, పరాధీనత ఇవి మనిషి మనుగడలో నిత్యసత్యాలు. ఆంతరికంగా ఆలోచిస్తే సంబంధ సత్యాలు. అంతే.



**"సాహిత్యసభలో ఒక సాహిత్యసామ్రాట్టు ఉంటాడు. కానీ అగ్రాసనంలో ఎవరోఒక ధనికుడో ఒకఅధికారో ఉంటాడు. అది చూడటానికి దుర్భరంగా ఉంటుంది".**

—గుంటూరు శేషేంద్రశర్మ

## నవలల సమీక్ష

1947 - 1972

# తెలుగు నవల

శ్రీ నోరి నరసింహశాస్త్రి

ఎవ రెన్ని చెప్పినా తత్త్వం విచారిస్తే నవల అంటేపెద్దకథ. ఎంత పెద్దదిః అది అడుగరాని ప్రశ్న. సాహిత్యంతో కొలిచే యంత్రాలు లేవు కనుకః అది మహాభారతమంత పెద్దదీ కావచ్చు, రామాయణమంత చిన్నదీ కావచ్చునుః గజేంద్రమోక్షము అంతచిన్నది కాకూడదు. అది ఎన్నేళ్ల నడిచినా చిన్నకథే. ఐతే ఈ మధ్య వచ్చిన శ్రీనాగరాజు 'ఊబిలోదున్న' ఒక పూటలో నడిచినకథే ఐనా నవల. మంచినవలకూడాను. అందులో ఎంతవైవిధ్యం ఉన్నది.

నవలలో కథను రచయితే చెప్పవచ్చు. నాయకుడో నాయికో చెప్ప వచ్చు. తెలిసిన మధ్యస్థుడు చెప్పవచ్చు. సంభాషణ ప్రధానంకావచ్చు. డయరీలు, ఉత్తరాలు, రికార్డుల రూపంలో ఉండవచ్చు. అన్నిలక్షణాలూ కలిసి ఉండవచ్చు. చివగ కది వచనంలోనే కాక పద్యాత్మకంగానూ గద్యపద్యాత్మకంగానూ కూడా ఉండవచ్చు. వీరగాథ, సాంఘికగాథ, కుటుంబగాథ, వ్యక్తిగాథ, మానసికవిశ్లేషణంతో కూడినకథ- ఏదైనా కావచ్చు గాని కథ కావలెః

నవల అనేది ఆంధ్రులు ఆకారాంత స్త్రీలింగంగా సంస్కృతీకరించిన ఆంగ్లశబ్దము.

నవల అనేపేరు కొత్తది కావచ్చు. దాని అర్థమూ అన్వయమూ స్వరూపమూ ఎంతో పరిణతి చెందుతున్నది కాని అసలు ప్రక్రియ అతిపురాతనమైనదే. టాల్స్టాయి 'వార్ అండ్ పీస్' గొప్పనవల ఐతే, మహాభారత మెందుకు కాదుః రొమారోలా 'క్రిస్టఫీ' నవల ఐతే, రామాయణ మెందుకు కాదుః ఇరియడు'ఒడిస్సే' ఈనిడు పారడైజులాస్టు నవల లెందుకు కావుః పద్యాత్మకంగా ఉండడ మేనా అవి చేసిన పాపముః పైగా రామాయణ మహాభారతాల భాష వచనానికి దగ్గరగా ఉండే సులభశైలికూడాను. ఇది వచనయుగము కాబట్టి పద్యాలుకూడా వచనంగా వ్రాయడము ఆచార మవుతున్నదిగదాః పాపము శ్రీకుందుర్తి అందు కోసమనే వచనకవిత్వము సాహిత్యం స్థాయిసంపాదించవలె నంటే కథాకావ్యము వ్రాసి చూపవలె నని ఘోషిస్తున్నాడు. శ్రీ విశ్వనాథ 'కల్పవృక్షము'

నిజానికి పద్యాత్మకంగా ఉన్నా నవలే; కాకపోతే సంస్కృతరామాయణం భాష కంటె కొంచెము క్లిష్టంగా ఉంటుంది.

## 2

స్వాతంత్ర్యానంతర ఆంధ్రసాహిత్యాన్ని నవలాయుగ మనవచ్చు. అంతకుముందు కవులకూ కథానికానాటికాకర్తలకే ప్రాధాన్య ముండేది. అప్పుడు వచ్చిననవలలు అధికభాగము అనువాదాలు. ఐనా స్వతంత్రనవలలు కొన్ని మంచివి లేకపోలేదు. శ్రీయుతులు చిలకమర్తి, కేతవరపు, విశ్వనాథ, బాపిరాజు, చలం, గోపీచంద్, కొడివటిగంటి స్వతంత్రనవలలు వ్రాశారు. వాటిలో కొన్ని చాలామంచివికూడాను. ఐనా అప్పుడు ఒకభావం ప్రబలితంగా ఉండేది. చదువరులకు తీరికలేనికాలము గనుక, కథలూ, నాటికలూ ఖండకావ్యాలేకాని దీర్ఘకావ్యాలకూ నవలలకూ కాలము తీరిపోయిన దని. కాని చిత్రమేమోకాని స్వాతంత్ర్యము వచ్చినతర్వాత- మరి పాఠకులకు తీరికా ఓపికా ఎట్లా పుట్టుకు వచ్చినవో- నవలారచనాపఠనమూ విస్తారంగా వ్యాప్తిలోకి వచ్చి తక్కిన రచనలు వెనకబడ్డవి.

స్వాతంత్ర్యానికిపూర్వము పాశ్చాత్యదేశాలలో 'క్లాసిక్సు' అని ప్రసిద్ధిపొందిన గ్రంథాలు విరివిగా దేశంలో దొరికేవి. కాని స్వాతంత్ర్యానంతరం-ముఖ్యంగా అమెరికాద్వారా- చౌకబారు రచనలు ఎక్కువ వ్యాప్తిలోకి రాసాగినవి. దానికితోడు కాస్త మనీషకలవారు చేసే రచనలుకూడా సాహిత్యపువిలువలు తగ్గి రాజకీయాది భావాలకు వ్యాప్తినిచ్చేవిగా తయారైనవి.

అన్నిటికీతోడు కేవలము చదవగలగడమే తప్ప గాఢమైన సాహిత్యరుచి లేని పాఠకులను తృప్తిపరచవలసిన అవసరం హెచ్చింది. ఈ స్థితి ఆంధ్ర దేశంలోనే కాదు, భరతఖండమంతటా, ప్రపంచంలోనూ వచ్చిన పరిణామమని తోస్తుంది. ఈ పాఠకులను తృప్తిపరచడానికి నవల బాగా ఉపయుక్తమైనది. పత్రికలు పోటీలు నిర్వహించి నవలలు ధారావాహికంగా ప్రచురించడముతో వ్యాప్తి మరింత ఎక్కువైనది. చక్కనికావ్యభాగమో నవలలో మంచిఘట్టమో మళ్లీమళ్లీ చదివి మననంచేసి ఆనందించే జనం తక్కువైపోయింది.

దీనికితోడు సాహిత్యభావస్వరూపాలను గురించికూడా నూతనాభిప్రాయాలు ప్రచారం పొందుతున్నవి. సాహిత్యము లోకవృత్తాన్ని ప్రతిబింబిస్తుంది అనేభావము ముఖ్యంగా పాశ్చాత్యదేశాలలో ప్రచారం పొందింది. అది నెమ్మ

దిగా లోకవృత్తాన్ని ప్రతిబింబించవలెనని మార్పు చెందింది. ఆ తర్వాత లోక వృత్తమంటే సమకాలీనసమాజవృత్తమే కావలెనని పరిణమించినది. దానికి విశ్వశ్రేయః కావ్య మనేమాట జోడించి నేటి సమాజానికి అవసరమైన సంస్కారాలు ప్రచారం చేయడమే కావ్యపరమావధి అనే సిద్ధాంతం వచ్చింది. మాటిమాటికి అదే ప్రతివారినోటా వింటున్నందువల్ల సామాన్యప్రజలే కాక కొంతఆలోచనస్థాయి కలవారుకూడా అదే సత్యమనే భావప్రవాహంలో కొట్టుకొని పోతున్నారు.

## 3

ఈ సాహిత్యాదర్శాలఫలితము ఏమంటే నేడు ప్రబలితంగా ఉన్న కొన్ని కొన్ని భావాలకు ప్రచారసాధనాలుగా నవలలు ఎక్కువ వ్రాస్తున్నారు.

వీటిలో ఎక్కువప్రచారము పొందుతున్నది సామ్యసమాజవ్యవస్థ. ఈ నవలలలో ధనికులు కేవలం రాక్షసులుగాను పేదలు దేవతలుగాను వర్ణింపబడుతున్నారు.

వర్ణభేదము నశించవలె ననే ఆశయంవల్ల వర్ణాంతరవివాహాల కష్టసుఖాలు చిత్రించేనవలలు వస్తున్నవి

స్వాతంత్ర్యము రాకముందు త్యాగమూర్తులుగా ప్రవర్తించిన వ్యక్తులే నేడు అధికారము చేతికిరాగానే స్వలాభమూ స్వాశ్రితపక్షపాతమూ ప్రదర్శించడము కథావస్తు వవుతున్నది.

యువతులు యువకులతోపాటు ఉన్నతవిద్యలు అభ్యసించడము వల్ల ఉత్పన్నమవుతున్న నైతికసమస్యలు- ఇవే ఎక్కువభాగము కథావస్తువులు. దీనికి ఉపాంగ మైనదే యువతులు ఉద్యోగాలు చేస్తూ ఎదుర్కొంటున్నకష్టాలు చిత్రించడము.

తక్కువజీతాలతో పెద్దసంసారాలతో బాధపడుతున్న ఎన్. జి. వో. లూ, ఉపాధ్యాయులూ, వారు పడుతున్న ఆర్థికకష్టాలూ దానితో తరుచుగా ముడిపడుతున్న వరకట్నాలవల్ల వివాహాలలో ఎదురవుతున్నచిక్కులూ;

ఆంధ్రనవలలు ఎక్కువగా ఆంధ్రప్రదేశ జీవితాన్నే చిత్రిస్తున్నవి. అట్లా ఆంధ్రదేశానికే పరిమితం కాక భారతదేశమంతటా- ప్రపంచమంతటిలోవలెనే- అన్నిరంగాలలో నైతికవిలువలు తగ్గినవని ప్రదర్శిస్తూనే భావిశుభసూచకంగా చివరకు ఆదర్శజీవితం గడుపుతున్న కొందరిని ప్రదర్శించిననవల నాదృష్టిలో పడ్డది ఒక్కటే- శ్రీబలివాడ వ్రాసిన 'పుణ్యభూమి'.

నవలాకారులు ముఖ్యంగా నగరజీవితమే వర్ణిస్తున్నారు. పల్లెటూళ్లజీవనం తెలిసి వర్ణించిన నవలల్లో చెప్పదగినవి శ్రీకృష్ణారావు 'కీలుబొమ్మలు', శ్రీ రామ మోహనరావు 'కొల్లాయి గట్టితే నేమి', శ్రీ పాలగుమ్మి 'నల్లరేగడ', శ్రీ పోలా ప్రెగడ 'సంఘం చేసిన మనిషి','దీపశిఖ', శ్రీదాశరథి రంగాచార్య 'చిల్లరదేవుళ్లు' వెనక ఉదాహరించిన 'ఊబిలోదున్న' కూడాను. వీటిలో 'కొల్లాయి గట్టితే నేమి' కొంత సాహిత్యస్థాయిని కూడా అందుకొన్నది.

## 4

స్వాతంత్ర్యానంతరం నవలారచనలో గమనించదగిన విశేషము రచయిత్రులు ఈప్రక్రియను అందుకోవడం. వారిబలగము ఎంత ఎక్కువయినదంటే, కొందరుపురుషులు తమనవలలవ్యాప్తికోనము స్త్రీలపేర్లు పెట్టుకొంటున్నా రనే ప్రథ ప్రబలినది. విమర్శకులు రచయిత్రుల నవలలమీద తగనంతశ్రద్ధ చూప డంలేదు. ఇప్పటికి వచ్చినవి ఉత్తమసాహిత్యస్థాయిని అందుకొన్నవో లేదో చెప్పదలచుకోలేదు. కాని రచయిత్రులకు నవలారచనలో అనుకూలమైన రెండు గుణాలు ప్రస్తావిస్తాను. ఒకటి, వాడుకభాష తెలుగునుడికారం తీరుతెన్నులు వారిలోనే పురుషులలోకంటె ఎక్కువగా నిలిచి ఉన్న దనే సత్యము. రెండవది, అనాదిగా పిల్లల నలరించే కథలు చెప్పేది తండ్రితాతలకంటే అమ్మమ్మలూ నాయనమ్మలే. కథాకథనము స్త్రీలకు ప్రకృతిసిద్ధము. కాబట్టి నవలారచనలో స్త్రీలకు ఉజ్జ్వలభవిష్యత్తు కలదనడానికి సందేహం లేదు.

## 5

ఈ వ్యాసంలో పేర్లు ఎత్తదలచలేను. కాని ఇప్పటికే కొన్ని వచ్చినవి కనుక కొందరు ప్రసిద్ధుల సంగతి టూకీగా ప్రస్తావిస్తాను.

ఎన్నో నవలలు, నాటకాలు, కావ్యాలు, కథలూ వ్రాసిన మన ఆస్థాన కవి శ్రీ విశ్వనాథ అగ్రగణ్యుడు. ఆయన స్వాతంత్ర్యానంతరము నవలలకు పెద్ద కార్ఖానాయే స్థాపించినాడు. ఆయన గ్రంథానుభవమూ లోకానుభవమూ విస్తారమైనవి. ఇంగ్లీషులో ఎన్ని నవలలు చదువుతారో అన్ని ఇంగ్లీషుసినిమాలు చూస్తారని వినికిడి. దృశ్యానుభవమూ, గ్రంథానుభవమూ, స్వానుభవమూ ముప్పేటగా నవలాపరిశ్రమనే అద్వితీయంగా సాగిస్తున్నారు. పురాణవైర గ్రంథమాల నేపాలరాజవంశకథలు, ఇత్యాదులెన్నో రచించారు. శ్రీ కోట వారి గ్రంథాలే సరియైన భారతదేశ చరిత్ర అని వారి విశ్వాసము. పురాణాలలో

చరిత్ర ఎంతో నిక్షిప్తమై ఉన్నదని అందరూ అంగీకరిస్తారుగదా! ఆయన ఏమి వ్రాసినా ఎన్ని వ్రాసినా ఎక్కడో కొన్నితావులలో ఆయన అద్వితీయ ప్రతిభ జ్యోతివలె కనిపించక మానదు.

కథల నవలల పరిశ్రమ పూర్వమే స్థాపించిన మరొకరచయిత శ్రీకొడవటిగంటి. స్వాతంత్ర్యానంతరంకూడా అది సాగుతూనే ఉన్నది. ఆయన పరిశ్రమకు ముడిసరుకు మధ్యతరగతివారి జీవితం. భారతీయభాషలలోగాని పాశ్చాత్యభాషలలోగాని క్లాసిక్సు అనేవి ఆయన చదవలే దనరాదేమోగాని వాటిమీద ప్రత్యయం లేదు. ఆయనకు అభిమానరచయితలు కేవల బుద్ధివైశారద్యం కల ఆధునికులు. శ్రీ విశ్వనాథ ఏమి వ్రాసినా, కవి శ్రీ కొడవటిగంటి అంమకు విరుద్ధంగా కేవల వచనరచయిత, కవితా శత్రువేమో కూడాను! కేవలబుద్ధికి నచ్చేరచనలు హృదయానికి హత్తుకోలేవు. అందువల్ల ఆయనరచనలు చదివినవెంటనే మరచిపోతాము. సాహిత్యానికి శాశ్వతత్వము అవసరలక్షణ మనికూడా ఆయన అంగీకరించరేమో.

రచయిత్రులలో శ్రీమతి లతను మాత్రమే ప్రస్తావిస్తాను, ఆమెకూడా నవలల ఖార్ఖానాఖామందుకనుక. స్వాతంత్ర్యానంతరం శ్రీ చలం మ్యూజింగ్సులో పడిపోయి నవలారచన మానినారు కనుక ఆయనలేనిలోటును శ్రీమతి లత చాలాభాగము తీర్చినవి. ఆమెకు శ్రీ 'చలం' మీద ఎంతో శ్రద్ధ ఉన్నదని ఆమె వ్రాసిన 'కాలం కరచిన కడపట' అనేనవల నిరూపిస్తుంది. 'మోహనవంశి' ఆమె ఊహాప్రపంచంలో ఎంతచక్కగా విహరించగలదో ప్రదర్శిస్తుంది. ఆమెకే మంచి ఆరోగ్యముంటే గొప్ప నవలలు వ్రాయగలదు.

శ్రీ కొమ్మూరిదికూడా చిన్నరకమునవలల కార్ఖానాయే. మధ్యతరగతి జీవితానికి ప్రతీకగా 'పెంకుటిల్లు' పేరుతో వ్రాసిన తర్వాత మామూలుధోరణిలో పడ్డాడు.

మానవతావాదాన్ని అధిగమించి ఆధ్యాత్మిక ప్రపంచంలో అడుగుపెట్టిన కొద్దికాలానికే శ్రీ గోపీచందు కాలధర్మము పొందడము విషాదకరము.

బుద్ధిమంతుల ప్రశస్తిని తరుచుగా పొందుతున్న నవల 'చివరకు మిగిలేది'. దివంగతుడైన బుచ్చిబాబు ఆనవల ఒక్కటే వ్రాసినాడు. అది నేను చదివి చాలాకాలమైనది. నా మనస్సులో మిగిలిఉన్న స్మృతులు ఇవి. 1. నాయకుడు, దయానిధి వృత్తిలో ఉన్నవేశ్యను ప్రేమించి విఫలుడై చివరకు ధనవంతుడై ఆమెను పొందడము. 2. ఆదర్శవంతంగా వైద్యము చేస్తూకూడా

వైద్యవృత్తిలో విఫలుడు కావడం. 3. తన దగ్గర బంధువైన మంచిగృహిణితో ప్రత్యేకసందర్భాలలో ఒకరాత్రి సంయోగం పొందడం. 4. ఆమెకు కలిగిన సంతానం తనదా ఆమెభర్తదా అని వారింటికి పోయి తహతహలాడడము. 5. అకస్మాత్తుగా రత్నము దొరికి ధనవంతుడై రాయలసీమలో పరిశ్రమ స్థాపించి అక్కడ కూడ విఫలుడు కావడమూ ! శ్రీ బుచ్చిబాబు నిస్సందేహంగా విశేష సాహిత్య సంస్కార మున్నవాడు. ఈ నవలలో మనోవిశ్లేషణ ఎక్కువగా జరిగినదంటారు అభిమానులు.

# 6

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత భారతభూమికి పాకిస్థాన్‌తో మూడు సార్లూ, చైనాతో ఒకసారీ, పోర్చుగీసువారితో ఒకటీ, నైజాముతో ఒకటీ యుద్ధాలు సంభవించినవి. చరిత్రాత్మకనవలాకారు లెవరూ ఇంతవరకూ వీటి జోలికి పోలేదు. నిజాముతో యుద్ధానికి పూర్వరంగమైన రజాకర్లఅల్లరి 'మృత్యువునీడల్లో' శ్రీ మహీధర చిత్రించినాడు. ఆనాళ్ళలో వినికిడి ఏమంటే జనము పగలు బాధించే రజాకర్లకుకంటే, రాత్రి బాధించే కమ్యూనిస్టులకు భయపడేవారని. ఇందులో కమ్యూనిస్టులు వహించిన మంచిపాత్రమాత్రమే చిత్రితమైనది. నవలలో అనుభవం వ్యక్త మవుతుంది.

ఈ కాలం వచ్చిన చారిత్రకనవలలలో ఎంతో శక్తిమంతమైనది శ్రీ తెన్నేటి సూరి 'జెంఘిస్‌ఖాన్', భారతదేశపరిధిని దాటినవస్తువును గ్రహించి అద్భుతంగా ప్రదర్శించిన చాలామంచినవల. ఆయన చిన్నతనములోనే దివంగతుడు కావడమువల్ల నవలారచనలో తీరనిలోటు సంభవించినది.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పోటీలు పెట్టి కొన్ని మంచిచరిత్రాత్మకనవలలు ప్రకటించినది శ్రీమతి వసుంధర, శ్రీయుతులు పాటిబండ, ధూళిపాళ్ల, బొడ్డుపల్లి ముఖ్యులు ఈ నవలలు వ్రాసినవారిలో. వాటిలో ఎంతోవైవిధ్యము కనిపిస్తుంది.

అతివినయము ధూర్తలక్షణ మంటారు గనుక ఈ వ్యాసకర్త చారిత్రక నవలలు వదలక ప్రస్తావిస్తాను. స్వాతంత్ర్యానికి పూర్వము కావ్యాలు, నాటికలు, కథలూ వ్రాసి వ్రాసి, స్వాతంత్ర్యానంతరం చరిత్రాత్మకనవలాపరిశ్రమలో చేయిచేసుకున్నాడు. ఇతనిది మొత్తముమీద భారీపరిశ్రమకార్ఖానా. ఒక్కమల్లారెడ్డి వ్రాయడానికే తొమ్మిదేళ్ళు తీసుకున్నాడు. ఇతనికి ఆంధ్రకవులూ, ఆంధ్ర చరిత్రా అభిమానమైనా, ప్రతినవలలోనూ సమకాలికులైన ఇతరభాషాకవులనూ,

ప్రక్క భూములచరిత్రనూమాత్రమే కాక జావా మొదలైన తూర్పుదీవుల ప్రస్తా వము కూడా తెస్తాడు. చారిత్రకనవల అంటే ఇతిహాసకావ్య మని ఇతని నిర్వచ నము.

## 7

తెలుగుదేశము భారతభూమిలో ఒకభాగము. భారతభూమి ప్రపంచంలో ఒకభాగము. ప్రపంచసాహిత్య మనే తరగని వస్త్రపుచుట్టలో భారతీయ సాహిత్యము ఒకతానూ, అందులో ముక్క ఆంధ్రసాహిత్యమూ, నవలా. అన్ని దేశాలలో ప్రక్రియలూ ఒకవిధంగానే ఉంటున్నవి. అన్నిప్రక్రియలూ తెలుగు నవలలోనూ కనబడుతున్నవి. ఇతరసాహిత్యాలతో పరిచయంలేనివాళ్ళకు మాత్రమే తెలుగునవలలలో విశిష్టత కనిపించవచ్చు. నాకు భాషావైశిష్ట్యం మాత్రమే గోచరిస్తున్నది.

నవలాకారులు నవలకూడా సాహిత్యప్రక్రియ అనేమాట గుర్తుంచుకోవలె. కాబట్టి ఉత్తమకావ్యానికి ఏలక్షణా లుండవలె నని ప్రాచ్యపాశ్చాత్యవిమర్శ కులు భావిస్తారో ఆ లక్షణా లున్నప్పుడే నవల సాహిత్యకోటికి ఎక్కుతుంది. లేకపోతే కాస్త సేపు తళుక్కున మెరిసే పత్రికారచనమాత్రమే అవుతుంది. నవల కావ్యవిశేషమే!

నవలారచయిత సమకాలీన జీవితాన్నే చిత్రించనక్కరలేదు. అనంత మైనకాలంలో పదసంవత్సరాలకూ పాతికసంవత్సరాలకూ వెయ్యిసంవత్సరాలకూ ఏమంత వ్యత్యాసంలేదు. కేవలము తర్కబుద్ధితో విశేషించిన ప్యూచరిస్టు మానిఫెస్టో ప్రకారము ఒకవాక్యము పూర్తిగా వ్రాస్తేనే భూతకాలంలో కలిసి పోతుంది. బుద్ధిమంతులు ఎవరూ కాదనలే రామాటను.

నవలకు ఏకాలపు జీవితమైనా కథావస్తువు కావచ్చు! ఏకాలాన్ని ఐనా పైపైగా కాకుండా లోతుగా అవగాహన చేసుకోవలె. లేకపోతే ఛాయాచిత్ర ప్రాయము ఔతుంది. సమకాలీన జీవితము గాఢంగా అవగాహన చేసుకోడానికి ముఖ్యంగా ఋషుల కుండే తపస్సు, మననము, రాగద్వేషాలకు అతీతంగా ఉండే సమదృష్టివంటిలక్షణాలు ఎన్నో కావలె. ఏకాలపుజీవితము అవగాహన చేసుకోడానికైనా అవి అవసరమే కాని సమకాలీన జీవితస్వరూపాన్ని తెలుసు కోడానికి ఆ గుణాలు ఎక్కువపాలులో కావలె. అందువల్లనే సమకాలీనజీవి తాన్ని చిత్రించడానికి యత్నించేవారిరచనలు ఫొటోగ్రాఫులు— మంచివో, చెడ్డవో-గా ఉంటున్నవే కాని అందుకో లేకపోతున్నవి.

సంప్రదాయంప్రకారము వాల్మీకీ వ్యాసుడూ రామాయణమహాభారతాలను జరిగినకాలంలోనే వ్రాసినారు. స్పష్టమైనమాటలు లేవుగాని రామాయణం వ్రాయడానికి పదేళ్ళు పట్టిన దని సూచన లున్నవి. మహాభారతము మూడేళ్ళు రచించినాడట: "ఇట్టిమహాభారతంబు ననేకవిధపదార్థప్రపంచసంచితంబు నుపపర్వమహాపర్వోపశోభితంబు నుపద్వీపమహాద్వీపసంభృతం బయిన భువనం బజుండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోకహితార్థంబు దత్తావధానుండై సంవత్సరత్రయంబు నిర్మించె" నని ఆ గ్రంథమే చెప్పుచున్నది. నాదృష్టిలో మహాభారతము ఇంతవరకు పుట్టిననవలలలో ఉత్తమోత్తమమైనది. నాసంకుచిత దృష్టివల్ల అట్లా అనిపిస్తున్నదేమో అని సందేహిస్తున్న నాకు, హోమరు ఒడిస్సేను ఆంగ్లవచనానువాదము చేస్తూ, ఉపోద్ఘాతములో ఇ.వి. రియూ వ్రాసిన ఈక్రిందిమాటలు ఈమధ్య చదవగా కొంత ధైర్యము కలిగింది.

"The Odyssey, with its well-knit plot, its psychological interest, and its interplay of character, is the true ancestor of long line of novels that have followed it. And though it is the first, I am not sure that it is not still the best."

ఆయన గొప్పగ్రీకువిద్వాంసుడు. మహాభారతము నాయంత శ్రద్ధగా చదివి యుండడు. నేను ఆంగ్లానువాదాలలో ఒడిస్సేను ఐదారుసార్లకు తక్కువ చదవలేదు. అది ఉత్తమనవల అనడానికి నాకు సందేహ మేమీ లేదు. కాని ఉత్తమోత్తమ మైనదనడానికి నేను మహాభారతాన్ని ఎన్నిక చేస్తాను.

నవలాకారులు జీవితాన్ని దత్తావధానులై 'సమ్యగ్దృష్టితో దర్శించి చిత్రించక, ఆధునికజీవితాన్ని పరిమితదృష్టితో చూచి ఛాయాచిత్రాలుమాత్రమే ప్రదర్శించి 'పైపైవన్నెల్ పచరింప వాని దిలకింపంబోరు ధీరోత్తముల్ !'



# తెలుగునవల - సరికొత్త పోకడలు

శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

ఏ భాషాసాహిత్యాలను పరిశీలించినా కథముందు నవల పసిపాపే! తెలుగు నవలకు మైనారిటీ తీరిందా లేదా అనేది యింకా అనుమానమే! తెలుగునవలా వికాసమంతా 1947 తరువాతే జరిగింది. 1947 కు ముందు పూర్వ్యయుగంగా భావిస్తే తెలుగునవల పండితకవులచేతులలోనుంచి వచ్చిన బ్రహ్మపదార్థంలా అవాఙ్మానసగోచరంగా ఉండేది. నిజానికి జాతీయోద్యమప్రభావం 1947 కు పూర్వమే తెలుగునవలపై పడినా స్వాతంత్ర్యం రావటమనేది తెలుగునవలకు ప్రత్యేకంగా ఒరగబెట్టినదేమీ లేదు. రెండవప్రపంచయుద్ధప్రభావం పాశ్చాత్య దేశాలలో క్రొత్తక్రొత్తసాహిత్యధోరణులను సృష్టించింది. ఇండియాకు స్వరాజ్యం రావటమనేదికూడా యుద్ధానంతరపరిణామమే కనుక యుద్ధంవలన వచ్చిన మార్పులన్నీ ప్రజలజీవితంలోనూ వారి ఆలోచనల్లోనూ కనిపించసాగాయి. అయితే ప్రపంచచరిత్రనే తారుమారుచేసిన యీమహాసంగ్రామ పరిణామాల ప్రసక్తే లేకుండా తెలుగులో విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి వంటి రచయితలు "గతకాలమె మేలు వచ్చుకాలముకంటెన్" అనేపద్ధతిలో మొహం తిప్పేసుకొని నవలలు రాసారు. అడవి బాపిరాజుగారినవలలు కూడా యింటిపేరుకు తగ్గట్టే అయోమయంగా ఉండేవి. వీరిరచనలే మీ "తెలుగునవల పోయినసరికొత్తపోకడలు" అనేందుకు ఉదాహరణలు మాత్రం కావు. తెలుగు నవల శ్రీ వీరేశలింగంపంతులుగారు రాజశేఖరచరిత్ర వ్రాసిననాటినుంచి వంకర తిరుగుళ్ళు పోతూ ఉంది. ప్రస్తుతానికి వస్తే నవల వ్రాయటం బ్రహ్మవిద్యేమీ కాదని 1947 తరువాత కలంపట్టిన రచయితలు రుజువు చేశారు. 1947 కు ముందు రాసినరచయితలలో చలం, కుటుంబరావుగారలు చాలాక్రొత్తప్రయోగాలు చేసిచూపారు. చలంరచనలన్నీ ప్రయోగాత్మకాలే. కుటుంబరావుగారు ఎమోష నల్‌గా కాక ఎనలెటికల్‌గా రాయటం, రాని చదివించటం చేసారు. చలం పాత కుణ్ణి ఆలోచింపచేస్తే, కుటుంబరావుగారు పాఠకుడికోసం తనే ఆలోచించి పెట్టేవారు. జాతీయోద్యమప్రభావానికి లోనై వ్రాసినకవిపండితులు దేశభక్తి చాటున దాక్కొని రివైవలిజానికి ప్రాణంపోశారు. చాలామందికవులు రచయితలు

భారతీయ ఆధ్యాత్మికచింతనలో అత్యుత్తమమైన విలువలుగా పరిగణింపబడే వాటిని ఘనంగా కీర్తించి, గతవైభవాన్ని చాటి కీర్తిప్రతిష్ఠ లార్జించుకొన్నారు. వీరికి భావితరంమీద, భవిష్యత్తుమీద చాలా చిన్నచూపు. హేతువాదదృక్పథం అసలే లేదు. శాస్త్రీయవిజ్ఞానాన్ని కూడా హేళన చేసేవారు.

1947 తరువాత దేశంలో అనేకమార్పు లొచ్చాయి. అసలు స్వాతంత్ర్యం రావటం రావటమే దేశాన్ని రెండుముక్కలు చేసి రక్తపాతంతో ప్రారంభమయింది. అయినా మనతెలుగువారు రెండవప్రపంచసంగ్రామంగురించి గాని, దేశవిభజనవలన ఏర్పడినపరిణామాలగురించిగాని చక్కనినవల రాయలేక పోయారు. ఆ రోజుల్లో పత్రికలు పుస్తకాలూ చదవటం అంటే చెడిపోవటం క్రిందే లెక్క. మితవాదదృక్పథం కల తెలుగుకుటుంబాల్లో నవలాపఠనం అంతంతమాత్రంగానే ఉండేది. అగ్రవర్ణాలలో కూడా స్త్రీలకు చాలామందికి చదువుసంధ్యలు పూజ్యం. ఇక తక్కిన్మా జాతులవిషయంలో స్త్రీలూ పురుషులూ కూడా హెచ్చుభాగం నిరక్షరాస్యులే. 1947 తరువాత సెకండరీవిద్యావిధానంలో చాలామార్పులు వచ్చాయి. పూర్వం హైస్కూళ్ళు లేనిగ్రామాలలో కొత్తగా హైస్కూళ్ళు వెలిసాయి. పట్నాల్లో ఉన్న హైస్కూళ్ళు రెట్టింపయ్యాయి. అంటే దీనిఅర్థం చదువుకొనేవారిసంఖ్య పెరిగిందన్నమాట. ఈ పాఠశాలలపెరుగుదలవలన యిదివరకు చదువులేనివర్గాలలో విద్యార్థులు బయలుదేరారు. స్త్రీవిద్యావ్యాప్తి బాగా జరిగింది కానీ చాలామంది అనేక కారణాలవలన మెట్రిక్యులేషన్‌లోపుగానే చదువులకు స్వస్తిచెప్పి వివిధవృత్తివ్యాపారాల్లో ప్రవేశించేవారు. అయినప్పటికీ ఒకమారు చదువుకొన్నతరువాత, జ్ఞానోదయ మయాక మానసికోల్లాసంకోసం, వినోదంకోసం, కాలక్షేపంకోసం, విజ్ఞానంకోసం చదవాలనే ఆకాంక్ష వీరిలో తలయెత్తింది. పాఠశాలతరువాత జ్ఞానదాహం తీరటానికి ఉన్నవి పుస్తకాలూ పత్రికలేకదా—వీరంతా ముఖ్యంగా వినోదంకోసం నవలలు చదవటం ఆరంభించారు. అయితే యీ పత్రికలూ పుస్తకాలూ చదివేవారంతా ఈ మధ్యతరగతిప్రజలే. వీరిఅభిరుచుల కనుగుణంగా రాసే రచయితలు వీరిలోంచే పుట్టుకొచ్చారు. ఈకెరటం వచ్చి పండితకవిరచయితలను ఓ నెట్టు నెట్టింది. సామాన్యంగా చదువుకొన్న పాఠకులు తమకు బోధపడేభాషలో చేసిన రచనలను విశేషంగా ఆదరించారు. చాలామందికి నాడూ నేడూ కూడా పుస్తకాలను కొని చదివేశక్తి లేదు. వీరికోసం సచిత్రవారమాసపత్రికలు నవలలను పుంఖానుపుంఖంగా ప్రచురించటం ఆరంభించాయి. ఒకవిధంగా తెలుగునవలా

వికాసానికి దోహదం చేసినవి తెలుగుపత్రికలే నని చెప్పాలి. తెలుగుపత్రికలు తెలుగునవలకు మార్కెట్‌ను సృష్టించాయి,

నవలాపఠనం ఆరంభంలో కేవలం వినోదంకోసం మాత్రమే. నవలలూ కథలూ చదివి ఎవ్వరూ తమజీవితాలను వెంటనే సరిదిద్దుకోలేరు-కానీ సాహిత్యాని కున్న శక్తి అల్లా ప్రజలభావాలలో మార్పు తేవటంమాత్రమే. రెండవప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్యవాదశక్తులు పతనంకావటంతో దేశంలోని భూస్వామ్య శక్తులు క్షీణించసాగాయి. అయితే ఫ్యూడల్‌శక్తులు రాజకీయంగా బలహీనం కావటం వేరు, సాంస్కృతికంగా పతనంకావటం వేరు. ఫ్యూడల్ వ్యవస్థ నంటి పెట్టుకొనేసంప్రదాయవాదులు తమసంస్కృతిని నిలుపుగొనగలుగుతున్నారు. ఫ్యూడల్‌శక్తులే పాతసంస్కృతిని కాపాడుకొంటూ పెట్టుబడిదారీశక్తులుగా రూపం మార్చాయి. అయితే ఫ్యూడల్‌వ్యవస్థ పెట్టుబడిదారీప్రజాస్వామికవ్యవస్థగా మార కుండానే కమ్యూనిష్టుభావాలు ప్రజల్లో వ్యాపించసాగాయి. ఈపరస్పరభావ సంఘర్షణలమధ్య కొంత అయోమయం ఏర్పడటం సహజమేకదా. మేథావుల్లోనూ రచయితల్లోనూ యీఅయోమయం వెర్రితలలు వేసింది. ఇందువలననే రచయి తల్లో లక్ష్యశుద్ధి లోపించింది. స్వాతంత్ర్యానంతరం జాతికి ఉత్తేజకరమైన ఏకైకలక్ష్యం ఏదీ ఏర్పడనందున ఎవరికి తోచినట్లు వారు వ్రాసారు. కానీ యిదే స్థితిలో తెలుగుసాహిత్యానికి అంతర్జాతీయదృష్టి నాకర్షించిన శ్రీశ్రీ వంటి మహా రచయితలు లేకపోలేదు. తెలుగునవలలలో యీపైనచెప్పినలక్షణాలన్నీ ఉంటూ వచ్చాయి.

మననవలలూ కథలూ నాటకాలూ అన్నీకూడా ప్రజలసమష్టిజీవితాన్ని చిత్రించడానికి మారుగా వ్యక్తులప్రైవేటుగాథలుగా మాత్రమే వుంటున్నాయి. ప్రబంధాలలో చూసినా పూర్వకావ్యనాటకాదుల్లో చూసినా అంతెందుకు నేటిఆధు నికసాహిత్యంలో చూసినా, సినిమాలలో చూసినా తెరంతా నిండి పోయే, పుస్తకాల నిండా పాకిపోయే కథానాయికానాయకులు మనకు కనిపిస్తారు. ఈనాయికానాయ కులే కాక మూసపోసినట్లున్నపాత్రలు విలనే అనీ, కమీడియన్ అనీ, సెకండ్ హీరోయిన్ అనీ మనకు తటస్థపడుతూఉంటారు సాహిత్య కళారంగాల్లో యివి ప్రజలను దగాచేస్తూన్నపాత్రలు. నిజమైనమనుష్యులు వీరిలా ఉండరు. నిజజీవి తంలో ఎక్కడా సంభవంకానిపాత్రలు వీరు. అయితే నల్లమందులా యీవిషం తరతరాలుగా ప్రజల తలకెక్కింది. ఈయంత్రయుగంలో మనిషి నలుసుకంటె అల్పాతిఅల్పమైనప్రాణి. వారిశృంగారజీవితం, వారిప్రైవేటు వ్యవహారాలు

యింతింతలు చేసి సాహిత్యంలో కెక్కించి జనాన్ని చావగొట్టేస్తున్నారు. సాహిత్యం నవలైనా, కావ్యమైనా మరేపుస్తకమైనా చదివినప్పుడు కలిగేది వ్యక్తిగతఆనంద మైనప్పటికీ అది జనంసామూహికజీవితాన్ని ప్రతిబింబించేదిగానే ఉండాలిగాని వ్యక్తులపై వేటు వ్యవహారాలను పెద్దవిచేసిచూపే భూతద్దాల్లా ఉండటం అవసరమా? ఇది చాలాచిక్కుప్రశ్న.

సరికొత్తమార్పు లనేవి జనజీవితంలో వచ్చినంతవేగంగా సాహిత్యంలో ప్రతిఫలించవు. జీవితం మారినంతవేగంగా సాహిత్యపద్ధతులు మారవు. ఏదో ఒక వరవడిని రాసుకొంటూపోయేవారే కనిపిస్తారుగాని క్రొత్తపుంతలు తొక్కిన వారు మహాఅరుదు. ప్రజలకూడా పాతపై మక్కువ హెచ్చు. అవేకథలు వినుగుకొనకుండా పదే పదే చదవటానికి, చదివి ఆనందించటానికి అలవాటుపడ్డారు. వారి క్కావాలసినది పక్కావినోదమే కాని విజ్ఞానవికాసాలు కావు. జగన్నాథుడు రథాన్ని భూమార్గంపట్టించడంలో నేలబారురచనలుకూడా విరివిగానే వచ్చాయి. సాధారణంగా సామాన్యపాఠకుడు ఏరచననయినా ఒకసారిమాత్రమే చదువుతాడు చదువుతూండగానే ఆలోచన కలిగించిందా పుస్తకం ప్రక్కన పెట్టేస్తాడు. ఆనందంతో ప్రారంభమై, ఆనందంతో ముగిసేసుఖాంతాలు వారి కిష్టం. వైగామన సంప్రదాయసాహిత్యంలోకూడా దుఃఖాంతాలు ఏమీలెవు, జీవితంలో విషాదం తాత్కాలికమైనదనీ, దుఃఖాలూ కష్టాలూ సామాన్యమే ననీ వీటిని జయించి బ్రహ్మానందాన్ని పొందటం జీవితలక్ష్య మనీ మనపూర్వులు చెప్పారు. ఆకారణం చేత మనకు విషాదాంతకావ్యా ల్లేవు. తరతరాలుగా మనప్రజలమనసులపై ఈ ఆలోచనా విధానంయొక్క ప్రభావం పనిచేసి నేటికికూడా కష్టాలు గడచి అందరూ అందర్నీ క్షమించేసి అంతా సుఖంగా ఉండే యితివృత్తాల్నే సామాన్య పాఠకులు, లేదా ప్రేక్షకులు చదివి, చూసి ఆనందించడానికి అలవాటుపడ్డారు.

మరొక విషయం— జీవితం అనేది ఏ సూత్రానికీ ఏ పద్ధతులకీ కట్టుబడి ఉండదు. అది ఒక మహాప్రవాహం. చాలా అసంబద్ధంగా అర్థంపర్థం లేనట్టు ఉంటుంది. నిజానికి హీరోలూ ఉండరు. విలన్‌లూ ఉండరు. ఈ మహాప్రపంచంలో మనిషి చాలా ఒంటరివాడు. అతడి బాహ్యజీవితం ఎంత అసంబద్ధంగా ఎంత అయోమయంగా ఉంటుందో అతడి లోపలి ఆలోచనాప్రపంచం అంతకంటే గందరగోళంగా ఉంటుంది. మనిషి లోపలిప్రపంచం మనిషిలోపలి ఆలోచనలకూ ఏఏ మోటివ్స్ కారణమౌతాయో ఊహిస్తే చాలా ఆశ్చర్యంకలుగుతుంది. సుషుప్త్యావస్థలోకూడా మనిషికి ఆలోచనలు, కలలు, భావాలు కలుగుతూ

వుంటాయి. మనిషి లోపలిమనిషి గురించి తెలుసుకొనకుండా బయటిమనిషిని గురించి వ్రాయటం అసహజమూ అవివేకమూ కాదా? మన ప్రాచీనసాహిత్యంలో కాని, నిన్న మొన్నటి వరకూ వచ్చిన రచనల్లోకానీ మనిషిలోపలి ప్రపంచాన్ని స్పృశించి బయటపెట్టినవారు లేరు. ఇటువంటి దుర్భరమైన జీవితం గడుపు తున్న మనిషిని రంగులకలలలోకి విసిరివేయటం అసహజమైన అవాస్తవిక మైన సంఘటనలను చిత్రించి వైవేటు వ్యక్తుల్ని గొప్ప హీరోలుగా చలామణీ చేయటం సాహిత్యకళారంగాలలో దగాచేయటం క్రిందే లెక్క.

1947 తరువాత క్రమక్రమంగా పత్రికలు పెరగటంతో పాఠకులసంఖ్య అధికం కావటంతో మధ్యతరగతివారికి సరదాగా చదువుకునేందుకు పత్రికలు విడవకుండా ధారావాహికంగా నవలలను ప్రచురించటం ఆరంభించాయి. అయితే పత్రికలలో వచ్చే నవలలకు కథాకథన చాతుర్యంకంటే సస్పెన్స్ ప్రధానం. అంటే ముందేమి జరుగుతుంది అనేటువంటి ఉత్కంఠను పాఠకుల్లో కలిగించాలి. భాష చాలా సులభంగా ఉండాలి. వర్ణనలు స్వగతాలవంటివి పేజీలకు పేజీలు ఉంటే వారు చదవరు. సంభాషణలు హెచ్చుగా ఉన్న రచ నలు చదవటానికి వారు యిష్టపడతారు. నరేషన్ ఎంత తక్కువగా ఉంటే అంత మంచిది. సంఘటనలు ఒకటివెంట ఒకటి జరుగుతూ ఉండాలి. కథా నాయకుడు కథానాయిక వీలైనంత మంచివాళ్లుగా ఉంటూ వీలైనన్ని కష్టాలు పడుతూ "అయ్యో పాపం" అనిపిస్తే చాలు. వారి శృంగారజీవితంగాని, వారి విలాస జీవితాన్ని గాని ఆదర్శవంతమైనదిగా ఊహించుకొని తామే ఆయా పాత్రల మనుకొని తాదాత్మ్యం చెందుతున్నారు ఒక నవల విజయవంతం కావ డానికి హెచ్చుమంది పాఠకులు ఆ నవలల్లోని పాత్రలను తమకు సన్నిహితమై నవిగా గుర్తించగలిగితే చాలు. 1947 ముందు వచ్చిన రచనల్లో (Didactic) డైడాక్టిక్ ధోరణి హెచ్చుగా ఉండేది. నేటి పాఠకులు అనగా 1947 తరువాత Novel of Ideas కంటే Novel of Action ని హెచ్చుగా ఆదరిస్తు న్నారు.

1947 తరువాత వచ్చిన ఆధునిక తెలుగు నవల మధ్యతరగతి కుటుంబ జీవితాన్ని విపులంగా చూపించింది. ఈ మధ్యతరగతి కన్సర్వేటివ్ కుటుంబాల్లో సమిష్టి కుటుంబ జీవిత విధానాన్నే ఆదర్శంగా నిలబెట్టడానికి ప్రయత్నం చేసింది. కుటుంబంలో యజమాని అనగా పెద్ద అన్నగారుగాని తండ్రిగాని చేసే త్యాగాలూ కుటుంబంలోని యితర సభ్యులకొరకై, ముఖ్యంగా ఆడపిల్లల వివా

హాలకొరకై వారు పడే తాపత్రయం, కష్టాలూ గ్లోంఫైచేసి చూపటం జరిగింది. ఈ కుటుంబాల్లోని తోడికోడళ్లు వదినలూ పెద్దతరం స్త్రీలూ సమిష్టి శ్రేయస్సు కొరకై తమ వ్యక్తిగత స్వార్థాలను విడనాడటం ఆదర్శంగా వ్రాశారు. కాని యిదే సమయంలో ఆలనాటి ఆధునిక యువతీ యువకుల ప్రేమకలాపాల దగ్గరకు వచ్చేసరికి మితవాదదృక్పథం గల సమాజానికీ, వ్యక్తులకూ మధ్య సంఘర్షణ మొదలై అది కాగితాల మీదకు ఎక్కి పాఠకులను తలక్రిందులు చేయటం ఆరంభించింది. ప్రేమకథలు నిజానికి వ్యక్తుల ప్రైవేటు గాథలే కాని వాటిలో సమాజానికి వ్యక్తులకూ మధ్య పోరాటం ఉండటం వలన అవి ఆధునికపాఠకులను విశేషంగా ఆకర్షించాయి. చాలామంది రచయితలు ప్రేమవివాహాలను కాగితాలమీద ప్రోత్సహించారేకాని నిజజీవితంలో—యింత చిన్న విషయంలో సమాజం రాజీపడలేదనీ, కులమత వర్గ విభేదాలనుంచి ప్రేమవివాహాలు చేసుకొన్న దంపతులను కాపాడటం అసాధ్యమని చెప్పటం వారి కెక్కువ ఇష్టంలేకపోయింది. చాలామంది రచయితలు సగం నిజాన్ని మాత్రమే ఎప్పుడూ బయటపెట్టేవారు.

ఈ కాలంలో వచ్చిన నవలల్లో మరొక విశేషముంది. చాలామంది రచయితలు అగ్రవర్ణాలకు చెందినవారు కావటంచేత, అందులో ముఖ్యంగా బ్రాహ్మణ కులానికి చెందినవారు కావటంచేత మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబాల జీవితమే నవలల్లో ప్రతిబింబించసాగింది. ఈ విషయం ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే మైనారిటీవర్గానికి చెందిన జీవితం నవలలకు వరవడియై కూర్చుంది. ఇందులో తప్పేమీ లేదు. మన సమాజ జీవితంలో ఆచార వ్యవహారాలలో నైతేనేమి, సంబంధ బాంధవ్యాల విషయంలో నయితేనేమి, మతపరమైన పుణ్యకార్యాలవిషయంలోనైతేనేమి హిందూమతంలో బ్రాహ్మణులు నిర్దేశించిన ప్రమాణాలే జీవనప్రమాణాలుగా అందరూ అవలంబిస్తూండటం చేత కులం ఏదైనా ఆ పద్ధతులు అందరకూ నచ్చి, ఆదర్శవంతమైనాయి. బ్రాహ్మణాధిక్యతను సమాజంలోని యితర వర్ణాలవారు నిరసించినప్పటికీ తెలిసో తెలియకో బ్రాహ్మణసంస్కృతినే ఆరాధిస్తూ వచ్చారు. ఈ ప్రభావమే యితర వర్గాలనుంచి కులాలనుంచి రచయితలు వచ్చేవరకూ ప్రజలను సాహిత్యపరంగా సమ్మోహితులను చేసినమాట మాత్రం వాస్తవం. భాషవిషయంలో కూడా బ్రాహ్మణులు వాడే భాషనే వ్యావహారికంలో ప్రామాణికం చేసుకొన్నారు, హైందవ సంస్కృతినుంచి బ్రాహ్మణ సంస్కృతిని వేరుచేసి చూడటం సాధ్య

మయ్యే విషయంకాదు. మిగతా కులాలనుంచి వచ్చిన కవి పండితులు రచయితలు నైతం తమ రచనలను సాటికులంవారు మెచ్చుకొన్నదానికంటే బ్రాహ్మణ పండిత కవులు మెచ్చుకొని శ్లాఘిస్తే అందలమెక్కినట్లు సంతోషించేవారు. ఈ విషయమైన ప్రస్తావన స్వర్గీయ గోపీచంద్‌గారి "చీకటి గదులు" చదివితే తెలుస్తుంది. ఐరోపాలో చర్చ్ సామాజిక జీవితాన్ని కంట్రోల్ చేసినట్టుగానే మనదేశంలో బ్రాహ్మనిజం సామాజికజీవితాన్ని క్రమబద్ధం చేసింది. ఈ ప్రభావం మంచిదా చెడ్డదా అన్న ప్రశ్న లేదు. దానిని తప్పించుకొని జీవించటానికి భిన్నమైన కొత్త సంస్కృతి ఏదీ యింకా ఏర్పడలేదు. ఈ కారణంచేతనే ఆంధ్రదేశంలోని వ్యక్తుల ప్రైవేటు జీవితాలు ఒక రకంగానూ, బాహ్యజీవితాలు వేరొకరకంగానూ ఉంటూ వచ్చాయి. అగ్రవర్ణాలవారికి సమాజంలోని అట్టడుగు ప్రజలకు సాంస్కృతికంగా బలమైన సంబంధాలు లేవనే చెప్పాలి. ఈ ఎక్కువ తక్కువలు మన సామాజిక ప్రగతిని చాలా కృంగదీశాయి. ఆర్థికంగా బలపడిన వర్గాలుకూడా సాంస్కృతికంగా ఎంతో వెనుకబడి ఉంటూ వచ్చాయి.

ఇంత వివరంగా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే నవలలో కొన్ని పాత్రలను స్వీకరించినప్పుడు అవి ఏకులానికి చెందితే ఆ కులానికి చెందేవర్గం తాలూకు ఛాయలు రచనలో రాకపోయినట్లయితే అపాత్రలు గాలిలో తేలిపోయి అవాస్తవికమైనవిగ రూపొందుతాయి.

ఆ విషయం అలాఉంచితే—రచయిత ఏకులానికి చెందినప్పటికీ నవలా సాహిత్యంలో ఎక్కువ మధ్యతరగతివారి జీవితంమాత్రమే చిత్రితమయింది. వర్గస్వభావా న్ననుసరించి మధ్యతరగతి పాలకవర్గానికి కొమ్ముకాయటం సహజం. ఈ కారణంచేత మధ్యతరగతిరచయితలు ఏవర్గంగురించి రాసినా తమవర్గస్వభా న్ననుసరించి తాము ఎవరికి నమ్మినబంట్లో తేల్చుకొని మరీ రాస్తారు. ఈసూత్రానికి కట్టుబడని ఉదాహరణలు ఉంటే ఉండవచ్చు.

మనదేశంలో కవులకు పండితులకు ఉన్నగౌరవం మర్యాద రచయితలకు లేదు. అందులో కవిత్వం గాకుండా ప్రోజ్ రాసేవారిని ఎవరూ పెద్దగా లెక్కచేసేవారు కాదు. కాని తెలుగులో యిప్పుడు వచనరచన రాజ్యం ఏలుతోంది. దీనికి కారణం పత్రికలు. తెలుగులో కథ-నవల, పాఠకులవిశేషాభిమానాన్ని చూరగొంటున్నాయి. ఈ పరిణామం 1947 తరువాతే వచ్చింది. మనదేశంలో మన భాషలో వచనరచన యింతగా వ్యాప్తిచెందటానికి మేతరుకోసం నోళ్లు తెరచికొని అరిచే ముద్రణాయంత్రభూతాలే కారణం. ఒకవైపున రాక్షసియంత్రాలూ, మరొక

వైపున అసంఖ్యాకమైన పాఠకజనం వినోదంకోసం కాలక్షేపంకోసం నవలలు కథలూ కావాలని డిమాండు చేస్తున్నారు. "అవసరార్థం అక్షతాం సమర్ప యామి" అన్నట్లు రచయితలు వ్రాయకతప్పటంలేదు. అంటే దీనిఅర్థం మన సాహిత్యం మాస్ ప్రొడక్షన్‌స్థాయి చేరుకొంది. రైసుమిల్లులు, బట్టలమిల్లులు, జనపనారమిల్లులు, చెరకుమిల్లులు పనిచేసినట్లుగానే భారీముద్రణాయంత్రాలు కూడా వారంవారం నెలనెలా యింతరొద్ద పడకొస్తున్నాయి. యంత్రయుగ స్వభావా న్ననుసరించి మాస్‌స్కేలుగా నవలలు కథలు వస్తున్నాయ్ కాని యీ యుగంస్వభావాన్ని యీసమాజస్వరూపాన్ని అవి సరిగా చిత్రించటంలేదు. రచయితలు గతంతాలూకు చూరుపట్టును వేలాడుతున్నారు. రేపటిప్రపంచం ఎలా ఉంటుంది ? ఈవేళ మనం ఎటువంటిప్రపంచంలో జీవిస్తున్నాము ? ఇప్పటి ప్రపంచంగురించే మనకు సరిగా తెలియకపోతే రేపటిప్రపంచం మనకు తెలి యదు. తెలుగునవల యీ సంగతులనుగురించి పట్టించుకొనకపోతే దానికి భవిష్యత్తు లేదు. జీవితం అనుక్షణం మారుతున్నది. మారుతున్నజీవితాన్ని మారుతున్న విలువలను ప్రతిబింబింపని తెలుగునవల నిష్ప్రయోజనం !

నవల అనగానే నవ్యతను స్పర్శించేది అని అర్థం. అంతమాత్రంచేత క్రొత్తగా వ్రాసిన ప్రతినవల సరిక్రొత్తనవల కాదు. నలుగురు నడచినబాటను పోవటం తేలిక. ఒకకొత్తమార్గంగుండా ఒకకొత్తలక్ష్యాన్ని చేరుకోవటం సాహసమైనప్రక్రియ. నవలారచనలో కొత్తపోకడ లనేవి చాలా అరుదుగా సంభ విస్తూంటాయి. ఒకగొప్పరచన చేసి గొప్పరచయిత అవుతారు. ఒకగొప్ప రచయిత ఒకగొప్పరచనను చేస్తారు. ఆతరువాత అదేమూసలో అనేకమంది అనేకరకాలరచనలు చేస్తారు. తెలుగులో వచనరచనావికాసం చాలాలేటుగా ప్రారంభమయినందున తెలుగునవలావికాసం పరిమితమైన పరిధిలో దారీతెన్నూ తెలియక కొట్టుకొంటూ వచ్చింది. రచనలో కొత్తపోకడలు అనగానే రచనా విధానానికి సంబంధించినవా లేక వస్తువుకు సంబంధించినవా అనేసందేహం కలుగుతుంది. రచనావిధానంలో చాలామార్పు వచ్చింది. రచనావిధానంలో వచ్చినమార్పు కొన్నిసందర్భాలలో ఎంతబలీయమైనదంటే అది నవలకు సంబంధించిన యితరసంప్రదాయాలను సైతం ద్రుళ్ళగొట్టగలిగింది. చెప్పేపద్ధతి చేత చదివించగలరచనలు కొన్నివచ్చాయి. రచయిత అభిప్రాయంలో ఏకీభవిం చనివారుసైతం ముగ్ధులై చదువుతున్నారు. ఇక్కడ మరొకవిషయం ప్రస్తా వించాలి. రాజకీయాలలో వామపక్షరాజకీయాలకు బలం వచ్చింది. అవిధంగానే

సాహిత్యంలోకూడా వామపక్షసిద్ధాంతాలను సూత్రాలను సమర్ధిస్తూ చేసేరచనలకు ప్రాచుర్యం హెచ్చుగా ఉన్నది. ఈనాడు అభ్యుదయకరమైన, విప్లవకరమైన అభిప్రాయాలను వెలిబుచ్చుతూ వామపక్షధోరణులకు బలంచేకూరుస్తూ వ్రాసే నవలలకు మన్నన ఎక్కువ. అయితే రాశిలో-వీటిసంఖ్య స్వల్పంగానే ఉంటు న్నది. ఈ వామపక్షవాదరచనల్లో తీవ్రవాదధోరణి, కసి, తిరుగుబాటుతత్వం ప్రధానం. కానీ యీకొత్తపోకడలను ప్రతిఘటిస్తూ యథాతథవాదాన్ని సమర్ధిస్తూ రివైవలిజానికి ప్రాణంపోస్తూ నవలలు, సెంటిమెంట్లతో, మేలోడ్రామాతో సినిమాటిక్ సంఘటనలతో అసంఖ్యాకంగా వస్తున్నాయి. నిజానికి యీసమయం "రైట్ వింగ్ లిటరేచర్"కి అనుకూలంగా లేదు. కానీ రాజకీయాల్లోనూ, సమాజజీవితాల్లోనూ వచ్చినంతవేగంగా మార్పులు సాహిత్యంలో, కళల్లో ప్రతిబింబించవు గనుక పలాయనవాద ధోరణి నవలలే ఎక్కువఆదరణ పొందు తున్నాయి. ఇది నిజంగా దురవస్థే. క్షీణయుగపు సంస్కృతిని సాహిత్యంలో ప్రాణంపోసి నిలబెట్టా లనుకొన్నా అది పిండిబొమ్మే. కానీ లక్ష్యశుద్ధి వివేచన లేనివ్యాపారదృష్టికల రచయితలు, కళాకారులు విప్లవంద్వారా సాధించవలసిన సామాజికపరిణామాలను వ్యక్తిగతమైన చివలరీ (పరాక్రమము), హీరాయిజమ్ ద్వారా పొందడం సాధ్యమైనట్లు వక్రంగా చిత్రిస్తున్నారు సమాజంలోని స్త్రీల సమస్యలకు వ్యవస్థలో మౌలికమైన విప్లవాత్మమైన మార్పురానిదే పరిష్కారం అసంభవమని తెలుసుకొనలేక వ్యక్తుల మంచితనంవలన పరిస్థితులు చక్కబడతా యనే భ్రమలను నవలలద్వారా చాలామంది కలిగిస్తున్నారు. అయితే విప్లవాత్మక ధోరణిలో రచనలు చేసేవారు మరొకపొరపాటు చేస్తున్నారు. వర్గస్వభావంచేత మొత్తం ఒకప్రత్యేకవర్గానికి చెందిన మనుష్యులందరినీ కట్టగట్టి మంచివారు గానూ, చెడ్డవారిగానూ చిత్రిస్తున్నారు. ఇది ప్రమాదకరమైన పిడివాదధోరణి. సంప్రదాయసంస్కృతిని ఎంతవరకు వ్యతిరేకించాలి (లేదా) పూర్తిగా వ్యతి రేకించాలా అనేది చిక్కుప్రశ్న. దీనికి జవాబు తేలకుండా ఆదర్శవాదధోరణిలో ఊహించి కల్పనలు చేయటం చాలాప్రమాదం!

తెలుగునవల తెలుగువారిమధ్యతరగతిజీవితాన్ని యథాతథంగా ప్రతిబిం బిస్తున్నదా అనేదికూడా సందేహమే. కానీ వెనకటికీ యిప్పటికీ రచయితల సంఖ్య రాశిలో పెరిగింది. మరొకవిశేష మేమంటె యిపుడు నవలలు వ్రాస్తున్న వారు హెచ్చువిద్యావంతులు కారు. పండితులైనవారే రచనలు చేయాలి అనేనియ మాన్ని త్రోసివేస్తారు. అసంఖ్యాకంగా నవలలు వ్రాస్తున్న యువరచయితలు

చాలామంది మిడిమిడిజ్ఞానం కలస్త్రీలూ, యువకులూ. నవల సామాన్యపరిజ్ఞానం కలవారిచేతుల్లో ఉంది. అందుచేత అంతా ఒకేగాడిలో రాసుకుపోతున్నారు. అభూతకల్పనలూ, అసహజమైనవిషయాలూ, ఆకాశంమీద తప్ప భూమిమీద నిలబడనిమనుష్యులూ, లోపభూయిష్టమైనరచనావిధానం విరివిగా వ్యాప్తిలో కొచ్చింది. అయితే గొప్పరచయితలనుగాని, గొప్పరచనలనుగాని విశ్వవిద్యాలయాలు సృష్టించలేవు. వారు అనుకోనిచోటునుంచి ఆకస్మికంగా పుట్టుకొస్తారు. ఈ యిరవయ్యోశతాబ్దపు ఉత్తరార్థంలో రచనలోనూ భాషలోనూ వస్తువులోనూ శైలిలోనూ అనంతమైన వైవిధ్యాన్ని ప్రదర్శించి కొత్తపోకడలు పోయిన రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి. ఆయన రాసిన "అల్పజీవి" అపూర్వమైన కొత్తనవల. మళ్ళీ ఇటీవల విడుదలైన "రాజు-మహిషి-" అంతకంటె సరికొత్త పోకడలు పోయిన గొప్పఅసంపూర్ణ మహాకావ్యం.

ఒకవందసంవత్సరాలు పోయింతర్వాత తెలుగుజీవితంగురించి తెలుసుకోవాలంటే "రాజు-మహిషి" ఉపయోగపడినట్లు మిగతానవలలేవి ఉపయోగపడవు. కన్యాశుల్కం నాటకాన్ని మించిన నాటకం ఇంతవరకూ రాలేనట్లే "రాజు-మహిషి"ని మించిన నవలకూడా యిప్పటిప్పట్లో రావటం అసాధ్యం. మళ్ళీ ఏ భగీరథుడో వచ్చి ఆకాశగంగను తెచ్చి పాతాళంవరకూ ప్రవహింపచేస్తేనే తప్ప తెలుగునవలకు పుణ్యగతులు లేవుగాక లేవు. తెలుగు వచనంపేరు చెబితే రాచకొండ విశ్వనాథశాస్త్రిపేరు చెప్పితీరాలి. ఒక్కొక్కయుగానికి అరడజనుమంది యుగకర్త లంటూ ఉండరుకనుక యింత నిర్మొహమాటంగా రాయాల్సవచ్చింది.



''రచనలో వస్తువును మించిన గౌరవం
రూపాలు పొందటం ఒప్పను.
బ్రతుకులో లేనిదాన్ని ఉత్ప్రేక్షలో ఊహించి
గొప్పగా వర్ణించి చెప్పను.
నిజం చెప్పలేని పుస్తకసమీక్షల
పూలదండలకు మెడలువంచను.
బ్రతుకుకావ్యాల రసౌచిత్యాలు చర్చించే విమర్శనలో
వ్యక్తిదూషణం, మతకలహాలు పెంచను.''

—కుందుర్తి

# తెలుగునవల - సామాజిక దృక్పథం

డా. అక్కిరాజు రమాపతిరావు

"Karl Marx stated that if one chose to be an ox, one could of course turn one's back on the agonies ot mankind and look after one's own skin".

'I know ot no literature the oxen have made. The making of fine literature is not an easy task, man alone does it, and he must stand erect, with his head held high.'" (Page 79- Literature and Reality by Howard Fast- People's Publishing House - 1952).

సామాజిక దృక్పథం లేని రచనలు ఉత్తమసాహిత్యం కిందికి రావు అని పై వాక్యాల సారాంశంలాగా అనుకోవచ్చు. తాను జీవించిన కాలంలో తన చుట్టూ ఉన్న మానవప్రపంచాన్ని వదిలిపెట్టి, త్రైకాలికంగా నిలబడేరచన చేస్తాననికాని, చేశాననికాని ఏ రచయితైనా అంటే అది వెర్రితనంకింద లెక్కే. ఉత్తమసాహిత్యంలో ఎప్పుడూ మనుషులూ, వాళ్ళసమస్యలూ, సంఘర్షణలూ, కనపడాలి అంతేకాని అభౌమమైన సంఘటనలు, ఆత్మానందానుభూతులూ, ప్రధానంకాదు. ఆత్మానందాన్ని, అపరోక్షానుభూతినీ, సాహిత్యంద్వారా దర్శించడం, అంటే సాహిత్యపరిధి కుంచించుకొని పోయి వైయక్తికమైపోతుంది. ప్రధానంగా ఏ కళాస్వరూపమూ, ప్రయోజనమూకూడా అది కాదు. సాహిత్య ప్రయోజనం అసలు కానేకాదు.

ఉత్తమ రచయిత ఎవరైనా, తన రచనద్వారా, తాను కోరే సమాజస్వరూపావిష్కృతికి పూనుకొంటాడు. గతకాలపు మానవ చరిత్రను, వర్తమాన పరిస్థితులను, తెలుసుకోకుండా, ఏ ప్రయోజనాన్నీ ఉద్దేశించకుండా, కేవలం ఆత్మాశ్రయంగా 'నవ్వివోదురుగాక నా కేటిసిగ్గు, నా ఇచ్ఛయే గాక నా కేటివెరపు' అనుకోవడం, ఏ రచయిత విషయంలోనైనా, అందునా ముఖ్యంగా కవిత్వం వదిలేసినా, కాల్పనిక రచనావిషయికంగా, పొరపాటు అని చెప్పాలి. పూర్వాలంకారికులను దృష్టిలో పెట్టుకొన్నా కూడా యశస్సూ, అర్థమూ, మనుషుల

సుఖదుఃఖాలను, అనుభూతులను, ఆకాంక్షలను విడిచిపెట్టి, కవి సాధించ గలుగుతాడా? సాధించలేడు. కాబట్టి మానవుడు, మానవజీవితము, ఉత్తమ సాహిత్యపు విలువలని చెప్పుకోవాలి. అయితే దేశకాలపరిస్థితులు, అన్నిరంగాలను ప్రభావితం చేసినట్లు సాహిత్యావగాహన విషయంలో కూడా, ప్రభావాన్ని తప్పక చూపుతాయి.

ప్రపంచ సాహిత్య చరిత్రలోనే కవిత్వ ప్రాభవం క్రమేపీ పలచబడి పోతూ వచ్చిన తరవాతగాని వచనం విజృంభించలేదు. ధనస్వామ్యానికి స్వస్తి చెప్పి ప్రజాస్వామ్యం అనేకదేశాలలో ఆరాధ్యమవుతున్నట్లు, పాతకాలపుకవిత్వ భూస్వామ్యవ్యవస్థ నశించి, వచనవికాసం యీ శతాబ్ది సాహిత్య ప్రధానలక్షణ మైంది.

తెలుగునవల పుట్టి నూరేళ్ళు గడిచాయి. ఈ నూరేళ్ళలో కొన్నివేల నవలలు వెలువడి వుండవచ్చు. అయితే సమాజాన్ని అత్యంతమూ ప్రభావితం చేసిన రచయితలను, ముఖ్యంగా నవలారచయితలను, వేళ్ళమీదనైనా ఎన్నాలంటే కష్టమే అవుతుంది. నూరు మంచినవలలను ఎంచడమైనా కష్టమే అవుతుంది.

స్వాతంత్ర్యం రాకపూర్వపు సమస్యలు వేరు. అవగాహనలు వేరు. ఆదర్శాలు, అనుభవాలు, వేరుగా వుండేవి. మేధావివర్గంలో, పారతంత్ర్యమే దేశంలోని అన్ని అనర్థాలకు మూలకారణ మని అభిప్రాయం వుండేది. స్వాతంత్ర్యకాంక్షను దేశీయులలో ప్రోజ్వలింపజేయటమే రచయితల, కళాకారుల, మేధావి వర్గాల ప్రధానాశయంగా వుండేది. దేశంలోని అంటరానితనం, అవిద్య, చేతిపనులన్నీ క్షీణించి ఆర్థికంగా బలహీనపడటమూ, సామాజిక దృక్పథం కల రచయితలను కలవరపెట్టాయి. స్వాతంత్ర్యం రావటానికిముందు పాతిక సంవత్సరాల తెలుగుసాహిత్యాన్ని పరిశీలించిచూస్తే, చారిత్రక నవలలలైనా సరే, ఆత్మాశ్రయ కవిత్వ మైనాసరే, నాటకమైనా సరే, పారతంత్ర్యాన్ని నిరశించడమూ, స్వేచ్ఛను కీర్తించడమూ, మన సమాజంలో కనపడే లోపాలను సరిదిద్దుకోవాలన్న ప్రబోధమూ కనపడతాయి. 'మాలపల్లి' ఇందుకు చక్కని ఉదాహరణ. సామాజికదృక్పథంతో వెలువడిన తెలుగునవలల్లో ఉత్తమోత్తమ స్థానం 'మాలపల్లి' కే దక్కుతుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పరిస్థితులన్నీ మారిపోయినాయి. ప్రజల దృక్పథం మారిపోయింది. అంతకుపూర్వంవలె కాకుంటా సాంఘిక సమస్యలు

కొత్తవి ఎదురైనాయి. స్వాతంత్ర్యం, సమభావం, స్నేహార్ద్రం, పునాదులై ఇళ్లలేచి, జనావళికి శుభం పూచి, 'శాంతి, శాంతి, కాంతి, కాంతి' అన్న కవివాక్యం రిత్తఅయిపోయింది. పారిశ్రామికవేత్తలు, పెట్టుబడిదార్లు, బలం బాగా పుంజుకొన్నారు. బలహీనవర్గాలకు స్వాతంత్ర్యం, సమానత్వం లభించలేదు. మధ్యతరగతి ప్రజల్లో సంస్కారం పెరగలేదు. అల్పాదాయ వర్గాలవారిలో అసంతృప్తి పెరిగిపోయింది. అందువల్ల, సంఘర్షణలు, ఉద్రేకాలూ, అనివార్యమైనాయి. స్వతంత్ర భారతంలో ఏమీ సాధించింది లేదు. అంతా అల్లకల్లోల మేనా అంటే, అట్లా అనకూడదు. ప్రజాస్వామ్యంలోను, ధనికవర్గాలలోను. సామాజిక దృక్పథం లోపించడంవల్ల మేధావివర్గాలవారిలో విలాసజీవనము, స్వార్థపరత్వము, త్రాగుబోతుతనము, ఎక్కువ కావడంవల్ల, దిగిరాను దిగిరాను ఊహాలోకపు దంతభవనాల మందిరాలనుండి, అనే ఒకానొక దృక్పథం, సమర్థులు, సరిదిద్దవలసినవాళ్ళు అయినవారిలో ప్రబలడంవల్ల యీ సమస్యలన్నీ ఉత్పన్నమైనాయి స్వతంత్రభారతంలో.

ఇటీవల రచయితకు సామాజిక దృక్పథం ఉండాలి కమిట్‌మెంట్ వుండాలి అన్న అభిప్రాయాలు, నినాదప్రాయంగా వినపడుతున్నాయి. మళ్ళీ యీ సిద్ధాంతాలను ప్రతిపాదిస్తున్న నినాదాలను మార్మోగిస్తున్న మేధావి వర్గాలలోనే చిత్తశుద్ధి, అసలు సమస్యల అవగాహన, ఉన్నట్లు కనిపించడంలేదు. ధనికులందరిని మట్టుపెట్టండి, వర్తమాన సామాజిక వ్యవస్థను సమూలంగా నిర్మూలించండి, అని వ్యక్తావ్యక్త ప్రేలాపనలే 'కమిటెడ్ రైటింగ్స్' అని ఒక వర్గంవారు భావిస్తున్నట్లుగా కనపడుతున్నది. ఒక పెద్ద వ్యాపారస్తుడు, పెట్టుబడిదారు, అధికారాన్ని, పలుకుబడిని తన గుప్పిటలో ఇరికించుకొని సమాజవిద్రోహాన్ని ఏ విధంగా కొనసాగిస్తున్నాడో, పదివేలు పారేసి పర్మిట్ సంపాదించుకొని, పంచదారను బ్లాక్‌మార్కెట్‌లో అమ్ముకొనే చిన్నవ్యాపారస్థుడు, అదే స్థాయిన సమాజవిద్రోహకార్యకలాపాలకు పూనుకొవడంలే దని చెప్పగలమా? ఈ దేశంలో తప్పుడు తూకాలు, కొలతలవల్ల వ్యాపారస్తులు, సాలుకు పదిహేనువందల కోట్లు అక్రమ లాభాలు ఆర్జిస్తున్నట్లుగా నిపుణుల అంచనాలవల్ల బయటపడిందికదా. ఆదాయంపన్ను వసూలుకాక ఆరువందలకోట్ల బకాయిలున్నాయని పేర్కొనడం జరుగుతున్నదికదా, వీధివీధికి బ్రాందీషాపులు వెలుస్తున్నాయికదా, ఖరీదైన మద్యం తాగేవాడు, సంఘవిద్రోహి అని ఎందుకు మీరు కేకలు పెట్టరు? ఈ వ్యవస్థనెవరు పోషిస్తున్నారు? వ్యభిచారమూ, తాగు

బోతుతనమూ లేకపోతే ఆ క్రమలాభాలెందుకు? అధికార్జనలెందుకు? మేం ముక్కు మూసుకొని, తాపసుల్లాగా కూచోలేము. ఉద్రేకాలు, వినోదాలు, ఆనందరస స్థాయిలూ మాకు కావాలి. ఏ సమాజమూ వీటన్నిటినీ వర్జించి ఇదివరలోలేదు. ఇకముందు ఉండదు అంటారా? సమాజంలో యీ హెచ్చుతగ్గులు, యీ కలిమి లేములు, మధ్య అంతరాలను ఎలా తగ్గిస్తారు మీరు? సిద్ధాంతాలు మనుషులు, మధ్య, మనుషులకోసమే సిద్ధాంతాలనుకోవాలికాని, సిద్ధాంతాలు ముఖ్యం- మనుషులు కారనుకొనేవాళ్ళు అవివేకులు. వాళ్ళకు వస్తుతత్త్వం తెలీదు. మనిషి స్వభావం తెలీదన్నమాట. సామాజిక దృక్పథం అనగానే ఇవన్నీ ఆలోచనలోకి రావద్దా? ఏ రాజకీయ సిద్ధాంతాలుకాని, వ్యవస్థలుకాని, మనిషి నైజగుణంలో కొంత మార్పు రానంతవరకు దీర్ఘకాలిక ప్రయోజనాలను సాధించలేవు. అల్పకాలికమైనవాటిని సాధించినా వాటివల్ల అనుకొన్నంత ప్రయోజనం వుండదు కదా. మనిషిలో సంస్కారము, బుద్ధిమంతుల్లో సాంఘికబాధ్యతలపట్ల దృక్పథమూ పెరగనంతకాలం, యీ అంతరాలు బాధిస్తూనే వుంటాయి. కఠినమైన రాజశాసనంవల్లకాని, అన్ని హక్కులు తనకే ఆపాదించుకొనే ప్రభుత్వ వ్యవస్థ వల్లకాని, అధికసంఖ్యాకులైన ప్రజలకు, సుఖశాంతులు, భద్రత, రక్షణలు, లభించేటట్లయితే, ఆ వ్యవస్థకు సుస్వాగతమే. కాని మనుష్యులు వీళ్ళేకదా. స్వార్థం, అలసత్వం, భోగాసక్తి, ఇంద్రియలోలుపత, ఇవన్నీ సమాజంలో నేరాలుగా పరిగణించనంతకాలం, ఏ వ్యవస్థ అయినా సాధించేది ఏమీ వుండదు. అందువల్ల సాహిత్యం ఆ పనికి, ఆ అవగాహనకు పూనుకోవాలి అంటే నీతి శాస్త్రంలా నీతులు బోధించమనికాదు. ప్రజల్లో ఆ జిజ్ఞాస, ఆ దృక్పథము పెంపొందించాలి.

స్వాతంత్ర్యానంతరం, తెలుగుదేశంలో వచ్చిన, వస్తూవున్న మార్పులను సమగ్రంగా ప్రతిబింబించకపోయినా, కనీసం ఆదృక్పథంతో వ్రాసిన నవలలైనా వున్నాయా? అంటే ఒకటో రెండో వున్నవేమోకాని, రచయితల్లో ఆ ఆలోచనగాని, పాఠకుల్లో ఆ ఆర్తిగాని లేవని విచారంతో చెప్పుకోవాలి. వెనకటి రోజుల్లో అంతోఇంతో సాంఘిక ప్రయోజనాన్ని సాధించిన వీరేశలింగంపంతులు గారి రాజశేఖర చరిత్రం, సత్యవతీ చరిత్రం, ఇటీవలికాలంలో ఉన్నవవారి మాలపల్లివంటి నవలలు, స్వాతంత్ర్యానంతరం వచ్చినవా? అంటే రాలేదనే చెప్పుకోవాలి నవలలు మాత్రం కుప్పతిప్పలుగా వెలువడినమాట వాస్తవమే. అధికసంఖ్యాకాలు వినోదాన్ని, కాలక్షేపాన్ని మాత్రమే అందించేవి. వర్తమాన

సమాజంలోని సమస్యలేమిటి? ప్రపంచవ్యాప్తంగా ఆర్థిక సాంఘిక రాజకీయ పరిస్థితులు, ఉద్యమాలు, మనదేశాన్ని, సంఘాన్ని ఏవిధంగా ప్రభావితంచేస్తు న్నాయి. అందువల్ల అక్కడి పరిణామా లేమిటి? అన్న విషయాలు రచయితలూ పాఠకులూ ఎవరూ పట్టించుకోవటంలేదు.

ఎప్పుడో, కాలగర్భంలో కలసిపోయిన జమీందారీవ్యవస్థ, రావుబహదూర్ భుజంగరావుగారి దర్పమూ, ఆయన కొడుకులూ, కూతుళ్ళూ, వాళ్ళ అతి శయాలూ, అపార్థాలు, ఇంకా ఆడవాళ్ళు చదువుకోవడంవల్ల గర్వం వొలక బోస్తారని కొండ రెట్లా అపోహపడి, చివరకు వాళ్ళత్యాగంవల్ల నిజం తెలిసి పశ్చాత్తాపం చెందటం, ఆధునిక ప్రమాణాలతో చతుర్విధనాయకులూ, నాయి కలూ, ఇంకా అత్తగారి ఆరళ్ళు, భర్తగారి బాదింపులు, భార్యగారి సాధింపులూ వెకిలి హాస్యం, వెర్రి ఉపన్యాసాలు, వ్రాసేవాళ్లు వ్రాస్తున్నారు, చదివేవాళ్ళు తమకంతో చదివేస్తున్నారు. సినిమాలు చూసి నవలలు వ్రాసేయటం, ఆ నవలలను చూసి సినిమాలు తీసేయటం కూడా ఇటీవల లాభదాయకంగానే వున్నట్లు కనపడుతున్నది.

కేవలం వ్యాపారదృష్టితో, పత్రికలుకూడా సాహిత్యపువిలువలను పాడు చేస్తున్నాయి. ప్రజలలో మూర్ఖత్వాన్నీ, అవివేకాన్నీ దేవాలయాలు చూపి, మతం పేరు చెప్పి కొందరు స్వలాభంకొసం ఏవిధంగా పెంచుతున్నారో, అపరిణత మనస్కులైన అధికసంఖ్యాకులకు, అసలువిషయాలు తెలియకుండా, పత్రికల వాళ్ళు జాగ్రత్తపడుతున్నారు. పెద్దపెద్దఅచ్చుకూటాలయజమానులు, సోషలిజం అచ్చుకొట్టి, స్వలాభాలుమాత్రం జాగ్రత్తగా పంచుకుంటున్నారు. ఎవడో ఒక నియంత వచ్చి దీన్నంతా సరిచేస్తాడన్నది మూర్ఖమైనఅభిప్రాయంలాగా కనపడు తుంది. భీతివల్లకానీ, నీతివల్లకాని, మనిషి, మనిషిని దోచుకోవడం ఆగిపోతేతప్ప, శ్రేయోరాజ్య మంటూ రాదు. ఆత్మవంచకులవల్ల, పరవంచకులవల్ల అటువంటి వ్యవస్థ సిద్ధించదు–ఆ దృక్పథం పెంపొందదు.

ఈ ఇరవైఅయిదు సంవత్సరాలకాలంలో, తెలుగుసాహిత్యంలో నవలా ప్రక్రియకు వచ్చినంతఆదరం మరేఇతరప్రక్రియకు రాలేదు. ఈశతాబ్దంలో వచ్చిన సాంఘికవిప్లవాలను వివరిస్తూ కొన్నిమంచినవలలు తెలుగునకూడా రాక పోలేదు. మహీధర రామమోహనరావుగారు వ్రాసిన ఓనమాలు, 'రథచక్రాలు' 'దవానలం' వంటినవలలు తెలంగాణాలో వచ్చినరాజకీయ సంచలనాన్ని, దర్పణ ప్రాయంగా చూపాయి. రామమోహనరావుగారు గొప్పఅవగాహన కలరచయిత.

సామాజిక దృక్పథం కల రచనలుమాత్రమే చేయటం వీరిప్రత్యేకత. 'కొల్లాయి గట్టితేనేమి' అన్న వీరినవలలో, కోనసీమప్రాంతాన్ని రంగస్థలంగా తీసుకొని, స్వాతంత్ర్యోద్యమంనాటిపరిస్థితులు కథావస్తువుగా చేసికొని నాటిఆంధ్రదేశాన్ని, చూపారు.వీరిరచనలన్నీ గొప్పరచనలు. జి. వి. కృష్ణారావుగారి 'కీలుబొమ్మలు' నగరజీవనంపట్ల, పారిశ్రామిక వ్యవస్థపట్ల గ్రామీణజీవితం, ఆకృష్టమై క్రమ పరిణామం చెందుతున్న దశను నిరూపించేనవల. తెలుగుదేశపు గ్రామీణజీవితాన్ని పరిస్థితులను, తెలిసి చేసినరచన కీలుబొమ్మలు. బుచ్చిబాబు గారి 'చివరకు మిగిలేది' పూర్వమేవచ్చినా, స్వాతంత్ర్యానంతరమే మూడుముద్రణలు పొంది, పాఠకులను ఆకర్షించింది. బుచ్చిబాబుగారిరచనలలో కళాత్మకమైన విలువలు ఎక్కువ. ఆయనదృష్టి సౌందర్యదృష్టి. సంఘమనే చట్రంలో వ్యక్తి ఏవిధంగా తనసమస్యలతో పోరాడుతూ, రాజీపడుతూ, వ్యక్తిగతవికాసంకోసం సంఘర్షిస్తూ వుంటాడో బుచ్చిబాబుగారి తాత్త్వికదృక్పథం గల రచనలన్నీ తెలియజేస్తవి. వ్యక్తి, సంఘము పరస్పరాశ్రయాలే అయినా, సంఘబలిమి, వ్యక్తిని శాసిస్తుందని. సంఘాన్ని ఎదిరించి, జయించడం సాధ్యంకాదని, చివరకుమిగిలేది నవలద్వారా బుచ్చిబాబు బోధిస్తారు. రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అల్పజీవి ఒక ప్రయోగా త్మకనవల. శైలిలోను, వస్తువులోను విలక్షణమైనది.

పంథొమ్మిదిపందలయాభై తరవాత, తెలుగునవల త్వరితగతిన వికాసం పొంది ప్రధానస్థానాన్ని పొందుతూ వచ్చింది సాహిత్యంలో. బలివాడ కాంతారావుగారి 'గోడమీదిబొమ్మ' 'దగాపడిన తమ్ముడు', ఇటీవల వచ్చిన 'పుణ్య భూమి' మంచినవలలు. వీరినవలల్లో పరిణతమైన దృక్పథం గోచరిస్తుంది. కొమ్మూరి వేణుగోపాలరావుగారు రచించిన 'పెంకుటిల్లు' మధ్యతరగతి కుటుంబజీవితాన్ని, కనులకు కట్టినట్లుగా చూపగలిగింది. పురాణం సూర్య ప్రకాశరావుగారి 'జీవనగంగ', 'మారేమనుషులు' సామాజిక దృక్పథం గల రచనలే. పాఠకుల అభిరుచినిబట్టి రచనలని పత్రికలవాళ్ళు, చెత్త రచనలను ప్రచురించటంలో సత్యం లేదని పురాణం సూర్యప్రకాశరావుగారి 'జీవనగంగ'కు వచ్చిన ఆదరణ నిరూపిస్తున్నది. రాజకీయాలలో ఏ విధమైన పరిగణన లున్నాయో, పత్రికలవాళ్ళవిజ్ఞతలోకూడా, అటువంటి పరిగణనలు, చోటు చేసుకొంటాయేమో నన్న అనుమానానికి ఆస్కారం వుంది. అందువల్లనే పాఠకులఅభిరుచినిబట్టే మాప్రమాణాలు అనటం వాళ్ళు.

ఏది ఏమైనా స్వాతంత్ర్యం వచ్చిన యీపాతికసంవత్సరాలలో సమా జాన్ని అత్యంతమూ ప్రభావితంచేసినరచనలు రాకపోయినా, సాహిత్యం,

సామాజికస్పృహకు వెలిగా వుండరాదన్న సిద్ధాంతంమాత్రం బాగా బలం పుంజుకొన్నది. కీర్తిశేషులు గోపీచంద్ రచించిన పండితపరమేశ్వరశాస్త్రి వీలునామా, మెరుపులమరకలు, చీకటిగదులు, ఆయన ఎరిగినసమాజాన్ని ప్రతిపాదించినవే. అట్లానే ఆధునికరచయితలలో అత్యంతప్రతిభాశాలిని శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మగారి బలిపీఠం, పేకమేడలు, వంటినవలలు వర్తమానసమాజంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాలను వెల్లడించినవి. సమాజంలో తరతరాలనుంచి వస్తున్నప్రాచీనదృక్పథం మారిపోలేదని, స్త్రీని వంచించడం యథాతథంగా కొనసాగుతున్నదనీ, యీదృక్పథం మారనంత వరకు, సామాజికశ్రేయస్సు దుర్లభమని యీమెగారు తమనవలల్లో ప్రతిపాదిస్తారు. స్వాతంత్ర్యానంతరం వచ్చిననవలల్లో పేర్కొనదగినది శ్రీ శీలా వీర్రాజు గారి మైనా. అవసరాల రామకృష్ణారావు రచించిన సంపెంగలు, సన్నజాజులు, హితశ్రీగారి సామాన్యుని కామన నేటిసామాజికసమస్యలను వివిధకోణాలనుంచి పరిశీలించి వ్రాసినవి. కొడవటిగంటి కుటుంబరావు గారి చదువు, పాలగుమ్మి పద్మరాజు గారి రామరాజ్యానికి రహదారి, మొదలైన నవలలు, స్వాతంత్ర్యం రాకపూర్వంనుంచి, వచ్చినవర్తమానపరిస్థితులవరకు, ఆంధ్రదేశంలో వచ్చి, వస్తూవున్న మార్పులను, ప్రతిబింబిస్తున్నరచనలు.

శిల్పవిషయకంగా తెలుగునవల ఎంతో అభివృద్ధిని సాధించింది. కొత్త శైలి, కొత్త అభివ్యక్తీకరణం, కొత్తకొత్త ఉపమానాలు, కొత్తగా వ్రాస్తున్న రచయితలలో చూడవచ్చు. నవీన్ వ్రాసిన అంపశయ్య, ఇటీవల వచ్చిన ప్రయోగాత్మకనవలల్లో చెప్పుకోదగింది. బీనాదేవి రచించిన హేంగ్ మి క్విక్ లేక 'పుణ్యభూమీ కళ్ళుతెరు' అన్ననవల లోవస్తువు, అభివ్యక్తీకరణం, శైలి, అన్నీ కొత్తగానే కనపడతాయి. శ్రీమతి ద్వివేదుల విశాలాక్షిగారు, మాలతీ చందూర్‌గారు, నేటిసామాజికస్వరూపాన్ని అందునా ముఖ్యంగా, మధ్యతరగతి కుటుంబాలజీవనస్థాయిని, ఇతివృత్తాలుగా స్వీకరించి మంచినవలలు వ్రాశారు. ఉత్తమసాహిత్యస్వరూప మేమిటన్నప్రశ్నకు సమాధానంగా, మననశీలమైన యీపంక్తులను గ్రహించవచ్చు.

"......It is one of the essential criteria of true literature that it exposes itself to the reality of the here and now with all its problems, and does not withdraw into the ivory tower of an aesthetic and artistic existence"-(Preface of Classical Readings from German Literature-Shakuntala publishing House-Bombay 1969.)



# తెలుగునవల - పాత్రచిత్రణము

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

జీవితమంటే సుఖదుఃఖాలు. ఒకమనిషి జీవితంలో అవి ఎలా సంప్రాప్తిస్తున్నవి? ఆయాసందర్భాల్లో ఆమనిషి ఎలా ప్రవర్తిస్తున్నాడు? ఈ రెండువిషయాల్నిబట్టి మనిషిలో వ్యక్తివైశిష్ట్యం గోచరమౌతుంది. జీవితాన్ని కథగా మలిచే ప్రక్రియయైన నవలలో అలా నిరూపింపబడేవ్యక్తి వైశిష్ట్యాన్నే పాత్రచిత్రణం అంటారు.

జీవితంలో సుఖదుఃఖాలకు మనిషి ఎంతవరకు బాధ్యుడు? ఈప్రశ్నకు సమాధానం రచయిత దృక్పథాన్నిబట్టి ఉంటుంది. జీవితంలో మనిషి కర్తృత్వం వహించే భాగంతోపాటు, కర్తృత్వం వహించకుండానే సంభవించేభాగమూ ఉన్నది. దాన్నే 'ఘటన' అంటారు. షేక్స్పియర్ నాటకాల్లో వ్యక్తి కర్తృత్వం వహించి చేసేపనులూ, నిర్ణయాలూ ఒకవైపు స్పష్టంగా అతని సుఖదుఃఖాన్ని రూపొందిస్తూ ఉండగా, ఘటన (chance) అనేదికూడా వాటికి అనుగుణంగానే దోహదం చేస్తూ ఉండటం కనిపిస్తుంది. అందుకే 'వ్యక్తిత్వం లోనే యిమిడివుంది విధివ్రాత' (character is destiny.) అనే సూత్రాన్ని షేక్స్పియర్ పాత్రలకు అన్వయిస్తారు. ఇందుకు భిన్నంగా థామస్ హార్డీ నవలల్లో ఘటనదే పైచేయిగా ఉంటుంది. అది వ్యక్తిని బొమ్మకుమల్లే ఆడిస్తూ వ్యక్తి సంకల్పం ఏమైనాసరే దాన్ని వమ్ముచేస్తూ ఉంటుంది. ఇది థామస్ హార్డీ చేసే జీవితచిత్రణం. తెలుగునవలల్లో పాత్రచిత్రణం పరిశీలించే సందర్భంలో ఈ రెండుఉదాహరణలూ గుర్తుపెట్టుకుంటే ఒకవిధానం ఏర్పడుతుంది.

తెలుగునవల పుట్టుకతోనే ప్రబోధాత్మకంగా పుట్టింది. అందువల్ల తెలుగు నవలారచయితలు చాలావరకూ వ్యక్తికర్తృత్వానికీ వ్యక్తిబాధ్యతకూ ప్రాముఖ్యం ఇచ్చారంటే ఆశ్చర్యపడనక్కరలేదు. 1947 పూర్వం వీరేశలింగం, చిలకమర్తి, ఉన్నవ, చలం, విశ్వనాథవంటి చెప్పుకోదగ్గ రచయితలందరూ వ్యక్తిబాధ్యతకే ప్రాధాన్యం ఇచ్చారు. అనూచానంగా వస్తున్న ఆచారాలని సంస్కరించడానికి గాని, జీవితభవితవ్యాన్ని చక్కబరచుకోవడానికిగాని, స్వేచ్ఛనూ సుఖాన్నీ అనుభవించడానికిగాని, ధర్మవ్యతిక్రమణకుగాని, ధర్మాచరణకుగాని, వ్యక్తిదే

బాధ్యత అనేధోరణిలో పాత్రచిత్రణం జరిగింది. ఒక్క 'ఏకవీర' నవలలో మాత్రమే ఘటనకు పూర్తిప్రాధాన్యం యివ్వబడటం చూస్తాం. అక్కడకూడా ఘటనని ఎదిరించి చివరిదాకా వ్యక్తి పోరాడుతూవుండటం కనిపిస్తుంది. ఇలా పాత్రచిత్రణం జరగడానికి కారణం 1947 పూర్వం నవలలకి ఆధారభూత మైన సంస్కరణవాదం, అధ్యాత్మికవాదం, స్వేచ్ఛాప్రేమసిద్ధాంతంవంటి అతి వాదకాల్పనికత, అన్నీకూడా వ్యక్తినిష్ఠమైనవీ, వ్యక్తికి ప్రాధాన్యాన్ని యిచ్చేవీ కావడమే.

1947 ప్రాంతాల్లో మనోవైజ్ఞానికపరిశోధనలదృష్ట్యా రచయితలు వ్యక్తి బాధ్యతనీ, కాల్పనికవాదసిద్ధాంతాలనీ పరిశీలించి విమర్శకు గురిచెయ్యడం ప్రారంభించారు. వ్యక్తి తనసుఖదుఃఖాలకు ఎంతవరకు బాధ్యుడు? అనేప్రశ్న తీవ్రమైన జిజ్ఞాసకు దారితీసింది. చిన్నతనంలో ఏమీ ఎరుగనివయస్సులో ఒక భయావహమైన సంఘటన మనస్సుమీద వేసినముద్ర కారణంగా ఒక వ్యక్తి చైతన్యం ముడుచుకుపోయి అతనికి పిరికితనం అలవాటైతే, తర్వాతిజీవితంలో కష్టసుఖాలకు వ్యక్తిగా అత నెంతవరకు బాధ్యుడు? ఘటనద్వారానే అతనికి విముక్తి లభిస్తే లభించాలి. 'అల్పజీవి' నవలలో సుబ్బయ్య చిక్కులో పడటంగాని, ఆ చిక్కు విడిపోవటంగాని, అతనికి ఒకానొకపంతులమ్మప్రేమ లభించటంగాని, తద్వారా అతనిచైతన్యం వికసించడంగాని, అతనిసంకల్పంద్వారా, ప్రయోజకత్వంద్వారా జరిగినవి కావు. కేవలం ఘటన. కాని నవలలో చివరిఉటంకింపు- మాననికంగా విముక్తిపొందినవ్యక్తి జీవితానికి బాధ్యత వహిస్తాడనీ, అలా బాధ్యత వహించడమే విముక్తికి అర్థం అనీ సూచన ఉంది.

కాల్పనికవాదసూత్రాలకూ, చలం స్వేచ్ఛావాదానికీ ఒకపెద్దసవాలుగా 'చివరకు మిగిలేది' నవలలో దయానిధిపాత్ర కనిపిస్తాడు. దయానిధి విచిత్ర వ్యక్తి. 'ఈడిపస్‌భ్రాంతి'లో చిక్కుకున్నదయానిధికి వ్యక్తిత్వం తాలూకు స్వాతంత్ర్యంకాని బాధ్యతకాని లేవు; కాని బాధ్యత ఉన్నట్లే తను నమ్మి ఇతరులను నమ్మించి చిక్కుల్లో పడతాడు. ఈవిషయంలో 'అల్పజీవి' లోని సుబ్బయ్యకూ ఇతనికీ తేడా గమనించవచ్చు. సుబ్బయ్యబాధ్యతను గురించి ఎవరూ పొరపాటుపడరు. దయానిధికి స్త్రీవ్యామోహం ఎక్కువనీ, అతనికి పలువురు స్త్రీలతో సంబంధం ఉన్నదనీ లోకం అపోహపడుతుంది. స్త్రీలసమక్షంలో అతనిమాటల్నీ ఊహల్నీబట్టి పాఠకులుకూడా ఆభ్రమలోనే పడతారు. నిజంగా చూస్తే అతనికి ఒక్క అమృతంలోతప్ప, అదీ ఒక్కసారే, మరేస్త్రీ

తోనూ, అతనిభార్యతోగాని కోమలితోగాని శారీరకసంబంధం లేనేలేదు: దాని కతను విముఖుడుకూడా. కాని దయానిధి సెక్సువిషయంలో నీతిపరుడు కాడనే కారణంతో అతనిసర్వస్వాన్నీ లోకులు ధ్వంసం చేస్తారు. దయానిధి పాత్రలో అతనిబాహ్యస్వరూపానికీ అంతర్యానికీ గలతేడానీ వైరుధ్యాన్నీ చిత్రించడంలో రచయిత గొప్పవిజయం సాధించాడు. దయానిధి మనస్తత్వచిత్రణం మెచ్చుకోతగ్గది. వ్యక్తి బహిరంతరాల్లో సమన్వయం సాధించడానికి తనలో తను సమాధానపడాలి. అంతదాకా అతనివ్యక్తిత్వానికి బాధ్యత అంటూ వుండదనే రచయితసూచన.

'అసమర్థుని జీవితయాత్ర'లోని సీతారామారావుపాత్రచిత్రణంలోనూ బహిరంతరాల సంఘర్షణయొక్క వైలక్షణ్యమే కనిపిస్తుంది. సీతారామారావు పాత్ర హాస్యస్ఫోరకంగా ప్రారంభమై కరుణాజనకంగా పరిణమించి చివరకు బీభత్సంలో అంతమౌతుంది. అతని ఘర్షణ లోకంతో అన్నట్లు మొదలు తోచి అంతర్యంలోని వైరుధ్యంగా భాసించి, చివర ఆత్మహత్యకు దారితీస్తుంది. ఇక్కడ వ్యక్తిబాధ్యత, ఘటన ఏది ఎంతమేర ఉన్నదో నిర్ణయించడం కష్టం.

1947 ప్రాంతాల వచ్చిన పైమనోవైజ్ఞానికనవలలు వ్యక్తిబాధ్యత అనేది ఎంతక్లిష్టమూ సంకీర్ణమూ అయినవిషయమో నిరూపించాయి కాని వ్యక్తిని అప్రధానంగా చిత్రించలేదు.

1951లో వచ్చిన 'కీలుబొమ్మలు' నవలలో పాత్రచిత్రణం 'వ్యక్తికి ప్రాధాన్యం లేదు' అనే సూత్రంమీదే జరిగింది. వ్యక్తికి ప్రాధాన్యం లేకపోతే మరి దేనికి ప్రాధాన్యం? పరిస్థితులు, రాజకీయాలు అని సమాధానం. కాని అవి ఆర్థిక పరిస్థితులు కావు, సిద్ధాంతాలమీద నడిచే పార్టీ రాజకీయాలు కావు. గ్రామప్రజల్లో పేరుకుపోయిన లోభత్వం, పిరికితనం, అనాలోచితంగా సృష్టించే దారుణ పరిస్థితులు, కేవలం స్వార్థం సృష్టించే కక్షలు. వ్యక్తి ఎక్కడో పొరపాటు చేస్తాడు. లేక అలసత్వంలో చెప్పవలసినమాట చెప్పకుండా దాస్తాడు. అది స్వల్ప విషయమే కాని అందునుంచీ రేగే సుడిగాలి, విజృంభించే తుఫాను అందరినీ నాశనం చేస్తాయి. ఆ స్థితిలో ఏ వ్యక్తిత్వమూ పనికిరాదు. ఇక్కడ వ్యక్తిని అశక్తుణ్ణి చేసి ఆడించేది ఆధారంలేని ఘటన కాదు. ఘటన రూపందాల్చే అజ్ఞానం, అధర్మం, తన్మూలమైన భయం. పార్టీరాజకీయాలు, వర్గరాజకీయాలు, గవర్నమెంటు వారిని రెచ్చగొట్టి మరింత బీభత్సానికి కారణమౌతాయే తప్ప అజ్ఞానాన్నీ అధర్మాన్నీ శాశనం చెయ్యలేవు. వ్యక్తుల్ని రక్షింపలేవు. వ్యక్తిబాధ్యతమీద రచ

యిత వెలిబుచ్చిన అపనమ్మకం ప్రతిపాత్రలోనూ ప్రతిబింబిస్తున్నది. ముఖ్యంగా ఆదర్శవాది, చదువుకున్నవాడు, మంచిమనసుగలవాడు అయిన డాక్టరు పాత్ర ద్వారాకూడా అదేఅభిప్రాయం రచయిత వ్యక్తం చేశాడు. ఈ పాత్రచిత్రణంలో జరిగిన ఒకవిశేష మేమంటే-డాక్టర్‌తో ఒకరాత్రి సంపర్కంతో పద్మఅనే మగ నాలికి గర్భంవస్తుంది, కాని ఆ సంపర్కం కలలో జరిగినట్లుగానే డాక్టరు భావిస్తూ ఉన్నట్లు రచయిత చిత్రించడం. డాక్టర్ అధర్మవర్తన నిద్దురమ గతలో జరగడంవలన అతనికి 'బాధ్యత' లేదనీ, గామంలోని అధర్మం అలా పద్మద్వారా ధర్మవ్రతుడైన డాక్టర్ని కూడా స్పృశింపక విడువలేదనీ రచయితచేసే సూచన. పురుషుడు నిద్రమగతలో ఉండి సంపర్కం జరిపికూడా నిద్ర మేల్కొనలేదనే విషయం అసంభావ్యమే. ఇక్కడ సంభవాసంభవాలెలా వున్నా గమనించవలసింది రచయిత తన దృక్పథాని కిచ్చిన ప్రాముఖ్యం. దృక్పథం వల్ల మిగతాపాత్రల చిత్రణం ఎంతవాస్తవికంగా వున్నా, డాక్టర్‌పాత్రచిత్రణం దెబ్బతినక తప్పలేదు.

1947 ప్రాంతాల వచ్చిన నవలల్లో మానవుడు అల్పజీవి, ఏకాకి, అసమర్థుడు, కీలుబొమ్మ అంటూ మానవుని అధీరలక్షణాన్ని చిత్రించడం గూర్చి ప్రస్తావించాను. కాని స్త్రీపాత్రల విషయంలో తద్భిన్నమైనమార్పు కనిపిస్తుంది. 'అల్పజీవి' లో పంతులమ్మ, 'చివరికి మిగిలేది' లో అమృతం, కోమలి, 'అసమర్థుని జీవయాత్ర' లో సీతారామారావుభార్య, 'కీలుబొమ్మలు' లో లక్ష్మమ్మ, లలిత, పద్మ ఆయా పురుషపాత్రలకంటె ఎక్కువ ధీరత్వమూ బాధ్యతా చూపిస్తారు. చలం నవలల్లో స్త్రీపాత్రలు సిద్ధాంత రీత్యా సంఘదురన్యాయాన్ని ప్రతిఘటించేందుకు వివాహవ్యవస్థపై తిరుగుబాటు చేస్తారు. కాని 1947 తర్వాత వచ్చిన నవలల్లో- 'గడియపడని తలుపులు' లో కోటీశ్వరమ్మ, 'మెరుపుల మరకలు' లో ఉషారాణి- సెక్స్‌ప్రవర్తనలో స్త్రీలు చూపే స్వేచ్ఛ వ్యక్తివికాసంలో భాగమేగాని అది వ్యవస్థ మీద తిరుగుబాటు కాదు. విషయలాలసత్వమూ కాదు; ఇది జాగ్రత్తగా గమనించి అర్థంచేసుకోవలసిన విషయం. లత వ్రాసిన నవలల్లో స్త్రీవ్యక్తిత్వ వైశిష్ట్యానికి కాక జీవితంలో అనుభూతివైవిధ్యానికి కూడా సాహసంతో అన్వేషిస్తున్నట్లు పాత్ర చిత్రణం జరిగింది. సంప్రదాయానికి మారుతున్న స్త్రీకి అనివార్యంగా సంభవించే ఘర్షణనే పదే పదే గుర్తుకుతెస్తూ పాత్రచిత్రణ చేస్తుంది లత. గంటి వెంకటరమణ వంటి రచయిత్రులకు ఆ స్పృహ ఉన్నట్లే తోచదు. యద్దనపూడి సులోచనారాణి ప్రాతసారాయమైన కాల్పనిక

వాదం తాలూకు ప్రణయాన్ని, ప్రేమసంఘర్షణనీ తనకొత్త పాత్రలద్వారా అంది స్తున్నది. 'సెక్రటరీ' లో నాయికగాని, 'ఆహుతి'లో నాయకుడుగాని, ఉద్యోగాన్వేషణకు బయలుదేరే నేటి యువతీయువకులే అయినప్పటికీ వాళ్ల ఎదుర్కొనే ప్రణయసన్నివేశాలు, మానసిక సంఘర్షణలు, వాళ్లు చూపే పట్టుదలలు, త్యాగాలు నేటి సామాజిక ధోరణుల్లో విలక్షణంగా కనిపిస్తాయి. అటువంటి పాత్రల్లో అనుభూతుల్లో అసహజత్వం అసంభావ్యత లేవుకాని, నేటి వాతావరణంలో మాత్రం అపురూపంగానే కనిపిస్తాయి. వాసిరెడ్డి సీతాదేవి చిత్రించిన వరూధిని ('మట్టిమనిషి') వంటిస్త్రీ, లెక నవీన్ చిత్రించిన 'శకుంతల' ('విచలిత') వంటి పాత్ర నేటియువతుల మనస్తత్వానికి ప్రతినిధులని చెప్పడంలో సందేహం అక్కరలేదు. నేటి స్త్రీ కోరుతున్నది వివాహం సుఖప్రదం కావాలని కాదు. వ్యక్తిగా స్వతంత్రప్రతిపత్తి అంటే సంఘంలో గృహిణిగా కాక ఇతరత్రా ప్రత్యేకవ్యక్తిగా తనకు గణన, వికాసమూ ఉండాలని, ఆ అన్వేషణ ఫలితంగా లోకంతో ఏర్పడే సంబంధాలలో ఆమె ఓటమీ గెలుపూ, సుఖదుఃఖాలు నేటిస్త్రీ పాత్రచిత్రణలో ప్రాధాన్యం వహిస్తున్నవి. ఇక్కడ సెక్స్‌కీ రోమాన్స్‌కీ ప్రమేయం వున్నా అది వ్యక్తిత్వ నిరూపణలో ఒక సాధనమో అవరోధమో తప్ప దాని కదే లక్ష్యమైన విషయలాలనప్రవృత్తి కాదని గమనించాలి.

పురుషపాత్రల్లోని అధీరగుణం, ఒకవిధంగా చూస్తే మారుతున్న సామాజిక పరిస్థితుల్లో మారిన విలువలమధ్య, క్షీణించిన మతతాత్త్విక విశ్వాసాలలో వ్యక్తి తనదైన లక్ష్యం ధర్మం రూపొందించుకోలేక పడుతున్న అవస్థగా అర్థం అవుతుంది. ఈ సమస్యకు పరిష్కారం ఏన్నోరకాలుగా ఉంటూ పాత్రలవ్యక్తిత్వాన్ని నిర్ణయిస్తూ వుంటుంది. జీవించడానికే జీవితం, అంతకు మించి దానికి అర్థంలేదని ఒక సమాధానం (గోపీచంద్). ఆర్థిక సామాజిక వ్యవస్థ మారితే గాని లాభంలేదని ఒక అభిప్రాయం (కుటుంబరావు) ధర్మం (సనాతనమా? బౌద్ధమా? మానవతా?) పునఃప్రతిష్ఠితం కావాలి మనుష్యుల్లో, అంతదాకా లాభం లేదని కొందరి మతం (విశ్వనాథ, జి. వి. కృష్ణారావు). మనుష్యులకు ప్రేమించడం తెలీదు, ప్రేమించలేకపోవడం ఎంతదురదృష్టం! ఎంతవిషాదం! అది తెలిస్తే సమస్యే వుండదని ఒకధ్వని (బుచ్చిబాబు). పోతే, జీవితం, విలువలు, వ్యక్తి- మూడూ వేరు వేరు విషయాలు కావు, జీవించడం నుంచీ విలువలూ వ్యక్తిత్వమూ సిద్ధిస్తాయి అనే దృక్పథంతో వ్రాయబడిన నవలలు: మైనా (శీలా వీర్రాజు), తాగుబోతు (వి. నాగరాజు), మళ్లీ వసంతం, అసురసంధ్య (ఆర్.

యస్. సుదర్శనం). 'మైనా'లో నాయకుడు సాయిబాబా, పోలీసు కానిస్టేబుల్ ధీరుడూ అధీరుడూఅన్న వింగడింపుకు లొంగడు. మైనా నవలలో కథ వున్నా, కథాసంవిధానం లేదు. అందుకు కారణం సాయిబాబా వ్యక్తిత్వానికీ, జీవితానికీ రచయిత సాధించిన తాదాత్మ్యం. ఆ వ్యక్తిత్వం ఒకదృక్పథాన్నీ లేక కొన్ని విశ్వాసాలనూ ముందుపెట్టుకొని తన్మూలంగా నడిచి, లేక నడవలేక బాధపడిన వ్యక్తిత్వంకాదు. కాని జీవించిన జీవితాన్నిబట్టి చూస్తే అందులో ఒకసౌష్ఠవం, ఒక Pattern కనిపిస్తూనే వుంది. అందునుంచీ విలువల్నిగూర్చి వ్యాఖ్యానమూ చేసుకోవచ్చు. ఇది పాత్రచిత్రణలో కొత్తపద్ధతి. పద్ధతేకాదు, కొత్తదృక్పథాన్నే సూచిస్తుంది 'తాగుబోతు' నవల చైతన్యస్రవంతిమార్గంలో వ్రాయబడింది. అలా వ్రాయబడినందువలన అది కొత్తదృక్పథానికి చెందినది కావడం లేదు. ఇక్కడకూడా త్రాగుబోతు అయిన ముసలివాడిపాత్ర, అతనిజీవితం ఒక విషయంగా రూపొందడం ప్రధానం. వాడికి మిగిలినవి ఆజీవితస్మృతులే- వాటిని గూర్చిన ధ్యాసతోనే వాడు ప్రాణాలు విడుస్తాడు. ఆ ముసలివాని వ్యక్తిత్వం జీవితంగాని కేవలం అర్థశూన్యమనీ అందులో విలువలు లేవనీ అనడానికి వీల్లేదు. ఆ వ్యక్తిత్వచిత్రణ కలిగించే కళానుభూతిలోనే ఉన్నది ప్రాథమికమైన విలువ. దానినుంచీ జీవితానికి ఎన్ని వ్యాఖ్యానాలైనా చెయ్యవచ్చు. 'మళ్ళీవసంతం' నవల ఊర్మిళ అనేపాత్ర తన జీవితాన్ని గూర్చి తాను చేసుచున్న పరామర్శ, నిశితమైన విశ్లేషణం. ఊర్మిళ తన జీవితంలో జరిగిన విశేషాలకూ, తనతో సంబంధం వున్న మనుష్యులకూ ఏ విలువనూ అర్థాన్నీ ఆపాదిస్తున్నదో ఆమె కథనం ద్వారా మనకు తెలుస్తుంది. కాని ఆమె కథనంలోనే ఆమె వ్యక్తిత్వవైఖరి వున్నది. ఎప్పటికప్పుడు ఆలోచిస్తూ సమన్వయం చేసుకుంటూ వెళ్లడం ఆమె ప్రవృత్తి. అందువల్ల నవలలో ఆమె జీవితానికీ వ్యక్తిత్వానికీ తాదాత్మ్యం కనివిస్తుంది. ఊర్మిళ కథలో ఇతరపాత్రలు కనిపించినా, వాళ్లు ఆమె మనశ్చిత్రాలే తప్ప వాళ్లకి ప్రత్యేకమైన అస్తిత్వం లేదు। ఇలా పైనుదాహరించిన మూడు నవలల్లోనూ ఏకపాత్రచిత్రణమే ఉండటం విశేష మని చెప్పాలి. కథ, సంఘటనలు ఇతర పాత్రలూ ఉన్నా, అవన్నీ ప్రధానపాత్ర చిత్రణంలో అంతర్భూతాలే కావడం ఈ నవలల విశిష్టత. పోతే 'అసురసంధ్య'లో ఇద్దరుపాత్ర లున్నారు. పైరకం పాత్ర, అంటే జీవితమూ వ్యక్తిత్వమూ తాదాత్మ్యం చెంది, తద్వారా విలువల్ని సృష్టించే పాత్ర నాగరాజు. నవలలో నాయకుడైన శ్రీధర్ పాత్ర అందుకు పూర్తిగా భిన్నం. అతను ఏవో విలువల్నీ, ధర్మాల్నీ, అధర్మాల్నీ

ముందుపెట్టుకొని అడుగులు వేయబోయి మాటిమాటికీ తూలుతాడు. క్రమంగా జీవించడంనుంచే వ్యక్తిత్వమూ విలువలూ సిద్ధిస్తా యని గ్రహిస్తాడు. వ్యక్తిత్వంలో మనిషికీ మనిషికీ ఉండే వైవిధ్యంలాగే, ఒక మనిషి జీవితం గుబాళించే విలువలుకూడా సమ్మిశ్రితంగా వుండి ఒక ప్రత్యేకమైన pattern ఏర్పరుస్తాయి. అదేమిటో ఆ జీవితాన్ని పరామర్శిస్తే గాని తెలియదు. అలా పరామర్శించడమే నవల సాధించే లక్ష్యం. పాత్రలూ, కథా వేరువేరుగా లేవనీ, వ్యక్తిత్వాలూ జీవితాలూ భిన్నం కావనీ, జీవితం అర్థాన్నీ పరమార్థాన్నీ సృష్టిస్తుంది గాని ఆదర్శాలు జీవితాన్ని సృష్టించవనీ తెలుగునవల గ్రహించేపరిస్థితిఏర్పడుతున్నది. ఇంతకంటె అభ్యుదయం ఏంకావాలి?



"చావుపుట్టుకలమధ్య సందేహం లాంటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచిగంధంలాగ పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక అలంకారం"

* * *

"కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి
విస్తరించాలి చైతన్య పరిధి
అగ్నిజల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి"

—తిలక్

# నవల - కథాసంవిధానం

శ్రీ సింగరాజు లింగమూర్తి

సాహిత్యప్రక్రియలలో ఈనాడు ప్రధానంగా పాఠకుల్ని ఆకర్షించుచున్నవి కథ, నవల అనే చెప్పాలి.

కథ అందమైన జవ్వనిలాంటిది; నవల పరిపూర్ణతను సిద్ధించుకున్న సుందరమైన ప్రౌఢలాంటిది. కథకు పరిమితి తక్కువ. ఏదో ఒక సంఘటనను తీసుకొని దాన్ని ఎంతో నైపుణ్యంతో మలచి కళాత్మకంగా చెప్పడమే కథకుడి పని. అనేకసంఘటనలను సారస్యం చెడకుండా కథ అల్లడం, చిన్నకుంచెతో పెద్దబొమ్మలను చిత్రించినట్టుగా నవలను తీర్చిదిద్దడం నవలారచయితపని.

ఎంతవాస్తవికమైన ఇతివృత్తాన్ని, సంఘటనల్ని తీసుకున్నా యథాతథంగా చిత్రించడం ఫొటోగ్రఫీ అవుతుంది. వర్ణచిత్రాలకున్న ఆదరణ, గౌరవము పెన్సిల్ స్కెచ్‌లకు లేనట్టు, కళాత్మకంగా రచించిన కథలకు నవలలకు ఉన్నంత పాఠకులగౌరవాదరణలు ఫొటోగ్రఫీరచనలకు ఉండదు.

నవల మళ్ళీ-మళ్ళీ చదివించేదిగా ఉండాలి. చదివిననవల పాఠకుల హృదయాలను హత్తుకోవాలి. అదే ఉత్తమమైన నవల.

స్వాతంత్ర్యానికిపూర్వం వచ్చిననవలాసాహిత్యంతో సాతంత్ర్యానంతరం వచ్చిననవలాసాహిత్యాన్ని పోల్చి కొందరు విమర్శకులు కొంత నిరుత్సాహం అసంతృప్తి ప్రకటిస్తున్నారు. పండితులు కొందరు ఇప్పుడు వస్తున్న నవలలను ఒకసాహిత్యంగా పరిగణించడంలేదు. ఈ పరిణామం రావడానికిగల కారణాలు కూడా వీరు సహృదయంతో పరిశీలించాలి.

ఆనాటిసాహిత్యప్రక్రియలన్నీ ఉద్యమాలతో, సాంఘికసంస్కరణలతో పెనవేసుకుపోయాయి. సాంఘికదురాచారాలను, మూఢనమ్మకాలను ఆలంబనంగా చేసుకొని నవలారచన సాగించారు.

తరం మారినప్పుడల్లా పాతదానిమీద రోత, క్రొత్తదానిమీద మోజు కలగడం సహజం; భావవిప్లవం ఎప్పుడు బయలుదేరుతుందో దానితోపాటే సాహిత్య విప్లవమూ జరుగుతుంది.

దేశం ఇప్పుడున్నంత ఇబ్బందుల్లో ఆనాడు లేదు. ఈనా డున్నంతగా యాంత్రికజీవితం ఆనాడు లేదు. ఈనాడున్నన్నిపత్రికలు, అసంఖ్యాకమైన

పాఠకులు ఆనాడులేరు. అక్షరాస్యులసంఖ్య ఆనాటికంటే ఈనాడు విపరీతంగా పెరిగింది. ఆనాడు తీరుబడిగా రచనలు చేసేవారు- పాఠకులు తీరుబడిగా చదివే వారు. ఆనాటిపాఠకులు బాగా చదువుకున్నవారు. మేధావివర్గానికి చెందినవారు. రచనలుకూడా ఆపరిధిలో ఉండేవి. ఈనాటిపాఠకులు సామాన్యులు. కాస్తచదవ గలిగేవారేకాదు విద్యార్థికులకూడా ఉన్నారు. ముఖ్యంగా యువతరం పాఠకుల సంఖ్య ఎక్కువ.

యువతరంపాఠకుల అభిరుచి వేరు. విద్యార్థికులైన పాఠకులకు చదివే సావకాశం ఉండదు. ఏకాస్త తీరుబడో దొరికితే కాలక్షేపానికి, అలసినమన స్సుకు కాస్త విశ్రాంతి లేదా ఆకాసేపు ఆహ్లాదం కలిగించుకోడానికి కథలు, నవలలు తిరగవేస్తారు. ఎంతచిన్నరచనైతే అంతతేలిక వారికి. కాస్త మనస్సును గిలిగింతలు పెట్టాలి. ఏకాస్త రంజింపచేసే రచనైనా చాలు. బరువైనవి, సంక్లిష్ట మైనవి, సమస్యలతో నిండినవి అయితే చదివేఓపిక చాలామందిలో లేదు. సాంఘికనవలల్లో అది కనిపించకపోతే ఏ డిటెక్టివ్ నవలో, ఏ సెక్సునవలో పుచ్చుకుంటారు. వాళ్ళకు కావలసింది 'థ్రిల్' తేలికరచనలు.

లబ్ధప్రతిష్ఠులైన వెనుకటితరం నవలారచయితలనుగురించి యింతవరకు ఎందరో వ్రాశారు. విశ్వనాథ, చలం, అడివి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి, ఉన్నవ, గోపీచంద్, బుచ్చిబాబు మొదలైన ప్రభృతులు చిరస్మరణీయులు. వీళ్ళ ప్రభావం కొందరిపై పడిందనిమాత్రం చెప్పుకోవచ్చు.

స్వాతంత్ర్యానంతరం అనేకనవలలు వచ్చాయి. నోరివారి చారిత్రకనవ లలు విలకా గణపతిశాస్త్రిగారి "విశాలనేత్రాలు" ప్రత్యేకకోవకి చెందినవి.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చినతర్వాత పల్లెటూళ్ళలో జాజకీయాలు ఎలా పొటమరించినవీ, రాజకీయవలయంలో చిక్కుకొన్న గ్రామీణులసంఘర్షణలను, వాటివెనకఉన్న మానవప్రవృత్తిని "కీలుబొమ్మలు"లో జి. వి. కష్ణారావుగారు చక్కగా చిత్రించారు.

తెలంగాణాలో నిజాంకు వ్యతిరేకంగా జరిగిన జాతీయోద్యమాన్ని ఆధారం చేసుకొని కీ.శే. వట్టికోట ఆళ్వారుస్వామి "ప్రజలమనిషి"ని రూపొం దించారు. తెలంగాణావాతావరణంలో పోలీసుచర్యకుముందు, ఆతర్వాత ఏర్ప డిన పరిస్థితుల్ని ఆధారంగా తీసుకొని నవలలు వ్రాసినవారిలో కీ.శే. భాస్కర భట్ల కృష్ణారావు "యుగసంధి" నా ఆదర్శాలు-అంతర్యాలు, శ్రీ దాశరథి రంగా చార్యులవారి "చిల్లరదేవుళ్ళు" పేర్కొనతగ్గవి.

అనేకరాజకీయనవలలు వ్రాసి ప్రఖ్యాతి గడించినవారిలో శ్రీ మహీధర రామమోహన్‌రావుగారు ప్రథములు. సాంఘికపరిస్థితులనుకూడా జోడించి కథాకథనాన్ని నేర్పుగా సాగించి పాత్రలకు ఒకవిశిష్టతను సంతరింపజేయ డంలో రామమోహన్‌రావుగారు కృతకృత్యులయ్యారు.

సాహిత్యపువిలువకంటే వ్యక్తిగతహోదాలకారణంగానో మరేకారణం గానో కొంతమంది రచయితలకు సాహిత్యరంగంలో ఎక్కువప్రాముఖ్యం లభించిందనడం అతిశయోక్తి కాదు.

స్వాతంత్ర్యానంతరం నవలాసాహిత్యం వెల్లువలా వచ్చింది. వీటిల్లో సాహిత్యపువిలువలు గలవి, సిలిచేవి ఎన్ని అనేది విమర్శకులు చెప్పడంలేదు. కనుక కాలమే నిర్ణయించాలి.

ఈనాడు మనకున్న విమర్శకులసంఖ్య చాలాతక్కువ. కొందరువిమర్శ కులు ప్రాచీనసాహిత్యాన్ని విమర్శించడంతోనే సరిపుచ్చుకుంటున్నారు. ఒక నవలనుగురించి పొగిడినా, తెగడినా దానివెనుక ఏదో ఒకఉద్దేశం ఉంటున్నదే గాని సహృదయత కనిపించదు.

వెనుకటికంటే ఈనాడు రచయిత్రిలసంఖ్య ఎక్కువైంది. స్వాతంత్ర్యా నికిముందు నవలలు వ్రాసినస్త్రీలు ఉన్నట్టు కనిపించదు. ఇటీవలే ఈసంఖ్య మరీ పెరిగింది. ఇది శుభసూచకమే అయినా స్త్రీలు వ్రాస్తున్న నవలల్లో వైవిధ్యం ఎక్కువగా కనిపించడంలేదు. సూటిగా, వాడిగా చెప్పుకోగలరచయిత్రి లత. ఈమెరచనల్లో అటు శరత్‌ప్రభావం ఇటు చలం ప్రభావం బాగా కనిపిస్తుంది.

వ్రాసింది ఒకేనవల అయినా డా॥ శ్రీదేవి "కాలాతీతవ్యక్తులు"లో ఆమె కథాకథనంలోను, సన్నివేశాలలోను, పాత్రపోషణలోను ఎంతోశ్రద్ధ తీసుకు న్నారు. ఆమె అకాలమృత్యువు పొందకపోయినట్లయితే మరికొన్ని చక్కటి నవలలు తెలుగుపాఠకలోకానికి అందించేవారేమో!

శక్తివంతమైననవలలు సృష్టించినది శ్రీమతి రంగనాయకమ్మ. సహజ మైన సంఘటనల్ని, పాత్రల్ని తీసుకొని, నేర్పుగా కథాసంవిధానం సమకూర్చి పదునైనభాషలో నిర్భీకంగా రచచలుచేయగల రచయిత్రులలో రంగనాయ కమ్మగారొకరు.

కేవలం అబ్బాయి, అమ్మాయి ప్రేమలు, వైఫల్యాలు కాక జీవితపులోతు ల్లోకి చూసి నవలారచన చేసినస్త్రీలలో ఓ ప్రత్యేకతను సంతరించుకున్నవారు కుమారి వాసిరెడ్డి సీతాదేవి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి అనే చెప్పాలి.

సీతాదేవి "అడవిమల్లి", "మట్టిమనిషి'', సరస్వతీదేవిగారి "భవతీభిక్షాందేహి" "దరిచేరిన ప్రాణులు" ఈకోవకు చెందినవి. విశాలాక్షిగారి నవలలు కొన్ని ఈస్థాయిలోనే ఉంటాయి.

పత్రికలలో నిర్వహించినపోటీలలో బహుమతులందుకున్న నవలలన్నీ ఉత్తమంగా ఉండడంలేదు. సాహిత్యఅకాడమీఅవార్డులు లభించిననవలలు, కథా సంపుటాలు ఉత్తమమైనవిగా ఉండటంలేదు. దీనికి కారణమేమిటి అని ఆలో చించేవారు తక్కువ.

స్వాతంత్ర్యానంతరం వచ్చిన నవలాసాహిత్యంమీద విపులమైన పరిశీలన చాలా అవసరం. మనం విమర్శకులు అనుకుంటున్నవారు బుచ్చిబాబు, రాచ కొండ, కొడవటిగంటి వరకేవచ్చి ఆగిపోతున్నారు. మిగతావారి పేర్లుమాత్రం అక్కడక్కడ ఉటంకిస్తున్నారేగాని వారినవలలను గురించి విపులమైన పరిశీ లన జరుపడంలేదు.

నిజంగా ఈనాడు రచయితలను ఎదుర్కొంటున్నప్రశ్న "దేన్నిగురించి వ్రాయాలన్నది".

ఈనాడు సమస్యలు సర్వసాధారణం అయిపోయాయి. ఎటుచూసినా ప్రధానంగా కనిపించేది ఆర్థికసమస్య. దీనికితోడు రాజకీయాలప్రభావం ప్రత్య క్షంగానో, పరోక్షంగానో జీవితంమీద పడుతున్నది. స్వార్థం, ఈర్ష్య, అసూ యలు, అసహిష్ణుతలు ప్రబలిపోయాయి. దేశంలో నానాటికి దారిద్ర్యం పెరిగి పోతున్నది. ప్రణాళికలప్రగతి కనిపిస్తున్నదేగాని మానవాభ్యున్నతి కనిపిం చడంలేదు. కులాల సెగలపొగలు రగుల్కొంటూనే ఉన్నాయి. మతవైష మ్యాలు, ప్రాంతీయఅభిమానదురభిమానాలు వెఱ్ఱితలలు వేస్తున్నవి. వీటన్ని టిని ఆధారంగా చేసుకొని రచనలు చేసేవారు తక్కువ.

ఈనాడు నవలారచన రెండువిధాలుగా సాగుతున్నది. మధ్యతరగతి ప్రజలజీవితచిత్రిణం, మనస్తత్వచిత్రిణం కొందరు చేస్తుంటే మరికొందరు పాఠకులలో ఆత్యాశలు రేకెత్తించేరచనలు చేస్తున్నారు. నేలమీద సాముచేసేవారు కొందరైతే నేలవిడిచి సాముచేసేవారు కొందరు. దైనందినసమస్యలతో, ఆర్థి కపుఒడుదుడుకులతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నవారిని ఓదారుస్తూ ఒడ్డునచేర్చే తరుణోపాయమైన రచనలు చేస్తే కొంతప్రయోజనం ఉంటుందేమోగాని అటు వంటివారిమనస్సుకు ఆహ్లాదం కలిగించాలన్నది సాకుగా తీసుకొని, జీవితంలో లభించని, ఊహించని కోరికలను ప్రేరేచే రచనలు చేయడంవల్ల పాఠకుల్ని

క్రమలో ముంచి పెడత్రోవలు పట్టించడం, సంఘర్షణలను కలిగించి అశాంతి పాలు చేయడమే అవుతుంది.

ప్రేమలు-పెళ్ళిళ్ళుగురించి, మధ్యతరగతిప్రజల జీవితసమస్యలను గురించిన ఇతివృత్తాలు తీసుకొని నవలలు వ్రాసినవారు చాలామంది ఉన్నారు. కథనంలో, నన్ని వేశాలలో కొత్తదనంలేకపోవడంవల్ల ఎవరు వ్రాసినా ఒక్కమూసలో పోసినట్టే ఉంటున్నాయి. వీటినేగాక మానవతావాదాన్ని ప్రతిబింబిస్తూ, జాతిలో ప్రేమ కరుణలను, సదవగాహనను కలిగించేనవలలు వ్రాసినవారిని వేళ్ళమీద లెక్కించవచ్చు.

కొందరురచయితలు, రచయిత్రిలు ఏ ఇంగ్లీషునవలనో చదివి నేర్పుగా గడుసరిగా తెలుగులో అవి తమసొంతం చేసుకుంటున్నారు.

ఈనాడు సామాజికవిలువలు మారిపోతున్నాయి. ఈమార్పు నవలాసాహిత్యంలోనూ రావలసిందే. సమకాలీనమైన సమాజజీవితాన్ని చిత్రించేటప్పుడు తప్పనిసరి అవుతుంది. దీనితోపాటు పడిపోతున్న నైతికవిలువలను చిగురింప చేయవలసిన బాధ్యతను కూడా నవలారచయితలు విస్మరించరాదు.



"కవిత్వమునకు సిద్ధాంతములు ప్రధానములు కావు. కవియొక్క నేర్పు ప్రధానము. ఒక మహాకవి విప్లవవాది కాకపోవచ్చును. వాడు మహాకవియే. ఒక విప్లవవాదికూడ మహాకవియైనచో మహాకవియే. మహాకవికి విప్లవవాదమునకు సంబంధము లేదు. విప్లవ వాదియొక్క రచనయందలి యీ గుణములే స్వీకారములు. తదితరునియందు స్వీకారములు కావనినచో నది గుణగ్రహణపారీణత లేమి. గుణమెందున్నను గుణమే"

—విశ్వనాథ

# నవల - వాస్తవికత - కల్పన

డా. ముదిగొండ వీరభద్రశాస్త్రి

నవలారచనలో వాస్తవికత, కల్పనలనుగూర్చి కొన్ని ఆలోచనలను వెలువరించటమే ప్రస్తుతఆశయం. మొదట స్థూలంగా వాస్తవికత-కల్పన అంటే ఏమిటో నిర్ధరించుకోవటం అవసరం. కొంతమంది వాస్తవికత అంటే ఉన్నది ఉన్నట్లు, యథాతథంగా చిత్రించటం అని అభిప్రాయపడేవాళ్లు ఉన్నారు. అయితే అటువంటి యథార్థనిరూపణ నూటికినూరుపాళ్లుగా చేయటం అసంభవం. యథార్థాంశాలలోనుంచి ఎన్నికచేసుకోవటం, ఒకక్రమంలో వాటిని తీర్చిదిద్దుకోవడంలోనే కళాకారుడిఉనికికి ఒకప్రయోజనం ఏర్పడుతున్నది. కళాకారుడి చాతుర్యం, సమర్థతకూడా కొంతవరకు ఈఎన్నికలోను, ప్రదర్శనలోను ఆవిష్కృతము లౌతాయి. అందుచేతనే వాస్తవికత అంటే యాథాతథం కాదని చెప్పుకోవాలి.

ఇక కల్పనమాటకు వస్తే కథ, నవలవంటివి కల్పనాత్మకసాహిత్యప్రక్రియలు. కల్పనకు యాథార్థ్యం పునాది వంటిది. సంభావ్యత అన్నది కల్పనకు గీటురాయి. కల్పనను రెండురకాలుగా విభజించవచ్చు. ఒకరకం ఎన్నడూ, ఎప్పుడూ సంభవించడానికి వీలులేనిది- "అభూతకల్పన" అనవచ్చు. రెండవరకం సాధారణంగా ఇలా జరగదుకాని జరగడానికి అవకాశం లేకపోలేదు అన్నటువంటిది. దీనిని "యాదృచ్ఛికసంభావ్యత" అనవచ్చు.

ఎటువంటికల్పన రాణిస్తుంది, ఎటువంటిది రాణించదు అనే విషయాన్ని గూర్చి వాదోపవాదాలు చేస్తే ఎక్కువప్రయోజనం ఉండకపోవచ్చు- దేనికి తగినపాఠకులు దానికి ఉన్నారు కాబట్టి.

నవల ప్రధానంగా కల్పనాత్మకసాహిత్యప్రక్రియ గనుక, ఇందులో వాస్తవికత, కల్పనలమధ్య సమన్వయం ఎలా ఉండాలి అన్నప్రశ్న ఏర్పడుతుంది. ఈప్రశ్నకు సమాధానం చెప్పుకోవటంలో కొన్నిచిక్కు లున్నాయి. వాటిస్వరూపాన్ని ముందు ఊహించడం మంచిది.

నవలలను అన్నింటినీ ఒకేజాతిగా తీసుకోవడంవల్ల ఈచర్చ సమగ్రం కాదు. నవలలో ఎన్నోరకాలు ఉంటాయి. మాటవరసకు చరిత్రాత్మకనవల

ఉన్నది. చరిత్రాత్మకనవవలలో ప్రధానమయినఅంశం గతకాలంగో ఎన్నడో జరిగిఉండవచ్చునన్న కథాంశాన్ని, ఆనాటిప్రజాజీవితాన్ని నవలాకర్త పునర్ని ర్మించవలసి ఉన్నది. లభ్యమయ్యే చారిత్రకాధారాలపరిమితులలో ఊహను ప్రసరణంచేసి, రూపకల్పనచేయటం జరుగుతున్నది. ఇటువంటిసందర్భంలో కల్పన. వాస్తవికతలసమన్వయం ఎలా జరుగుతున్నది ? సమకాలీనసమ స్యలను, పరిష్కారాలను కూడా కొందరు నవలాకర్తలు ప్రాచీనఇతివృత్తాం లోకి చొప్పిస్తున్నారు. చొప్పించడమేకాదు, అందులో కృతకృత్యులూ అవుతు న్నారు. దీనివల్ల ఒకవిషయం స్పష్టం అవున్నది. నవీనంగా చొప్పించబడిన కొన్నిఅంశాలు కథాకాలంనాడు లేకపోయినా, అవి "అవాస్తవికం" అన్న భావం కలగకుండా రచయిత తననైపుణ్యంతో భ్రమపెట్టవచ్చు. మనుషుల చుట్టూ ఉండేపరిసరాలు, సాంస్కృతికసంప్రదాయాలు, నాగరకతలో, జీవిత విధానంలో ఒకభాగంగా పరిణమించే వస్తుపరికరసంపద. ఇవన్నీ కూడా వాస్తవికతలో అంతర్భవించి ఉన్నాయి. వీటినన్నిటినీ ఆవరణలుగా భావిస్తే బాహ్యతమఆవరణగా భౌతికవాస్తవికత ; దానిలోపల సంస్కృతీసంప్ర దాయాలు, ఇంకా లోలోపల 'మానవత' ఉంటాయి. ఆమానవతలో మారే, మారని అంశాలు ఉన్నాయి. ఆమారని, నిత్యసత్యాలను రచయిత అందుకొని ఆవిష్కరిస్తున్నంతసేపూవాస్తవికత భాసిస్తూనే ఉంటుంది. కల్పనకు ఎంతయినా విలిచ్చేఅంశాలు ఆనిత్యసత్యాన్ని అంటిపట్టుకొని ఉండాలి

సత్యాన్వేషణదృష్టి, సత్యావిష్కరణకృషి ఒక్కనవలాకర్తకే కాదు ; ఏరచయిత కయినా అవసరమే. అదే సాహిత్యానికి ప్రాణం. అయితే జీవానికి పరిపుష్టమయినదేహం ఎలా అవసరమో, అలాగే సాహిత్యంలోకూడా ఈసత్యా తకు ఉచిత వాతావరణకల్పన అవసరం. యాథాతథ్యానికి చేరువగా వచ్చే వాస్త వికకత, అంటే ఆచారాలు, కట్టుబాట్లు చుట్టూ ఉండే భౌతికవస్తుజాలము ఇవన్నీ సాహిత్యంలో జీవాన్ని ధారణచేసే శరీరభాగాలుగానే పరిగణనకు వస్తాయి.

ఈనాటినవలలలో కొన్నింటిని ఈమాట మనసులో ఉంచుకొనిచూస్తే, రచయితలశక్తియుక్తులు కేవలబాహిరస్వరూపానికే పరిమితమయిపోయినట్లు అనిపిస్తున్నది. అసలు నవలయొక్కప్రయోజనం ఏమిటి అన్నవిషయమై రచనకు ఉపక్రమించేముందు ఏమాత్రం ఆలోచించవలసిన అవసరం లేదనే కొందరి ఉద్దేశమయినా అయిఉండవచ్చు. అందుచేత, నవలలలో పుష్కలంగా

సామాన్యజీవితంలో నిత్యమూ కనవచ్చే నన్నివేశాలను వర్ణిస్తూ, వ్యక్తులకదలిక లను, యథాలాపంగా చేసేపనులను పూసగ్రుచ్చినట్లు వివరిస్తూ వాస్తవికతా ప్రదర్శనం సాధించినట్లు తృప్తిపడుతున్నారేమో ననికూడా తోస్తుంది.

ఇక రెండవది. రచయితలూ, రచయిత్రులూ తా మెన్నడూ చూచి, విని యెరుగనివిషయాలనుసైతం అలవోకగా ఎరిగిఉన్నట్లు వ్రాసి నవలలను విసరివేయటం జరుగుతున్నది. నవలలలో రచయితలు సృష్టించే పాత్రల పరిసరాలు, జీవితము, ఆరచయితలకు ఆకళింపు అయిఉండకపోవటం చేతకూడా ఈలోపం జరుగుతున్నది. వార్తాపత్రికలవారుగాని, చలనచిత్ర నిర్మాతలుగాని నవలలను ఆమోదిస్తే చాలు నన్న దృక్పథంతో వ్రాసేనవలలలో వాస్తవిక ఈవిధంగా కృత్రిమము కలుషితము కావటం గమనించవచ్చు. ముఖ్యంగా ఈవిధమయినధ్యేయానికి ఉన్నప్రభావం మన నవలలముగింపు వయిన కనిపిస్తున్నది. ప్రతిభావంతమయిన ముగింపులు మలుగా మిక్కిలి పేలవ మయిన ముగింపును అసహజంగా, కృత్రిమంగా లగించటాన్ని గమనించ వచ్చు.

ఒకపాటే కానివ్వండి, పద్యమే కానివ్వండి, కథే కానివ్వండి, నవలే కానివ్వండి, ఏదయినా మొదటిసారిగా విన్నప్పుడు, చదివినప్పుడు మనలో ఆసక్తిని రేకెత్తించే ఒకమహానుభవం కావాలి. నవలారచయితలమనస్సులలో క్షీరసాగరమథనమంత బృహత్కార్యం జరిగితే, కాలకూటరూపంలోగాని, అమృతరూపంలోగాని ఫలితం వెలువడితే అది ఒక దీప్తానుభవం అవుతుంది. ఆ అనుభవం ఎలాంటిదయినా ప్రభావాత్మకమే అవుతుంది. అది సంచలనం కలిగిస్తుంది. అప్పుడు దాన్ని వెల్లడించే సాహిత్యం కుడా ప్రతిష్ఠ సంపాదించు కొంటుంది. ఈఏర్పాటులో కొంతలోపం ఉండబట్టే గుండెనిండుగా అనుభ వాన్నిచ్చే సాహిత్యం అప్పుడప్పుడు ఎప్పుడో మాత్రమే తళుక్కుమంటుంది.

ఆవిధమయిన రచన చదువుతుంటే ఇందులో కల్పనఎంత ? వాస్త వికత ఎంత? ఇలాంటి ప్రశ్నలు తేలికగా ఉదయించవు.కల్పనను, వాస్తవికతను రెంటినీ ఇముడ్చుకున్నా, ఈరెంటికీ అతీతమయినది సాహిత్యం అనవచ్చు. అలాంటి సాహిత్యసృజనకు పరికరాలు - తెల్లకాగితాలు - నల్లసిరా మాత్రమే కావు.



# నవలలు - మహిళలు *

శ్రీ గాంధీజీ యలమంచిలి

ఈ ఇరువదిఐదు సంవత్సరములలో తెలుగు నవలా రచనలో మహిళలు చెప్పుకోదగినంత ముందుకు వచ్చారు. నవలా రచనలో ప్రజలకు అభిమాన పాత్రులైనవారిలో రచయిత్రులే ఎక్కువ. ఇతర సాంఘిక, రాజకీయ కార్యకలాపాలలో అనాసక్తి చూపించే మన దేశస్త్రీలు సాహిత్యంలో అమితాసక్తిని ప్రదర్శించడం సంతోషించవలసిన విషయం. స్వాతంత్ర్య పోరాటకాలంలో రచయిత్రుల సంఖ్య తక్కువ. వారు చేసిన రచనలు కూడ తక్కువే. కాని గత దశాబ్దమున్నరనుండి తెలుగు నవలాపరిధిని మహిళలు విస్తరింపజేశారు.

ప్రజలలో మానసిక చైతన్యాన్ని కలిగించి, వారిని శాస్త్రీయజీవనవిధానానికి మళ్ళించగలిగినవే నిజమైన నవలలు. తమ రచనలు కొన్ని వేల మంది ప్రజల ఆలోచనాసరళిపై ప్రభావం చూపుతాయనే విషయం మరువదగినదికాదు. అందువలన సాహిత్యంలో ప్రతివ్యక్తిపై సాంఘికపరమైన బాధ్యత కొంత ఉంటుంది. ప్రతి నవలా రచయిత్రి సాంఘిక ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. కొందరు రచయిత్రులు సాంఘిక బాధ్యతను తిరస్కరిస్తున్నారు. నవలారచన సరదాకోసమో కాలక్షేపంకోసమో వ్రాస్తున్నట్లు చెబుతారు. "మీరెందుకు రచనలు చేస్తున్నారు?" అంటే, చిత్రాతిచిత్రంగా సమాధానం చెబుతున్నారు. తమ రచనా వ్యాసంగం తమ వ్యక్తిగతమైన విషయంగా చాలమంది భావిస్తున్నట్లు కనబడుతుంది. ప్రచురింపబడున దేదీ తమకే పరిమితం కాదు. దాని ప్రభావం సంఘం మీద కూడ ఉంటుంది. కాబట్టి రచయిత్రి తన అభిప్రాయాలను సంఘానికి తెలియజేసేముందు బాధ్యతాయుతంగా ఆలోచించాలి.

సంఘ పరిణామాన్ని నిర్దేశించేదే రాజకీయము. కనుక రచనకు, రాజకీయాలకు సంబంధం అవినాభావమైనది. సాహిత్యాన్ని రాజకీయాలనుండి వేరుచేసి చూపాలనే ప్రయత్నం నిర్హేతుకమూ, అనర్థమూ అయినది రాజకీయ వ్యవస్థను నిర్ణయించడంలో రచయిత్రికీ బాధ్యత ఉన్నది. సాంఘిక పరిణామం

---

* యువభారతి నిర్వహించిన మహతి వ్యాసరచన పోటీలలో 'పాతికేళ్ళ (1947-72)నవలలు- మహిళలు' అన్నఅంశంపై ప్రథమబహుమతి అందుకున్న వ్యాసం.

అత్యధిక ప్రజలసౌఖ్యానికి అనువైన శాస్త్రీయ వ్యవస్థా నిర్మాణానికి దోహదం చెయ్యాలి. అదే రచన ఆశయం కావాలి. అందువలన నవలలను భాషాసౌందర్య పరమైనవి, మనోల్లాసకరమైనవి అంటూ విభజించుకుంటూ పోవడం విశ్లేషణాత్మకమేగాని, విమర్శనాత్మక పరిశీలనము కాదు.

సాంఘిక ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని తెలుగు రచయిత్రుల కృషిని పరిశీలిద్దాము. చాల కాలం వరకు ఈ విషయాన్ని ఎవరూ పట్టించుకోలేదు. కానీ ఇటీవలి విషమపరిస్థితులవల్ల నైతేనేమి, ప్రజలలో పెరిగిన రాజకీయ చైతన్యంవల్ల నైతేనేమి అందరూ ఈ విషయంపై ఆలోచించక తప్పడం లేదు. అభ్యుదయకరమైన రచనలు చేసిన మహిళలు చాల తక్కువ. రచయితలు ఎంతవరకు చేశా రన్నది ఈ వ్యాసశీర్షికలో ఇమడదు. తెలుగు నవలలు అధికం "నవీన కాశీమజిలీ కథల పునర్జన్మ" అన్న శ్రీ గోరాశాస్త్రికి అభినందనలు. ఆ వాక్యం మహిళల నవలలకు మరింత వర్తిస్తుంది.

చాలాశాతం నవలల్లో ఆర్థికంగా మధ్యతరగతిలో ఉన్న అగ్రకులాల వారిలో ఉండే sentiments ఎక్కువగా చోటు చేసుకుంటున్నాయి. ప్రస్తుత వ్యవస్థలో విద్యాసౌకర్యాలు కలిగి సాహిత్యం చేపట్టే అవకాశం ఈ వర్గంవారికి ఉండటమే ఇందుకు కారణం. ఎక్కువలో ఎక్కువ వీరు వ్రాసేది సంస్కరణ వాదం. సంస్కరణవాదం పలాయనవాదుల శరణాలయం. ఈ వర్గం వారికి ధనికవర్గజీవితవిధానం యెడల మానసికమైన బానిసత్వం ఎక్కువ. అందేతనే మన మహిళలు సృష్టిస్తున్న నవలలలో ఈ బానిసమనస్తత్వం అధికంగా కనిపిస్తుంది. ఈ వ్యవస్థలో ధనికవర్గప్రాబల్యానికి మనసు దాసోహం చేయడం జరుగుతుంటుంది. ఇట్టి మానసిక ప్రలోభంనుండి బయట పడటానికి తెలుగు రచయిత్రి ప్రయత్నించలేదు. అందువలననే రచయిత్రి తన మేధస్సును ఊహాసౌధనిర్మాణానికి వృధాచేస్తున్నది.

నవల అనగానే ఒక నాయిక- నాయకుడు, వారి ప్రేమ- పెళ్ళి, లేక వారి ప్రేమ- త్యాగము, లేక ఇరువురి ఆత్మహత్యవగైరా జీవితానికి దూరమైన విషయాలు అధికంగా కనుపిస్తాయి. రచయిత్రులు కూడ "స్వర్గ లోకంలో settings"వేసుకుంటూ పోవడం చాల బాధాకరమైన విషయం. ధనికస్వామ్యానికి ఎంతగా లొంగిపోయారంటే, అలొంగుబాటును సహనం, అహింసావాదంగా వారు ప్రచారంచేస్తుంటే, ఆ ప్రచారాన్ని వదడుగులు ముందుకు తీసుకు పోతున్నారు రచయిత్రులు. ఏది నిజమైన శాంతి ? బలవంతుడిదే రాజ్య మని నమ్మి

బలహీనుణ్ణి బానిసగా బ్రతకమనడమే సహజీవనమా? రచయిత్రులు సృష్టించిన త్యాగమయమైన పాత్రలన్నీ ఈ మోసపు సిద్ధాంతాలకు బలియైనవేకాని ఎదురు తిరిగినవి కావు.

ఓ అందమైన రాజశేఖరానికి పడవకార్లూ, రాజభవనాలూ, పడిచచ్చే స్త్రీలూ-ఇలాంటినవలలు వ్రాయడంవల్ల ఆర్థికవిషవలయంలో ఊపిరాడని స్త్రీ జాతికి రచయిత్రులు ఎంత ఉపకారం చేస్తున్నారు. ధనికస్వామ్యానికి మన రచయిత్రి ఎంత వశమై పోయిందోనని విచారించవలని వస్తున్నది. లేదా నవల "కౌసల్యా సుప్రజారామ......" అంటూ మొదలై మధ్యలో వెలయాలి చిరు నవ్వులా అసహ్యకరమైన వంపులు తిరిగి, చివరికి "ఆ మూడునామాలవాడే ఇది వ్రాయించాడు......" అంటూ ముగుస్తుంది. రచయిత్రులకు శాస్త్రీయవిజ్ఞానం కొరవడినందునే ఇటువంటి నవలలు వస్తున్నాయి.

నవల ఎల్లప్పుడూ సమకాలీన సమస్యలకు అక్షరరూపం. మహిళలు తమనవలల్లో సమస్యలను చర్చించడం జరగడంలేదు. నవల అనగానే ఊహా శక్తికి పరీక్ష కాదు. భావుకత వాస్తవానికి, శాస్త్రీయమైన ఆలోచనకూ దగ్గరగా ఉండాలనే విషయాన్ని కొద్దిమంది రచయిత్రులే గుర్తించారు.

ఎటువంటి మానవపరిణామక్రమం వల్ల మనం ఈ దశకుచేరుకున్నామో, సంఘంలోని కట్టుబాట్లూ, ఆచారాలు మార్పు కనుగుణంగా ఎలా మారుతూ వచ్చాయో రచయిత్రి తెలుసుకోవాలి. చారిత్రక సత్యాలవెలుగులో ఆచార వ్యవహారాల్లో అవసరమైన మార్పులు తేవడానికి రచయిత్రి ప్రయత్నించాలి. ఈ వ్యవస్థలో సహజంగా సంక్రమించిన ఆలోచనావిధానమే సరైనదని రచయిత్రులు భావించరాదు. అణువునుండి మనిషి వరకు పరిణామక్రమం మనకు తెలుసు. Science ద్వారా భౌతికవాదమే సత్యమన్న విషయం మనకు తెలుసు. కానీ మనం ఇంకా గ్రుడ్డిగా భావవాదాన్ని ప్రచారం చేసుకుంటున్నాం. జీవితం బుద్బుద ప్రాయము, అంతా ఈశ్వరేచ్ఛ అంటూ రచయిత్రులు ఊహాలోకంలో విహరిస్తున్నారు. కొన్నివందలమంది స్త్రీలు దేవదాసీతనం అంటూ ఊరేగితే ఒక్క రచయిత్రి ఖండించడం జరగలేదు. దురాచారాలపట్ల ఉపేక్ష ఉదాసీనత మాత్రమే కాక వాటిలో పూర్తివిశ్వాసం కూడ ఉన్నట్లు మనరచయిత్రుల రచనలు ఉంటున్నాయి. కాని భావవాదంవల్ల స్త్రీ జాతి ఎక్కువగా దోచుకోబడుతున్న సంగతి గమనించాలి.

"మతము మానవుని ప్రగతికి మత్తుమందు." అది ఏమతమైనా అజ్ఞానం దాని జన్మస్థలి. మనదేశంలో సుమారు 12 కోట్ల మంది ముస్లిమ్ మతస్థులున్నారు. పరస్పరద్వేషం కల వర్గాలు చేసే ప్రచారానికి, వారు కల్పించే మత దురహంకారానికి అంతంలేదు. హిందూ, ముస్లిం తదితర మతాలమధ్య సామరస్యం అవసరమని చెప్తారు. అజ్ఞానాన్ని ఆలంబనంగా తీసుకుని పెరుగుతున్న ఈ విషవృక్షాలను కూకటివ్రేళ్ళతో పీకివేయడం అవసరం. రచయిత్రులు తమ రచనల్లో తమ మత సంప్రదాయాలనే పాటిస్తున్నారు. సంస్కరణవాదులైన రచయిత్రులు మతసామరస్యాన్ని ప్రభోధిస్తారు. కాని మౌలికమైన భౌతిక వాదాన్ని ఏ రచయిత్రీ ఇంతవరకు ప్రచారం చెయ్యలేదు. దేశంలో ఎప్పుడూ ఈ అవాస్తవికమైన విషయాలపై హత్యలు, కొట్లాటలు జరుగుతూనే ఉన్నాయి. కానీ మన రచయిత్రులకు ఈ విషయం ప్రేరేపణ కలుగజేయలేదు.

సాంఘిక దురాచారాలవల్ల పురుషస్వామ్యం ఏర్పడింది. అశాస్త్రీయమైన ఆలోచనే అన్ని దురాచారాలకు మూలమని, అదే మనదేశ పతనావస్థకు కారణమనీ పదే పదే చెప్పవలసి వస్తోంది. పురుషుడు విధించిన నియమాలలోనే స్త్రీ ఊపిరి తీసుకోవాలి. స్త్రీకి స్వంత ఆలోచన, స్వతంత్ర జీవనమూ లేవు. ఈ సమస్యతీవ్రత వల్లనైతేనేమి దైనందిన జీవితంలో ఈ సమస్య స్త్రీని ఎక్కువగా ఆలోచింపచెయ్యడం వల్లనైతేనేమి, కొందరు రచయిత్రులు పురుషస్వామ్యాన్ని ప్రధానంగా వ్యతిరేకిస్తున్నారు. ఇదైనా సంతోషించ దగినది.

స్త్రీకి ఆర్థికస్వాతంత్ర్యం లేకపోవడం పురుషస్వామ్యానికి అనుకూలపరిస్థితి. ప్రేమ, అనురాగము మొదలైన సెంటిమెంట్స్‌తోనూ, తండ్రిపైనో భర్తపైనో ఆధారపడి ఆలంబన జీవితాన్ని ప్రోత్సహించే పాత్రచిత్రణతోనూ స్త్రీ అస్తిత్వాన్ని దెబ్బతీయడం జరుగుతున్నది. స్త్రీ తనపరిస్థితిని గురించి ఎన్నడూ ఆలోచించుకోకుండా చెయ్యగలుగుతున్నారు. స్త్రీ అవిద్యకూడ ఈ పరిస్థితికి దోహదం చేస్తున్నది. పెట్టుబడిదారీవర్గము విద్యావ్యాప్తిని నిరోధిస్తుందనే వాదన ఒకటి ఉంది. దీన్నిబట్టిచూస్తే వర్గమనస్తత్వంతో ధనికవర్గాలు వన్ని నవలలో స్త్రీ చిక్కుబడి ఉంది. ఐతే రచయిత్రులు ఈ సత్యాన్ని గ్రహించినట్లు కనబడరు. అందుచేతనే వారు ఈ దారుణపరిస్థితులకు అనుకూలంగా రచనలు చేస్తున్నారు. Hero worship నవల లెన్ని వచ్చాయో మనకు తెలుసు. ఈ తరహా నవలారచయిత్రులు ఎంత బానిస మనస్తత్వంతో ఉన్నారో అర్థమవుతుంది. స్త్రీ పురుషుల ప్రకృతి సహజమైన సంబంధాలను త్రోసిపుచ్చ

డం కాదు కానీ పురుషస్వామ్యాన్ని ఖండించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

అన్ని సమస్యలకు మూలము ఆర్థికసమస్య. ఆర్థికసమస్యతో ముడిపడినది రాజకీయము. కనుక ఆర్థికరాజకీయసమస్యలు రెండూ వేరువేరు కావు. రచయితలకున్న రాజకీయాభిలాష, పరిజ్ఞానము చెప్పుకోదగినవికావు. కాని రచయిత్రికి రాజకీయదృక్పథము చాల అవసరము. గాంధీప్రజాస్వామ్య మనీ, నెహ్రూ ప్రజాస్వామ్య సామ్యవాదమనీ, ఇందిరాగాంధీ సామ్యవాదమనీ చెప్తూవచ్చారు. మళ్ళీ సోషలిస్ట్‌లకు, కమ్యూనిస్ట్‌లకు, కాంగ్రేసువారికీ ఎవరిసామ్యవాదం వారి కుంది. ఇలాంటి పరిస్థితులలో సరైనమార్గాన్ని సాహిత్యం నిర్దేశించాలి. రచయితలూ, రచయిత్రులూ అన్నవిచక్షణ లేదు. రాజకీయాలను చర్చించిన తెలుగు రచయిత్రులు ఎవరైనా ఉన్నారా? ఓటర్లలో 50 శాతంపైగా స్త్రీలే. రాజకీయాలు కేవలము పురుషులకు సంబంధించిన విషయంగా రచయిత్రులు వదలివేశారు. ఒకస్త్రీ ప్రధాని ఐతేనో, రాష్ట్రానికి ముఖ్యమంత్రిఐతేనో దేశంలో స్త్రీలంతా ముందంజ వేస్తున్నారని అనడం హాస్యాస్పదం.

మానవ శరీరధర్మాల్లో కామము ఒకటి. చాలామంది రచయిత్రులు sexను ఇంకా పాపమన్నట్లు భావిస్తున్నారు. అదీ ఆకలి, నిద్రవంటి సహజగుణాల్లో ఒకటి. ఈవ్యవస్థ సృష్టించే కామప్రలోభాలకు బలైపోతున్న స్త్రీలు కొందరైతే కామాన్ని పవిత్రకార్యమంటూ చేసే ప్రచారానికి బలైపోతున్నస్త్రీలు కొందరు. "ఆరోగ్యకరమైన sex జీవితాన్ని గడపడం స్త్రీ అలవర్చుకోవాలి" అన్న రంగనాయకమ్మగారికి అభినందనలు. సహజమైనకామాన్ని రహస్యంగా, పాపంగా భావించే స్త్రీపురుషులను educate చేయవలసినఅవసరం ఉంది. అప్పుడు సంఘంలో వ్యక్తిమేధస్సును తొలుస్తున్న కామప్రలోభాలు తొలగింపబడతాయి.

కొంతమంది రచయిత్రులు వేశ్యావృత్తిని విమర్శిస్తూ నవలలు వ్రాశారు. కూటికోసం వేశ్యావృత్తి నవలంబించే దారుణపరిస్థితులను, ఆస్త్రీ మానసికక్షోభను వర్ణించడం జరిగింది. కానీ మౌలికపరిస్థితులను రచయిత్రి గుర్తించడంలేదు. వేశ్య, విటుడూ ఇద్దరూ ధనస్వామ్యం సృష్టించినవారే. శాస్త్రీయమైన సెక్స్ పరిజ్ఞానం లేకపోవడం, అశాస్త్రీయమైన వివాహవ్యవస్థ, ఆర్థికఅసమానత సృష్టించిన మానసిక ప్రలోభాలు వేశ్యరికాన్ని సృష్టిస్తున్నాయి. ఈఒత్తిడులనుండి స్త్రీని సంరక్షించడానికి రచయిత్రులు పూనుకోవాలి.

సమకాలీనరచయిత్రులలో కొద్దిమంది సాంఘికప్రయోజనసంకల నవలలు వ్రాయడం చాలాసంతోషకరమైన విషయం. శ్రీమతి రంగనాయకమ్మ, శ్రీమతి

బీనాదేవి ముందు పేర్కొనదగినవారు. స్త్రీలను జాగృతంచేసేరచనలు చేసిన వారు రంగనాయకమ్మగారు. స్త్రీ బానిస బ్రతుకును నిరసిస్తూ, సాంఘికదురాచారాలకు బలైనస్త్రీకి వ్యక్తిత్వాన్నిస్తూ, పురుషుని అమానుషాన్ని ఖండిస్తూ వీరు సృష్టించినపాత్రలు తెలుగువారికి అభిమానమైనవి. కులాంతరవివాహాన్ని సమర్థిస్తూ "బలిపీఠం" వ్రాశారు. "కళ ఎందుకు ?" "స్వీట్‌హోమ్" అన్ననవలల్లో స్త్రీ స్వతంత్రవ్యక్తిత్వాన్ని ప్రతిపాదించారు. ఆర్థికవిషవలయంలో చిక్కుకున్న "జీవితాన్ని" వెదికిపట్టుకుని స్తబ్ధులైన ప్రజలకు చూపించడానికి ప్రయత్నిస్తున్నారు. శ్రీమతి బీనాదేవి Hero worship కథావస్తువు మొదలైనపక్కినుండి తప్పుకొని ఈవ్యవస్థవర్గతత్వాన్ని చాల చక్కగా చిత్రించిననవల వీరి "పుణ్యభూమీ కళ్ళుతెరు !". స్త్రీsexజీవితానికి సంఘం విధించిన కట్టుబాట్లను నిర్భయంగా ఎదిరించి నవలలు వ్రాశారు చలంగారి హేమలత. కానీ మనసుకు వచ్చిన ప్రలోభాలను అభూతకల్పనలద్వారా, విశ్వసింపజేయడానికి "లత" కొన్ని నవలల్లో ప్రయత్నంచేయడం విచారించదగినది. సామాజికసమస్యలను కథావస్తువులుగా స్వీకరించి రచనలు చేస్తున్నవారిలో శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి ఒకరు. సమస్యలను వ్యంగ్యహాస్యధోరణిలో వ్రాయడం శ్రీమతి పురాణం సీతప్రత్యేకత. అత్తగారి భానుమతి తెలుగుసాహిత్యానికి "వెరైటీ" నందిస్తే, శ్రీమతులు యుద్దనపూడి, అరికెపూడి రచయిత్రులు నవలలకు మార్కెట్ పెంచారు. ఏవిధంగాను పేర్కొనదగని Commercial రచయిత్రులు ఎంతోమంది ఉన్నారు.

ఇన్నివేలరచనలు వెలువరించిన ఇంతమంది రచయిత్రులు ఎంతసాంఘిక పరిణామాన్ని తీసుకువచ్చారు ? శాస్త్రీయమైన సామ్యవాద సమాజనిర్మాణానికి వారిరచనలు ఎంతవరకు దోహదం చేస్తున్నాయి?ఇది రచయిత్రులు ఆత్మవిమర్శ చేసుకోవలసినసమయం. శాస్త్రీయమైన ఆలోచనలతో, రాజకీయచైతన్యంతో రచయిత్రులు ముందుకు రాగల రని, నిర్వీర్యమైన ఈజాతిని ప్రగతిమార్గాన నడిపించగలరచనలు చెయ్యగలరని ఆశిద్దాం.



# తెలుగుకథ - తెలుగుదనం

శ్రీ మధురాంతకం రాజారాం

వరదవెల్లువవల్ల దేశానికెంతగా అపకారం జరిగినా, దానిపుణ్యమా అని పొలాల్లో ఒండలిమట్టి పేరుకపోతుంది. నేల సారవంతమౌతుంది. ఇచ్ఛ, ఓపిక ఒకదానికొకటి తోడైతే పుష్కలంగా కొత్తరకం పంటలు సైతం పండించవచ్చు. బ్రిటిషు పరిపాలన వరదవెల్లువలా దేశాన్ని ముంచెత్తింది. ఆ కీడులో నుంచీ మన సాహిత్యప్రపంచానికి ఒనగూడినమేళ్ళు నాలుగైదింటిలోనూ చాలా ముఖ్యమైనది కథానిక.

బహుశా ఈ కథానికాప్రక్రియ మనకు వైదేశికమైనది కావడంవల్లనేగావచ్చు, తెలుగుజాతి జనజీవితాన్ని చిత్రించడంలో యిది ఏమాత్రం కృతకృత్యత పొందిందన్న ప్రశ్న యిప్పు డెదురౌతూవుంది.

ఇప్పు డిలా ప్రశ్నించుకోడం సముచితం మాత్రమేకాదు. సకాలికం గూడా! ఎందుకంటే తెలుగులో కథానిక పుట్టి నేటికి దాదాపుగా ముప్పాతిక శతాబ్ది కావస్తూ వుంది. ఆంధ్రావళికి సమ్మోదం కలగజేయడమే, ధ్యేయంగా కలంపట్టిన కవిబ్రహ్మలా, గురజాడ అప్పారావుగారు మూఢవిశ్వాసాల రుగ్మతలో చివికిపోతున్న సమాజంకోసం సరిక్రొత్తటానిక్కులు తయారుచేయడంలో సలిపిన ప్రయత్నాలలోనుంచీ తెలుగుకథానిక మొదటిసారిగా వెలుగు చూచింది. సాహిత్యాన్ని ప్రజలకు చేరువగా తీసుకునివెళ్ళే సత్సంకల్పంతో యిరవయ్యోశతాబ్దం మొదటి పదేళ్ళల్లో బందరునుంచి కృష్ణాపత్రిక, బొంబాయి నుంచి ఆంధ్రవారపత్రిక ప్రారంభించబడ్డాయి. వీటితోబాటుగా సాహితి, వినోదిని లాంటి పత్రికలుగూడా విరివిగా కథలను ప్రచురించేవి. ఆ తొలిరోజుల్లో ఈ సాహిత్యప్రక్రియకు అంతో, యింతో ప్రజాదరణ చేకూరుతూ వచ్చిందంటే అదంతా చింతా దీక్షితులు, పూడిపెద్ది వేంకటరమణయ్య, వేలూరి శివరామశాస్త్రి, రాయసం వేంకటశివుడు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిలాంటి రచయితల కృషిఫలితం.

ఆధునికాంధ్రసాహిత్యచరిత్రలో మరపురాని సంవత్సరం 1924. 'ఆంధ్రహృదయమునందు స్వకీయమైన స్వరూపభావమును నిర్ణయించి,

స్వధర్మము నారాధింపవలె' నన్న విశ్వదాత మహదాశయంలోను.చి ఆ యేడాది 'భారతి' మాసపత్రిక అవతరించింది.

నాటినుంచీ మళ్ళీ పాతికేళ్ళదాకా ఈ కథాసాహిత్య క్షేత్రంలో కొనసాగుతూ వచ్చిన నిర్విరామ వ్యవసాయంయొక్క స్థాయి, వైవిధ్యం ఏపాటివో తెలుసుకోగోరేవారికి 'భారతి' రజతోత్సవసంచిక బాగా ఉపకరిస్తుంది. అందులో వచ్చిన కథ లయిదు. ఎదురుచూచిన ముహూర్తం (పాలగుమ్మి పద్మరాజు), ఓ పువ్వుపూచింది (చలం), ఉన్నతోద్యోగాలు (కరుణాకుమార), లేచిపోయిన మనిషి (కొడవటిగంటి కుటుంబరావు). అసావేరి (మల్లాది రామకృష్ణశాస్త్రి). బుచ్చిబాబుగారి నాటకం రావడంవల్ల రజతోత్సవసంచికలో ఆయనకథ ప్రచురితం కాలేదు.

ఇంతవరకూ చెప్పింది మన కథాసాహిత్యంలో సంగ్రహంగా రెండు తరాల కథ. మూడోతరం కథకులకథ కొంచెం ముందూవెనుకగా స్వాతంత్ర్య భానూదయం దగ్గరినుంచే ప్రారంభమవుతుంది.

## 2

అనస్తంగత సూర్యసామ్రాజ్యవాదులు పడవెక్కి తిరుగుప్రయాణం పట్టిన తర్వాత తలపైనుంచి కొండంతబరువు దిగిపోయినట్టు హాయిగా స్వేచ్ఛగా భారతదేశం వూపిరి పీల్చుకోగలిగింది. పరాయివారి పరిపాలనతో బాటుగా స్వదేశంలో యింకా తమతమ పరగణాలను ఏలుకుంటున్న నాటుదొరల జులుంను సైతం మాఫీ చేస్తూ సంస్థానాలవిలీనీకరణ జరిగింది. రాజులకాలం పోయిందహో, ప్రజలరోజులు వచ్చేశా యనుకున్నారు జనం. ఈసాంఘిక పరిణామానికిన్నీ, భావవిప్లవానికీ గూడా చక్కటిప్రతీక కవికొండల వెంకటరావుగారి జమీందారు కథ. అతడు నిన్నటివరకు ఆకొంప్ర కధిపతి. వేల కొద్దీ ఎకరాలకు జమీందారు. నిన్నటివరకూ ఆచుట్టుపట్టంతకూ అత డెంత చెబితే అంత! నేడొక్కశాసనంతో అతని జమీ లాగివేయబడింది. 'నీయిష్ట మున్నచోటికి నీచరాస్తితో వెళ్ళిపోవచ్చు. మరి ఇందు గల సెంటుభూమి నీది గాదు. ఇక్క డుండడానికి నీకు ఇల్లులేదు. వల్లకాదు-.' అని సర్కారువారు నిష్కర్షగా ముదల యిడినారు. అతడు ప్రచ్ఛన్నంగా బల్లకట్టుమీద కాలువ అవలిగట్టుకు (తన రాచరికపు సరిహద్దుకాబోలు!) దాటి అక్క డొక చింత చెట్టు మొదలు కానుకొని కూర్చున్నాడు. సవారీమేనాలో బోయీలు మోసితెచ్చిన

ఆతడిఅర్ధాంగి- నిన్నటివరకూ ఆప్రాంతానికి దొరసాని, కాలవలో స్నానం చేస్తూంది. ఇంతలో ఎక్కడనుంచి వచ్చిందో ఓకాందిశీకాంగన, ఇల్లు లేక, వాకిలి లేక ఏ కడనూ రక్షలేక, భిక్షలేక ఓజీర్ణపత్రంలా ఎక్కడికో కొట్టుక పోతున్న ఒక నిర్భాగ్యస్త్రీ ఆమేనాలో దూరి కూర్చుంటుంది. బోయీలు సవారీ మోసుకెళ్ళిపోతారు. ఆమాజీజమీందారుదంపతులు దిగాలుపడి ఒకరిముఖం ఒకరు చూసుకుంటూ అక్కడే దిగబడిపోతారు.

'కామమ్మ పుట్టగానే కరువొచ్చినాది' అన్నపాటను మళ్ళీ ఒకసారి సార్థకం చేయదలచినట్టుగా, స్వరాజ్య మనే కామితార్థం ఈడేరిందో లేదో వరా మర్శించి రాకపోతే బాగుండదనుకున్నట్టుగా కరువురాకాసి కదలివచ్చి తెలుగు గడ్డపైన విడిదిచేసింది. మిరపమడి మాడిపోగా, జొన్నకంకి కంటి కగుపించక పోగా, చీనీతోట ఎండి సంగీతం వినిపించకపోగా, మెట్టపొలాల బక్క రైతుకు అడుగుజూని కడుపుతరిగిన మోటబావిలో తనమాటలే తిరిగి తిరిగి విని పించాయి. కొత్తగా దొరతనాన్ని చేపట్టిన ప్రజాప్రభుత్వ సరదార్లు గ్రామసీమల్లో తెరిచిన గంజికేంద్రాల్లో మోతుబరులదే పెత్తనమైపోయి, వాళ్ళు బియ్యమూ, జొన్నలూ కాజేసి మిగతా భాండీలో ఇంతవుప్పు, అన్ని వుల్లిపాయలూ వేసి చుట్టుప్రక్కల పల్లెలనుంచి అయిదారుమైళ్ళు నడిచివచ్చిన అనాధలకు వేడినీళ్ళు వడ్డించసాగారు. ఆకలితోనేగాకుండా వడదెబ్బతోగూడా ఎన్నోప్రాణాలు గుటుక్కుమన్న ఆగడ్డురోజుల్లో సైతం ఈతెలుగుసీమ పృథ్వీపుత్రులు కళ్ళ ప్రమిదెల్లో ఆశలవత్తులు వెలిగించి దీపాలు పెట్టుకున్నారు.

ఆనాటి తెలుగువాడి ఆశాకిరణం పేరు ఆంధ్రరాష్ట్రం! 'కలదోయి తెలుగు జోదుల తుటారికటారి చెలరేగి నగర చీల్చినదినమ్ము' అన్న జాతీయావేశం అప్పుడు తెలుగువాడి అంతరంగం నిండుకూ శివతాండవం చేస్తూంది.

మునిపల్లెరాజుగారి 'వీరకుంకమ' కథలో హంపీశిథిలాలు చూసిననాటి రాత్రి తనసహపాఠకుడి ముసలితండ్రితో రాజు అనే కాలేజివిద్యార్థి చెప్పిన మాటలు వినండి. "జన్మభూమి కరువుగడ్డ కావచ్చు. ఎడారి ఇసుకతిప్ప కావచ్చు. బీడు, కంచె, వరద, చవిటిదిబ్బ కావచ్చు. కానీ మనల్నికన్న తల్లి. తల్లిని మనం ప్రేమించకపోతే మరెవరిక వాత్సల్యం. మనప్రేమ చివరికి హంపీ శిథిలాలై, రుద్రభూమియై దక్కుతుందేమో. దక్కవచ్చు. కాని ఈశిథిలాల నుండి కొత్తసౌందర్యంతో తల్లిప్రకృతి నిలుస్తుంది. చీలి చెదరిఉన్న తెలుగు జాతి ఒకరాష్ట్రం కిందికి వస్తుంది. దానితో మన నందికొండ, మనసిద్ధేశ్వరం,

మనరామపాదసాగరమూ వస్తాయి. తెనుగునాడంతా దీపావళిరాత్రిలా వెలిగే రోజులు, ఈ కరువునూ, దరిద్రాన్నీ నిరాశనీ ఎరగనిరోజులు వస్తాయి!

కానీ ఆవేశం మాత్రమే కాదు, తెలుగువాడిలో ఆలోచన, ఆంతరంగిక విమర్శగూడా బాగానే వున్నాయన్నారు రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు. తెలుగు వారి ప్రాంతీయాభిమానాల కథ ఎవ్వ రెరుగనిది? పోతనామాత్యుడి జన్మస్థలాన్ని గురించి జరుగుతున్న వాగ్వాదం ఒక్కటీ చాలదా దృష్టాంతానికి? అందుకనే ఆయన వేడివేడిగా ఓ చురక అంటించారు. కథ పేరు 'గుంటూరు'. ఎక్కడ లేని ప్రాముఖ్యతను తమతమ స్వస్థానాల కంటగట్టడంలో ఓ గుంటూరువాడికీ, విశాఖపట్టణం వాడికీ మధ్య ఏర్పడిన పోటీయే ఈ కథకు ఇతివృత్తం! నిష్ఠుర సత్యమే మరి- గుంటూరు మిరపకాయలాగా!

వెర్రితలలు వేయగూడదేగానీ, స్వస్థానవేషభాషాభిమానాలు ఎవరికైనా కొంతవరకూ అవసరమే! ఈ విషయంలో మన పొరుగున వున్న తమిళ సోదరు లది వీరశైవంలాంటి తీవ్రతత్వం. వాళ్ళతో పోల్చి చూచుకుంటే తెలుగువాళ్ళ అభిమానాలు బాగా హద్దుకు లోబడి వున్నట్టే తోస్తుంది. రాష్ట్రసిద్ధి తర్వాత ఆంధ్రమాతను గురించిగానీ, ఆంధ్ర పౌరుషాన్ని గురించిగానీ పద్యాలు, గేయాలు వెలువడక పోవడం బట్టిచూస్తే, ఆ వున్న అంతో యింతో రాష్ట్రీయాభిమానం గూడా నానాటికీ తీసికట్టయి పోతుందనే చెప్పాలి. దురభిమానం లాగే నిరభి మానంగూడా ఆరోగ్యలక్షణం కాదేమో! 'భీమమండలం బెక్కడ, అన్య మండలము లెక్కడ' అన్నాడు శ్రీనాథుడు. ఆయన వర్ణనవల్ల భీమమండల శోభ గోడకు తగిలించి పెట్టిన చిత్తరువులా మనసులో మెరిసిపోతుంది. అలాగే ఆధునికకావ్యం పెన్నేటిపాట ద్వారా పెన్నేటి గట్టు పరిసరాలు, అక్కడి ప్రజల జీవన విధానమూ మాసిపోకుండా స్మృతిపథంలో చోటు చేసుకుంటుంది. అందుకనే తెలుగుకథ ఈ సీమ ప్రకృతి సౌందర్యాన్ని, కాదా ప్రకృతి బీభ త్సాన్నీ, యిక్కడి జనజీవనాన్ని ఎంతవరకూ సాహిత్యంలో నిబద్ధం చేయగలి గిందన్న ప్రశ్న మన కిక్కడ సహజంగానే ఎదురవుతుంది. గోదావరినిగురించి వినని తెలుగువా ళ్ళెవరు? ఆమాట వింటే ప్రాణం లేచివచ్చినట్టుంటుంది. నూటి కొకరిద్దరు మినహా మిగిలినవారు గోదావరి నొకసారి కనులారా తిలకించే భాగ్యానికి నోచుకుని వుండరుగనుక అసంఖ్యాకులైన ఆంధ్రుల పాలిటికి అది ఒక కల. గోదావరే ఒకకలైతే ఇకదానిపైన పడవప్రయాణంసంగతి చెప్పనే అక్కర్లేదు. పాఠకుల అదృష్టం కొద్దీ పాలగుమ్మి పద్మరాజుగారొక కథ

వ్రాశారు. తెలుగుకథకు అంతర్జాతీయప్రతిష్ఠ తీసుకొచ్చినందుకేగాదు, 'పడవ ప్రయాణం' వ్రాసి పాఠకుల హృదయాల్లో గోదావరిపైన పడవప్రయాణాన్ని గురించిన మధురానుభూతిని ప్రోగుచేసినందుకు గూడా ఆయన అభినంద నీయులు. రాయలసీమ రాళ్ళసీమే నన్నది రూఢిగా వున్న ఒక అభిప్రాయం. ఆ రాయలసీమలో కొన్ని పల్లెటూళ్ళు అత్యద్భుతమైన ప్రకృతి సౌందర్యానికి విడుదులని చెరకుపల్లి జమదగ్నిశర్మగా రొక కథ వ్రాసేదాక చాలామందికి తెలియదేమో! ఆ కథపేరు 'మరువురాని ఆవూరు'. మదనపల్లె దగ్గర ఓ చిన్న పల్లెటూరది. ముగ్గురు కుర్రవాళ్ళు ఆవూరిచుట్టూ తిరగడమే కథలోని సారాం శం. ఆంధ్రదేశానికి చెందిన మరొక ప్రాంతపు ప్రకృతి రామణీయకతను అపు రూపమైన పదచిత్రాలతో రూపు కట్టిస్తారు బుచ్చిబాబుగారు. 'ఆ పచ్చటి పర్వత శిఖరాలు నీలి ఆకాశాన్ని మేలిముసుగులా కప్పుకున్న తెల్లమేఘాన్ని అన్వేషించి, అందుకోలేక అలసి క్రిందికి క్రుంగి లోయగా సాగారి నగ్నంగా పవ్వళించిన ఏకాంత కన్యలు. విషాదంలో జుట్టు విరబోసుకున్నట్టు చుట్టూ దట్టమైన అడవి. పైనవేసుకున్న ముంగురులులా వికృతమైన చెట్ల మ్రానులు వర్షపు నీటికి చారలు తేరిన నల్ల కొండరాతి బీటలు, ఆశకి భ్రమించి, కళ్ళు తెరిచినట్లు శిఖరాలమధ్య విడిన మబ్బుసీడలు, వక్షాల మధ్య బాధతో జారిన కన్నీరు మాదిరి వంకరలు తిరిగి అదృశ్యమయ్యే రోడ్డు, నగం ఎండిన పిల్లనదీ, తమ అందానికి తలలు వంచి పాదాలకేసి చూసుకున్నట్లు క్రిందికి, యింకా క్రిందికీ అధోలోకంలోకి దిగజారిపోతున్న అదృశ్యం, ఆ అనుభవం అరకులోయ'. (కథ పేరు: అరకు లోయలో కూలిన శిఖరం).

కృష్ణా గోదావరుల్లో తరచుగా వరదలొస్తాయి. నిండుపంటలు తుడిచి పెట్టుకపోతాయి. నీళ్ళెక్కువైనా చిక్కే, తక్కువైనా చిక్కే. పల్నాటిసీమ వాడు జోగినాథం. విజయవాడలో కొత్తగా ఉద్యోగంలో చేరి 'ఇక్కడ ఒంటి నిండుకూ పుష్కలంగా కావలసినన్ని నీళ్ళు పోసుకుంటున్నాను. కడుపుదీరా నీళ్ళు త్రాగుతున్నాను. నా వొంటిరంగుగూడా మారింది' అంటూ యింటికి ఉత్తరం వ్రాస్తాడు. చివరి కతడు తన చన్నీటిస్నానం మోజులో కృష్ణలో మునిగి కొట్టుకపోతాడు. ('నీళ్ళు— పెద్దిభొట్ల సుబ్బరామయ్య). ఇంత నంగటి ముద్ద వేయించిన దేవదారాకుతో కలిపి చిక్కంలో పెట్టుకొని గొడ్డుగోదల మేతకు బోద కోసుకొచ్చే నిమిత్తం కొండలకు బయల్దేరి వెళ్ళే రాయలసీమపల్లీ యుల విషాదోదంతాల నెన్నింటినో కె. సభా గారు తన కథల్లో చిత్రించారు ఏ

పాఠకజనాన్ని గురించైతే వ్రాస్తున్నారో, వారి భాషలోనే కథ నడిపించడం మా గోఖలే ప్రత్యేకత. మోతుబరి ఆసామి రత్తయ్య పట్టుపంచ సుడిగాలి కెగిరిపోతే ప్రాణం పణంగా పెట్టి ముళ్ళకంచెలో పడి, తాటిచెట్టెక్కి ఒళ్ళంతా రక్తసిక్త పర్యంతం కాగా, ఆ బట్టను వదిలంగా రక్షించుకుని ఆవే వందవేలనుకుంటూ మురిసిపోయిన మడివేలు గూగడు తెలుగు సమాజపు చీకటి కోణం అట్టడుగున బ్రతుకు వెళ్ళదీస్తూ, ఒక వట్టాన కంటికి కనిపించనివాడు. తన జీవశక్తినంతా సంఘానికి ధారపోసి, జీవచ్ఛవంలా మిగిలిన ఈ గూగడి కథకు కథకుడు కొలకలూరి ఇనాక్ 'పిండీకృతశాటి' అని పేరు పెట్టారు. ఈయనదే మరొక కథ 'తలలేనోడు'. తరతరాల కులాహంకార కాళీయఫణి ఫణంమీద ఈ కథ చిన్నకృష్ణుడిలా భరతనాట్యం చేస్తుంది. తాడిగిరి పోతరాజుగారి కథ 'సృష్టి' సైతం యిలాంటిదే! నాలుగు పడగల హైందవ నాగరాజు కట్టుకున్న పురాతన వల్మీకం పునాదులతో సహా కదిలిపోతూ వుండడం యిందులో మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ఐతే యిక్కడొక మాట చెప్పాలి. అరుదుగా కొన్ని మంచికథలు వచ్చినంత మాత్రాన కథాసాహిత్యం జనపదాల్లో చెలరేగుతున్న జీవనసంరంభాన్ని, బ్రతుకు పోరాటాన్ని, ఆకలి ఆరాటాన్ని సమగ్రంగా చిత్రించిందనుకోడం సత్యదూరమే! ఇప్పుడు వెలువడుతున్న కథల్లో మన వల్లెటూళ్ళ సామాజిక వ్యవస్థలోని మంచిచెడ్డలను పరామర్శిస్తున్నవి నూటి కొకటి రెండు మాత్రమే! ఇందుకు కారణం మన కథకుల్లో ఎక్కువ మంది మధ్యతరగతి కుటుంబాలకు చెంది, బస్తీ నాగరికతకు అలవాటుపడ్డమే గావచ్చు. పనిగట్టుకుని సమాజపు అట్టడుగు పొరల్లో మెదలుతున్న పీడితతాడిత ప్రజానీకాన్ని గురించి వ్రాయాలన్న పూనిక ఒకటి యిప్పుడిప్పుడే పొడసూపుతూ వుంది. (చూడండి: ఇటీవల సృజన, వేకువ మాసపత్రికల్లో వస్తున్న కథలు).

## 3

మునిమాణిక్యంవారి 'కాంతం' ముద్దరాలు. 'భర్త' గూడా ఆమె కన్ని విధాలుగా తగినవాడే! ఆ జంటను చూస్తే ఎవరికైనా 'ఇంతమంచి దగునే దాంపత్య' మన్న ఆశ్చర్యం కలుగుతుంది. అలాంటి అన్యోన్యదాంపత్యంగనుక సమకూరినట్టయితే అడవిలోకి వెళ్ళి గుడిసె వేసుకున్నప్పటికీ జీవితం ఒకతియ్యటి పాటలా సాగిపోవచ్చు ననిపిస్తుంది. మన కథాసాహిత్యంలో 'కాంతం' దంపతుల లాంటి జంట లింక లేవేమో నని వితర్కించవలసినపని లేదు. కె. రామలక్ష్మి

గారి పార్వతీకృష్ణమూర్తు లున్నారు. ఇచ్ఛాపురం జగన్నాధరావుగారి సుజాతా రావు లున్నారు. పార్వతీకృష్ణమూర్తుల్లో పార్వతిదే పైచేయిగా తోస్తుంది. సుజాతారావుల దాంపత్యం వెంకిపెళ్ళాం, గడుసుమొగుళ్ళ కలయికకు నమూనా. సుజాతవుడుకుమోత్తనం ఎంతో ముద్దుముద్దుగా వుంటుంది. కాంతం, పార్వతి, సుజాత—ఈ మూడుపాత్రలూ వరుసగా మూడుతరాల తెలుగువారి సాంసారిక జీవనానికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్టుగా తోచడం ఒకవిశేషం. వీళ్ళ ముగ్గురినిగురించి తలచుకున్నప్పుడల్లా 'పతికౌగిటిలో వరవశమయ్యే పడతి బ్రతుకు' కన్నా మధురమైనది మరొకటి లేదని అనిపిస్తుంది. అలానీ ఆడ బ్రతుకంతా మధురమనీ, ఆడబ్రతుకులన్నీ మధురమైనవని అనుకోగలమా? కాదని చెబుతుంది అనుభవం. 'అవనిలో నావంటి ఆడుజన్మముకంటె చెట్టుగా నడవిలో పుట్టవచ్చు' అన్నదిగూడా ఒక తెలుగుమహిళేగదా! ఒక అమ్మ కన్నబిడ్డను తీసుకెళ్ళి, పెద్దసమిష్టిసంసారంలో పడవేస్తే, ఆక్కడామెకు ఎదురయ్యే మల్లిగుల్లాలె లాంటివని యిప్పటివారి కంత స్పష్టంగా తెలియక పోవచ్చు. అత్తలఆరడి, ఆడపడుచుల అధికారం, మగడి నిరాదరణ, ఇంటెడు చాకిరీ, ఇరుగుపొరుగు అమ్మలక్కల ఎత్తిపొడుపుమాటలు, ఇసుమంత సాను భూతికైనా నోచుకోని నిరర్థకజీవితం! ఇన్నింటికీ తోడుగా ఆమెకు బిడ్డలు గూడా లేకపోతే ఆ సంసారం యిక రౌరవనరకమే! కళ్ళప్పగించి చూస్తూ వుండగానే తనభర్త యింకొక పెళ్ళికూతురుమెడలో తాలిగట్టే పరిణామంగూడా అసంభవ మేమీగాదు. ఇందులో ఒక్కొక్కవిషయమే ఒక్కొక్క కథావస్తువు కాగా, అన్నింటినీ ఒకచోట గుదిగ్రుచ్చినకథలు సైతం లేకపోలేదు ('భారత నారి'-వట్టికొండ విశాలాక్షి). అంతకుమించిన ఆశలు, ఆశయాలు వాళ్ళ కవసరం లేదన్నట్టుగా పుట్టినింటికీ, మెట్టినింటికి కీర్తితేవడమే స్త్రీజన్మకు సార్థక్యమంటారు. మెట్టినిల్లు బలిపీఠంలాంటిదే ఔగాక! పుట్టినింటివాళ్ళు తమ ఆడపడచులు అక్కడే నిలబడి ఆత్మాహుతి కావడానికే ఒప్పుకుంటారు. మన సొకచోట, మగు వొకచోట అయినప్పుడు ఆ మగువగతి ఏంకావాలి? నవలల్లో ఈ యితి వృత్తంపైన వెలసిందే 'ఏకవీర'. మనకథల్లో 'అలరాస పుట్టిళ్ళు' అలాంటిది. కల్యాణసుందరీ జగన్నాథ్‌గారి రచన. అరుగులు విరిగాయి. గోడలు నెర్రెలు వద్దాయి. పూలతోట వున్నచోట ఉమ్మెత్తలు, జిల్లేళ్ళు మొలిచాయి. ఇల్లంతా బూజు. తలవాకిళ్ళు దుమ్ము సాలీళ్ళు. ఇంటిపెద్ద సుబ్బారాయడు సజావైన వైద్యానికి నదుపాయంలేక చావుపడక పైన పడివున్నాడు. కలకంఠికంటి

కన్నీ రొలికితే ఏయింటికైనా యింతకుమించి ఏం గతి పడుతుందంటూ జాతి రక్తంలో జీర్ణించిపోయిన ఓ నమ్మకాన్ని చెప్పకనే చెబుతారు రచయిత్రి. ఆ యింటిఆడపడచు సత్యవతి. ఒకప్పు డా యింటివారితో బాసూ ఒకడుగా మసలుకున్న చెంగల్వరాయణ్ణి వలచింది. ఆమెయిష్టానికి వ్యతిరేకంగా పెళ్ళి జరిగింది, సంసారానికి సాగనంపడమూ జరిగింది. రామచిలుక పంజరంలో వుండలేకపోయింది. ఎగిరిపోయిరావడం మొదలెట్టింది. అర్ధరాత్రప్పు డొకసారి పుట్టిల్లు చేరుకున్న చెల్లెల్ని అప్పటికప్పుడే అత్తగారింటికి నడిపించుకునివెళ్తూ బల్లకట్టుమీదినుంచీ గోనెలేటిలోకి గిరవాటు పెట్టి గుట్టుచప్పుడుగా యిల్లు చేరుకున్నాడు సుబ్బారాయడు. పాము కప్పల్ని మింగలేదా? అతడి పాపమే అతణ్ణి మ్రింగిందని కథనం! కానీ ఎన్ని 'హింసబాధ'లు చుట్టుముట్టినా పారిపోనివాళ్ళు, ఆత్మహత్యకు తలపడనివాళ్ళు లోకంలో లేరా? వాళ్ళ కా ఓరిమి ఎలా అబ్బింది? కొమ్మూరి వేణుగోపాలరావుగారి కథ 'క్షమించేను'లో ఆదిశేషయ్యకు కలిగిందిగూడా సరిగ్గా ఈ సందేహమే! ప్రియురాలిని కలుసుకునే నిమిత్తం రాత్రి రెండుగంటలకు తనను లేపమని చెబుతాడు ఆదిశేషయ్య. ఇంటిపనితో సతమతమై వుండడంవల్ల పార్వతమ్మ ఆదమరిచి నిద్రపోతుంది. ఆ నేరానికి ఆదిశేషయ్య భార్యను మక్కెలు విరగ్గొడతాడు. ఇంకొకసారి ఆమె వంటగదిలో పనిమీద వుండిపోవడంవల్ల ఊయల్లో ఏడుస్తున్న బిడ్డను పైకి తీయడంలో కాస్తా ఆలస్యం జరిగింది. తనకు నిద్రాభంగం కలిగినందుకు భర్త ఆమెను డొక్కలో తంతాడు. జీవితంపొడుగునా ఆమె ఈ దురాగతాన్ని కిక్కురుమనకుండా భరిస్తుంది. భర్తస్వభావంలోని నైచ్యాన్ని ఆమె క్షమించింది. క్షమిస్తున్నా నన్న స్పృహవల్ల కలిగిన ఆనందంతోనూ, అభిజాత్యంతోనూ తాను జీవించగలిగానని చెబుతుంది. ఈ రహస్యాన్ని వెల్లడించిన మరుక్షణమే తాను చనిపోవాలని కోరుకుంటుంది. మనసంఘం స్త్రీవ్యక్తిత్వాని కిచ్చినవిలువ ఏపాటిదో తెలుసుకోడానికి 'చరణదాసి' అన్నమాట ఒక్కటేచాలు! 'చరణదాసులు' కథలో యిందునుగురించి మరింత నిశితంగా చెబుతారు పురాణం సూర్యప్రకాశరావుగారు. "శత్రువును తప్పించుకునేందుకు సాధ్యమైనంతవరకూ పెనుగులాడే జీవితేచ్ఛ జంతువులోనైనా వుందిగానీ, వ్యక్తిత్వంమీద అభిలాష స్త్రీజాతిలో ఏకోశానా లేదు. పైపెచ్చు ఎంతో ఒడుపుగా మొగవాడి పైశాచిక హస్తాలలో చిక్కుకుని గర్వంగా నవ్వుకుంటుంది..."

ఐతే జబ్బు నయం కావాలన్న ఆదుర్దా ఇతరులకన్నా రోగికే ఎక్కువగా ఉండాలి. మహిళల ఆలోచనాసరళిలో మార్పురావడం చాలా ముఖ్యమయింది. పురాణం సూర్యప్రకాశరావుగారిదే మరొకకథ 'నిద్రాశువు'లో ప్లీడరు గుమాస్తాకూతురు అనూరాధతో, ఉద్యోగిని మనోరమ చెప్పేమాటల్లో ఈ మార్పు స్పష్టంగా కానవస్తుంది. ఇంట్లో వంటచెయ్యడం, పిల్లల్ని సాకటం, ఇల్లు చక్కబెట్టుకోవడం అన్నది ఒకబాధ్యత. ఆఫీసులో ఉద్యోగంచేసి సంసారానికి అవసరమైనడబ్బు తీసుకురావడమన్నది మరొకబాధ్యత. ఒకబాధ్యత స్త్రీ నిర్వహిస్తే మరోబాధ్యత పురుషుడు నిర్వహిస్తాడు. ఇందులో హెచ్చుతగ్గులకు స్థానంలేదు. నేను చెప్పేదల్లా స్త్రీ తన ప్రపంచాన్ని మరింతవిస్తృతం చేసుకోవాలనే! భర్తని ఆరాధించే ఆడదానికన్నా, అభిమానించే ఆడదాన్ని నేను ఎక్కువ గౌరవిస్తాను. ప్రతిస్త్రీ వీధినిపడే పరిస్థితులు రాకుండా తనకాళ్ళమీద తను నిలబడగలిగే అర్హతను సంపాదించుకోవాలి. అవసరమైతే ఆ అర్హతను వినియోగించుకోవాలి...."

మహిళల అంతరంగంలో కలిగిన ఈ భావచైతన్యంతో శతాబ్దాల, సహస్రాబ్దాల చరణదాస్య శృంఖలాలు పుటుకు పుటుక్కున తెగిపోసాగాయి.

సమిష్టికాపురాలు విచ్ఛేదం కావడంవల్ల కోడంటికంబాధ తగ్గింది. మూఢవిశ్వాసాలు విచ్చిపోయాయి. సంసారరథానికి ఆలుమగళ్ళు యిద్దరికిద్దరూ రెండు చక్రాలేనని ఆడా మగా ఇద్దరూ గుర్తించడమైంది ఎటొచ్చీ ఇప్పటి చిక్కుకాపురాలకు సంబంధించికాదు. అదీసారి వివాహందగ్గరే వచ్చింది!

తెలుగునాట సమాజం ప్రచండవేగంతో సాగిపోతూవుంది. రజస్వలా వివాహాలు, స్త్రీవిద్య, వితంతూద్వాహాల మాటకేంగానీ యిప్పుడు వర్ణాంతర మతాంతర వివాహాలుసైతం మామూలువిషయాలైపోయాయి. వివాహసంబంధాలు బెడిసిపోవడమంటూ జరిగితే అందుకు ఆర్థిక స్థితిగతుల వ్యత్యాసమే కారణమవుతూవుంది. అన్నిగుణగణాలు కాంచనాన్నే ఆశ్రయిస్తూన్న ఈ సమాజంలో సాంప్రదాయచాదస్తపు పప్పు ఉడకడంలేదు. కాబోయేమామగారు ఎప్పుడో వంటపూటివాడుగా పనిచేశాడన్న వర్తమానం చెవిలో పడగానే, సంబంధాన్ని వదలుకోదలచుకున్న వరుడితో ఆ అమ్మాయి "నడునడు నీ సాంప్రదాయం, నీనాగరికత, నీచదువులు యివన్నీ పదివేలిచ్చి మార్కెట్లో రేపీపాటి కల్లా కొనగలను నేను" అనగలుగుతూవుంది ('సంప్రదాయం'- కొనకళ్ళ వేంకటరత్నం). మరైతే పెళ్ళిళ్ళమార్కెట్లో కట్నాలరేటుకు నరితూగలేని

లంగ్రులమాట యేమిటి? వాళ్ళకంటే దయనీయులైనవ్యక్తు లింకొకరు లేరు. ఆడబిడ్డ గుణవతి గావచ్చు. రూపవతి గావచ్చు. సర్వశుభలక్షణాలు ఆమెలో మూర్తీభవించి ఉండవచ్చు. కాని వీటివల్ల ఆమెకు ఒరిగేది ఏముంది? కోరినంత కట్నమిచ్చి ఆమెకు పెళ్ళయినా చేయగలగాలి. లేదా ఆర్థికంగా తనకాళ్ళపైన తాను నిలబడగలిగే వెసులుబాటయినా కలిగించాలి. ఇలా జరగనినాడు అన్ని మంచిగుణాలు ఆకలిపొట్టలో ఆహుతై పోక తప్పదు. ఈ కఠోరసత్యానికి నిరూపణగా తెలుగుసాహిత్యంలో చాలాకథలు వచ్చాయి. (పాడులోకం, పాడుమనుషులు- బలివాడ కాంతారావు.)

కోరినంత కట్నాలిచ్చుకోలేకపోవడం ఒకటి. ఉద్యోగం చేస్తున్న విద్యావతులు పెళ్ళంటే అదొక పనికిమాలినపనైనట్టు, దాంపత్యజీవనానికి దొరకబోయిన ప్రతిరైలును తప్పిస్తూరావడం యింకొకటి. ఈ రెండుకారణాలవల్ల నవ సమాజంలో 'ముదికన్య'లసంఖ్య హెచ్చిపోతూవుంది. కట్నాలిచ్చుకోలేకపోవడానికి కారణం ఆర్థికం. రెండోదాన్ని గురించి ఏంచెప్పాలి? వీళ్ళకు జీవితంలో మిగిలిపోయే తీరని అసంతృప్తినిగురించి, ఆరనిఆవేదనను గురించి 'వాచస్పతి' 'రంగుటద్దాలు' అని ఒకకథ వ్రాశారు. పరిమళా సోమేశ్వర్‌గారికథ మరొకటి. దానిపేరు 'క్రోటనుమొక్కలు!'

ఎంతసముద్రమైనా దానికీ ఒకహద్దుంది. మానవజీవితానికీ ఉండక తప్పదు. శీలానికి ప్రాధాన్యం ఇవ్వని మానవసమాజాలు పతనాన్ని కోరి కొని తెచ్చుకున్నాయి. స్త్రీపురుషులు పదివేలయేండ్ల మానవనాగరికత కానిన కుక్కమూతి పిందెలుగా గాకుండా, దేశ మనియెడు దొడ్డవృక్షంలో పూసినపువ్వులా శోభిల్లాలని ఎవరైనా కోరుకుంటారు. క్లబ్బులు, లాడ్జీలు, త్రాగుడు, వ్యభిచారం యిదంతా ఈనాటితెనుగుతనానికి పట్టిన తెగులు. ఈ అధోలోకాన్ని గురించి కథలు రాకపోలేదు. కానీ ఈ పరిణామంపట్ల బలీయమైన ఏహ్యాభావం పుట్టించే రచన లంతగా రావడంలేదేమో ననిపిస్తుంది.

## 4

అతడిపేరు ఆర్. చక్రారావు. జీవితం పొడుగాటి తారురోడ్డులాంటిదనీ, ఆదర్శాల కారులో కూర్చుని దానిపైన రంయిమని సాగిపోవచ్చుననీ అతడు చిన్నప్పుడు కలలు గన్నాడు. పెద్దపెద్ద మేడలున్న రాజవీధికి దూరంగా చిన్న మురికి సందులో నల్లులు, దోమలు మానవులతో సహజీవనం చేసే ఒక అద్దె

కొంపలో అతడి కాపురం. అతడి యింట్లో పొయిలోకి బొగ్గులుండవు. చలికాల మొస్తే కప్పుకోడానికి రగ్గు లుండవు. ఎండ కాస్తుంటే తల మాడ్చుకుంటూ, వాన కురుస్తుంటే తడుస్తూ అతడు ఆఫీసుకు వెళ్తాడు. చేతిరుమాలే అతనికి గొడుగు. టైరు చెప్పులే అతనికి పాదరక్షలు. ఋతువు ప్రారంభమైనప్పుడల్లా, ఎన్నో కొత్త అవసరాలు అతణ్ణి ఎదుర్కొంటాయి. అవి తీరకముందే ఆ ఋతువుకాస్తా వెళ్ళిపోతుంది. ఋతువలయంలో జీవితచక్రం గిరికీలు తిరుగుతోంది గనక అన్వర్థనామధేయుడు ఋతుచక్రా రావు!

అతడి కిది వాకాటి పాండురంగారావుగారు పెట్టినపేరు. దాదాపుగా ప్రతి తెలుగుకథకుడూ అతడి కొక పేరు పెట్టే వున్నాడు. కుటుంబరావుగారిలా అత డికి డజన్లకొద్దీ నామకరణాలు చేసినవాళ్ళుగూడా వున్నారు.

ఎంద రెందుకు ఎన్నెన్ని పేర్లుపెట్టినా ఆంతర్యంలో అతడు అసలు సిసలైన మధ్యతరగతి మానవుడు.

కలువకొలను సదానందగారి కథలో అతడిపేరు రామదాసు.

రామదాసు యింట్లో పళ్ళపొడి వుండదు. సబ్బుబిళ్ళ వుండదు. కాఫీపొడి వుండదు. పాలుసంపూర్ణాహార మన్నమాట పాఠ్యపుస్తకంలో మాత్రమే వుంటుంది.

నీళ్ళ కొళాయి దగ్గర మునిసిపల్ కౌన్సిలరు భార్యచేత మొట్టికాయలు తిన్న ఎనిమిదేళ్ళ కూతుర్ని 'నా తల్లే, నా ఇందిరాగాంధే' అంటూ ఓదార్చి, 'ఒరే బాబూ! నువ్వు చిన్నవాడివి, నిక్కరు తొడుక్కోకుంటేనే బాగుంటా వని మూడేళ్ళ కొడుకును సముదాయించి. కొట్లోబియ్యం అప్పుడిగి లేదని పించుకుని రాత్రి తొమ్మిది గంటలప్పుడు ఖాళీసంచీతో ఇంటికి తిరిగి వెళ్తున్న రామదాసుకు, పక్షి వాహనారూఢుడై ఊరేగుతున్న స్వాములవారు ఎదురౌతారు.

పెద్ద పెద్ద పూలదండలు స్వీకరించి ఆయన షావుకారు పరశురాములుకు లైసెన్సులు యిప్పిస్తానంటాడు. భూపతి అనే వెయ్యెకరాల ఒక్క రైతుకు యింకొక వందఎకరాల బంజరుభూమి పట్టా మంజూరు చేయిస్తా నంటాడు. సి. ఐ. డీ. లు పట్టుకెళ్ళిన నల్లడబ్బు యిరవై లక్షలు వాపసు వచ్చేటట్టు చూస్తా నని సినిమానటి ఊర్వశికి వాగ్దానం చేస్తాడు.

రామదాసు స్వామిఎదుట సాగిలపడిపోతాడు. బోయీలు తొక్కినంత పనిచేసి ఆగిపోతారు.

"ఎవరదీ?" అంటాడు స్వామి.

"నేనే స్వామీ!" అంటాడు రామదాసు.

"నేనంటే? చూస్తున్నావుగా తలమునగ పూలదండలు. కళ్ళు కనిపించవు. చెవులు వినిపించవు బిగ్గరగా మాట్లాడు" అంటూ చిరాకు వెళ్ళబోస్తాడు భగవంతుడు.

రామదాసు గొంతు సవరించుకొని "సీరామదాసుణ్ణి" అంటాడు.

"ఎవడివో! ఎందరు లేరు రామదాసులు? ఫలం, పుష్పం, పత్రం పట్టుకొచ్చావా?"

"మన్నించాలి. ఖాళీజేబులు, ఖాళీసంచీ!"

"ఉత్తచేతులతో వచ్చావా? అఘోరించావులే! ఊఁ అవతల పనుంది. ఏమిటి నీ ఏడుపు?"

"నా పెళ్ళాం బిడ్డలు ఈ పూట పస్తున్నారు......"

"పస్తుండడం ఎందుకు? తింటే పోలా!"

"బియ్యం నిండుకున్నాయి"

"బియ్యం నిండుకుంటే కొనుక్కోవాలమ్మా!"

"డబ్బులేదు"

"డబ్బులేదా!" అంటూ ముక్కున వేలేసుకుంటాడు స్వామి. "నాన్నా! తాగినరొమ్మును గుద్దడమంటే యిదే కదా! నీ నెలజీతమంతా ఏమయినట్టు? ఆశకు అంతెక్కడ? తృప్తికి మించిన దర్జా లేదుగదా! పొదుపుగా బ్రతకాలి. ఆడంబరాలు వదిలెయ్. నీముఖానికి స్నోలు, పౌడర్లు కూడానా! టూత్ పేస్టులు బ్రష్షులు లేకపోతే నీపళ్ళు రాలిపోతాయా? మానం కాపాడుకోడానికి టెర్లిన్ బట్టలే కావాలా? రేడియోలు, టెలివిజన్లూ నీకెందుకూ? మద్యపానం, మాంసాహారం మానుకోరాదూ?" అంటూ సదుపదేశం చేసి స్వామి తనదారి వెంట తాను వెళ్ళిపోతాడు.

లోకం యితడిపట్ల యింతకు మించిన దయాదాక్షిణ్యాలతో వ్యవహరించడంలేదు. జీవితంలో ఏ వారా ఆనందలేశమనేది కనిపించకపోయినప్పుడు ఏ మానవుడైనా ఏం చేస్తాడు? పగటి కలల్ని భోంచేస్తూ కాలక్షేపం చేస్తాడు.

పావురాళ్ళ గూళ్ళలాంటి గదులున్న పాత కట్టడం ఒకటి. -ంచులో ఎన్నో వాటాలున్నాయి. అన్నదమ్ముడు తనకోసం డాక్టరును తీసుకొస్తాడేమోనని రోగిష్టి ఆడమనిషి సూరమ్మ ఆకాంక్ష. అరవయ్యేళ్ళ ముసలినాడి మూడో పెళ్ళాం మాలిని. హఠాత్తుగా తన కెప్పుడో సినిమా ఛాన్సు వూడిపడుతుందని ఆమె ఆశ. పాతికేళ్ళ సుబ్బలక్ష్మికి వివాహం ఒక తీరని కోరిక. ఓరోజు వుదయం ఆయింటి ముందరి కొక కా రొచ్చి ఆగింది. డాక్టరు వచ్చివుంటా దని

సూరమ్మ, వచ్చింది సినిమావాళ్ళే నని మాలిని, కారులో వెళ్ళివారు దిగుతుంటా రని సుబ్బులు అనుకుంటారు. తీరా చూడబోతే వచ్చినవాడు ఆ యింటిని కొను క్కున్న ఆసామి. కట్టడం రిపేరుచేసి లాడ్జీగా మార్చాలని అతడి ప్లాను. అందుకు వీలుగా యిల్లు ఖాళీచెయ్యమని ఫర్మానా యివ్వడంకోసం వచ్చాడన్నమాట! మధ్యతరగతి జీవితాలు ఎలాంటి భ్రమా ప్రమాదానికి లోనై వున్నాయో చెప్ప డానికి వేరే వ్యాఖ్యానం అక్కర్లేదు. ఐ.వి.యస్. అచ్యుతవల్లిగారి 'సన్నాటా' కథే చాలు!

నిండా మునిగిన తరువాత చలేముంది? అప్పుడు ఏడ్చినా, నవ్వినా ఒకటే అర్థం. అందువల్లనే ఈనాడు అప్పులవాడి బాధ 'ఋణానందలహరి' కాగలిగింది. ఆధునిక భారతంలో నిరుద్యోగుల గోడుకూడా ఒక పర్వంగానే పరిణమించింది. నల్లులకు శరీరం అప్పగించడం 'రక్తయజ్ఞం'గా మారింది. రాజకీయాల్లో పైకి రావడ మెలాగో బేతాళుడు చెప్పవలసి వచ్చింది. వెరశీ యిప్పుడు జీవితం రసానంద సమంచితమైన నాటకంగాదు. అవహేళనకు తావలమైన ప్రహసనం. ఇప్పుడు జీవితం అందాలను వెదజల్లే రంగులచిత్రం గాదు. వికారపు గీతల సమ్మేళనంతో అవహాస్యం పుట్టించే కార్టూను!

ఇలాంటి సామాజిక స్థితిగతులలోనుంచీ పుట్టుకొచ్చే పరిణామంపేరు **తిరుగుబాటు.**

ఈ తిరుగుబాటు తాలూకు ఓంకారధ్వని యిరవైయేళ్ళ క్రిందటి 'పలా యితుడు'కథలోనే వినవచ్చింది. తన దెబ్బయి రెండురూపాయల సంపాదనతో సంసారం గడవక, బోలెడు అప్పులుచేసి వాటిని తీర్చే వెరవులేక, బొత్తిగా తనను అర్థంచేసుకోని భార్య విశ్వాసరాహిత్య తీర్మానం ప్రకటించి పుట్టింటికి వెళ్ళిపోగా దేశాలపాలైన రాజశేఖరం తన మిత్రుడికి వ్రాసిన చివరి ఉత్తరం లోనివి ఈ మాటలు. "ఈ పృథివిపై సమస్త సంపదలూ ఉన్నవి. ఈ సంప దలపై భూమిని పుట్టిన జీవరాసులకన్నింటికీ హక్కున్నది. బలవత్తరమైన జీవులు కొన్ని బలహీనమైనవానిని తమస్వార్థం, దురాశా హేతువులుగా వంచించి అన్యాయం చేస్తున్నది. తక్కిన జీవరాసులలోకన్నా ఇది మానవులలో ఎక్కువ స్పష్టంగా చూడగలుగుతున్నాము... నేటి సమాజంలో అటు కండలు కరగించి సంపద నుత్పత్తిచేసేవారూ, ఇటు మేధాశక్తి వినియోగించి మానవ సమాజపు సృజనశక్తులను అభివృద్ధి చేసేవారూ, వీరందరి ఆరోగ్యం, ఆనందం, సంస్కారం పరిరక్షిస్తూ ఉత్తమగతు లేర్పరచేవారు అర్ధాకలితో, అణచుకున్న

కోర్కెలతో ఆ సంపదలో తక్కువలో తక్కువ పొందుతూ బ్రతుకుతున్నారు. వారి శ్రమజన్యమైన సంపదలో అత్యధికభాగం మరికొందరు అనుభవిస్తున్నారు. ఈ ఇంద్రజాలాని కంతటికీ కారణం ఇప్పుడు మానవు డనుసరిస్తున్న ఆర్థికవిధానం. ఈ జూదగొండి ఆర్థిక విధానం హస్తాలలో ఇరుక్కుని వున్నంతకాలం మన జీవితాలను మనం ఆనందమయం చేసుకోలేము..."

మరైతే ఏం చేయాలి?

ఈ ప్రశ్నకు జవాబు మళ్ళీ అదే కాళీపట్నం రామారావుగారు యిటీవల వ్రాసిన 'చావు' కథలో కనిపిస్తుంది. అందులో ఒక పండుచలికాలపు రాత్రి వేళ, అనాధప్రేతసంస్కారానికి కట్టెపుల్లలు పుట్టించుకోడం గూడెంలోని జనానికి బ్రహ్మప్రళయమైపోతుంది. ఆఖరుకు తెగబడి నాయుడుగారి వామిలో నుంచీ కట్టెలు దొంగిలించవలసివస్తుంది. ఈ పనిచేయడం వెనక వున్న మంచి చెడ్డల్ని గురించిన వాదంలో ఓ కోరమీసాల పడుచువాడు చెబుతున్నాడు. "ఓరయ్య, వాదన్లొద్దు. పన్లు సెయ్యడం ఇష్టంలేనప్పుడే వాదన్లొస్తాయి. మన కది మంచిపనని తోసింది. చేసేసినాం. కాదదిసెడ్డ, అది సేసినందుకు మీ పని పడతాం అంటూ ఆళ్ళొస్తారూ, రానీ, ఆళ్ళపని మనవూ పడతాం. ఇయ్యేళ నుంచీ యిదే లెక్క: ఒక పనిచేస్తే నాయుడేమంటాడో; కరణమే మంటాడో చారికేమంటాడో కాదు, మంచిపనా, సెడ్డపనా? మంచిదైతే సేసియ్: దేవుడు కాదు. దేవుణ్ణి పుట్టించిన జేజమ్మయినా దెబ్బలాడు. అదీ మన పద్ధతి.

ఐతే తొందరపడి విప్లవవిజిగీషతో ముందుకురకడానికి యిది సమయం కాదని కొందరు, అలాంటి అవసరం ఏర్పడలేదనీ, అసలు ఏర్పడకనే పోవచ్చునని మరికొందరు భావిస్తున్నారు. ప్రభుత్వం ఒకటొకటిగా అభ్యుదయ కార్యక్రమాలు తలపెట్టినకొద్దీ ప్రజలు ప్రజాస్వామ్యంపైన ఆశలు పెంచుకుంటున్నారు. సోషలిజం ఒక సిద్ధాంతస్థాయిలో నుంచీ నికరమైన కార్యాచరణగా మారి భవిష్యత్తుకు బంగారుబాటలు నిర్మిస్తుందన్నవిశ్వాసం యిప్పటి కింకా అడుగంటి పోలేదు. అనుభవంతో తాను చెబుతూవచ్చిన సలహాలు పాటించకుండా పాల పొంగులాంటి ఉత్సాహంతో శ్రీకాకుళం అడవుల్లోకి వెళ్ళిపోయి అక్కడి విప్లవోద్యమంలో పాల్గొన్న కొడుకును వెదుక్కుంటూ వెళ్ళిన సుబ్బరామయ్యగారితో ఓ అనుభవజ్ఞుడు చెప్పిన ఈ క్రింది మాటల్లో ఈనాటి మేధావుల వివేచన, విచక్షణా గోచరిస్తున్నాయి. ఆయనంటాడు. "మూఢత్వము, దురాశా, సోమరితనం, భయం, ఇవి నశించనంతకాలమూ, వ్యవస్థ ఏదైనప్పటికీ

కన్నీళ్ళూ, కడుపుచిచ్చులూ తప్పవు. ఇంతోడిదానికి, మా సిద్ధాంతమే ప్రపంచానికి తరణోపాయమని అరుస్తారు కొందరు. మా దేశంలో అంతులేనిజనాభా వుంది. అందులో సగంమంది మూడోప్రపంచయుద్ధంలో చచ్చినా వాళ్ళ యముకలమీద మిగతా సగంమందితోనూ నవసమాజం సృష్టిస్తా మని కొందరు అరుస్తారు. వాళ్ళమాట చెల్లితే అసలు జరిగేది సగంమందికి చావు, సగంమందికి సంకెళ్ళూనూ. పాత మూఢనమ్మకాలస్థానే, కొత్తమూఢనమ్మకాలను సృష్టిస్తారు రక్తపిపాసులు. ఎటొచ్చీ అధికారదాహంలో వాళ్ళకి వీరు, వీళ్ళకు వారూ తీసిపోరు. మధ్యలో చచ్చేది మీ అబ్బాయిలాంటివాళ్ళు. రాబోయే నవసమాజానికి పునాదులుగా వాళ్ళ ఎముకలు పనికొస్తాయి..." ('పనికిరానిపాఠాలు'—మంచిరాజు వేంకట్రావు).

'వేషం' కథలో ఆర్.యస్. వసుంధరగారు మరింత ఆలోచనాత్మకమైనమాట ఒకటి ఉల్లేఖించారు.

యాంగ్రీ యంగ్ మేన్ నాగయ్యభావతో, అతడి మేనత్తకూతురు, ధర్మదాతల కుటుంబంలో కోడలుగా కాపురం చేసుకుంటున్న ఇందిరమ్మ చెప్పినమాట అది—"దయ మావేషమైతే, విప్లవం నీవేషం."

## 5

అనన్యసామాన్యమైన ప్రజాదరణకు పాత్రమైన సాహిత్యప్రక్రియగా కథానిక తెలుగువారి జీవితంలోకి చొచ్చుకపోయింది. కావ్యం, నాటకం, నవల మొదలైనవి అడుగుమోపని మారుమూల చీకటికోణాలను సైతం స్పృశించింది. తెలుగు జీవితంలోని నిమ్నోన్నతాలను ప్రస్ఫుటీకరించింది. వారిరాగద్వేషాలను చిత్రించింది. దేశంలో ఎలాంటి రాజకీయ, సాంఘిక పరిణామాలు పొడసూపినా, వాటి ప్రతిధ్వని కథానికలో వినిపిస్తూ వచ్చింది.

కథకులు సూటిగా తమ చుట్టూరా నెలకొన్న సమాజం నుంచీ కథావస్తువును తీసుకున్నంతకాలం తెలుగుకథలోని తెలుగుదనానికి సేగి వాటిల్లదు. అందుకు భిన్నంగా యితివృత్తంకోసం ఇతరపుస్తకాలపైన, ఇతర భాషల సాహిత్యంపైన, సినిమాలపైన ఆధారపడినంత మేరకు తెలుగుదనం లుప్తం గాక తప్పదు. ఈ ప్రమాదం నేడు తెలుగుకథను ఎదుర్కొంటున్నమాట వాస్తవం. తెలుగునేలపైన ఎక్కడా కానరాని వాతావరణం, పునాదులు లేకుండా ఆకాశంనుంచి వూడిపడినట్టుండే పాత్రలు ఈనాటి కథల్లో ప్రత్యక్షమౌతు

న్నాయి. అంతే కాదు. జీవద్భాషతో సంబంధంలేని ఒక కృతక తెలుగుశైలి నేటి కథలో కానవస్తుంది. పది పదిహేనేళ్ళకు మునుపటి వారమాసపత్రికల నొకసారి త్రిప్పి చూచితేచాలు. కథల విషయంలో రాశి పెరిగినంతగా వాసి పెరగడంలేదన్న సాహిత్యవేత్తల తీర్మానానికి వేరే నిదర్శనం అక్కర్లేదు.

నిస్సందేహంగా తెలుగువారి సాంస్కృతిక జీవితంలో ఒక భాగంగా పరిణమించిన కథానిక, మరింతబలంగా తన వేర్లను సమాజక్షేత్రంలోకి సారించి శాఖోపశాఖలుగా విస్తృతమై సాహిత్యాభిమానులకొక అటపట్టుగా ఆలోచనాకేంద్రంగా విలసిల్లే శుభపరిణామం కన్నా కోరుకోవలసింది ఏముంటుంది ?



"భావములు మానవనిష్ఠములు. భాష జాతినిష్ఠము. ఈజాతినిష్ఠమైన భాష భావములయందు కూడ విలక్షణత్వము సంపాదించును. కనుక భాషానిష్ఠమైన సంప్రదాయముతో కూడిన భావసంపత్తు వేఱు. కలగూరగంపయైన భావముల పద్ధతి వేఱు. అందుకనియే తనదేశభాషయందు సందిగ్ధమైన కవితాశక్తి కలవాడు వానినింగ్లీషుభాషలోనికి తర్జుమాచేసి గొప్పకవిగా నగుచున్నాడు. అగుటకు ప్రయత్నించుచున్నాడు. వాని భావములకు జాతీయతాముద్ర తక్కువ. వానికి దేశభాషాపాండిత్యముకంటె ఇంగ్లీషుభాషాపాండిత్య మెక్కువ."

—విశ్వనాథ.

# కథానిక : నిర్మాణ శిల్పం

శ్రీ శీలా వీర్రాజు

వార్తకి వాతావరణాన్ని జతపరుస్తే వస్తువుతయారౌతుంది. వాతావరణమంటే వార్తలోని సంఘటనకు పూర్వాపరాలు. కథకి కావలసిన మొట్టమొదటిది వస్తువు. వస్తువు లేకపోతే కథే లేదు - సరిగమపదనిసలు లేకపోతే సంగీతమే లేనట్టు.

రచయిత శిల్పి అయితే వస్తువు బండరాయి. లోకంలో బండరాళ్ళకి ఎలా కొరత లేదో వస్తువుకి కూడా కొరతలేదు. మనిషిజీవితంనిండా అవే. మనిషిజీవితమే ఒకచైను. సంఘటనల చైను. ఒకదాన్నొకటి కలుపుకుంటూ అలా అలా బ్రతుకంత పొడుగ్గా కుప్పతిప్పలుగా ఎన్నెన్నో.

అయితే ప్రతిరాయీ శిల్పానికి పనికిరాదు. అలాగే ప్రతిసంఘటనా కూడా. కొండా కోనా తిరిగి, ఉలిపెట్టి తట్టిచూసి పరీక్షచేసి తగినరాయిని ఏరుకున్నట్టే రచయితకూడా అనువైన వస్తువును ఎన్నుకోవాలి. పైకి దంబంగా వున్నా లోపల ఏమిలేని గుల్లయితే శ్రమేతప్ప ఫలితం సున్న. ఒకవేళ రచయిత కష్టపడి కథను తయారు చేసినా ఏ విమర్శకుడో కాస్త గట్టిగా ఓ రాయి విసిరేసరికి పుటుక్కున పగిలిపోతుంది.

సంఘటన అన్నివేళలా కథకి అచ్చుగుద్దినట్టు సరిపోదు. ఒక జరిగిన సంఘటనకి కొన్ని మార్పులూ చేర్పులూ కావలసి వుంటాయి. ఒక్కొక్కప్పుడు అసలు సంఘటనకన్న కల్పనే ఎక్కువ వుంటుంది. మరొకప్పుడు జరగని సంఘటననే జరిగినట్టు ఊహించుకోవాల్సి వుంటుంది. ఇందుకు కల్పన కావాలి. ఈ కల్పన రచయిత ప్రతిభ మీద ఆధారపడివుంటుంది. సమర్థుడైన రచయిత ఆలోచన లెప్పుడూ వాస్తవానికి దగ్గరగా వుంటాయి. అవి నేలవిడిచి గాలిలో ఎగరవు. ఊరు విడిచి అడవిలో దూరవు. అందరిమధ్యా అందరిలోనూ కలిసిపోయి తిరుగుతాయి. సహజత్వానికి ఒదిగివుండి కదుల్తాయి.

ఇలా పాత్రల్ని నడిపించాలంటే రచయితకు మనస్తత్వపరిశీలన అవసరం. లోకవ్యవహారరీతి తెలిసి వుండాలి. వాస్తవానికి దూరంగా ఎంత అందంగా కథ చెప్పినా అది కాకమ్మ కథే అవుతుంది. కాలక్షేపానికో, నిద్ర

పుచ్చడానికో ముసలమ్మ చెప్పే రాజకుమారుల కథలు అబద్ధాల పుట్టలు. ఇవి కూడా అంతే.

వస్తువు సంఘటన ప్రధానమైనదైనా కావచ్చు. మనస్తత్వచిత్రణ ప్రధానమైనదైనా కావచ్చు. సంఘటన ప్రధానమైన కథలకన్న మనస్తత్వ చిత్రణ ప్రధానమైన కథల్లో శిల్పవిన్యాసం ఎక్కువగా వుంటుంది. కథలో విషయం ప్రధానంకాదు. కథ చెప్పడమే ప్రధానం-మనస్తత్వ చిత్రణాత్మక రచనల్లో. అందువల్ల అలాటి కథల్లో శిల్పానికి ఎక్కువ తావుంటుంది.

కథ సంఘటనాత్మకమైనా, మనస్తత్వచిత్రణాత్మకమైనా అసలు ఎన్నుకునే వస్తువులోనే మార్పు వచ్చింది. సాంసారిక, ప్రేమ యితివృత్తాల్లోంచి సాంఘిక యితివృత్తాల్లోకి కథ అడుగుపెట్టింది. ఈ రెండు ధోరణులూ యీనాడు చెట్టపట్టాలేసుకునే నడుస్తున్నాయి. ప్రేమకథ పాతచింతకాయ పచ్చడైతే సాంఘికకథ కొత్తావకాయ. దేనిరుచి దానిదే. ఎటొచ్చీ కథ వాస్తవికతకు దూరం అయిపోకూడదు. అబద్ధాలపుట్ట కాకూడదు. మూఢాచారాలమూట కాకూడదు. ప్రేమకథని ముట్టుకుంటే ఆ రచయిత తిరోగామి అని, సామాజిక స్పృహలేనివాడనే ధోరణి యీనాడు కొత్తగా వ్యాపించింది. సామాజిక స్పృహ అనేది కేవలం రాజకీయాల్ని ప్రచారం చేయడం కాదని చలం రచనలే తార్కాణం. రుద్రాభట్ల నరసింహరావు, మంజుశ్రీ, అవసరాల రామకృష్ణారావు చాలా అందమైన ప్రేమకథలు రాశారు. వీరి కథల్లో మనస్తత్వచిత్రణ ఒక ప్రత్యేకత, సాంఘిక ప్రయోజనం లేదని ఈ కథన్ని తీసిపారెయ్యటానికి వీల్లేదు. వీటికి సాహిత్యప్రయోజనం పుష్కలంగా వుంది. శిల్ప రీత్యా చక్కని కథలివి.

శిల్పమంటే మరేంకాదు. ఒక సంఘటనని వార్త కాకుండా కథగా చేసేదే శిల్పం. రచయిత, విలేఖరి ఒకరు కారు. విలేఖరి ఒక సంఘటనని ఫొటో తీస్తాడు. రచయిత చేత్తో గీస్తాడు. అది యాంత్రికమైతే యిది బౌద్ధికం.

వస్తువు వున్నంత మాత్రంచేత కథ కాదు. రాతిని చెక్కితేనే కదా విగ్రహం అయ్యేది. ఒకేరాయి అద్భుతమైన కళాఖండంగానూ కావచ్చు. ఇంటి ముందు మెట్లరాయిగా పాదాలకింద పడి నలిగిపోనూవచ్చు. అది శిల్పి చేతిపని తనం మీద ఆధారపడి వుంటుంది. అందుకే కథకు మూలమైనది వస్తువైనా దాన్ని కథగా మార్చే పనితనమే ముఖ్యమైనది. ఇదే నిర్మాణ శిల్పం. కథకైనా, నవలకైనా, మరింకే రచనా ప్రక్రియకైనా యిది అవసరమే.

కథను యిలాగే చెప్పాలి, ఇలా ప్రారంభించి యిలా ముగించాలి, యీ పట్టాల మీద నడపాలి అని గిరులు గీయడం సంకుచితమే. అలా పరిధి మధ్య బంధిస్తే దాని వికాసం ఆగిపోయే ప్రమాదముంది. ప్రతివిషయంలోనూ మార్పు అనేది శీఘ్రతరమైన యీ ఆధునికకాలంలో దేనికీ స్థిరమైన హద్దులు లేవు. స్వేచ్ఛకు ప్రతి బంధకాలు. మార్పుకు, కొత్తదనానికి అడ్డుగోడలు. కథా నిర్మాణానికి కూడా యిది వర్తిస్తుంది. అనగనగా ఒక రాజు అంటూ వస్తువులో మాత్రం వైవిధ్యం వుండి, శిల్పంలో ఏ మార్పూలేని కథలకూ, యీ నాటి కథలకూ ఉన్న తేడా అదే.

ఈ నాటి కథానిక శిల్పప్రధానమైన సాహితీ ప్రక్రియ. అందువల్ల కథానికకు శిల్పమే ప్రాణం. దాన్నిబట్టే రచయిత ప్రతిభని కొలవచ్చు. ఇది పూర్తిగా వైయక్తికం గనుక, రచయితకు రచయితకూ యీ విషయంలో ఎంతో కొంత తేడా కనిపిస్తుంది గనుక రచనాశిల్పమే ఒకరచయితప్రతిభను కొలవడానికి సరైన కొలబద్ద. సమర్థుడైన రచయిత ఒక స్వంతముద్రని ఏర్ప రచుకుంటాడు. కొందరు కథాకథనంలో, మరికొందరు వర్ణనలో, ఇంకొందరు ముగింపులో-యిలా ఒక్కొక్కరు ఒక్కోవిషయంలో తమప్రతిభని ప్రక టిస్తుంటారు. అది వారి ముద్రగా గుర్తింప బడుతుంది. దాన్నిబట్టే, ఒక రచనను చూడ్డంతోటే యిది ఫలానా వారిదని అర్థమై పోతుంది.

కొంతకాలం క్రితం ఒక మిత్రుడిఊరు వెళ్ళాను. చిన్న పల్లెటూరు అది. సాయంత్రం కాలవవడ్డుకు షికారుకు వెళ్తూ పకోడీలు కట్టించుకొచ్చాడు అక్కడ తిందామని. కాస్తగా నోట్లో వేసుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ పొట్లాలు ఖాళీ చేసేశాం. దానితో చేతులు తుడుచుకో బోతూ ఆగి పోయాను నేను. అది నాకు యిష్టమైన రచయిత కథా, నాకు నచ్చిన చిత్ర కారుని బొమ్మా వున్న కాగితం. స్నేహితుడు పారేయబోతున్న కాగితం తీసుకుని చూశాను. ఆకాగితం కూడా ఆ కథలోదే. మూడో పేజీ అది. దాన్ని చదివి రచయిత ఎవరో చెప్ప మన్నాను. రెండుమూడు పేరాలు చదివి ఆ మిత్రుడు "ఇది బుచ్చిబాబు కథ అయ్యుంటుంది" అన్నాడు.

అది నిజమే!

రాచకొండ విశ్వనాథ శాస్త్రి కథల్ని కూడా పది లైన్లు చదవడం తోటే గుర్తు పట్టెయ్యొచ్చు. అలాగే చలం, మల్లాది రచనలు కూడా. అంత స్పష్టంగా తమతమ ముద్రల్ని చూపించే రచయితలు మనకు బహుతక్కువ. వారిని వేళ్ళమీద లెక్కపెట్టొచ్చు.

తెలుగు రచయితల్లో శిల్పానికి బుచ్చిబాబు యిచ్చినంత ప్రాధాన్యాన్ని మరొక రెవరూ యివ్వలేదనే చెప్పాలి. కథను ప్రారంభించడంలోనే ఒక కొత్తదనం వుంటుంది. ప్రారంభం ఎంత కొత్తో ముగింపుకూడా అంతే కొత్త. ఈ రెండింటికి మధ్య కథనం కూడా అలాగే నడుస్తుంది. పద్మరాజుదీ అదే ధోరణి. రావిశాస్త్రి ప్రారంభం ముగింపులకన్న కథనానికి ఎక్కువ ప్రాధాన్యాన్నిస్తాడు. వస్తువుకు సరేసరి.

మంచి ప్రారంభమూ, చక్కని ముగింపూ కథకు నిండుదనాన్నిస్తాయి. అవి అంచుల్లాగ వుండి కథ అందాన్ని ఎక్కువ చేస్తాయి. ఒక ఫోటోను మామూలుగా చూసిన దానికన్న ఫ్రేములో వుంచి చూస్తే ఎలా అందంగా కనిపిస్తుందో కథని కూడా మంచి ప్రారంభమూ, చక్కని ముగింపుల మధ్య బిగించి చూస్తే అలా అందంగా కనిపిస్తుంది. అయితే యీ రెండింటిలోకీ ముగింపుకి వచ్చినంత గుర్తింపు ప్రారంభానికి రాలేదు. ముగింపులో ప్రత్యేకతని చూపించడం ఒక శిల్పప్రక్రియగా గుర్తింపబడుతోంది. బలివాడ కాంతారావు, కాశీపట్నం రామారావు, రంధి సోమరాజు, తాడిగిరి పోతరాజు కథనానికీ, ముగింపుకీ ప్రాధాన్యాన్నిస్తారు. మధురాంతకం రాజారాం, అవసరాల రామకృష్ణారావు, వాకాటి పాండురంగారావుల కథల ప్రారంభం బావుంటుంది. కథ చెప్పేతీరు కూడా కొత్తగా వుంటుంది.

కథను ఎవరికి నచ్చినట్టు వారు చెప్పుకోవచ్చు. నల్లేరు మీద బండి నడిచినట్టుగా ఎగుడుదిగుడులు లేక సాఫీగా చెప్పొచ్చు. సర్కస్ ఫీట్సు చేయించొచ్చు. అది ఆయా రచయితల అభిరుచిమీద ఆధారపడి వుంటుంది. కొందరికి తాపీగా నడవడం యిష్టం. కొందరికి తొందరగా నడవడం యిష్టం. ఎవరి పద్ధతి వారిది. ఇలాగే కదలాలని నియమ మేమీ లేదు. నడిచినా, పరుగెత్తినా ఎబ్బెట్టుగా వుండకూడదు. అవతల యిల్లు తగలడుతుంటే తాపీగా ఎవడూ నడవడు. భార్యతో షికారుకెళ్తూ హడావిడిగా పరుగెడ్తున్నట్టు ఎవడూ కదలడు. సమయాన్ని బట్టి కథను నడిపే నేర్పురచయితకు వుండాలి. ఇచ్ఛాపురపు జగన్నాథరావు, సి. ఎస్. రావులు వాతావరణాన్ని బట్టి కథను నడుపుతారు. అందువల్ల రచయిత తనతోపాటు పాఠకుడ్ని లాక్కుపోయే వీలుంది. పాఠకుడు కథాగమనంలో పూర్తిగా మునిగిపోయి రచయిత వెంట మంత్రముగ్ధుడిలా వెళ్తాడు. అలా పాఠకుడ్ని తనతోపాటు నడిపించే రచయిత ప్రభావం ఆ పాఠకుడి మీద విశేషంగా వుంటుంది.

సంగీతంలో తాళం ఎలాటిదో సాహిత్యంలో శైలి అలాటిది. అది కథా గమనాన్ని క్రమబద్ధం చేస్తుంది. రౌతుకు పగ్గం, రచయితకు శైలి ఒకే విధంగా తోడ్పడతాయి. సమర్థుడైన రచయిత చేతిలో పగ్గాన్ని పట్టుకుని కథను అదుపులో పెట్టుకుని తను చెప్పినట్టు నడిపిస్తాడు. ఎలాటి కొరుకుడు పడని యితివృత్తాన్నయినా దారికి తెచ్చి నడిపిస్తాడు. తనకి దాసోహం చేసుకుంటాడు.

రచనాశిల్పంలో ముఖ్యమైనది శైలే. రచయితను గుర్తుపట్టే 'ఐడెంటిటీ కార్డు' లాటి దిది-దీన్ని చూపించే, రచయిత తనని తాను పరిచయం చేసుకుంటాడు. ఇది ప్రధానంగా భాషకు సంబంధించినది. చలం మాటల్ని తరిమినా, ముళ్ళపూడి సర్కసు చేయించినా, కుటుంబరావు నిదానంగా నడిపినా, బుచ్చిబాబు ఆడిస్తూ పాడిస్తూ కుతూహలంగా దిక్కులు చూపిస్తూ స్వేచ్ఛగా కదిలించినా తమదైన స్వంత ముద్రల్ని చూపించుకొని తమని తాము పరిచయం చేసుకోడానికే.

ఒక స్వంతముద్రలేని రచయితల్ని పాఠకులు తొందరగా మర్చిపోతారు. అలాటివారికి గుర్తింపు వుండదు. ఒకరి నీడలో ఎదగడానికి ప్రయత్నించినా అంతే. అందుకే అసంఖ్యాకంగా వస్తోన్న రచయితల్లో పాఠకులు గుర్తుంచుకునేవాళ్ళు అంతంత మాత్రంగానే వున్నారు. చక్కగా కథలు చెప్పేవారు తెలుగులో చాలామంది వున్నారుకాని ఒక స్వంత గొంతుతో పలికేవాళ్ళు తక్కువే. హితశ్రీ, తిలక్, సి. రామచంద్రరావు, త్రిపుర, పెద్దిభొట్ల సుబ్బరామయ్యలు బహుకొద్ది రచనలు చేసినప్పటికీ వారిని పాఠకులు గుర్తుంచుకున్నారంటే కారణం అదే.

కొంతమందికి వొంటికి నగ లుంటేనే అందం. కొంతమంది ఏమీ లేకపోతేనే అందంగా వుంటారు. మనిషినిబట్టి మారుతున్నట్టే వస్తువునుబట్టి వర్ణనలు మారుతుంటాయి. కొన్నిరకాల కథలకు వర్ణనలు అట్టే అక్కరలేదు. కొన్నిటికి ఓ మాదిరిగా కావాలి. మరికొన్నిటికి కాస్త ఎక్కువగానే వుండాలి. వర్ణనలేని కథ రంగుల్లేని చిత్రం. అది రేఖాచిత్రం. రేఖా చిత్రంకూడా గొప్పగా వుండొచ్చు. రంగులు రేఖలకు ప్రాణంపోస్తాయి. వర్ణనలుకూడా అంతే. అయితే ఊరికే రంగులు పులిమేసినంతమాత్రంచేత అది సిద్ధించదు. బేలన్సు చూసుకోవాలి. సమర్థుడైన చిత్రకారుడికి ప్రత్యేకమైన శ్రమలేకుండానే ఆ దృష్టి ఏర్పడుతుంది. సమర్థుడైన రచయితకుకూడా ఆ నేర్పు స్వాభావికంగానే

వుంటుంది. వర్ణనలకు బుచ్చిబాబు పెట్టిందిపేరు. వర్ణనలమీద మోజుకొద్దీ వస్తుస్వభావాన్ని ఎప్పుడూ ఆయన మర్చిపోలేదు. 'దేశం నాకిచ్చిన సందేశం' అందుకు ఓ ఉదాహరణం. వర్ణనల్లో బీనాదేవిని ప్రత్యేకించి చెప్పుకోవాలి.

ఈనాడు వస్తు ప్రాధాన్యత పెరిగి శిల్ప ప్రాధాన్యత తగ్గిపోయింది. చలం 'ఓ పువ్వుపూసింది' లాటి ఉత్కృష్టశిల్పం గల రచన యింతకాలమైనా మళ్ళీ రాలేదు. అందుకు కారణం రచయితలు భావవిప్లవం పేరుతో వస్తువుమీద ఎక్కువ మోజుచూపి శిల్పాన్ని అలక్ష్యంచేస్తున్నారు. వెనకటి కాలంలో వచ్చి నన్ని ప్రయోగాలు యీనాడు రావడంలేదు. అతివాస్తవిక ధోరణిలో, అస్తిత్వ వాద ధోరణిలో, చైతన్యస్రవంతి మార్గంలో — యిలా అనేక సాహితీ ప్రక్రియల్లో కథ రకరకాల రూపాల్లో ఆవిష్కృతమైంది. ఈనాడు ఆ ప్రయోగాలు కరువయ్యాయి.

ప్రయోగాలవల్ల సాహిత్యం అభివృద్ధి చెందుతుంది. ఒక్క ప్రగతివాద మైనంత మాత్రంచేత సాహిత్యం వికసించదు. అది ప్రయోగపరంగానూ విక సించినప్పుడే ఏ సాహిత్యమన్నా అభివృద్ధి చెందుతుంది. ఈనాడు సామాజిక స్పృహ పేరుతో కేవలం వస్తువు మీదనే చూపుతున్న ఆసక్తిని శిల్పంమీద కూడా చూపి కొత్త ప్రయోగాలకు వీలుకల్పిస్తే తెలుగు కథానిక ఏకముఖంగా కాక బహుముఖాలుగా వికసించగలదు.



"పసిపాపల నిదుర కనులలో
మురిసిన భవితవ్యం యెంతో?
గాయపడిన కవిగుండెల్లో
వ్రాయబడని కావ్యాలెన్నో?"

—దాశరథి.

# వాస్తవికత - తెలుగు కథానిక

శ్రీ కొలకలూరి ఇనాక్

వాస్తవికత 'రియలిజమ్' అనే ఆంగ్ల పదానికి తెలుగు. ఆంగ్లంలో వస్తువు ఉద్దిష్టం కాకపోయినా ఆంధ్రంలో ఉద్దేశింపబడింది. తత్త్వశాస్త్రంలో చిత్రలేఖన శిల్పాలలో, సాహిత్యంలో, ఈ పదం ప్రయోగింప బడుతూవుంది. సారస్వతంలో ఒక రచనాతత్త్వంగా వాస్తవికత ప్రసిద్ధం. కవిత్వంలో కంటే వచన ప్రక్రియల్లో, నాటకాది రచనలకంటే, నవలకథానికాది రచనల విషయంలో వాస్తవికత అధికంగా ఆలోచింపబడుతుంది.

సృజన సాహిత్యంలో కల్పన పెరిగేకొద్దీ వాస్తవికతాదృష్టి పెరుగుతుంది. ఒక రచనలోని వాస్తవికత ఆ పాఠకుల్ని కొంతవరకు లోనైపోయేటట్లు చేసుకొంటుంది. విమర్శనం ప్రారంభమయిన నాటినుంచి విమర్శకులు ఆ పేరుతోనో, మరో పేరుతోనో ప్రత్యక్షంగానో పరోక్షంగానో వాస్తవికతాదృష్టితో విమర్శిస్తారు. అందువల్ల సృజనసాహిత్యం వాస్తవికతతో కూడిందయితే, ఎక్కువగా ఆదరింపబడుతుంది. ఈ కారణంగానే తెలుగు కథానికల్లో వాస్తవికత పెరుగుతూవచ్చింది.

సాహిత్యంలో మతం కాని, భయంకాని ప్రాధాన్యం వహించినంతకాలం, అది సృజనమయినా కాకపోయినా వాస్తవికతకు అవకాశం తక్కువ. ప్రపంచ ప్రధానభాషల్లో ప్రారంభంలోనూ, ఆపైన చాలాకాలందాకా వెలువడ్డ సారస్వతంలోనూ మతం ప్రధానంగా వున్నట్లే భావింపబడింది. ఒక కాలంలో దేవుడు మరోకాలంలో రాజులు, ఇంకోకాలంలో సిద్ధాంతాలు పుట్టింపజేసిన సాహిత్యం భయంనుంచి పుట్టింది. ఈ మతభయాల సాహిత్యంలో వాస్తవికత మృగ్యం.

సృజన సాహిత్యంలో వాస్తవికత సామాజిక చైతన్యానికి ప్రతీక. ఆర్థిక స్థితిలో వెనుకబడ్డ వాళ్ళు, మధ్యతరగతివాళ్ళు; ఉత్పత్తి సంస్థల్లో కూలీలు, శ్రామికులు, పీడితవర్గాలు; తక్కువ వాళ్ళుగా చూడబడే నీగ్రోలు హరిజనులు మొదలైనవాళ్ళు; ఆర్థిక రాజకీయ సాంఘిక సమానతలు వాంఛించి ఏ పరిస్థితుల్లోను వాటిని పొందటానికి ప్రయత్నంచేస్తున్నప్పటినుంచి వెలువడ్డ ప్రపంచసాహిత్యంలో వాస్తవికతా దృష్టి ప్రబలింది. 19 వ శతాబ్ది ప్రారంభం నుంచి, ఫ్రాన్సు

రష్యా, ఇండియా, చైనా దేశాలలో, నీగ్రో దేశాలలో, ఇతరదేశాలలో వచ్చిన పరిణామాలు వాస్తవికతకు దోహదం చేశాయి. "The time around the July revolution of 1830 was generally considered as the end of an epoch, as the dawn of a new age in literature also" 1

ప్రపంచ సాహిత్యంలో వాస్తవికతాదృష్టి 19 వ శతాబ్దికి పూర్వం ఎక్కువగా లేదని చెప్పవచ్చు. వాస్తవికతతోకూడిన రచన ఉండవచ్చుకాని, అవి ఆ విధమైన రచనలుగా ఆకాలంలో కాని ఆ కవులు రచయితలచేతగాని భావింపబడినట్లు చెప్పటం కుదరదు. కాళిదాసు కవిత్వంలో తిక్కన సాహిత్యంలో షేక్స్పియర్ నాటకాలలో వాస్తవికత వుందని వర్తమానంలో అనుకొంటే అనుకోవచ్చు కాని, ఆ కాలంలో ఈ భావం లేదు.

1851 లో థాకర్ వాస్తవికతావాదాధ్యక్షుడుగా భావింపబడ్డాడు. 1953 లో బాల్జాక్ వాస్తవికతావాదిగా అంగీకరింపబడ్డాడు. అమెరికాలో 1864 లో హెన్రీజేమ్స్‌తో, జర్మనీలో 1850 లో డిశాంక్టస్, జోలా రచనాలోచన చేయటంతో, రష్యాలో 1836 లో విసారియన్ బెలిన్‌స్కీ, ఫ్రీడరిక్ స్కెలెదెల్ వాస్తవికత అనే పదబంధం స్వీకరించటంతో వాస్తవికతాదృష్టి ప్రపంచంలో ఆయా ప్రాంతాలలో పొందిన ప్రారంభం తెలుస్తుంది.

తెలుగు సాహిత్యంలో ఈ వాస్తవికతాదృష్టి ఎప్పణ్ణుంచి కలిగిందిఅన్న విషయం పరిశీలింపవలసి వుంది. 19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో, ఆంగ్లభాషాసారస్వత ప్రభావం, ఆంగ్ల ప్రక్రియాప్రభావం కానీ, 20 వ శతాబ్ది మొదట పాతికేళ్ళలో ఆంగ్లభాష, తత్త్వసిద్ధాంతాలు కానీ, తెలుగుసాహిత్యంమీద ప్రభావం చూపుతున్నప్పుడు వాస్తవికతాదృష్టి ఈ సాహిత్యంలో ప్రవేశింపలేదు.ఆంగ్లేయపాలనం కాని, ఆంగ్లప్రభావంకాని ఈ వాస్తవికతను తెలుగులోకి తేలేదు.

1930 ప్రాంతంలో వచ్చిన ప్రపంచార్థికసంక్షోభంనుంచి, అప్పుడప్పుడే పెరుగుతున్న మార్క్సిస్టు దృక్పథం నుంచి, తెలుగు దేశంలో ఫలిస్తున్న రష్యా సామాజిక సాంస్కృతిక కళారంగాల ప్రభావం నుంచి తెలుగు సారస్వతంలో

---

1. Rene Wel lek-The concept of Realism in Literary Scholarship : (ch)-concepts of criticism- New Haven and London : Yele university press. (1965) P. 243.

వా స్తవికతా దృక్పథం ఆవిర్భవించింది. కమ్యూనిష్టు రచనలుగా భావింపబడే తెలుగు రచనల్లో వా స్తవికత ఆద్యరూపం గోచరమవుతుంది. రష్యాలో ప్రపంచ సాహిత్యంలోనే అత్యుత్తమ వా స్తవికతా సాహిత్యం పుట్టటంవల్లనూ, వా స్తవికతా దృక్పథం రష్యా సారస్వతంలో తప్పనిసరి కావటం వల్లనూ, "In the Soviet Union, in all the Satellite Countries, and I presume, even in China" realism or rather "socialist realism" is installed officially as the only permissible literary doctrine or method" 2 అవటంవల్లనూ, రష్యాసాహిత్యంవల్ల తెలుగుసాహిత్యం ప్రభావితమై, ఉత్తమ వా స్తవికతా దృక్పథం చూపే రచనావిర్భావానికి దోహదమయింది.

వా స్తవికత అంటే ఏమిటో స్పష్టంగా తెలియటం అవసరమే: వా స్తవికత అంటే స్థూలంగా జీవితాన్ని ఉన్నదున్నట్లుగా చిత్రించటం అనవచ్చు. ఇందులో కల్పనకు ఊహకు అవకాశం ఉండదు. కంటికి కనిపించే జీవితం సాహిత్యంలో కళ్ళకు కట్టేటట్లు వ్రాయటం అనవచ్చు. ఈ ప్రాథమిక నిర్వచనం వా స్తవికతా దృష్టివైశాల్యాన్ననుసరించి, వి స్తృతంగా చూడవచ్చు.సాధారణంగా సంఘంలోని జీవితం ద్రవరూపంలో ఉండి రచయిత అనే మూసలో పోయబడి, ఘనీభవించి, సాహిత్యంగా రూపొందుతుంది. మూసకు ఏ రంగు వుంటుందో, ఏ కొలత లుంటాయో, ఏ ఆకారం వుంటుందో, ఆ విధంగా సంఘ జీవితం సాహిత్యం రూపొందుతుంది. అయితే వా స్తవికతా దృష్టి ఉన్న రచయిత సంఘజీవితం సాహిత్యంలోకి వీలయినంతవరకు ఉన్నది ఉన్నట్లుగా తేవటానికే ప్రయత్నిస్తాడు. రచయిత తన ఆశలు, ఆశయాలు వ్యక్తిత్వం తన సాహిత్యంలోకి వచ్చి బాహాటంగా కనిపింపకుండా జాగ్రత్త పడతాడు. సామాజికసత్యంలో కల్పన కలపకుండా స్వచ్ఛరూపం ప్రదర్శిస్తాడు.

తెలుగు కథానికా సాహిత్యంలో స్వాతంత్ర్యానికి పూర్వం అల్పంగా, అనంతరం అధికంగా వా స్తవికత గోచరమవుతుంది. ఎందరో రచయితలు ఈ వా స్తవికత తమ కథానికల్లో నిక్షిప్తం చేశారు. శ్రీ శ్రీశ్రీ, శ్రీ ఆరుద్ర, కీ॥ శే॥ పిచ్చేశ్వరరావు కథల్లో పీడితులు, శ్రామికులు, మధ్యతరగతిజనంమనస్తత్వం జీవితం వా స్తవికతలో ఒప్పుతాయి. వా స్తవికత కమ్యూనిజం ప్రచారానికి వెలుపల ఆవిర్భవించటానికి వస్తువిషయకంగా శ్రీ రాచకొండ విశ్వనాథ

2. Ibid- P. 222

శాస్త్రి, పాత్రవిషయికంగా శ్రీ కొడవటిగంటి కుటుంబరావు చేసిన దోహదం గమనార్హం. కమ్యూనిజందృష్టి లేని రచయితల కథానికలు వాస్తవికతను పటిష్ఠంగా పోషించాయి. శ్రీ చలం కథానికల్లో ప్రేమకోసం ప్రాణం లెక్కపెట్టని యువతత్త్వం, శిథిలమైపోతున్న ఒకతరం జీవితంమీద క్రొత్తగా పుడుతున్న నవతరం దీప్తి; కీ॥ శే॥ బుచ్చిబాబు కథానికలలో సామాన్యుల జీవితసంఘర్షణ దానికోసం మనిషి చేసేసర్దుబాట్లు; 'కీ॥ శే॥ కరుణకుమార' కథానికల్లో సంఘం తాకిడికి తట్టుకొనే మనుష్యుల మమతలు, భయాలు; కీ॥ శే॥ గోపీచంద్ కథానికల్లో పల్లెనుంచి పట్టణానికి అక్కణ్ణుంచి స్వర్గానికి పెరుగుతున్న మనిషి పోతున్న పోకడలు; శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి కథానికల్లో న్యాయానికి అటూ ఇటూ సంచరించే మనుష్యుల జీవితంలో కనిపించే రాత్రీ పగలు; శ్రీ మధురాంతకం రాజారాం కథానికల్లో పూర్వస్థితినుంచి, ఆధునిక నాగరికతవైపు పల్లెప్రజలు పొందే పరిణామం; శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ కథానికలలో వర్తమానాంధ్ర సమాజ జీవితంలో స్త్రీ సాధింపవలసిన ఔన్నత్యం; వాస్తవికతను ప్రదర్శించి తెనుగు కథాసాహిత్యస్థానం పెంచుతున్నాయి.

శ్రీచలం కథానికలు కొన్నింటిలో శ్రీ కొడవటిగంటి కథానికలు కొన్నింటిలో వివాహవ్యవస్థ అనవసరం అన్నభావం వుంది. ఈ భావం సక్రమమయిన ఆలోచనకు కానీ, సమాజంలో ఉన్నదున్నట్లుగా చిత్రించటం అన్నదానికికాని దోహదం చేయలేదు కనుక సాహిత్యంలో వాస్తవికత కాదు. రచయిత ఆశ, ఆశయం సిద్ధాంతం సమాజ జీవితానికి భిన్నంగా వుంటే, ఆ ఆశ, ఆశయం సిద్ధాంతం కథానికలుగా రూపొందితే,అవి అవాస్తవికతలో చోటుచేసుకొంటాయి.

ఏ సిద్ధాంతం అయినా నమ్మేవాళ్ళు, ఏ ఆశ అయినా గాఢంగా ఉన్నవాళ్ళు, ఆ సిద్ధాంతం, ఆ ఆశ ప్రచారం చేసుకోవటానికి ప్రదర్శించుకోవటానికి చేసే రచనలు పాక్షిక సత్యం చెబుతాయి కనుక వాస్తవికతకు దూరమవుతాయి. చారిత్రక దృష్ట్యా, వాస్తవ పరిస్థితుల అవగాహనమే లేని రచయితలు ఏర్పరచుకొనే విశ్వాసాలనుంచి పుట్టే సాహిత్యం అవాస్తవికతను జోడించుకొంటుంది. పరిణామం సమాజధర్మ మయిన సంఘంలో వచ్చే ఏ మార్పూ సహించలేని మనిషి రచయిత అయితే ఆ సాహిత్యంలో వాస్తవికతకు అవకాశం తక్కువ. ప్రాచీనతకు భక్తుడైన రచయిత, భవిష్యత్తు అంటే భయపడే రచయిత, సర్వమానవ విజ్ఞానం పాతరాతియుగంలోనే జాతిజీవితంలో ప్రవేశించిందని నమ్మే రచయిత, తన సాహిత్యంలో వాస్తవికతను రూపొందించలేడు.

కాబట్టి వాస్తవికత సాహిత్యంలో స్వచ్ఛంగా గోచరం కావాలంటే, రచయిత సమాజాన్ని దైవంకంటే ఎక్కువగా చూడాలి. రచయితకు సంఘం ప్రాణం. సాంఘికం కాని సన్నివేశం, పాత్ర, వాతావరణం సాహిత్యంలోకి వచ్చే అవకాశంలేదు. సాహిత్యంలో వాస్తవికత సంఘజీవితం నుంచి తీసిన నకలు. అయితే, సంఘంలో సామాన్యుడు చూడలేని ఏ విషయం సాహిత్యంలో ఉండకూడదా, ఉంటే దోషమా కాకపోతే అవాస్తకవిత అవుతుందా అని ప్రశ్న ఉదయిస్తుంది. సంఘంలో అసామాన్య సన్నివేశం, సాహిత్యంలో నిషిద్ధ మవుతుందా ?

ప్రకృతిని ఉన్నదున్నట్లు వర్ణించటం వాస్తవికత అనుకొంటే మనిషి అందులో భాగమే! కాని ఒక మనిషి మనస్సులో కదిలే ఆలోచన సంఘంలోని ఏమనిషి మునుపెప్పుడూ చూచి ఉండకపోవచ్చు. అనుభవంలోకి రాకపోవచ్చు. మనిషి వాస్తవం కనుక సాహిత్యంలో ఆ మనిషి వాస్తవికత. మనసు వాస్తవం కనుక సాహిత్యంలో ఆ మనసు పోయే పోకడలు వాస్తవికత అయితీరాలి. అయితే మనస్సు కనే కలలు కలలేకాని ఆ మనస్సునుంచి సాగే సక్రమమయిన హేతుబద్ధమయిన ఆలోచనలు పొందే రూపాలు, అప్పటికి సంఘంలో కొత్తవైనా, లేనివైనా, వాస్తవికత ప్రదర్శిస్తాయి.

రంగస్థలం మీద మూడు గంటలు ప్రదర్శింపబడ్డ నాటకం సమాజ జీవితంలో మూడు గంటల్లో ముగిసిన సన్నివేశానికి ప్రతిరూపం కావాలనే డౌబిగ్‌నెక్ వాస్తవిత కన్నా, ఒక వ్యక్తిజీవితం ఆ వ్యక్తి కలగివున్న వస్తుజాలంతో సంబంధంపొందివుంటుంది కాబట్టి, ఆవ్యక్తిని సాహిత్యంలో పాత్రగా రూపొందించేటప్పుడు ఆ వస్తు సమూహం వర్ణించటం అవసరం అన్నభావానికి తోడుగా ఆ వ్యక్తి వస్తుజాలం పూర్తిగా కచ్చితంగా స్పష్టంగా వర్ణించాలనే గస్టోవ్ ఫ్లాన్బే వాస్తవికతన్నా పూర్ణ స్వీకరణార్హమైన వాస్తవికత మనిషి అంతరప్రకృతినుంచి లభిస్తుంది.

రచయిత ఆశ, కల, అవాస్తవికతవైపు సాహిత్యాన్ని తీసుకుపోతాయి. సంఘంలో ప్రజలంతా సత్యహరిశ్చంద్రులుగా ఉండాలన్న ఆశ, జనమంతా సోదరులుగా ఒక మహాభవనంలో ఒక పూరెడు జనం ఉండాలన్న ఆశ, ఒంటి స్తంభం మేడమీద భూమికి మైలు పైన ఆకాశంలో ఒంటరిగా ప్రేయసితో చుక్కలు లెక్కబెడుతూ కూర్చోవాలన్న కల, లోకమంతా తనని నీతిపరుడుగా భావించాలన్న కల, సాహిత్యాన్ని అవాస్తవికతలోకి ఈడ్చుకుపోతాయి.

అయితే రచయిత ఆలోచనలకు వాస్తవికతలో చోటు వుందనటం ఎలా సాధ్యం ? పొగచూరిన పూరిళ్ళు ఇరుకుగా మురికిగా ఉన్నచోట పూలమొక్క లేకపోయినా, ఉండే అవకాశం లేకపోయినా ఉన్నట్లో; ఊరు పూరంతా ఏడుపు పెడబొబ్బలతో దుఃఖంతో నిండి పోయినప్పుడు, ఆపూళ్ళో రేడియో లేక పోయినా, ఉండే అవకాశం లేకపోయినా ఉన్నట్లు పాడుతున్నట్లు వ్రాసే రచయిత అవాస్తవికత వ్రాసినట్లు కాదు. ఎండిన బ్రతుకుల్లో ఒక పూలమొక్క మొలవటం, దుఃఖంతో పూడుకుపోయిన గొంతుల్లో ఒక రేడియో మోగటం వాంఛనీయాలు. వాంఛిస్తే, ప్రయత్నిస్తే లభ్యాలు, ప్రయత్నార్హాలు. అంతేకాని ఒంటిస్తంభం మేడ, ఏ దొందల కుటుంబాలుండే పల్లెలో మహాభవనం వాంఛనీయాలు అయితే అలభ్యాలు. లభ్యాలు అయితే అవసరాలు, అవసరాలు అయితే నిరుపయోగాలు. ఉపయోగపడితే, అవి ఎందు కుద్దేశింపబడ్డాయో అందుకే ఉపయోగపడవు. అందువల్ల క్రమబద్ధంకాని, హేతుయుతంకాని ఆలోచన అవాస్తవికతలో అంతర్భాగ మవుతుంది.

అభూతకల్పన కాకుండా అల్పమైన కల్పన సర్వజీవితానికి జోడించి సృష్టించిన సాహిత్యంలో వాస్తవికత వుంటుంది. రచయిత కంటికి కనిపించిన జీవితం చిత్రించటంతోపాటు గుండె కంటికి కనిపించే జీవితం చిత్రించటంతో వాస్తవికత ద్విగుణీకృత మవుతుంది.

తెలుగు కథానికలో వాస్తవికత ఇతివృత్తంలో పాత్రభాషగతంగా చూడ వచ్చు. ఇతివృత్తంలో వాస్తవిత వుంటే, ఆ కథానిక సజీవంగా ఉన్నప్రాణి. పాత్రగత వాస్తవికత వుంటే ఆ కథానిక అవయవాలు పుష్టిగా ఉన్నప్రాణి. భాషా విషయక వాస్తవికత వుంటే ఆ కథానిక రక్తం బాగా ప్రవహిస్తున్న ప్రాణి.

కథానికలోని ఇతివృత్తం సమాజ జీవితంలోని ఒక అత్యంతస్వల్పాంశం ప్రదర్శిస్తే చాలు. కాలచక్రం కదలికలో ఏ క్షణంలో వెయ్యోవంతో ప్రకటిస్తే చాలు. సంఘానికి దూరమయిన ఇతివృత్తం వాస్తవికతను కోల్పోతుంది. అర్ధ రాత్రి వర్షంలో తడిసిన యువతి వంటినిండా సొమ్ములతో వచ్చి, యువకుడు అందగాడు ఒంటరివాడు అయిన బ్రహ్మచారిగది తలుపు తట్టి, తలదాచుకొనే చోటు ఇమ్మంటే, తన బట్ట లిచ్చి, తనపడక ఇచ్చి, తనగది ఇచ్చి, బైటికి వచ్చి, వర్షంలో వరండాలో గాఢనిద్ర పోతే, తెల్లవారుజామున నిద్రలేచిన యువతి తలుపు తీసుకొని వెలుపలికి వచ్చి యువకుడికి చెప్పకుండానే చీకటిలోకి వెళ్ళి

పోయిన కథలో వాస్తవికత వుందా ? అంటే లేదని, ఏమాత్రం లేదని సమాధానం! ఇది రచయిత/రచయిత్రి ఆశ/కలలోనుంచి పుట్టినకథ. ఇందులో పదో పాతికోవిధాల అవాస్తవికత వుంది.

కథానికలోని పాత్రలు సంఘంలోని మనుష్యులుగా వుంటే పాత్రగత వాస్తవికత సాధ్యమవుతుంది. లేకపోతే లోపిస్తుంది. రంభనో, ఊర్వశినో, ఇంద్రుణ్నో, చంద్రుణ్నో పాత్రలుగా సృష్టించి, వాస్తవికత ఉండాలంటే కష్టమే! లోకంలో ఒకే సన్నివేశంలో భిన్నవ్యక్తులు భిన్నరీతులుగా ప్రవర్తిస్తారు. అవిభిన్నత గల వ్యక్తులు ఎవరు పాత్రలయినా వాస్తవికత సాధ్యమే. యజమాని ఇద్దరుసేవకుల్ని సమానంగా కొడితే, ఒకడు తిరగబడవచ్చు, మరొకడు సహింపవచ్చు. తిరగబడ్డా, సహించినా, అది అపాత్రగతంగా వాస్తవికతే! తిరగబడటమేనో సహించడమేనో వాస్తవికత అంటే పొరపాటు.

కథానికలోని భాష సంఘంలోని మనుష్యులు మాట్లాడేదిగా వుండాలి. కొన్ని పరిమితుల మాట అటుంచి, చాలావరకు మాట్లాడినట్లు వ్రాయవచ్చు. గ్రాంథికంలో సంభాషణలు వ్రాసి, వాస్తవికత వుందని ఎవరూ అనకపోవచ్చు. గ్రాంథికంకంటే వ్యావహారికం, వ్యావహారికంకంటే మాండలికం వాస్తవికతను సాధించే అవకాశం వుంది. నేటి తెలుగు కథానికారచయితలందరూ సర్వసాధారణంగా వ్యావహారికమే వ్రాస్తున్నారు. మాండలికం వ్రాసిన వాళ్ళలో కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణ విషయం వదిలితే, నేడు, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కొంత గుంటూరు మాండలికం, శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి, శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ విశాఖపట్టణం మాండలికం, శ్రీ పోరంకి దక్షిణామూర్తి గోదావరి తెలంగాణాల మాండలికం (నవలల్లో) వ్రాశారు. వ్రాయవచ్చు. వ్యావహారికంకంటే మాండలికం వాస్తవికతా దృష్టితో ముందడుగు. రచయిత ఏభాషలో కథ వ్రాస్తున్నాడో ఆ భాషలో కథలో పాత్రలు మాట్లాడకపోవచ్చు. తెలంగాణా రైతు పాత్ర అయిన కథలో తెలుగు వ్యావహారికం, ఆ పాత్ర మాట్లాడినప్పుడు ఉండక తెలంగాణా మాండలికం వుంటుంది. ఇక్కడ రచయిత వ్యావహారికంలో కథ వ్రాస్తున్నా, సంభాషణలు తెలంగాణా రైతులిద్దరిమధ్య జరుగుతుంటే తెలంగాణా మాండలికం వ్రాయటం ఉచితం. ఒక్కమాటలో-పాత్ర ఎలా మాట్లాడితే అలా సంభాషణ వ్రాసి, రచయిత తన భాషలో కథ వ్రాయవచ్చు. రచయితభాషే పాత్రలభాష కాదు. వాస్తవికత దెబ్బతింటుంది. పాత్రలభాషే రచయితలభాష కావచ్చు. అంతేకాక ఈ సన్నివేశంలో

ఈ పాత్ర ఇలా మాట్లాడుతుందా అని రచయిత వితర్కించుకోకుండా భాష ప్రయోగించకూడదు. పట్టణంతో సంబంధంలేని పల్లెమనిషి ఎక్కువగా ఇంగ్లీషు పదాలు వాడుతుంటే వాస్తవికత కాదనిపిస్తుంది. రైలుకు జండా వూపుతున్న గార్డు మాటమాటకీ మూడు సామెతలు చెబుతూ పదినిమిషాలు పాతకుల్ని ఆపితే, అతడు రైలు నెంతసేపు ఆపినట్లు? 'నేను వస్తాను, నువేపో' అనవలసినచోట సామెత లెందుకు? మాట లెందుకు? ఒకపాత్రకు నసగా మాట్లాడటం ధర్మం అయినప్పుడు ఆపాత్ర క్లుప్తంగా మాట్లాడటం ఉచితంకాదు. ఊరికే మాట్లాడే పాత్రను కీ.శే. బుచ్చిబాబు సృష్టించినట్లు గుర్తు.

వాస్తవికత, ఇతివృత్తం పాత్రభాషలమూలంగా సాధింపవచ్చునన్న తర్వాత, మనిషి అంతర్ప్రకృతినుంచి సాధ్యమయ్యేవాస్తవికత వివరంగాగమనించాలనిపిస్తుంది. ఒకడు బస్సుక్రింద పడబోయే పిల్లను రక్షించి, ముఖంఅయినా చూడకుండా గొంతు నులిమి చంపేస్తే, కోపంగా ఉంటుంది. కారణం చెప్పకపోతే ఈసన్నివేశం అవాస్తవికత. కారణం తెలిస్తే, సరయిందయితే, వాస్తవికత. కారణం ఉంటుంది పాత్రమనస్సులో. అది విశ్లేషించటం తప్పనిసరి. అప్పుడే కారణ మవగతమవుతుంది. దీనికి మానసికవిశ్లేషణ అవసరమయింది. కాబట్టి, అది జరిగింతర్వాత ఈ సన్నివేశం వాస్తవికత అనిపించింది కాబట్టి దీనిని మనస్తాత్త్వికవాస్తవికత అనవచ్చు. ఇది ప్రాకృతిక వాస్తవికతకంటే భిన్నమయింది. మనస్తాత్త్విక వాస్తవికత చూడగానే వాస్తవికత కాదేమో అనిపించే ప్రమాదానికికూడా లోనవుతుంది. పాత్ర హేతుయుతంగా, క్రమబద్ధంగా పొందిన మానసిక పరిణామం, జనం అనుభవంలోకి రాకపోయినా, స్థూలంగా అవాస్తవికంగా ఉన్నట్లు తోచినా, అది అవాస్తవికత కాదు. ప్రాకృతికవాస్తవికతను కొన్ని సంకేతాలమూలంగా స్పష్టంచేయచ్చు. (అరక, ఎడ్లు, నాగేటిచాలువంటి పదాలతో పొలందున్నటం వాస్తవికతతో చూపించవచ్చు. ఇక్కడ ఆపైమూడుపదాలు సంకేతాలు). ఇక్కడ రచయిత ఆలోచన అంత ఎక్కువగా రచన వాంఛించదు. అయితే మనస్తాత్త్విక వాస్తవికత సాధించాలంటే అది వాస్తవికతగా ఋజువుచేయాలంటే రచయితఆలోచన, అది పొందే పరిణామం దాని కుపయోగించేపదాలు సంకేతాలుగా రూపొందటం అత్యవసర మవుతాయి. ఇది రచయిత చేసే కత్తిమీదిసాము. రచయిత జాగ్రత్తగా ఉంటే వాస్తవికత, లేకపోతే అవాస్తవికత. అంటే బాగావ్రాస్తే వాస్తవికత లేకపోతే అవాస్తవికత. బాగా వ్రాయటమంటే రచయిత ఆలోచన క్రమవికాసంపొంది లోపరహితంగా

ఉండటం. కాబట్టి సక్రమమయిన ఆలోచన పొందే అక్షరరూపం వాస్తవికతతో ఒప్పుతుంది.

భ్రమ ప్రమాదాలకు లోనుకాకుండా సాహిత్యంలో ఏవిషయాన్ని అయినా నిర్వచించటం కష్టసాధ్యం కనుక, వివరించటం సులువు. అయితే నిర్వచించటానికి ప్రయత్నించవచ్చు. సమకాలీన సామాజికవాస్తవానికి పరాశ్రయ ప్రాతినిధ్యం వాస్తవికత. ఈనిర్వచనంలో పరాశ్రయం, వాస్తవం అన్న పదాల వివరణం అవసరం అనిపిస్తుంది. పరాశ్రయం అంటే ఆత్మాశ్రయం కాదని తేలుతుంది. ఆత్మాశ్రయరచనంలో సత్యం పాక్షికంగా గోచరమవుతుంది. పరాశ్రయసాహిత్యంలో సత్యం సంపూర్ణంగా దర్శించే అవకాశం వుంది. ఆత్మాశ్రయసాహిత్యంలో రచయిత వ్యక్తిత్వం స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. పరాశ్రయ సారస్వతంలో రచయిత కనిపించడు. వాస్తవం అంటే అంతరబాహిర వస్తుతత్త్వం అనుకోవచ్చు. ఏమయినా ఈనిర్వచనంలో ఉపదేశత్వం, పరాశ్రయత్వం, పరోక్షంగా ప్రత్యక్షంగా వివరణం ఆపేక్షిస్తాయి.

'సత్యం వద ధర్మం చర' వంటి ఉపదేశం ఉండే అవకాశం వాస్తవికత ఉన్నరచనల్లో లేదు. సంఘం ఇలావుంది అని వర్ణించటంతోపాటు, ఇలా వుండాలి, ఇలా వుంటుంది అని చిత్రించటంలో వాస్తవికత అవుతుంది. ఈ ఇలా వుండాలి, ఇలా వుంటుంది అన్నతీరు పూర్తికల్పన కాదు. వాస్తవంమీద ఆధారపడిన కల్పన. ఇల్లు కడుతున్నప్పుడు, ఇది పునాది, ఇవి గోడలు అన్నప్పుడు, కిటికీ ఇక్కడుండాలి, ఇక్కడుంటుంది అనటంలాంటిది. పుష్పకవిమానంలో ఇటువంటిగది వుండాలి, ఇటువంటిగది వుంటుంది అనటంలాంటిది కాదు. వాస్తవికతలో వుండే ఉపదేశం అసాధ్యం కాని, అభూతకల్పనకాని, అస్పష్టంకానీ కాదు.

వాస్తవికత సాధించటానికి పరాశ్రయత్వం ప్రధానలక్షణం. స్థూలంగా రచయితరచనలో భాగంకాకుండా వుండటం పరాశ్రయలక్షణంగా చెప్పవచ్చు. షేక్స్పియర్ రచనల్లో ఈ లక్షణం బాగా వుందంటారు. పరాశ్రయత్వాన్ని గూర్చి, "It rejects the fantastic, the fairy-tale-like, the allegorical and the symbolic, the highly stylized, the purely-abstract and decorative. It means that we want no myth, no Maerchen, no world of dreams. It implies also a rejection of the unpro-

bale, of pure chance, and of extra ordinary events, since reality is obviously conceived at that time, in spite of all local and personal differences, as the orderly world of nineteenth-century science, a world of cause and effect, a world without miracle, without transcendence even if the individual may have preserved a personal religious faith"3 ఈ వివరించినతీరు స్వీకరింపవచ్చు.

ఈ పరాశ్రయత్వంలో, ఆత్మాశ్రయత్వంలోలాగా, ఒక అవరోధం వుంది. పరాశ్రయత్వం సంపూర్ణంగా సాహిత్యంలో సాధ్యమా? ఆత్మాశ్రయ స్పర్శలేని పరాశ్రయత్వం వుంటుందా? ఇలాగయితే ఈ ప్రశ్నలు అనేకం అవుతాయి. పరాశ్రయసాహిత్యంలో ఆత్మాశ్రయలక్షణం అల్పంగానైనా ఉండటం తప్పనిసరి. అయితే అది లోతుల్లో ఉండవచ్చు కానీ పైకి తేలకూడదు. అది అల్పంగా ఉండవచ్చునేమోకాని అధికంమాత్రం కారాదు. శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి సృష్టించిన న్యాయవాదుల గుండెల్లో రచయిత కూర్చుని వున్నట్లుందనీ, శ్రీ మధురాంతకం రాజారాం రచనల్లో బడిపంతుళ్ళ జీవితంవెనుక రచయిత మనస్తత్వం ఉందనీ, అనిపించినా ఆరచనల్లో పరాశ్రయత్వం లోపించదు. వాస్తవికత ఉంటుంది.

ఒక కథానికలో పూర్తి వాస్తవికత వుందనుకొనీ, ఒకరచయిత పూర్తిగా వాస్తవికత ఉన్న రచనలే సృష్టించడానికని చెప్పటం ఉచితం కాదు. వాస్తవికత ఉన్న ఒకకథలో ఏమూలో అవాస్తవికత తొంగిచూడవచ్చు. ఒక రచయిత రచనల్లో అవాస్తవికత అధికంగా చోటుచేసుకొన్న రచన ఉండవచ్చు. వాస్తవికత సాహిత్యంలో సామూహికధర్మం. ప్రపంచసాహిత్యంలో రష్యాసాహిత్యం వాస్తవికత నధికంగా కలిగివుంది అనికానీ తెలుగుసాహిత్యంలో కథానిక వాస్తవికతతో ఒప్పుతూవుంది అని కానీ, నిరభ్యంతరంగా చెప్పవచ్చు.

ఆధునిక ప్రపంచ సారస్వతంతో వాస్తవికత అంతర్వాహిని. దీన్ని తెలుగు సృజనసాహిత్యం వర్తమానంలో వాంఛిస్తూవుంది. వాస్తవికత రచయిత రచనాప్రవర్తన మీద ఆధారపడివుంది. అది సాహిత్యంలో కార్యమూ, కారణమూ అయింది. సిద్ధాంతాలకు, వాంఛలకు, భావాలకు దాస్యంచేసినా వ్యక్తిత్వ

3. Rane wellek. The Concept of Realism in Literary scholarship (ch) Concepts of crticism. New Haven and London : Yale University press (1865) P. 241

నిలుపుకొంటుంది. ఏ ప్రక్రియ అయినా వాస్తవికత కలిగివుంటేనే ఉత్తమంగా గోచరించే అవకాశం వుంది. వాస్తవికత ఒక కాలానికి, ఒక ప్రక్రియకు పరిమితం కాదు. సాహిత్యానికే కాక సర్వకళలకు వాస్తవికత సంబంధించిది. కళలన్నింటికి వాస్తవికత పునాది. ఏ కళాభావన అయినా హేతుయుతంగా ఆలోచిస్తే కొద్దోగొప్పో వాస్తవికతారూపం పొందుతుందనటంలో అనుమానంలేదు. "It is clear, however, that in the unlimited range of artistic impulses there is a region which responds more especially to the realistic trend of creative efforts; just as among theories of art there are some doctrines, the guiding principle of which is realism, and which aim at defining exactly the means of attaining to this form of artistic expression" 4 అందువల్ల ప్రపంచసాహిత్యంలో సాహిత్య ప్రక్రియల్లో, సాహిత్య సిద్ధాంతాలలో అల్పంగానో, అధికంగానో వాస్తవికత వుంటుంది. కళా ప్రపంచంలో వాస్తవికత తప్పనిసరి దృక్పథం.



"వెనుకకు చూస్తే భూతం
కనిపించును చూడకు అటు
లభ్యంకాని భవిష్యం
లక్షిస్తూ రభసపడకు
వర్తమానం వ్యర్థం చేయని
కర్తవ్యం నీదని మరువకు
పశ్చాత్తప్తులు పూర్వతప్తులు
ప్రస్తుత మెరుగని వ్యక్తులు వ్యర్థులు"

—కాళోజీ.

4. Emile Legovis & Louish Cazamian—A History of English Literature (1933)—P.1236.

# తెలుగుకథానిక - మనోవిశ్లేషణ

శ్రీ వాకాటి పాండురంగరావు

తెలుగు కథారాజంబులో 'మనోవిశ్లేషణ' అనేటువంటి బ్రహ్మపదార్థంబు గలదా అన్నది మిలియన్ డాలర్ ప్రశ్న.

మనస్సుని విశ్లేషించడం_అనగా

ఆ భౌతికమైన ప్రాతిపదికగలదియున్ను, అయిననూ అంతకుమించి ఎత్తులకు లోతులకు దశదిశలకు విస్తరించగలదియున్నూ, పాతఢిల్లీ నగరంలోని గల్లీలవలె అనేకానేక మలుపులు చీకట్లు వెల్గులు గలదియున్నూ, అనుభవాలు, జ్ఞాపకాలు, కోపాలు, తాపాలు, ఎక్కాలపాఠాలు_ఎక్కలేని నిచ్చెన్లు_నాన్నలమ్మలు_దొంగతనాలు, దొంగముద్దులు _ మిస్ రంగాజమ్మలు _ మిసెస్ కరుణాకరాలు _ హైస్కూల్లో సీతారాంరావులు గోడదూకి వచ్చిన గోవర్ధనాచార్యులు_వాళ్ళతోవీళ్ళతో ఎందరో ఎందరోళ్ళతో ఎన్నోఎన్నో సంఘటనలు_వాటి తాలూకు వెన్నెల్లు అమావాస్యలు_గడిచిన తీయందనాలు_రాబోయేదేమిటో తెలియని భయాలరాహుకేతులు, గ్రహణాలు, పాణిగ్రహణాలు, వేణిగ్రహణాలు_బ్రతుకు భయం చావు భయం చచ్చాక ఏమిటో తెలియనిభయం-చచ్చాక స్వర్గంలో ఒక బెర్త్‌కోసం రంభకోసం చేయాల్సిన యత్నాలు యజ్ఞాలు - చేసిన పాపాలకు పూయాల్సిన వెల్లవేతలు వేయాల్సిన డిస్టెంపర్లు _ మనస్సుకు వాక్కర్మలకూ మనోవాక్కులకూ కర్మలకూ మధ్య బంగాళాఖాతాలు_వాటిలో సోవియటునౌకలు సెవెన్త్‌ఫ్లీటులు_గీతావాక్యంనుండి, అనేక వారవార తెల్గూ సీరియల్ నావల్స్‌చేత అలంకరింపబడిన పాదపద్మములు గల వేంకటేశ్వరస్వామినఃనుండి, శ్రీ మన్మద్గురు పరంపరనుండి అమ్మవార్లనుండి బాబాలనుండి బేబేలదాక 'బేబెల్' దాకా కన్ఫూషియస్‌నుండి కన్ఫ్యూషన్‌దాక కీర్కెగార్డ్‌దాక ఆల్డస్ హక్స్‌లీనుండి సార్త్రెదాక కమూదాక కవబాటాదాక ఫ్రాయిడ్‌నుంచి పార్కిన్సన్‌దాక జాబాలినుండి జంగ్‌దాక ఇంకా శతకోటి జంగాలదాక చెప్పిన రాసిన చదివిన విన్న కన్న సూక్తుల ఉద్ఘాటనల అభిభాషణల ఘోషణల ప్రవచనాల చరిత్రల సైన్సుల చదువుల సారాల ఇట్లా ఎన్నో లలలలలయొక్క ముద్రంపొరలకు అడుగునో పైనో లోపలో చుట్టూనో ఎక్కడో తెలియనది

యున్నూ అయినట్టి ఆ మనస్సనేదానినీ-దాని అనంతమైన లీలలనూ పరిశీలించి గాలించి గమనించి గుర్తించి గవేషించి విశేషించి నిర్వచించి తెలుగుకథ అనే కెమెరాతో కాక్స్ ఆఫ్ ఆటావా లాగున మంచి 'కుఠో' లేమన్న తీశారుటోయ్ బుడుగూ, అని అడుగుతున్నా ర్యార్....!

**ఒకటీ, ఇంక్ + ఒకటీ**

కాలము దేశము అన్నవాటికి అతీతంగా వెళ్ళగల్గినట్టిమనసు ఆదిలో వీటికి లోబడి, వీటికి పరిమితమై, పుట్టి, వికసించి పెరిగి విస్తరిల్లి ఇంతింతయై అంతదాక అనంతందాక పెరుగుతుంది; కనీసం పెరగాలి. చినపులివర్రులోని ఎలిమెంటరీస్కూలు మేష్టారుమనసు ఈవిశ్వమంతటినీ తనపరిష్వంగంలోకి తీసుకోగల్గాలి. ఆపరిష్వంగానికి ఆసర్వమానవశ్రేయస్సును కోరేటి మనస్తత్వానికి రాజకీయంగా, ఆర్థికంగా వ్యక్తిపరంగా ఎన్నోదారులు ఎన్నోఇజాలు.

కాని ఆనిర్గుణనిరాకారస్వరూపుడిని చేరడానికి విగ్రహారాధన ప్రారంభం మాత్రమే అని తెలిసికూడా విగ్రహారాధనతో మొదలుపెట్టి అక్కడే ఆగిపోయే భక్తుడిపలె- నేటిసత్యాన్వేషికూడా ఈ ఇజాలదర్వాజాలదగ్గర, ఢంకాచప్పుళ్ళ కప్పుల క్రింద, నినాదాల చలివేంద్రలముంగిట విలిచిపోతున్నాడు. మేధావులు కూడా కళేబరాని కిచ్చినప్రాధాన్యం ప్రాణాని కివ్వడంలేదు. చిత్తశుద్ధికన్న సిద్ధాంతం ముఖ్యమవుతున్నది. నిజాతీకన్న నీతివల్లింపు పెద్దదవుతున్నది. గుణంకన్న రాశికే గౌరవం లభిస్తున్నది. కనుకనే చెప్పేది ఒకటి, చేసే దింకొకటి; తనకోస మొకటి, ఇతరులకయితే ఇంకొకటి. వ్యక్తిగా ఒకటి సంఘజీవిగా ఇంకొకటి. ఇట్లా అడుగడుగున సుడులతో వైరుధ్యపుసుడులలో అపక్రమభిన్నాలతో,వక్రభాష్యాలతో,శుక్రాచార్యలతో నిండివుంది మనమనస్తత్వం.

కన్‌కార్డ్ జెట్ వస్తున్నదయ్యా అంటే-"దీన్నిగురించి బ్రహ్మపురాణంలో సూతేశ్వరరావు ఏనాడో శౌనక్‌సింగ్‌నకు జెప్పియుండెను. 'కనక' అను ధాతువు నుండి 'కన్‌కా' ఏర్పడినది. ఇంక 'ట'కార మన బరుషస్వరూపము. అయ్యది గసడవాదేశసంధిప్రకారము 'డ' ఆయెను. 'ర'గాగమం బెట్లాయెనన...." అని వెనుకవాటితోనే ముందును వెతికే ఛాందసపు రివర్స్‌గేర్స్ ఒకవైపు.

"శ్రీరామచంద్రుడు దుత్తి వెధవాయి" - "భగవంతుడు బక్వాస్ అని కార్నెల్ మహాశయుడు చెప్పినట్లు మేము లోగడనే మనవి చేసివున్నాము"- "సంస్కృతం చచ్చి కుళ్ళి కంపుకొడుతూందిగనుక దుర్గంధనివారిణిని దిగుమతి చేసుకోవాలి." - "గతములోకి చూడ్డమే తెగులు"-"అన్నిదురదలకు మూలము

వర్గవిభేదము"–"సర్వరోగాలకు ఔషధము విప్లవము" – అని "ముందుచూపు" ఎక్కువయి దృష్టిమాంద్యంలో అతివృష్టితో బాధపడే బ్రేక్స్‌లేని బ్రెయిన్స్ ఇంకొకవైపు.

మరి ఇందులో నిజం ఏది, నిజంకానిదేది అని అడిగే మనస్సుకు తెలుగు కథ పట్టిన అద్దాలు ఎన్ని? ఎన్నో లేవు అనే అందామా?

**మనిషి ÷ n**

సగటు మనిషికి ఎందు చూడబోయినా ఏది చేయబోయినా ప్రశ్నలే. వాటికి సమాధానాలు దొరకడంలేదు. జీవితంమేడీజీలు లేవు. ప్రమాణాలు అసలే కానరావు. భూకమతాల పరిమితుల మీద మన నాయకమ్మన్యుల ప్రవచనాల వలె అంతా 'వేడి' యే కాని 'వెలుతురు' కనబడ్డంలేదు. మానవజీవితం ఎన్నో దారుల కూడలియే కాని దారిమాత్రం కనపడడంలేదు. ఆకాశమంత విషయమూ విజ్ఞానమూ రాశి పోసివుందికాని మనసు పిడికిట ఏదీ ఇమడ్డంలేదు. గురువులు లఘువులవుతున్నారు. లఘువులే గురువులుగా చలామణీ అవుతున్నారు. గిలగిల లాడుతున్నది మనసు. కలవర మందుతున్నది మనసు. కలదా లేదా, కలయా ఎల్ఎస్‌డి మాయయా అని తెలియక కొట్టుమిట్టాడుతున్నది మనసు. మరి పాపం, దానికి తెలుగు కథ కట్టిన వారధులు ఎన్ని, వానిలో ఇసుక వంతెనలు ఎన్ని అని అడిగితే అవి కొన్నే, వాటిలో ఇవి ఎన్నో అని చెబితే అబద్ధమా?

"నీవు ఒక సైనికుడవుకూడా" అన్నారు DAVP వారు. ఔను మనం దరం సైనికులం కూడా. అందుకనే అందరము చకచకమని పంచవర్ష ప్రణాళికలూ ఠోవతివర్ష ప్రణాళికలూ వేసుకుని 'ముందుకు' 'మున్ముందుకు' వెళ్ళిపోతున్నాము. వెళ్ళిపోతున్నకొద్దీ ఎంత వెనకబడి వున్నామో తెలిసి షాక్ తగులుతున్నది. అటు శేఠ్‌జీల పొట్టల ఇనప్పెట్టెల ఘనపరిమాణం పెరుగుతున్నది; ఇటు ఇంజనీరూ నిశానీదారూ కలిసి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్‌ఛేంజ్ దగ్గర 'క్యూ'లో నిలబడి పత్రికల్లో నిన్ననే రావలసిన సోషలిస్టు వైకుంఠం గురించి అరచేతిలో వెతుక్కుంటున్నారు. విసిగి ఒళ్ళు మండి ఏమిట్రా ఇదంతా దొంగవెధవల్లారా అని అడిగితే అశ్లీల మంటున్నారు. 'ఆక్ట్'లు ఏవో వల్లించి నోటికి తాళాలు వేస్తున్నా రీ స్వేచ్ఛాభారతంలో. మరి మన'సుల'కు తాళాలు వేశారా? అట్లా కాదని కాస్త నిదానించి చూచి—"అబ్బే మనం ఈ పాతికేళ్ళల్లో ఏదోకొంత సాధించకపోలేదు. ఈ పెరిగే జనాభా ఆ యుద్ధాలువంటివి మనం సాధించిన విజయాలను పల్చగా చేసి పారేస్తున్నాయి—" అని నచ్చజెప్పుకుని,

ప్రతి మనిషికి కూడు. గుడ్డ, ఇల్లు, చదువు, అన్న ధ్యేయంతో ముందడుగుకు సిద్ధమవుతుంది మనసు.

అయితే___

ఇదే దారిని ఇదే బాటను మనకన్న నీతితో నిజాయితీతో నిష్ఠతో నడిచి ఆర్థికంగా బలం పుంజుకుని వెలిగిపోతున్న దేశాలలో "కూడు, గుడ్డ, ఇల్లు, చదువు ఎన్నో ఎన్నో సౌకర్యాలు" సాధించిన సమాజాల్లో__"అమ్మయ్య, ప్రస్థానం ముగిసింది. గమ్యం చేరాము. భువిమీద దివిని నెలకొల్పాము. ఇంకా అంతా పరిపూర్ణమైన ఆనందమే___" అన్నటువంటి భావన కన్పిస్తున్నదా ?

లేదు.

మరి మనం వెళ్ళే దారి చివర చేరిన వాళ్ళలా దిగాలుగా కూర్చున్నారే. వాళ్లు ఇవన్నీ సాధించాక ఇంకా ఏమో కావాలనుకుంటున్నట్లున్నారే. అదేమిటి? అసలు మానవుడు అన్నివిధాలా బాగా వుండడానికి, నిండయిన మనిషిగా దేవుడుగా కావడానికి సరయినదారి ఇదేనా, ఎమండీ, అయ్యా మే మెక్కిన రైలుబండి సరయినదేనా అని అడగాలనిపిస్తున్నది. అడిగితే సవాలక్ష సమాధానాలు వస్తున్నాయి. మళ్ళీ గందరగోళం. గోళాధ్వందరం. విషపలయంలో, పలవంటి విషయంలో గిరాంగిరదిరాల, రాంరాం హరేరాం. రమ్‌పీయో మారేదమ్ మిస్టర్ రామ్, రామ్ బి డామ్డ్__అంటున్న నేటి మనస్సుకు తెలుగు కథకు ఎంతెంత దూరం ?

శాన శాన దూరం.

**పావురాలూ - రాబు నాపామ్సూ**

మనిషి చందమామ మీద పాదం మోపాడు. కాని ఆ మనిషే పనిగట్టుకుని అమెరికానుండి వేలాదిమైళ్ళు నడచి వియత్నాం వచ్చి తన కేమీ ఎగ్గుతల పెట్టని వియత్నాం అమాయకుడిని చంపుతున్నాడు. ప్రపంచమంతా నపుంసకుడయి చూస్తున్నది. అందుకు నీ మనస్సు ఏమంటుంది బ్రదర్ ? కర్మ అంటున్నదా, కేపిటలిజం అంటున్నదా, కార్ల్ మార్క్స్ అంటున్నదా ? ఈ నీలోని రణగొణలను "మామూలయిన అలవరుసలలో" ప్రసారంచేయ యత్నించే తెలుగు కథా ప్రసారకేంద్రం వుందా అని అడిగితే అరకిలోవాట్ కేంద్రాలు ఒకటో అరో వున్నాయండీ అంటావా ?

శాంతి కావాలి అన్నారు. ఐక్యరాజ్యసమితి పెట్టుకున్నారు. చర్చలదాగుడుమూతలు, తీర్మానాలగేమ్స్ ఆడుకుంటున్నారు. ఐరాస కాపురంవున్న ఆ అమెరి

కాలోనే కోటీశ్వరులున్నారు. ఆ ఈశ్వరుల కోట్లు మిలియన్లు ఎక్కడనుండి వస్తునాయయ్యా అంటే మిసిలీలనుండి గ్రెనేడ్లనుండి రాకెట్లనుండి టాంక్‌లనుంచి నాపామ్‌బాంబులనుండి వస్తున్నాయి. ఆ తయారయ్యే మందుగుండుసామగ్రి, అమ్ముకోవాలి. అంటే ఆ ప్రేలుడుపదార్థానికి హిరోషిమా, నాగసాకి, సినాయ్ మైలాయ్, జెస్సోర్, లాంగెవ్లా–ఎక్కడయితేనేమి ఎర కావాలి, గురి కావాలి. ఆ టిఎన్‌టి ప్రేలడానికి ప్రేలి తనధ్యేయం నెరవేర్చడానికి, కోటీశ్వరులపెట్టుబడికి లాభం రావడానికి మనుషులు కావాలి; మనుషులప్రాణాలు కావాలి, ప్రాణాలున్న మనుషులు కావాలి. అమాయకులయినాసరే ఆడవాళ్ళయినాసరే; ఆఖరికి పసిపిల్లలయినా, "మనభగవంతునిబిడ్డలు ఎవరయినాసరే" కావాలి. కనుక యుద్ధాలు వర్ధిల్లాలి. కనుక యుద్ధంవద్దనే బడుద్దాయికి అధికారపుపట్టం కట్టకు. నాయకుడిగా వాడిని చేయకు, వుండనీయకు. కెనెడీలు కింగ్‌లూ అడ్డొస్తే కాల్చిపారేయి. బిలియన్ డాలర్ల మారణహోమపు జగన్నాథరథచక్రానికి ఎదురయినఎవ్రినాయిాల్ని కూల్చిపారేయి. శాంతి దేముంది, వేదికలమీద కుండలు బ్రద్దలుకొడదాం. సదరు సిద్ధాంతాలకు డాక్టరేట్లుఇద్దాం.చాలదంటే ఒకనోబెల్‌శాంతి బహుమానం పారేద్దాం. పావురాళ్ళ నెగరవేద్దాం. కాని గుర్తుంచుకో డియర్, పావురాళ్ళ ఆకాశంలో! నాపామ్‌బాంబ్లు భూమిమీద. అది పరం. ఇది ఇహం. Do not Confuse these two. To each into its own.

అన్న ఈ కథను చదివాక తెలుగు పాఠక్‌జీ! నీ మనస్సనేపదార్థం ఏమంటూంది? ఓయీ గురువరా, కథకశేఖరా ఇట్టి స్థితిలోనిమనిషిమనస్సులోకి, లోలోకి తమ రచనలెన్స్‌ను ఫోకస్ చేసిచూశారా? అడెప్త్‌ను, ఆపెనోరమాను, ఆ రౌరవాన్ని ఆ అంతరాంతరాల–అగాధాలనిజాలను బయిటికి తీశారా?–

అని 'మహతి'ని మీసేవా రడుగుతున్నారు, అడిగిస్తున్నారు.

కథకవర్యులారా! కలిసి ఏమి చెబుదాం సమాధానం?

"అయ్యా మహతివారూ! "మాలో అనగా తెలుగుకథక్స్‌లో ఎవరో ఒకరో ఇద్దరో, మహాఅయితే ఏ పదిహేందో ఇట్లాంటిపిచ్చివేషాలు వేశారేమోగాని మేము ఎప్పుడూ ఇట్లాంటిపిచ్చివేషాలు వేయలేదు. నేల విడిచి సాము చేయలేదు. కనుక ఆ మైనారిటీవారి అజ్ఞానాన్న అధికప్రసంగాన్ని క్షమించి మాశాయం గల విన్నపాలను వినగలరు. ఉన్నదున్నట్లుగా చెపితే ఉలుక్కోకుండా చెవిని వడేయించగలరు.

"రాయడానికి కలమూ మరియూ తెల్లకాగితా లుంటే చాలు. అచ్చువేయడానికి వారపత్రికలు కాకపోతే కనీసం పాకెట్‌బుక్‌వాలాప్ వుంటేచాలు. నిద్ర

లోనయినా కథలు రాయగల భాస్కరులము మేము. మాదంతా మధ్యతరగతి మందహాసం. అదే తరగతి గుడుగుడుగుంచం. మాసదసత్సంశయం కాంచన మాలకే పరిమితం. మాకథలమనుషు లెప్పుడూ చాలమంచివాళ్ళు. మనుషుల్ని ఆప్టే క్రమసెట్టనివాళ్ళు.... అత్తలు కోడళ్ళు దాంపత్యాలు అపశ్రుతులు అపార్థాలు ఆకర్షణలు రగడలు రైలుప్రయాణాలు అడపాదడపా రైతుపాత్రలు కాద్దోగాపోవ్ డాక్టర్లు-"భగవాన్ మాకింతే చాలు"లు- జీవనరాగాల తరంగాలనౌకలవాదాల చక్రాల వికారాలు_ ఇవన్నీ సమానాంతరాలు_ మాకథలరైలుబండి ఈపట్టాల మీద పడుతూ లేస్తూ పరుగెడుతూంటుంది_ మాకృష్ణమూర్తిభాతీ వెడల్పుగానే వుంటుంది_ మాసత్యభామల కోపాలు తీర్చడానికి ప్లాస్టిక్ పారిజాతాలే పదివేలు- మారహమాన్ కొట్టే టెన్నిస్‌బంతి అడుగుకు పైగా ఎగరదు_ ఇంపాలాతప్ప ఎక్కని క్లబ్బులో తప్ప ఊపిరి పీల్చలేని మానాయకశ్రీ జీవితాన్ని చాల లైట్ గానే సిప్ చేస్తాడు. ఈ గానుగే మాకథలపాలిటి పట్టపుఏనుగ_ మనీ వుంది_ మజా వుంటే మనసు దేముంది? జోకొట్టవచ్చు_ జాబిలీపాటలు పాడవచ్చు_ పగలే వెన్నెల కాయించవచ్చు_ పల్నాడులోనే ప్రెయిరీలను నాటవచ్చు-కనుక సార్, కథలనేవి రాయడం ఎందుకండి?

"పేరు అచ్చులో పడ్డానికి, పాతికో యాభయో చేతికి రాలడానికి. కాల రెత్తుకు తిరగడానికి, అకాడమీ బహుమతి వస్తే అందుకోవటానికి, సమావేశాలు గోష్ఠులు హాజరవడానికి, హాయిగా కాలం వెళ్ళబుచ్చడానికి, మజాగా కులాసాగా జీవించడానికి, విలక్షణంగా వి. ఐ. పి. లా వెళ్ళిపోవడానికి _ అంతేకాని ఈ మనస్సనే బురదలోకి అడుగుపెట్టడానికటండీ మేము రాయడం? మేము రాయకపోతే వారాలు మాసికాలు పెట్టడం - ఎట్లాగు, పాపం ఆ లక్షలాది వాయసాలు బ్రతికే దెట్లాగు, బుద్ధుడు పుట్టిన భూమిలో పుట్టిన మీకదేమి బుద్ధి, ఆ మాత్రం భూతదయ లేకపోవుటేమి_ఎందుకొచ్చిన మనసు లెందుకొచ్చిన విశ్లేషణలు_హాయిగా హెరాల్డురాబిన్సున్నాడు, నికొలాస్ బ్లేకున్నాడు-వాళ్ళను చదివి కథలు రాస్తే చాలు "మీ మా" పాఠకులు థ్రిల్ అయిపోతారు_ "మీ మా" ప్రసాదాలూ వైణికులూ బ్రహ్మరథం పడతారు_ఈ లోగా దేవుడు మేలుజేస్తే చౌదరిగారొచ్చేస్తారు_మన కథని సినిమాయం చేస్తారు-అప్పు డిహ మన పేరుకు రిపేరుండదు. మన కలానికి అర్థం అసలుండక్కర్లేదు. హాయిగా ఎయిర్‌కండిషనర్ల నిరుపహతిస్థలాల కూర్చుని 'ఘర్మజలం' పెనంమీద ఘాటయిన సోషలిస్టు పెసరట్లు వేయించవచ్చు_తీర్థానికి తీర్థం_ప్రసాదానికి ప్రసాదం_విప్లవానికి విప్లవం_ డప్లాపిల్లోకి డిప్లొపిల్లో_" అని చెబుదామా?

అసలు చెప్పాలా అని?

# కథానిక - సాంఘికపు విలువలు - కళాప్రయోజనాలు

శ్రీ కాళూరి హనుమంతరావు

కథ కార్డులో ఇమిడే పరిమాణం కలది కావచ్చు, నూరుపేజీలైనా ఉండవచ్చు.

కథకుడు పండితుడు కావచ్చు, కాకపోవచ్చు. కథాపఠిత సాహిత్యవేత్త కావచ్చు, సాహిత్యంగురించి ఏమీ తెలియని వాడైనా కావచ్చు.కథ దేన్నిగురించైనా వ్రాయొచ్చు, ఇంతటి వైవిధ్యంకల కథల కళాత్మకమైన విలువని నిర్ణయించడం చాలా కష్టమైనపనే. అసలు సాహిత్యం అంతటా సామాన్యంగా అభిరుచిలో చాలా వైవిధ్యం ఉంటుంది. ఒకరికి నచ్చిన కవిత్వం ఇంకొకరికి నచ్చకపోవచ్చును. కాని కవిత్వం, విమర్శ వ్రాసేవారికీ చదివేవారికి ప్రాయికంగా అదివరకు కొంతసాహిత్యానుభవం ఉంటుంది.నవలలలోనూ కథలలోనూ ఇది ఉండకపోవచ్చు, కథలలో మరీని. కొందరికి మంచి జీవిత పరిశీలన, మనోవిశ్లేషణకల కథలే నచ్చవచ్చు. కొందరికి మంచి సస్పెన్సుతో నడిచి ఆశ్చర్యం కలిగించే కథలు, ముఖ్యంగా డిటెక్టివ్ కథలు నచ్చవచ్చు. కొందరికి సెక్సుకథలంటే మహాఇష్టం కావచ్చు. ఇలా కథానికా ప్రపంచం విశ్వమంత విశాలమైనది. మరి ఏది మంచికథ అని ఏ సూత్రాన్ని బట్టి నిశ్చయించడం? అంటే ఈ నిర్ణయానికి మన హృదయాన్నే ప్రమాణీకరించాలి. ఏ కథ మనహృదయంలో నాటుకొంటుందో, ఏకథ చదివిన అనంతరం అందలి పాత్రలను గురించి మనం ఆలోచిస్తూనే ఉంటామో, ఏకథ మన భావనాలోకంలో భాగమై పోతుందో అదే ఉత్తమశ్రేణి కథ; దానికే కళాత్మకమైన విలువ ఉంటుంది. ఏ ఒక్క కాలంలోనైనాసరే ఇటువంటికథలు చాలా తక్కువగానే రచితములై ఉండవచ్చు. వాటిని చదివి అర్థంచేసుకొనేవారూ విరళంగానే ఉండవచ్చు; ఎక్కువమంది డిటెక్టివ్ కథలనూ, విచిత్రమైన కథలనూ, సెక్సుకథలనూ చదివి ఆనందించ వచ్చును. వీరి సంఖ్యాబలం ఎంతఎక్కువైనా వీరికి సాహిత్యాభినివేశం లేదు.తాము నిత్యం చదివిపారేసేకథలను గురించి వారు ఆలోచించరు. కనుక సాహిత్యమర్మజ్ఞులు ఏ కథలను చదివి ఆనందించి మననంచేసి విమర్శించి చర్చిస్తారో అవే సాహిత్యంగా నిలుస్తాయి.

గతించిన పాతిక సంవత్సరాల తెనుగు కథానికా సాహిత్యాన్ని ఒక్కసారి సింహావలోకనం చేస్తే తెనుగుకథానిక వస్తువులోనూ, కథనశిల్పంలోనూ బాగా పరిణతి పొందిందని తోచకమానదు. పద్మరాజుగారి 'గాలివాన'కి అంతర్జాతీయ బహుమతి లభించడం వలన తెనుగు కథానికా సాహిత్యం ప్రపంచంలో ఉత్తమ కథానికా సాహిత్యం మధ్య నిలబడగలదని రుజువైంది.

నేటి కథానికాసాహిత్యాన్ని స్థూలంగా రెండువర్గాలుగా విభజించవచ్చును- స్త్రీ కథలు, పురుషకథలు అని. స్త్రీ కథకులు రచించే కథలు సాధారణంగా స్త్రీ పాత్ర ప్రధానంగా, స్త్రీల సమస్యలని చర్చిస్తూ నడుస్తాయి. పురుషకథకులు రచించే కథలు దేనిని గురించైనా ఉండవచ్చును.

స్త్రీలు వ్రాసే కథలలో తాము చెప్పబూనిన కథాంశాన్ని సూటిగా విశ్వయించుకోవడం, పాత్రలనీ కథాసన్నివేశాన్నీ తమకు సుపరిచితమైన జీవితం నుండి గ్రహించడం ఇత్యాది మంచి లక్షణాలు కనిపిస్తాయి. అంటే స్త్రీలు రచిస్తున్న కథలలో సాధారణంగా వాస్తవికతపాలు అధికంగా కనిపిస్తుందన్న మాట.

కాని పురుషులు రచించేకథలలో చాలావైవిధ్యం కనిపిస్తుంది. ముఖ్యంగా పురుషులు వ్రాసే కథలలో కనిపించే ఒక దుర్లక్షణం వారు ఏ మనుష్యులను గురించి కథలు వ్రాయబూనుతున్నారో ఆ మనుష్యులతో తమకు పరిచయం లేకపోవడం; తత్ఫలితంగా కథలో వాస్తవికత లోపించి ఊహ అనీ, కృతక మనీ తెలిసిపోవడం.

సాహిత్యమంటే జీవితంలోని విశేషాన్ని నిరూపించి తద్వారా సామాన్యాన్ని ఉద్దీపింపజెయ్యడం. ఎవరిగురించైనా కథ వ్రాయాలంటే అతని జీవితంలో కథగా చెప్పదగిన విశేషం ఉండాలి. ఈ నాడు గతానుగతిక మానవజీవితంలో సగటుమనిషిలో విశేషం కొరవడుతున్నది. అందుచేత పఠితలను ఆకర్షించడానికి సాధారణంగా కథకులు సగటుమనిషిని వదిలి ఏదోవిధమైన విశేషంకల దొంగలు, హంతకులు మొదలైనవారిని గురించి కథలు వ్రాస్తున్నారు. కాని కథకులలో చాలామందికి దొంగలతోనూ, హంతకులతోనూ పరిచయంలేక, కేవలం ఊహాప్రాయులైన దొంగలనీ, హంతకులనీ తమకథలలో సృష్టిస్తున్నారు. ఇది తరచుగా పురుషులు వ్రాస్తున్న కథలలో కనిపిస్తుంది. స్త్రీలు వ్రాస్తున్న కథలలో ఇటువంటి ఊహాపాత్రలు సాధారణంగా తక్కువ. తమకు తెలిసినవారిని గురించీ తెలిసిన విషయాలను గురించీ వారు వ్రాయడంవలన వాస్తవికత బాగా

ఉంటుంది వారి కథలలో. కాని స్త్రీలకథలలో సాధారణంగా భావగాంభీర్యం తక్కువగా ఉంటున్నది.

నేటి కథలలో కనిపించే ఇంకో లక్షణం– కథలు సాధారణంగా నేటి ఆర్థిక స్థితిగతులు జీవితంపై కలుగజేస్తున్న ప్రభావంగురించి రచితము లవుతున్నాయి. స్త్రీ పురుష సంబంధాన్ని నిరూపించే కథలు అంత ఎక్కువగా రావడం లేదు. స్త్రీ పురుష సంబంధాన్ని నిరూపించే కథలలో కూడా అత్యధికభాగం వ్యభిచారాన్నీ పడుపువృత్తినే చిత్రిస్తున్నాయి. హాయిగా మనస్సును ఆహ్లాదపరచే మధురప్రేమభరితమైన కథ మృగ్యమవుతోంది. తాత్త్వికదృష్టి, నైతికావేశం, నైతిక బాధ్యత కల కథలు అసలే రావడంలేదు. కథకులకు ఈ భావాలను చిత్రించాలన్న దృక్పథం లేకపోవడమే ఇందుకు కారణం.

కథావిషయంలోనూ, కథనశిల్పంలోనూ ప్రత్యేకత కలిగిన ఇటీవల ముప్పైసంవత్సరాలలో వచ్చిన కొన్నిఉత్తమకథలను గురించి చర్చిస్తాను.

పద్మరాజుగారి 'పడవప్రయాణం' అత్యుత్తమమైనకథ. స్త్రీ అంటేఏమిటో ఆయన ఈకథలో నిర్వచించారు. ఇది తెనుగు వాతావరణం, తెనుగుదనం కల అత్యుత్తమ తెనుగుకథ.

కృష్ణశాస్త్రిగారి 'రిక్షావాలా' చక్కనికథ. వర్ణిస్తున్న మనుష్యులనీ పరిసరాలనీ బొమ్మగీసినట్లు చూపించగలిగేకథనశక్తి, చక్కిలిగింతలు పెట్టే భాషా, గంభీరభావాలూ–కృష్ణశాస్త్రిగారు కథలు వ్రాసినా కవిత్వం వ్రాసినట్లే వ్రాస్తారు.

మంచికథనశిల్పం, చమత్కారభరితమైన ఉక్తికలకథకులు ఆరుద్ర, రాచకొండ విశ్వనాథశాస్త్రి, బీనాదేవి. "తల్లి వూ అంది"లో ఒకతరహా అవినీతి జీవితం అలవాటయిపోయినమనుష్యులను ఆరుద్ర చాలాబాగా చిత్రించారు.'దీవెన' లో మనోవిశ్లేషణ గణనీయమైనది. రా. వి. శాస్త్రిగారి 'కార్నరుసీటు', మూడు స్థలాల్లో, మొదలైనకథలు ఆధునిక కథానికలలో విశిష్టమైనవి. అసమానమైన ఉక్తిచమత్కృతీ,విస్తృతమూ నిశితమూఅయిన జీవితపరిశీలనా బీనాదేవికథలలో కనిపిస్తాయి. కాని కథలో వీటికన్నా ముఖ్యమైనది కథద్వారా చెప్పదలచిన జీవితసారాంశం. అది తగినంత బలమైనది కాకపోతే ఎంతగా ఆధునికసమాజాన్ని 'చిత్రించినా' ఎంత ఉక్తివైచిత్రిని ప్రయోగించినా పాఠకుడికి గాఢమైన అనుభూతి కలగదు. బీనాదేవికథలు చదువుతూ ఉంటే అనేకరకాల మనుష్యుల యథార్థచిత్రణా, ఉక్తిచమత్కృతీ మనను ఆకట్టుకొంటాయేతప్ప, కథ ముగిసిన అనంతరం ఒక గొప్పజీవితగాంభీర్యాన్నిదర్శించిన సాహిత్యతృప్తి కలగదు.

'నువ్వు యిచ్చిన నాన్న' అన్నకథలో తక్కినకథలలోవలె ఉక్తిచమత్కృతి కొట్టవచ్చినట్టు కనిపించదు. కాని ఈకథ ఒక్కటిమాత్రమే కథలసంపుటి ముగించినతర్వాతకూడా మనస్సులోనుంచి మాయమైపోకుండా చెరగనిఅనుభూతి కలిగిస్తుంది. కథకి ముఖ్యమైనది జీవితపులోతును చిత్రించడమే తప్ప కథనశిల్పం కాదని ఈకథరుజువు చేస్తుంది.

నిస్పృహ ఆవరించిన జీవితంగురించి తాత్త్వికంగా ఆలోచించే మనుష్యలను 'త్రిపుర'గారు తమకథలలో చిత్రించారు. వీరి 'ప్రయాణీకులు' అన్నకథలో శేషు చాలా గొప్పపాత్ర.

పరిమళా సోమేశ్వర్ గారి 'క్రోటన్ మొక్కలు' చాలామంచికథ. ఈకథలో ప్రధానపాత్ర M. A. Ph. D., అయి పెళ్ళిచేసుకోకుండానే వయస్సుమళ్ళిన ఒకస్త్రీ. జీవితంలో ఆమెకు విద్య, ఉద్యోగం, హోదా, గౌరవం అన్నీఉన్నాయి కాని తనజీవితంలో వెలితి? ఈనాడు సాధారణంగా స్త్రీలంతా పురుషులతో సమానంగా అన్నిరంగాలలోనూ పనిచెయ్యాలనీ, అదే మహిళాభ్యుదయమనీ రేడియోలోనూ పత్రికలలోనూఅదేపనిగా ప్రచారసాహిత్యంవస్తున్నది. ఇట్టిస్థితిలో ఈకథ నేటిస్త్రీని దూరదృష్టి, లోతూ కల పరిశీలనతో సహా చిత్రించడం చాలా గొప్పవిశేషం. ప్రపంచాన్నంతా జయించి మానవత్వాన్ని కోల్పోయే నియంత వలె స్త్రీసామాజికమూ ఆర్థికమూ అయిన పూర్ణస్వేచ్ఛను సాధించి స్త్రీత్వాన్ని పోగొట్టుకొంటున్నది నేటికాలంలో. ఇట్టిపరిస్థితిలో ఈకథలో రచయిత "స్త్రీకి వివాహం, మాతృత్వం పరిపూర్ణతని ఇస్తాయి" అని చాలాసమర్థంగా ప్రతిపాదించారు. ఈ కథలో అక్కచెల్లెళ్ళ పాత్రచిత్రణ, మనోవిశ్లేషణ గణనీయంగా ఉన్నాయి.

కుటుంబరావుగారు మధ్యతరగతివారిని కథలలో చిత్రించారు, కాని కథ ద్వారా సిద్ధాంతాలని రుజువుచేసే ఉబలాటంవలన ఎంతోసహజంగా ప్రారంభమైనకథ సగం గడిచేసరికి చాలా అసహజంగా పరిణమిస్తూ ఉంటుంది. 'తిండి దొంగ'అన్నకథతో సిద్ధాంతాలగొడవ ఏదీ లేదు చాలాసహజంగా నడిచిన మంచికథ 'తిండిదొంగ'.

ప్రసిద్ధకవి 'తిలక్' కథలలో ఊహ ఉన్నంతగా వాస్తవికత, జీవితానుభవం కనిపించవు. 'ఊరిచివరఇల్లు' కట్టుకథలా ఉంటుంది, కాని 'పరివర్తన' మంచికథ. ఇది పరిపూర్ణాకారంలో ఆనందవాణి—తిలక్ స్మారకసంచిక'లో ప్రచు

రితమైంది. దీనిలో ఇల్లు ఒకపవిత్ర స్థలమనీ, దాంపత్యం ఒకపవిత్ర వ్యవస్థఅనీ ప్రతిపాదితమైంది.

పెద్దకథలలో పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారి అంగారతల్పం గణనీయమైనది. జీవితంలో అడుగడుగునా కలుగుతున్న నైరాశ్యపరంపర-పఠిత హృదయాన్ని ద్రవింపజేస్తున్నాయి.

ఇంకా వేలూరి శివరామశాస్త్రిగారి జన్మాంతరసంబంధము, పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి నీలి; మాలతీచందూర్‌గారి శానమ్మ; మంజుశ్రీగారి 'క్రాస్వర్డ్‌పజిల్' ఇస్మాయిల్‌గారి 'వల' — చాలా ఉన్నాయి విశేషించి చెప్పదగిన మంచికథలు.

మొత్తానికి స్వాతంత్ర్యానంతరకాలంలో మంచిసాహిత్యమని పరిగణించదగినకథలు చాలానే వచ్చాయి.



"మరచిపో దుఃఖాలు-బాధలు
మరచిపో యుద్ధాల గాథలు;
మరల మరల-హిమాంబు మౌక్తిక
మాలకై పరుగెత్తిరా--

--దాశరథి.

# పత్రికలు - కథలు

శ్రీ రాపూరు వెంకట సత్యనారాయణరావు

స్వాతంత్ర్యభానూదయరేఖలు ప్రకృతినిండా పచ్చిపసుపు గ్రుమ్మరించిన పవిత్రసమయంలో భారతపౌరుల హృదయాలన్నిటిలో పసిడి చిరుగంటలు మ్రోగినాయి. వారినేత్రాలనుండి కురిసిన ఆనందాశ్రువులు చిన్నచిన్న సెలయేరులై ప్రవహించినాయి. భారతజాతీయ జీవనంలో ఒక వెన్నెల అధ్యాయం ఆరంభమైంది.

అంతవరకు పరప్రభుత్వపుతాకిడికి చీకటిపాలైన స్వసాంస్కృతిక సంపదల్ని వెలార్చడంకోసం ప్రతిహృదయం తాపత్రముపడింది-తహతహలాడింది. ఎన్నాళ్ళుగానో పంచబంగాళమై పడివున్న భారతీయజీవనాన్ని, పునరుజ్జీవనమొనర్చడంకోసం-అన్ని హృదయాలూ ఆయత్తమైనాయి.

ఈ సంరంభంలో, స్వాతంత్ర్యం ప్రాతిపదికగా నిలిచింది. దాని నాధారంచేసుకొని సాధించదలచిన విజయా లెన్నో గోచరించాయి. కొన్నికొన్ని హృదయాలలో కొన్నికొన్ని వినూత్న భావనలు విరిసి వికసింపసాగినాయి. రాజకీయవేత్తల హృదయాలు కదలినాయి. కవుల కలాలు విజృంభించినాయి. చిత్రకారుల కుంచెలు కొత్తక్రొత్త రంగులు సంతరించుకొన్నాయి. గాయకుల కంఠాలు విజయశంఖాలుగా మారినాయి. నర్తకుల కాలిగజ్జెలు గలగలలాడినాయి. నటీనటుల హావభావ విన్యాసాలు వెల్లివిరిసినాయి. భారతదేశమంతటా పూలజల్లులు కురిసినాయి. ఉలిపిరి మంచుతెరమాటుగా ఉదయించిన సూర్యభగవానుడు జాతిని ఉత్సాహతరంగాలలో ఊగించాడు.

సారస్వత రంగంలో నూతనశకం ప్రారంభమైంది. ప్రతి కలం ప్రగతిపథంలో స్వైరవిహారం చేయడానికి పూనుకొంది. రుద్ధమైన కంఠాలలోనుంచి భావబంధురమైన కవితలు పెల్లుబికినాయి. వచనరచనా వ్యాసంగంలో కొత్తశయ్యలు, రీతులూ ఉద్భవించి-ఒయ్యారాలు ఒలకబోయడం ప్రారంభించినాయి. ముఖ్యంగా పత్రికలలో ఇవి గర్వంతో కనిపించసాగినాయి.

గద్యరచనతోపాటు పద్య గేయరచనలు కూడా పత్రికాముఖాన ప్రజలకు దర్శనమివ్వడం ప్రారంభించాయి. వాటితోపాటు కథలు, నవలలు, నాటికలు, నాటకాలు కూడా పత్రికద్వారానే వెలుగులోకి రాసాగాయి.

ఈ విధమైన ఆదరణా, అభిమానం పత్రికలు అందించడం ప్రారంభించిన తర్వాత రచయితలను,పత్రికలను మనసులో పెట్టుకొని రచనలు సాగించడం అలవాటుగా మారిపోయింది. అదైనా చెయ్యితిరిగి పేరుగడించిన రచయితలకు మాత్రమే అనుకూలమైంది. క్రొత్తరచయితలు, సామాన్యరచయితలు, మధ్యతరగతిరచయితలు– తమరచనలు అచ్చులో చూచుకోవడంకోసం తాపత్రయపడటం– క్రమంగా నైరాశ్యంలో మునగడం తప్పలేదు.

పత్రికలు తమకువున్న అవకాశంలో ఉత్తమ రచనలు ప్రచురించడానికి ప్రయత్నించడంలో ఆశ్చర్యంలేదు. అసలు ముఖ్యవిషయం పత్రికలు జీవించాలి. అప్పుడుగదా బాషాసరస్వతిని సేవించేది; అందువల్ల పత్రికలు, అందరు రచయితలకూ అవకాశం ఇవ్వడమనేది అసంభవం, అయినా పరిమితమైన దృష్టితో భాషాసేవ చేస్తునేవచ్చాయి. కొన్ని పత్రికలు అట్టేకాలం నిలవలేక తగిన ఆదరణ లేక– మటుమాయం కావడంకూడా సంభవించింది.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి భారతి–ఎంతో భాషాసేవ చేసింది_ చేస్తున్నది. ముఖ్యంగా ఈవ్యాసంలో పత్రికలు– కథలకు కల్పించిన స్థానాన్నీ చేసినసేవచూ చర్చించవలసివుంది.

భారతిపత్రికలో ప్రముఖులకథలు అనేకం ప్రచురించబడినాయి. ఆనాటి మేటికథారచయితలందరికి భారతిలో స్థానం లభించింది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, వేలూరి శివరామశాస్త్రి, ప్రభృతులకథలు భారతిద్వారానే ఎక్కువగా ప్రచారంలోకి వచ్చాయి.

కృష్ణాపత్రికకూడా చాలామంది కథారచయితలకు స్థానం కల్పించింది. వెంపటి నాగభూషణం, మునిమాణిక్యం, చింతా దీక్షితులు, కవికొండల వెంకటరావు, బొడ్డు బాపిరాజు, మొదలైనవారి కథలు కృష్ణాపత్రికలో ప్రచురించబడుతూ వచ్చాయి. అయితే ఒకటి మాసపత్రిక, ఇంకోటి వారపత్రిక అవడంవల్ల సంవత్సరానికి సుమారు యాభైకథలవరకే బయడకు రావడానికి అవకాశం వుండేది. అప్పట్లో ఆంధ్రవారపత్రికలోకూడా కథలు పడుతూ వచ్చేవి. కనుక కథలు వ్రాయాలని ఉత్సాహపడేవారికి ఎక్కువగా ప్రోత్సాహం లభించలేదు. కథాసృష్టికి పత్రికల 'గ్రీన్‌సిగ్నల్' అవసరమనిపించింది. అందుచేత కలాలలో బలం చాలలేదు.వ్రాసి దాచుకోవడం ఒకవిధమైన బలహీనతక్రింద భావించబడేది.

నిజానికి కథలు వ్రాసి గ్రంథంగా ప్రచురించే స్థోమతు చాలా తక్కువ మందికి వుండేది. సిరిగలవారు వారి రచనలలో శిల్పం ఎంతగా వున్నా, ధైర్యంతో వాటిని ప్రచురించకలిగేవారు. గ్రంథ రూపంలో కథలు రావడం చాలా తక్కువ గనుక--వచ్చిన వాటిని పాఠకులు శ్రద్ధగా చదివే వారు.

మొత్తంమీద కథలు పత్రికలలో ప్రచురించబడటం, గ్రంథ రూపంలో వెలువడటం చాలా తక్కువ స్థాయిలో వుండేది. కనుక ఆ కాలంలో "తెలుగు కథ"—ఇప్పటివలె ఎక్కడ పడితే అక్కడ ప్రత్యక్షమయ్యేది కాదు. ఎప్పుడో ఎక్కడో - మేలి ముసుగునీడలో ముసిముసినవ్వులు నవ్వుతూ ముగ్ధమనోహర మూర్తిగా దర్శనమిచ్చేది. ఆమె నవ్వులు ఆయా రచయితలకు కర్పూరనీరాజనాలుగా వుండేవి.

పైన పేర్కొనినట్లు స్వాతంత్ర్యావతరణ తర్వాత క్రొత్తక్రొత్తగా ఇతివృత్తాలతో కథలు సృష్టించాలనే ఆకాంక్ష పలువురిలో ప్రబలినమాట సత్యం. కాని ఆ పొంగుకు తగినంత ప్రోత్సాహం లభించలేదు. అందువల్ల పాతపోకడలకు మెరుగులు దిద్దడం మాత్రమే జరిగింది కొంతకాలం. అందువల్ల స్వాతంత్ర్యగానాలు వినిపించే, ప్రగతిపథాన్ని సూచించే నవభారతికి నవ్య నీరాజనాలందించే కథలు అనుకొన్నంతగా బయటకు రాకపోవడం జరిగింది.

అంతమాత్రంతో రచయితలు కలాలు అవతలపెట్టి కూర్చోలేదు. క్రొత్త పోకడలు అనేకం వారి మనస్సుల్లో తొంగిచూచినాయి. దీనికి తగినట్టు పత్రికలు విరివిగా తలఎత్తాయి. వాటిలో కథలకు తగినస్థానం ఇవ్వడం గర్వించతగిన విషయం. తమ కథ అచ్చుపడుతుంది. అదృష్టాన్ని పరీక్షిద్దామనే భావంతో చాలామంది కథలు వ్రాయడం ప్రారంభించారు. అచ్చుపడినవారిసంఖ్యకంటె-అశోపహతులైన వారిసంఖ్యే ఎక్కువగా వుండవచ్చు. అంతమాత్రంతో వారు నైరాశ్యంలో మునగలేదు. దరహంమీద కథా రచనా వ్యాసంగం అభివృద్ధి పథంలోనే నడిచింది.

వారపత్రికలు ముఖ్యంగా కథలకు మంచి స్థానం కల్పించినవి. ఒక్కొక్క పత్రిక నెలకు పన్నెండునుంచి పదిహేను కథలు ప్రచురించడం జరిగింది. నెల పత్రికల్లో కథల సంఖ్య అంతగా లేకపోయినా-వారు తగిన స్థానమిచ్చి గౌరవిస్తూ వచ్చారు. మొత్తంమీద అన్ని పత్రికలలో-కలసి సంవత్సరానికి సుమారు వెయ్యి కథలు వెలుగులోకి వస్తున్నట్లు అంచనా వేయ

బడింది. మంచి, చెడుల వివరాలు వదలివేస్తే సంవత్సరానికి పదివేల కథలన్నా వ్రాతల్లోనే మిగిలిపోతూ వుంటాయి.

ఇందులో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు. వారపత్రికల పోటీలు ప్రకటించినప్పుడు సంవత్సరానికి సుమారు రెండుమూడు వేల కథలు ఉత్పత్తి అవుతూ వుంటాయన్నారు. ఈ సంఖ్య ఇంకా ఎక్కువ వుండవచ్చు. నేను ఆంధ్రప్రభ వారపత్రికలో వున్నప్పుడు కథల పోటీలకు వచ్చిన కథలు రెండు వేలకుపైగా చదివాను, ఒక సంవత్సరం. ఆ లెక్కప్రకారం ఎన్ని కథలు సృష్టించబడుతున్నాయో-ఎన్నికలాలు కథారచనకు ఉత్సాహపడుతున్నాయో - ఎన్ని కళ్లు కథలప్రచురణలకోసం ఆతురతతో ఎదురుచూస్తున్నాయో, ఎన్ని హృదయాలు తమ కథ పాఠకులచేత కొనియాడబడుతుంటే విని ఆనందించాయో చెప్పడం కష్టం.

"కథ అచ్చుపడకపోవడంవల్ల పట్టుదలతో మరోకథ వ్రాయడం జరుగుతుందా? కథ అచ్చుపడిందన్న సంతోషంతో మరొకటి త్వరత్వరగా వ్రాయడం జరుగుతోందా? దేనివల్ల ఎక్కువ కథలు వెలువడుతున్నాయి?" అనేప్రశ్న ఉదయించిం దొకసారి. ఈవిషయాన్ని పరిశీలిస్తే పట్టుదలతో వ్రాసేవారి సంఖ్యే ఎక్కువగా వుందని తేలింది. వారు నిజానికి జయాపజయాలను లెక్కచేయని "ప్రజ్ఞానిధుల" క్రింద జమపడతారు.

ప్రచురణద్వారా లభించే పారితోషికాలు కల్గించే ప్రోత్సాహంద్వారా కథారచనలు చేసేవారిసంఖ్య చాలాతక్కువ. అయితే వీరిలో తరగతు లున్నాయి. కొందరు ప్రథమశ్రేణి రచయితల్ని తలచినప్పుడు - "ఇలాటి ఉత్తమ కథారచయితలు ఒక పాతికమంది వుంటే చాలదా?" అనే సంతృప్తి జనిస్తుంది.

అది నిజమేకాని కథారచనలో ఆసక్తివుండి పైకి రాతగిన ప్రతిభ వుండి వెలుగులోనికి రాలేనివారిసంగతి ఎవరు గుర్తిస్తున్నారు? ఎంతవరకు వారికి సహాయం చేస్తున్నారు? పత్రికలు కథలకు ఎంతో సేవచేసినమాట నిజం. పత్రికలు అలా స్థానం కల్పించకపోతే, తెలుగుకథల చరిత్ర ఎంతో క్లుప్తంగా నిలిచిపోయేది. పత్రికలవారికి సారస్వత సేవతోపాటు వ్యాపార విజయంకూడా అవసరం గనుక క్రొత్తరచయితల్ని ప్రోత్సహించే అవకాశం మృగ్యం కదా! అలాగే ప్రచురణకర్తలవిషయంకూడా! కథారచన సాగించే వారిలో స్వంతంగా పుస్తకాలు వేసుకొనే స్థోమతకలవారిసంఖ్య చాలాతక్కువ

గధా! కనుక కలాలనుంచి వెలువడ్డ కథలన్నీ కాగితంమీదకు రావడం అసాధ్యమైనపని.

అందువల్ల ఒక దశాబ్దం క్రిందవరకు తెలుగు కథారచనల, రచయితల సంఖ్య పరిమితంగావే ఉండిపోయింది. కాని అదృష్టవశాత్తు ఈదశాబ్దంలో పత్రికలు పెరగడం, కథలకు ఎక్కువస్థానం లభించడం, ముదావహం. ప్రచురణతోపాటు పారితోషికాలు కూడా లభించడం సంతోషదాయకం. దీనిద్వారా మనస్సు చల్లబడటం– చెయ్యి పచ్చబడటం జరుగుతోంది. చాలామంది మహిళలు, మగవారు – ప్రసిద్ధరచయిత్రులుగా ప్రఖ్యాతరచయితలుగా కొందరు స్థిరపడటం సంభవించింది. గడించిన ఖ్యాతితో వాటిని గ్రంథరూపంలోకి తేవడం కూడా వారికి సులభసాధ్యమవుతున్నది. ప్రచురణకర్తలు పత్రికలలో వెలువడిన కథలు అచ్చువేయడానికి ముందుకు వస్తున్నారు. సరాసరి ఇంటివద్దనుంచి తెచ్చిన కథలను "చెత్తబుట్ట" కంకితం కావలసిన వ్రాతలుగా భావించి తల ప్రక్కకు తిప్పుకొంటున్నారు.

కనుక మన కథాసాహిత్యం బయటకు వచ్చినదానికంటె మాటున పడిపోయిందే ఎక్కువ వుండివుండవచ్చు. అయితే అవన్నీ ఉత్తమకథలయిఉండేవనే విశ్వాసం ఎక్కడిది? అని ప్రశ్నించవచ్చు. కాని ఆరచయితలకు ప్రోత్సాహము లభిస్తే అందులో కొందరు ఉత్తమశ్రేణి రచయితలు కాగలిగే అవకాశం ఉండేదేమోనన్నదే మన భావన.

స్వాతంత్ర్యం వచ్చినతర్వాత మన ప్రభుత్వం సాహిత్యపోషణకు కొంతవరకు పూనుకొన్నదనే చెప్పాలి. సాహిత్యఏకాడమీలద్వారా అలాటి ప్రోత్సాహం కొందరికే లభిస్తున్నదన్నమాట వాస్తవం. ప్రతిసంవత్సరం ఉత్తమకథానికలసంపుటికి బహుమతి అందజేస్తున్నారు. అయితే దేశంలో అది ఒక్కటే–ఆయేటికి సంబంధించిన ఉత్తమ సంకలనమని చెప్పడానికి ఎక్కువ అవకాశం లేదు. పోటీలు జరిగినప్పటికీ అలాటి ప్రత్యేక స్థానం ఆ బహుమతి పొందిన గ్రంథానికి అంకితం చేయడం సమంజసం కాదేమో! ఒకరచయితకు ఉత్తమరచయిత బహుమతి అందింది. అది సంతోషదాయకం. అలాటి గ్రంథాలు మరిలేవా? అనే మీమాంసకు గాని వాటి అన్వేషణకు గాని ఉపక్రమించడం ప్రయత్నించడం జరగడంలేదు. అందువల్ల ఆబహుమతిగ్రహీతను గుర్తించినందుకు, గౌరవించినందుకూ మనం ఏకాడమీలను శ్లాఘించాలి. వారి కృషికి జోహారు లర్పించాలి.

నాలుగైదు సంస్థలు ఇలాటి బహుమతులు ప్రకటిస్తే అంతమంది మంచి రచయితలు, మంచి రచనలు బయటకు రావడం సంభవిస్తుంది. అలాటి అవకాశాలు మనకు లేవు. కనుక ఒక ఉత్తమ కథానికల సంపుటికోసం ఒక సంవత్సరం ఎదురుచూడవలసి వస్తుంది. పత్రికలవారు కూడా బహుమతులు ప్రకటిస్తున్నారు. ఎక్కువ మొత్తాలే కానుకలుగా సమర్పిస్తున్నారు. పోటీలలో పాల్గొన్న వారికి ఎంతో ఉత్సాహం కల్పిస్తున్నారు. వీటిద్వారా ఏటా బయటికి వచ్చే మంచి కథలు కూడా డజనుకు మించడంలేదు. బహుమతి గ్రహీతలు తమకు లభించిన మొత్తంలో కొంత వెచ్చించి వారి కథలను గ్రంథరూపంలోకి తీసుకువస్తే— కథాసాహిత్యం పెరిగే అవకాశం వుంటుంది. లేదా ఈ బాధ్యతను పబ్లిషర్సు వహించాలి. కథాసాహిత్యం అభివృద్ధికావడమనేది మనకు ముఖ్యాంశం.

పోతే ఇటీవల వస్తున్న కథలు—స్వాతంత్ర్య భారతంలో మార్పులను, కూర్పులను రూపిస్తూ వెలిగించిన జ్యోతులుగ, తీగలు సరిచేసిన వీణలుగా, దిక్కుదిక్కులా వినిపించే శంఖారావాలుగా—వున్నాయా అనేది సమస్య. ఇట్టి ఇతివృత్తాల సేరుకొన్న కథలు నూటికి పదికంటె ఎక్కువ వుండవేమో నని పిస్తుంది. గ్రామజీవనానికి సంబంధించిన కథలు చాలా వచ్చినమాట వాస్తవం. కాని గ్రామాలలోని కక్షలనూ, కార్పణ్యాలనూ, వర్గపోరాటాలను సూచించేవి వాటిలో ఎక్కువగా వుండవచ్చు. ధనికవర్గాన్ని దుయ్యబట్టేవికూడా ఎక్కువే. కాయకష్టంచేసే కర్షక, కార్మిక జాతిని అభినందిస్తూ ఆదరించాలని ప్రోత్సహిస్తూ వ్రాసిన కథలు కొన్ని కనిపిస్తాయి మనకు.

అవినీతి, అహంకారం, మోసం, రోషం, కార్పణ్యం, కక్ష మొదలైనభావనలను నిరూపించే కథలలో కొన్ని మంచి శిల్పాన్నీ జాతీయతనూ సంతరించుకో గలిగాయి. కొన్ని కేవలం ప్రచారంకోసం వ్రాయటమనే ఆచారానికి ఆనవాలుగానే నిలిచిపోతాయి. హరిజనాభ్యుదయాన్ని అభివర్ణించే కథానికలు కొన్ని వచ్చినాయి. అవి నిజానికి ఎంతో విలువైనవిగా భావింప బడినాయి. జాతీయ జీవనంలో తలఎత్తిన ప్రగతి సాధనలలో అతిముఖ్యమైన సమస్యయిది. గాంధిజీ స్వర్ణస్వప్నాలలో ఒకటి. ఈ అభివృద్ధిని భగవంతుని దయవల్ల-ప్రభుత్వం కూడా ఇతోధిక శ్రద్ధతో కొనసాగించగలుగుతోంది. కనుక ఈ పథకాన్ని బలపరిచే కథానికలు మన కథాసాహిత్యానికి మంచి కానుక లైనాయి. సాహిత్యపరంగా జరిగిన ఈ ప్రచారం సాంఘికంగా కూడా ముందడుగు వేయ

దంవల్ల ఆ కధానికలు మచ్చుతునకలుగా నిలిచినాయి.- ఎంతోముచ్చట గొలిపే అధ్యాయాలుగా నిలిచిపోయాయి. ఇదిఇంకా కొనసాగవలసిన కృషి. వీటి విష యంలో ప్రభుత్వం మరింత శ్రద్ధతీసుకోవడం- ప్రోత్సహించడం జరిగితేఎంతో మేలు జరిగినట్లవుతుంది. రైతు జీవనానికి సంబంధించిన కథలుకూడా చాలా వచ్చాయి. కొందరు మాత్రమే అందులో సిద్ధహస్తులనిపించుకో గలిగారు. అ కథలు పూలతోరణాలుగా నిలిచిపోతాయి మన కధాసాహిత్యంలో. రైతుజీవనం రోజురోజుకూ మారుతున్నది. మానసిక పరిణామాలు కూడా గమనించ వలసిన అవసరం ఏర్పడుతోంది. ఈ మార్పులను బట్టి రైతుజీవనానికి సంబంధించిన అనేక అద్భుత ఘట్టాలను కథా వస్తువులుగా తీసుకొనే అవకాశాలున్నాయి. సామ్యవాద సిద్ధాంత సాధనలో రైతు సరికొత్త భూమిక ధరించ బోతున్నాడు. రైతు దాత కాబోతున్న తరుణమిది. సామ్యవాద సిద్ధాంతాలకు మూలస్తంభా లుగా నిలవగలిగిన స్థితి వారికి లభించబోతున్నది. కనుక రైతుకథలు నవనవో న్మేషణతో ప్రత్యక్షం కాగలవు మనకింక. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతఅను కోకుండా మనకు యుద్ధప్రమాదాలు సంభవించినాయి. ఆయాతరుణాలలోభారత ప్రజలు ఒక్కటిగా నిలిచి దేశరక్షణకు కంకణధారులైనారు. రచయితలలో కూడా అమితమైన సంచలనం బయలుదేరింది. ఆ సందర్భంగా చాలా గేయాలు వెలువడినాయి. కొద్దిగా నాటకాలుకూడా ఉత్పన్నమైనాయి. కాని కథలు విరి విగా రాలేదు. ఆ సమర వాతావరణంలో, వీర, కరుణరసాల్ని పోషించేఘట్టాలు అనేకం ఉత్పన్నమవడం సహజం. వాటిని కథాకారులు చక్కటిశిల్పంగామలుచు కొంటే ఉత్తమమైన కథాసాహిత్యం వెలువడే అవకాశాలున్నాయి.

ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాలను ప్రోత్సహించడంకోసం ప్రచారం లోకి తేవడం కోసం కొంత సాహిత్యం వెలువడుతూ వుంటుంది. సాహిత్యం సామాజికదర్పణం కావాలనే భావంమనకు కలగడం సహజం. ఆ కారణంగా ప్రచార సాధనగా కొన్ని కథలు వెలువడినాయి. వీటిలో సంతాన నిరోధకానికి సంబంధించిన వాటిని ముఖ్యంగా పేర్కొనవచ్చు. ప్రచారానికి ఉద్దేశింపబడిన రచయిత సిద్ధహస్తుడైతే ఇలాటి కథలక్కూడా ప్రామాణ్యత ఏర్పడుతుంది. తక్కినవి గాలిలో తేలిపోతాయి .ఇలాటివే హెచ్చుగా వచ్చినాయని చెప్పవచ్చు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మనస్సుల్లో వున్న చీకటి తొలగిపోయి వెన్నెల ప్రసరించిన మాట నిజం. కాని అది అంతగా నిలవలేదు. నిత్య జీవితా లలో తగినశాంతి లభించలేదు. అధిక ధరలను తట్టుకోవడం సులభ సాధ్యం

కాలేదు. వివాహాల సమస్య ప్రతిబంధన రూపం తాల్చింది. ఉద్యోగ సమస్య ఉక్కు ముక్కలతో కోలాటంగా తయారైంది. ఇలాగే ఎన్నో గృహస్థవాతావరణంలో సంచలనం కల్పించే సంఘటనలు ఏర్పడినాయి. వీటిని చక్కగా చిత్రించకలిగిన కథలు ఎక్కువగా రాలేదు. గార్హస్థ్య జీవితంమీద- ఓహరిసాహరిగా కథలు వ్రాసిన శ్రీ మునిమాణిక్యంవారు సైతం వాటిని వదిలి వేశారు. వారికి వారసులుగా నిలవవలసినవారూ కనిపించలేదు. అందువల్ల ఆ శాఖ అంతగా విస్తరించలేదు. ఈ కథలు కలకాలం నిలవ కలిగివుండేవి. చాలామంది సోదరీమణులు కథలు వ్రాస్తున్నా గృహవాతావరణాన్ని చిత్రించే కథలు వ్రాయడం జరగలేదు.

పోతే ఇటీవల వస్తున్న కథలలో చాలావరకు ప్రణయానికి సంబంధించినవే కనిపిస్తున్నాయి. "అమ్మాయి - అబ్బాయి"—ఇతివృత్తాలు కథలలో, నవలలలో, నాటకాలలో, సినిమాలలో ఎక్కువగా పాకిపోయినాయి. ఈ అనుబంధాల్ని అనేక రీతులుగా, చిత్రవిచిత్ర గతులుగా వర్ణించడంలో సిద్ధహస్తులైనవారు చాలా మంది వున్నారు. యువతీయువకులలో ఏర్పడిన స్వాతంత్ర్య భావన అనేక విధాలైన ఇతివృత్తాలకు దోహదం కల్పిస్తోంది. ప్రగతిపథంలో నడిచిపోవాలనే యువతీయువకుల ఆకాంక్షలు- అతిమనోజ్ఞంగా వర్ణించబడు తున్నాయి. ఈ శాఖలో గోచరించే స్వాతంత్ర్యం ఇతరత్రా మృగ్యమనే చెప్పాలి.

ప్రణయం పవిత్రమైంది. భావబంధురమైంది. అద్భుత శక్తికలదీ అనడంలో సందేహం లేదు. అలాటి ప్రణయాన్ని ప్రేయసీ ప్రియులు తమ హృదయాలనే బంగారు పళ్ళాల తూనికలో తూచుకొని వెలకట్టుకోవడం చేతకాని సమయాలలో— పడే నష్టకష్టాలు కూడా గమనించి వర్ణించబడుతున్నాయి.

మొత్తంమీద నేటి కథాసాహిత్యంలో స్త్రీ భూమికలను నిండుతనంతో, నిర్భయంతో, స్వేచ్ఛతో, ఉచ్ఛస్థితికి ఆలంబనగా నిలిచే భావనలతో చిత్రించ కలగడం గర్వించతగిన విషయం. మహిళలు మనోహర మూర్తులుగా, వారి పలుకులు మంగళహారతులుగా పరిఢవిల్లడం జాతికి వెలుగు సంతరించడమే అవుతోంది.

ప్రగతి పథయాత్ర ఆదిలో నానుడురాళ్ళమీద ప్రయాణంవంటిదే అవుతుంది. కనుక ఉత్సాహాన్ని మాత్రమే ఊతగా చేసుకొని పయనించడంలో ప్రమాదంవుంది. కనుక ఆ ప్రమాదాలను గురించి హెచ్చరించే కథానికలు కూడా అవసరం. వీటిమీద ఎక్కువగా కథకులు శ్రద్ధ వహించడం అవసరం.

నేటి మన కథారచయితలలో స్త్రీలుకూడా ఎక్కువ దర్శనమీయడం శుభ సూచకం. యుగ సంచలనం కొంతవరకు అణిగిన తర్వాత, ఆయా పరిస్థితులను అనువైన వాతావరణంలో చక్కటి కథలు సృష్టించే నేర్పు, తీర్పు ఎక్కువ లభిస్తుంది. మరో దశాబ్దం తర్వాత మనకీవాతావరణం గోచరిస్తుంది. కథాసాహిత్యానికి చక్కటి స్థాయీ భావం ఏర్పడుతుంది.

ఉత్తమ కథారచయితలుగా పేరెన్నికగన్న గోపీచంద్, మల్లాది రామకృష్ణశాస్త్రి, బుచ్చిబాబు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రివంటివారు దివంగతులైనారు. వీరి స్థానాలు అలాగే వెలితిగానిలిచిపోతా యేమో !

శ్రీయుతులు పద్మరాజు, కొడవటిగంటి, బలివాడ, మధురాంతకం, కొమ్మూరి వేణుగోపాలరావు, అంగర వెంకట కృష్ణారావు, ముద్దంశెట్టి, గొల్లపూడి, శీలా వీర్రాజు, మంజుశ్రీ, తాళ్లూరి నాగేశ్వరరావు— శ్రీమతులు రంగనాయకమ్మ, కోడూరి కౌసల్యాదేవి, లత, సులోచనారాణి, రామలక్ష్మి, భానుమతీ రామకృష్ణ, ఆనందారామం, తురగా జానకీరాణి, పరిమళా సోమేశ్వర్ ప్రభృతులు కథా సాహిత్యానికి వెలలేని వెలుగులు గ్రుమ్మరించకలిగారు. (కొందరి పేర్లు ఇక్కడ చేర్చలేకపోతే తప్పుగా భావించక మన్నించకోర్తాను) తెలుగుకథా సాహిత్యం మరింత పురోభివృద్ధి చెందగలదని, దానికి వీరందరూ తగిన కృషిచేస్తున్నారనీ నా విశ్వాసం.

కాని, పైన పేర్కొన్న రచయితలలో చాలామంది నవలా రచయితలుగా ఎక్కువగా ఖ్యాతి గడించారు. అయినా కథను వారు వదలక— ముందుకు తీసుకుపోగలరనే భావంతో భవిష్యత్తులోకి తొంగిచూడటం అవసరం.

తెలుగు కథాసాహిత్యం ఏ ఇతర భాషలలో సాహిత్యానికీ తీసిపోదు. ఆ సాహిత్యాన్ని పోషించడం, ప్రోత్సహించడం— ఒక నిర్దిష్టమైన రూపానికి తీసుకురావడం... కథా సరస్వతిని పూర్వకాలపు మేనాలోనుంచి దించి, పూల పల్లకీలో ఊరేగించడం ఆంధ్రుల కర్తవ్యం. కథాసాహిత్యంమీద సదస్సులు— మహోత్సవాలు విరివిగా జరగాలి. ముఖ్యంగా పత్రికలు కల్పిస్తున్న ప్రోత్సాహానికి జోహారులర్పించాలి. కథారచన నవలా రచన— కాలేజీలలో ఒకశాఖగా ఏర్పరచాలి— మన సాహిత్యం మధురవీణవంటిది. దానిని సరిచేసి కమ్మని గీతాలాలపింపచెయ్యాలి— కథానిక సంఘాన్ని మేల్కొల్పి ప్రగతిపథంలో నడిపించడానికి పూనుకోవాలి.

"వీణా మధురాలాపం గాంధారం ప్రతిముచ్యతి"— ద్రౌపది గాంధార రాగం వినిపించినప్పుడే భీమసేనుడు నిద్రలేచే వాడుట. మన కథలు గాంధార రాగమాలపించి జాతిని చైతన్యవంతం చెయ్యాలి.

యువభారతివారు కథారచనను పరిశీలించడంకోసం పూనుకొన్నారు— ఈ పూనికలోనుంచి పూలజల్లులు కురవాలి. ఉత్తమమైన కథలను ఎన్నుకొని ప్రచురించి ప్రజానీకానికి అందించేశక్తి వీరికి భగవంతుడు అందించాలని ప్రార్థిస్తున్నాను.



అంతర్జీవనంలోంచి బహిర్జీవనంలోంచి
మాయను తెంపుకొని లోపలా బయటా
చేసే తపస్సే జీవనం
జీవం ఉన్నంతవరకు మృత్యువుకోసం
చేసే తపస్సే జీవనం
మాతృగర్భంలోనూ నేల ఒడిలోనూ.

—వేగుంట మోహనప్రసాద్

# రూపక సమీక్ష

# పాతిక సంవత్సరాల తెలుగు నాటకం

శ్రీ మొదలి నాగభూషణ శర్మ

స్వాతంత్ర్యయుగోదయానికి మూడు నాలుగు సంవత్సరాలు ముందుగానే తెలుగునాటకరంగచరిత్రలో నవశకం ప్రారంభమైనదని చెప్పవచ్చు. 1941లో ఆంధ్రనాటక కళాపరిషత్తుకు తొలిదశ అంతమై, 1946లో ఒక స్థిరమైన రెండవదశ ప్రారంభమైంది. 1943లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు నాటకాల పోటీలతోపాటు నూతనప్రయోగాలను చేయసమకట్టింది. 1945లో ప్రజానాట్య మండలి తెలుగుశాఖ అవతరించింది. ఈ మూడింటి ఆవిర్భావము తెలుగునాటకోద్యమంలో ఒకమైలురాయి. వీని ఆవిర్భావం వలన సాంప్రదాయిక నాటక పద్ధతులకు స్వస్తి చెప్పి, ప్రయోగాత్మక నాటకాలను ప్రయుక్తం చేయగలగడం, పద్యనాటకాలకుమారుగా గద్యనాటకాలు రాయడం, పౌరాణికచారిత్రక నాటకాలకు బదులుగా సాంఘికనాటకాలకు ప్రాముఖ్యం ఇవ్వడం ప్రారంభమైంది. స్వాతంత్ర్యోదయంతోపాటు తెలుగునాటకరంగంకూడా ఒక కొత్త ఆశతో, కొత్తశకంలోకి అడుగు పెట్టింది.

ఈ కొత్తశకాన్ని ఆవిర్భవింపచేసిన రచయితలు, నటులుకూడా ప్రతిభా సంపన్నులు. సరికొత్తనాటకరంగం – సినిమాతో పోటీపడికూడా నిలవదగిన నాటకరంగాన్ని వారు ప్రారంభించి, కొనసాగించడానికి తగిన వాతావరణం ఉంది. పాతపద్ధతులతో విసుగెత్తిన ప్రేక్షకులు ఉన్నారు. ప్రతిభావంతులైన నటులు, రచయితలు ఉన్నారు. అయినా ఈపాతికేళ్ళ తెలుగునాటకరంగాన్ని పరిశీలిస్తే ఎక్కడో లోపం ఉన్నట్లు కనిపిస్తుంది. ఇంతతొందరలోనే ఆ ఆశా దీపం మినుకుమినుకు మనిఆరిపోవడానికి సిద్ధంగా ఉంటుందనీ, తెలుగునాటకరంగం ఎవరికీ పుట్టినబిడ్డ కాకుండా పోతుందనీ, దానికి ఆలనా పాలనా కరువై కొందరు నాటకం "పిచ్చి" ఉన్న యువతీయువకుల ఉత్సాహమే ఊపిరై బతుకుతుందనీ ఆనాడు ఎవ్వరూ అనుమానించి ఉండరు. దీనికి కారణాలను ఈ వ్యాసం చివర చర్చిస్తాను.

ఈపాతికేళ్ళ తెలుగునాటకచరిత్రను కాలక్రమానుసారం వివరించడం అసాధ్యం. పాతికసంవత్సరాలు ఒకసాహిత్యచరిత్రలో చెప్పుకోదగ్గంతకాలం

కాదు. అందువల్ల తెలుగునాటకంలో ఉన్న ముఖ్యమైన ప్రవృత్తులదృష్ట్యా ఈ చరిత్రను క్లుప్తంగా వివరిస్తాను.

స్వాతంత్ర్యం వచ్చేనాటికే తెలుగునాటకాల ఇతివృత్తాలలో ఎంతో చైతన్యవంతమైన వైవిధ్యం ప్రారంభమైంది. 1921 నుంచి 1944 వరకు వచ్చిన నాటకాలను పరిశీలిస్తే అందులో సగభాగం పౌరాణికాలు, మిగిలినసగం చారిత్రకాలు, సాంఘికాలు. పౌరాణికాలన్నీ పద్యాలతోను, పాటలతోను కూడివుండడంతో వాటిమధ్య గద్యం కనిపించకుండా పోయింది. కాని స్వాతంత్ర్యయుగోదయంనాటికే వృత్తినాటకసమాజాలు అంతరించి కిరాయినటుల నాటకాలు ప్రబలడంతో అది ఆర్థికంగా అంత గిట్టుబాటు కాకపోవడంవల్ల పౌరాణికనాటకాల ప్రయోగంకూడా ఒకటి రెండు నాటకాలకు మాత్రమే (పాండవోద్యోగ విజయాలు, గయోపాఖ్యానం వంటివి) పరిమితమైపోయింది.

తెలుగులో వచ్చిన చారిత్రకనాటకాలలో చాలవరకు స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా ఉన్నరోజులలో వ్రాయబడినవే: ఉద్యమాన్ని ప్రత్యక్షంగాచూపే రాజకీయనాటకాలపై బ్రిటిష్ప్రభుత్వం ఆంక్షలు విధించడంవల్ల పరోక్షంగా దేశభక్తిని ప్రేరేపించే చారిత్రకనాటకాలు అవసరం అయ్యాయి. "మాతృదాస్యవిమోచనము" వంటి పౌరాణికనాటకాలుకూడా ఇట్టిపరోక్షరచనలే: స్వాతంత్ర్యం రావడంతో తెలుగునాటకకర్తకు ఈదేశభక్తి ఉద్బోధకాలైన ఇతివృత్తాలన్నీ అంటరానివైపోయాయి. ఈలోపాన్ని పూరించడానికి సంఘసమస్యలవైపుకు రచయితలు దృష్టి సారించారు.

సాంఘికనాటకం అన్నది చాలా విస్తృతమైనపదం. 18ి2లో కన్యాశుల్కం వచ్చిననాటినుంచి రచయితలు అసంఖ్యాకాలైన సాంఘికసమస్యలను నాటకీకరిస్తూనేవచ్చారు. 1921–44 మధ్యకాలంలో వచ్చిన సాంఘికసమస్యానాటకాలను స్థూలంగా రెండురకాలుగా విభజించవచ్చు. సంఘంలో పాతుకొనిపోయిన దురాచారాలను కథావస్తువుగా స్వీకరించి, వానివలన వ్యక్తికి కలిగే కష్టనష్టాలను వివరించేనాటకాలు కొన్ని. ఇవి అన్నీ ఆనాటికే ఏర్పడిపోయిన సాంప్రదాయికనాటకశైలిలో పద్యాలు, పాటలతో వ్రాయబడిన నాటకాలు. "చింతామణి, రంగూన్‌రౌడీ, వరవిక్రయం" వంటినాటకాలు ఈకోవకు చెందినవి. ఆనాడు పౌరాణికనాటకాలతో సమంగా ఇవికూడా ప్రచారంలోకి వచ్చి విజయవంతమైనవంటే ఈనాటకాలప్రభావం వేరే చెప్పనక్కరలేదు.

ఇక రెండవరకం నాటకాలు సంఘంలోవ్యక్తికి లేదా వ్యక్తులకు జరుగుతున్న అన్యాయానికి సంబంధించినవి. సంఘం కొందరువ్యక్తులను ఎలా అణగ ద్రొక్కుతున్నదీ వివరిస్తాయి ఈనాటకాలు. ఇబ్సన్‌వల్ల ప్రభావితులైన రాజ మన్నార్, రాఘవ, రంగారామ్ వంటి రచయితలు సంఘంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాలను గురించి చర్చించారు. సమాజంలోని వర్గభేదాలను గురించి, పైతరగతి మనుష్యులు క్రిందితరగతివారిని ఏవిధంగా నీచంగా చూస్తారో అన్నవిషయాన్ని గురించి 1947కు ముందుగానే చాలానాటకాలు వచ్చాయి. జమీందార్లు- లేదా భూస్వాములకు, పాలేర్లకు మధ్యజరిగే సంఘర్షణను చిత్రించిన నాటకాలలో బోయిభీమన్నగారి పాలేరు (1945), సుంకర, వాసిరెడ్డిగార్ల ముందడుగు (1945) ముఖ్యమైనవి. కాని 1947 తరువాత వచ్చిన నాటకాలలో వెనుకటికంటె తీవ్రత, అసహనం హెచ్చుగా కనిపిస్తాయి.

1947 తరవాత - ముఖ్యంగా 1947—55 ల మధ్యకాలంలో వచ్చిన సమస్యా నాటకాలన్నీ వర్గభేదాలనుగురించి, రానికి సంబంధించిన అన్యాయాలను గురించి వచ్చినవేనని చెప్పుకోవచ్చు. ఇది ధనవంతులకు, బీదవారికి జరిగిన పోరాటంగా మాత్రమే కాక అధికారానికి అణగద్రొక్కబడుతున్న శ్రామిక, రైతువర్గాలకు మధ్య జరుగుతున్న పోరాటంగాకూడా చిత్రించబడ్డది. ఈనాటకాలకు పీడితప్రజలప్రతినిధి నాయకుడు. సంఘం, అధికారికవ్యవస్థ, అధికారంలో ఉన్నప్రభుత్వం ఆప్రభుత్వంప్రతినిధులు - ప్రతినాయకులు. పీడితమానవుని ఆక్రందనను, దానినుంచి జనించే అసహనాన్ని, క్రోధాన్ని ఆత్రేయ ప్రతిబింబించి నంతవిస్పష్టంగాను, పటిష్టంగాను మరేతెలుగునాటకరచయితా చిత్రించలేదు. అందువల్లనే ఆత్రేయ ఆధునికనాటకయుగానికి మూలపురుషుడైనాడు. పటిష్ఠమైన సంభాషణలు, బలమైనసన్నివేశాలు, ప్రజలకు దగ్గరగా ఉండి, వారిని ఉత్తేజపరిచే ఇతివృత్తాలు - ఇవి ఆత్రేయనాటకాలను, నాటికలను ఆంధ్రదేశం నలుమూలలా విజయవంతం చేయడానికి ముఖ్యమైనకారణాలు. నటుడుగా, దర్శకుడుగా, ప్రయోక్తగా, నాటకరచయితగా, వెంకటగిరి అమెచూర్స్ నిర్వాహకుడుగా ఒకవ్యక్తి ఎంతవైవిధ్యాన్ని, ప్రతిభను ప్రదర్శించవచ్చో తెలుగుదేశానికి చాటాడు ఆత్రేయ. అయితే ఆత్రేయనాటకాలలో ఉండే మిగిలినలక్షణాలు కాక అతనివ్యంగ్యవిమర్శ, సంఘాన్ని, ప్రభుత్వాన్ని జరిగినఅన్యాయానికి దుయ్యబట్టడంమాత్రం ఆత్రేయ అనుయాయులు తమనాటకాలలో జొప్పించారు.

1946 లో ఆంధ్రనాటక కళాపరిషత్తు మొదటిసారిగా నెరిపిన నాటకాల పోటీలలో ఆత్రేయ కొండమీద గోపాలరాయశర్మ వ్రాసిన "ఎదురీత"ను ప్రదర్శించి ఉత్తమనటుడుగాను, దర్శకుడుగాను ఎన్నుకోబడ్డాడు. "ఎదురీత" వర్ణాంతరవివాహాలను గురించిననాటకం. నేను మొదట పేర్కొన్న దురాచారాలను, మూఢనమ్మకాలు ఉన్నవారిని విమర్శించేనాటకం. 1949 లో "యన్.జి.వో" ఉత్తమనాటకంగా ఎన్నుకోబడ్డది. ఈరెండు నాటకాలు ఈనాటివరకు కొనసాగుతున్న సమస్యానాటకాలలోని రెండుపద్ధతులను ప్రతిబింబించే నాటకాలని చెప్పవచ్చు.

ఆత్రేయనాటకాలపద్ధతిలో నాటకాలువ్రాసినవారు అసంఖ్యాకంగాఉన్నారు. మధ్యతరగతి జీవితాన్ని, యువకుల నిస్పృహను చిత్రించిననాటకాలలో అనిసెట్టి సుబ్బారావు "గాలిమేడలు" ఒకటి. బాధానర్పదష్టులైన పతితుల, భ్రష్టజీవితాలను నాటకీకరించినవారిలో పినిశెట్టి శ్రీరామమూర్తి (కులంలేనిపిల్ల, పల్లెపడుచు, అన్నాచెల్లెలు) ముఖ్యుడు.

సమస్యాప్రధానమైన నాటకాలను సందేశనాటకాలుగా మార్చి, నాటకం చిట్టచివరప్రధానపాత్రచేత(ఈపాత్రపతితులకు ప్రతినిధి)ఉపన్యాసా లివ్వించడం ఆత్రేయతరంతరవాత వచ్చినమార్పు. ఈపద్ధతికి పరాకాష్ఠను బెల్లంకొండ రామదాసు (మాస్టర్జీ, పునర్జన్మ,) అవసరాల సూర్యారావు (పంజరం) ప్రభృతుల నాటకాలలో చూడవచ్చు.దీనివలన కథాసంవిధానంకన్న, నాటకంచివర ఉద్వేగం పాలు ఎక్కువై ప్రధానపాత్ర చేసే అంగవిన్యాసం. అరిచేఅరుపులు పటిష్ఠాలై ఏకపాత్రనాటకాలు ఏక నటనాటకాలు ఎక్కువ కాజొచ్చాయి. ఇటువంటినాటకాలు పరిషత్తులలో బహుమానాలు పొందడానికి ఉపకరించాయి. కాని మంచి నాటకాలను సృష్టించలేకపోయాయి.

ఏర్పడివున్న సాంఘికవ్యవస్థలో మార్పును కోరేవే రెండుపద్ధతులనాటకాలుకూడా: సంఘంలోని దుర్వ్యసనాలనుమాన్పి, సంఘాన్ని ఎలాపునరుజ్జీవితం చేయాలో కొన్నినాటకాలు మార్దవంగా ఆదేశిస్తే, మరికొన్ని సమాజంలోని కుళ్ళును కడిగి, దుష్టాంగాలను ఖండించాలని ఆక్రోశించాయి. మరికొన్ని కొత్తగా వచ్చిన రాజకీయవ్యవస్థ ఏర్పరచిన అధికారాన్ని. ద్రోహచింతనను ఎదిరించాయి. ఈ రాజకీయవ్యవస్థమీద ధ్వజంఎత్తిన రచయితలలో ఆత్రేయ, రాచకొండ విశ్వనాథశాస్త్రి, కొడాలి గోపాలరావు ప్రభృతులు ముఖ్యులు.

ఈ రాజకీయవ్యవస్థలో - ముఖ్యంగా పట్టణ నగర రాజకీయాలలో పెచ్చు మీరిపోయిన దురన్యాయాలను విమర్శిస్తూ వచ్చిననాటకాలు రెండు. అవి తెలుగులో వచ్చిన మౌలికరచనలుకావు. గొగోల్ వ్రాసిన "ఇన్‌స్పెక్టర్ జనరల్" ప్రీస్టీ వ్రాసిన "యాన్ ఇన్‌స్పెక్టర్ కాల్స్" అన్ననాటకాలకు అనువాదాలు. మొదటినాటకానికి దాదాపు అరడజను అనువాదాలు వచ్చాయి. అందులో ముఖ్యమైనది కొవ్వరపు సుబ్బారావుగారి "ఇనుపతెరలు". ఇదేపద్ధతిలోదేశ, రాష్ట్ర నగరరాజకీయాలమీద విమర్శలు వచ్చాయి. వాటిలో కొడాలి గోపాలరావు వ్రాసిన "ఛైర్మన్" చెప్పుకోదగ్గనాటకం.

పట్టణాలలో మునిసిపాలటీలు అధికారానికి ఆటపట్టులైతే పల్లెలలో పంచాయతీలు, లేదా ఇంకా మిగిలివున్న భూస్వాములు అట్టివారు. అధికారానికి, అంతస్థుకూ ప్రతినిధులైనవారికీ వారిచేత అణగత్రొక్కబడుతున్న పీడితవర్గాలకీ మధ్య జరిగేసంఘర్షణను ఇతివృత్తంగా స్వీకరించిన నాటకాలుకూడా బహుళంగా వచ్చాయి. వానిలో సుంకర, వాసిరెడ్డి వ్రాసిన "మాభూమి" తెలుగుదేశం అంతటా జైత్రయాత్ర చేసింది; దానికి కారకుడు ఆనాటకానికి దర్శకుడైన డాక్టర్‌రాజారావు; అటువంటినాటకాలు ఆతరువాత అసంఖ్యాకాలుగా వచ్చాయి. కేవలం పల్లెటూళ్ళపునర్వ్యవస్థీకరణను దృష్టిలో పెట్టుకొని వ్రాసిననాటకాలలో భీమన్నగారి పడిపోతున్న అడ్డుగోడలు, కె. యల్. నరసింహారావు గారి అడుగుజాడలు, "క్రొత్తగుడి" ప్రత్యేకంగా ఎన్నదగినవి.

1947 నుంచి ఒకదశాబ్దంవరకు అనువాదనాటకాలుకూడా ఎన్నో వచ్చాయి. అందులో ముఖ్యంగా పేర్కొనవలసినది డి. వి. నరసరాజు ఓడ్‌హౌస్‌కు చేసిన అనువాదం - "నాటకం" అనేనాటకం. ఒకదశాబ్దంపాటు తెలుగు నాటకరంగాన్ని ఏలింది ఈనాటకం. ఇంకా అనువాదాలు, అనుసరణలుచేసిన రచయితలలో కొండముది శ్రీరామచంద్రమూర్తి, అంగర సూర్యారావు, మంథా వెంకటరమణ మొదలైనవారు ముఖ్యులు. గొల్లపూడి మారుతీరావువ్రాసిన "రాగరాగిణి" ఇటీవలి అనుసరణనాటకాలలో ముఖ్యమైనది.

నాటకరచనలోను, ఇతిర్పతంలోను వచ్చినతరువాతిమార్పును గురించి చర్చించకముందు ఇక్కడ పేర్కొనవలసినరచయిత డాక్టర్ కొర్లపాటి గంగాధరరావు. ఆయన వ్రాసినన్నినాటకాలు, నాటికలు (దాదాపుతొంభై) మరియేయితరనాటకరచయితా వ్రాయలేదు. అవిఅన్నీ ప్రదర్శనసులభాలు.

తెలుగునాటకరంగానికి ఉన్న పరిధులు ఏమిటో ఆయనకు తెలిసినంతగా మరో నాటకరచయితకు తెలియదు. రంగస్థలం లేదు ; స్త్రీలు నటించడానికి ముందుకు రారు ; సెట్టును మార్చి, కొత్త సెట్టును వేసుకోవడానికి తగిన పరికరాలు లేవు. ఇవి అన్నీ అవసరంలేకుండా ఉన్నంతలో నాటకాన్ని ఆడడానికి వీలుగా తన రచనలు చేశాడాయన. (ఇటువంటిరచనలవల్లనే తెలుగులో ప్రతీకాత్మకంగా తెరలను, సెట్లను అమర్చడంపోయి, డ్రాయింగ్ రూమ్ సెట్ రూఢిఅయిందన్న అపవాదుకూడా పూర్తిగా అబద్ధం కాదు.

1947 ప్రాంతాల అనాదిగా వస్తున్నదుర్వ్యసనాలకు వ్యక్తులులోను కాకుండా నీతిని బోధించే సందేశనాటకాలు వచ్చాయి. ఆ తరువాత వ్యక్తికీ, సమాజానికి మధ్య సంఘర్షణను చిత్రించే సామస్యానాటకాలు ఎక్కువగా ప్రచారంలోకి వచ్చాయి. ఆ తరువాత బాహ్యవిషయాలతోను, పరిస్థితులతోను పడేసంఘర్షణకన్న అంతరాంతరాలలో పడేసంఘర్షణకు ప్రాధాన్యం హెచ్చింది. దీనిని చిత్రించినది మనస్తత్వనాటకం. బుచ్చిబాబు "ఆత్మవంచన" ఈ రకంనాటకాలలో మేలిబంతి. ఈ పద్ధతిలో ఎన్నోప్రయోగాలను చేస్తున్న ఆధునికుడు మారుతీరావు.

గతదశాబ్దంలో పేరుపొందిన ఇతరరచయితలు అందరూ ఇటువంటి మనస్తత్వచిత్రణ చేసినవారే : ఆర్.వి.యస్. రామస్వామి, రాఘవ, పాత్రో ఇందులో చెప్పుకో తగ్గవారు. పాత్రో విశాఖపట్నం 'యాస'నునాటకసంభాష ణలకు వాడడంలో అత్యంతప్రజ్ఞాశాలి. పావలా డబ్బులకోసం ఒక కింది తర గతి కుటుంబంపడే మథనను ఎంతో మేధావంతంగా చిత్రించాడతను 'పావలా' నాటికలో. ధనం మనిషి జీవితాన్ని ఎలా వక్రగతులను మళ్ళిస్తుందో కూడా అతడు చాలా నాటికలలోను, ఒక నాటకంలోను చిత్రించాడు.

రాజకీయ నాటకాల్లో, ఈనాడు అన్ని రంగాలలోను జరుగుతున్న అన్యా యాన్ని అతినగ్నంగా బహిర్గతం చేస్తూ వ్యంగ్యంగా చిత్రించిన నాటకం రాచ కొండ విశ్వనాథశాస్త్రి "నిజం". ఇంతటి విమర్శనాత్మకమైన ఇతివృత్తాలతో పాటు హాస్యాత్మకమైన నాటకాలు, నాటికలుకూడా మనకు ఎన్నో వచ్చాయి. సోమంచి యజ్ఞన్నశాస్త్రి "పెద్ద మనుషులు", నరసరాజు "నాటకం" ప్రఖ్యా తాలు. భమిడిపాటి రాధాకృష్ణ ఇటువంటి రచనలో (తండ్రికివలెనే) సిద్ధ హస్తుడు. 'కీర్తి శేషులు' వంటి నాటకం ఏకపాత్రాత్మకమైనా, 'ఇదేమిటి'వంటి రచనల్లో మంచి హాస్యాన్ని చూపినవాడు. రావి కొండలరావు "నాలుగిళ్ళ

చావిడి", "కుక్కపిల్ల దొరికింది" వంటి నాటక, నాటికా రచనల్లో సన్నివేశ గతమైన హాస్యాల్ని చూపించాడు. యన్.ఆర్. నంది మానవత్వానికి విలువ నిచ్చే నాటక రచయిత. ఒకవైపు ఈనాటి వ్యవస్థను విమర్శిస్తున్నా ఆశా వాదంతో నాటకాన్ని ముగిస్తాడు. అతడి "అరణి", "మరో మహెంజొదారో" నాటకాలు ఇందుకు ఉదాహరణలు.

నాటక సాహిత్యంలో ఎటువంటి మార్పులు వచ్చాయో, నాటికా సాహిత్యంలోకూడా కేవలం అట్టి మార్పులే కనిపిస్తాయి. అవి రెండూ ఒకదానివెంట ఒకటిగా నడిచిన సాహిత్య ప్రక్రియలు. ప్రఖ్యాత నాటికా కర్తలలో తిరిగి ఆత్రేయ, వినికెట్టి, డాక్టర్ గంగాధరరావు, డి.వి. నరసరాజు, సోమంచి యజ్ఞన్నశాస్త్రి, గొల్లపూడి మారుతీరావు ప్రభృతుల పేర్లే పేర్కొనక తప్పదు. హాస్యనాటికలను నేర్పుగా వ్రాసిన వారిలో నరసరాజు, యజ్ఞన్నశాస్త్రి, డాక్టర్ గంగాధరరావు, పులుగుండ్ల రామకృష్ణయ్య, ముద్దుకృష్ణ, బుచ్చిబాబు, కొండల రావు, భమిడిపాటి లను పేర్కొనవచ్చు.

చారిత్రక నాటకాలనుగురించి చెప్పవలసి వచ్చినప్పుడు 1947కు ముందూ ఆ తరువాతా వచ్చిన వానిని గురించిన అంతరాన్ని చెప్పవలసి వుంది. 1947 కు ముందు వ్రాయబడిన చారిత్రక నాటకాలు చాలభాగం పరోక్షంగా స్వాతంత్ర్యోద్యమానికి చేయూత నివ్వడానికి, దేశభక్తిని ఉద్బోధించడానికి వ్రాయబడినవి 1947 తరువాత అట్టి అవసరం లేదు. అందువల్ల ఆతరువాత వచ్చిన చారిత్రక నాటకాలు ఇతివృత్త నిర్మాణంమీద, పాత్ర పోషణమీద ఎక్కువ కేంద్రీకరించాయి. నండూరి రామకృష్ణమాచార్యులు వ్రాసిన "ధర్మచక్రము", "ఛత్రపతి శివాజీ", "ఉరికంబం", శ్రీకృష్ణదేవరాయాలు" ఆత్రే చెప్పుకోదగినవి. "అశోక సామ్రాట్", పడాల "అల్లూరి సీతారామరాజు", ఆమంచర్ల "విశ్వాంతర" అటు సాహిత్య గౌరవము, ఇటు ప్రదర్శన సౌలభ్యము కల రచనలు.

వీనితోపాటు పద్యప్రధానమైన పౌరాణిక నాటకాలుకూడా రాకపోలేదు. కాని అవి సంఖ్యలోను, గుణంలోను కూడా అంత చెప్పుకోదగ్గవికాదు. పౌరాణిక గాథలకు ఆధునిక పరిస్థితుల కనుగుణంగా మలిచిన నాటకాలలో శ్రీరాములు సచ్చిదానంద శాస్త్రిగారి "దివోదాసు", బోయిభీమన్నగారి "రాగ వాసిష్ఠం" పేర్కొనదగినవి.

1947 కు ముందు తెలుగులో గేయ నృత్యనాటికలు ఎన్నో వచ్చాయి. కృష్ణశాస్త్రి, రజనీకాంతరావు ప్రభృతులు సంగీత సాహిత్యాలను మేళవించి

చక్కని రచనలు చేశారు. 1947 తరువాత గేయనాటికా కర్తలలో చెప్పుకోదగిన వాడు సి. నారాయణరెడ్డి. ఆయన నవ్వనిపువ్వు, రామప్ప వంటివి సరళములై, ప్రదర్శనకు కూడా ఎంతో తగిఉన్న రచనలు. వచనగేయాలలో వచ్చిన నాటికలలో ఆరుద్ర "సాలభంజిక", "దరఖాస్తు ఫారం", కుందుర్తి "శాంతి", అరిపిరాల విశ్వం "అశ్వఘోషుడు" పేర్కొనదగినవి.

ఈ కాలంలో బాలబాలికలకోసం కూడా నాటికలు చాలా వచ్చాయి. జంధ్యాల పాపయ్యశాస్త్రి, ఇల్లిందల సరస్వతీదేవి, న్యాపతి రాఘవరావు, మొదలి వెంకట సుబ్రహ్మణ్యశర్మ మొదలైనవారు బాలలనాటికలు వ్రాసి, పాఠశాలల్లోను, బాల సంఘాలలోను పిల్లలచేత నాటకాలు ఆడించారు, కాని మనకు - పెద్దలకు ఒక స్థిరమైన నాటకరంగం లేనట్లే, పిల్లలకోసంకూడా ఒక నాటక రంగం అంటూ లేదు.

రేడియో నాటికలు వ్రాస్తున్నవారు ఈనాడు అసంఖ్యాకంగా ఉన్నారు. నాటకాలు, నాటికలు వ్రాసినవారు మాత్రమే కాక, నవలలు, కథలు వ్రాసినవారు కూడా రేడియో నాటికలు వ్రాస్తూనే వున్నారు. వీరిలో చాలామందికి "రేడియో నాటకం" అన్నది ఒక ప్రత్యేకమైన 'మీడియం' అని, దాని శిల్పం వేరని కూడా తెలియదు. రేడియో మీడియంలో చక్కని నాటికలు వ్రాయగలిగిన కొద్దిమందిలో గోరాశాస్త్రి ముఖ్యుడు. ఆయన వ్రాసిన దాదాపు పదిహేను నాటికలు తెలుగు శ్రవ్య నాటికా సాహిత్యానికి మకుటాయమానాలు. హితశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, ప్రయాగ కోదండ రామశాస్త్రి, అమరేంద్ర మొదలైనవారు చక్కని రేడియో నాటకాలు వ్రాశారు. రేడియోలో హాస్యప్రధానమైన నాటకాలు వ్రాయడంలో ప్రఖ్యాతులు మునిమాణిక్యం, నండూరిసుబ్బారావు మొదలైనవారు.

ఈ సుదీర్ఘమైన చరిత్రను, ప్రక్రియా వైవిధ్యాన్ని, రచయితలసంఖ్యను పరిశీలిస్తే ఈ పాతికేళ్ళ తెలుగు నాటకరంగం మూడు పూలు, ఆరు కాయలతో విరాజిల్లుతున్నదన్న భావం రావచ్చు. ముందే చెప్పినట్లు మనకు మంచి నాటకాలు ఉన్నాయి; మంచి రచయితలు ఉన్నారు. కాని తెలుగు నాటకరంగం కొన ఊపిరితో బ్రతుకుతున్నదని ఆ రంగానికి సంబంధించిన వ్యక్తులు ఎంత త్వరగా గమనిస్తే అంతమంచిది. దానికి ముఖ్యమైన కారణం మనకు అమెచూర్ నాటక సంఘాలే కాని వృత్తి నాటకరంగం అంటూ లేకపోవడం. వృత్తి నాటకరంగం లేని ఏ నాటకరంగమూ తనకాళ్ళమీద తాను నిలబడలేదు. ప్రజలకు కావలసిన

నాటకాలను అందించలేదు. మనకు avant grade నాటకాలు ఉన్నాయే కాని, ప్రజాబాహుళ్యానికి నచ్చి, వారు ఒకటికి నాలుగుసార్లు చూడాలనుకొనే నాటకాలు లేవు. వెనక వృత్తి నాటక సమాజాలు ఉన్నప్పుడు వారు సంగీత సాహిత్యాలను తమ వాచికంలో మేళవించగల మంచి నటులను రావించి తమతమ బృందాలను ఏర్పాటు చేసుకున్నారు. తిరిగి ఆ దశ రావాలి. ప్రజలకు దగ్గరగా ఈ నాటకాలు పోనంతకాలం తెలుగు నాటకరంగం ఇదేవిధంగా ఉండక తప్పదు.

దీనికి మరొకకారణం నాటకశాలల, రంగస్థల పరికరాల కొరత. 1925-40 ల మధ్యకాలంలో తెలుగుదేశంలో నాటక శాలలు లేని చిన్న పట్టణం కూడా ఉండేదికాదు. అందులో చాలభాగం సినిమాహాళ్లుగా మారిపోయాయి. తిరిగి ప్రతిఊరా నాటక శాలలు వస్తేనే కాని నాటక ప్రదర్శనలు ఇతోధికంగా జరగడానికి వీలుండదు.

ఈ నాడు నాటకకర్తలు చాలమంది సినిమాలకు, నవలారచనకు పూను కుంటున్నారంటే దానికి కారణం నాటకరంగం తమకు లాభసాటి కాకపోవడం వల్లనే.

ఇప్పటికైనా, ప్రభుత్వమూ, అకాడమీలు పూనుకొని తెలుగు దేశంలో వృత్తి నాటకరంగాన్ని పునరుజ్జీవింప చేయాలి. నాటక శాలలను నిర్మించాలి. రచయితల మేధాశక్తి ఇంకా నాటక రంగానికే ఉపయోగించ గలగాలి. అది లేనినాడు ఈ నాటికి వలెనే నాటకరంగం బలుపేగాని, శక్తి లేని వ్యవస్థ అవుతుంది. అమెచూర్ నటులకు ఎంత ఉత్సాహం ఉన్నా వారికి జీవిక వేరేఉన్నదని, అది గడిచిన తరువాతనే నాటక ప్రదర్శనలకు పూనుకుంటారనీ, అలాకాక నాటకరంగమే జీవికగా చేసుకొన్న కొందరు ప్రతిభావంతులు తిరిగి నాటక రంగానికి వస్తేనేకాని తెలుగు నాటకరంగం పూర్తిగా కోలుకోలేదనీ మనం ఎంత త్వరగా గమనిస్తే అంత మంచిది.



# పద్యప్రధాన నాటకాలు

శ్రీ పాతూరి శ్రీరామశాస్త్రి

స్వాతంత్ర్యోదయమై పాతికేళ్ళు నిండింది. కొన్ని రంగాల్లో ప్రగతి సాధించాం. కొన్ని రంగాలు ఎలా ఉన్నవి అలాగే ఉండి పోయాయి. మరి కొన్ని రంగాల్లో దిగజారిపోవడమో లేక వక్రగతి పట్టడమో జరిగింది. అలా దిగజారిపోయి వక్రగతి పట్టిన రంగం పద్యప్రధాన నాటకరంగం. ప్రగతిలేనే లేదు. కాని మానవుడు ఆశాజీవి. ఆ ఆశతోనే పద్యప్రధాన నాటకాల మీద వ్రాయడానికి పూనుకొన్నాను.

పద్యప్రధాన నాటకాలలో కొండవీటి చాంతాళ్లలాంటి రాగాలు తీస్తూ పద్యం పాడడమేననే అభిప్రాయం కొంతమంది పెద్దలలో కూడ పాతుకుపోయి పద్యనాటకాలంటే కొంత అయిష్టత ప్రచారంలోకి వచ్చింది. అలా సాగదీసి పాడడం సబబుకాదని ముక్తసరిగా రాగాన్ని పద్యంలో ఇమిడ్చి పద్యాన్ని పాడడం అవసరమని చాలా కాలంనించి వస్తున్న అభిప్రాయం. ఈ ప్రక్రియకు దోహదమిచ్చి ప్రచారంలోకి తెచ్చిన పెద్దలు ముఖ్యంగా ముగ్గురు, స్వర్గీయులు ముంజులూరి కృష్ణారావుగారు, బళ్ళారి రాఘవాచారిగారు, మాధవపెద్ది వెంకట్రామయ్యగారు.

పద్యాన్ని భావయుక్తంగా పాడడం అనేది ఆంధ్రుల ప్రత్యేకత. మరియే ఇతర భాషలలోను, దేశాలలోనులేదు. ఈ ప్రత్యేకతను నిలబెట్టుకోవడం తెలుగువారి బాధ్యత. అందువల్లనే పద్యప్రధాన నాటకాలు తిరిగి ప్రచారంలోకి రావాలని ఆకాంక్షించే వారిలో నేనొకణ్ణి.

పద్యప్రధాన నాటకాలంటే వెంటనే స్ఫురణకు వచ్చేది తిరుపతి వేంకటకవుల పాండవ నాటకాలు, చిలకమర్తివారి గయోపాఖ్యానం, పానుగంటి వారి పాదుక, ధర్మవరంవారి చిత్రనళీయం— సారంగధర, బలిజేపల్లివారి హరిశ్చంద్ర మొదలయిన పద్యయుత నాటకాలు. ఈ నాటకాల లోనివద్యాలు సాహిత్య పరిజ్ఞానం అంతంత మాత్రంగా ఉన్న మహిళాలోకంలో చాలా మందికి కంఠస్థం...... పద్యాలు పూర్తిగా రాకపోయినా సందర్భానుసారంగా ఈ పద్యప్రధాన నాటకాల లోని పద్య భాగాలను ఉదహరించటం పరిపాటి.

"బావా! ఎప్పుడు వచ్చితీవు"- "అల్లుడా రమ్మని ఆదరంబున బిల్వ"- "రాము వంటి కొడుకు"- "అతి వా దాపగనేల"- "మాయామేయ జగంబె నిత్యమని"- అనే పద్యభాగాలు అత్యంత అధునిక గృహాలలో తప్ప కొంచెం పాతకాలపు వ్యక్తులున్న కుటుంబాలలో తరుచు వినవస్తుంటాయి. దీనికి కారణాలు రెండని చెప్పుకోవచ్చు. అతిలలిత సుందర పదాలతో నడిచిన అపద్యరచన మొదటిది. తర్వాత ఆ నాటకాలు సుశిక్షితులైన నటబృందాలు ప్రదర్శించేవారు. అందువల్ల పద్యప్రధాన నాటకాలు రసిక లోకాన్ని ఆనందపరిచి ప్రజలలోకి చొచ్చుకు పోయాయి.

ప్రపంచంలో ఏ దేశంలోనైనాసరే, ఇతరనాటకాలకన్న సంగీతనాటకాలకి ప్రచారం, ప్రభావం జాస్తి. అలాగే తెలుగునాట పద్యప్రధాననాటకాలు ప్రజలను ఆహ్లాదపరిచాయి. కాని అలాంటి నాటకాలను చూడాలనే అభిలాష గల రసికలోకానికి ఆనాటకాలను ప్రదర్శించే సమాజాలు తక్కువైపోతున్నాయి. స్వాతంత్ర్యోదయము అయినకొన్నాళ్ళవరకు ప్రేక్షకహృదయ సామ్రాజ్యాలను ఏలాయి. ఇప్పటికి ఏలుతూఉన్నాయి. కొన్ని కొత్తరచనలూ వచ్చాయి కాని అవి బహుళప్రచారానికి వచ్చి ఖ్యాతి నార్జించడానికి ఎక్కువగా నోచుకోలేదు. దీనికి కారణాలన్వేషిస్తే మనకు మొదట తట్టేది రంగస్థలాలు అతితక్కువగా ఉండడం. తరువాతది క్షీణిస్తున్న ఆర్థికస్థోమత. ప్రతీది పదిరెట్లు పెరిగిపోయిన ఈరోజుల్లో పద్యప్రధాననాటకాలు- ఇవి ముఖ్యంగా పౌరాణికాలు, ఐతిహాసికాలు, జానపదాలూను- ప్రదర్శించాలంటే సరియైన ఆహార్యం సేకరించడంకోసం పడవలసినశ్రమ అనన్యసామాన్యం. ఆధునికవచన నాటకాలతో ఈబాధలేదు. సామాన్యంగా ఈనాటకాలలో వాడేదుస్తులు మామూలుజీవితంలో ధరించేవే. అందువల్ల ఒకరిదగ్గరలేకపోతే మరొకరిదగ్గర అరువుతెచ్చుకోవచ్చు. కొంతకాలంగా ప్రదర్శింపబడుతున్న "రక్తకన్నీరు", ఇటీవల ప్రచారంలోకి వచ్చిన "మహమ్మద్‌బిన్‌తుగ్లక్" తప్పితే డబ్బువచ్చే ఇతరనాటకాలు లేవంటే తప్పుకాదేమో! ఈనాటకాలవిజయానికి కారణం ఈనాటి రాజకీయపరిస్థితుల పైన, ప్రభుత్వంపైన, సంఘంపైన విసిరే ఛణుకులు, విమర్శ అని తోస్తుంది. వచననాటకాలలో ఒకపరిధిని దాటి (ఒకగది) ఆడే నాటకాలు లేవేమో. తెలుగువారి ఏకైకసాంఘికవచననాటకం కన్యాశుల్కం. ఆనాటకం ఆడితే డబ్బిచ్చి చూచేవారు తక్కువ. వచననాటకాలు తేలికగా ఆడవచ్చు. శ్రమతక్కువ. పద్యప్రధాన నాటకాలకు అలా కాదే మంచిగాత్రసాధన కావాలి. శృతిపక్వం

ఉండాలి, భాషాజ్ఞానం కావాలి, కొంత సంగీతసంప్రదాయం తెలియాలి. ఇవి అన్నీ వున్న వ్యక్తులు కూడి శ్రమిస్తేగాని ఆనాటకప్రదర్శన రసోత్పత్తి చేయదు. శ్రావ్యత రసస్ఫూర్తికి అవసరం. సంగీతం ఎక్కువగా లేకపోయినా లోగడ ఉదాహరించిన మహనీయవ్యక్తుల పద్యపఠనారీతి రసస్ఫూర్తి కలిగించి సామాజికులను ఆనందపరిచేది.

సామాన్యజనానికి అర్థమయ్యే వాడుకభాషలోనే రచన ఉండాలి. అలా ఉంటేగాని నాటకము రక్తికట్టదనే భావము కొందరు పెద్దల్లోకూడా బాగా పాతుకుపోయింది. అంటే భాష మామూలు పరిభాష కావాలి, అని. ఈభావముతో నేను పూర్తిగా ఏకీభవించలేను. ఇలా అన్నానని భాష జటిలంగా దుర్గ్రాహ్యంగా ఉండాలనికాదు. ఉదాత్తమైనభాష, సరళమైనది, అన్నిటికంటె చెవికి ఇంపైన భాషఉన్నపుడు ప్రేక్షకులు ఆనందించారు, ఆనందిస్తున్నారు, ఆనందిస్తారనేది నా విశ్వాసము.

పరాధీనస్వాతంత్ర్య యుగసంధిలో వచ్చిననాటకము వావిలాల సోమయాజులుగారి "నాయకురాలు" అందులోనించి ఒకపద్యము ఉదాహరిస్తాను.

స్ఫాయద్భీకర మంద్రగర్జ విపులాశాగర్భ నిర్భేద్యమై
మ్రోయన్ శాతశిలీముఖప్రకరసంబుద్ధేద్ధవిద్యుద్యుతుల్
కాయన్, సంగరవీధి రక్తజలదాకారంబుతో శత్రురా
ట్కాయంబుల్ రుధిరాప్లుతంబులుగ రక్తాంభోధి వర్షించెదన్"

ఈ పద్యంలోని భాష జటిలమే కాని ఈ భాష అర్థము కాకపోయినా పద్యంలో శబ్దతరంగవిన్యాసము ఉంది, భావస్ఫోరకత ఉంది. అందుచేతనే ఈ పద్యము పాడినప్పుడల్లా మళ్ళీ పాడమని సామాజికులలోనుంచి హర్షధ్వానాలు వచ్చినవి.

ఇలాంటిదే- అంతకు మునుపు రమారమి 40 సంవత్సరాల క్రిందట రచించిన హరిశ్చంద్ర నాటకములోని పద్యాన్ని ఉదాహరిస్తాను.

"చతురంభోధిపరీతభూవలయరక్షాదక్షచామీకరా
యతదండంబు ధరించు ఈ కరమె ఆహా ! ఇప్పు డిక్కాటిలో
చితిలో కాలుచునున్న యీ కొరవి దాల్చెన్ నవ్యమాణిక్యరా
జిత నీరాజనకాంతికిన్ బదులు వచ్చెన్ శోచనీయంబుగన్."

ఇందులో భాషకూడా అంతసుబోధకం కాదు.... కాని పద్యభావము లలి

తము కాగా శబ్దగాంభీర్యము ఉంది. ఇలా చెప్పుకుంటూపోతే ఉదాహరణలు అనంతము.

పద్యప్రధాననాటకాలు ప్రజలలోకి చొచ్చుకొనిపోవు- అనేది ఆధునికుల్లో కొందరి అభిప్రాయము. విషయపరిశీలన చేస్తే ఈ అభిప్రాయము సత్యదూరమని తేలుతుంది. ఈ నాటికీ సురభినాటకసమాజాలు తెలుగునేలలో ఏమారుమూల పల్లెలోనో, ప్రతిరోజూ పద్యనాటక ప్రదర్శనలు ఇస్తూనేఉన్నాయి. మొత్తము 32 సురభినాటక సమాజాలున్నవి. వీటిలో అత్యంత ఆధునిక పరికరాలతో వెలుగునీడల విన్యాసాలతో రెప్పపాటులో మారే దృశ్యాలతో, అతిసమర్థవంతంగా ప్రదర్శిస్తున్న సమాజాలు ఎన్నతగినవి ఏడెనిమిది ఉన్నవి. రెండేళ్ళనాడు ఇలాంటి సురభిసమాజము "కృష్ణలీలలు" హైదరాబాదులో ప్రదర్శించారు. ఆ నాటకము పద్యప్రధానమే ; పాటలూ ఉన్నవి. అయినా పండితులు, పామరులు, నవ్యులు ఆ ప్రదర్శనను చూచి ఆనందించారు. వారి క్రమశిక్షణను మెచ్చుకున్నారు. లిప్తలో మారుతున్నరంగాలను చూచి ఆశ్చర్యపోయారు. అతుకులబొంతలా కాకుండా సాఫీగా, ప్రజారంజకంగా నాటకాన్ని నాటకంగా ప్రదర్శించారు సురభివారు. రంగాలు, ఒకదానిలోనించి ఒకదాన్ని అతిసౌలభ్యంతో, రంగాలుమారుతున్నాయని తెలియకుండానే మారిపోయాయి. నాటకము రక్తికట్టింది. ఒహో అంటే ఒహో అన్నారు.

సురభి సమాజాలవారు సాధారణంగా వారి నాటకాలను పట్టణాలలో ప్రదర్శించరు. పల్లెల్లో వేస్తూవుంటారు. ఒక రంగములో వేషము వేసిన పాత్రధారులు మరో రంగము జరుగుతూవుంటే, రాబోయే రంగానికి కావల్సిన పరికరాలను సిద్ధము చేసికొంటారు. అతి సహజంగా నాటకాన్ని ప్రదర్శిస్తారు. వీరివి సంచార రంగస్థలాలు. ఒకేవూళ్ళో నెలలతరబడి ఒక సమాజము ప్రదర్శనలను ఇస్తుంది. రోజువిడిచి రోజు వివిధ పద్యప్రధాన నాటకాలు ఆడతారు. ఈ రోజు నాటకములో ఎల్లుండి రాబోయే నాటకము గురించి చెబుతారు. అదే వారి పబ్లిసిటీ. కరపత్రాలు, వాల్‌పోస్టర్లు లేవు. ముఖేముఖే చుట్టుపక్కల పల్లెలన్నింటికి ప్రచారము జరుగుతుంది. పల్లెప్రజలు బళ్ళుకట్టుకుని నాటకాన్ని చూడ్డానికి వస్తారు. వీరి వ్యవస్థను గురించి కొంత చెప్పుకోవాలి.

వీరి జీవిక నాటక రంగము. నాటకములో డబ్బువస్తేగానీ సమాజము బ్రతకదు. సమాజము బ్రతికితేగాని నటీనటులకు జీవనాధారము లేదు. ప్రభుత్వపు గ్రాంటులు మొదలే లేవు. ఒక సమాజములో రమారమి ఏడెనిమిది కుటుం

బాలు ఉంటాయి. ఈ కుటుంబాలకు వేర్వేరు గదులు రంగస్థలాల వెనకనే ఏర్పరుస్తారు. ఆ గదిలోనే ఆ కుటుంబము వంటచేసు కొంటుంది. తీరిక సమయా లలో దుస్తులు తెరలు వాటికి కావలసిన పరికరాలను సరిచూసుకుంటారు, చెడి పోయినవాటిని బాగుచేసుకొంటారు. వీరికి మేకప్‌వారు ఉండరు. ఎవరి మేకప్ వారే చేసుకొంటారు. కొంచెము అనుభవము కలవారు. పిల్లలపాత్రలకు మేకప్ చేస్తారు. ఇలా ప్రతిదానికి స్వశక్తిపై ఆధారపడతారు. మన ఔత్సాహిక నాటకాల వారు ఈపద్ధతులను అలవాటు చేసికొని పద్యనాటకాలను సాధనచేస్తే ఏంతో బాగుంటుంది.

వీరిది కుటుంబ నాటకరంగము కావడమువల్ల స్త్రీ బాలపాత్రలకు వెతు క్కో నవసరము లేదు. సమవయస్కులైన స్త్రీ, పురుష బాలలకు ప్రతీ నాట కములోనూ రెండుమూడు పాత్రలు కంఠస్థము. అనారోగ్యము వలన గాని, ఇతర కారణాలవల్లగాని, ఆ నాటి నాటకములో వేషము వేయడానికి వీలు కాక పోతే వెతుక్కోనవసరము లేకుండా మరొకరు ఆ పాత్రను పోషిస్తారు. ఇలాంటి సంచార కుటుంబ నాటకరంగం యావత్ ప్రపంచములోనూ ఇది ఒక్కటేనని నిర్భయముగా చెప్పవచ్చు. షేక్స్పియర్ కాలములో ఇలాంటి వ్యవస్థ ఉందేదని తెలుస్తోంది.

ఒక విధముగా ఆలోచిస్తే భరతముని సంప్రదాయాన్ని పాటిస్తున్న నాటకరంగము యావత్ భారతదేశములో ఇది ఒక్కటే. మరోమాట చెప్పుకో వాలి. పెద్దసమాజాలన్నింటికి ఒక నాటకకర్త ఉంటాడు. ఆయనే వారికి కావ ల్సిన నాటకాలను వ్రాసే కవి, సూత్రధారి. ఆయనే వారికి తగిన శిక్షణ ఇస్తారు. ఇది భరతముని పద్ధతే.

ఈ సమాజాలకు మంచిశిక్షణ ఉండటమువలననే నాటకాలు పద్య ప్రధానా లైనా భాష చాలమటుకు గ్రాంథికమైనా వీరి నాటకాలను ప్రజాసామాన్యము ఏళ్ళతరబడి నిరంతరాయంగా పోషిస్తున్నది. పద్యప్రధాన నాటకాలు వాటి ప్రాచుర్యము, ప్రభావము కోల్పేలేదని చెప్పటానికి ఇంతకన్నా తార్కాణము ఏంకావాలి ?

ప్రజలు, ప్రజలభాష అనే నినాదము మిధ్యావాదమని, ఏ ప్రజలగురించి నినాదము లేవదీస్తున్నారో ఆ ప్రజలే భాషావైవిధ్యంగల ఈ సమాజాల నాటక ప్రదర్శనలను, సమాజాలను ఈ నాటికీ పోషిస్తున్నారు. పద్యనాటకాల అవస

రము లేదనే ఆధునికుల అభిప్రాయము సరియైనది కాదని పైవిషయాలు నిరూపిస్తాయి.

పద్యప్రధాన నాటకాలు చరమదశలో ఉన్నాయనిపిస్తున్నది. ఎందువల్లనంటే ఈ నాటకాలకు ఒక కొత్త షట్టకురుపు పుట్టింది. ఇద్దరు, ముగ్గురు, నలుగురు ఒకేపాత్రను నాటకంలో పోషించడం జరుగుతున్నది. అందువల్ల పాత్ర పోషణ అనేది మృగ్యమైపోతోంది. నటులు తమ ప్రజ్ఞాపాటవాలను చూపిస్తున్నారు. కాని నాటకప్రదర్శన క్షీణిస్తున్నది. కాబట్టి పద్యప్రధాన నాటకాలకు ఘాటైన చికిత్స- కాయకల్పం లాంటిది జరగాలి. ఔత్సాహిక నాటకరంగం ఔత్సాహికుల తృష్ణను తీరుస్తుందిగాని నాటకరంగానికి నిజమైనసేవ జేయజాలదు అనేది పెద్దలందరూ అంగీకరించిన సిద్ధాంతమే। అందువల్ల ఒకబలమైన జీవిక నాటకరంగాన్ని రూపొందించాలి. ఈ కాయకల్ప చికిత్స మాటలతో అయ్యే పనిగాదు. దీనిని చేపట్టవలసిన బాధ్యత ప్రభుత్వంలోని వివిధ శాఖలు వహించాలి. ఏ తీరున ఈ జీవిత నాటక రంగపు పునరుజ్జీవనం జరగాలో మనవి చేస్తాను.

పద్యప్రధాన నాటకాలకు పట్టినదుస్థితికి మొట్టమొదటి కారణం నాటకశాలల అభావంగా ఈ వ్యాసంలో విన్నవించాను. నాటకసమాజాలూ, మంత్రులూ ఈ పరిస్థితిని అవగాహన చేసుకుని నాటకశాలలు కనీసం తాలూకాస్థాయిలో నన్నా నిర్మించాలన్నట్లు చేయాలనే భావాన్ని వ్యక్తపరుస్తున్నట్లు పత్రికలద్వారా తెలియవస్తోంది. ఇది చాలా సంతోషించాల్సిన విషయం. ఈ నాటకశాలలు రూపొందించిననాడు మళ్ళీ నాటకరంగం కొత్త ఊపిరిని పోసుకొని జీవికనాటక రంగానికి పునరుజ్జీవనాన్ని ప్రసాదిస్తుంది.

ఒక్కొక్క ఊళ్ళో ఒక్కొక్క ప్రమాణాలు గల నాటకశాలలను నిర్మిస్తే, ఒక నాటక శాలలో అమర్చుకున్న రంగాలంకరణ మరో నాటక శాలకు పనికిరాదు. అందువల్ల నిర్మించబోయే నాటకశాలల ప్రమాణాలు ఒకే సాంకేతిక స్థాయిలో ఉండాలి. ఇది ఎలా నిర్మించాలి అనే విషయాన్ని చర్చించడం ఈ వ్యాసంలో సాధ్యంకాదు.

ఈనాటకశాలలనిర్మాణాన్ని ప్రణాళికా శాఖ, సాంస్కృతిక వ్యవహారాల శాఖలు పరస్పరసహకారంతో నిర్మించడంమంచిది. ప్రజాసహకారంకూడా తీసుకుని ఈరంగశాలలనిర్మాణం సత్వరంజరిగేటట్లు చూడాలి.

పద్యప్రధాననాటకాలు ప్రాతిపదికగా గల జీవికనాటకరంగం పునరుద్ధరింపబడాలి. ఇదేమిటి? ఇరవయ్యోశతాబ్దం మూడొంతులు గడచిపోయినతరువాత ఈపాతచింతకాయపచ్చడి మాటలేమిటని కొట్టిపారేయకండి. పాతచింతకాయపచ్చడి పథ్యం. జీవికనాటకరంగ కాయకల్పచికిత్సలో బాగా పనికివచ్చి నాటకరంగానికి పరిపుష్టమైన ఆరోగ్యాన్ని చేకూరుస్తుంది.

జీవికనాటకరంగానికి పునాదులువేయడాన్ని దేవ, ధర్మాదాయశాఖ ప్రారంభిస్తే బాగుంటుంది. ఎందుకంటే వారికి వసతులు వనరులుఎక్కువ ఉన్నాయి. తిరుపతి, కాళహస్తి, శ్రీశైలం, అన్నవరం, సింహాచలాలలో ప్రతినిత్యం వేలాది భక్తులు దర్శించే సుప్రసిద్ధదేవాలయా లున్నాయి. ఈదేవాలయాలకు తగినంతవరుమానంకూడా ఉంది. వీటికి చరిత్ర, స్థలపురాణ, స్థలమహాత్మ్య, చరిత్రల ఆధారాలుగా పద్యయుతనాటకాలను వ్రాయించి ప్రతిదినం ప్రదర్శించేటట్లు చేయాలి. ఈప్రదర్శనలకు ఒకజీవికనాటకసమాజాన్ని కనీసం ఈ ఐదుచోట్లనన్నా ఏర్పాటుచేయాలి. దీనివలన తెలుగువారి సంప్రదాయాన్ని కాపాడి జీవికనాటకరంగోద్ధరణా జరుగుతుంది; ప్రజలలో భక్తిభావాన్ని పెంపొందించడమూ జరుగుతుంది. మొట్టమొదట ఇవి ప్రారంభించడానికి నాటకశాలలనిర్మాణం, జీవికనాటకరంగస్థాపనకు కొంతధనవ్యయం జరిగినా, క్రమక్రమేణా ఈజీవికనాటకసమాజాలు స్వయంపోషకాలయ్యే అవకాశాలు బాగాఉన్నాయి. ఈపద్ధతి ఉభయతారకం. అటు ప్రజల్లో భక్తిభావాన్ని పెంపొందించుతుంది. ఇటు జీవికనాటకరంగానికీ దోహదకారి ఔతుంది.

ఈ కార్యక్రమాన్ని టూరిజంశాఖకూడా చేపట్టాలి. ముఖ్యటూరిస్టుకేంద్రాలలో ఆకేంద్రాలకు సంబంధించిన చరిత్ర ఉంటుంది. అంతేకాకుండా ఆ ప్రాంతాలలో విఖ్యాతిపొందినకళారీతులుంటాయి. అవి నృత్యాలుకావచ్చు, జానపదనాటకరీతులు కావచ్చు. ఉదాహరణకు విజయవాడకు దగ్గరలోనే కూచిపూడిఉంది. కూచిపూడినృత్యనాటకాలు ఇటీవల దేశంలోనూ, విదేశాలలోగూడా పేరుప్రఖ్యాతుల నార్జించాయి. వివిధ నృత్యనాటకాలను అక్కడ గాంధీకొండమీదో మరెక్కడనో దినదినం ఆడిస్తే మనకళాసంపద, ప్రదర్శనరీతులు జాతీయ, అంతర్జాతీయ యాత్రికులను ఆకర్షిస్తాయి. విజయవాడకు గాని మరి ఏయితర వినోదయాత్రాస్థలాలకుగాని వచ్చేయాత్రికులు మనదేశంగురించి మన ప్రాంతంగురించి తెలుసుకోవాలనే ఆసక్తితో వస్తారు. వారికి అలవాటయిన వినోదాలతోపాటు,

మన ప్రాంతపుచరిత్రనూ, కళలనూ వారు అవగాహనచేసుకునేసావకాశం ఏర్పాటు చేయడంద్వారా జీవికనాటకరంగానికి గట్టిపునాదులు వేయడంలో టూరిజంశాఖ ప్రముఖ పాత్రవహించాలని నాకోరిక. ఈమాదిరిగానే న్యూఢిల్లీలోని అశోకా హోటలులో భారతీయనృత్యనాటకాలు ఏర్పాటుచేస్తున్నారు. అలాగే మన నృత్య నాటకాలుగూడా ప్రదర్శింపజేయాలి. కూచిపూడి నృత్యనాటకాలు పద్యయుతాలు కావడంవల్ల ఈసూచనజేయడం జరిగింది.

పైన ఉదాహరించిన రీతులలో నాట్యశాలలు నిర్మించి, పద్యప్రధాన నాటకాలకూ జీవికకూ అవినాభావసంబంధం ఏర్పరిస్తే పద్యప్రధాననాటకాలు పునరుజ్జీవనంపొంది ఉదాత్తతను సంతరించుకొని ప్రజానీకాన్ని సక్రమమైన ప్రద ర్శనారీతులతో ఆనందపరచగలవనే ఆకాంక్షతో ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.



"పాత సంప్రదాయపు గోడలు
పడద్రోసెద వెలుతురుకోసం
తరుణత్వం మెచ్చకపోతే
తిరుగబడెద దేవునిమీద"

—దాశరథి

# సంగీతరూపకాలు - యక్షగానాలు

శ్రీ శశాంక

ఈనాడు సంగీతరూపకాలన్నవి ఎక్కువగా ఆకాశవాణి ప్రసారాలకే నియమితమై ఉన్నవి కృష్ణశాస్త్రిగారు రచించిన "విప్రనారాయణ", "క్షీర సాగర మథనం" వంటి యక్షగానాలూ, నారాయణరెడ్డిగారు రచించిన "వెన్నెల వాడ", బోయి భీమన్న రచించిన "పైరుపాట", భావనాచార్యులు రచించిన "భావనాశాకుంతలం" వంటి కొన్ని సంగీతరూపకాలు రంగస్థలంపై ప్రదర్శించబడినా ఎక్కువ భాగం ఆకాశవాణి ప్రసారాలకే నియమితమై ఉన్నవి. అయితే ఈ సంగీతరూపకాలని వచన నాటకాలు విన్నంతగా జనం వినరేమో అని, నా అనుమానం. రేడియోసెట్టుముందు కూర్చుంటే అర్థావగాహనకి అవరోధం లేకుండా వచన నాటకం సాగిపోతుంది. సంగీతరూపకంలో వచ్చే పాటలూ అందులో వాడే భాష సామాన్యుళ్ళ గందరగోళంలో ముంచివేస్తాయనుకొంటాను. కొద్దో గొప్పో సంగీతంమీద అభిమానం ఉండేవాళ్ళు విన్నా అందులోని సంగీతాన్నే తాము ఆనందిస్తారేమో కాని మొత్తం ఆ రూపక సౌందర్యాన్ని మెచ్చుకోలేరేమో। అందువల్ల ఈ సంగీతరూపకం వచన నాటకంకన్న తక్కువదేమో శక్తిలో.

సంగీత రూపకాల్లో కూడా మొదటినుంచీ చివరివరకూ సంగీతమే ఉన్న నాటకాలైతే మరీ బోర్ కొడతాయి. మళ్ళీ మధ్యమధ్య చిన్నచిన్న సంభాషణలు అక్కడా అక్కడా సన్నివేశానికి తగినట్టుగా అందమైన పాటలూ ఉన్న సంగీత రూపకాలైతే శ్రోతలకు అంత ఇబ్బంది ఉండదు. పాటలు గగనపథాల్లో తేలిస్తోంటే సంభాషణలు మళ్ళీ భూమిమీదకు తీసుకొస్తోన్నట్టు ఉంటాయి. భూదివాలమధ్య డోలగా ఊహలహేలగా సంగీతరూపకం రసజ్ఞులను ఉర్రూతలూపుతుంది.

వచనం భూమి అయితే పాట ఆకాశం. మాట ఎప్పుడూ నేలబారుగానే ఉంటుంది. పాట ఆకాశమంత ఎత్తుగా ఉంటుంది. ఎంత మామూలు మనిషి అయినా అతడికి ఊహలు ఉంటాయి. ఊహలు ఎప్పుడూ నిజాలు అందుకోలేనంత ఎత్తుగా ఉంటాయి. అందనివాటికోసం అర్రులు చాచే ఆశాజీవులకి,

ఊహాశక్తికలవారికి, రసజ్ఞులకి మాత్రమే సంగీత రూపకాలు నచ్చుతా యని భావిస్తున్నాను.

మన తెనుగునాట అనాదిగా ఉన్న యక్షగానానికీ ఈనాటి సంగీతరూపకానికీ ఎటువంటి పోలికా లేకపోయినా రెండూ సంగీత ప్రాధాన్యం వహించి ఉండడం గమనార్హం. ఇటీవల రేడియోలో సంగీతరూపకాలు వచ్చినంత విరివిగా యక్షగానాలు రాకపోయినా, రంగస్థలంమీద యక్షగానాలు ప్రదర్శింపబడుతోన్నంత విరివిగా సంగీతరూపకాలు ప్రదర్శింపబడడంలేదు. ఆ ప్రదర్శింపబడుతోన్న యక్షగానాలుకూడా ఎక్కువగా పూర్వకవి విరచితములే.

స్వర్గీయ శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి తోడ్పాటుతో, శ్రీ చింతా కృష్ణమూర్తిగారి కృషితో కూచిపూడి నృత్యం తెలుగువారి ప్రత్యేక నృత్యకళా సంప్రదాయంగా దేశంలో విశేష ఖ్యాతి నార్జించుకున్నాక, అడనేర్చిన ప్రతి నర్తకీ నేడు సిద్ధేంద్రయోగి విరచితమైన భామాకలాపాన్నో, అందులో కొంత భాగాన్నో ప్రదర్శించడం పరిపాటైంది. ఈ విధంగా ప్రాచీన యక్షగాన సంప్రదాయానికి కలిగిన పునరుజ్జీవనంవల్లా, అసలా యక్షగాన ప్రక్రియలో గల శక్తి వల్లా ఆధునిక కవులుకూడా ఆకర్షితులై యక్షగానాలు వ్రాశారు. అందులో పురాణప్రసిద్ధమైన కథల్ని మాత్రమే వస్తువులుగా స్వీకరించి వ్రాశారు. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు రచించిన శ్రీనివాస కళ్యాణం ఈకోవకు చెందినదే. మాచ్‌ఖండ్ జలవిద్యుత్కేంద్ర నిర్మాణాన్ని వస్తువుగా గ్రహించి శ్రీ వింజమూరి శివరామారావుగారు రచించిన "విద్యుల్లేఖ" వంటి నూత్నవస్తు రామణీయకాన్ని సంతరించుకొన్న యక్షగానాలు కొన్ని లేకపోలేదు.

ఇక సంగీతరూపకాలపేరు చెవిని పడగానే కృష్ణశాస్త్రి, రజని, నారాయణరెడ్డి, దాశరథి, మల్లవరపు విశ్వేశ్వరరావు వంటి కవుల పేర్లు మొదటి వరుసలో కనిపిసాయి. వీరంతా సంగీతరూపకానికి రూపురేఖలు దిద్దినవారు. అంత సంగీత ప్రాధాన్యం లేకపోయినా ఆదిలో తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు రచించిన "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి", "వరపరీక్ష", "యక్షపాత్ర", "సహజయానపంథీ", "దీక్షితదుహిత", "కవిప్రియ", "పదాంకము", "సద్వాక్యము" వంటి పద్యగేయ నాటికలు, శ్రీశ్రీ రచించిన మరోప్రపంచం "చతురస్రం" వంటి వచనగేయనాటికలూ ఈకోవకే చెందినవిగా భావించవచ్చు.

ఆకాశవాణిలో మొట్టమొదటి సంగీతరూపకం "బిల్హణీయం" మల్లవరపు విశ్వేశ్వరశాస్త్రిగారే వ్రాసినా, సంగీతరూపక పరిణతికి శ్రీ కృష్ణశాస్త్రిగారి

కృషే ప్రధానమైనదిగా చెప్పాలి. వారు రచించిన "శర్మిష్ఠ", "ఊర్వశి", "విద్యావతి", "ధనుర్దాసు", "గుహుడు", అండాళ్ళు కళ్యాణం", "దక్ష యజ్ఞం" మొదలైన సంగీతరూపకాలు పద్య గద్య మిశ్రితమై విశేషంగా ప్రజాదరణ పొందినవి. ముఖ్యంగా వారి "వసంతోత్సవం" వారి సంగీత రూపకాలన్నిటిలోకీ మకుటాయమైనది ఉమర్ ఖయ్యాం జీవితం ఆధారంగా వారు రచించిన అతిథిశాల అన్న సంగీతరూపకంలోని పాటలలో వారు వాడిన ఉర్దూ, అరబ్బీ, పారశీకపదాలు, అందుకు అనుగుణంగా రజనికూర్చిన సంగీతం వింటోంటే మన మా ఉమర్ ఖయ్యాం కాలంలో జీవిస్తోన్నట్లే ఉంటుంది.

"రావెసాకీ, సాకీ" అన్నపాటా, "తళుకుజలతార్ బుటా లద్దిన నీల వలయమ్మీ గుడారం, అఖిల సుఖదమ్మీ బిడారం, చేయిచేయి మెయిమెయి తగిలిచి చెంతనే ఉండాలి ప్యారీ, చెలియమే మాపాలి హోరీ" అన్న పాటా నా మనస్సులో ఇప్పటికీ మారుమ్రోగుతోనే ఉంటాయి.

ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రంలో Spoken word Producer గా చేరిన తర్వాత దాశరథితో కలిసి వ్రాసిన "కొత్తకోవెల" అన్న సంగీత రూపకంలోని 'నారాయణ, నారాయణ అల్లా అల్లా' అనే పాట, 'కమ్మగా బ్రతికితే గాంధీయుగం' అనే పాటా తెలుగువారి హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోయాయి. ముఖ్యంగా 'నారాయణ, నారాయణ అల్లా అల్లా' అన్న పాట భారతీయ భాషలన్నిటిలోకీ పరివర్తింపబడింది. 'రాజఘట్టం' గాంధీజీ హత్యని ప్రధానేతి వృత్తంగా గ్రహించిన సంగీత రూపకం.

మొత్తంమీద హైద్రాబాద్ ఆకాశవాణిలో ప్రవేశించిన తర్వాత భావకవి అయిన కృష్ణశాస్త్రిగారు ప్రజాకవిగా మారిపోయినట్టు తోస్తుంది వారి సంగీత రూపకాల్ని పరికిస్తే.

"చౌరాస్తా" అనే సంగీత రూపకాన్ని పరికిస్తే హైద్రాబాద్ నగర జీవితాన్ని ఆయన ఎంత సునిశితంగా పరిశీలించారో మనకు అవగత మవుతుంది. అందులో నగరంలోని రిక్షావాలా, గుమాస్తా—పెద్ద మనుషుల జీవితాన్ని ఎంత వాస్తవికంగానో వర్ణించారు.

చౌరాస్తా
ఆహిస్తా
ఏక్ సవారీ చారణా
దో సవారీ ఛే అణా

సర్దీ గర్మీ ఛడావ్ ఉతార్
రిక్షా జల్దీ తొక్కేస్తా
చౌరాస్తా
ఆ' హిస్తా

అన్న పాటలో హైద్రాబాద్ భాషా, రిక్షావాలా జీవితం కళ్ళకి కట్టినట్టుగా కనిపిస్తుంది.

అలాగే విరాళోపహతుడైన నగరవాసి

గల్లీ రస్తా మోడ్ మొహల్లా
కాళ్ళసవారీ నడిపిస్తా
బతికుంటే మరి కూడెట్టా
చావంటే మరి భయమెట్టా
ఉండీ ఉండీ ఓ రో జెపుడో
హుస్సేన్‌సాగర్ దూకేస్తా

అని తన జీవిత కథనాన్ని చెప్పుకుపోతోంటే మనకు కళ్ళవెంట నీళ్ళు తిరుగుతాయి. ఏడాదిపొడుగునా, వేణుకుంజం, అనే సంగీత రూపకాల్లో గ్రామీణ వాతావరణాన్ని, పండగ వేడుకల్నీ ఎంతో సహజంగా చిత్రించారు. ఋతుచక్రం సంగీత రూపకంలో ఋతుశోభని వర్ణించారు. ఇంత వస్తు వైవిధ్యం గల శాస్త్రిగారి సంగీత రూపకాల గురించి చాలామందికి తెలియదు. అవి అన్నీ అచ్చుపడి ఎప్పుడు చేతికందుతాయా అని ఆశగా ఎదురుచూస్తూ ఉంటాను.

శాస్త్రిగారి సంగీత రూపకాలకు సంగీతం కూర్చడంవల్లా, అసలు శాస్త్రి గారికి చిన్నప్పటినుంచీ సన్నిహితంగా మసలడంవల్లా రజని కూడా చాలా సంగీత రూపకాలు వ్రాశాడు. "మధురానగరగాథ", "సుభద్రా విజయము", "మేనక", "నౌకావిహారము", "పుష్పలావికుడు", "రాసలీల", "స్వప్న సీమ", "సుమజన్మ", "నళినభ్రమరి", "శాపో అమృతవర్షిణీ", "మేఘ సందేశం", "చండీదాసు", "లకుమాదేవి", "విజయ విధాత", "ఏశ్వవీణ", "స్వైరిణి అన్నారు", "శాంతిపథము" అనే సంగీత రూపకాలు, "విశ్వవీణ" అనే పేరుతో సంపుటీకరింపబడి ప్రకటింపబడ్డాయి. ఆ సంపుటి శ్రీ కృష్ణశాస్త్రి గారికే అంకితం చేయబడింది. ఇవన్నీ నిర్వచనాలు. సంగీత మర్మం తెలిసిన వాడు కనుక రూపకాలు జావకారిపోకుండా సంగీతంతోనే నిలబెట్టుకొచ్చారు. మన రూపకాలలో "మధురానగరగాథ", "చండీదాసు", "లకుమ"

"మేఘసందేశం", "విశ్వవీణ", "స్వైరిణి అన్నారు", "శాంతిపథం" విశేషంగా మన్నన లందుకున్నవి.

ఇప్పు డాయన వ్రాస్తోన్న 'భాగ్యమతి' యక్షగానం బయటికి వస్తే సంగీతరూపరచనలో ఆయన సాధించిన పరిపక్వత సువిదితమవుతుంది.

ఈవేళ సినిమారంగంలో అగ్రశ్రేణికి చెందిన లిరిసిస్టుగా వన్నెకురావడానికి నారాయణరెడ్డి వెనుక వ్రాసిన సంగీతరూపకాలే తగిన సాధనసంపత్తిని చేకూర్చిపెట్టినవని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈయన "వెన్నెలవాడ" బహుళ ప్రచారం పొందిన సంగీతరూపకం. ఆపేరుతోనే ఆయన "దివ్వెల సంగీతం", "సంక్రాంతి" "గోకులవిహారం", "అజంతాసుందరి", "మనిషి-యంత్రం", "నవ్వనిపువ్వు" అనే రూపకాల్ని సంపుటీకరించి ప్రకటించారు. వీటిల్లో "మనిషి యంత్రం" అన్న సంగీతరూపకం రచనలోనూ, నిర్వహణలోనూ కూడా ఆధునికదృష్టిని సంతరించుకున్నది. ఇందులో యంత్రం తన అర్ధాంగంగా మారిబోయిన మానవుడు కనబడుతాడు. ఫిరంగులు తనపురోగతికి సరంగులుగానూ, పంచభూతాలను తనముంగిట్లో చిలుకలుగానూ నిలబెట్టుకున్న యంత్రం కనిపిస్తుంది. యంత్రం ఒక మదపుటేనుగైతే, మనిషి మావటివాడు కావాలన్న సందేశం వినిపిస్తుంది.

నారాయణరెడ్డి వ్రాసిన "సుగాత్రి", "దసరాపేడుకలు", "వసంతలక్ష్మి", "హరిచరణదాసి మీరా", "కర్పూరవసంతరాయలు", "కౌముదీ విహారం" వంటి సంగీతరూపకాలు ఎన్నో ఉన్నాయి. అన్నిటిలోనూ ఆయన రామప్ప అగ్రగణ్యమైనది. "రామప్ప" గుడిమీది నాగిని శిల్పం కల్పించిన ఆవేశంతో ఈరూపకం రూపకల్పన చేసుకొన్నది. వస్తుగౌరవానికి తగిన రసమయమైనరచనా, ఆరెంటికీ తగ్గ శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారి సంగీత నిర్వహణా ఈ రూపకానికి ఒక విశిష్టతని చేకూర్చినవి ఇందు పాల్గొన్న మంగళంపల్లి బాలమురళీకృష్ణ, చంద్రబాబు, చిత్తరంజన్‌ల సమైక్యకృషి ఈరూపక ప్రశస్తికి దోహదం చేసింది. మొదట్లో ఈ రూపకప్రసారం హైదరాబాద్ మద్రాస్ కేంద్రాలకే పరిమితమైనదైనా, ఆపైన ఇది హిందీలోకి అనువదింపబడి జాతీయరూపకకార్యక్రమంగా పన్నెండు భారతీయభాషల్లో ప్రసారం చెయ్యబడింది. హైదరాబాద్ ఆకాశవాణీ సంగీతరూపకాల్లో ఇంత ప్రశస్తి వహించిన సంగీతరూపకం మరొకటి లేదనే చెప్పాలి. "రామప్ప" నారాయణరెడ్డికవితా శక్తికి కీర్తిపతాక మెత్తిన సంగీతరూపకం.

దాశరథి వ్రాసిన మహోదయం స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించినది. ఇందులోని "భూదరమో సాగరమో'' అన్నపాట "మహోదయానికి ముహూర్త మిదేనోయి'' అన్నపాట, ''లేరా కనువిచ్చిరారా రారా'' అన్నపాటా దాశరథి అకలంకమైన దేశభక్తికి నిక్షేపలాలై విన్నంతమాత్రంచేతనే శ్రోతల్ని ఉర్రూతలూపుతూ ఉంటాయి. 'ఆనందభవన్' అనేరూపకం మోతీలాల్ జీవితానికి సంబంధించినది. 'రాధప్రేమ' నిర్వచన సంగీతరూపకం. ఇవికాక 'యశోధర', "మహాశ్వేత" వంటి సంగీతరూపకాలు ఎన్నో ఉన్నాయి.

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు "బలహీనులు", "కృష్ణాపుష్కరం", "మహిషాసురమర్దని" మొదలైన సంగీతరూపకాలు వ్రాశారు. వీరు వ్రాసిన గాజులబేహారికి మంచి ప్రశస్తి వచ్చింది. రవీంద్రుని "చిత్రాంగద"ఆధారంగా సాగిన వీరి తెలుగుఅనువాదం మంచి సంగీతరూపకాలలో వేర్కొనదగినది.

విజయవాడ రేడియోకేంద్రంనుంచి శ్రీ వింజమూరి శివరామారావు ఎన్నో సంగీతరూపకాలు ప్రసారం చేశారు. అక్కడినుంచే ప్రసారమైన శ్రీరామభద్రరావుగారి "దీపమాల", "వసంతశోభ", "హేమంతలక్ష్మి", "నరకాసురవధ", 'విజయాంబిక' మొదలగు సంగీతరూపకాలు గణనీయమైనవి. వీరి "నవశక్తి' ఆధునికదృష్టితో వ్రాయబడిన సంగీతరూపకం. ప్రతిఏడూ దసరా పండగల్లో దేవీమూర్తిగా కొలవబడేశక్తి మానవశక్తి అని వివరిస్తూ ఈరూపకం సాగుతుంది. దీపావళికి వ్రాసిన దీపమాల అన్ననాటకంలో చీకటిశక్తులపై కాంతి సాధించినవిజయం అభివర్ణించబడింది.

'పల్లెపట్టు' జానపదాలతో శ్రీ బి. రామరాజుగారిచే కూర్చబడి ప్రసారం చేయబడిననాటకం, ఎక్కువసంఖ్యలో సంగీతరూపకాలు వ్రాయకపోయినా గుణబాహుళ్యంచేత గొప్పవైన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి శివతాండవంవంటి సంగీతరూపకాలు బహు అరుదుగా లభిస్తాయి.

అబ్బూరి రామకృష్ణారావుగారి నదీసుందరి, వేటూరి ఆనందమూర్తిగారి అంబాపాలి, కరుణశ్రీగారి అమరావతి, కేశవపంతులు నరసింహశాస్త్రిగారి గిరిక, స్వర్గీయ నార్ల చిరంజీవిగారి భాగ్యనగరం, మేఘసందేశం చెప్పుకోదగ్గ మంచి సంగీతరూపకాలు.

సాధారణంగా సంగీతరూపకాలు సాగే ధోరణిని తప్పించాలనే ప్రయత్నంతో శ్రీ బుచ్చిబాబుగారు రచించిన అంతిమవిజ్ఞానం శ్రీ కృష్ణశాస్త్రిగారిచే

ఆయనే వ్రాయించిన 'మాటా మౌనం' అన్నవి కొత్తరకం రూపకాలు. ఇటువంటి మార్గాన్ని ఇదివరకు శ్రీ శ్రీ చేపట్టి కృతకృత్యుడైనాడు.

తామసి మౌనమ్మైతే
తారక మాట
తావియ మౌనమైతే
పూవే మాట
పొలతుక మౌనమ్మైతే
పురుషుడు మాట

అంటూ ఆమాటా మౌనం అన్నరూపకం సాగుతుంది.

రజనిలాగే అనేక సంగీతరూపకాల సంగీతనిర్వాహణలో అనుభవం గల శ్రీపాలగుమ్మి విశ్వనాథంగారూ ఎంకి అలక, కిన్నెరసాని, సంగీతపుచెట్టు వంటి సంగీతరూపకాలు ఎన్నో వ్రాశారు. నాగార్జునసాగర్ అన్న సంగీతరూపకం నాగార్జునసాగర్ వెళ్ళి అక్కడినిర్మాణంలో పాల్గొనే కూలీలు పాడుకొనే పాటల్ని రికార్డుచేసి కూర్చినది. స్వేదబిందుఅనే సంగీతరూపకం శ్రీ కృష్ణశాస్త్రిగారు వ్రాయకపోతే శ్రీ విశ్వనాథంగారు పూనుకొని వ్రాసినది. పాటలశేషమ్మ అనే వీరిసంగీతరూపకం సామాన్యంగా పూర్వం మనఇళ్ళల్లో పాడుకొనే స్త్రీలపాటలు ఆధారంగా చక్కనికథని మేళవించి అద్భుతంగా సాగిన సంగీతరూపకం.

మొత్తంమీద కొద్దోగొప్పో సంగీతాభిమానులైన కవులో సాహిత్యపరిజ్ఞానంగల సంగీతజ్ఞులో ఈసంగీతరూపకాలు వ్రాసినట్టు కనబడుతోంది. సంగీతరూపకరచనకు ఆరెంటిలోనూ తగినప్రావీణ్యం అవసరమని తోస్తుంది.

ఇటీవల నేను వ్రాసిన పచ్చతోరణం, దీపలక్ష్మి, నల్లనయ్య, వసంతశోభ మొదలైన సంగీతరూపకాల్ని, శ్రీ బాపురెడ్డి వ్రాసి ప్రకటించి ప్రసారంచేసిన ఋతురాగం, సాగరఘోషం, భావిజీవాలు, విజయహేల, కల్యాణయాత్ర, రాకెట్టు రాయబారం మొదలైన సంగీతరూపకాల్నీ, డాక్టర్ అరిపిరాల విశ్వం రచించిన అశ్వఘోషుడు సంగీతరూపకాన్నీకూడా కలుపుకుంటే చాలా సంగీతరూపకాలను పేర్కొన్నట్టుగా అవుతుంది. ఇప్పుడింతకన్న ఈవ్యాసపరిధిలోనూ, ఈకాల పరిధిలోనూ చేయగలిగిందిలేదు. ఇందులో ఆకాశవాణి విజయవాడకేంద్రంనుంచి ప్రసారమైన సంగీతరూపకాల్ని ఎక్కువగా పేర్కొనలేకపోయాను. అవీ,ఇంకా నేను మరిచిపోయినవీ అన్నీ సేకరించి ఏపాలగుమ్మి విశ్వనాథంగారివంటి వారో పూనుకొని తెలుగులో సంగీతరూపకపరిణామం అనేపరిశోధకగ్రంథాన్ని వ్రాయగలిగితే ఈశాఖకు ఎక్కువన్యాయం చేకూరుతుందని ఆశిస్తున్నాను.

# తెలుగు నాటకరంగం

శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి

అది 1949వ సంవత్సరం.

ఆంధ్రనాటకకళాపరిషత్తు ఏలూరులో పదిహేనవవార్షికోత్సవం జరుపుకుంటూన్న సందర్భంలో వెంకటగిరి అమెచ్యూరునాటకసంస్థ ఆత్రేయ రచించిన 'ఎన్.జి.ఓ.' నాటకాన్ని ప్రదర్శిస్తూన్నది. ముందువరసలోని ప్రముఖు లిద్దరు సభనుండి తమఅసమ్మతిని సూచిస్తూ నిష్క్రమించారు. వారిలో ఒకరు మద్రాసు ప్రభుత్వపు ఆర్థికమంత్రి, మరియొకరు మద్రాసు శాసనసభాధ్యక్షులు........ నాటకదర్శనంలో నిమగ్నులయినప్రేక్షకులలో ఎవరూ దీనిని గమనించినట్లు లేదు. నాటకంమీద చివరితెరపడకుండానే ప్రేక్షకులు నిర్ణయించారు ఆ సంవత్సరాని కదే ఉత్తమనాటకమని! తెలుగునాటకస్వరూపాన్నే మార్చివేస్తూ, రానున్న పదిసంవత్సరాలవరకూ ఆంధ్రనాటకరంగానికి ఆకృతి తీర్చిదిద్దిన ఉత్తమ నాటకకర్తను వెలుగులోకి తీసుకొనిరావటమే ఆనాటి నాటకప్రదర్శనంలోని ప్రత్యేకత !....

నాడు విదేశీయప్రభుత్వం స్వతంత్రభారతానికి అందించిన ఆస్తిపాస్తులు దారిద్ర్యము, అజ్ఞానము, కుతంత్రము, కుట్రమొదలయినవి అనుగమింపరానివిగా యేర్పడిన నికృష్టఆర్థికసామాజికవ్యవస్థ. ఈ వ్యవస్థలో గతి తప్పి, గత్యంతరం లేక నలిగిపోయి, అలిగిన ఆర్తుని క్షుభితాత్మవిజృంభణాన్ని ఆవిష్కృతం చేసింది ఆత్రేయ 'ఎన్.జి.ఓ.' 1947 నుండి 1957వరకూ, తనకు పూర్వ ప్రసిద్ధులయిననాటకకర్తల కున్న పాండిత్యం లేకుండానే ఆంధ్రనాటకరంగాన్ని ఉర్రూతలూగించిన, చిన్నవీ పెద్దవీ అయిన అనేకనాటకాలను ఆత్రేయ రచించారు. హిందూమహమ్మదీయసఖ్యతను ప్రతిపాదించే 'ఈనాడు', మానవజీవితాలను నిరసించిన శాస్త్రీయప్రయోగాలను సమీక్షించే 'విశ్వశాంతి', సమాజానికి వ్యంగ్యచిత్రణమైన 'కప్పలు', ప్రాచీనచరిత్రకు సమకాలీన తత్వవ్యాఖ్యానాన్నిచ్చిన ప్రతీకాత్మకరచన 'అశోకసమ్రాట్టు', భయంలోని నికృష్టతత్వాన్ని ఆవిష్కరించిన 'భయం' మొదలయినవి ఆత్రేయకలం తీర్చిదిద్దిన మరికొన్ని సుప్రసిద్ధనాటకాలు.

స్వాతంత్ర్యానికి పూర్వం పాతికేళ్ల చరిత్రలోనూ, అడపాదడపా పొడుపు జాడలు కనవచ్చినా మొత్తంమీద ఆంధ్రసాంస్కృతిక గగనరంగాన అంధకారమే పఱుచుకొని వున్నది. 1921-1946నడుమ వెలువడిన తెలుగు నాటకాలను నాలుగువిభాగాలు చేయవచ్చును.

(1) కొందరు అప్రసిద్ధులయిన నాటక కర్తలు వ్రాసిన సంఘ సంస్కార నాటకాలు. సామాన్యప్రజల నాకర్షించి బాగా డబ్బు చేసికొన్నవి.

(2) చారిత్రిక పాత్రలను, సన్నివేశాలను స్వప్రయోజనాల కోసం మార్చి కూర్చి వ్రాసినవి, సమకాలీన రాజకీయ పాక్షికతకు ప్రతిబింబాలు అయిన నాటకాలు.

(3) సుఖజీవనాన్ని సాగిస్తూ మనువు, కౌటిల్యాలను స్మరించుకొంటూ కాలం గడిపే తెలుగు సంస్కృతపండితులచే వ్రాయబడిన హైందవసంస్కృతీ పునర్వికసనాన్ని ప్రబోధించే నాటకాలు.

(4) అధికారుల నెదుర్కొలేని భీరువులూ, నిస్పృహాలు, అర్ధాకలితో అలమటించే వారూ అయిన రచయితలచే రచింపబడిన 'ప్రతిఘటనాత్మక' నాటకాలు (protest-plays). ఈ నాటకాలు మిత్రులకు వినోదాన్ని మాత్రమే కలిగించాయి కాని వెలుగుచూడ నోచలేదు.

స్వాతంత్ర్యానికి పూర్వం ఒక మూడేళ్ళ కాలం నుండీ ఆంధ్ర నాటకరంగంలో గొప్ప పరిణామాలు కలిగినవి. 1943 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి ప్రయోగాత్మక నాటకరంగం (Experimental theatre) ఏర్పాటైంది. శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతను ఆంధ్రనాటక కళాపరిషత్తు గుడివాడలో 1944 లో శాశ్వత స్థావరాన్ని యేర్పరచుకొన్నది. 1945లో బెజవాడలో గరికిపాటి రాజారావుగారి పర్యవేక్షణలో ప్రజానాట్య మండలి స్థాపింపబడింది. స్వాతంత్ర్యానంతరం, యీ రెండున్నర దశాబ్దాలలోను తెలుగునాటకరంగం మీద ఈ మూడువ్యవస్థల ప్రభావము సుస్పష్టమైనది.

ప్రజానాట్యమండలి 'ముందడుగు' 'మాభూమి' అను రెండు నాటకాలను మాత్రమే ప్రదర్శించింది. సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు యీ నాటకకర్తలు. 12 ప్రదర్శనా లిచ్చిన మీదట 'ముందడుగు' ను ప్రభుత్వం నిషేధించింది. డా. రాజారావుగారి ఆధ్వర్యంలో 'మాభూమి' అసంఖ్యాక ప్రదర్శనాల నందింది. 'మాభూమి' లో తత్వాన్ని ఆకళింపు చేసికొన

టానికి కాంగ్రెసు ప్రజానాయకులకు రెండు దశాబ్దాలు పట్టింది. కారణాంతరాల వల్ల రాజారావు వంటి నాయకులు వదలిపోగానే ప్రజానాట్యమండలి బలహీనమై రూపుమాసిపోయింది.

ఆంధ్రనాటక కళాపరిషత్తు 1929 లో స్థాపింపబడినా 1946 వరకూ సాధించినది **అంతంతమాత్రమే.** అంతకుముందు ఆరంభించి నిలిపివేసిన నాటక పోటీలను 1946 లో తిరిగి ప్రారంభించింది. ఉత్తమసాంఘిక నాటకానికి బహుమతు లేర్పరచి నాటకరచనకు, ప్రదర్శనకు, సంబంధించిన కొన్ని నియమాల నేర్పరచింది. ఎమ్. ఆర్. అప్పారావు, కాజ వెంకటరామయ్య, వసల సూర్య చంద్రరావుగార్ల సహకారంతో, 1953 లో ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడే వరకూ, ఈ సంస్థ చాలా బాగా పనిచేసింది. 1943–1963 మధ్య ఆంధ్రాయూనివర్సిటీ ప్రయోగాత్మకనాటకరంగం విశ్వవిద్యాలయ నాటకసమాజపు సహకారంతో తెలుగునాటకచరిత్రలో తీవ్రసంచలనాన్ని కలిగించింది. ఈ సంస్థలు 175 చిన్న పెద్ద నాటకాలను ప్రదర్శించాయి. వీనిలో కన్యాశుల్కం, విశ్వంకర, అల్లి ముతా అన్న మూడునాటకాలు మాత్రమే రెండుమూడు ప్రదర్శనల నందినవి. 1942–1961 మధ్య జరిపింపబడిన ఆంధ్రాభ్యుదయోత్సవాలు విద్యార్థులలోను, అధ్యాపకులలోను తెలుగునాటకప్రదర్శన, ప్రయోగాలకు సంబంధించిన వినూత్నచైతన్యాన్ని కలిగించాయి. ఈ ఉత్సవాలలో అంతర్ కళాశాలలమధ్య నాటకపుపోటీలను జరిపి ఉత్తమనాటకానికి, ప్రదర్శనకు, ఉత్తమనటీనటకులకు బహుమతు లివ్వబడేవి. ప్రయోగాత్మకనాటకరంగం యిచ్చినప్రదర్శనలలో చాలాభాగం ప్రయోగాలుగానే భాసించేవి. ప్రతాపరుద్రీయం, విశ్వంతర, వసంత సేన వంటి ప్రాచీనధోరణినాటకాలు, పౌరాణికాలకు స్వతంత్రవ్యాఖ్యానాలిచ్చిన 'ఖూని', 'అశోకం' 'చిత్రాంగి' '**యాదవప్రళయం**' మొదలయిననాటకాలూ, 'ఎన్.జి.ఓ.' 'ప్రగతి'వంటి సమస్యాత్మక నాటకాలు, 'కాళరాత్రి' 'ఫణి' వంటి అపరాధపరిశోధకనాటకాలు, '**అల్లిముతా**' 'సాలభంజిక' వంటి సంగీతరూపకాలు, 'పుత్తడిబొమ్మ' 'కన్యక' మొదలయిన గేయాత్మక మూకాభినయ రూపకాలు, రాగమంజరి, రాగహృదయం, 'మీనకన్య' 'కామిని' వంటి నృత్య సంగీతనాటికలూ, ఆంగ్లంలోనూ హిందీలోనూ ఎన్నోనాటకాలు ఈ ఉత్సవాలలో ప్రదర్శింపబడి ప్రశంసింపబడినవి. ఎందరో అధ్యాపకులు, విద్యార్థులు, ఇతరకళాకారులు ఈ సంస్థవెనుకనుండి యితోధికంగా కృషిచేశారు. 'నాటక కళాభ్యుదయానికి పాటుపడ్డారు. 1943–1963 మధ్య వివిధకళాశాలల నాటక

ప్రదర్శనలకు ముఖ్యనిర్వాహకుడుగా ఈవ్యాసకర్త పనిచేసివున్నాడు. ఇంతేకాక యీ ప్రయోగాత్మకసంస్థ నాటకకళకు సంబంధించిన అనేకరంగాలలో విద్యార్థులకు శిక్షణకూడా యిస్తూండినది.

తెలుగు నాటక వికాసానికి తోడుపడిన మరియొక సంస్థ కొప్పరపు సుబ్బారావుగారి తెలుగు లిటిల్ థియేటరు. ఈ సంస్థ నాటక కళను వివరించే అనేక తెలుగు, యింగ్లీషు పుస్తకాలతో చక్కని గ్రంథాలయాన్ని ప్రారంభించింది. ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం మరియొక సంస్థ. ఆంధ్ర నాటక కళాపరిషత్తు, సంగీతనాటక అకాడమీ, ఎ.పి. నాట్యసంఘం కలిసి నాటకోత్సవాలు జరుపుతూండేవి, నాట్యవిద్యాలయాన్ని నడిపినవి. ఈ నాట్యసంఘం ఈనాడు మరుగున పడిపోయింది. ఆంధ్ర నాటక పునర్వికాసానికి అమూల్య సహకారాన్నందించిన నాటక సమాజాలు రాజమండ్రి రాఘవ కళాసమితి, వెంకటగిరి నాటక సమాజం, బాపట్ల కళావాణి, విజయవాడ రసన సమాఖ్య, శ్రీకాకుళపు నటరాజకళామందిరం, అనంతపురపు లలితకళామందిరం, పాలకొల్లు ఆంధ్ర నాట్యమండలి మొదలయినవి.

గతించిన పాతికేళ్ళలో నాటకకళాపరిషత్తు నాటక పోటీలతోపాటు ఇరవై యితర వ్యవస్థలీపోటీలను నిర్వహించాయి. కొప్పరపు సుబ్బారావు నాటక కళాపరిషత్తు, నరసాపురం నాటక కళాపరిషత్తు, బళ్లారి రాఘవ స్మారక పరిషత్తు, గూడూరు సంస్కృతి సమ్మేళనం, లలితకళా పరిషత్తు, రాయల నాటక కళాపరిషత్తు మొదలయినవా యిరవైలో కొన్ని. సంవత్సరం పొడుగునా జరుగుతూండే యీ పోటీలలో ఏడాదికి కనీసం డజను ఉత్తమ నాటకాలు, ఉత్తమ ప్రదర్శనలు, ఉత్తమ నటకులు, ఉత్తమ రంగాలంకరణ నిపుణులూ ప్రచారానికి రావటం సంభవించింది.

తెలుగు నాటక రచనలలో ఈ పరిస్థితులలోనే కొన్ని ముఖ్య పరిణామాలు వచ్చాయి. పండితుల చేతుల్లోనుండి జారి జీవితపు వివిధ రంగాలలో పనిచేసే వ్యక్తుల చేతుల కందివచ్చింది నాటక రచనం. కర్తలు పండితులు కాకపోవటంచేత నాటకాలలో గ్రాంథికభాష స్థానే వ్యావహారికం స్థిరపడింది. 5, 7 అంకాల సుదీర్ఘ నాటకాలకు బదులు 3 అంకాలు గలిగినవీ, ఏకాంకికలూ, బహుళ ప్రచారాన్నందుకున్నాయి. సత్యాన్ని ఉన్నదున్నట్టుగా చెప్పే వాస్తవిక వాదం ప్రబలింది. నాటక ప్రదర్శన నాటక రచయిత చేతులనుండి సూత్రధారుని చేతుల కందిరావటం మరియొక విశేషం. ఈ విధంగా తెలుగు నాటకాలు

సాహిత్యపు పరిధుల నతిక్రమించి సామాన్యులకు సుబోధకమైన ధోరణులలో వ్రాయబడినవి.

స్త్రీలు స్త్రీ పాత్రలు ధరించటానికి వీలుపడని కారణంగా నాటక రచయితలు, ప్రదర్శకులు కొన్నిసమస్య లెదుర్కొనవలసి వచ్చింది. నాటక రచయితలు కొంతవరకు స్త్రీ పాత్రలు లేకుండాను, ఒకటి రెండు పాత్రలతోనూ మాత్రమే నాటకాలు వ్రాయటం జరిగింది.

నాటక వస్తువులో గొప్ప మార్పు వచ్చింది. రాజులు, రాణులు, పనీ పాటా లేని ధనిక వర్గాలవారు నాటక వస్తుప్రకరణం నుండి వైదొలగిపోయారు. అతిసామాన్యుని జీవితము, తత్సంబంధమైన సాధక బాధకాలు నాటకవస్తు పరిగణనంలో పట్టం కట్టుకున్నాయి. 'సాంఘిక చైతన్యాలు', 'కమిట్‌మెంట్' అనేది నాటకాలకు వ్యాప్తినందినవి. చదువూ సంస్కారమూ బాగా వున్నవారి నాటకాలలో సహజంగా నాటక రచయితలు కాని సిగ్మండ్‌ఫ్రాయిడ్, కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ నీషే మున్నగువారి విప్లవాత్మక భావాలు ప్రతిబింబించాయి.

అమెచ్యూర్ సంస్థల నాటకాలలో సంగీతప్రాధాన్యం లేదు. ఒకవేళ వున్నా సంభాషణలను వినిపించకుండా చేయటానికే పనికివచ్చేది. సెట్టింగులకు ప్రాధాన్యం వున్నా అవీ అంతగా బాగుండేవి కావు. ఈ విషయంలో ప్రయోగాత్మక నాటకరంగం (Experimental theatre) వారు చేసిన ప్రయోగాలు చాలా గొప్పవి. కొప్పరపు సుబ్బారావుగారి సంగీత రూపకప్రయోగం 'అల్లిముఠా' బహుళప్రజాదరణం పొందిన తదుపరి గురజాడవారి నాలుగు గేయాలు నాటకీకరింపబడి నేపధ్యసంగీతంతో మూకాభినయ రూపకాలుగా ప్రదర్శింపబడినవి. కృష్ణమాచారి తెలుగు గడ్డ, ఆంధ్ర సాలభంజిక చక్కని వ్యంగ్యసంగీత రూపకాలైనవి. ఇవికాక, కామిని, మీనకన్య, ఉషారాగం, రాగహృదయం మొదలయిన సంగీత నృత్యనాటకాలు ప్రదర్శింపబడినవి.

స్వాతంత్ర్యానికిముందే నాటక రచయితలుగా కొంత ప్రసిద్ధిని పొందిన వారు తరువాత కూడా ఉత్తమ నాటకాలను రచించారు. పాలగుమ్మి పద్మరాజు 'డాక్టర్ల వృత్తిధర్మం', బుచ్చిబాబు 'దారినపోయే దానయ్య', వావిలాల 'నాయకురాలు', సోమంచి యజ్ఞన్నగారి 'కల్యాణి' 'న్యాయం' 'పెద్దమనుషులు', ఆమంచర్ల గోపాలరావు 'విశ్వంతర' మొదలయిన రచన లీకోవలోనివి.

స్వాతంత్ర్యానంతరం కాలక్రమానుసారంగా మొదటి నాటక రచయితగా కొండముది గోపాలరాయశర్మను పేర్కొనాలి. ఇతని 'ఇదీలోకం' 'ఎదురీత' 'న్యాయం' 'ఏకదేశం' 'గౌతమబుద్ధ' మొదలయిన నాటకాలు సులభ ప్రయోగ దృష్టితో వ్రాయబడినవి. ఇతనిని అనుసరించిన తరువాతి వారు కూడా తమ నాటకాలలో స్వాతంత్ర్యానంతరం తెలుగు నాటకరంగంలో సామాన్యంగా కనిపించిన ప్రయోగాత్మక దృక్పథాన్నే ప్రతిబింబింప జేశారు. వీరందరూ యీ నూత్న దృక్పథంలో తమ రచనను ఒక మార్గంనుంచి మరో మార్గానికి, ఒక పద్ధతినుండి మరొకపద్ధతికీ, వాస్తవికవాదంనుండి ప్రతీకాత్మక వాదానికీ, దానినుండి ఛాయాత్మక వాదానికి యీమూటినీ కలిపిన మరొక వాదానికీ మార్చుకుంటూ ప్రయోగాలు చేశారు.

గోపాలరాయశర్మ, ఆత్రేయల తరువాత నవభారత యుగోదయంలో నాటకాలు రచించిన ప్రసిద్ధ రచయితలు అనిసెట్టి, పినిసెట్టి, బోయి భీమన్న, కొడాలి గోపాలరావు, బెల్లంకొండ రామదాసు, అంగర సూర్యారావు, కొర్లపాటి శ్రీరామమూర్తి, వేదాంతకవి, కె. ఎల్. నరసింహరావు, చిల్లర భావనారాయణ, నరసరాజు, గోపీచంద్, పడాల, శ్రీవాత్సవ మొదలయినవారు. వీరి నాటకాలన్నీ దేశీయములయిన వివిధ సమస్యలకు దర్పణాలై ప్రజలలో సామాజిక, ఆర్థిక, రాజకీయ చైతన్యాన్ని కలిగించినవే.

ఈ యుగంలో అధికసంఖ్యలో నాటకాలు రచించినవారిలో కొర్రపాటి గంగాధరరావు ముఖ్యుడు. చిన్నవి, పెద్దవీ, మొత్తం 88 నాటకాల కితడు కర్త. గుడ్డిలోపం, తస్మాత్ జాగ్రత, లోకంపోకడ మొదలయినవి కొన్ని యీతని నాటకాలు.

సునిశిత హాస్యము, తూచిన సంభాషణలు, గొల్లపూడి మారుతీరావు నాటకాల కలంకారాలు. ఇతని 'రాగరాగిణి' 'అనంతం' 'కళ్ళు' మొదలయిన నాటకాలు గొప్పవి.

ప్రయోగాత్మక దృక్పథంతో రచయితలు బహుళంగా ఏకాంకికలు రచించారు. రాజమన్నారు, చలం, ముద్దుకృష్ణ, సోమంచి, శ్రీవాత్సవ, కొర్రపాటి, నంది, మారుతీరావు ప్రభృతులయిన నాటకకర్తలందరూ అనేక సంఖ్యలలో ఏకాంకికా రచనల చేపట్టి నూత్న ప్రయోగాలు చేసినవారే.

నాటక రచనం మన రచయితలు చాలామందికి ఆర్థికంగా లాభించ లేదు. నాటకకర్తలకు నవలలు వ్రాయటము, సినీమా సంభాషణలు వ్రాయుటయు ఎక్కువ

లాభదాయకమని తోచింది. ప్రముఖ వారపత్రికలు నడిపే నవలల పోటీలు, బహుమతులు కూడా వారిలో యీ అభిప్రాయానికి దోహదం చేశాయి. నవల వ్రాసి కథలు వ్రాసి కనీసం మూడవ బహుమతి పొందినా నాటకం వ్రాయటం కన్నా ఎక్కువ ఆర్థికంగా బాగుపడవచ్చుననే భావం ప్రముఖ నాటకకర్త లందరిలోనూ వ్యాపించింది. నాటక రచయితలకు, రానురాను తమ నాటకం రంగస్థలాని కెక్కడమే మహద్భాగ్యమని సంతోషించవలసి వచ్చింది.

ఆంధ్రనాటకరంగానికి పట్టిన మరియొక దురవస్థ సినిమాకళాకారు లెవ్వరూ దాని నాదరించి ఆదుకోలేకపోవటం. తెలుగుసినిమారంగం తమిళ దేశంలో స్థిరపడటం దీనికి ముఖ్యకారణం. తమిళ, బెంగాలీ, హిందీ, మరాఠీ, పంజాబీ సినిమారంగాలు ఆయానాటకరంగాలకు ఇస్తున్న సహకారం ప్రశంస నీయం. తెలుగునాటకరంగం దానికి నోచుకోలేదు. ఆంధ్రదేశంలో నాటక ప్రదర్శన కనువైన థియేటరు అవకాశాలు కూడా చాలాతక్కువ. రవీంద్రభారతి వంటివున్నా ఖర్చుతోకూడుకొన్నవి.

కొత్తనాటకాలను వ్రాయించి ప్రదర్శించవలసిన బాధ్యత నిజానికి ప్రసిద్ధ సమాజాలది. కాని మన సమాజాలు ఎప్పుడో 50 ఏళ్ళక్రితం వ్రాయబడిన నాటకాలను మాత్రమే ప్రదర్శించటానికి ముందడుగు వేస్తున్నాయి. రక్తకన్నీరు ఒక్కటిమాత్రం దానికి విరుద్ధం. 16 ఏళ్ళలో ఈనాటకం 200 సార్లు ప్రదర్శింప బడింది. ఈనాటకం పొందిన బహుళప్రజాదరణకి ఒక్క నాగభూషణం వ్యక్తిత్వమే కారణమంటే అతిశయోక్తికాదు.

'నాటకప్రేక్షకులనుబట్టే నాటకప్రదర్శన ముంటుంది' అని జాన్‌సన్ అన్నది అక్షరాలాసత్యం. తెలుగుదేశంలో టిక్కెట్టులేకుండా ఎక్కడయినా నాటకప్రయోగం జరిగితే అది చూడవచ్చే ప్రజానీకం అంతంతమాత్రపు సభ్యతాసంస్కృతులు కలిగినది। అవి అంటే అట్టే పట్టింపులేనిది. ఆప్రయోగాలు గందరగోళంగా తయారవటానికి ఎన్నేనా అవకాశాలుంటాయి. ఆ పరిస్థితులలో నాటకసంఘాలుకూడా అలాంటి ప్రేక్షకుల అభిరుచిని బట్టే నాటకాలు ప్రదర్శి స్తారు కాని ఉత్తమనాటక ప్రమాణాల ననుసరించి కాదు.

చక్కని సంయమనంతో కూడిన పాత్రచిత్రణము, భావప్రదర్శనము కలిగి సాంప్రదాయిక నాటకలక్షణాలను సమన్వయపరిచే ఉత్తమనాటకాలను వ్రాసేవిషయంలో ఈనాడు ప్రపంచనాటకకర్తలందరూ కొన్నివిపరీతశక్తుల

నెదుర్కొనవలసివస్తున్నది. నేడు నాటకరంగాలలో ప్రబలిపోయిన సిద్ధాంతీకరణము, ప్రచారధోరణీ, తెంపులేనిచర్చలు నాటకకర్తల దృష్టిని నాటకరచనం నుండి దూరంచేస్తున్నాయి. తెలుగు నాటకకర్తలలో బాగాచదువుకున్నవారు, విజ్ఞానులు ప్రపంచంలోని వివిధదేశాల నాటకరంగాలలోని పరిణామాలను గ్రహిస్తూనే వున్నారు.

ఏది యేలాగున్నా 1947 తర్వాత ఆంధ్రనాటకరంగం బహుముఖంగా వికసించిందంటే సత్యదూరం కాదు. రచనాత్మకంగా నేమి, ప్రయోగాత్మకంగా నేమి, ప్రమాణ పరిమాణాలలోనేమి, తెలుగునాటకం తదితర భారతీయ భాషానాటకాలకు తీసిపోయింది కాదని ఘంటాపథంగా చెప్ప వచ్చును-తెలుగు నాటకాలు ఉత్తమ సాహితీరూపాలు కాకపోవచ్చు. కాని మంచివి :....

(స్వేచ్ఛానువాదం : శ్రీమతి వి. సీతాకల్యాణి)



"చేతులు అలసిపోతాయి
రాత అలసిపోదు.
విధి నిదరపోతుంది
విధి లిఖితం నిదురపోదు"

—డా. సి. నారాయణరెడ్డి

# దృశ్యశ్రవ్య నాటికలు

శ్రీ గొల్లపూడి మారుతీరావు

**1947** ఆగస్టు 15న ఈదేశంలో రచయితకి గొప్ప అన్యాయం జరిగిపోయింది. అదేమిటంటే_ఈదేశానికి స్వాతంత్ర్యం రావడం.అంతవరకు ఎలుగెత్తి బండగొంతుతో- నాటికలలో, నాటకాలలో, సభల్లో, ఉపన్యాసాల్లో "ఈదేశానికి స్వాతంత్ర్యం కావాలోయ్!" అని అరిచే అవసరం రచయితకి చచ్చిపోయింది. దేశస్వాతంత్ర్యానికే కాదు, దాదాపు వందసంవత్సరాలు పెంచి పోషించిన గొప్ప యితివృత్తపు దుర్మరణానికి ఆరోజు గుర్తు.

దేశస్వాతంత్ర్యాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలో ఇంకా ఈదేశానికి అర్థంకానట్టే, సమాజంలో వచ్చిన ఈగొప్పమార్పుని ఎలా వినియోగించుకోవాలో రచయితకి యింకా అర్థంకాలేదు. ఇవాళ బస్సులు తగలెట్టి, ఘెరావులు చేసే భారతీయ కర్మవీరులకీ, నాటికలు, నాటకాలూ పుంఖానుపుంఖంగా రచించే నాటకరచయితలకీ చాలాపోలిక లున్నాయి.

ఏ ప్రక్రియలోనైనా చెప్పాల్సిన సందేశం loud అయినప్పుడు ఆమేరకు ఆప్రక్రియలో బలంకూడా సన్నగిల్లుతుంది. ముఖ్యంగా నాటికలో చెప్పాల్సిన విషయం వాచ్యం అయితే రుచి చచ్చిపోతుంది. నాటిక సూచించాలి- చెప్పకూడదుమరి. స్వాతంత్ర్యోదయానికి ముందు ఏరచన తీసుకున్నా- దాస్యంలో క్రుంగుతున్న సామాన్యుడిగురించో, పట్టి పీడిస్తున్న విదేశీపాలకవ్యవస్థ గురించో కనిపిస్తుంది. నాటకంలో ప్రతిపాత్రా సంఘాన్ని తిడుతుంది. గుమాస్తా కుటుంబాన్ని సరిగ్గా పోషించుకోలేడు. ఈసంఘమే అందుకు కారణమంటాడు.దొంగ దొంగతనం చేస్తూ దొరికిపోతాడు. పాలకవ్యవస్థని తిడతాడు. కాని ఈ పాలక వ్యవస్థ ఎవరిది ? ఈసంఘాన్ని ఎవరు ఏర్పరిచారు ? మనది కాని ప్రభుత్వాన్ని విమర్శించడానికి రచయిత చేసుకున్న మెలకువ లివి. ఇది ఆ కాలానికి చెల్లింది. ఇలా వాచ్యంగా నినాదాలు చేయడం రసస్ఫూర్తిని ఎంతో కొంతమేరకు చంపుతున్నా - ఆ యితివృత్తాలు topical అయినకారణంచేత ప్రేక్షకుల్లోకి దూసుకు వెళ్ళాయి; రంజింపజేశాయి. రచనాధోరణివల్లకాక, విషయప్రాముఖ్యం కారణంగా ఆరచనలు బతికాయి.

ఇదికాక మరొక కారణంకూడా వుంది. అంతకుముందు దేశంలో ప్రసిద్ధిలో నున్నవి చాలామట్టుకు పౌరాణిక రచనలు. అవన్నీ loud plays. వాటి ప్రాముఖ్యానికి కారణం సూచనప్రాయంగా ఉన్న సందేశం, రసస్ఫూర్తిని కలిగించే పాత్రచిత్రణ, యిలాంటివి కానేకావు. నటులసామర్థ్యం– సంగీతం ప్రధానంగా నటులు ప్రేక్షకులలో సాధించిన పరపతి. ఇప్పటికీ ఆతరంవారికి పట్టుగా పద్యాలు చదివే పదిమందినటులు గుర్తుంటారుకాని, కళ్ళనిండా నీరుతిప్పే సన్నివేశం గుర్తుకురాదు. దరిమిలాను దాస్యవిముక్తి, స్వాతంత్ర్యసాధన సందేశాలుగా వచ్చినరచనలుకూడా పైనచెప్పిన నాటకాలధోరణిలోనే పద్యాలు, పాటలతో వచ్చాయి. తమకు అలవాటయిన ధోరణిలోనే ఉన్న ఆ రచనలను ప్రేక్షకులు సుఖవుగానే ఆదరించారు. నాటకాలలో రసస్ఫూర్తికంటే ప్రజలరక్తనాళాలలో దేశవిముక్తికై పొంగే వేడిరక్తం ముఖ్యంగా వాటికి విజయాన్ని సాధించి పెట్టింది.

అయితే ఆరోజుల్లో పాకాల రాజమన్నారు, నార్ల, ముద్దుకృష్ణ, అమంచర్ల గోపాలరావువంటి పెద్దలు dilated subjects ని వెదుక్కుంటూ, యీ loudness కి కాస్తదూరంగా పోయి off the beat-subjects చేపట్టారు. ముద్దుకృష్ణ (అశోకం) అమంచర్ల (హిరణ్యకశిపు) ·Anti-Theatre experiments కూడా చేశారు.

ఇది స్వాతంత్ర్యోద్యమం నాటికి తెలుగునాటకం స్థితి.

అప్పుడిక మనకు స్వాతంత్ర్యం వచ్చింది. నిన్నటివరకు ఉన్న ఒక గొప్పయితిప్పృత్తం చచ్చిపోయింది. ఇక ఈ సంఘాన్ని దుయ్యబట్టే అదృష్టం మనకిలేదు, ఈపాలకుల్ని తిట్టే అవకాశమూ లేదు. ఇవాల్టి సంఘం, పాలకవ్యవస్థ మనది. నిన్నటిదాకా స్టేజిమీద అద్భుతంగా నడిచిన melo-drama చచ్చిపోయింది. ఇప్పుడిక "మాకడుపులు యిలా మాడ్చిన ఆ దోపిడీరాయుళ్లు ఎవరు?" అంటే ప్రేక్షకులు చప్పట్లు కొట్టరు।

ఈ సంఘాన్ని మార్చాలంటే తిట్టి ప్రయోజనం లేదు. ప్రేమించాలి. ద్వేషించి ప్రయోజనం లేదు. అర్థం చేసుకోవాలి. ఇది నీయిల్లు. ఇంటికప్పు కూలుతోందని యింటికి నిప్పంటిస్తావా? నీకొడుకు తప్పుచేశాడని దూలానికి వేలాడదీస్తావా?– నిన్న నువ్వు గమనించిన దుర్మార్గానికి ఒకవ్యవస్థ కారణమయితే, యివాళ అలాగే కొనసాగుతున్న యీదుర్మార్గానికి–అవ్యవస్థలో తరిఫీదయి, ఆ అలవాట్లనుంచి బయటపడలేని నీతమ్ముడు కారణం – వాడిని వెలి

వేస్తావా? ఆ అలవాట్లనుంచి బయటపడలేని వాడిబలహీనతకి జాలిపడి, బయట పడాలనే 'జ్ఞాపకాన్ని' 'అవసరాన్ని' గుర్తుచేయడం నీబాధ్యత కాదా!

వ్యవస్థనుంచి వ్యక్తిమీదకి దృష్టి మళ్ళించాలని గుర్తించిన చాలామంది పెద్దలు తమ కలాలకు కొత్తపాళీలు తగిలించారు. ఇక తాము ఎదుర్కొనేది social problem కాదని emotional problem అని తెలుసుకున్నారు. ఇలాంటి సమస్యలను ఆవిష్కృతం చేసే కొత్తతరహా ప్రక్రియలకు- అప్పటికే దేశాన్ని ప్రభావితం చేసిన ఆంగ్ల నాటకరంగంవేపు మొరలు సారించారు. ఆ రోజుల్లోనే నికొలాయ్ గొగోల్ Inspector General కి అయిదారు అనువాదాలు, J. B. Priestly 'The Inspector calls' కి మరో అయిదారు అనుసరణలు, Gaslsworthy, Anatole Frances, Shaw- వీరంతా తెలుగు దేశంలో అవతరించారు. ఈ రచనలన్నింటిలోనూ సమాజంలో శిథిలమయిపోతున్న మానవుని వ్యక్తిత్వం, అవినీతి, అన్యాయం, స్వార్థం వీటిమధ్య నలిగిపోతున్న అమాయకుల ఆక్రోశం కనిపిస్తుంది. ఇది ఆనాటి సమాజానికి ప్రతిబింబం కాదా!

కొత్తప్రక్రియలకై విదేశాలవేపు తిరిగినవారు- ఈదేశానికి కొత్తప్రక్రియలతో పాటు కొన్నిఅరిష్టాలనూ తెచ్చారు. ఉదాహరణకి- మనదేశంలో ఎన్నడూ లేని Drawing room sets వచ్చాయి.

కుటుంబంలోని వ్యక్తులంతా భోజనానికి Dining table దగ్గర తప్ప కలుసుకోని సామాజిక వ్యవస్థలోంచి "నాటకం" సృష్టించాల్సివచ్చిందని ప్రీస్ట్లీ వాపోయారు. కాని మనం ఆ డ్రాయింగురూంని యథాతథంగా తెచ్చిపెట్టుకున్నాం. ప్రతి ఎమెచ్యూర్ నాటకంలో ఈ గదే కనిపిస్తుంది- ఇంకా ఆస్తోమతకు పెరగని ఎన్నోకుటుంబాలు మనకి కనిపిస్తున్నా!

విదేశాలనుంచి దిగుమతి అయిన మరొకవ్యక్తి నాటకాలలో నౌఖరుపాత్ర. విదేశసామాజిక వ్యవస్థలో- భార్య, భర్త ఉద్యోగంచేసుకోవలసిన అగత్యం వుంది కనుక-నౌఖరుయింటిలో ఉండడం తప్పనిసరికావచ్చు- ఇవాళ్టికీ చాలా శ్రీమంతుల యిళ్ళలో తప్ప నౌఖరుని పెట్టుకోవడం Luxury. కాని నాటకంలో మధ్యతరగతి కుటుంబీకుడి యింట్లోకూడా నౌఖరుంటాడు. ఆ నౌఖరు యజమానికంటె తెలివయినవాడయి వుంటాడు. వాడు అడిగినా అడగకపోయినా యజమానికి (ఆయనసాధారణంగా జడ్జిగారో, పోలీసుసూపరెంటో మరెవరో అయివుంటాడు.) ఉచితంగా సలహాలిస్తాడు. చాలా చక్కటిసూక్తులు చెప్తాడు.

"ఒకప్పుడు సువాసన లిచ్చాయని పువ్వులు వాడిపోయినా యింట్లో దాచు కుంటామా బాబూ ?- జీవితమూ అంతే బాబూ"?- అంటూ ఏవేవో గొప్ప సత్యాలను చెప్తాడు. అవన్నీ ఆ యజమాని విని-మధ్యమధ్య ఆ'రంగయ్యా'ను సలహాలకు అడుగుతూ వుంటాడు. ఒక్కొకసారి ఆలోచించండి. ఇలాంటి నౌఖరును చూడగానే మీకు Inevitable jeirvos, Oscarwilde నాటకాల్లోబట్లర్లు (ఉదా. The importance of being Eeornesh లో బట్లరుమెర్రిమాన్), Shaw నాటకాల్లో నౌఖర్లు (ఉదా. The Doctors' Dilama ) గుర్తుకొస్తారు- మననాటకాల్లో కనిపించే ఏ మాత్రపువాస్తవికతయినా యీ 'నౌఖరు' పణంగా పుచ్చుకున్నాడు.

ఇదికాక మరొక విచిత్రమయిన పాత్ర తెలుగుదేశానికి సరాసరి విదేశాల నుంచి దిగుమతి అయింది_ స్త్రీ। ఈ స్త్రీ జీవితాన్ని చాపలాగ పరుస్తుంది. దానిమీంచి "ఎందరో హతభాగ్యులు నడిచివెళ్లారు. తన లోపాన్ని సమాజం ముందు ఠీవిగా అంగీకరిస్తుంది. అవినీతికి తలవొంచిన స్త్రీ మనకి తెలుసునేమో కాని,యిలా బాహ్యంగా చెప్పుకొనే 'స్త్రీ'ని యింకా ఆ రోజుల్లో మనం చూసి వుండ లేదు. ఈవిడ మనకు చాలా కొత్తవ్యక్తి. ఉదాహరణకి- పునర్జన్మ, పంజరం, పంజరంలో పక్షులు__ దరిమిలాను వీటికి కార్బన్ కాపీలు పుంఖానుపుంఖంగా వస్తూనే వున్నాయి.

ఇవన్నీ విదేశీప్రభావం మనకు తెచ్చిపెట్టిన మేళ్ళతోపాటు, యిచ్చిపోయిన లొసుగులు. అందంగా కనిపించిన అమ్మాయిలో ఏ అలంకారం ఆకర్షణ నిచ్చిందో తెలియక, గుడ్డిగా అన్నిటినీ అనుకరించిన ఫలితం యిది.

ఇదికాక యింకా స్వాతంత్ర్యోదయ సంధికాలంలో వచ్చిన melo Drama— యింకా చెవులలో ప్రతిధ్వనిస్తుండగా అదే appeal కి యివాళ్టికీ అలాగే అవే యితివృత్తాలపై వందలాది రచనలు వస్తున్నాయి. ప్రేక్షకులను విసుగెత్తిస్తున్నాయి. ఒకే విధమయిన monotony ని కలిగిస్తూనే వున్నాయి. సంఘాన్ని__సంఘంలో వచ్చిన మార్పుని, సమకాలీన సమస్యనీ అసమస్యని ఆవిష్కరించడానికి చేపట్టాల్సిన ప్రక్రియనీ__అర్థం చేసుకోలేని రచయిత కలంనుంచి వచ్చే still born బిడ్డలే నేడు వస్తున్న చాలా రచనలని చెప్పాలి.

ఇవన్నీ రచనలో, ప్రక్రియలో రచయితల ద్వారా వచ్చిన మార్పులు_ మంచికో, చెడుకో.

ఇక స్వాతంత్ర్య యుగోదయంలో సాంఘిక, నైతిక దృక్పథంలో మార్పులు చూద్దాం. ఎట్టకేలకు దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. మానవుడి తలపై బాధల ముళ్ళ కిరీటం ఉండదని అంతా కలలు కన్న తరుణం ఆసన్న మయింది. కాని తీరా ఏమయింది? దేశం యింకా అలాగే వుంది. సమాజంలో సగటు మానవుడు యింకా బిత్తరచూపులు చూస్తూనే వున్నాడు. తనదయిన వ్యవస్థలో తనవాళ్ళ మధ్యే మోసపోతూ ఏడవలేక, నవ్వలేక, బిక్క చిక్కిపోతు న్నాడు. అతని కలలు క్రమంగా చెదిరిపోతున్నాయి. కళ్ళముందే కోరుకున్న స్వర్గం కరిగిపోతోంది. మనస్సులో దిగులు, నిరాశ చోటుచేసుకుంది. గాభరా పడుతున్నాడు. గందరగోళం ఎక్కువయింది. ఎవరిని ప్రశ్నించినా వినిపించు కొనే పరిస్థితిలో లేడు. దీపముండగానే అందరూ ఎవరి యిళ్లు వాళ్లు చక్కబెట్టు కుంటున్నారు. సగటు మనిషి వణికిపోతున్నాడు. జీవితంలో ఏదో మూల ఏదో విధంగా నిలదొక్కుకోవాలని అటూ ఇటూ పరుగులు తీస్తున్నాడు. చదువు కున్న చదువు ఉద్యోగానికి ఉపయోగపడటంలేదు. చేస్తున్న ఉద్యోగం ఉపా ధిని యివ్వడంలేదు. ఆకలి అవినీతివేపు చెయ్యిచూపిస్తోంది.

అయితే ఈ అవ్యవస్థను ప్రతిబింబించాల్సిన నాటకరచయిత - నిల దొక్కుకోవడం తెలీని ఆధునిక నాటకరంగంలో అంతే అవ్యవస్థలో ఉన్నాడు- ఏదో విధంగా బ్రతికిన పౌరాణిక వృత్తి నాటకరంగం గడిచి - యింకా నిల దొక్కుకోలేని అధునిక నాటకరంగంలో కొట్టుమిట్టాడుతున్నాడు. ప్రేక్షకులను యింకా తనవేపుకు పూర్తిగా ఆకర్షించుకోలేక పోతున్నాడు. ఎందుకంటే తన మీద తనకే పూర్తిగా నమ్మకం కుదరలేదు. కనక బలమయిన వృత్తి నాటక రంగం యింకా ఏర్పడలేదు. కనీసం Repertory Theatre అయినా ఏర్పడలేదు. అందుకని రెండు అవ్యవస్థల సమన్వయంగా ప్రస్తుత నాటకరంగం భాసిల్లుతోంది.

ఈ సమయంలో కేవలం escape గా - పాత నాటకాలు యిచ్చిన అను భవంతో cheap popularity కో, easy popularity కో చాలామంది రచనలు చేస్తున్నారు. ప్రోత్సాహిక నాటక సమాజాలు పెరిగాయి. రచయితలు తక్కువయారు. ఆసమాజాల ఆకలిని తీర్చే ఏపది వాక్యాల సంపుటి అయినా నాటకంగా చెలామణీ అయిపోతోంది. పరిషత్తులు బహుమతులు ఇస్తున్నాయి. ఇక ఆ రచయిత 'వర్ధిల్లు'తున్నాడే కాని పెరగవలసిన అవసరం కనిపించడం

లేదు. ఈనాటకాల్ని చూస్తున్న ప్రేక్షకులు నటుల ఉత్సాహానికి అబ్బురపడుతూ రచయితలు చూపే monotony ని అసహ్యించుకొంటున్నారు.

స్వాతంత్ర్యానికి ముందు Popular appeal కి కావలసిన Melo Drama యివాళ అవసరం. ఎందుకు? _ The spirit of man is almost situated. ఈ అంశాన్ని ఎత్తిచూపే రచనలు ఎన్ని వస్తున్నాయి? అలసిపోయి ఈడిగిలబడి, కార్చడానికి కన్నీరుకూడా లేక కూలబడిన దురదృష్ట వంతుడి కథనం రచయితగా ఏడవకుండా ఏ రచయిత చెప్తున్నాడు? ఇలా ప్రశ్న వేసుకుంటే స్వాతంత్ర్య యుగోదయంలోని నాటకరంగం కళ్ళకు కడుతుంది,

**శ్రవ్యనాటికలు**

దృశ్యనాటికల విషయంలో పైన చెప్పిన అనర్థాలలోంచే శ్రవ్యనాటికా రచయితకూడా పుట్టాడు. మనదేశంలో రేడియో నాటికకు వయస్సు తక్కువ. ఇదొక ప్రత్యేకమయిన medium గా చేపట్టి, ప్రతిభను గడించినవారు లేరు. అథవా వున్నా వేళ్ళమీద లెక్కపెట్ట గలిగినంతమంది కనిపిస్తారు. మిగతా వాళ్ళంతా దృశ్యనాటకాలు వ్రాసి - అదే కలంతో దాదాపు అదే ధోరణిలో రేడియో నాటికలు రాశారు. ఇప్పటికి ఇదే జరుగుతోంది.

రేడియో నాటిక కేవలం శ్రవణేంద్రియానికి appeal చేస్తూ రససిద్ధిని కలిగించగలగాలి. శ్రోత ఆలోచనకు - imagination కు అవకాశం ఇవ్వాలి. ఇందుకు రచయితకు ఉన్న ఆలంబన అల్లా-కేవలం భాష. ఇది చాలా జటిల మయిన ప్రక్రియ. పదునైన కత్తిమీద సాము. అయితే రంగస్థల నాటకానికి ఉన్న సౌలభ్యం దీనికి లేకపోవచ్చుగాని, దీనికి ఉన్న range రంగస్థల నాటకానికి రాదు.సహారా ఎడారిలో, బకింగ్ హామ్ పాలెస్‌లో, పూరిగుడిసెలో, ఊరి పొలిమేరలో, విమానంలో, ప్రేయసి మనస్సులో, కథానాయకుడి మెదడులో కథని నడపవచ్చు. మనస్సు తీయగలిగినంత పరుగు, వేగం యిందులో చూడవచ్చు. ఇంత Flexibility దృశ్యనాటికకు రాదు.విచిత్రంగా దృశ్యనాటికలో విసుగు కలిగించే melodrama యిక్కడ బాగా రాణిస్తుంది. రంగస్థల నాటికలో ఎదురుతిరిగే Dialouge Play రేడియో నాటికకు ప్రాణం.

అయితే రంగస్థల రచనలు చేసే రచయితలు ఈ medium యిచ్చే అవకాశాల జోలికి పోలేరు. అక్కరకు స్టేజినాటకాన్ని రేడియో నాటకం చేశారు. కొన్ని యాదృచ్ఛికంగా రాణించాయి, కొన్ని బ్రతకలేదు.

స్వాతంత్ర్యయుగోదయంలో సమాజాన్ని నాటకరంగాన్ని సమీక్షించడం పనిగా పెట్టుకున్నాను. కేవలం రచనలు, రచయితల జాబితా ఏకరువు పెట్టడం ఉద్దేశంకాదు. అయితే ఈ 25 సంవత్సరాల కాలంలో కేవలం మంచిరచనలు రాలేదని చెప్పడం అన్యాయమే అవుతుంది. కాని సమాజాన్ని సరిగ్గా ఆకళించుకొని నాటకరంగాన్ని అర్థంచేసుకొని రచనలు చేసినవారు బహుతక్కువ అని చెప్పాలి. మంచి నాటకాలు accidental గా వచ్చినవే – ఏ రచయితా రెండు మంచిరచనలు చెయ్యలేదు।

అయితే ఒకప్పుడు బాగా బ్రతికిన పౌరాణికవృత్తి నాటకరంగానికీ–యింకా రూఢిగా నిలదొక్కుకోని ఆధునిక ఔత్సాహికనాటకరంగానికి యిది సంధికాలమని చెప్పాలి–మంచినాటకరంగానికై తపన అంతటా కనిపిస్తోంది–పరిషత్తులు వెలిశాయి. ఔత్సాహికులు ఎక్కువమంది ఉన్నారు. ఇంకా సమాజాన్ని, నాటకరంగాన్ని అర్థం చేసుకొని–ఆనటుఃకి నిజమైన పనిచెప్పగలిగే రచయితలే ముందుకి రావడం లేదు. అలా వచ్చిననాడు స్వాతంత్ర్యయుగోదయం నాటకరంగానికి శుభోదయం కాగలదు.

ఒక్కమాట. ప్రస్తుతం మంచిరచనాధోరణి లేదని బాధపడడం కంటె, మంచిఉత్సాహం దేశమంతటా ఉన్నదని సంతోషపడడం మంచిది–సరైనదారి తెలిసిననాడు గమ్యం ఎంతోదూరం ఉండదు.

After all, no theatre lives on its master pieces, but between them.



'ఏ దేశసంస్కృతి అయినా ఏనాడూ కాదొక స్థిరబిందువు
వైక నదీనదాలు అదృశ్యంగా కలసిన అంతస్సింధువు'

—తిలక్




## మహతి

# పరిశీలనం

### విమర్శనాత్మక సారస్వత విలోకనం

### స్వాతంత్ర్యయుగోదయంలో

### * విమర్శ * భాష

# విమర్శ సమీక్ష

# తెలుగు విమర్శ

డా. జీ. వి. సుబ్రహ్మణ్యం

విమర్శ ముందుపుట్టి తెలుగుబిడ్డ తర్వాత పుట్టాడు. విమర్శఅంటే తెలుగువాడికి తిట్టుగా అర్థమౌతుంది పరదూషణమే పరమ వివేకంగా పలవరించే తెలుగువాడి స్వభావమే అందుకు కారణం. పరులంటే ఎవరో కాదు. తెలుగువాడికి తన కంటే ఇతరులంతా పరులే. అందులో అతనికి అన్యభాషా సాహిత్యవేత్తలకంటె ఆంధ్రభాషా సాహితీవేత్తలే పరమపర శబ్దవాచ్యులు. ఒకడు పండితుడంటే మరియొకడు ఒప్పుకోడు. ఒకడు మహాకవి అంటే మిగతావారికంతా మంట। ఇది మన జాతికి కల్గించిన మేలు:కీళ్ళ సంగతి అలా ఉంచితే తెలుగువాడికి అహంకారాన్ని అలంకారంగా అందించిందని మనం గర్వించవచ్చు.

అహంకారం ఆత్మవిమర్శ, స్వీయప్రతిభమీద విశ్వాసం ఉన్న వాడికి అలంకారమైనట్లుగా ఆవేశపరుడికి, అనుకరణశీలికి కాదు. తెలుగువాళ్లల్లో అహంకారమే అందంగా ఉన్నవాళ్ల ప్రతిరంగంలో ఒకరో ఇద్దరో కనబడతారు. కానీ, ఆనవాయితీ ప్రకారం అన్నిరంగాల్లో అందరు ఆంధ్రులూ అహంకరిస్తూనే ఉంటారు. కాదంటారని కనపడ్డవాళ్ళమీద అక్షింతలు చల్లుతూనే ఉంటారు. ఔనంటే తన జట్టులో చేరి జై కొట్టమంటారు.నోరున్నవాడిది పేరుగా రాజ్యం చెలాయిస్తుంటారు. ఇది అన్నిరంగాల్లో వలెనే సాహిత్యరంగంలో కూడా కనపడే సామాన్య లక్షణం।

తెలుగువాడికి అహంకారం కంటే ఆవేశం యెక్కువ. దీనివల్ల మన జాతికీ,సాహిత్యానికీ జరిగిన మేలెంతో హానీ అంతే కనపడుతోంది. కొత్త ఎక్కడైనా కనపడితే చాలు కో అని కూస్తాడు. కోటిగొంతుకలెత్తి కోలాటంవేస్తాడు. పదడుగులు నడిచింతరువాత తటపటాయిస్తాడు. ఇంతలో మరొక కొత్తకేక వినపడితే చాలు తనవారిని నట్టేటముంచి మరోతెప్పమీదికి దూకిపోతాడు. కొత్తొక వింతలా సాగే తెలుగువాడి సాహసయాత్రలో పాతలు పల్టీలు కొట్టటం, నేతలు పార్టీలు మార్చటం నిత్యనూతనాధ్యాయమై సాగిపోతున్నది.

తెలుగులో మంచివిమర్శ రాలేదంటే తెలుగువాడి పైస్వభావమే మొదటి కారణం. విమర్శకు మూలబీజం నిష్పాక్షికమైన, నిర్మాణాత్మకమైన, సహృ

దయభావం. ఆవేశం నిర్మాణాత్మక వివేచనానికి విరుగుడుమందు; అహంకారం పాక్షికత్వానికి పరమమిత్రము; పరనిరాకరణం సహృదయత్వానికి చావుదెబ్బ. వీటివల్ల సద్విమర్శ మొలకెత్తటమే కష్టం।

స్వాతంత్ర్యోదయంలో తెలుగు విమర్శలతకు ఈ చీడపురుగు లన్నీ పట్టాయి. అందువల్ల ఫలసాయం జాతి అవసరాలకు తీరేటంత లభించటం లేదు. దానితో విమర్శకు ధర పెరిగింది. సామాన్యుడికి అందని మ్రానిపండైంది. కాని, అందుబాటులో లేసి వస్తువుమీద ఆసక్తి ఎక్కువ. అందని ద్రాక్షపండ్లు పుల్లన అనే ఈసడింపు ఎక్కువ. తెలుగువాడు ఈ నాడు నిజమైన విమర్శను చేయలేకున్నాడు. ఒకవేళ ఎవడైనా చేస్తే 'ఎవడి కుపయోగం ఈవిమర్శ' అని అధిక్షేపిస్తున్నాడు.

ఇటువంటి అధిక్షేపాలకూ, అవహేళనకూ నోచుకున్న తెలుగు విమర్శ శాఖల్లో మొట్టమొదటిది పరిశోధన. అధునాతనాంధ్ర సారస్వతప్రక్రియలన్నింటి వలెనే పరిశోధనకూడా పాశ్చాత్యభాషాభ్యసనం వలన తెలుగు సాహిత్యవేత్తలు సాధించిన ఉత్తమకళ। పరిశోధన మౌలికసత్యాన్ని శోధించి సమన్వయించి చెపుతుంది. భాషాసాహిత్యాలు పరిశోధనకు క్రీడారంగాలు. పరిశోధనకు గతమంటే ఏవగింపు, వర్తమానమంటే అభిమానం, కొత్తఅంటే కొనవెట్టి ఉండదు. సమగ్రదృష్టితో, సత్యసాధన జిజ్ఞాసతో విలువలను నిగ్గదీయటం చేస్తుంది. ఇది సంప్రదాయదాసులకు చుక్కెదురు. సంప్రదాయ విచ్ఛేదనశీలులకు తోకచుక్క. అందువల్ల సమన్వయశీలంతో సాహిత్యాన్ని ఉపాసించే సహృదయులకు ఉపాదేయ మౌతున్నది.

పరిశోధన ప్రధానంగా విశ్వవిద్యాలయ క్షేత్రాల్లో పండినపంట। ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఇది తొలికాపు కాసింది. కవిత్వతత్త్వ విచారంతో కౌముదీ మహోత్సవం చేసుకుంది. సంహితా సర్వస్వంగా విశ్వరూప సాక్షాత్కారం చేసింది. గ్రంథరూపంగా వచ్చినదానికన్న అధ్యయనశీలంగా వచ్చిన విమర్శ విధానానికీ, పరిశోధన పరిపాకానికీ ఆంధ్రవిశ్వవిద్యాలయం తొలుత చాలాకృషి చేసింది. ప్రక్రియాప్రయోగానికి పటిష్ఠమైన పరిశోధనా విధానాన్ని రూపొందించింది. శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతం, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి వంటి ఆచార్యులు నేటి తెలుగు సాహిత్యభాషా పరిశోధనకు మంచిబాటలు తీర్చిదిద్దారు. తరువాత కోరాడ రామకృష్ణయ్యగారు

(మదరాసు విశ్వ.) గంటి జోగి సోమయాజులుగారు (ఆంధ్ర విశ్వ.) భాషా విషయకమైన పరిశోధనకు రూపురేఖలు దిద్దారు. తెలుగుసాహిత్యాన్నీ, చరిత్రనీ సమన్వయమార్గంతో వివేకించటం, వర్గీకరించటం, విశేషాంశాలకోసం శోధించటం ప్రారంభమైంది.

సాహిత్యపరిశోధన విషయంలో నేడు అగ్రతాంబూలం అందుకుంటున్నది ఉస్మానియా విశ్వవిద్యాలయం. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారల ఆధ్వర్యంలో పరిశోధన సత్రయాగంలా సాగి పోతున్నది. సాహిత్యచరిత్రలో ప్రసిద్ధయుగాలమీద సమగ్రపరిశీలనం జరిగే విధంగానూ, ప్రసిద్ధకవుల సాహిత్యంమీద ప్రామాణిక సిద్ధాంతవ్యాసాలు సిద్ధమయే విధంగానూ, ప్రత్యేక సాహిత్యాంశాలమీద విశ్లేషణాత్మక వివేకం విస్తరించే విధంగానూ, ఒకవిశిష్టప్రణాళికతో పరిశోధనం ఈ విశ్వవిద్యాలయంలో ప్రారంభమై ప్రౌఢంగా ముందుకు సాగుతున్నది. భాషాశాస్త్రాచార్యులు డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు లింగ్విస్టిక్స్ డిపార్ట్‌మెంట్‌ను మూడుపూవు లారుకాయలుగా విరియించి భాషావిషయక పరిశోధనాన్ని విశ్వవిద్యాలయంలోనేకాక అకాడమీల ద్వారా గూడ నిర్వహించి నిర్వహింపజేస్తున్నారు. ఇప్పుడు భాషావిషయకంగా ముమ్మరంగా పరిశోధన శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోకూడా సాగుతోంది. ఆచార్య జి. యన్. రెడ్డిగారి ఆధ్వర్యంలో చక్కని భాషాసిద్ధాంత వ్యాసాలు అచ్చట వెలువడుతున్నాయి. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో డా. దోణప్పగా రీశాఖను చిగురింపచేస్తున్నారు.

విశ్వవిద్యాలయాల కనుబంధంగా పరిశోధనకేంద్రాలు పనిచేస్తున్నాయి. వరంగల్లులో ఆచార్య బి. రామరాజుగారి ఆధ్వర్యంలో జానపదవాఙ్మయం క్రొత్తఊపిరి నింపుకుంటున్నది. ఆచార్య యస్వీ జోగారావుగారి ఆధ్వర్యంలో గుంటూరుకేంద్రం దేశిసాహిత్యమార్గాలకు క్రొత్తపుంతల నన్వేషిస్తున్నది. ఇంకా ఆచార్య కె. వి. ఆర్. నరసింహం, డా. కోరాడ మహదేవశాస్త్రి ప్రభృతులు సాహిత్యభాషావిషయాలలో పరిశోధనలను పర్యవేక్షిస్తున్నారు. మదరాసు విశ్వవిద్యాలయం సాహిత్యచరిత్రల నిర్మాణానికి పేరుమ్రోగింది. శ్రీయుతులు నిడదవోలు వెంకటరావు, శిష్టా రామకృష్ణశాస్త్రి గార లీ రంగంలో కృషిచేశారు.

సాహిత్యపరిశోధన ప్రధానంగా రెండువిధాలు। ఒకఅంశాన్ని క్షుణ్ణంగా పరిశోధించి ఒక నూత్న దృక్పథాన్ని ప్రతిపాదించటం, ఒక అంశంమీద వెలు

పడిన విమర్శను సమాలోకించి క్రొత్త సమన్వయంతో అనుసంధించటం. ఇందులో సాహిత్యానికి_నవ్యాలోకాన్ని ప్రసాదించేది మొదటివిధానం; సాహిత్య సమాలోచనానికి తోడ్పడేది రెండవమార్గం. విమర్శకదృష్టికి వెలువైనది మొదటి మార్గమే. అయితే నేడు విశ్వవిద్యాలయాలలో పరిశోధన ఒకవిధంగా ఉద్యోగా ర్హతలలో ఒకటైపోయింది. అందువల్ల అది అధ్యాపకులకు ఐచ్ఛికం కాకుండా అత్యవసరమైపోయింది. దానితో పరిశోధనప్రవృత్తి లేని పండితులు కొందరు బలవంతపు మాఘస్నానాలు చేస్తున్నారు. అందువల్ల పరిశోధనలో ఫలంకన్న పరిశ్రమ యెక్కువ కావటం, పరిణతంగాని ఫలితాలు వడపిందెల్లా కాపుకాయటం జరుగుతోంది. 'మంది యెక్కువైతే మజ్జిగ పల్చబడదా?' అనే లోకాపవాదుకు లోనుకావటం కూడా జరుగుతోంది. ఇక్కడ ఒకటి గమనించాలి. మొదటిరకం పరిశోధనలు సృజనాత్మకాలు. నవ్యదృష్టికి సద్యఃఫలాలు. ఇటువంటివి ఏ కళా క్షేత్రంలోనైనా పరిమితాలే. అయితే మిగిలినవి వస్తుసామగ్రిని సన్నద్ధంచేసే వాఙ్మయకోశాలు. భావితరం వాటిని జల్లెడపట్టి నిగ్గుతేల్చుకోవటానికి మూలనిక్షే పాలు. సమాచార సంపుటీకరణం పరిశోధనలో ప్రాథమికాంగం; దానిలో వర్గీ కరణకు ప్రాధాన్యం ఉంది. వినూత్న సిద్ధాంత ప్రపంచనం పరిశోధన ప్రధా నాంగం. సృజనాత్మక విమర్శ కిది మూలస్తంభం.

వినూత్న సిద్ధాంత ప్రతిపాదనకు విశ్వవిద్యాలయాలలో కొన్ని అవరోధా లున్నాయి. అందులో మొదటిది: పర్యవేక్షకులకు కొత్తదనాన్ని వెంటనే అంగీకరించే ధైర్యం సాహసం లేకపోవటం. రెండవది:క్రొత్త నన్వేషించాలన్న దృష్టి విద్యాపీఠాలకు లేకపోవటం. మూడవది : వారానికి 22 గంటలు పాఠాలు చెప్పే అధ్యాపకుడు పరిశోధన చేయవలసి రావడం. పరిశోధనకు తగినన్ని పరికరాలు లభ్యంకాకపోవటం. ఈ మూడింట్లో విశ్వవిద్యాలయ పరిశోధకుల్ని ఒకదానికంటె మరొకటి గట్టిదెబ్బ తీస్తున్నది. అందువలన పరిశోధకుడు నిర్భ యంగా చెప్పదలచుకొన్న సత్యాన్ని తన సొంతపుస్తకంలో వ్రాసుకుంటున్నాడు. విశ్వవిద్యాలయంలో డిగ్రీవచ్చే విధానాన్ని సిద్ధాంతవ్యాసంలో అనుసరిస్తున్నాడు. ఇది బాహుళ్య దృష్టితో చెప్పినమాటేకాని, సిద్ధాంతవ్యాసాల్లో నవ్యాలోకాన్ని ప్రసాదించినవి అసలు లేవనికాదు. స్వాతంత్ర్యయుగోదయంలో విశ్వవిద్యాల యాలలో మరింత బౌద్ధిక స్వాతంత్ర్యం ఉండాలనే వాదానికి హేతువులైన కారణా లివి యని తెలియచెప్పటానికి పేర్కొన్నాను.

పరిశోధనను పరిపోషిస్తున్న సంస్థలలో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి, తెలుగు అకాడమీలను ముఖ్యంగా పేర్కొనాలి. సాహిత్య అకాడమీవారు ప్రామాణిక నిఘంటువును, ప్రామాణిక సాహిత్య విమర్శను తెలుగులో వెలయించే ప్రయత్నాలు చేస్తున్నారు. తెలుగు అకాడమీ భాష, లిపి, శాస్త్రీయపరిభాష మొదలైన అంశాలలో పరిశోధన చేస్తున్నది. విశ్వవిద్యాలయాలలో ఉన్న పరిధులు, అవరోధాలు ఈ సంస్థలో లేవు కాని చేయదలచుకొన్న ప్రణాళికలను చేపట్టి చేయించే ఆర్థికవనరులు తగినన్ని లేనట్లుగా కనపడుతున్నది.

పరిశోధన విశ్వవిద్యాలయాలకే పరిమితం కాలేదు. సంస్థల వంటి వ్యక్తులున్నారు; పరిశోధనలు చేసి గ్రంథాలుగా వెలువరిస్తున్నారు. కాని, విశ్వవిద్యాలయాల పరిశోధనవిధానాన్ని జీర్ణించుకొన్న రచయితల కున్న శాస్త్రీయ విధానం వారి రచనల్లో కనపడటం అరుదు।

పరిశోధనకు విమర్శకు కొంతభేదం యిప్పటి వ్యవహార నిష్ఠమై ఉన్నది. విమర్శలో పరిశోధనలోని శోధన కంటె అంతర్మథనం ఎక్కువ; ప్రమాణ ప్రయోగాల పర్యాలోచన మెక్కువ. సమకాలీన సాహిత్యానికి విమర్శ పరిశోధనకంటె సన్నిహితంగా ఉంటుంది. కాని, మన తెలుగులో సాహిత్య విమర్శ ఆ అదృష్టాన్ని అంతగా నోచుకో లేదు. ప్రాచీన సాహిత్యం మీద వచ్చిన విమర్శతో పోల్చుకుంటే సమకాలీన సాహిత్యం మీద వచ్చింది చాల తక్కువ. ఇందుకు కొన్నికారణాలు లేకపోలేదు.

మనదేశంలో సృజనాత్మక విమర్శకులు చాల తక్కువ. మనసాహిత్యంలో ఒక క్రొత్త ప్రయోగం వెలిసిందంటే అది తెలుగు విమర్శకులు భావించి, దర్శించి జాతిని ప్రబోధిస్తే వచ్చింది కాదు. విశ్వసాహిత్యాలలో జరుగుతున్న తాత్త్వికచింతకు తెలుగు కవులు స్పందించి, క్రొత్త ప్రయోగాలు సాధిస్తున్నారు. అంటే తెలుగు సాహిత్యపు నవ్య చైతన్యానికి పాశ్చాత్య కవి విమర్శకులు కారకులౌతున్నారు. ఏ సాహిత్యంలో తన సాహిత్య విమర్శకుల ప్రబోధ శంఖారావంతో క్రొత్తసాహితీ చైతన్యం నినదిస్తుందో ఆ సాహిత్యం ఇతర సాహిత్యాలకు మార్గదర్శకత్వం వహిస్తుంది. తెగులువా రింతవరకూ ఆ భాగ్యం నోచుకోలేదు సరిగదా వచ్చిన క్రొత్త సాహిత్య ప్రయోగాలకు తాత్త్విక వ్యాఖ్యానాన్ని చెప్పే నాథుడు వారికి లేకుండా పోతున్నాడు. విమర్శకుడు కవులకన్నా ముందుండడానికి బదులు కవులకు కొన్ని దశాబ్దాల శతాబ్దాల వెనుకబడి ఉండటం జరుగుతోంది.

అందువల్లనే ఆధునిక కవులు తమకవిత్వ లక్షణాలను, ధ్యేయాలను, తత్త్వాలను, పరిధులనూ, పరిణామాలనూ కవిత్వంలోనే చెప్పుకొని సమాజాన్ని ప్రబోధించుకోవలసి వస్తోంది. తమ కవిత్వం సమకాలీన సమాజానికి అర్థం కావటం లేదని లోలోన కొంత వాపోవటానికి అవకాశం ఏర్పడుతోంది. దానితో కవితలో విమర్శ చోటు చేసుకొంటోంది. విమర్శను కవితగా వ్రాస్తే మహాకవిగా చెలామణి అయ్యే రోజులు వచ్చాయి. కవులే తమ కవితామార్గాల స్వరూప స్వభావాలను వివరించుకొనే అవస్థ వచ్చిపడింది. విమర్శ తాను వెనక పడటమే కాకుండా కవితను కూడా వెనుకబడ్డ జాతిలో కలిపి వేస్తున్నది.

ఇక పోతే, తెలుగుదేశంలో నేడు విచ్చలవిడిగా చెలామణిలో ఉన్న విమర్శశాఖ సమీక్ష. సమీక్షకు పాశ్చాత్య సాహిత్యాల్లో కొన్ని ప్రమాణాలు ఉన్నాయి. కాని, మన తెలుగులో అవేమీ కనపడటంలేదు. ప్రచురించేవా డుంటే అధికారి కాకపోయినా సమీక్షకు సాహసిస్తున్నాడు ప్రతివాడూ. అందువల్ల ప్రశంసలు, పక్షపాతాలూ, తిట్లూ, దీవెనలూ సమీక్షల్లో చోటు చేసుకుంటున్నాయి. దురదృష్టవశాత్తూ మన తెలుగు సాహిత్యరంగంలో విలయతాండవం చేస్తున్న సైద్ధాంతిక, రాజకీయ, వర్గదృక్పథాలూ, కులమత వర్గ విభేదాలూ సమీక్షలను పాక్షిక దృక్పథాలకు గురి చేస్తున్నాయి. గుణాన్ని చెప్పే ఓర్పు ఒక వైపు నశిస్తుంటే, దోషాన్ని చెప్పే ధైర్యం మరొకవైపు లోపిస్తున్నది. అందువల్ల తెలుగు సాహిత్య సమీక్ష ఎదుగవలసినంత ఎత్తు ఎదుగలేక పోతున్నది.

దీనికి సాంఘికమైన ఒక కారణం లేకపోలేదు. ఆధునిక కవులు మేము సంఘాన్ని మరమ్మత్తు చేస్తున్నామని తమ కవితల్లో లోకానికి చెప్పుకుంటున్నంతగా, సమాజంలో సవ్యమైన సాహిత్య చైతన్యాన్ని సృష్టించటానికి కృషి చేయటంలేదు. సామాన్య మానవుడికి సాహిత్యంలో పట్టాభిషేకం చేశామని ప్రచారం చేసుకోవటమే కాని సామాన్యుణ్ణి తమ సాహిత్యాస్వాదనానికి ఎంత వరకు సమాయత్తం చేస్తున్నదీ గమనించటం లేదు. అందువల్లనే ఆధునిక కవి సమ్మేళనం పెడితే పట్టుమని పదిమంది సభ్యులు రావటం గగనమౌతున్నది. సమాజంలో సాహిత్య చైతన్యాన్ని కల్పించే సాహిత్యకళలనూ, ప్రక్రియలనూ ప్రభుత్వం కూడా చిన్నచూపు చూచి, రాజకీయ ప్రచారానికి ప్రాముఖ్యం ఇస్తున్నది. దానితో తరతరాలుగా వస్తున్న సాహిత్య సంస్కారం, కవితా రసికత్వం జాతిలో నశిస్తున్నది. ఈ నాడూ బుఱ్ఱకథలన్నా, హరికథలన్నా,

పౌరాణిక నాటకమన్నా జనం విరగబడుతున్నారు. వారికి కథాకథనంద్వారా ప్రబోధం కావాలి. వినోదంలో విజ్ఞానం రంగరించి అందించాలి. శుష్కవచనం కన్నా లయబద్ధమైన వచనమో, గీతమో, పద్యమో మరేఛందమో కావాలి. నేడు మహాకవుల కావ్యాలలోని సూక్తులు ప్రజల నాల్కలపై నుండి అదృశ్యమైనాయి. సినిమాపాటలు చిందులు త్రొక్కుతున్నాయి. అందులోనూ సాహిత్యం కన్నా, పాట బాణీదే అగ్రతాంబూలం. ఈ సమాజంలో సాహిత్య రసికత్వం రావాలని కవులు పూనుకోవాలి. కవితను అనుభవించి, సమీక్షింపగలిగే ప్రాథమికార్హతైనా రచనలు, విమర్శలు వారికి కల్పించాలి. లేకపోతే కవుల కావ్యాలను కనికరించే సహృదయులు మైనారిటీ వర్గంలో పడతారు. కవితకు భీమా కంపెనీలు పెట్టే సత్కాలం త్వరలోనే రావచ్చు.

లోకంపోకడ యిలా ఉన్నా సాహిత్యపరులం గర్వించే తెలుగు విమర్శ దేశంలో లేదని పెదవి విరిచే నిరాశావాదిని కాను నేను. కట్టమంచి, రాళ్ళపల్లి, పింగళి, విశ్వనాథ, చలం, తాపీ, నిడదవోలు, గిడుగు, ఖండవల్లి, దివాకర్ల, పాటిబండ, దేవులపల్లి, శ్రీశ్రీ, ఆరుద్ర, మొదలైన విమర్శకు లెందరో ఉన్నారు.

ఈ తరంవారు ఎంత నిక్షేపాన్ని మన కందించినా, ఈరోజు మనకు సాహిత్యలోకంలో చెలామణీ అయ్యే నాణాలు కావాలి. ముందు నేటి మన అవసరాలు తీరాలి. మనతరం బ్రతకాలి.

యువకుల్లో ఈ చైతన్యం ఇప్పుడిప్పుడే ఉషఃకాంతుల్ని ప్రసరిస్తున్నది. సమకాలీన సాహిత్య సమీక్షలో సారవంతమైన విమర్శ పంటలు పండిస్తున్నారు. ప్రశంసలు వీరికి రుచించటంలేదు. ప్రమాణాలకొరకు ప్రయత్నాలు చేస్తున్నారు. నూత్న ప్రయోగాల నవనవోన్మేషాలకు నవ్యాదర్శాలను అన్వేషిస్తున్నారు. ఈ చైతన్యంలో ఒక నూత్న విమర్శశకం రూపుకడుతున్నది. సాహిత్య సహనశీలం విమర్శలో రాగాలాపనం చేస్తున్నది. అది కొంతవరకు మహతిలో వినిపిస్తున్నది.

సమీక్ష సమగ్రరూపం తాల్చేంతవరకూ, విమర్శ సమకాలీన సాహిత్య చైతన్యానికి క్రొత్తశక్తి నందించేవరకూ స్వాతంత్ర్య యుగోదయంలో పరిశోధనకే పెద్ద పీట!



# ఆంధ్ర విశ్వకళాపరిషత్తు - తెలుగులో పరిశోధన

ఆంధ్రవిశ్వవిద్యాలయ మాంధ్రుల ఆశయాలకు ఆలంబమైన కళాపరిషత్తు. విద్యావేత్తలు, తత్త్వవేత్తలు ఉపాధ్యక్షులుగా నుండి ఉజ్జ్వలాధ్యాయముల నా పరిషత్తులో నిర్మించిపెట్టిరి. కట్టమంచివారి "కవిత్వతత్త్వవిచారము" ఆంధ్రసాహిత్యవిమర్శలో నొక నూతనశకమును సృష్టించిన విమర్శగ్రంథము. రాళ్ళపల్లివారి 'వేమన' తెలుగువచనవాఙ్మయభారతికొక కల్హారమాలిక.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తులోని ఆంధ్రశాఖ చేసిన కృషి అనన్యసామాన్య మైనది. ఆంగ్లభాషాసాహిత్యాలతో సమానమైన గౌరవప్రపత్తులను విశ్వ విద్యాలయ విద్యాప్రణాళికలస్థాయిలో కల్పించుటయే కాక, సాహిత్యచరిత్రాంశ ములు, భాషావ్యాకరణాంశములలో మౌలికమైన విమర్శవిధానాలను రూపొం దించుటలో విశేషకృషి గావించినది. స్వాతంత్ర్యయుగోదయసమయానికి ఆంధ్ర శాఖ పరిశోధనాపరణములో అడుగిడినది. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, ఆచార్య గంటి జోగి సోమయాజిగారు, క్రమముగా ఆశాఖలో పరిశోధనప్రణాళి కలను సిద్ధముచేసి పర్యవేక్షణచేసియుండిరి. ప్రస్తుతము ఆచార్య కె. వి. ఆర్. నరసింహంగారు ఆంధ్రశాఖాధ్యక్షులై దానిని నిర్వహించుచున్నారు.

అచ్చట సిద్ధమైన సిద్ధాంతవ్యాసములలో ప్రచురణ మొందినవి: 1. డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావుగారి "తెలుగుసాహిత్యముపైఇంగ్లీషుప్రభావము" (1960).-ఈఅంశముపై వెలసిన మొదటిశాస్త్రీయమైన పరిశోధనగ్రంథమిది. కుంపినీవారు తెలుగుగడ్డపై నడుగిడిననాటినుండి ఆంగ్లము తెలుగువారి వాఙ్మయ సాహిత్యాలపై వైచిన ప్రభావాలను సోదాహరణముగా, సోపపత్తికముగా నిరూ పించినగ్రంథ మిది. అపూర్వములైన ఆకరములనుండి విషయసేకరణము చేయు టలోను, విషయ విశ్లేషణములోను,సమన్వయదృక్పథములోను వీరిపరిశోధనము పేరెన్నిక గనినది. 2. డా. యస్వీ. జోగారావుగారి "ఆంధ్రయక్షగానవాఙ్మయ చరిత్ర" (1961). యక్షగానము దేశీయరూపకప్రక్రియ. దానిఉత్పత్తి, వికాస, పరిణామాలను సప్రమాణముగా నిరూపించుటలోను, వెలుగుచూడని యనేక యక్షగానములను లోకమునకు పరిచయము చేయుటయేకాక, గంభీరమైనశైలిలో

వానిని ఏర్గీకరించి విమర్శించిన ఉత్తమపరిశోధనగ్రంథ మిది. యక్షగాన వాఙ్మయమున పరమప్రమాణగ్రంథము.

3. డా. కె. వి. ఆర్. నరసింహంగారి "ఆంధ్రప్రబంధము"- ప్రబంధ వాఙ్మయమును సూక్ష్మపరిశీలనదృష్టితో విమర్శించి నిగ్గుతేల్చిన యీసిద్ధాంత వ్యాసము ఆంధ్రవిశ్వవిద్యాలయాంధ్రశాఖలో పొటమరించిన తొలివిమర్శ గ్రంథసుమము.

4. డా. బొడ్డుపల్లి పురుషోత్తంగారి "తెనుఁగువ్యాకరణవికాసము" (1969) ఆ వాఙ్మయశాఖయొక్క చరిత్రను సూక్ష్మేక్షితతో పరిశీలించి నిర్మించిన తొలిప్రామాణికగ్రంథము.

5. డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారి" శ్రీనాథుడు": చారిత్రకము : ఆంధ్రీకరణము (1971)- యుగకర్తయైన శ్రీనాథుని సాహిత్యస్వరూపస్వభావ ములను, అందలిచారిత్రకాంశములను,అతని యనువాదవిధాన విశేషాంశములను విస్తారముగా వివరించినగ్రంథ మిది.

నన్నయకు పూర్వమువెలసిన శాసనములలో కానవచ్చు ఛందోవిశేషాల మీద డా. తంగిరాల వేంకట నారాయణశాస్త్రిగా రొక సిద్ధాంతవ్యాసమును వెల యించిరి. కాని అది యింకను వెలుగు చూచు భాగ్యము నోచుకొనలేదు. పరిశోధకు లెందరో యింకను పరిశోధనలు చేసినారు, చేయుచున్నారు.

అస లీయంశముపై వ్యాసము ఆచార్య కె. వి. ఆర్. నరసింహంగారు వ్రాయవలసినది. వారివ్యాసము మా కింకను చేరమిచే మాకు లభ్యమైనయంశ ముల నిందు పొందుపరచియుంటిమి. ఇందుకు పఠితలు మన్నింతురని ఆశించు చున్నాము.

—సంపాదకవర్గము.

★

# ఉస్మానియా విశ్వవిద్యాలయము-
# తెలుగులో పరిశోధన

**ఆచార్య డా. దివాకర్ల వేంకటావధాని**

పూర్వము నిజాము రాష్ట్రమున ఉర్దూ, తెలుగు, కన్నడము, మరాఠీ, తమిళము మున్నగు భాషలన్నింటిని మాటాడుప్రజ లుండుటచే ఉస్మానియా విశ్వవిద్యాలయమున నాభాషలన్నియు బోధింపబడుచుండెను. అవిగాక పార్శీ, అరబిక్, సంస్కృతము మున్నగు ప్రాచీన భాషల బోధనము జరుగుచుండెను. ప్రస్తుత మీభాషలన్నింటితోపాటు జెర్మన్,రష్యను, ఫ్రెంచి,మున్నగు పాశ్చాత్య భాషలుకూడ బోధింపబడుచున్నవి. తెలుగున 1940వ సంవత్సరము నాటికే ఆ విశ్వవిద్యాలయమున ఎం.ఏ., తరగతులు స్థాపింపబడెను. 1942వ సంవత్సరమున శ్రీ పల్లా దుర్గయ్యగారందుండి ప్రప్రథమముగా ఎం.ఏ., బిరుద పట్టము పొందియుండిరి. 1952-53 సంవత్సరమునందు పిహెచ్.డి., పట్టము పడయుటకు దగిన పరిశోధన సౌకర్యములు కల్పింపబడెను. అప్పటినుండి విశ్వవిద్యాలయమున ఆంధ్రశాఖలో పరిశోధన లవిచ్ఛిన్నముగా జరుగుచునే యున్నవి. ఇప్పటి కాంధ్రమున వివిధములైన అంశములపై పరిశోధనలు సాగించి పిహెచ్. డి. పట్టము పొందిన వారి సంఖ్య 28; ఆ పట్టమునకై సిద్ధాంత వ్యాసములను సమర్పించి ఫలితములకై యెదురుచూచుచున్నవారి సంఖ్య 4; పరిశోధన మారంభించి కొనసాగించుచున్నవారి సంఖ్య 40. ఈ వ్యాసమున నింతవరకు పిహెచ్.డి., పట్టమును బడసిన విద్వదభ్యర్థుల సిద్ధాంత వ్యాసములను గూర్చి సంగ్రహముగా తెల్పబడును.

1. తెలుగు జానపద సాహిత్యము—1955, శ్రీ బి. రామరాజుగారు. పర్యవేక్షకులు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. ముద్రితము. తెలుగు జానపద సాహిత్యమును గూర్చి రచింపబడిన విమర్శాత్మకము, సమగ్రము నైన గ్రంథ మిది. వస్తురసాదిభేదమునుబట్టి యిందు జానపద సాహిత్యమంతయు పౌరాణిక గేయములు, చారిత్రక గేయములు, మతపారమార్థిక గేయములు, గృహజీవనగేయములు, స్త్రీల పాటలు, శ్రామికగేయములు, బాలబాలికా

గేయములు, శృంగారములు, అద్భుత రసగేయములు, కరుణరసగేయ ములు, హాస్యరసగేయములు అను ప్రధాన శీర్షికలుగా విభజింపబడినది. ఇందు జానపద సాహిత్యమునందలిసారస్వత, సాంఘిక, మత, భాషా,ఛందో విశేషములన్నియు సోదాహరణముగా వివరింపబడినవి. తెలుగు జానపద సాహి త్యమును గూర్చి యింతకుపూర్వ మిట్టి ప్రామాణికమైన కృషి జరిగియుండ లేదు.

2. ప్రాఙ్నన్నయ యుగము, నన్నయభారతము—1936 – దివాకర్ల వేంకటావధాని— పర్య. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు — ముద్రితము. ప్రాక్చాళుక్యయుగమునందలి ఆంధ్రభాష, పూర్వచాళుక్యయుగము నందలి ఆంధ్రవాఙ్మయ స్వరూపము, చాళుక్యయుగమునందలి భాష, నన్న యకు పూర్వము ఛందస్సు, మార్గదేశీకవిత్వములు,నన్నయ 'ఆది కవిత్వము', భారతరచనకు పూర్వరంగము, నన్నయ అనువదించిన సంస్కృత భారతప్రతి, నన్నయ అనువాద పద్ధతి, అవతారిక, నన్నయ కవితారీతి, శైలి, నన్నయ భారతమునందలి భాషా విశేషములు, నన్నయ చిత్రించిన రాజరాజు, చాళుక్యుల కాలమునాటి రాజకీయ మతపరిస్థితులు, ఆంధ్ర శబ్ద చింతామణి ఆరణ్యపర్వ భాషముల కర్తృత్వము అనునవి యీ గ్రంథమునందలి ముఖ్యవిభాగములు. ఆంధ్రభాషపుట్టుపూర్వోత్తరములు, నన్నయకుఁ బూర్వమందలి శాసనములలోని భాషా సారస్వతముల స్వరూపము, నన్నయరచనల యందలి భాషా కథాకథన రస పాత్ర పోషణచ్ఛందో విశేషములు సవిమర్శముగా వివరింపబడినవి. నన్నయ అనువాదమునకై గ్రహించిన సంస్కృత భారతప్రతి యేదైయుండు నని నిర్ణయించుటకు గ్రంథకర్త చేసిన పరిశ్రమ ప్రశంసనీయము. ఆంధ్రభాషా సారస్వతముల ఆరంభ పరిస్థితులను దెల్పు ప్రామాణికగ్రంథ మిది

3. 16 వ శతాబ్దియందలి ప్రబంధవాఙ్మయము-తద్వికాసము-1959- శ్రీ పల్లా దుర్గయ్యగారు- పర్య. ఆచార్య శ్రీలక్ష్మీరంజనంగారు- ముద్రితమగు చున్నది. ప్రబంధశబ్దార్థ విచారము, నన్నయ నుండి వెన్నెలకంటి సూరన్న వఱకు గల కవులు ప్రబంధశబ్దమును గూర్చి వెల్లడించిన అభిప్రాయములు, ప్రబంధభేదములు, నన్నయాదికవుల అనువాదపద్ధతి, అష్టదిగ్గజముల గ్రంథ ములను కూర్చి సవిమర్శకమైన సమీక్ష సంకుసాల నృసింహకవి, ఫణిభట్టు మున్నగు అనంతర ప్రబంధకవుల గ్రంథముల విమర్శ అనునవి యీ గ్రంథము నందలి ప్రధానాంశములు. ఆంధ్రప్రబంధముల స్థూలస్వరూప మను అధ్యాయ

మున శ్రీ దుర్గయ్యగారు సంస్కృతాంధ్ర లక్షణగ్రంథములనుండి ప్రమాణముల నుటంకించుచు నాంధ్రప్రబంధములందలి ప్రబంధత్వమును జక్కగా నిరూపించి యుండిరి. వారు ప్రబంధములలోని శృంగార రసాధిక్యమునుగూర్చి చర్చించి దానికి సంస్కృతకవులే ఒజ్జబంతులని నిరూపించియుండిరి. వారు ఆంధ్రవాఙ్మయమున స్వర్ణయుగముగా పరిగణింపబడు ప్రబంధయుగమునందలి గ్రంథములను సమగ్రముగా విమర్శించి యందలి గుణగణములను, దోషములను నిపుణముగా ప్రదర్శించియుండిరి. ఆంధ్రప్రబంధ సౌందర్య దిదృక్షువుల కీసిద్ధాంత వ్యాసము మణిదర్పణము.

4. తెలుగునాటకము, అవతరణము, వికాసము- 1960-శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు- పర్య. ఆచార్య శ్రీలక్ష్మీరంజనంగారు. ముద్రితము. ఇందారంభమున నాట్యోత్పత్తి, నృత్తనృత్య నాట్యములభేదము, నాట్య స్వరూపము చక్కగా వివరించబడినవి. శ్రీ అప్పారావుగారిందు ప్రాచ్యపాశ్చాత్య రూపకములను గూర్చియు, సంస్కృతాంధ్రాంగ్ల యవనరూపములను గూర్చియు సమగ్రమైన సమీక్ష కావించియున్నారు. ప్రాఙ్నన్నయ, చాళుక్య,కాకతీయ, రెడ్డి, విజయనగర, నాయకరాజుల యుగములందు సంగీతనృత్యనాట్యములెట్లు వికాసము పొందెనో వారు విశదీకరించి యున్నారు. దృశ్య వినోదముల వృత్తాంత మిందు సోదాహరణముగా నిరూపింప బడియున్నది గ్రంథకర్తగారిందు కోరాడ రామచంద్రశాస్త్రిగారితో నారంభమైన తెలుగునాటక మెట్లు వివిధ రూపముల క్రమవికాసము నందినదో సవిమర్శముగను సప్రమాణముగను ప్రదర్శించియున్నారు. ఆంధ్రనాటకముల ఉత్పత్తి వికాసముల నెఱిగించు విజ్ఞాన సర్వస్వ మని చెప్పదగిన టీసిద్ధాంతవ్యాసము.

5. తిక్కన కావ్యశిల్పము, తత్త్వదర్శనము-1960-శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రిగారు - పర్య. శ్రీ బి. రామరాజుగారు. అముద్రితము. శ్రీశాస్త్రిగారిందు మొదట తిక్కన దేశకాలములను గూర్చియు కృతులను గూర్చియు చర్చించి తరువాత కావ్యస్వరూప రసస్వరూపములను విశదీకరించిరి. పిమ్మట నిర్వచనోత్తర రామాయణమున నంగిరసము ధర్మవీర మని సప్రమాణముగ నిరూపించి యది రెండు లఘుకావ్యముల సంపుటి యని సిద్ధాంతీకరించిరి. తరువాత నిర్వచనోత్తరరామాయణము నుత్తరకాండముతో పోల్చి యందలి పాత్రపోషణ కథాకథ నౌచిత్యపోషణములను వివరించిరి. పంచమోన్మేషమున తిక్కనకావ్య నిర్మాణదృష్టి నిరూపింపబడినది. ద్వితీయఖండమంతయు భారతసంబంధి.ఎనిమి

దధ్యాయములతో కూడిన యీ ఖండమున భారతరచనయందలి విశేషము లుగ్గ డింపబడినవి. తృతీయ చతుర్థ ఖండము లొకవంక శ్రీ శాస్త్రిగారి పాండితీ పరి శోధన పాటవమునకు వేఱొకవంక తిక్కన కవితాశిల్పతత్త్వములకును దర్ప ణముల వంటివి. చతుర్థఖండమున తిక్కన భావించిన హరిహరనాథుని తత్త్వము ప్రదర్శింపబడినది. కవిబ్రహ్మ కవితాశిల్పతత్త్వముల నిశితముగను సప్రమాణ ముగను నిరూపించు నుత్తమ విమర్శగ్రంథ మిది.

6. రామరాజభూషణుని కృతులు—1961- శ్రీ కోవెల సుప్రసన్నా చార్యులుగారు-పర్య. ఆచార్య శ్రీ బి. రామరాజుగారు. అముద్రితము. ఇందారం భమున రామరాజభూషణుని జీవిత విశేషములును, కృత్యాదిపద్యములలోని విశేషములును వివరింపబడినవి. తరువాత శ్రీ సుప్రసన్నగారు వసుచరిత్ర కావ్యేతివృత్తమును గూర్చియు మూలమునకును దానికిని గల సంబంధమును గూర్చియు కథాకథనమందును, వసురాజపాత్ర పోషణమునందును ప్రబంధ నామకరణమునందును,కథాతత్త్వమును నిరూపించుటయందును రామరాజభూష ణుడు ప్రదర్శించిన ప్రతిభను గూర్చియు సమగ్రముగా విశదీకరించియుండిరి. పిమ్మట వారు కావ్యలక్షణములను పరిశీలించి ప్రబంధములందలి నాటకీయతను ప్రకటించిరి. ఒక అధ్యాయమున మను వసుచరిత్రల తులనాత్మక పరిశీలనము కావింపబడినది.రామరాజభూషణుడు సంగీతకళా రహస్యనిధి యనుట యందలి యథార్థ్యమును, ఆతనిపైగల పూర్వాంధ్ర గీర్వాణ కవుల ప్రభావమును, తరువాతి తెలుగు కవులపై వసుచరిత్రకు గల ప్రభావమును శ్రీ సుప్రసన్నగారు చక్కగా నిరూపించిరి. వారు తమిళ సంస్కృతములందు వెలసిన వసుచరిత్ర లను గూర్చికూడ పరిశీలించిరి. చివర నొక అధ్యాయమున కావ్యాలంకార సంగ్ర హమును గూర్చియు నింకొక అధ్యాయమున హరిశ్చంద్ర నలోపాఖ్యానమును గూర్చియు సప్రమాణమైన విమర్శ కావింపబడినది. రామరాజభూషణుని పాండితీ ప్రతిభావైభవములను హృదయ పరిపక్వతను ప్రదర్శించుటలో శ్రీసుప్రసన్నగా రొనర్చిన కృషి అత్యంత ప్రశంసనీయమై పరిఢవిల్లుచున్నది.

7. ఆధునికాంధ్ర కవిత్వములో సంప్రదాయము - ప్రయోగము-1972. శ్రీ సి. నారాయణరెడ్డిగారు. పర్య. ఆచార్య లక్ష్మీరంజనంగారు- ముద్రితము. శ్రీ రెడ్డిగా రిందు మొదట సంప్రదాయ ప్రయోగము లననేమో వివరించి,కవిత్వ స్వరూపమును ప్రదర్శించి, ప్రాచీనాంధ్ర కవిత్వమునందలి నవీన రీతులను

ప్రకటించియుండిరి. ఆధునిక కవితాయుగమునకు గురజాడ రాయప్రోలు లిరు వురును కర్తలే యని వారు తీర్మానించిరి. ప్రాచ్యపాశ్చాత్యాలంకారిక దృక్పథ ములను సమన్వయమొనరించి వారు భావకవితాయుగమునందలి కవులను గూర్చియు తత్కృతకావ్యములను గూర్చియు సమగ్రమైన పరిశీలనము కావించిరి. అభ్యుదయ కవితావతరణ వికాసములను వివరించి వారు శ్రీశ్రీ నాయకత్వమును, తత్ప్రతిభా విశేషమును సోదాహరణముగా నిరూపించిరి. అనంతరము వర్తిల్లిన ప్రయోగశీలమైన అధివాస్తవిక ధోరణిని గూర్చియు, శ్రీ నారాయణబాబు, ఆరుద్ర మున్నగు కవుల చిత్రకవితారచనను గూర్చియు పాశ్చాత్య లక్షణపూర్వకముగా వారు కావించిన చర్చ యపూర్వమైనది. అనంతరము వారు ఇతినవ్యకవితారీతులను గూర్చికూడ సంగ్రహసమీక్ష కావించిరి. కవితకు క్రొత్తపాతల మేలుకలయిక ఉపాదేయమనియు, క్రొత్తరీతుల తనలో నిముడ్చుకొని ప్రగతి సాధింపవలె ననియు వారి యాశయము. ఆధునికాంధ్రకవితా స్వరూప దర్శనమున కమూల్యాదర్శ మని చెప్పదగినది యుత్తమ సిద్ధాంత వ్యాసము.

8. ఆంధ్ర నవలా సాహిత్య పరిణామము – 1962– శ్రీ బి.వి కుటుంబ రావుగారు – పర్య. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు – ముద్రితము. తెలుగునందలి నవలల సమగ్రసమీక్షతో గూడిన ప్రథమ విమర్శ గ్రంథమిదే. ఇందలి ప్రథమ భాగమున శ్రీ కుటుంబరావుగారు స్వదేశీయ పూర్వరంగమును గూర్చి చర్చించి సంస్కృతాంధ్రములందలి నవలల తొలిదశను వివరించిరి. తరువాత వారు పాశ్చాత్యభాషలందలి నవలల పరిణామమును పేర్కొని 1920 నుండి 1947 వరకు తెలుగున నవలారచన ఎట్లు పరిణామము చెందెనో వివరించిరి. పిమ్మట వారు 1947 తరువాత వెలువడిన విస్తృతమైన నవలా వాఙ్మయము స్వరూపమును చక్కగా విశ్లేషించి ప్రదర్శించిరి. అనంతరము వారు 1953 నుండి 1957 వరకు రచింపబడిన నవలల తీరుతెన్నులను గూర్చియు, కొందరు నవలా కర్తలను గూర్చియు, కొన్ని నవలలలోని విశిష్ట పాత్రలను గూర్చియు, గుణవంతములైన కొన్ని ప్రత్యేక నవలలను గూర్చియు వివరించి నవలా వాఙ్మయము పొందిన ప్రగతినంతను విపులీకరించిరి. ఈ బృహత్సిద్ధాంత వ్యాసమున రాజకీయ, సాంఘిక, శిల్పప్రధాన, నాటకోచిత, ప్రచారక, వాస్తవిక, సంఘర్షణాత్మక, వర్ణనాత్మక, హాస్యప్రధాన, పాఠ్య

గ్రంథోచిత, చలనచిత్ర సంబంధి, లైంగిక, కాపరాధ పరిశోధనాత్మక నవలల స్వరూపము చక్కగా నిరూపింపఁబడినది. ఆధునికాంధ్ర వాఙ్మయమున విస్తృత భాగము నాక్రమించు నవలలందలి వైవిధ్య వైశిష్ట్యములను ప్రదర్శించుటలో శ్రీ కుటుంబరావుగారు చూపిన పరిశోధన పాటవ మపూర్వమైనది.

9. పానుగంటివారి సాహిత్యసృష్టి- 1963 - శ్రీ ముదిగొండ వీరభద్ర శాస్త్రిగారు - పర్య. ఆచార్య బి. రామరాజుగారు - ముద్రితము. ఆధునికాంధ్ర రచయితలలో కీ. శే. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి కున్న స్థానము విశిష్టమైనది. వారి సాహిత్యమును పరిశీలించుట కుద్దేశింపబడిన యీ సిద్ధాంత వ్యాసమును శ్రీ శాస్త్రిగా రైదధ్యాయములుగా విభజించిరి. ప్రథమాధ్యాయమున శ్రీ పంతులుగారి జీవిత విశేషములు వివరింపబడినవి. ద్వితీయాధ్యాయమున పంతులుగారు రచించిన బహునాటకములను గూర్చియు, వారి సన్నివేశ కల్పన, పాత్రచిత్రణ సంభాషణ రచనా ప్రాగల్భ్యమును గూర్చియు, నాటకమున పద్యములను వ్రాయు విషయమున వారికిఁగల అభిప్రాయములను గూర్చియు, వారి నాందీ ప్రస్తావనలను గూర్చియు, నాటకకర్తగా వారికి గల స్థానమును గూర్చియు విశదీకరింపబడినది. తృతీయాధ్యాయమున సాక్షి - ఉపన్యాసములు, అందలి సంఘ సంస్కరణము, స్పెక్టేటరుకు దానికిగల సంబంధము, అందలి కథలు, పంతులుగారు రచించిన యితర కథలు మున్నగువాని సమీక్ష కలదు. చతుర్థాధ్యాయమున సోదాహరణముగా పంతులుగారి హాస్యరచనా విధానము పరిశీలింపబడినది. పర్యాలోకన మను పంచమాధ్యాయమున పంతులుగారి కవితా ప్రతిభ, రసపోషణము, భాషాశైలులు, లోకజ్ఞత, వ్యక్తిత్వము మున్నగు విషయములు సవిమర్శముగా వెల్లడి చేయబడినది. ప్రతిభాపాదోనిధులైన పానుగంటివారి రచనలను గూర్చి విద్వన్మనోరంజకముగా కావింపబడిన సమగ్ర సమీక్ష యీ సిద్ధాంత వ్యాసము.

10. ఆంధ్ర మహాభారతము – ఛందోలంకార శిల్పము – 1964 – శ్రీ పాటిబండ మాధవశర్మగారు- పర్య. ఆచార్య దివాకర్ల వేంకటావధాని – ముద్రితము. శ్రీ శర్మగా రీ సిద్ధాంత వ్యాసమున ఛందస్సంబంధులగు నపూర్వ విషయముల నెన్నింటినో విశదీకరించి యున్నారు. ఇందలి ప్రథమాధ్యాయమున ఛందస్తత్త్వానుశీలనము కావింపబడినది. ఛందోనిర్వచనము, ఛందోవతారము, ఛందోవృత్తిరీతులు, ఛందఃప్రయోగౌచిత్యము అనునవి యిందలి ముఖ్య

విషయములు. అలంకరణానుశీలనాత్మకమైన యిందలి రెండవ అధ్యాయమున ప్రాసానుప్రాసాదులు యతులు కావ్యమునకు కలిగించు సౌందర్యమును, కవిత్రయమువారు శిల్పసంపచ్ఛోభితముగా వానిని మహాభారతమున ప్రయోగించిన భంగియు వివరింపబడినవి. మూడవ అధ్యాయమున రసానుశీలనము కావింపబడినది. ఇది యీ గ్రంథమున కాయువుపట్టు. ఇరువదియారు ఛందము లందు పుట్టు అపారములైన వృత్తములలో ఏరసమున కేసందర్భమున నే వృత్తము వాడుట ఉచితముగా నుండునో ఇందు సోదాహరణముగా నిరూపింపబడినది. కవిత్రయమువారు పాటించిన వృత్తౌచిత్య మిందు ప్రదర్శింపబడినది. నాల్గవ అధ్యాయమున ఛందస్సంవాదము మున్నగు విషయములు చర్చింపబడినవి. ప్రసక్తానుప్రసక్తముగా నిందు రసాలంకార శిల్పములు కూడ చోటు చేసికొన్నవి. ఛందోరహితముగనే వలువురు యువకులు రచనలు సాగించుచున్న యీ రోజులలో శ్రీ శర్మగారు వేదకాలమునుండి నేటివరకు ఛందస్సునుగూర్చి వ్రాయబడిన గ్రంథములన్నియు చదివి, మౌలికతతోడను అపూర్వ విషయ విన్యాసముతోడను గూడిన యీ ఉద్గ్రంథమును రచించి ఛందః శాస్త్రజిజ్ఞాసువులకు మహోపకారము కావించి యున్నారు.

11. ఆంధ్ర వచన వాఙ్మయోత్పత్తి వికాసములు- (18 వ శతాబ్ది అంతమువఱకు)- 1964- శ్రీ మడుపు కులశేఖరరావుగారు- పర్య. ఆచార్య దివాకర్ల వేంకటావధాని. ఆంధ్రమున పద్య వాఙ్మయమునుగూర్చి జరిగినంత కృషి వచన వాఙ్మయమును గూర్చి జరిగియుండలేదు. శ్రీ కులశేఖరరావుగారి యీ సిద్ధాంతవ్యాస మా లోపమును తీర్చుచున్నది. వారు మొదట పద్యము, గద్యము, వచనము అనువానిని సవిమర్శముగా వివరించిరి. ఆంధ్రమునందలి వచనమును వారు శాసనవచనము, చంపూకావ్యవచనము, కేవల వచనము అని మూడు భాగములుగా విభజించిరి. తరువాత వారు ప్రాఙ్నన్నయ యుగ శాసనములందలి వచనము స్వరూపమును, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర సమ్రాట్టులు, నాయకరాజులు మున్నగువారు వేయించిన శాసనములందలి వచనము స్వరూపమును వేఱువేఱధ్యాయములలో వివరించిరి. చంపూకావ్యములైన పురాణములు, ప్రబంధములు మున్నగువానియందలి వచనముల విధమును గూడ వారు సోదాహరణముగా ప్రకటించిరి. ఎఱ్ఱన, శ్రీనాథుడు, పోతన, ప్రబంధకవులు మున్నగువారి వచనములందలి వైశిష్ట్య లక్షణములను వారు విశదీకరించిరి. యక్షగానములందలి వచనములను వారు సమీక్షించిరి. వచ

నైకరచనలను వారు చారిత్రకములు, పౌరాణికములు, మతసంబంధాలు, క్షేత్ర మాహాత్మ్య సంబంధాలు, ఇతరములు అని వింగడించి వానియందలి భాషా రచనా విశేషములను చక్కగా ప్రదర్శించిరి. ఆంధ్ర వచన వాఙ్మయ సమగ్ర దర్శనమని చెప్పదగిన ప్రశస్త సిద్ధాంత వ్యాస మిది.

12. ఆంధ్రశతక వాఙ్మయోత్పత్తి వికాసములు- 1947 - శ్రీ కె. గోపాల కృష్ణారావుగారు - పర్య - ఆచార్య దివాకర్ల వేంకటావధాని - అముద్రితము. ఆంధ్ర వాఙ్మయమున నైదువేలకు మించిన శతకములు కలవు. ఇన్నిశతకములు మతే వాఙ్మయమందును లేవు. శ్రీ గోపాలకృష్ణారావు గారు శతక స్వరూపలక్ష ణములను నిరూపించి సంస్కృత కర్ణాటక భాషలందు వెలువడిన స్తోత్రముల ప్రభావమున తెలుగులో శతకరచన మారంభమైనదని తెల్పిరి. వారాంధ్రము నందలి శతకములను భక్తి శతకములు, నీతిశతకములు, అధిక్షేప శతములు, శృంగారశతకములు, తాత్త్వికశతకములు, చారిత్రకశతకములు- భాషా వ్యాక రణనిఘంటు ప్రహేళికా శతకములు, సంకలన శతకములు, వివిధవస్తు శతకములు, కథాత్మక శతకములు, అనువాద శతకములు. అను ప్రధానవర్గ ములుగా విభజించి ఆయావర్గములకు జెందిన శతకముల నన్నిటిని చక్కగా సమీక్షించిరి. తరువాత వారు శతకములలో కలిగిన మార్పులను, ఆంధ్రశతక వాఙ్మయమునందలి వైశిష్ట్యమును లెస్సగా విశదీకరించిరి. ఆంధ్రమున యథా వాక్కుల అన్నమయ్య మున్నగువారు శతకములను మాత్రము రచించి సంస్కృతమున మయూరునివలె మహాకవులని పేరుగాంచియున్నారు. ఆంధ్ర వాఙ్మయమునందలి ముద్రితాముద్రితములైన శతకములనన్నిటిని సేకరించి, ఓపికతో పఠించి, వానినిగూర్చి సవిమర్శము సప్రమాణమునైన సమీక్ష వెలువ రించి, శ్రీ గోపాలకృష్ణారావుగా రుభయలోక తారకమైన మహాకార్యమును సాధించుటే కాక శతక బాహుళ్యముచే ఆంధ్రమునకు కల్గిన ఆధిక్యమును లెస్సగా నిరూపించి యున్నారు.

12. శ్రీ వీరేశలింగంపంతులుగారు- వారికృతులు- 1964- శ్రీ అక్కి రాజురమాపతిరావుగారు - పర్య. ఆచార్య శ్రీ బి. రామరాజుగారు - ముద్రి తము- శ్రీ కందుకూరి వీరేశలింగంగా రాంధ్రవాఙ్మయమున నవయుగ వైతాళి కుఁడని ప్రసిద్ధి పొందిన మనీషి. ఆయన యెంతరచయితయో అంత సంస్కర్త. శ్రీ రమాపతిరావుగా రీసిద్ధాంతవ్యాసమున పంతులుగారికి పూర్వ ముండిన తెలుగుభాషస్థితిని, వారిరాకచే దానికి కలిగిన అభ్యుదయమును, వారిసాహితీ

పేతృత్వమును, వారి జీవితవిశేషములను చక్కగా వివరించిరి. తరువాత వారు సృజించిన పద్య, నాటక, నవలా, కథా వ్యాసోపన్యాసములనుగూర్చియు, కవిజీవితములనుగూర్చియు ప్రత్యేకాధ్యాయములలో విశదీకరించిరి. పిమ్మట వారు పంతులుగారి పత్రికానిర్వహణము, స్వీయచరిత్రరచనము అనువానిని వివరించి వారికి హాస్యరచయితగా గల స్థానమును, వారి లోకజ్ఞతను ప్రదర్శించిరి. పంతులుగారి వ్యక్తిత్వమునుగూర్చియు, దక్పథమునుగూర్చియు, విలక్షణము ఆదర్శప్రాయమునైన వారి వచనశైలిని గూర్చియు శ్రీ రమాపతిరావు గారు వ్రాసినభాగము వారి పరిశోధనపాటవమును నిష్పక్షపాతమైన విమర్శన ప్రౌఢిని ప్రకటించుచున్నది. సిద్ధాంతవ్యాసమునకు చివర వారు తమరచనకుపబలక మైన ఎన్నో ఘట్టములను, పంతులుగారినిగూర్చి ఇతరులు వ్రాసిన వ్యాసములను, అభిప్రాయములను, ముఖ్యచిత్రములను అనుబంధరూపమున చేర్చి గ్రంథమునకు వన్నెకల్గించియుండిరి.

13. ఆధునిక కవిత్వమునందలి మానవుఁడు — ప్రకృతి - 1955 - శ్రీ అరిపిరాల విశ్వనాథంగారు- పర్య. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు అముద్రితము. ఈసిద్ధాంతవ్యాసమున ఆధునికకవిత్వమునందలి రూపవస్తు వ్యక్తీకరణముల తాత్త్వికార్థము విశదీకరింపబడినది. ఇందలి మొదటి నాలుగ ధ్యాయములలో విషయమునకు సంబంధించిన పాశ్చాత్య విమర్శనవిధానమును, చివరి యేడధ్యాయములలో కవితాప్రక్రియల పరిశీలనమును, మానవసమస్యల పరిశీలనమును, వానికి పూర్వరంగముగా ప్రకృతికి గల స్థానమును వివరింపబడినవి. రెండుమూడధ్యాయములలో మానవప్రకృతులనుగూర్చి సైద్ధాంతికచర్చ కావింపబడినది. రచయిత ఆధునికకాలమున రచింపఁబడునదంతయు 'లిరికల్' కవిత్వము కాదనియు, దేశభక్తి, సమస్యలను తాత్త్వికదృష్టితో పరిశీలించుట అనునంశములు వేదకాలమునుండియు గోచరించుచున్నవనియు వివరించిరి. పాశ్చాత్య తాత్త్వికాశయములకు వారొసంగిన పారిభాషికపదములు ప్రశంసనీయములుగా నున్నవి. దివ్యమానవత, ప్రకృతి, స్వార్థము, ఆత్మరక్షణము, ఆధునికత్వము, అభ్యుదయకవిత్వము, స్వచ్ఛందపద్యము, విశ్వసనీయమైన అహంకారము మున్నగువిషయము లిందు చక్కగా వర్ణింపబడినవి. ప్రతిబింబమునుగూర్చి చేయబడిన చర్చ సమగ్రమును ప్రశంసనీయమునై యున్నది. రచయిత తాము వ్యక్తముచేసిన అంశములన్నిటికిని ఇతరకవులనుండియు తమ కవిత్వమునుండియు నుచితములైన యుదాహరణముల నొసంగియున్నారు.

ఆంగ్లమునుండి యుద్ధరింపబడిన భాగముల కాంధ్రానువాదము లొసంగబడినవి. ఆధునికకవిత్వమునందలి ప్రకృతిని కవితాప్రక్రియలను వారు వివరించినతీరు మెచ్చదగియున్నది. ఆ కవిత్వము తాత్త్వికముగను, సమగ్రముగను, ప్రతిభావంతముగను పరిశీలించి రచింపబడిన ఆలోచన ప్రేరకమైన ఉత్తమ సిద్ధాంత వ్యాసమిది.

15. విజయనగర యుగమునందలి ఆంధ్రవాఙ్మయముపై - ముఖ్యముగా తాళ్ళపాకకవులపై–వైష్ణవమత ప్రభావము–1946–శ్రీవేటూరి ఆనంద మూర్తిగారు– పర్య. ఆచార్యశ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు - అముద్రితము. ఈ సిద్ధాంతవ్యాసమున శ్రీ ఆనందమూర్తిగారు తాళ్ళపాక కవుల చరిత్రమును, వారు రచించిన గ్రంథములను వివరించి, సంకీర్తన పదకవితా రూపమైన వారి కావ్యజాలము నాధారముగా జేసికొని, వైష్ణవమత సిద్ధాంతములం దెట్లు ప్రచారము చేయబడినవో, వారిపై నా మతముప్రభావ మెంత యధికముగాఁ గలదో వివరించిరి. వారు తాళ్ళపాకవా రార్జించిన అగ్రహారములనుగూర్చియు, తిరిగిన దేశములనుగూర్చియు, కీర్తించిన దైవములనుగూర్చియు, తిరుపతిలోని ఆలయములనుగూర్చియు, వానికి సంబంధించిన యుత్సవములందు తాళ్ళపాకవారికి గల సంబంధములనుగూర్చియు విశదీకరించియుండిరి. వైష్ణవమత సిద్ధాంతములను, ఆంధ్రదేశమున వైష్ణవమతము వ్యాపించిన వృత్తాంతమును వారు సప్రమాణముగా నిరూపించియుండిరి. ఆంధ్రవాఙ్మయమునందలి వీర శైవమతప్రచారకములైన గ్రంథములనుగూర్చి వ్రాయబడిన విమర్శలు కొన్ని కలవు కాని దానిపై వైష్ణవమతమునకుగల ప్రభావమును గూర్చి యెవ్వరును పరిశీలించి యుండలేదు శ్రీ ఆనందమూర్తిగా రన్యులు స్పృశింపని యీ విషయమును గూర్చి సమగ్రముగను సప్రమాణముగను గావించిన యీ పరిశోధన అత్యంత ప్రశంశనీయమై యున్నది.

16. కవిత్రయము వారి యొక్కయు నాచన సోమనాథునియొక్కయు కవితాశయాభ్యాసములు–1966–శ్రీమాదిరాజు రంగారావుగారు - పర్య. ఆచార్య శ్రీ బి. రామరాజుగారు– అముద్రితము. ఈ సిద్ధాంత వ్యాసమునందలి ప్రథమ భాగమున నన్నయ తిక్కనలగూర్చియు ద్వితీయభాగమున ఎఱ్ఱన నాచన సోమనాథులను గూర్చియు వివరింపబడినది. వారి నలుగురు కవులలో నొక్కొక్కరి కావ్యములనుగూర్చి నిశితముగా పరిశీలించి, వారి కథా కథన శిల్పము, అవతారికలు, వారి రచనలందలి ప్రబంధధోరణి, మనస్తత్త్వ చిత్రణము,

సంవాదశిల్పము మున్నగువానిని గూర్చి ప్రతిభావంతముగా సమీక్ష కావించి యుండిరి. తిక్కన సోమనాథుల హరిహరనాథ తత్త్వమును, యుద్ధ శృంగారాదుల వర్ణనములందలి వైశిష్ట్యమును, వారుగ్గడించిన తీరత్యంత రమణీయముగా నున్నది. రంగారావుగారు వారిశైలినిగూర్చియు, కవితాశయములను గూర్చియు సోదాహరణముగా వివరించియుండిరి. ఆంధ్రవాఙ్మయ సౌధమునకు మూలస్తంభము లని చెప్పదగిన యీ నలుగురు కవులనుగూర్చియు వారికవితా కళాభిరుచులనుగూర్చియు వారు కావించిన పరిశోధన ఆదర్శప్రాయమై యలరారుచున్నది.

17. దక్షిణాంధ్ర వాఙ్మయమునందలి భాషావిశేషములు–1967–శ్రీమతి హేమలతగారు–పర్య. ఆచార్య దివాకర్ల వేంకటావధాని–అముద్రితము. భాషా పరిణామదృష్టితో పరికించినచో ఆంధ్రవాఙ్మయమును నాలుగు యుగములుగా విభజింపవచ్చును. అవి ప్రాఙ్నన్నయ యుగము, నన్నయ యుగము, దక్షిణాంధ్రయుగము, ఆధునికయుగము అనునవి. నన్నయనాటినుండి ప్రబంధ యుగము చివరివఱకు ఆంధ్రభాష కొంచెమించుమించుగా ఒకేవిధముగా వర్తిల్లెనని చెప్పవచ్చును. దక్షిణాంధ్రయుగమునుండి యందు కొంతమార్పు స్పష్టముగా కనిపించును. శ్రీమతి హేమలతగా రాయుగమున వెలసిన కావ్యములను, వచన గ్రంథములను, యక్షగానములను, గేయాదులను కూలంకషముగా పరిశీలించి యప్పటి యాంధ్రభాష స్వరూపమును చక్కగా వ్యక్తము చేసియున్నారు. వారాకాలపు ధ్వనులు, సంధులు, తత్సమ, దేశ్య, సంఖ్యావాచక, సర్వనామోప విభక్తిక, కారకక్రియా విశేషణ,సమా, సావ్యయకృత్తద్ధితాదులలోని విశేషముల నన్నిటిని వేఱువేఱుఅధ్యాయములలో వివరించిరి. దక్షిణాంధ్ర వాఙ్మయమునందలి వాక్యనిర్మాణ పద్ధతినిగుఱించియు, అప్పటిభాషయందు ప్రవేశించిన అన్య భాషాపదములను గుఱించియు పాత్రోచితభాషాప్రయోగమును గుఱించియు, కొన్ని శబ్దముల విషయమున గోచరించు అర్థవిపరిణామమును గూర్చియు, అప్పటి సామెతలు, జాతీయములు, మాండలికములు మున్నగువానినిగూర్చియు వా రెన్నో క్రొత్త విషయములను వెల్లడించి యున్నారు. అప్పటి రచనలలో కనవచ్చు ప్రయోగవిశేషములను ప్రదర్శించిన తీరు వారి పరిశోధన పాటవమును చాటుచున్నది. ఈ సిద్ధాంతవ్యాసము నాకాలపు ఆంధ్రభాష స్వరూపమును ప్రదర్శించు మణిదర్పణమని చెప్పవచ్చును.

18. ఆముక్తమాల్యద సౌందర్యము – 1967 – శ్రీ తుమ్మపూడి కోటే

శ్వరరావుగారు-పర్య. ఆచార్య దివాకర్ల వేంకటావధాని - ముద్రితము. ఆంధ్ర ప్రబంధములలో అత్యంత ప్రౌఢమైనది ఆముక్తమాల్యద. అది యెంత ప్రౌఢమైనదో అంత సుందరమైనది. శ్రీ కోటేశ్వరరావుగా రందలి కథాకథన, రస, పాత్ర పోషణ సౌందర్యము నీ సిద్ధాంత వ్యాసమున నిపుణముగా వెల్లడించిరి. ఇం దాఱధ్యాయము లున్నవి. ఒక్కొక్క అధ్యాయమున కొక్కొక్క దర్శన మని నామకరణము కావింపబడినది. ఈ విధముగా నిది షడ్దర్శని, ఆముక్తమాల్యద యందలి కథ, నాయకుడు, ఋతువర్ణనలు, రచనా బంధము, ఔచిత్యము, పాత్ర నిర్మాణము, దండ నీతి మున్నగు విషయములను గ్రంథ కర్త ప్రతిభానమన్వితముగా నిరూపించియున్నారు. వారు రాయల వైదుష్యమును, సమకాలిక సాంఘికపరిస్థితులను విశదముగా తెల్పియున్నారు. ఆముక్తమాల్యద యందలి ప్రధానరసము వీరమని వారు నిరూపించిన తీరు వారి ప్రతిభా పాండిత్యములను వ్యక్తము చేయుచున్నది. ప్రౌఢమైన ఆ ప్రబంధమును క్షుణ్ణముగా పఠించి, యందలి రహస్యములను స్వాయత్తము చేసికొని, సామాన్యులకు కూడ సుబోధ మగునట్లు వారు వెల్లడించిన విధము ప్రశంసింపదగి యున్నది.

19. కేతన అతని కృతులు - 1968 - శ్రీహరి శివకుమార్ - పర్య. డా. కేతవరపు రామకోటి శాస్త్రిగారు-అముద్రితము. కేతన తిక్కన సమకాలికుడు. దండి సంస్కృతమున రచించిన దశకుమార చరిత్రము నతఁడు చంపూ కావ్యముగా ననువదించి మిత్రుడైన తిక్కన కంకితము కావించినాడు. విజ్ఞానేశ్వరీయ మను ధర్మశాస్త్రమును పద్యకావ్యముగా రచించుటయేకాక అతడు ఆంధ్ర వ్యాకరణమును ఆంధ్ర భాషా భూషణమనుపేర పద్య రూపమున వెలయించినాఁడు. ఈ విధముగా సంస్కృత గద్య కావ్యమును మొదట నాంధ్రీకరించిన వాఁడును, తెలుఁగున మొదటి శాస్త్ర గ్రంథమును, మొదటి వ్యాకరణమును రచించిన వాడు కేతనయే. శ్రీహరి కుమార్‌గారు కేతన కావ్యమును సంస్కృత గద్య కావ్యముతో పోల్చి అనువాదము నందలి విశేషములను వెల్లడించిరి. విజ్ఞానేశ్వరమునందలి శాస్త్రీయవిషయములను గూర్చియు, పారిభాషిక పదములను గూర్చియు చక్కని వివరణ మొసంగిరి. అట్లే మరియొక అధ్యాయమున ఆంధ్ర భాషా భూషణము నందలి వ్యాకరణాంశములను విశదీకరించిరి. చివర కేతనకాల నిర్ణయమునకు పనికివచ్చు వంశ వృక్షముల నొసంగిరి. కేతన తిక్కనగుణరూప శీల మహత్త్వములను దశకుమార చరితము

అవతారిక యందును, ఆశ్వాసాద్యంతములందును ఎట్లు వ్యక్తము చేసెనో వారు చక్కగా వివరించిరి. ఆంధ్ర వాఙ్మయమున ఉపేక్షితులైన పూర్వ కవులలో కేతన యొకడు. అతని కృతులను గూర్చియు జీవిత ప్రతిభా విశేషములను గూర్చియు చక్కగా వివరించు శివకుమార్ గారి సిద్ధాంత వ్యాస మా విషయమున అద్వితీయమైనది.

20. దక్షిణాంధ్ర వాఙ్మయము - సాంఘిక జీవితము - 1969 - శ్రీమతి బోయి విజయ భారతి - పర్య. ఆచార్య పల్లా దుర్గయ్యగారు. అముద్రితము. ప్రబంధయుగానంతర మాంధ్రవాఙ్మయము మధుర, తంజావూరు, పుదుక్కోట మున్నగు దక్షిణ దేశము నందలి సంస్థానము లందు కూడా వర్ధిల్లినది. ఆ వాఙ్మయమున ప్రతిఫలించు దక్షిణ దేశపు సాంఘికాద్యాచారములను మత రాజకీయ పరిస్థితులను వివరించుట యీ సిద్ధాంత వ్యాసము ప్రధానోద్దేశము. వ్యాసకర్త్రి మొదట దక్షిణ దేశమున నేర్పడిన రాజ్యముల రాజకీయ చరిత్రమును, వానిని బరిపాలించిన రాజుల రాజకీయ సాంఘిక మతదృక్పథములను వివరించి యున్నారు. ద్వితీయ భాగమున నాటి ఆచార వ్యవహారములు, సాంఘిక రాజకీయ పరిస్థితులు, వినోదములు, సంగీత నాట్యయక్షగానాది కళలు, ఆంధ్ర సంస్కృత వాఙ్మయ పోషణము మున్నగునవి వివరింపబడినవి. నాటి సామెతలు, ఆభరణములు, ఆయుధములు, అప్పటి ముద్రితా ముద్రిత గ్రంథములు మున్నగు వానినికూడా వ్యాసకర్త్రి పట్టికల రూపమున నొసంగి యున్నారు. దక్షిణ దేశమున వర్ధిల్లిన ముద్రితాముద్రితములైన సర్వగ్రంథములను చక్కగా పఠించి వానిలో చిత్రింపబడిన యప్పటి రాజకీయ మత సాంఘిక విశేషములను శ్రీమతి విజయ భారతిగారీసిద్ధాంత వ్యాసమున ప్రతిభా సముచితముగా ప్రదర్శించి యున్నారు.

21. మార్కండేయ పురాణ పర్యాలోచనము - 1969 - శ్రీ గూడ వెంకట సుబ్రహ్మణ్యంగారు - పర్య. ఆచార్య శ్రీ పల్లా దుర్గయ్యగారు - అముద్రితము. ఆంధ్రమున కనుపదింపబడిన మొదటి పురాణము మార్కండేయ పురాణము. దానిని రచించినవాడు తిక్కన శిష్యుడైన మారన. ఈ సిద్ధాంత వ్యాసమున మనుచరిత్రము, కువలయాశ్వ చరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము, ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము, మదుత్తరాట్చరిత్ర, శ్రీ దత్తభాగవతము, మున్నగు నాంధ్రప్రబంధములకు మార్కండేయ పురాణ మెట్లు మూలమై విలసిల్లినదో యుదాహరణ పూర్వకముగా నిరూపించబడినది. శ్రీ సుబ్రహ్మణ్యంగారిందు

తమకు సహజమైన మధుర మంజులశైలిలో మార్కండేయ పురాణమందలి ఉపాఖ్యానచ్ఛందోలంకార శిల్పములను గూర్చియు, మారనశైలిని గూర్చియు నిపుణముగా వివరించియున్నారు. ఆరంభమున పురాణనిర్వచనము కావించి తత్స్వరూపస్వభావములను ప్రకటించుటయందును, మాతృకయైనమార్కండేయ పురాణమునకును మనుచరిత్రాది పుత్త్రికలకును వస్తువిన్యాసమున గల సామ్య వైషమ్యములను విశదీకరించుటయందును వ్యాసకర్త చూపిన నేర్పు ప్రశంసింపదగియున్నది. మార్కండేయ పురాణమను పేర వెలసిన భావనమహర్షి చరిత్రమును తెల్పు పురాణముకాని పురాణమునుగూర్చి కూడా వారిందు ప్రసక్తాను ప్రసక్తముగా వివరించియుండిరి. తెలుగునాట నంతగా ప్రసిద్ధి ప్రచారములు నందకపోయినను మార్కండేయ పురాణము తరువాతి వాఙ్మయము పై నెంత ప్రభావముప్రదర్శించినదో తెల్పుచు నందలి కవితాశిల్పమును వివరించుటలో శ్రీ సుబ్రహ్మణ్యము గారు కావించిన కృషియు పరిశోధనయు విద్వద్విమర్శక వినుతములై యున్నవి.

22. ఆంధ్రమునందలి హరివంశము - 1969 - శ్రీమతి పి. యశోదా రెడ్డిగారు - పర్య. ఆచార్య దివాకర్ల వేంకటావధాని - ముద్రితమగుచున్నది. ఈ సిద్ధాంతవ్యాసము మూడు భాగములుగను 6+ 7+ 16= 29 అధ్యాయములుగను విభజింపబడినది. ప్రథమ భాగమున హరివంశ భారతములకును, హరివంశ విష్ణుపురాణభాగవతములకును గల సంబంధము, తెలుగునందలి హరివంశములు, ఎఱ్ఱాప్రెగడ రచనల పౌర్వాపర్యము, కవిత్రయమునం దాతనికి గల స్థానము, అతని అనువాదపద్ధతి అనువిషయములను గూర్చి వివరింపబడినది. రామాయణ హరివంశములు, అరణ్య పర్వశేష నరసింహపురాణములు అను ఉటలలో రామాయణ హరివంశములనే ఎఱ్ఱన మొదట రచించెననిగ్రంథకర్త్రి అభిప్రాయము. రెండవభాగమున నాచనసోమనాథుని కాలము, రచనలు, అనువాదపద్ధతి, శైలి, అతనికిగల బిరుదములు, ఇతర కవులపై అతనికిగల ప్రభావము, ఉత్తర హరివంశమున శ్రీ కృష్ణునికి గల ప్రాధాన్యము అనునంశములు చర్చింపబడినవి. సోమన పూర్వహరివంశమును రచింపలేదనియే గ్రంథకర్త్రి యభిప్రాయము. తృతీయభాగమున ఎఱ్ఱన సోమనల రచనలో గల సామ్యవైషమ్యములు, నేమాని భైరవకవి హరివంశోత్తరభాగము, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్ర భవిష్యపర్వము, విశ్వనాథ నరసింహకవి హరివంశ పురాణము అనునవి విశదీకరింపబడినవి. శేషధర్మములు హరివంశ భాగములు కావని

వ్యాసకర్త్రి నిర్ణయించినారు. గూళికల్లు వేంకటరమణకవి, తాళ్ళపాక పెద తిరుమలయ్య రచించిన హరివంశములు లభింపలేదు. ఎఱ్ఱన హరివంశ పూర్వ భాగము, భైరవకవి ఉత్తరభాగమునందలి పంచమ, షష్ఠ, సప్తమాధ్యాయములు సోమన ఉత్తర హరివంశము, సూర్యనారాయణ శాస్త్రిగారి భవిష్యపర్వము నందలి మొదటి మూడాశ్వాసములు కలిపి వరుసగా ముద్రించినచో సమగ్రమైన హరివంశమేర్పడునని వ్యాసకర్త్రిభావము. గ్రంథాంతమున హరిహరాభేదమును గూర్చియు హరిహరనాథుని స్తుతించిన కవులను గూర్చియు తెలుపబడినవి. అనుబంధమున హరివంశ విషయానుక్రమణిక, అధ్యాయశ్లోకాశ్వాసగద్య పద్యముల సంఖ్య యొసంగబడినవి. గ్రంథమున శ్రీకృష్ణుని లీలలను సూచించునట్టియు, గణపతి మున్నగు దేవతలయొక్కయు రమ్యములైన చిత్రములు సందర్భానుగుణముగ చేర్చబడి దానికి వన్నె చేకూర్చుచున్నవి. సంస్కృతాంధ్ర హరివంశములను క్షుణ్ణముగా చదివి, గూఢములై మఱుగు బడియున్న హరి వంశములను వెలుగునకు తెచ్చి శ్రీమతి యశోదా రెడ్డిగారు కావించిన యీపరిశోధన వారి ఉభయభాషా పాండిత్యమును, విమర్శన కౌశలమును విశదముగా ప్రదర్శించుచున్నది.

23 శ్రీమదాంధ్రభాగవతానుశీలనము - 1969 - శ్రీ ధూళిపాళ శ్రీరామ మూర్తిగారు- పర్య. ఆచార్య దివాకర్ల వేంకటవధాని - అముద్రితము. ఈ సిద్ధాంతవ్యాస మైదుభాగములుగా విభజింపబడినది. మొదటి భాగమున పోతన నివాసము, కాలము, గ్రంథములు, భాగవతగ్రంథ పాఠములు, పోతనమతము, ఉత్తరజీవితము అను విషయములు వివరింపబడినవి. పోతన ఓరుగల్లు మండలము నందలి బమ్మెరగ్రామమున 15 వశతాబ్దిలో నివసించెననియు, అతఁడు శైవు డనుటకన్న స్మార్తుడనుట యుక్తమనియు, నారాయణ శతక మతడు రచించినది కాదనియు గ్రంథకర్త సోపపత్తికముగా నిరూపించి యున్నారు. పోతనగారి యనువాదవిధానమును వివరించుచు వారు రెండవ భాగమున శ్రీధరీయానుసరణములను, అపార్థకల్పనములను, పోతన తెలుగుచేయక విడిచిన శ్లోకములను, స్వతంత్రముగా పెంచివ్రాసిన భాగములను చక్కగా వివరించిరి. మూడవభాగమున పోతనకవితావైభవ ముగ్గడింపబడినది. అతని కథాకథన శిల్పము, వర్ణనలు, రసపాత్రపోషణము, భావుకత, దేశిలక్షణములు, అలంకార ప్రయోగము పూర్వకావ్యానుసరణములు ఇందు వివరింపబడినవి. కవిత్రయము వారిని, సోమనాథ ద్వయమును, భాస్కరుని అతఁ డెక్కువగా అనుసరించెను.

అతని దీర్ఘ వచనములు శబ్దార్థాలంకార పూరితములై బాణుని వచనమును తల పించుచుండును. నాల్గవ భాగమున పోతన భాషాచ్ఛందః ప్రయోగవైచిత్రి పరి శీలింపబడినది. వ్యాకరణ విరుద్ధములని భావింపబడు పోతన ప్రయోగములు పెక్కుశాస్త్రసమ్మతములే అనియు, అతడు లాక్షణికుడైన కవియనియు గ్రంథ కర్త సమర్థించిరి. చివరిదైన అయిదవభాగమున భాగవత తత్త్వము వివరింప బడినది. సాత్త్వతమతము, వాసుదేవతత్వము, భక్తియోగము, భక్తిరసము, మున్నగు విషయములను సమీక్షించునప్పుడు శ్రీ శ్రీరామమూర్తిగారు ప్రదర్శిం చినప్రతిభాపాండిత్యము లప్రతిమానములు. పోతన కవిత్వమునుగూర్చి వెలు వడిన విమర్శలలో ఇంత సమగ్రము, ఇంతప్రామాణికము, ఇంతనిష్పాక్షికము నైన రచన మరొకటి లేదనుటలో అతిశయోక్తి లేదు.

24. ఆధునికాంధ్ర కవిత్వంపై ఉద్యమముల ప్రభావము - 1969 - శ్రీ ముదిగొండ శివప్రసాదరావుగారు-పర్య. శ్రీ డా. సి. నారాయణరెడ్డి గారు- అముద్రితము. ఈ సిద్ధాంతవ్యాసమున శ్రీ శివప్రసాద్‌గారు సాహిత్యసమాజము లవినాభావ సంబంధము కలవని నిరూపించి,దేశమున ప్రవర్తిల్లిన వివిధోద్యమ ములు సాహిత్యము నెట్లు ప్రభావిత మొనర్చినవో, సాహిత్యోద్యమముల ఫలిత ముగా జాతీయ జీవితవాహిని యెన్ని మలుపులు తిరిగినదో చక్కగా వివరించి యున్నారు. మొదట భౌతికాధ్యాత్మిక శక్తుల నడుమ జరుగు నిరంతర సంఘట్ట నము కారణముగా జాతిలో ఉద్యమము లెట్లు పుట్టునో,అవి సాహిత్యమునం దెట్లు ప్రతిఫలించునో వారు నిరూపించిన తీ రద్భుతముగా నున్నది. సాహిత్య సంబం ధులైన భావాభ్యుదయాది వాస్తవికోద్యమములను, రాజకీయములైన జాతి, యాంధ్రరాష్ట్ర, తెలంగాణోద్యమములను, చైనా, పాకిస్తాన దండయాత్రలను, భాషాసంబంధియైన వ్యావహారికోద్యమమును, సాంఘికములైన మహిళా హరిజ నోద్యమములను, పారిశ్రామిక విప్లవమును సాహిత్యమున ప్రవర్తింపచేసిన పరిణామములను వివరించి భవిష్యత్కవిత యెట్లుండునో వారు కావించినసూచన శాస్త్రీయమును హేతువాద పూర్వకమునై వారియపారమైన ప్రతిభను ప్రకట నముచేయుచున్నది. ఆధునిక కవిత్వమును గూర్చి గురువుగారు రచించిన సిద్ధాంతవ్యాసము దానికొక మహాభాష్యముకాగా శిష్యుడు రచించినది మహా భాష్యమునకు సమగ్ర వివరణమై విరాజిల్లుచున్నది.

25. తెలుగు జానపద గేయగాథలు—1970—శ్రీమతి నాయని కృష్ణ కుమారిగారు—పర్య. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు— అముద్రి

తము. జానపద గేయగాథల నాధారముగా గ్రహించి తెలుగు జీవితమున నేదు కాన్పించు మతసాంఘికాదిస్థితిగతులకు కారణములైన మౌలికాంశముల స్వరూపము పూర్వమెట్లుండెనో వివరించుట యీ సిద్ధాంత వ్యాసముయొక్క ప్రధానోద్దేశము. ఆదిమానవుని భావశబలతలకు మాఱటరూపమైన కళాసృష్టి కథారమ్యము, కల్పనా పటిష్ఠము గానానుగతము, లయాన్వితమునై జానపదగాథలలో రూపొందుననియు, వానియందలి కథాకథన కౌశలము సంపూర్ణమై జానపదుల కపారమైన యానందము నందిచ్చుననియు, నందు సమకాలీన సంఘటనలతో పాటు ప్రాచీన మానవ స్వరూపముకూడ వెల్లడియగుననియు, వారివెనుక నృశాస్త్ర విజ్ఞానమెంతయో మరుగుపడియుండుననియు శ్రీమతి కృష్ణకుమారి గారు చక్కగా వివరించియున్నారు. జానపదగాథలు విద్వాంసులు కాని సామాన్యులు తీర్చిదిద్దినవగుటచే నందు నాగరికతాకల్పితకృత్రిమత లేని మానవ మానస మౌలిక స్వరూపము ప్రస్ఫుటమగుచుండును. అవి జాతిచరిత్రకు సంబంధించిన ప్రాథమికాంశములకు పట్టుగొమ్మలు. ఈ సిద్ధాంత వ్యాసమున ప్రాచీన మతచరిత్రకు మూలములైన ఆత్మారాధన, పితృదేవతారాధన, మాత్రారాధన, వీరారాధన, జంతుపూజా విధానము మున్నగు విషయములును వానికి జానపద గాథలలోని కథాంశములతోగల సంబంధమును వివరింపబడినవి. అందు ప్రతిబింబించు సాంఘికాచారములు, మూఢవిశ్వాసములు, శకునాదికములు మున్నగువాని వెనుక ప్రాచీనమానవుడు తానుగా నిర్ణయించుకొన్న నియమాదులు తొంగిచూచుచుండును. ఈ ఉత్తమ సిద్ధాంత వ్యాసమున జానపద గాథల సౌందర్యముతో పాటింతకుముం దెవ్వరి చేతను స్పష్టము చేయబడని నృశాస్త్ర సంబంధి దృక్పథముకూడ గోచరించుచున్నది. ఈ విధముగా నుపేక్షితమైన జానపదగాథా ప్రపంచమున గూఢములైయున్న రహస్యముల నెన్నిటినో వెలువరించి శ్రీమతి కృష్ణకుమారిగా రీ సిద్ధాంతవ్యాసమున దాని సహజ మహత్త్వ సౌందర్యములను ప్రకటించుటలో చూపిన ప్రతిభా కౌశలములు మిక్కిలి ప్రశంసార్హములైయున్నవి.

26. ఆంధ్ర వ్యాకరణ పరిణామము—1971—శ్రీ అమరేశం రాజేశ్వర శర్మగారు—పర్య. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు—అముద్రితము. అపార పాండితీ ప్రతిభా స్ఫోరకమైన యీ సిద్ధాంతవ్యాస ముపోద్ఘాతము కాక అయిదు పెద్ద అధ్యాయములుగా విభజింపబడినది. ఈ ఆఱుఅధ్యాయములు విషయమునుబట్టి మరల నలువదియొక్క భాగములుగా విశ్లేషింపబడినవి. దీనిని

ఆంధ్రవ్యాకరణ సర్వస్వమని వర్ణింపవచ్చును. మొదట భాష, దాని స్వభావము అందలి రహస్యములను వెల్వరించు విధానము మున్నగు విషయములు విశదీకరింపబడినవి. ఇందు మొత్తము నలువదియొక్క ముఖ్యవ్యాకరణ గ్రంథములు నిపుణముగా సమీక్షింపబడినవి. శ్రీ శర్మగా రొక భాగమున వ్యాకరణ ప్రయోజనములను తెల్పి వానిని తెలుగు వ్యాకరణమునకు కూడ అన్వయించి ఆంధ్రశబ్దచింతామణి 14వ శతాబ్దములో రచింపబడి యుండెననియు, అది కాలమున అతిప్రాచీనము కాకపోయినను గుణమునుబట్టి అద్వితీయమనియు వారి అభిప్రాయము. వా రతిప్రాచీనములైన కాణ్వ బృహస్పతి వ్యాకరణములను కూడా పరిశీలించిరి. అట్లే ప్రాకృత హిందీ వ్యాకరణములను గూర్చియు సంస్కృతాంధ్ర వ్యాకరణములను గూర్చియు చక్కని సమీక్ష కావించిరి. చిన్నయసూరి ఆంధ్రశబ్దచింతామణి నంధముగా అనుసరింపలేదని నిరూపించి వా రత డాంధ్రవ్యాకరణస్వరూపమును పరిణమింపజేసిన క్రమపరిపాటిని వెల్లడించిరి. కాంబెల్, సి. పి. బ్రౌన్ మున్నగు వైదేశికులు రచించిన తెలుగువ్యాకరణముల స్వరూపమును వారు చక్కగా వివరించిరి. వారు శ్రీ వజ్ఝలవారి సిద్ధాంతముల నచ్చట నిశితముగా విమర్శించిరి. కేతన ఆంధ్ర భాషాభూషణమునకును కన్నడమునందలి నాగవర్మ కర్ణాటభూషణమునకును గల పోలికలను వివరించి వారు కేతన నాగశర్మ ననుసరించెనని నిరూపించిరి. వా రాంధ్రవ్యాకరణమునందలి సాంప్రదాయికవిధానములను లెస్సగా సూచించిరి. వారి విమర్శ నిష్పాక్షికము, సప్రమాణము పాండితీస్ఫోరకమునై యున్నది. కాంధ్రవ్యాకరణమును గూర్చి సమగ్రము, శాస్త్రీయము, సముదంచితమునైన యిట్టి పరిశోధన కావించుట శ్రీ శర్మగారి అసాధారణమైన పాండితీ పాటవమునకు తార్కాణము.

27. గోపీనాథ వెంకటకవి- వెంకటగిరి సంస్థానమునకు చెందిన యితరకవులు- 1971- శ్రీ కాళిదాసు పురుషోత్తంగారు- పర్య. ఆచార్య శ్రీ బి. రామరాజుగారు. అముద్రితము. శ్రీ పురుషోత్తంగా రిందు మొదట వెంకటగిరి సంస్థానచరిత్రను వివరించి వెలుగోటివారిని గూర్చియు, వారు నెల్లూరుమండలమున ప్రవేశించిన పరిస్థితులను గూర్చియు తెల్పియుండిరి. ప్రథమప్రకరణమున వేంకటాద్రినాయునిగూర్చియు, యాచశూరుని గూర్చియు నితరరాజులనుగూర్చియు వివరింపబడినది. రెండవప్రకరణమున వెంకటగిరి సంస్థానము నాశ్రయించిన పలువురు కవుల చరిత్ర విశదీకరింపబడినది. తృతీ

య ప్రకరణము ప్రత్యేకముగా వెంకయ్యశాస్త్రిగారి ప్రతిభా పాండిత్యములను, రచనలను వివరించుటకు వినియోగింపబడినది. చతుర్థ ప్రకరణము శాస్త్రిగారికి సమకాలికులైన కవుల వృత్తాంతమును వర్ణించుచున్నది. పంచమప్రకరణ మప్పటి పదకవితకు సంబంధించినది. ఆఱవప్రకరణమున వేంకటగిరి సంస్థానమునం దలి సంస్కృతకవులసేవ ఉగ్గడింపబడినది. సప్తమప్రకరణము వేంకటగిరి సంస్థానపురాజుల పరిపాలనా విధానమును, అప్పటి రాజకీయ మత సాంఘిక పరిస్థితులను విశదీకరించుచున్నది. చివర శ్రీ పురుషోత్తంగారు స్వాతంత్ర్యా నంతరము వెంకటగిరి సంస్థానమున జరిగినమార్పులను తెల్పియున్నారు. ఈ విధముగా వారాసంస్థానము నేలిన రాజులపోషణమున నాంధ్రసంస్కృతవాఙ్మ యములకు కలిగిన అభ్యుదయము నీ సిద్ధాంతవ్యాసమున సులభసుందరమైన శైలిలో నిపుణముగా వివరించియున్నారు.

28. ఆంధ్ర మహాభారతము—మనస్తత్వ పరిశీలనము 1971— శ్రీ అప్పజోడు వెంకట సుబ్బయ్య గారు— పర్య. ఆచార్య దివాకర్ల వేంకటావ ధాని— అముద్రితము. ఈ సిద్ధాంత వ్యాసము రెండు భాగములుగను పదునైద ధ్యాయములు గను విభజింప బడినది. మొదటి ఐదధ్యాయములతో కూడిన ప్రథమ భాగమున మానవుడు అతనికి గల ప్రాముఖ్యతము—మానవ స్వభావము తత్సంకీర్ణత— మానవ స్వభావ పరిణామము— ఆస్తి దాని పంపకము- వాఙ్మ యమున సందేశమునకు మానవ స్వభావనిరూపణమునకు గల స్థానము — అను విషయములు విచరింప బడినవి. రెండవ భాగమున గ్రంథ కర్త వ్యాసుడు మహాభారతమును రచించిన పరిస్థితులు, దాని మహత్త్వము— కవిత్రయము వారి అనువాద విధానము, వారు వివిధ పాత్రలను చిత్రించిన విధము మున్నగు విషయములను విపులముగా వర్ణించిరి. పదవ అధ్యాయము కౌరవ పాండవుల దాయ భాగ విభాగమునకు సంబంధించిన సమస్యలను, పదుమూడవ అధ్యా యము ఉపాఖ్యానము లందలి వివిధ పాత్రల గుణశీల స్వభావములను వివరించు చున్నవి. పదునాల్గవ అధ్యాయమున తత్త్వక దృష్టితో కాక మానవ స్వభావ దృష్టితో భగవద్గీత పరిశీలింప బడినది. చివరిదైన పదు నేనవ అధ్యాయమున మొదటి పదునాల్గధ్యాయముల సింహావలోకనము చేయబడినది. శ్రీ వేంకట సుబ్బయ్య గారు సంస్కృతాంధ్ర మహాభారతములను కూలంకషముగా పఠించి అందలి మానవ స్వభావమును ప్రకటించుటలో చూపిన ప్రతిభా పాండిత్యములు అసాధారణము లైనవి.

అవిగాక శ్రీమతి సీతాకల్యాణిగా రాంధ్రమునందలిచారిత్రక కావ్యములను గూర్చియు, శ్రీ యస్. వి. రామారావుగా రాంధ్ర విమర్శ వాఙ్మయోత్పత్తి పరిణామములను గూర్చియు, శ్రీ సన్నిధానం పరబ్రహ్మశాస్త్రి గారాంధ్రమునందలి అద్వైవతత్త్వ బోధక గ్రంథములను గూర్చియు, శ్రీ ముకురాల రామరెడ్డి గారు 14 వ శతాబ్ది వఱకుగల ఆంధ్రకవుల కవిత్వాశయములను గూర్చియు, సిద్ధాంతవ్యాసములను రచించి విశ్వవిద్యాలయమునకు సమర్పించియుండిరి. కొలదికాలముననే వానిఫలితములు కూడ ప్రకటింపబడును. ప్రస్తుతము వివిధ విషయములను గూర్చి సుమారు నలువది మంది విద్యార్థులు పి. హెచ్. డిపట్టము కొఱకును, పదిమంది విద్యార్థులు యమ్. లిట్ పట్టముకొఱకును సిద్ధాంతవ్యాసములను వ్రాయుచున్నారు.

ఈ విధముగా ఉస్మానియా విశ్వవిద్యాలయమునందలి ఆంధ్ర శాఖలో పరిశోధన కార్యక్రమ ముత్సాహముతో నిర్వహింపబడుచు క్రమక్రమాభివృద్ధి నందుచున్నది. ఆంధ్రభాష ఏర్పడినది మొదలు నేటివఱకును గల వివిధకవులకును, వాఙ్మయప్రక్రియలకును, భాషా సాంఘిక సాంస్కృతిక పరిస్థితులకును సంబంధించిన వస్తువులను గూర్చి ఆయా విద్యార్థులచే శాస్త్రీయ పద్ధతిని పరిశోధనము కొనసాగింపబడుచున్నది. ఈ పరిశోధనవ్యాసములన్నియు కలసి ఆంధ్ర భాషా వాఙ్మయముల సమగ్రస్వరూపమును జిజ్ఞాసుల కందీయవలెనని ఆందలి ఆచార్యుల ఆశయము, ఇట్లు వాఙ్మయమునందలి అన్ని అంశములను గూర్చి నిశితము, విస్తృతము, కూలంకషమునైన పరిశోధనము జరిగినపిమ్మట సమగ్రాంధ్ర వాఙ్మయ చరిత్రకు రూపు దిద్దవలెనని వారి సంకల్పము. సర్వ విద్యా స్వరూపిణియు, కరుణామయహృదయయునైన శారదాదేవి వారి సంకల్పమునకు సాఫల్యము చేకూర్చుగాక !

## శ్వర విశ్వవిద్యాలయం-
## శోధన

క. రెడ్డి

ారం మన రాష్ట్రంలో స్థాపించబడిన విశ్వవిద్యాలయాల్లో
్వర విశ్వవిద్యాలయం మొదటిది. (1954)

ాలయంలో తెలుగు భాషా సాహిత్యాల అధ్యయనానికి
కోత్తరశాఖ (Post graduate department) 1959
శాఖకు మొదటి అధ్యక్షులు శ్రీ భూపతి లక్ష్మీనారాయణ
వారి తర్వాత కి. శే. పింగళి లక్ష్మీకాంతంగారు నాలుగు
-1965) ఆంధ్ర శాఖాధ్యక్షులుగా పనిచేసి విరమించిరి.
965 నుండి ఈ శాఖకు అధ్యక్షులు.

తరగతులను నిర్వహించడంతోపాటు తెలుగుభాషా సాహి
ప్రోత్సహించడం కూడ ఈ శాఖయొక్క ప్రధాన
ండ్లు నిండిన ఈ తెలుగుశాఖ ఆధ్వర్యాన ఈ క్రింది
(Theses) సమర్పించినవారు డాక్టరేట్ పట్టాలను

ాలయ నిబంధనల ప్రకారం తెలుగు భాషా సాహిత్యాలకు
క వ్యాసాల్ని ఇంగ్లీషులోగాని, తెలుగులోగాని రచించవచ్చు.
మ గ్రాంథిక శైలిలోగాని, వ్యావహారిక శైలిలోగాని వ్రాయ
ట్టికలో ఇంగ్లీషు శీర్షికలున్న సిద్ధాంత వ్యాసాలు ఇంగ్లీషులో
ఈ గుర్తుగలవి ముద్రితాలు.

**క—రచయిత—పరిశోధననాకాలం—డిగ్రీవచ్చిన తేది—**
**వరుసలో-**

of Telugu compounds- J. సూర్యనారాయణ - జనవరి
- ఆగస్టు 1964 - డా. భద్రిరాజు కృష్ణమూర్తి.

2. Descriptive grammar of Nannaya's usage – K. నాగభూషణ రావు - జూలై '61-జూలై '64 - జూలై 1965 - డా. K. మహాదేవశాస్త్రి.

3. A study of Yerrapraggada's works - V. రామచంద్రన్- జూలై '60-జూలై '64 - ఏప్రిల్ 1966 - ఆచార్య పింగళి లక్ష్మీకాంతం.

*4. ద్విపదవాఙ్మయము - G. నాగయ్య - జనవరి '62 - జనవరి '65 - అక్టోబర్ 1966 - ఆచార్య పింగళి లక్ష్మీకాంతం.

5. Historical grammar of Inscriptional Telugu (1200–1400) A. D.) – M. కందప్పచెట్టి - జూలై '62 - జూలై '66 - జనవరి 1968 - డా. K. మహాదేవశాస్త్రి.

6. ఆంధ్ర సాహిత్యములో దేశి కవితోద్యమము-పాలకురికి సోమనపాత్ర -T. కోదండరామయ్య - జూలై '62 - జనవరి '68 నవంబర్ 1968- డా. జి. యస్. రెడ్డి.

*7. ఆంధ్ర భాగవత విమర్శ - P. V. L. V. ప్రసాదరావు - జూలై '64- జూలై '66 - డిసెంబర్ 1967 - డా. K. మహాదేవశాస్త్రి.

8. A Descriptive grammar of Nannechodas Kumarasambhavam - L. B. శంకరరావు - జూలై '63 - జూలై '66 - డిసెంబర్ 1967- డా. K. మహాదేవశాస్త్రి.

9. తెలుగులో వీరగాథా కవిత్వము - T. V. సుబ్బారావు - జూలై '63- జనవరి '68 - ఫిబ్రవరి 1969 - డా. జి. యస్. రెడ్డి.

10. English loan words in Telugu – S. అక్కిరెడ్డి - జూలై '64- జూన్' 70 - జూలై 1971 - డా. జి. యస్. రెడ్డి.

11. శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకములు, ఇతర రచనలు-వాని వైశిష్ట్యము- S. గంగప్ప-జనవరి'67-అక్టోబర్'71-జూన్ 1972 - డా. జి. యస్. రెడ్డి.

12. తెలుగు ప్రబంధములు-ప్రకృతి వర్ణన - A. నరసింహం-జనవరి'65-మార్చి'72-ఫలితం ఇంకనూ ప్రకటింపబడలేదు-డా. జి. యస్. రెడ్డి.

13. ధర్మవరం రామకృష్ణమాచార్యుల నాటక పరిశీలనము - S. వీరస్వామి నాయుడు - జూలై '65 - మే '72 - ఫలితం ఇంకనూ ప్రకటింప బడలేదు - డా. J. చెన్నారెడ్డి.

పై పట్టికనుబట్టి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో యింతవరకు భాషా విషయపరంగా ఐదు సిద్ధాంత వ్యాసాలు, సాహిత్యపరంగా ఎనిమిది సిద్ధాంత వ్యాసాలు రచింపబడ్డాయి. ఈ విశ్వవిద్యాలయంలో పరిశోధన కార్య క్రమంలో యించుమించు సమప్రాధాన్యం భాషా సాహిత్యాలకు వుండడం గమనించదగిన విశేషం

John Leonard అనే అమెరికన్ విద్యార్థి ఈ తెలుగుశాఖలో కొంత కాలం పరిశోధకుడుగా వుండి "Kandukuri Veeresalingam - As a social Reformer" అనే సిద్ధాంతవ్యాసాన్ని రచించి Wisconsin University కి సమర్పించి 1969 లో పి.హెచ్.డి. పట్టాన్ని పొందగలిగాడు.

ప్రస్తుతం ఈ క్రింది అంశాలమీద పరిశోధన కొనసాగుతూ వుంది.

| పరిశోధక విషయం | పరిశోధకుని పేరు |
|---|---|
| 1. తెలుగు నిఘంటువుల పరిశీలన | T. ఉషారాణి |
| 2. తెలుగు గ్రామనామాల పరిశీలన కడప జిల్లా. | K. విశ్వనాథరెడ్డి |
| 3. తెలుగులో కవిసమయములు | K. గోపాలకృష్ణయ్య |
| 4. నన్నయ అక్షర రమ్యత | V.V.L. నరసింహారావు |
| 5. ఆధునిక తెలుగు కవిత్వముపై జాతీయోద్యమ ప్రభావము | M. సుబ్బారెడ్డి |
| 6. తెలుగు సాహిత్యములో చేమకూర వేంకటకవికి గల స్థానము | V. నారాయణరెడ్డి |
| 7. అన్నమయ్య భాషా ప్రయోగాలు | K. శ్రీనివాసులు శెట్టి |
| 8. భారతీయ వ్యాఖ్యాన సంప్రదాయము- తెలుగులో వ్యాఖ్యానము | M.V. నారాయణశర్మ |
| 9. ప్రబోధ చంద్రోదయ విమర్శ-తులనాత్మక పరిశీలనము | M. గురవయ్య |

10. సీతారామాంజనేయ సంవాద విమర్శ — R. బాలరాజు
11. జాషువా కృతుల విమర్శ — D. భాస్కర చౌదరి
12 రంగనాథ కంబరామాయణములు-తులనాత్మక పరిశీలన — N. వెంకటరమణయ్య
13. తెలుగులో సాహిత్య విమర్శ — K. S. రామమూర్తి
14. కవిత్రయ భారతము ధ్వని సిద్ధాంతము — S. రఘునాథశర్మ
15 తెలుగులో వ్యాసరచనా పరిణామము — K. ఇనాక్
16. తిక్కన-జాతీయ ప్రయోగము — C. దామోదరశాస్త్రి
17. తిక్కన తెలుగు-క్రియా ప్రక్రియ — G. సుబ్రహ్మణ్యం

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఈ క్రింది సిద్ధాంత వ్యాసాలను తెలుగుశాఖ తరపున ప్రచురించింది.

1. J. Suryanarayana — *A study of Telugu compounds (1966)*
2. G. N. Reddy — *A study of Telugu Semantics (1966)*
3. K. Mahadeva Sastri — *Historical grammar of Telugu Language (1966)*

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ ఆధ్వర్యాన డా. జి. యన్. రెడ్డి ముఖ్య సంపాదకులుగా "శ్రీ వేంకటేశ్వర ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు" నిర్మాణం పూర్తి అయింది. దీని ప్రచురణకు తెలుగు అకాడెమీ హైదరాబాదు అంగీకరించింది. ఇది త్వరలో వెలువడ గలదు.

# మద్రాసు విశ్వకళాపరిషత్తు-
# తెలుగు పరిశోధన

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

ఎం. ఏ., డిగ్రీ పరీక్షకు బోధించు అనుబంధ కళాశాలలు మద్రాసులో చాలా యున్నవి కాన మద్రాసు విశ్వకళాపరిషత్తులో పరిశోధనయే ప్రధానముగ నున్నది. బోధన చాలతక్కువ. అసలు లేదనియేచెప్పవచ్చును. బోధన అనుబంధ కళాశాలలోమాత్రమే జరుగును.

## 1. నేను చేసిన పరిశోధన

**1. గ్రంథములు :**

(I) 1947వ సం॥న ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు సర్ ఆర్. వెంకటరత్నంనాయుడు రిసర్చిమెడల్ పారితోషికమునకై "వీరశైవాంధ్ర వాఙ్మయ"మను విషయముపై పోటీపరీక్షను జరిపిరి. నేనా పోటీలో పాల్గొని వీరశైవాంధ్ర వాఙ్మయమునుగూర్చి యొక పరిశోధన గ్రంథమును డెమ్మిసైజులో 400 పుటలలో వ్రాసి ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి సువర్ణపతక పారితోషికమును పొందితిని. ఈగ్రంథమున ఆంధ్రవాఙ్మయమున వీరశైవమతమునకు సంబంధించిన వివిధ మత ప్రతిపాదిత పురాణములు, ప్రబంధములు, యక్షగానములు, శతకములు, పాటలు, ద్విపదలలోను, చంపువులుగనున్న వివిధగ్రంథములు పరిశోధింపబడినవి.

(ii) 1949 వ సం.న "నాటక విమర్శన"మను గ్రంథమును రచించితిని. అందులో మొదటి ప్రకరణమున ప్రాచ్య పాశ్చాత్య నాటకరచనా సంప్రదాయములను వివరించి, వాని భేదములను పరిశీలించితిని. తరువాత సంస్కృతమందలి భాసుని స్వప్నవాసవదత్తము, భట్ట నారాయణుని వేణీసంహారము, విశాఖదత్తుని ముద్రారాక్షసమను నాటకములను ప్రాచ్యపాశ్చాత్య నాటకవిమర్శ పద్ధతుల ననుసరించి సమీక్షను చేసితిని. ఇందు కవికాలము, నాటక కథయొక్క మూలము, మూలమునుండి మార్పులు, వాని ప్రయోజనములు, పాత్ర పోషణము మొదలైన యనేక చర్చనీయాంశములపై విమర్శచేయబడినది.

(iii) 1938 వ సం.న ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు డాక్టరు కట్ట మంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులుగా నున్నపుడు విపులమైన ఆంధ్ర వాఙ్మయచరిత్రను వ్రాయించుటకై యొక ప్రణాళికను తయారుచేసి రెండు సం॥లు గడువునిచ్చి, వేయి రూపాయలు పారితోషిక మిచ్చునట్లుగా ప్రకటించిరి. 1940 సంవత్సరములో తిరుపతిలో జరిగిన దశమ సకల భారత ప్రాచ్య విద్యా సమావేశమున ద్రావిడశాఖాధ్యక్షులుకూడ నట్టి సమగ్రమైన విపులాంధ్ర వాఙ్మయచరిత్ర రచనావశ్యకతను గూర్చి యుగ్గడించిరి. అంతకు పూర్వ మాంధ్ర వాఙ్మయచరిత్ర సంగ్రహములు రెండు మూడుకలవు. అవియన్నియు అసమగ్రములు, అసంతృప్తికరములుగ నుండుటచేతనే ఆంధ్ర విశ్వ కళా పరిషత్తువారు విపులమైన సమగ్ర వాఙ్మయ చరిత్ర రచనకు ప్రకటించినారు. అప్పుడుకాని తర్వాతకాని యట్టి సమగ్రరచనకు నెవరును వ్రాయ ప్రయత్నింప లేదు. 1950 సం.వరకు దానికి ప్రయత్నించినవారెలేరు.

(iv) ఆంధ్రనాటకరంగమునుగురించి వివిధ నటుల చరిత్రలతో, "ఆంధ్రనాటకకళ" అను పేరుతో గ్రంథమును రచించినాను. ఇందు సంస్కృ తాంగ్ల నాటక సంప్రదాయములు తెలుగు నాటకములపై నెట్టి ప్రభావమును నెర పినవో వివరింపఁబడి, సంస్కృతాంగ్ల నాటకచరిత్రలు క్లుప్తముగా తెలుపఁబడి నవి. ఆంధ్రనాటక ప్రారంభదశలిందు స్పష్టముగా వివరింపఁబడినవి. ఆంధ్రీ కరణములును, సాంఘిక చారిత్రిక పౌరాణిక నాటకములు గుర్తింపఁబడినవి. మరియు వివిదాంధ్రనటుల నటనా విశేషములు కూడ వర్ణింపఁబడినవి. వివిధ ప్రదేశములలో నాటక సమాజములెట్లు వికసించినవో తెలుపఁబడి, క్రమముగా నాంధ్రనాటకకళ యెట్లు క్షీణదశకువచ్చి పతనము పొందినదో సకారణముగ తెలుపబడినది. సినిమాకళవలన నాటకరంగ మెంతవరకు దెబ్బతిన్నదో విచా రింపఁబడి, సినిమాకళకు నాటకకళకుగల భేదము వివరింపఁబడినది. తరువాత సంసారిక కథలను వస్తువులుగాగ్రహించి నాటికలు వ్రాయువిధానమెట్లు నూతన ముగా ప్రబలుచున్నదో సూచింపబడినది.

(v) భాషాశాస్త్రమునుగురించి రాయల్ సైజు 200 పుటలలో రచింపఁ బడినది. ప్రపంచమందలి వివిధభాషల లక్షణములు పరిశీలింపఁబడి వాని ప్రత్యేక గుణములు క్రోడీకరింపఁబడి భాషాకుటుంబములుగా విభజింపఁబడినవి. వివిధ భాషలలోని వ్యాకరణాంశములనుబట్టి భాషాజాతులుగను, ధాతు శబ్ద

సామ్యములనుబట్టి భాషాకుటుంబములుగను నెట్లు వర్గీకరింపవలయునో వివరింపఁబడినది. భాషపరిణామమెట్లు జరుగునో పరిశీలింపఁబడినది. సన్నిహిత భాషలలోని ధాతువుల సామ్యమునునిరూపించుచు నాయాభాషల యైక్యమునుస్థాపించు విధానము పరిశీలింపఁబడినది. ఈవిధముగ భాషాపరిణామమును, వాని క్షీణదశలును, మృతభాషలనుండి నూతనభాషలు పరిణమించు విధానము తెలుపఁబడినది. సంఘము జాతి భాషాపరిణామమున కెంతవరకు తోడ్పడునో యిందు నిరూపింపఁబడినది.

## 2. నిడదవోలు వెంకట్రావుగారు చేసిన పరిశోధన

(i) శాసన పద్యకవులనుగూడచేర్చి 'ఆంధ్ర కవుల చరిత్ర అను పేరుతో ప్రారంభమునుండి తిక్కనవరకుగల కవుల చరిత్రను రచింపగా మద్రాసు విశ్వకళాపరిషత్తువారు దానిని 1951 లో ప్రచురించిరి. (ii) దక్షిణాంధ్రవాఙ్మయమను పేరుతో తంజావూరు, మధుర మొదలైన దక్షిణ సంస్థానములందు వెలసిన యాంధ్రకవులచరిత్రను రచింపగా మద్రాసు విశ్వకళాపరిషత్తువారు దానిని 1955 ప్రాంతమున ప్రచురించిరి.

## 3. విద్యార్థులుచేసిన పరిశోధన

(i) జి. వి. కృష్ణారావు, పింగళి సూరన కళాపూర్ణోదయముపై. Ph. D. కి

(ii) వై. సరోజిని ...ఆంధ్ర కవయిత్రులపై...M Litt. కు

(iii) చల్లా రాధాకృష్ణశర్మ...ఆంధ్రభాషపై తమిళభాషాప్రభావము. Ph. D. కి

(iv) విజయలక్ష్మి...కథావాఙ్మయము...M. Litt. కు.



# విమర్శ గ్రంథములు - వ్యాససంపుటులు

ఆచార్య డా. యస్వీ జోగారావు

స్వాతంత్రోద్యమ ప్రారంభంతో మన జాతి సర్వస్వము జాగృతమైనది. జాతికి వైతాళికులైన సాహిత్య స్రష్టలు, ద్రష్టలుచేసిన బహుముఖబంధుర మైన కృషిమూలంగా నవభావన మూదలగా సాహిత్యం కూడ నూతనచైతన్య చకచ్చకిత మైనది. సాహిత్యద్రష్టల సహృదయతా పటిష్ఠమైన విమర్శక దృష్టి అక్షరాకృతి ధరించిన కొలది సాహిత్యసృష్టి ఉత్తరోత్తర మహత్తరమైన సౌష్ఠవం సంతరించుకోవడాని కవకాశా లెక్కువవుతాయి. ఆధునిక యుగంలో ఆంధ్రసారస్వతక్షేత్రంలో అనేకులు విదగ్ధులు భావుకులు మేధావులు కోవిదులు క్షోదక్షమ పరిశీలన దక్షులు, వాదనిపుణులు, వచనరచనాచణులు అయిన విమ ర్శకులు బయలుదేరి బహుముఖంగా సాహిత్య సమీక్షలు చేశారు, చేస్తున్నారు. పత్రికలు పుంఖానుపుంఖంగా బయలుదేరి వారి పరిశ్రమ ఫలితాలకు కల్యాణ తోరణాలు కడుతున్నాయి. పరశ్శతంగా వెలుస్తున్నాయి వారి వ్యాసాలు. ముద్రణయంత్రాలు, ప్రచురణసంస్థలు, సాహిత్యపరిషత్తులూ, సమాజాలు తామక తంపరగా బయలుదేరి వ్యాససంపుటులను విమర్శ నిబంధములను వెలయిస్తున్నాయి. ఆన లీదృష్టి, దృక్పథము, ఉద్యమము అన్నవి మనకుకలిగిన పాశ్చాత్య సంస ర్గము ఫలితము. ఆధునికయుగం ప్రసాదించిన నవభావన ఫలితము.

వీరేశలింగం, గురజాడ. గిడుగు, కొమర్రాజు, పానుగంటి, చిలుకూరి, చెళ్లపిళ్ల, కాశీభట్ల, వేటూరి, మల్లంపల్లి, వజ్ఝల, కోరాడ, గంటి, కట్టమంచి, సురవరం, ప్రభృతుల వివిధ విమర్శలు, వ్యాసాలు సమకాలికుల అర్వాచీనుల రచనా సర ణికి ఒరవళ్లు పెట్టాయి. అందునా పానుగంటివారి "సాక్షి" వ్యాసాలు అనేక విషయాలగురించి వివిధ విమర్శ విన్యాసాలు ప్రదర్శించి తెలుగువారి వైమర్శిక దృక్పథానికీ, వ్యాసరచనకూ అప్రతిమాన దోహదం చేశాయనిచెప్పాలి. ఆయా పెద్దల వ్యాసాలు పరశ్శతంగా వివేకవర్ధని, సరస్వతి, శారద, సఖి, వైశాఖి, సమదర్శిని, ప్రతిభ, ఆంధ్రపత్రిక, భారతి మున్నగు అనేక పత్రికలలో ప్రక టితములవుతూ తెలుగునేల నాలుగుచెరగులా మన సాహిత్యానికి మంచివ్యాప్తిని

చేకూర్చాయి. సామాన్య పాఠకులను సైతం సాహిత్య ద్రష్టలను చేశాయి. విషయజిజ్ఞాసువులను విమర్శవ్యాసరచనా చికీర్షువులను చేశాయి.

**కవిచరిత్రలు**

నవయుగ సారస్వత పరమేష్ఠి అయిన వీరేశలింగంగారే తెలుగులో విమర్శకు, వ్యాసరచనకు ఆద్యప్రవర్తకు డనవచ్చును. వారి శేముషీశాణోల్లీఢమైన విమర్శ "ఆంధ్రకవుల చరిత్ర" లో దర్శనమిస్తుంది. అది ఒరవడిగా తదుపరి తెలుగులో ఎంతో వివిధసాహిత్య విషయవిమర్శ, పరిశోధన చకచక సాగుతూ వచ్చాయి. 1947 నుండి కీ. శే. చాగంటి శేషయ్యగారి చేతిమీదుగా "ఆంధ్ర కవి తరంగిణి" ఒక ప్రామాణికగ్రంథంగా వెలయడాని కది మార్గదర్శకం. అయితే అది 13 సంపుటాలు మాత్రమే ప్రచురింపబడి సమగ్రరూపంతో సాక్షాత్కరించక పోవడం శోచనీయం. 1956 లో శ్రీ నిడదవోలు వారి "తెనుఁగు కవుల చరిత్ర" యొకటి వచ్చింది కాని అది శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారి చేత "అఖండ దీపారాధన దానశాసన వాఙ్మయ చరిత్ర" అనే కితాబందు కొన్నది. అందులో విషయం జావ కారుతుంది. పిడుచ కట్టదు. ఇటీవల శ్రీశిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు "విజయనగరాంధ్రకవులు" అనే గ్రంథంవ్రాశారు. ఆ విషయమై లోగడ కీ. శే. చేకుమళ్ల అచ్యుతరావుగారి గ్రంథంలో వున్నంత రససర్వంకషమైన రమణీయవిమర్శ దృష్టిగాని,విషయవైశాల్యంగాని యిందులో లేవు. 1970 లో శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావుగా రొక సరికొత్త పూనికతో పూర్వాంధ్రకవుల చరిత్రరచన ప్రారంభించారు. అందులో మొదటిభాగం వెలువడింది. ఎందరో విస్మృత కవుల కందులో నీరాజనము లెత్తినారు. వారిఉద్యమము "ఆంధ్రవాఙ్మయ చరిత్ర జిజ్ఞాసువులకు నూతనోత్సాహము కలిగించునట్టి" దని ఆచార్య దివాకర్లవారి ప్రశంస. 1950 లో శ్రీ మధునాపంతులవారి "ఆంధ్రరచయితలు" అనే చక్కని గ్రంథం వచ్చింది. అందులో జనన తిథి 19 వ శతాబ్దికి చెందిన వందమంది రచయితల కీర్తిదంత మెంతో ముదావహకావ్యకళాసురభిళంగా సంగ్రంథిత మైంది. 1953 లో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు శతాధికంగా వున్న ప్రాచీనాధునికాంధ్ర రచయిత్రుల చరిత్ర నేర్చి కూర్చి "ఆంధ్ర కవయిత్రులు" అనే పేర గ్రంథాన్ని వెలయించి తెలుగుభాషా సమితివారి బహుమతి పొందేరు. ఆమె 1965లో "అఖిలభారత కవయిత్రు"లనే మరోహద్గ్రంథం ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ తరపున వెలువరించారు.

పఃమ శ్లాఘ్యమైన పరిశ్రమ మది. అందులో ఆంధ్ర కవయిత్రుల ఉదంతం కూడా వుంది. తె. భా. స. విజ్ఞాన సర్వస్వం 4, 6 భాగాలలోను, శ్రీ ఖండ వల్లివారి సంగ్రహాంధ్ర విజ్ఞానకోశంలోను అనేకాంధ్రకవుల ఉదంతం సవిమర్శకంగా ఉట్టంకింప బడింది.

వాఙ్మయ చరిత్రలు

ఈ స్వాతంత్ర్యయుగంలో కవి చరిత్రలే కాక వాఙ్మయ చరిత్రలుకూడ అనేకం వెలిశాయి. మొట్టమొదటి "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర" లోగడ కీ.శే. వంగూరి సుబ్బారావుగారు రచించారు. ఆ చరిత్ర రచన కానాడు దొరికిన సామగ్రి అత్యల్పం. అందుచేత ఆ గ్రంథం అపర్యాప్తమైనదని చెప్పాలి. 1955 లో ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి "ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహం", 1958 లో ఆచార్య శ్రీ దివాకర్ల వెంకటావధానిగారి "ఆంధ్ర వాఙ్మయచరిత్రము", 1960లో శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారి సంకలనం అయిన "తెలుగు వాఙ్మయము—సంగ్రహ చరిత్ర" వచ్చాయి. ఇవి బృహద్గ్రంథాలు కాకపోయినా "కొండ అద్దమందు కొంచెమై యుండదా" అన్నట్లు ఆ కొంచెంలోనే కొండంత విషయాన్ని చూపడానికి ప్రయత్నించారు గ్రంథకర్తలు. సాహిత్యవిద్యార్థుల కవి చక్కని తెరువులు చూపగలవు. 1942లోనే కీ.శే. కురుగంటివారు, కీ శే. పిల్లలమర్రివారు తలపెట్టి ప్రచురిస్తూ వచ్చిన "నవ్యాంధ్ర సాహిత్యవీధులు" అనే నాలుగు భాగాల బృహద్గ్రంథం 1951 నాటికి పూర్తయింది. ఇది కఠోరపరిశ్రమ ఫలితం, కమ్మని భావుకుల భణితం.

1956 ప్రాంతంలో అనుకొంటాను శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారి "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వం" మొదటి భాగం వచ్చింది. "యద్యదా చరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః" అనేమాట తలపుకు తెచ్చింది. సొంత గొంతుక వినిపించినచోట్ల భావవైపరీత్యము, వివాదము అహమహమికతో ముందుకు వస్తాయి. వీరి "వీరశైవ వాఙ్మయము" సువర్ణ పతకం పొందింది. కాని శివుడికి దయలేదు. గ్రంథము ఆంతర్య పరిశీలనం ప్రసన్నం కాలేదు. 1965 నుంచి ఆరుద్రగారి "సమగ్రాంధ్ర సాహిత్యం" పరంపరగా 12 సంపుటాల వరకూ వచ్చింది. పూర్వాంధ్రసాహిత్యం చాలావరకు గతార్థమైనది. ఇంక త్వరలో మిగతా సంపుటులనుగూడ తెచ్చే పూనికతో వున్నారని వింటున్నాం. ముదావహం. అసలాయన ఈ వాఙ్మయ చరిత్ర రచన చేపట్టారని విన్నప్పుడు అస్మాదృశు

లకు సంభ్రమాశ్చర్యాలు కలిగేయి. చూసినప్పుడు సంతోష సంతృప్తులు కలిగేయి. వారి గ్రంథం శుష్కచరిత్రకాక వలుతావుల సూనృతమైన రసజ్ఞతతో నిశితపరిశీలనతో నిశిత వాక్కుతో నిష్పాక్షికనిర్ణయంతో చేయబడిన చారుతర చతుర సమీక్ష. ఆ మధ్య ఆ విషయాన్ని బోధించే అధ్యాపకులు చాటుగా చదువుకునేవారు కాని యిప్పుడు బాహాటంగానే చదువుతున్నారు. శుభం. ఈ స్వాతంత్ర్యయుగారంభ దశలోనే ఒక చిక్కని నిపుణ ప్రణాళికతో ఆంధ్ర వాఙ్మయ చరిత్ర రచనకు పథకం వేసుకుని ఓ తగుమాత్రం సంపుటానికి సరిపోయే గ్రంథంవ్రాసి విరమించారు కీ.శే. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు. వారి స్వహస్తలిఖితప్రతి నెలాగో సంపాదించి యిటీవల బందరు త్రివేణి వారికిచ్చాను. వారచ్చువేస్తున్నారు. 1966 లో కేంద్ర అకాడమీ డాక్టర్ గిడుగు సీతాపతిగారి "History of Telugu Literature" ప్రచురించారు. ఆంగ్లం లో జరిగిన వెనుకటి రెండు ప్రయత్నాలకన్నా యిది మిక్కిలి సుష్ఠుగా వుంది. తె.భా.స. 3, 4, 6 సంపుటాలలో తెలుగు సాహిత్య చరిత్ర బాగానే చోటు చేసుకుంది.

ఇక ప్రత్యేకంగా కొన్ని వాఙ్మయశాఖలగురించిన గ్రంథజాలం కొంత వుంది. అందులో ముఖ్యములైనవి కొన్ని: 1. శ్రీ నిడదవోలు వెంకటరావుగారి "ఉదాహరణవాఙ్మయచరిత్ర" (1950–68) ఇందు 22 ఉదాహరణకావ్యములు గూడ పూర్తిగా ఉదాహరింపబడి వుండడం ముదావహమైనవిషయం. 2. శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారి "శతకవాఙ్మయసర్వస్వము" (1954) వంగూరి సుబ్బారావుగారే మొదట 'శతకకవులచరిత్ర' వ్రాసినా ఈగ్రంథం అనేకాంధ్ర శతకరత్నముల రమణీయదీధితులను సమగ్రసుందరంగా చూపిస్తుంది. 3. కీ. శే. గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారి "ఆంధ్రవచనరచనా పరిణామము" (1961). కూలంకషమైన కృషిఫలితము. తె. భా. స. బహుమతి పొందినగ్రంథము. 4. కీ.శే. కోరాడ రామకృష్ణయ్యగారి "దక్షిణదేశ భాషా సారస్వతములు- దేశి" (1954)- వివిధ ద్రావిడభాషలతో సరిపోల్చి తెలుగు దేశికవితయొక్క విశిష్టతను చాటిచెప్పే విదగ్ధుని సంభావన మీకృతి. 5. శ్రీ ఆర్వీయస్. సుందరంగారి "తెలుగుసాహిత్యంలో దేశికవిత" (1970)- మన వివిధ వాఙ్మయశాఖలలో దాక్కొనివున్న సలక్షణ 'దేశి' సుందరిని సరసంగా దర్శించే గ్రంథం. 6. దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము గురించి ఆరు గ్రంథాలు బయల్వెడలినవి. గ్రంథకర్తలు : కురుగంటి, శ్రీ నిడదవోలువెంకటరావుగారు,

డాక్టర్ కె. వి. ఆర్. నరసింహంగారు, డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్య గారు, శ్రీ వాత్సవ, కుమారి కొక్కొండ సత్యవతి, శ్రీ శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి గారు. నిడదవోలువారిగ్రంథం కేటలాగు పాండిత్యానికి కాణాచి అని నేనిదివరకు భారతిలో నిరూపించాను. మిగతావారంతా అసలుగ్రంథాలు చదివి వ్రాసినవారేకాని ఈ ఏడుగ్రంథాలను అసలుగ్రంథాలను దగ్గర పెట్టుకుంటే ఈవిషయంగురించి యింకా సర్వంకషమనోజ్ఞమైన గ్రంథం వ్రాయడాని కవకాశం వుంది. 7. 1960 ప్రాంతంలో అప్పుడే కనుమరుగైపోయిన మొన్నమొన్నటి 19వ శతాబ్ది తెలుగుసాహిత్యచరిత్ర గురించే పద్ధతిగా పకడ్బందీగా కీ.శే. యండమూరి సత్యనారాయణరావుగారు "ఉషఃకిరణాలు" అనే గ్రంథం రచియించి ఆం. ప్ర. సా. అకాడమీవారి పారితోషికం పొందేరు. 8. శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రిగారు ఈమధ్యనే "ఆంధ్రనాటకకళ" అనే బృహద్గ్రంథం రచించారు. తద్విషయకములైన సర్వపూర్వగ్రంథముల సామగ్రిని చక్కగా వుణికి పుచ్చుకొన్నారు. 9. 1964లో "గజపతిరాజుల తెలుగుసాహిత్య పోషణము" అనే గ్రంథాన్ని సత్యనిష్ఠతో విషయపుష్టితో విమర్శపరిశుద్ధదృష్టితో వెలువరించారు శ్రీబులుసు వెంకటరమణయ్యగారు. 10. 1968లో డాక్టర్ జి. నాగయ్యగారు తెలుగుసాహిత్యసమాలోచన చరిత్ర మరొక క్రొత్తవెలుగు త్రోవ త్రొక్కేరు. "తెలుగుకావ్యావతారికలు" పేర వాటి సంప్రదాయాన్ని, పరమార్థాన్ని పరిశోధన పటువైన ప్రజ్ఞతో సంగ్రహించారు. 1969లో అకాడమీ పారితోషికం అందుకొని వచ్చిన డాక్టర్ కె. గోపాలకృష్ణారావుగారి "తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము" సాహిత్య భాషా వ్యాకరణ విశేష పరిశోధనాత్మకమైన చక్కని గ్రంథం. ఇక మరో సరిక్రొత్తకోవకు చెందిన గ్రంథాలు. 11. శ్రీ ముట్నూరి సంగమేశంగారి "తెలుగుహాస్యము" (1954) 12. శ్రీ మునిమాణిక్యంవారి "మనహాస్యము" (1968). ఈ రసజ్ఞ పారిషదుల చేతిలో ఈ రెండుగ్రంథాలూ మానవత్వమును పరిపాలించే రసామతల్లియైన మనహాస్యము స్వరూపాన్నీ అతివేలకౌశలంతో అభివర్ణించారు, ఆలపించారు, చిత్రించారు, శిల్పించారు. అందునా హాస్యచతురాస్యుడు మునిమాణిక్యం ఆ రసవిషయంలో తెలుగులో ఎన్నడూలేని సాధికార సిద్ధాంతగ్రంథాన్ని సిద్ధింపజేశారు. 13. 1961లో "వీరరసము" అనే డాక్టర్ జి. వి సుబ్రహ్మణ్యంగారి గ్రంథం వచ్చింది. వీరరస స్వరూప స్వభావాలను పరమభావుకతతోను పటుశాస్త్రజ్ఞతతోను వివరించి మన వివిధ వాఙ్మయశాఖలలో దానికి

గల ప్రతిపత్తిని నిరూపించి అకాడమీ బహుమానానికి సమర్థులయ్యారు గ్రంథ కర్త. ఇలా ఒక రససిద్ధాంతాన్ని ఒకవాఙ్మయానికి సమన్వయించి సంసాను శీలనము, సమ్యగవలోకనము చేయటానికి సమకట్టిన గ్రంథాలు మనకన్నో లేవు. అందులో ఇది అక్షరాలా అగ్రగణ్యము. 14. ఇక చిత్రంగా మరోతరహా గ్రంథం వచ్చిందితెలుగులోకి 1968లో అకాడమీబహూకృతి నందుకొని. అది శ్రీ రావూరి దొరస్వామిశర్మగారి-"తెలుగులో తిట్టుకవిత్వము" ఈకవిత రౌద్రహాస్యాది రసాలకు తావలమైనది. నరసత్వపు పసను, విరసత్వపు కసనూ ఏకత్ర ప్రదర్శిస్తుంది. మనవాఙ్మయంలో ఎక్కడెక్కడ దాగున్నదాన్నీ కొప్పట్టు కీడ్చుకొచ్చి రసజ్ఞపాఠక పారిషదుల కొలువులో నిలబెట్టేరు శర్మ గారు. శాస్త్రనిశాతమేకాదు తమవాక్కు రానిక్యపేశలమైనదికూడ అని నిరూ పించుకొన్నారు. తెలుగుదేశంలోని వివిధ సంస్థానాల సాహిత్యసేవగురించిన డాక్టర్ దోణప్పగారి బృహద్గ్రంథం అకాడమీ బహుమానానికి పాత్రమైనది.

**3. ప్రత్యేక కవివిషయకములు :**

ప్రత్యేకంగా కొందరు కవులగురించి, వారి కావ్యాలగురించి కొన్ని సమీక్షా గ్రంథాలు వెలిశాయి. అందులో ఈ యుగానికి సంబంధించినవి కొన్ని: శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "నన్నయ ప్రసన్న కథా కలితార్థయుక్తి," "అల్లసాని వాని అల్లిక జిగిబిగి," "శాకుంతలము యొక్క అభిజ్ఞానత." "కావ్య పరిమళము" మొ॥. ఒక మహాకవి మరో మహాకవి యొక్క విమర్శ కుడైతే చూటముచ్చటగా వుంటుంది - శృంగార ప్రబంధనాయకుడు కామశాస్త్రం వ్రాసినట్టుంటుంది. సాహిత్య స్రష్టగా గాని, ద్రష్టగా గాని ఎంత గహనమైన రసరహస్యాన్ని అందిపుచ్చుకోవడంలోను అందెవేసిన చేయి వారిది. శిల్పజ్ఞతలో సిద్ధహస్తులు. విదగ్ధతకు మారుపేరు విశ్వనాథ. అట్టివారి విమర్శలు అవశ్యం మనకుపాథేయములే గాని ఒక్కొక్కప్పుడంత భావభారధూర్వహగంభీర హృదయులూ ఏతామ త్రొక్కిట్లు ఎంతెంత గంభీరార్థాన్నీ యిట్టే పైకెత్తు తారుగాని తాము తేలిపోతూ వుంటారు. ఆ మధ్య అకాడెమీవారు నన్నెచోడు ని కవిత్వంగురించి పోటీ పెట్టేరు. ఆ నిమిత్తంగా తెనుగులో చక్కనివి నాల్గు కుమారసంభవ సమీక్షా గ్రంథాలు వచ్చాయి. అందులో కవికాల నిర్ణయ విష యంలో క్రొత్త పంథా త్రొక్కిన శ్రీ వేదము వేంకటరామశాస్త్రి గారిది అగ్రి తాంబూలము. వారి ఖ్యాతికే 1959 బహుమతి లభించింది, కీ. శే. వేదాల తిరు

వేంగళాచార్యులవారు 1965లో "కుమార సమ్భవతత్త్వము"ను వెలువరించారు. వారి సమీక్షాసాగరాని కొక రేవు లేదు. అది వారి పాండిత్యంవలె దహనమై పోయింది. ఈయుగంలో మహాభారతం గురించి కొన్ని మంచిగ్రంధాలు వచ్చాయి. 1. శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు గారి "భారతము - తిక్కనరచన" (1949), 2. డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు గారి కవిత్రయము. 3. దేశిరాజు భారతీదేవిగారి "కవిత్రయ కవితారీతులు (1959). ఆ కదచన్న మహాకవులమీద ఈ విమర్శకుల కున్న ప్రగాఢ ప్రతిపత్తికొక హార్దిక ప్రణామము - కాని లోతుకు దిగక ఒడ్డునే నెమరువేసే ధోరణియెక్కువగా కనిపిస్తుంది వీటిలో. సారస్వత పరిషత్తువారు 1957 ప్రాంతంలో పరమ భావుక పట్టభద్రులైన కొందరు కోవిద గ్రామణులచే "ఆంధ్ర మహాభారతోపన్యాసములు" "ఆంధ్ర మహా భాగవతోపన్యాసములు" వ్రాయించి చక్కని గ్రంథాల రూపంలో వెల యించారు. అకాడమీ వారు కూడ 1962 నుంచి "సాహిత్యోపన్యాసములు," అనేపేర నిష్ణాతులైన వారిచే నన్నయ, చిన్నయసూరి, క్షేత్రయ్య, గిడుగు, నన్నెచోడుడు, వేదం, శ్రీపాద, చిలకమర్తి, కాశీనాథుని, సాహిత్య వ్యవసాయ ములగురించి నిష్ణాతులైన వారిచే ఉపన్యాసా లిప్పించి వాటి నొక ప్రత్యేకగ్రంథ పరంపరగా వెలువరిస్తున్నారు. శ్లాఘ్యమైన ప్రయత్నం. 1949లో కీ. శే. వేటూరి వారు "అన్నమాచార్య చరిత్రము"ను చక్కని కావ్యకళతో ఆవిష్కరించారు. ఇటీవల శ్రీనాథుని గురించి కొంత చక్కని సమీక్షా గ్రంథజాలం వచ్చింది. 1. శ్రీ గడియారం వెంకట శేషశాస్త్రిగారి "శ్రీనాథుని కవితా సామ్రాజ్యము" 2. శ్రీకుందూరి ఈశ్వరదత్తు గారి "శ్రీనాథుని కవిత్వతత్త్వము", 3. చిలుకూరి పాపయ్య శాస్త్రిగారి "శ్రీనాథకవితా సమీక్ష. 4. కీ. శే. బండారు తమ్మయ్య గారి "శ్రీనాథమహాకవి." చరిత్ర విషయంలో చిలుకూరి వారు బండారువారు చేసిన పరిశోధన సాహిత్య విషయంలో గడియారం వారు కుందూరి వారు చేసిన సమీక్షయున్నూ గణనీయములైనవి. కీ.శే. గొబ్బూరివారు తమ "నన్నయ విజ్ఞాననిరతి" (1959)లో నన్నయగారినాలుక నోలగించిన సరస్వతిని ఎవ్వరూ దర్శించని ఒక క్రొత్తకోణంనుంచి దర్శించారు. పాలకురికి సోమనాథుని తథాపి సర్వశివకవుల వాఙ్మయాన్నీ ఆపోశనం పట్టిన బండారు తమ్మయ్యగారు 1966లో "సోమనాథకవి" అనే గ్రంథం రచించి తమ 'విమర్శకాగ్రేసర' బిరు దాన్ని చరితార్థం చేసుకున్నారు. ఈవిరి సలవని ఉద్యోగాంతరంలో వుంటూ

వారుచేసిన వాగ్దేవీవరివస్య గొప్పది. 1965 లో "మహాకవి మార్గము" అను పేర తిక్కన కవితామార్గాన్ని సమీక్షిస్తూ నేనొక గ్రంధాన్ని ప్రచురించాను.

ఈ స్వాతంత్ర్య యుగ ప్రాత స్సంధ్యా సమయంలో కక్కులం కళ్లెము వంటి ప్రౌఢ ప్రబంధమైన ఆముక్తమాల్యద గురించి శ్రీ వెల్దండ ప్రభాక రామాత్యు లొక మహాభినివేశంతో ఒక సమీక్షా గ్రంథం వెలువరించారు. దానికి "ఆంధ్ర సాహిత్య సౌరభము" అనేపేర శ్రీమాన్ ఈయణ్ణి వేంకట వీరఘవా చార్యుల వారు రచించిన పీఠిక విషయ గౌరవంలోను, పరిశోధన పాటవంలోను గొప్పది. మనుచరిత్ర వంటి మహాకావ్యం మీద ఇప్పటి కొక సమగ్ర విమర్శనిబంధం వెలువడకపోవడం శోచనీయం. వెనుక "మను చరిత్ర హృదయా విష్కరణం" అనే పేరుతో కీ.శే. జనమంచి శేషాద్రి శర్మగారొక గ్రంథం వెలయించారు. కాని అవి "నామ్ బడా దర్శన్ తోడా". 1968లో శ్రీ కట్టా వేంకట సుబ్రహ్మణ్యం గారి సమీక్షా గ్రంథం వచ్చింది. గ్రంథం చిన్నదే అయినా అ సమీక్ష చిన్నదాని పొందులా మన్నిక మనోజ్ఞంగా వుంది. వెనుకటి వజ్ఝలవారి "వసుచరిత్ర విమర్శనము"తో రామరాజభూషణుని ఋణం తీరి పోలేదు. ఇటీవల భీమవరం శ్రీ రామరాజ భూషణ సాహిత్య పరి షత్తువారు ప్రచురించిన "భూషణ కిరణావళి" (1969), శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి వసుచరిత్రసమీక్ష ఆ మహాకవి బహుముఖ కళా కౌశలాన్ని దక్షతతో ప్రదర్శించాయి. గురజాడ అప్పారావు, దువ్వూరి రామి రెడ్డి. గారు సాహిత్యం గురించిన శ్రీ రమణారెడ్డి గారి సమీక్షా గ్రంథాలు, శ్రీశ్రీ గారించి శ్రీ అద్దేపల్లి రామమోహనరావు గారి సమీక్ష ముఖ్యగునవి పేర్కొన దగినవి. ఇంకా మరికొన్ని ఏవం విధ ప్రత్యేక కవికావ్య విమర్శ గ్రంథాలు లేక పోలేదు గాని అన్నిటి గురించి చెప్పడాని కిక్కడ నాకున్న స్థలం విషయంలో నాస్తికత్వం నన్నావేశించింది.

**శాస్త్రవిషయకములు :**

భాష, వ్యాకరణం, ఛందస్సు, సాహిత్య విమర్శ అనే విషయాలకు సంబంధించిన చక్కని సమీక్షాగ్రంథాలుకూడా ఎన్నో వచ్చాయి యీ యుగంలో. ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజిగారి- "ఆంధ్రభాషా వికాసం" (1947) అనే గ్రంథం శాస్త్రీయదృక్పథంతో ఆంధ్రభాషా చరిత్రను సమీక్షించిన గ్రంథ రాజము. తదుపరి ఎన్నదగినవి వజ్ఝల వారి- "ద్రావిడభాషా పరిశీలనము", కోరాడ రామ

"భాషాచారిత్రక వ్యాసములు" (1954). నూ్ర ర్తిశ్రీ గారి- "తెలుగు భాషా చరిత్ర" (1934; కీ.శే. విష్ణుభొట్ల సూర్యనారాయణగారి-"భాషాపాఠములు" (1967). వ్యాకరణం విషయంలో- వజ్ఝల వారి "వ్యాకరణ సంహితా సర్వస్వము", దూసివారు, దువ్వూరివారు, నూ్ర ర్తిశ్రీ, గాండీవి, వ్రాసిన బాలవ్యాకరణ వ్యాఖ్యలు, శ్రీ భాష్యకారాచార్యులగారి ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య, ఖండవల్లి, చెలమచర్లవారలు, శ్రీ ఆకెళ్ల అరుణాచల శాస్త్రిగారు వ్రాసిన అహోబల పండితీయ వ్యాఖ్యలు ఎన్నదగినవి. ఛందస్సు విషయంలో- ద్వివేదుల రామశాస్త్రి గారు, రావూరి దొరస్వామి శర్మగారు, గిడుగు సీతాపతిగారు, సంపత్కుమారాచార్యులుగారల కృషి. కృతులు ప్రశంసనీయములు. సాహిత్య విమర్శవిషయంలో- పింగళి, దివాకర్ల, కాకర్ల, విశ్వనాథ, విన్న కోటప్రభృతుల కృతులు, అలంకార శాస్త్రవాఙ్మయ అనువాద వ్యాఖ్యానాల విషయంలో జమ్మలమడక. వేదాల. పంతుల, భాగవతుల ప్రభృతుల కృతులు కొంతలోటు తీర్చినట్టివి.

**ఇతరభాషా వాఙ్మయ విషయకములు :**

ఇతరబాషా వాఙ్మయముల చరిత్రలు కొన్ని ప్రత్యేక గ్రంథరూపంలోను. కొన్ని తె. భా స. విజ్ఞాన సర్వస్వం- నెం. 6 - 'శవ్వి సాహితి' సంపుటం లోను వచ్చాయి. సంస్కృత మహాభారత విమర్శనము శ్రీ పుట్టపర్తి వారు రచించారు (1965) వాల్మీకిరామాయణ విమర్శనము, హర్షనైషధ పరిశీలనము శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి ప్రత్యగ్ర పరమార్థ వివరణాత్మకంగా వెలిశాయి. కాళిదాస భవభూతులగురించిన సాహిత్య తులనాత్మక పరిశీలనం చేసి శ్రీ గొడవర్తి సూర్యనారాయణ గారు 1966 లో ఆం. ప్ర. ప్రభుత్వబహుమతి నందుకొన్నారు. కాదంబరీ కావ్యాస్వాదము గురించి ఈ వ్యాసకర్త ఇదివర కనేక వ్యాసాలు ప్రకటించిఉన్నాడు.

1950 లో అప్పటికే సంస్కృత వాఙ్మయచరిత్ర రచించి ప్రచురించిన కీ. శే. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు- "సంస్కృత కవిజీతము" ప్రచురించారు. ఇంకా ఈ లాగున సంస్కృతవాఙ్మయం గురించి, ఇతర భాషావాఙ్మయాల గురించి సమీక్షాగ్రంథాలెన్నో మన భాషలో అవతరించాలి. అనాడేమన తెలుగువాఙ్మయానికి పుష్టి చేకూరుతుంది. తెలుగువాఙ్మయంయొక్క వ్యక్తిత్వం వైశిష్ట్యం చక్కగా తేటపడతాయి.

పూర్వోక్త విషయాలను పరికిస్తే ఈ స్వాతంత్ర్యయుగంలో సాహిత్య ద్రష్టలు విమర్శ విక్రమంతో పరాక్రమిస్తూ వున్నారని అర్థం అవుతుంది.

## వ్యాససంపుటులు

ఒక జాతియొక్క దినదినప్రవర్ధమాన మవుతూవున్న బహువిధ విజ్ఞాన గంగావాహినినుండి విషయజ్ఞులు, విమర్శదృగధ్వనీనులూ అయిన సారస్వత పురోహితులు పాఠకయాత్రికుల కందిచ్చే కాశీగుళ్ళిలు వ్యాసాలంటే విషయ సమాలోచనము, సమ్యగనుశీలనము, పటిష్ఠమైన ప్రణాళిక, వికకవితమైన వివరణము, సరళము చతురస్రమునైన రచనము దాని స్వభావజీవలక్షణ ములు. పాశ్చాత్యవాఙ్మయ ప్రపంచంలో గతశతాబ్దినుండి సర్వాంగసుందర మైన సారస్వతప్రక్రియగా రూపొందిన వ్యాసము మన కక్కడినుండి దిగుమతి అయిన సామాగ్రియే.

వివిధ సాహిత్య సాహిత్యేతర విషయాలపై సుష్ఠు ప్రక్రియా పటిష్ఠము లైన వ్యాసము లనేకము వేలయించి ఈమార్గమునందును మనకు మార్గదర్శకు డైన మహానుభావుడు నవయుగవైతాళికుడు వీరేశలింగమనీషి. తన సర్వంకష ప్రజ్ఞాపారమ్యమునకు సాక్షిగా "సాక్షి" వ్యాసాలను అక్షయతూణీర వినిర్ముక్త శరపరంపరగా కురిపించిన నవ్యసాహిత్యసవ్యసాచి పానుగంటి లక్ష్మీనరసింహ రావుగారు. మన వైజ్ఞానిక మహాపర్వదీపావళిగా వెలిసింది కొమఱ్ఱాజువారి "లక్ష్మణరాయవ్యాసావళి". ఆయా పెద్దలు విజ్ఞానవ్యాసులు విమర్శకమహేశులు నేర్పుగా ఆంధ్రవాగ్దేవి నెన్నొదుట తీర్చిన కల్యాణతిలకంగా వర్ధిల్లుతూ వున్నది తెలుగువ్యాసము నేడు. ఎందరో హేమాహేమీలా వెనుకటి వ్యాసభగవానులు పలుపత్రికలలో పరశ్శతంగా వెలువరించిన వ్యాసపరంపరలోని మేలేర్చికూర్చి "సారస్వతవ్యాసములు" అనేపేర ఇటీవల వరుసగా నాలుగు సంపుటాలు ప్రక టించింది ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ. అవే కాదు ఈ స్వాతంత్ర్యయుగం లోనే వివిధ పత్రికాకేదారములందు ఏకత్ర రాశీభూతములైన సందర్భములే చెప్పుకోదగ్గవే శతాధికమున్నవి. వాటిలో ప్రకృతపు కఠోర స్థలనియమానికి కట్టువడి కతిపయముఖ్య సంపుటముల స్వరూపస్వభావాల నురమరికగా ఒక వైనంవారీగా పరామర్శించడానికి ప్రయత్నిస్తాను:

**ఆంధ్రభాషా సాహిత్యవిషయములు :**

A 1. శివశ్రీ బండారు తమ్మయ్యగారి "వ్యాసావళి" (రెండుభాగా లిప్పటికి ప్రకటితములైనవి- 1969. ఇంకొకసంపుటి రావలసివున్నది). ఇందులో వివిధ శివకవుల సారస్వతసేవ, బసవేశ్వరుని ఉదంతము చక్కగా ఉగ్గడింప

బడ్డాయి. శైవవాఙ్మయము తమ్మయ్యగారికి వెన్నతో బెట్టినవిద్య. అందులో వారేవిషయము నెత్తుకొన్నా సాధికారంగా సప్రమాణంగా విస్పష్టంగా సత్య నిష్ఠతో, విషయగౌరవంతో నిరాడంబరగంభీరంగా చెబుతారు. ఆయా లక్షణా లలో మన పిల్లకారు విమర్శకులు, వ్యాసకర్తలూ నేర్చుకోవలసింది చాలవున్నది. 2. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి "పంచమి" (1954). అతఃపూర్వ మనేక భాషాసాహిత్య సాంఘికవిషయాత్మకములుగా వీరు రచించిన వ్యాసాలు 1947లో "వ్యాసమంజరి" పేర ప్రకటితములు. ఈ'పంచమి'లో- పేరుసార్థకము గాదు, అది వారు పెట్టినదికాదు సంపాదకులు పెట్టినది- రంగనాథరామాయణ కర్తృత్వవిచారము, ద్రౌపది- సీతపాత్రల స్వభావతారతమ్యపరిశీలనము, భారతభాగవత ప్రతియోగసమీక్ష మున్నగువిషయములు వారి సాహిత్యసౌమన స్యమునకు, రామభారతకథారాసిక్యమునకు, నిశితానుశీలనశీలమనీషకు నికషో పలములు. 3. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి "సారస్వతాలోకము", "నాటకోపన్యాసములు"- ఈ రెండుసంపుటాలలో కావ్యనాటకములకు సంబం ధించిన కొన్ని ముఖ్యవిషయాలు పండినహార్దమార్దవము పజ్జనే నిండైన శేముషీ నిశాతత్వం చోటుచేసుకొన్న ఒకసహృదయ సమ్రాట్టుయొక్క చతురాతిచతుర సరసాతిసరస విమర్శవిహారం తిలకింపగలం. భావకూలంకషమైన శైలీప్రాగ ల్భ్యముతో నుడికారవు టొడువులతో ఛలోక్తుల చెణుకులతో సుతిమెత్తనిమాట లలో సూదులు గ్రుచ్చగల సూక్తులతో సాగిన వీరి విమర్శ ననసాగిన వీరి రచన పానుగంటివారితరువాత తెనుగులో వ్యాసమున కొక ప్రతిష్ఠ తెచ్చి పెట్టేయి. 4. డాక్టర్ శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారి- వాఙ్మయవ్యాస మంజరి" (1967). చారిత్రక పరిశోధన పరమేశ్వరులైన వీ రొక మహాభిని వేశంతో సారస్వత సమారాధనంకూడ చేస్తూ వుండడం మిక్కిలి ముదావహమైన విషయం. ఈ సంపుటిలో వీరు ప్రకటించిన 21 వ్యాసాలు అనేక వాఙ్మయ పరిశోధకులకు మార్గదర్శకాలు. వీరి విషయ పరిశీలనము పటువైనది, సత్యనిష్ఠ గలది. కాని చర్చకు దిగితే ఒక్కొక్కప్పు డెదుట లేని ప్రతివాది నెదలోనే ఉత్పా దించుకొని భావతీవ్రతతో ఎదుర్కొని కటుపాక్చ పేటములతో వాడికి గుణమర్దనం చేస్తారు. 5. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారి- "లక్ష్మీరంజన వ్యాసావళి" (1968-1970)- వీ రనేకతరుణ కోవిదకోరకములను పరిణత

పరిశోధక సురభిళ ప్రసూనములుగా తీర్చిదిద్దిన మహనీయులు. పలువురిచే పలువిషయములపై పరిశోధనలు జరిపించిన వీరి అనుభవ పరిణాహము, వివిధ విషయ పరిజ్ఞానము ఈ సంపుటిలోని 21 వ్యాసములలోను ప్రస్ఫుటంగా కని పిస్తాయి. 'తెనుఁగులో సాహిత్య విమర్శ', 'ఆశ్వాసాంత పద్యము', 'శ్రీకృష్ణ దేవరాయల రాజనీతి', 'జాతీయత- వాఙ్మయము", 'రామాయణము- మహా కావ్యము" అనే వ్యాసాలు వీరి ప్రతిభకు. పాండితికి తగిన నిదర్శనములు. 6. ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని గారి- "కావ్యలహరి" (1971). బహుముఖీనమైన పాండిత్య పరిణాహంతో అద్యతనాంధ్ర సాహిత్య రంగంలో పరాక్రమిస్తూ వున్న దివాకర్లవారు ఈ సంపుటిలో శృంగార నైషధము, మను చరిత్రము, పారిజాతాప హరణము, వసు చరిత్రము, విజయ విలాసము అనే అయిదు ప్రబంధ గంధ గజేంద్రములను అసాధారణాధోరణప్రజ్ఞతో సమీ క్షించారు. 7. కీ.శే. కాటూరి వేంకటేశ్వరరావు గారి- "సాహిత్య దర్శనము" (1967). రసవసంత వనవాటికలో కొనలు సాగే మనోవల్లరి పూచిన పూవు వీరి కన్ను. కావ్యసుందరికి కనుగీటి ఆమె ఆంతర్యము కనుగొన్న వీరి చూపు విమర్శ మీదను ప్రసరించడం విశేషం. ఆ చూపు విమర్శ నొక కళగా దర్శిం చింది. ఎఱ్ఱన. అడవి బాపిరాజు, బుచ్చి సుందరరామ శాస్త్రి అనే ముగ్గురు సాహిత్య సత్యవ్రతుల వ్యక్తిత్వాన్ని సమీక్షించింది. గురుదేవులైన చెళ్లపిళ్ల కేల కోశ్శెత్తింది. సూరనగారి శృంగారానికీ, పేరిగాని హాస్యానికీ నివాళు లర్పిం చింది శ్రీభట్టాచార్య విరచితాలేఖ్యమును రసపేశల వాక్కులతో వ్యాఖ్యా నించినది. ఇలా పంద్రెండు వ్యాసాలలో పరుచు కొన్నది వారి పరమ భావుకత పండు మీసల కొసల నుండి పసమించు యెలనవ్వు పండించు కొను వారి హాస్య చతురాస్యత వారి నొక సరస సాహిత్య ద్రష్టను గూడ చేసింది ఈ సంపుటిలో. 8. శ్రీ దేవులపల్లి రామానుజరావు గారి- "సారస్వత నవనీతము" (1958)- ఆం.ప్ర. సాహిత్య అకాడమీ సూత్రధారులైన వీరు ప్రాచీనాధునిక భేదంగాని పండిత జానపద భేదంగాని, స్త్రీ పురుషోపజ్ఞ భేదంగాని పాటించకుండా సువి శాలమైన రస సురభిళ హృదయాలతో ఎన్నో సాహిత్య హొయల నిందులో సమీక్షించారు. "గుణమును గ్రహించి చెప్పుటయందు మీకు గల పక్షపాతము విమర్శకులు నే దనుకరింపవలసిన విషయము" అని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు వీరి కిచ్చిన కితాబు వారి ప్రాజ్ఞతకు వన్నెబెడుతున్నది. 9. డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యంగారి—"సారస్వత సౌరభము" (1970). ఎలమావి

కొమ్మపై ఎలుగెత్తడాని కదే తొలిసారి అయినా కలకంఠ కంఠరవము కల వరమే అవుతుందన్నట్లుగా ఆంధ్ర సాహిత్య వీరరసనమాలోచనంతో ప్రారంభ మైన ఈ విమర్శక హంవీరుని సారస్వత సమీక్షా వ్యాసంగం తొలుతనే వరమ రమణీయములైన ఫలశ్రుతులు పలికించుకొంది. ఈ వ్యాస సంపుటంలో సహృదత్వ సౌరభాలు గుబాళించింది. వ్రాసిన ప్రతివ్యాసంలోనూ ఏదో ఒక సరిక్రొత్త సమాలోచనం, ఒక ప్రత్యగ్ర పరిష్కారం చేస్తా రీయన. ఈ రెండు కృతులతోనే ఒక విశిష్ట సాహిత్య ద్రష్టగా తన భవిష్యదధ్వంలో పట్టుతివాసీలు పరుచుకొన్నా రీయన. ఇక ఈ పొగడ్తలకు పొంగిపోయి లొంగిపోయి స్మయ దూషితముగాక సవినయంగా ఎదుటికి పయనించడమే తరువాయి.

ఈ కోవకే చెందిన మరికొన్ని ముఖ్య సంపుటముల గురించి - కొద్దిగా పరిచయ వాక్యాలు : 1960 లో హైదరాబాదు అష్టదిగ్గజ వర్ధంత్యుత్సవ సమితి వారు ప్రకటించిన "అష్టదిగ్గజములు" అనే గ్రంథంలో ఆయా కవులగురించి దివాకర్ల, విశ్వనాథ, బిరుదురాజు, చెలమచెర్ల, కురుగంటి, పోణంగి, ఖండవల్లి, సన్నిధానం, వేదాల, నేలటూరి ప్రౌఢ సమీక్షలు చేసి వున్నారు. అయితే అష్ట దిగ్గజాలలో చేరడాని కవకాశం ససేమిరా లేని అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, ఇంకా ఆ మాటకువస్తే రామరాజ భూషణుడు ఇందులో చోటు చేసుకోవడం నా మట్టుకు నాకు విడ్డూరంగా కనివిస్తూ వుంది. 1961 లో ఆచార్య బి. రామరాజుగారు "మరుగుపడిన మాణిక్యాలు" అనే గ్రంథంలో పదహారుగురు విస్మృతాంధ్ర కవుల అసూర్యంపశ్యలైన కృతికన్యలకు ముకురదీక్ష నిచ్చి శ్రీ వర్ధస్వము చెప్పి తమ పరిశోధన రసికతను ప్రమాణీకరించుకొన్నారు. 1960లో "జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి" అనే గ్రంథాన్ని ప్రకటించారు. కీ.శే. నేదునూరి గంగాధరంగారు ఆ వాఙ్మయ వ్యవసాయానికి బ్రదుకును ముడుపుగట్టిన మహానుభావుడు. ఆ వాఙ్మయంలో సాహిత్య సరస్వతి చను జేపులు, ఆ వ్యాసాల్లో ఆయన గుండెల పులకరింపలూ చూడగలం. 1958లో శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు వ్రాసిన "ఆంధ్ర సాహిత్య పునర్వికాసం" అనేది చూడడానికి చిన్న పుస్తకమైనా అందులో 'ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు', "తెలుగుతల్లి హృదయావేదనలు" అనే వ్యాసాంలో పెద్ద హృదయం నిక్షేపించి వాస్తవికతను సత్యనిష్ఠతో సందర్శించారు. 1968 లో శ్రీ ఆర్.ఎస్. సుదర్శనంగారు "సాహిత్యంలో దృక్పథాలు" అనే పుస్తకంలో

ఒక మితవాద హితవాద ధోరణిలో ఒక క్రొత్తకోణంనుండి సాహిత్య సత్యాన్ని సమీక్షించడానికి ప్రయత్నం చేశారు. వీరి దృక్పథంలో ప్రాతక్రొత్తల మేలు కలయికను గమనించగలం. 1967 లో అమరేంద్రగారి "భావవీణ" రసగ్రంథి విచ్చిన ఒక భావుక హృదయం చేసిన రాగాలాపనలా వచ్చింది. మనసులోంచి మాట పెగిలి, మాటలో మనసు నిలిపి బహిరంతరముల భావుక మహేంద్రుడై పలికే ఈయన వ్రాసిన యీ వ్యాస సంపుటిలో కవిత్వపు వాలకం వేసుకొన్న కమ్మని విమర్శ దర్శన మిస్తుంది. కటుత్వము లేని పటుత్వము, అపేలవమైన మార్దవమూ గల వాగర్థమహాయోగమది. ఆ "కవులకళ్లు", "అందమే ఆనందం" ఇత్యాదివ్యాసాలు పరిమాణంలో చిన్నవైనా హృదయ పరిణామంలో పెద్దవి. అందులో ఆకాశాన్నందుకొనే ఆలోచన, అడవిని దూసుకుపోయే చూపు, అర్థవాన్ని మథించే ఆశ కనిపిస్తాయి. 1969 లో శ్రీ నందుల గోపాలకృష్ణ మూర్తిగారు "ఋతుసూక్తము" అనే గ్రంథంలో కావ్యానుశీలన వశమున విశదీభూతమైన తన మనోముకురంలో నాటి నేటి నాడాంధ్రకవుల కల్పనా శిల్పముнకు పరసీమయైన ఋతువర్ణన యొక్క రమణీయ దర్శనం చేశారు. ఈ గ్రంథమును-"సారస్వతాధ్వ రసజ్ఞపాంథ పాథేయ" మని ప్రశంసించిన కీ.శే. దిగుమర్తి సీతారామస్వామిగారు భావుకలోక పట్టభద్రుడు. 1959 లో "నవ్యతంతువు", 1965 లో "సారస్వత నీరాజనము" అనే రెండు వ్యాస సంపుటాలు ప్రచురించారు యస్వీ జోగారావుగారు. వీటిలో కొన్ని క్రొత్త విషయాలు, ప్రాత విషయాలపై కొన్ని క్రొత్త చూపులూ వున్నాయి. తన కొలదులు తానెరిగిన రచయిత యీయన. అందుచేత జీవితంలో మోసపోయినా సాహిత్యంలో మాత్రం మరొకరి కొలదులు కనుక్కోగల ననే ధీమా గలవాడు. వ్యాసము యొక్క స్వరూపము, విమర్శయొక్క స్వరూపము, సాహిత్యము యొక్క ఆంతర్యము, రచనలో రామణ్యము కొంతకుకొంత తెలిసినవా డనిపించకపోదా వ్యాసాలు చదివితే- అవసరమైతే సులోచనాలు తగిలించుకొని. ఇక మరోరకం వ్యాస సంపుటా లున్నాయి – కేవలం కావ్యపాత్రల తత్వాన్ని సమీక్షించేవి. అందులో శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారి "ప్రబంధ పాత్రలు" (1952) అనే గ్రంథం ముఖ్యమైనది. పాత్ర అంటే కావ్య జీవితభూతమైన రసపాకమున కాధారం. ఆ పాత్ర యెంత శుచిగా వుంటే రసమంత రుచిగా వుంటుంది. శాబ్దిక చండతాండవమే శైలి అనుకొనే అపోహలతో పదాల పటాలపు కవాతు కసరత్తులతో, అలంకారాల కలంకారితో, అష్టాదశ వర్ణనల సాముగరిడీలతో,

ఊకదంపుడు ఉపదేశాలతో, కట్టుకథలతో పిట్టకథలతో దస్త్రాలవంటి పెద్ద కావ్యాలు వ్రాయడంకన్నా చిరస్మరణీయమైన ఒక్క పాత్రను సృష్టించిన, చిత్రించిన చిన్న కావ్యం రచించడం మంచిది. అలాంటి పాత్రలను మన ప్రాచీన ప్రౌఢ ప్రాబంధికులు కొన్ని సృష్టించారు. వాటి ప్రాణస్పందనలు పట్టి చూశారు కేశవపంతులవారు. వీరి నిశిత పరిశీలనము, శాస్త్రజ్ఞతా పటువైన దృక్పథము, నిరవద్య గద్యశైలీ ప్రాగల్భ్యము సురవరం ప్రతాపరెడ్డి ప్రభృతుల ప్రాజ్ఞలోక పారిషదుల ప్రశంసలకు పాత్రమైనవి. ఇలాంటిదే ఇటీవల "లతవ్యాసాలు" అనే కితాబు ఆధునిక వాఙ్మయ స్త్రీ పాత్రల మతాబు వచ్చింది. ఇందులో కృష్ణశాస్త్రి ఊర్వశి, చలం అరుణ, బుచ్చిబాబు అమృతం, రావూరి పార్వతి, బాపిరాజు శశికళ, గురజాడ మధురవాణి, శ్రీదేవి ఇందిర, శరత్ కమలలత, విశ్వనాథ కిన్నెరసాని, మల్లాదివారి స్త్రీ పాత్రలు సమీక్షింపబడ్డాయి. రసరహస్యము లెరిగిన రమ్యాభిరుచి గల ప్రగల్భ శ్రీమతి లతగారు. ఆయా స్త్రీ పాత్రల అంతర్యాన్ని సొంతంగా కనుగొన్నారామె. అదేమి చిత్రమోగాని ఏ సాహిత్య చరిత్రచూసినా కవిత్వంలోకంటె 'ఉత్పాద్యం' (Fiction)లో స్త్రీ లెక్కువ సిద్ధహస్తలు. పురుష ప్రకృతిగల స్త్రీలకు జీవితరంగంలోని స్త్రీలు, ఫిక్షన్ వ్రాసిన స్త్రీలకు ఇతరుల సాహిత్య సృష్టిలోని స్త్రీ పాత్రలు చక్కగా అర్థమవుతా రనిపిస్తుంది. విడివిడిగా కొందరు కొందరు రచయితలు కొన్ని కొన్ని కావ్యపాత్రలను సమీక్షిస్తూ వ్రాసిన వ్యాసాలు లేకపోలేదు. అందులో రాళ్ళపల్లివారి తిక్కన తీర్చిన సీతమ్మ. కట్టమంచివారి ద్రౌపది—సీత, ఇంద్రగంటివారి పాపరాజు సీతాపాత్ర చిత్రణము, జి.వి. సుబ్రహ్మణ్యంగారి కర్ణుడు, వరూధిని- యస్వీగారి ద్రౌపది పాత్ర-భారత భాగవత చిత్రణములు పేర్కొన దగినవి.

ఇవిగాక ఈ స్వాతంత్ర్య యుగంలోనే ఆంధ్రసాహిత్య విమర్శనాత్మకములనేక వ్యాససంపుటులు వచ్చాయి. స్థలాభావంవల్ల వాటి పేర్లుమాత్రం ఉదాహరిస్తాను. 1. కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారి "మూడు కావ్యాలు" (1952). 2. వారిదే "సాహిత్య వ్యాసములు" (1967). 3. కీ. శే. పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు గారి "సాహిత్య సమీక్ష" (1950); 4. వారిదే "శారదా విలాసము" (1959); 5. వారిదే "సాహిత్య స్రవంతి" (1970). 6. "తెలుగు తీరులు" (1964- పుట్టపర్తివారు తెనాలి రామకృష్ణుడి గురించి, దివాకర్లవారు విజయవిలాసం గురించి వ్రాసిన వ్యాసాలసంపుటి).

7. డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి "వ్యాసవాహిని" (1965). 8. డాక్టర్ కె. వి. రామకోటి శాస్త్రిగారి "నైమిశము" (1961). 9. శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారి "తెలుగుసాహిత్యం తీరుతెన్నులు" (1963). 10. శ్రీ నరసింహ దేవర ఉమామహేశ్వరశాస్త్రిగారి "నవ్యాంధ్రపంచకావ్య పరిశీలనము" (1960). 11. శ్రీ వంతరాం రమకృష్ణారావుగారి "వ్యాసమంజరి" (1964). 12. శ్రీ విన్నకోట మాధవరావుగారి "కావ్యరీతులు" (1963). 13. శ్రీ బులుసు వెంకట రమణయ్య గారి "వ్యాస కదంబము" (1971). 14. శ్రీ పెనుమాదు వెంకట శేషయ్యగారి "తెలుగు వెలుగు" (2 సంపుటులు- ప్రాచీన కవులు & ఆధునిక కవులు. 1965). 15. డాక్టర్ జి. సూర్యనారాయణగారి "వ్యాసరాజి" (1969) 16. శ్రీ వేదుల సూర్యకాంతం & శ్రీ కామేశ్వరరావుల "సాహిత్యతరంగిణి". (1968). 17. కుమారి కొక్కొండ సత్యవతిగారి "వ్యాస ప్రభాస" (1969).

**అన్యభాషా సాహిత్య విషయకములు :**

మన భాషాసాహిత్యముల వ్యక్తిత్వము, గౌరవలాఘవములు మనకు సమంజసంగా అర్థంకావాలంటే అన్యభాషా సాహిత్యాలగురించి అవశ్యం తెలుసు కోవడానికి మనం ప్రయత్నించాలి. అంతేకాదు ఏదేశంలో ఏకాలంలో బయలుదేరినదైనా విశ్వవ్యాప్తమైన మానవాత్మను ప్రతిఫలించే సాహిత్యం సర్వమానవ సమాజైక తానమైన సొత్తు. దానికి భాష యొక ప్రతిబంధకమని భావించకూడదు. ఆ యా చూపులతో మన రచయితలు అన్యభాషలనుండి సాహిత్యాన్ని అనువదిస్తూ వుంటారు, కొందరు ద్రష్టలుమాత్రమే ఐ యి ఆయా సాహిత్యస్వరూప స్వభావాలను విశదీకరిస్తూ వుంటారు. అన్నిటికన్న మనకు సంస్కృతంతో వున్న అనుబంధం దొడ్డది. పరమ ప్రాచీనమైనది, సమీచీనమైనది, సహజమైనది, సమంజసమైనది. అది గుర్తించియే 'ఆకాశవాణి' వారు కొన్నియేండ్లుగా వారం వారం "అమరవాణి" కార్యక్రమాలు ప్రసారం చేస్తున్నారు. శ్రీ మాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకటాచార్యులుగారు అలా ప్రసారం గావించిన తమప్రసంగాలిరవయ్యింటిని 1968 లో "అమరవాణి" అనే పేరుతోనే గ్రంథరూపంగా ప్రకటించారు. గాఢప్రతిభులైన వీరి పాండిత్య శౌండీర్యం ఈ గ్రంథంలో బహుముఖీనంగా ప్రకటిత మైనది. అందులో ఒక భాషేమిటి, వ్యాకరణ మేమిటి, సాహిత్య మేమిటి సంస్కృతంలో వారి కచుంబిత విషయమంటూ వుందా అనివిస్తుంది. వారు వ్రాసిన విషయా లెన్నో మన కక్కరకు వచ్చేటటువంటివి, ఇదివర

కెవరూ వ్రాయనివి, ఒక ప్రాజ్ఞుని పరిష్కార నికషోపలమునబడి తేజరిల్లి నట్టివి. అందులో సంస్కృత వ్యాకరణానికి ఆంధ్రులు చేసినసేవ నుగ్గడిం చడం లోను. నన్నయ గారి "వక్షోముఖాంగేషు" ప్రయోగసామంజస్య నిర్ణయం చేయడంలోను వారి పరిశోధక దృష్టి, వాదనైపుణి మాత్రమే కాక తెనుగుతో వారికున్న చనవునుగూడ సూచిస్తున్నాయి. 1970 లో శ్రీ పైడి పాటి సుబ్బరామ శాస్త్రిగారు మరికొన్ని "అమరవాణీప్రసారములు" సంకలనం చేసి అదే పేరుపెట్టి ఒక గ్రంథంగా వెలయించారు విపులమైన పీఠికతో సహా. ఇందులో శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు, శ్రీసూరి రామకోటిశాస్త్రి గారు, శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మ గారు మున్నగు అతిరథమహారథుల వ్యాసా లున్నాయి. అందరూ గీర్వాణాంధ్ర గిరాంధురంధరులు. మాతృభాషకు ఉపకారం చేదామనే మహోద్దేశంతో తమ విజ్ఞానాన్ని మనకు చూరలిచ్చారు. తెలుగులో సంస్కృత వాఙ్మయ చరిత్రకారులైన కీ.శే. మల్లాది సూర్యనారా యణ శాస్త్రిగారు భాస కాళిదాస భవభూతి పండితరాయ ప్రభృతుల గురించి ప్రత్యేకం అనేకం వ్యాసాలు వ్రాశారు. అవి కొన్ని 1963 లో ప్రకటితములైన వారి వ్యాసరత్నావళిలో సంగ్రథితములయ్యాయి. శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు 1949 లో దక్షిణదేశ భాషా సారస్వతముల గురించి పరిశోధనాత్మక వ్యాససంపుటి నొకదాన్ని వెలయించారు. కీ.శే. డాక్టర్ బూర్గుల రామకృష్ణా రావుగారు తమ "సారస్వత వ్యాస ముక్తావళి"లో ఉర్దూ భాషా సారస్వతాల గురించి, ఉమర్ ఖయాము గురించిన విషయం దక్షతతో నిక్షేపించారు. తిరుపతి సాహిత్య సమితివారి "వ్యాసావళి" రెండు భాగాల్లోనూ (1967–1969) సంస్కృత ప్రాకృత తమిళకన్నడాంగ్ల వాఙ్మయాలకు సంబంధించిన వ్యాసాలు వివిధ విదగ్ధ పండితులు వ్రాసినవి తొమ్మిది వున్నాయి. డాక్టర్ శ్రీ బయ్యా సూర్యనారాయణగారి "ఆలోచనామృతము" (1970)లో హిందీ సాహిత్యంలో ఆధునిక యుగకర్తల గురించి ఒక చక్కని వ్యాసం వున్నది. అమరేంద్రగారి "భావవీణ"లో షేక్స్పియర్, టాగూర్, కీట్సుల ఆంగ్లకవితా మహత్త శ్లాఘింప బడింది.'59లో రాజమండ్రి విశ్వసాహిత్యమాలవారు ప్రచురించిన"కావ్యజగత్తు" రవీంద్రుని సంస్కృత వాఙ్మయ వ్యాసాలకెవరో చేసిన అనువాదము. ఇక ఇలా ఇతర సాహిత్యాల గురించి చెదురుగా వ్యాసాలున్న సంపుటులు మరికొన్ని వున్నాయి. కాని యితర భాషా సాహిత్యాలు గురించి మనకు దిగవలసినంత సామాగ్రి దిగలేదు.

**సాహిత్య సిద్ధాంత విషయకములు :**

ఏవంవిధ గ్రంథజాలంకూడ మనకు తగినంతగా లేదు. సాహిత్యసృష్టికి సౌష్ఠవ మేర్పడి అది నిత్యపరిణామశీలంగా బహుముఖంగా ప్రగతిని సాధించ టానికి ఎప్పటికప్పుడు దాని బాగోగులను బేరీజువేసే వివేచన కొనసాగుతూ వుండాలి. సిద్ధాంతరూప వ్యాసములు పరిశ్కృతంగా పత్రికలలో వస్తూవుండాలి. మనకు అందుకు తగిన పత్రికలే లేవు. ఇలాంటి గ్రంథాలను రచయితలే కొన రని ప్రతులు అమ్ముడుపోవని అచ్చువేయడానికే గ్రంథప్రకాశకుడూ ముందుకు రాడు. ఇటీవల తెలుగులో ఇలాంటి వ్యాససంపుటులు రెండు రావడం చాల ముదావహం. అవి శ్రీ కాళూరి హనుమంతరావుగారి "సాహితీజగతి" (1970), "వాఙ్మయ సమాలోచనము" (1972). ఆయన ప్రధానకర్మక్షేత్ర మసలు సాహి త్యం కానేకాదు. ఔషధ విజ్ఞానశాస్త్రం. అయినా తండ్రి తాతలనుండి వస్తూవున్న సాహిత్యనిరతి వీరిలో విశేషంగా ప్రగల్భించింది. ఈ సంపుటాలలో "సాహితీ జగతి, సాహిత్య ప్రయోజనము, కవిత్వము- ఇతివృత్తము, భాష-వ్యాకరణం కవిత్వంలో అస్పష్టత, వాఙ్మయ సమాలోచనము, కవిత్వము-ఛందస్సు, సాహిత్యం- సమాజం, కథానికా శిల్పం, విమర్శ" అనే వ్యాసాలు చూస్తే సాహిత్య తత్వానుశీలనమంటే ఈయన కెంత మమకారమా అనిపిస్తుంది. కొన్ని కొన్ని అభిప్రాయాలను పరిశీలించిచూస్తే ఈయన Literary Facist లా వున్నాడే అని అనిపించడాని కాస్కారం కద్దు. అప్పుడప్పుడు తన ప్రగాఢ విశ్వాసంనుండి దూసుకు వచ్చిన ఆవేశంలో పడి భావసంయమనము, తర్క సహమైన వాదనైపుణ్యము కోలుపోతారనిపిస్తుంది. అయితే పలుతావుల వీరొక నైతిక నిష్ఠతో సత్యపక్షపాతముతో చేసిన నిర్ణయాలు పరిణతప్రజ్ఞుని హృదయ పరిపాకాన్ని ఋజువు చేస్తాయి. భాషా సాహిత్య సిద్ధాంత వ్యాసాలు మరికొన్ని మల్లాదివారి "వ్యాసరత్నావళి", తిరుపతి సాహిత్య సమితివారి "వ్యాసావళి" బయ్యావారి అన్వర్థ సంజ్ఞితమైన "ఆలోచనామృతము", "స్ఫూర్తిశ్రీ వ్యాసా వళి" మొ॥ గ్రంథాలలో చెదురుగా కానవస్తాయి. టి.యస్. ఇలియట్ ప్రభృతుల వలె మన మహాసాహిత్య స్రష్టలే మన విశ్వనాథ ప్రభృతులే ఉజ్జ్వలమైన మరో ఊపిరితో అంతర్దృష్టులై తమ సాహిత్య చైతన్యమును తాము సమీక్షించుకొన గల్గిననాడు మనకు సాహిత్య సిద్ధాంతము గురించి ప్రమాణ గ్రంథాలు రాగలవు.

**సాహిత్యేతరవిషయకములు :**

సాహిత్యేతరవిషయములను పురస్కరించుకొని వ్రాసిన వ్రాతలలోను యథావకాశంగా కొన్నికొన్ని సాహిత్యలక్షణములను నిక్షేపిస్తే ఆ వ్యాసాలకొక సాహిత్యసిద్ధి వస్తుంది. అలాంటివ్యాసాలకు మనకు పానుగంటి, కొమఱ్ఱాజులే మార్గదర్శకులు. పట్టి నడివీధి తోలుబొమ్మలాటను వర్ణిస్తున్నా పానుగంటివారి రచనకు చక్కని రసస్పర్శ వచ్చింది. కొమఱ్ఱాజువారు, ఆదిభట్ల నారాయణ దాసుగారు శాస్త్రీయవైజ్ఞానికవిషయాలగురించి వ్రాసినా; మల్లంపల్లి, నేలటూరి ప్రభృతులు చారిత్రకవ్యాసాలు వ్రాసినా వాటి కేదో కళాత్మకమైన అందం చందం వచ్చాయి. కాని ఈకోవకు చెందిన వ్యాసం ఇంకా శైశవావస్థలోనే వుంది మన వాఙ్మయంలో. మల్లాదివారి "వ్యాసరత్నావళి", వినాా అప్పారావుగారి 'వ్యాసావళి' (1956). శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి "నరుడు-నక్షత్రాలు" (1938) అనే సంపుటులో వున్నవన్నీ ఇలాంటివే కావుగాని కొన్నివున్నాయి. వున్నంతమేరకు సత్యనిష్ఠతో వున్నాయి. శేషేంద్ర శర్మగారిచేతిలో ఇలాటివ్యాసాలకు గూడ సాహిత్యసౌగంధ్యం బాగా అబ్బింది. గ్రంథంయావత్తూ సాహిత్యేతరవిషయ విశిష్టమై సాహిత్యసిద్ధి పొందిన సందర్భాలు : 1. శ్రీ వావిలాల సోమయాజులుగారి "మణిప్రవాళము" (1956). ఇందులో పుష్పలోకము, చంద్రుడు-చంద్రిక, మలయానిలుడు, భ్రమరాన్వేషణము, నిద్రావైచిత్రి, స్తోత్రపాఠము, శత్రువులు- శత్రుత్వము, నవ్వు అనే వ్యాసాలున్నవి. మహాభావుకుడు, మనీషి, రసజ్ఞ రాజశేఖరుడు అయిన సోమయాజిగారి భావనలో భావవ్యక్తీకరణ పద్ధతిలో చతుర చమత్కార చారువైన సరసత్వము సర్వతః ప్రసన్నమై ఒక్కొక్క వ్యాస మొక్కొక్క సరస్వతీ దరస్మేరమైనది. 2. డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారి "వ్యాస మంజరి" (1962). ఇందులో సంభాషణ. రేపు, కోరిక, పాషాణహృదయము, రాత్రి, మృత్యువు. మతిమరపు, కన్ను అనే వ్యాసాలున్నవి. ఇటువంటి విషయాలగురించి కేవలం విషయప్రధానంగా వ్రాయాలన్నా గ్రంథకర్తకద తగినంత సరుకుండాలి. అంటే అనుభవం, పరిశీలన, విషయజ్ఞత, ఆలోచన. ఇక ఇలాంటి వ్యాసాలకు సాహిత్యసేచనం చేయాలంటే హృదయదఘ్నమైన రసికత వుండాలి. ఈ సామగ్రి అంతా పుష్కలంగా వుంది సుబ్బయ్యగారిదగ్గర. మంచిభావుకుడు. పరిశ్రమ చేస్తే మహోజ్వల భవిష్యత్కావాటాలు బారుగా

తెరుచుకుంటాయి. కొంత ఈకోవకు చెందినదే శ్రీ యేలూరిపాటి అనంత రామయ్యగారి "జంఘాలశాస్త్రి క్ష్మాలోకయాత్ర". అది సాక్షికి కొంత మానస పుత్రికేయైనా యేలూరిపాటివారిప్రజ్ఞ ఆపాటిదీపాటి దని చెప్పడానికి వీల్లేదు. కోరి జంఘాలశాస్త్రిని తీసుకువచ్చి అతనిచేత ఒక్కొక్క వ్యాసఖండంలోను చక్కని సమకాలిక సాంఘికవిమర్శను అపురూపములైన హాస్యసారస్యములతో మిళాయించి పట్టుకుంటే వదలని వలాస్త్రిగా చేసిపెట్టేరు. పుస్తకం చేతపుచ్చుకొన్న క్షణంనుంచి వదిలిపెట్టబుద్ధే పుట్టదు. మనకు మామూలుసాహిత్యం ఇవ్వడానికి చాలామంది వున్నారు. ఇతరవిషయాలగురించి ఇంపుగా చాటుగా కన్నుగొట్టి సాహిత్యసరస్వతిని అభిసారికను చేసుకునే సొంపుగా పాశ్చాత్యులకున్నట్టు మనకులేవు గ్రంథాలు. అలాంటిరచనలు చేయడమంటే మహాకవులకు కూడా చేతనయ్యేపనికాదు. దానిముడిసరకు, మూలద్రవ్యాలే వేరు. అది వినియోగించుకునే కైవాడం అందరికీ వుండదు. వస్తే అలాటిగ్రంథాలు అనంతరామయ్యగారి వంటివారినుండే రావాలి.

ఏదో కాస్త అవకాశ మున్నంత మేరకు మీద మన వ్యాససంపుటాల గురించి నాకు తోచినవి నాలుగుమాటలు చెప్పేను గాని ఏఒక్క గ్రంథం యొక్క స్వరూపస్వభావాలనూ విషయం నాలుగంచులూ విప్పి వివరించినట్లు కాలేదు. అయితే ఒకమాట. మన కనేక వ్యాససంపుటాలున్నాయి. చాలామందికి వ్యాసం వ్రాసే తీరు తెలిసినట్లే. మనవారు మంచిగద్యశైలీవైవిధ్యం సాధించినట్లేకాని పెద్దలు వ్రాసినవే కొన్ని కేవలం "పెద్దబాలశిక్ష" లలా తయారవుతున్నాయి, రచనాశిల్పంలో చాదస్తం చెలాయిస్తున్న జబర్దస్తీవల్ల. వ్యాసరచయితకు విషయజ్ఞత ఊపిరి. వ్యాససౌందర్యానికి చక్కని ప్రయోగోపసంహారాలు, వివరణ, విమర్శ, సముచితనిర్ణయం అనేవి ఉచ్ఛ్వాసనిశ్వాసాలు. ఈనాటి మన విమర్శకు లింకా నిష్పాక్షికంగావుండి, ఆర్జనుకలిగి, నిదానమవలంబించి, రచనలో ఒక నియమానికి నిలబడి ఒకపద్ధతికి కట్టుబడి వ్యాసంయొక్క సారస్వతపు వారసత్వంమీద చూపు నిలిపి పరిక్రమిస్తే మన విమర్శలకు, వ్యాసాలకు అవశ్యం మంచిభవిష్యత్తుంటుందని ఇప్పుడున్న పరిస్థితినిబట్టి ఆశాలింగిత కంఠంతో ఘంటాపథంగా చెప్పవచ్చు. భవతు.



# పరిష్కృత గ్రంథాలు - పీఠికలు

శ్రీ ఎన్. వి. రామారావు

స్వాతంత్ర్య భానుడు ఉదయించాక కావ్య పరిష్కరణరంగంలో క్రొత్త వెలుగులు ప్రసరించాయి. ప్రాచీన కాలంలో గ్రంథ ముద్రణా సౌకర్యం కొఱవడటం చేత తాళపత్రాల్లో నిబద్ధమైవున్న కావ్యాలు వ్రాయనకాండ్ర పొరపాట్లకు లోనవుతూ వచ్చాయి. తాళపత్ర గ్రంథాలు శిథిలమై అక్షరాలు చెరిగిపోయిన భాగాలలో తమ యిష్టానుసారంగా వాటిని పూరిస్తూ వచ్చారు. కవులు, లాక్షణికులు మరికొంత స్వాతంత్ర్యం వహించి తమ అభిరుచి కనుగుణంగా పాఠాలను సవరిస్తూ వచ్చారు. దీనివల్ల మన ప్రాచీన కావ్యాలు సహజ స్వరూపాన్ని కోల్పోయి అపపాఠాలతో వికృతరూపాన్ని దాల్చాయి. ముద్రణాయంత్రాలు నెలకొన్న తర్వాత ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. కావ్యం యొక్క ప్రతులన్నీ నాడు అందరికీ అందుబాటులో లేవు. ఒకవేళ లభ్యమైనా పరిష్కర్తలు వ్యక్తిగత వైమనస్యాలతో, పెక్కు దురభిప్రాయాలతో తమకు తోచిన పాఠాలను ఎన్నుకోవటం జరిగేది. అందుచేత స్వాతంత్ర్యానికి పూర్వం వెలువడిన కావ్యాలన్నీ సమగ్ర పరిష్కరణలని చెప్పటానికి వీలులేదు.

స్వాతంత్ర్యోదయం తర్వాత ఈ పరిస్థితి కొంతవరకు మారింది. దేశంలోని మారుమూలల్లో, రాష్ట్రేతరాల్లో వున్న తాళపత్ర గ్రంధాలను సేకరించటానికీ, ప్రాచీన ముద్రిత ప్రతులను సంపాదించటానికీ నేడు విరివిగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. భాషా వాఙ్మయ పరిశోధకులలో శాస్త్రీయదృష్టి, సమ్యగవగాహనాసక్తి ప్రబల మౌతున్నాయి. హేతువాద దృక్పథం, సత్య జిజ్ఞాస మిక్కుటమౌతున్నాయి.

సమగ్రమైన గ్రంథ పరిష్కరణకు నాంది పలికింది సాహిత్య అకాడమీ ప్రకటించిన ఆంధ్ర మహా భాగవతం. భారతదేశం దాస్యశృంఖలాల నుండి విడివడిన తర్వాత సాహితీ లోకానికి లభించినవరం అకాడమీల స్థాపన. 19 లో వెలసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పరిష్కృత కావ్య ముద్రణలో గణనీయమైన కృషిసలిపింది. రాయప్రోలు, దివాకర్ల, దీపాల, తాపీ ధర్మారావు

రామరాజు సంపాదకత్వంలో విపులమైన పీఠికతో ఆంధ్ర మహా భాగవతం సంపుటాలు వెలువడ్డాయి. ఇందలి పాఠనిర్ణయం గురించి వివిధ పత్రికల్లో వెలువడిన ఆక్షేపణలకు సమాధానంగా దీపాల పిచ్చయ్య శాస్త్రి 'భాగవత పాఠ పరిశోధనము' అనే లఘు గ్రంథాన్ని వెలువరించారు. అకాడమీ ప్రకటించిన ఇతర పరిష్కృత గ్రంథాలుకూడా ప్రశంసాపాత్రమైనవి. డా॥ బి. రామరాజు జాంబవతీ పరిణయ, రాఘవాభ్యుదయములను, డా॥ కే.వి. రామకోటి శాస్త్రి ఘటికాచలమాహాత్మ్యమును, డా॥ పి. యశోదా రెడ్డి ఉత్తర హరివంశమును పరిష్కరించి సమగ్రమైన పీఠికలు సమకూర్చారు.

తెలుగు కావ్యాలను చౌకధరలకు అందించాలని తలపెట్టిన ప్రణాళికలో ప్రసిద్ధ పండితుల పరిష్కరణతో అకాడమీ 35 గ్రంథాలను ప్రచురించింది. ప్రతి గ్రంథానికీ విపులమైన పీఠిక వుండటం వీటి ప్రత్యేకత. తెలుగు కావ్య పీఠికా వాఙ్మయం లోనే వీటికి విశిష్టమైన స్థానం వుంది. కవి జీవిత విశేషాలతో పాటు కావ్య సౌందర్య విశేషాలను ఆమూలాగ్రంగా వీటిలో స్పృశించటం జరిగింది. పై ప్రణాళికలోనే అకాడమీ ఆంధ్ర మహా భారతాన్ని కూడా సంపుటాలుగా వెలువరిస్తున్నది. ద్రోణపర్వం వరకూ ఏడు సంపుటాలు వెలువడ్డాయి.

అర్వాచీనకాలంలో పలువురు పండితుల సాయంతో వివిధ ప్రచురణ సంస్థలు ప్రకటించిన పరిష్కృత ముద్రణలుకూడా పేర్కొనదగినవి. అసంపూర్ణంగా వుండిన శివరాత్రి మాహాత్మ్యం కావ్యాన్ని ఆంధ్ర సారస్వత పరిషత్తువారు బి. రామరాజు పరిష్కరణలో సంపూర్ణంగా ప్రకటించారు. ఆంధ్ర రచయితల సంఘంవారు సిద్ధేశ్వర చరిత్రము (ఖండవల్లి లక్ష్మీరంజనం), ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధకము (బి. రామరాజు), సింహగిరి వచనములు(యం. కులశేఖర రావు) మున్నగు అపూర్వ కావ్యాలను వెలుగులోకి తెచ్చారు. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు ఆంధ్ర భాగవతమును (రాయలుఱుకో), వేలూరి శివరామశాస్త్రి గారు నృసింహ పురాణము (వావిళ్ళ)ను సమగ్రసుందరంగా పరిష్కరించారు. శిశాలాంధ్ర ప్రచురణాలయంవారి పల్నాటి వీరచరిత్ర పరిష్కర్త పింగళి లక్ష్మీకాంతంగారు దానికి విపులమైన పీఠికను జోడించారు. విజయవిలాస పాఠాలను చర్చిస్తూ వివిధ పత్రికల్లో వ్యాసాలను ప్రచురించిన శ్రీ తాపీ ధర్మారావు ఇటీవల ప్రకటించిన హృదయోల్లాసవ్యాఖ్యకు కేంద్రసాహిత్య అకాడమీ బహు

మతి లభించింది. తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయం కె. మహదేవ శాస్త్రి, ఏ. మహాదేవశాస్త్రి, సుందరశర్మ, నిడదవోలు, నేలటూరి ప్రభృతుల సంపాదకత్వంలో పెక్కు పరిష్కృత ప్రబంధాలను వెలువరించింది. స్వాతంత్ర్యానికి పూర్వం పలుకావ్యాలను ప్రకటించిన వావిళ్ళ రామస్వామిశాస్త్రి, వేంకట్రామా మున్నగు ప్రచురణ సంస్థలు నిడదవోలు, వెంపరాల, చిలుకూరి మొదలగు పండితుల తోడ్పాటుతో అనంతరకాలంలో కూడా తమ కృషిని కొనసాగించారు. పూర్వం వేటూరి ప్రభాకరశాస్త్రి పరిష్కరించిన క్రీడాభిరామమును మరికొన్ని విశేషాంశాలతో రమణీయంగా ముద్రించారు ప్రభాకర పరిశోధక మండలివారు.

స్వాతంత్ర్యం వచ్చిన ఈ పాతికేళ్ళ కాలంలోనూ గ్రంథ పరిష్కరణలో చెప్పుకోదగిన అపూర్వ సంఘటన ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి బృహత్ప్రణాళికయైన ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణం. వివిధ ప్రాంతాలలోని తాళపత్ర ప్రతులను, వ్రాతప్రతులను, ముద్రిత ప్రతులను సంపాదించి, వాటిలోని పాఠాలను పండిత సంఘాలలో చర్చించి, మూలానికి సన్నిహితమైన పాఠాలను నిర్ణయించటం ఈ సంశోధిత ముద్రణ యందలి వైశిష్ట్యం. విశ్వవిద్యాలయాలలో భాషాసాహిత్యాల బోధనలో ఆరితేరిన పండిత ప్రకాండులు, ఈ కార్యనిర్వహణభారాన్ని చేబూనటం ముదావహం. ఈ ప్రణాళికలో ఇంతవరకూ నాలుగు సంపుటాలు వెలువడ్డాయి. ఖండవల్లి, దివాకర్ల, రామరాజు ప్రభృతులు వీనికి విపులమైన, విమర్శనాత్మకమైన పీఠికలు రచించారు. గ్రంథ పరిష్కరణ విషయాన్ని ముగించేటప్పుడు ఇంటింటా స్వంతగ్రంథాలయ ప్రణాళిక నిర్వాహకులూ, పాకెట్ బుక్స్ ప్రచురణలో సిద్ధహస్తులూ అయిన యం. శేషాచలం & కోని మరచిపోరాదు. ప్రబంధసాహితి శీర్షికలో వారు ప్రకటించిన ప్రబంధాలు రావూరి దొరస్వామిశర్మ, బి. వి. సింగరాచార్య, బి. నళినీకాంతరావు పరిష్కరణతో, బాపు ముఖపత్రాలతో సర్వాంగసుందరంగా వెలువడ్డాయి. విశ్వనాథ, బొమ్మకంటి, శివశంకరస్వామి, ఆరుద్ర ప్రభృతులు సామాన్య పాఠకులకు చవులూరించే పీఠికలు వీనికి సమకూర్చారు.

తెలుగులో పీఠికారచనకూడా ప్రత్యేక ప్రక్రియా స్థానాన్ని సంపాదించుకున్నది. ప్రాచీనయుగంలోని కావ్యావతారికల స్థానాన్ని ఆధునిక యుగంలో పీఠికలు ఆక్రమించుకున్నాయని చెప్పవచ్చునుకాని అవతారికలు స్వయంగా గ్రంథకర్తలు కూర్చినవి కాగా పీఠికలు ఇతరులచేత రచింపబడ్డాయి. అవతారి

కలవలె గ్రంథ పరిచయం కావించటమే వీని ఉద్దేశ్యం. అయినా వానిలో కవిత్వ పరామర్శకు అవకాశం వున్నా అది కేవలం లక్షణ చర్చకు మాత్రమే పరిమితమైందికాని పీఠికలలోవలె లక్ష్యపరిశీలనం చాలావరకు మృగ్యం. తొలి పలుకు, మున్నుడి, ఆముఖం, ఉపోద్ఘాతం, ప్రస్తావన, ప్రవేశిక, ప్రకాశిక, భూమిక మొ॥ పీఠికకు పర్యాయపదాలుగా నేడు వాడుకలో వున్నాయి.

కావ్యతత్త్వ నిరూపణతో కూడిన పీఠికలు స్వాతంత్ర్యానంతర కాలంలో విరివియైనాయి. ఆధునిక వాఙ్మయం విస్తృతమై విభిన్న ప్రక్రియలు వెలయటంతో పీఠికలుకూడ వినూత్న స్వరూపాల్ని దాల్చాయి. గ్రంథబాహ్యస్వరూప నిరూపణంతోపాటు అంతరంగ నిర్ణయంకూడ వానియందు ప్రాముఖ్యం వహించింది. ప్రాచీన కృతులకేకాక ఆధునిక కావ్యాలు, నవలలు, నాటకాలు, కథలు, విమర్శలు మొ॥ వానికికూడా అసంఖ్యాకంగా పీఠికలు వెలశాయి.

ప్రాచీన కావ్యాల పీఠికల గురించి ఇంతకుముందే గ్రంథపరిష్కరణ పరామర్శలో- ప్రస్తావించటం జరిగింది. వివిధ ప్రక్రియారచనలో సమున్నతమైన స్థానాన్ని అధిష్ఠించిన బహుముఖ ప్రతిభాశీలి విశ్వనాథ సత్యనారాయణ గారు పీఠికారచనలోకూడా తమ ప్రత్యేకతను నిలబెట్టుకున్నారు. విలక్షణమైన ఆయన విమర్శనపంథ వీటిలోకూడా తొంగిచూస్తుంది. అకాడమీ ఆంధ్రభారతం మొదటి సంపుటానికీ, శేషాచలం కంపెనీవారి ప్రబంధ సాహితిలోని తొలి పది ప్రబంధాలకూ వారు అమూల్యమైన పీఠికలు కూర్చారు. ఆధునికకృతుల్లో పాలవెల్లి, ఆనందభిక్షువు, ఋతుఘోష, మధుమాసం మున్నగువాని పీఠికలు కావ్యతత్త్వ ప్రకాశికలై రసవంతములై ఒప్పుతున్నాయి. మహేంద్రోదయమునకు మల్లంపల్లి, గంగిరెద్దు, నాగార్జునసాగరం కావ్యాలకు రాళ్ళపల్లి, కర్పూర వసంతరాయలు, పోతన చరిత్రములకు దివాకర్ల, మధూదయమునకు బండారు తమ్మయ్య ప్రశస్తమైన పీఠికలు వెలయించారు. నిడదవోలు వెంకటరావు దాశరథీ శతకానికి పీఠికగా విపులంగా శతకవాఙ్మయ సమీక్ష కావించారు. గాలిబ్ గీతాల ఉపోద్ఘాతంలో డా॥ బూర్గుల రామకృష్ణారావు గాలిబ్ కవితామాధుర్యాన్ని గజల్ సౌందర్యాన్ని చవిచూపారు. భీమన్న 'దీపసభ' కు నిడదవోలు పీఠిక, బాపురెడ్డి 'రాకెట్ రాయబారా'నికి భీమన్న దిద్దిన తిలకం పేర్కొనదగినవే. ఆరుద్ర 'త్వమేవాహం'కు శ్రీశ్రీ లఘువ్యాఖ్య, దాశరథి టిప్పణి పీఠికాప్రాయాలే అని చెప్పవచ్చును. అర్వాచీనములైన వచనగేయ కావ్యాలలో విషాదభారతం మున్నగువాటికి రమణారెడ్డి పీఠికలు రచించారు. చేతనావర్తం రెండుభాగాలకు

సుప్రసన్న, సంపత్కుమార కూర్చిన పీఠికలు వచనకవితత్వాన్ని నిరూపిస్తు న్నాయి. నారాయణరెడ్డి 'మంటలూ - మానవుడు' కావ్యానికి కె. వీరభద్రరావు రూపొందించిన పీఠిక ఇటీవలి కావ్యపీఠికల్లోనే తలమానికంగా ఎన్నదగినది. స్వాతంత్ర్యానికి పూర్వం శ్రీ శ్రీ మహాప్రస్థానానికి చలం యిచ్చిన యోగ్యతా పత్రం ఎంతవిలువైనదో స్వాతంత్ర్య యుగోదయ కాలంలో ఈ పీఠిక కూడా అంతే గణనీయమైనది.

వివిధ వచనగ్రంథాల పీఠికలలో ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము నకు సురవరం ప్రతాపరెడ్డి ఉపోద్ఘాతం మొదట చెప్పతగినది. ఆముక్తమాల్యదా పర్యాలోకనము ద్వితీయావృత్తికి ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు కూర్చిన 88 పుటల ఆంధ్రసాహిత్యసౌరభ భూమిక దానికి సమగ్రత్వాన్ని చేకూర్చింది. తెలుగు ఛందోవికాసమునకు విశ్వనాథపీఠిక విశిష్టమైనది. సారస్వతవ్యాసములు (1) విపులపీఠికలో డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం తెలుగుసాహిత్య విమర్శను శాస్త్రీయంగా విశదీకరించారు. అద్యతనకాలంలో వెలువడిన విమర్శ గ్రంథా లకు దివాకర్ల, పాటిబండ ప్రభృతులు కూర్చినపీఠికలు పేర్కొనదగినవి. దేవులపల్లి రామానుజరావు వివిధగ్రంథాలకు రచించినప్రస్తావనలు స్వరూపంలో చిన్నవైనా గణింపదగినవి.

ప్రాచీన కావ్యావతారికలవలెనే ఆధునికయుగంలో కూడా సంప్రదాయ బద్ధమైన కావ్యాలకు అవతారికలు వెలశాయి. శ్రీమద్రామాయణ కల్పవృక్షావ తారిక సత్యనారాయణగారి కావ్యదృక్పథాన్ని వెల్లడిస్తూ సహృదయ హృద యగమంగా వుంది. బీర్నీడి ప్రసన్న పృథ్వీభాగవతం కృతిస్కంధంలోకృతి భర్తయైన విశ్వనాథ కవితావైశిష్ట్యాన్ని ఉగ్గడించారు. నవ్యకావ్యమైన 'సినీవాలి' ప్రారంభంలో శ్రీశ్రీ, వరద, ఆరుద్రలు కావించిన కవిత్వచర్చకూడా అవతారికా ప్రాయమై వివేచనాత్మకంగా విలసిల్లుతున్నది.

ఈ విధంగా గ్రంథపరిష్కరణలో, పీఠికా రచనలో స్వాతంత్ర్యయుగో దయ కాంతులు ప్రకాశమానమవుతున్నా వాటి నావరించివున్న చీకటితెరలు పూర్తిగా అంతరించిపోలేదు. తమిళనాడులోని తంజావూరులో, చెన్నపట్నంలో అసంఖ్యాకమైన తాళపత్ర గ్రంథాలు అముద్రిత రచనలు వెలుగుకు నోచుకో కుండా అట్టడుగున పడివున్నాయి. వాటినన్నిటినీ సేకరించి తెలుగువారి ముఖ్య పట్టణంలో భద్రపరచినాడు, మనరాష్ట్రంలోని మూడుప్రాంతాల్లో జరుగుతున్న కృషిని సమీకరించిననాడు, పరిష్కర్తలు, పండితులు రాగద్వేషాలను విడనాడి సంయమనం వహించిననాడు అవి కాంతిమంతగా వెలుగొందగలవు.

# విమర్శ : ప్రమాణాలు : ప్రయోగాలు

శ్రీ సంపత్కుమార

ఆధునిక విమర్శలో ప్రధానంగా వచ్చిన మార్పు కావ్యాన్ని లేదా రచనను ఏకదేశంగా దర్శించటం కాకుండా, కావ్య సమగ్రతాదృష్టి, — సమగ్ర కావ్యదృష్టి-తో భావించటం. కావ్యంయొక్క సమగ్రతకు కథ, కాలం, దేశం, ఈ మూడంశాల్లోనూ ఏకత్వం ఉండటమనేది పాశ్చాత్య సాహిత్య విమర్శ ప్రమాణాల్లో ముఖ్యమయిన వాటిలో ఒకటి. అయితే మన ప్రాచీన కావ్యాల్లో ఈ మూడంశాలూ చాలాచోట్ల లోపించినట్లు కనుపిస్తుంది. అయినప్పుడు కావ్యానికి సమగ్రత్వం ఎట్లా భావించటం? దీన్నిగూర్చి ఈ పాతిక సంవత్సరాల్లోనూ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రాచీన కావ్యాలను ఆధారంగా తీసుకుని విమర్శలో ఒక కొత్త దృక్పథాన్ని కలిగించినారు. ఆయన వెలువరించిన 'నన్నయగారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి', 'శాకుంతలము యొక్క అభిజ్ఞానత', 'అల్లసానివాని అల్లిక జిగిబిగి', 'ఒకడు నాచనసోమన్న' అన్న గ్రంథాలు, కావ్యగత మహా విషయాలను అనేకంగా ప్రస్తావిస్తూ, కథను మన పద్ధతిలో, కావ్య పరమార్థ దృష్ట్యా చూడవలసిన విధానాన్ని గూర్చి నూత్న మార్గాన్ని వెలయించినారు. ఆధునిక విమర్శ ఈ దృక్పథాన్ని ఒక్క ప్రాచీన కావ్యాల విషయంలోనే కాకుండా, ఆధునిక కావ్యాలకూ. రచనలకూ విస్తరింప చేసి అనుశీలనం చేస్తున్నది.

విమర్శ సాగటంలో స్థూలంగా రెండుపద్ధతు లున్నాయి. ఒకటి - కవి లేదా రచయిత వైపు నుంచి. రెండు - పాఠకుని వైపునుంచి. మొదటి పద్ధతి రచయిత రచనా విషయికంగా పడిన శ్రమ, అతని పాండిత్యమూ, ప్రతిభా శిల్ప ప్రయోగం మొదలయిన వాటిని విశ్లేషిస్తూ గుణదోష విచారణ చేస్తూ విమర్శ సాగుతుంది. రెండవ పద్ధతిలో కావ్యం - రచనవల్ల పాఠకునికి కలిగే అనుభూతిని, అందులోని దశాతారతమ్యాన్నీ ప్రధానం చేసుకుని సాగుతుంది. ఈ పాతికేళ్ళుగా సాగిన ఆధునిక విమర్శలో రెండవ పద్ధతికి ప్రాధాన్యం కల్గించబడుతున్నది. ఎందుకంటే, రచనయొక్క స్థాయిని నిరూపించటంలో రచయితయొక్క శిల్ప చాతుర్యం మొదలయినవి అవసరమే అయినా, అది పాఠకునికి కల్గించే అనుభూతి ప్రధానమైంది. రచయిత యొక్క వైయక్తిక జీవితం,

అందులోని నిమ్నోన్నతాలూ, అతని మనస్తత్వం, రచన సాగినప్పటి పరిస్థితులూ మొదలైన వాటికి ప్రాధాన్యంకల్గితే, రచనవల్ల కలుగ వలసిన అనుభూతి సమగ్రంగా కలిగే అవకాశం సంకుచిత మయింది. రచనను భావించే ధోరణిలో పాక్షికత కలుగుతుంది. రచనను అన్ని వైపులనుంచీ చూచే అవకాశం తగ్గిపోతుంది. ఈ కారణంగా ఆధునిక విమర్శ మొదటి పద్ధతిని అభిమానిస్తున్నది.

మనకు ప్రాచీనమయిన సాహిత్య శాస్త్రం చాలా విస్తృతంగా ఉన్నది. అది సాహిత్యానికి సంబంధించిన సిద్ధాంతాలను నిరూపించింది. ఈ సిద్ధాంతాలు గూడా బహుకావ్యాలను సహృదయత్వంతో సుష్ఠుగా అనుశీలనం చేయటం ద్వారా సాగిన విమర్శవల్లనే నిష్పన్నమయినయి. తరువాత సాగే విమర్శకు ప్రమాణాలయినయి. అయితే మన సాహిత్య శాస్త్రమంతా చాలావరకు ఒక విధంగా రచనా విషయంలో కవిశిక్షారూపంగా కనిపిస్తుంది. కావ్యం ఈ యీ విధంగా ఉండాలనీ, ఈ యీ అంశాలు కావ్యంలో ఉండాలనీ, కవి ఫలానా విషయాలలో జాగ్రత్తగా మెలగాలనీ, ఈ విధంగా కవిని, అతని కావ్యాన్నీ చాలా నిర్బంధిస్తున్నట్టూ, నియమిస్తున్నట్టూ కనిపిస్తుంది. కాని ఈ నియమాలన్నీ వెసులుబాటులేని ఇనుపగొలుసు లేమీ కావు. అట్లాగే అయ్యేటుంటే, సాహిత్యంలో ఉపజ్ఞకు స్థానంగానీ, సాహిత్యంలో పురోగతిగానీ వచ్చేదేకాదు. 'శాస్త్రము ప్రతిభను కుదించలేదు. శాస్త్రమును వదిలిపెట్టి ప్రతిభ భాసించదు' అని విశ్వనాథవా రన్నట్టు ఈ రెండు పరస్పరం పోషకాంశాలు. కాని ఈ విషయాన్ని గ్రహించకుండా కొన్ని సందర్భాల్లో అటు కవులూ, ఇటు విమర్శకులూ శాస్త్రాన్ని గుడ్డిగా అనుసరించటంతో, శాస్త్రీయ ప్రమాణాలంటే ఒక విధమయిన భయం, ద్వేషం కలుగటానికి వీలయింది. శాస్త్ర నిరూపిత ప్రమాణాలన్నీ రచనను గూర్చిన సరయిన అవగాహన ఉద్దేశించవనే తప్ప ఉపజ్ఞను అణగార్చటానికి కాదు. కవికి లోక శాస్త్రాద్యవేక్షణం అవసరమని చెప్పటంలో ఉద్దేశం ఇదే. విమర్శకూ ఇవి చాలా ప్రధానమయినవే. శాస్త్రీయ ప్రమాణాలను అవకాశాన్ని బట్టీ, సందర్భాన్ని బట్టీ వికసింపచేసుకొని ముందుకు సాగటం ఆధునిక విమర్శ అవలంబిస్తున్న పద్ధతి. ఇది ఇంతకుపూర్వం అసలే లేదనటం కాదుగాని, ప్రాధాన్య వివక్షతో ఇట్లా చెప్పటం.

సాహిత్యం నిలువనీరేమీ కాదు. ప్రవహించే మహాప్రవాహం. క్రమక్రమంగా ఉపనదుల్ని కలుపుకుంటూ ఎప్పుడూ విస్తరించే నదివంటిది. స్వప్రతిభా విశేషంచేతా, తన గాఢమయిన పరిచితిలోకి వచ్చిన ఇతర సాహి

త్వాల ప్రభావప్రేరణలతోటే విస్తృతమవుతూ కొత్త కొత్త దారుల్లో సాగిపోతూ ఉంటుంది. ఆధునిక కాలంలో వివిధ రంగాలలో ప్రపంచ వ్యాప్తంగా విజ్ఞానం బహుముఖంగా విస్తరిస్తున్నది. పరిస్థితుల్లో రకరకాల మార్పులు వస్తున్నాయి. ఆలోచనా ధోరణిలోనూ ఎన్నోవిధాలు అనుభూయమానమవుతున్నయి. మరి వీటన్నిటి ప్రభావం సాహిత్యంమీద కూడా గాఢంగా పడటం అతిసహజం. వీటన్నిటి దృష్ట్యా, అన్నిటినీ సమీకరించుకొని ముందుకు సాగేందుకు కొత్త ప్రమాణాలను సమన్వయించుకుంటూ, సాంప్రదాయికమయిన వాటిని విస్తరింప చేసుకుంటూపోయే సమన్వయ దృక్పథం ఆధునిక విమర్శ అలవరుచుకున్నది. మౌలికమయిన అంశాలను వదలకుండా సాంప్రదాయిక ప్రమాణాలను నూత్న దృక్పథంతో వ్యాఖ్యానం చేసుకుంటున్నది. ఇది ఇంకా గాఢంగా జరుగవలసి ఉన్నది కూడా.

ఏ దేశంలోనైనాసరే, ఆ దేశీయమయిన ప్రమాణాలను అన్నివిధాలా తోసిరాజని ఏ కొత్త ధోరణీ నిలుకడ సంపాదించటం కుదురదు. అందుకే సాహిత్యంలో వచ్చిన కొత్త ధోరణులు మొదట్లో ప్రమాణాలన్నిటినీ తృణీక రించి నట్లు కనిపించినా నెమ్మది నెమ్మదిగా, తమకు అన్వయించుకొని నిలుకడ సంపాదించుకొన్నాయి. అన్వయించుకోనివి కేవలం పేర్లుగా మాత్రమే మిగిలి పోయినయి. ఈ దృష్టితో ఈనాడు సాహిత్య విషయికంగా వివిధ దృక్పథాలు కలిగిన వారందరూ, విమర్శ విషయంలో ఉపయోగించే, పాటించే ప్రమాణాల్లో దాదాపు తేడా లేకుండానే వర్తిన్నాయనే అంశం. ఆధునిక విమర్శలో ప్రధా నంగా గమనించవలసిన అంశం ప్రమాణరాహిత్యాన్ని ఎవరూ హర్షించటం లేదు.

అయితే ఆధునిక విమర్శలో కావ్యపరమార్థ విషయికంగా రెండురకాల అభిప్రాయాలు వ్యాప్తిలో ఉన్నాయి. మొదటిది కావ్యపరమార్థంగా రసాను భూతిని భావిస్తుంది. రెండవది కావ్యపరమార్థంగా వస్తువును భావిస్తుంది. ఈ వస్తువు ఒక సిద్ధాంతానికి సంబంధించింది. ఆ సిద్ధాంతం మార్క్సిస్టుదృక్పథం ద్వారా నిశ్చితమయింది. మార్క్సిజం నిరూపించిన ఆదర్శం కావ్యపరమార్థం. ఈ పరమార్థ దృష్టిలో ఉన్న విభేదాన్ని అనుసరించి రచనాస్థాయిని అంచనా వేయటం జరుగుతుంది. రచనాశిల్పం ఎంతగా ఉన్నా రచన రసాభివ్యంజకం కాకపోతే ఆ రచన మొదటిపద్ధతిలో ఉత్తమస్థాయిని సంపాదించలేక పోతుంది. అట్లాగే రెండవపద్ధతిలో ఆ 'ఆదర్శం' రచనా పరమార్థంగా చిత్రితం కాకపోతే

ఉత్తమస్థాయిని పొందదు. అయితే, ఇక్కడ ఒకచిన్నతేడా యున్నది. మొదటి పద్ధతిలో రసపోషక సామగ్రి విరహితంగా, రచనాశిల్పం లేకుండా రసాభివ్యక్తి కలగటానికి వీల్లేదు కాని రెండవపద్ధతిలో ఆ 'ఆదర్శం' ఉండటానికి వీలున్నది. 'ఉత్తమాదర్శ' ప్రేరితమయిన కావ్యాన్ని-రచనను - రచనాశిల్పం లేని కారణంగా హర్షించలేకపోవటం బూర్జువాతత్త్వంగా భావించబడుతుంది. 'శిల్పం లేనిదాన్ని మనం ఎంత ఉత్తమాదర్శప్రేరిత మయినా హర్షించలేకపోతున్నాం. ఇది బూర్జువా మనస్తత్వం అంటారు 'మన' వాళ్ళు. నిజం లేకపోలేదు అనిపిస్తుంది" అని శిల్పప్రాధాన్యాన్ని భావించే ఆరుద్ర, దాశరథికి వ్రాసిన ఒక ఉత్తరంలో తన చికాకులు వ్యక్తపరుస్తారు. అంటే శిల్పంలేకున్నా 'ఉత్తమాదర్శం' ఉంటేనే ఉత్తమకావ్యంగా భావించవచ్చునన్న ధోరణి ఇందులో వ్యక్తమవుతుంది. ఇదిట్లా ఉండగా, సర్వకావ్యాలూ రసాభివ్యక్తిని కలిగించే ఉత్తమస్థాయి కావ్యాలు కావు. కాని రచనాశిల్పంచేత, ఇంకా ఇతరమైన రచనాసంబంధి విషయాలచేత మనస్సుకు చమత్కారం కలిగించటం ద్వారాకూడా కొన్ని కావ్యాలూ రచనలో సాహిత్యంలో స్థానాన్ని పొందగల్గుతున్నాయి. మొదటి పద్ధతి వీటికి తగిన స్థాయి నిరూపిస్తుంది. కాని రెండవపద్ధతిలో ఈ స్థితికి అవకాశం చాలా తక్కువ.

ఈ దేశంలో సాహిత్యవిమర్శ ఏనాడూ రచనయొక్క స్థాయిని ఏసిద్ధాంతంతోగానీ, తత్త్వంతోగానీ ముడిపెట్టలేదు. కావ్యప్రయోజనాల్లో ఉపదేశాన్ని గూడా ఒక అంశంగా చేర్చటం జరిగింది కాని, అది గౌణంగానే భావించబడింది తప్ప ప్రధానంగా కాదు. అందుకే సాహిత్యసిద్ధాంతాలూ, విమర్శ ప్రమాణాలూ విభిన్నతత్త్వాలకూ చెందిన సాహిత్యాలకూ అనువర్తింప చేయటానికి వీలయినంత వెసులుబాటుతో సాగివస్తున్నాయి. నిజానికి ఒకరచన సాహిత్యపరిధిలోకి రావడానికి, అది ప్రధానంగా రచనాశిల్పాన్నీ, పాఠకునికి అది కలిగించే రసానుభూతిని బట్టి తప్ప కేవలం విషయప్రతిపాదనంవల్ల మాత్రం కాదు. విషయానికే ప్రాధాన్యం - అంటే ఆ 'ఆదర్శా'నికి ప్రాధాన్య మియ్యటంవల్ల సాహిత్యపు విలువలు తగ్గిపోయే అవకాశం అధికంగా ఉన్నది. ప్రగతివాద - అభ్యుదయ-కవితా ధోరణిలో ఈ విషయం అనుభవంలోకి వచ్చిందే. '....కవిత్వంలో మాత్రం అభ్యుదయభావాలు అమరికలేకుండా సూటిగా ప్రవేశించాయి. ఎంత ఎక్కువగా ప్రవేశించాయంటే, రాజకీయప్రబోధకుడికీ కవికీ భేదంలేనంతగా ప్రవేశించాయి. ఇది కవిత్వమా? నినాదాల సమూహమా? అని విమర్శకులు అడిగేటంత ఎక్కు-

ఏగా ప్రవేశించాయి. అందుకే అభ్యుదయకవిత్వంలో కవిత్వపు విలువలు చాలా తక్కువగా ఉన్నాయనే అపవాదు పుట్టింది. అయినా ఆ విధంగా జరిగినందు వల్ల సోషలిష్టు విప్లవానికి మేలే జరిగింది కాని, కీడేమీ జరగలేదు. ఈ విమర్శను పురస్కరించుకునే అనంతర కాలంలో వచనకవి యీ దశలో కవిత్వపు విలువలకు లోటులేనివిధంగా అభ్యుదయ కవిత్వం ప్రవర్తిల్లింది.......' అన్నారు శ్రీ కుందుర్తి. ('సాహిత్యంలో మారిన విలువలు; కవిత') సోషలిష్టు విప్లవానికి జరిగే మేలుకీళ్ళనుబట్టి సాహిత్యం పరిశీలించేదృష్టి ప్రధానమన్న అంశం ఇక్కడ గమనించవలసింది, మొత్తంమీద ప్రస్తావితమయిన రెండుపద్ధతుల్లో మొదటిపద్ధతిలో రచనాశిల్పం ప్రధానంకాగా, రెండవదానిలో గౌణం. సిద్ధాంతప్రచారానికి కావ్యశిల్పం, రచనాశిల్పం ఒక సాధనంగా స్వీకరించటం ఈ రెండవదానిలో ముఖ్యం కాగా మొదటిదానిలో పాఠకునికి కావ్యం వల్ల కలిగే అనుభూతి ప్రధానం. అయితే మొదటిపద్ధతి రెండవదాన్ని స్వాంతర్గతం చేసుకోగలిగిన విస్తృతి కలది కాగా, రెండవది లేనిది.

ఈపాతికేళ్ళుగా సాగిన ఆధునికవిమర్శలో, విమర్శ కేవలం వ్యాసాల రూపంగానేకాకుండా కవితాధోరణిలోనూ, సంభాషణారీతిలోనూ, కథాస్వరూపంలోనూ అక్కడక్కడా వెలువడింది. అయితే వీటిలో వ్యాసరూపంలో వెలువడిన విమర్శలో ఉండే లోతుగానీ, గాఢత్వంకానీ ఉండే అవకాశం తక్కువ. అందువల్లనే ఆవిధమైన ప్రయోగాలకు అంతగా విస్తృతి కలుగలేదేమోననిపిస్తుంది. అయినా ఒక ప్రయత్నంగా వాటిని స్వీకరించవలసిందే.

ఆధునికసాహిత్యవిమర్శ సాహిత్యంలోని వివిధప్రక్రియలను గూర్చి సాగటం నిజమే కాని కథ, నవల, నాటకం మొదలయిన ప్రక్రియలన్నింటిని గూర్చి వచ్చిన విమర్శ కవిత్వాన్నీ కావ్యాలనూ గూర్చి వచ్చిన విమర్శదృష్ట్యా చాలా తక్కువే అని చెప్పవలసి ఉంటుంది. దానికి కారణం కవిత్వంలో, కావ్యరూపాల్లో త్వరత్వరగా వచ్చినన్ని నూత్నరీతులు మిగిలినవాటిలో అంతగా రాకపోవటమే అనిపిస్తుంది.

ఆధునిక విమర్శను ప్రోదిచేసినవారంటూ - వెనుకటితరం వారిని వదిలి- ధూళిపాళ శ్రీరామమూర్తి, కేతవరపు రామకోటిశాస్త్రి, జి.వి. కృష్ణారావు, పోట్లపల్లి సీతారామరావు, కే. వి. రమణారెడ్డి, రాచమల్లు రామచంద్రారెడ్డి, కాటూరి హనుమంతరావు, జి.వి. సుబ్రహ్మణ్యం, సుప్రసన్న, గుంటూరు శేషేంద్రశర్మ, సంపత్కుమార, ఆర్.ఎస్. సుదర్శనం....ఇట్లా చెప్పుకుంటూపోతే తొందరలో తెమలదు. అందుకని ఆ ప్రయత్నం, ప్రత్యేకంగా ఇక్కడ వివరించిచెప్పుకునే అవకాశం లేకపోవటంవల్ల విరమించటం, ప్రస్తుతానికి చాలామంచి అని తృప్తిపడటం మంచిది.

# సమీక్షలు - చర్చలు - వాదోపవాదాలు

డా. ముదిగొండ శివప్రసాద్

సాహిత్యాన్ని సృష్టించడంకన్నా సాహిత్య సమీక్షను అసిధారావ్రతంగా నిర్వహించడం ఇంకా కష్టం: కవి స్రష్ట అయితే సమీక్షకుడు ద్రష్ట అయి వుండాలి. వ్యక్తిగతమైన అభినివేశాలకు లోనుగాకుండా మహర్షిలా సత్య వాక్కునూ, సత్త్వవాక్కునూ ఆధారంగా చేసుకొని ప్రసన్నంగా లోనారసి ఒక గ్రంథాన్ని సమీక్షించడం అంటే అది సామాన్యమానవుడు చేయలేని పని. కాబట్టే తెలుగులోనూ, మిగతా భాషలలోనూ కూడా సృజనాత్మక సాహిత్యం వచ్చినంత విస్తృతంగా సహృదయ సమీక్షలు, ఋషిప్రోక్తాలు రావడంలేదు.

గ్రంథసమీక్ష(Book-Review)సాహిత్య విమర్శ(Literary criticism) రెండూ సన్నిహిత సంబంధంగల అంశాలు. మొదటిదాని బృహద్రూపమే రెండవది. కొండవంటి సాహిత్య విమర్శనావ్యాసంగాన్ని గ్రంథసమీక్షకుడు తన పరిమితమైన అద్దంలో చూపడానికి ప్రయత్నిస్తాడు. ఏకదేశమైన గ్రంథసమీక్ష యొక్క బహుముఖీనమైన వ్యాపకదశలో వెలువడే సిద్ధాంత గ్రంథమే సాహిత్య విమర్శ. పెద్ద కాన్వాసుమీద బొమ్మను చిత్రించడంకన్నా ఆ సౌందర్యాలన్నీ పరిమితమైన, సీమితమైన ఎల్లలుగల భిత్తికపై చిత్రించడంలో గల కష్టమే ఏకదేశమైన ఒక గ్రంథాన్ని సమీక్షించడంలో సమీక్షకునికి ఎదురవుతుంది. కొన్ని సందర్భాలలో ఈ సమీక్ష అనేక కారణాలను పురస్కరించుకొని వాదోపవాదాలకు దారితీస్తుంది. పట్టాలు తప్పనంతవరకు, ఆరోగ్యదాయకమైన వాదోపవాదాలను మనం హృదయపూర్వకంగా ఆహ్వానించాలి. అలాంటి చర్చలలోనుండీ, వాగ్యుద్ధాలలోనుండీ పుటంపెట్టిన బంగారంలా మేలిమి వన్నెలతో సాహిత్య విమర్శ ఒక భాషలో సజీవంగా సు'వర్ణ' ద్యుతులలో సహజంగా ప్రవర్థమానమౌతుంది. ఈ ఎదుగు ఒక భాషయొక్క సాహిత్యంయొక్క ఉపాధికి మూలాధారమైన విషయం :

మానవుడు ఏ దేశంలో, ఏ కాలంలో పుట్టినా మౌలికమైన అతని నిర్మాణంలో మార్పులు రావడానికి అవకాశం లేదు. స్వాతంత్ర్యం రావడానికి ముందుగల సమీక్షకులలో వున్న గుణలోపాలే అనంతరకాలంలోని సమీక్షకులలోనూ

వున్నాయి. అదే మనసు, అదే మనిషి, అవే రాగద్వేషాలు, కాకుంటే స్వాతంత్ర్యానికి పూర్వం విమర్శలో లోతు ఎక్కువగా ఉండేది దానికి బదులు 1947 తర్వాత లోతు బాగా తక్కువై కేవలం వెడల్పు పెరిగింది. ఇది చాలా ముఖ్యంగా మనం గమనింపవలసిన ఒక పరిణామం.

కట్టమంచి రామలింగారెడ్డిగారి విమర్శనా గ్రంథం వెలువడ్డనాటినుండి తెలుగు విమర్శలో ఒక విప్లవాత్మకమైన మార్పు ప్రారంభమైంది. శాబ్దిక చర్చలూ, వ్యాకరణాంశాలపై మల్లయుద్ధాలు తగ్గి తులనాత్మక సమాలోచనమూ, అంతర్వీక్షణమూ మొదలైంది. ఆంగ్ల విమర్శనా సంపర్కంతో తెలుగు సమీక్షకునిలో ఒక కొత్త మెరుపు, ఒడుపు కన్పడసాగింది. పాత్రికేయం కాళ్లూని నిలబడటంతో, ముద్రణాసౌకర్యాలు విస్తృతంగా రూపొంది విరివిగా గ్రంథ ప్రకాశం జరగడంతో 'గ్రంథసమీక్ష' ఒక ప్రత్యేక సాహిత్యాంగంగా, పృథక్కరింపదగ్గ దశకు చేరుకుంది. సమీక్షకునికి అర్హతలు నిర్ణయింపబడి అదొక ఉద్యోగంగా, చాతుర్యంగా పరిగణింపబడుతున్నది ఈనాడు.

సమీక్షలను మనం రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది గ్రంథ పరిచయం. దీనికి పెద్ద ప్రజ్ఞ ఉండనక్కరలేదు— "తెలుగు సాహిత్యంలో బసవగీత అనే పుస్తకం ఒకటి ఉద్భవించింది. దీనిని శివప్రసాద్ అనే కవి రచించారు. దీనికి మూలం కన్నడంలో బసవేశ్వరుడు రచించిన వచనాలు. గ్రంథం వందపుటలుంది. మేలిమి కాగితంపై ముద్రింపబడింది—

అయినా దీని వెల రూపాయి మాత్రమే. ప్రాప్తిస్థానం వి. వి. హాస్టల్. హైదరాబాదు-27" ఇలా వ్రాయడానికి ఋషితుల్యుడైన విమర్శకుడే కానక్కర లేదు— ఏ ప్రూఫ్‌రీడరో, చివరకు కంపోజిటరోకూడా చేయగలడు ఈ పని. ఇలాకాక "ఈ పుస్తకం చాలా బాగుంది. అక్కడక్కడ అచ్చుతప్పులున్నాయి." అని కొన్ని బాగున్న పంక్తులూ, కొన్ని బాగాలేని పంక్తులూ, నాలుగైదు అచ్చు తప్పులూ చూపించడం రెండవరకం. ఇది మొదటిదానికన్నా కాస్త మెరుగు. అంతేకాని ఇక్కడా విమర్శక వ్యాపారం పరాకాష్ఠను చేరుకునే ప్రజ్ఞ, కౌశలం అన్నింటినీ మించిన ఋషిత్వం కన్పడే అవకాశంలేదు-తెలుగులో 1947 నుండి 1972 వరకు వస్తున్న గ్రంథ సమీక్షలలో నూటికి తొంభై సమీక్షలు ఈ రెండవ పద్ధతికి చెందినవి. ఇప్పుడు పైన చెప్పిన లక్షణానికి లక్ష్య సమన్వయం చేయడానికి ఉదాహరణలు తీసుకొందాము.

ఉగాది కొకసారి మొత్తం సంవత్సరంలోనూ వచ్చిన గ్రంథాలను సమీక్షిస్తూ శ్రీ వాత్సవగారు బ్రతికి వున్నంతకాలమూ భారతి, ఆంధ్రజ్యోతి, పత్రిక లేదా ప్రభలలో వ్యాసాలు వ్రాస్తూ వుండేవారు. వీరు ఆ సంవత్సరం వచ్చిన నవలలపై ఒక వ్యాసం, నాటకాలపై ఒకటి, పద్యకావ్యాలపై మరొకటీ ఇలా వ్రాస్తూ వుండేవారు. వారు ప్రారంభించిన ఈ సత్సంప్రదాయం వారితోనే కుంటుబడిపోయింది. అయితే ఈ సమీక్షలలో సాహిత్యాన్నిగూర్చిన ఒక విహంగావలోకనం మనకు లభిస్తుందే కాని లోతు లేని వెడల్పయిన ఒక ఆంగ్లేయ విమర్శనాపద్ధతి గోచరిస్తుందే కాని ఇదే సమగ్రమైన సమీక్ష కావడానికి అవకాశం లేదు.

సమీక్ష కేవలం గ్రంథపరిచయాలకే పరిమితం కాలేదు. వివిధాంశాలపైన కూడా సమీక్ష జరుగవచ్చు. దానిపై వాదోపవాదాలు ప్రారంభం కావచ్చు. ఈ సత్యాన్వేషణలో సహృదయులు మంచి పాటవాన్నీ, ప్రజ్ఞనూ ప్రదర్శింపవచ్చు-అలాంటి చర్చలే "అర్జునుని శరీరవర్ణ మెలాంటిది ?" "కాకతీయులు వేల్పుకొండవారా ?" "దధివామన స్వరూపమెట్టిది ?" ఇత్యాదులు. 'ఇంతటితో ఈ చర్చను ముగిస్తున్నాము' అని సంపాదకుడు వ్రాసేవరకూ ఇవి సాగేవంటే విమర్శకులు ఎంతటి ఆసక్తిని వాటి యెడల కనపరచేవారో అర్థమవుతుంది. ముందే తా మొక అభిప్రాయానికి వచ్చి దానిని ఇతరుల నెత్తిన రుద్దుదామన్న ఉద్దేశంతో కాక (Pre-conceived notions), సత్యాన్వేషణతో ఇలాంటి చర్చలు ఎన్ని విషయాలపైన ఎంతకాలం జరిగినా అవి ఆరోగ్యదాయకమైన ఫలితాలనే ఇస్తాయి.

1947కు ముందు సాగినట్లే తర్వాతకూడా శాబ్దికమైన చర్చలూ యుద్ధాలూ చాలా సాగాయి. 'శరణార్థి శబ్దపల్లవమౌనా?' 'లోపడు' రూపంలోని సాధుత్వ నిర్ణయం వంటి చర్చలలో శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు, వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారి వంటి దిగ్గంతు లెందరో పాల్గొన్నారు. భాషాపరంగా ఇవి చాలా సత్ఫలితాలను సాధించాయి కూడాను. 'నృసింహపురాణ పాఠశోధన'పై తాపీవారికీ, రాళ్లపల్లి వారికీ నడిచిన వివాదం, 'ధనంజయ ప్రవరుడు' అన్న పాదంమీద దీపాలవారికీ, రాళ్లపల్లి వారికీ నడిచిన సంవాద 'వ్యాకరణ సంహితా సర్వస్వం'పై శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రి గారికీ, వఝ్ఝలవారికీ సాగిన వాగ్యుద్ధ, విశ్వనాథ వారి అణడం యతిపై కొత్త

చౌదరిగారికీ, వేదాంతం గోపాల కృష్ణమాచార్యులు ప్రభృతులకూ సాగిన కురుక్షేత్రం, వంటివి శాబ్దికంగా సాగిన విమర్శలకు కొన్ని ఉదాహరణాలు. 'లుప్త విభక్తిక నామ్నీ కరణం' పై చేకూరి రామారావు గారికీ, కాశూరి హనుమంతరావు గారికీ సాగిన సంవాదం, భాషా శాస్త్రానికి ఉదాహరణమైతే, 'జుత్తిగ వాసుకిరవి సోమేశ్వర స్వామి ప్రతిష్ఠాత' లపై జి.ఆర్. వర్మగారికీ తురగా కృష్ణమూర్తి గారికీ మధ్య నడిచిన వివాదం శిల్పశాస్త్ర సంబంధమైన ఒక ఉదాహరణం. ఆరుద్ర ఆంధ్ర సాహిత్యంపై నిడుదవోలువారి వ్యాస పరంపరా, శ్రీశ్రీ, చలం ప్రభృతులపై సాగిన 'సాహిత్యనికషోపలం' సమీక్ష, సాహిత్య పరమైన యుద్ధాలకు ఉదాహరణమైతే శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు. ఆర్.ఎస్. సుదర్శనం గార్ల రచనలూ భారతిలో శ్రీ పాదవారి (అర్ధ శతాబ్దపు తెలుగు కవిత్వంపై) వ్యాస పరంపరా సాహిత్యంయొక్క అంతర మైన పరిశీలనకు ఉదాహరణాలు. 'రాయల గయశాసనము జయశాసనమా' అని కె.హెచ్.వి శర్మగారి మధ్య, డా. నే. వెంకటరమణయ్యగారి మధ్యా నడిచిన వివాదం శాసనసంబంధమైనదైతే, వచనకవిత్వానికి యుగకర్తలెవ్వరని వివిధ పత్రికలలో సాగించిన వివాదం (ఈ వివాదం ఒక్కొక్క యుగకర్త తన అనుయాయులచేత సాగించాడు) ముఠాసంబంధమైన ఒక సమీక్షాత్మక కార్యకలాపానికి ఉదాహరణం. ఇలా జాబితానిస్తే చాలా పెద్దదౌతుందని ఇంతటితో విరమిస్తున్నాను. భారతి, కృష్ణాపత్రిక, సాహితిస్రవంతి, సృజన, జాగృతి ప్రభ, పత్రిక, ఆంధ్రజ్యోతివంటి ఎన్నో తెలుగుపత్రికలు వెనుకటి గాండీవం, వజ్రాయుధం. ఉదయిని పత్రికలవలె ఈ యుద్ధాలకు రంగస్థలాలుగా ఈపాతికేళ్ళు నిలిచాయి. అయితే కేవల శబ్దచర్చ ఒక సుందరి ధరించిన చీరెను వర్ణించడం, రంగును ప్రశంసించడం వంటిదైతే అర్థ విమర్శ ఆమె అంతరంగ సౌందర్యాన్ని స్పృశించడమని ప్రాక్పశ్చిమ విమర్శకులు బలంగా అభిప్రాయ పడుతున్నారు. అయితే ఆర్థిక చర్చలలో హార్దిక సౌందర్యం విమర్శకునికో మృగ్యమైనప్పుడు అది కేవలం వ్యక్తిదూషణ కిందికి దారితీస్తుంది. ఇది తరుచు జరిగే విషయం. కాటూరి, పింగళి, విశ్వనాధవంటి వ్యక్తుల గ్రంధాలను ముఖ్యంగా సౌందరనందం, కల్పవృక్షంవంటివాటి సమీక్షలలో ఇది చాలా సార్లు కన్పడింది. 'సౌందరనందం' కావ్యమే కాదు అని 1952 ప్రాంతంలో జరిగిన విమర్శ వ్యక్తిగతంగా పింగళివారి స్థాయిని సాహిత్యంలో తగ్గించేం

దుకు చేసిన ఒక ప్రయత్నం. అలాగే విశ్వనాథవారిపై కల్పవృక్షం— అల్ప వృక్షమని నిరూపించేందుకు 1962 ప్రాంతంలో లేవబడ్డ ధూళి చాలావరకు వ్యక్తిగతంగానే కాదు కులాల ప్రాతిపదికమీద ఒకే కులంలోని అంతశ్శాఖా విభేదాలనాధారంగా చేసుకున్న స్పర్ధగా కూడా పరిణమించింది. ఇది చాలా అసహ్య(భ్య)కరమైన పరిణామం, ఏ భాషకైనా సరే!!

విశ్వనాథవారి బాలకాండము పేరు వినగానే బాలక + అండము గుర్తుకు వచ్చి జుగుప్స కలిగింది—కాబట్టి విశ్వనాథ కవికాడు అనే దొక విమర్శ. ఈ బాలకాండం విశ్వనాథవారే ప్రయోగించారా? వాల్మీకి లేదా ఇతర రామాయణ కర్తలలో లేదా? అప్పుడు మీకు బాలక, అండం ఎందుకు గుర్తుకు రాలేదు?? కేవలం ఇది వ్యక్తి దూషణకు శిఖరాయమానమైన ఉదాహరణంగా స్వీకరించి మాత్రమే చూపిస్తున్నాను. ఇలాంటి చర్చలు విశ్వనాథ, గురజాడ, శ్రీశ్రీ, చలంవంటి ప్రముఖ వ్యక్తులపైనా సాగాయి. ఒక వ్యక్తిమీద మనకు ఎలర్జీ వున్నప్పుడు ఇలాంటి వాదోపవాదాలకు దారితీసే రచనలు చేస్తాము. చేయిస్తాము. మహాసర్గమీద విశాలాంధ్ర, జనశక్తివంటి పత్రికలలో ఇలాంటి సమీక్ష లెన్నో వచ్చాయి. ఇదంతా ఆర్థిక ప్రాతిపదికమీద జరిగిన విమర్శలో అంతర్భాగమైనా ఇక్కడ సహృదయత్వం లేనేలేదు. వైయక్తికమైన స్పర్ధకు సమీక్ష ఒక ఆలంబనమూ, ఆచ్ఛాదనమూ మాత్రమేనని గుర్తించాలి. దిగంబర కవులు కన్పడిన పెద్దల నందరినీ తిడుతూ వ్రాయడం, వారిని ఆకాశానికెత్తుతూ, లేదా అధఃపాతాళానికి దంపుతూ ప్రతి విమర్శలు చేయడంలో రెండువైపులా ఈ ఎలర్జీయే కన్పడుతుంది. ఇవి సమీక్షా శబ్ద సామీప్యానికి కూడా రాదగని ప్రహసనాలు. హేతువాదం పేర బూతువాదాన్ని వ్యాప్తి చేస్తున్న దిగజారిన వైఖరికి ఉదాహరణాలు.

ఇవికాక సిద్ధాంతపరంగా గ్రంథాలపై విమర్శలూ, వాగ్వివాదాలు వ్యాపించాయి. గురజాడనాటికి సామ్యవాదం లేదు. ఆయన సామ్యవాదిగా తన్ను తాను ప్రకటించుకోలేదు. 1915 నవంబరు 30 న గురజాడ అస్తమించారు. 1917లో కాని రష్యన్ విప్లవంరాలేదు. కాని ఆయనరచనలు సామ్యవాదులు ఎందుకనో ఉపయోగించుకొన్నారు. గురజాడను ఆదర్శ సామ్యవాద రచయితగా తీర్చిదిద్దారు, తత్ఫలితంగా సామ్యవాదాన్ని వ్యతిరేకించ దలచుకొన్న వారంతా సామ్యవాదులు ఎవరిని రచయితలంటే వారిని విమర్శించారు. సామ్య

వాదులు వ్యతిరేకించిన విశ్వనాథ ప్రవృత్తులను తద్విరుద్ధశక్తులు బలపరిచాయి. ఇలా రాజకీయ-ఆర్థిక సిద్ధాంతాల ప్రాతిపదికపైన రచయితల వర్గీకరణ, గ్రంథాల సమీక్ష విజృంభించింది. కన్యాశుల్కంపై రేగిన దుమారం, విశ్వనాథ నవలలపై సాగిన సమీక్షలూ సృజన, ఆంధ్రపత్రిక, (ఉగాది) లలో కొడవటి గంటి, కె. వి రమణారెడ్డిగార్ల వ్యాసపరంపరలూ ఈకోవకు చెందినవి. ఏ సిద్ధాంతమూలేని వ్యక్తులుకూడా తమ దూషణభూషణలకు ఉపకరణంగా సిద్ధాంతాల ముసుగును వాడుకొని రాద్ధాంతం చేయడం కూడా మనకీవాగ్వివాదాలలో చాలా సందర్భాలలో కనిపిస్తుంది.

సిద్ధాంతాల ప్రాతిపదికపై గ్రంథసమీక్షలూ, వాగ్వివాదాలు పూర్వ కాలంలో కూడా లేకపోలేదు. శైవ వైష్ణవ బౌద్ధ జైనాది సిద్ధాంతాలనాధారంగా చేసుకొని పాల్కురికివంటి వారిని అణగద్రొక్కడమో, ఆకాశానికెత్తడమో భిన్నభిన్న కాలాల్లో మనం చూస్తున్న విషయమే. అలాగే భావకవిత్వం తొలి రోజులలో రేగిన దుమారం, భావకవిత్వంపై అభ్యుదయకవులు చేసిన తిరుగు బాటు, ఆనాటి సాహిత్యోద్యమాలూ, విప్లవాలు ఆధునికులకు సుపరిచితమే:కాని వ్యక్తిగతమైన ఆవేశకావేశాలకు సిద్ధాంతాల రంగునద్దడమూ ఔచిత్యాన్ని మరచి అవతలవ్యక్తిని తిట్టి, తద్వారా పాశవికమైన అసంతృప్తిని పొందడమూ విమర్శకు కూడనిపని. అప్పయ్యదీక్షితులవారిని 'అప్పిగాడు' అని మరొక ఆలంకారికుడు తిట్టడం మనకు తెలుసు. దిఙ్నాగుడు చేతులు బారలు చాపుతూ కాళిదాసును వ్యర్థంగా తిట్టేవాడని మేఘసందేశంలోని ఒక పంక్తి సాక్ష్యమిస్తున్నది. భూమి విశాలమైనది నేడుకాకుంటే రేపైనా నన్ను ప్రజలు మన్నించగలరని భవభూతి విలపించడమూ, ఏగతి రచియించినా సమకాలమువారు మెచ్చరని చేమకూర వేంకటకవి తనబాధ వ్యక్తంచేయడమూ మనకు తెలిసిన కొన్ని ఉదాహరణలు. ఈ సందర్భాలన్నిటిలోనూ కులద్వేషమో, వర్గద్వేషమో, వర్ణ ద్వేషమో కరుడుగట్టుకొని అసూయ అసహనములకు దారితీసి, అసందర్భమైన వాగ్వివాదాలను ప్రోత్సహించిందని మనం గ్రహించగలం. 1965 తర్వాత నేటివరకూ వచ్చిన సాహిత్య సమీక్షలలో ఈ తత్వం చాలా ప్రబలంగా కనిపిస్తుంది. సహృదయత్వం అన్నది కంటకాగడాలేసి వెతికినా కనిపించని రచనలు, వాటినే వ్యాపారార్థం ప్రోత్సహిస్తున్న పత్రికలూ నేడు తెలుగుదేశంలో స్వైరవిహారం సాగిస్తున్నాయి.

నచ్చినవాణ్ణి యుగకర్తగా చిత్రించి నచ్చనివాడికి కుకవిముద్రను వేయడం మహర్షితుల్యులైన విమర్శక పీఠాన్నలంకరించిన సర్వజ్ఞులుచేయవలసినపనికాదు మనవాక్యం శాపంలా, ఇంద్రచాపంలా చంద్రతాపంలా వుండాలి. నిడదవోలు వారుతన్ను విమర్శించినందుకు రాళ్లపల్లి వారు ఒక సందర్భంలో 'నన్ను గురించి నిడదవోలు వారిచెనుకు' అనే శీర్షికలో వ్రాస్తూ "శ్రీ వేంకటరావు గారి గ్రంథవ్యాసంగము విశాలమైనది. వ్యవసాయము విసుగులేనిది. దానిఫలముపూర్ణ ముగా ఆంధ్రసాహిత్యమునకు లభించుటకై వారు తమ అభిప్రాయములను రాద్ధాంతములును కొంత ఆత్రపడక నెమరువేసుకొని వెలువరచుట కావలసియు న్నది". (భారతి 1969 నవంబరు. 73వ పుట) అని సున్నితంగా తానుకొట్టే కత్తికే మందుపెట్టి దెబ్బవేయడం లోని సంయమనం. ఎంతోతపస్సుతో సాధి స్తేనేగాని అలవడే లక్షణం కాదు. ఒక గ్రంథాన్ని మనం విమర్శించడంలో అసలు పరమార్థమేమిటి?? 'వాడునిన్ను విమర్శించాడు' అంటే వట్టుకు చెడ తిట్టాడు- అనే అర్థమేకాదు వ్యావహారికంగా వ్యాప్తమై వుంది. కారణం విమ ర్శకుల రచనలు ఇందుకు ఉపబలకాలుగా ఉండటమే! విమర్శకుని ధర్మం ఒక రచనలోని గుణదోషాలను నీరక్షీర న్యాయంతోవిచక్షణచేసి కవివాచ్యంగా చెప్ప కూడదని వదిలిన శిల్పాలు వెలికితీసి చూపి, అజ్ఞతవలననో, ప్రమాద వశాత్తో చేసిన దోషాలను దిద్దుకోవలసినదని మృదువుగా హితవరిగా సలహానివ్వడం. ఆంగ్లంలో కొన్ని విమర్శక సంప్రదాయాలున్నాయి. అక్కడివారు విమర్శకు భయపడరు. కేవలం స్తోత్రపాఠాలకే ఆ జాతి అలవాటుపడి ఇసుమంత విమ ర్శనుకూడా సహించలేని దుస్థితికి దిగజారలేదు. అలాగే విమర్శకులు కూడా ఒకవ్యక్తిపేరు 'స్టోన్' అనివుంటే 'ఈ రాతిమొద్దుగాడి కవిత్వం పాషాణపాకం' అని విమర్శించరు. ఒక రచయిత చేసేవృత్తిని బట్టి ఒకచేత్తో మాంసంకోస్తూ మరొకచేత్తో కవిత్వంవ్రాసి మనప్రాణాలు తోడేస్తున్నాడు.' అని ఒక మాంసం దుకాణంపెట్టుకున్న కవినిగూర్చి విమర్శించకూడదు. ఆ కవియొక్క వంశాన్ని గూర్చితల్లిదండ్రుల గూర్చి గ్రంథ విమర్శలో ప్రసక్తం చేయకూడదు. కాని తెలుగుదేశంలోని నేటి వాగ్వివాదాలలో కన్పడేధోరణి మన అపరిణత బుద్ధికీ అల్పజ్ఞతకూని దర్శనం. శిశుదశనుంచి పశుదశకే పరుగిడుతున్న ఒక మన స్తత్వానికి ప్రతీక.

యువభారతివారు ఆజ్ఞాపించినట్లు పరిమితమైన పుటల పరిధిలో తెలుగులో వస్తున్న సమీక్షల తీరుతెన్నులు (Trends) మాత్రం స్థూలంగా ఇందులో విశ్లేషించి (Analysis) చూపడానికి ప్రయత్నించాను ఈ వ్యాసం సమగ్ర మని నేను భావించడమే లేదు. తెలుగులో ఎన్నో విధాల సమీక్షలు ఈనాడు వెలువడుతున్నాయి, ప్రతి పత్రికా గ్రంథ సమీక్షను ప్రోత్సహిస్తున్నది. కాని సమీక్షల సంఖ్య పెరిగినంతగా స్థాయి పెరగడం లేదు. రచయితను కూడా నచ్చని పుస్తకాన్ని 'చాలా బాగున్నది...అందరూ చదివితీరాలి—కాని తప్పకుండా చదవతగిన గ్రంథం, అని ఇలా పడికట్లతో మూసపోత సమీక్షలు చేయడం భాషయొక్క వెనుగుదలకు చిహ్నంకాదు. సమీక్షకుడు ఎలా వ్రాస్తే నేమి కాని దాని ప్రచురించేటప్పుడు సంపాదకుడు ఒకటికి రెండుసార్లు బాగా ఆలోచించి కాని ముద్రించరాదు. కీట్సును సమీక్షకులు (బ్లాక్ ఉడ్స్) చంపారు. కాళిదాసుకు 'సంజీవిని' చౌతమల్లినాధసూరి బ్రతికించాడు. సమీక్షకునిలో ఒక సహృదయ పాఠకుడూ, సమాజ సేవకుడూ, కవి, విమర్శకుడూ, పండితుడూ, న్యాయనిర్ణేతా, మహర్షీ, ఇంతమంది అంతర్లీనంగా దాక్కొని వున్నారు. ఇది బాగా గ్రహిస్తే 'ఈ పుస్తకం బాగుంది-లేదా బాగాలేదు' అని చెప్పడానికి ఎన్ని లేఖినులు నేటిలా ముందుకు దూకుతాయో చెప్పడం కష్టమే ॥



**భాషలలో భేదాలా వేషములో భేదాలా**
**దేశములో భేదాలా దేహములో భేదాలా**
**పరస్పర విభేదాలా మరణాంతోన్మాదాలా**
**మతకలహ నినాదాలా మహామతుల వాదాలు**

—వానమామలై వరదాచార్యులు

# భాషా సమీక్ష

| | |
|---|---|
| గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమాలు | * శ్రీ పోరంకి దక్షిణామూర్తి |
| భాష – ప్రామాణికత | * డా॥ బూదరాజు రాధాకృష్ణ |
| బోధనభాష – తెలుగు | * శ్రీ వి. పి. రామానుజాచార్యులు |
| మారుతున్న భాష-వ్యాకరణం | * శ్రీ ఎన్.సి.యస్. వేంకటాచార్యులు |
| భాషాకృషి | * డా॥ చేకూరి రామారావు<br>శ్రీ పి.సి. నరసింహారెడ్డి |

# గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమాలు

శ్రీ పోరంకి దక్షిణామూర్తి

ఈనాటి యువతరానికి ఈ శీర్షిక చూస్తేనే నవ్వొస్తుంది. ఎంచేత? ఈనాడటువంటి వివాదానికి స్థానంలేదు కాబట్టి. కాలమిచ్చిన తీర్పు అమలులోకివచ్చి కొన్ని దశాబ్దాలే గడిచిపోయాయి కనక; ఒక్క పాఠ్యపుస్తకాల్లో తప్ప సర్వే సర్వత్ర ఆధునికభాషే ప్రయుక్తమవుతూ రోజుకు కొన్నివందల పుటలు అచ్చవుతూ వస్తున్నాయి కనక; ఆ పాఠ్యపుస్తకాల్లోనయినా, ప్రాచీన కావ్యభాషా సంప్రదాయాన్ని తెలుగు విద్యార్థులు మరిచిపోకుండా ఉండటంకోసం తెలుగు మాతృభాషగా చదివే వాళ్ళకోసం రాయించిన తెలుగువాచకాలకే గ్రాంథికం పరిమితమవుతుంది కనక.

నిజమే. కాని ఇటీవలి రెండుమూడు సంవత్సరాల కిందటివరకు ఆ ఉద్యమాల ప్రభావం ప్రసరిస్తూనే వచ్చింది. ఆనాడేకాదు, ఈనాడుకూడా 'వ్యావహారిక సత్యాన్ని' అంగీకరించలేని కావ్యభాషాభిమానులు ఇరకాటాన పడుతూండటం కద్దు. కాబట్టి ఈ వివాదానికిగల చారిత్రక ప్రాముఖ్యం విస్మరించరానిది.

గ్రాంథిక, వ్యావహారిక భాషోద్యమ చరిత్రను సమగ్రంగా అవగాహన చేసుకోవాలంటే భాషతో ముడిపడి ఉన్న మౌలికాంశాలను ముందుగా ప్రస్తావించటం అవసరం.

సమాజంలో ఒకరి భావాలు మరొకరికి తెలియటానికి వీలుగా ఏర్పడిన ధ్వని సంకేతాల నియతనిర్మాణం భాష. సమాజం దీన్ని సమష్టిగా సృష్టించుకుంది. సమష్టి సాధనంగా వాడుకుంటోంది. సమాజంలో వివిధస్థాయిలున్నట్లుగానే భాషలో కూడా వివిధస్థాయిలుంటాయి. వివిధరంగాల్లో పరిణామాలు వచ్చినట్లుగానే భాషలోకూడా పరిణామాలు వస్తూఉంటాయి. అంటే పాతవి తొలగిపోతూండటం కొత్తవి చేరుతూండటం జరుగుతూ ఉంటుంది. ఈ పరిణామాలన్నిటినీ స్వీకరిస్తూ సమకాలీన వాగ్వ్యవహారానికి అద్దంపట్టేదే జీవద్భాష. అట్లాలేనిది మృతభాష.

ఏభాషలోనయినా లిపికొత్తగా వాడుకలోకి వచ్చినప్పుడు అప్పటి వ్యవహారానికి అది అక్షరరూపమిస్తుంది. ఒకరకమైన రచనాసంప్రదాయాన్ని నెలకొల్పుతుంది. కాని ఆ సంప్రదాయానికే అలవాటుపడ్డ మితవాదులు, పరిణామకారణంగా

వారి వ్యవహారంలోనే వచ్చిన మార్పులను లిఖితంచేస్తామంటే ఆంక్షపెడతారు. దేన్ని ప్రాచీన సంప్రదాయమని తాము అనుకుంటున్నారో దాంట్లోకూడా వచ్చిన రచనాపరిణామాలను చూస్తూ ఉండికూడా భాషాతత్వాన్ని అర్థం చేసుకోలేక పోతూ ఉంటారు. తెలుగులో వాళ్ళనే కావ్యభాషావాదులని, గ్రాంథికభాషావాదు లని అంటూ ఉంటారు.

సమాజంలో వివిధస్థాయిలున్నట్టే భాషలో కూడా వివిధస్థాయి లుంటుం టాయని ముందు చెప్పుకొన్నాం. వాటిలో - చదువూ సంస్కారం ఉన్నవాళ్ళు సంపన్నులూ పలుకుబడిగలవాళ్ళు సామాన్యంగా నిత్యవ్యవహారంలో వాడేభాష ఆ కాలపు ప్రమాణభాషగా గుర్తింపు పొందుతుంది. అటువంటి ప్రమాణభాషకే తెలుగులో మరోపేరు శిష్టవ్యావహారిక భాష. శిష్టేతరులు దీన్ని అనుకరిస్తూ ఉండటం దానిద్వారాకూడా శిష్టత్వం సంపాదిస్తూ ఉండటం సర్వసామాన్యమైన విషయం. సమాజంలో అన్నిరంగాల్లోనూ ప్రాచుర్యంపొందిన ఈ ప్రమాణభాషే విద్యారంగంలో కూడా స్వీకారయోగ్యమైందని వాదించేవాళ్ళని ఆధునిక భాషా వాదులని, శిష్టవ్యావహారిక భాషావాదులని అంటూఉంటారు.

## పూ ర్వ ద శ

తెలుగులో ఆదికావ్యంగా ప్రసిద్ధమైన నన్నయభారతంలోనిభాష ఆనాటి శిష్టవ్యావహారికానికి ప్రతిబింబమని చెప్పడానికి ఆధారాలులేవు. దానికి భిన్నమైన నిర్మాణంగల రూపాలు అప్పటికి కొన్ని శతాబ్దాలముందునుంచికూడా వాడుకలో ఉంటూ తరవాతకూడా ఎన్నో శతాబ్దాలు అలాగే జీవించినఉన్న దాఖలాలు ఉన్నాయి. కొబట్టి నన్నయగారి భాషకూడా అంతకుపూర్వం చాలాకాలంగా కావ్య రచనకు పరిమితంగా వాడుకలో ఉండి ఉన్నదేనని అరచనలు మాత్రం శిలమయి పోయాయని గ్రహించవలసిఉంది. పోతే, నన్నయగారి కాలంనుంచి ఇటీవల చాలా శతాబ్దాలవరకూ తెలుగు సాహిత్యంగా చెలామణీ అయినవి దాదాపు అన్నీ పద్యకావ్యాలే కొబట్టి వాటిలో అపాత ఒరవడే కనిపిస్తుంది. అయినా అక్కడక్కడ, కవి స్వేచ్ఛాపరతవల్ల నయితేనేం, సమకాలిక వ్యవహారప్రభావంవల్ల నయితేనేం, ఛందోనిర్బంధాలవల్ల నయితేనేం పేరుమోసిన కవుల రచనల్లోకూడా కావ్యభాషా సంప్రదాయానికి భిన్నమైన రూపాలు కనిపిస్తూనే ఉన్నాయి. వ్యాకర్తలు వాటిలో కొన్నిటిని మట్టుకు అనింద్యగ్రామ్యాలనో పూర్వకవి ప్రయోగాలనో మన్నిస్తూనే

వచ్చారు. ఇది ఇలాఉండగా వివిధశాస్త్రగ్రంథాలకు రాసిన వ్యాఖ్యలలోను, శాస నాలలోను, తదితర రచనలలోను కూడా మహాపండితులు సైతం వ్యావహారికాన్ని ఆదరిస్తూ వచ్చారు. దీన్నిబట్టి తేలేదేమిటంటే, గతశతాబ్ది ఉత్తరార్థంవరకు పండితులకు సైతం వ్యావహారికంపట్ల నిరసనభావం ఎంతమాత్రంలేదు. అందుకు నిదర్శనం, చిన్నయసూరిగారు స్వయంగా ప్రచురించిన ఆంధ్రమహాభారతం ఆదిపర్వానికి రాసిన టీకలోని రూపాలే సాక్ష్యం (చూ. గిడుగువారి 'గద్య చింతామణి')

భారతదేశంలో సార్వజనీనమైన విద్యావిధానం వచ్చింది ఇంగ్లీషువాళ్ళ చలవవల్లనేఅని మనకుతెలుసు. 1852లో మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాలల్లో మూడు విశ్వవిద్యాలయాలు వెలిశాయి. వాటిలో చదువుకొని పట్ట భద్రులైనవాళ్ళుదేశంలో విద్యావ్యాప్తికి దోహదంచేస్తారని ప్రభుత్వం ఆశించింది. అయితే ఇంగ్లీషు పరభాషకావడంవల్ల, దేశభాషల్ని అభివృద్ధిచెయ్యడానికి తగిన దోహదం లభించకపోవడంవల్ల వాళ్ళ ఆశఫలించలేదు. 1901లో గవర్నర్ జనరల్‌గాఉన్న లార్డ్ కర్జన్, సిమ్లాలో ఒక సమావేశమేర్పరిచి విద్యాసంబంధ మైన సమస్యలన్నిటినీ కూలంకషంగా చర్చింపజేశాడు. ప్రాథమికస్థాయినించి విశ్వవిద్యాలయ స్థాయివరకు పరిష్కరించవలసిన అంశాలగురించి, ఆ సమా వేశం 150 తీర్మానాలను ఆమోదించింది. వాటి ఆధారంగానే కర్జన్ విద్యావిధానం రూపొందింది. ఉత్తరోత్తరా, పాఠశాలల్లోనూ కళాశాలల్లోనూ మాతృభాషా బోధనపట్ల విద్యాధికారులుకూడా శ్రద్ధచూపడం ప్రారంభించారు.''మాతృభాషలో వ్యాసరచనలను నిర్బంధపాఠ్యాంశంగా ప్రవేశపెట్టాలనీ, అట్లాగే ఇంగ్లీషులోని పుస్తకాలను ప్రాంతీయభాషల్లోకి అనువదించేప్పుడు వారికి శిక్షణకలిగేందుకు గాను అనువాద పద్ధతులను నేర్పాలనీ" నిశ్చయించారు.

1906 ప్రాంతంలో గంజాం, విశాఖపట్నం, గోదావరిజిల్లాలకు పాఠశాలా పరీక్షాధికారిగా జె. ఏ. యేట్స్ అనే ఆయన ఉండేవారు. ఆయన కేంద్రకార్య స్థానం విశాఖపట్నం. అందువల్ల ఆయనకి తెలుగు పట్టుబడింది. అయితే పుస్తకాల్లో ఉన్న తెలుగువేరు, ఆ పుస్తకాలుచెప్పే పండితులే క్లాసులోమాట్లాడే తెలుగు వేరు కావడంచూసి ఆయన విస్తుపోయాడు. నిజమే. ప్రపంచంలో ఏ భాషలోనూ ఇటువంటి విచిత్రం లేదాయెమరి! దీని కథాకమామిషూ ఏమిటో తెలుసుకుందామని, స్థానికకళాశాలాధ్యక్షులైన పి. టి. శ్రీనివాసయ్యంగారి దగ్గిర

కదిపించారు. ఆయనకూడా తెలుగు బాగావచ్చినవాడే. అయినా విజయనగరంలో ఉన్న గురజాడ అప్పారావుగారు, పర్లాకిమిడిలో ఉన్న గిడుగు రామమూర్తిగారు తనకంటె బాగాచెప్పగలరని సూచించాడు. యేట్స్ వాళ్ళిద్దరినీ కలుసుకొని కీలకం గ్రహించాడు. ఏటేటా ఉపాధ్యాయ వార్షికసమావేశాలు ఏర్పరిచి భాషా పరిణామ వివేచనాదృష్టితో రామమూర్తి పంతులుగారిచేత ఉపన్యాసాలిప్పించాడు. పండితులకిది కంటకోకారమైంది.

ఈ తరుణంలో మెట్రిక్ పరీక్షబదులు స్కూల్‌ఫైనల్ పరీక్ష, ఎఫ్. ఏ. బదులు రెండేళ్ళ ఇంటర్మీడియట్ వచ్చాయి. అప్పుడు మాతృభాషలో వ్యాస రచనకు, అనువాదానికి ఎన్నుకోవలసిన పాఠ్యాంశాలగురించి గడబిడ జరిగింది. గిడుగువారు జీవద్భాషాప్రాశస్త్యాన్ని పునరుద్ఘాటించారు. పి. టి. శ్రీనివాసయ్యంగారు Language : Life and death ప్రచురించారు. 1911 స్కూల్‌ఫైనల్ పరీక్షకు గ్రీకుమిత్తులు (Greek Myths) పాఠ్యగ్రంథమైంది. పండితులకిది కోపకారణమైంది. వ్యావహారికభాషానిరసనానికి ఒక ఉద్యమమే లేవదీశారు. దాని బహిష్కారానికి ప్రభుత్వంమీద ఒత్తిడితీసుకువచ్చారు.

ఈ పరిస్థితి గమనించి గ్రాంథికవ్యావహారికభాషావివాదాన్ని పరిష్కరించడానికని మద్రాసు విశ్వవిద్యాలయం 1911 సెప్టెంబరు 8వ తేదీన ఒక సంఘాన్ని నియమించింది. అందులో నలుగురు గ్రాంథికభాషావాదులు, నలుగురు వ్యావహారికభాషావాదులు సభ్యులు; ఒక తటస్థుడు అధ్యక్షుడు. ఈ సంఘం చాలాసార్లు సమావేశాలు జరిపి శిష్టవ్యావహారికానికి అనుకూలంగా తీర్మానించింది. దాని మేరకు విద్యాశాఖవారు, విద్యార్థులు గ్రాంథిక వ్యావహారికాల్లో దేనినయినా ఎన్నుకోవచ్చునని బాకీదులిచ్చారు.

ఇది కావ్యభాషాభిమానులకు దుర్భరమైంది. వ్యావహారికాన్ని ఎదుర్కోడం కోసం ఆంధ్రసాహిత్య పరిషత్తు స్థాపించారు. శిష్టవ్యావహారికాన్ని గ్రామ్యమని నిరసించారు. ఎందరో పండితులను కూడగట్టుకున్నారు. ఊరూరా సభలుజరిపి, సంతకాలుతీసుకుని ప్రభుత్వానికి మహజర్లు పంపుకొన్నారు.

ఇది ఇలా ఉండగా, విశ్వవిద్యాలయం నియమించిన ఉపసంఘంవారు, తెలుగులో నామ సర్వనామ క్రియాపదాల ప్రాచీన వర్తమాన రూపాలను వింగడించడంకోసం ఒకతీర్మానం ఆమోదించి వేదం వెంకటరాయశాస్త్రిగారిని, కొమ

ర్రాజు వెంకటలక్ష్మణరావుగారిని, గురజాడ వెంకటఅప్పారావుగారిని ఆ పని చూడమని కోరారు. వ్యవహారికభాషా వ్యతిరేకులైన వేదంవారు, కొమర్రాజు వారు ఈ పట్టిక తయారీలో తమ చాతుర్యంచూపి వ్యావహారిక గ్రాంథికాలలో సమానరూపంలో ఉన్న ఏరెండు మూడింటినో తప్ప తక్కినవాటినన్నిటినీ గ్రాంథికంలోంచే తీసుకుని అవే వర్తమాన రూపాలన్నారు. అనిషంగా, వెనక ఆమోదించిన తీర్మానానికే తమకుకావలసిన అర్థం చెప్పుకుని దానిప్రయోజనాన్ని భగ్నంచేశారు. గురజాడవారు దీన్ని ప్రతిఘటించారు.

ఇది ఇలా ఉండగా, కొందరుపెద్దలు, విద్యావిషయాల్లో కూడా రాజకీయాలు ప్రవేశపెట్టకపోతే లాభంలేదనుకుని, విశ్వవిద్యాలయం నియమించిన ఉపసంఘంలో రాయలసీమకు ప్రాతినిధ్యం కల్పించే కారణంతో కోలాచలం శ్రీనివాసరావు, టి. శంకరలింగంపిళ్ళె, నాగపూడి కుప్పుసామయ్య, బారిస్టర్ కె. సుబ్బారెడ్డిగార్ల నియామకానికి దోహదంచేశారు. వీరంతా వ్యావహారికభాషా వ్యతిరేకులేనాయె। ఇంకేముంది? త్రాసు ఆవేపుమొగ్గింది. మెజారిటీ తీర్మానం గ్రాంథికభాషకే పట్టంకట్టింది. అప్పుడు గురజాడ అప్పారావుగారు డిసెంట్ పత్రం (Minute of Dissent) ఆంగ్లంలోరాసి అందజేశారు. రామమూర్తిపంతులుగారు రాసిన A Memorandum on Modern Telugu, జయంతిరామయ్యపంతులుగారు రాసిన A defence of literary Telugu మొదలైనవి కొంచెమించుమించుగా అప్పుడు వచ్చినవే.

అప్పటినించి బోధనారంగంలో గ్రాంథికం ఏలుబడి చెల్లుతూవచ్చింది. అయితే ఉత్తరోత్తరా వచ్చిన వచనరచనల్లో వ్యావహారికం ప్రాచుర్యం పెరుగుతూ వచ్చింది. సమాజంలో అన్నిరంగాల్లోకీ వేళ్ళుతన్నింది. పత్రికలు, రేడియో, సినిమాలు, సృజనాత్మక సాహిత్యం వ్యావహారికాన్నే చేపట్టి సర్వవ్యాప్తం [illegible]యి. పాత అలవాటు పోనివాళ్ళు, వేళ్ళమీద లెక్కపెట్టవలసిన కొద్దిమంది రచయితలు, తప్ప తక్కినవాళ్ళంతా వ్యావహారికంలోనే రచనలు చేస్తున్నారు. కేవలం వచనంలోనేకాదు పద్యాల్లోకూడా ఇది చోటుచేసుకుంది. చివరికి గ్రాంథిక వ్యావహారిక వివాదమన్నదే అర్థరహితమనిపించేటంతగా తెలుగువాళ్ళ దృక్పథంలో మార్పుతెచ్చింది. అందుకే అంట, స్వాతంత్ర్యానంతర కాలంలో పుట్టినవారికి ఈ శీర్షికచూస్తేనే నవ్వొస్తుందని। అయితే కథ ఇంతటితో అయిపోలేదు.

## ఇటీవలి చరిత్ర

మొదట్లో వ్యావహారికాన్ని వ్యతిరేకించిన ఉద్దండ పండితులే సత్యం గ్రహించి వ్యావహారికాన్ని సమర్థించడం ప్రారంభించారు. అందులో రచనలు ప్రారంభించారు. అటువంటివారిలో మొట్టమొదట చెప్పుకోదగ్గవారు వీరేశలింగం పంతులుగారు. గిడుగువారితో చర్చించి, వారివాదాన్ని ఆమోదించి, వర్తమానాంధ్ర భాషా ప్రవర్తకసమాజానికి అధ్యక్షస్థానం స్వీకరించారు. అలాగే చెళ్ళపిళ్ళవారు, మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు, మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయ శాస్త్రిగారు, అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు వంటివారు దీన్ని సమర్థిస్తూ వాదించారు. గిడుగువారి దగ్గిర చదువుకొన్న తాపీధర్మారావుగారు కొంతకాలం వీరగ్రాంథికంలో విహరించినా గురువుగారి వాదాన్ని గ్రహించిన తరవాత వ్యావహారికంలో విరివిగా రచనలు చెయ్యడమేకాదు పత్రికల్లో (జనవాణి) వ్యావహారికాన్ని మొట్టమొదట ప్రవేశపెట్టిన ప్రతిష్ఠ దక్కించుకొన్నారు. చలం, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, చింతాదీక్షితులు, మల్లాది రామకృష్ణశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, గోపీచంద్ మొదలైనవాళ్ళంతా కథలూ నవలలూ వ్యాసాలూ రాసి వ్యావహారికాన్ని పటిష్ఠంచేశారు; దేశంలో రేడియోశ్రోతలూ సినిమాప్రేక్షకులూ పాఠకులూ ఇబ్బడిముబ్బడిగా పెరిగారు. రచయితలూ కొన్నిరెట్లు పెరిగారు. ఇప్పటి పాఠకుడికి అన్నిప్రాంతాలవాళ్ళ రచనలూ అందుబాటులో ఉన్నాయి. అన్నిప్రాంతాల మాండలికాలూ అన్నిస్థాయిల మాండలికాలూ భిన్నత్వంలో ఏకత్వం ప్రదర్శిస్తూ హృదయరంజకా లవుతున్నాయి.

ఆంధ్రప్రదేశం ఏర్పడ్డ కొంతకాలానికి రాష్ట్రప్రభుత్వంవాళ్ళు పాఠ్యపుస్తకాలను జాతీయంచేశారు. ప్రసిద్ధులైనవారిని ఎన్నుకొని సరళ గ్రాంథికంలో రాయించారు. అయితే ఇవి తెలుగు మాతృభాషగాచదివే విద్యార్థులకోసం. తెలుగుదేశంలో బతికే పరభాషీయులుకూడా రెండోభాషగా తెలుగు నేర్చుకోవలసి ఉంటుందికాబట్టి వాళ్ళకోసం రెండోభాష తెలుగు పుస్తకాలు రాయించాలని ప్రభుత్వం సంకల్పించింది. దానికోసం దేశంలో ప్రసిద్ధులైన పండితుల్ని రచయితలుగాను, సంపాదకులుగాను నియమించింది. ఆరోతరగతి తెలుగువాచకానికి, ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషాశాస్త్రాచార్యులయిన డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తిగారు సంపాదకులు. వారు ఆధునిక భాషాశాస్త్రాన్ని విదేశాల్లో

క్షుణ్ణంగా అభ్యసించి ద్రావిడభాషాశాస్త్రవేత్తల్లో అంతర్జాతీయఖ్యాతిగడించినవారు. ఆరోతరగతి పుస్తకం పాఠ్యప్రణాళిక (సిలబస్) పీఠిక (ప్రియాంబుల్)ను అనుసరించి ఆధునికం, నిత్యవ్యవహారోపయుక్తం అయిన భాషలో శ్రీఉత్పల సత్యనారాయణాచార్యులుగారిచేత ఆ పుస్తకం రాయించారు. అయితే అది, ఇతర పాఠ్యపుస్తకాలకు భిన్నంగాఉండటంవల్ల భాషాశైలినిగురించి ఒక నిర్ణయం తెలియజేయడంకోసం ప్రభుత్వానికి నివేదించడం జరిగింది. దాన్ని పురస్కరించుకొని 1965లో తిరుపతిలో ఒక పండితగోష్ఠి ఏర్పాటుచెయ్యాలని మూడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులూ తీర్మానించారు. దానిమేరకు, ప్రభుత్వంతరపున పాఠ్యపుస్తక జాతీయాకరణ సంఘానికి కార్యదర్శిగా ఉన్న డాక్టర్ పి.ఎస్.ఆర్. అప్పారావుగారి సమర్థకార్యకర్తృత్వంతో, కీ. శే. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి అధ్యక్షతన పండితగోష్ఠి జరిగింది. దేశంలో ప్రముఖ విద్వాంసులూ రచయితలూ పత్రికా రచయితలూ అందరూ అందులోపాల్గొన్నారు. విషయ (subject) ప్రధానమైన పాఠ్యపుస్తకాల్లోను, ద్వితీయభాషా(Second language) పుస్తకాల్లోనూ ఆధునికభాషే ఉండాలనీ తక్కినవాటిలో సరళగ్రాంథికంఉండాలనీ తీర్మానించారు. శైలీ వివరాలు రూపొందించడానికి మరొక చిన్నకమిటీ వేశారు. అందులో ఫుల్‌టైమ్ మెంబరుగా నియుక్తులైన శ్రీ గొడవర్తి సూర్యనారాయణ గారు కొన్ని నమూనాపాఠాలు రూపొందించారు.

హిందీ మాతృభాషగాగల ఉత్తరదేశీయులు తెలుగు నేర్చుకొనే నిమిత్తం, దక్షిణ భారతహిందీప్రచారసభవారు తెలుగు భాషాబోధిని అన్నపేరుతో నాలుగు వాచకాలు, మరికొన్ని ఉపవాచకాలు వ్యావహారికంలో వ్రాయించి ప్రచురించారు.

ఇంతలో, కళాశాలలస్థాయిలో ప్రాంతీయభాషలో విద్యాబోధనజరగాలన్న అంశం ఎదురయి, అప్పటి విద్యాశాఖకార్యదర్శి అయిన శ్రీ జె. పి. ఎల్. గ్విన్ గారి అధ్యక్షతన ఒక కమిటీని ప్రభుత్వం నియమించింది. ఆ కమిటీవారుకూడా ప్రాంతీయభాషలో వేసేగ్రంథాలు శిష్టవ్యావహారికంలోనే ఉండాలని ఏకగ్రీవంగా తీర్మానించారు. ఆ కమిటీ తెలుగుభాష అభివృద్ధికి, ఆధునికీకరణకు 'సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్' నమూనాలో ఒకసంస్థఏర్పడాలని సూచించింది. ఆ సూచన ననుసరించి రూపొందినదే ఇప్పటి 'తెలుగు అకాడమి.' ఈసంస్థ ఆధునిక భాషకు కొంత పరిధిఏర్పరిచి దానిమేరకు విషయప్రధానమైన పాఠ్యగ్రంథాలు రాయించడం ప్రారంభించింది.

ఆ మరుసటి సంవత్సరం, ఆధునిక సాహిత్యానికి సంబంధించిన పి. హెచ్. డి. సిద్ధాంతవ్యాసాలు వ్యావహారికంలో రాయవచ్చునని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తీర్మానించింది.

ఇది జరిగిన కొన్నాళ్ళకి — మాతృభాషగా తెలుగు చదివేవిద్యార్థుల సమస్య అపరిష్కృతంగానే ఉండిపోవడం గమనించి, ఆంధ్రవిశ్వవిద్యాలయం పాలకవర్గ సభ్యులయిన శ్రీ పురిపండా అప్పలస్వామిగారు, సమస్యాపరిష్కార పరిశీలననిమిత్తం విశ్వవిద్యాలయంవాళ్ళు ఒక కమిటీని నియమించాలని తీర్మానం ప్రవేశపెట్టారు. దానిమేరకు, మాజీమంత్రి శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన ఒక కమిటీ ఏర్పడింది. డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి, డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, డాక్టర్ జి.ఎన్. రెడ్డి, డాక్టర్ తూమాటి దొణప్ప, శ్రీ పురిపండా అప్పలస్వామి, డాక్టర్ చేకూరి రామారావు ప్రభృతులు సభ్యులు. వీరంతా చాలా సమావేశాలు జరిపి, ఏకగ్రీవంగా ఒక నిర్ణయానికివచ్చారు. నాటకాలు, ఉపవాచకాలు, ఆధునిక విషయాలంగురించి వ్రాసిన ఇతర రచనలు వ్యావహారికంలో ఉండవచ్చుననీ విద్యార్థులు ఆధునికభాషలోనే సమాధానపత్రాలు రాయవచ్చుననీ తీర్మానించినట్లు వినికిడి. ఒక విస్తృతినమసరించి ప్రాచీన, ఆధునిక కావ్యభాషాభాగాలను పాఠ్యాంశాలుగా నిర్ణయించాలనికూడా పేర్కొన్నట్లు తెలుస్తున్నది. ఈ నిర్ణయాలు త్వరలో అమలులోకివచ్చి సత్ఫలితాల నందించగలవని, ఆవిధంగా ఆంధ్రవిశ్వవిద్యాలయం పూనిక ఇతర విశ్వవిద్యాలయాలకు మార్గదర్శకం కాగలదని ఆశించవచ్చు.



అల్లసాని పెద్దనార్యు
దడిగిన నిరుపహతి
స్థలే త్యాదులనవసరం
సదాకృతిః ప్రభవతి — శ్రీశ్రీ

# భాష-ప్రామాణికత

*డా॥ బూదరాజు రాధాకృష్ణ*

గ్రాంథిక వ్యావహారిక వివాదాలు తలయెత్తిన తొలిరోజుల్లో భాషారూపాల్లో ఏది ప్రామాణికం ఏదికాదనే విషయం తీవ్రచర్చలకు దారితీసింది. 'లక్షణవిరుద్ధ' మైన భాష 'గ్రామ్య' మన్న సంప్రదాయపండితులు లక్షణగ్రంథాలకు ప్రామాణ్యం నిర్ణయించే అధికారం వుందని విశ్వసించారు. వారిలో కొందరు 'ఆర్యవ్యవహారం' లో 'దృష్ట' మైన 'లక్షణవిరుద్ధ' భాషారూపాలు కూడా 'గ్రాహ్య' లని భావించారు. 'మహాకవి' ప్రయోగాలన్నీ సలక్షణశబ్దాలేనని వారి నమ్మకం. అయితే లాక్షణికుల్లో అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు ఎవరి అభిప్రాయం పరమప్రామాణికమో నిర్ణయించుకొనే ఏర్పాట్లు ఉన్నట్లులేదు. ఎవరు 'మహాకవు' లో ఎవరో కారో నిరూపించటంలో కూడా ఏకాభిప్రాయానికి రావటం కష్టమే. అంచేత పైతీరు ప్రమాణనిర్ణయాన్ని నిష్కర్షగా గ్రహించటం మంచిదికాదు.

తెలుగు పండితలోకంలో రెండుమూడురకాల సిద్ధాంతాలు ప్రమాణనిర్ణయానికి ఉపయోగపడుతుండేవి. 'ప్రయోగశరణా వైయాకరణాః' అనే సంస్కృతాభియుక్తోక్తికి ఎక్కువగౌరవం వుండేది. 'ప్రయోగ' శబ్దానికి తెలుగు వ్యాకర్తృ పండితుల దృష్టిలో 'కవిప్రయోగ' మనే అర్థం. అయితే మన లాక్షణికులు స్వీయాభిరుచులమీద ఆధారపడి ఆయాకవులను ప్రామాణికులుగా గుర్తించేవాళ్లు. సాధుశకటరేఫ నిర్ణయంలో అర్ధానుస్వార నిరూపణంలో వారివారి అభిరుచుల, అభిమాన కవిరచనల ఆధారంతో వాదప్రతివాదాలు చేస్తుండేవాళ్లు. 'శిష్ట ప్రయోగా' లను కూడా ప్రామాణికాలుగా గుర్తించమని గిడుగువారు కోరటంతో 1910-14 ల మధ్య తీవ్ర వాదోపవాదాలు జరిగేయి. 'అనుకరణం హి శిష్టస్య సాధు భవతి' అనే పతంజలివాక్యం, 'శిష్టానా ముక్తౌ సూత్రాణామభావే అనుశాసన కారిణ ఏవ దండనీయాః' అనే దండిమాట వ్యావహారికవాదులకు ప్రధానాయుధాలుగా ఉండేవి. వీటికి తోడుగా అథర్వణాచార్యుడు వికృతివివేకంలో చెప్పిన కారిక మరికొన్ని కొత్తచిక్కులు తెచ్చిపెట్టింది. అది :

"శాస్త్ర ప్రయోగవచసో శ్శాస్త్రం బలవదుచ్యతే,
అనిష్పన్నపదే తేన ప్రయోగాశ్రయణం మతమ్".

పై కారిక ప్రకారం కవిప్రయోగాల కన్నా వ్యాకరణసూత్రాలే బలవత్తరమైనవి; వ్యాకర్త సూత్రీకరించకపోతేనే ప్రయోగాలు స్వీకరణీయా లవుతాయి. అంటే కవికన్నా ప్రమాణనిర్ణయంలో లాక్షణికుడే పైఅధికారి.

పై సిద్ధాంతాల సామంజస్యాన్ని, ఆచరణలో వాటికి మనలాక్షణికు లిచ్చిన గౌరవాగౌరవాల్ని ఇక్కడ చర్చించవలసిన పనిలేదు. భాష బహుముఖ ప్రవాహిని. దేశకాల పాత్రలనుబట్టి దానిస్వరూపం మారుతుంటుంది. భిన్న రూపాల్లో, భిన్నదశల్లో ఉన్నభాషకు ప్రామాణికరూపం ఒక్కటే వుంటుందని గాని, సార్వకాలిక ప్రామాణికత్వం భాషారూపాల్లో ఏదో ఒకదానికే వుంటుం దనటం కాని, సమర్థనీయంకాదు. కాని పైఅభిప్రాయానికి - లేదా విశ్వాసానికి - ప్రధానకారణం 'కావ్యభాష' ఒక్కటే పరిణామాతీతంగా శాశ్వతంగా ఉంటుందనే నమ్మకమే. పాశ్చాత్యదేశాల్లోకూడా ఇటువంటి నమ్మకాలే క్రీ. శ. 18వ శతాబ్ది దాకా ఉండేవి. మనపూర్వుల విశ్వాసాలు సంక్షిప్తంగా ఇవి : (1) కావ్యభాష (గ్రాంథికం/సాహిత్యకభాష) ప్రాచీనతమం (2) లక్షణగ్రంథాలు నిరూపించిన పక్కిలో ఆ కావ్యభాషారూపాలే సాధువులు; ఇతరభాషారూపాలు తప్పులు. (3) సాహితీభాష పామరవ్యవహారంలో భ్రష్టమై గ్రామ్యమై పోతుంది. అంటే వ్యవహృతరూపాలు చారిత్రకంగా అర్వాచీనాలు (4) భాషకు ఒకేఒక ప్రామాణిక రూపం వుంటుంది; అది కావ్యభాషారూపం. ఈ సిద్ధాంతాలన్నీ ఒకటిరెండు భాషలునేర్చి లక్ష్యైకదృష్టితో కావ్యరసాస్వాదన చేసిన విద్వాంసుల్లో వేళ్ళూనన్నాయి.

పారిశ్రామిక విప్లవఫలితంగా ఖండాంతర ప్రయాణాలుచేసి బహుభాషలు నేర్చి భాషాస్వరూప స్వభావాలను అధ్యయనం చేయటం మొదలుపెట్టిన రోజుల్లో ప్రామాణికతను గురించి, తప్పొప్పులను గురించి పాశ్చాత్యపండితులు కొందరు చర్చించారు. భిన్నభాషలను తులనాత్మకంగా పరిశీలించినమీదట, అనేకభాషల్లో చారిత్రకంగా వచ్చిన పరిణామాలను గుర్తించిన తరవాత, చాలామంది విద్వాం సులు కొన్ని నిర్ణయాలకు వచ్చారు. అవి ప్రధానంగా ఇవి : (1) సాహిత్యభాషా స్వరూపం ఇతరభాషారూపాలకన్నా ప్రాచీనతరంకాదు (2) కావ్యభాష ఒక ప్రాంతీయ మాండలికంనుంచో వర్గమాండలికంనుంచో ఏర్పడ్డదేకాని వేరుకాదు. (3) పరిణామక్రమాన్ని భ్రష్టతగా గ్రామ్యతగా పరిగణించవలసివస్తే పరిణామ

శీలమైన కావ్యభాషకూడా కాలాంతరంలో భ్రష్టమే; గ్రామ్యమే. (4) భాషలోని బహుముఖాలను గమనించినప్పుడు ఏకైకప్రమాణం ఆమోదయోగ్యంకాదు.

ఇరవయ్యో శతాబ్దానికి కొంచెంముందుగాను, తరువాతి మొదటి రెండు దశాబ్దాలల్లోను భాషాప్రామాణికతను నిర్ణయించటానికి అనుసరించవలసిన పద్ధతులను కొందరు పాశ్చాత్యపండితులు చర్చించారు. అడాల్ఫ్ నొరీన్ 1895లో మూడు పద్ధతులు పేర్కొన్నారు. (1) సాహిత్యక చారిత్రకపద్ధతి (literary-historical method). ఈ వాదాన్ని గ్రిమ్, రిడ్క్విస్ట్ మొదలైనవాళ్ళు సమర్థించారు. దీనిప్రకారం అర్వాచీన కవిప్రయోగాలకూ భాషారూపాలకూ ప్రామాణ్యం లేనేలేదు. (2) సహజపరిణామపద్ధతి (Natural evolutionary method.) ఈ వాదంప్రకారం వివిధపరిణామదశల్లోని భాషారూపాలన్నీ సాధువులే. యెస్పర్సన్ దీన్ని అరాజకసిద్ధాంతమన్నారు. (3) తార్కిక లౌకికపద్ధతి (logical-secular method) ఈ వాదరీత్యా తర్కపరీక్షనునిలిచే రూపాలుమాత్రమే సాధువులు. ఇది అవకాశవాది సిద్ధాంతమని యెస్పర్సన్ ఆక్షేపణ. టెగ్నర్ అనే భాషావేత్త సౌలభ్యసిద్ధాంతం (theory of ease) అనే వాదం ప్రతిపాదించి సులభోచ్చారణ, సులభగ్రాహ్యత గల రూపాలే ప్రామాణికాలన్నాడు. ఇది అభిరుచిప్రధాననిర్ణయం. మొదటి మూడు పద్ధతులనూ ప్రతిపాదించిన నొరీన్ తన వాదం వదలుకొని టెగ్నర్‌ను బలపరిచారు.

ప్రామాణ్యనిర్ణయాన్ని యెస్పర్సన్ ఏడు విధాలుగా వివరించారు. (1) పండితప్రమాణం, (2) భౌగోళికప్రమాణం, (3) సాహిత్యప్రమాణం, (4) కులీనప్రమాణం (aristocratic standard), (5) ప్రజాస్వామికప్రమాణం (democratic standard), (6) తర్కప్రమాణం, (7) ఆలంకారికప్రమాణం (aesthetic standard). వీటిలో ఏ ఒక్కటీ కేవలప్రమాణంకాదు. పండిత పరిషత్తుల నిర్ణయించినంతమాత్రాన సాధుత్వాసాధుత్వాలు స్థిరపడిపోవు. ఫ్రెంచ్ అకాడమీ నిర్ణయాలకు దిక్కులేదు. అకాడమీలేని ఇంగ్లండులో ప్రామాణ్య నిరూపణం జరగకపోలేదు. ఏదో ఒక ప్రాంతీయ మాండలికంనుంచి ప్రామాణికభాష ఏర్పడినప్పుడు మాత్రమే భౌగోళికప్రమాణం నిలుస్తుంది. విద్యాగంధం లేని కులీనత ప్రమాణనిరూపకంకాదు. తర్కాతీతమైన (alogical) భాషకు తర్కవాదాలు నిర్ణాయకాలుకావు. అభిరుచిప్రధానమైన ఆలంకారికనిర్ణయం రచనా పద్ధతికేగాని భాషకు ప్రమాణంకాదు. కాబట్టి బహుజనామోదంపొందిన రూపాలే

సాధువులంటాడు యెస్పర్సన్. ఆంగ్లవ్యాకర్త స్వైస్ దృష్టిలోకూడా ఇదే ఆమోదయోగ్యమైన సిద్ధాంతం. ఒకనాటి సాధురూపాలు మరోకాలంలోఅసాధువు లవుతాయి. అందువల్ల భాషలో ఇదితప్పు, ఇదిఒప్పు అని చెప్పదగ్గ అంశమే లేదంటాడు యెస్పర్సన్. తరవాతి కాలంలోని ఆధునికభాషాశాస్త్రజ్ఞులు అసలీ విషయాన్నే చర్చించటం మానివేశారు.

భాషాసామాన్యానికున్న బహురూపాలనూ బహువిధప్రామాణికదశలనూ బ్లూంఫీల్డ్ ఈవిధంగా నిరూపించాడు. (1) వ్యక్తిగతప్రత్యేకతను ప్రదర్శించే వైయక్తికభాష (ideolect). (2) అనేకవైయక్తికభాషల సమాహారమైన మాండలికభాష (dialect). ఈ మాండలికం ప్రధానంగా మూడురకాలు : (a) ఒక కులానికో మతానికో వృత్తికో జాతికో పరిమితమైన వర్గమాండలికం (class dialect), (b) ప్రాంతీయ ప్రత్యేకతలను ప్రదర్శించే ప్రాంతీయ మాండలికం (regional dialect), (c) విశిష్టప్రయోజనాలకోసం వినియుక్తమయ్యే సాహిత్యకమాండలికం (literary or specialised dialect). ప్రామాణికభాషా స్వరూపం మూడు విధాలుగా ఉంటుందని ఆయన వివరించాడు. (1) గ్రంథ రచనలో ఉపయోగించే సాహిత్యకప్రామాణికం (literary standard), ఇది 'గ్రాంథిక'మని మనం వ్యవహరించేది కాదని గుర్తించాలి. గ్రంథరచనలో వాడిన ఏభాషారూపమైనా సాహిత్యకప్రామాణికమే. (2) కేవలం వ్యవహారంలో విద్యావంతులు సాంఘికంగా ఉన్నతస్థాయిలో ఉన్నవాళ్ళు వాడే వ్యావహారిక ప్రామాణికం (colloquial standard). (3) కేవలం ప్రాంతీయ వ్యవహార పరిమితమైన చదువుకున్నవాళ్ళభాష ప్రాంతీయప్రామాణికం (regional or provincial standard). పై మూడు తరగతులంటూ చెందక పరిమితప్రదేశాల్లో పామరవ్యవహారంలో మాత్రమే వాడుకలో ఉన్న భాషాభేదాన్ని స్థానికమాండలికం (local dialect) అనీ, అప్రామాణికం (sub-standard) అనీ బ్లూంఫీల్డ్ వ్యవహరించాడు.

ఈ ప్రామాణికరూపాలు ఎవరో నిర్ణయించి మొత్తం జాతిమీద రుద్దేవి కావు. సాంఘిక రాజకీయ చారిత్రకార్థిక పరిణామాలవల్ల కాలగతిలో క్రమంగా ఏర్పడేవే. ఒకసారి ప్రామాదికమైన భాషారూపం శాశ్వతంగా అదేగౌరవం నిలుపుకోనూలేదు. ప్రామాణికభాషారూపాలు ప్రధానంగా రెండురకాలుగా ఏర్పడ్డా

యని బహుభాషాధ్యయనంవల్ల తెలుసుకోవచ్చు: (1) మాండలికాలనుంచి, (2) శిష్టనిరూపణంవల్ల, ఈ రెండోరకం పరిణామం చరిత్రలో విరళాతివిరళం.

నేటి ప్రామాణికాంగ్లభాష లండన్ (ప్రాంతీయ) మాండలికంనుంచి ఏర్పడ్డది. అట్లాగే పారిస్ మాండలికంనుంచి నేటిప్రామాణిక ఫ్రెంచ్‌భాష, ఫ్లారెంటిన్ మాండలికంనుంచి ప్రామాణిక ఇటాలియన్, పోల్తావా - కీవ్ ప్రాంతీయ మాండలికంనుంచి యుక్రేనియన్ ప్రామాణికం, కలకత్తా మాండలికంనుంచి నేటి ప్రామాణిక బెంగాలీ (చలిత్), తీరాంధ్ర మాండలికంనుంచి ఆధునిక ప్రామాణికాంధ్రం ఏర్పడ్డాయి. ఇవన్నీ ఒకేఒక ప్రాంతీయ మాండలికంనుంచి అనుకూల పరిస్థితుల్లో క్రమపరిణామంలో ఏర్పడ్డ ప్రామాణికభాషలు. కొన్ని భాషల ప్రామాణికరూపాలు బహుమాండలికాలనుండి ఏర్పడ్డాయి. ఉదాహరణకు మాస్కో-లైత్ ప్రాంతీయ మాండలికానికి ప్రాచీనస్లావ్ భాషారూపాలతోబాటు అన్యదేశ్యాలు చేరి ఆధునిక ప్రామాణిక రష్యన్‌భాష ఏర్పడ్డది. కొందరు పండితుల అభిప్రాయంలో ఈ ప్రామాణికభాషలో కుర్‌స్క్ - ఓరియల్ ప్రాంతీయ మాండలికం కూడా కలిసింది. అట్లాగే తూర్పుసరిహద్దుల్లో వాణిజ్యంలో వాడుకలోవున్న అనేక సాంఘికమాండలికాల (లేదా వర్గమాండలికాల) కలయికవల్ల ఆధునిక జర్మన్ ప్రామాణికభాష ఏర్పడ్డది. ప్రాచీననార్స్ మాండలికాలనుంచి పరిణమించిన వ్యావహారిక నార్వీజియన్ భాషనుంచి ఆధునిక ప్రామాణిక నార్వీజియన్ ఏర్పడ్డది. దీన్ని లేండ్స్‌మాల్ (= దేశభాష) అంటారు.

కొన్ని ప్రామాణికాలు భిన్నాకారాల్లో భిన్నమాండలికాలనుంచి ఏర్పడ్డట్లు నిదర్శనాలున్నాయి. క్రీ. శ. 13, 14 శతాబ్దాలనాటి ఫ్లెమిష్ మాండలికంనుంచి అప్పటి సాహిత్యక డచ్ భాష ఏర్పడ్డది. 14, 15 శతాబ్దాల్లో ఈప్రామాణిక భాషాస్వరూపం బ్రబంట్ మాండలికంనుంచి సిద్ధించగా, 16, 17 శతాబ్దాల్లో వ్యావహారిక డచ్‌నుంచి దీని ప్రామాణికరూపం ఏర్పడ్డది. లిఖితజర్మన్ ప్రామాణికం ఒకప్పుడు హైజర్మన్ మాండలిక ప్రాంతానికి గూడా వ్యాపించిన మధ్య జర్మన్ మాండలికంనుంచి ఏర్పడినా, తరవాతికాలంలో 'థియేటర్ జర్మన్' (Biihnen-deutsch) అనే వర్గమాండలిక ఆధారంగా రూపరేఖలు దిద్దుకుంది.

టర్కిష్ దాస్యంనుంచి విముక్తులయిన సెర్బో - క్రోషియన్ ప్రజలకు శతాబ్దాలుగా ప్రామాణిక భాషంటూ ఒకటి వుండేదికాదు. రాజకీయ స్వాతంత్ర్యం

రాగానే వుక్ స్టిఫనొవిచ్ కరజిచ్ అనే విద్వాంసుడు తన మాండలికానికి ఒక వ్యాకరణాన్ని, ఒక నిఘంటువునూ రచించి ప్రామాణికభాషను ప్రసాదించాడు. ఇటువంటి సంఘటనలు చరిత్రలో చాలాతక్కువ. ఇంకా సజీవులుగావున్న కొందరు వృద్ధులు చూసుండగానే బహుమాండలికాలనుంచి స్వతంత్రలిథువేని యన్ ప్రజలకొక ప్రామాణికభాష ఏర్పడ్డదని బ్లూంఫీల్డ్ చెప్తున్నారు.

ప్రామాణికభాషలు ఈవిధంగా ఏర్పడేటప్పుడు స్థానికమాండలికాలు కాల క్రమాన వ్యవహారదూరమైపోతాయి. లండన్‌నగరానికి చుట్టూ 30 మైళ్ళదూరం లోని అనేక స్థానికమాండలికాల వ్యవహర్తలు ప్రామాణికభాషా వ్యవహర్తలై పోయారని పరిశోధకులు చెప్తున్నారు. జనసాంద్రత, వార్తాసౌకర్యాలు, విద్యాభి వృద్ధి, ఆర్థికరాజకీయ సౌష్ఠవం, భౌగోళికసాన్నిహిత్యం మొదలైన ప్రధానకార ణాలవల్ల వ్యవహర్తల వాడుకలోనుంచి స్థానికమాండలికాలు తొలగిపోయి ప్రామాణికరూపాలు ఏర్పడి భాషలో ఏకత్వం అధికమవుకుంటుంది. ఒక్కసారి ప్రామాణికత్వం సంపాదించిన భాషారూపం శాశ్వతంగా అదేస్థితిలో ఉండదనటం సజీవభాషల విషయంలోనే కాక, విద్వాంసులు తార్కిక దృక్పథంతో సృష్టించగా విద్యాధికులు మాత్రమే వ్యవహరించే కల్పితభాషల (artificial languages) విషయంలో కూడా రుజువవుతున్నది. ఉదాహరణకు 1887 లో డాక్టర్ లుడ్విగ్ ఎల్ జమెన్‌హాఫ్ సృష్టించగా 80 లక్షలమంది విద్యాధికులు ఉపయోగిస్తున్న 'ఎస్పెరాంటో' (Esperanto) అనే కల్పితభాషను ఆర్. డి నసూర్ అనే విద్వాంసుడు సంస్కరించి 'ఎస్పరాన్టిడో' (Esperantido) అనే పేరు పెట్ట వలసి వచ్చింది. ఇంతకన్నా బలవత్తరప్రమాణం మరొకటుంది. జాన్ మార్టిన్ ష్లైయర్ అనే పండితుడు 1880 లో సృష్టించిన వొలపక్ (volapuk) అనే కల్పితభాషను రెండు దశాబ్దాలకాలంలో మరి ఆరుగురు సంస్కరించి మారుపేర్లు పెట్టవలసివచ్చింది వివరాలివి :

| సంవత్సరం | పరిష్కృత నామధేయం | పరిష్కర్త |
|---|---|---|
| 1887 | బొపల్ (Bopal) | సెయింట్ డి మాక్స్ |
| 1888 | స్పెలిన్ (Spelin) | బాయర్ |
| 1893 | బాల్తా (Balta) | దార్మేయ్ |
| 1893 | డిల్ (Dil) | ఫైబిజర్ |
| 1896 | వెల్ట్‌పార్ల్ (Veltparl) | వాన్ ఆర్మిన్ |
| 1899 | లాంగ్ బ్లూ (Langue Bleue) | బొలాక్ |

ఇక సహజభాషల ప్రామాణికరూపాల విషయం చెప్పనక్కరలేదు.

ప్రామాణికతానిర్ణయ విషయంలో లోకమంతటా వ్యాపించిన మరో మూడు విశ్వాసాలు కవిశక్తిమీది గౌరవం, భాషాపరిశుద్ధతావాదం, శిష్టోక్తి ప్రాచీనతాదర్శం అనేవి. భాషలో సహజంగాలేని లక్షణాలను కవులు కల్పించినంత మాత్రాన వాటికి ప్రామాణ్యంరాదు. అనుశాసన కర్తృత్వాన్ని కవికి మనం కట్టబెట్టినా లోకం అంగీకరించటంలేదు. అందువల్ల కవిప్రయోగం కేవల ప్రమాణంకాదు.

పామరులకన్నా పండితులే ఎక్కువగా పట్టుబట్టేవిషయం భాషాపరిశుద్ధత అనేది. ఇతరభాషలతో ఆదానప్రదానాలు లేకుండా మడికట్టుకున్నభాష ప్రపంచంలో లేదు. ప్రతిభాషకూ సాంస్కృతికాది కారణాలవల్ల కొన్నిభాషలతో అత్యంత సాన్నిహిత్యం ఉండవచ్చు. తెలుగువిషయంలో చూస్తే సంస్కృతం నుంచి మనం ఎరువుతెచ్చుకొన్న మాటలు సంఖ్యాధికం. వాటికి మనమేదో ప్రత్యేక గౌరవాన్ని పవిత్రతను ఆరోపిస్తున్నాం. మన లాక్షణికులు సంస్కృత శబ్దాలు తెలుగులో ప్రవేశించిన తీరును నిపులంగా చర్చించారు. హిందీ, పర్షియన్, అరబిక్, ఇంగ్లీషువంటి భాషలనుంచి వచ్చిచేరిన అనేకానేకపదాల రూపనిష్పత్తి విషయంలో మన నిఘంటు వ్యాకరణాలు మౌనం వహించాయి. 'వ్యవహారహాని' సంధిల్లుతుందనే భయంతో అప్పుడప్పుడు అన్యదేశ్యాల ప్రయోగాన్ని అంగీకరించినా, కవులనేకులు ఆయాశబ్దాలను ప్రయోగించినా, భాషావిద్యార్థికి వాటి స్వరూప జ్ఞానాన్ని అందిచ్చే వ్యాకరణాలు ఇప్పటికి లేవు సంస్కృతవిషయంలో అవసరమైన రూపనిష్పత్తిజ్ఞానం, ఆమోదయోగ్యమైన పదసంఘటన ఇతరభాషల విషయంలో పనికిరాలేదు. ఈవిధానాన్నే హాకెట్ 'ద్విభాషాపరిశుద్ధతావాదం' అన్నాడు. ఈ పరిస్థితి అన్నిభాషల విషయంలోనూ తరతమభేదంతో కనిపిస్తుంది. అన్యదేశ్య నిషేధంవల్ల భాషకు పరిశుద్ధత, పవిత్రత వస్తాయనుకోవటం దుర్భ్రమ, అశాస్త్రీయం.

శిష్టోక్తి ప్రాచీనతరమని, నాగరూకప్రయోగమని, కేవలప్రమాణమని భావించటం కూడా అన్నిసందర్భాల్లోనూ నిజంకాదు. విద్యాధికులు 'పెనగలు' అనే మాటను నిరక్షరాస్యులు 'చెనగలు' అంటారు. సంస్కృతంలోని 'చణక' శబ్దభవమైన ఈ మాట చకారాదిగా ఉండటమే ప్రాచీనతకు నిదర్శనం. అయినా అది ప్రామాణికంకాదు-విద్యావంతుల వాడుకలో లేదుకాబట్టి. అంటే తప్పొప్పులకూ, ప్రాచీనతార్వాచీనతలకూ, ప్రామాణికతాప్రమాణికతలకు సంబంధంలేదని

గుర్తించాలి. మన వ్యాకరణాలు అనేకరకాల మిశ్ర/వైరి సమాసాలను నిషేధించినా అటువంటివి శిష్టవ్యవహారంలో చాలానిలిచాయి. అంతమాత్రాన ప్రతి మిశ్రసమాసమూ స్వభాషావ్యవహర్తకు ఆమోదకర మవుతుందని చెప్పలేము.

ఈ ప్రామాణికతా నిరూపకుల ప్రధానలక్షణాలు రెండు : (i) భాషను శాసించాలన్న సంకల్పం, (ii) భాషలోని తప్పొప్పులను సామాజికేతరకారణాల ద్వారా ముఖ్యంగా అభిరుచిప్రధానబుద్ధితోనో తార్కికదృష్టితోనో నిరూపించాలనే ప్రయత్నం. భాష తర్కాతీతం. భాషలోని పరిణామాలకూ, భేదాలకూ. ముఖ్య హేతువులు సామాజిక స్థితిగతులు. ఆర్థిక రాజకీయ భౌగోళిక సాంస్కృతిక కారణాలవల్ల దేశకాలపాత్రల స్వభావపరిణామంవల్ల భాషలో వచ్చే రూప భేదాలకూ వాటికి ఆయాకాలాల్లో ఆయాసమాజాల్లో ఉండేగౌరవాగౌరవాలకూ పరస్పరసంబంధముంది.

పైచర్చ కంతటికీ సారాంశంగా భాషారూపాల ప్రామాణికతను నిర్ధరించే 'కేవల' ప్రమాణం ఏమీలేదని చెప్పవచ్చు. అనుకూల సామాజిక, రాజకీయార్థికాది పరిస్థితుల్లో తత్కాలశిష్ట వ్యవహారంలోని రూపాలు ప్రామాణికాలు అవుతాయని, వాటిని ఒప్పులుగా పరిగణించినంత మాత్రాన తక్కినరూపాలన్నీ తప్పులని భావించనక్కరలేదని గుర్తించాలి. అటు రచనామాధ్యమంగా ఇటు సంభాషణ మాధ్యమంగా శిష్టులుపయోగించే భాషారూపం నిర్దిష్టదేశకాలాల్లో ప్రామాణికంగా పర్యవసిస్తుంది. సన్నిహిత సాంఘికాది సంబంధాలవల్ల భాషలోవచ్చే 'ఏకరూపత' నే, 'సామ్యా' న్నే ప్రామాణికమని వ్యవహరిస్తాం. ఇది హఠాత్పరిణామం కాదు అందువల్ల భాషారూపాల్లో సామ్యవైషమ్యాలు ఎప్పుడూ ఉంటుంటాయి. పూర్వవ్యాకర్తలు భాషలోని అల్పాల్పభాగాన్ని సాధువని అత్యధిక భాగాన్ని అసాధువని అప్రామాణికమని విభజించేవాళ్లు. నేటి భాషాశాస్త్రజ్ఞులు తమ నిర్ణయాలను, అనుశాసనాలను జాతిమీద రుద్దటంలేదు; భాషలోని భిన్నవిధ లక్షణాలను ఆయా తరగతులుగా విభజించి వర్ణించి చెప్తారు వీళ్ళదృష్టిలో సాధుతాసాధుతాచర్చ ఒకసాధనమూకాదు; దానికి ప్రయోజనంకూడా లేదు. పండితులను పామరులనుకరించటం యథార్థస్థితి. ఈ అనుకరణఫలితంగా నిర్దిష్ట దేశకాలాల్లో వచ్చేభాషా రూపతౌల్యమే ప్రామాణికం.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదే వేతరో జనః,
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే".



# బోధనభాష – తెలుగు

శ్రీ వి. వి. రాఘవాచార్యులు

## భాష అంటే ఏమిటి ?

ఒక భాషణ సముదాయంలో భావాభివ్యంజన సాధనంగా ఉపయోగపడేది భాష. ఇది దృశ్యశ్రవ్య సంకేతరూపకమైఉంటుంది. పారంపరికమైన జన వ్యవహారంలో రూఢములై, అనుకరణ శిక్షణలద్వారా, భాషా నైపుణ్యాలు ఆర్జింపబడుతుంటాయి. భావం భాషలో వ్యక్తరూపం సంతరించుకుంటుంది; అటు భాషద్వారా భావోదయమూ ప్రేరితమౌతుంది. ఈ విధంగా భాషాభావనలు పరస్పరాశ్రయాలు. వీటిల్లో భావన ఆదిమమైంది; భాష ద్వితీయం. ఇతర ప్రాణి కోటితో మానవుడు ఏ యే అంశాల్లో భేదిస్తాడు ?— అనే చర్చవచ్చినప్పుడు, భాష చాల ప్రముఖమైనదిగా స్ఫురిస్తుంది.

## భాషాప్రయోజనాలు.

భాషకు విశిష్టమైన సామాజిక ప్రయోజనం ఉంది. ఒక జనసముదాయం యొక్క సామూహిక జీవితాన్ని ఇది ఎంతగానో ప్రభావితంచేస్తుంది. మానవ హృదయాలను ఇటు ఏకీకరించడంలోను, అటు విభేదాలు రేకెత్తించడంలోను కూడ, భాషఎంత ప్రబలశక్తిగా పనిచేస్తుందో గత దశాబ్దాల్లోని భారతీయచరిత్ర యే రుజావుచేస్తుంది. యుగ యుగాల క్రమానుగతమైన చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలు భాషారూపంలోనే తరువాతి తరాలకు అందజేయబడుతాయి. కనుక ప్రతిభాష ఒక సాంస్కృతిక సృష్టిని చేకూర్చుకొని, విలక్షణమైన వ్యక్తిత్వంకల్గి ఉంటుంది. విషయజ్ఞానార్జనలో, భావ వినిమయంలో, మాధ్యమంగా భాష ప్రయోగింపబడుతుంది. భాషకు ఇది ప్రధాన ప్రయోజనం. అనుషంగికములైన తదితర ప్రయోజనాలతో ఈ వ్యాస విషయానికి ప్రసక్తి లేదు.

## భారతీయ భాషలు.

భిన్నత్వంలో ఏకత్వం సంతరించుకున్న సంస్కృతి మనది. భాషా విషయంలో కూడ భారత భూమి అదే వైవిధ్యంతో సాక్షాత్కరిస్తుంది. కబీరు, వేమన, తిరువళ్లువర్, సర్వజ్ఞ, నానక్, తుకారామ్ వంటి వారి రచనల్లో అంత

ర్వాహివిగా కన్పించే భావైక్యతతోబాటు కొంతకొంత భాషాసామ్యంకూడ గోచరిస్తుంది. మన జాతీయ భాషలకు ధాత్రిగానో మాతృమూర్తిగానో సంస్కృతమ్ పుష్టివి చేకూర్చింది. అందుకే మన కవులు అంటూ వచ్చిన "తల్లి సమస్త భాషలకు దైవతభాషయు..." అనే సూక్తి వైజ్ఞానికంగా కాకపోయినా, వ్యావహారికంగానైనా యదార్థమైంది.

పరాధీన యుగంలో భారతీయ భాషలన్నీ బానిస భాషలే, ఆంగ్లభాషా వ్యవహారమే నాగరికతకూ, ప్రాభవానికీ లక్షణాలుగా ఏర్పడినాయి. స్వాంతత్ర్యావతరణంతో పాటు, అణగారి ఉన్న ఆశలూ, ఆశయాలూ, అభ్యుదయ శిఖరాలు అందుకోవాలనే ఆకాంక్షలూ ఉవ్వెత్తుగా ఉదయించడంతో పరిస్థితి మారిపోయింది. ఒకప్పుడు 'ప్రాచ్య' భాషలనీ, దేశభాషలనీ, చులకనగా చూడబడిన ప్రాంతీయ భాషలు నవ భారత రాజ్యాంగంలో జాతీయభాషలుగా పేర్కొనబడిన నేడు తమ సముచితస్థానాన్ని చేరుకొనే వంరంభంలో నిమగ్నమై ఉన్నాయి.

## మన భాషా సమస్య

ఈ వినూత్న పరిణామంలో భాషా సమస్య అంటూ భారతదేశమంతటా తలయెత్తి కొన్ని యెడల వికృతరూపం ధరించింది. మాతృభాషా స్థానంలో ఉన్న ప్రాంతీయ భాషలప్రాముఖ్యత సరే సరి. ఇవిగాక దేశమంతటికీ ఒక సామాన్య భాష ఉండాలి. అప్పైన, నవీన విజ్ఞాన కిరణప్రసారానికి కిటికీలాగా, విశాల విశ్వవాయువులు ప్రవేశించే గవాక్షంలాగా ఇన్నాళ్లూ మనకు తోడ్పడిన ఆంగ్లభాష తప్పక ఉండవలసిందే. మరోవైపు సంస్కృతం లాంటి ప్రాచీన భాషలు విడనాడి మన భాషలు సౌష్ఠవంగా మన లేవనే దృక్పథం ఉంది. అందువల్ల జాతీయ అవసరాలకు అనుగుణంగా జాతిని తీర్చిదిద్దే పాఠశాలల్లో సామరస్య భావనతో ఆయా భాష బోధనను, వివిధ దశల్లో ప్రవేశపెట్టి కొనసాగించాలనే ఆలోచన ఉదయించింది. మొదలియార్ కమిషన్, కొఠారీ కమిషన్ నివేదికలు కూడ తగిన ప్రతిపాదనలు ఈ మేరకు చేయడంతో, త్రిభాషా సూత్రం పేరుతో ఈ భావన భారతజాతీయ విధానంగా రూపొంది (తమిళనాడు మినహా) దేశమంతటా అమలు జరుపబడుతోంది.

## బాలురపై భాషా భారం

బాలురపై భాషాభారం అనే దృక్కోణంనుండి సమస్యను పరిశీలించినప్పుడు, సహజంగా ఇతర అభ్యుదయ దేశాల అనుభవాల్ని లెక్కలోకి తీసు

కోవాల్సి ఉంటుంది. హాలండ్ పాఠశాలల్లో నాలుగు స్విట్జర్లాండు దేశంలో మూడు భాషలు నేర్పబడు తున్నాయి. రష్యా దేశంలోకూడా విద్యార్థులు విధిగా బహు భాషాధ్యయనం చేస్తున్నారు. అవసరం అంటూ ఏర్పడాలి గాని, అసలు నేర్వడం బాధఅనీ, భారం అనీ అనుకోవడం అసహజం. మన ప్రాంతంలో మనం అనాగరికులని చెప్పే లంబాడీలు చూడండి. ఉర్దూ, తెలుగు, లంబాడీ-మూడు భాషల్లో నిరాఘాటంగా నిత్యజీవన వ్యవహారం సాగిస్తుంటారు. వర్తక వ్యాపారాల్లో మెలగుతూ నిత్యావసరాలకులోనై, అలవోకగా ఆయా ప్రాంతాల భాషలు పుక్కిట బట్టిన వాళ్లను—సామాన్య ప్రజ్ఞావంతులే—ఎందరిని చూడడంలేదు! హైదరాబాదులో హోటలు పెట్టుకోడానికి వచ్చిన తమిళ, కేరళ, ప్రాంతీయులు—నిరక్షరాస్యులతో సహా సంవత్సరం తిరగకముందే, తెలుగు ఉర్దూ భాషలు దిట్టంగా మాట్లాడేస్తున్నారు గదా!

## మాతృభాషలో అధ్యయనం.

తల్లి ఒడిలో శిశువుకు తొలి విజ్ఞానపు వెలుగులు నించేదీ, మనసులో పొంగి పొర్లివచ్చే తన ఆదిమ భావాలకు తొలి తొడవులు సంతరించేదీ, తన సభ్యతా సంస్కృతులపట్ల గౌరవాదరాలు పెంచేదీ, తల్లిభాష. జన్మజాతమైన బోధనమాధ్యమం ఇది. బాహ్యప్రపంచ అవగాహనకు తొలిమాధ్యమం ఇది. అప్రయత్నంగా జీవితమంతా ఆవరించి, శ్వాసవాయుల్లాగా తుదిదాకా వెంటనంటి ఉండేదిది. దీనిని ఒక భాషామాత్రంగా అనుకోలేము. మాతృభాషను తక్కిన బోధన విషయాలతో పాటు ఒక విషయంగా లెక్కించటం పొరపాటు. ఎంత గొప్ప పరభాషలో అధ్యయనం చేసిందైనా, ఒక జటిల విషయం అవగాహన అయ్యే ప్రక్రియలో, అనుకోకుండానే మాతృభాషాపరమై, ఆలోచనలో స్థిరపడుతుంది. అందుకే అది, సాధనమాత్రమైన స్థాయినతిక్రమించి, ఆత్మీయతా భావనలతో పెనవేసుకుంటూ మానవుని మూర్తిమత్వంలో ఒక అవిభాజ్య అంగంగా రూపొందుతుంది.

## మన మాతృభాష.

మన మాతృభాష తెలుగు. "ఆంధ్రత్వమాంధ్రభాషాచనాల్పస్య తపసః ఫలమ్" అని ఏనాడో దిగ్గజంలాంటి పండితుడు అప్పయ్య దీక్షితులు సగర్వంగా చెప్పుకొన్నాడు. బహుభాషాకోవిదుడైన కృష్ణరాయలు తెలుగునే లెస్స అనటం

లోకవిదితమే. ఇదినాటి మాట. నేటియుగంలో — అదెంతవరకు సమంజసమో వేరేమాటగాని — శ్రుతి మాధుర్యం వల్ల పాశ్చాత్యులు మన భాషను "ఇటాలియన్ ఆవ్ ది ఈస్ట్" అన్నారు. విభిన్న స్రవంతులు తనలో లీనంచేసుకొనే సమర్థత గలదనీ. అత్యంత సమన్వయ శక్తిసంపన్నమనీ ప్రఖ్యాత వైజ్ఞానికుడు జె. బి. యస్. హాల్డేన్ భారతీయభాషలో తెలుగును పేర్కొన్నాడు. గత శతాబ్దంలో డా॥ విలియంకారే విద్వాంసుడు, నేర్చుకోడానికి కొంత కష్టమనిపించినా, తెలుగుభాష అత్యంత పరిమార్జితమైనదనీ, "పెంపొందింపదగిన మిక్కిలి యోగ్యభాషల్లో తెలుగు గణనీయమైందనీ, ఎంతో సుకరంగాను, సమంజసంగాను, కొంకంతోను భావవ్యక్తీకరణ సామర్థ్యం సమకూర్చగల రూప విస్తృతి వైవిధ్యంగల భాష'' అనీ వాకొన్నాడు. ఆంగ్లభాష పరిణతి చెందడానికి పూర్వమే సాహిత్య, సంపన్నంగా వెలసినభాష తెలుగు. అనేక అవరోధాలను అతిక్రమిస్తూ, వికాసమార్గంలో పురోగమిస్తూ, నేటి జాతీయజీవనంలో సముచిత పాత్ర వహించాల్సిన మదియలో క్రొత్తమలుపు తిరుగుతోంది ఈ నాడు. ఈ తరుణంలో, మనభాష మనకు అక్కరకు వస్తుందా అనే సందేహం కొందరు మేధావుల్లో బయలుదేరటం నిజంగా దురదృష్టకరం. జాతి పునర్నిర్మాణంలో 'ఈ భాష మనకెంత చెయ్యగల్గుతుంది' అనేవాళ్ళు 'ఈ భాషకు ఇంతవరకు మనమేంచేశాం' అని ప్రశ్నించుకోటంలేదు. సరే ఆ విషయం వదిలేద్దాం.

## ప్రాంతీయ భాషలతో ఇంగ్లీషు పోటి.

ఈనాడు చాలామంది తలుస్తున్నట్లుగా ఆంగ్లభాష పోటీపడేది హిందీతో కాదు. ప్రాంతీయ భాషలతోనే: ముఖ్యంగా ఉన్నత విద్యారంగంలో బోధన భాషగా నేటివరకు ఇంగ్లీషే కొనసాగుతోంది. ఇప్పుడు మాధ్యమం తెలుగు కావాలంటున్నాం. అంతపెద్దకార్యం నిర్వహించేస్థానం తెలుగుకు లేదని కొందరంటున్నారు. వీళ్ళది అరణ్యరోదనం కాకతప్పదు. మాతృభాషస్థానంలో మరే భాషా — అదెంతటిదైనాసరే — ప్రతిష్ఠింపబడలేదు; అది సామాజికంగా, జాతీయంగా, మనోవైజ్ఞానికంగా అసమంజసం, అసంభవం. ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యుల శాతమెంత ? అందులోనూ, ఆంగ్లభాషా పరిజ్ఞానంగలవాళ్ళ శాతమెంత ? ఏ సమాచారగ్రంథం తిరగేసినా ఇట్టే తేలిపోతుంది. ప్రధానంగా పట్టణాల్లో నివసిస్తూ, నూటికి ఏ ఒక్కనికో తెలిస్తే ఆంగ్లభాషలో పరిపాలనా,

విద్యాబోధనలూ నిర్వహిస్తే, ఇది ప్రజాస్వామ్యం ఎలా అవుతుంది? ఈ విష వలయంలో పడిన మనకు ఇంతవరకు ఫలించింది — ప్రజలపైన స్వామ్యమే గాని, ప్రజలయొక్క స్వామ్యంమాత్రం కాదు. ఆంగ్లవిద్య కోట్లాది మన భారతీయ సోదరులను, మననుండి వేరుచేసి వేసిందని గాంధీజీ ఏనాడో ఘోషించి చెప్పారు. మన పల్లెల్లో పరిశ్రమించే రైతుకూ, మన కార్ఖానాల్లో కష్టించే కార్మికుడికీ ఇంగ్లీషుభాష — శతాబ్దాలకాలంలో సన్నిహితంకాలేదే — నేడు కాగలుగుతుందా? మన పట్టభద్రుల్ని, మనపాలన యంత్రాంగాన్ని ఈ ప్రజాజీవితానికి సన్నిహితం చెయ్యాలంటే, ఆ ప్రజల భాషలోనే ఇటు ఉన్నత విద్య, అటు పరిపాలనా వ్యవహారం కొనసాగాలి. లేకపోతే మన ప్రజారాజ్యం ప్రజలకు దూరంగా, నేతి బీరకాయగానే ఉండిపోతుంది. తన దేశంలోనే మన పౌరుడు పరాయివాడుగా ఇంకా జీవనయాత్ర సాగిస్తుంటాడు. తన పేరిటసాగే రాజ్యతంత్రంలో తానుపాల్గొనే హక్కుమంచీ శాశ్వతంగా వంచింపబడతాడు. ఇదే నేడు మనం ఎదుర్కొంటున్న సవాలు.

## భాష యొక్క గొప్పతనం జన్మసిద్ధమా?

ప్రస్తుతానికి వద్దాం. ఉన్నతవిద్యాస్థాయిలో బోధన మాధ్యమంగా ఇంగ్లీషు స్థానంలో, తక్షణమే మనప్రాంతీయ భాషలురావాలి. ఇందులో సమస్యకు రెండు పార్శ్వాలున్నాయి. ఇంగ్లీషును (మాధ్యమంగా మాత్రమే) తొలగించడం, ఒకటి. ప్రాంతీయ భాషల్ని మాధ్యమంగా చెయ్యడం, రెండు. ఇందులో మొదటి అంశాన్ని వ్యతిరేకించేవారు, ఒక భాషగా ఇంగ్లీషుకు ఉన్న గొప్పతనాన్ని స్తోత్రం చేస్తారు. కాని మానవుడిలాగే – ఏ భాషా గొప్పదై పుట్టడం అంటూ ఉండదు. అనుకూలమైన వాతావరణం, వికాసావకాశాలు, రాజకీయ సామాజిక పరిస్థితులు, సర్వతోముఖ - జాతీయ పునర్నిర్మాణ పరమైన నాయకత్వం, జాతీయావసరాలు నిర్వహించగల గొప్పసాహితవేత్తలు — ఇలాంటివి ఒక భాషోన్నతికి కారకాలుగా తోడ్పడే అంశాలు. ఏ ప్రసిద్ధభాషావేత్తా నేటివరకు ఇతర భాషలకు వశపడని అపురూపలక్షణాలు లెక్కవేసి, ఇంగ్లీషుభాషే గొప్పదని నిరూపించలేదు. అంతవరకూ పై అభిప్రాయం కేవలం నిరాధారమైన దురభిమాన జన్యంగానే మిగిలిపోతుంది. రవి అస్తమించని సామ్రాజ్యం తాలూకు భాషగా ఇంగ్లీషుకు చారిత్రకంగా మహత్తర అవకాశాలు లభించాయి. విజేతల

భాషగా వలదేశాల్లో, నలుమూలలా చొచ్చింది. పాలకుల ఉద్దేశ్య పూర్వకమైన విధానాలద్వారా స్థానిక భాషలను అణచిపెట్టి, బలవంతంగా ఇంగ్లీషు తలపై రుద్దబడింది. చరిత్రలో ఇది అక్షరరూపమైన సత్యం.

## ఇంగ్లీషు గొప్పపుటుక ఎలాంటిది ?

ఇంత గొప్పగా పేర్కొనబడే ఇంగ్లీషు భాషవికాస క్రమం ఎలాటిదో దిఙ్మాత్రంగా పరికించటం అవసరమే. తెలుగులో కవిత్రయంవారు కావ్యసృష్టి చేస్తున్నకాలంలో ఇంగ్లీషుకు ఇంకా రూప కల్పనం కాలేదు. పాఠశాలలో క్రీ.శ. 1350లో ప్రవేశ పెట్టబడేదాకా. ఇంగ్లీషు 'దేశావాళీ సరుకు'గా చిన్న చూపుచూడబడినది. 14వ శతాబ్దం అంతిమ వర్షంలోనే ఈ భాషకు స్వదేశంలో పార్లమెంటు ప్రవేశం లభించింది. నేడు మన ఇంగ్లీషు వ్యామోహంలాగే నాడు వాళ్ల దేశంతో ఫ్రెంచి, లాటిన్ భాషల వ్యామోహం ఉండేది. ఇది ఇంగ్లీషు ప్రగతి మార్గానికి అవరోధంగా తయారయింది. అప్పట్లో స్వభాషా ఉద్యమాన్ని లేవదీసిన ప్రముఖుల్లో ఒకరు, ఒక ప్రధానోపాధ్యాయుడు "...లాటిన్‌ను గౌరవిస్తాను; కాని ఇంగ్లీషుని పూజిస్తాను." అంటూ శంఖారావం చేయాల్సి వచ్చింది. 1586లో కూడా జార్జి పెటీ తన మాతృ భాషా విషయంలో ఇలా ఆక్రోశించారు. "నేను ఇంగ్లీషులో రాస్తాను కాబట్టి, నాపరిశ్రమని తీరిక చేసేవారు...శోచనీయ మేమంటే వారు మన భాషలో (ఉత్తమ రచనలు చేయడం) అసాధ్యమంటారు. వారు మన భాషని నిస్సార మైనదిగా భావిస్తారు; అనాగరిక భాషగా ఎంచుతారు; గుర్తింప దగనిది అంటారు." ఫ్రెంచి ల్యాటిన్ భాషల స్థానంలో స్వభాష (ఇంగ్లీషు) రావడానికి నాడు అంతా వ్యతిరేకత ఉండేదన్న మాట.

## ఎలా కలిగింది గొప్పదనం ?

నాటి అనాగరిక భాషయైన ఇంగ్లీషే నేడు ప్రపంచమంతటలో గొప్ప భాష అనీ, హుందాతనం మూర్తీభవించిన భాషఅనీ, ప్రాంతీయభాషలు దానిస్థానం ఆక్రమించడానికి సర్వదా అయోగ్యమైనవనీ మన పెద్దలు కొందరు అంటున్నారు అక్కడిచరిత్రే ఇక్కడ నేడు పునరావృత్త మౌతోంది—కాని తలక్రిందురూపంలో విపర్యాసంగా మంటా. నేడు మన ప్రాంతీయ భాషలస్థితిలోనే మూడు, నాలుగు వందల ఏండ్ల క్రిందిటి దాకా ఇంగ్లీషు కూడా ఉండేది. తమ పుస్తకాలకి తగిన గౌరవం రాదని, న్యూటన్, బేకన్ వంటి మేధావిదులు కూడా ఇటు ఇంగ్లీషులో

చేసిన రచనలకు అటు లాటిన్ అనువాదాలు ప్రచురించుకున్నారు. తరువాత కాలంలో స్వదేశంలో ఆ భాషకు అన్ని రంగాల్లో ప్రయత్న పూర్వకంగా స్థానం కల్పించుకున్నారు. దానికి తగినట్లు ఆంగ్లభాషకు కలిగిన అనుకూల పరిస్థితులు, ఆ భాషను ఆశ్రయించుకుని అద్భుత రచనలు చేసిన మహా రచయితలూ, మాతృ భాషాభిమానులై లోకం నలు మూలల వ్యాపించిన ఆంగ్లేయులూ, ఇరుకు భావాలు భాషానియంత్రణలు విడనాడి స్వేచగా తమ భాషను ఎదుగనిచ్చిన దృక్పథం-ఇన్ని ఆ భాషౌన్నత్యానికి తోడు ఐనాయి. నేడు అతిసామాన్యమైన ఆంగ్ల శబ్దాల్లో ఎన్నెన్నో వాస్తవానికి సేచ్ఛగా అరువు తెచ్చుకున్న ఫ్రెంచి మొదలైన భాష లకు అనుకృతులో, తద్భవాలో అని గమనించటం చాల ముఖ్యం. ఇంగ్లీషులో 'ఇంగ్లీషు' పాలు ఎంత తక్కువో చూస్తే ఆశ్చర్యం అవుతుంది. విజానికి ఇది కూడా మనలోనే గుణపాఠంకావాలి. కాబట్టి ఇంత గొప్ప ఇంగ్లీషు కనుక ఇదే మన మాధ్యమంగా ఉండాలి అనేది, చారిత్రకసత్యాలు గుర్తించని అర్థహీన మయిన వాదం [భాషాసమస్య—వాసమూర్తి].

## సమస్య రెండవ పార్శ్వం.

పోతే, సమస్య రెండవ పార్శ్వం ఉంది. ప్రాంతీయ భాష మాధ్యమంగా ఉన్నతస్థాయి విద్య నిర్వహించడం సాధ్యమా: సమంజసమా:—అని. మాతృ భాష అయిన ఇంగ్లీషు తమ దేశంలో మాధ్యమంగా వనిరానిది అని అక్కడి వాళ్లనుకున్న పరిస్థితిపైన చూశాం. మన భాషల సంగతీ, ఈ నాడే అచ్చంగా అలాగే అనుకుంటున్నాం. ఇంగ్లీషుస్థానంలో వచ్చేయోగ్యత వాటికి లేదని సందేహిస్తూ కూర్చుంటున్నాం. వాటికి ఇంతవరకు అవకాశం అంటూ ఆధునిక యుగంలో ఏనాడూరాలేదు. వస్తే అవికూడ ఇంగ్లీషులాగ అంతర్జాతీయ భాష వాలేవేమోకాని, జాతీయ అవసరాలు తీర్చాడానికీ, ప్రజా జీవితంలో నవోదయం ఆవిర్భావానికీ మాత్రం వాటివల్ల దారులు పడుతాయనడంలో ఏసంశయమూ లేదు. ఇంగ్లీషు భాషా చరిత్రనించి మనంనేర్చుకోవలసింది ఇదేకాని, ఇంగ్లీషును పట్టుకుని ఊగులాడడంకాదు.

ప్రపంచంలో ఏ ప్రగతిశీలమైన దేశంలోను పరిభాష బోధనమాధ్యమం గాలేదు. రష్యా, జపాన్, ఇజ్రాయిల్, వంటి పెద్ద చిన్న దేశాలెన్నో తమ భాషలను అధికారభాషలుగా, అన్ని స్థాయిలలో బోధన భాషలుగా రూపొందిం

చుకొని అత్యభివృద్ధిచెందిన, ఆధునిక దేశాలుగా అంతర్జాతీయ రంగంలో మనుగడసాగిస్తున్నాయి. ప్రయోగం బట్టి భాషకు యోగ్యతాయోగ్యతలు సిద్ధిస్తాయి తప్ప జన్మతఃకాదు. మన దేశానుభవంలోనే మాజీ హైదరాబాదు రాష్ట్రంలో, భారతీయ భాషలలో ఒకటైన ఉర్దూ ఉన్నతవిద్యామాధ్యమంగా రూపొందింపబడిన ప్రయోగంలోనకు గుణ పాఠం కావాలి.

## తెలుగునుగూర్చి కీ.శే.కొ. లక్ష్మణరావుగారు.

'దేశ భాషలలో శాస్త్రపఠనము' అనే తమవ్యాసంలో మహనీయుడు కీ.శే. శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు అర్ధశతాబ్దం పూర్వమే ఆవేదనతో చెప్పిన ఈ మాటలు గమనీయములు: "తల్లి పాలు త్రాగిపెరిగిన బాలునకును, దీదిపాలు త్రాగి పెరిగిన బాలునకును నెట్టి భేదముండునో స్వభాషయందు శాస్త్రాభ్యాసము చేసిన వానికిని పరభాషయందు జ్ఞానార్జనము చేసిన వానికి నట్టి భేదమేయుండును". బాలుని మానసిక ప్రవృత్తి, ప్రవర్తన భేదము అను దృక్కోణములనుండి ఈ సూక్తిని పరిశీలించటం అవసరం. ఇంకను, "...ఉగ్గుపాలతో నేర్పఁబడిన స్వభాష సహజముగఁ బ్రతిమనుష్యునకు వచ్చును...అయా నిద్రలు సులభము గను త్వరితముగను బ్రసరించి జనులయున్నత స్థితికిఁ గారణ భూతములగును," అనుచు భవిష్యత్తువైపు సంకేతము చేసినారు. వచ్చీరాని ఇంగ్లీషులో ఉన్నత విద్యను బోధింపయత్నించి, మన యువకుల వ్యక్తిత్వాల్ని ఎదుగు బొదుగు లేకుండా చేసుకుంటున్న మనం ఆయన ఆశయానికి ఎంతదూరం ఉన్నామో! "ఇప్పుడితో భ్రష్టస్తతో భ్రష్ట" అమనట్లు మన బాలకులకు ఇంగ్లీషు బాగుగా వచ్చుట లేదు; శాస్త్రములు చక్కఁగఁ దెలియుట లేదు." అనుమాట నేటికి ఎంత యదార్థమో మనకే తెలుసు. నేటివలె, ఆంగ్ల భాషా వ్యామోహ పరులైన విద్వాంసులను గూర్చి వారన్న మాటలు; "పాతకాలలోఁ దెలుగున శాస్త్రములు చెప్పఁదలఁచినపుడు మీకుఁ దెలుగులో శాస్త్రగ్రంథములేవియని యడ్డముచెప్పుదురు. శాస్త్రగ్రంథములు వ్రాయుదమనగానె, "ఆగ్రంథముల నుపయోగించు బశ్శేవోయి' యని వీరె మరల నడ్డము వచ్చెదరు. వీరిసిద్ధాంతము ననుసరించినఁ పిచ్చికుదిరి నఁగాని పెండ్లి కాదు; పెండ్లియైనఁగాని పిచ్చికుదురదు. వీరి వాదము వినుచుండినఁ బిచ్చియుఁగుదురదు; పెండ్లియుఁగాదు. కావునఁ బరస్పరాశ్రయ ద్వేషభూయిష్ఠమైన వీరి వాదమునుచూచి మనము భయపడవలదు." నేటికిని మనకు మహనీయుని యుపదేశమే శరణ్యంగా తోపకమానదు.

## పెద్దల నిపుణుల అభిప్రాయాలు

ఈ విషయమై, విద్యారంగంలో అద్వితీయులైన నిపుణులు ఏంచెప్తారో విచారిద్దాం. గాంధీజీ "నేనే నియంతనైతే మన బాల బాలికలకు పరభాషా మాధ్య మంద్వారా బోధించడం నేడే నిల్పివేస్తాను .........ఈ దుస్థితికి తక్షణచికిత్సే అవసరం" అన్నారెన్నడో. విశ్వకవి రవీంద్రుడు, తిలక్, రాజేంద్రప్రసాద్, డా॥జాకిర్ హుసేన్‌వంటి ప్రజాజీవన విధాయకులూ ఇలాటి భావాలేప్రబోధించారు.

## విద్యాకమిషన్లు ఏం చెప్పాయి ?

ఉన్నత విద్యాస్థాయిలోకూడ విద్యాబోధన ప్రాంతీయ భాషల్లోనే జరగా లని సిఫారసుచేసిన మొట్టమొదటి నిపుణుల సంఘం డా॥రాధాకృష్ణన్ కమిషన్ (క్రీ॥ శ.1948). ఆ తర్వాత అనేక ప్రముఖ విద్యావేత్తలతో ఏర్పడిన కొఠారీ కమీషన్ (1964-66) వారి నివేదిక ఎంతో ప్రామాణికమైంది. విద్యారంగంలో గొప్ప అనుభవం గడించిన శ్రీ యం. వి. రాజగోపాల్‌గారు, "బ్రిటిష్‌వారు తమ వెనుక విడిచివెళ్ళిన ఎన్నో నరిపడని విదేశీ నమూనాల్లో విద్యావిధానం ఒకటి. అన్నిటికన్నా బాధాకరమైనది". అంటూ బోధన మాధ్యమం విషయం ప్రస్తావిస్తూ, కాశ్మీరు నాగాలాండు రాష్ట్రాల్లో ఆంగ్లభాషా మాధ్యమం విఫలమైం దని ఆయన పేర్కొన్నారు.

## మనోవిజ్ఞానం ఏమంటుంది ?

మనోవైజ్ఞానికంగాకూడా, అజ్ఞాత విషయాన్ని అపరిచిత మాధ్యమం ద్వారా సాధించడం వాంఛనీయంకాదు మాతృభాషా గతమైన విషయంపూటిగా, సులభంగా ధారణాగతమైపోతుంది. భాష ఆధారమైతే, భావం ఆధేయమవు తుంది. రెండూ అపరిచితాలైతే, అధ్యయనప్రక్రియ క్లిష్టమైపోతుంది. మాతృ భాషద్వారా విషయజ్ఞానార్జన అనే ప్రక్రియ సర్వతోముఖమైన మూర్తిమత్వ వికాసానికి దోహదకారి అవుతుందని శాస్త్ర కారుల అభిప్రాయం.

## ఇంగ్లీషుమాధ్యమం పుటుక

1835లో లార్డ్ బెంటింక్ ఐరోపాసాహిత్యం, విజ్ఞానం ఇండియావాసులలో పెంపొందించడమే బ్రిటిష్ ప్రభుత్వం ప్రముఖలక్ష్యంగా పేర్కొంటూ, విద్య

కోసం కేటాయించబడిన నిధులన్నీ కేవలం ఇంగ్లీషు విద్యపైనే సద్వినియోగం కాగలవన్నాడు. నిన్నమొన్నటిదాకా అదే కొనసాగుతూవచ్చింది. తనకు విశ్వాసపాత్రులైన భారతీయ కాలేదార్లను తరిఫీదు చెయ్యకపోతే, తన సామ్రాజ్యపు అస్తుల్ని నిర్వహించుకోడం అసంభవంఅని ఆయన స్పష్టంగాప్రకటించాడు. ఇక నాటి విద్యావిధాన నిర్ణేతగా లార్డుమెకాలే ఆశించిన భారతజాతి, అభిరుచులు, అభిప్రాయాలు, నీతి ప్రజ్ఞల విషయంలో ఆంగ్లేయులుగా రూపొంది, రక్తమూ రంగులలోమాత్రం ఇండియన్లుగా ఉండే స్థానికజనుల సముదాయం. ఆంగ్ల మాధ్యమం ఆశించిన ప్రయోజనాలను బాగాసిద్ధింపచేసింది.

## కొఠారీ కమిషన్ సిఫారసులు

కొఠారీ కమిషన్‌వారు ఈ సమస్యగూర్చి చెప్పిన మాటలు పరిశీలిద్దాం. "పరాయి మాధ్యమంలో జ్ఞానార్జన చెయ్యడంవల్ల విద్యార్థుల్ని విషయంపై ఆధిపత్యం సంపాదించేందుకు బదులుగా, వల్లెవెయ్యడం పైనే కేంద్రీకరించడం అనివార్యంచేస్తుంది. పాఠశాలలోను, ఉన్నత స్థాయిలోను విద్యామాధ్యమం సామాన్యంగా ఒకటే అయిఉండాలి. 1937కు పూర్వం కనీసం యీపరిస్థితివుండేది. నేడు పాఠశాలదశలో ప్రాంతీయభాషల్ని విద్యామాధ్యమంచేసి సముచిత చర్యతీసుకున్నాంగనుక, ఆపై దశల్లోకూడ వాని అధికప్రయోగం విస్తృతమనేది, ఆ చర్యను అనుసరించిరావాలి." ఇక జాతీయ సమైక్యతామండలి వివేచనకూడ చూడండి. ప్రజలకూ, వృత్తివనుల సాంకేతికుల విశ్వవిద్యాలయముల వారలకూ ప్రాంతీయభాషలద్వారా నిరంతరమైన అనుబంధాలేర్పడితేనే తప్ప, భారతీయ విశ్వవిద్యాలయ వ్యక్తులు, గరిష్ఠపురోగతికి దోహదం చెయ్యడం పొసగదు. విశ్వవిద్యాలయ స్థాయిలో బోధన మాధ్యమంగా ప్రాంతీయ భాషల్ని నియోగించనట్లయితే, దేశంలో ఉన్న ప్రతిభావికాసం తఱుగుముఖం పడుతుంది.

## తెలుగు పనికివస్తుందా మరి ?

పై చర్చవల్ల ప్రాంతీయభాషలే ఉన్నత విద్యామాధ్యమంగా నెలకొనాలని తేలుతుంది తెలుగుభాష విషయం ఇక వేరేచెప్పనక్కరలేదు. అస్పత్రి, లాంతరువంటి ఇంగ్లీషుపదాలు, తువ్వాలు మేజువాణి వంటి ఉర్దూపదాలు, అలమారు బొత్తాము వంటి ఐరోపీయాభాషా శబ్దాలు ఎంతచక్కగా తెలుగు మూసలో పోసి, ఒదిగి ఉన్నాయోచూస్తే ఈ భాషశీలనత అర్థం అవుతుంది.

ఐనా మన పండితులు కొందరు ఏ వ్యాకరణసూత్రాలకో విరుద్ధమంటూ నూతన పద నిర్మాణాన్ని నిరుత్సాహ పరచడంకూడదు. ఆంగ్లంలో క్లోరోఫిల్ అనేది ఒక గ్రీక్ ఒక లాటిన్ పదాల సమ్మేళనం. దీని అనుకృతిగా 'పత్రహరితం' రూపొందింది. ఇలాంటి రూఢశబ్దాల్ని మన నిఘంటుకారులు కూడ ఆహ్వానించాలి. ఉదాహరణకు ఈ వ్యాసంలో సంకేతికమైన అర్థంలో "మాధ్యమం'' అనే పదానికికాని, ప్రతిసామాన్య విజ్ఞాన శాస్త్రవిద్యార్థికి సుపరిచితమైన ఖనిజ శబ్దానికిగాని ఇంకా మన నిఘంటువుల్లో చోటియ్యకపోవడం నిజంగా శోచనీయం. అది తెలుగులాంటి జీవద్భాషపట్ల అపచారం అని మనవి చేస్తున్నాను. నవరూపనిష్పత్తి. అన్యభాషా విన్యాసాలు స్వకీయం చేసుకోగల సామర్థ్యం, నవీన అవసరాలను అనుగుణంగా సమన్వయపరగల దక్షత. క్రొత్తపోకడలఇముడ్చుకోగల స్తోమత గలభాషగా తెలుగు ఏనాడో నిలబడింది. వేలాది అన్య దేశములను చక్కగా తనమూసలో మలచుకోగల్గిన మనభాష విద్యామాధ్యమంగా కాని, అధికార భాషగా కాని నిస్సంశయంగా తగిఉంది. ఈత వచ్చిన తర్వాతనే నీటిలో దిగాలనే వితండవాదంకాని, ఎదిగి వచ్చేదశలో ఏదో సరిగాలేదని వంకలుపెడ్తూ అవరోధాలు కల్గించే ఛాందస విధానంగాని, ఈ విషమ పరిస్థితుల్లో మాతృభాషా బోధకమవుతుందనే మనవిచేస్తున్నాను. ఎదురుకల్గిన తర్వాత ఒదుగు అదే ఏర్పడుతుంటుంది. అనతికాలంలో ప్రభుత్వభాష, మాధ్యమమూ ఒకటవుతాయని అట్లాకావటం అధిక ప్రయోజనమని ఆశిద్దాం, అందుకోసం కృషిచేద్దాం.



# మారుతున్న భాష – వ్యాకరణము

శ్రీ ఎన్. సి. యస్. వేంకటాచార్యులు

వ్యాకరణం అంటే ఏమిటో ముందు తెలుసుకొంటే 1947 తరవాత వస్తున్న భాషకు వ్యాకరణం అవసరమా అనేవిషయం అంతుపడుతుంది.

వ్యాకరణం ఒకభాషలో ఉన్న వాక్యాల తీరుతెన్నులను వింగడించి చూపుతుంది. భాషకు ప్రమాణం వాక్యమేగాని పదంకాదు. ఒక వ్యక్తి తన అభిప్రాయం తెలిపేటప్పుడు ఒక్కొక్క భావాన్ని ఒక్కొక్క వాక్యంలో చెబుతాడు. ఆ వాక్యాన్ని సౌకర్యంకోసం పదాలుగా వింగడించడం జరుగుతుంది. వివిధవాక్యాలలో ఈ పదాలు ఉండే స్థానాలు వేరు. ఆ స్థానాలనుబట్టి పదాలలో మార్పులు జరుగుతూ ఉంటాయి. అట్లు ఆ పదాలలో ఎటువంటి మార్పులు జరుగుతూ ఉంటాయో గూడా వ్యాకరణం విడదీసి చెబుతుంది. అంటే ఆ పదాలలో మూలశబ్దమేదో ప్రత్యయాల పద్ధతి ఎలాఉంటుందో ఆ ప్రత్యయాలు చేరేటప్పుడు శబ్దంలో ఏమిమార్పులు జరుగుతాయి, ప్రత్యయంలో ఏమిమార్పులు జరుగుతాయి అని సూక్ష్మవిభజనచేసి వ్యాకరణం చూపుతుంది. వీటికి సంబంధించిన సూత్రాలను చెబుతుంది. ఈ సూత్రాలకూ వీటి లక్ష్యాలకూ కలిపి వ్యాకరణమని పేరు. ఈ వ్యాకరణం తయారుచేసిన వారికి వ్యాకర్తలని పేరు. వ్యాకర్తలకు ఎంతో సూక్ష్మేక్షిక అవసరం.

పైన జరిగిన చర్చనుబట్టి భాష లక్ష్యం; వ్యాకరణం లక్షణం. లక్షణమెప్పుడూ లక్ష్యాన్ని అనుసరిస్తుంది. లక్ష్యంలేనిదే లక్షణాని కవకాశమేలేదుగదా!

భాష ఎప్పుడూ ఏదేశంలోనైనా జనమంతా మాట్లాడుకునేది ఒకటి. రాతకి ఉపయోగించుకొనేది ఒకటి. మానవుడు అతివేగంగా ఆలోచించుకో గలిగినా, మాట్లాడేటప్పుడు కొంత తాపీతనం వస్తుంది. ఏది మాట్లాడితే ఆత్మశ్రేయమూ లోకశ్రేయమూ కలుగుతుందో అతను తాపీగా ఆలోచించుకొనే మాట్లాడతాడు. అందువల్ల ఆలోచనలోకంటే మాట్లాడటంలో కొంతవేగం తగ్గుతుంది. మాట్లాడే విషయాన్నే రాతకగ్గం చేసేటప్పుడు ఇంకాకొంత ఎక్కువ ఆలోచన కావలసి వస్తుంది. మాటకంటే రాత శాశ్వతంగా ఉండేది. ఫలాని ఆయన ఇలారాశాడూ

అవి ఆయన అనంతరం గూడా మనం చెప్పుకుంటాము. కనక మాట్లాడే భాషకూ రాసేభాషకూ మరికొంత అంతరం ఉంటుంది. అయితే ఈ అంతరం అన్ని దేశాలలోనూ వీలయినంత తక్కువగా ఉంటున్నది.

మన తెలుగుదేశంలో రాసే భాషకూ మాట్లాడేభాషకూ అంతరం ఎక్కువగా ఉంటూంది. దీనికి ముఖ్యమైన కారణం మనకు వ్యాకరణాలు ఎక్కువభాగం ఇటీవలి కాలంలోనే పుట్టినవి ఉండటమూ, అవీ కావ్యభాషకే పుట్టటమూను. మన నిఘంటువులకుకూడా కావ్యభాషే మూలం. అందుచేతే మనవాడుకలో మాటలే వాటిలో కనపడవు. రాతభాషలో కూడా కావ్యభాషవేరూ మిగిలినరాతల భాష వేరూను తిక్కన్నకాలంలో బయలుదేరిన ఆంధ్రభాషా భూషణం బహూచిన్నది. పైపై లక్షణాలు మాత్రమే తెలిపింది. ఆంధ్రశబ్ద చింతామణీ, వికృతివివేకం లాంటివి కేవలం కావ్యభాషకే ఏర్పడిన వ్యాకరణాలు. వచనరచన బాగా పెంగబోతున్న కాలంలో బయలుదేరిన బాలవ్యాకరణం పరిధి చాలా చిన్నది కావటమూ, అది ఆయనచెప్పుకొన్నా గమనించక అది వ్యాకరణంలో చివరిమాట అనుకొని దానిప్రకారం అచ్చుపుస్తకాలనన్నిటినీ దిద్దిన పండితులు మనదేశంలో ఎక్కువ కావటమూ మూలంగా మనకు మంచి వ్యాకరణం రావటానికి అవకాశం కలగలేదు తరవాత మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు రచించిన ఆంధ్రభాషానుశాసనంలో కొంత ముందుకువెళ్ళినా కావ్యదృష్టితోనే వెళ్ళటంచేత ఎక్కువ ఉపయోగించలేదు. కాగా మనకు వ్యాకరణంగాని, నిఘంటువుగాని కావ్యాన్ని వదలి భాషలో విహరించినవి లభించలేదనే చెప్పవచ్చు.

కావ్యభాషను వ్యాకరించి దానిప్రకారమే వచనం రాసుకోందనటం సాహసం. కావ్యానికుండే ఇబ్బందులు వేరు. దానికి పూర్వకాలంలో తప్పకుండా ఛందస్సుండేది. కనుకనే వారలు, వచ్చినారలు, వీళ్ళులు మొదలైన ప్రయోగాలు కుప్పతిప్పలుగా వచ్చివడ్డాయి. ఇవి వచనంలో వాడితే నవ్వుటాల పాలవుతాము. అయితే కొంతమంది పూర్వపు పండితులు అదేవ్యాకరణ సహితమైన భాష అనుకొని దానిలోనే వచనరచనలు కూడా చేశారు. వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగముండరాదనే వారిభావం. అంతేగాని వ్యాకరణ ప్రయోజనం వారు గుర్తించినట్టు కనపడదు.

కాలంమారింది. గురజాడవారు ఈ భాషానమస్యను తమ నెత్తిపైకివేసుకొన్నారు. అయినా వారూ కావ్యాలప్రయోగాలు పట్టుకొనే ప్రత్యర్థులపై దండయాత్ర చేశారు.

1947 సంవత్సరం భారతచరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించదగినకాలం. ఇంగ్లీషువారిపెత్తనంతొలగిపోయింది. మనకుఅంతకుముందున్నకట్టుబాట్లునడలిపో యినవి క్రమంగావచనరచనకు-నవల, నాటిక, చిన్నకథలకుప్రాముఖ్యంవచ్చినది. పద్యంలోకూడా ఛందో బందోబస్తులకు స్థానం సన్నగిల్లినది. క్రమంగా వచన పద్యాలకు ప్రచారం హెచ్చింది. ఈనాడు పద్యాలు రాసేవాళ్ళ సంఖ్య తగ్గి పోయింది. వచనపద్యమే నలుదిక్కులా వినపడుచున్నది. తెలుగు అకాడమీవచ్చి పాఠ్యపుస్తకాలను వాడుకభాషలో ప్రచురిస్తున్నది. మాండలిక భాషను రికార్డుచేసి దానిమీద జిల్లాలవారీగా పుస్తకాలు ప్రచురిస్తున్నది. ఇకతెౌద తొక్కిడిలో వెనక్కి పోయే ప్రమాదంలేదు.

కనక ఇప్పుడు వ్యాకరణం చెయ్యవలసిన పనిఏమిటి? ఈకాలంలో మాట్లాడేభాష రాతభాష ఎలానడుస్తున్నవి? ఈ విషయాలను పరిశీలన చేసి భాషా సమష్టిదృష్టి వ్యాకరణం తయారు చెయ్యాలి. ఈ వ్యాకరణ మనేది భాష పెద్దగా మార్పుచెందినప్పుడల్లా తయారు కావలసిందే. అది విద్యా ర్థులకూ, రచయితలకూ కూడా భాషతీరుతెన్నులు తెలపటానికి కావలసిందే.

ఎటువంటి ప్రయోగాలు నాగరికమైనవి? ఎటువంటివికావు? అనేసంగతి వ్యాకరణంవల్లనే తెలుస్తుంది. వ్యాకరణం ఒక్క కావ్యభాషకేగాక భాషాసమష్టికి తయారవుతుంది గనుక అది అన్నివిధాలైన రచనలకీ పనికివస్తుంది. మన తెలుగుభాష విస్తృతి పొందుచున్నది. గనుక దానిని చక్కగా వింగడించుకొని వ్యాకరణరచన చేసుకొంటే మనకు మనం మేలుచేసుకొన్న వాళ్ళమవుతాము.

ఇంకొకవిషయం అంతా గుర్తుంచుకోవాలి. వ్యాకరణం రాసినంతమాత్రాన భాషలో మార్పురావటం తగ్గిపోతుందనుకోటం మాత్రం భ్రమ. పాణినిలాంటి సూక్ష్మేక్షికగల వ్యాకర్త వ్యాకరణం రాసినతరువాత గూడా, సంస్కృతంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆ మార్పులు పాణీనీయానికి విరుద్ధాలయినందున తప్పన్న వారున్నారు. ఆ అభిప్రాయమే పొరపాటు. అయినా మార్పులు భాష వాడుకలో ఉన్నంతవరకూ రానేవచ్చాయి. భాష వాడుకలోనుంచి తొలగిపోయిన తరువాత మార్పులకు అవసరమూలేదు, అవకాశమూ ఉండదు. తెలుగు వాడుకలో ఉన్నంతవరకూ మార్పులు వస్తూనే ఉంటాయి. వ్యాకరణం అవసరమవుతూనే ఉంటుంది. వ్యాకరణం భాషను కుంటువడనియ్యదు. భాష యథేచ్ఛగా పెరుగు తూనే ఉంటుంది.

# భాషాకృషి

డా. చేకూరి రామారావు
శ్రీ పి. సి. నరసింహారెడ్డి

భాషాశాస్త్ర పరిధిని నిర్ణయించటం చాలా కష్టమైనపని. ఒక భాషను గురించి గాని లేక భాషలను గురించిగాని విజ్ఞానాన్నందించటానికి చేసే ఏ కృషి ఐనా భాషాశాస్త్రంలో భాగంగానే పరిగణించవచ్చు. ఆ పద్ధతిలో ప్రాచీన వ్యాకరణాల్ని గురించి చేసిన చర్చ, కావ్యాల్లో పాఠభేదాల్ని గురించి ప్రయోగ విశేషాల్ని గురించిన చేసిన చర్చ భాషాశాస్త్రంలో భాగంగానే నిజానికి పరిగణించాల్సి ఉంటుంది. ఐనా ఈ వ్యాసంలో వాటిని పరిగణనలోకి తీసుకోవటంలేదు. అందుక్కారణం వారు చేసిన కృషి అల్పమైనదిగా భావించటం కాదు. సమగ్రమైన పరిశీలనలో వాటి ప్రస్తావన తప్పనిసరి.

ఈవ్యాసానికి కాలపరిమితి కూడాఉంది. స్వాతంత్ర్యానంతరం జరిగిన భాషాకృషి మాత్రమే ఇందులో పరిశీలించబడుతుంది. స్వాతంత్ర్యావతరణకి భాషా శాస్త్ర కృషికి ప్రత్యేకమైన సంబంధముందని మేమనుకోవటంలేదు. కాలంలో ఎక్కడో ఓచోట గిరిగీసుకోవటం ఏ పరిశీలనకైనా అవసరమే కాబట్టి సంపాదకు లేర్పరచిన ఈ పరిమితి ఆమోదయోగ్యమైనదే.

తెలుగు దేశంలో స్వాతంత్ర్యానికి పూర్వంగాని తర్వాతగాని ద్రావిడ భాషలమధ్యన ఉన్న సంబంధాన్ని నిరూపించే ప్రయత్నం విశేషంగా జరిగింది. దాని విస్తారమైన పరిశీలన ఈ వ్యాసంలో మేము చేయబోవటంలేదు. అందులో తెలుక్కి అవసరమైనంతవరకే ఇక్కడ పరిశీలించబడుతుంది. వాటి సమగ్రమైన పరిశీలన వేరె వ్యాస విషయం.

ఈ వ్యాసపరిధి ఇది. ఆధునిక భాషాశాస్త్ర పద్ధతిలో తెలుగు భాషను గురించి ప్రత్యేకంగా జరిగిన పరిశోధన. మళ్ళీ ఇక్కడ చిక్కుంది. ఆధునిక భాషా శాస్త్రమంటే కూడా నిర్వచించటం కష్టమే. ఈ వ్యాసంలో వాస్తవానికి కొంత విరుద్ధమైన (chomsky) యుగానికి పూర్వపు భాషా విజ్ఞానం కూడా ఆధునిక భాషాశాస్త్రంగా పరిగణిస్తున్నాము. భాషాశాస్త్రానికి సంబంధించిన సిద్ధాంత కృషిచేసిన తెలుగు వారెవరూలేరు కాబట్టి తెలుగు భాషా లక్షణాన్ని గురించి జరిగిన కృషి ఈ వ్యాసంలో ప్రధానాంశమౌతుంది.

భాషాశాస్త్ర అవసరాలు మాకు తెలిసినంతవరకు మొదటిసారిగా గుర్తించినవారు గిడుగు రామ్మూర్తిపంతులుగారు. సవరభాషావ్యాకరణనిర్మాణంకోసం ఆయన తన కాలానికి అందుబాటులో ఉన్న శాస్త్ర విషయాల్ని అధ్యయనం చేశారు. తెలుగుభాషను గురించికూడా ఈయన శాస్త్రపద్ధతిలో ఆలోచించారనటానికి ఆధారాలున్నయ్. (చూ. [గిడుగు సీతాపతి - గతకాలపుస్మృతులు, కృష్ణాపత్రిక, 1960). 1908, 1909, 1910 సంవత్సరాలలో విశాఖపట్నంలో జరిగిన ఉపాధ్యాయుల సమావేశంలో భాషనుగురించి శాస్త్రీయ దృక్పథాన్ని వ్యాప్తిచేయటానికి ఆయన కొన్ని ప్రసంగాలు చేశారు. 1913 లో డేనియల్ జోన్స్ (Daniel Jones) అనే ప్రఖ్యాత ధ్వనిశాస్త్రజ్ఞుడు మద్రాసులో కొన్ని ఉపన్యాసా లియ్యటానికి వచ్చినప్పుడు తెలుగుభాషలో కొన్ని ధ్వనులను గురించి తాను పరిశీలించిన అంశాలను జోన్స్‌తో చర్చించారు. నేటి తెలుగులో మనం రాతలో సూచించే ప్రతిఅచ్చుకు రెండు రకాల ఉచ్చారణ ఉంది. ఆ ఉచ్చారణ భేదాన్ని గ్రహించటానికి ఈ క్రింది మాటల జంటలు ఉదాహరణగా తీసుకోవచ్చు.

పిట్టు — పిట్ట మెట్టు — మెట్ట పుట్టు — పుట్ట పొట్టు — పొట్ట
పీకు — పీక మేకు — మేక గూడు— గూడ గోడు — గోడ

పై మాటల జంటల్లో మొదటి పదంలోని మొదటి అచ్చుకు రెండో పదంలోని మొదటి అచ్చుకు ఉచ్చారణభేద ముంది. మొదటి పదాల్లోనివి సంవృతాచ్చులు. రెండో పదాల్లోనివి వివృతాచ్చులు. ఈసంవృత వివృతభేదం పరాక్షరంలోని అకారంవల్ల ఏర్పడింది.

రామ్మూర్తిగారు కనుక్కున్న ఈ విషయాన్ని సరైనదే నని జోన్స్ అంగీకరించారు. అయితే వ్యావహారికభాష ప్రయోజనాన్ని స్థాపించటానికే రామ్మూర్తిగారు తన శక్తుల్ని వినియోగించవలసి రావటంవల్ల ఈ పద్ధతిలో ఆయన విశేషమైన కృషి చేయటానికి అవకాశం లేకపోయింది. పైసంఘటన వల్ల ఆయన్ని ప్రథమాంధ్ర భాషా విజ్ఞానిగా గుర్తించవలసి ఉంటుంది.

ఆ తరువాత చాలాకాలంవరకు తెలుగుభాషపై శాస్త్రపరిశీలన జరిగినట్టు ఆధారంలేదు కోరాడ రామకృష్ణయ్యవంటివారు కాల్డ్వెల్ (Caldwell)రచించిన ద్రావిడవ్యాకరణం ఇచ్చిన ఉత్సాహంతో తెలుగుభాషపై చారిత్రకపరిశీలన చేశారు. రామకృష్ణయ్యగారి 'సంధి' అందులో ఒక మైలురాయి.

గంటి జోగి సోమయాజులుగారి'ఆంధ్రభాషావికాసము'భారతస్వాతంత్ర్యా

వతరణం ఒకేసారి జరిగినయ్. ఆంధ్రాయూనివర్సిటీలో తెలుగు ప్రొఫెసర్‌గా ఉంటి భాషాశాస్త్రాధ్యయనానికి ప్రోత్సాహమిచ్చారు. తెలుగు ద్రావిడభాషా జన్యమే అనే కాల్డ్వెల్ సిద్ధాంతానికి వీరు మరికొన్ని ఉపపత్తులను ఈగ్రంథంలో చూపించారు. తెలుగుభాషలో ధ్వనులలోను వ్యాకరణాంశాలలోను వచ్చిన మార్పుల్ని ఈగ్రంథంలో విస్తారంగా చెప్పారు. ఈనాటిదృష్టితో చూస్తే సోమయాజులుగారి పరిశీలన అంత సంతృప్తి నియ్యనిమాట నిజమే, అయినా అనేక చారిత్రకాధారాల్ని బహుకాలం వ్యయప్రయాసలకు లోనై ప్రోగుచేసిన పరిశ్రమ ఈ గ్రంథంలో మనకు కనిపిస్తుంది.

నేటి తెలుగుదేశంలో భద్రిరాజు కృష్ణమూర్తిగారిపేరు భాషాశాస్త్రానికి పర్యాయపదంగా వాడబడుతున్నది. అంతర్జాతీయంగానే వేళ్ళమీద లెక్కించదగిన ద్రావిడ భాషావేత్తల్లో కృష్ణమూర్తిగారు ఒకరు. సర్వపండితవేద్యమైనవీరి ద్రావిడభాషాపరిశోధనని వివరంగా ప్రస్తావించటానికి ఇది చోటు కాదు.

Telugu verbal bases (తెలుగు క్రియాప్రాతిపదికల చారిత్రక వర్ణనాత్మక పరిశీలన) అనే గ్రంథంలో తెలుగుక్రియలన్నిటికీ చారిత్రకంగా మూలరూపాల్ని ఇతరభాషల ఆధారంతో నిర్మించారు. దానితోపాటు తెలుగులో జరిగిన ధ్వనులమార్పును కూలంకషంగా పరిశీలించారు. తెలుగుభాషకు వర్ణనాత్మక వ్యాకరణరచనకు మొదటిసారి దారి నేర్పరచింది వీరే. ప్రాచీన, ఆధునిక ఆంధ్రభాషలో క్రియాధాతువులు, అవి గ్రహించే ప్రత్యయాలను వాటి ప్రవర్తనను బట్టి వీరుచేసిన విభాగం ఇప్పటికీ ప్రామాణికంగానే పరిగణించబడుతున్నది. నేటితెలుగులో (కోస్తా జిల్లాల భాష ఆధారంగా) సంధిస్వరూపాన్ని 'Sandhi in modern colloquial Telugu' అనే వ్యాసంలో (1957) వీరు పరిశీలించారు. సంహితలో పూర్వాచ్చు లోపించి పరాచ్చు మిగలటం పూర్వ వ్యాకర్తలు గుర్తించిందే. రెండు వ్యంజనాల మధ్యన అచ్చు లోపించటం అందువల్ల వ్యంజనాల్లో వచ్చేమార్పును ఈవ్యాసంలో మొదటిసారిగా సూత్రబద్ధం చేశారు. ఏ వ్యంజనాలమధ్య అచ్చు లోపిస్తుందో అచ్చు లోపించిన తరువాత వ్యంజనాల్లో ఏమార్పులు జరుగుతాయో ఈ వ్యాసంలో చూపించారు, ఈ వ్యాసంలో నేటితెలుగుభాషకు వర్ణనిర్ణయం కూడా చేశారు, పరిసరభేదాల్ని అనుసరించినవాటి ఉచ్చారణభేదాల్ని ఈవ్యాసంలో ఏర్పరచారు. (ప్రాచీన భాషకు వర్ణనిర్ణయం Verbal bases లలో చేశారు.)

'Compound verbs in Telugu' అనే వ్యాసంలో (1964) భిన్న

ధాతువులు ఒకే క్రియాప్రాతిపదికగా ఏర్పడే విధానాన్ని, ఆ ప్రాతిపదికలో ధాతువుల సంఖ్యాపరిమితిని పరిశీలించారు. మాట నిలబెట్టుకోలేకపోతున్నాడు. అనేది క్రియలో మాట నిల బెట్టు కో లేక పో అనేది ప్రాతిపదిక. ఈ ప్రాతిపదికలో మాట అనే నామధాతువును వదిలేస్తే 5 క్రియాధాతువు లున్నయ్. ఇది తెలుగులో క్రియాప్రాతిపదికలో వచ్చేధాతువుల గరిష్ఠసంఖ్య. ఈవ్యాసంలో పరివర్తన వ్యాకర్తలు పాటించే సూత్రపద్ధతిని పాటించారు. తెలుగుక్రియలను వాక్యంలో ప్రవర్తించే విధానాన్నిబట్టికూడా కొన్ని విభాగాలు చేయవచ్చు. అందులో స్థితిబోధక క్రియలు (Statives), అస్థితి (గత్యాదులు–non - stative) బోధకక్రియలు అనేవి ఒకవిభాగం. తెలుసు, ఎరుగు, ఉండు వంటివి స్థితిబోధక క్రియలు. వీటి ప్రవర్తనను 'Stative expressions in Indian languages' అనే వ్యాసంలో (1970) పరిశీలించారు. స్థితిబోధక క్రియల్లో జ్ఞానగ్రహణ క్రియలు ఇంకో విభాగం. తెలుగులో తెలుసు, ఎరుగు, వచ్చు అనేవి అట్లాంటివి. ఇవి వాక్యాల్లో ప్రవర్తించే తీరును 'Verbs of cognition in Telugu' అనే వ్యాసంలో (1970) పరిశీలించారు.

ప్రేరణ, అప్రేరణ అనే విభాగం ప్రాచీన వ్యాకర్తలు గుర్తించిందే. ఈ భేదానికి స్థితి అస్థితి భేదానికి ఉండే సంబంధాన్ని 'Causative Constructions in Indian languages : Some Semantic and Syntactic aspects, అనే వ్యాసంలో (1970) వీరు పరిశీలించారు. 'Bilingualism and Social dialects in Telugu' అనే వ్యాసంలో (1972) పరిహరించగలిగిన ఇంగ్లీషు పదాల్ని వాడటంకన్న పరిహరించగలిగిన సంస్కృతపదాల్ని వాడటం ఆమోద యోగ్యమైన లిఖితవ్యవహారంలా కనిపిస్తున్న దని గుర్తించారు. ఈనాడు విద్యావంతులు సన్నిహిత వ్యవహార రంగంలో పరిహరించగలిగిన చోట కూడా ఇంగ్లీషు పదాలు, వాక్యాలు విశేషంగా వాడుతున్నా రన్నది మాకు తెలుసు. అయితే లిఖితవ్యవహారంలో పరిస్థితి భిన్నంగా ఉంది.

పైవన్నీ వీరు ఇంగ్లీషులో రాసినవి. 'భాష–వ్యాకరణం', 'ధ్వని–వర్ణం', 'తెలుగులో వర్ణసమామ్నాయం' అనే వ్యాసాలు (1959) 'పదం – పదాంశం' అనే వ్యాసం (1970) వీరు కొన్ని భాషాశాస్త్ర విషయాల్ని తెలుగువారికి తెలుగులో చెప్పటానికి ఉద్దేశించి రాసినవి.

తెలుగుదేశంలో వివిధ వృత్తులవారి వాడుకలో ఉన్న వృత్తి పదాలు

శాస్త్రీయ పద్ధతుల్లో సేకరించి వింగడించటానికి ఒక ప్రణాళికను సిద్ధంచేసి మాండలికవృత్తి పదకోశాన్ని (1962) నిర్మించారు. ఈరకమైన కృషి భారత దేశంలోనే ఇది మొదటిది. తర్వాత వృత్తిపదకోశ సంపుటాలకు వీరు పెట్టిందే ఒరవడి. ప్రధానారోపనిర్ణయం, అర్థనిర్ణయం. రూపాంతర ఉచ్చారణ భేదవిభాగం తొలిసారిగా ఈ కోశంలో చేయబడింది. చదువుకున్నవారి భాషకు చదువుకోని వారిభాషకు ఉన్న ఉచ్చారణ భేదాల్ని కొన్ని అంశాలుగా ఈవృత్తిపదకోశంలో వీరు నిరూపించారు. ఈ సంపుటంలోని వ్యవసాయపదాల వ్యవహారభేదకరేఖలు ఆధారంగా తెలుగు వ్యవహారమండలాల్నికూడా వీరు ఇందులో ఏర్పరచారు. వీరి సంపాదకత్వంలోనే వృత్తిపదకోశం (చేనేతపదాలు) ద్వితీయ సంపుటం కూడా (1971) వచ్చింది. ఈ సంపుటానికి సహాయకుడు పోరంకి దక్షిణా మూర్తిగారు.

తెలుగుమాండలికాలు : 'కరీంనగరంవాడుక' అనేవ్యాసంలో (1970) వ్యవసాయ వృత్తిపదకోశంలో ప్రతిపాదించిన విషయాన్ని విస్తృతపరచారు. ఇందులో రాయలసీమలో వ్యవహరించే రూపాల్ని (చేసిండు, చేస్తడు)స్వరగ్రహ స్వీకరణ సూత్రం ద్వారా సాధించారు. ఈ వ్యాసంలో తెలుగులో జరుగుతున్న మాండలిక పరిశోధన ఆవశ్యకతను, అనుసరించదగిన సూత్రాలను పొందు పరచారు.

కోరాడ మహదేవశాస్త్రిగారు క్రీ. పూ. 300 నుంచి క్రీ. శ. 1000 వరకు తెలుగుభాషా చరిత్రను శాసనాలు, ఇతర ఆధారాలతో 'Historical grammar of Telugu' అనే పిహెచ్. డి., గ్రంథంగా (1961) రూపొందించారు. క్రీస్తుశకంలో మొదటి సహస్రాబ్దాన్ని వీరు పరిమితిగా నిర్ణయించుకున్నా తర్వాతికాలంనుంచి నేటివరకు వివిధ భాషాంగాల్లో జరిగిన మార్పులను కూడా శాసనాలు, ప్రాచీన కావ్యాలు, ప్రాచీనవ్యాకరణాలు, కావ్య సంప్రదాయేతర గ్రంథాలు ఆధారంగా పరిశీలించారు. తెలుగుభాషా చరిత్రకు వీరు యుగ విభజన చేశారు. క్రీ. పూ. 600 _ 300 వరకు చరిత్ర పూర్వయుగం, క్రీ. పూ. 300 నుంచి క్రీ. శ. 1000 వరకు ప్రాచీనాంధ్రయుగం. క్రీ. శ. 1000_1600 వరకు మధ్యాంధ్రయుగం, క్రీ. శ. 1600 నుంచి నేటివరకు ఆధునికాంధ్రయుగం. వీరి పుస్తకం అచ్చయింది 1969 అయినా రచనాకాలం 1961 ప్రాంతం. తెలుగుభాషా చరిత్రను గురించి మనఅవగాహన ఈ పుస్తకం

వల్ల సోమయాజులుగారి ఆంధ్రభాషావికాసం నాటికన్నా విస్తృతమౌతుంది. ఈ వ్యాసకర్తలు పరిశీలించని శాస్త్రిగారి వ్యాసాలు కొన్ని ఉన్నయ్.

తెలుగులో అన్యభాషాపదా లంటే తూమాటి దోణప్పగారు గుర్తుకొస్తారు. తెలుగుభాషలో చేరిన వివిధ భాషాపదాలను గురించిన చారిత్రకాంశాలమీద దోణప్పగారి నిర్ణయాలు ప్రామాణికం వారి'వైకృతపద స్వరూప నిరూపణము' తెలుగులోని వైకృత శబ్దాల సర్వస్వమే. తెలుగులో ప్రాచీన వ్యాకరణాల్లో తత్సమ, తద్భవ విభాగం చాలా అస్పష్టమైనది. దోణప్పగారు ప్రాకృతసమ ప్రాకృతభవాలను సంస్కృతసమ, సంస్కృతభవాలనుంచి వేరుచేశారు, వైకృతపదం అంటే ఏమిటో వీరు నిర్వచించారు. సంస్కృత, పాకృత ఆంధ్ర భాషల సంబంధాల్ని గురించిన విపులమైన పరిశీలన వీరి గ్రంథం. ఇదికాక వీరు తెలుగులో వివిధ పత్రికల్లో ప్రచురించిన వ్యాసాలు కేవలం పేర్కొనాలన్నా ఇక్కడ చోటు చాలదు. తెలుగు భాషలో పోర్చుగీసు పదాలు ప్రవేశించినతీరు, హకారాదిపదాల పుట్టుపూర్వోత్తరాలు, నన్నయ నన్నచోడులు కవిద్వయంలో అన్యదేశ్యాభాసాలు, మరాఠీలో ప్రవేశించిన తెలుగు మాటలు, తెలుగులోనే కృతకప్రామాణిక రూపాలు ఏర్పడిన రీతులు మొదలైనవి వీరు వ్యాసాల్లో చర్చించిన అనేక విషయాల్లో కొన్ని. నన్నయ 'ఏనూరు గాదీలు' అని గాదీ అనే ఉర్దూమాటకు ఉపయోగించలేదని, ప్రక్క, వ్రేల్చు అనే పదాలలో రేఫంకృతకంగా వచ్చిందని (>పఖ-ప్రాకృతం),కుసిని, బొత్తాము, ఇస్త్రీ, కమీజు అని నేటి తెలుగులో వాడుతున్న ఈ మాటలకు పోర్చుగీసు భాషాపదాలు మూల మని వీరు ప్రతిపాదించిన కొన్ని ఆసక్తికరమైన విషయాలు. వీరు చేసిన గ్రంథాల కెక్కని ఒక కృషికూడా ఇక్కడ వ్యాసక్తం చేయాల్సింది. భాషాశాస్త్రాన్ని తెలుగులో బోధిస్తూ వీరెన్నో పరిభాషాపదాల్ని సృష్టించారు. వ్యవసాయ వృత్తిపదకోశానికి వీరు సహసంపాదకత్వం వహించి ఒక విభాగానికి పూర్తిగా బాధ్యత వహించారు. వస్త్రవృత్తిపదకోశానికి వీరు సంపాదకత్వం నిర్వహిస్తున్నారు.

శాస్త్రీయమైన పద్ధతుల్లో తొలిసారిగా తెలుగులో అర్థవిపరిణామాన్ని అర్థ నిర్మాణాన్ని పరిశీలించినవారు జి. యన్. రెడ్డిగా పరిచితులైన గోళ్ళ నారాయణస్వామిరెడ్డిగారు. 'A Study of Telugu Semantics' అనే సిద్ధాంత గ్రంథంలో (1966) ప్రాచీనాధునిక శాస్త్రవేత్తల సిద్ధాంతాలను పరిశీలించడమే కాకుండా తెలుగులో అర్థ పరిణామరీతుల్ని వివరించారు. తొడు, తల, పసి/పచ్చ

శబ్దాల ఆర్థిక విశ్లేషణ ఎంతో ఆసక్తిదాయకంగా చేశారు. విదేశాల్లో తెలుగు భాషలు బోధించిన అనుభవాన్ని పురస్కరించుకొని తెలుగు నేర్చుకొనే విద్యార్థులకోసం ఒక వార్తాపత్రికల Reader ను ఒక ఆధునిక కథల Reader ను డ్యాన్‌మాట్సన్ (Dan Matson) అనే ఆయనతో కలిసి సంపాదక బాధ్యతలు నిర్వహించి ప్రచురించారు. ఈ పుస్తకాలకు విపులమైన వ్యాకరణ వివరణ, అకారాది పట్టికలుకూడా ఉండటం ఇంకో విశేషం. తెలుగులో భాషాశాస్త్రాన్ని బోధించటానికి తగిన పరిభాషను వీరుకూడా ఎంతో కల్పించారు. వడ్రంగం, కమ్మరం, కుమ్మరం వృత్తులపదకోశానికి సంపాదకత్వం వహిస్తున్నారు.

తెలుగు రానివారికి తెలుగు నేర్పటానికి మొదటిపుస్తక (1963) రాసిన గౌరవం మలిస్కర్ దైనా (Leigh Lisker)ఎక్కువప్రయోజన కరమైన పుస్తకాన్ని -A basic course in modern Telugu తయారుచేసిన (1961) గౌరవం భద్రిరాజు కృష్ణమూర్తిగారిది (పులిగడ్డ శివానందశర్మ దీనికి సహగ్రంథకర్త). కెల్లీగారి (Gerald Kelley) అధ్వర్యంలో కోర్నెల్ యూనివర్సిటీలో ఒక బేసిక్‌కోర్స్ తయారవుతున్నట్లు తెరియవస్తున్నది. కేరళ యూనివర్సిటీ భాషాశాస్త్ర విభాగంలోను, మైసూరులోని Central Institute of Indian languages లోనూ తెనుగు బోధించటానికి ఇంటెన్సివ్ కోర్సులు తయారుచేశారు. కేరళవారు–Telugu-An intensive course అనే పేరుతో పుస్తకరూపంలో ప్రచురించారు. రచయిత యస్. శివరామమూర్తి.

క్రీ. శ. 200 నుంచి క్రీ. శ. 1100 వరకు దొరికిన శాసనాల ఆధారంగా బూదరాజు రాధాకృష్ణగారు 'A historical grammar of early Telugu' అనే పరిశోధన గ్రంథాన్ని (1963) రచించారు. 11 వ శతాబ్దివరకు వ్యవహారంలో ఉన్న భాషాచరిత్రను తెలుసుకోవటానికీ, కావ్యభాషకు వ్యవహారభాషకు గల అంతరాన్ని గ్రహించటానికీ ఈగ్రంథం ఉపకరిస్తుంది. ఆనాటిలేఖనసంప్రదాయాల పరిశీలన, తెలుగు వ్యక్తినామాల, గ్రామనామాల, గౌరవవాచకాలపరిశీలన ఆసక్తిదాయకంగాచేశారు. మాండలికవృత్తి పదకోశం (వాస్తుపదజాలం) నాల్గవ సంపుటానికి (1969) సంపాదకత్వబాధ్యతను నిర్వహించారు. ఇటీవలే 'ప్రాచీనాంధ్ర శాసనాలు' అనే గ్రంథాన్ని ప్రచురించారు. శాసనశబ్దకోశం శాసనభాషలోని వ్యాకరణాంశాలమీద సంక్షిప్తమైన వ్యాసం ఇందులోనివిశేషం. 'Diglossia in Telugu' అనే వ్యాసంలో (1971) కావ్యభాషమీద దాడి సంప్రదాయవాదులైన పండితులలోనే కొందరు ప్రారంభించా రని తెలుపుతూ కావ్యభాష ఏనాడూ వ్యవహారంలో లేదని శాసనాధారాలు చూపించారు.

క్రీ శ. 12, 13, 14 శతాబ్దుల శాసనాల ఆధారంగా కందప్పచెట్టిగారు 'Historical grammar of the Telugu Inscriptions of the 12th, 13th, 14th, century A. D' అనే చారిత్రక వ్యాకరణాన్ని నిర్మించారు. ఇది కోరాడ మహదేవశాస్త్రిగారి పర్యవేక్షణలో వచ్చిన సిద్ధాంతగ్రంథం. శాసనభాషా పరిశీలనతోపాటు తెలుగుభాషకు సంబంధించిన చారిత్రకాంశాలు ఎన్నో పొందుపరచారు. వీరు తెలుగులో 'రు' అనే బహువచన ప్రత్యయాన్ని గురించి చారిత్రకపరిశీలన చేశారు. 'History of 'R' in Telugu' అనే పేరుతో (1963) తెలుగులో రకారపరిణామం గురించి వ్యాసం రాశారు. కోరాడ మహాదేవశాస్త్రి, బూదరాజు రాధాకృష్ణ, కందప్పచెట్టిగారల గ్రంథాలు ఆయా శతాబ్దుల వ్యవహార భాషాస్వరూపాన్ని తెలుసుకోవటానికి, తెలుగుభాషకు చారిత్రక వ్యాకరణాన్ని నిర్మించటానికి మనకున్న మంచి ఆధారాలు.

తిక్కన రచనలు ఆధారంగా 'A study of Telugu compounds' అనే సిద్ధాంత గ్రంథాన్ని (1966) జాస్తి సూర్యనారాయణగారు రచించారు.

పి. యస్. సుబ్రహ్మణ్యంగారిది ప్రధానంగా తులనాత్మక పరిశీలన 'Long vowels before Y in Telugu' అనే వ్యాసంలో (1970) ఇతర ద్రావిడభాషల్లో హ్రస్వాచ్చు తెలుగులో యకారానికి ముందు దీర్ఘమయిందని ప్రతిపాదించారు. ఈ మార్పు ప్రాచీనభాషలో కావ్యభాషగా చలామణి అయిన మాండలికంలో జరిగిందని (చేయి) వ్యవహారంలో హ్రస్వస్వరూపాలు యకార ద్విత్వంతో కనిపిస్తున్నాయని (చెయ్యి) చూపించారు. అయితే ప్రేరణార్థక ప్రత్యయాల ముందుమాత్రం నిల్చిఉన్న దీర్ఘరూపాలు (చేయించు) ఇంచ్ - ప్రత్యయంలో అది వకారం లోపించడంవల్ల లోపదీర్ఘత చెంది ఏర్పడినవని నిరూపించటానికి ప్రయత్నించారు. అయితే దీనికి చారిత్రకాధారాలు చూపించలేదు.

భాషాశాస్త్ర పరిశోధనలో యుగవిభజన అంటూ చేయాల్సివస్తే కృష్ణమూర్తి పూర్వయుగం, కృష్ణమూర్తి యుగం, కృష్ణమూర్తి తరువాతియుగంఅని చేయాల్సివస్తుంది. ఈ పైనపేర్కొన్న పరిశోధకులలో ఒక సామాన్యాంశం ఉంది. పై పరిశోధనంతా ఏదోరకంగా (కృష్ణమూర్తిగారి బహుముఖ వ్యక్తిత్వాన్ని ఇక్కడ అపవాదంగా చెప్పుకోవాలి) తెలుగు భాషాచరిత్రకు సంబంధించినది. కోరాడ రామకృష్ణయ్య, గంటి జోగి సోమయాజులు ప్రభృతులు కృష్ణ

మూర్తి పూర్వయుగంలోవాళ్ళు. ఈ యుగంలో ప్రధానాంశం ద్రావిడభాషల పరస్పర సంబంధ పరిశీలన. కృష్ణమూర్తియుగంలో చెప్పినవాళ్ళు కృష్ణమూర్తి గారికి మిత్రులో శిష్యులో అయినవారు.

కృష్ణమూర్తియుగంలో ప్రధానాంశం శాస్త్రీయమైన చారిత్రక పరిశోధన, కొంత వర్ణనాత్మక పరిశోధన.

అనంతరయుగంలో ఇంతకు ముందటియుగంలో లక్షణాలు సాగుతూనే ఉన్నా కొన్ని కొత్తఅంశాలుకూడా చోటు చేసుకున్నాయి. అందులో ప్రధానంగా చెప్పుకోవలసింది తెలుగువాక్య నిర్మాణాన్నిగురించి ఆలోచించటం. ఇది చేకూరి రామారావుతో ప్రారంభమైంది. 1955_68 సం॥ల మధ్యకాలంలో నామ్నీకరణాలకు సంబంధించిన పరిశోధన చేశారు. ఆ పరిశోధన ఫలితాలు 1968 లో 'A transformational study of Telugu' అనే Ph.D., గ్రంథంగాను ఆ తరువాత కొన్ని మార్పులతో తెలుగులో నామ్నీకరణాలు వ్యాసాలుగాను వచ్చాయి.

ఒక వాక్యం ఇంకోవాక్యంలో నామబంధంగా ప్రవర్తించే తీరు నామ్నీకరణం. వీటిలో విషయార్థక, సందేహార్థక, ఇత్యర్థక, కాంక్షార్థక, వ్యాపారార్థక, లుప్తవిభక్తిక నామ్నీకరణాలపేర్లతో 'భారతి' లో వ్యాసాలుగా (1968) అచ్చయినయ్. వాటన్నింటినీ ఇక్కడ వివరంగా చర్చించడానికి వీలుపడదు. 'Direct, and indirect reports : A hypothesis concerning the universals of language' అనే వ్యాసంలో (1967) తెలుగులో ప్రత్యక్షపరోక్ష కథనాల్ని గుర్తించాలని ప్రతిపాదించాడు. ఇవి మానవభాష లన్నింటిలోను ఉండిఉండాలని ఊహచేశాడు. 'Coordination or subordination' అనే వ్యాసంలో (1971) తెలుగులోనేకాక ఇతర ద్రావిడభాషల్లోకూడ క్త్వార్థకక్రియ ఏఏ పద్ధతుల్లో ప్రవర్తిస్తున్నదో పరిశీలించారు, 'Causal use of quotative morpheme in Dravidian' అనేవ్యాసంలో ( ? ) అని శబ్దం హేత్వర్థకం ఎట్లా అవుతుందో నిరూపించారు. ఒక సంశ్లిష్టవాక్యంలో మొదటి వాక్యాంశం (clause) అని శబ్దంతో ఉంటే హేత్వర్థం కావాలంటే పదవాక్యాంశంలో (main clause) కర్త మనుష్యవాచకమై ఉండాలని. అందులో క్రియ ఆకర్తృ స్వాధీనంలో ఉండాలని ఈ వ్యాసంలో ప్రతిపాదించారు. 'Some aspects of coordination in Telugu' అనే వ్యాసంలో ( ? ) తెలుగు సముచ్చయ వాక్యాల పద్ధతుల్ని వివరించారు. ఇవికాక 'A grammatical sketch of

Telugu' అనే చిన్న వ్యాకరణ గ్రంథంలో (1969) తెలుగుభాషలో ధ్వని, పద, వాక్యనిర్మాణాల్నిగురించి స్థూలమైన చర్చ చేశారు. ఈ Sketch లో తెలుగుధ్వనుల నిర్మాణాన్ని గురించి Generative Phonology పద్ధతిలో రాసిన సూత్రాలున్నయ్. ఈ పద్ధతిలో జరిగిన మొదటికృషి ఇదే. 'తెలుగులో బహువచన రూపనిష్పత్తి' అనే వ్యాసంలో (1970) ఆధునికాంధ్రంలోని బహువచననామాలను నియతక్రమ సూత్రాల (ordered rules) సహాయంలో వ్యాకరించారు. తెలుగులో ఒకేసారి క్రమంగా దగ్గరలో ఉన్న రెండక్షరాల్లో వ్యంజనాలమధ్య స్వరలోపానికి అవకాశం ఉన్నప్పుడు కొన్నిచోట్ల పూర్వాచ్చు లోపించటం, కొన్నిచోట్ల పరాచ్చు లోపించటం కనిపిస్తుంది.

కోటు + లు + లేవు -> కోట్లులేవు

కోట + లు + లేవు -> కోటల్లేవు

మొదటి ఉదాహరణలో పూర్వసంధి వ్యాకరణ సమ్మతం. రెండో ఉదాహరణతో పరసంధి వ్యాకరణ సమ్మతం. వీటికి తాను ప్రతిపాదించిన బహువచన నిష్పాదన సూత్రాల్లో వర్ణనియత సూత్రాలవరస పరిసరాలు కారణంగా నిరూపించారు.

వ్యాకర్తలు ప్రాచీనులైనా నవీనులైనా సూత్రీకరణలో భాషలోని వ్యవహార భేదాల్ని పక్కకు నెట్టేస్తూ వచ్చారు. వ్యవహార భేదాలన్నిటికి సూత్రాలు రాయడం సాధ్యపడదని వారివాదం. తెలుగులో మాండలికభేదాలను సూత్రబద్ధం చేయడానికి ప్రయత్నించిన తొలివ్యక్తి రామారావుగారు. తన sketch లో తెలంగాణ హ్రస్వరూపాలనుండి రాయలసీమ దీర్ఘరూపాలేర్పడ్డాయని (చేసినమ్ -> చేసినాము. కృష్ణమూర్తిగారు దీర్ఘరూపాలనుండే హ్రస్వరూపాలేర్పడ్డాయని ప్రతిపాదించారు. రామారావుగారి ప్రతిపాదన చారిత్రకదృష్టితో చూస్తే అంగీకారయోగ్యం కాకపోవచ్చు), భూతకాలిక ప్రత్యయంలో నకారం లోపించటంవల్ల కోస్తామండలాల్లోనిరూపాలు ఏర్పడ్డాయని ( చేసినాము. చేస్ + ఇనా + ము -> చేస్ + ి అ + ము (నకారలోపం) -> చేస్ + ఏ + ము -> చేశేము) ప్రతిపాదించారు. అయితే నకారం ఆ పరిసరంలో ఎక్కడ భాషలో లోపించటం లేదు. కనుక ఈ ప్రతిపాదన సమర్థనీయం కాదని తనే దాన్ని త్రోసిపుచ్చారు. కాని భాషా పర్యటన పరిశోధనలో గమనించిన అంశాలను క్రోడీకరించి నకారం అనునాసిక్యంగా మారి తరువాత పూర్తిగా లోపించిందని ఈమార్పు ఒక క్రమంలో జరిగినదిగా పి. సి. నరసింహా

రెడ్డి 'మిశ్రమవ్యవహారమండలం : కొన్ని విశేషాలు' అనే వ్యాసంలో (1972) నిరూపించారు. రామారావుగారు తెలుగులో రాసిన వ్యాసాలు మరిరెండు ఉన్నాయ్. వ్యాకరణ మూలంగా భిన్నార్థబోధకాలైన వాక్యాలను కొన్నిటిని తీసుకొని అభిన్నార్థబోధకత ఎట్లా వచ్చిందో 'వ్యాకరణశ్లేష' అనే వ్యాసంలో (1969) చెప్పారు. 'భాషాశాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం' అనే వీరివ్యాసం (1971) పరివర్తన సిద్ధాంత మూల సూత్రాలను తెలుగు పాఠకులకు ఎరుక పరచటంకోసం రాసింది. భద్రిరాజు కృష్ణమూర్తిగారి వర్ణము (phoneme), ధ్వని (phone), పదాంశము (morpheme), అనే పారిభాషిక పదాలు వ్యాప్తి లోకి వచ్చినట్లే ప్రతిభ (competence), ప్రవృత్తి (performance) నామ బంధం (noun phrase), క్రియాబంధం (Verb phrase), గుప్తనిర్మాణం (deep structure), వ్యక్తనిర్మాణం (surface structure), నామ్నీకరణం (nominalization) వంటి పారిభాషిక పదాలు ఈ వ్యాసం ద్వారా తెలుగు భాషలో వ్యాపించినయ్.

'వచన పద్యం : అభాస లక్షణనిరాకరణం' ప్రధానంగా ఛందస్సుకు సంబంధించిన వ్యాసమే అయినా (1972) ఛందస్సులో లయస్ఫురణకు ఊనిక, పదాంశవిరామము నిర్వహించే పాత్రను గురించి కొన్ని సూచనలు చేశారు.

ఆధునికాంధ్ర భాషలో వాక్యనిర్మాణాన్ని గురించి ఇంకా కృషి చేస్తున్న వారిలో పేరి భాస్కరరావుగా రొకరు, 'A Grammar of Telugu causative constructions' అనే వ్యాసంలో (1971) అకర్మకక్రియల నుంచి సకర్మకక్రియలను నిష్పాదించే విధానాన్ని సూచించారు. 'వంచు' వంటి ఏకక్రియల సకర్మకత్వానికి 'పంగగొట్టు' వంటి క్రియాద్వంద్వంలో సకర్మ కత్వానికి గల తేడా చూపించారు. 'On the syntax of Telugu existential and copulative predications' అనే వ్యాసంలో (1971) తెలుగులో 'ఉండు, అగు' అనే క్రియల తత్వాన్ని అర్థపరంగాను, వాక్యనిర్మాణ పరంగాను పరిశీలించారు. 'Pronouns and pronominal compounds in Telugu' అనే వ్యాసంలో (1971) సర్వనామాలతత్వాన్ని పరిశీలించారు. నామవాచకానికి బదులుగా వాడేది సర్వనామం అయినట్లయితే తెలుగులో సర్వ నామాలు లేవు అనేది వీరి ప్రతిపాదన. ఉత్తమ మధ్యమపురుష సర్వనామాలు నామబంధానికి బదులుగా వచ్చేవి కావని వీరు పేర్కొన్న అంశం అంత కొత్త దేమీ కాదనుకుంటాను. ఇది ఒక తెలుగుభాషకే పరిమితమైంది కూడా కాదు.

ప్రథమపురుష సర్వనామాల్ని వాక్యాలనుంచి నిష్పాదించాలని వీరు చేసిన ప్రతిపాదన చిత్రమైంది. 'On delimitation' అనే వ్యాసంలో (1971) ఒక శబ్దం అనిర్దిష్టార్థంలోనేకాక నిర్దిష్టార్థంలో కూడా ప్రయుక్తమౌతుందని చూపించారు.

తెలుగు ధ్వనుల నిర్మాణాన్ని ఇంగ్లండ్‌లో ప్రచురంగా ఉన్న Systemic పద్ధతిలో వివరించిన గౌరవం వెన్నెలకంటి ప్రకాశంగారికి దక్కింది. తెలుగు భాషలోని Phonematic units Prosodic Processes ను ఇంకా స్వరం, ఊనికవంటివాటిని వీరు విపులంగా పరిశీలించారు. ఆధునికాంధ్రంలో నామాల్లోను, క్రియల్లోను కనిపించే స్వరసమతను తమ పరిశోధనగ్రంథంలో వీరు పరిశీలించారు.

కోర్నెల్ యూనివర్సిటీలో జి. సాంబశివరావుగారు తెలుగు క్రియల్లో వ్యావహారిక గ్రాంథిక భేదాల్ని నిరూపిస్తూ 'Telugu Verb literary and colloquial' అనే M.A., thesis (1969) రాశారు. డ్యూక్ యూనివర్సిటీలో ర్యాలి రాజగోపాలరావుగారు తెలుగు బంధుత్వ బోధక పదాల ఆర్థిక విశ్లేషణ ద్వారా సమాజాధ్యయనం చేస్తూ 'Semantic analysis of Telugu Kinship terminology' అనే Ph.D., thesis ను (1970) రాశారు. ఇలినోయ్ యూనివర్సిటీలో కె. వి. సుబ్బారావుగారు తెలుగుమీద పరిశోధన చేస్తున్నారు. వారు Varieties of Telugu'(1970) 'Some Phonological changes in Telugu' (1971) 'Vowel harmony in Telugu and Parentheses and infinite rule schemata notations' (1972) అనే వ్యాసాల్ని రాశారు. అవి అముద్రితాలు.

యన్. శివరామమూర్తిగారు పూనా యూనివర్సిటీలో నేటి శిష్ట భాషా లక్షణాన్ని వివరిస్తూ 'Telugu grammar, a descriptive study of modern literary language' అనే Ph.D., thesis ను (1968) రాశారు.

'ఆంధ్ర శాసన సారస్వతము లందలి ఉర్దూ, మరాఠీ పదములు (క్రీ. శ. 1800 వరకు)' అనే సిద్ధాంత గ్రంథాన్ని లకంసారి చక్రధరరావుగారు దోణప్పగారి మార్గా న్ననుసరించి రాశారు. తెలుగులో కనిపించే ఉర్దూ మరాఠీ మాటలకి సమీపమాతృకలను తెలుగులోకి ప్రవేశించినప్పు డేర్పడే ధ్వని మార్పులను వీరు ఇందులో సూచించారు. ఈ శబ్దాల్లో అర్థ విపరిణామాన్ని కూడా పరిశీలించారు. ఈయన ప్రచురించిన 'భాషా శాస్త్ర వ్యాసములు

అనే వ్యాససంకలనం విద్యార్థుల నుద్దేశించి రాసినట్టు కనిపిస్తుంది. ఈ వ్యాసాల్లో కొంత తొందరపాటు, అపరిణతి కనిపిస్తుంది.

పై మార్గంలోనే వచ్చిన (1971) ఇంకో సిద్ధాంత గ్రంథం శ్రీ రామ శాస్త్రిగారి 'మెకంజీ తెలుగు సంకలనములలోని ఉరుదూ, మరాఠీ, ఒరియా పదములు'. ప్రతిదేయశబ్దాలమీద (ఈ పారిభాషిక పదం 'loan word' అనే మాటకు దోణప్పగారు సృష్టించిందే) వచ్చే ఈ సిద్ధాంత వ్యాసాలకు ఒరవడి దోణప్పగారిదే. పై రెండు సిద్ధాంత గ్రంథాలు ఆంధ్రా యూనివర్సిటీ నుండి Ph.D., డిగ్రీని సంపాదించినయ్.

శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలో జి. యన్. రెడ్డిగారి దర్శకత్వాన కొన్ని చక్కని సిద్ధాంత గ్రంథాలు వెలువడ్డయ్. అందులో కె. నాగభూషణ రావుగారి 'A descriptive analysis of Nannaya's usage' అనేది (1964) ఒకటి. ఇందులో నన్నయ భాషలోని శబ్దాలను పరిశీలించటంతోపాటు జాతీయాలను కూడా పరిశీలించారు. నన్నయ తరువాతి కవులభాష నన్నయ నుంచి ఎట్లా భేదించిందో తెల్సుకోవటానికి ఈ గ్రంథం ఉపకరిస్తుంది. సమకాలిక శాసనభాషను కూడా పరిశీలించటంవల్ల కావ్య సంప్రదాయానికి వ్యవహారానికి ఉన్న భేదం కూడా తెలుస్తుంది.

జి. యన్. రెడ్డిగారి దర్శకత్వంలో వచ్చిన ఇంకొక పరిశోధన గ్రంథం యల్. బి. శంకర్రావుగారి 'A study of language of Nannechodadeva's Kumarasambhava' నన్నెచోడుడి కుమారసంభవం భాషాపరిశోధకులకు ఆసక్తికరమైనది. కవిత్రయంవారి పద్ధతికి భిన్నం కావడంవల్లే ఇది భాష విషయంలో ముఖ్యమైనది. కుమారసంభవ భాషను పరిశీలించటంతోపాటు దీనికి నన్నయ పూర్వపు భాషకి, నన్నయ భాషకి ఉన్న సంబంధాన్ని భేదాన్ని కూడా నిరూపించటానికి ప్రయత్నించారు.

తెలుగులోకి ఇంగ్లీషు పదాలు ప్రవేశించినప్పుడు జరిగిన మార్పుల్ని చక్కని సూత్రపద్ధతిలో చెప్పిన (1971) సిద్ధాంత గ్రంథం అక్కిరెడ్డిగారి 'A study of English loans in Telugu'. దీనికి జి. యన్. రెడ్డిగారిదే దర్శకత్వం.

తెలుగు దేశపు గ్రామనామాల్ని గురించి జి. యన్. రెడ్డిగారి దగ్గర ప్రస్తుతం కేతు విశ్వనాథ రెడ్డిగారు పరిశోధన చేస్తున్నారు. 'తెలుగు ఊర్ల పేర్లయందలి అనుబంధ రూపములు - ఒక నమూనా పరిశీలన' అనే వ్యాసం ఒకటి

(1966) వీరు ఇదివరకే ప్రకటించారు. తెలుగు ఊళ్ళ పేర్లలోని ప్రత్యయ భాగాలమీద (మద్రి వద్రుమొ॥) పరిశోధన వ్యాసం ఒకటి (1957) నాయని కృష్ణకుమారి గారు 'తెలుగు ఊర్ల పేర్లు' అనే పేరుతో ప్రకటించారు.

ఇస్మానియా యూనివర్సిటీలో భద్రిరాజు కృష్ణమూర్తి గారి పర్యవేక్షణలో పి. స్వరాజ్యలక్ష్మి తెలుగుభాషపై ఉర్దూ ప్రభావాన్ని గురించి పరిశోధన చేస్తున్నది.

రాజపాళెయం తెలుగు మీద యన్. కుమారస్వామి రాజా అన్నామలై యూనివర్శిటీలో పరిశోధన చేస్తున్నారు. ఆ పరిశోధన ఇంకా పూర్తయి నట్లు లేదు.

ఈ వ్యాసకర్తల్లో ఒకరైన పి.సి. నరసింహారెడ్డి ఇటీవలి ద్రవిడియన్ కాన్ఫరెన్స్‌లో చదివిన 'An approach to the description of dialects' అనే వ్యాసంలో (1972) తెలుగు వ్యవహార భేదాల్ని పరిశీలించటమేకాక వాటి పరస్పర సంబంధాన్ని నిరూపించటానికి ఒక క్రొత్తమార్గాన్ని సూచించే ప్రయత్నం చేశారు. భాషాంతర సామాన్యాలేకాక అంతర్భాషా సామాన్యాల ప్రాధాన్యాన్ని వివరించారు. 'తెలుగు వ్యవహార మండలాలు: ఒక పరిశీలన' అనే వ్యాసంలో (1971) తెలుగు క్రియారూపాల్లో కాలబోధక ప్రత్యయాలన్నిటిలో కనిపించే వ్యవహార భేదాల వ్యవహార విస్తృతి పరిమితు లను పరిశీలిస్తే ఈ వ్యవహార భేదాలు ప్రాంతీయ విభజనగానేగాక సాంఘిక విభ జనను కూడా తెలుపుతా యని నిరూపించారు. ఇంతకు ముందే ప్రస్తావించిన 'మిశ్రభాషా మండలం: కొన్ని విశేషాలు' అనే వ్యాసంలో తెలుగుక్రియల్లో జరిగే వర్ణసమీకరణ విధానం ప్రాంతీయ, సాంఘిక విభజనను తెలుపుతున్న దని నిరూపించారు. పై వ్యాసాల్లో తెలుగుభాష సమగ్ర స్వరూపాన్ని దర్శించ టానికి ప్రాంతీయ, సాంఘిక వ్యవహార భేదాల్ని సూత్రబద్ధం చేయాల్సిన అవశ్యకతను వివరించటం ప్రధానాంశం.

తెలుగుభాషకు వర్ణనాత్మకవ్యాకరణం నిర్మించాలనే బృహత్సంక ల్పంతో తెలుగు అకాడమీ మాండలిక పరిశోధనకు పూనుకొన్నది. 'తెలుగు మాండలికాలు' అనే పేరుతో జిల్లాలవారీగా డయలెక్ట్ బులిటిన్స్ కూడా వచ్చి నయ్. వాటిని అక్కడి పరిశోధకులు పి. సి. నరసింహారెడ్డి (కరీంనగర్, కడప), అబ్బిరాజు శ్రీహరి (విశాఖపట్టణం), శ్రీ గిరిజరాజు శంకరమోహన రావు (గుంటూరు) రూపొందించారు. ఈ సంపుటాలకు బూదరాజు రాధాకృష్ణ

గారు సంపాదకులు. 'తెలుగుమాండలికాలు కరీంనగర్ వాడుక' వ్యాసంలో భద్రిరాజు కృష్ణమూర్తిగారు భాష సమాజం ఎట్లా సహరూపాంతరతను ప్రదర్శి స్తాయో నిరూపించారు. ఈ bulletins లో పరిశోధకులు భాషలోని వ్యవహార భేదాల్ని పరిశీలించి పైఅంశాన్ని చర్చిస్తూ వ్యాసాలు రాశారు. వ్యవహర్తల వ్యవహారం ఖండికలతోపాటు వాటిలోని వ్యాకరణాంశాల వివరణ కూడా ఈ సంపుటాలలో పరిశోధకులు చేర్చారు. మొదటి మూడు bulletins లో మాండ లిక భేదాల్ని పరిశీలిస్తూ రాధాకృష్ణగారు రాసిన వ్యాసాలున్నయ్. వులిగడ్డ శివానందశర్మ కరీంనగరులో సేకరించిన సమాచారం ఆధారంగా ఇతర పరిశో ధకులు ఆయా జిల్లాల్లో సేకరించిన సమాచారం ఆధారంగా చిన్న వ్యాకరణ గ్రంథాలు తయారు చేస్తున్నారు.

తెలుగుభాషమీద పాశ్చాత్యులు చేసిన కృషికూడా ఉంది. లిస్కర్ (Leigh Lisker) రాసిన Introduction to Spoken Telugu అనే పుస్తకం విషయం పూర్వమే ప్రస్తావించాము. స్యోబర్గ్ (Andr'ee Sjoberg) తెలుగు ధ్వనుల నిర్మాణంమీద (The problem of a Telugu dialect) అనే Ph. D., thesis ను (1957) రచించింది. ఆమె రాసిన Coexistant Phonemic systems in Telugu' అనేవ్యాసం (1962) సన్నిహిత (informal), ప్రత్యేక (formal) వ్యవహారరంగాలలోను శిష్టశిష్టేతర వ్యవహారంలోను కనిపిస్తున్న భిన్నధ్వని నిర్మాణాల్ని చూపించింది. 'Evidence for a locative case in Telugu' అనే వ్యాసంలో (1969) తెలుగులో అధికరణార్థాన్ని సూచించే విభక్తిప్రత్యయాన్ని ప్రతిపాదించారు. ఈమె ఇంకా 'Telugu personal names : a structural analysis' అనేవ్యాసాన్ని (1968), 'The role of aspect in the Telugu simple verb' అనే వ్యాసాన్ని (1967) కూడా రచించింది. ప్రస్తుతం రాయలసీమ భాషమీద పరిశోధన చేస్తున్నారు.

కెల్లీ (Gerald Kelly) తెలుగుభాషమీద ఎక్కువ కృషిచేసిన అమె రికన్. 'Telugu Vowel phonemes' అనే వ్యాసంలో (1959) రామ్మూర్తి గారు గుర్తించిన సంవృత వివృత స్వరోచ్చారణ భేదాన్ని వర్ణభేదాలుగా గుర్తించాలని ప్రతిపాదించారు. 'Vowel phonemes and external vocatic sandhi' అనే వ్యాసంలో (1963) తన మొదటి ప్రతిపాదన వదలుకొని కొన్నివర్గాలవరకు ప్రసరించే వివృతత్వాన్ని, తాలవ్యత్వాన్ని వేరుచేసి వాటి

పృథగ్వ్యక్తిత్వాన్ని కల్పించారు, ఈయనరాసిన 'A grammar of Telugu' అనే వ్యాకరణం మ్యానుస్క్రిప్టను 1963 లో తయారుచేశారు. అది అప్పుడే అచ్చైఉంటే బాగుండేది. ఇప్పు డందులో కొన్ని విషయాలు కాలదోషం పట్టినయ్.

తెలుగుభాషమీద Texas University లో స్యోబర్గ్ పర్యవేక్షణలో కొంత పరిశోధన జరిగింది. మాంట్‌గోమరీ (Stephen E. Montgomery) తెలుగుక్రియావిశేషణాలమీద 'The Telugu adverb' అనే M. A., thesis ను (1963) రాశారు. వెల్స్ (Ernest S. Wells) అనే ఆయన 'The inflection of nominals in Telugu' అనే M. A., thesis ను (1964) రాశారు. (Ieanell B. Botton) 'Noun predicates in Telugu' అనే Ph. D., dissertation ను (1971) రాశారు. ఈ పరిశోధనకు గ్రంథాల కన్నింటికి దర్శకత్వం శ్రీమతి Sjoberg దే.

Pennsylvania Uninersity లో బేయర్ (Curnelius von Bayer) అనే ఆయన తెలుగు కారక నిర్మాణం మీద 'Towards a case garmmar of Telugu' అనే M. A., thesis ను (1969) రాశాడు. తెలుగు సర్వనామాల్లో గౌరవ బోధకతల అంతరువుల్ని 'Telugu deference' అనే ఇంకో వ్యాసంలో (1970) వివరంగా పరిశీలించారు.

California University కి చెందిన ప్రే (Bruce Pray) అనే ఆయన తెలంగాణా తెలుగుమీద ఇటీవలే (1972 లో) కొంత పరిశోధన చేసి తెలుగు క్రియా నిర్మాణంమీద 'Telangana Telugu: Verb structure and morphology' అనే పెద్ద వ్యాసాన్ని, దక్కన్ ఉర్దూ-తెలంగాణా తెలుగుమీద 'Evidence for grammatical convergence of Deccani Urdu and Telugu' అనే ఇంకో వ్యాసాన్ని రాశారు. అవింకా అముద్రితాలు. ఇట్లా ఇంకా చాలామంది పరిశోధన చేస్తున్నవారు ఉండవచ్చు.

రష్యాలో గూరొవ్ (Nikita Gurov) లెనిన్‌గ్రాడ్ యూనివర్శిటీ తెలుగు శాఖాధ్యక్షులుగా ఉండి తెలుగుభాషపై విశేషమైన కృషిచేస్తున్నట్టు, చేయిస్తున్నట్లు తెలుస్తున్నది. కాని వివరాలు తెలియరావటంలేదు. పెత్రూని చెవా (Z. Petrunicheve) అనే ఆమె చాలాకాలం కిందటే ఒక చిన్ని వ్యాకరణాన్ని రష్యన్ భాషలో రాసింది. అది 1960 లో 'Telugu language' అనే పేరుతో అచ్చయింది. మిసెస్ స్వెత్లానా జేనిత్, మిసెస్ పెత్రూనిచెవా, నికితా

గూరొవ్‌గార్లు కలిసి 'తెలుగు-రష్యన్ నిఘంటువు' ఇటీవలే (1972) ప్రచురించారు. ఈ నిఘంటువుకు అనుబంధంగా ఒక సంక్షిప్త తెలుగు వ్యాకరణం వివరణనుకూడా స్వెత్లానా జేనిత్, నికితా గూరొవ్‌గార్లు చేర్చారు. ఇదీ రష్యన్ భాషలోనే ఉంది.

మొత్తంమీదచూస్తే తెలుగు భాషపై శాస్త్రపద్ధతిలో పరిశోధన ఒక మాదిరిగా జరుగుతున్నట్లే కనిపిస్తున్నది. కాని విశిష్టులైన పరిశోధకులు తగినంత సంఖ్యలో తయారు కాకపోవటం ఇంకా తెలుగుభాష దురదృష్టమే. ముఖ్యంగా హిందీమీద, తమిళంమీద జరిగిన భాషా పరిశోధనతో పోలిస్తే తెలుగుభాషమీద జరిగిన పరిశోధన ఏ మూలకీరాదు. ఈ పరిస్థితి మెరుగుపడాలంటే కొన్ని లోపాలు పూరించాల్సి ఉంది. ఒకటి: భాషాశాస్త్ర ప్రధానాంశాలను బాగా ప్రచారం చేసి తెలివైన విద్యార్థులకు ఈ శాస్త్రంమీద అభిరుచి కలిగేలాగా చేయాలి. రెండు: తెలుగుదేశంలో-మూడు విశ్వవిద్యాలయాలలోను భాషాశాస్త్ర పరిశోధనను ప్రోత్సహించటానికి తగిన సహకారం లభించాలి. మూడు : భాషాశాస్త్రాధ్యయనం ధనవంతులు ఉబుసుపోకకు చదువుకునే విషయంగా కాక తద్వారా జీవనోపాధికి మార్గంకూడా లభించేట్టుగా భాషాభిమానులు ప్రయత్నించాలి. ఇక ఆఖరుగా, సమర్థులైనవారు ప్రయోజనాపేక్షను కొంతవరకైనా పక్కకుబెట్టి అడ్డదారులకోసం ఆలోచించకుండా నిజమైన శాస్త్రపరిశోధన చేయటానికి పూనుకోవాలి. అందాకా మనభాషాపరిశోధన స్థితి ఇంతే. ఈ పరిస్థితి మెరుగుపడుతుందని ఆశిస్తున్నాము.





మహతి

# ప్రస్తారం

స్వాతంత్ర్యయుగోదయంలో
వివిధసారస్వతశాఖాప్రస్తారం

| | | |
|---|---|---|
| ిత్రలు | * | డా. వేటూరి ఆనందమూర్తి |
| | * | శ్రీ ప్రతాప వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి |
| | * | శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి |
| | * | డా. శ్రీమతి నాయని కృష్ణకుమారి |
| ్యం | * | శ్రీ వేలూరి సహజానంద |
| | * | డా. భీమసేన్ 'నిర్మల్' |
| | * | శ్రీమతి ఎ. లక్ష్మీరమణ |
| | * | డా. ఎం. కులశేఖరరావు |
| రచనలు | * | డా. మహీధర నళినీమోహన్ |
| | * | శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావు |
| | * | శ్రీ తాళ్ళూరు నాగేశ్వరరావు |
| | * | శ్రీ పన్యాల రంగనాథరావు |
| వ | * | శ్రీ ఆచంట సూర్యనారాయణ మూర్తి |
| న | * | శ్రీ తురగా కృష్ణమోహన్‌రావు |
| పాదకీయాలు | * | శ్రీ పరాంకుశం దామోదరస్వామి |
| విధ శీర్షికలు | * | శ్రీమతి కె. రామలక్ష్మి |
| ర్టూనులు-జోకులు | * | శ్రీ సుధామ |
| థ | * | శ్రీ వి. చెంగయ్య |
| మంచి | * | శ్రీ ఎమ్వీయల్ |
| సెక్సు | * | శ్రీ రాంషా |

❀

# ఆత్మకథలు - జీవితచరిత్రలు

డా. వేటూరి ఆనందమూర్తి

"చుట్టూరా ఆవరించుకునివున్న చీకటిని తిట్టుకొంటూ కూర్చోవడంకంటె ప్రయత్నించి ఎంతచిన్నదీపా న్నయినా వెలిగించడం మంచి" దన్న నుడితో ముడివేసుకొని ముందడుగు వేస్తున్న 'యువభారతి' చేతలకు, తలపోతలకు 'మహతి' ఒకఅక్షరాకృతి. అది ఆధునికవాఙ్మయక్రీడారంగాన వెలిగి, వెలిగించే అఖండజ్యోతి.

ఈయుగోదయంలో ప్రభవించిన చైతన్యాన్ని తూచి వెలకట్టడంకోసం 'మహతి' ఒకకాలపరిమితిని కల్పించుకొన్నది. కాని దానినుండి వెలువడి ముందువెనుకలు పర్యాలోచించుకొన్నప్పుడు తప్ప ఆవిషయం మన కందుబాటులోకి రాకపోవచ్చు. ఎందుకంటే పూర్ణాయుష్యంతో, పరహితబుద్ధితో జీవనరంగాన పెరిగి పండబారిన జీవితాలుగాని చిత్రితాలు కావుగదా ! కాబట్టి తత్కాలలేశంలో ఏది ప్రభవించినా అది ఒకపురుషాయుషకాలాన్ని ప్రతిబింబించేదిగా వుంటుంది. పర్యాలోచనలో గతం బహుసమ్మాన్యమైన వర్తమానమై భవిష్యత్తుకి ప్రాణప్రతిష్ఠ చేసేలాగ పరిణమించడం మన మాహనీయుల జీవితాల్లో చూస్తాం. కనుక ఆముందువెనుకల, ప్రాతకొత్తల మేలుకలయికను మదింపు వేయడానికి వ్యాసశీర్షిక కొకింత వ్యాప్తికల్పించుకోవలసివుంటుంది. ఇందులో 'వెలువడిన' అనేదానికి వ్రాయబడినవి (ప్రజ్ఞాప్రభాకరము - 1949), వ్రాయబడుతున్నవి (భారతరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరిగారి స్వీయచరిత్ర 1972); అచ్చువేయింపబడినవి (దేశభక్త కొండ వెంకటప్పయ్యగారి స్వీయచరిత్ర 1952), పునర్ముద్రింపబడినవి (శ్రీరామకృష్ణలీలామృతము 1957, శ్రీవివేకానందసంపూర్ణగ్రంథావళి 1961), విస్తరింపబడినవి (శ్రీవీరబ్రహ్మేంద్రస్వాములవారి సంపూర్ణచరిత్ర - జవంగుల నాగభూషణదాసు 1971, తొలికూర్పులు 1927, 1932), సంగ్రహింపబడినవి (మహాకవిగురజాడ - లత. నగారా పబ్లికేషన్సు 1941), క్రోడీకరింపబడినవి (గురజాడవారి రచనలు 4, 5 వాల్యుంలు 1958), సంగ్రహంగా పేర్కొనబడినవి. (ఆంధ్రవిజ్ఞానసర్వస్వసంపుటాల్లో క్లుప్తంగా పేర్కొనబడినజీవితాలు గరికిపర్తి కోటయ్యదేవర, బ్రౌను, రావిచెట్టు రంగారావుప్రభృతులు పలువురివి 1959), అనువ

దింపబడినవి (చరితార్థుడు - మార్క్వ్ కన్లిఫ్ 1958 లో ప్రకటించిన జార్జి వాషింగ్టన్ దివ్యజీవితానికి శ్రీధనికొండ హనుమంతరావు అనువాదం 1961), చలనచిత్రరూపంలో చిత్రింపబడినవి (పోతన, రామదాసు వంటి చిత్రాలు): - అని ఇట్లా అనేకవిధాల వ్యాప్తి కల్పించుకోవలసి వుంటుంది. ఇంతకూ చెప్ప వచ్చిందేమిటంటే అది ఎవరిచరిత్రయైనా, ఎప్పటికథయైనా ఈకాలవేళంలో ఏతీరుగా 'వెలువడి'నా, ఈకాలంలో వర్ధిల్లినవారితో ఏమాత్రం ప్రత్యక్ష సంబంధముండినవారిదైనా అది మనపరిశీలనలోకి రావలసి వుంటుం దని మాత్రమే. అంటే, శ్రీఅవ్వారి వాసుదేవశాస్త్రి రచించిన అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి మహోదయులజీవితం 1944 లోనే ప్రకటితమైనా తరువాత విజ్ఞానసర్వస్వం మూలంగానూ, పదునైదవశతాబ్దికి చెందిన తాళ్ళపాక అన్నమాచార్యుని కథైనా వారిజీవితం సంగ్రహింపబడిన నేటిపాఠ్యగ్రంథాలమూలంగానూ మనదృష్టికి తగిలితీరుతుందని; రెంటాల సుబ్బారావుగారు తమకథ తాము వ్రాసుకోక పోయినా ఆకాలపుస్వీయచరిత్రకారులందరూ ఏదోఒకసందర్భంలో వారిని పేర్కొన్నవారే; కథలో కథగా తమ సూర్యనారాయణీయం (1936)లో వల్లూరి సూర్యనారాయణరావుగారు రెంటాలవారినిగూర్చి సగంపుస్తకమే వ్రాశారు. వారికే అంకిత మిచ్చారు. కనుక సమకాలపువారి కెంతో ఉత్తేజ మిచ్చిన వారిజీవితాన్నిమాత్రం మనం స్మరించకుండా ఎలావుండగలం? కనుక ఒక్కమాటలో అనాలంటే తెలుగులో వచ్చిన జీవితచరిత్రలు - ఆత్మకథలు అన్నీకూడా సమీక్షించాలన్నమాటే. అది ఇంతలో సాధ్యమా? విషయం విస్తృతమైనదీ; వ్యాసపరిమితి చిన్నదీ కావడం చేతనూ; పుస్తకప్రపంచం విశాలమైనదీ, నాశక్తిపరిమితమైనదీ కావడం చేతనూ – నేనుచూచినవాటినీ, చూచినవాటిల్లోనూ ఇప్పుడు నాకందుబాటులో వున్నవాటినీ మాత్రమే ఉదాహరిస్తూ రామబాణంలా ఈవ్యాసవిషయాన్ని దూసుకుపోవలసి వుంటుంది.

మనమిప్పుడు సమీక్షిస్తున్న జీవితచరిత్రలవంటి రచనక్రియలో నూతన వికాసం ఈఇరవయ్యోశతాబ్దిలోనే జరిగిం దనిచెప్పవచ్చు. జీవితచరిత్రలు ముందు వచ్చినరచనలు. ఆతరువాతివే ఆత్మకథలు. కందుకూరివారు, చిలకమర్తి వారు ప్రారంభించిన జీవితచరిత్రరచన ఒకఉద్యమంగా విస్తరించి తెలుగున విభిన్నరూపాల నందుకొన్నది. కవిజీవితాలమీదినుండి సంఘసంస్కర్తల మీదికి, ఆమీద రాజకీయవాదులమీదికి, క్రమంగా దృష్టి మరలింది. తగురచనలూ వెలిశాయి. గాంధిమహాత్ముని ఆత్మకథలో తద్రచనా వికాసం పరాకష్ఠ

నందుకొన్నది. ఆపైన తత్ప్రభావం అందరిరచనలమీద పడింది. పందల కొలదిగా పుస్తకాలు వెలువడ్డవి. ఏమైనా ఈరంగంలోనూ వీరేశలింగంగారి తోనే నూతనవికాసం ఆరంభమైనదని చెప్పాలి. విక్టోరియారాణి జీవితాన్ని చిత్రించడంలోనే కాక జీవితచరిత్రరచనప్రక్రియలోనే నూతనత్వాన్నితెచ్చిన కందుకూరివారిని ఆంగ్లంలో సుప్రసిద్ధజీవితచరిత్రకారుడైన లిట్టన్‌స్ట్రాచేతో పోలిస్తే తప్పు లేదనుకొంటాను.

ఆత్మకథలు - జీవితచరిత్రలు అన్నరచనలు వాఙ్మయంలో చారిత్రిక రచనావిభాగానికి చెందినవి. కాని, ఒకవిధంగా అవి కేవలం చరిత్రలూ కావు, కట్టుకథ లంతకన్నా కావు అనవలసివుంది. వీటిల్లో విస్తరింపబడినవస్తువు ఒక్కవ్యక్తియొక్క జీవితవివరణమేకాబట్టి అది చరిత్ర కాదనీ, వాస్తవమైనదీ యథార్థంగా జరిగినదీ కాబట్టి అది కట్టుకథ కాదనీ మనం త్రోసిపుచ్చినా ఆరచనల్లో చరిత్రకారునిసత్యదృష్టి కథాకారుని కళాదృష్టి రెండూ మేళవించి వుండడంవల్ల ఇవి ఆరెండింటిసమ్మేళనరూపా లనవలసివుంటుంది. అందుకే వాటిని మనం (ఆత్మకథలు - జీవిత) చరిత్రలు అని చమత్కారంగా అనుకొంటున్నాము.

వీటిల్లో ఏకాలంలోనైనా జీవితచరిత్రలకంటే ఆత్మకథలే తక్కువ సంఖ్యలో వ్రాయబడతాయి. కారణం విదితమే. వ్రాసుకోవాలని లోన వున్నా అనేకకారణాలవల్ల చాలమంది ఆత్మకథలు వ్రాసుకోరు. వ్రాసుకోవలసినవారూ ఏకొద్దిమందోమాత్రమే వుంటారు. కనుక తీరా వ్రాసుకొనేవారు ఇంకా కొద్దిమందిమాత్రమే మిగులుతారు. పోతే జీవితచరిత్రలవిషయం అలాకాదు. ఎవరో మరొకరు వ్రాస్తారుకాబట్టి ఆబాధ లేదు. వ్రాస్తామంటే వద్దనేవారు కొంద రున్నా వారితర్వాతనైనా ఆకథవ్రాయబడి (మాస్టర్. సీ. వీ. వీ. గారు శిష్యులను తమ కథ వ్రాయవల దని అన్నారట — కాని తర్వాత వ్రాయడం జరిగి) తీరుతుంది కాబట్టి — అలా వ్రాసితీరవలసినవారివీ, ఇంకా వ్రాయించుకోవాలని ఉబలాట పడేవారివీ వెరసి ఇవే చాలా అధికంగా వుంటాయి.

ఏమైనా ఈరెండువిధాలైన రచనల వెనుకా ప్రేరణ పలువిధాలుగా వుంటుంది. ఆత్మకథల్లో ఆత్మశోధన ప్రేరకం కావచ్చు (గాంధీగారి ఆత్మకథలోవలె); లేదా ఆవ్యక్తి చెరిగిన మిత్రులప్రోద్బలమో వ్రాసేశక్తి తమ కుండడమో కావచ్చు (చిలకమర్తివారి స్వీయచరిత్ర మునగాలరాజాగారు, అడవి శంకరరావుగారు కోరకపోయినా, విస్సా అప్పారావుగారు, రాయసం

వేంకటశివుడుగారు పూనుకోకపోయినా వారిస్వీయచరిత్ర - బహుశః వెలువడేదే కాదేమో !); లేదా ఆత్మసమర్థనకోసం కావచ్చు (కందుకూరివారి స్వీయచరిత్ర), లేదా తమకథ తరువాతివారికి మార్గదర్శకం కాగలదన్న విశ్వాసం కావచ్చు (టంగుటూరి ప్రకాశంపంతులుగారి, ఆచంట లక్ష్మీపతిగారిస్వీయచరిత్రలు); లేదా గతస్మృతులమాధుర్యాన్ని నిరంతరం క్రోలుతుండాలనే కోరికకావచ్చు (ఆచంట జానకిరాంగారి 'నాస్మృతిపథంలో' 'సాగుతున్నయాత్ర').

కాని-జీవితచరిత్రరచనకి ప్రేరణ వేరేవిధంగా వుంటుంది. లోకోత్తరమై ఆకర్షణీయమై అనుభవంతో పండబారిన మహనీయులజీవితం ఆదర్శంగా చూపాలన్న ఆకాంక్ష కావచ్చు (చాలామంది మహాపురుషుల జీవితాలు); లేదా రచయిత నమ్మిన మతవిశ్వాసాలు, ఇజాలు కారణంగా వాటికి మూలస్తంభాలయిన మహనీయుల గాథలను బోధలను ప్రచారంలోకి తేవాలన్న బలవత్తరమైనవాంఛ కావచ్చు (రామకృష్ణమఠం, దివ్యజ్ఞానసమాజం, అరవిందాశ్రమం మొదలైనసంస్థలు ప్రచురించిన జీవితచరిత్రలు, సర్వోదయ, విశాలాంధ్ర ప్రచురణలు-వినోబా మార్క్సులెనిన్ల జీవితాలు మొదలైనవి), లేదా విద్యామనస్తత్వశాస్త్ర ప్రాతిపదికమీద నిర్మితమైన ఆధునికవిద్యాప్రణాళిక ననుసరించి వాచకాల్లోనూ ఉపవాచకాల్లోనూ జీవితచరిత్రల కున్న ప్రాధాన్యం కావచ్చు (సిలబస్ననుసరించి ప్రతివాచకంలోను ఇద్దరుమహాపురుషుల కథలైనా వుండాలి) లేదా బహుళవ్యాప్తిలో నున్న పత్రికలు మహనీయుల జయంతులను వర్ధంతులను పురస్కరించుకొని నిర్వహించే కార్యకలాపము కావచ్చు (పరిశోధన - ప్రభాకరసంస్మరణసంచిక, ధర్మవరంవారి స్మారకసంచిక మొ॥, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారిని స్మరిస్తూ పత్రికలు ప్రతివర్షమూ జరిపే కార్యకలాపము ఉదాహరణలు); లేదా సేవాదృక్పథంతోనూ, కొంతవ్యాపారదృష్టితోనూ అకాడమీలు, వివిధగ్రంథప్రచురణసంస్థలు చేసే దోహదం కావచ్చు. (రాష్ట్రకేంద్ర అకాడమీలు, బాలసరస్వతీ బుక్‌డిపో, విశాలాంధ్ర విద్యోదయా నగారా పబ్లికేషన్సు, గోదాగ్రంథమాల, వేంకట్రామా కంపెనీ మొదలైన సంస్థలు పుంఖానుపుంఖంగా ప్రకటిస్తున్న జీవితచరిత్రలు).

ఇన్నివిధాలైన కారణాలవల్లను, ప్రేరణలవల్లను ఈరచనావ్యాసంగం ముమ్మరంగా సాగుతున్నది, తెలుగువారు ఇందులో ఎవరికీ తీసిపోలేదు.

మొదట ఈయుగంలో వెలువడినజీవితచరిత్రలనుగురించి వెనుకనే అన్నట్లు వ్రాయబడినవి, వ్రాయబడుతున్నవి, అచ్చయినవి, పునర్ముద్రింప

బడినవీ, విస్తరింపబడినవీ, సంగ్రహింపబడినవీ, క్రోడీకరింపబడినవీ, సంగ్రహంగా పేర్కొనబడినవీ, అనువదింపబడినవీ, చలనచిత్రాలుగా రూపొందినవీ పెక్కులున్నవి. వీటి కుదాహరణ లిదివరకే చూశాము. ఇవేకాక రచననుబట్టి పాక్షికజీవితచిత్రణ (Partial Portraits) మనబడే తీరుగల రచన (ఆంధ్రకేసరి - శ్రీ టి. యస్. రావు, 1956, మాశాస్త్రిగారు - శ్రీ కొత్త రామకోటయ్య - 1956) లు కూడా మనకున్నాయి. ఒకరిజీవితంలోని ఒకటి రెండు ప్రధానాంశాలను మాత్రమే తీసికొని ప్రత్యేకంగా పాత్రచిత్రణ చేయడం వీటిల్లో జరుగుతుంది. ఈ జీవితచరిత్రలు చాలావరకు అన్నీ వచనం లోనే వున్నా రసదృష్టితో కళాత్మకంగా పరిష్కరిస్తూ తమ కవితాశక్తి ప్రదర్శించాలన్న కోర్కెతో వీటిని ఛందోబద్ధం కావించిన వారుకూడా లేక పోలేదు (చిన్నవారిలో శ్రీ దిందేల మాలకొండారెడ్డి రచించిన నేతాజీ (1948) కావ్యము, పెద్దలలో శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రివర్యుల 'వివేకానందము' (1949) ఉదాహరణలుగా చూపవచ్చును. నవయుగకవిచక్రవర్తి శ్రీ జి. జాషువా 'క్రీస్తుచరిత్ర' ని (1963) మాత్రమే కాక 'నాకథ' (1952) అని వారి ఆత్మకథనుకూడా పద్యాలలో వ్రాసుకొన్నారు). ఇది అంతా రచనా వైఖరినిబట్టి జీవితచరిత్రల్లో చేయదగినవింగడింపు.

పోతే మూలరచనయొక్క భాషను బట్టి స్వతంత్రములు (ఉదాహరణ లీయ నవసరములేదు), అనువాదములు (ఈ. స్టెపెనోవా రచించిన కారల్ మార్క్సుజీవితానికి శ్రీ పరచూరి (1957) అనువాదం, మార్జరి సైక్సు రచన 'రవీంద్రనాథఠాకూర్'కి శ్రీమతి ఆచంట శారదాదేవి అనువాదం (1957), బుద్ధ భగవానుడు (1957) ధర్మానందకోశంబిగారి రచనకు (శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులఅనువాదం ఉదాహరణలు) అని రెండువిధములు.

ఇట్లాగే పాఠకలోకాన్ని దృష్టిలో పెట్టుకొని బాలసాహిత్యము (నగారా పబ్లికేషన్సువారి చిలకమర్తి, గురజాడ, చిన్నయసూరి (1971) మొ॥ రచనలు; గోదాగ్రంథమాలవారి మనరాష్ట్రపతి (1966), జమునాలాల్‌దంపతులు (1967), శ్రీ దేశోద్ధారకుడు (1967), లోకమాత (1970) మహర్షి వివేకానందుడు (1971) మొ॥ రచనలు ఉదాహరణలు) అనీ, యువసాహిత్యము (ఇటీవల వెంకట్రామాకంపెనీవారు ప్రకటిస్తున్న 'జాతీయనాయకమణిమాల' అన్న వరుసవి, ఇంకా ఇతరప్రచురణ సంస్థలవి ఉదాహరణలు) అనీ, ప్రౌఢసాహిత్యము (యోగి లెడ్బీటరు దివ్యచరిత్ర శ్రీ గుంటూరు

సుబ్బారావు (1947), గురజాడరచనలు (1958) ఉదాహరణలు. జాన్సనుకి బాస్వెల్ తోడ్పడినట్లు శ్రీముని వెంకట సుబ్రహ్మణ్యం మహాకవి గురజాడకి తోడుపడగా ఆకృషిని శ్రీ అవసరాల సూర్యారావు మూలంగా విశాలాంధ్ర ప్రచురణాలయంవారు లోకానికి వెల్లడిస్తున్న గొప్ప ఉదాహరణం గురజాడ రచనలు) అనీ మూడువిధాలు.

ఇలాగే కాకుండా ఇంకా జీవితచరిత్రలో ప్రధానపాత్ర వహించే వ్యక్తిని బట్టికూడా ఈసాహిత్యం పలువిధాల విశ్లేషింపబడుతుంది. 'అనిబిసెంట్' (శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి (1967) రచన, 'లోకమాత' (శ్రీ కె.టి యల్. నరసింహాచార్యులు (1970) రచన) మొదలైనవి మాతృమూర్తులకు చెందినవైతే తక్కినవి పురుషపుంగలవి. ఈ 'వ్యక్తి'త్వం కూడా మరి అనేక విధాల వింగడింపబడుతుంది. (1) ఆంధ్రులైన భారతీయుల చరిత్రలు (పట్టాభి- శ్రీ ఏ. రమేశ్ 1966, ఆదిరాజువారి జీవితచరిత్ర - శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు 1962, వెంకటనారాయణా (వీణా) చార్యులవారి జీవితము - శ్రీ వి. వి. నర సింహాచార్యులు (1948) ఇంకా అనేకులవి). (2) ఆంధ్రేతరులైన భారతీయుల చరిత్రలు (జవహర్లాల్‌నెహ్రూ - శ్రీ ఏ. రమేశ్ 1967, దాదాభాయినౌరోజీ - శ్రీ ఎన్. సి. యస్. పార్థసారథి 1965, గోపాలకృష్ణగోఖలే - శ్రీధరణి ప్రగడ వెంకట శ్రీరామచంద్రమూర్తి (1967) మొదలైనవి. (3) విదేశీయులైనవారి జీవితచరిత్రలు (టాల్‌స్టాయి - శ్రీ మహీధర రామమోహనరావు 1956 మొ॥). ఇలా వ్యక్తుల స్త్రీపురుష భేదాన్ని,జన్మభూమినిబట్టి మాత్రమేకాకుండా వ్యక్తిగత జీవనమార్గాన వారువారు సాగించిన కృషినిబట్టికూడా వైజ్ఞానికులు (శ్రీ బి. వి. రమణరావుగారి 'వైజ్ఞానికుల జీవితాలు' 1953), తాత్త్వికులు (శ్రీరామకృష్ణ లీలామృతము - శ్రీ వెదురుమూడి కృష్ణారావుపంతులు, శ్రీ కందుకూరు మల్లి కార్జునం - (1957), రాజకీయవాదులు (వెంకట్రామాకంపెనీవారి జాతీయ నాయకమణిమాలవరుస), కళాకోవిదులు (త్యాగరాయచరిత్ర - యోగి శ్రీ శుద్ధానందభారతి 1948). - అనీ, ఇంకా పలువిధాలుగాను విభజించుకోవచ్చు. ఈవింగడింపు అంతా పరిశీలనసౌకర్యంకోసం విమర్శదృష్టితో మనం చేసుకొనేదేగాని వాస్తవానికి ఆమహనీయుల సమగ్రవ్యక్తిత్వస్వరూపమేగదా మనమీద ప్రభావంచూపేది? పరిపూర్ణంగా దర్శనమిచ్చే ఆ మహనీయుల వ్యక్తిత్వం ముందు నిజానికి వారిజన్మగాని, దేశంగాని, వైయక్తికకృషివిశేషంగాని ప్రధానాలు కావు.

ఇంతవరకూ జీవితచరిత్రలనుగూర్చి కొంత స్పృశించాము. ఇక నిప్పుడు స్వీయచరిత్రలనుగూర్చి చిలకమర్తివారినే ఉదాహరిస్తాను. "చరిత్రలు దేశాభ్యుదయమునకు తోడుపడును. కావున దేశచరిత్రలు మిక్కిలి యావశ్యములు. బహుపురుషులచరిత్రలు గలపి దేశచరిత్ర లగును కాబట్టి జీవితచరిత్రలు మిక్కిలి యవశ్యములు .... ఒకరి చరిత్రము మరియొకరు వ్రాసినపక్షమున వ్రాయవలసినవిషయములు సమగ్రముగా లభింపవు. అందుచేత నెవరిచరిత మును వారే వ్రాసుకొన్నపక్షమున విషయములన్నియు సంపూర్ణముగా నుదాహరించుట కవకాశ ముండును .... మహాపురుషులు పరులకు మార్గదర్శకముగా నుండుటకై తమ చరిత్రలు తప్పక వ్రాయవలెను. మనయాంధ్రదేశమున మొట్టమొదట స్వీయచరిత్రమును వ్రాసుకొన్నవారు మహనీయులైన రావు బహదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు, ఆమహాపురుషుని చరిత్రమంతయు స్వార్థత్యాగముతోడను, లోకోపకారమైన ఘనకార్యముల తోడను నిండియున్నది. కావున వారిస్వీయచరిత్రము నిశ్చయముగా నాంధ్ర సారస్వతమున కలంకారమై యాంధ్రజనులకు మార్గదర్శకమై యున్నది." ఇట్లే పల్లూరి సూర్యనారాయణరావుగారి, రాయసం వెంకటశివుడుగారి స్వీయ చరిత్రలుకూడా దానధర్మాలు, నిస్వార్థబుద్ధి, సత్ప్రవర్తనము అనేఅంశాలతో కూడి శ్లాఘనీయము లని వారే అన్నారు. వీటి తర్వాతివే చిలకమర్తి, కొండ, టంగుటూరి ప్రభృతులవి. ఇవి అన్నీ వాస్తవచిత్రణతో తత్కాలపరిస్థితులను ప్రదర్శిస్తూ, ఆసక్తికరములుగానే వున్నా ప్రసన్నమైనశైలితో ముందువెనుకలు పొందిపొసగి ఒకనవలవలె ఉత్తమకళాఖండంగా ఎన్నతగినది చిలకమర్తి వారిరచనే అని నాఅనుభూతి. 'With brevity which excludes everything that is redundant and nothing that is significant ' (ఎన్‌సైక్లో-బ్రిటా) అన్నట్లు సూటిగా సూక్ష్మంగా నాతివిస్తరంగా సున్నితంగా సాగినరచన అది. వీనితర్వాత అసంపూర్ణంగానే వున్నా పితృతాదులు శ్రీప్రభాకరశాస్త్రిగారి 'ప్రజ్ఞాప్రభాకరము' నూతనఫక్కిలో నడచిన, నాకు నచ్చిన, మధురగంభీర మైనరచన. ముప్పదేండ్లయోగసాధనానంతరం తమషష్టిపూర్తినాడు కలిగిన అంతరుద్బోధంవల్ల ఆత్మకథని - అంతరంగకథగా - అంతరాత్మ (మాస్టర్ సీ. వీ. వీ.) కథగా కూర్చి 'ఇన్నర్‌లైఫ్'ని రికార్డ్‌చేసే 'న్యూబయోగ్రఫీ' రూపొందించారు. అది వారనుకొన్నట్లు పూర్తే అయివుంటే స్వీయచరిత్రరచన ల్లోనే పేరెన్నికకన్నదై యుండేది.

ఇలాగే అడపాదడపా వెలువడిన పలువురు అనుభూతులు శ్రీపాదవారి (?) 'అనుభవాలు _ జ్ఞాపకాలు' జానకిరాంగారి 'నాస్మృతిపథంలో - సాగుతున్న యాత్ర' మొదలైనవి రసపిపాసతో పూవుపూవుకీ వెళ్ళి అనుభవాలమధువుని క్రోలినంత క్రోలి మిగతావాళ్ళకి పంచిపెట్టడంకోస మని కూడబెట్టుకొన్న తేనెపట్టుల్లాంటివి. వారిరచనలు-కాస్త చ(ది)వి చూస్తే చాలు. మధురస్మృతుల మధువులు జొటజొట జాలువారుతాయి. మన ఆత్మకథల్లో ఇవి కొన్నికొత్త పోకడలే. ఇలాగే ఆమధ్యపత్రికల్లో వరుసగా పడిన పద్మశ్రీ చిత్తూరి నాగయ్యగారి స్వీయచరిత్రలో కొన్నిభాగాలు చదివాను. ఆకళాకారుని ఉదారహృదయం తోటిలోకాని కెలా కృతజ్ఞతాబద్ధమై వున్నదో, కష్టసుఖాలకోను ఎలా నిల దొక్కుకోకలిగి ముందడుగు వేసిందో మన కందులో కనిపిస్తుంది. ఇలాగే నటసమ్రాట్ శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి జీవితము, శ్రీమతి జానకిగారి జీవితానుభవాలు ప్రజలకు మోజైన సినిమాప్రపంచాన్ని భూతద్దంలో చూపించి, అందులో తాము గడించుకొన్న స్థానాన్ని నిరూపించుకొన్న రచనలు.

కాలం శరవేగంతో మారిపోతున్నది. ఆమార్పు వారివారి జీవితచరిత్రల్లో స్పష్టంగా మనం గుర్తించవచ్చు. ఈ యుగంలో వెలువడిన పెద్దతరంవారి జీవితాలు చదువుతుంటే వారిమహనీయమైన ఉదారమైన వ్యక్తిత్వం అలా వుంచి కొట్టవచ్చినట్లుగా సమకాలికేతివృత్తం కొంత మనకు కనపడుతుంది. దాన్ని కొంత స్థూలంగా ఈక్రిందివిధాన క్రోడీకరించవచ్చును. నాటిపల్లెటూళ్ళ జీవితం సాంఘికంగా సమగ్రమైనది (కాంప్రెహెన్సివ్). వైద్యసౌకర్యాలు తక్కువ. వ్యాధులు_బాధలు_మరణాలు, దస్తావేజులు_కోర్టులు_డిక్రీలు_వకీళ్ళు_పరువు దావాలు- జమిందార్లు_వారి ఔదార్యం కలవారి సంపర్కాలు--సంఘసంస్కరణ విదేశయానాలు-పెళ్లి-శ్రీముఖాలు-వితంతువివాహాలు-అంటరానితనం- సామాజిక విందుభోజనాలు, చదువుసంధ్యలు-శ్రద్ధలు, పాఠశాలలస్థాపన - రాత్రిబళ్లు - తక్కువకులాలవారికి ప్రత్యేక పాఠశాలలు; నాటకాలు, సమాజాలు, రచనా ప్రోత్సాహం, వైషమ్యాలు, కొట్లాటలు; రాజకీయాలు, బంగ్లావిభజన, సైమను కమిషను, గాంధీపిలుపు, చదువులకు వృత్తులకు స్వస్తి, జైళ్లు, శిపమెత్తడం, తెల్లదొరలు, క్రైస్తవ మిషనరీలు, మతప్రచారం, పత్రికలు, వాదోపవాదాలు స్పర్ధలు., పుస్తకాల, మందుల,ఫొటోలవ్యాపారాల మెలకువలు; దానధర్మాలు వీలునామాలు, ధర్మసంస్థలు; ఇట్లాగే పలువిషయాలు మనసులో మెరిసిపోతాయి. ఇప్పటికి ఆరోజులు దాటి అర్ధశతాబ్ది గడిచింది. పోల్చి చూస్తే ఎంతో వృద్ధి

చెందా మనిపిస్తుంది. కాని ఇంకా ఎంతోవృద్ధి మిగిలిపోతోంది. వితంతు వివాహ మొకసమస్యగా లేదివాళ. బాల్యవివాహా లరికట్టే మేమో (ఇంకా కొన్నిచోట్ల ఉన్నట్లు మొన్న పేపర్లోవార్త!). కాని కట్నపిశాచిని మాత్రం ఇంకా వదిలించుకోలేదు. మూడురూపాయలకు రెండుపూటలా నెలభోజనం నాడు గడిస్తే నేడు మూడున్నరకిగాని ఒకరోజు భోజనం గడవడంలేదు. గాంధీగారి పుణ్యమా అని సామాజికంగా కొంత ముందడుగు వేసినమాట నిజమేగాని నేటికీ బలహీనవర్గాల అభివృద్ధి ఒకజటిలమైన రాజకీయసమస్యగా ఎదురౌతూనే వున్నదిగదా! చిరకాలంగా వేరుదన్నిన ఆవిషమసమస్య అంత తేలికగా పెకలింపబడుతుందా? చూడాలి. ఆనాడు నాటకాలమీదమోజు, నాటకాలూ వచ్చాయి; నటులూ పుట్టుకొచ్చారు. ఈనాడు ఆగాలి నవలలు సినిమాలమీదుగా మళ్ళింది. నిస్స్వార్థసేవ, సంపాదించినదంతా సమాజంకోసం ధారపోయడం అప్పటిస్వభావమైతే వెనకవేసుకోడం పరిపాటి అవుతోంది. నాడు బడులు తక్కువే అయినా పిల్లలకి విద్య బాగానే ఒంటబట్టేది. అప్పటి మూడోక్లాసు ఇప్పటి మూడోఫారంతో సమానమని వాళ్ళే అనుకొన్నారుగదా! కానీ నేడో బడులు పెరిగినాయి, అక్షరాస్యతా అధికమైంది. కాని విలువలే సన్నగిల్లుతున్నట్లున్నవి. మొత్తంమీద మార్పు బాగానే వుంది గాని, దాని తీర్పే బాగుండలేదు. కుండ పెద్దదే అయింది గాని తూటుకూడా పెద్దదవుతూనే వుందిమరి. ఇదిగో ఇలాటి విషమసమయాల్లోనే ఆసచ్చరిత్రుల చరిత్రలు దారిదివ్వెలై మనకు వెలుగుబాట చూపించాలి. అవి చూపిస్తూనే వున్నాయి. చూసుకోవలసింది మనమే.



"యుగపురుషులు ప్రూఫ్‌రీడర్లై
జగత్కావ్యాన్ని సరిదిద్దినా
పరిస్థితుల కంపోజిటర్లు
తరతప్పులు చేయటానికి తైపులులేవు"

— ఆరుద్ర.

# హరికథలు

**శ్రీ ప్రతాప వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి**

మానవుని మనోవికాసమునకు విజ్ఞానముతోపాటు వినోదముకూడ అవసరము. సంగీత సాహిత్యాలు రమారమి సమమైనపాళ్ళలో మేళవింపబడి నవరసభరితముగా భక్తిని, నీతిని, వైరాగ్యమును, సమకూర్చి శ్రోతల మానసికగ్లానిని అపనయించి పరమానందము గూర్చు ప్రక్రియ హరికథ. దీనికి పూర్వరూపము యక్షగానము. తమిళులు హరికథను 'కాలక్షేపము' అందురు. మహారాష్ట్రులు 'అభంగ్' అందురు. ఐతిహాసికయుగములోని కుశలవుల రామాయణగానము ఈజాతికే చెందినది. యక్షగానాలు బహువ్యక్తికాలు. ఏకవ్యక్తికమై బహుపాత్రాభినయముతో చేయు సంగీతోపన్యాసము హరికథ. అట్టి కథాగానము చేయువారిని భాగవతు లనియు, హరిదాసు లనియు నందురు. భగవద్భక్తి గలవారు భాగవతులు. హరివిషయకజ్ఞానము గలవారు హరిదాసులు.

స్వాతంత్ర్యమునకుపూర్వము భారతదేశములో ప్రధానముగా భారత రామాయణాదిగాథలే హరికథలుగా చలామణి యగుచుండెడివి. రానురాను పోతనవంటి కవులజీవితచరిత్రలు, త్యాగయ్య రామదాసు వంటి భక్తులజీవిత గాథలు, మహాత్మాగాంధివంటి దేశనాయకులజీవితవిశేషాలుగూడ హరికథలుగా రూపొందినవి. స్వభావసిద్ధముగా హరికథలు కాకున్నను దైవభక్తులయు దేశభక్తులయు జీవితకథలు ఐతిహాసికగాథలవలె బహుజనాకర్షకములైనవి. ఆయా భక్తులు తమజీవితములలో పడిన కష్టసుఖములను కథకులు గద్య, పద్యకృతులతో సాభినయముగా గానముచేయుచు, పండితపామరహృదయాలను చూఱగొనెడివారు. వయొలిన్ లేక హార్మోనియము, మృదంగము సహకారవాద్యములుగా నుంచుకొని పాత్రరసానుకూలసంభాషణాచాతుర్యముతో సందర్భోచిత హాస్యప్రసంగములతో కథకులు సదస్యులను రంజింపజేసెడువారు.

ఆంధ్రదేశములో హరికథావిధానమునకు మూలపురుషులు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు. వీరు "హరికథాపితామహ" యను సార్థకబిరుదము గలవారు. వీరిసంప్రదాయములో కథాగానమున నృత్యము విశిష్టస్థానమును సంతరించుకొన్నది. శ్రీదాసుగారు కేవలహరికథకులేకాక అష్టభాషాప్రవీణులు. పుంభావసరస్వతి యనదగినవారు. వీరు స్వతంత్రభానూదయమునకు పూర్వో

త్తరకాలములందు అనేకయక్షగానములను రచించి అద్వితీయప్రతిభావ్యుత్పత్తులతో ఒక్క ఆంధ్రమునే కాక యావద్భారతమును హరికథాగానలహరిలో నోలలాడించినవారు. పలుమాట లేల? శ్రీదాసుగారు ముట్టని సాహితీప్రక్రియయు మెట్టని రాజాస్థానమును లేవని చెప్పిన సాహసోక్తి కాదు. దాసుగారిశిష్యులమని చెప్పుకొనుటయే గొప్పగా భావించెడువారు ఆనాటికథకులు.

మనభారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చుటకు పూర్వ మున్న హరిదాసులు వ్రేళ్ళపై లెక్కింప వీలైనవారు. ఆపాతమధురమైన సంగీతమును ఆలోచనామృతమైన సాహిత్యమును కూలంకషముగా అభ్యసించి, పరిణతప్రజ్ఞులై వలసినంతలోకానుభవమును సముపార్జించుకొని, బహువిధరచనలు గావించి, హరికథాగానమునకు విఘ్నేశ్వరపూజ గావించెడువారు. వారి గద్యపద్యములుగాని, కీర్తనలుగాని ప్రాబంధికశైలిలో నారికేళపాకమున బడి సామాన్యులకు బోధపడెడివి కావు. ఆనాటి సదస్యులును చక్కనిసంస్కారము గలవారు. కావున కథకులు తమ పాండితీస్ఫూర్తిని ప్రకటించు శాస్త్రప్రసంగములతో కథాగానము గావించెడువారు. శ్రీనారాయణదాసుగారి కథాగానము ఒకఘట్టమున సంగీతకచేరిగను, మఱొకఘట్టమున విద్వద్గోష్ఠివలెను సంభ్రమాశ్చర్యములను కలిగించెడిది.

స్వాతంత్ర్యము వచ్చినతరువాత ఈపాతికేండ్లలో హరికథలు తామరతంపరగా వృద్ధినందినవి. వానితోపాటు కథకులుకూడ వందలకొలది తయారయినారు. స్వతంత్రసమరసమయములో 'త్రిపురాయబారము', 'వందేమాతరము' వంటిహరికథలు ప్రచారములో నున్నవి. పూర్వకథకుల కున్న పాండిత్యప్రకర్ష, నవనవోన్మేషశాలిని యగుప్రతిభయు కానవచ్చుట లేదనుటకు సాహసింప నవసరములేదు. అట్లే రచనలయందును పూర్వపుబిగి సడలిన దనవచ్చును. వానితో సభ్యులసంస్కారస్థాయియు తగ్గిన దని చెప్పనక్కరలేదు. హాస్యశృంగారములు కరుణయు ప్రధానములుగా నేటికథకులు గానము చేయుచున్నారు. భక్తికి హరికథకు సంబంధము వికల్పమయ్యె నని రసజ్ఞభావుకులకు తోచకపోదు. గాలిపాటతో నాలుగుమంజరులు పదికీర్తనలు వల్లించి చిలుకపలుకులు పలికే కథకులు నేడు రంగమున నున్నారు.

హరికథాగానకేదారములో బహువిధయక్షగానబీజములు నాటి అద్వితీయవాగ్గేయకారులుగా పేరెన్నికగన్నవారు శ్రీమన్నారాయణదాసుగారు. హరికథామృతమను సంస్కృతయక్షగానము రచించి గానముచేసిన ప్రతిష్ఠ దాసుగారికొక్క

రికే దక్కినది. శ్రీదాసుగారి సాక్షాత్తుశిష్యులలో శ్రీవాజపేయయాజుల వెంకట సుబ్బయ్య, శ్రీ నేతి లక్ష్మీనారాయణ భాగవతులు ముఖ్యులు. వీరు గురువర్యుల సంప్రదాయము ననుసరించి యావదాంధ్రదేశమున హరికథాగానస్రవంతిని ప్రవహింపజేసినారు. శ్రీపుచ్చల భ్రమరదాసు, శ్రీమైనంపాటి నరసింగరావు, ప్రభృతులు హరికథలను స్వయముగా రచించి ప్రజారంజకముగా గానము చేసినారు.

శ్రీనారాయణదాసుగారి తరువాత శ్రీపెద్దింటి సూర్యనారాయణదీక్షితదాసుగారు ఇతిహాసకథావిశేషములను పెక్కింటిని రచించినారు. వీరిరచనలలోని తోహరలు, కృతులు, పద్యములు ధారాళమైనశైలిలో భావస్ఫోరకములుగానుండి పండితపామరజనాకర్షకములుగా నున్నవి. దాసుగారిరచనలోని కాఠిన్యము వీరిరచనలందు లేదు. వీరిసమకాలికులలో శ్రీముసునూరి సూర్యనారాయణగారు మధురసంగీతకథాగానమున ఆంధ్రప్రజలను తన్మయుల గావించినారు. శ్రీప్రయాగ సంగమేశ్వరశాస్త్రిగారు భక్తిరసప్రధానముగా ఇతిహాసకథలనేగాక శ్రీత్యాగరాజస్వామివారి చరిత్రమును గూడ పండితపామరరంజకముగా గానము చేసినారు. ఈకాలముననందే శ్రీపరిమి సుబ్రహ్మణ్యముగారు, శ్రీములుకుట్ల పున్నయ్యగారు, శ్రీఅద్దేపల్లి లక్ష్మణశాస్త్రిప్రభృతులు బహువిధ హరికథారచనలు గావించి హరికథాలోకమునకు నవాలోకమును కల్పించినారు.

శ్రీ నారాయణదాసుగారి ప్రశిష్యులలో హరికథరత్న' విద్వాన్ శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారు ప్రసిద్ధులు. కర్ణాటక సంప్రదాయసంగీతము వీరికి వెన్నతోబెట్టినవిద్య. సంస్కృతాంధ్ర భాషాపాండిత్యము కరతలామలకము. భక్తిరసప్రధానముగా శ్రీదాసుగారి రచనలను గానముచేయుటయేగాక జైమినిభారతము శివలీలలు మున్నగుకథలను సర్వజనమనోరంజకముగా గానముచేయు దక్షులు వారు. శ్రీ త్యాగరాజ చరిత్ర గానముచేయుట వారిసొమ్ము. శ్రీపాతూరి మధుసూదనశాస్త్రి, శ్రీకుప్పా వీరరాఘవశాస్త్రి, శ్రీ నౌడూరి విశ్వనాథశాస్త్రి, శ్రీఅమ్ముల విశ్వనాథము, శ్రీ జి. ఉమాకాంతము ప్రభృతిహరిదాసులెందరో యీ కథాగానప్రక్రియకు దోహదము చేసినారు. తరువాతికాలమున కొందఱు కేవలము పాటలతోను మఱికొందఱు కేవలము మాటలతోను కాలక్షేపము చేసినారు.

ఆటపాటమాటలలో నైపుణ్యము గల భాగవతులు కథాకథనవిధానములో వివిధములగు మార్పులను తెచ్చినారు. శ్రోతల అభిరుచుల ననుసరించి వారికి

దగిన స్థాయిలో కథాగానము చేయుట, కథామధ్యమున సందర్భోచితముగా అధ్యాత్మరామాయణకీర్తనలు, సదాశివబ్రహ్మేంద్రులవారికృతులు, జయదేవుని అష్టపదులు, నారాయణతీర్థులవారి తరంగములు, జావళీలు మున్నగువానిని గానముచేయుట, సమయోచితముగా కథానుకూలహాస్యప్రసంగములు, అర్థోక్తులు, వింతవింత సంభాషణలు, కాశీదండకములు, సినిమాపాటలు మున్నగువానిలో శ్రోతలలో భక్తిభావమును మఱుగుపరచుట అనుమార్పులు వచ్చినవి.

పురాణగాథలతోపాటు స్థలమాహాత్మ్యములను, భక్తులజీవితములను కవులచరిత్రములను గానము చేయుచు పేరెన్నికగన్న నేటికథకులలో శ్రీ కూచిభొట్ల కోటేశ్వరరావు, శ్రీఅక్క-పెద్ది శ్రీరామశర్మ, శ్రీబుర్రా శివరామ కృష్ణశర్మ, శ్రీరాజశేఖరుని లక్ష్మీపతిశాస్త్రి, శ్రీఅత్మకూరి గురుబ్రహ్మగుప్త, శ్రీ కోట సచ్చిదానందశాస్త్రి, శ్రీ తెల్లాకుల వెంకటేశ్వరగుప్త, ప్రకృతవ్యాసకర్త ప్రభృతిహరిదాసులు తెనుఁగునేల నలుమూలల హరికథలద్వారా భక్తివైరాగ్య ములను ప్రచారము చేయుచున్నారు. వీరిలో శ్రీవేంకటేశ్వరగుప్తగారు వందల కొలది శిష్యులరాండ్రకు గజ్జగట్టించి కథలుచెప్పి కులపతులై విద్యాదానకర్త లని పేరందినారు. హరిదాసులేకాక శ్రీమతి దుర్గాంబ, శ్రీమతి బెజవాడ నగరాజ కుమారి వంటి భాగవతారిణులుకూడ యీకథాగానరంగమునకు వెలుగు గూర్చినారు.

ఈనాటిసామాజికుల మనస్సులలో భక్తి సన్నగిల్లుచు, హాస్యరసశ్రవణా సక్తి హెచ్చుటతో హరికథలుగూడ హాస్యరసప్రధానములైనని. హరికథాగాన సమయమున అడుగడుగున పిట్టకథలు చెప్పుచు ప్రధానకథను సాగనీయక అశ్లీలార్థకసంభాషణము గావించుట సంఘమునకు శ్రేయోదాయకముగాదు. హరికథలు నేతిబీరకాయలు కారాదు. కథాగానశ్రవణముతో రామాదిపురాణ పూరుషుల ధార్మికహృదయమును సావధానముగా అర్థము చేసికొని వారినడవడిని శ్రోతలు ఆచరణమున నుంచుకొనుట వాంఛనీయము. లేకున్న హరికథా విధానము వ్యర్థమగుటయే గాక జగన్మంగళకారి కానేరదు.

సంప్రదాయసంగీతశిక్షణమునకు ప్రభుత్వమువారు సంగీతకళాశాలలను నిర్వహించుచున్నారు. కాని వానిలో హరికథాప్రక్రియకు అవకాశము కల్పింప బడినట్లులేదు. హరికథాగానమును ఒకప్రత్యేకకళగా భావించి ప్రభుత్వము ప్రోత్సాహము నొసంగుట అవసరము. నేటిహరిదాసులందఱు భక్తిరసప్రధాన ముగా హరికథలను గానము చేయుచు సంఘశ్రేయమును వృద్ధి నందింప యత్నించుట అపేక్షింపదగినది.

# బుర్రకథలు

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

రెండవప్రపంచయుద్ధం ప్రారంభమై ప్రపంచమంతా ఫాసిస్టుల ప్రళయ ఆర్భాటాలతో మారుమ్రోగిపోతోంది. ఫాసిస్టులకూ ప్రజాస్వామిక శక్తులకూ మధ్య తీవ్రమైన సంఘర్షణ చెలరేగింది. యుద్ధం జరిగే ప్రాంతాలన్నీ శ్మశానాలైనాయి. మనదేశంలో కరువుపిశాచి కరాళనృత్యంతో రాయలసీమ బెంగాల్ నలిగిపోయాయి. రేపోమాపో అటు కలకత్తామీదో కాకినాడమీదో మద్రాసుమీదో విశాఖమీదో బాంబులు బడేటట్లున్నాయి. భారతదేశపు తూర్పు కోస్తా అంతా అతిప్రమాదమైన స్థితిలో పడిపోయింది. ఆభాయలే ఆంధ్రదేశం మీద పడ్డాయి. ఆనాడు ఆంధ్రప్రజలు అరచేతిలో ప్రాణాలు బిగబట్టుకుని బ్రతకాల్సివచ్చింది. చివరకు అనుకున్నంత పనీ జరిగింది. కాకినాడ విశాఖ పట్టణాలపై బాంబులు పడనే పడ్డాయి. ఈస్థితిలో ఆంధ్రప్రజలస్థితి ఏమిటి? ఒక్కఆంధ్రప్రజలస్థితేకాదు. ఏదేశమైనా ఏప్రజలైనా ఈ భయంకరమారణ హోమం నుంచి ఈ అగ్నిజ్వాలలనుంచి బయటపడాలని తహతహలాడే భయంకరదినాలవి.

ఈ స్థితిలో కళాకారులూ, కవులూ, కథారచయితలూ, గేయకవులూ, గాయకులూ, వాద్యకులూ మొత్తం కళాకారులంతా ఈ హోమగుండంనుంచి ప్రజలను విముక్తి చేయాలనుకున్నారు. నాటియువకులందరూ వేయికంఠాలెత్తి పిడికిళ్ళను బిగించారు. ఆంధ్రదేశపు నాలుగుచెరగులనుంచీ యువకులందరూ సమీకరించబడ్డారు. ఆంధ్రరాజకీయజీవితంలో ఒక నవచైతన్యం ఒకఅభ్యుదయ యుగం ప్రారంభమైంది.

ఈ తీవ్రసంచలనంలో ప్రతికళాకారుడూ దేశభక్తి ప్రపూరితుడై పోయాడు. కవులు గేయాలు వ్రాశారు. గాయకులు కంఠాలెత్తారు. ఆంధ్రప్రజా సామాన్యాన్నంతా గాఢనిద్రలో మేల్కొలిపారు. నాడు దేశంలో వచ్చిన రాజకీయకల్లోల వాతావరణంలో ఏర్పడిందే ప్రజానాట్యమండలి. ఉత్సాహం కొద్దీ నిర్మించిందికాదు ప్రజానాట్యమండలి. అది ఒక ఉద్ధృతవాతావరణంలో జన్మించింది.

కళ కళకోసం కాదని, అది ప్రజలకోస మని, నిరూపించింది. కళ

వ్యక్తులసొత్తు కాదనీ, అది ప్రజలకు చెందిన ఆస్తి అనీ, చాటింది. ప్రజల యొక్క స్థితిగతులకు అనుకూలంగా వారికష్టాల్లో పాలుపంచుకుని పరిష్కార మార్గాలను కళారూపాలద్వారా పరిష్కరించింది.

ప్రాచీన కళారూపాల నన్నిటినీ పునరుద్ధరించారు. కళారూపం పాతదైనా ప్రస్తుత ఇతివృత్తాలను చేర్చి, ఆ కళారూపాలస్థాయినీ, రూపాన్నీ మార్చి కొత్తమెరుగులు తీర్చిదిద్దారు. ఒక్కొకక్క కళారూపానికి ఒక్కొక్క ప్రజాసమస్యను ముడిపెట్టారు. అలా మన కున్న ప్రాచీన జానపదకళా రూపాల్లో ప్రథమంగా ప్రారంభించిన కళారూపం బుర్రకథ.

నాటిపరిస్థితుల్లో కృష్ణాజిల్లా దివితాలూకాలో కీ. శే. పెండ్యాల వెంకటేశ్వరరావు, పరచూరి రామకోటయ్యగార్లు దేశభక్తిని పురికొల్పుతూ, యువజనమహాసభలలో వైజ్ఞానిక కార్యక్రమంగా బుర్రకథ కార్యక్రమాలను చెప్పడం ప్రారంభించారు. వీరికార్యక్రమాన్ని చూచి ఉత్తేజితులైన కోసూరు పున్నయ్య, సిరివిశెట్టి సుబ్బారావు, గోవర్ధన మొదలైన దివితాలూకా కొత్తపాలెంకు చెందినవారు దేశభక్తిని పురికొల్పుతూ బుర్రకథలు ప్రారంభించారు. సిరివిశెట్టి సుబ్బారావు కథకుడుగానూ, కోసూరి పున్నయ్య హాస్యపాత్రనూ, గోవర్ధన రాజకీయాలనూ నిర్వహిస్తూ వుండేవారు. వంతగా కోసూరి పున్నయ్య సున్నితమైన హాస్యంతో గ్రామీణ సామెతలతో రాజకీయ విషయాలను ప్రజలకు అర్థమయ్యే శైలిలో చెపుతూ వుండేవారు.

అదేసమయంలో అటు గుంటూరుజిల్లాలో కాకుమాను సుబ్బారావు, దావులూరు, చింతల సూర్యనారాయణ, మొదలైనవారు రష్యన్‌వీరనారి "టాన్యా", ఝాన్సీలక్ష్మీబాయి మొదలైన వీరవనితలకథలను చెప్పి ప్రజలను త్తేజపరుస్తూ వుండేవారు.

ఈకాలంలోనే 1943 మార్చిలో, కృష్ణాజిల్లా యువజనసంఘం అధ్వర్యాన దివితాయకా కొడాలిగ్రామంలో ఫాసిస్టువ్యతిరేక వైజ్ఞానికశిక్షణా శిబిరం ప్రారంభించబడింది. ఈశిబిరంలో ప్రప్రథమంగా కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరు పున్నయ్య, సిరివిశెట్టి సుబ్బారావు ఒకబుర్రకథదళంగాను, మిక్కిలినేవి, మాచినేని, దావులూరు నారాయణ ఒకబుర్రకథదళంగాను పెరుమాళ్ళు, కీ. శే.చదలవాడ కుటుంబరావు, తుమ్మల కేశవరావు, మరోబుర్రకథదళంగాను, పురుషోత్తం, వెంకటేశ్వరరావు మొదలైన దివితాలూకాకు చెందినబాలురతో ఒకబాలురబుర్రకథదళమూ ఏర్పడ్డాయి.

అటు గుంటూరుజిల్లాలో నాజరు, రామకోటి, పురుషోత్తం మొదలైన వారితో ఏర్పడిన బుర్రకథదళం ఉత్తేజంగా బుర్రకథలు చెపుతూవుండేది. మోటూరు ఉదయం, చింతల కోటేశ్వరమ్మ, మహంకాళి లక్ష్మి మొదలైన వారు మహిళాబుర్రకథదళంగా ఏర్పడి రష్యన్‌వీరనారి "టాన్యా" కథను బుర్ర కథగా హృదయాలు ద్రవించేటట్లు చెప్పేవారు. పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులో చంద్రు సూర్యనారాయణ, చంద్రు చిన్నబ్బాయి, మాణిక్యాలరావు మొదలైన వారు జిల్లాలో విరివిగా బుర్రకథలద్వారా ప్రచారం చేయడమేకాక మరికొన్ని బుర్రకథదళాలను క్యాంపులుపెట్టి తయారుచేశారు.

ఆరోజుల్లోనే గుంటూరుజిల్లాలో ఉప్పుగుండూరు బాలురబుర్రకథదళం ఆంధ్రదేశాన్నంతా ఆకర్షించింది. కర్నూలుజిల్లా గిద్దలూరుప్రాంతంలో తుపాకుల బసవయ్యదళం పనిచేస్తూ వుండేది. నెల్లూరుజిల్లాలో రాజగోపాల్ బుర్ర కథదళమూ, కడపజిల్లా జమ్ములమడుగులో హుస్సేన్‌బాబా బుర్రకథదళమూ విరి విగా కథలు చెపుతూవుండేవి.

పైన ఉదాహరించిన మోటూరు ఉదయం స్త్రీలబుర్రకథదళంతోపాటు స్త్రీలబుర్రకథదళాలు కూడా అత్యంత ప్రాముఖ్యాన్ని వహించాయి. ప్రథమంలో కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి ఆధ్వర్యాన కొండేపూడి రాఘవ, తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజిని మొదలైనవారు మన్యవిప్లవకారుడైన అల్లూరు సీతా రామరాజు జీవితచరిత్రను 'సుంకర' బుర్రకథగా వ్రాయగా, ఆకథను ఎంతోరస వత్తరంగా ప్రదర్శించి ఆంధ్రప్రజానీకాన్ని ఉర్రూతలూగించారు. ఆంధ్ర దేశంలో అనేకప్రాంతాల్లో ఈకథను చెప్పడమే గాక ఉమ్మడిమద్రాసురాష్ట్రంలో మంత్రులసమక్షంలో ఈకథను ప్రదర్శించి, ఆనాటికాంగ్రెసుమంత్రులమన్న నలు పొందడమేకాక వారినుండి పారితోషికాలుకూడా పొందారు. కాని అనతి కాలంలో కథను కాంగ్రెసుప్రభుత్వం నిషేధించింది.

అల్లూరు సీతారామరాజు జీవితకథద్వారా ఆనాటి విప్లవస్థితిగతుల నన్వ యించి ప్రజల్లో ఉత్సాహాన్ని కలిగించారు.

వీరేశలింగంగారిజీవితచరిత్ర బుర్రకథద్వారా నాటిసంఘంలో వున్న కుళ్ళునూ, సంఘవిద్రోహులనూ, మతాధిపతులనూ, లంచగొండులనూ, చీల్చి చెండాడుతూ, సాంఘికసంస్కరణలకూ సాహిత్యవుద్యమాలకూ దోహద మిచ్చారు. పల్నాటియుద్ధంద్వారా పూర్వవీరులపౌరుషాన్ని జ్ఞప్తికి తెచ్చి ప్రజల ను త్తేజపర్చారు. బెంగాల్‌కరువు బుర్రకథద్వారా ఆనాడు రాయలసీమలోనూ,

బెంగాల్‌లోనూ, మలబార్‌లోనూ, విశాఖపట్టణంలోనూ, కరువురాక్షసి- లక్షలాది ప్రజలు ఎలా ఆకలిమంటల్లో మ్రగ్గిపోతున్నారో కళ్ళకు కట్టినట్లు జూపి వారికి సహాయపడడానికి వీధులవెంట తిరిగి విరాళాలు వసూలుచేసి సోదరప్రజల ప్రాణాల్ని కాపాడారు.

సుంకర సత్యనారాయణ రచించిన కష్టజీవిబుర్రకథద్వారా బ్రిటిష్‌వారు బానిసత్వంలో వున్నమనదేశంలో జమీందారీయుగాన్ని ఎలా సృష్టించిందీ, ఆజమీందార్లు భూస్వాములూ పేదప్రజల్ని ఎలా దోచుకున్నదీ, కష్టజీవుల రక్తాన్ని ఎలా పీల్చి పిప్పిచేసిందీ, చివరికి జమిందారీ రైతుపోరాటంలో కష్ట జీవులు ఎలా విజయం పొందిందీ, కళ్ళకు కట్టినట్లూ హృదయాలు ద్రవించే టట్లూ చెప్పేవారు.

ఇక ఝాన్సీలక్ష్మీబాయి కథద్వారా 1857 లో సిపాయితిరుగుబాటులో చంటిబిడ్డను మూపున కట్టుకుని బ్రిటిష్‌వారిని గడగడ లాడించిన ఝాన్సీ లక్ష్మీ బాయి, స్వాతంత్ర్యంకోసం ఎలా బలియైపోయిందో వివరిస్తూ ఆవీరనారి సాహ సాన్నీ దేశభక్తినీ త్యాగాన్ని స్మరిస్తూ, ప్రజలందరినీ ఉద్రేకపరుస్తూ స్వాతంత్ర్య సమరంలో దూకేటట్లు ఉత్తేజపర్చేవారు.

అలాగే రెండవప్రపంచయుద్ధంలో ఫాసిస్టులు రష్యాలో ఎలా ప్రళయ తాండవంచేసిందీ, టూన్యా, నటాషా లాంటి వీరవనితలను ఎలా చిత్రహింసలకు గురిచేసిందీ, రష్యన్ వీరవనితలు ఎలా త్యాగాలు చేసిందీ వివరిస్తూ మనదేశపు స్త్రీలలో స్వాతంత్ర్య పిపాసనూ దేశభక్తినీ రేకెత్తించేటట్లు మహిళా బుర్రకథ దళాలు ప్రజల్లో ప్రచారం చేశాయి.

ఆనాటి బుర్రకథకులకు కథలను వ్రాసి అందించినవారిలో ప్రముఖరచ యిత ప్రజాకవి సుంకర సత్యనారాయణ. సుంకర ప్రారంభంలో కథకుడుగా కథను చెప్పడమేకాక, కష్టజీవి. రైతువిజయం .... స్టాలిన్‌గ్రాడ్‌యుద్ధం, అల్లూరి సీతారామరాజు, వీరేశలింగం మొదలైన బుర్రకథలను రచించారు.

సుప్రసిద్ధ బుర్రకథకుడు నాజరు, బెంగాల్‌కరువు, పల్నాటియుద్ధం, మొదలైన బుర్రకథలను రచించాడు. అలాగే లక్ష్మీకాంతమోహన్ మరికొన్ని బుర్రకథలు రచించాడు.

ప్రజానాట్యమండలి బుర్రకథదళాలతోపాటే ఆంధ్రదేశంలో మరికొన్ని బుర్రకథదళాలు కూడా వర్ధిల్లాయి. అనేకమంది రేడియోలో కథలు చెపుతున్నారు. లక్ష్మీకాంతమోహన్, బుర్రకథాసమ్రాట్ బెనర్జీ మొదలైనవారు. పభుత్వ పంచ వర్షప్రణాళికాకార్యక్రమాన్ని బుర్రకథలద్వారా ప్రచారం చేశారు.

ప్రజాహృదయాలను ఇంతగా చూరగొన్న ఈ బుర్రకథలయొక్క పూర్వచరిత్ర మనకు సరిగా తెలియడంలేదు. యక్షగానంతొలిదశ తెలిసినట్లు ఈబుర్రకథలయొక్క పరిణామం తెలియడంలేదు. జంగంకథగా వర్థిల్లిన ఈ కళారూపం నేడు బుర్రకథ అనీ తంబురాకథ అనీ తంథానకథ అనీ, గుమ్మెట్ల కథ అనీ అనేకప్రాంతీయభేదాలతో పిలువబడుతూ వుంది.

కృష్ణా గుంటూరుజిల్లాలలో ఈనాడు జంగంకథలంటే చాలమందికి తెలియదు. బుర్రకథ అనే పేరు ఆబాలగోపాలానికి తెలుసు. అలాగే రాయలసీమ జిల్లాలలో బుర్రకథ అంటే ఎవరికీ తెలియదు. అక్కడ తంథానకథలనే వ్యవహరిస్తున్నారు. ఈవిధంగా జంగంకథ ప్రాంతీయమైనభేదాలతో వివిధనామాలతో పిలువబడుతూవుంది. ఈకథకు ఇన్నిపేర్లు రావడానికి కారణంకూడ లేకపోలేదు.

కథల్లో ప్రధానకథకుడు తంబురాను ఉపయోగిస్తున్నాడు. ఆతంబురాను ఉపయోగించే బుర్రనుబట్టి దీనికి తంబురాకథ అనీ బుర్రకథనీ పేరు వచ్చివుండవచ్చు. ఈ కథలో ఉపయోగించే గుమ్మెట్లను డక్కీలనీ బుర్రలనీ వ్యవహరించడంవల్ల ఈకథలకు డక్కీకథలనీ బుర్రకథలనీ పేరు సార్థకమై యుండవచ్చునని కొందరి అభిప్రాయం.

ముగ్గురువ్యక్తులతో కూడిన కళారూపంయొక్క ప్రాముఖ్యం అనిర్వచనీయమైంది. ఇది ఉత్తమకళాయుధం గనుకనే చరిత్రాత్మకంగా ఆంధ్రప్రజాహృదయాలలో హత్తుకుపోయింది.

ఒక్కొక్క బుర్రకథాప్రదర్శనానికి 20 వేలమంది ప్రేక్షకులవరకూ హాజరయ్యారంటే నాట్యమండలిప్రదర్శనలకు ప్రజాదరణ ఎంతవుందో బోధపడుతూవుంది.

ఏదో ఒకగ్రామంలో బుర్రకథాకార్యక్రమం జరుగుతూ వుందంటే చుట్టుప్రక్కలగ్రామాలనుంచి ప్రజలు తండోపతండాలుగా బళ్ళు కట్టుకుని బారులుతీర్చి ఊరేగింపులద్వారా ఆటలతో పాటలతో ఆబాలగోపాలం కదలివచ్చేవారు, ప్రదర్శనం ప్రారంభమై మరలపూర్తిఅయ్యేలోగా ఒక్కవ్యక్తికూడ మధ్యలో లేచేవాడుకాదు. ప్రతిబుర్రకథ ప్రదర్శనం అంతబాగా ప్రదర్శింపబడేది. ఏప్రదర్శనం చూచినా ఏపాటవిన్నా ప్రేక్షకులకు అర్థంకానిది ఒక్కడీ వుండేది కాదు. ప్రజల మనస్తత్వాల ననుసరించీ, వారి అభిరుచుల ననుసరించీ ప్రదర్శనాలు జరుగుతూవుండేవి.

బుర్రకథాప్రదర్శనలను కొన్నిలక్షలమంది ప్రజలు చూశారు. తెలుగు జాతీయజీవితంలో బుర్రకథ ఒకప్రముఖస్థానాన్ని ఆక్రమించింది.

# జానపదసాహిత్యం

డా. నాయని కృష్ణకుమారి

జానపదవాఙ్మయం, నిజానికి సాహిత్యంలో చేర్చదగ్గదవునా ? లేక అది పురావిషయాలను (Antiquities) తెలియజేసే విజ్ఞానశాఖ, అనే ఆలోచనకు తావుంది. అదలా ఉంచి దీన్ని సాహిత్యంగా పరిగణించడం మీద పండితులకు చాలామందికి నిశ్చితమైనఅభిప్రాయం ఉన్నట్లు లేదు. అసలు, తెలుగుసాహిత్యప్రపంచంలో స్థితప్రజ్ఞులైనపండితులు చాలామందికి, తెలుగు సారస్వతంమీద, దీనిప్రభావం అంతో ఇంతో పడడానికి అవకాశం ఉన్నదేమో నన్న ఆలోచన లేశమైనా లేదు.

అచ్చుయంత్రాలు మొదలైనరోజుల్లో అనగా 19 వ శతాబ్దపు ప్రథమ పాదంలోనే తెలుగుగ్రంథాలఅచ్చు ఆరంభమైంది. తెలుగుభాషమీద మోజు పెంచుకున్న బ్రౌన్‌దొర స్వయంగా జానపదవాఙ్మయసేకరణకు దిగకపోయినా, దానిమీద సానుభూతినీ, కుతూహలాన్నీ వ్యక్తం చేస్తుండేవాడు. J. A. Boyle అనే మరొకదొర విమర్శనాదృష్టితో ఈసాహిత్యాన్ని సమీక్షించాడు. 20 వ శతాబ్దపుఆరంభంనుండీ, స్త్రీలపాటలూ, పిల్లలపాటలూ, శృంగారగేయాలూ, గ్రామికగేయాలూ చెదురుమదురుగా పుస్తకరూపంలో రా నారంభించాయి. మరీచిన్నసైజులో వీటిని అచ్చొత్తించి అమ్ముతుండేవాళ్ళు. కాకమ్మకథా, లక్షమ్మకథా వంటివీ, వ్రతకథలూ, విరివిగా ముద్రింపబడుతుండేవి. అమ్ముడు పోయేవికూడానూ.

కాని 19 వ శతాబ్దపు ద్వితీయార్ధారంభంలో శ్రీవీరేశలింగంపంతులుగారు చేపట్టిన సాహిత్యోద్యమం ఏవిధంగానూ జానపదవాఙ్మయాన్ని స్పృశించలేదు. ఆయన సంప్రదాయపద్ధతిలో నడిచిన సాహిత్యస్వరూపాన్నే చేపట్టాడు. జానపద మైనబాణీలనూ, రచనాపద్ధతినీ అవలంబించి ఉంటే ఆవాఙ్మయానికి ఎనలేని మేలు ఒనగూడి ఉండేది. అలా కాకపోవడం ఆవాఙ్మయం చేసుకున్న పాపం !

స్వరాజ్యోద్యమం ముమ్మరంగా సాగుతున్నరోజుల్లో, ఉత్సుకులై గుంపులుగుంపులుగా కూడుతున్నజనాన్ని ఆకట్టుకోవడానికి కార్యకర్తలు పాటలు పాడేవాళ్ళు. పదాలాపన చేసేవాళ్ళు. రచయితలు, జానపదులకు సంబంధించినబాణీలలో పదరచన చేసేవాళ్ళు.

"కోల్లాయి గట్టితే నేమీ మాగాంధి
కోమటై పుట్టితేనేమి "
"నమో హిందుమాతా, మాతా
నమో భరతమాతా"
"మా కొద్దీ తెల్లదొరతనమూ "
"కల్లు మానండోయ్, బాబూ
కళ్ళు తెరవండోయ్ "

వంటి పాటలన్నిటిపైనా జానపదులు పాడుకునే పాటల బాణీల ప్రభావం ఉంది.

భావకవులకోవకు చెందిన బసవరాజు అప్పారావుగారి గేయాలలో జానపదగేయప్రభావం బాగా ఉన్నట్లు కనిపిస్తుంది.

"గుత్తివంకాయ కూరోయి బావా
కోరి వండినానోయి బావా
కూరలోపలా నావలపంతా
కూర్చి పెట్టినానోయ్ బావా !"

"నల్లనిదంచును నవ్వగనేలా
నల్లదనములో నాణెములేదా"

"కోయిలా కోయిలా కూయబోకే
చిట్టినీ జ్ఞాపకం చేయబోకే "

"మావిడిచెట్టును అల్లుకున్నదీ
మాధవీలతొకటి
ఏమారెండిటిప్రేమసంపదా
ఇంతింతనలేమూ "—

ఇవన్నీ అటువంటివే.

తరువాత చెప్పవలసిన వ్యక్తి శ్రీ నండూరి సుబ్బారావుగారు ఈయన. 'ఎంకి' పాటల్ని ఎరగని ఆంధ్రు డుండడు. ఈయన

"జాము రేతిరి యేళ
జడుపుగిడుపూ మాని
చల్లంగ వత్తాది నాయెంకి
మెల్లంగ వత్తాది నాయెంకి "

అన్నా,

"నన్నిడిసి పెళ్లెళ్లినాడే నారాజు
మొన్న తిరగొత్త నన్నాడే "—

అన్నా,

ఎంకివంటి పిల్ల లేదోయి లేదోయి
ఎంకి నావంకింక రాదోయి రాదోయి

అన్నా,

పరిపూర్ణజానపదమనోభావాన్నే ప్రతిబింబించింది. వీటిల్లో, జానపద సాహిత్యంతో భావసామ్యమే కాక, భాషాసామ్యంకూడా ఉన్నట్లు గుర్తించ వచ్చును. లోకం 'నండూరి సుబ్బారావు' అనేపేరును విస్మరించగలిగితే, ఎంకిపాటలన్నీ అవిదితకర్తృకాలుగా, జానపదసాహిత్యంలోకి సులువుగా చేరిపోగలవు. అంతచక్కగా, సహజంగా వ్రాయగలిగా రాయన.

సృజనాత్మకతను పెంపొందించుకున్నకవులు తమరచనల్లో జానపద సాహితీలక్షణాలను ఈవిధంగా రంగరించుకోగా, పండితులూ, విమర్శకులూ మిక్కిలికుతూహలంతో అధ్యయనంచేసి ప్రశంసలు వెలువరించారు. అటువంటి వారిలో ముఖ్యులు శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, సురవరం ప్రతాపరెడ్డి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలగువారు. ఇదంతా స్వాతంత్ర్యయుగోదయానికి ముందే జరిగింది. ఇటీవలికాలాన శ్రీవేదునూరి గంగాధరం, డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, హరి ఆదిశేషువు మొదలైన వారు ఈసాహిత్యంమీద విశేషశ్రద్ధ చూపించారు. దీన్ని పరిశోధనావిషయంగా స్వీకరించి డాక్టర్. బి. రామరాజు, నేనూ, డా. తంగిరాల వెంకటసుబ్బారావూ పట్టాలు పొందగలిగాము.

1947 తరువాత, జానపద, సాహితీశాఖగా, బుఱ్ఱకథ (Ballad) తెలుగుసాహిత్యంలో ఒకస్థానాన్ని పొందగలిగింది. దేశవీరుల్నిగురించీ, ప్రముఖసంఘటనల్నిగురించీ, పుంఖానుపుంఖాలుగా బుఱ్ఱకథలు నాగరకులచేత రచింపబడ్డాయి. ఈకళను పోషించిన వారిలో ముఖ్యులు 'నాజర్'దళంవారు. వాళ్ళు దేశవీరులకథల్నీ, విప్లవకారులచరితల్నీ, బుఱ్ఱకథలరూపంలో ప్రచారంలోనికి తేవడం అందరెరిగినదే. ఇటీవలనే 'కుమ్మరిమాస్టారు' అనే ఆయన, దీన్ని విమర్శనాపూరితంగా, హాస్యయుతంగా, జనరంజకంగా, ప్రచారం లోనికి తెస్తున్నాడు. జానపదకళావిభాగమైన తోలుబొమ్మలాటల్ని ప్రచార సాధనంగా ప్రభుత్వంవారుకూడా వినియోగించుకుంటున్నారు.

ప్రభుత్వం సంగీత నాటక ఎకాడమీని స్థాపించి జానపద
ంలంగా వారిసాహిత్యానికీ స్ఫూర్తినీ ప్రాచుర్యాన్నీ
స్తున్నది. సాహిత్య ఎకాడమీ కూడా, జానపదసాహిత్య
రించే ప్రయత్నంలో ఉన్నది. తెలుగుదేశంలోని
జానపదసాహిత్యం ప్రత్యేకాధ్యయన విషయంగా (Special
సంపాదించుకోగలిగింది. ఈనడుమ యెంకిపాటల
గోపాలరావు 'మల్లిపాటలు', శ్రీ వెల్దండ రఘుమారెడ్డి
చక్కని తెలంగాణా మాండలికభాషలో వెలయించి యీ
. ఇంకా 'కూనలమ్మపదాల' వంటివి వెలువడుతున్నాయి.
్వతంత్ర్యయుగోదయంలో సాధించిన ప్రగతి స్వరూపం

న్ని అనుకరిస్తూ సాంప్రదాయికులు, లేదా, నాగరికులు
ోనికి లేవాలన్న పద్ధతికన్నా, దీన్ని పురావిషయంగా
ు ఉన్నట్లుగా సేకరించి, అధ్యయనం చెయ్యాలనే పద్ధతి
. అందువల్ల మరుగున పడిన పురావిజ్ఞానం ఎంతో
పకాశం ఉన్నదనుకుంటాను.



నా ఆరుద్రా ! ఒక తమాషా
నాయం నిలిచే ఉంటుంది హమేషా
'చారాలు మారుతూ ఉంటాయి నిజం
సంప్రదాయం తాతముత్తాతలనాటిధనం
జీవననాళిక
దగితి.''

—'ఆరుద్ర-సాహిత్యోపనిషత్'

# ఆధ్యాత్మికసాహిత్యం

శ్రీ వేలూరి సహజానంద

అసలు మనస్వాతంత్ర్యఉద్యమం నిజానికి ఆధ్యాత్మికంగానే ప్రారంభమైంది. ఇతరదేశాల్లోని ఉద్యమాలతో మనఉద్యమాన్ని పోలిస్తే, ఈవిషయం సుస్పష్టమవుతుంది. ఆయాదేశాలకు రాజకీయస్వాతంత్ర్యం దాని కదే ఏకైక లక్ష్యం. అందుకేనేమో హింసావిధానం ఆదేశాలనాయకులకు శరణ్య మైంది.

కాని అన్నిస్వాతంత్ర్యాలకూ మూలం ఆధ్యాత్మికస్వాతంత్ర్యం అని తెలుసుకొన్నమహాపురుషులు ఇక్కడ స్వాతంత్ర్యఉద్యమానికి స్వాగతం పలి కారు. 1857 సిపాయివిప్లవంలో కూడా ఎందరో ఆధ్యాత్మికవాదులు, సన్న్యా సులు పాల్గొన్నారు. శత్రువుపై ద్వేషం లేకుండా స్వరాజ్యసమరంలో పాల్గొన్న యోగులూ ఉన్నారు. ఈఆధ్యాత్మికయోధులు కేవలం భారతీయులు మాత్ర మేకాదు. నిజానికి వారు విశ్వపురుషులు. వారిపోరాటం భారతస్వాతంత్ర్యంకోసమేకాదు. విశ్వమానవస్వాతంత్ర్యకోసం.

ఒకదేశాన్ని మరొకదేశం, ఒకజాతిని మరొకజాతి, ఒకవర్గాన్ని మరొకవర్గం పీడించటం ఆధ్యాత్మికంగా అజ్ఞానం, అక్రమం. అందుకనేగదా, ఆనాటి మననాయకులు కేవలరాజకీయనాయకులు కాదు. రాజా రామ్‌మోహన్ రాయ్, రామకృష్ణపరమహంస, కేశవచంద్రసేన్, స్వామివివేకానంద, రవీంద్రులు, బాలగంగాధర్ తిలక్, గాంధీజీ, స్వామిశ్రద్ధానందు, శ్రీ అరవిందులు వీరందరూ మతమూఢాచారాలను నిశితంగా విమర్శించినవారే। అయితే ఆధ్యాత్మికసత్యాన్ని గుర్తించిన మహాజ్ఞానులు. మతాల కతీతమై, సకల మానవు లను ఏకసూత్రంతో, విశ్వసౌజన్యసూత్రంతో సమైక్యంచేసే దర్శనం ఒక్క ఆధ్యాత్మికదర్శనమే అని వీరు సనాతన(శాశ్వత)సత్యాన్ని సమకాలికంగా నిరూ పించారు.

స్వరాజ్యం అవతరించినతర్వాత కూడా, ఈసత్సంప్రదాయం కొనసాగు తూనే వస్తోంది. భావకవిత్వపురోజుల్లోకూడా కేవలమానవపరిమితులను దాటి పోయి, మొత్తం ఉనికిలో తదాత్మ్యంపొంది, ఆమహానుభూతిని కవితారూపంలో ప్రకటించినవారు లేకపోలేదు.

భావకవులంటె, ఆధ్యాత్మికంగా చూస్తే ముందుగా కళ్ళలో మెదిలేది—

వేదులవారు, బసవరాజు అప్పారావుగారు. కేవల కవితాపరిధుల్లోంచి చొచ్చుకుపోయి, అంతరాంతరాలఅగాధాలను అన్వేషించినట్లు కన్పిస్తారు వీరు. ఇంకా కొ. సుబ్బారావుగారు ఇత్యాది.

1947 తర్వాత అభ్యుదయమార్గం స్థిరపడింది. సమకాలికరాజకీయాల ప్రభావం ప్రబలంగా ఉన్నప్పటికీ, ఈఉద్యమానికీ మూలం అధ్యాత్మికం. మనిషిని మనిషిగా పరిగణించట మనేది నిజానికి ఆధ్యాత్మిక దర్శనం వల్లనే సాధ్యమౌతుంది. అయితే కొందరు విశిష్టరచయితలను రాజకీయ సాహిత్యం తృప్తిపరచలేకపోయింది. ఇదంతా ఏమిటి ? ఈరాగద్వేషా లేమిటి ? దౌర్జన్యాన్ని శిరసావహించాక, మనిషితత్త్వం పశుత్వంగా వికృతం చెందదా? మొత్తం ప్రపంచస్థాయిలోనే ఎందరో విశిష్టరచయితల్లో ఈఅమృత, ఆలోచనామృతమథనం ప్రారంభమైంది.కొందరికి రాజకీయంగా, మరికొందరికి సాంఘికంగా, ఇంకొందరికి తాత్త్వికంగా _ మొత్తంమీద సాహిత్యంలో ఆధ్యాత్మికచింతన ఏదోవిధంగా ప్రారభంమైంది. ఇది కేవలం మతాల పరిభాషలో కాకపోవచ్చు కాని తత్త్వతః ఇది ఆధ్యాత్మిక సంచలనం.

మనతెనుగు సీమలో అడుగుపెట్టితే, మొదట్లో అందర్నీ ఆశ్చర్యపరచే ఒక ప్రసిద్ధరచయిత ఎదురౌతారు. ఆయన శ్రీ గుడిపాటి వెంకటాచలం. చలంగారిరచనల్లో స్వంతప్రవృత్తుల పరితృప్తిమాత్రమే అపేక్షించుకున్న వారుమాత్రం, 'ఇదేమిటి, రమణులనుగురించి వ్రాయాల్సిన మాచలం రమణమహర్షిని ఆశ్రయించాడేమిటి చెప్మా' అని నివ్వెరపోయివుంటారు. కాని ఎవరి జిజ్ఞాస చిత్తశుద్ధితో ప్రజ్వలిస్తుందో, వారు తోటివారల పొగడ్తలకు బలికారు. కాగా జిజ్ఞాస తమను ఎక్కడకు తీసుకువెళ్లితే అక్కడికి వారు వెళ్ళటానికి వెనుకాడరు. శ్రీ చలంగారి జ్ఞానయాత్రకు గమ్యం అరుణాచలం అయింది. అధునాతనఆంధ్రసాహిత్యచరిత్రలో అరుణాచల-చలంకు ప్రత్యేకస్థానం ఉంది.

ఇదేమాదిరి జిజ్ఞాసువు త్రిపురనేని గోపీచంద్. చలం జిజ్ఞాస స్త్రీపురుష బాంధవ్యంతో ప్రారంభమైతే గోపీచంద్‌లో జిజ్ఞాస సాంఘికంగా, తాత్త్వికంగా ప్రారంభమైంది. నాస్తికత్వంనుంచి ఆస్తికత్వానికి పరిణతి చెందిన అదృష్టవంతుడు గోపీచంద్. అదృష్టవంతుడని అనటం ఎందుకంటే, ఈ పరిణామస్థితిలో కొందరేదోవిధంగా దెబ్బతింటూఉంటారు. అలాకాక గోపీచంద్ ఈసమన్వయాన్ని ప్రశాంతంగా సాధించుకున్నాడు. చలం

అరుణాచలానికి వెళ్ళితే, గోపీచంద్ పుదుచ్చేరి వెళ్ళాడు. శ్రీ అరవిందుల దర్శనం గోపీచందుకు కొత్తదారిని చూపించింది. గోపీచంద్ జీవితంలో, సాహిత్యంలో ఇదొక కొత్తమలుపు. ఇంకా కొన్నేళ్ళు జీవించివుంటే, "సమర్థుని జీవితయాత్ర" అనే కొత్తనవల వ్రాసేవారేమో।

వీరిద్దరికన్న పైకి భిన్నంగా కనబడుతాడు బుచ్చిబాబు. కేవలం సాహిత్యంమాత్రమే తమవ్యవసాయం అన్నట్టు కన్పిస్తుంది, కాని వీరిలో కూడా ఏదో లోలోపల సంచలనం ఉండివుండకతప్పదు. జిజ్ఞాస అనేది కలగాలేగాని, కలిగితే అంతే। అది ఎటు తీసుకువెళ్తుందో చెప్పలేం. సోమ ర్సెట్ మామ్ బుచ్చిబాబుకు అభిమానరచయిత. మామ్‌రచనల్లో పైకి బాగా కనబడేది పాతరీతులపట్ల, ముఖ్యంగా మతవిశ్వాసాలపట్ల, అవహేళన. ఇతరుల అజ్ఞానాన్ని హేళనచేయటం తేలికే, కాని స్వంత అజ్ఞానం సంగతిఏమిటి అనే దారుణప్రశ్న వేధించినప్పుడే, మనిషిలో మానసికభూకంపం కలుగుతుంది. సోమర్సెట్‌మామ్ భారతదేశానికి వచ్చాడు. అరుణాచలంలో రమణమహర్షిని చూశాడు. బుచ్చిబాబుపై ఈసంఘటనప్రభావంకూడా పడివుంటుంది. కాగా బుచ్చిబాబుకు మరొకఅభిమానమేధావి బర్ట్రాండ్‌రస్సెల్. ఇంక ప్రపంచంలో మతవిశ్వాసాలను, ఆధ్యాత్మికరీతులను సమూలంగా నిర్మూలించగల అద్వితీయ మేధావి వచ్చాడు. రస్సెల్‌ప్రవేశం దేవునినిష్క్రమణం అనుకొన్న ఉద్రేక పరులు లేకపోలేదు. ఎంతఅభిమానమేధావిఅయినా రస్సెల్‌రచనలు కూడా బుచ్చిబాబుకు పూర్తితృప్తిని ఇవ్వలేకపోయినై. ఎలా ఇవ్వగలుగుతై ? రస్సెల్ జీవించినతీరు, శాంతిఉద్యమంలో అతను పాల్గొనటం అణ్వాయుధాలను వ్యతి రేకించటం, రష్యాను ముందు అమోఘంగా పొగడి, ఆతర్వాత తెగడటం.... ఇదంతా తత్త్వతః ఆధ్యాత్మికమే. జీవితంలో నశించనిది లేదు; ఈ ప్రపంచం గుప్పెడుబూడిదే అనుకొనేవాడు శాంతికోసం అంత ఆక్రం దించటం దేనికి ? మనిషిలో అమూల్యమైన దేదో వుంది అనేస్పృహ వల్లనే రస్సెల్ అంతవిశాలమానవతాదృక్పథాన్ని అనుసరించ గలిగాడు. బుచ్చిబాబు రస్సెల్‌రచనలనుంచి సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆధ్యాత్మికరచనలవైపు మళ్ళాడు. కేవలకథాకథనశిల్పవ్యామోహంలో చిక్కుకొనక, ఆశిల్పానికే ప్రాణమయిన సత్యాన్ని గురించిన తాత్త్వికచింతన బుచ్చిబాబు రచనల్లోనూ ప్రతిబింబిస్తుంది. ముఖ్యంగా చివరిరోజులరచనల్లో దురదృష్టవశాత్తు, వీరు కూడా గోపీచంద్‌లాగానే అకాలమృత్యువుకు గురిఅయ్యారు. సుమారించు మించు ఒకేవయస్సులో కూడానేమో। వీరింకాకొన్నేళ్ళు జీవించివుంటే, 'చివరకి

మిగిలేది మొదలే' (ఆదిమధ్యాంతాలుఒకటే) అనే ఇంకొకనవల వ్రాసేవారేమో! రామాయణం, భగవద్గీత ఇత్యాదిగ్రంథాల్లో బుచ్చిబాబు గాఢమైన ఆసక్తిని చూపేవారంటే, కొందరికీ ఆశ్చర్యంకూడా వేయవచ్చు. అవి మానసికంగా వార్ధక్యలక్షణాలని వ్యాఖ్యానించగలవారూ ఉండవచ్చు.

చలం, గోపీచంద్ బుచ్చిబాబు....ఈరచయితలనే ఎందుకు ప్రస్తావించా మంటే ఓవిధంగా వీరు ఈఇరవయ్యోశతాబ్దప్రతినిధులు. మొదట్లోనే ఆధ్యాత్మికవాదులు కారు. కాని జీవితసత్యాన్ని గురించిన నిరంతరఅన్వేషణలో, వీరు అనుభవాలద్వారా, తర్కంద్వారా, స్ఫురణద్వారా ఆధ్యాత్మికమార్గంలో అడుగుపెట్టారు.

పూర్వఆధ్యాత్మికగ్రంథాలను మళ్ళీ తిరిగి వ్రాయటమూ ఆధ్యాత్మిక సాహిత్యం కిందవస్తుంది. ఆరచనలు బహుశా, పూర్వంలోకన్న, ఇప్పుడే అనగా 1947 తర్వాతనే ఎక్కువగా వస్తున్నయేమో! ఇలాంటి పూర్వగ్రంథాల్లో ముఖ్యంగా చెప్పుకోవలసింది భగవద్గీత. గీతకు అనువాదమో, పరిచయమో, వ్యాఖ్యానమో, ఎదోఒకటి ప్రచురితం అవుతూనే వుంటుంది - ఏటేటా! ఈనాటి పరిస్థితులకు అన్వయించేతీరునకూడా రచనలు వస్తూనేవుంటై. అలాగే రామాయణం. విశ్వనాథవారి రామాయణకల్పవృక్షానికి జ్ఞానపీఠబహుమానం రావటం కూడా ఆధ్యాత్మికరచనలపట్ల అధికమవుతున్న ఆదరానికి (విలువైన)నిదర్శనం. పురాణపండవారు మహాభారతాన్ని తెనిగించారు.

ఇక సాహిత్యరీతుల్లో, వచనకవిత్వం వచ్చి, బజారునపడ్డాక, కొంత మంది నిస్పృహచెందారు. సాహిత్యంలో కలిపురుషుని ప్రవేశం ఇది అనుకుని మూర్ఛపోయిన వారుకూడా కొందరుండవచ్చు. ఏదో ఒకానొకరాజకీయ సిద్ధాంతాన్ని ముసుగ్గా వేసుకొనివచ్చినా, అదేంకవిత అయినప్పటికీ, వచన కవితే అయినా కూడా, చివరకు కవిత్వానికే హృదయమైన ఆధ్యాత్మికస్పందాన్ని ఎవరు కాదనగలరు? బహుశా ఈశతాబ్దపుమానవ ఆవేదనను, ఆక్రందనను ఆధ్యాత్మికంగా విన్పించకలిగిన వీలు వచనకవితకు ఉందేమో! భావకవుల్లో, ఇంతకుమునుపు ఉదాహరించినవారితోబాటు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు,నాయని సుబ్బారావుగారు, అడవి బాపిరాజుగారు....ఇత్యాది ఆధ్యాత్మికరచనలు చేయ వలసివచ్చినట్లే, అభ్యుదయరచయితలుకూడా కొందరు చేయకతప్పలేదు. ఆదే జీవితపుగమ్మత్తు. ఆరుద్రరచనల్లో ఆధ్యాత్మికస్పృహ లేదని ఎవరనగలరు? శ్రీశ్రీ దారితప్పడేమో నని అనిపిస్తుంది. శ్రీరంగం నారాయణబాబు ఆకాలంలో

కన్నుమూసినకవి। కాని అతనొకజ్వాల। జ్యోతి। ఆ(రుధిర) జ్యోతిలో ఆధ్యాత్మికకాంతులు లేవా। మరి శిష్టాసంగతేమిటి? దాశరధి తత్త్వతః కవి. ఆతత్త్వం, ఆధ్యాత్మికతత్త్వం ఎప్పుడో ఒక్కప్పుడు ఏదోవిధంగా అక్షర రూపం తాలుస్తూనేవుంటుంది. తాలుస్తూనేవుంది. అరిపిరాల విశ్వానికి నేటి రచయితల్లో విశిష్టస్థానం ఉంది. పైపైప్రాకారాలవద్ద షికార్లుచేయక, జీవితపు లోతుల్లోకి ఈదుకొనివెళ్ళిపోగలిగే సునిశితదృష్టి వున్ననవీనభావుకుడు. అలాగే గుంటూరు శేషేంద్రశర్మగారిరచనలు కూడా. మరి సి. నారాయణరెడ్డిగారి రచనల్లోనూ ఆధ్యాత్మికం దోబూచులాడుతూనే వుంటుంది. ముదిగొండ శివప్రసాద్ రచనల్లో ఆధ్యాత్మికమైనతపన స్పష్టంగా కనబడుతుంది.

మరీ అధునాతనమైన దిగంబర విప్లవకవితారీతులు కూడా పోయినకొద్దీ మార్పుచెందకతప్పదు. (ఉదాహరణపూర్వకంగా కొందరు రచయితలను గురించి మాత్రమే ప్రస్తావించటం జరిగింది). మానవుడు తోటిమానవుడికి చేసే ఘోరమైన అన్యాయం, సాంఘికదౌర్జన్యం, వంచన-ఇవి పైపైమార్పిడులవల్ల మాసిపోయేవికావు. రష్యా, చైనా, హంగరీ, జకొస్లొవేకియా, వియత్నాం, కొరియా వగైరా విప్లవ-దేశాలచరిత్ర కూడా ఈసత్యాన్నే మరింత బలపరుస్తుంది. ఎవరికీ హానిచేయక అందరికీ మంచిని చేయగలశక్తిని మానవుడు కేవల ఆర్థిక, రాజకీయ విధానాలనుంచి సంపాదించలేడు. సమీకరించుకోలేడు. ఆసకల-సౌజన్య-శక్తి ఆధ్యాత్మికఅనుభూతినుంచే సిద్ధిస్తుంది. అలవాటు చేసుకొన్నదౌర్జన్యం, ద్వేషం హింస అవసరం తీరగానే, అదృశ్యమైపోవు. అప్పు డాపాములు పెంచినవారినే కాటువేస్తయ్. ప్రతివిప్లవంలోనూ జరిగేది ఇదే. విప్లవం దానినాయకులను మింగేస్తుంది. ఒకచిత్రం. అహింస, ఆధ్యాత్మికం అనేవి ఏవో పూర్వకాలపు ఛాందసాలు, మూఢవిశ్వాసాలు, హింస అనేది శాస్త్రీయం, నవీనం అని అనుకుంటూవుంటాం. కాని ఇది పొరబాటు. హింస ముందు, అహింస తర్వాత. తనకు తనే అనే నాస్తికత్వంముందు, నన్ను రూపొందించే సత్యం ఉందనే ఆస్తికత్వం తర్వాత. ఇంకోవిధంగా చెప్పాలంటే హింస అనేది ఛాందసం. అహింస అనేది నవీనం. మౌలికమైనవిప్లవం ఆధ్యాత్మికం.

ఏదేశసాహిత్యంలోనైనా ఆధ్యాత్మికచ్ఛాయలు పడకతప్పదు. అయితే ఈశతాబ్దానికి, దశాబ్దానికి అటు వైజ్ఞానికప్రభావంతో తూలతూగగలిగే ఆధ్యాత్మిక ప్రభావాన్ని ప్రసరింపజేయగలరచనలు వస్తున్నయ్యా అని అంటే విశ్వస్థాయిలో

కూడా జవాబుచెప్పటం మహాకష్టం. సీదలు వేరు, మూలం వేరు. జీవితాన్ని అన్నివిధాలా ఆధ్యాత్మికదర్శనం తీర్చిదిద్దగలదు,దిద్దగల్గుతుంది అనే సమగ్రమైన. గాఢమైన స్పృహ రచయితను ఉత్తేజపరిస్తేతప్ప, అతనిరచనల్లో ఆధ్యాత్మిక విశిష్టత ఉండదు. ఆధ్యాత్మికదర్శనం సమకాలికజీవితసమస్యలను పరిష్కరించ గలదు అని రచన నిరూపించలేకపోతే, అది కేవలం పాతకు ఒక కార్బన్‌కాపీ అవుతుంది. అలాకాక, పరిష్కరించగలదు అని రచన నిరూపిస్తే, అనుభ వింపజేస్తే ఇప్పటి సాహిత్యప్రతిష్ఠంభనలోంచి ఒకకొత్తదారి కనబడుతుంది.

సృజనాత్మకంగా రచనలుచేసేవారు ఆధ్యాత్మిక 'దృష్టి'ని సరిగా అల పరచుకున్నప్పుడు, ప్రస్తుతస్థితిపట్ల కేవలం అసహాయులై నిర్లిప్తులుగానూ ఉండరు. అలా అని ఊరికే ఉద్రిక్తులైపోరు. జీవితంపట్ల యథార్థమైన శ్రద్ధ, దాన్ని సాధించే శుభ్రప్రదమైనశక్తి, దాన్ని అందరితో పంచుకొనే సుహృ ద్భావం-ఇవన్నీ ఏర్పడుతయ్. నేటి సమాజాన్ని, పాఠకులను ఉర్రూతలూపే శక్తిమంతమైన ఆధ్యాత్మికరచనలకు మనం సమీపంలోనే ఉన్నామని అని పిస్తుంది. సామాజికజీవిత మనే మహేతిహాసంలోని (స) జీవపాత్రల్లో వారివారి స్వార్థాలే కాదు ఘర్షణపడుతోంది. ఆస్వార్థాలను మించిన పరార్థమేదో, పరమార్థమేదో ఆరాగద్వేషాల్లోంచి, కోపతాపాల్లోంచి, జీవన్మరణాల్లోంచి స్వ-పర-వంచనల్లోంచి క్రమంగా ఆవిష్కృతమవుతూ వుంటుంది. ఈనానావిధ పాత్రలన్నిటిలో, అన్నిటివెనుక, కనబడని నేపథ్య - పాత్రఒకటి మనకు దృశ్యాదృశ్యంగా కనబడుతుంది - మబ్బులవెనుకసూర్యునిలాగా. ఆనేపథ్య పాత్రయే చివరకు మనకంటికి హృదయానికి ఆనేది.ఇలా రచయిత స్పందించటం ఆధ్యాత్మికం. అందుకే ఆధ్యాత్మికరచయిత వ్రాసేరచన పైకి విషాదాంతం అయినా, యథార్థానికి అది విషాదానికి అంతం. అంతే. అలాకాక, ఆధ్యాత్మిక స్పందం లేనిరచన పేరుకు సుఖాంతమే అయినా, అది సుఖానికి 'అంతం' కావచ్చు. పాఠకులసంఖ్య విస్తృతంగా పెరిగిపోతున్న ఈరోజుల్లో రచయిత తనబాధ్యతను గుర్తించటం ఆధ్యాత్మికం. తన అయోమయానికి పాఠకులను గురి చేయటం ఏమంతసబబు! తనఅక్షర - దౌర్జన్యం సమాజంపట్ల హింసే. ద్వేషం వెలిగక్కే కలం హంతకునికత్తిగా రూపొందుతుంది. కొందరు తోటివారిని ఆర్థికంగా పీడిస్తే, ఇంకొందరు సాహిత్య - పరంగా పీడిస్తారు. పీడన పీడనే!

స్వాతంత్ర్యమనే పదానికి అర్థాన్నికేవలం రాజకీయాలకే పరిమితంచేస్తే, అది ఓపఫంగా క్రమంగా పారతంత్ర్యంగా పరిణమించవచ్చు. మానవవ్యక్తి కున్న స్వచ్ఛందమైన ఆధ్యాత్మికస్వాతంత్ర్యాన్ని సాహిత్యంలో ప్రతిబింబింప జేయగలిగే రచయిత ధన్యుడు. అలాంటిరచయితలు రాజకీయరచయితలుకారు- వారుమాత్రమే మనకొక కొత్తదారిని, కాంతినిచూపగలుతారు. భవిష్యత్తువారిదే.

# అనువాద సాహిత్యం

డా. భీమసేన్ 'నిర్మల్'

స్వాతంత్ర్యంరావడానికిముందు ఒకవిశిష్టదృక్పథంతో-ఆంగ్లంనుండి ఆదర సాంఘికజీవితాన్ని చిత్రించేరచనలు, వంగభాషనుండి జాతీయోద్యమానికి సంబంధించినరచనలు, ఆతరవాత డిటెక్టివ్‌నవలలు, అనువాదాలు చేయబడ్డవి. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత అలా కాకుండా, తరతమభావం లేకుండా, అనువాదకునిఅభిరుచి లేక ప్రచురణకర్త అభిలాష ననుసరించి, ఇతరభాషలనుండి అనువాదాలు చేయబడ్డాయి. ఇలా అసంఖ్యాకంగా వెలసిన అనువాదాలలో ప్రథమస్థానం అలంకరించినవి నవలలు. ఆతరవాత కథలూ, కవిత్వమూను. పాఠకుల పఠనాసక్తినిబట్టి నవలలు ఎక్కువగా అనువదించబడడం స్వాభావికమే. వీటిల్లో వంగ, హిందీభాషలనుండి, ఆంగ్ల, రష్యన్ భాషలనుండి చేయబడ్డ తెలుగుఅనువాదాలు సంఖ్యాదృష్ట్యాను, గుణందృష్ట్యాను పేర్కొనతగినవి. అయితే శరత్‌వలె తెలుగుపాఠకుణ్ణి ఆకట్టుకొన్న రచయిత మరొకడు లేడంటే అతిశయోక్తికాదు. శరత్‌రచనలప్రభావం కూడా తెలుగు నవలారచయితలమీద బాగా కనబడుతుంది. శరత్‌రచనలను అనువదించిన వారిలో బొందలపాటి శివరామకృష్ణ, శకుంతలాదేవి ప్రముఖులు.

శతజయంతిసందర్భంగా రవీంద్రనాథటాగూరువంగరచనలను చాలామంది మళ్ళీ అనువదించారు. వీరిలో చాలామంది సరాసరివంగభాషనుండికాక ఆంగ్లానువాదాలు ఆధారంగా తెలుగుచేశారు. వంగభాషనుండి చక్కగా అనువాదం చేసిన వారిలో శ్రీదండమూడి మహీధర్, శ్రీమద్దిపట్ల సూరి పేర్కొనదగిన వారు.

తారాశంకర్ బంద్యోపాధ్యాయ వంగభాషలో రచించిన 'గణదేవత భారతీయజ్ఞానపీఠ్‌వారి లక్షరూపాయలబహుమతి అందుకొన్ననవల. 'గణదేవత' నవలానువాదం ఆంధ్రపత్రిక (ఆదివారం సారస్వతానుబంధం)లో సీరియల్‌గా ప్రచురించబడుతున్నది.

సుప్రసిద్ధ హిందీరచయితలయిన యశపాల్, జైనేంద్రకుమార్, ఇలా చంద్రజోషి, జయశంకరప్రసాదు మొదలయినవారి నవలలు తెలుగులోనికి అనువదించబడ్డాయి. హిందీ, ఉర్దూభాషలలో కథారచయితగా, నవలారతయితగా

పేరొందిన కిషన్‌చందర్ రచనలుకూడా తెలుగులోకి వచ్చాయి; హిందీ నుండి తెలుగుచేయబడిన నవలలో ఆచార్య హజారీప్రసాదు రచించిన 'బాణభట్టుని ఆత్మకథ' పేర్కొనదగినది. ఈఅనువాదం కేంద్రసాహిత్యఅకాడమీ కొరకు కీ.శే.ఏ.సి. కామాక్షిరావుగారు చేశారు. అలాగే శ్రీదాశరథిగారు అనువదించిన 'గాలిబుగీతాలు', వారిసోదరుడు రంగాచార్యులుగారు ఉర్దూనుండి అనువదించిన 'ఉమ్రావ్అదాజాన్' పేర్కొనదగినవి. కీ.శే.బృందావన్‌లాల్‌వర్మ హిందీలో రచించిన 'ఝాన్సీకీరానీ - లక్ష్మీబాయి' నవలను శ్రీమతి యం. సరస్వతి తెలిగించారు. హిందీ ఛాయావాదకవిత్వరంగంలో పేరొందిన ఏకైకమహా కావ్యం 'కామాయని': ఈమహాకావ్యాన్ని శ్రీవావిలాల సోమయాజులుగారు, డా. ఇలపావులూరి పాండురంగారావుగారు అనువదించారు. డా. పాండురంగా రావుగారు భారతీయజ్ఞానపీఠ్‌వారి లక్షరూపాయలబహుమతినందిన 'చిదంబరా' (హిందీమూలం: శ్రీసుమిత్రానందన్‌పంత్)ను, జయిశంకరప్రసాదు రచించిన లఘుకావ్యం 'ఆఁసూఁను - కన్నీరు'అనుపేరుతో ఆంధ్రీకరించారు. ఇవి కాక ఇంకా చాలారచనలు తెలుగులోనికి అనువదించబడ్డాయి.

**తెలుగునుండి ఇతరభాషలలోకి అనువాదాలు:** హిందీనుంచేకాక ఇతర భారతీయభాషలు - కన్నడం, మరాఠీ, తమిళం, మళయాళం, ఒరియాభాషల నుండి చేయబడ్డ అనువాదాలు ఎక్కువ. కన్నడంలో 'త్రివేణి' రచించిన నవలలు ఎక్కువగా అనువదించబడ్డాయి. దాదాపు వీటన్నింటిని శర్వాణి అనువదించారు. కొరటి శ్రీనివాసరావుగారు కన్నడంలో విద్యానగరరాజ్య చరిత్రఆధారంగా వ్రాసిన నవలలను 'విద్యానగరనవలామాలిక' అన్నపేరుతో శ్రీ శ్రీనివాసపురం సోదరులు అనువదిస్తున్నారు. పుట్టప్పగారి కన్నడవ్యాసాలకు శ్రీతిరుమలరామచంద్రగారి అనువాదాలు చాలాసరసంగా ఉన్నాయి. మరాఠీ నుండి నవలలు అనువదించినవారిలో శ్రీయస్.జగన్నాధ్ ప్రముఖుడు. ముఖ్య మంత్రులు, విద్వద్వరేణ్యులు అయిన శ్రీ పి. వి. నరసింహారావుగారు సుప్రసిద్ధ మరాఠీనవలారచయిత కీ. శే. హరినారాయణఆప్టేగారి ఒకనవలను 'అబలా జీవితం' అనేపేరిట అనువదించారు. తమిళంలో యం. వరదరాజన్ వ్రాసిన నవలను 'మధువుమాధుర్యం' అనేపేరుతో శ్రీజయచంద్రారెడ్డి అనువదించారు. శ్రీ పి. సీతారామయ్యగారు 'తిరుప్పావై', 'తిరుక్కురళ్' అన్నగ్రంథాలను అనువదించారు. శ్రీ వానమామలై వరదాచార్యులుగారుకూడా ఈమధ్యనే 'తిరుప్పావై'ని సరసంగా పద్యాల్లోకి అనువదించారు. కీ. శే. కె.యం.మున్షీ

గారు గుజరాతీభాషలో వ్రాసిననవలలకు, కొన్ని ఒరియారచనలకు, శ్రీ పురిపండా అప్పలస్వామిగారు చేసిన అనువాదాలుకూడా పేర్కొనతగినవి.

పాశ్చాత్యభాషలనుంచి, ముఖ్యంగా ఆంగ్లం, రష్యనుభాషలనుండి అనువాదాలు బహుళంగా చేయబడ్డాయి. సాధారణంగా ప్రపంచంలో ఏభాషలో వ్రాయబడ్డా, దాని ఇంగ్లీషుఅనువాదాన్నే మనరచయితలు ఆధారంగా గ్రహించారు. ఫ్రెంచి, జర్మన్, అమెరికన్, చైనాభాషలలోని ప్రముఖరచనల అనువాదాలు మనభాషతో వచ్చాయి. ఈఅనువాదకులలో శ్రీ బెల్లంకొండ రామదాసు, శ్రీ శ్రీనివాస చక్రవర్తి, నండూరి రామమోహనరావు, రెంటాల గోపాలకృష్ణ, శ్రీతెన్నేటి సూరి, శ్రీసూరంపూడి సీతారాం, శ్రీకొడవటిగంటి కుటుంబరావు, శ్రీ అవసరాల సూర్యారావు ప్రముఖులు.

గాంధీశతజయంతిసందర్భంలో గాంధేయసాహిత్యానికి చెందిన చాలా రచనలు - హిందీ, ఆంగ్ల, గుజరాతీభాషలలో వ్రాయబడ్డవి - తెలుగులో వచ్చాయి. గాంధేయసాహిత్యాన్ని అనువదించినవారిలో శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీహరి ఆదిశేషు, శ్రీ సూర్యప్రకాశరావు, డా. అడపా రామకృష్ణారావు, డా. నిర్మల్ పేర్కొనదగిననారు.

ఇంతమటుకు ఇతరభాషలనుండి తెలుగుచేయబడిన రచనలనుగురించి తెలుసుకొన్నాము. ఇటీవల పెక్కుతెలుగురచనలు ఇతరభాషలలోనికి అనువదించబడటం జరుగుతున్నది. శ్రీరాచకొండ విశ్వనాథశాస్త్రిగారికథలు కొన్ని, డా. అరిపిరాల విశ్వంగారి కవితలు కొన్ని, శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారి 'ఋతుఘోష' అనే ఖండకావ్యమొకటి ఆంగ్లంలోనికి అనువదింపబడ్డాయి. శ్రీసన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు తెలుగురచనలను సంస్కృతీకరించారు. స్వయంగా కవులు కావడంతో, తెలుగు కావ్యంలోని కావ్యసౌందర్యం పొల్లుపోకుండా వారు 'కళాపూర్ణోదయము', 'శ్రీవేంకటేశ్వరవచనాలు' శ్రీమదాంధ్రమహాభాగవతంలోని కొన్నిఉపాఖ్యానాలు, 'ఆంధ్రకావ్యకథలు' మొదలగువానిని సంస్కృతం లోనికి అనువదించారు. ఈ సందర్భంలో డా.పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రవీంద్రనాథుని 'గీతాంజలి'కి చేసిన సంస్కృతానువాదాన్ని తప్పకుండా పేర్కొనాలి. మందాక్రాంతంలో మౌలికకావ్యంలా ప్రతిభాసించేట్లు వారు గీతాంజలిని అనువదించారు.

స్వాతంత్ర్యప్రాప్తికి ముందు హిందీభాషాసాహిత్యాలప్రచారం ముమ్మరంగా జరిగినా, హిందీరచనలే ఎక్కువగా తెలుగులోనికి అనువదించబడ్డాయి. కాని

తెలుగువచనలు హింటీలోనికి అనువదించబడ్డం జరగలేదు. స్వాతంత్ర్యప్రాప్తి తరువాత హింటీసాహిత్యం జాతీయస్థాయికి పెరగడంతో, ఇతరభాషలనుండి హింటీలోకి జరిగే అనువాదాలకు ఇతోధికంగా ప్రోత్సాహం లభించడంతో తెలుగువారు పుంఖానుపుంఖలుగా తెలుగురచనలను హింటీలోనికి అనువదించసాగారు. కథలు, కవితలు అయితే లెక్కకుమిక్కుటంగా అనువదించబడ్డాయి సాహిత్యగౌరవం కలిగి, పుస్తకరూపంలో ప్రచురించబడ్డ కొన్ని ప్రముఖానువాదాలను ఇక్కడ ఉట్టంకిస్తాను.

కీ. శే. ఏ. సి. కామాక్షిరావుగారు రంగనాథరామాయణానికి గద్యానువాదం చేశారు. డా. భీమసేన్ 'నిర్మల్' రంగనాథరామాయణాన్ని మూలం నాగరిలిపిలో ఇస్తూ, గద్యంలోనికి అనువదిస్తున్నాడు. ఈఅనువాదం ప్రత్యక్షరం మూలానుసారియైనది. శ్రీ బాలరెడ్డిగారు అనువాదాలతో రచనావ్యాసంగం ప్రారంభించి, హింటీలో మౌలికనవలారచయితగా పేరుపొందారు. రెడ్డిగారు 'పంచామృత్' అనే పేరుతో మొట్టమొదటిసారిగా ఐదుగురు ప్రబంధకవుల రచనల (కొన్నిఘట్టాలుమాత్రం) ను హింటీలోనికి అనువదించారు. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు రచించిన 'రుద్రమదేవి', 'నారాయణభట్టు' అనే నవలలు, శ్రీనార్ల వెంకటేశ్వరరావుగారి 'క్రొత్తగడ్డ' (ఏకాంకికలసంకలనం)ను హింటీలోనికి అనువదించారు. వారు అనువదించిన తెలుగుకథలు 4 సంపుటాలుగా వెలువడ్డాయి.

కీ. శే. అడివి బాపిరాజుగారి నారాయణరావును శ్రీ అరిగెపూడి రమేశ్ చౌదరిగారు అనువదించారు. 'ఆంధ్రకేకబీర్' అనేపేరుతో వేమనను గురించిన సమీక్షాత్మకవ్యాసమేకాకుండా వేమనపద్యాలను మొట్టమొదటిసారిగా హింటీలోనికి అనువదించినారు శ్రీవారణాసి రామమూర్తిరేణుగారు. వారు 'ఆదాన్-ప్రదాన్' అనే ఉద్యమాన్నే ప్రారంభించి, హింటీనుండి తెలుగులోకి, తెలుగునుండి హింటీకి అసంఖ్యాకంగా అనువాదాలు చేశారు. ఆంధ్ర మహాభాగవతంనుండి గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరిత్ర, వామనచరిత్ర, రుక్మిణీ కళ్యాణం అనే నాలుగు ఉపాఖ్యానాలను 'భాగవతపరిమళం' అనే పేరుతో హింటీచేశారు. ప్రస్తుతం రేణుగారు భాగవతదశమస్కంధానువాదం పూర్తి చేశారు. శ్రీ జాషువాగారి 'గబ్బిలం' ఖండకావ్యాన్ని 'చమగాదడ్' అనే పేరిట హింటీచేశారు.

మాన్యశ్రీ పి. వి. నరసింహారావుగారు విశ్వనాథవారి 'వేయిపడగల'ను 'సహస్రఫణ్' అనే పేరుతో హిందీచేశారు.

శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు శ్రీ ఆత్రేయ రచించిన 'ఈనాడు' అనేనాటకను, శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'హౌస్‌సర్జన్' అనే నవలను, శ్రీ ఎం.బి.వి.ఆర్. శర్మగారు 'సుమతీశతకం', 'కుమారీశతకం', 'కన్యాశుల్కం'లను, డా. ఇలపావులూరి పాండురంగారావుగారు శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి 'పేకమేడలు' అనే నవలను అనువదించారు. శ్రీసూర్యనారాయణభానుగారు 'ఆధునిక్‌తెలుగుకావ్యధార' అనేపేరిట ఒక గ్రంథాన్ని ప్రకటించారు. 'ఆధునిక్‌తెలుగుకవిత' అనేపేరిట శ్రీఆలూరి బైరాగి చౌదరిగారు అభ్యుదయవాదకవితలను అనువదించారు. శ్రీ ఆకెళ్ళ సీతారామం గారు 'ఆముక్తమాల్యద', 'కళాపూర్ణోదయ' కావ్యాలను హిందీగద్యంలో అనువదించారు. శ్రీనర్దిపర్తి చలపతిరావుగారు 'మనుచరిత్ర'కు హిందీపద్యానువాదం చేస్తున్నారు. శ్రీ అంబడిపూడి హనుమయ్యగారు 'ఏకవీర'ను అనువదించారు.

'నిర్మల్' తిరుపతివెంకటకవులకొన్నిప్రముఖరచనలను, కాటూరి పింగళికవుల కొన్నిరచలనను 'కవిశ్రీమాల' అనేపుస్తకమాలలో రెండుకుసుమాలుగా ప్రకటించారు. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారి 'ఆణిముత్యాలు', ఆచార్యరాయప్రోలు సుబ్బారావుగారి 'రూపనవనీతం', శ్రీఅబ్బూరి రామకృష్ణారావుగారి 'నదీసుందరి', శ్రీమునిమాణిక్యంగారి 'దీక్షితులు', శ్రీఆరుద్రగారి కొన్నిరచనలు, శ్రీదాశరథిరంగాచార్యగారి 'చిల్లరదేవుళ్ళు' మొదలగు తెలుగు రచనలను హిందీలోని కనువదించారు. తెలుగునవలనుగురించి ప్రముఖులచే 23 వ్యాసాలు వ్రాయించి, హిందీలోని కనువదించి 'తెలుగుకాఉపన్యాస్‌సాహిత్య' అనే పేరుతో హిందీలో ప్రచురించారు. శ్రీరాయసం వెంకట్రావుగారు 'ఆంధ్రులసాంఘికచరిత్ర'ను హిందీచేశారు. ఇప్పుడు వారు 'అల్పజీవి' అనే ప్రసిద్ధనవలను అనువదిస్తున్నారట. పైన చెప్పబడినవి కాక ఇంకా ఎన్నో రచనలు - కథలు, ఖండికలు మొ॥ హిందీలోనికి అనువదించబడ్డాయి.

హిందీభాషలోకి తప్ప వేరే ఏఇతరభాషలలోకి తెలుగుసాహిత్యం అంత ఎక్కువగా అనువదించబడ్డట్లు కనిపించడంలేదు. ఈదృక్పథంతో తెలుగు సాహిత్యసౌరభంతో ఇతరభాషలను గుబాళింపచేయవలసినఅవసరం ఎంతగానో ఉంది. దానికై ఆంధ్రప్రదేశ్ప్రభుత్వం, సాహిత్యఅకాడమీ, వ్యక్తులు కూడా ఏకోన్ముఖంగా గట్టిప్రయత్నం చేయాలి.

# బాలసాహిత్యం

శ్రీమతి ఎ. లక్ష్మీరమణ

వెన్నవలె సున్నితమైన శిశుహృదయాలలో భావివిజ్ఞానవృక్షాలకి బీజాలు బాలసాహిత్యరచనలు. ఉజ్జ్వలభవిష్యత్తుకేసి పయనించే బాలలకు అనువైన సాహిత్యం అందించటమే బాలసాహిత్యరచయితలలక్ష్యం. భారతస్వాతంత్ర్యానంతరం, బాలలఅభిరుచికి అనుగుణమైనవి వారిగ్రహణశక్తికి సముచితమైన రచనలు రాకపోలేదు. జాతిమహోన్నతికి మూలరాయనదగిన బాలసాహిత్యంలో అవిరళకృషి గావించినవారు, పునఃస్థాపన చేసినవారు, సంస్కరించినవారు లేకపోలేదు. ఈ రంగములో ఇంతవరకు జరిగినకృషి పరిశీలించి చూచి, ఇతరదేశములతో పోల్చి చూచినచో, మనము సాధించగలిగినది, ఇక ముందు సాధించవలసినదీ వ్యక్తమగును.

బాల్యమునుండి పదునాల్గుసంవత్సరముల ప్రాయమువరకు, వారివారికనువైన సాహిత్యమును బాలసాహిత్యమని చెప్పుకొనదగును. బాలసాహిత్యమును సంకలనమొనర్చి చెప్పుట కష్టతరమైనదే అయినప్పటికి "సవ్యాఖ్యాన బాలగ్రంథసూచి"ని సంకలన మొనర్చే తొలిసూచన భారతప్రభుత్వము చేసినది. తరువాత రాష్ట్రప్రభుత్వము ఇందలి ప్రాముఖ్యముగుర్తించి 'బాలసాహితీమాల' అన్నపేరుతో 1963 వరకూ వెల్వడిన బాలసాహిత్యమును ఇందు పొందుపరచినది. ఇందులో పిల్లల బాలగేయములు; లలితకళలకు సంబంధించిన పుస్తకములు, కథలు, నవలలు, రాజకీయవేత్తల జీవితములు, రచయితల, ఇంజనీర్ల జీవితచరిత్రలు, దేశచరిత్రలు, ఇతరభాషలలో బాలసాహిత్యము ఇందులో సూచింపబడినవి. 1947 సంవత్సరమునకు పూర్వము రచించినవి, తిరిగి ముద్రితములైననికొన్ని గూడ ఇందులో చేర్చబడినవి. 1963 సంవత్సరమువరకు దాదాపు 2000 కు పైగా బాలసాహిత్యగ్రంథములువెల్వడినట్లుగా దీనినిబట్టి తెలియుచున్నది. ఆతరువాత వచ్చినబాలసాహిత్యగ్రంథములుకూడ లెక్కకు మిక్కుటముగానే యున్నవని చెప్పవచ్చును. 1963 వరకు వచ్చిన గ్రంథనామ సూచికయే 400 పేజీలకుపైన మించినందున ఆ తదుపరిరచనలు కూడ వేనకువేలున్నందున, యీనాల్గుపుటలలో అందు కొన్నింటినిమాత్రమే సూచనప్రాయముగా పేర్కొననగును.

బాలసాహిత్యరచయితలు తాము బాలలకు ఆశించే నవజీవనవిధానాలను,

ప్రకృతిసౌందర్యమును, ఆనందానుభూతులను, నెత్తమ్మివలె నిరంజనమైన పసి హృదయాలకు పిట్టకథలలోను, జానపదకథలలోను, పురాణకథలమూలము గాను, చరిత్రకథలమూలముగాను, సాహసవిజ్ఞానకథారూపకముగానూ, నవలల ద్వారాను అందించినారు.

1954, 1951 సంవత్సరములలో నార్ల చిరంజీవి చక్కనిపాటలుగా 'ఆట పాటలు' 'ఎర్రగులాబి' 'కొత్తపాటలు' 'జాబిల్లి పాటలు' 6 - 10, 8-10 సంవత్సర ములబాలబాలికలకు అనువుగా వ్రాసినారు. 1956 లో, "పిల్లలపాటలు"గా కవి రావు గేయకథలు, 1965లో "ముద్దుపాప"-కేంద్రప్రభుత్వబహుమతినందుకున్న గేయములు-వెల్వడినవి. 1958, 1960 సంవత్సరాలలో బి. వి. నరసింహారావు "ప్రియదర్శి"గేయసంపుటి, "బాలరసాలు" పిల్లలపాటలు, "బాలలోకం" 'బాల గేయాలు' ప్రచురితమైనవి. 1957 వ సంవత్సరమున, న్యాపతి రాఘవరావు "బడిగంట" భారతప్రభుత్వంవారిబహుమతి పొందినబాలగేయాలు 10 సంవత్సర ములలోపు బాలబాలికలకు వెల్వడినది. 1961 లో బాలాంత్రపు రజనీకాంతరావు "జేజిమామయ పాటలు" 8 - 12 సంవత్సరములబాలబాలికలకు ప్రచురింప బడి నవి. 1957, 1967 సంవత్సరాలలో సమతారావు "పాపల్లారా ! పాటకథలు" "తెలుగుపూలు"గేయాలుగా వెల్వడినవి. 1965 లో దక్షిణభాషాపుస్తకసంస్థ పిల్లల పుస్తకములపోటీలో బహుమతి నందుకొన్న "బాలాభిరామం" పిల్లలపాటలు, పదునేనవభారతీయబాలసాహిత్యపుపోటీలో మరొకబహుమతినందుకొన్న "రంగు రంగులరత్నదీపాలు"గేయసంపుటి వెల్వడినవి. 1960 దాశరథి "బాలలగేయాలు" ప్రచురితమైనవి. ఈగేయములన్నియు పిల్లలసుకుమారహృదయముల నుర్రూత లూగించునవే. మృదుమధురముగా పాడుకొనుట కనువైనవే.

మహాపండితులయిన కవులు గూడ కొంత బాలసాహిత్యసేవకు పూను కొనినవా రున్నారు. విశ్వనాథ సత్యనారాయణ 12 సం. బాలలకు "కడిమిచెట్టు" (1958), "పరీక్ష" (1959) అన్న నవలలు, దివాకర్ల వేంకటావధాని "అల్లా ఉద్దీను" "వింతలాంతరు" అను అరేబియన్‌కథలు, యుక్తికథలు (1955) పి. నారాయణరెడ్డి "బొమ్మలభాగవతము" (1960) బాలలకు రచించినవారే. బాలసాహిత్యములో బహుకృషి సలిపిన పెద్దలు న్యాపతిరాఘవరావు "పిల్లల దొంగ", కనకదుర్గా రామచంద్రన్ "ఇంద్రజాలదీపం" (1961) వారణాసి సత్యనారాయణమూర్తి "రాము - రాక్షసుడు", 1958 లో భారతప్రభుత్వబహూ కృతి నొందిన జి. సురమౌళి "కలసిబ్రతుకదాం" రచించి, వినోదముతో

బాటు విజ్ఞానవికాసములను పొందుపరచి బాలసాహిత్యము నందించినవారే. అటులనే జీవితచరిత్రలు, దేశచరిత్రలు వ్రాసినవారెందరో యున్నారు.

కేంద్రప్రభుత్వమే కాకుండ, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీకూడ బాలసాహిత్యమును ప్రోత్సహించునుద్దేశముతో ప్రతిసంవత్సరమును పోటీలను నిర్వహించుచున్నది. అటులనే రేడియోసమాచారశాఖవారు హైదరాబాదు నుండి ప్రతిసాయంకాలము 7 గంటలకు నాల్గునిమిషములపాటు 12 సంవత్సరములలోపు బాలబాలికల వినోదవిజ్ఞానమును పెంపొందించు చిన్నకథలను ప్రసారముచేయుచున్నారు. ఇందులో ప్రఖ్యాతబాలసాహిత్యరచయితల కథానికలు ప్రసారమగుచున్నవి. ఇందు నార్ల చిరంజీవి, న్యాపతి రాఘవరావు, మద్దిపట్ల వెంకటరావు, న్యాపతి కామేశ్వరి, శశాంక, లక్ష్మీరమణ, పాలంకి వెంకటరామచంద్రమూర్తి, తురగా జానకీరాణి, సింగరాజు లింగమూర్తి, కురివెళ్ళ వెంకటరావు, నరసింహారావు, మరియు రేడియోనిర్వాహకవర్గమునందలి రచయితలు రావూరి భరద్వాజ, వారణాసి రామమూర్తి, శ్రీరామచంద్రమూర్తి, చెరుకుమల్లి భాస్కరరావు గార్లకథానికలు ప్రసారమగుచున్నవి. ఇందుమూలమున గూడ ఉత్తమశ్రేణికి చెందిన బాలసాహిత్యకథానికలు వెల్వడుచున్నవి. పిల్లలుపెద్దలుకూడ శ్రద్ధతో విని ఆనందించుఈకార్యక్రమము నిర్వహించు కార్యకర్తలు ప్రశంసింపదగు విషయము.

భారతదేశములోని ఇతరప్రాంతములపుస్తకములను, ఇతరభాషలలోని పుస్తకములను నేషనల్‌బుక్‌ట్రస్ట్‌వారు "నెహ్రూబాలపుస్తకాలయం" అన్న పేరుతో అనువాదములు చేయుచున్నారు. ఈప్రణాళికమూలమున బాలలకు ఇతరభాషలనుండి సంప్రదాయములనుండి అనువాదములగుచున్నవి. ఈశీర్షికలో మొదటిపుస్తకముగా మహాత్మగాంధిజీవితకథ వెల్వడినది. అటులనే పక్షులలోకం, మననదులకథ, హిమాలయశిఖరాలు, మనరైల్వేలు, విదేశీయులు, భారతదర్శనం, కాశ్మీరు, సరసవినోదకథలు, స్వర్గయాత్ర - ఇతరకథలు, స్వాతంత్ర్యగాథ మున్నగునవి చక్కనిచిత్రములతో వెల్వడినవి. దక్షిణభాషా పుస్తకసంస్థకూడ వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథములు, ప్రపంచసారస్వతమునందలి ఉత్తమబాలసాహిత్యగ్రంథములను అనువదించుటకు అవకాశములు కల్పించుచున్నది. బాలసాహిత్యపు పోటీలో బహుమతి నందుకున్న ఎస్. అబ్దుల్‌ఖాదర్ తమిళములో రచించిన "ఆకాశదీపం", మలయాళములో రచించిన "జంతువులు నడిచే వింతసర్కస్" వంటినవలలను దక్షిణభాషాపుస్తక

సంస్థవారు అనువదించినారు. ఈవిధముగా ప్రాంతీయభాషలన్నింటిలో నివి తర్జుమా చేయబడుచున్నవి. ఇండియాబుక్‌హౌస్, అమరచిత్ర కథలుగా చిన్న పిల్లల నాకర్షించుబొమ్మలలతోనూ, చిన్నమాటలతోను వచ్చుచున్నవి.శకుంతల, హరిశ్చంద్ర, సావిత్రి, హనుమంతునికథ, పంచపాండవులకథలు లేబ్రాయము పిల్లలకు చూడముచ్చటగా వచ్చుకథలివి.

బాలసాహిత్యమునందలి యింపైనకథలను వెండితెరపై ప్రదర్శించవలె ననెడి తలంపుతో ఆంధ్రప్రదేశ్‌ప్రభుత్వము ఒక కమిటీని ఏర్పరచినారు. ఇంతవరకు చెప్పుకొనదగిన కృషిజరుగకపోయిననూ, సఫలీకృతమైనప్పుడు అది ఒక ఆకర్షనీయమైన పథకముగా చెప్పవచ్చును. బాలసాహిత్యమునకు వెలుగులు దిద్దగలిగిన దీపథకము.

బాలసాహిత్యములో బహుప్రజ్ఞావంతు లయిన గురజాడ, వెంకటపార్వ తీశ్వరులు, గిడుగు సీతాపతి, చింతా దీక్షితులవంటివారు వేసిన వెన్నెలబాట లలో నడయాడిన కవికుమారు లెందరో యున్నారు. జరిగినకృషికి సంతో షించవలసియే యున్నను, జరగవలసినకృషి విస్మరించుట వివేకముగా తోచదు. కొన్ని బాలసాహిత్యరచనలలో హాస్యరసమును పోషించవలెనన్న దృక్పథముతో ప్రారంభించి, భాషలోను, భావములలోను పేలవముగాను, కొన్నికొన్ని సందర్భములలో వెట్టిగాను ముగియుచుండుట శోచనీయము. కొన్నియుత్తమగ్రంథములుగా ప్రారంభించినవి అందుకొనవలసిన స్థాయిని అందుకొనుటలేదు. 1956 లో ప్రచురితమైన మహమ్మద్ ఖాసింఖాన్‌గారి బాలవిజ్ఞానసర్వస్వము పరిశీలించి చూడగా అందుమూలకముగా బాలసాహిత్య మునకు గలిగిన ప్రయోజనమెంతవరకు నన్న ప్రశ్నయుదయించును. మనబాల విజ్ఞానసర్వస్వముకూడ ఆర్థర్‌మి (The 'childrens' Encyclopedia - Arthur Mee) అంతవిజ్ఞానపూరితముగా ఆకర్షణీయముగా తీసుకొని రాగలిగినప్పుడు బాలవిజ్ఞానసర్వస్వముపైన బాలలకు ఆసక్తి యుదయించును. (1) The childrens' books of Achivement, wonders of Modern Enterprise - Edited by J. E. Pryde Hughes (2) Boys and girls who became famous, The University Society New York (3) Do you know- M. E. Segal, Foreign Languages Publishing House, Moscow వంటి అద్భుతమైన బాలసాహిత్యగ్రంథములను పరిశీలించి చూచినపుడు మనబాలసాహిత్యము ఇంకను ఎంతగానో పురోగమించవలసియున్న దని తోచును.

# తెలుగు వచన రచన

డా. ఎం. కులశేఖరరావు

ఆధునికయుగంలో, అందులోను స్వాతంత్ర్యానంతరం తెలుగువచనరచన బహుముఖంగా విస్తృతిని పొందింది. ఈవిస్తరణానికి పూర్వరంగాన్ని పేర్కొన వలెనంటే, దానిలో రెండుప్రధానాంశాలు కనిపిస్తవి. శ్రీవీరేశలింగంగారు తెలుగువచనానికి గల ప్రయోజనాన్ని గుర్తించి, సాహిత్యానికి చెందిన అనేక ప్రక్రియలకు దాన్ని ఉపయోగించడం ఒకటి. శ్రీగిడుగు రామమూర్తిపంతులు గారిద్వారా ప్రారంభించబడి, తదనంతరం విశేషంగా ప్రచారాన్ని పొందిన వ్యావహారికభాషావాదం రెండవది. ఈరెండువిశేషాలేకాక, మనదేశంలో గడచిన 25 సం॥రాలలో పత్రికలు బహుజనామోదాన్ని పొందడం, అక్షరాస్యత దేశంలో అధికం కావడం, మాతృభాషాబోధనకు ప్రాముఖ్యం రావడం వంటివి మిగిలినకారణాలుగా చెప్పవచ్చు.

ఆధునికయుగానికిపూర్వం తెలుగువచనప్రయోజనం కేవలం కథాకావ్యాలకుమాత్రం సీమితం అయి ఉండేది. కాని, శ్రీవీరేశలింగంగారు దాన్ని చేపట్టడంతో, నవల, వ్యాసము, విమర్శనము, జీవితచరిత్రలు, సాహిత్యచరిత్ర, కథానిక, శాస్త్రరచన మున్నగు విభాగాలను వచనం ఆక్రమించింది. ఇక కవిత్వ రంగంలో కూడ వచనం తనప్రయోజనాన్ని నిరూపించుకొంటున్నదీ అంటే, ఈ నాడు ఈరచనాపద్ధతికి ఎంతటి విస్తృతప్రచారం కలిగిందో వేరుగా చెప్పవలసినఅవసరం ఉండదు.

తెలుగుపై ఆంగ్లభాషాప్రభావం కలిగి, దానిపరిణామంగా ఏర్పడిన రచనల్లో నవల ప్రథమంగా చెప్పదగిఉన్నది. సమకాలీనవిశేషాలను ఉల్లేఖించడంలోనేమి, చారిత్రకాంశాలను రమ్యంగా చెప్పడంలోనేమి, ఈయుగంలో నవల చాలశక్తివంతమైన సాధనంగానే ఉన్నది. స్వాతంత్ర్యానికి పూర్వమే నవలారచనలో పేరుపొందిన శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు, దానితరువాత కూడ నవలారచనావ్యాసంగాన్ని విడనాడలేదు. చారిత్రకవిభాగంలో చూస్తే ఉత్తమ కథావిధానాన్ని ప్రదర్శించి, మనపూర్వసాహిత్యపుటౌన్నత్యాన్ని జ్ఞప్తికి తెచ్చేవి శ్రీనోరి నరసింహశాస్త్రిగారినవలలు. విశ్వనాథవారినవలలో చాలవరకు, నోరి వారి నవలలన్నీ, సరళగ్రాంథికంలో వ్రాయబడ్డనవలలు. గ్రాంథికభాషలోనూ నవల చక్కగా వ్రాయవచ్చును అని వీరిరచనలు నిరూపిస్తున్నవి.

సాంఘికమైన వస్తువును గ్రహించి, సమకాలీనజీవితంపై దృష్టిని ప్రసరించిన వారిలో శ్రీబుచ్చిబాబు చెప్పదగినవాడు. ప్రత్యేకశైలి, మనస్తత్వ పరిశీలన శ్రీరాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అభిమానవిషయాలు. వారినిఅనుసరించే వారు చాలమంది ఉన్నారుకాని, బీనాదేవిని ఈసందర్భంలో పేర్కొనవలె. ఇదేకాలంలో చాలమందిస్త్రీలు నవలారచనావ్యాసంగాన్ని చేపట్టి సాధనచేస్తూ ఉన్నారు. వీరు రచించిన నవలలప్రమాణంమాట ఎట్లా ఉన్నా పరిమాణం మాత్రం చాలాఅధికం. కౌసల్యాదేవి, రంగనాయకమ్మ, సులోచనారాణి, ఆనందా రామం మున్నగువారు ఈసందర్భంలో పేర్కొనదగి ఉన్నారు. ఏది ఎట్లా ఉన్నా, వచనరచన తెలుగులో, నవలారచనద్వారా విశేషంగా లోకంలో వ్యాప్తి చెందింది.

ఈకోవలో పేర్కొన్నరచయితలందరూ వ్యావహారికభాషనే తమసాధ నంగా ఎన్నుకొన్నారు. బుచ్చిబాబు రచనల్లో ఇంగ్లీషుభాష చదువుకొన్న తెలుగువారు ఉపయోగించేభాష కాన్పిస్తుంది. రా. వి. శాస్త్రిగారు విశాఖప్రాంతం లోని మాండలికాన్ని గ్రంథస్థం చేయడంలో అందెవేసినచేయి. బీనాదేవి, ఏఅవకాశం ఉన్నా ఇంగ్లీషువాక్యాలో, కనీసం ఇంగ్లీషుపదాలో వ్రాయాలనే అభినివేదం ఉన్నవారుగా కన్పిస్తారు. వీరినవలల్లో కొన్నింటికి ఆంగ్లంలోనే నామకరణం చేసిఉన్నారు.

ఆంధ్రవచనరచనకు మరోప్రధానమైన ఆలంబనంగా ఉన్నది కథా నికారచన. ఆంగ్లభాషాసంస్కారంచేత తెలుగులో ఉద్భవించినసాహిత్యప్రక్రియ ఇది. యాంత్రికంగా పరిణమించిన ఈనాటిసంఘంలో, చాలశక్తిమంతంగాను ప్రచురంగాను ఉన్నది కథానిక. దీనిలో జీవితంలోని ఒకసంఘటననుగాని, దానికి సంబంధించిన కొన్నివిశేషాలనుగాని, కథావస్తువుగా గ్రహించడం సంభవిస్తుంది. ఒక్కొక్కసారి మానవమనస్తత్వసంబంధమైన ఏదోఒక కోణాన్ని ప్రదర్శించడానికి కూడ కథానిక ఉపయోగపడుతున్నది. అధిక ప్రచారాన్ని చెందిఉండడంచేత, విభిన్నరచయితలు విభిన్నరచనాశిల్పాలను అవలంబించి కథానికారచన చేస్తున్నారు. దేశంలో ఉండే వారమాసపత్రికలు, కొందొకచో దినపత్రికలుకూడ, కథానికాప్రచురణకు స్థానం ఇస్తున్నవి. ప్రేమ, ప్రణయం, దారిద్ర్యం, ధనికసమాజం, రాజకీయాలు, రహస్యవిష యాలు, ఒకటేమిటి, అన్నీ ఈనాటికథానికలో వస్తువులుగా మారుతూఉన్నవి.

ఈనాడు తెలుగుదేశంలోని రచయితల్లో కథారచన చేస్తున్నవారే అధికంగా ఉన్నారు అంటే అనుచితంగా ఉండదు.

స్వాతంత్ర్యానికి పూర్వమే కథానికారచన ప్రారంభించి ఇంకా కొనసాగిస్తూన్నరచయిత కొడవటిగంటి కుటుంబరావు. వీరు సంఖ్యలోను, ప్రమాణంలోను ఆధిక్యాన్ని పొందిన కథానికలను వ్రాసినారు. పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన'అనే కథతో, తెలుగుకథ అంతర్జాతీయఖ్యాతిని అందుకొన్నది. బుచ్చిబాబుగారి నిరంతరత్రయం, మంచికథల్లో పేర్కొనదగినది. ఇటీవల మధురాంతకం రాజారాం, వాకాటి పాండురంగారావుకూడ మంచికథలు వ్రాసిఉన్నారు. ఇస్మాయిల్ వ్రాసిన కాశీసీసాలు అనేకథ శిల్పంలోను, వస్తువులోను ఎన్నికచెందింది. భానుమతి అత్తగారికథలు వ్రాసి కథానికకు వ్యంగ్యంతోకూడిన హాస్యాన్ని జోడించారు. రంగనాయకమ్మ, సులోచనారాణి మొదలైనరచయిత్రులుకూడ కథానికారచన చేపట్టి సమర్థతతో నిర్వహిస్తుఉన్నారు. విశ్వనాథశాస్త్రిగారికథలు నేటికథానికారచయితలకే ఆదర్శవంతంగా ఉన్నవి. ప్రభావోపేతమైన మాండలికభాష, పాత్రలలోని వాస్తవికత వీరికథల్లోని ప్రత్యేకతలు. వీరు వ్రాసిన 'సారాకథలు' సంఘంలోని సారాన్ని ప్రదర్శిస్తూఉన్నవి. కొలకలూరి ఇనాక్, నవీన్ అనేరచయితలు కూడ మంచి కథలను వ్రాస్తున్నవారే. రచయితలు, రచనలు అధికంగా ఉండడంచేత, అన్నిటినీ గురించి ఈరంగంలో చెప్పడం సాధ్యంకాదు.

ఈనాటి కథానికారచయితలందరూ కథానికారచనకు వ్యావహారికభాషనే ఉపయోగిస్తున్నారు. ఈరచయితల్లో చాలమంది సంభాషణోచితమైనభాష కథానికకు జీవంలాంటి దనేవిషయాన్ని విశ్వసించినవారే. కొందరురచయితలు వ్యావహారికంపేరిట కృత్రిమంగాను, కొన్నిచోట్ల వికృతంగానూ ఉన్న తెలుగును ఉపయోగించకపోలేదు. అయినా, దీనికి బలం వస్తువు కావడంచేత పాఠకులు అంతగా పట్టించుకొన్నట్లు కాన్పించదు. ఏది ఎట్లా ఉన్నా వ్యావహారికభాష కథానికనూ, తదంతర్గతపాత్రలనూ, పాఠకులకు సన్నిహితం చేయగలిగింది అనడంలో సందేహంలేదు.

గడచిన 25 ఏండ్లకాలంలో వ్యాసరచనలో కూడ కొంతకృషి జరిగింది. కాని, అంతకుపూర్వమే వెలువడ్డ సాక్షివంటి వ్యాసాలు ఈకాలంలో రాకపోవడం నిజంగా మనభాషకు లోపమనే చెప్పవలె. వివిధశాస్త్రములకు కళలకు చెందినవ్యాసాలుకూడ వచ్చినవికాని, సాహిత్యవిమర్శకు సంబంధించిన వ్యాస

పాటే ఈకాలంలో అధికంగా వెలువడ్డవి. రాజకీయవ్యాసాలు వివిధపత్రికలు ప్రకటిస్తూనే ఉన్నవికాని, వాటికి శాశ్వతప్రయోజనం తక్కువ. సాహిత్య సంబంధియైన వ్యాసాల్లో అనంతకృష్ణశర్మగారి సారస్వతాలోకం ముందు పేర్కొనదగింది. వివిధరచయితల వ్యాససంకలనమైన భారతోపన్యాసాలు ఉత్తమసారస్వతవ్యాసాలుగా పేర్కొనవలె.

సారస్వతపరిషత్తు, ఆంధ్రప్రదేశసాహిత్యఅకాడమీ మొదలైన సంస్థలు రచయితలను ప్రోత్సహించి, వ్యాసాలను ప్రచురిస్తుఉన్నారు. సాహిత్యంమీద అభిమానం ఉన్నవారినే వ్యాసాలు ఆకర్షిస్తాయి. కాబట్టి వీటికి పాఠకుల సంఖ్య తక్కువే. అయినా మంచివ్యాసాలే వచ్చినవి అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఏవో కొన్నిసందర్భాలలో తప్పిస్తే పుస్తకరూపంలోను, పత్రికాముఖంగాను, వచ్చేవ్యాసాలన్నీ గ్రాంథికభాషామయింగానే ఉన్నాయి. రాళ్ళపల్లి వారివ్యాసాలు గ్రాంథికమే అయినా, చెప్పవలసినఅంశాలను ఏమీ క్లిష్టతలేకుండా తేటపరుస్తున్నాయి. అట్లేయితరరచనలుకూడ. కొంతసాహిత్యవాసనకలిగి, అందులోని బాగోగులులను పరిశీలించేవారికే ఈవ్యాసాలు నిర్దేశింపబడినవి కావడంచేతను, నేటిభాష గ్రాంథికంలోనే ఉంటూ ఉన్నది. విద్యార్థులు గ్రాంథికభాషాభ్యసనం చేయడానికినీ, ఈవ్యాసాలు చక్కగా ఉపకరిస్తున్నాయి.

సాహిత్యవిమర్శకగ్రంథాలుకూడ ఈపాతికసంవత్సరాల్లో వెలువడినవి. సర్వతోముఖప్రజ్ఞ, కలిగిన విశ్వనాథ సత్యనారాయణగారు, నన్నయగారి ప్రసన్నకథాకవితార్థయుక్తి' అనే విమర్శనాగ్రంథాన్ని ప్రచురించినారు. నన్నయ్యకథాశిల్పరమ్యతను బహుముఖంగా ప్రదర్శించేగ్రంథ మిది. వారిదే 'అల్లసానివారిఅల్లికజిగిబిగి' అనేగ్రంథం. దీనిలో ప్రథమప్రబంధంలోని వన్నెచిన్నెలు విశేషంగా విస్తరింపబడి ఉన్నవి. ఆధునికసాహిత్యంపై కూడ మంచివిమర్శ వెలువడింది. రమణారెడ్డి, ఆర్. ఎస్. సుదర్శనం, సుప్రసన్న మొదలైనవారు ఈ రంగంలో కృషిచేస్తున్నారు. యువభారతివారు ఇటీవల వెలువరించిన 'కావ్యలహరి' మంచి విమర్శనాత్మకగ్రంథం. ఇదికాక అకాడమీవారు, శేషాచలంకంపెనీ ప్రచురించిన విభిన్నప్రాచీనకావ్యాలకు విజ్ఞులు, విమర్శనతోకూడిన పీఠికలను వ్రాసిఉన్నారు. ఈ పీఠికలు, ఆంధ్రవిమర్శన సాహిత్యాన్ని సుసంపన్నం చేసినవి. ఈ విమర్శనశాఖలో వెలువడిన సాహిత్యమంతా వ్యాసరచనవలె గ్రాంథికభాషలోనే ఉంటూఉన్నది.

ఇంతకు ముందుగానే ఒకటిరెండు చరిత్రగ్రంథాలు తెలుగులో వెలువడి

నవిగాని, ఈ కాలంలో వచ్చినగ్రంథముల సంఖ్యే అధికము. ఖండవల్లి లక్ష్మీ రంజనంగారు, బాలేందుశేఖరంగారు కలిసివ్రాసిన 'ఆంధ్రులచరిత్రసంస్కృతులు' అనేగ్రంథం, సాంస్కృతికచరిత్రను చెప్పేప్రథమగ్రంథం. శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రులసాంఘికచరిత్ర' కూడ ఈకోవకే చెంది, రాజులవంశచరిత్రను కాక ప్రజాజీవితవిధానాలను వివరించేదిగా ఉన్నది. సాహిత్యచరిత్రల్లో ఖండవల్లివారి ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహం, దివాకర్ల వారి ఆంధ్రవాఙ్మయచరిత్ర పేర్కొనదగినవిగా ఉన్నవి. చాగంటి శేషయ్యగారు వ్రాసిన 'ఆంధ్రకవితరంగిణి'కూడా ఇదేకాలంలో వెలువడి, అనేక సాహిత్యచారిత్రకవిశేషాలను వెల్లడిచేసే గ్రంథంగా ఉన్నది. మధునాపంతుల వారి ఆంధ్రరచయితలు అనేగ్రంథం ఇచట పేర్కొనదగింది. ఇటీవల శ్రీ ఆరుద్ర వ్రాసిన సమగ్రాంధ్రవాఙ్మయచరిత్ర శిష్టవ్యావహారిక భాషలో వెలువడిన ఉత్తమచరిత్ర గ్రంథం. స్వాతంత్ర్యానంతరం ఆంధ్రదేశంలోని విశ్వవిద్యాలయాలు సాహిత్య పరిశోధనను ప్రోత్సహించడంతో, కేవలం కొందరు పండితులమధ్యలోనుంచి, సాహిత్యపరిశోధన విస్తృతరంగంలో అడుగుపెట్టింది. ఆధునికపద్ధతులలో, శాస్త్రీయసూత్రబద్ధంగా పరిశోధన విశ్వవిద్యాలయాల్లో చక్కగా కొనసాగింది. యువకులైన పరిశోధకు లనేకులు సాహిత్యాన్ని మధించి అనేక సిద్ధాంతవ్యాసాలను రచించినారు.

సాహిత్యచరిత్రలకు వలెనే సాహిత్యపరిశోధనగ్రంథాలుకూడ విషయవైవిధ్యం ప్రధానంగా కలిగినట్టివికదా। అందుచేత తద్రచయితలుకూడ చరిత్రగ్రంథకర్తలవలెనే సాధ్యమైనసరళగ్రాంథికంలోనే తమగ్రంథములను రచిస్తూ వచ్చినారు. ఈ గ్రంథాలుకూడ ఒక పరిమితమైనపరిధిలో ఉండే పాఠకులకే సీమితమైనవి కావడంచేత, ఆపాఠకుల ఆమోదాన్నికూడ పొందినది.

ఈరెండున్నరదశాబ్దులలో ఆంధ్రవచనంలో శాస్త్రరచనకూడ తగినంత జరిగింది. ఇంతకుముందే విజ్ఞానసర్వమును సంకలనం చేయడానికి ఒకటి రెండు ప్రయత్నాలు జరిగినవి కాని, అవి అంతగా ఫలవంతములు కాలేదు. స్వాతంత్ర్యానంతరం ఈరంగంలో చక్కటి కృషిజరిగి ఉత్తమగ్రంథాలు వెలువడినవి. తెలుగుభాషాసమితి వారు వివిధ సాంఘికశాస్త్రాలపైననూ, ప్రకృతి శాస్త్రాలపైననూ అనేకవ్యాసాలతోకూడిన సంపుటాలు విజ్ఞానసర్వస్వం అనే పేరుతో వెలువరించినారు. ఇవి విజ్ఞానానికి చెందిన వివిధరంగాల్లో విషయవైశద్యం కలిగిఉన్నవి. ఆయా విషయాల్లో నిష్ణాతులైన రచయితలు, సంపా

దకులు ఈగ్రంథరచనలో పాల్గొన్నారు. ఇదేదశలో ప్రయత్నంజరిగి మరొక విజ్ఞానసర్వస్వం 'సంగ్రహవిజ్ఞానకోశము' అనేపేరుతో వెలువడింది. ఎనిమిదిసంపుటాలలో వివిధ విషయాన్వితమైన యీ 'సంగ్రహ' కోశము సరళగ్రాంథికంలో రచితమై ఉత్తమశాస్త్రగ్రంథరచనకు ప్రతీకగా ఉన్నది. విజ్ఞానసర్వస్వమువలె విషయమును బట్టికాక, అకారాదిగా సంపుటీకరణము చేయబడినగ్రంథమిది. ఈరెండు విజ్ఞానసర్వస్వాలను, దాదాపు ఒకేకాలంలో తెలుగువారికి అందించిన సంస్థలు అభినందించదగియున్నవి. వీటిలో తెలుగుభాషాసమితివారు ప్రకటించిన సంపుటాలలో శిష్టవ్యావహారికభాషనే ఉపయోగించినారు. వివిధవిషయాలను వ్యావహారికంలో సుగమంగా చెప్పడంలో వీరు కృతకృత్యులైనారనే చెప్పవలె.

తెలుగులో ఉన్నతపాఠశాలలవరకు మాత్రమే ఇదివరకు విద్యాబోధన అనుమతించబడిఉండడంచేత, ఆయాశాస్త్రములలో (ప్రకృతి, సాంఘిక, ఉన్నత దశలోని విజ్ఞానానికిచెందినగ్రంథాలు అంతగా అవసరం అనిపించలేదు. కాని యిటీవల ప్రభుత్వం కళాశాలస్థాయిలోను తెలుగును బోధనాభాషగా ప్రవేశపెట్టడంతో, ఈశాస్త్రగ్రంథాల ఆవశ్యకత ఏర్పడింది. ఈఅవసరాన్ని తీర్చడానికి ప్రభుత్వం పూనుకొని, తెలుగుఅకాడమీ అనేసంస్థద్వారా తెలుగులో శాస్త్రగ్రంథాలప్రచురణ చేయించింది. స్వల్పకాలంలోనే కళాశాలస్థాయికి ఉపకరించేవి, సాంఘిక, వాణిజ్య, ప్రకృతిశాస్త్రాల్లో అనేక ఉత్తమగ్రంథాలు వచ్చినవి. ఆయావిషయాల్లో నిష్ణాతులై, విశ్వవిద్యాలయాల్లో బోధిస్తున్న విద్వాంసులు ఈగ్రంథాలను రచించడం ఎంతోసముచితంగా ఉన్నది. ఈ గ్రంథాల్లో వచనరచన శిష్టవ్యావహారికంలో జరుగుతున్నది. విద్యార్థులకు భాష సుగమం కావలెనని కాబోలు, రచయితలూ, ప్రచురణకర్తలూ, వ్యావహారికాన్ని ప్రోత్సహిస్తూ ఉన్నారు. మరికొంతకాలంలోనే వివిధవిషయాలకు చెందిన అనేక గ్రంథాలను తెలుగుఅకాడమీ రచింపచేసియు, అనువాదము చేయించియు ప్రచురించగలదని ఆశింపవచ్చు.

ఈ కాలంలో తెలుగువచనరచన ఎంతగా ప్రాచుర్యంపొందిందీ అంటే పైనపేర్కొన్న ప్రక్రియలేకాక, కవిత్వంకూడ వచనాన్ని ఆశ్రయించింది.

పరిశీలనలోఉన్నఈకాలంలో వచనరచనకు అనుసరించిన భాషలో అనేకపరివర్తనలు కలిగినవి. గిడుగు రామమూర్తిపంతులుగారు ప్రారంభించిన వ్యావహారికవాదం అధికమైనప్రాచుర్యాన్ని పొందింది. నవల, కథానిక, మొదలైన సృజనాత్మకసాహిత్యాన్ని వ్యావహారికభాష పూర్తిగా ఆక్రమించింది.

ఇప్పటికీ, విశ్వనాథవంటివారుకొందరు, కొన్నినవలలను గ్రాంథికంలో వ్రాస్తూఉన్నా, కొన్నిసందర్భాల్లో వారుకూడ ఆనియమాన్ని సడలించుకొన్నారు. ఇక ఇతరరచయితలు వ్యావహారికాన్నే అనుసరిస్తూ ఉన్నారు. సాహిత్య విమర్శలు, పరిశోధనవ్యాసాలు వ్రాసేవారు ఇంకా సరళగ్రాంథికాన్నే ఉపయోగిస్తున్నారు. ఇటీవల వచ్చిన శాస్త్రగ్రంథాలుకూడ వ్యావహారికంలోనే ఉన్నవని పైననే చెప్పితినిగదా.

వచనరచన వ్యావహారికంలో జరగడంలోని కొన్నిసాధకబాధకాలను చర్చించడం ఇచట అనుచితంకాదు. భాషలోనిలోతుపాతులు తెలిసిన వ్యుత్పన్నులు వ్యావహారికభాషలో రచనలు చేసినా, దానిలో ఉండే గాంభీర్యానికి విఘాతం కలుగదు. కాని, భాష వ్యావహారికమే కదా, అని, అవ్యుత్పన్నులు, అపండితులు, రచనావ్యాసంగానికి పూనుకొంటున్నారు. దీనివల్ల రచనల్లో భాషకూ,భావానికీ, విఘాతం కలుగుతూఉన్నది. మనం స్వాతంత్ర్యం రావడంతో స్వేచ్ఛను పొందినామని సంతోషించినా, భాషాపరంగా మరింత పారతంత్ర్యానికి గురిఅయినాము. ఈనాడు వెలువడేనవలల్లో, కథానికల్లో ఎంతఇంగ్లీషు కలిపి వ్రాస్తే అంత గొప్పఅనుకొంటునట్టున్నారు రచయితలు. ఎన్నోనవలలపేర్లు, కథలపేర్లు కూడ ఇంగ్లీషులోనే ఉన్నాయంటే, మనం ఎంతపారతంత్ర్యానికి గురిఅయినామో తెలుస్తుంది. ఈపరిణామం, ఏభాషకూ ఆరోగ్యప్రదంకాదు. మనవారికి ఇంగ్లీషుమీద వ్యామోహం ఉంటే, ఇంగ్లీషురచనలను చదవడం, అదేభాషలో వ్రాయడం చేయవచ్చు. కాని, భాషాసాంకర్యం మంచికి దారి తీస్తుంది అనడానికి ఆస్కారంలేదు. ఇది వ్యావహారికభాషలోని హేతువాద దృష్టిని అర్థంచేసుకోకపోవడంచేత వచ్చిన వికృతపరిణామమనడంలో సందేహంలేదు. ఇక ఉన్నతవిద్యకు పాఠ్యగ్రంథాలు వ్యావహారికంలో ఉండడంలోని మంచిచెడుగులను గురించి చెప్పవలె. సరళమైనభాష విషయగ్రహణాన్ని సులభంచేస్తుం దనడంలో విప్రతిపత్తిలేదు. కాని,గ్రాంథికమై, నిరలంకారమైన తెలుగులోనే సరళభాషను రూపొందించవచ్చు. ఈభాష సర్వసామాన్యంగా ఉండి, అందరికి ఆమోదయోగ్యం అవుతుంది. అట్లుకాక, వ్యావహారికమనే పేరుతో కొన్నిమాండలికరూపాలు రావడం, అవి ఇతరమండలాలవారికి క్రొత్తగా ఉండడం, విధిగా వాటిని అభ్యసించ వలసిరావడం సంభవిస్తున్నది. పైగా, ఈవ్యావహారికభాషాభ్యసనంవలన విద్యార్థికి రచనలో ఒకస్థూలదృష్టి ఏర్పడ్డంలేదు. అందుచేత మనంకూడ హిందీ, తమిళంవంటిదేశీయభాషల్లో ఉండే సరళగ్రాంథికపద్ధతినే పాఠ్యగ్రంథరచనలో అనుసరిస్తే, విద్యార్థులకూ, రచయితలకూ మేలుచేకూర్చినవార మవుతాము.

# తెలుగులో వైజ్ఞానిక రచనలు

డా. మహీధర నళినీమోహన్

పుట్టుమచ్చలశాస్త్రం, బల్లిపతనశాస్త్రం, కొక్కోకశాస్త్రం మినహాయించి, సైన్సుతో బొత్తిగాపరిచయం లేనివారికి శాస్త్రవిజ్ఞానాన్ని సరఫరాచేసే గ్రంథాల సంఖ్య తెలుగులో బహుతక్కువ. తెలుగు వారపత్రికలన్నీ వంటలూ-పిండి వంటలూ, కుట్లూ-అల్లికలూ వగైరా శీర్షికలతోబాటు వైజ్ఞానికవ్యాసాలు (అని తాము అనుకునేవి) అడపాతడపా ప్రచురించి, సైన్సుమీద తమకుగల భక్తిని యథోచితంగా వెల్లడిచేసుకుంటూనే ఉన్నాయి. అంతకన్న వాళ్ళుమాత్రం ఏం చెయ్యగలరు? పాపం! మరీ వారంవారం పుంఖానుపుంఖంగా సైన్సువ్యాసాలు లంకించుకుంటే వేడిచేసి, ఆపత్రికమొహం చూసేవాడుండడు. కనుక పొదుగు కోసుకొని పాలుతాగెయ్యకుండా, బంగారుగుడ్లుపెట్టేబాతుల్ని కోసుకు తినెయ్యకుండా, మా(మీ) అభిమానపత్రికకి బొత్తిగా విజ్ఞానంతోపనిలేదు అనెయ్యకుండా, పథ్యంగాఆరునెలలకో సైన్సువ్యాసంఅచ్చువేసి, కత్తిమీద సాములానడుపుకొస్తున్న పత్రికలవాళ్ళని తప్పక అభినందించవలసిందే.

వారపత్రికలకీ మాసికాలకీ, దూరంగాఉంటూ కూడా తెలుగులో పాప్యులర్ సైన్సుగ్రంథాలువ్రాసి, పాప్యులర్ అయినవాళ్ళు కొందరున్నారు. (అన్నట్లు పాప్యులర్ సైన్సుని తెలుగులో ఏమానలో?)

70 ఏళ్ళక్రితం వీరేశలింగంపంతులుగారు శాస్త్రీయవిజ్ఞానాన్ని సామాన్య పాఠకులకు, ముఖ్యంగా స్త్రీలకు, అందజేయడానికి కృషిచేసినతరువాత, మళ్ళీ చాలాకాలంపాటు అటువంటి ప్రయత్నాన్ని కొనసాగించినవాళ్ళు లేకపోయారు.

శ్రీకాశీపట్నం కొండయ్యగారు 35 ఏళ్ళక్రితం "విశ్వరూపం" అనే పేరుతో ఖగోళశాస్త్రంమీద ఒకచక్కనిగ్రంథంవ్రాశారు. సర్ జేమ్స్ జీన్స్ వ్రాసిన ఒకపుస్తకానికి అనుసరణఅది. ఆరోజుల్లో ఆగ్రంథం చాలామందిని ఆకర్షించింది. అందులోనిసంగతులు కొన్ని ఇప్పుడు పాతబడిపోయాయి. ఇటీవల శ్రీనండూరి రామమోహనరావుగారు ఖగోళశాస్త్రంమీద ఓగ్రంథంవ్రాసి, దానికి మళ్ళీ "విశ్వరూపం" అనేపేరునే పెట్టేరు: ఒకరు వాడినపేరునే మరొకరు మళ్ళీవాడడం దేనికో? ఆలోచిస్తే మరో పేరే దొరకదా?

ఇరవైఏళ్ళక్రిందట డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు "విజ్ఞాన

వీధులు" అనేశీర్షికకింద ప్రశ్నలు – జవాబులు రూపంలో చాలాచక్కనివ్యాసాలు వ్రాశారు. అవి నాలుగుసంపుటాలుగా ఇటీవలనే తిరిగి వెలువడ్డాయి. మన ప్రాచీనుల వైజ్ఞానికపరిణతిని నిరూపించడంకోసం విమానాలు, అణుబాంబులు, రేడియో, టెలివిజన్ మొదలైన ఆధునిక అవిష్కరణలన్నీ మనఋషులకి ఏనాడోతెలుసుననీ, అన్నీవేదాల్లోనూ పురాణాల్లోనూ వివరంగా రాసిపెట్టే ఉన్నాయిషఅనీ, మనగ్రంథాలను జర్మనీవాళ్లు ఎత్తుకుపోయి గొప్పశాస్త్రవేత్తలు అయిపోయారనీ వాదించేఅమాయకులు మనదేశంలో చాలామంది ఉన్నారు. "వైజ్ఞానికాభివృద్ధికోసం వీపుకికళ్ళుమొలిపించుకుని, నిన్నామొన్నా వేదకాలమూ వెతకడందండగ. పురోగామిజాతులతోబుజంకలిపి రేపూఎల్లుండికీ కావలసిన విజ్ఞానసాధన చేయవలసిందే" అని బల్లగుద్ది చెప్పేరుశ్రీపాదవారు తమ "విజ్ఞాన సాధన" అన్నేగ్రంథంలో. దీనికి కొంచెం ఐమూలగాఉంటుంది, శ్రీవసంతరావు వేంకటరావుగారి వాదం. "ప్రాక్పశ్చిమవిజ్ఞానాలను సమన్వయింపవలెనన్న ముఖ్యోద్దేశంతో" వీరు "ఆధునికవిజ్ఞానం" అనే వ్యాస సంపుటిం వ్రాశారు. (విజ్ఞానమంజరి, మారేలోకం, ఎలక్ట్రానుఆత్మకథ, గాలిగ్రహాలు విశ్వవిన్యాసం వగైరా వీరి అనేక పాప్యులర్ సైన్సుగ్రంథాలలో ఇది ఒకటి). ఇందులో "మంత్రాలు" అనేవ్యాసంలో మంత్రప్రభావాన్ని ఆధునిక విజ్ఞానశాస్త్ర పదజాలంతో సమర్థించాలని ప్రయత్నించారు. మంత్రాలవల్ల నిజంగానే చింతకాయలు రాలుతాయనే వీరివిశ్వాసంలా కనిపిస్తోంది. చింతకాయలు ఏశాస్త్రీయ సిద్ధాంతానుగుణంగా రాలగలవో "పరిశోధన" చేశారు. "తేలు కుట్టినప్పుడు అయస్కాంతాన్ని కుట్టినచోటపెడితే అది విషాన్ని మీదకుఎక్కనీయదు" అనివారి ఉవాచ. "అయస్కాంతంలో అయస్కాంతత్వమున్నట్లు మంత్రంలో విద్యుదయస్కాంతశక్తి ఉన్నట్లు తోస్తుంది" అనీ "సరియైన ఉచ్చారణ మంత్రాన జీవులనుచంపడానికి అవకాశం ఉన్నట్లుతోస్తుంది. అదే Ultrasonics" అనీవీరుచేసిన అభిభాషణలలోని పదజాలం పైనచెప్పినరకపుఅమాయకులమీద బాగాపనిచేస్తుంది, సందేహంలేదు. ఆ గ్రంథంలోనే మరోచోట "చంద్రుని బరువుకన్న సూర్యునిబరువు 26,400,000 రెట్లు అధికం; కనుక మనకుదగ్గరగాఉన్న చంద్రునిఆకర్షణకన్న, దూరంగా ఉన్నసూర్యుని ఆకర్షణబలమే అధికం." అని వ్రాశారు. కాని, ఇది కేవలం తప్పుడుఅభిప్రాయం. చంద్రాకర్షణవల్ల సముద్రపుమట్టంలోకలిగేమార్పుతో 5/11వ వంతు మాత్రమే సూర్యాకర్షణవల్ల

కలుగుతుంది. (వివరాలు కావలసినవారు నా "క్షీరసాగరం" అనేపుస్తకంలో "భూదేవితో డీడిక్కీ" అనే ప్రకరణంలో చూడవచ్చు.)

"అమావాస్యనాడు సూర్యచంద్రులు భూమికి ఒకేవైపున ఉండడంచేత వాటి బలాలు రెండూ కలుస్తాయి. పూర్ణిమనాడు సూర్యచంద్రులు భూమికి చెరోవైపునా ఉంటారుకనుక వాటిగురుత్వాకర్షణ బలాలు చెరోవైపు లాగుతాయి. కనుక పూర్ణిమనాటికన్న అమావాస్యనాడే బలం ఎక్కువ. కనుక అమావాస్య అధికపర్వదినం. అందుకనే సూర్యగ్రహణానికి అధికప్రాముఖ్యం అని వీరు వ్రాశారు. మంత్రపునశ్చరణకి సూర్యగ్రహణ సమయం ప్రశస్తం అని మన ఋషిపుంగవులు ఎందుకు సెలవిచ్చారో వివరించేప్రయత్నంలో. కాని ఇది కూడా తప్పే. సూర్యచంద్రులు భూమికి ఒకేవైపున ఉన్నా చెరోవైపున ఉన్నా వాటిబలాలు కలుస్తాయి. ఒకదాని కొకటి వ్యతిరేకం కావు. ఇది సామాన్యబుద్ధికి విచిత్రంగానే కనిపించినా గణితంద్వారా ఋజువుచేయవచ్చు. ఈవిషయవివరణ నా క్షీరసాగరంలో (లేదా Tides కి సంబంధించిన ఏ పుస్తకంలోనైనా) చూడవచ్చు.

మనపూర్వులు సర్వజ్ఞులుసుమా! అని ఋజువుచేసేప్రయత్నం వ్యర్థం. అల్లాగని మనపూర్వులకు ఏమీతెలియ దని నా ఉద్దేశంకాదు. వాళ్ళకున్నపని ముట్లతో, అప్పటికిఉన్న వైజ్ఞానికపరిమితులతో మనవాళ్లు బాగా ఆలోచించి, ఎన్నోవిషయాలను గ్రహించారు, సందేహంలేదు. కాని, వారికి అన్నీ తెలుసునని పురాణాలలోని కట్టుకథలబట్టతలకీ సైన్సుమోకాలికీ ముడిపెట్టే ప్రయత్నం హాస్యాస్పదం.

Genetics మీదా Evolution మీదా వచ్చినపుస్తకాలు చాలా తక్కువ. ఆరాసినవాళ్లైనా ఆయావిషయాలు కూలంకషంగా తెలిసినవాళ్లుకారు. ఈలోపాన్ని శ్రీ జమ్మి కోనేటిరావుగారి 'జంతుపరిణామము' 'జన్యుశాస్త్రము' అనే చక్కని గ్రంథాలు కొంతవరకు భర్తీచేశాయి.

తెలుగులో పాప్యులర్ సైన్సుమీద శ్రీ వేమరాజు భానుమూర్తిగారు వ్రాసినన్నిపుస్తకాలు మరెవరూ వ్రాయలేదు. వీరిది చక్కనిశైలి. అన్నిటికన్నా వీరి "సైన్సుకథ" నాకు నచ్చింది. ఉత్తమపురుషలో కథలా నడిపించారు. శ్రోత వీరిభార్యసుభద్రగారు. అందులో ఒకచోట ఐన్‌స్టైన్‌నిగురించి "ఆయన తన పరిశోధనల్లో ఎంతగా నిమగ్నమైపోయేవాడంటే తనబట్టలు మాసిపోయాయని గాని, తనకి ఆకలివేస్తుం దనిగాని ఆయనకి గుర్తే ఉండేదికాదు భార్య గుర్తుచేసే

దాకా" అని కథకులైన భానుమూర్తిగారు చెప్పగా సుభద్రగారు "అయితే ఐన్‌స్టీన్ అచ్చంగా మీలాగేనన్నమాట!" అంటారు. ఈ ఘట్టం నాకు మరింత నచ్చింది, చెప్పొద్దూ?

సుమారు పాతికేండ్లక్రితం శ్రీ మహీధర జగన్మోహనరావుగారు "యక్ష ప్రశ్నలు" అనే చక్కని పుస్తకం రాశారు. చిన్నపిల్లలు చలిమంటల చుట్టూ చేరి "కర్రలు మండుతూ ఉంటే చిటపటమంటలు ఎందుకూ?" "నీళ్ళుపడితే మంట ఆరిపోతుంది ఎందుచేత?" వగైరా ప్రశ్నలు వేయడం, వాటిని ఆపిల్లలకు అర్థంఅయేధోరణిలో కథలరూపంలో జవాబులు చెప్పటం కనిపిస్తుంది. చిన్న పిల్లలకోసం రాసిన వైజ్ఞానిక గ్రంథాలలో ఇదే మొదటిదేమో తెలుగులో. ఇలిన్ & సెగాల్ వ్రాసిన గ్రంథాలకు "మానవులు _ మహీధరములు". "జనులు _ మహాజనులు"; "జ్ఞానం _ విజ్ఞానం" అని వారుచేసిన అనువాదాలు శైలీమాధుర్యానికీ, విషయవివరణ సౌలభ్యానికీ చక్కని ఉపమానాలు.

శ్రీ విస్సా అప్పారావుగారు "పరమాణుశక్తి" అనే గ్రంథంలో అణువులగురించిన ప్రాథమిక భావాలనుంచి, రియాక్టర్లవరకూ ఎన్నోవిషయాలు వివరంగా వ్రాశారు. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు విశాలాంధ్రలో లోగడ వ్రాసిన సైన్సువ్యాసాలు చాలాప్రజాదరణపొందాయి. వారిశైలి దానికి ముఖ్య కారణం. డాక్టరు గాలి బాలసుందరరావుగారు "మనమూ_మనదేహస్థితి" మొదలైన శారీరకశాస్త్రగ్రంథాలూ, పత్రికల్లో వ్యాసాలూ చాలా ఆకర్షకంగా వ్రాశారు. శ్రీ ఎ. వి. యస్. రామారావుగారు "పరమాణువుకథ" "సౌర కుటుంబం" మొదలైన గ్రంథాలను సులభమైనశైలిలో Precision పోనీకుండా వ్రాశారు. డాక్టర్ బ్రహ్మాండం నరసింహంగారు "నేనూ ప్రయోజకుడనే" అనే పేరుతో పెరట్లో మొక్కలపెంపకాన్నిగురించి ఓచిన్నపుస్తకం వ్రాశారు. రచనలో వారినేర్పు ప్రశంసనీయం.

పనిలోపని నేను రాసిన పుస్తకాలజాబితాకూడా ఏకరువుపెడదామనే ఉంది. కానీ మళ్ళీ "పోనీలే. మరో అవకాశం రాకపోతుందా?" అని వదిలేస్తున్నాను. తెలుగులో (ఆమాటకొస్తే ఏభారతీయభాషలోనైనాసరే) వైజ్ఞానిక రచనలు చేయడంలో ముఖ్యమైన ఇబ్బంది స్థిరమైనపారిభాషికపదావళి లేకపోవడం. ఆపదావళి ఏదో ఏర్పడ్డాకే వ్రాతకి కూర్చుందామంటే "పిచ్చికుదిరితే గాని పెళ్ళి కుదరదు, పెళ్ళికుదిరితేగాని పిచ్చికుదరదు" అన్నసామెతగా ఉంటుంది. ఇప్పుడు డిగ్రీక్లాసులవరకూ తెలుగులోనే బోధించాలని నిశ్చయించారు కనక, ఏదో ఒకపదగుచ్ఛంతయారై బయటపడుతుంది. దరిమిలా అది స్థిరపడుతుంది.

# పరామర్శ గ్రంథాలు

శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావు

స్వాతంత్ర్యానంతరం ఆంధ్రభాషాసరస్సులో సాహిత్యకమలము వేయి దళాలతో విప్పారింది. మూడుప్రాంతీయవిశ్వవిద్యాలయాల్లో భాషావాఙ్మయాలపై పరిశోధనలు ముమ్మరంగా సాగుతున్నాయి. ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ ఏర్పడి పండితప్రకాండుల సహకారంతో అనేకఉద్గ్రంథాలను ఉత్తమగ్రంథాలను ప్రచురించడమే కాకుండా ప్రజలలో సాహిత్యచైతన్యం పుట్టేటట్టు అనేక దోహదాలు కల్పిస్తున్నది. ప్రభుత్వం స్వయంగా ద్రవ్యసహాయం చేసి మరికొన్ని గ్రంథాలు ముద్రణభాగ్యాన్ని పొందేటట్టు చేస్తూఉంది. లోగడ ఎండబారిన సాహిత్యక్షేత్రాలన్నీ ఇప్పుడు పండబారుతున్నాయి. సాహిత్యంలో 'పచ్చవిప్లవం' ప్రారంభమయింది. ఎన్నిస్మృతిస్వీకారాలు ! ఎన్నినూతనగ్రంథఆవిష్కారాలు !

ఇటువంటి శుభసమయంలో పరామర్శగ్రంథాల (Reference books) పరామర్శకూడా అవసరము. ఒక పరామర్శగ్రంథనిర్మాణం అంటే భారీఎత్తు పరిశ్రమ. అర్థబలం ఉన్నా అంగబలం పటిష్ఠంగా ఉండవలె.నిర్దుష్టమైన ప్రణాళిక, ఉద్దేశము లేకపోతే ఈ పరిశ్రమ లాభసాటి కాదు. చెప్పుకుంటే సిగ్గుకాని మనకున్న పరామర్శగ్రంథా లెన్నని ! సూని, శర, బ్రౌణ్యాలు, దేవకీజమీందారు ఆంధ్రవిజ్ఞానం, లక్ష్మణరావు, నాగేశ్వరరావుగార్ల అసంపూర్ణ సర్వస్వాలు, పూర్వగాథాలహరి, పురాణనామచంద్రిక తప్ప. ఇప్పుడా ఈ పరామర్శగ్రంథజాలం ఒక అపరిమితకుటుంబంలా తయారైంది. స్వాతంత్ర్యానంతరం వచ్చిన కొన్ని పరామర్శగ్రంథాలు.

**నిఘంటువులు :**

వావిళ్ల నిఘంటువు, ఆంధ్రశబ్దరత్నాకరం,శాసనపదకోశము, చేనేతవృత్తిపదకోశము, వ్యవసాయవృత్తిపదకోశము, గృహవాస్తువృత్తిపదకోశము, ధాతుక్రియాస్వరూపమణిదీపిక, వివిధపారిభాషికపదకోశాలు (Etymological-Dictionary) (ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు తయారుచేస్తున్నారు), ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు (తెలుగుఅకాడమీవారు. ఇది శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయంవారు తెలుగు అకాడమీకి పరిష్కరణ ప్రకటనలకై ఇచ్చినది),

Index Verborum(ప్రాచీనాంధ్రశాసనాంనే గ్రంథంలో 314 పుటల నిఘంటువు).

ఇవికాక బ్రౌన్యం తెనుగు, ఇంగ్లీషు నిఘంటువు, శబ్దరత్నాకరం మూని 8 వ సంపుటం, మామిడి వేంకటార్యుని సంస్కృతనిఘంటువు మొదలైన వాటికి కొత్తకూర్పులు వచ్చేయి.

**విజ్ఞానసర్వస్వాలు :**

ఆంధ్రవిజ్ఞానము, బాపినీడుగారిది–తెలుగు విజ్ఞానసర్వస్వం,సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, నెల్లూరిమండల సర్వస్వము, గుంటూరుమండల సర్వస్వము, ఆంధ్రదేశచారిత్రకభూగోళ సర్వస్వము, కడప, అనంతపురంజల్లాల గెజెటీర్‌లు (ప్రభుత్వంవారివి).

**పదప్రయోగసూచికలు :**

నన్నయ, నన్నెచోడ, తిక్కన, శ్రీనాథ (ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వశేషం శేషంగానే మిగిలిపోయింది) పదప్రయోగసూచికలు.

**తాళ్ళపాకవారి పలుకుబళ్లు :**

పదబంధపారిజాతం (2 సం). (Dictionary of Idioms), సూక్తి సుధాకరము (Dictionary of quotations), తెలుగుసామెతలు (Telugu Proverbs), ఈ గ్రంథాలలో చాలావాటికి సాహిత్యఎకాడమీ నారుపోసి నీరు పెట్టింది.

నిఘంటువులలో – ఆంధ్రశబ్దరత్నాకరంలో కొన్ని నూతన రత్నాలు దొరకుతాయి. సాధారణంగా తెనుగునిఘంటువులలో తత్సమశబ్దాలు 'అరవఅమెత' విందుగా ఉంటాయి. ఇచ్చిన శబ్దాలకైనా వ్యుత్పత్తిని చూడా లంటే తిరిగి అమరాన్ని యాచించవలసి వస్తూఉంది. ఈలోటు ఆ. శ. ర. వల్ల బర్తీ అయింది. పదబంధాలతో, సామెతలతో, ద్రవిడభాషా సామ్యాలతో పుష్టిగా తుష్టిగా కనబడే త్రిసంపుటి ఆ.శ. ర. ఆంధ్రధాతుక్రియాస్వరూప మణి దీపిక కేవలం క్రియాపద నిఘంటువు.శాసన పదకోశం శాసనాల్లో వాడినపదాలకు బృహద్‌కోశం.

Index Verborum – ఇది కూడా శాసనపదనిఘంటువే కాని పరిమితి పాజ్ఞనన్నయ కాలానికి. సుమారు 314 పుటలలో శాస్త్రబద్ధంగా తయారైన కోశం ఇది. అర్థంపర్థం కాని మృతకపదాలను, వాటి అర్థాలను ఇందులో చూడవచ్చు.

ఆధునికకాలంలో వెలువడే నిఘంటువులకీ ప్రణాళిక ఆదర్శప్రాయం కాగలదు. ఒకపక్క ప్రాఙ్నన్నయ యుగపు శాసనభాషకు, మరొకపక్క కావ్యభాషకు నిఘంటువులు ఏర్పడితే ప్రజాభాషకు కూడా పదకోశాలు వచ్చేయి. ఈ యుగంలో గర్వించదగిన సాహిత్యకృషి ఇది. బ్రౌను కొంతదారి చూపినా భద్రిరాజు కృష్ణమూర్తి ఘంటాపథం చేసేరు. వృత్తిపదకోశాల పుటలు విప్పి చూస్తే తెనుగుజాతి ఎంత శక్తివంతమైన పదజాలాన్ని రసనాగ్రంమీద దాచుకుందో తెలుస్తుంది. ఈ పదకోశాల నిర్మాణంలో ఆంధ్రులదే పైచెయ్యి.

**తెనుగు అవయవ వ్యుత్పత్తి పదకోశము :**
(Telugu Etymological Dictonary)

ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు దీనికి పునఃప్రారంభము చేసినారట. వివరములు తెలియవు. దేశ్యపదాలకు వ్యుత్పత్తి లేదనే వాదం తప్పని ఈ నిఘంటువు వెలుగులోకి వస్తే తెలుస్తుంది.

తెనుగు ఎకాడమీవారి ప్రాంతీయ భాషా పాఠ్యగ్రంథాల ఉత్పత్తిలో ఉపఉత్పత్తిగా తయారవుతున్న పారిభాషిక పదపట్టికలు అంతర్జాతీయపదాలను చేర్చుకున్నాయి. అంతర్జాతీయ పారిభాషికపదాలను తెనుగులోకి తెచ్చే భగీరథ ప్రయత్నం చేస్తున్న తెనుగు ఎకాడమీవారికృషి బహుధా శ్లాఘనీయము. ప్రతి పాఠ్యగ్రంథానికీ చివర ఈ పట్టికలు ఉంటాయి.

**పదప్రయోగ సూచికలు :** (Concordances)

వేదాలకు Bloomfield అనే పాశ్చాత్య భాషాపారంగతుడు ఒక పదప్రయోగసూచికను తయారుచేసేడు. తెనుగులో కూడా నన్నయ, తిక్కన, నన్నెచోడ, శ్రీనాథుల గ్రంథాలకి పదప్రయోగసూచికలు వెలిసినాయి. ఈసూచికల్లో దేశ్యపదాలు, తత్సమక్రియలు, వాటిని కవి తనగ్రంథంలో ఎక్కడెక్కడ ఎట్లా ప్రయోగించినదీ కనబడుతుంది. భాషాపరిశోధనల కివి సోదనదీవియలు. ఇదే ఊపులో పాల్కురికి సోమన గ్రంథాలకీ, హంసవింశతికీ కూడా పదప్రయోగ సూచికలు వస్తే ఎంత బాగుండును. అంతా ఒకఎత్తు అగస్త్యుడు ఒక ఎత్తు అన్నట్టు తాళ్లపాకవారి కృతులకు నిర్దుష్ట పద ప్రయోగసూచిక రావాలి. పాల్కురితో తెలంగాణాప్రాంతానికి, తాళ్లపాకవారితో రాయలసీమ ప్రాంతానికి పదప్రయోగసూచికలో ప్రాతినిధ్యం లభిస్తుంది. కోస్తాప్రాంతానికి నన్నయ, తిక్కన, నన్నెచోడ, శ్రీనాథు లీవరకే ఎన్నికయినారు.

విజ్ఞాన సర్వస్వాలు :

రెండువిధాలైన విజ్ఞానసర్వస్వాలు తెలుగులో ఉన్నాయి. (1) ప్రధానంగా అనుక్రమణిక సర్వస్వాలు, (2) విషయప్రధాన సర్వసాలు. మొదటికోవకు చెందినది సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము. అకారాదితో మొదలుపెట్టిన విజ్ఞాన కోశాల్లో విజయవంతంగా పనిని పూర్తిచేసిన సంస్థ సంగ్రహాంధ్రవిజ్ఞానకోశ సమితి.

తెనుగుభాషాసమితివారు విజ్ఞాన సర్వస్వాలను విషయానుపూర్వికంగా విభజించినారు. వారి సంపుటాలలో మొదట దిక్ప్రదర్శనంగా వ్యాసాలు ఉంటాయి. తరవాత అకారాదిగా ఆ విషయానికి సంబంధించిన అంశాలు ఉంటాయి. తెనుగు సంస్కృతి - (3 వ. సం.) ప్రత్యేకతను, ప్రామాణికతను సంపాదించుకున్నది.

తెనుగు అధికారభాష కావడానికి పూర్వమే తెలుగులో విజ్ఞానసర్వస్వాలు తలయెత్తడం మొదలుపెట్టేయి. అంతర్జాతీయ విజ్ఞానాన్ని తెలుగువారికి అందించాలన్న ఆశయంతో మొదలుపెట్టిన విజ్ఞాన సర్వస్వ సంచాలకులు ముందుగా తెలిసో తెలియకో పారిభాషికపదాలను సేకరించుకోవడం మొదలుపెట్టినారు. దురవబోధమైన శాస్త్రవిషయాలను తెలుగులోకి తేవాలనే వీరి దృఢసంకల్పం కొనియాడదగింది. ఆంగ్లభాషలోనుంచి తెనుగులోకి శాస్త్రవిషయాలను అనువాదం చేసేటప్పుడు విజ్ఞానసర్వస్వ సంపాదకులు పడే శ్రమకు కంటతడిపెట్టక తప్పదు.

ఈ పరంపరలో వచ్చిన నెల్లూరిమండల సర్వస్వం, గుంటూరు మండల సర్వస్వం, కడప, అనంతపురం జిల్లాల సర్వస్వాలను కూడా స్మరించాలి. ఈవిధంగా జిల్లాలవారిగా తక్కిన జిల్లాలకు ప్రత్యేకసర్వస్వాలు వస్తే ముదావహం.

ఆంధ్రదేశ చారిత్రక భూగోళసర్వస్వంలో యావదాంధ్ర దేశాన్ని ఏలిన రాజులు, వారిరాణులు, వారిమంత్రులు, దండనాయక సేనాపతులను గురించే కాకుండా దేశంలోని పట్టణాలు, నదులు, పర్వతాలు, రాజ్యాలు, సంస్థానాలను గురించిన విషయాలను అకారాదిగా కూర్చి ప్రచురిస్తున్నారు. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశనిర్మాణంలో అనుభవాన్ని సంపాదించినపెద్దలే దీన్ని నడుపుతున్నారు. ఒక్క ప్రథమసంపుటం మాత్రమే వెలువడింది.

ఇంకా ఈ క్రింది పరామర్శగ్రంథాలు వస్తే బాగుంటుంది.

1. ముద్రితాముద్రిత గ్రంథసూచి (Catalogue catlagorum) (కాశీనాథుని వారిని స్మరిస్తూ)
2. పురాణనామకోశము (Dictionary of Mythology) (పూర్వగాథాలహరిని స్మరిస్తూ)
3. వ్రతాలు, నోములు, పండుగలు, పర్వదినాలు (Dictionary of Festi- vals and Feasts)
4. కవికావ్య విమర్శచంద్రిక_(Companion to Literature)
5. వర్ణాలు, శాఖలు (గిరిజనులతో సహా) (Thurston-Castes and Tribes in South India స్మరిస్తూ)
6. ఆలంకారిక లేక కావ్యలక్షణ పదకోశము (Dictionary of Literary terms).

ఊహలో ఉన్నవి, అచ్చవుతున్నవి, అచ్చయినా విస్మరించబడ్డ పరామర్శ గ్రంథాలు ఇంకా ఎన్నో ఉండొచ్చు. వాటి సమాచారము వ్యాసకర్తకు తెలియదని విజ్ఞులకు తెలుసు. బుద్ధిపూర్వకం కాదని వ్యాసకర్తకు తెలుసు.

పరామర్శగ్రంథనిర్మాణం, డాం నిర్మాణం లాంటిదే_ఆలస్యానికి, శ్రమకు ఫలితాలకు.



''నా ఆనందం కోసం నేను వ్రాసుకున్నాను: ఎవరి కర్థంకాకపోయినా, ఎవరు బాగులేదన్నా నాకులెక్కలేదు' అని నే ననుకోను. ఏ రచయితైనా, అట్లా అన్నా అది నేను నమ్మను - నా సమకాలికులలో కొందరు పిన్నలకి పెద్దలకీ కూడా నేను చెప్పదలచుకున్నవి అవగాహన కావటం, రుచించడం, సానుభూతితో వారు విమర్శించగలగటం నాకు ఉత్సాహాన్ని, సంతృప్తిని కలిగించింది, ఇది నా అదృష్టం''.

—బుచ్చిబాబు.

# పాఠ్య గ్రంథాలు

శ్రీ తాళ్లూరు నాగేశ్వరరావు

పాఠ్యగ్రంథాలప్రచురణవిషయంలో మనదేశం అభివృద్ధిదశలో ఉన్నది.

పాఠ్యగ్రంథాల అవతరణ స్వాంతంత్ర్యయుగోదయంతో ప్రారంభంకానప్పటికీ, వాటిలో ఎన్నోనూతనపరిణామాలు ఈమధ్యకాలంలో వచ్చాయి. అందులో ఉన్నతపాఠశాలస్థాయివరకు పాఠ్యగ్రంథాలను జాతీయంచేసి, వాటి ప్రచురణను ప్రభుత్వం చేపట్టడం పేర్కొదగ్గపరిణామం. పాఠ్యగ్రంథాల జాతీయాకరణకుముందు అనేకమంది పబ్లిషర్లు అనేకరకాలుగా పాఠ్యగ్రంథాలను తయారు చేయించి, మార్కెట్‌లో పోటీకి పెట్టేవారు. కొన్నింటికి ప్రభుత్వ ఆమోదముద్రా, ఆదరణా లభించేవి. అట్లాంటి పుస్తకాలపబ్లిషర్లు లక్షాధికారులయ్యేవారు. పాఠ్యగ్రంథాలు ప్రయివేటురంగంలో ఉన్నంతకాలం, ఆవ్యవస్థ అస్తవ్యస్తంగా ఉండి, అనారోగ్యకరమైన పోటీ ఎక్కువై విద్యార్థులూ, ఉపాధ్యాయులూ ఎన్నోఇబ్బందులు పడవల్సి వచ్చేది. అందుచేత ప్రభుత్వం ప్రజల కోర్కెలమేర పాఠ్యగ్రంథాలను జాతీయంచేసి, వాటితయారీబాధ్యతను స్వీకరించి, ప్రచురణను చేపట్టింది.

పాఠ్యగ్రంథాల విషయంలో మిగతారాష్ట్రాలకంటె మనరాష్ట్రం త్వరితగతిని ముందంజవేస్తూన్న దని చెప్పవచ్చు. పాఠ్యగ్రంథాల ప్రచురణలో ఇటీవలి పరిణామాలను పరిశీలిస్తే ఈ అంశం తేటతెల్లమవుతుంది. ఇందుకు ప్రధానకారణం_మన ముఖ్యమంత్రి మాన్యశ్రీ పి. వి. నరసింహారావుగారి అపూర్వమైనకృషి. ఉన్నతవిద్యలో తెలుగును బోధనాభాషగా నిర్ణయించి, ప్రజలభాషలో పరిపాలన, విద్యాబోధన జరగవలెనని ప్రకటించి, ఆచరణలో పెట్టిన శ్రీ పి. వి. గారి పేరు ఆంధ్రప్రదేశ్ విద్యావిషయిక చరిత్రలో సువర్ణాక్షరాలతో నిలిచిపోతుంది. ఈ సందర్భంలో వారిసందేశాన్నిమననంచేసుకోవడం మన ధర్మం. "ప్రజలు విజ్ఞానవంతులైతే మన నిర్మాణకార్యక్రమాలలో ప్రోత్సాహంగా పాల్గొని దేశపురోగతికి ఎక్కువగా తోడ్పడగలరు. మన సభ్యతా సంస్కృతులలో ఉన్నమంచిని, ఇతర నాగరికతా సంస్కృతులలో ఉన్నమంచిని తులనాత్మకంగా పరిశీలించి, గ్రహించి తమజీవితాలను ఫలవంతం చేసుకోగలరు. ప్రజలభాషలో పరిపాలన, విద్యాబోధన జరిగిననాడే

ఇది సాక్ష్యం. ఇందుచేతనే మనప్రభుత్వం తెలుగును అధికారభాషగా ప్రకటించింది; కళాశాల తరగతులలో కూడా తెలుగును బోధనాభాషగా నిర్ణయించింది. ఈ నిర్ణయాలకు ప్రజలకోర్కె పునాది; దీనికి ప్రజలసమ్మతి ఉంది."

ప్రాథమిక, ఉన్నతపాఠశాలావిద్యార్థులకు చాలకాలంగా తెలుగులోనే విద్యాబోధన జరుగుతున్నది. ప్రభుత్వమే అనుభవమూ, సామర్థ్యమూ ఉన్న ఉపాధ్యాయులచేత ప్రామాణిక పాఠ్యగ్రంథాలను వ్రాయించి, అందంగా ముద్రించి సరసమైనధరలకు విద్యార్థులకు సప్లయ్ చేస్తున్నది. ఈ పాఠ్యగ్రంథాలన్నీ ఐక్యవిద్యాప్రణాళికను అనుసరించి, బోధనావిధానంలో వచ్చిన అభివృద్ధి ధోరణులను దృష్టిలో పెట్టుకొని, దేశభక్తి, లోకజ్ఞానం, సర్వమానవ సోదరభావం, భాషాసేవ, సంస్కృతి, కళలు, శాస్త్రవిజ్ఞానం, మానవీయత, వినోదవికాసాలు మొదలైన బహుళాంశాలకు ప్రాతినిధ్యం చూపుతూ వ్రాయించి, ప్రచురించి నటువంటివే. మన విద్యార్థులలో ఉత్తమ విద్యాస్థాయి నెలకొనడానికి, వివిధ విషయపరిజ్ఞానం పెంపొందడానికీ, సత్సంస్కారం అలవడడానికీ, ఉన్నతవిద్యాభ్యాసానికి ప్రాతిపదికగా ఈ పాఠ్యగ్రంథాలు ఉపకరిస్తున్నాయి. ఒకటో తరగతినుంచి పదోతరగతి వరకూ అన్నిపాఠ్యగ్రంథాలనూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రచురణసంస్థ ప్రచురిస్తున్నది.

1969 - 70 నుంచి వెలుగులోకి వచ్చిన ఇంటర్మీడియట్ కోర్సుకూ, 1971 నుంచి తెలుగులో ప్రారంభమైన బి. ఏ; బి. యస్. సి; బి. కాం., కోర్సులకు మౌలికమైన పాఠ్య, పఠనీయ గ్రంథాలను తెలుగు అకాడమి వివిధశాస్త్రాలలో విశేషపరిశోధన చేసిన విశ్వవిద్యాలయాచార్యుల పర్యవేక్షణలో, బోధనలో బాగా అనుభవమున్న, అధ్యాపకులచేత వ్రాయించి, ప్రచురించి విద్యార్థుల, అధ్యాపకుల ఉపయోగార్థము, తెలుగులో ఉన్నత విద్యాబోధన విజయానికి తోడ్పడుతూన్నది. ఉన్నతస్థాయిలో విద్యాబోధనకు తెలుగును ప్రవేశపెట్టవలెననే ప్రభుత్వాశయానికి తద్వారా రాష్ట్రపరిపాలనా సౌలభ్యానికి తెలుగును తీర్చిదిద్ది, పటిష్ఠంచేయ వలసిన ఆవశ్యకానికి—తెలుగుఅకాడమి ఆచరణ ప్రాముఖ్యాన్ని చేకూర్చే సాధనంగా రూపొందినదని చెప్పవచ్చు. ఈ సంస్థ ఇప్పటివరకూ అంటే 1972 ఆగస్టు 6 వరకూ ఇంటర్మీడియట్ కోర్సులకు సంబంధించి 59 పాఠ్యగ్రంథాలనూ. డిగ్రీతరగతుల కోర్సులకు సంబంధించి 99 పఠనీయ గ్రంథాలనూ వెలువరించింది. మనరాష్ట్రంలో తెలుగుమీడియమ్‌పట్ల విద్యార్థులకు ఉత్సాహం పెరగడానికీ, బోధనలో అధ్యాపకులకు సౌలభ్య మేర్పడటానికీ,

విద్యావంతులలో ఆసక్తి కుదరడానికీ, అభ్యుదయకరమైన ఈ పరిణామం విజయం పొందడానికీ తెలుగుఅకాడమి ప్రామాణికమైన గ్రంథాలను సకాలంలో అందించడమే ప్రధానకారణమని చెప్పడంలో అతిశయోక్తిలేదు. తెలుగు విద్యార్థిలోకానికీ, అధ్యాపక ప్రపంచానికీ, ప్రజలకూ అత్యల్ప వ్యవధానంలో, ప్రభుత్వ, విశ్వవిద్యాలయాల సహకారంతో సేవలు అందించిన తెలుగుఅకాడమి కృషిని ఎవరైనా అభినందించకుండా ఉండలేరు. ఈ అపూర్వకృషిసాధనలో ఆసంస్థ ఛైర్మన్ బహుభాషాకోవిదులు అయిన శ్రీ పి. వి. నరసింహారావుగారినీ, డైరెక్టర్ డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావుగారినీ ప్రత్యేకంగా పేర్కొనవలె.

ఉన్నతస్థాయిలో విద్యాబోధనకు ఉపకరించే పాఠ్యగ్రంథాలను తెలుగులో తయారుచేయడం అంత సులభమైన వ్యవహారం కాదు. ముఖ్యంగా ఇబ్బంది పారిభాషికపదాలతో వస్తుంది. కొన్నివందల సంవత్సరాలనుంచీ ఇంగ్లీషు మీడియమ్ కొనసాగుతూ వస్తున్నది. చదవడం, వ్రాయడం, ఆలోచించడం— అంతా ఇంగ్లీషులోనే జరిగిపోతున్నది. సాంకేతిక, శాస్త్రీయపదాలకు తెలుగులో సమానార్థకాలు వాడుకలో బహుతక్కువగా ఉన్నాయి. పారిభాషిక పదావళి మీద తెలుగులో ఎక్కువ కృషి జరగలేదు. శాసన, న్యాయ, పరిపాలనా సంబంధమైన పదాలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక పారిభాషిక పదకోశాన్ని నిపుణులచేత తయారుచేయించి, ప్రచురించింది. మానవికశాస్త్రగ్రంథరచనకు ఈ గ్రంథం కొంతవరకు ఉపకరిస్తుంది. కాని ఇట్లాంటి ఉపయుక్తగ్రంథం శాస్త్రీయగ్రంథరచనకు లేదు. ఏది ఏమైనా ఈ సంధికాలంలో ఎక్కువగా సాంకేతిక, శాస్త్రీయపదాలను ప్రతిలేఖనంగా (Transliteration) వాడుకోవడం ఉత్తమంగా తోస్తున్నది. అట్లా వాడడంవల్ల పైచదువులకు వెళ్ళే విద్యార్థులకు, పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయిలో ఇంగ్లీషువిద్య నభ్యసించవలసివచ్చినప్పుడు— సాంకేతిక, శాస్త్రీయ పదాలతో పెద్దగా ఇబ్బంది ఏర్పడదు.

తెలుగులో ఉన్నత విద్యాభ్యాసానికి ఒక్క పాఠ్యగ్రంథాలవల్లనే ప్రయోజనం చేకూరదు. ఎన్నో రిఫరెన్సు గ్రంథాలు రావాలి. ఇవి అనుబంధ పఠనానికి ఉపయోగ పడతాయి. ఆంగ్లంలో సుప్రసిద్ధరచయితలు వ్రాసిన ప్రామాణిక గ్రంథాలను మనరాష్ట్రంలో ఉన్న పెద్దపబ్లిషర్సు సమర్థులైన కాలేజీ అధ్యాపకులచేత అనువదింపజేసి ప్రకటిస్తే, విద్యార్థుల కెంతో ఉపయోగంగా ఉంటుంది. ప్రామాణికగ్రంథాలను తెలుగులో అనువదింపజేసి, ప్రకటించే కార్యక్రమానికి తెలుగుఅకాడమి పూనుకొన్నది. ఇది కొనియాడదగిన కృషి.

మిగతా పుస్తకప్రచురణసంస్థలుకూడా ఈ కార్యక్రమాన్ని చేపడితే తెలుగు మాధ్యమం విజయానికి చేయూత నిచ్చినట్లు అవుతుంది. అంతేకాకుండా మన ఆచార్యుల, అధ్యాపకుల, విద్యావంతుల మానసిక వైఖరిలో ఎంతో మార్పు రావలసి ఉన్నది. తెలుగుభాషపట్ల, తెలుగులో విద్యాబోధనపట్ల, అధికార భాషగా తెలుగు రాణించడంపట్ల ప్రత్యేక అభిమానాన్ని చూపే తరుణం ఆసన్న మైంది. వివిధశాస్త్రాలబోధనలో అనుభవ మున్నవారు వివిధశాస్త్రాంశాల మీద ప్రత్యేకంగా గ్రంథాలు రచించి, ప్రకటించవలె; మానవిక, వైజ్ఞానిక శాస్త్రవిషయాలమీద వ్యాసాలు వ్రాసి, పత్రికలద్వారా అందించవలె. తెలుగులో వైజ్ఞానికపత్రికలు వేళ్లమీద లెక్కించదగినవే ఉన్నాయి. కాలేజీలలో తెలుగు మీడియమ్ ప్రవేశపెట్టిన ఈతరుణంలో విద్యార్థులు, అధ్యాపకులు పాఠ్యగ్రంథాల పరిధిని దాటి విభిన్న వైజ్ఞానికవిషయాలనుగురించి తెలుసుకోవడానికి, చదువుకోవడానికి తెలుగులో వైజ్ఞానికపత్రికలు విరివిగా రావాలి. ఇప్పుడు వెలువడుతూన్న దిన, వార, పక్ష, మాసపత్రికలు వైజ్ఞానికవిషయాల ప్రచారానికి కొన్నిపేజీలు కేటాయించవలె. తెలుగుఅకాడమీవారు ప్రచురిస్తున్నతెలుగు, త్రైమాసిక పత్రిక మానవిక, వైజ్ఞానిక శాస్త్రాంశాలకు సంబంధించినఅమూల్య మైన రచనలను అందిస్తున్నది. అదే విధంగా 'తెలుగు విద్యార్థి' 'ప్రసారిత', 'భారతి' మొదలైన పత్రికలు వైజ్ఞానికవ్యాసాలను ప్రచురిస్తున్నాయి.

మన పాఠ్యగ్రంథాలలో ఒకముఖ్యవిషయాన్ని ప్రస్తావించవలసిఉన్నది. ఈ పుస్తకాలధరలు చాల హెచ్చుగా ఉంటున్నాయనీ, వీటిని కొనుక్కోవడానికి నిరుపేదలైన విద్యార్థులు సతమత మవుతున్నారనీ చాలామంది అంటున్నారు. ఈ విమర్శను తోసిపుచ్చడానికి వీల్లేదు. ఈ విషయంలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు జోక్యం కల్పించుకొని, పాఠ్యగ్రంథ ప్రచురణసంస్థలకు తగి నంత సబ్సిడీలు ఇచ్చి, విద్యార్థులకు పాఠ్యగ్రంథాలు మిక్కిలి చౌకగా అందే టట్లు చూడవలె. యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్‌వారు పాఠ్యగ్రంథాలు కొని ఉచితంగా చదువుకొనే నిమిత్తం పేదవిద్యార్థులకు ఇవ్వడానికి ప్రతికాలేజీకి ఒక పథకం కింద గ్రాంట్లు ఇస్తున్నారు. ఈపథకం పేదవిద్యార్థులకు ఎంతో ఉపయోగకరమైన పథకము. ఈ పథకం కింద లభించిన గ్రాంట్లతో కాలేజీలు పాఠ్యగ్రంథాలు కొంటున్నాయి. ధర తక్కువ పాఠ్యగ్రంథాలు (Low priced text books) విరివిగా రావలె. అవి విద్యార్థులకు బాగా అందుబాటులో ఉండవలె. పైపెచ్చు మౌలికమైన స్థాయిలో ఉండవలె.

# రేడియో రచన

శ్రీ పన్యాల రంగనాథరావు

సాహిత్యరచనాప్రక్రియలలో 'రేడియోరచన' అనే ఒకప్రత్యేకప్రక్రియ చోటు చేసుకుని, ఇప్పటికి దాదాపు పాతిక ముప్పయ్యేళ్ళకు మించలేదని నేననుకుంటున్నాను. ఈమూడుదశాబ్దాలలోనూ, రేడియోరచన – అంటే రేడియోలో ప్రసారానికి, 'టెక్నికల్'గా సరిపడేరచన ఉన్నంతలో మంచిప్రగతి సాధించిందనే చెప్పుకోవాలి.

శ్రవ్యరచనకీ, రేడియోకోసం రాసేరచనకీ అట్టే తేడా లేనట్టు కనిపించినప్పటికీ, శ్రవ్యరచనే రేడియోరచన అని సిద్ధాంతీకరించుకోవడం పొరపాటేమో అనిపిస్తుంది. కేవలం శ్రవ్యరచన రేడియోలో ప్రసారంకోసం వచ్చేటప్పటికి, 'టెక్నికల్'గా కొద్దిపాటి మార్పులకు గురికాక తప్పదు.

అసలు – ఈరేడియోరచన అనే ప్రక్రియ ఏమిటి? ఏదైనా ఇది కేవలం వచనరచనకు సంబంధించినదే అని అనుకోవలసిఉంటుంది. వచనరచనలో, కథ, నవల, వ్యాసం, నాటకం, సంభాషణ, చివరికి వార్తలుకూడా రేడియోలో ప్రసారానికి అనుగుణ్యంగా ఉన్నప్పుడే అవి రేడియోరచన లవుతాయి. రేడియోలో ప్రసారానికి 'అనుగుణ్యంగా' ఉండడం అంటే ఏమిటనే సందేహం ఇక్కడ కలగకమానదు. సాంకేతికంగా అంటే టెక్నికల్‌గా రేడియోలో ప్రసారానికి కొన్ని పరిమితులంటూ ఉంటాయి.

రంగస్థలంమీద ఒకనాటకం ప్రదర్శించేటప్పుడు, ప్రేక్షకుల్ని ఎలా దృష్టిలో ఉంచుకోవాలో, ఉపన్యాసకుడు సభికుల్ని ఎలా దృష్టిలో ఉంచుకోవాలో, కథగానీ, నవలగానీ రాసేటప్పుడు పఠితల్ని ఎలా దృష్టిలో ఉంచుకోవాలో, అలాగే రేడియోలో ప్రసారానికి ఒకరచనను రూపొందించేటప్పుడు శ్రోతల్ని దృష్టిలో ఉంచుకోవాలి.

ఏ బాలమురళీకృష్ణ గాత్రాన్నో, ఏచిట్టిబాబువీణావాద్యాన్నో, ఏ మాలి మురళీవాద్యాన్నో, ఏ మారెళ్ళకేశవరావు వయొలిన్‌వాద్యాన్నో, ఏ శ్రీరంగం గోపాలరత్నంకంఠంనుంచి కమ్మనిపద్యాలనో, ఒకగంటసేపు తెంపులేకుండా రేడియోలో మనం హాయిగా వింటూ ఆనందించగలం. అయితే పట్టుమని పది నిమిషాలపాటు రేడియోలో ఒకప్రసంగాన్ని, లేదా, చిన్నకథని, అంతశ్రద్ధ

గానూ విని ఆనందించగలిగామంటే, ఆ రచనా, దాన్ని చదివినవారూ రేడియో దృష్టిలో బాగా ఆరితేరినవారై ఉండాలి.

పత్రికలలో ప్రచురణకు సరిపడేపద్ధతిలో రాసే ప్రసంగవ్యాసాన్నే ఉన్నదున్నట్టుగా రేడియోలో చదువుతున్నందువల్ల ముఖ్యంగా అవి శ్రోతల్ని ఆకట్టుకోలేకపోతాయి. కాబట్టి శ్రోతల్ని ఆకట్టుకునే గుణాలు రచనలో ఉండాలి. ఆప్యాయత ఉండాలి. "నేను చెప్పిందే వేదం – శ్రోతలంతా మూర్ఖులు" అనే ధోరణిలో రచన సాగకూడదు. ప్రసంగాన్ని వింటున్నప్పుడు, మధ్యలో శ్రోతకు "ఏడిశావు" అనిపించే రియాక్షన్ రాకుండా జాగ్రత్తపడాలి. ఇందుకోసం సరియైనమాటలు ఏరితూచివేయాలిగాని, అప్పటి కేది తోస్తే అదే రాసి పడేయకూడదు.

'మైక్రోఫోన్' అనేసాధనం ఎంతసున్నితమైందో, ఎంత సెన్సిటివో, అంత పెంకెదీ, పోకిరీదీని. మననోట్లోంచి ఊడిపడే ప్రతిశబ్దాన్నీ, మనకక్కర్లేనివికూడా పట్టేస్తుంది. కాబట్టి దానిముందు మనఅమాయకత్వాన్నీ – అజ్ఞానాన్నీ బయట పెట్టుకోరాదు. ఈముఖ్యమైనవిషయాలు, రేడియోలో చదివేవారికే వర్తించినా, చదివేవారు రాసినదేదో చదువుతారుగనక రాసేవారిక్కూడా వర్తిస్తాయని జ్ఞాపకం ఉంచుకోవాలి. 'చూడటం' సంగతి అలా ఉంచి, రేడియోవ్యవహారం 'వినడం'తో సంబంధించిందికాబట్టి, ఏమాత్రం కటువైన శబ్దాన్నైనా చెవి ఇట్టే పట్టేస్తుంది.చెవితాలూకు సామర్ధ్యాన్ని ఆసరాగా తీసుకుని, 'మైక్' ఎంతటి ఆటయినా ఆడించేస్తుంది.

కొన్నికొన్నిమాటలూ, వాక్యాలూ రేడియోలో ప్రసారమయేటప్పుడు, కేవలం విమర్శభావాలను స్ఫురింపచేయటమే కాక, 'బూతు' అశ్లీలం–అనుకునే ప్రయోగాన్ని స్ఫురింపచేయడంకూడా పరిపాటి. ఉదాహరణకి: 'గుద్ద', 'పూనాకి వెళ్లారు' 'వారిమొద్దా', 'వీపు మీద గుద్దులు గుద్దడం మంచిదికాదు!' 'స్కందపురాణం' 'భాగం' ఇలాంటి వెన్నెన్నో ఉన్నాయి. రేడియోలో ఈ మాటలు నిషిద్ధం కాదుగానీ, ఇలాంటివి వాడి శ్రోతలదృష్టిలో నవ్వులపాలు కావడం వాంఛనీయం అనిపించుకోదు.

ఏదైనా ఒకవిషయంమీద, 'రేడియోలో ప్రసారం చేసేటందుకు' ఒక ప్రసంగం, వ్యాసం రాయటానికి పూనుకొనేటప్పుడు – ముఖ్యమైన అంశం వొకటి దృష్టిలో ఉంచుకొనడం మంచిది. ఆప్రసంగవ్యాసంలో రచయిత చెప్పదలుచుకున్న దేమిటో ముందుగా చెప్పేబదులు, తను ఎన్నుకున్న, లేక

తనకు నిర్దేశితమైన విషయంలో ఏది శ్రోతకు సామాన్యశ్రోతకు ఇంపుగా ఉంటుందో, ఆలోచించాలి. ఎంతబరువైనవిషయమైనా సరే. రవంతఫలో క్తి పరంగా, చమత్కారంగా ఎత్తుగడలోనే ఎత్తుకోవాలి. రేడియోలో క్షణాలకూ నిముషాలకూ ఎక్కువప్రాధాన్యత ఉంటుంది. సినీమాతెరపైన అయిదు నిమిషాలు ఎంత సామాన్యవిషయం కాదో, రేడియోలో అయిదుసెకెండ్లయినా అంత సామాన్యం కాదు. ఒకచిన్నవిషయం ఉదాహరణగా తీసుకొండి. మీగదిలో రేడియో మోగుతూ ఉంటుంది. ఒకకార్యక్రమం ముగిసి మరో కార్యక్రమం ప్రారంభం కావాలి. ఆరెండింటిమధ్య పదిసెకెండ్లు పోతే, అయిదు సెకెండ్ల పాటు విరామం వచ్చినా, అంటే ఏప్రసారమూ లేకుండా గడిస్తే, మీదృష్టి వెంటనే అటు ఆకర్షించబడుతుంది. "ఏమిటి? ఆగిపోయింది!" "ప్రసారం పోయిందే!" "రేడియో చెడిపోయిందా ఏంఖర్మ!" ఇలా పోతుంది మనసు. శ్రోతలు ఇలా అనుకునిపోతారేమోనని రేడియోవాళ్లు విరామసంగీతం అంటూ ఫిల్లర్స్ వేస్తారు. ఫిల్లర్స్ కేవలం అందుకేకాదు. పదినిమిషాలప్రసంగం తొమ్మిదినిముషాలే వస్తే ఏంచేయాలి? మిగతా నిమిషాన్ని సర్దాలి. ఫిల్లర్స్ ప్రయోజనాలు ఇలా ఎన్నో ఉంటాయనుకోండి. మాటవరసకి చెప్పాను.

అయిందా! చెప్పొచ్చే దేమంటే, ఉన్నపదిపదిహేనునిమిషాల వ్యవధిలో మొదటి రెండుమూడు నిమిషాలదాకా శ్రోతను ఆకట్టేప్రయత్నంలోనే ప్రసంగ రచన సాగాలి. ఆ మూడునిమిషాలలో ఆకట్టుకోలేకపోతే శ్రోత సినీమా సంగీతానికైనా పోతాడు లేదా రేడియో మూసేసాడు ఒక తిట్టుతిట్టి. ఇక కథల సంగతికి వద్దాం. అప్పుడప్పుడు, రేడియోలో కథలు ప్రసారమవుతూ ఉంటాయి. అవన్నీ పత్రికల్లోనో, పుస్తకాలుగానో అచ్చవుతే చదువుకోడానికి తప్ప, రేడియోపరిమితులకు లోబడి ప్రసారానికి పనికొచ్చేవిగా ఉండవు.

ఒక కథగానీ, నవలగానీ, పత్రికలోనో, పుస్తకంగానో అచ్చులో ఉన్నప్పుడు, పత్రికకు ఒక గొప్పసౌకర్యం ఉంటుంది. రచన 'బోర్' కొడితే పేజీలు తిప్పేయడం. 'బోర్' అని ఎప్పు డనిపిస్తుంది? కథ నడవక, కుంటు పడినప్పుడు కథ నడిచే భాగాలుపటుకే చదువుకుంటూ పోవడం. ఈసౌకర్యం పాపం శ్రోతకు లేదు. వినదలచుకుంటే, చచ్చేటట్టు వినాలి. 'బోర్' కొట్టిందా "స్విచ్ ఆఫ్". ఆపైన 'నీముఖంలా ఉంది' అని ఒక పసందైన తిట్టు.

కాబట్టి ఇదివరకు వ్రాసినదే ఒకకథను రేడియోలో ప్రసారానికి ఉద్దేశించినప్పుడు, దాన్ని రేడియో "శ్రోత" ను దృష్టిలో ఉంచుకుని తిరిగి

రాస్తే మంచిది. లేదా, ఆ విధంగా మార్పులైనా చేయాలి. ముఖ్యంగా శ్రోత వర్ణనలు భరించలేరు. పైగా ప్రకృతి శోభ వర్ణనలు – అసలు భరించటం సాధ్య పడదు. వచనంలో అటువంటి భాగాలన్నీ తొలగించుకోవాలి. కథలో 'గమనం' ఉండాలి. కథలో ఉపయోగించే 'శిల్పం' శ్రోతకు సులభగ్రాహ్యమై ఉండాలి. కథను 'మైక్' ముందు చదివేటప్పుడు, భావానుగుణ్యంగా చదవగలిగినప్పుడు శ్రోతను ఇట్టే ఆకర్షిస్తుంది. అయితే ఇందులో "అతి" చేయరాదు. కథలో సంభాషణలు_పాత్ర చదివేపద్ధతికి దగ్గరగా ఉండేటట్టుగా చదవాలి. అంతేగాని 'నటించ' కూడదు. కథలో పాత్రల సంభాషణలు డైలాగ్స్ ఎక్కువ ఉన్నప్పుడు– ఆయా సంభాషణలు కోరే వ్యక్తులచేత అనిపించడం, కథాప్రసారంలో సామాన్యంగా అనుసరించే ఒక పద్ధతి. ఇందులో కథకుడు కథాభాగాన్ని నెరేషన్-చదువుతాడు సంభాషణలు పాత్రలు చెప్పుతాయి. ఇదికూడా వినేవారికి ఆసక్తికరతుతుం దొక్కొక్కప్పుడు. నాటకం సంగతి చెప్పాలంటే, చాలా ఉంది ఎంత క్లుప్తంగా చెప్పాలన్నా కొన్ని ముఖ్యమైన విషయాలు ప్రస్తావించక తప్పదు. నాటకానికి రేడియోలో ఉండే వ్యవధి చాలాతక్కువ ఎక్కువ ఉండరాదని కాదు. శ్రోతల దృష్ట్యా పెట్టుకోవలసి ఉన్న నియమం రేడియో నాటకాలలో రెండుమూడు రకాలున్నాయి. సంగీతనాటకం_నాటిక–రూపకం, ఇలాగ. సంగీతాత్మకమైనది సంగీత నాటకం. ఇటువంటి నాటకంలో సంభాషణలు సంగీతానికి అనువుగా ఉండాలి. భావానికి అనుగుణ్యంగా నేపథ్యంలో మధ్యసంగీతం కూడా ఉంటుంది. బృందగానా లుంటాయి. బృందగానాల ద్వారా కథను నడిపించేపద్ధతి కూడా ఉంటుంది

ఇక నాటిక ఏదైనప్పటికీ, ప్రతిసంభాషణ కథను కాస్తముందుకు తోస్తున్నదిగా ఉండాలిగాని, స్థబ్దం కారాదు. పావుగంట, అరగంట, ముప్పావు గంట–గంట స్థూలంగా అవ్యవధిలో ఉంటాయి నాటికలు. ఒకనవల రాసేకన్నా ఒక చిన్నకథ రాయడం ఎంతకష్టమో, గంట నాటిక రాయడంకన్నా పావుగంట వ్యవధికి నాటిక రాయడం అంతకష్టంతో కూడుకున్నపని. నాటకం వ్యవధి ఎంతైనా సంభాషణలు సహజంగా, సజీవంగా ఉండడం ఎంతైనా ముఖ్యం. రంగస్థల నాటకంలో కొన్నిసంభాషణలు వినపడకపోతే మునుచుకుపోయేది లేదు. కాని రేడియో నాటికలో ప్రతిసంభాషణా చెవిని పడితీరుతుంది కాబట్టి ప్రతి సంభాషణా సజీవంగా ఉండడమే కాక అదే లేకుంటే నాటకం గంగలో కలిసేది అనేభావం శ్రోతలో కలిగించేటట్టుగా ఉండాలి. రేడియో

నాటికలో ఏవొక్కడై లాగు బాగులేకున్నా శ్రోత తన 'హక్కు' వెంటనే అసలు జరుపుకునే ప్రమాదం ఉంటుంది. ఇదిలా ఉండగా నాటిక పావుగంటే అయినా, అరగంటనే అయినా, గంటదే అయినా జీవం పోసేది ఎఫెక్ట్సు. నాటికకు స్వభావసిద్ధంగా ఉండవలసిన వాతావరణం కలిగింప చేసేది ఎఫెక్ట్సు. నాటిక రాసేటప్పుడే వీటిగురించి దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది.

ఇక వార్తలూ, వ్యాఖ్యానాలూ, విమర్శలూ మొదలైనవికూడా, పత్రికల్లో వెలువడుతున్న భాషగా ఉంటే, రేడియోప్రసారానికి యోగ్యమనిపించుకోవు. వింటున్నవారికి ఎదురుగా ఉండి చెపుతున్నధోరణిలో వీటిని చదవాలి. ఆవిధంగానే రాయాలి.

"రేడియోలో ప్రసారానికి రచన ఎలా వుండాలి ?" అనే విషయంపైన, ఉత్తరోత్తరాఎవరైనా పెద్దలు పూనుకొని పుస్తకం రాయాలేగాని, ఇంతవరకూ అనుభవజ్ఞులైనవారు తెలుగులో రాయలేదు. ఇంగ్లీషులో, రేడియో ప్రసారాలకు సంబంధించి చాలాగ్రంథాలున్నాయి. చెప్పుకోతగ్గ లైబ్రరీలలో దొరకొచ్చు. రేడియోలో ప్రసారాలకు రచనలు పంపేవారు, అటువంటిగ్రంథాలలో తమకు పనికొచ్చేది ఒకటైనా తిరగవేస్తే, తమరచనాపద్ధతికి అది ఎంతైనా తోడ్పడుతుం దనడంలో సందేహ మేమీ లేదు.



'సహృదయుడు అంటే బోలెడు తెలిసినవాడు. ముఖ్యంగా నవ్వతగిన విషయాలేవో, నవ్వకూడని విషయాలేవో తెలిసినవాడే సహృదయుడు'

—మునిమాణిక్యం.

*          *          *

"కవిత్వంలోనూ, జీవితంలోనూ, Economy of words and thoughts లేకపోవడం దేశభక్తికన్న హీనమైన పాపం, ఆత్మలోకంలో దివాలా"

——చలం.

# రేడియో - సాహిత్య సేవ

**శ్రీ ఆచంట సూర్యనారాయణమూర్తి**

దాదాపు అర్ధశతాబ్దం కావస్తున్నది, మనదేశంలో రేడియోకార్యక్రమప్రసారాలు ప్రారంభమయి. మొదట్లో "మద్రాసు ప్రెసిడెన్సీ రేడియోక్లబ్" అనే స్థానికసంస్థ, మద్రాసులో కార్యక్రమాలు ప్రసారంచేసేది. 1924 లో ప్రారంభింపబడిన ఆక్లబ్ 1927 లో మూసివేయబడింది. ఆదేసంవత్సరంలో 'ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ' ఒకటివెలసి, బొంబాయి, కలకత్తా నగరాల్లో కార్యక్రమాలను ప్రసారంచెయ్యడం మొదలుపెట్టింది. ఆకార్యక్రమాలు 30 మైళ్ల మేరకు మించి వినిపించేవి కావు. మూడేళ్ళలో ఆకంపెనీగూడా మూసివేయబడింది. కాని ప్రభుత్వం, ఆకంపెనీని స్వాధీనంచేసుకుని నడిపి, 1934 లో ఢిల్లీలో ఒకకేంద్రాన్ని స్థాపించింది. 1935 నుండి రేడియోకేంద్రాలు, కార్యక్రమాలు, దినదినాభివృద్ధిపొందుతూ వచ్చాయి. 1939 లో రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయినప్పుడు భారతదేశంలో ఆంగ్లేయపాలితప్రాంతంలో 6 కేంద్రాలు, సంస్థానాల్లో 5 కేంద్రాలు మాత్రమే ఉండేవి. అప్పటికి కొద్ది రోజులక్రితమే, యీసంస్థకు "ఆలిండియారేడియో" అని నామకరణం జరిగింది.

1947 లో స్వాతంత్ర్యం వచ్చాక, కేంద్ర ప్రభుత్వంలో రేడియోసమాచార మంత్రిత్వశాఖ ఏర్పడింది. మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభమయ్యే సరికి రేడియోకేంద్రాలసంఖ్య 11 నుండి 25 వరకు పెరిగింది. కార్యక్రమాల మొత్తంపరిమితి 1947లో ఉండే 26,342 గంటలనుంచి 1950 నాటికి 60,000 గంటల వరకు పెరిగింది. అన్నిప్రాంతీయభాషలలోనూ రేడియో కార్యక్రమ ప్రసారాలు ప్రారంభమయ్యాయి.

గత పాతిక సంవత్సరాలలో రేడియో గణనీయమైన అభివృద్ధినిపొందింది. ఈరోజున భారతదేశంలో 39 ముఖ్యకేంద్రాలు, 29 అనుబంధ కేంద్రాలు ఉన్నాయి. 20 ముఖ్యభాషలలోనే కాకుండా 22 మాండలిక భాషలలోనూ, 91 ఆదివాసులభాషలలోనూ కార్యక్రమప్రసారాలు జరుగుతున్నాయి. ఇవికాక 31 భారతీయ విదేశీయ భాషలలో 230 వార్తాప్రసారాలు జరుగుతున్నాయి. వివిధ భాషలలో వివిధ కేంద్రాలనుండి ప్రసారమయే కార్యక్రమాల మొత్తంకాలం, రోజుకు 700 గంటలవరకు ఉన్నది. అందు సంగీతం 308 గం॥, వార్తలు

150 గం॥అయితే, ప్రసంగాలు, నాటికలు, చర్చలు, పరిచయాలు కలిసి 234గం॥ వరకు జరుగుతున్నాయి. ఇన్ని భాషలలో యింత విస్తృతంగా కార్యక్రమాలు జరుపుతూన్న 'ఆకాశవాణి' భారతదేశంలోని అన్నిభాషలకు అనన్యసామాన్య మైనసేవ చేస్తున్నదనడంలో అతిశయోక్తి లేదు. ఆకాశవాణి చేస్తున్న సేవకు మరో ప్రత్యేకమైన ప్రయోజనం ఉంది. నిరక్షరాస్యులు ఎక్కువమంది గల మన దేశంలో రేడియో ఒక విలక్షణమైనకార్యాన్ని నెరవేరుస్తున్నది. మొదటిది వినోదాన్ని చేకూర్చడం రెండవది విజ్ఞానాన్ని వ్యాప్తిచెయ్యడం.

వినోద కార్యక్రమాల లక్ష్యం శ్రోతలకు కేవలం ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగించడమేకాదు. పూర్వకాలంలో సంగీతాన్ని మహారాజులు, రాజులు పోషించే వారు. తరువాత సంస్థానాధీశులు కొంతవరకు ఆ బాధ్యతను వహించారు. ప్రస్తుత ప్రజాప్రభుత్వయుగంలో ఆ బాధ్యత ప్రభుత్వంమీద పడింది. ప్రభుత్వంలో భాగమైన రేడియో సంగీత పోషణలోను, సంగీతంపట్ల అభిరుచిని కలిగించడంలోను ఉచితపాత్రను వహిస్తున్నది. జాతీయ కార్యక్రమాలద్వారా హిందూస్థానీ సంగీతాన్ని దాక్షిణాత్యులకు, కర్ణాటకసంగీతాన్ని ఉత్తరభారతీయులకు అందజేసి, అభిరుచులను పెంపొందింపజేసి, భారతీయ సమైక్యతకు కృషి చేస్తున్నది.

ఆకాశవాణి ప్రసారంచేసే వైజ్ఞానిక కార్యక్రమాలు వివిధరంగాలకు నిర్దేశింపబడ్డాయి. బాలబాలికలు, విద్యార్థులు, యువకులు, స్త్రీలు, వ్యవసాయరంగంలో ఉన్నవారు, పరిశ్రమలలో పనిచేస్తున్నవారు – వీరందరికి ప్రత్యేకకార్యక్రమాలు జరుగుతున్నాయి. విజ్ఞానశాస్త్రంలోని నూతన పరిశోధన ఫలితాలను, జనబాహుళ్యానికి అందజేయడంలోకూడా రేడియో ఎంతో ఉపకరిస్తుంది.

ఇక దేశభాషల అభివృద్ధికి రేడియో చేస్తున్న కృషి అనన్యసామాన్యమైంది. ఒక రాష్ట్రంలో ఉండే భాష, ఆ రాష్ట్రం అంతటా ఒకేమోస్తరుగా ఉండేదికాదు. ఉదాహరణకు తెలుగునాట, వివిధ మండలాలలో వివిధమాండలిక రీతులు వాడుకలో ఉండేవి. విజయనగరంలో ఉండే పోకడలు వేరు, గోదావరి, కృష్ణ, నెల్లూరు జిల్లాలలోని భాషాస్వరూపం తీరు మరోమోస్తరు. రాయలసీమ తెలంగాణా ప్రాంతాల విషయం వేరే చెప్పనక్కర్లేదు. విభిన్న స్వరూపాలు గల ఒకేభాషకు, రేడియో తన ప్రసారాలద్వారా ఒక సమగ్రస్వరూపాన్ని ఏర్పరచి నిలబెట్టింది. రోజూ ఎవరి యింటిలో వారు రేడియోను వినడంద్వారా, నిత్యం వాళ్ళ చెవులలో సరళమైన భాష వినబడడంవలన మాండలికప్రభావాలు సన్నగిలి

ఒక రాష్ట్రం అంతటా సరళమైన సమగ్రభాష వాడుకలోకి రాసాగింది. భాష యొక్క స్వరూపానికి రేడియో చేసిన సేవలో ఇది ప్రధానమైనది. నిజానికి రేడియో ద్వారానే భాషయొక్క శ్రవ్యస్వరూపం పటుత్వాన్ని పొందింది.

తెలుగుభాష స్వతః శ్రావ్యమైనభాష. వీనులకు విందుగొలిపే భాష. వ్రాయడానికీ అందమైన భాష. వినడానికి మరీ అందమైనది. ఇటువంటి అందమైనభాషయొక్క శబ్దస్వరూపం సన్నగిలితే భాషయొక్కజీవమే సన్నగిల్లుతుంది. కాబట్టి తెలుగుభాషకు గల సహజశ్రావ్యసంపదను పోగొట్టుకోకూడదు. అన్నిభాషలకు ఇటువంటి సహజమైన సంపదలేదు, అన్నిభాషలకు యిటువంటి శ్రవణానందాన్ని కలిగించే గుణంలేదు. కొన్ని భాషలకు గల శబ్దసరళివలన అలసట కలగడం కూడా ఉన్నదట. కాని తెలుగుభాషకు గల ధ్వనిసంపద సుఖాన్ని కలుగజేస్తుంది. భాషకు గల సొగసు ఉచ్చారణమీద ఆధారపడి ఉంటుంది. గత 30 ఏండ్లలో రేడియోప్రభావంవలన ఇంగ్లండుదేశంలో ఆంగ్లభాషయొక్క ఉచ్చారణ చాలా బాగుపడిందట. అదేవిధంగా తెలుగుభాష యొక్క ఉచ్చారణ రేడియోప్రసారాలద్వారా ఎంతైనా బాగుపడాలి.

రేడియో సాహిత్యంలో సహజమైన లోటు ఒకటి ఉంది. అదే ఆ సాహిత్యంయొక్క విశిష్టతకూడా. రేడియో కార్యక్రమాలలో ఉపయోగించే భాష అతి సరళంగా సులభగ్రాహ్యంగా ఉండాలి. చెవికి వినసొంపుగా ఉండి, వినీ వినడంతోటే అర్థమయేదిగా ఉండాలి. ఏ మాటా మరోసారి వినిపించదు. ఏ మాటయినా అర్థం కాకపోతే ఆగి అర్థంచేసుకొనే వ్యవధి ఉండదు. కాబట్టి మొదటి వినికిడిలోనే శ్రోతకు అర్థమయేటట్టు ఉండాలి. ఇది రేడియో సాహిత్యానికి ఉండవలసిన ప్రధాన లక్షణం.

రేడియో సాహిత్యానికి శ్రవణేంద్రియం ఆధారం. శ్రోత తన నిత్యజీవితంలో నిత్యవ్యవహారాల్లో మాట్లాడుకోడానికి అలవాటుపడిన భాషలోనే రేడియో కార్యక్రమాలను వినడానికి అభిలషిస్తాడు. శ్రవణేంద్రియం చటుక్కున అలవాటును మార్చుకోలేదు. కాబట్టి గ్రాంథికభాష రేడియో కార్యక్రమాలకు అనువైన భాష కాదు. రేడియో కార్యక్రమాలలో శ్రోత నిత్యం మాట్లాడుకునే భాషనే వాడాలి. వ్యావహారికభాష రేడియోకు అనువైన భాష. వ్యావహారిక భాషావాదానికి రేడియో సహకారం సహజంగానే లభిస్తుంది. చక్కటి సరళమైన వ్యావహారిక భాషను సృజించడానికి, దాన్నివ్యాప్తిచెయ్యడానికి రేడియో ఎంతైనా దోహదం చేస్తుంది. రేడియో ప్రభావంవల్లనే గత పాతికేళ్ళలో ఆంధ్ర సాహిత్యంలో శిష్టవ్యావహారిక భాష ఒక పటిష్టరూపాన్ని నిర్మించుకుని ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకుంది.

# తెలుగులో పత్రికారచన

శ్రీ తురగా కృష్ణమోహన్‌రావు

మనకి రాజ్యాంగం ప్రసాదించిన స్వాతంత్ర్యాలలో అతిముఖ్యమైన దని చెప్పదగింది పత్రికాస్వాతంత్ర్యం. ఈ స్వాతంత్ర్యాన్ని మనం లోక కళ్యాణార్థం వినియోగించుకోలేక పోయామనే చెప్పాలి. చాలాసందర్భాల్లో దీన్ని సద్వినియోగం చేసుకోలేకపోయాం సరిగదా। అనేక సందర్భాల్లో దీన్ని దుర్వినియోగం చేయడం కూడా జరిగింది. ప్రజల కేది మంచిదో తెలుసుకోడం సులభం కాదు. అదేదో తెలుసుకొని, ఆమంచిని చేకూర్చడమే తమధ్యేయంగా పత్రికలను నిర్వహించడానికి బదులు తమకు మంచిగా పరిణమించగల లక్ష్యం తోనే గత పాతికసంవత్సరాలుగా దేశంలో పత్రికలు నడుస్తున్నాయని అనడంలో తప్పులేదు.

దీనికి కారణం ఉంది. ఇటీవలికాలంలో అక్షరాస్యత పెరిగి, పాఠకులసంఖ్య పెరిగింది. ఇదివరకు వేలసంఖ్యలో ప్రచురితమైన పత్రికలు కొన్ని లక్షలసంఖ్యలో ప్రతులను ముద్రిస్తున్నాయి. ఇది ఖర్చుతోకూడినపని. వ్యాపార ప్రకటనల బలం లేకుండా, పత్రికలను నిర్వహించడం అసంభవం ఐపోయింది. వ్యాపారప్రకటనలు ప్రతులసంఖ్యపై ఆధారపడి ఉంటాయన్నది కేవలం ఒక నమ్మకం మాత్రమే. తమకు నష్టం కల్గించేవేగాక, తమకు లాభం అనుకున్నంత రాకుండా అడ్డుపడగల సిద్ధాంతాలకు అనుకూలంగా ఉన్న పత్రికలకు వ్యాపార ప్రకటనలు లభించవు. కనుక ప్రజలకీ, దేశానికీ ఏది మంచిదన్నదికాక దేశంలో పలుకుబడి గల పరిశ్రామికవేత్తలకీ, వ్యాపారస్తులకీ ఏది మంచిదో దాన్ని సాధించడమే పత్రికలధ్యేయం నేడు. ఇదికాక, పారిశ్రామికవేత్తలే పత్రికలు స్థాపిస్తూండడం కూడా మనం చూస్తూనేఉన్నాం.

చిన్నచిన్న పత్రికలకి పెద్దపెద్ద ప్రకటనలు ఎలాగూ రావు. వీటికి చిన్న ప్రకటనలు, చిన్నచిన్నసహాయాలు చాలు. పురపాలకసంఘాల సభ్యులతో ప్రారంభించి, అనేక రాజకీయనాయకుల సహాయంపై ఆధారపడవలసిరావడం వల్ల – ఈ పత్రికలవారూ రాజ్యాంగం ప్రసాదించిన పత్రికాస్వాతంత్ర్యాన్ని వినియోగించుకోలేక పోతున్నారు. చిన్నపత్రికలకు కొంతసహాయం చేసి, వాటికి ఆర్థికస్వాతంత్ర్యం లభింపచేయడానికి ప్రభుత్వం ఇటీవల కొన్ని చర్యలు

తీసుకుంది. కాని ఈ పత్రికలు ప్రభుత్వం పైననో, ప్రభుత్వంలో ఉన్న కొన్ని వర్గాలపైననో, కొందరు వ్యక్తులపైననో ఆధారపడి, తమఅభిప్రాయస్వాతం త్ర్యాన్ని కోల్పోయే ప్రమాదం లేకపోలేదు.

వ్యవస్థాపరమైన లోపాలసంగతి అలాఉంచి, పత్రికలవారు తమంతగా తాము తెచ్చిపెట్టుకున్న - లేదా, సవరించుకోలేకపోయిన - కొన్నిలోపాలున్నాయి. పత్రికాస్వాతంత్ర్యం అంటే ఏమిటి ? సత్యం అనేది ఏదో అన్వేషించి, గ్రహించి, పాఠకులు గ్రహించగలిగినట్లుగా వ్యక్తంచేయగల పరిస్థితులను కల్పించుకోవడం. అబద్ధం ఒక్కటే చెప్పకుండా, అన్నీనిజాలే పలికి, సాక్షి కోర్టువారిని అబద్ధపుధోరణిలో పట్టించిన ఉదంతాలు మనకి తెలుసు. ఇదే విధంగా నిజమైనవిషయాలు కొన్నిమాత్రమే ప్రకటించడంవల్ల, నిజమైనవిషయాలు కొన్నిటికి ఇవ్వరాని ప్రాధాన్యం ఇవ్వడంవల్ల, నిజమైనవిషయాలు కొన్నిటికి ఇవ్వాల్సినంత ప్రాధాన్యం ఇవ్వకపోవడంవల్ల, పాఠకులను అబద్ధపు ధోరణిలో పట్టించడం జరుగుతుంది. ఘట్‌కేసర్‌వద్ద ఒకరైలు ప్రమాదం జరిగినప్పుడు ఇరువురు వెంటనే చనిపోయారు. ఒకవార్తాసంస్థ 'నూరుగురు చనిపోవడమో, గాయపడ్డమో జరిగింది' అని ఒకవార్తని ప్రసారంచేసింది. దేశమంతటా పత్రికలన్నీ ప్రముఖంగా ఈ వార్తని ప్రకటించాయి. ఇరువురు చనిపోయి, తొంభై ఎనిమిదిమంది గాయపడినా, ఈ వార్త నిజమే ఔతుంది. కాని నిజంగా మనం అది నిజంఅని చెప్పగలమా ? కనీసం డెబ్బై ఎనభై మంది చనిపోయారనైనా పాఠకులు భావిస్తారు, భావించారు. రైల్వేమంత్రిత్వ శాఖ ఈ వార్తను ఖండిస్తూ, ఒకప్రకటన జారీచేసింది. పత్రికలన్నీ ప్రకటించాయి. కాని ఏంలాభం ? ప్రభుత్వం ఇటువంటి విషయాల్లో నిజం దాస్తుందని ప్రజల్లో ఒకఅభిప్రాయం ఎలానూ ఉంది. ప్రజల మనస్సుకి పైఅబద్ధం అతుక్కుపోయింది.

తెలంగాణాఉద్యమం రోజుల్లో పత్రికలవారు అనుకోకుండానే ఎన్నో అబద్ధాలను ప్రచారంచేశారు. అవి తెలంగాణా ప్రజల్లోనూ, ఆంధ్రప్రాంత ప్రజల్లోనుకూడా తమకు అన్యాయంజరిగిందని గట్టిగా నమ్మకం ప్రబలినరోజులు. నిజాలతోపాటు, అబద్ధాలుకూడా ప్రచారం కావడానికి అవకాశం ఉన్నరోజులు. తెలంగాణాప్రాంతంనుంచి వచ్చి విజయవాడలో రైలు దిగినవారినందరినీ ఇంటర్వ్యూ చేసి, విజయవాడ పత్రికలు ప్రముఖంగా ప్రకటించాయి. ప్రమాదాలకు గురిఐ పారిపోయివచ్చిన వారితోబాటు, నిజంగా భయపడి పారిపోయి

వచ్చిన వారితోబాటు–బాకీలను ఎగవేయడానికి వచ్చినవారూ, పుకార్లను నిజాలుగా నమ్మి ప్రచారంచేసినవారూ, నిజాలను దాచి అబద్ధాలు చెప్పినవారూ వీరిలో ఉన్నారని పత్రికలవారికి అనుమానంకూడా కలగకపోవడం దురదృష్టకరం. ఇదేవిధంగా – లేనిసంఘటనలను ఊహించి పత్రికలద్వారా ప్రచారం చేసిన పత్రికాప్రతినిధులు హైదరాబాదులో లేకపోలేదు. యుద్ధకాలంలోనూ, ఉద్యమాల రోజుల్లోనూ మొదట బలిఅయ్యేది సత్యమే.

1947కి పూర్వంనుంచీ కొందరువ్యక్తులకి (శ్రీయుతులు ప్రకాశం, రంగా, గోపాలరెడ్డి, సంజీవరెడ్డి, సంజీవయ్య, బ్రహ్మానందరెడ్డి వగైరా); కొన్ని రాజకీయపక్షాలకి; కొన్ని సంస్థలకి, నిర్ణయాలకి అనుకూలంగానూ వ్యతిరేకంగానూ ఉద్యమాలను నిర్వహించే అలవాటు మనపత్రికలది. 'విశాలాంధ్ర', 'ఆంధ్రజనత' పత్రికలు ఎన్నికల్లో కమ్యూనిస్టుపక్షానికీ, కాంగ్రెసుపక్షానికీ అనుకూలంగా ప్రచారంచేయడంలో ఆశ్చర్యంలేదు. కాని కొందరువ్యక్తుల్ని దృష్టిలోపెట్టుకొని, వ్యక్తులకోసం సమస్యలపై కొన్నినిర్ణయాలకు వచ్చి, ఆ నిర్ణయాలకు అనుకూలంగా ఉధృతంగా ఉద్యమాలు సాగించడం అంతమంచిదికాదు.

ఈ ఉద్యమాలసంగతి అటుంచి, ప్రజలకు సంబంధించిన సమస్యలను పత్రికలవారు నిష్పక్షపాతంగా చర్చించడానికి అనువైన పరిస్థితులు మనదేశంలో ఇంకా నెలకొనలేదు. పత్రికల్లో ప్రతీరోజూ ఒక సంపాదకీయం ఉంటుంది కదా! ఈ సంపాదకీయరచయితలు సంపాదించుకున్న సమాచారం అసలు సమగ్రంగా ఉండాలి. ఈరచయితలు తమతమ విలేఖరులపైన, ప్రభుత్వప్రచురణలపైన, శాసనసభ్యులు ఇతరులు వ్యక్తంచేస్తున్న అభిప్రాయాలపైన ఆధారపడ్డం జరుగుతూంది. తెలుగుపత్రికల సంపాదకీయాల ప్రభావం పాఠకులపై లేకపోవడానికి కారణం ఇదే.

ఇతరదేశాల పత్రికల్లో న్యూస్ఎడిటర్స్‌కీ, చీఫ్‌సబ్స్‌కీ, సబ్ఎడిటర్స్‌కీ చాలా ప్రముఖమైనపాత్ర ఉంది. తెలుగుపత్రికల్లో, కొందరు ప్రముఖుల్ని మినహాయిస్తే, చాలమందికి విషయపరిజ్ఞానం తక్కువ. ధవళేశ్వరంవద్ద గోదావరీ బరాజ్‌కి శంఖుస్థాపన జరిగినప్పుడు – ఒక విజయవాడపత్రిక ఇది అంతర్వేదివద్ద జరిగినట్టు పతాకశీర్షికలో ప్రకటించింది. శీర్షిక రాసి ఇచ్చిన సంపాదకసిబ్బంది సభ్యుడికి బరాజ్ ఎక్కడ నిర్మిస్తారో తెలియకపోదమేకాక, అంతర్వేది ఎక్కడుందో తెలియదనే అనుకోవాలిగదా! అప్పట్లో విజయవాడ నుంచి వెలువడినదే మరోవారపత్రిక – శాసనసభలో భోజనవిరామసమయంలో

జరిగిన సంఘటనలను గురించి ప్రస్తావించింది ఒకసారి. శాసనసభకి ఇటు వంటి ఇంటర్వ్యూలే లేదు. మరో తెలుగుపత్రిక శాసనమండలికి సంబంధించిన 'బిజినెస్ ఎడ్వైజరీ కమిటీ'ని 'వ్యాపార సలహా సంఘం'గా అనువదించింది. మరోపత్రిక ఒకబ్రిటిష్ విలేఖరిని గురించి' 'శ్రీఎలిజబెత్——' గా ప్రస్తావిస్తూ వచ్చింది. ఎలిజబెత్ అనే ఆవిడ 'ఒకమహిళ, పురుషుడుకాదు' అని ప్రముఖ దినపత్రికలో పనిచేసే ఉపసంపాదకులకి తెలియకపోవడం అన్యాయమే మరి।

అనువాదం సంగతి ఇక్కడ వచ్చింది కాబట్టి, మరికొన్ని విషయాలు ప్రస్తావించాలి. ఒకటి - వార్తల్లో తరుచువచ్చే అనేకపదాలకు సరియైన అర్థాన్ని సూచించగల తెలుగుపదాల జాబితాని తయారుచేయడానికి క్రమబద్ధమైన ప్రయత్నం ఏదీ ఇంతవరకు తెలుగుపత్రికలవారు చేయలేదు. ఒక ఇంగ్లీషు పదానికి ఒకేపత్రికవారు అప్పుడు డ్యూటీలోఉన్న సబ్ఎడిటర్లనుబట్టి రకరకాల తెలుగుపదాలను వాడ్డం, విభిన్నార్థాలు గల ఇంగ్లీషుపదాలకి అర్థభేదం తెలియడా నికి అవకాశం లేకుండా ఒకేతెలుగుపదాన్ని వాడ్డం మనం చూస్తూనే ఉన్నాం. అనువాదసరళిని రూపొందించడానికి రాష్ట్రప్రభుత్వం కొంతకృషి చేసింది. ఈ కృషి లోపరహితమైనదని చెప్పలేం. కాని అదికూడా జరక్కుండా ఆగి పోయింది, విమర్శలఫలితంగా।

రెండు - వార్తలను సాధ్యమైనంత త్వరగా పాఠకులకు అందచేసే ప్రయత్నం తెలుగువాక్య నిర్మాణంలో కనబడకపోవడం. 'ఆంధ్రప్రభ' విజయ వాడలో ప్రారంభంఅయ్యేవరకు, పాఠకులకు త్వరగా వార్తలను అందించాలనే ప్రయత్నం తెలుగుపత్రికలు చెయ్యనేలేదు. సత్వరముద్రణకి అవకాశాలుండి కూడా, ముద్రించిన ప్రతులను గంటలతరబడి కార్యాలయాలలోనే అట్టేపెట్టు కునే పరిస్థితు లుండేవి కొంతకాలం. ఈ దశాబ్దంలో పరిస్థితులు మారాయనే చెప్పాలి. కాని పత్రికారచనకి అనువైన వాక్యనిర్మాణపద్ధతుల్ని రూపొందించ డానికి ప్రయత్నం ఇంకా జరగడంలేదు. ఇంగ్లీషులో వచ్చినవార్తల్ని తెలుగులోకి అనువదించే ప్రయత్నంలో వెనుకముందులు కావడం సర్వసాధారణంగా జరుగుతోంది. హిందీలోలాగ తెలుగులోకూడా వార్తలను పంపించే వార్తా సంస్థలను ఏర్పరచుకోడంగాని, తమతమ విలేఖరులవద్దనుండి రోమన్‌లిపి నుపయోగించి వార్తలు తెప్పించుకోడంగాని జరిగినప్పుడు ఈ పరిస్థితి బాగుపడ వచ్చు.

తెలుగుపత్రికలు వేరువేరుగా కాని, అన్నీ కలిసికాని, విశ్వవిద్యా

' విభాగంవారి సహకారంతో కాని, సిబ్బంది ఉపయోగం
ంటివి తయారు చేయించడం మంచిది.

కచేసే విధానంలోనూ, ప్రకటించే విధానంలోనూ కూడా
అవసరం చాలాఉంది. ఇంతవరకు తెలుగుపత్రికల్లో
సమస్యలకి తగినంత ప్రాధాన్యం లేదు. ఉగాండాలోనూ,
గుతూన్న విషయాలకీ, భారతదేశంలోనే మారుమూల
న్న చిన్నచిన్న విషయాలకీ ప్రాధాన్యం తగ్గించి, మన
పురపాలక సంఘాల్లో గల సమస్యల వివరాలకు స్థానం
ానికేతరమైన సమస్యలకు ఇంతగా ప్రాధాన్యం ఇవ్వడం
బడదు. మరేదేశంలోనూ రాజకీయాలకు ఇంత ప్రాధాన్యం
లు, సంగీతం, సాహిత్యం, లలితకళలు, కళాశాలలు_
ంగుతున్న, జరగాల్సిన కృషిని నిపుణులచేత పరిశీలింప
గుపత్రికలకి పూర్తిగా అలవాటు కాలేదు. తెలుగు ప్రజా
కావాలంటే, అది పత్రికలలో ప్రతిబింబించబడా లంటే

ఇప్పుడు ప్రతిరోజూ పదికాలముల వెడల్పున ఒక
జరుగుతూంది. ఈ పద్ధతి ఇంగ్లీషుపత్రికల్లో కనబడదు.
ే తమతమ భేదాలను సూచించడానికి శీర్షికలు ఉపయోగ
మైన వార్తలు ఏవీ రానిరోజునకూడా ఎనిమిది కాలముల
నిచ్చే దురదృష్టకర పరిస్థితిలో న్యూస్ఎడిటర్లను ఉంచడం
ేరి, చాలాకాలం క్రితం, 'మదనపల్లి ఆసుపత్రిలో రోగుల
ముల శీర్షిక క్రింది వార్త ఐంది ఒక మదరాసు తెలుగు
త్రికలలో పనిచేసేవారంతా ఎప్పుడో ఒకప్పుడు వార్తా
స్తూనే ఉంటారు. పుష్టికరమైన, రుచికరమైన, సుసంపన్న
ుచిననాడు, గృహస్థు రొట్టలు వేస్తూ భోజనం చేసినా
దొరకనినాడు రొట్టలువేసి సంతుష్టిపడి లాభంలేదు - ఇదే
వార్తలు లేనినాడు కూడా పాఠకుల్ని మభ్యపెట్టడం
నుపయోగించడంలో అర్థం కనపడదు. దీనివల్ల పత్రికలో
ుడవలసిన మార్పు కనబడదు. వైవిధ్యం లోపిస్తుంది.
స్లేప్లో శక్తి, అభిరుచి తగ్గుతాయి. నిజంగా మంచివార్త

వచ్చినరోజున అది ప్రముఖంగా ప్రకటించే అవకాశాలు సన్నగిల్లుతాయి.

ఈ వ్యాసంలో ఇంతవరకు చేసినది విమర్శమాత్రమే. ఇందులో చాల వరకు రేడియోలో ప్రసారమయ్యేవార్తలకే వర్తిస్తుంది. ఇదేవిధంగా ఈ విమర్శకి ప్రస్తుత రచయితకూడా చాలవరకు పాత్రుడే అని చెప్పాలి. ఐతే ఈ విమర్శని బట్టి తెలుగు పత్రికా రచనలో ప్రశంసనీయమైన అంశాలే లేవని భావించరాదు. కీ. శే. శంభుప్రసాద్, ప్రముఖ పత్రికారచయితలు శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావు, నండూరి రామమోహన్‌రావు, నీలంరాజు వెంకట శేషయ్య, పండితారాధ్యుల నాగేశ్వరరావు ప్రభృతులు తమతమ పత్రికల్లో గత రెండుమూడు దశాబ్దాలలో ఎన్నో మార్పులు తెచ్చారు. పత్రికా నిర్వహణలో కొత్తదారులు తొక్కారు. కాని తెలుగు పత్రికారచన సరియైన పద్ధతుల్లో ముందుకు సాగాలంటే, విలేఖరులవి, ఉపసంపాదకులవీ, తదితర పత్రికా రచయితలవీ సగటు ప్రమాణాలు పెరగాలి. అంతేకాదు. వారు ఉపయోగించే సాధనాలు వాడితీరాలి. దీనికి శిక్షణ, పరిశోధన, దీక్ష అవసరం.



"ఛందస్సు గుర్రం వంటిది. గుర్రం ఎటు తీసుకుపోతే అటల్లా వెళ్ళిపోయేవాడు అశ్వికుడు కానట్లే ఛందస్సు లాగుకు పోయినట్టు వ్రాసేవాడు సంవిధానజ్ఞుడు కాడు. మరి ఆఛందస్సును లొంగించుకొని దానిచేత చిత్రవిచిత్ర రీతులలో కదం త్రొక్కించిన వానినే ప్రశంసిస్తాను."

—శ్రీశ్రీ

*   *   *

"వర్తమాన కవిత యేమిటో తెలుసా వరదా?
అది భూతభవితవ్యాలమధ్య ట్రాన్స్‌పరెంట్ పరదా."

—ఆరుద్ర

# తెలుగు పత్రికలు - సంపాదకీయాలు

శ్రీ పరాంకుశం దామోదరస్వామి

పత్రికకు సంపాదకీయం ప్రాణంవంటిది.

"ప్రజలఅభిప్రాయాలను ప్రజలకే వ్యాఖ్యానంచేసి పత్రిక చెబుతుంది. ప్రజలభావాలను మార్చగలనాయకు డౌతుంది పత్రిక. ప్రజలను తీవ్రంగా విమర్శిస్తుంది - పొగుడుతుంది, బతిమాలుతుంది".

ఈభావంతో ఎన్నిపత్రికలు వ్యవహరిస్తున్నాయి ?

తెలుగునాట - ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్ర భూమి, విశాలాంధ్ర, బహుళప్రచారంపొందిన దినపత్రికలు - వీటిలో కొన్ని, స్వాతంత్ర్యానికి పూర్వంనుండే, దేశస్వాతంత్ర్యంతోపాటు, తెలుగువారి రాజ కీయ సాంఘికప్రత్యేకతకు కృషిచేశాయి.

ఆకృషి ఫలితంగానే, భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడి, 1956 నవంబరు నెలలో ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగింది.

స్వాతంత్ర్యం వచ్చినతర్వాత, జాతీయప్రభుత్వాన్ని ఏర్పరిచిన కాంగ్రెసు ప్రభుత్వాన్నే బలపరిచేధోరణిలో - మనతెలుగుపత్రికలు - వార్తలు, వ్యాఖ్యలు, సంపాదకీయాలు ఉన్నాయి. మనవారే పరిపాలిస్తున్నారు కాబట్టి, అప్పుడే విమర్శలు చేస్తే, 'మీకు పరిపాలించుకోవడం చేతకాదు' అన్న అభిప్రాయం ఇతరసభ్యదేశాలకు ఏర్పడుతుం దని భావించడం జరిగింది.

రెండుప్రణాళికలు పూర్తి అయ్యాయి. ఆప్రణాళికలు, ప్రజలకు కలిగించ వలసిన ఆర్థిక, సామాజిక లక్ష్యాలు చేరుకోలేదు. ప్రభుత్వ యంత్రాంగంలో, పాలకులలో ఆశ్రితపక్షపాతం, లంచగొండితనం, అలసత్వం ఏర్పడిందని, పత్రికలు గ్రహించాయి. అటుతరువాత, పత్రికలుకూడా తమఅలసత్వాన్ని పోగొట్టుకొని, కొద్దికొద్దిగా విమర్శించడం ప్రారంభించాయి.

దేశంలో అవిద్యా, అవిజ్ఞానం పేరుకుపోయిఉంది. పత్రికలను చదివే అలవాటు లేదు. చందాదారులద్వారా పత్రికలు జీవించడం కష్టం. అందుకని ప్రకటనదారుల - ప్రకటనలమీద పత్రికలు ఆధారపడవలసివచ్చింది. ప్రకటన దారులు పరిశ్రమదారులు గుత్తాధిపత్యం వహించి, రాజకీయాధిపత్యం కూడా వహించారు. దానితో వారిక్రీనీడలలో పత్రికలు మసలవలసివస్తున్నాయి. అందువల్ల పత్రికలలో వ్యాపారదృష్టి పెరిగింది.

దేశంలోనిపత్రికలు ఒకవిషవలయంలో చిక్కుకున్నాయి. ఆ పత్రికాధి పతులచేతిలో పత్రికారచయితలు, సంపాదకులు - వారివార్తలు, సంపాదకీయా లూనూ - ఇదీ పరిస్థితి.

ప్రజాసమస్యలపట్ల, ఆర్థికదుస్థితిపట్ల, దేశంలో భావవిప్లవం, సామాజిక విప్లవం సాధించేందుకు పత్రికలే స్వయంగా ప్రారంభించి, నిర్వహించిన సంఘటనలు చాలాతక్కువ. ఆయా సందర్భాలలో రాజకీయనాయకులు, ప్రజల కొరకు ప్రారంభించిన ఉద్యమాలను సమర్థించడం జరిగిందని చెప్పవచ్చు. మనం ఆదర్శంగా పెట్టుకున్న సెక్యులర్ - ప్రజాస్వామ్యవ్యవస్థ అనుకూల మైన విధానాలను పత్రికలు ప్రోత్సహించవలసినంతగా ప్రోత్సహించలేదు. వైజ్ఞానికంగా అభివృద్ధి పొందుతున్నయుగంలో కలుగుతున్న ఆధునిక భావాలకు గాని, సామాజికమార్పుకు గాని, అస్పృశ్యతానివారణ మొదలైన సాంఘికసమస్యలకు గాని ప్రాముఖ్యం ఇవ్వటం జరగడంలేదు. మనపత్రికల సంపాదకీయవ్యాఖ్యలు రాజకీయవాదులప్రసంగాలకు, వాటి వ్యాఖ్యలద్వారా, తమ కొమ్ముకాస్తున్న రాజకీయవాదుల ప్రయోజనాలకే అధికప్రాముఖ్యం ఇస్తున్నాయి గాని, సాంఘికంగా జరుగుతున్న అన్యాయాన్ని, ప్రజలకు జరగవలసిన న్యాయాన్ని - ప్రభుత్వాన్ని గాని, దానిపాలకులను గాని ఎదిరించి, విమర్శించి, హెచ్చరించే పత్రికలు, సంపాదకీయాలు మనకు అరుదు.

ఆంధ్రప్రదేశ్ అవతరణ, విశాఖలో ఉక్కుకర్మాగారం ఆవశ్యకత, నాగార్జునసాగర్ నిర్మాణం, మొదలైనసందర్భాలలో - రాజకీయప్రేరేపణతో వచ్చినప్రజాఉద్యమాలను, మనపత్రికలు, సంపాదకీయాలు పూర్తిగా సమర్థిం చడం జరిగింది.

ఒక గ్రామంలో ఒకహరిజనబాలుడు సజీవదహనం అయిపోతే, ఏదో ఒకతెగకు చెందినవారిపై అత్యాచారం జరిగితే, వెంటనే ఆవార్తను ప్రపంచా నికి వెల్లడించి, వారికి సాంఘికన్యాయం జరిగించడానికి, మనపత్రికలు అంతగా ముందుకు రాలేదు.

ఆ సంఘటనను, ఆఘోరాన్ని, ఉత్తరభారతంలో ఉన్న ఒకఆంగ్లదిన పత్రిక ప్రచురించినతరువాత, జరిగిన ఆందోళన తరువాత, నాలుగైదు రోజులకు గాని, తెలుగు పత్రికలు ప్రకటించలేకపోయాయి. అటుతరువాత జరిగిన పరిణామాలపై, ఒకతెలుగుదినపత్రిక ముందుకువచ్చి, ఆ అన్యాయాన్ని తీవ్రంగా ఖండిస్తూ, వార్తలూ, వ్యాఖ్యలూ చేస్తే, ప్రభుత్వం, ఆ పత్రికపట్ల

కటువుగా, నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తే, మిగతాపత్రికలు ఆ సంఘటన జోలికి పోలేదు. ఇది మన తెలుగుపత్రికలధోరణి.

రెండు సంవత్సరాలక్రితం వరకు అవిచ్ఛిన్నంగా ఉన్నఅఖిలభారత కాంగ్రెసు రెండుగా చీలింది. అటుతరువాత పార్లమెంటుకు మధ్యంతరఎన్నికలు జరిగాయి. అప్పుడు, ప్రముఖతెలుగుపత్రికలన్నీ మితవాద పక్షాలుగా పేర్కొన్న "గ్రాండ్ అలియన్స్"ను సమర్థించడం జరిగింది.

మధ్యంతరఎన్నికలఫలితాలను ప్రముఖపత్రికలన్నీ ఊహించినట్లుగాక, అందుకు వ్యతిరేకంగా ప్రజలు తీర్పుఇవ్వడం జరిగింది.

తెలుగువారు తెలుగువారితో విడిపోవాలని చేసిన ఆందోళనను ప్రముఖ పత్రికలన్నీ, తెలుగుప్రజలసమైక్యతను సమర్థిస్తునే వ్యాఖ్యలు విమర్శలుచేశాయి.

ఒకప్రాంతంప్రజలకు విడిపోవాలనేభావం ఎందుకు కలిగింది ? వారికి ఉన్నఅసంతృప్తి ఏమిటి ? దాన్ని పోగొట్టేందుకు తోటితెలుగువారు చేయ వలసినత్యాగాలు ఏమిటి ? అన్నిఅంశాలపై 'ఆంధ్రజ్యోతి' దినపత్రికతీసుకొన్న వైఖరి, నిజమని నిరూపితమైంది. ఆ పత్రిక తీసుకున్నవైఖరి సాహసోపేత మైనది. పత్రికానిర్వహణ అసిధారావ్రతమని, కఠోరమైనసత్యాలను వెల్లడిచేస్తే చేదుగా ఉంటుందని నిరూపితమైనది.

సామాన్యంగా ప్రముఖతెలుగుదినపత్రికలన్నీ 'Conservative' విధానా లనే అనుసరిస్తున్నాయని చెప్పవచ్చు.

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు వారి సంపాదకత్వంలో వెలువడుతున్న 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక అందుకుభిన్నంగా-మారుతున్నసమాజానికి అనుగుణం గాను, సామాజిక, సాంఘిక చైతన్యంకలిగించేవిధంగా, నిర్వహిస్తున్నారు. నార్లసంపాదకీయాలలో ఆధునికత, ఆలోచనలో ఆధునికత, వ్యాఖ్యలలో ఆధునికత, కనబరుస్తూ, ఉన్నతెలుగుపత్రిక లన్నింటికంటే 'Progressive'గా నిర్వహిస్తున్నారు. ఇటీవలికాలంలో రాజారాంమోహన్‌రాయ్ ద్విశతజయంతి జరపాలని, శ్రీనార్ల ప్రభుత్వానికి చేసినసూచన ఇందుకు ఒకమచ్చుతునకగ. సాంఘికపుమార్పును కోరేవారికి, రాజారాంమోహన్‌రాయ్‌ని మనన చేసుకొనడం ఎంతఅవసరమో, అది వారియెంత కనీసకర్తవ్యమో వివరించారు. తెలుగు దేశంలో, తెలుగుజర్నలిజంలోకే శ్రీనార్లసంపాదకీయాలకు ఒకప్రత్యేకత ఉన్నది. "ఈఅంశంపై శ్రీ నార్ల సంపాదకీయాభిప్రాయం ఏలా ఉంటుంది" అని తెలుసు కోవాలనే ఆతృత, పాఠకలోకంలో ఉన్నది. వారివి ఖచ్చితమైన అభిప్రా

యాలు. తాను నమ్మినసత్యాలను, అభిప్రాయాలను, ఎన్ని నిష్ఠురాలు వచ్చినా, పత్రికాముఖంగా వెల్లడించడంలో శ్రీ నార్ల వెనుతీయలేదు.

తెలుగుదేశంలో ప్రముఖస్థానం పొందిన 'ఆంధ్రపత్రిక'ది ఒకప్రత్యేక వైఖరి. తెలుగువారి 'Conservative' ధోరణిని ప్రతిబింబిస్తుంది. భాషలో గ్రాంథికవ్యవహారం, శైలిలో సనాతనత్వం గోచరిస్తుంది.

అదేవిధంగా ఆంధ్రప్రభ దినపత్రిక, వ్యాపార ధోరణిలో, ప్రభుత్వాన్ని సమర్థిస్తూ వ్యాఖ్యలు చేస్తూ ఉంటుంది.

తెలంగాణాప్రాంతంలో అవిచ్ఛిన్నంగా సాగి, కొన్ని సంవత్సరాలక్రితం మూతపడిపోయిన 'గోలకొండ పత్రిక' తెలంగాణా ప్రాంతీయుల రాజకీయ చైతన్యాన్ని, గ్రంథాలయోద్యమంద్వారా దాస్యవిముక్తిని సాధించేందుకు చేసిన కృషి మరువలేనిది.

1947, ఆగస్టు 15వ తేదీన, భారతదేశం యావత్తూ స్వేచ్ఛావాయువులు పీల్చుకొనడం ప్రారంభిస్తే, అప్పటి హైదరాబాదురాష్ట్ర ప్రజలు దాస్యశృంఖలాలలోనే ఉన్నారు. అప్పుడు గోలకొండ పత్రిక, ఇక్కడి తెలుగువారిలో కలిగించిన రాజకీయచైతన్యం-'నిజాంనవాబు జన్మజన్మాల బూజు'గా వర్ణిస్తూ 'తెలంగాణా' నాడు 'కోటిరత్నాల వీణ'గా సగర్వంగా చెప్పుకొనే దేశభక్తిని కలిగించింది. 1948 సెప్టెంబరులో 'పోలీసుచర్య' అనంతరం హైదరాబాదురాష్ట్రం స్వతంత్ర భారతంలో విలీనంఅయ్యింది. అప్పుడు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వాన, తర్వాత శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి సంపాదకత్వాన 'గోలకొండ పత్రిక' వెలువడింది. రాజకీయచైతన్యం తోబాటు, తెలంగాణా ప్రాంతంవారి భాషాభివృద్ధికి ఎనలేని సేవ చేసింది.

18 సంవత్సరాలక్రితం హైదరాబాదునుండి వెలువడిన 'ఆంధ్ర జనత' ప్రస్తుతం అధికారకాంగ్రెసుపార్టీ పత్రికగా వస్తూఉన్నది.

12 సంవత్సరాలక్రితం ప్రముఖరచయిత, పాత్రికేయుడు శ్రీ గోరాశాస్త్రి సంపాదకత్వంలో వెలువడుతున్న 'ఆంధ్రభూమి' ప్రజల సామాజికాంశాలపై ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నది. శ్రీ గోరాశాస్త్రి సంపాదకీయాలు, ప్రజలలోని నిరాశా, నిస్పృహలను ప్రభుత్వానికి తెలుపుతూ తమ బాధ్యతను నిర్వహిస్తున్నవి.

కమ్యూనిస్టుపార్టీ దృక్పథాలను, విధానాలను వెల్లడిస్తూ ఆ పార్టీపత్రికగా 'విశాలాంధ్ర' వెలువడుతున్నది.

ఆ పత్రిక తన పార్టీ విధానాలను తూ.చా. తప్పకుండా ఆచరిస్తూ ఆ పార్టీ

సిద్ధాంతాలను ప్రచారంచేస్తున్నది. 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అన్న లక్ష్యంతో అది కృషి చేస్తున్నది.

ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికలు కూడా భాషా విషయికంగా చేస్తున్న కృషికూడా గొప్పదే. ప్రభుత్వం తెలుగులో పరిపాలన సాగించాలని, అందుకు తగిన సంస్కరణ లిపిలో రావాలని అవి చేస్తున్న సూచనలు విలువైనవి.

వ్యావహారికపదాలను అధికంగా వాడుతూనే, తెలుగు జర్నలిజానికి 'ఒకభాష'ను, శైలిని ఒరవడిగా పెడుతూ శ్రీ నార్ల సంపాదకీయాలు ఉంటాయి. ఇంగ్లీషులో క్రొత్తగా వచ్చేపదానికి, తెలుగులో శ్రీ నార్ల ఏపదం వాడుతాడు అన్నజిజ్ఞాస, తెలుగుపాఠకులకు కలుగుతూఉంటుంది. United Nations కు 'ఐక్యరాజ్యసమితి' అని అన్నపదం మొట్టమొదట వాడటం శ్రీ నార్లగారే। "Non Alligned" అన్నపదానికి 'అలీన' అన్నపదాన్ని శ్రీనార్ల కొత్తగా సృష్టించారు. విశాఖపట్నం ఓడరేవులో కొత్తగా వచ్చిన'Dredger'ను అక్కడికూలీలు 'త్రవ్వోడ' అని పెట్టుకున్న పదానికి, గౌరవం కల్పించి, కార్మికుని హృదయాంనుండి వచ్చిన 'శబ్దం' పై ఒకసంపాదకీయమే వ్రాశారు. కొన్నాళ్ళక్రితం, భారతదేశంలో సంస్కృతాన్ని రాజభాష చేయాలని వచ్చిన వాదాన్ని పూర్వపక్షం చేస్తూ 'సంస్కృతం – సంస్కృతి' అన్నశీర్షికలో ధారావాహికంగా, శ్రీ నార్ల అప్పుడు సంపాదకత్వం వహిస్తున్న 'ఆంధ్రప్రభ'లో వ్రాశారు. అదేవిధంగా 'విజయవాడ' ఆంధ్రుల రాజధాని అని సమర్థిస్తూ, సంపాదకీయాలు వ్రాశారు. తెలుగు సంపాదకీయాలు ధారావాహికంగా వ్రాయ డానికి శ్రీ నార్ల ప్రారంభకులు.

ఆ ఒరవడిలోనే, శ్రీ గోరాశాస్త్రి 'ఆంధ్రభూమిలో' ప్రభుత్వాన్ని విమర్శిస్తూ నైతికవిలువలపై, ధారావాహికంగా సంపాదకీయాలు ఇప్పటికీ వ్రాస్తుండటం గమనించవచ్చు.

తెలుగు జర్నలిజంలో ఎన్నో 'మొట్టమొదట్ల'కు శ్రీ నార్ల శ్రీకారం చుట్టారు. తా నొక కఠోరసత్యాన్ని తెలిపినప్పుడుగాని, తాను నమ్మిన సిద్ధాంతాలు వివరించినప్పుడుగాని, తాను చెప్పదలుచుకున్న అభిప్రాయాలను చెప్పినప్పుడుగాని, చారిత్రిక సంఘటనలు, రాజకీయసంఘటనలు జరిగినప్పుడు, శ్రీ నార్ల సంపాదకీయాలు, ఎంతో ఉత్సాహంగా, భావస్ఫోరకంగా భాషకు, జర్నలిజానికి ఒరవడిపెట్టినట్లుగా ఉంటాయి. అవి తెలుగువారికి చైతన్యాన్ని వైజ్ఞానిక దృక్పథాన్ని కల్గించేవిధంగా ఉంటాయి.

తెలుగులో దినపత్రికలేగాక, వారపత్రికలు, పక్షపత్రికలు, మాస పత్రికలు, వందలాదిగా వస్తూ, తెలుగువారి అభివృద్ధికి తోడ్పడుతూ, సంపాద కీయాలు వ్రాస్తూనే ఉన్నాయి.

# తెలుగు పత్రికలు : వివిధ శీర్షికలు

శ్రీమతి కె. రామలక్ష్మి

"వార్తలందు ధరణి వర్ధిల్లు" అని నన్నయగారు వార్తలప్రాముఖ్యాన్ని చెప్పకచెప్పారు. మరి పత్రిక లింకా లేనికాలంలో వార్త లెలా వర్ధిల్లేవి? లోకసంచారి అయిన నారదులవారు మనతొలివిలేఖరి అనుకుంటే రచ్చబండ మనతొలిపత్రికే। వార్త లిచ్చిపుచ్చుకోవడం, వార్త లానోటా ఆనోటా విస్తరించడం పూర్వం ఎలా జరిగేదో మనం యిప్పుడు వూహించలేం కూడా. మన కిప్పు డన్ని పత్రికలు ఉన్నాయి।

తెలుగులో ప్రచురితమైన తొలిపత్రికలు "హితవాది" "వర్తమాన తరంగిణి" "సుజనరంజని" మొదలైనవి. తరువాత వీరేశలింగం పంతులు గారు తమఉద్యమములకొరకే పత్రికలని బాగా వినియోగించుకొన్నారు. "వివేకవర్ధని" పత్రికస్థాపించారు. ఈరోజుల్లోలాగే ఆరోజుల్లోకూడా పత్రికల మధ్య, వారిసంపాదకులమధ్య తీవ్రమైన పోటీవుండేదని – మనకి తెలియచెప్పే టందుకు – "ఆంధ్రభాషాసంజీవని" వెలిసింది. పంతులుగారి వివేకవర్ధనికీ – యీకొక్కొండ వెంకటరత్నంగారి ఆంధ్రభాషాసంజీవనికీ హోరాహోరీ పోరాటం జరుగుతూవుండేది. వీరేశలింగంగారేం తీసిపోలేదు. "హాస్యసంజీవని" అని ఒకపత్రికను ప్రత్యేకంగా స్థాపించారు ఆంధ్రభాషాసంజీవనిపై పోటీకి. వీరే స్త్రీలకని ప్రత్యేకంగా "సతీహితబోధిని" అనేపత్రికకూడా స్థాపించారు. తెలుగులో తొలిదినపత్రిక దేశాభిమాని. తరువాత కృష్ణాపత్రిక వెలిసింది. వీటి తరువాత ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రప్రభ మొదలైనవి వచ్చాయి.

స్వాతంత్ర్యం రావడానికి పూర్వం తక్కినభాషాపత్రికలలాగే తెలుగు పత్రికలుకూడా జాతీయోద్యమానికే ప్రాముఖ్యాన్నిచ్చేవి. ప్రజల్లో జాతీయ చైతన్యాన్ని రేకెత్తించుతూ బ్రిటీషుప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తూ విప్లవ శంఖారావాలను పూరించినందుకు కఠినకారాగారశిక్షలకు లాఠీదెబ్బలకు గురి అయిన ఆంధ్రపత్రికాసంపాదకులు, పాత్రికేయులు ఎందరెందరో। వీరిలో మనయువతరం ముఖ్యంగా స్మరించితీరవలసిన వ్యక్తులు – శ్రీఖాసా సుబ్బారావుగారు, శ్రీకోటంరాజు రామారావుగారు, శ్రీముట్నూరి కృష్ణారావుగారు. వీరిలో తొలియిద్దరిపరిచయభాగ్యం నాకుంది. "నిజం చాటడానికి భయపడని

జర్నలిస్టుగా పేరుకాంచిన శ్రీఖాసా - జర్నలిస్టులకే వన్నెతెచ్చారు. నిత్యోత్సాహీ, సంభాషణాచతురత కలవారూ శ్రీరామారావుగారు, 'భారతావనిలో నేను సంపాదకునిగా పనిచెయ్యనిపత్రికలు ఏఒకటో అరో ఉంటాయి!' అన్నాప-ఆయ నంత స్వేచ్ఛావాది. ఎదురు చెప్తే సహించలేని వ్యక్తిత్వం వారిది.

స్వాతంత్ర్యసముపార్జనానంతరం పత్రికలబాధ్యతలు ఒకరంగంలో తరిగినా యితరరంగాలలో పెరిగాయి. నిర్మాణాత్మకవిమర్శనము చేబట్టి ప్రభుత్వాన్ని రుజుమార్గం పట్టించే బాధ్యత పెరిగింది. అంతేకాకుండా ప్రచురణలో బాధ్యతలు పెరగడంతో వ్యాపారసరళికూడా పెరిగింది. లేకుంటే ప్రకాశం పంతులు గారి 'స్వరాజ్య' లా ఎన్నాళ్ళు పత్రికలు నడపకలరు? వారు జీతానికి బదులు బియ్యం పట్టుకెళ్ళమని అనేరోజులుకూడా వుండే వనేవారు శ్రీ ఖాసా.

ఈ రోజుల్లో పత్రికలూ, పత్రికారచనాకూడా వ్యాపారసరళిలోనే సాగుతోంది. పత్రికావిజయానికి చిహ్నం-అది అమ్మబడుతూన్న సంఖ్య అయినప్పుడు - ఎక్కువ అమ్మేపద్ధతులనే అవలంభిస్తారుకాని చేతులుకాల్చుకొని ఒకలక్ష్యంకోసం నడిపే పత్రిక లీరోజుల్లో చాలా అరుదు. అసలు లేవన్నా అబద్ధం కాదు.

ఇక పత్రికారంగాలు ఇంతవ్యాపారసరళికి దిగినప్పుడు వాటిలోనిరచనలు పరిశీలించాలికదా! అవి ప్రచురింపబడడానికి కారణం పాపులారిటీ.

తొలిపత్రికలలో ఇలా పాపులర్ అయిన ఎన్నో చక్కని శీర్షికలు కన్పిస్తాయి. ఆంధ్రప్రభలో న్యాయపతి నారాయణమూర్తి గారి పాన్‌సుపారి, ఆంధ్రపత్రికలో దాసు వామనరావుగారి కాలక్షేపం, మొదలైన శీర్షికలు యీనాటికీ అంతా మననం చేసుకుంటూనే ఉన్నారు. కొద్దిరోజులే రాసినా శ్రీశ్రీ తాడూ బొంగరం, ఆరుద్ర కుర్చీలో కూనిరాగం, రఘునాధయ్యర్ గారి 'సోటావోసె' సాకా సైడ్-లైట్స్ యివన్నీ సాహితీవేత్తలకి, రాజకీయాలు చదువుకునే విద్యార్థులకీ పఠనీయంగా ఉండేవి. మెదడును పదనుపట్టేవి.

శీర్షిక నొకటి రాయడం ప్రారంభించడం వేరు. దాన్ని చాకచక్యంగా అందరూ చదివి ఆనందించేదిగా రూపొందించకల్గడం వేరు. పఠితలు ఆయా పత్రికలమీద అభిమానం వాటిలోని వివిధశీర్షికలనుపట్టే-పెంచుకుంటారు. రావూరివారి అషామాషీలో యీవారం ఏం రాశారు? వినాయకుడివీణలో గోరా ఏం పలికాడు? విశ్వం మాణిక్యవీణ యీవారం ఏం మీటింది? అన్న

ఉత్సాహంతో ఆయాపత్రికలు ఎప్పు డొస్తాయి. అని ఎదురు చూసేలా చేయ కలిగినదిట్ట లీరచయితలు. అలాగే 'నార్లవారి మాటా మంతీ'.

పత్రికలకు వార్తలు అందించడం వేరు. శీర్షికలు రాయడం వేరు. ఆంగ్ల నవలా రచయితల్లో ప్రముఖుడైన ఆర్. ఎల్. స్టీవెన్‌సన్ ఒకప్పుడు 'విలేఖరి'గా ఒక పత్రికలో చేరాట్ట. చేరినరోజే సాల్వేషన్ ఆర్మీవారి వుత్సవానికి వెళ్ళి రాయవలసి వచ్చిందట. ఆ సందర్భంలో పేదలకు అన్నదానం చేశారట. స్టీవెన్‌సన్ తీక్షణంగా వారినందరినీ పరిశీలించి ఆ పేదప్రజ లెలా విందారగించారో అప్పుడు వారి ముఖా లెలా వున్నాయో, వారిలో నిజంగా ఎందరు దరిద్రులో, ఎందరు సంఘదూరులో, ఎందరు ముష్టికి దిగిరో-అన్నీ కన్నులకు కట్టేటట్లు, గుండెలు పిండేటట్లు రాసి ఆఫీసులో ఇచ్చాడు. ఆ సంపాదకుడు దాన్ని చదివి నలిపి బుట్టలో పడేసి "నీ కీపని కెవరయ్యా నియోగించారు? నువ్వు రాసినదాంట్లో వార్తేది? ఎంద రతిథులు వచ్చారు? ఎవరి ఆధ్వర్యాన ఉత్సవం, జరిగింది వారి పేర్లేమిటి? దాని విజయానికి కారకులైన ప్రముఖు లెవ్వరు? ఇవేం లేకుండా నువ్వు విలేఖరివేం అవుతావు. ఇంకోపని చూసుకో" అన్నాట్ట. చెప్పొచ్చే దేమిటంటే-విలేఖరి చేయవలసిన పని వేరు. ఇదే విషయాల్ని ఏ 'ఎరౌండ్ ది టౌన్' లోనో శీర్షికారచయిత రాసివుంటే అంతా ఓహో అనేవారే! ఇదే పత్రికారచనాదృష్టికి వాఙ్మయరచనాదృష్టికి కల తేడా కూడా. పత్రికారచనాకార్యము లౌకికము, వాఙ్మయ ప్రయోజనము, సాంస్కృతికము. పత్రికలు వార్తావిశేషాలకి, సాహిత్యం మనోవికాసానికీ చదువుతాం మనం. "కుక్క మనిషిని కరిస్తే అది వార్త కాదు. కాని మనిషి కుక్కని కరిస్తే అది బాక్సు ఆయిటమే" అవుతుంది- పత్రికలవారి దృష్టిలో!

రచనావ్యాసంగం ఒక జబ్బులాంటిది. శీర్షికారచయితల కీజబ్బు కొంచెం ఎక్కువగానే వుంటుంది. ఏ విషయాన్ని అయినా సరే తమ శీర్షికలోకి ఇమిడ్చి రాయగల నేర్పు వారికి అభ్యాసమువలన అలవాటై పోతుంది. ఆ క్షణంలో ఏంతోస్తే అది రాసి ఆ వారం పత్రిక ముగింపు చేయవలసిన అవసరం వుంటుంది. అంచేత ప్రత్యేకించి ఫలానా విషయాలనే రాయాలన్న నిబంధన పెట్టుకోరు చాలామంది. అలా కాకుండా రాజకీయాలు, సాంఘిక విషయాలు, స్త్రీల సమస్యలు, పిల్లల క్లిష్టమైన విషయాలు చర్చిస్తూ ఆయాశీర్షికలు కూడా-చాలా ప్రచారం పొందినవి ఉన్నాయి. తొలి మహిళాలోకపు శీర్షికలు-కుంకుమ రేఖలు నడిపించారు-కే. శే. పద్మావతిగారు. అలాగే శారదలేఖల ద్వారా, ఎన్నో

విషయాలని సమర్థవంతంగా చర్చించి మహిళల శీర్షికకి ఒక స్వరూపం కల్పించాచు కనుపర్తి వరలక్ష్మమ్మగారు. "ప్రమదావనం" శీర్షికద్వారా ప్రతి యిల్లాలిని ఆకర్షించి, ఎప్పుడూ చదవనివారిచేత కూడా చదివింపించిన ఘనత మాలతీ చందూర్‌కి దక్కుతుంది. 'ఇయం గేహే లక్ష్మి' శీర్షికలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు ఎన్నో చక్కని వ్యాసాలను రచించారు.

ఈనాడు సామాన్యంగా అయిపోయినశీర్షికలు పూర్వంలో వాఙ్మయస్థానం ఆక్రమించిఉన్నాయనడానికి నిదర్శనే "సాక్షి" వ్రాసాలు. అలాగే పలుపత్రికలలో పలుశీర్షికలక్రింద తమఅమూల్యమైన వ్యాసాలని రచించినారు తిరుపతి వేంకటకవులు.

వివిధవ్యాపారాలను సమీక్షిస్తూ వ్యాసాలు రాయడం వేరు. ప్రత్యేకించి శీర్షికలను నడుపుతూ వాటిలో రాసినవాటిని పలువురు చదివేలా రాయకల్గడం వేరు. పత్రికలలో ఈశీర్షికల బలాబలాన్నిపట్టీ వాటిప్రచారం ఉంటుంది. కాబట్టి అవి రాసే రచయితలకలం పదునూ ఊహలవాడీ కూడా వాటివిజయానికి తోడ్పడతాయి.

చాలామంది పత్రికలలో ఈవివిధశీర్షిక లెందుకు? అంటూ ప్రశ్నిస్తూవుంటారు. ఒకపత్రికాధిపతిని యిదేప్రశ్న అడిగాము. వారు చెప్పిన దిది: 'మాకు రోజు కిన్నికిలోల లెక్కన ఈరోజుల్లో వ్యాసాలు, కథలూ కవితలూ వస్తూంటాయి. వాటిలోంచి ప్రచురణయోగ్యం అయివున్నవాటిని ఏరడానికే ఓవారం చాలదు. ఇంక వాటిపై పూర్తిగా ఆధారపడితే ఆవారంపత్రిక ఎలా వస్తుంది? అంచేత సర్వసాధారణంగా పత్రికలో మూడోవంతు ప్రత్యేకశీర్షికలకి కేటాయించడం జరుగుతుంది. అప్పుడే నిశ్చితంగా కొన్నిపేజీలు నిండుతాయి. మిగిలినవి వచ్చినసాహిత్యంనుంచి నింపడానికి ప్రయత్నిస్తా"అన్నారు.

పత్రికలో శీర్షికలు నడిపేవారిపై ఓప్రత్యేకఅభిప్రాయమూ, ఓప్రత్యేక అసూయా పాఠకులలో సాటిరచయితలలో కాబోయే రచయితల్లో ఉండడం గమనించదగినది. వీరే ఎందుకు రాయాలి? అన్నప్రశ్న విన్పిస్తూంటుంది! శీర్షికాభిమానులు ఏం వారే ఎందుకు రాయకూడదు? అని ఎదురుప్రశ్న వేస్తూంటారనుకోండి. అయినా – ఈవివిధశీర్షికలరచయితలు తమస్థానాన్ని ఆక్రమించుకోవడం లేదని విమర్శకులు గ్రహించితే చాలు.

ప్రత్యేకశీర్షికలు ఎప్పుడూ ప్రత్యేకరంగాలకు సంబంధించే ఉంటాయి. కాని స్వాతంత్ర్యానికిపూర్వం పత్రికల్లో ఈశీర్షికలన్నీ కూడా ఆనాటిప్రజని

రాజకీయచైతన్యంవైపు దేశభిమానంవైపు మళ్ళించడానికి ప్రయత్నించేసేవిగానే ఉండేవి. ఆనాటిపత్రికల ప్రథమకర్తవ్యంలాగే శీర్షికారచయితలకర్తవ్యం కూడా - ప్రబోధన, ఉత్తేజపరచడం కార్యోన్ముఖులను చేయడం. కాని ఈ నాడు వేరు. "సాక్షి" వ్యాసకర్తలాగే - సంఘంలో లోపాలు ఎత్తి చూపడానికి, నలుగురూ తెలుసుకోతగ్గవి చెప్పడానికి, కాకుండా - పాఠకులకీ రచయితలకీ మధ్య వంతెనలా రూపొందుతున్నాయి వివిధశీర్షికలు. ఈనాడు వీటిప్రయోజనం వేరు. ఇవి పత్రికలకి సెల్లింగ్ పాయింట్స్. ఆయారచయితలనేర్పుకీ ఓర్పుకీ నిదర్శనలు.

ఈనాడు అతివిస్తారంగా ప్రచారం పొందుతున్నవి ప్రశ్నలు - జవాబుల శీర్షికలు. వాటిలో పాఠకులుకూడా పాల్గొనడం వుంటుంది కనుక - వాటి ప్రచారాన్ని మనం సులభంగానే అర్థంచేసుకోవచ్చు. రిపోర్ట్కి, విజ్ఞానం పంచడానికి, అనుమానాలు తొలగించుకోవడానికి అచ్చులో పేరుచూసుకోడానికి - యివి చాలా ఉపయోగపడుతున్నాయి. అందుకే బహుళజనాదరణకి నోచుకుంటున్నాయి.

పత్రికలు - వివిధశీర్షికలు చర్చిస్తున్నప్పుడు ఒకసంగతి మరిచి పోకూడదు. ఎంతప్రచారం పొందినా జనాదరం లభించినశీర్షిక లెప్పుడూ ఆయా పత్రికలో భాగాలే!



''వచనగీతం అంటే చేతికివచ్చిన వ్రాతకాదు. వ్యర్థపదాలు లేకుండా వచనం రాయడమే ఎంతోచిక్కు. అటువంటి అప్పుడు సమగ్రసౌందర్యంగల వచనగీతం వ్రాయడం మరీకష్టం''.

—శ్రీశ్రీ.

# తెలుగు పత్రికలలో కార్టూనులు - జోకులు

శ్రీ సుధామ

ప్ర...ప్ర...ప్రకటన :

'పత్రిక తిరగేస్తున్నారు. పదిపేజీలకో మరింకొన్ని పేజీలకో ఒక్కొక్క సారి అనుకోకుండా మీపెదవులమీదచిరునవ్వుమెరుస్తోంది. ఒక్కోసారి ఆపుకోలేక గట్టిగా నవ్వేస్తున్నారు. ఈ మధుర దరస్మితవదనానికి ప్రేరణ ఏమిటి?- కార్టూనులు, జోకులు. సత్వర ఆనందం పొందడానికి కార్టూనులూ, జోకులే వాడుడు బనానేవాలే....టింగ్ టింగ్ టింగ్' - ఇది జనరంజని కార్టూనులు, జోకులు ప్రకటన అనుకుంటున్నారా? లేదా. ఏమైనా కానీయండి తెలుగు పత్రికలలో కార్టూనులు, జోకులకొక ప్రత్యేకత, అలాంటిదే ఒక స్థానం వుందని పెదవులనే ఢంకామీద చిరునవ్వు అనే దెబ్బకొట్టి చెప్పచ్చు. కాదనగలరా?_లేరు.

ప్రస్తావన :

అసలు స్వాతంత్ర్యయుగోదయంలోనే ఈ కార్టూనుల, జోకుల మహోదయం వుందని చెప్పాలి. స్వాతంత్ర్యానికిపూర్వం దాస్యశృంఖలాలు త్రెంచుకునే దేశభక్తి ఉద్రిక్తతతో వున్నామే తప్ప మనమీద మనం జోకులేసు కుంటూ, కార్టూన్లు గీసుకుంటూ అంతగా నవ్వటాలగా లేము. స్వాతంత్ర్యా నంతరం తెలుగుపత్రికలు సంఖ్యలోనూ, స్థిరత్వంలోనూ చెప్పుకోదగినట్లుగా వచ్చాయి. హాస్యానికి దేశ, కాల, పాత్రముల ననుసరించి ఉనికి, మనికి, ప్రగతి ఏర్పడుతూవస్తుంది. అప్పటి హాస్యానికి, ఇప్పటి హాస్యానికి మనకు చాలా తేడా కనిపిస్తుంది. మనిషిధోరణిలోనూ, సాహిత్యంలోనూ ఒకప్పుడు హాస్యం కాస్త మొరటుగా, జుగుప్సావహంగానే వుండింది. ఇవాల్టి హాస్యం లోని వైవిధ్యం మీరు అనుభవిస్తూనే వున్నారు.

తొలి తెలుగు కార్టూనిస్టుగా ఈ స్వాతంత్ర్యయుగోదయంలో శ్రీతలిశెట్టి రామారావును చెప్పుకోవాల్సి వుంటుందేమో! 'తాటిచెట్టుమీదికెక్కుస్తూ ఒక రవాడికి

కత్తియుద్ధం నేర్పిస్తున్న తండ్రి'- అది దృశ్యం. క్రిందదానికి శీర్షిక– 'గీతాబోధన' అని–అది స్వాతంత్ర్యానంతరపు తొలివత్సరాల్లో ఒకతెలుగు పత్రికలో కార్టూను. అప్పటి కార్టూన్ల ధోరణి అలావుంటుంది.

**నిర్వచననిఘంటువు :**

కార్టూన్లకు, జోకులకు నిర్వచనం చెప్పడం కష్టం.'**A Joke is A Joke is A Joke**' అన్నారు. అంతే. జోకుకు రూపం కంటి కెదురుగా ఉండదు. ఊహలో కనిపిస్తుంది. కార్టూను అంటే రేఖలతోకూడిన జోకు అనచ్చు అంటే రూపంకూడా కనిపించే జోకుమాట. అయితే కేవలం యిలా నిర్ధారించడం దేంజరు. చరిత్ర కందని వీరుల్లా కార్టూను కందని జోకులూ వుంటాయి. జోకు ల్లేని కేవలరూపాలు (అవీ బ్రహ్మాండంగా నవ్విస్తూనే) కార్టూన్లగా కూడా బోల్డు. కార్టూనుకు తెలుగుపేరుంది. వ్యంగ్యచిత్రం అని. చిత్రం వ్యంగ్యంగా ఉన్నా వ్యంగ్యవాక్యాలతో కూడిన చిత్రమైనా అది వ్యంగ్యచిత్రం. అంటే కార్టూను అన్నమాట. కార్టూనులో నవ్వించడానికి తగిన మనుషుల్ని వాతావరణాన్ని సంతరించాలి రేఖల్లో. జోకును జోకుగా రాసేస్తే చాల్తుంది.

**'పం' గతులు :**

పత్రికను ఆసాంతం చదివించేందుకు ఆకర్షణ ముందు ముఖచిత్రం అయితే ఆ తర్వాత అందుకు ఉత్సాహాన్ని కలిగించేవి ముందుగా పాఠకులు తిరగవేసే కార్టూనులు, జోకులే. అవి బాగుంటే పత్రికంతా బాగుంటుందని పాఠకులు చదవడం నాకు తెలుసు. ఎంత తీరికలేని మనిషి చేతయినా ఒకసారి పత్రిక తిరగవేయించే ఘనత వీటికుంది. ఇప్పటిదాకా అంటే ఈ 1972 ఫలానా ఇవాళ తారీకుదాకా లెక్కవేస్తే కొన్నివేలకార్టూనులు, అంతకుమించి జోకులు తెలుగుపత్రికలలో వెలువడ్డాయి. ఇటీవలి 15 ఏళ్ళల్లో వీటిసంఖ్య చెప్పుకోదగ్గట్టుగా వీటిఫలితాలు అంతకుమించి ఆనందించ దగ్గట్టుగా ఉన్నాయి. ఆంధ్రప్రభ, పత్రిక, ఆంధ్రజ్యోతి, ప్రగతి, యువ, జ్యోతి, తరుణ, స్వాతి మొదలైన వార, మాస పత్రికలన్నీ ఇప్పుడూ కార్టూనులు జోకులూ ప్రచురిస్తూనే వున్నాయి డిటెక్టివ్, సెక్స్ పత్రికలుకూడా వాటివాటి ధోరణుల్లో వీటిని వేస్తూన్నాయి. ఆంధ్రప్రభ వారపత్రికలో లోకో క్తిచిత్రిక అనేశీర్షిక ద్వారా చాలామంది కార్టూనిస్టులకు ప్రోత్సాహమూ, అవకాశమూ ఆపత్రిక

కలిగించింది. గతంలో ఆంధ్రజ్యోతిలో కార్టూన్ స్ట్రీట్ అని ప్రత్యేకంగా శీర్షికే వుండినది. ప్రగతి అనే సచిత్రవారపత్రిక 1970 దీపావళికి కార్టూన్ల పోటీ నిర్వహించింది (ఫలితాలు తెలుపనేలేదు. బహుమతు లిచ్చారో లేదోకూడా తెలీదు – అది వేరే సంగతి అనుకోండి) ఆంధ్రజ్యోతిలో 'జోకాభిరామాయణం', జ్యోతిలో 'ప్రముఖుల హాస్యాలు'జగతిలో (ఒకమాసపత్రిక) నిమ్మతొనలు; విశ్వరచనలో 'చిటికథలు' ఇలా జోకులకోసం ప్రత్యేకశీర్షికలున్నాయి. అయితే విచిత్రం ఏమిటంటే కార్టూనిస్టులసంఖ్య వేళ్ళమీద లేదుగానీ వేలమీద అసలులేదు. తొలివందల్లోనే వుందేమో ! జోకులు చాలామంది రాసివుండచ్చు. గానీ కారూన్లుమాత్రం అంత 'చాలామంది' వేయలేదు.

**కార్టూను = బాపు, జోకు = ముళ్ళపూడి :**

ఏ తెలుగువాడూ (నవ్వేనవాడు, నవ్వేవాడు, నవ్వగలవాడు) కాదనలేని పరోక్ష నిర్వచనం యిదే. సత్తిరాజు లక్ష్మీనారాయణ (బాపు), ముళ్ళపూడి వెంకటరమణ జమలికలుగా తెలుగుపత్రికల ద్వారా అనేక లక్షల పర్యాయాలు అనేక లక్షల పాఠకులకు కడుపునొప్పి తెప్పించిన పాపం వూరికే పోదు. అది మళ్ళీ వారి అడుగుజాడల్లో అనేక శిష్య పరమాణువులను సృష్టించి మళ్ళా వాళ్ళ చేతుల్లో కార్టూన్ల ద్వారా, జోకుల ద్వారానే పోతోంది, పోతుంది. నిజానికి ఇవాళ మహతి తన మహత్తరమైన మోతలో ఈ విషయాన్నికూడా ఒక రాగంగా సంతరించేలా కార్టూన్లు, జోకులకు ఒక గుర్తింపు దశను, విశిష్ట దశను చేకూర్చిపెట్టిన ఘనత ఆ జమలికకే దక్కుతుంది. వారి సంపాదకత్వంలో ఒకప్పుడు జ్యోతి మాసపత్రిక ద్వారా ఈ కార్టూన్లు, జోకులు ఒక విశేషపథానికి ఎక్కగలిగాయి. ఒక ప్రత్యేకతను సంతరించుకున్నాయి. జ్యోతిలో – తర్వాత కొన్నాళ్ళపాటు వారి దక్షతలోనే వెలువడిన 'సుధ' మాసపత్రిక కూడా ఈ కార్టూనులు, జోకుల ప్రక్రియలో ప్రత్యేకతను వెలార్చింది. ఇవాళ ఒక కార్టూనో, జోకో లేకుండా ఏ వారపత్రికా, ఏ మాసపత్రికా దాదాపు రావడం లేదనే చెప్పాలి. వచ్చినా ఆకర్షించడం లేదని ఖచ్చితంగా చెప్పాలి. పాఠకుల్ని ఆకర్షించడానికి పత్రికకు కావలసిన ముడిసరుకులో కార్టూనులు, జోకులు పనికొచ్చే ప్రథమ సరుకు.

**ఇన్ ఎ నట్ షెల్ అను అద్దంలో కొండ :**

పాతికేళ్ళ స్వాతంత్ర్యంలో తెలుగుపత్రికలలో కార్టూన్లు, జోకులు ఎన్ని రకాలుగా వచ్చాయో, ఎన్ని విభిన్నమైన గిలిగింతలను ఇచ్చాయో, ఎన్ని

విషయాలను నవ్వులాట చేసాయో, ఎందరి తత్త్వాలను, ఎందరు పెద్దమనుషులను ఎగతాళి చేసాయో, చిన్ని చిన్ని చురకలతో ఎందరిని తమలోకి తాము చూసుకునేట్లు చేసి తెలియకుండానే సంస్కరణోద్యమంలో పాలు పంచుకున్నాయో చెప్పడం అంత సులభం కాదు. 'కార్టూన్లు జోకులు+నేను' అని ఒక శీర్షికయిచ్చి ఒక సెమినార్ చేసినా పూర్తి వివరాలు వ్యక్తం అవుతాయా అన్నా అనుమానమే. ఈ స్వాతంత్ర్య యుగోదయంలో జీవితంలోని, సమాజంలోని ప్రతి రంగానికీ ఒక కార్టూనో, జోకో తెలుగుపత్రికకు ఎక్కిందనడంలో సందేహం అక్కరకురాని చుట్టమే అవుతుంది. భార్యాభర్తల పోట్లాటలు, మనుషుల అమాయకత, వెర్రివెంగళాయతనము, పిల్లలు, ఇళ్ళు, హోటళ్ళు, వంటలు, డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, ఆఫీసులు, ప్రేమలు, వాహనాలు ఇలా కార్టూన్లకు, జోకులకు 'థీమ్'లుగా, ప్రేరణలుగా అనేకానేకం అనేకానేక రంగాల్లో వున్నాయి.

రాజకీయంగా తెలుగులో కార్టూన్లు అంతగా రాలేదు. ఇంగ్లీషు భాషలో యిలాంటి విట్స్ ఎక్కువ వచ్చాయి. రాజకీయ కార్టూనంటే సాధారణంగా మంత్రుల వ్యవహారాలమీదా, ఎన్నికలమీదా, ఓట్లమీదా వేసే కార్టూన్లు అని కాదు నా అభిప్రాయం. నడుస్తున్న పాలనమీద ఆయా పీఠాలమీద వున్న వ్యక్తుల ముఖాలను వ్యంగ్యంగా కార్టూనగా మలచి చురకల్లా వ్యవహరించిన కార్టూన్లు తెలుగు కార్టూనిస్టులు అతి తక్కువగా వేశారని నా అభిప్రాయం. బాపు, సాంబు ప్రభ, పత్రికల్లో కొన్ని వేశారలాంటివి. మామూలుగా రాజకీయాలను వ్యంగ్యంగా చిత్రిస్తూ దినపత్రికల్లో కార్టూన్లు వేస్తున్నవారు కొందరున్నారు. ఆంధ్రప్రభలో పిన్నా సుబ్బారావు (చిత్తజగత్తు) ఆంధ్రజ్యోతిలో E. V. రమణ (లోకం పోకడ) ఆంధ్రపత్రికల్లో యిలాంటి కార్టూన్లుంటున్నాయి. 'శంకర్స్ వీక్లీ' లాంటి రాజకీయ కార్టూన్ల పత్రిక ఒకటి తెలుగులో వుంటే బాగుంటుంది. ఆ పత్రికలోని కార్టూనుకే తెనుగు చేరుస్తూ విశాలాంధ్ర మొదలైన పత్రికలు తరచు ప్రచురిస్తున్నాయి. ఆంధ్రపత్రిక వీక్లీలో ఫామెస్ కార్టూన్స్ ఒకటే పూర్తి రాజకీయ కార్టూన్ల శీర్షిక అని చెప్పాలి.

ఇవాళ మన జోకుల్లోనూ, కార్టూన్లలోనూ తెలుగుతనం వున్నందుకు సంతోషించాలి. ఇంగ్లీషు, హిందీ, కన్నడం మొదలైన భాషలవాటితో పోల్చి చూసుకుంటే ఇంగ్లీషు తరువాత ఎక్కువ విశిష్టతకలిగినవి మన తెలుగు కార్టూనులు, జోకులే. జోకులకన్నా కార్టూన్లు వేయడం కష్టం. కార్టూన్లకు బొమ్మలు

గావాలి, హాస్యరేఖలు కావాలి.వినోదధోరణివున్న ప్రతిమనిషీ జోకును సృష్టించ గలడు కానీ కార్టూన్లు గీయడానికి చిత్రకళ రావాలి. గీతల్లో హాస్యం చొప్పించాలి. జోకు చప్పనిదయినా రేఖాకృతుల్లో బ్రహ్మాండంగా నవ్వించవచ్చు. కార్టూన్లలో బొమ్మలోని కనుముక్కు తీరు, నోరు, వ్యక్తి వాతావరణంయొక్క ఆకృతి గమనించగానే నవ్వు పుట్టాలి. కార్టూనిస్టుల్లో యిలాంటి స్వంత రేఖలు, చక్కనిగీతలు, తెలుగుతనం ఉట్టిపడేరీతులుఉన్నవారు వేళ్ళమీదేవున్నారు. ఇవాళ సగానికి సగంమంది కార్టూనిస్టులు బాపూ, గోపు ల ననుకరిస్తూ తమ జోకులను అందులో చూపిస్తున్నవారే. రేఖలను సంతరించడంలో ఆ అందం,పొంకం,సహజత, హాస్యత కలిగి అందెవేసినచేయి 'బాపు'యే కావడం దానికి కారణం. స్వంతగీతలున్నా ఇతరకార్టూనిస్టులరేఖల్లో మరి అంత అందం కనిపించమంటే పాఠకులకు కనిపించడంలేదు. అయినా సత్యమూర్తి, బాబు, జయదేవ్ మొదలైన కొందరిలో వారి ప్రత్యేక గీతలధోరణిలో అందాలున్నాయి. బాపును అనుకరిస్తూ, అనుసరిస్తూ చంద్ర, సుధామ, అంజన్, మాధవి, రామకృష్ణ, శంకు, గుప్త, సురేంద్ర, టింగు,గోర్కి,రషీదా,రమేష్,భవాని,త్రిగుణ్,రుక్మిణి మొదలైన కార్టూనిస్టులు ఇప్పటి తెలుగుపత్రికల్లో మనకు కనిపిస్తూంటారు. కార్టూన్లుచూడడమే, నవ్వడమేగానీ కార్టూనిస్టులను గుర్తించకపోవడం ఇవాళ పాఠకుల్లో కొంతవుందని ఈ కొన్ని పేర్లుగానీ ఇంకా ప్రఖ్యాతులు, యువకులు అయిన కార్టూనిస్టులున్నారు. అందరిపేర్లు చెప్పడంకష్టం స్థలాభావం దృష్ట్యా. కేవలం అయోమయం, అందవిహీన రేఖలవల్ల కూడా రూప, విష్ణు మొదలైన కొద్దిమంది కార్టూనిస్టులు హాస్యాన్ని సృష్టించయత్నిస్తున్నారు.

**శైలి :**

కార్టూన్ జోకులకు ఒకప్రత్యేకశైలివుంది. ఆశైలిలో అదిసృష్టించే హాస్యం ఒకరకంప్రత్యేకత. వార్నీ, గవత్తు, బాంది, ఏవోయ్, పాయిం చేస్మీ, స్మో వంటిపదాలు ఈశైలిలో వుంటాయి. ఈకార్టూన్ల భాషలోకి వచ్చేటప్పటికి భాషాశాస్త్రజ్ఞులు కూడా నవ్వేయవలసిందే. ఈశైలిలో కొన్ని చోట్ల మకారాన్ని అర్థసున్నతో కూడిన 'వ'కారంగా మార్చడం వంటి రూపాలు హాస్యానికి మెరుగులుదిద్దడం జరుగుతోంది. ఈకార్టూన్లశైలి 'జోకులాష్టమి' నాడుపుట్టడనిపించ ముళ్ళపూడిలోనే విశేషంగా కనిపిస్తుంది. అతని 'బుడుగు' ఈశైలిలోనేవుండి జోకుకథ అనో జోకు నవల అనోఅనిపించడానికి సందేహం అక్కర లేదంటుంది.

**గుసగుస :**

గా చెప్పుకోవలసిన కబురేమిటంటే కొన్ని జోకుల్ని కార్టూన్లు చేయచ్చు. కార్టూన్లను జోకులు చేయచ్చు. ఇవాళ చాలామంది ఆపని చేస్తున్నారు కూడా. కొన్ని జోకులకి బొమ్మనంతరించి కార్టూన్లగానూ కొన్ని కార్టూన్లలోని మాటలను బొమ్మతొలగించి జోకులు చేసుకోవడం, ఇప్పుడిప్పుడు పాతవాటిని మరల తిరగతోడడం అటువిటువి విట్లుగాచేయడం కూడా జరుగుతోంది. కార్టూన్లలో అప్పడాలకర్ర దశ ఇటీవలే ముగిసింది అనిచెప్పవచ్చు.

**జోకా ? నువ్వు హాస్యకథకు పునాదివా ? - వర్ధిల్లు :**

జోకులు ఆధారంగా చిట్టిచిట్టి కథలకు, ఓమోస్తరు పెద్దహాస్యకథలకు నిర్మాణం కూడా జరుగుతోంది. ఆంధ్రపత్రికలో కొంతకాలం క్రితం హమేషా తమాషాకథలు, కథకానికథ వంటి శీర్షికలు అలాంటివే. ఆంధ్రజ్యోతిలోని గాథావళిశీర్షిక ప్రముఖుల జోకావళే చాలాభాగం. కాలేజీలో ఒకరోజు, మరపు రాని సంఘటన మొదలైనకొన్నిపత్రికల శీర్షికల కింద జోకులను కథలుగా మలచి అల్లినతనం కనిపిస్తుంది. హరికథల్లోనూ, బుర్రకథల్లోనూ - కథకులు ఈకార్టూనిస్టుల జోకులను ఉపయోగించి జనరంజనకు కృషిచేస్తున్నారు.

**పుస్తకప్రచురణ :**

నిండుగా నవ్వుకుందామని కార్టూన్లు జోకులతో వున్నపుస్తకాల్ని కొనుక్కుందామని మీరు బజారుకెడితే ఆంగ్లంలోలభించినన్ని తెలుగులో లభించవు. ఈవిషయంలో మనం కుంచెం బోల్డు వెనకపడేవున్నాం. కారణం కార్టూన్ల పుస్తకం ప్రచురించడం ఖర్చుతో కూడిన వ్యవహారం. జోకులతో పుస్తకం ప్రచురించడం సులభమే అయినా ఎందుకో అవీ ఎక్కువగా మనకు లేవు. కార్టూన్లు, జోకులు మిళాయించిన పుస్తకాలు నిజానికి ఎన్ని వెలువడితే అంత బాగానే వుంటుందికానీ ప్రచురణకర్తలెవ్వరూ నవలలుమొదలైనవి ప్రచురించినట్లుగా ఒకకార్టూనిస్టు కార్టూన్లన్నిటినీ పుస్తకంగా ప్రచురించడానికి సాహసించరుమరి. అలాంటి సాహసం కొందరు చేయగా మనకువున్న కార్టూన్లు, జోకులపుస్తకాలు పదుల్లోనేవున్నాయి. రసికజనమనోభిరామం, నవ్వితే నవ్వండి, యుక్తులూ ఛలోక్తులు మొదలైనవి అతిస్వల్పం. ఒకేవ్యక్తికార్టూన్లు గల పుసకాలు వ్రేళ్ళమీద చెప్పవచ్చు. పిళ్ళాసుబ్బారావు చిత్రజగత్తు, సత్యం

కార్టూన్లు ఆకోవలోనివి. ఆమధ్య ఎవరో కుర్రకార్టూనిస్టు పుస్తకం 'మైకార్టూను' చూసినగుర్తు.

**నిఝం... సీరియస్‌గా ఇంకొన్ని విషయాలు :**

హాస్యపత్రికలు కార్టూన్లపత్రికల పేర్లతో కొన్నిమాసపత్రికలువచ్చాయి. జోకర్, నవ్వులుపువ్వులు, పకపకలు, హాస్యప్రియలాంటి నాలుగైదు. అయితే వాటిల్లోని కార్టూన్లు, జోకులు స్థాయికి ఎదిగి నవ్వించినవి చాలా స్వల్పం. ఆ పత్రికలు కూడా చాలామటుకు దెబ్బతినేసాయి. కార్టూన్లతో కొన్నితెలుగు సినిమాల టైటిల్స్ కూడా చూపబడ్డాయి. బాలరాజుకథ టైటిల్స్ చెప్పుకోదగ్గవి. సినిమా రెండోసారి ఆటైటిల్స్ కోసమే చూశానేను. ప్రేమించుచూడు మొదలైన ఇంకొన్ని చిత్రాలుకూడా కార్టూన్లు చూపాయి. ఆప్రక్రియ విస్తరిస్తే బావుంటుంది.

పత్రికల్లో కార్టూన్లు, జోకులు చూసి నవ్వుకునేవారే తప్ప వాటినివేసే కార్టూనిస్టులగురించి ఎవరు ఆలోచిస్తున్నారు. ఆలోచిస్తున్నవారు తక్కువ. కొందరు కార్టూన్లు మీరే అంటే(మనుషులే అనేట),వేస్తారా అని కార్టూనిస్టులను అడగడం నాకు వింతవేసింది. అవి పత్రికలే వేస్తాయి అని వారిఉద్దేశ్యంట. (అచ్చువేసేది అవే అనుకోండి) కార్టూనిస్టులు అనేది పత్రికల్లో ఒక ఉద్యోగంగా అంతటాస్థిరపడితే ఎలావుంటుందో మరి ఆలోచించాలి? రచయితల్లాగానే కొన్నిపత్రికలకు కూడా గుత్తపుచ్చుకున్నట్లు కార్టూనిస్టులు కొందరుండడం పరోక్షంగా అలాంటిదే అనుకుందామేంటి పోనీ.

రచయితలకు, కవులకు వున్నంత గుర్తింపు కార్టూనిస్టులకు లేదు."వీరు కార్టూన్లు వేస్తుంటారండీ", "వీరు ఫలానా కార్టూనిస్టుగారు" అంటే అదికూడా జోకుగానూ, కార్టునులానూ; తీసుకుంటుంటే ఏంచేస్తాం. అంటే ఏం చైలేమన్న మాటేనా. కార్టునిస్టులకిచ్చే ఆర్థికప్రోత్సాహం నాలుగూ అయిదూ. అవీ కొన్ని పెద్దపత్రికలే. అదేపెద్దమొత్తం అనేవారిని గురించి ఏమనగలం. ఏ ఆంధ్రప్రభలోనో ఒక ఫుల్‌పేజీ కార్టున్లు పడితే అక్కడికి కార్టూనిస్టు కొండంత సంతృప్తిపడడం చూస్తూనేవున్నా.

కొన్నిపత్రికలు రెమ్యూనిరేషన్ చెల్లించవుసరికదా కార్టూనిస్టుకు ప్రతి కూడా పంపవంటే మీరు హాశ్చర్యపడిపోనక్కర్లేదు. (కొందరు రచయితలకూడా ఈ దిక్కులేదుటలెండి) కార్టూనిస్టులకుకూడా కోరికలున్నాయి, శ్రమ

వుంది, దావ్యత లున్నాయి, హక్కు లున్నాయి. కాదంటారా. అనకండి. సంఘ సంస్కరణకు సమాజంలోనూ, మనిషిలోనూ మార్పుకు రచనసంగతేమోగానీ కార్టూన్ల జోకులుమాత్రం పరోక్షంగానైనా కారణమౌతూనే వున్నాయి. హేళనగా, మృదువుగా, ఎగతాళిగా ఒక్కోసారి కఠినంగా నడుస్తున్న రీతులమీద వెలువడుతున్న కార్టూన్లుచూసి లోలోపల తమమీదే అనుకుంటూ సిగ్గిల్లుతున్న వారిని నేను కనుక్కోగలిగానుకూడా. అందుకని కార్టూనిస్టులనుగురించి కూడా సీరియస్‌గా ఆలోచించండి.

అందరికీ సంఘాలున్నాయి, సమావేశాలున్నాయి, సభలున్నాయి. కార్టూనిస్టులకు లేవు. పెడదామని ఆశ. పెట్టవలసిందే. అఖిలభారత తెలుగు కార్టూనిస్టుల మహాసభ ఒకటి (సీరియస్‌గానే చెబుతున్నది. "ఇన్నాళ్ళుగా మనల్ని రకరకాలుగా, ఘోరంగా చిత్రిస్తూవచ్చిన కార్టూనిస్టులందరూ ఒకేచోట దొరికారు పట్టుకోండి" అని మహిళాసమాజం అప్పడాలకర్రల మొదలైన ఆయుధాలు పట్టుకువస్తున్నట్లు మా'బాబు' కార్టూన్‌నిజమైపోయినాసరే) నిర్వహించాలి. ఆ ఆవశ్యకత నిజంగావుంది. కార్టూనిస్టుల సమస్యలు, సాధకబాధకాలు, కష్టనిష్ఠూరాలు చర్చించుకోవల్సిన అవసరంవుంది. కార్టూనిస్టుల పరిచయాలతో, ఫోటోలతో WHO IS WHO లాంటి గ్రంథం ఒకటి ప్రచురించాలి. పెద్దఎత్తున వ్యంగ్యచిత్ర కళాప్రదర్శనం జరగాలి. అందుకే **"తెలుగు కార్టూనిస్టులారా ఏకంకండి"** అని ఒక స్లోగన్ రాద్దామనుకుంటున్నాను. (నవ్వకండయ్యా బాబూ!) ఇవన్నీ జరిగితేతప్ప పూర్తిగా కార్టూనిస్టులంటే ఏమిటో జనానికి తెలీదు. ఇవన్నీ ప్రణాళికలు. సత్ఫలితాలను సాధించాలంటే కార్యరూపంలో యువభారతి లాంటి సంస్థలేపూనుకోవాలి. అలాంటిసంస్థ యువభారతి ఒక్కటేకాబట్టి ఎప్పటికైనా దీనికి యువభారతే పూనుకోవాలి. తను పూనుకోవడం పూనుకోకపోవడం అన్నది, కార్టూనిస్టుల తెలుగువాళ్ళ భాగధేయంమీద ఆధారపడివుంటుంది.

**ముక్తాయింపు :**

స్వాతంత్ర్యయుగోదయంలో తెలుగుపత్రికల్లో కార్టూనులు, జోకులు అనే నాకు ప్రసాదించిన ఈవిషయానికి నేచేసిన న్యాయాన్యాయాలు ఏమిటోగానీ ముగింపుగా ఒకటేమాట—"కార్టూన్లను, జోకులను హాస్యంగా తీసుకోండి. అభ్యంతరంలేదు. కానీ వాటినిసంతరించే మనుషుల (కార్టూనిస్టుల)జీవితాలను మాత్రం జోకుగా తీసుకోకండి. జోక్ చేయకండి."

# సినిమా రచన - చిత్రకథ

శ్రీ పి. చెంగయ్య

మానవజీవితానికీ, ఒక జాతి సంస్కృతికీ అద్దంవంటిది సాహిత్యం.

ఒకఆదర్శాన్ని ప్రజకుచూపించి, ఆ లక్ష్యసాధనకు కావలసిన ప్రబోధాన్నికలిగించే శక్తికూడావుంది సాహిత్యానికి.

"Unto this last" అన్న ఒకపుస్తకం, తనజీవితంలో పెద్దమార్పును తీసుకొచ్చింది అన్నారు మహాత్మాగాంధీ.

నెహ్రూజీ ఆత్మకథ, అనేకదేశాల్లో స్వతంత్రవీరులకు దీక్ష కంకణం కట్టిందని మనం చదివాం. ఈప్రభావం, విశిష్టత, స్వేచ్ఛా సాహిత్యానికే వుంది. సినిమారచనకులేదు. స్వేచ్ఛారచన విజ్ఞానాత్మకం. సినిమా రచనవినోదాత్మకం. సినిమా ఒక మూడుగంటల గిలిగింత. సాహిత్యం, రేపటితరానికి, నేటివారు అందిచ్చే సాంస్కృతిక సంపద. స్వేచ్ఛారచన అవధులను అంగీకరించదు. సినిమా రచనకున్నవే అవి. శ్రీశ్రీ భాషలో చెప్పాలంటే, రచయితలు "Goldsmiths" కావడానికి సావకాశంవుంది. సినిమారచయితలు "Wordsmiths" మాత్రమే కాగలరు.

ఈ దృష్టితోనే సమీక్షించాలి_గత 25 సంవత్సరాలలో "సినిమారచన" ఏం సాధించింది అన్నఅంశం.

* * *

సినిమారచనలో రెండు విభాగాలున్నాయి.

1. సినిమాకథ.
2. సంభాషణలు.

ప్రతికథ సినిమాగా, తెరమీద కనిపించేముందు, ఈరెండుదశలూ దాటాలి. వాగ్రచన - చిత్రరచనగా మారాలి. మాటలలోవున్న కథను, కథనాన్ని - సినిమావరవడిలో దృశ్యాలుగా రూపకల్పనచేసి, వ్రాయడమే "సినిమాకథ" Screen play. కథారచయిత వ్రాసిన ప్రతిదృశ్యం యథాతథంగా తీస్తే తెరమీద రాణించదు. అందుచేత Screen play writer కు, భాషాజ్ఞానం మాత్రం వుంటేచాలదు. అభిమానుల అభిరుచులు తెలియాలి.

సినిమానిర్మాణం గురించి, దానికి సంబంధించిన అన్నశాఖలగురించి సమగ్రమైన "టెక్నికల్" జ్ఞానం, అనుభవం కావాలి. వెనుక, Holly woodలో

ఒక సరిక్రొత్తరచయిత, నాయికానాయకుల మధ్య ఒకప్రేమఘట్టం, రెండు పేజీలు ఒక టెలిఫోన్‌బూత్‌లో జరిగేట్టువ్రాశాడట. కానీ టెలిఫోన్‌బూత్‌లో ఇద్దరు నిల్చోలేరు, సరికదా, కెమెరా రావడానికి అసలుస్థలం వుండదు. అందు కని ఆసెట్టింగ్ విశాలంగా నిర్మిస్తే – అది టెలిఫోన్‌బూత్ కానేకాదు. వాస్తవి కతకు దూరం అవుతుంది. ఆ సీను మార్పించాడు నిర్మాత.

"సినిమాకథ" కు – మాటలు, హావభావప్రదర్శనేకాక, ఉపయోగించే కొన్నిచిట్కాలున్నాయి. మనకళ్లు చూచేదానికంటె సూక్ష్మంగా, నిశితంగా చూస్తుంది కెమెరాలెన్సు. ఇదికాక, సినిమాకు కొన్ని Symbols కూడా వున్నాయి. ఇవిసినిమాకళకు ప్రత్యేకమైనవి. ఆలోచనలలోకొట్టుకుపోతూన్న ఒకమనిషిని, చెప్పడానికి, సినిమాలో తరుచు, వేగంగా తిరుగుతూన్న fan లేదా ఒకరైలును చూపొచ్చు. ఒకమనిషిని గతజీవుడైనాడని చూపడానికి symbol గా, ఒక చిత్రంలో సత్యజిత్‌రే, రెక్కలుకొట్టుకుంటూ ఎగిసిపోయే పావురాలను చూపించాడు.

కానీఈ symbols సరియైనచోట రావడానికి, Timing sense కావాలి. అంటే ఎడిటింగ్ గురించికూడా తెలియాలి. క్లుప్తంగా చెప్పాలంటే దర్శకుడు, ఒక చిత్రానికి ఎంతముఖ్యమో, screen play writer కూడా అంతే ముఖ్యం.

ఈ శాఖకు 25 ఏళ్ళనాడున్న గౌరవం ఈనాడు లేదు స్వయం శిక్షితులైన ఆనాటివారు "సినిమా కథ"కు ఇచ్చినంతవిలువ ఈనాటివా రివ్వటంలేదని ఖచ్చితంగా చెప్పొచ్చు. దృష్టాంతాలు కావాలంటే వందలు దొరుకుతాయి.

ఆనాటి "యోగి వేమన", "పాతాళభైరవి", "దేవదాసు", "మల్లీశ్వరి" ఇలాటి చిత్రాలు చూస్తే, కళాదృష్ట్యా పరిశీలిస్తే వాటిలో ప్రతి చిన్నవిషయం సూక్ష్మంగా ఆలోచించి చేసినట్టు కనిపిస్తుంది. ఈనాడు లేని విశిష్టత ఒకటేదో– దృగ్గోచరమౌతుంది. ఎందుకని ?

ఇంక సినిమా సంభాషణల విషయంలో ఆనాటి సముద్రాల, తాపీ ధర్మారావుగార్ల దగ్గర్నుంచి, ఈనాటి ఆత్రేయ, నరసరాజులవరకూ సినిమా రచన ఏమాత్రం ప్రగతిని సాధించింది అంటే–కొంతవరకు సాధించిందనే అనాలి.

ఆనాడు పదిమాటల్లో చెప్పింది ఈనాడు ఒక్కమాటలో చెప్తున్నారు రచయితలు. చిన్నమాటల్లో పెద్దభావాలను అందచేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఇదేమంత సులభమైన పని కాదు.

"The greatest art is the simplest" అన్నది ఆదర్శం కానీ, సులభ సాధ్యం కాదు.

సినిమా రచన పతనమైందన్న కొందరి విమర్శ నేనంగీకరించను. మారిందంటే ఒప్పుకుంటాను. దీనికి కారణం – మారిన కాలం!

1947 మన దేశచరిత్రలోనే ఒక స్వర్ణయుగపు ఆఖరుదశ. పాతవిలువలు మారుతూ, కొత్త విలువలింకా తలెత్తని సంధియుగం యిది.

ఆనాడు శృంగారం అన్నచోట ఇప్పుడు "సెక్సు" అంటున్నాం. ఎన్ని కష్టాలలోనైనా వశం తప్పని, నిగ్రహం కలిగిన మనిషి ఆనాటి నాయకుడు.

కరుకుతనం, బెరుకుతనం, కయ్యానికి సవాల్‌చేసే ఆవేశం, సంఘాన్ని పరుషంగా దుయ్యబట్టడం, ఇన్నీ వున్న నాయకునే ప్రజలు హర్షిస్తారు నేడు.

ప్రజా బాహుళ్యానికి ఎగువ,ఉన్నతస్థాయిలో వున్న వాడానాటి నాయకుడు. ఈనాటి నాయకుడు ప్రజలలో ఒకడే కావాలి.

దీనమానవుడు అతనికి జరిగిన నిన్నటి అన్యాయం, నేడు జరుగవలసిన న్యాయం, రేపటి ఉజ్జ్వల భవిష్యత్తు ఇవే కథావస్తువులు. వీటిని అతనికి అందుబాటులో వుండే భాషలోనే చెప్పాలి. ఇది చారిత్ర్యకంగా ఒక అవసరం. పతనమని నేనంగీకరించను.

మనిషి కావ్యవస్తువు కావడం మనలో పెరుగుతూన్న మానవతకు నిదర్శనమని నేనంటాను, నమ్మతాను.

సినిమా రచన క్షీణించేగనక వుంటే – ఆబాలగోపాలం ఇంటింటా వాడుకునే సినిమాపాట లెలావస్తున్నాయి. శ్రీ శ్రీ, నారాయణరెడ్డి, దాశరథి, ఆరుద్ర, ఆత్రేయ ఎంత బరువైన భావాలను ఎంత తేలికైన మాటల్లో చెపుతున్నారు. ఇదేమంత సులభసాధ్యమా?

"మార్పు" కాలధర్మం. దానికి అనుగుణంగానే వుంటుంది సంస్కృతి. ఆ సంస్కృతిలోనుంచే పుట్టుకొస్తుంది సాహిత్యం. "సినిమా రచన" కూడా అంతే. కాకపోతే పురోగమనానికి కావలసినంత స్వేచ్ఛ, భావావేశం, సినిమాల కథావస్తువు రచయితలకు కలిగించడంలేదు. కొత్తదనం నిర్మాణ సూత్రాలలోనే రావాలి. Formula చిత్రాలను ప్రేక్షకులు యింకా నిరాకరించాలి. ప్రబోధాత్మక చిత్రాలను ఆదరించాలి. ఈ మార్పు వచ్చేంతవరకూ ప్రభుత్వం నిర్మాతలతో సహకరించాలి. ఇది జరిగిననాడు "సినిమా రచన" వినోదాత్మకమే కాక, విజ్ఞానాత్మకం కూడా కాగలదని నిరూపించగల చైతన్యం సినిమా రచయితలలో వుందని నా సంపూర్ణ విశ్వాసం.

# సినిమా రచన

# మాటా - మంచీ

శ్రీ ఎమ్వీయల్

**మొదటిమాట :**

సినిమాకి సంభాషణలు అవసరం లేదని చార్లీచాప్లిన్ చిత్రాలు ఈనాటికీ రుజువు చేస్తూనేవున్నాయి. మూకచిత్రాలు అన్ని దేశాలవారికీ అర్థమయే అవకాశం వుంది. మరి మాటలకు చోటిచ్చి పరిధిని పరిమితం చెయ్యటం ఎందుకు?

ఎందుకంటే ప్రపంచంలో చార్లీచాప్లిన్ ఒక్కడే వుంటాడు గనక అందుకే మిగిలిన చిత్రదర్శకులు మాటలమీద ఆధారపడక తప్పదు.

సినిమాకి మాటలే అవసరం లేదు పొమ్మంటున్నప్పుడు మనం ఉపయోగించక తప్పని మాటలు ఎంత క్లుప్తంగా, సంక్షిప్తంగా, వుండాలో చెప్పాల్సిన అవసరం లేదు. కాని తెలుగు వారి జీవన విధానంలోలాగే, ప్రాచీన కవిత్వంలోలాగే, ఆధునిక కవిత్వంలోనూలాగే, తెలుగు నవలల్లో లాగే సినిమాల్లో కూడా క్లుప్తత అన్నది లుప్తమై పోయింది.

**'నజ్జలు—నజ్జలు'**

తెలుగు చిత్రసీమలో మాటల రచయితలుగా పనిచేసినవారు, చేస్తున్నవారు యాభై మందిపైనే వున్నారు. ఒరవళ్లు పెట్టినవారు కొందరు ఆ ఒరవడిలో పడిపడిగా సాగిపోయేవారు మరికొందరు. నవలలు చదివి నవలలు రాసినట్లే సినిమాలు చూసి సినిమాలకు రాసేవారే ఎక్కువ. జీవితాన్ని, మనుషుల్ని, తత్వాల్ని తరచి చూసి రాసేవాళ్లు బహుతక్కువ తెలుగు సాహిత్య చరిత్రలో కనబడే మలుపులు మెరుపులు చిత్ర చరిత్రలో కూడా కనబడతాయి. ముఖ్యంగా నిన్నగ్రాంధికం, నేడు వ్యావహారికం చిత్రనిర్మాణం పౌరాణికాలతో ప్రారంభం కావటంతోను, నాటితెలుగు సాహిత్య ప్రభావం సినిమాలపై ప్రసరించటంతోను మాటలు చాలాకాలం గ్రాంధిక పద్ధతినే నడిచాయి. జానపద పథానికి, సాంఘికరంగానికి చిత్రరంగం విస్తరించినా సంభాషణల పద్ధతి మారలేదు. తరవాత సాహిత్యంలో వచ్చిన వెల్లువ చిత్రరచయితలకు కూడా సోకి వ్యావ

హారికం వైపు మళ్లారు. కాని పౌరాణికాలకు, అక్కడక్కడా జానపదాలకు ఉపయోగించాల్సివస్తే సాంఘికాలలో పద్యాలకు గ్రాంధికమేవాడాలని నియమం పెట్టుకున్నారు. అర్థం కాకటం గురించి పట్టించుకోలేదు. అర్థం కాకపోయినా తలయూపే రసిక ప్రేక్షకులుండటంతో మనపద్ధతే కరెక్టని ఈనాటికీ అలాగే రచన చేస్తున్నారు. వీరవ్యావహారిక వాదులైన రచయితలు కూడా ఈ రసికులకు భయపడి పౌరాణికం రాసేప్పుడు గ్రాంధిక స్వేచ్ఛ నొక్కేస్తున్నారు.

**పాత్రౌచిత్యం--సౌజన్యం :**

బెంగాల్ కథలను సినిమాలు తీసిననాళ్ళు తెలుగుపలుకుబడి తలవంపులకు పక్కకు తప్పుకుంది. బెంగాల్ వాతావరణమే సన్నివేశాలలో, సంఘటనలలో పాత్రలలో తాండవించేది. మనమాట నిలబెట్టడానికి రచయిత ప్రయత్నించినా అతని మాటపోవడం తప్ప ప్రయోజనం వుండేది కాదు. బెంగాల్ మోజు విరిగి పోయాక తమిళచిత్రాల తాకిడి ఎక్కువైంది. ఇక్కడకూడా తెలుగుమాట దక్కకుండా పోయింది. తమిళంలోవుండే చాంతాళ్ళ సంభాషణలు తెలుగులోకి వచ్చేశాయి. ఇద్దరి సంభాషణలో రెండోవాడికి మాటతోచదు. రచయితా తోచనివ్వడు. ఇదికాక డబ్బింగు సినిమాలకు రాయటంలో చేయితిరిగిన రచయితలు తెలుగు డైలాగ్ కూడా డబ్బింగ్‌లాగే రాసే దుస్థితికి లోనయారు. ఇప్పుడు వచ్చిన కొత్తకెరటం 'బాండ్' చిత్రాలు. వీటిలో ధ్వనులకు తప్ప మాటలకు చోటులేదు. ఉన్న పట్టెడు మాటలు కథనుగాని,పాత్రల తత్వాలను గాని, సంఘర్షణను గాని వ్యక్తం చేయడంలేదు. ఈకెరటంతెచ్చిన మాటలన్నీ నత్తగుల్లలే. ఈ చిత్రాలతో తెలుగుచిత్రాల మాటపడిపోవటం మొదలైంది.

**మాటమీదమాట :**

తెలుగు చిత్రాలు మంచిమాట చేసుకోక పోవటానికి ముఖ్యకారణం మాటలు పాత్రోచితం, కథోచితం కాక నటోచితం కావటమే. నటుల్ని దృష్టిలో పెట్టుకొని రాసినంత కాలం మాటలు సీటీబుడగల్లా పేల్తాయేతప్ప విజ్ఞానంతో కూడిన ఆనందాన్నిచ్చే దీపకళికలు కాలేవు. సూర్యకాంతం నూరే మాట కారాల ఘాటు సినిమా ఆడినంత కాలంకూడా వుండదు. హాస్యం సృష్టించే ప్రయత్నంలో సంభాషణలు పేనుకుంటూ పోవడం కూడా మంచి సంభాషణలు రాకుండా పోవడానికి కారణం. హాస్యం కోసం కథకు సంబంధం లేని

పాత్రల్ని, సన్నివేశాల్ని సృష్టించడంతో ఈదోషం కొట్టింది. 'మృచ్ఛకటికం' నాటకంలో మైత్రేయుడి ప్రతిమాటా సన్నివేశంనించి, పాత్రస్వభావంనించి, జరిగిన కథనించి, జరగబోయే కథను సూచిస్తూ జనించి హాస్యాన్ని అందించింది. అలాటి హాస్యం చిత్రాలలో రాసింది సదాశివబ్రహ్మం, ముళ్లపూడి వెంకటరమణ. కొందరు రచయితలు పాండిత్యం ప్రదర్శించే తాపత్రయంలో అర్థాలు లేనివి, అపార్థాలువచ్చేవి రాయటం, శ్లేషలతో మాట మీరటం ఎక్కువైంది. 'యోగివేమన' చిత్రంలో సీనియర్ సముద్రాల 'మసిపూసిన మాణిక్యం' అని రాశారు. ఆ దోషాన్ని ఎత్తిచూపుతూ శ్రీశ్రీ 'అవాక్కులు' అనే వ్యాసంరాశారు. మాటమాటకీ నూటొక్క అర్థాలుండేలా రాయటం, 'నేనింతావకాయ వేసుకోనుసుమీ, ఆవకాయ వేసుకోను, వేసుకోను' వంటి డైలాగులు రాయటం గురించి ముళ్లపూడి చాలా వ్యాసాలు రాశారు. 'గిరీశంలెక్చరు'ద్వారా ఘాటుగా విమర్శించారు.

కథనాత్మకం అయినపుడు కూడా సంభాషణ కుంటుపడక తప్పదు. దర్శకుడికి, రచయితకి ఏపని ఎవరుచెయ్యాలో తెలియకపోవటంవల్ల దర్శకుని బాధ్యత అయిన కథనం రచయిత పాలబడి సంభాషణలు నిర్జీవం కావటం జరుగుతోంది. దర్శక ప్రముఖులు రచయితల్ని దాదాపు ఎడిషనల్ డైలాగ్ రైటర్ హోదాకి దించేసి వాళ్ళే మాటచేసుకోవటం ఎక్కువైంది. రచయితకి మాట దక్కకపోవటానికి నటులు, దర్శకుడు కూడా కారణం.

**మాటకోసం - మాటకోసమే :**

సంభాషణ కేవలం సంభాషణ కోసమే నడిపే రచయితలు లేకపోలేదు. ఎన్నిడైలాగులు, ఎన్నిఅడుగులు, ఎన్నిరీళ్లు తిరిగినా పాత్రల పెరుగుదల అంగుళం వుండదు. డైలాగుల సంఘర్షణతప్ప పాత్రల సంఘర్షణ ఆవగింజంత వుండదు. ఇటువంటి సంభాషణలు ఒకోసారి నటులకి, రచయితకి పేరు తెస్తాయి. కథకి, సినిమాకి పేరులేకపోగా ఊరు కూడా లేకుండా చేస్తాయి.

నాటకంలో రచయిత కనబడకూడదన్నది లాక్షణిక నియమం. కాని సినిమాల్లో ఫలానా రచయితే యిలా రాస్తాడని, ప్రేక్షకులు డైలాగుల వెనక వున్న రచయితని తేలిగ్గా గుర్తు పట్టేస్తున్నారు. అంటే అక్షరాలా రచయిత ముద్ర కనబడుతోందన్నమాట. మాట నాటకీయంగా, మాటకీయంగా నడిస్తే కథా, పాత్రచిత్రణా మరుగున పడినట్లే. అయినా సమర్థుడయిన రచయిత అలాంటి పరిస్థితుల్లోనూ నెగుకు రాగలడు.

**ఆత్రేయత :**

'వెలుగునీడలు' చిత్రంలో_నాయికా నాయకులు షికారుకెళ్తారు. నిజానికి పాటకోసం కల్పించిన సన్నివేశం అది. ఆ కృత్రిమత్వాన్ని కనబడనీయని డైలాగులు రాశారు ఆచార్య ఆత్రేయ.

'ఏదీ నీ చెయ్యి'

'ఏం జోస్యం చెబుతారా'

'కాదు నిజం చెబుతాను'

ఇక్కడ జోస్యంమీద నమ్మకం లేంది రచయితకే కాని పాత్రక్కాదు. నాయకుడికి ఆ ప్రసక్తి అనవసరం. అయినా జోస్యం గురించి తన అభిప్రాయం చెప్పి 'ధనవంతులు ఒంటినిండా నగలు పెట్టుకుని ఆడంబరంగా వుంటారనీ, నాయిక చెయ్యి చిన్న రిస్టువాచ్‌తో చూడ ముచ్చటగా వున్నద'నీ ఉద్ఘోషిస్తాడు రచయిత. అక్కడ కష్టజీవుల గురించి చెబుతూ సామ్యవాద సంఘాన్ని సూచించే పాట వుంది. శృంగార వైరాగ్యాల మధ్య ఊగులాడే ఆ సన్నివేశంలో ఆ పాట అతకదు. అయినా రచయిత చాకచక్యంగా రాసిన ఆ మూడు మాటలూ ముచ్చటగా అతికి సన్నివేశాన్ని, పాత్రల్ని అసహజత్వంనించి రక్షించాయి.

**మాటజారితే...**

ఇలా పాత్రల్నీ కథనీ మించిన సంభాషణల రచన ఒకోసారే అతుకుతుంది. మాటలు పన్నడంలో ఆత్రేయ అవాక్కులు రాసిన సందర్భాలు కూడా లేకపోలేదు. ఆత్రేయ చాలా చిత్రాల్లో 'స్టేట్‌మెంట్ల' లాగా రాసే సంభాషణలు పాయసంలో మిరపకాయల్లా వుండిపోతాయి. మిరపకాయలు బావుండవా అంటే అది వేరే సంగతి!

రచయిత ముద్ర కనబడే సంభాషణల్లాగే 'సింబాలిక్'గా సాగే సంభాషణలు కూడా కథతో కలవకుండా తీర్థప్రసాదాల్లా విడివిడిగా వుండిపోతాయి. సినిమాల్లో సింబాలిజమ్ చిత్రీకరణలో వుండాలి కాని డైలాగ్‌లో కాదు.

**సంభాషణభూషణాలు :**

'బుకిష్‌డైలాగ్' కొంతవరకు నవలకు సరిపోతుంది గాని పాత్రల నోటివెంట వినాల్సిన సినిమాలకు పట్టదు. జూనియర్ సముద్రాల అంత్యప్రాసలతోను, అనుప్రాసలతోను ప్రతిసంభాషణ నడపటం వల్లనే 'గులేబకావళి కథ' కుంటినడక నడిచింది. ఆయనే 'జయసింహ' చిత్రంలో అంతరాలు

అంతఃపురాలలోనే అంతరించాయి. ఇక్కడ ఆంతర్యాలకే ప్రాధాన్యం' అని రాసిన డైలాగ్ పాండిత్యం మాటేసినట్టుంది నటుడికి కష్టాన్ని, సన్నివేశానికి నష్టాన్ని కలిగించింది. 'పెంకిపెళ్లాం' చిత్రంలో ఆరుద్ర అంత్యప్రాసలతో రాసిన డైలాగులు హాస్యాన్ని చిందించాయి గాని సన్నివేశాల్ని సాగటీశాయి. 'ఏకవీర' చిత్రానికి డాక్టర్. సి. నారాయణరెడ్డి రాసిన కవితాత్మకమైనసంభాషణలు కథాస్వభావానికి సరిపోయాయి కాని నటుల నోటిలో 'ప్రాజేయిక్' గా మారాయి. మల్లాది రామకృష్ణశాస్త్రి మాటలు కవితాత్మకంగా సాగినా కొంత శ్రుతి మించేవి, సన్నివేశాల్ని పెంచేవి. 'రక్తసంబంధం' చిత్రంలో ముళ్ళపూడి వెంకటరమణ రాసిన ఒకడైలాగ్ వచన కవితలా పదునుగా వుంటుంది. కార్మికుల్ని వెంటతీసుకువచ్చిన కార్మిక నాయకుడితో కథానాయకుడంటాడు. 'నువ్వు నీ జీవితానికి పునాదులు, వాళ్ళ పతనానికి గోతులు తవ్వుతున్నావు' అని. అలంకారికమైన డైలాగులు కూడా అక్కడక్కడా వుంటేనే అందగిస్తుంది. అంతటావుంటే కథ మందగిస్తుంది.

**రచయిత – సినిమా రచయిత :**

ఒకో రచయితలో వున్న ప్రత్యేకగుణం అతన్ని సినిమా రచయిత చేస్తుంది. కాని సినిమాలోకి వెళ్ళగానే తనప్రత్యేకత పూర్తిగా మరిచిపోయి రచనలారంభిస్తారు రచయితలు.

తను సాహిత్యరంగంలో సాధించిన రత్నాల్ని చేజారనివ్వక చిత్ర రంగంలోకూడా నిలబెట్టుకోగలిగినవాడు ముళ్ళపూడి వెంకటరమణ ఒక్కరే.

**రమణీయం :**

'బాలరాజు కథ' చిత్రంలో బుడుగువయసుపిల్లలు తల్లిలేని వాళ్ళయారు. తనకంటె చిన్నదైన చెల్లెల్ని ఓదారుస్తాడు అన్న.

'చూడు చెలాయ్! ఇకనించే నీకునేను తోడు. నాకు నువ్వుతోడు.'

'మన యిద్దరికీ ఎవరు తోడు!

'ఆ గుడిలో నిద్రపోతున్నాడే దేవుడు—ఆయనే మనకి తోడు.'

ఆ మాటకు జవాబుగా పసిమనసును వ్యక్తం చేశారు రమణ.

'అలాగా పాపం! ఆయనకి తెలుసో లేదో? లేపి చెబుదామా?'

'ఇప్పుడొద్దమ్మా! మనలాగ ఎందరో పిల్లలకు అన్నం తినిపించి అలసిపోయి పడుకున్నాడూ – లేపకూడదు.'

నా నాలుగు మాటల్లో పసితనం వుంది. లేతమాటలలో రచయిత ప్రౌఢత్వం కనబడుతుంది.

**దేవ (య్య) భాష :**

అమ్మచాటున పెరిగి, ఆవిడ చెప్పుచేతల్లో తిరిగేవాళ్లు ఎలా తయారవుతారో గమనించి 'దాగుడుమూతలు' చిత్రంలో పాపాయి పాత్రని సృష్టించారు రవణ. పాపాయి మాట్లాడే ప్రతిమాటా లోకజ్ఞానం లేకుండా పెరిగినవారిమీద సెటైర్. అదేకాక వ్యవహారభాషాజ్ఞానం లేనివారు ఎలా మాట్లాడతారో, కృతకమైన భాష ఎలా రాస్తారో అదికూడా ఆ పాత్రకు రాసిన మాటలద్వారా నిరూపించాడు రచయిత.

'తాతయ్యలకు బోల్డు ఆస్తి వుండును. దానిని వాళ్లు మనుమలకు ఇచ్చెదరు. అంతవరకు మనము అమ్మడిని పెళ్ళి చేసుకోరాదు అని అమ్మ చెప్పును.'

'ఏమోనమ్మా నాకదంతా తెలీదు. అనగనగా ఒక దొంగవిల్లు. అందువల్ల అమ్మకి నాన్నకి జేలు.'

**కరణీకులం :**

'సాక్షి' చిత్రంలో ఒక సన్నివేశంలో మాటలు పల్లెటూరి మనుషుల లోతుమాటల్ని ధ్వనిస్తాయి.

కృష్ణని సాక్ష్యానికి ఒప్పించటానికి కరణం మునసబులు కుట్రచేశారు. ఆ హత్యాపరాధంనించి మునసబును బైటపడేసే 'బిస' కరణం దగ్గరుంది. కరణం బంజరుభూమికోసం కొన్ని దశాబ్దాలుగా అడుగుతున్నా మునసబు 'ఊ ఆ' అనడంలేదు. కుయుక్తులకి, దొంకతిరుగుడు మాటలకి పేరుబడ్డకరణం ఆ సంఘటనని తన స్వార్థానికి వినియోగించుకున్నాడు.

కరణం : ఆ(: అంతే, నీ కెందుకురా భయం ! రేపు కోర్టులో ఖూనీ ఎక్కడ ఎలా ఎవరికోసం జరిగిందీ ఉన్నదున్నట్టు చెప్పేసెయ్. ఒకేళ నీ బుర్ర బంజరు పత్రయితే నన్నడుగు-నే చెప్తా.

ఖూనీ మునసబు తోటలో మునసబు మనుషులవల్ల మునసబుగారికోసం జరిగింది. 'ఎక్కడ ఎలా ఎవరికోసం' అన్న పదాలు మునసబు గుండెల్లో గునపాల్లా దిగితే 'బంజరుపత్ర' పిడుగులా పడింది. బంజరుభూమి యిస్తానంటే పోతే కరణం పట్టు వదల్డు.

అక్కడ సంభాషణలు చూడండి :

మునసబు ; అయ్యా ! మీ కిది తగదు. మీయిష్టం అన్నానుగా.
కరణం : దేవుడు సాక్షి ! ఒరే అబ్బాయ్! (కరణం కొడుకు ముందుకొస్తాడు)
క. కొడుకు : నమస్కారమండీ ! మీకలవైతే రేపణ్ణించీ లాయకి చేసుకుంటా
నండి. మంచిరోజు కూడా.

ఈ డైలాగుల్లో బంజరుభూమి కరణం అడిగినట్టు, మునసబు యిస్తానన్నట్టు అక్కడున్నవాళ్లెవరికీ తెలీదు వాళ్ళిద్దరికితప్ప.

రవణ రాసే డైలాగులు పాత్రని సన్నివేశాన్ని, వాతావరణాన్ని-వ్యక్తం చేస్తాయి. ప్రతిమాటా పాత్ర సాంఘిక, శారీరక, మానసికతత్వాలను బయట పెడతాయి. వీటితోపాటు ప్రతిచిత్రంలోను సాంఘికంగా, సాహిత్యకంగా వుండే దురాచారాలను పారకీ చెయ్యడం, విమర్శించడం రవణకలవాటు. మాటల రచనలో రవణ పర్ఫెక్షన్ సాధించారు.

**మంచి మాట :**

పాత్రల సంఘర్షణనించి సంభాషణలు పుట్టుకురావాలి. పాత్రల ముక్కోణాలను అంటే శారీరక, సాంఘిక, మానసిక తత్వాలను సంభాషణలు బహిర్గతం చెయ్యాలి. సంభాషణ గతకథను ధ్వనించాలి. రాబోయే సంఘటనలను సూచించాలి. క్లుప్తత వుండాలి. భాష పాత్రోచితంగా పాత్రస్థాయికి, వృత్తికి తగినట్లుండాలి. పాత్రలు తమగురించి తాము చెప్పుకోకూడదు. చెప్పిందే చెప్పకూడదు. కథకు నీతి వుండాల్సినమాట నిజమే కాని సంభాషణలు నీతుల్ని ఉపన్యసించకూడదు. సంభాషణలు చిత్రంలో భాగం కావాలే గాని ప్రధానం కారాదు. చిత్రీకరించాల్సిన విషయం డైలాగ్‌లో చెప్పకూడదు. ఈ లక్షణాలు కనబడితే సినిమా బావుంటుంది. 'డైలాగులు బావున్నాయిరా' అంటే మాత్రం డైలాగులు బావుండనట్లే లెక్క.

**అయిదూ అయిదూ :**

పై లక్షణాలన్నీ పోగుపడినట్లు మాటబాటలు వేసిన రత్నాల్లాంటి చిత్రాలు పది చెబుతాను.

పల్లెటూరు, రాజూ - పేద, బంగారుపాప, పెద్దమనుషులు, మాయా బజారు, ఇల్లరికం, బాటసారి, మూగమనసులు, వివాహబంధం, సాక్షి.

పాతికేళ్ళ చిత్రచరిత్రలో పదికాలాలపాటు నిలువగల సాహిత్యగంధం గుబాళించిన చిత్రాలు ఈ పదే.

**మాటకారులు :**

సుంకర–వాసిరెడ్డి, పినిసెట్టి, పాలగుమ్మి, నరసరాజు, పింగళి, ఆరుద్ర, సీనియర్ సముద్రాల, ఆత్రేయ–ముళ్ళపూడి, అట్లూరి పిచ్చేశ్వరరావు, ముళ్ళపూడి వెంకటరమణ ఆ పది చిత్రాల రచయితలు.

**చివరిమాట :**

మాటలు రాయటం మాటలుకాదు. చిత్రాల్లో సన్నివేశాలకు సంభాషణలు రాయటం కన్నా రాయకుండా వుండటమే గొప్పవిషయం.

'సెల్యులాయిడ్' రహస్యం తెలిసిన రచయితలు రాయని భాస్కరుల్లాటివారు.



''సాహిత్యప్రియులకు కావలసింది రసం. రసం అన్నది వాక్య నిర్మాణంలో పొటమరిస్తుంది. గాని శబ్దరూపాల్లోనూ, క్రియా రూపాల్లోనూ కాదుమరి. వ్యావహారికంలో అయితే రచన నీరసం అవుతుందనుకోడమూ, గ్రాంథికం అయితేచాలు రసమహితం అయిపోతుందనుకోడమూ రెండు నిదర్శనాలు. గ్రాంథికమే వ్యాకరణయుక్తం అయివుంటుందనీ, వ్యావహారికం వ్యాకరణ దూరం అనీ అనుకోడం అవివేకానికి మూడో నిదర్శనం.''

—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# తెలుగు సాహిత్యంలో సెక్సు

శ్రీ రాంషా

రసానికి శృంగారమే రాజు. ఆత్మీయానుబంధాలన్నీ శృంగారాన్నే ఆశ్రయించుకుని ఉన్నాయి.

శృంగారమే సెక్సు. శృంగారం వ్యక్తుల్ని సంపుటీకరిస్తుంది. సమాజాన్ని సంక్షోభవిస్తుంది. సంఘానికి ధర్మాన్నీ, అర్థాన్నీ కల్పిస్తుంది. అధర్మాన్నీ, అనర్థాన్నీ తరిమికొడుతుంది.

ద్వేషం మనుషుల్ని విడగొడుతుంది. ప్రతిఒకరిచుట్టూ దుర్భేద్యమైన వలయాన్ని కల్పిస్తుంది. అప్పుడు సంఘం ఎలా ఏర్పడుతుంది? సృష్టి ఎలా సాగుతుంది? శుభస్థితి ఎలా ఉంటుంది?

కనుక సమాజం ఏర్పడాలంటే కుటుంబం ఏర్పడాలి. కుటుంబం ఏర్పడాలంటే కామంవర్ధిల్లాలి!

ఆ దృష్టితోనే శృంగారాన్ని రసరాజన్నారు. శృంగారం ప్రాణుల దైహికసంబంధాన్ని ఉదాత్తీకరిస్తుంది. ఆనందాన్ని పర్యవశింప జేస్తుంది.

మన ప్రబంధాలు ఈ ఉదాత్తప్రయోజనంతోనే వెలువడ్డాయి. దానికి ఉదాత్తుడైన పురుషుడు నాయకుడు. ఉదాత్తురాలైనస్త్రీ నాయిక. వారిసంబంధం ఉదాత్తమైనది.

క్షుద్రులైన నాయికా నాయకులు కథావస్తువుగా ఎందుకుండకూడదు?— ఇదొక విమర్శ.

ఉండరాదన్న నిషేధంలేదు. కాని, దాని పర్యవసానమేమిటి? క్షుద్రత్వమేకదా! ఉష్ణం ఉష్ణం చ శీతలం అయినట్లు క్షుద్రం క్షుద్రంచ ఉత్తమం కాదు.

ప్రబంధ సాహిత్యంలో కనిపించే శృంగారం కేవలం ఆంధ్రజాతికే పరిమితమైనది కాదు. అది కాలానుగుణమైనది. అదేకాలపు ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ సాహిత్యాలలో కూడా ఆ రకం శృంగారమే కనిపిస్తుంది. అది 'మోటు'గా కనిపిస్తుంది.

బలీయమైన ప్రేమయే కామం. కామంలో ఉన్న ఫోర్సు (Force) ప్రేమలో లేదు. కనుక కామం 'మోటు'గా ఉండకతప్పదు.

మరో విమర్శ: మన ప్రబంధాలలో స్త్రీకి సంబంధించిన వర్ణనలే ఎక్కువగా ఎందుకు కనిపిస్తున్నాయి? పురుషుల అంగాంగ వర్ణన లెందుకు కనిపించవు?

మా సమాధానం: వ్రాసింది పురుషులు గనుక, స్త్రీలు కాదు గనుక!

స్త్రీలు సహజంగా కోమలస్వభావలు! ప్రకృతిసిద్ధంగా వారు గ్రహీతలే

గాని, కర్తలుకారు. కర్తృత్వం పురుషప్రకృతియై ఉంది. మహోజ్జ్వలమైన కామం విజృంభిస్తేగాని పురుషుడు కర్తకాలేడు. స్త్రీలో కామం సహజంకాదు. కృతకం. పురుషకృతమై అంకురించవలసిందే! అందుకే ఆకర్షక విధానాలను స్త్రీలకు, ప్రేరణవిధానాలను పురుషులకూ కామశాస్త్రం చెపుతున్నది. ప్రపంచాలలో 'మోటు' తనానికి సహజమైన హేతువిదే.

అటీగాక ఆమోటుతనం కాలానుగుణమైనది. ఆనాటి మనుష్యులు తిండి పుష్టికలవారు. కనుక భోజనప్రియులు. కండపుష్టికలవారు – కనుక యుద్ధంలో వీరులు! నరాలదౌర్బల్యం ఎఱుగనివారు – కనుక స్మరరంగంలోనూ వీరులే.

కండపుష్టీ, తిండిపుష్టీలేని, నరాల దౌర్బల్యం గల ఈ జాతికి వారు మోటుగానే కనిపిస్తారు. వారి భావోద్వేగం కూడా మోటుగానే కనిపిస్తుంది.

దానిపై తిరుగుబాటు చేసింది భావకవిత్వం. నాయిక స్థానంలో హృదయేశ్వరి అవతరించింది. అంగాంగ శృంగారం స్థాయిలో ఆరాధన ఉద్భవించింది. కృష్ణశాస్త్రి, వేదుల, నాయని, నండూరివంటివారు దీని ప్రచారకులు. కామంస్థానంలో నిర్వీర్యమైన ప్రేమ ప్రతిష్ఠించబడింది. స్త్రీ ఈ సామాజికులకు ఆరాధ్యవస్తువు. స్త్రీ ఔన్నత్యాన్ని వీరు కీర్తించి, పురుషప్రపంచపు దౌర్జన్యాన్ని ఈ కవులు ఖండించారు.

"నాకతినపాదశిలలక్రింద పడి నలిగిపోయె నెన్నియో పూలు మున్ను...." వంటి రోదన కావ్యాలు చెలరేగాయి!

పర్యవసానంగా ప్రబంధయుగాంతానికి భోజ్యవస్తువుగా మారిన స్త్రీ, భావకవితాయుగంలో ఆరాధ్యదేవతగా ప్రతిష్ఠింపబడిన స్త్రీ చైతన్యవంతమై కామంలో తన భాగాన్ని తాను కూడా సమంగా అనుభవించేహక్కును నిలదీసి ప్రశ్నించడం ప్రారంభించింది. దానితో కవిత్వం కరిగిపోయి, రాజకీయాల తెరమరుగుల్లో ఆశ్రయం పొందసాగింది.

స్త్రీలో ఈ మేల్కొల్పుకు కారకుడు చలం. హేవలాక్ఎల్లీస్, సిగ్మండ్ ఫ్రాయిడ్, కిన్సే, మాష్టర్, హిల్‌వంటి సైకాలజిస్టులు, సెక్సాలజిస్టులు ఈ రంగంలో చేసిన పరిశోధనలప్రభావం పురుషుని నపుంసకత్వపు ప్రేమను ఖండించి, దాంపత్య సామరస్యానికి అవసరమైన కామశాస్త్ర విజ్ఞానికి ప్రవేశాన్నిచ్చింది.

ప్రబంధకాలంలో కవిత్వమూ సెక్సూ దంపతులు. భావకవులకాలంలో వాటికి విడాకులయ్యాయి. కనుక ఆధునిక కథాసాహిత్యం సెక్సు విజ్ఞానానికి ఆశ్రయమిచ్చింది. రాచకొండ, ముప్పాళ్ళ–ఈరకం ఉదాత్త సాహిత్యానికి తలమానికాలయ్యారు. ఈసారి సెక్సు, కథాసాహిత్యాన్ని మళ్ళీ పెళ్ళి చేసుకొని సుఖంగా కాపురం చేస్తోంది.




## మహతి

# ప్రభావం

## స్వాతంత్ర్యయుగోదయంలో
## * సారస్వతం * సమాజం
## పరస్పర ప్రభావం

| | | |
|---|---|---|
| గాంధీవాదం | – | శ్రీమతి యలమంచి తాయారు |
| సామ్యవాదం | – | శ్రీ ఏటుకూరు బలరామమూర్తి |
| రాజకీయాలు | – | శ్రీ కపిల కాశీపతి |
| లలిత కళలు | – | శ్రీ సంజీవదేవ్ |
| సంస్కృత సాహిత్యం | – | డా. పుల్లెల శ్రీరామచంద్రుడు |
| తెలుగు - ఉర్దూభాషా సాహిత్యాలు | – | డా. కె. గోపాలకృష్ణరావు |
| యువతరం - కవిత | – | శ్రీ ముకురాల రామారెడ్డి |
| ప్రచార సాహిత్యం | – | శ్రీ కొత్తపల్లి సుబ్రహ్మణ్యం |
| అకాడమీలు - పరిషత్తులు | – | శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి |
| రచయితల సంఘాలు | – | శ్రీ పోతుకూచి సాంబశివరావు |
| సాహిత్య సదస్సులు - సమావేశాలు | – | శ్రీ సురమౌళి |
| యువతరం | – | కుమారి సగరం ఉమ |
| విద్యార్థిలోకం | – | శ్రీ నాగినేని భాస్కరరావు |
| మహిళాలోకం | – | శ్రీమతి పవని నిర్మల ప్రభావతి |
| పాఠకలోకం | – | శ్రీ వంగపల్లి విశ్వనాథం |
| తెలుగు సాహిత్య పత్రికలు | – | శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయశాస్త్రి |
| దినపత్రికలు - వారపత్రికలు | – | శ్రీ యస్. వెంకటేశ్వరరావు |
| గ్రంథాలయాలు - 1 | – | శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య |
| గ్రంథాలయాలు – 2 | – | శ్రీ వెలగా వెంకటప్పయ్య |
| ముద్రణకళ | – | శ్రీ తెన్నేటి అచ్యుతరామయ్య |
| ఉద్యోగుల సంఘాలు | – | శ్రీ ఎ. శ్రీరాములు |
| తెలుగువారి తీరని సమస్యలు | – | శ్రీ ఎన్. శ్రీనివాసు |
| జాతీయ సమైక్యభావం | – | శ్రీ ఎన్. ఇన్నయ్య |

# గాంధీవాదం

శ్రీమతి యలమంచి తాయారు

సమాజాన్ని ప్రభావితంచేసే చారిత్రక సంఘటనలు జరుగుతాయి. ఈ సంఘటనలకు నాయకత్వం వహించినవారు చారిత్రక నాయకులుగా ప్రసిద్ధికెక్కుతారు. వీరి ఆదర్శాలు, వీరి చిత్తశుద్ధి, వీరి దేశభక్తి సమాజాన్నెంతగానో ప్రభావితం చేస్తాయి. వీరిని యుగపురుషులుగా కీర్తిస్తుంది లోకం.

బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు మొదలైనవారిని యుగపురుషులుగా గుర్తించింది ప్రపంచం. అలాగే మహాత్మా గాంధీని కూడా యుగపురుషుడుగా కీర్తించింది. మహాత్మా అని రవీంద్రుడు చేసిన సంబోధన విశ్వమంతటా మార్మోగింది గాంధీ ఆదర్శాలు ఒకయిజంగా చలామణి అవుతూ వచ్చాయి.

స్వాతంత్ర్యపోరాటం నాటి చారిత్రకదశ గాంధీని మహాత్మా గాంధీగా సృష్టించింది. దక్షిణాఫ్రికాలో జాతివివక్షతకు వ్యతిరేకంగా గాంధీజీ ప్రారంభించిన సత్యాహింసలపోరాటం భారతస్వాతంత్ర్యోద్యమంలో పరాకాష్ఠనందుకుంది. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంతో ఆ సామ్రాజ్యపు వలసతృష్ణతో దాని మారణాయుధసంపత్తితో భారతీయులు పోరాటం సాగించాలంటే సత్యాగ్రహ పోరాటం అవసరం అయ్యింది ఆనాటికి. జైళ్ళకు, లాఠీలకు ప్రజలు భయపడరు. మారణాయుధాలతో, దారుణ హత్యాకాండతో స్వాతంత్ర్య పోరాటాలను నెత్తుటి ఏఱులలో ముంచివేయగల శక్తి బ్రిటిష్‌ప్రభుత్వానికి వుంది. అందుకే గాంధీజీ 'ఇంగ్లీషువారు మన పోరాటాన్ని శతఘ్నుల, మరఫిరంగుల యుద్ధభూమికి గొనిపోవాలనుకుంటున్నారు. ఎందుకంటే తమవద్ద కొల్లలుగా వున్న ఆ మారణాయుధాలను వారు ప్రయోగించగలరు. కాని, మనమెన్నుకున్న సమరభూమి వేరు. అక్కడనుండి మనము పోరాడే ఆయుధాలు ఇంగ్లీషువారి వద్ద లేవు" అన్నారు.

అహింసను ఆయన పశుప్రవృత్తిపై విజయంసాధించే మనుష్యధర్మంపై స్వీకరించటం జరిగింది. "నిజమైన అహింస భయంతో కాక ప్రేమనుండి జనిస్తుంది. నిస్సహాయతనుండి కాక సామర్థ్యంనుండి ఉత్పన్నం అవుతుంది. క్రోధము, ద్వేషము, నిస్సహాయత మొదలైన అవలక్షణాలతో ప్రేరేపించబడని క్షమాశక్తిముందు ఎంత గొప్ప శక్తియైనా లొంగవలసి వస్తుంది" అని

ఆయన నమ్మారు. తన ప్రతికక్షిని మిత్రునిగా భావించి ప్రేమించారు. అందుకే ఆయన సత్యాగ్రహులకు తమశత్రువుని కించపరచి అవమానపరచేదృష్టితో సత్యాగ్రహము సాధించరాదని బోధించారు. ఇలా తన ప్రతికక్షులలో హృదయ పరివర్తన తేవాలనేది ఆయన సిద్ధాంతం. సామాజిక, ఆర్థిక విధానాలకు చెందిన మార్పులలో ఈ గాంధీజీ ప్రతిపాదించిన హృదయ పరివర్తనా సిద్ధాంతం పూర్తిగా విఫలమైంది. గాంధీజీ అనుచరులే గాంధీసిద్ధాంతాలను స్వప్రయోజనాలకు రక్షకవచంగా వాడుకుంటూ వచ్చారు. తన ఆశీర్వాదంకోసం వచ్చిన మంత్రివర్యులకు ఆయన ఎనిమిదిసూత్రాలు చెప్పారు తప్పనిసరిగా పాటించమని. 1. మంత్రులు అస్పృశ్యత, పక్షపాతం, కుల, మత భేదాలు–వీటన్నింటికీ దూరంగా ఉండాలి. 2. మంత్రుల వ్యక్తిగతజీవితం నిరాడంబరంగా వుండాలి, రోజు కొకగంటైనా వారు రాట్నం వడకటమో, కూరగాయలు పండించటమో, పాకీపని చేయటమో చెయ్యాలి. 3. మంత్రులు బంగళాలలో ఉండకూడదు. వారికి కారులు ఉండకూడదు. అతిముఖ్యమైన అవసరాలకు కారులు వాడుకోవచ్చు. 4. మంత్రులు నౌకర్లను పెట్టుకోకూడదు. 5. మంత్రులు విదేశీ ఫర్నిచరు, సోఫాలు మొదలైనవాటిని ప్రజలు ఎదుర్కొంటున్న ఆర్థికస్థితి దృష్ట్యా ఉపయోగించకూడదు. 6. మంత్రులకు వ్యసనా లేవీ ఉండకూడదు. వారు ప్రజలకు ఆదర్శంగా ఉండాలి. 7. మంత్రులు, మంత్రుల కుటుంబ సభ్యులు ఖాదీ ధరించాలి. 8. అంతరంగికభాషణలో మంత్రులు ప్రాంతీయభాష నుపయోగించాలి. అధికార కార్యకలాపాలకు హిందుస్తానీ వుపయోగించాలి. ప్రభుత్వ ఉత్తర్వులన్నీ హిందుస్తానీలో ఉండాలి.

ఇవన్నీ చెపుతూ గాంధీజీ మరొకమాట కూడా అన్నారు. "నాది అరణ్య రోదనంగానే మిగిలిపోవచ్చు. కాని, ఈనాడు నాచుట్టూ జరుగుతున్న వాటి నన్నిటినీ చూస్తూ అసమ్మతి తెలియజేయకుండా వుండలేను." (కోడూరి శ్రీరామమూర్తిగారి గాంధీజీ జీవితగాథావళి నుండి).

గాంధీజీ ఎదుటనే మంత్రివర్గాలు ఏర్పడినవెంటనే కాంగ్రెసు సంస్థ ప్రాబల్యాన్ని గాంధీజీ ఆదర్శాలను స్వంతస్వార్థాలకు మంత్రులు వాడుకోవటం గమనించిన గాంధీజీ తమ ఆవేదనను పైవిధంగా వెళ్ళబుచ్చుకున్నారు. అందుకే స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసుసంస్థను రద్దుచేయవలసిందిగా కూడా ఆదేశించారు.

24 సంవత్సరాల కాంగ్రెసు పరిపాలనలో గాంధీ ఆదర్శాలపేరిట 'సోష

లిజం' నినాదాల పేరిట ఏమి జరిగినదో ప్రజలందరికి తెలిసిన విషయమే. ఆశ్రిత పక్షపాతం, అవినీతి, అట్టహాసాలు, అక్రమాలు, అధికారదుర్వినియోగం-అన్ని అవలక్షణాలకు ఆటపట్టులుగా ఉన్నాయి కాంగ్రెసు మంత్రివర్గాలు. వీరు పాలించిన "రామరాజ్య" "శ్రేయోరాజ్య" రజతోత్సవాలు జరుపుకో బోతున్న శుభతరుణం ఇది. సుప్రసిద్ధ కవి గాంధీవాది అయిన "తెనుగులెంక" తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు గాంధీజీ శతజయంతి సందర్భంలో యిలా విన్నవించుకుంటారు.

'దిక్కూ మొక్కూ లేని కుగ్రామము లివి
నీ విక్కడికే విచ్చేసెద వనుకొనలేదు
కాకున్న ఇంతకంటె ఘనమైన సత్కారమే
చేకూరియుండెడిది నీకు.

భక్తి కావలసినంత కలదు కాని
భవదుపదిష్టధర్మాచరణముపట్ల
శక్తియే కొఱవడినది మాకు బాపూ!
రానురా నీ లోకము నిన్నొక
రాతిబొమ్మను జేసి
గుడి కట్టించి కూర్చుంత బెట్టదు గదా!

పరాస్తమగుగాక! పాపము
నిరస్తముగుగాక తంత్రము
ఉన్న గుళ్ళగోపురాలు చాలు
ఊరికి నాలుగైదు
నీ వుండదగినది గుడి కాదు
ఎడద.
నీ కర్పించదగినది నీరాజనం కాదు
జీవనం!''

అలాగే డా. సి. నారాయణరెడ్డిగారు—
''ఇదొక విచిత్ర విషవలయం
వెన్నెల దుస్తుల్లో వీధుల్లో ఊరేగే
అమావాస్యలకు ఆనందనిలయం
నీపేరు జపించని కొరత్కర లేదు
ఆపైన ననేమీ అక్కరలేదు.

పట్నం గడిస్తే సరి
పాపాలపుట్టల వోళ్ళలో
ఓపినన్నిపాలు పోస్తే సరి
పదితరాలకు తరగని పుణ్యం పండుతుంది
లోకం మట్టి గొట్టుకు పోయినా
లోగిట్లో ముక్కారుధాన్యం నిండుతుంది.'' అన్నారు.

గాంధీజీ సిద్ధాంతాలు ఆయన అనుచరుల పరిపాలనా కాలంలో ఎలా వుల్లంఘించబడినవో ఎలాంటి అవ్యవస్థ తాండవ మాడుతున్నదో పైగేయాలు మనకు తేటతెల్లం చేస్తున్నవి. కులం ప్రభావం, మతంప్రభావం కలిసి రాజ్యమేలుతున్న రోజు లివి. అందుకే గాంధీజీ ఏనాడో అన్నారు.

"నన్ను బ్రతికుండగానే సమాధి చెయ్యలేదనే ఆశతో వుంటాను. నా ఆదర్శాలలో ప్రజానీకానికి విశ్వాసం సడలలేదనే నా ఆశ ప్రజలవిశ్వాసం కోల్పోయినట్లు ధృవపడినపక్షంలో అవి అంతరించనట్లే జమ. ఆ నాడు నన్ను సజీవంగా సమాధిచేశారనే చెప్పవచ్చు. కాని, నేను ఏకాకినై సుదూరంగా నిలబడినప్పటికి నావిశ్వాసం ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నంతకాలం నా సమాధిలో నేను సజీవంగా వుంటాను. అక్కడినుండే ప్రసంగిస్తుంటాను."

అంటే ఆయన బ్రతికివున్నప్పుడే ఆయన ఆదర్శాలను ఆయన అనుచరులే సమాధి చెయ్యగలరనే విషయం ఆయన పసిగట్టినట్లే మన కర్థమౌతుంది. "బ్రిటిష్‌పాలనాఫలితంగా ధనవంతులు, కర్మాగార యజమానులు, భూవసతులుగల కామందులు ఇత్యాది వర్గాలవారి స్వార్థాలే అహింసా సిద్ధాంత పంథాకు పెద్ద ఆటంకాలుగాఉన్నాయి. వీరందరూ ప్రజలరక్తాన్ని పీల్చి బ్రతుకుతున్నామని సాధారణంగా గ్రహించటంలేదు. ఒకవేళ గ్రహించినప్పటికీ బ్రిటిష్‌వారివలెనే వారి కీలుబొమ్మలుగా ఈవర్గాలవారు కూడా నిర్లక్ష్యంగా ప్రవర్తించుతుంటారు. రక్తసిక్తధనలాభాలను వారు విసర్జించినట్లైతే అహింసాసమరం విజయవంతమౌతుంది. బ్రిటిష్ అధికారులలోవలె ఈ వర్గాల ప్రముఖుల యెడ ఒర్పు వహించాలనేది అహింసాసిద్ధాంతం. వాళ్ళల్లో మార్పుతీసుకు రావాలనేదే ఈ అహింసా సిద్ధాంత ప్రధానోద్దేశ్యం" అంటారు గాంధీజీ.

తన ఆధ్యాత్మిక సిద్ధాంతాలకు, ఆర్థిక, రాజకీయ పోరాటాలకు ముడిపెట్టి యిలా వర్గసామరస్య ధోరణిని ప్రతిపాదించారు ఆయన. గోవులకు రక్షణగా పెద్దపులులనువుంచి, వాటిలో హృదయ పరివర్తన సాధించటం ఎంత అసాధ్యమో

అలాగే పీడిత ప్రజలను దోపిడీ చేస్తున్న ధనస్వామ్య వర్గంలో హృదయపరివర్తన తేవటం కూడా అంతఅసంభవం. బహుశా యిది కూడా గాంధీజీ వూహించినట్లే వున్నారు. అందుకే ఆయన మరొకచోట "ధనికులకు, కోట్లాది క్షుద్బాధితులకు నడుమ అంతరాయం ఉన్నంతకాలం అహింసాయుత విధాన ప్రభుత్వం అసాధ్యమనే విషయం సుస్పష్టమే. ధనికవర్గం ఏ అధికారాన్ని నిర్వహించుతోందో బీదప్రజలు కూడా అదే అధికారాన్ని అనుభవించగల స్వేచ్ఛ భారతదేశంలో రావాలి. ఢిల్లీలోని మహా భవనాలు, వాటిని ఆనుకొనే వున్న పేదప్రజల దుర్భరమైన పూరిగుడిసెలమధ్య వున్న వ్యత్యాసం ఒక రోజు కూడా కొనసాగజాలదు. ధనికులు తమ కున్న భాగ్యాల్ని తద్వారా లభించిన అధికారాన్ని వదులుకొనేందుకు సమిష్టిశ్రేయస్సుకొఱకు పాటుపడేందుకు సిద్ధం కాకపోతే, హింసాయుత విప్లవం ఏదోఒకరోజు రాక తప్పదు" అని అన్నారు.

అదే నేడు జరిగింది. గాంధీజీ ఆదర్శాలను ఆయన అనుచరులు రాజఘాట్‌లో ఆయనతోపాటే సమాధి చేశారు. గాంధీజీ వూహించినట్లుగానే గాంధీయిజం నుండి నక్సలిజానికి భారతదేశం మళ్ళవలసి వచ్చినది. సామాజిక, ఆర్థిక మార్పులకోసం గాంధీజీ చెప్పిన ధనికస్వామ్యపు "రక్తసిక్తలాభా"ల నుండి పీడితప్రజలను విముక్తి చేయటంకోసం వుడుకురక్తంతో వురకలెత్తుతున్న యువత నక్సలిజాన్ని చేపట్టింది. వ్యక్తి హింసాకాండ ప్రారంభించి ధనస్వామ్యాన్ని భయభ్రాంతంచేసి సాయుధ పోరాటం సాగించాలనుకుంటోంది. ఈ పరిణామాలకు బాధ్యులు గాంధీజీ అనుచరులే. నక్సలిజాన్ని రక్తపాతవిప్లవమని, అరాచకశక్తుల విజృంభణమని నిందించే హక్కు వారికి లేదు. రెండు దశాబ్దాలకు పైగా వేచిచూసిన సామాజిక, ఆర్థిక మార్పులు కనుచూపు మేరలో కనుపించకపోయేసరికి, (తప్పుదారిని పట్టించేపైనప్పటికి) యిలాంటి వ్యక్తి హింసాకాండతో కూడిన సాయుధపోరాటలు ప్రారంభమయ్యాయి.

ఒకనాడు గాంధీజీ స్వాతంత్ర్య పోరాటానికి తన సిద్ధాంతాలద్వారాభారతీయులనందర్నీ సమీకరించి ప్రభావితం చేయగలిగారు. నాలుగు గోడల మధ్య జీవిస్తున్న స్త్రీలనుకూడా రాజకీయపోరాటంలోనికి ఆయన తీసుకొని వచ్చారు. అంగవస్త్రం కట్టిన ఒక సామాన్యభారతీయుడు ప్రపంచంలోని అతిశక్తివంతమైన బ్రిటిష్ సామ్రాజ్యంతో రౌండుటేబుల్ సమావేశంలో సంభాషణలు జరపడం ప్రపంచాన్ని ఆశ్చర్యంలోను, ఆసక్తిలోను ముంచెత్తింది. ఈప్రభావంలో

గాంధీజీ వ్యక్తినిష్ఠ ప్రధాన పాత్ర వహించింది. ఇదే గాంధీయుగానికి ప్రాతిపదిక అయ్యింది. భారతీయ సంస్కృతిలో కాని, తదితర మతధర్మసూక్తులలో కాని చెప్పబడిన ఆదర్శాలనే గాంధీజీ వ్యక్తిగతంగా కాక సామాజికంగా, సామూహికంగా ఆచరణవంతం చెయ్యాలని ప్రయత్నించటం జరిగింది. అందుకే ఆయన అంటారు–'గాంధీయిజం అంటూ ఏమీలేదు. నాదంటూ ఒకసిద్ధాంతాన్ని ఈ ప్రపంచాని కిచ్చే వుద్దేశ్యం నాకు లేదు. ఏ క్రొత్త సిద్ధాంతాన్ని నేను కనుగొనలేదు. సర్వకాలీనమైన సత్యాలను మన దైనందిన జీవితంలో వుపయుక్తమయ్యేలా నేను చెయ్యటానికి ప్రయత్నించాను. నాకున్న అభిప్రాయాలు, నేను తీసుకున్న నిర్ణయాలూ చిట్టచివరివి కావు. వాటిని నేను రేపు మార్చుకొనవచ్చును. ప్రపంచానికి నేను చెప్పిన క్రొత్త విషయాలేమీలేవు. సత్యమూ, అహింసా అనేవి అత్యంత పురాతనమైనవి. నేను చేసిందల్లా వాటిని భారీ ఎత్తున వుపయోగించటానికి ప్రయత్నించటమే. ఈ ప్రయోగాలు చెయ్యటంలో నేను కొన్నితప్పులు చేశాను. నా తప్పులు తెలుసుకొన్నాను. నేను చెప్పిన విషయాలలోని సారమంతా యింతే. దానిని మీరు గాంధీయిజం అనలేరు. అలాంటి యిజం ఏదీ లేదు."

గాంధీజీ ఏమి చెప్పినా గాంధీయిజంగా ఆయన ఆదర్శాలకి చెలామణి రావటం జరిగింది. ఈ గాంధీవాద ప్రభావం స్వాతంత్ర్య యుగోదయంలో అంటే 1947 నుండి 72 వరకు సమాజం మీద ఎలా వున్నదీ, అది సాహిత్యం మీద ఎలా ప్రతిఫలించుచున్నదీ అనేప్రశ్న వుంది.

సాహిత్యమూ, సమాజమూ బింబ, ప్రతిబింబాలు. అద్దంలో ముఖం చూచుకొన్నట్లుగా సమాజాన్ని సాహిత్యంలో చూడవచ్చు. ప్రధానంగా సమకాలీనఆర్థికప్రభావం సమాజంమీద, సాహిత్యంమీదా గాఢంగా వుంటుంది. ఇదే ప్రధానచోదకశక్తిగా వుంటుంది.

వేదకాలంనాటి ఈ చోదకశక్తి వేరు. మధ్యయుగాలనాడు వేరు. అలాగే స్వాతంత్ర్యపోరాటంనాటి వలసపీడనకు వ్యతిరేకంగా జాతీయవిముక్తి పోరాటదశ వేరు. ఈదశలో గాంధీవాదం ప్రధానచోదకశక్తిగా పనిచేసింది. అందుకే సమాజం మొత్తం ప్రభావితం అయ్యింది. విదేశీవస్తు బహిష్కరణ, స్వదేశీ ఉద్యమం ప్రతిఒక్కరిని ఆకర్షించాయి. ఇది ఆనాటి సాహిత్యంమీద బలీయమైన ప్రభావాన్ని కల్గించింది. "కొల్లాయికట్టితేనేమి? మాగాంధి కోమటై పుట్టితేనేమి?" పండితపామరులందరు ముక్తకంఠంతో పాడారు. ఉన్నవవారి

"మాలపల్లి" లాంటి ఉత్తమోత్తమైన నవల తెలుగుభాష కొక మణిపూసగా వెలిసింది. ఆనాటి సాహితీస్రష్టలందరిపైనా గాంధీ ఆదర్శాల ప్రభావం గాఢంగా ప్రతిబింబించింది. "మాలపిల్ల" లాంటి చిత్రరచనకు ఎన్నుకున్న యితివృత్తం గాంధీజీ ప్రారంభించిన హరిజనోద్యమప్రభావాన్ని ప్రతిబింబించింది.

ఇక స్వాతంత్ర్యానంతరం గాంధీజీ అనుచరులు గాంధీజీ ఆదర్శాలను కాక ధనస్వామ్య ఆదర్శాలనే చేపట్టారు. అందుకే ఒకప్రక్క మద్యనిషేధం. మరొకప్రక్క బీహెవ్ర్ాంటీ అడ్వర్టైట్‌మెంట్లు జంట జంటగా హాస్యాస్పదంగా సాగాయి. సాంప్రదాయ డంబాచారముతో గాంధీజీ ఆదర్శాలను వల్లించి ఆయన శిలాప్రతిష్ఠలకు జయంత్యుత్సవాలకు ఆయన సిద్ధాంతాలను పరిమితం చేశారు.

"భవిష్యత్తులో రాబోయే అహింసాత్మక, సామాజిక వ్యవస్థలో భూమి ప్రభుత్వానికి చెందుతుంది, భూమి సర్వం గోపాలునిది అని చెప్పివుందికదా। ఆవ్యవస్థలో కర్షకుడు లేక రైతు, వ్యవసాయ కార్మికుడు లేక స్వయంగా భూమిదున్నే చిన్నరైతుదే అగ్రస్థానం. రైతు భూసారం వంటి వాడు. న్యాయానికి భూమి రైతుకు చెందినది. రైతుకే చెందాలికూడా. అంతేగాని గైరుహాజరు భూస్వాములకు, జమిందారులకు చెందరాదు" అన్న గాంధీజీ భూసమస్యలకు చెందిన సిద్ధాంతం ఈ పాతికేళ్ళుగా అలాగే వుండిపోయింది. దేశఆర్థిక వ్యవస్థకు ముప్పుగా 833 కోట్ల గుప్తధనం పెత్తనం జేస్తోంది. ఇంచుమించుగా 500 కోట్ల ఆదాయపు పన్ను ఎగవేతలు బహిరంగంగా ప్రకటించబడ్డాయి. విదేశీకంపెనీలు కోట్లాదిధనాన్ని తరలించుకు పోతున్నాయ్. ఈదేశంలోని గుత్తపెట్టుబడిదారులు, తమపెట్టుబడులను త్రివిక్రమావతారంగా పెంచు కొంటున్నారు. గాంధిజీ చెప్పిన వీరి రక్తసిక్తలాభాలు దేశంలో దారిద్ర్యాన్ని పెంచుతున్నాయి. జాతిసంపదను కొద్దిమంది కుబేరులచేతుల్లోకి నెట్టుతున్నాయి. ఇదంతా ధనస్వామ్యవ్యవస్థ చేస్తున్న పెత్తనం. ఇదే సాహిత్యకళారంగా లన్నింటా ప్రతిబింబించుచున్నది. నేటి సమాజం పైగాని, సాహిత్యంపైగాని గాంధీవాదప్రచారం బొత్తిగా లేదనే చెప్పాలి. ధనస్వామ్యం ప్రతిఒక్కరిని లొంగతీసుకొని, స్వేచ్ఛావిహారం చేస్తున్న రోజులివి. విద్యా, వైద్య, సంస్కృతీరంగా లన్నీ వ్యాపారకళలో లీనమై పోయాయి. గాంధీఆదర్శాలకు పొత్తుకుదరని వ్యాపారదృక్పథం యీ ధనస్వామ్యవ్యవస్థ ప్రధాన లక్ష్యం. అందుకే స్వాతంత్ర్యయుగోదయంలో

(25 ఏళ్ళ స్వాతంత్ర్యం తరువాత) భావదాస్యం, ఆర్థికదాస్యం రెండూ అలాగే వున్నాయి.

జాతి వెనక్కు మళ్ళింది. జాతీయవిముక్తి కాలంనాటి చైతన్యంలేదు. సంఘసంస్కరణాభిలాష లేదు. సామాజికనిష్ఠ లేదు. వ్యక్తి స్వార్థంతో కూడిన తీరని ధనతృష్ణ మాత్రం వుంది. అందుకే 1947–72 మధ్యకాలంలో "మాలపల్లి"తో సరితూగగల మరోనవల రచింపబడలేదు. తుమ్మల సీతారామ మూర్తిగారు రచించిన "మహాత్ముని కథ," రామమోహనరావుగారి "కొల్లాయి గట్టితే నేమి?" నవల మొదలైనగ్రంథాలుకూడా స్వాతంత్ర్య పోరాటంనాటి ప్రభావాన్నే విశదీకరించుతున్నాయి. గాంధీజీని గురించి ఈనాడుకూడా అనేక మంది కవులు కవిత లల్లవచ్చు. అనేకమంది రచయితలు రచనలు చేయవచ్చు. కానీ ఆ కవితల్లో, ఆరచనల్లో జాతిని ప్రభావితం చెయ్యగల ప్రేరణశక్తి లేదు, గాంధీ ఆదర్శాలు ఎలా వుల్లంఘించ బడినవో ఎత్తిచూపటం కాని, అందుకు చెందిన మనోవేదన, నిస్పృహ మాత్రమే–అవి ప్రతిబింబిస్తున్నాయి. మిధ్యాభ్రమలతో కూడిన గాంధిజీహృదయపరివర్తనా సిద్ధాంతం విఫలమవ్వటం తప్పనిసరి. కాని గాంధీజీ అనుష్ఠించిన వ్యక్తినిష్ఠ మానవసత్యాలపైన, మానవత్వంపైన అచంచలమైన ఆయనకు గల దృఢమైనదీక్ష ఎల్లకాలాలకు నిఖిల మానవాళికి అనుసరణీయమైనది. గాంధీజీలోని సంస్కర్త, గాంధీజీలోని త్యాగమూర్తి, గాంధీజీలోని విప్లవాత్మకగాంధీ ఎల్లకాలాలవారికి మాన్యుడే. గాంధీజీ పూర్ణపురుష దేమీకాదు. అవతారపురుషుడన్నది అంతకన్నా పచ్చి అబద్ధం. అనేకసందర్భాలలో ఆయన ఆదర్శాలు గజిబిజిని, గందరగోళాన్ని కల్గించక పోలేదు. భగత్‌సింగ్ మరణదండన గురించి, నేతాజీ గెలుపు గురించి ఆయన వెల్లడి చేసిన అభిప్రాయాలు ఆయనకు తీరని మచ్చగానే యీనాటికీ వుండిపోయాయి. సామాన్య మానవుడిగాపుట్టి, సామాజిక జీవితంనే సంబంధాలు పెట్టుకొని, ఎదిగి, తప్పు ఒప్పు చేస్తూ తను నమ్మిన సిద్ధాంతాలతో కోసక కృషిచేసిన గాంధీజీని మానవాతీతవ్యక్తిగా అవతారపురుషునిగా కీర్తించటం మాత్రమే జరుగుతోంది. చారిత్రకపురుషులను మానవాతీతులుగా సృష్టించి, వారిపేరిట గుళ్ళు, గోపురాలు కట్టించి, ప్రజలను అజ్ఞానాంధకారంలో ముంచెత్తి, దేశాన్ని అధఃపతనావస్థకు తీసుకొని వెళ్ళటం అనాదిగా జరుగుతున్నదే. ఏభారతీయ సంస్కృతి మూలసూత్రాలను గురించి మనం గొప్పలు చెప్పుకుంటామో ఆమూలసూత్రాలు కలికానికైనా కానరాని వ్యవస్థకు మనం బానిసలుగా జీవిస్తున్నాం.

ఇంతకూ ప్రధానమైన విషయం అశేష ప్రజానీకపు భౌతికావసరాల నుపేక్ష చేసి, వర్గ వ్యత్యాసాలను భద్రపరచి ఆత్మిక విలువలు స్థాపించటమనేది అసంభవమైన విషయం.

అందుకనే నేటి ధనస్వామ్య వ్యవస్థ సెక్సు సాహిత్యాన్ని, నేర, హంతక సాహిత్యాన్ని సృజించమని ప్రోత్సహిస్తోంది. లాభసాటిగా గల వ్యక్తి స్వీయమానసిక ధోరణులకు చెందిన (వక్రీకరణ) సాహిత్యాన్ని సృజించమని ప్రేరేపిస్తోంది.

బుద్ధుని సిద్ధాంతాలు ఈ దేశంలో ఎలా మిగలలేదో, అలాగే గాంధీ సిద్ధాంతాలు కూడా. బుద్ధుడు చెప్పినా, మహమ్మదు చెప్పినా, క్రీస్తు చెప్పినా వ్యక్తినిష్ఠను గురించే చెప్పారు. మహమ్మదు తాను చెప్పిన సిద్ధాంతం కోసం కత్తి పట్టాడు కూడా. మనిషి భౌతికావసరాలు, వర్గాల పుట్టుక, వర్గ వ్యత్యాసాలు, మనిషి మనిషిని చేస్తున్న దోపిడీ వీటన్నింటిని వీరు శాస్త్రీయంగా గమనించ లేదు. వ్యక్తిని మారమని వీరు ప్రబోధించారు. వ్యవస్థ నిర్మాణంతో ముడిపడి యున్న వ్యక్తి మనస్సు అందుకే మారలేదు. ఈ ప్రబోధాత్మక సిద్ధాంతాలన్నీ కూడా మనిషి సమస్యలను సమూలంగా పరిష్కరించలేకపోయాయి. వారు ఆశించిన ఆత్మిక విలువలను మనిషిలో ప్రతిష్ఠించ లేకపోయాయి.

అందుకే ఈనాడు శాస్త్రీయమైన ఆర్థిక సిద్ధాంతాలను ప్రతిపాదించి, వర్గ వ్యత్యాసాలను తొలగించటంలో తప్పనిసరి అయితే హింసాత్మక విధానాలను కూడా చేపట్టమని బోధించిన మార్క్సిస్టు ఆర్థిక సూత్రాలు, ఆర్థిక సమానతా విధానాలు విజయవంతమౌతూ ప్రపంచాన్ని కుదిపివేస్తున్నాయి. ఈ కుదిపివేతకు సాహిత్యం కూడా ప్రభావితమయ్యింది.

హింసను ప్రోత్సహించే అహింస అహింస కాదు. ఆచరణలో అసత్యాన్ని అనుష్ఠించే సత్యం సత్యం కాదు. పర భాగ్యోపజీవులు నైతిక, ధార్మిక విలువలు కాపాడలేరు సరికదా యావత్తు శ్రమసంపదను తమ భోగలాలసత కొఱకే వినియోగించుకుంటారు. సంస్కృతిని, సభ్యతను, ఆర్థిక, సాంఘిక సూత్రాలను తమ స్వార్థ పరిరక్షణకు మలచుకొంటారు.

దక్షిణాఫ్రికాలో జాతివివక్ష అలాగే ఉంది. ఇందుకు వ్యతిరేకంగా సాయుధపోరాటం ప్రారంభమయ్యింది. సామ్రాజ్యవాద శక్తులు యుద్ధరంగంలో మారణ హత్యాకాండ సాగిస్తున్నాయి.

అణుశక్తి యావత్ప్రపంచాన్ని సంచలితం చేస్తున్న యీ యుగంలో హింస, అహింస అనే పదాలకు పడికట్టు అర్థాలు కొత్త ఆచరణవంతమైన ఆదర్శాలలో పరీక్షించటమనేది విజ్ఞత. ఇదే సాహిత్యంలో ప్రతిబింబించాలి.

# సామ్యవాదం

శ్రీ ఏటుకూరి బలరామమూర్తి

**1947** ఆగస్టు 15 న భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించింది. దీర్ఘకాల బానిసత్వబంధనాలనుండి విడివడి స్వేచ్ఛాప్రపంచంలో అడుగు పెట్టింది.

ఆంధ్రప్రదేశ్‌లో, తెలంగాణాలో ఆనాడు, నైజాం వ్యతిరేకసాయుధ పోరాటం జరుగుతున్నది. బ్రిటిష్ బానిసత్వంనుండి మాత్రమేకాక, నైజాం భూస్వామ్య దోపిడీనుండి విముక్తి చెంది దున్నేవానికే భూమి సాధించుకోవాలనే మహదాశయంతో సాగిన సాయుధపోరాట మిది. సామ్యవాద వ్యవస్థ స్థాపనకు తొలిదశ.

తెలుగుసాహిత్యంపై ఈ పోరాటం గొప్ప ప్రభావం కలిగించింది. ప్రముఖ తెలంగాణా కవి దాశరథి తనగళంవిప్పి కవితాత్మను పూర్తిగా ఆవిష్కరించు కున్నది ఈ పోరాటప్రభావంతోనే. మరో ప్రముఖ తెలంగాణా కవి డాక్టరు నారాయణరెడ్డి పైన ఈ ఉద్యమప్రభావం ఎంతో ఉంది.

తెలంగాణా సాయుధపోరాటగాథలను వస్తువులుగా తీసుకుని అనేక నవలలు వెలువడ్డాయి. కీ.శే. పట్టికోట ఆళ్వారుస్వామి రచన 'ప్రజలమనిషి' వీనిలో మకుటాయమానమైనది.

నైజాం వ్యవస్థలో, జాగీర్దారుల దోపిడీలో, గ్రామసీమలలో పేద ప్రజలు పడిన బాధలు ఇందులో కళ్ళకుగట్టినట్లు ఆళ్వారుస్వామి వర్ణించారు. జాగీర్దారు గడీలో విస్తరాకులు కుట్టుకుంటూ, తన పిల్లవాడిని చదివించుకుంటూ, అభిమానానికి ఆత్మగౌరవానికి భంగంలేకుండా జీవించిన వైష్ణవ కుటుంబిని ఆవేదన ఈ నవలకు జీవనాడి. ఆమె పుత్రుడు ప్రజలమనిషిగా, పోరాటం వీరుడుగా, స్వాత్రంత్ర్య యోధుడుగా నవలలో రూపొందుతాడు. శ్రీఆళ్వారుస్వామి స్వీయచరిత్ర ఇందులో ప్రతిబింబిస్తుంది. తెలంగాణా సాయుధ పోరాటగాథకు ప్రాతిపదిక ఐన భూస్వామ్య దౌర్జన్యాలను రసవత్తరంగా వర్ణించిన ఉత్తమ నవలలు – శ్రీదాశరథి రంగాచార్యులు ఇటీవల రచించిన 'చిల్లర దేవుళ్లు', 'మోదుగుపూలు'.

మహీధర రామ్మోహనరావుగారు వ్రాసిన ఓనమాలు, మృత్యువునీడల్లో, బొల్లిముంత శివరామకృష్ణ రచించిన మృత్యుంజయులు, తదితరాలకు గూడా ఈ పోరాటమే కథా వస్తువు.

కుందుర్తి ఆంజనేయులు 'తెలంగాణా' కావ్యం ఉత్తమ కావ్యాలలో

ఒకటి. ఈతరంవారు, రాబోవుతరంవారు కూడా చదువుకుని, పాతవీరగాథ లను గ్రహించ గల గ్రంథం. ఆరుద్ర 'త్వమేవాహం' కూడా ఈ కోవకు చెందినదే. సింబాలిజం ఎక్కువగా ఉన్నందున కాలం గడిచిన కొద్దీ ఈ కావ్యం దుర్గ్రాహ్యం అయ్యే ప్రమాదముంది.

ప్రముఖులైన వీరి రచనలే కాక, ఇంకా ఎన్నో జానపదగేయాలు, కథలు ఈ కాలంలో ఉద్భవించాయి. వీటన్నిటినీ సేకరించి ప్రచురించి నప్పుడే, తెలుగు దేశంలో మహత్తరమైన ఈ పోరాటం, సాహిత్యంపై కలి గించిన ప్రభావం పూర్తిగా విదితం కాగలదు.

1947 కు పూర్వంనుండే, ఆంధ్రలో అభ్యుదయ రచయితల ఉద్యమం గొప్ప కవితా సృష్టికి పునాది వేసింది. సామ్యవాద సిద్ధాంత ప్రభావం ఈ ఉద్య మానికి పునాది. శ్రీశ్రీ మహాప్రస్థానం, దేశచరిత్రలు, లేలేరష్యా తదితర గేయాలన్నీ, సామ్యవాదభావ పూరితాలు. ఇవన్నీ 1947 కు పూర్వం ఉద్భవించి నవి. ఐనా వాటి ప్రభావం ఈనాటికి చెక్కుచెదరలేదు.

స్వాతంత్ర్యానికి పూర్వమే, సోవియట్ రష్యా విప్లవమూ, సోషలిజాన్ని గురించి నెహ్రూ చేసిన సాధారణ ప్రచారమూ ఆంధ్రదేశంలో సైతం గొప్ప ప్రభావాన్ని కలిగించాయి. అడవిబాపిరాజు గారి 'నారాయణరావు' 1947 కు పూర్వం అందులో సోషలిస్టుభావాలచే ఉద్దీపితుడైన నవయువకుడు నారాయణ రావు. ఉప్పల లక్ష్మణరావుగారిది అతడు-ఆమె లో ఉభయులూ సోషలిస్టు భావాలలోనేగాక, సోషలిష్టు మానవతనుపుణికి పుచ్చుకున్న పాత్రలు.

కమ్యూనిస్టు ఉద్యమపురోగతికి, అభ్యుదయ రచయిత సంఘప్రగతికి, మంచికో, చెడుకో వేరేవిషయం - అవినాభావసంబంధమున్నది. 1962 వరకు ఒక నడకసాగించిన అభ్యుదయ రచయితల ఉద్యమం ఆ తర్వాత కుంటు పడది. 1962 లో చైనా భారత్‌పై చేసినదాడి, రాజకీయవాదులనేగాక, సాహితీ వేత్తలను సైతం కలచివేసిన ప్రధానఘటన.

1937_40 ల మధ్య సోవియట్ రష్యాను చూసి, అక్కడ సోషలిజం నిర్మాణాన్నిచూసి కవులు ఉత్తేజితులైనారు. 1950_60 సంవత్సరాలమధ్య చైనా పురోగంని చూసికూడా అలాగే ఉత్తేజితులైన సాహితీపరులున్నారు. ఈ ఉత్తేజం సాగేతీరూ వారిలో వెలువడేలోగానే 1962 యుద్ధము అందరికీ దిగ్భ్రాంతి కలిగించింది. కొన్నేండ్లపాటు అభ్యుదయ రచయితల ప్రాముఖ్య మంతా పోయింది.

ఆ పిమ్మట చైనాలో 'సాంస్కృతిక విప్లవం' పేరుతో అల్లకల్లోలం ప్రారంభమైంది. దాంతో విభేదాలు మరీ ఎక్కువైనాయి. మల్లారెడ్డి వ్రాసిన 'వృశ్చికసంతానం' చైనాపట్ల అభ్యుదయ కవుల తీవ్రవ్యతిరేకతకు తార్కాణం.

కొంచెంసాకుగా అవుతుందేమోగాని, శ్రీశ్రీ వ్రాసిన "శేలేరషా్య" 1935 ప్రాంతంలో ఒక అభ్యుదయ కవితాస్రవంతికి ప్రారంభమైనట్లు, మల్లారెడ్డి వ్రాసిన 'వృశ్చికసంతానం' చైనా ముష్కరత్వంతో ఆగ్రహావేశులైన తెలుగునాటి అభ్యుదయ కవుల కవితాధోరణికి నాంది అని చెప్పవచ్చు.

1964 లో కమ్యూనిస్టు ఉద్యమం రెండుముక్కలైంది. 1968 లో ఆంధ్రలో మరో చీలికవచ్చింది. మార్క్సిస్టు పార్టీ తిరిగి చీలిపోయింది. చైనా ప్రవర్తన సోషలిస్టు దేశాలకు ఆనాటికానాడు మరింతగా తలవంపులు తెచ్చేదిగా తయారైనదని అభ్యుదయ కవులు బాధపడుతుండగా, చైనా వైఖరే సరైన అభ్యుదయం, అదే విప్లవ పంథా అని బాహాటంగా ప్రచారంచేసే వి.ర.సం. 1970 జనవరిలో విశాఖలో శ్రీశ్రీ షష్టిపూర్తి సన్మానసభ సందర్భంగా తలఎత్తసాగింది. తీరా నిర్మాణరూపం ఆ తర్వాత కొంతకాలానికి గానిపూర్తి కాకపోయినా, శ్రీశ్రీ షష్టిపూర్తి సన్మానమే తమ జన్మ నక్షత్రమని వారే ఈ నాడు చెప్పుకుంటున్నారు.

అంతకు ముందు రెండుమూడేండ్ల నుండే దిగంబర కవులుగా వ్యవహరించినవారు వి.ర.సం. గా మారారు. సాయుధ పోరాటం శ్రీకాకుళం పంథా, మావో నాయకత్వం, చైనాసాంస్కృతిక విప్లవ ఆదర్శం–వీటితో వీరు కవిత్వం వ్రాస్తునారు. కథలు వ్రాస్తున్నారు. కారణం ఏదైతేనేమి, యువకులలో ఒక వర్గాన్ని వీరు ప్రస్తుతానికి ఆకర్షించ గలుగుతున్నమాట నిజం.

కమ్యూనిస్టు పార్టీ మాత్రమేగాక నెహ్రూవంటి కాంగ్రెసు నాయకులు, ప్రస్తుతప్రధాని ఇందిరాగాంధి సోషలిజాన్ని గురించి ప్రచారం చేస్తున్నారు. కాని వారి మాటలకు, ఆచరణకు పొంతన లేనందున, ఈ సామ్యవాద ప్రచారం, సాహితీ పరులను ఆకట్టుకోగల స్థితికిరాలేదు.

రాజకీయ పార్టీల ప్రభావం, సాహిత్యంపై ఉండడం అనివార్యం. మౌలికంగా. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో విప్లవాత్మక మార్పులను ఆకాంక్షించే సామ్యవాద ప్రభావం తప్పనిసరిగా సాహిత్యంపై ప్రసరించి తీరుతుంది. ఐతే, తత్కాలానికి మాత్రమే నిలిచే రాజకీయ నినాదాలు, ఎత్తుగడలు త్వరలో కాలగర్భంలో కలిసి పోతాయి. తాత్త్విక, సిద్ధాంత, సాంస్కృతిక పరంగా సామ్యవాదం, సమాజంలో నిత్యజీవితంలో కలిగించిన ప్రభావం, కవితా రూపంలో, నవలారూపంలో వెలువడవలసిఉంది.

గాంధీయుగానికి చెంది అటిమౌలిక రచన మాలపల్లి 1925 ప్రాంతంలోనే వెలువడ్డది. సామ్యవాద సిద్ధాంతాలు, ఆంధ్రప్రజా జీవితంలో కలిగించిన, కలిగిస్తున్న మార్పులను సమగ్రంగా, చిత్రించే నవల లేక కావ్యం వెలువడవలసిఉంది. బహుశా మరో దశాబ్దం అందు కొరకు వేచిఉండవలసి వస్తుందేమో!

# రాజకీయాలు

శ్రీ కపిల కాశీపతి

స్వాతంత్ర్యయుగోదయంలో మనజాతీయ, ప్రాంతీయపరిస్థితులు ఏమిటి?

స్వరాజ్యంకోసం ఉద్యమం నడిపింది అఖండభారతం. ఆఉద్యమానికి సారథి గాంధి. ఫలితం భగ్నభారతం. ఉపఖండాన్ని మూడుముక్కలుచేసి రెండుదేశాలుగా భాగించి, రాజకీయయాజమాన్యంమాత్రం విడిచిపెట్టి పోయారు బ్రిటీషువారు. ఈశస్త్రచికిత్స గాంధీకి సుతరామూ ఇష్టంలేదు. ఆయనహృదయం భగ్నమైంది. ఆపగిలిపోయిన గుండెలో తుపాకిగుండు పేల్చిచంపేశాడు మత ఉన్మాదు డొకడు. గాంధీయుగం అంతరించింది. గాంధీ బోధించిన నైతిక, సాంఘిక, ఆర్థికసంస్కారోద్యమాలు చిహ్నమాత్రంగా పాటించాం విధిలేక, ఇష్టం లేకపోయినా. సత్యం, అహింస మాటలలో లోటులేదు. ఖద్దరు, హరిజన ఉద్ధారణ, మద్యపాననిషేధం లాంఛనాలుగా వుంటూవచ్చాయి; అఖరిది పోనే పోయింది. గాంధీవిగ్రహారాధన మిగిలింది.

ఈ భగ్నభారతమే స్వరాజ్యం అనుకుని, తెలియరాని అధికార కాంక్షతో ఈ వేరుకాపురం అడకత్తెరలో పోకచెక్కలా వున్నా అంగీకరించి, సంతోషంతో స్వీకరించినవాడు జవహరలాల్. ఆయన గాంధీ వారసుడు, కాని అతని శిష్యుడుమాత్రం కాదు. నెహ్రూ ఆంగ్ల మానసపుత్రుడు. నిద్రలో ఇంగ్లీషులో పలవరించేవాడు. ఒకవూపులో, తన జీవితకాలంలోనే తనదేశాన్ని కొండెక్కించాలనే ఆటతో, పవిత్రమైన దేశభక్తితో, ప్రజానీకంమీద అపారమైన ఆపేక్షతో, అడ్డులేని నాయకత్వంతో, విదేశాలు తమ స్వార్థంకోసం అందించినఅప్పులతో పని ప్రారంభించాడు. బ్రిటీషువారు స్వరాజ్యమే ఇచ్చారుగాని వారి ప్రొసీజరూ, వారికోసమే పుట్టిన నెగెటివుతత్వ పారంగతులైన అధికార్లనీ విడిచిపెట్టి పోయారు. నాయకులికి పరిపాలనాఅనుభవం లేదు. ఉద్యోగుల చేతుల్లో కీలు బొమ్మలయారు. పైగా నెహ్రూతో సహా, బంధుప్రేమతో అడ్డమైనవాళ్ళూ అధికారంలోకి వచ్చారు. ఆ స్థితి ఇప్పుడూ వుంది.

నెహ్రూ హయాంలోనే మన రాజ్యాంగవిధానం రూపొందింది. మన నిర్మాణ కార్యక్రమం ప్రారంభమైంది. ప్రపంచంలో వున్న రాజకీయమైన ఆదర్శాలన్నీ ఏరి, మనదేశప్రజల పరిస్థితులతో ప్రమేయంలేకుండా, అపురూప

మైన రాజ్యాంగం సృష్టించారు. రచయితలందరూ పండితులు. పన్నాలు వల్లె వేసినవారు. అనుభవజ్ఞానం లేనివారు. తీరా అమలులోకి వచ్చేసరికి భారతీయ వ్యవస్థలాగే, పరస్పరవైరుధ్యాలు సంప్రాప్తించాయి. ఇరవై అయిదేళ్ళలో ఇరవైతొమ్మిదిసార్లు రాజ్యాంగం సవరించుకుంటూ రావలసివచ్చింది. ఇంకా చాలాసవరణలు అవసరం అని తెలుస్తోంది. రాజ్యాంగంప్రకారం భారతదేశంలో అమలులోవున్నది మతాతీతమైనప్రభుత్వం. సామ్యవాదపద్ధతిలో నడవాలి; వయోజనవోటుతో స్థాపించిన ప్రజాప్రభుత్వం.

మాటవరసకి మతాతీతమైనా, రాజకీయ అధికారంకోసం స్థాపించిన మతసంస్థలు వుంటూనేవున్నాయి. వాటిప్రభావం ప్రజలమీద వుంటూనే వున్నది. ఈ సంస్థలప్రభావంప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రచారసాహిత్యం మీద వుంటూనే వున్నది. కులతత్వాలు రాజకీయాల్ని కూకటివేళ్ళతో కుంగ తీస్తున్నాయి.

ఇక సామ్యవాదం, ఇంతవరకూ అనగా నెహ్రూయుగం అంతరించి, ఇందిరాయుగం ప్రారంభించేవరకు, ఏరూపంలోనూ ఆచరణలోకి రాలేదు. జమీందారీలు పోయాయిగాని, జమీందార్లు పెరిగిపోయారు. రాజకీయాలుతప్ప వేరేవృత్తి లేని నడిమంత్రపుసిరిగాళ్లు పోగై చీకటిబజారులో స్వేచ్ఛగా విహరిస్తున్నారు. ధరలు పెరిగినకొలది దారిద్ర్యం ఎక్కువైంది. దేశానికి పట్టుకొమ్మ అయిన మధ్యతరగతిప్రజ నాశనం అయిపోతున్నారు. తత్కారణంగా అడుగడుగునా లంచగొండితనం పెరిగిపోయింది. ప్రభుత్వంలో ఆపాదమస్తకం అదే జబ్బు.

ఇక ప్రజాప్రభుత్వం విషయంలో చెప్పనే అక్కర్లేదు. ఎన్నికలవరకే అది ప్రజాతంత్రం. తరవాత భూస్వాముల, పరిశ్రమాధిపతుల, కంట్రాక్టర్ల కీలుబొమ్మ. ఒకమాటు అధికారంలోకి వచ్చినకూటాన్ని, అయిదేళ్ళదాకా, వాళ్లల్లో వాళ్లు కొట్లాడుకుంటే తప్ప, తోసెయ్యడానికి వీలులేదు.

బ్రిటీషువారిహయాంలో భారతదేశానికి స్వరాజ్యం పరమలక్ష్యం అయినట్టు, స్వరాజ్యానంతరం ఆర్థికస్వాతంత్ర్యం, దారిద్ర్యనిర్మూలనం మనలక్ష్యం. ఆలక్ష్యం ఇంకా చాలాదూరం వుంది. ఇరవై అయిదేళ్ళ నిర్మాణకార్యక్రమాల తర్వాత, నాలుగు పంచవర్షప్రణాళికలతర్వాత, గ్రామాలే ఎక్కువగా వున్న మనదేశంలో, ఎనభై శాతం తాగడానికి మంచినీళ్ళు లేనినిర్భాగ్యసీమగా పరిణమించింది. మనపరిపాలకునికి ఎంతప్రత్యక్షప్రపంచజ్ఞానం వుందో తెలుస్తుంది. ఇంతవరకు ప్రజలలో ఆశావైఫల్యం.

అయిదారేళ్లగా ఇందిరాయుగం ప్రారంభించింది. ఆవిడకార్యదీక్ష అమలులోకి వస్తే ఎగిరిపోతామని భయపడి, తంత్రాలుపన్నిన, పెట్టుబడి వారీ దళారీలు, ఆవిణ్ణి ఎదుర్కొని, నిజంగా ఎగిరిపోయారు. మతదురభిమాన పార్టీలుకూడా మాటుమణిగాయి. కమ్యూనిస్టులు రెండుగా చీలి, ఒకరు రష్యా వేపూ, మరొకరు చైనావేపూ చూస్తున్నారు.

స్వరాజ్యం రాకపూర్వం మనమీద ఒకబ్రిటీషుప్రభావమే వుండేది. స్వరాజ్యంవచ్చినతర్వాత అమెరికా, రష్యా, చైనా దేశాలప్రభావంకూడా ఎక్కువైంది. అమెరికాఏజంట్లు అనేకహోదాలతో ఢిల్లీనించి పల్లెదాకా వ్యాపించి, ధనం వెదజల్లి మభ్యపెడుతున్నారు. నిక్సను అధ్యక్షుడిధర్మమా అని బంగ్లా స్వాతంత్ర్యసమరంలోనూ, వియత్నాంలోనూ, అమెరికావైఖరివల్ల, ప్రజలలో అమెరికామీద వెగటు పుట్టింది. రష్యానించీ, చైనానించీ వచ్చినడబ్బుకూడా వుంది. ఎన్నికలలో ఖర్చైందనే అపవాదుకూడా వుంది. ఇరుపక్షాల కమ్యూనిస్టుతత్వంకూడా నిరాశవల్ల కలిగిన ఉగ్రవాదం. వారిఆశయాలు హింస లేకుండా సాధించవచ్చు నని ఇందిర నమ్మకం. ఆవిణ్ణిఎన్నుకున్నప్రజల నమ్మకం. భారతదేశంలో ఇందిరాపర్వంలో ఇంతవరకు కొన్నిలక్ష్యసాధనలు జరిగాయి. ఒకటి సంస్థానాధీశ్వరుల నిష్క్రమణ. రాబోయేది ఆస్తులలో తారతమ్యపరిష్కారం. ఇది జరిగితే ఆవిడా, భారతీయ ప్రజలూకూడా ధన్యులు. జిత్తులతో ఉచ్చులు వేస్తున్నారు. కలకులదళారీలు కమ్యునిస్టులమని చెబుతూ ఆస్తులు సేకరించినవా రెందరో వున్నారు. వారుకూడా బలిఅవుతారు. ఈపరిణామాలు సంభవించినఈపాతికేళ్ళుకూడా ఏదో ఒకరూపంలో కాంగ్రెసే కేంద్రంలో అధికారంలో వుంది. ఇది స్వాతంత్ర్యయుగోదయంలో భారతదేశపు రాజకీయచిత్రం.

ఇక తెలుగుదేశం 1947 ఆగస్టు 15 వతారీఖుకి ఇంకా ప్రత్యేకరాష్ట్రం కోరుతూనే వుంది. కోరుతున్నరాష్ట్రంఅంతవరకు మద్రాసులో భాగంగా వున్న పదకొండుజిల్లాలు మాత్రమే. సంస్థానాలు పోతాయి. సమగ్రతెలుగురాష్ట్రం లభిస్తుందనే ఊహా లేదు ఆశా లేదు. ఆపదకొండు జిల్లాలరాష్ట్రానికే రాయల సీమనాయకులు షరతులుపెట్టి ఆటంకాలు కలగజేస్తూనే వున్నారు. చివరికి 1953 లో రాష్ట్రోదయచిహ్నాలు గోచరించాయి. మద్రాసు అందులో భాగంగా వుండాలనికోరుతూ శ్రీరాములు ప్రాణాలు అర్పించాడు. మద్రాసులేకుండానే రాష్ట్రం ఏర్పడింది.

ఈసమయంలో తెలంగాణాలో తొమ్మిదిజిల్లాలలో ఆంధ్రులుమొదట రజాకర్లతోనూ, తర్వాత కమ్యూనిస్టులతోనూ యమయాతనపడ్డారు. నిజాం వోడిపోయినతర్వాత సమగ్రాంధ్రరాష్ట్రం ఏర్పడే ఆశలు కలిగాయి. అప్పుడు తెలంగాణనాయకులుకొందరు ప్రత్యేకతెలంగాణాకోసం అలజడిచేశారు. చివరికి ఒకవొప్పందంమీద ఆంధ్రప్రదేశం ఏర్పడింది. ఆంధ్రనాయకులు ఆ వొప్పందం అక్షరాలా అమలుజరపలేదు. మళ్ళీ ప్రత్యేకతెలంగాణావాదం దౌర్జన్యంగా బయలుదేరింది. ఇందిరాదేవి జోక్యంతో ఆగిపోయింది. పూర్తిగా పోలేదు. 1956 లో ఆంధ్రప్రదేశము ఏర్పడిన ఈపదిహేను, పదహారు సంవత్సరాలలోనూ నలుగురుముఖ్యమంత్రులు మారిపోయారు. వీరంతా తమ పదవులు సంరక్షించుకునేప్రయత్నములో నిమగ్నులై రాష్ట్రానికి చెయ్యవలసినంత, చెయ్యగలిగినంత చెయ్యలేకపోయారు. ఇన్నాళ్లుకూడా ఏదోవిధంగా కాంగ్రెస్సేప్రభుత్వములో వుంది.నక్సలైట్ల పెరుగూ విరుగుకూడా సంభవించాయి.

స్వరాజ్యముకాని, స్వరాష్ట్రముగాని రావడమువల్ల కలగవలసినలాభాలు మనకి కలగలేదు. ఆర్థికంగా చాలా వెనకబడివున్నాము. రాష్ట్రప్రభుత్వము అప్పులపాలైంది. సాంఘికంగా కులతత్వాలు పెరిగిపోయాయి. అవి రాజకీయాల్ని కళంకితము చేశాయి.



" తెలుగుదేశాన యువకులు త్రిదశులైరి
మొట్టమొదట శాస్త్రపురాణముల నిరసన
పైనదేవుడు లేడన్న పట్టుదలయు
నూటిగా చిట్టచివరకు సోషలిజము "

—విశ్వనాథ

# లలితకళలు

శ్రీ సంజీవదేవ్

ఏది లభ్యంకాదో దానిమీద వుండే తీవ్రాకాంక్ష అది లభ్యమైన తరువాత దానిమీద వుండదనేది సామాన్య మనో వైజ్ఞానిక సత్యం. అందుకే దాస్యంలో వున్నంతవరకు ఏ జాతికైనా స్వాతంత్ర్యంమీద వుండే తీవ్రాకాంక్ష స్వాతంత్ర్యం లభించిన తరువాత వుండదు. ఇది సహజంకూడ.

అయితే, స్వాతంత్ర్య సంపాదన మార్గంలో ప్రజల్లో వుండేకొన్ని మంచిగుణాలుకూడ స్వాతంత్ర్య సంపాదన తరువాత నశిస్తాయి. బానిసత్వంలో బ్రతికినందువల్ల అలవడ్డ కొన్ని చెడ్డగుణాలుకూడ స్వాతంత్ర్యంలభించిన తరువాత నశిస్తాయి, సందేహం లేదు. చెడ్డగుణాలు నశించటం శ్రేయస్కరమే కాని మంచిగుణాలు నశించటం హానికరం.

బానిసత్వంలో జీవిస్తూ స్వాతంత్ర్యం కోసం పోరాడే ప్రజల్లో, త్యాగ శీలత, నైతికపారిశుద్ధ్యం, సమైక్యత, నిస్వార్థత, నిజాయితీ, పట్టుదల, అనుభూతి, తీవ్రత మొదలైన వెన్నో మంచి గుణాలుంటాయి. స్వాతంత్ర్యం రాగానే వాటిలో చాలా నశిస్తాయి అనే సత్యానికిమనకుమనమే సాక్ష్యం. భారత దేశానికి స్వాతంత్ర్యం రాకముందున్న ప్రజల్లోని సుగుణాలు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దుర్గుణాలుగా మారాయి. అందుకని స్వాతంత్ర్యం కంటే బానిసత్వంమంచిదని చెప్పితే అంతకుమించినదుర్గుణం మరొకటుండబోదు.

ఈ చెడ్డమార్పు అంతాకూడ రాజకీయనాయకుల్లోను, పరిపాలనాపదవుల్లో వున్న పెద్దవారిలోను, కొంతవరకు ప్రజల్లోను ప్రబలంగా ప్రవేశించింది. కాని సాంస్కృతికరంగంలో, అంటే సారస్వతంలోను, మిగతా లలితకళ ల్లోను ఆ చెడ్డమార్పు అంతగా ప్రవేశించినట్లులేదు. రాజకీయరంగంలోను, ప్రజల నైతిక రంగంలోను ప్రవేశించిన పతనం స్వాతంత్ర్యానంతరం సాంస్కృతిక రంగంలో ప్రవేశించలేదు. సాహిత్యరచనలు, చిత్రరచనలు, సంగీతం, నాట్యం, వాస్తునిర్మాణం, శిల్పసృష్టి మొదలైనవన్నీ స్వాతంత్ర్యం ముందటికంటే స్వాతంత్ర్యం తరువాత సంఖ్యలోను, సారంలోనుకూడా పెరుగుతూవచ్చినాయేకాని తరుగుతూరాలేదు. వీటిలోని ఈ అభివృద్ధికి కారణం స్వాతంత్ర్యంకాదు, అంతర్జాతీయంగా పరిణమిస్తూ వచ్చిన కాలంలోని మార్పు

మాత్రమే. మనదేశానికి స్వాతంత్ర్యం రాకపోయినాకూడా మన సాంస్కృతిక రంగంలోనేడు ప్రత్యక్షమవుతూన్న మంచిమార్పు వచ్చితీరేదే. ఇది కాలం తెచ్చిన ఉన్నతిమాత్రమే కాని స్వాతంత్ర్యం తెచ్చినఉన్నతి కాదు. మన దేశంలోని కాలాన్ని కొలవటానికి మాత్రమే స్వాతంత్ర్యపుముందు కాలమనీ, స్వాతంత్ర్యపు వెనకకాలమనీ, మైలురాళ్లను నిర్ణయించుకొన్నాం.

ఈ ఇరవై అయిదు సంవత్సరాల్లో సాహిత్యంలోను, మిగతా లలితకళ ల్లోను జరిగిన ఉన్నతి స్థూలత్వంనుంచిసూక్ష్మత్వంవైపుకు వికసించిన పరిణతి. రూపత్వం (Concrete) నుంచి నైరూప్యం (Abstract) లోకి చెందినరూపాంతరం, అలంకారం నుంచి సాదాతనానికి పయనించిన నిరాడంబరత.

ప్రబంధకవిత్వం 'ఏనాడో పాతబడిపోయి భావకవిత్వం ప్రాదుర్భవించింది. భావకవిత్వంలోని అతిసౌకుమార్యాన్ని, అతిమార్దవాన్ని, ప్లెటానిక్ ప్రేమను దుర్బలత్వంక్రింద జమకట్టి అభ్యుదయ కవిత్వం ఆవిర్భవించింది. ఈ అభ్యుదయకవిత్వం మార్దవానికి బదులు కాఠిన్యాన్ని, శాంతికిబదులు క్రాంతినీ అభివ్యక్తం చేయజొచ్చింది. దీనిలోనే ప్రయోగవాదపు ముఠా పేరుగా ప్రగతివాదపుముఠా పేరుగా సంచరించసాగేయి. ప్రగతి వాదపుముఠాకు, దేశపరిస్థితి, రాజకీయాలు, బీదలపాట్లు,మొదలైనవి ప్రధానాలు తమకవిత్వంలో. ఇక ప్రయోగవాదం వారికి మానవుని మనోవైజ్ఞానిక రీతులు, మనిషిలోని నిరాశ, నిస్పృహ, వేదన మొదలైనవి ప్రధానాలు.

స్వాతంత్ర్యోదయంనాటికి ప్రగతివాద కవిత్వం నిలిచివుంది తెలుగు సాహిత్యంలోబాగా. కాని దీనిలో రాజకీయభావాలకే ప్రాధాన్యం ఇవ్వబడటం వల్ల ప్రగతివాదంపైన ప్రయోగవాదం ఆధిపత్యాన్ని వహించసాగింది. ఈ ప్రయోగవాదకవిత్వం క్రమేణ చైతన్యవాదకవిత్వంగా రూపొంది అటు భావ కవిత్వంలోని అతిమార్దవాన్నీ, ఇటు ప్రగతివాద కవిత్వంలోని అతికాఠిన్యాన్నీ సమన్వయపరచి ఒకనూతన హృదయ సంగీతాన్ని, ఒకనవ్యప్రాణస్పందనను అభివ్యక్తం చేయసాగింది. దీన్ని ప్రధానంగా వచన కవితల్లో వ్రాయసాగేరు. నేడీ వచనకవిత ఒకసుస్థిరస్థాయినందు కొన్నది. ఈ ఇరవైదు సంవత్సరాల్లో కవిత్వం సాధించిన మహత్కార్యం వచనకవిత. వచన కవితలో ఆలోచన ప్రధానం.

ఈ ఇరవై అయిదేళ్లలో కల్పనాసాహిత్యం కథానికారూపంలో, నవలా రూపంలో సారంలో కంటే సంఖ్యలో విపరీతంగా పెరిగిపోయింది. కల్పనా

సాహిత్యంలో రచయితల సంఖ్యకంటే రచయిత్రులసంఖ్య ఎక్కువైంది. స్వాతంత్ర్యోదయానికి ముందు కల్పనాసాహిత్యంలో ప్రధానంగా సామాజిక వాస్తవం ఎక్కువ చిత్రించబడేది. అది క్రమేణ సామాజిక వాస్తవాన్ని వర్ణిస్తూ, మనోవైజ్ఞానిక వైచిత్రిని చిత్రించటం ప్రారంభించింది. కాని మళ్ళీ ఒకదశాబ్దంనుంచి స్త్రీలు కల్పనాసాహిత్యాన్ని రచించటం ఎక్కువయిన తరువాత తిరిగికొంత సామాజిక వాస్తవికత, కౌటుంబిక వైచిత్రి, ఘటనా ప్రాముఖ్యం మొదలైనవి కథల్లోను, నవలల్లోను ప్రవేశించసాగేయి. ఈ సాహిత్యాన్ని సచిత్రవారపత్రికలు బాగా పోషించాయి.

సాహిత్యశాఖల్లో సాహిత్యసమీక్ష ఒక ప్రత్యేకస్థానం కలిగుంది. ఇతర్ల రచనల్ని ప్రశంసించటం మాత్రమే సాహిత్యసమీక్షగా ఎంచబడటం పోయి. ఈ ఇరవైఅయిదు ఏళ్ళలో సాహిత్యసమీక్ష ఒక నిష్పాక్షికమైన వస్తుగత ప్రమాణం (Objective criterion)గా రూపొందింది. కావ్యాలను గురించిన సమీక్షలు, కథానికలను గురించిన సమీక్షలు, వ్యాసాలను గురించిన సమీక్షలు, ఈవిధంగా సమీక్షాసాహిత్యం ఒక స్వతంత్రసాహిత్యంగా నిలచిపోయింది. సమీక్షాత్మకసాహిత్యానికీ వ్యాసరచనకూ ఎక్కువ సామీప్యంవుంది. వ్యాసాలన్నీ సమీక్షాత్మకాలుకావు, సృజనాత్మకవ్యాసాలుకూడ చాలా వుంటాయి. అయినప్పటికీ వ్యాసానికి సృజనాత్మకమైన వాసనకంటే సమీక్షాత్మకమైనవాసన ఎక్కువవుంటుంది. వ్యాసంలో అనుభూతిమూలక అభివ్యక్తికంటే ఆలోచనామూలక అభివ్యక్తియే అధికంగా వుంటుంది.

ఈ ఇరవైఅయిదు సంవత్సరాలలో అంతకుముందులేని వైజ్ఞానిక సాహిత్యం చాలాపెరిగింది. అంతరిక్షయానాలు, చంద్రమండలానికి పయనాలు, చంద్రునిగురించిన బోలెడన్నివివరాలు, ఇతరగోళాన్ని గురించిన పరిశోధనలు, ఇంకా ఆధునికవిజ్ఞానంలో కనుగొనబడిన అనేక భౌతిక, రసాయనిక, జైవ విచిత్రాలు, ఇవన్నీకలిసి వైజ్ఞానికరచనకు ఎంతో ప్రేరణను కలిగించాయి. ఈకాలంలో రచయిత సృజనలోను, సమీక్షలోనుకూడ ఒకవిధమైన పరిణతి నొందేడు. తన రచనాసాధనద్వారా తాను రచించజాలని దానికంటే తాను రచించజాలిందే ఎక్కువవుంటుందనే ఆత్మవిశ్వాసాన్ని అందుకొన్నాడు రచయిత ఇన్నేళ్ళలోను.

కేవలం బయటి ప్రపంచంతోనే కాని, కేవలం లోపలిప్రపంచంతోనే కాని సంతృప్తిపడివుండక బయటిప్రపంచమూ, లోపలిప్రపంచమూకూడ

సమానంగా అవసరమనే సత్యాన్ని తెలుసుకొన్నాడు రచయిత ఈస్వాతంత్ర్యానంతరపు 25 సంవత్సరాల్లోను. మరోసారికూడ చెపుతూన్న దేమంటే రచయితకు అబ్బిన ఈమానసికపరిణతికీ స్వాతంత్ర్యోదయానికీ సంబంధం ఏమీలేదుఅని. స్వాతంత్ర్యం రాకపోయినాకూడ ఈమానసికపరిణతి ఆగేది కాదు. ఈపరిణతి యుగధర్మానికి చెందిందే కాని స్వాతంత్ర్యానికి చెందింది కాదు. నిజానికి స్వాతంత్ర్యం రావటానికికూడ కాలంలో వచ్చిన మార్పే కారణం. ప్రపంచం అంతటిలో ఒకనవచేతన ఉదయించటంతో మనకు స్వాతంత్ర్యమూ వచ్చింది. మన సాంస్కృతికజీవితానికి ఒక నూతనకాంతీ అబ్బింది. ఆకాంతియేమనకు మధ్యమధ్య శాంతినీ క్రాంతినీకూడ తాత్కాలికంగా కలిగిస్తుంటుంది.

ఈ స్వాతంత్ర్యయుగోదయంలో సాహిత్యంలో జరిగినట్లే మిగతాలలిత కళల్లో కూడ ఎంతోమార్పు జరిగింది. సాహిత్యంకూడా నిజానికి ఒక లలిత కళయే. అయినా, సంగీతం, చిత్రకళ, శిల్పం, నాట్యం మొదలైనవికొన్ని ప్రధానంగా లలితకళలని పిలవబడుతూన్నాయి. తెలుగుసాహిత్యంలో వచనకవిత ఈయుగంలో ఏ విధంగా పరిణతి చెందిందో అదేమాదిరి తెలుగుచిత్రకారులు నైరూప్య(abstract) చిత్రకళను పరిణతి చెందించారు. ఈనైరూప్యచిత్రకళను తెలుగు చిత్రకారులు మాత్రమే సృష్టించలేదు. భారతీయ చిత్రకారులుమాత్రమే సృష్టించలేదు, ప్రపంచంలోని అన్ని దేశాల చిత్రకారులుకూడ సృష్టించారు, సృష్టిస్తున్నారు. తెలుగు చిత్రకారుల కుంచెలోనుంచికూడ ప్రపంచ చిత్రకారులు చిత్రిస్తూన్న చిత్రకళ యొక్క ప్రతిబింబమే దిగింది.

పూర్వపుసంగతి చెప్పజాలంగాని నేడు ప్రతి కొత్త విషయం పాశ్చాత్య దేశాలనుంచి ప్రాచ్యదేశాలకు దిగటం పరిపాటి అయిపోయింది. పూర్వం ఇందుకు విరుద్ధంగా చాలావిషయాలు ప్రాచ్యదేశాలనుంచి పాశ్చాత్యదేశాలకు వెళ్ళేయి అని వాడుక. ఏదేశంనుంచి ఏదేశానికి దిగినా ఫరవాలేదు. అన్ని దేశాలుకూడ మనం నివసిస్తున్న ప్రపంచంలోవేకనుక మనకు ఏదీ పరాయిది కాదు. ఈ విశాల ప్రపంచంలో నిజానికి ఏదేశమూ మనకు విదేశంకాదు, అన్నిదేశాలూ స్వదేశాలే.

సాహిత్యానికీ చిత్రకళకూ ఒక గొప్పప్రభేదం వుంది. సాహిత్యం ఏ భాషలో రచిస్తే ఆభాషతెలిసిన వాళ్ళకు తప్ప అర్థంకాదు. మరొక భాషవాళ్ళకు అర్థం కావాలంటే అది అనువాదం చేయబడాలి. కనుక సాహిత్యం అనేది ప్రాదేశికమేకాని విశ్వజనీనంకాదు.

చిత్రకళ అటువంటిదికాదు. ఏదేశపు చిత్రకళనైనా అన్నిదేశవాసులూ చూచి ఆనందిస్తారు. ఇతర్లు అర్థంచేసుకొనే నిమిత్తం ఒకదేశపు చిత్రకళను మరొకదేశపు చిత్రకళలోకి అనువాదం చేయాంసిన పనిలేదు. కనుక చిత్రకళ అనేది ప్రాదేశికంకాక విశ్వజనీనం.

తెలుగులో ప్రవేశించిన వచనకవితను తెలుగువారుమాత్రమే చదివి ఆనందించగలరు. తెలుగుదేశంలో చిత్రించబడే నైరూప్యచిత్రకళను ప్రపంచమంతా ఆనందించగలదు. అందుకనే చిత్రకళమీద అంతర్జాతీయ చిత్రకళా ప్రభావం ప్రసరించినంత వేగంగా సాహిత్యంమీద అంతర్జాతీయ సాహిత్య ప్రభావం ప్రసరించదు. దీనిమీద ఆలస్యంగాకాని ప్రసరించదు. అంతర్జాతీయ సాహిత్య ప్రభావం సాహిత్యంమీదా, అంతర్జాతీయ చిత్రకళాప్రభావం చిత్రకళమీద పడటంమాత్రమేకాదు, చిత్రకళా ప్రభావం సాహిత్యంమీదా, సాహిత్య ప్రభావం చిత్రకళమీద కూడ పడటంకూడా జరుగుతుంది.

కవిత్వం పూర్వం పాడటానికి పనికొచ్చేవిధంగా వ్రాయబడేది. తరవాత తరవాత చదవటానికి పనికివచ్చే విధంగా వ్రాయబడసాగింది. స్వాతంత్ర్య యుగోదయంలో ఆలోచించటానికి పనికొచ్చేవిధంగా వ్రాయబడటం జరిగింది. ఇదే చిత్రకళలో కూడ జరిగింది. పూర్వం చిత్రకళ ఒక కథనో, ఒకవిషయాన్నో, ఒకవ్యక్తిరూపాన్నో తెలియజేయటానికి పనికొచ్చే విధంగా చిత్రించేవారు. తరవాత చిత్రకారుడు తన రసానుభూతిని అభివ్యక్తం చేసుకోడానికి చిత్రించసాగాడు. ఇక స్వాతంత్ర్య యుగోదయంలో రూపం నిమిత్తమేరూపం, రంగునిమిత్తమే రంగు అనేదాన్ని అభివ్యక్త పరచటానికి మాత్రమే చిత్రిస్తున్నాడు. నేటివచనకవిత చాలామందికి అర్థంకావడంలేదు అన్నట్లే నేటి నైరూప్య చిత్రకళా, శిల్పకళా కూడా చాలామందికి అర్థంకావటం లేదు అంటున్నారు. స్వాతంత్ర్య యుగోదయంలో చిత్రకళ మారినంత పూర్తిగా మరొకళ మారలేదు. మిగతాకళలు వాటిని గుర్తించటానికి వీలుగా వుండేట్లుగా మారినాయి కాని చిత్రకళ దాన్ని గుర్తించటానికి వీలులేనంతగా మారింది.

దృశ్యజగత్తులోని ఏపరిచితరూపంకూడ నైరూప్యచిత్రకళలో గోచరించదుకనుక దీన్నిరూపంలేని చిత్రకళ లేక నైరూప్య చిత్రకళా అన్నారు (Abstract Painting). నిజానికి చిత్రకళ అంటే రూపంలేంది వుండజాలదు. అయినప్పటికీ రూపజగత్తులోని మనకు పరిచితమైన రూపం దానిలో, అంటే

నైరూప్య చిత్రకళలో వుండదుకనుక అదినైరూప్యం, లేక రూపంలేని రూపంఅయింది. రూపాన్ని గురించి సంజీవదేవ్ ఒకచోట వ్రాశాడు.

Form is a huge visual deception—an optical illusion—and thus it is a material burden, a physical bondage and a veil hiding the absolute reality. Art begins in form and culminates in the formless. So, the artist in course of his creative evolution should transend the form in order to have greater freedom in his or her luminous pilgrimage of self-expression.

(రూపం అనేది ఒక గొప్ప దృశ్యమయభ్రమ; కంటికి సంబంధించిన మాయ. కనుక అదొక జడమయభారం; ఒకభౌతిక బంధన; నిరపేక్షిక సత్యాన్నిదాచే ఒక ముసుగు. కళ అనేది రూపంలో ఆరంభించి రూపాతీతంలో పరిణతి చెందుతుంది. కళాకారుడు తన సృజనాత్మక పరిణామపు ఒకానొకదశలో రూపాన్ని అధిగమించాలి, అప్పుడు కాని ఆత్మాభివ్యక్తిలోని తేజోమయయాత్రలో తాను అధికతరమైన స్వేచ్ఛను పొందజాలడు.)

చిత్రకళలోమాదిరే శిల్పకళలో కూడ నైరూప్యరూపాలు ప్రత్యక్షంకాసాగినాయి. ఆంధ్రదేశంలో ప్రాచీనకాలంలో శిల్పసృష్టి అధికంగాను, చిత్రసృష్టి స్వల్పంగాను వుండేది. కాని నేడు చిత్రసృష్టి అధికంగాను, శిల్పసృష్టి స్వల్పంగాను జరుగుతూంది. ఇది ఆంధ్రదేశంలోనేకాదు, భారత దేశంలోనే కాదు, ప్రపంచం మొత్తంలోనే కనుపిస్తుంది. అయినా పాశ్చాత్య దేశాల్లో జరుగుతూన్నంత ఆధునికమైన నైరూప్య శిల్ప సృష్టి మనదేశంలో జరగటం లేదు. భారతదేశంలో నైరూప్య శిల్పసృష్టి అంతంతమాత్రంగా మాత్రమే జరుగుతూంది. ఇక తెలుగు దేశంలో ఈ ఇరవైఅయిదు సంవత్సరాల్లో నైరూప్య శిల్పసృష్టి వికసించ లేదనే చెప్పవచ్చు.

స్వాతంత్ర్యయుగోదయంలో సాహిత్యంలోను చిత్రకళలోను ప్రవేశించినంతమార్పు సంగీతంలోను, నాట్యకళల్లోను ప్రవేశించినంతగా గోచరించదు. కర్ణాటకసంగీతం కొంత సామాన్య ప్రజల ఆదరణను కోల్పోతూ ఆస్థానంలో హిందూస్తానీ సంగీతం ప్రవేశించ సాగిందేమో అనిపిస్తూంది. ఇదే మాదిరి నాట్యంలోకూడ. భరతనాట్యంపైన ప్రజా సామాన్యానికి మమకారం తగ్గి కథక్ వంటి ఉత్తరదేశపు నర్తనరీతులమీద ప్రీతి పెరిగినట్లున్నది. తెలుగుదేశంలో హిందీచలనచిత్రాల అధిక ప్రచారం ఈ మార్పులకు కారణమేమో అనిపిస్తూంది. ఈ ఇరవైఅయిదు సంవత్సరాల్లో తెలుగు సంస్కృతిమీద దాక్షిణాత్య ప్రభావానికంటే ఔత్తరాహిక ప్రభావం ఎక్కువ పడింది. ఇందుకు ఇతర కారణా

లతో పాటు ఉత్తరదేశాల సంస్కృతినే ఎక్కువ కలిగివున్న హైదరాబాద్ నగరం మనకు ముఖ్యపట్టణం కావటంకూడ ఒకకారణం.

ఈ ఇరవైఅయిదు సంవత్సరాల్లో ప్రపంచంలోని అన్నిదేశాల్లో వలెనే, భారతదేశంలోని అన్నిప్రాంతాల్లో వలెనే వాస్తుకళలో ఆధునిక అమెరికన్ వాస్తుప్రభావం గోచరిస్తూంది. సౌధనిర్మాణాల్లో రాయి, ఇటుక, సున్నం ప్రాధాన్యంపోయి ఇనుమూ, కంకరా, సిమెంటూ ప్రాధాన్యం వచ్చేసింది. వక్రరేఖలు కాక సరళరేఖల సౌధాకృతి, గుండ్రంగా కాక కోణాలుగా తేలిన మూలలూ, గాలి వెలుతురు సాధ్యమైనంత అధికంగా లోపలికి ప్రవేశించటానికి వీలయేట్లుగా విశాలమైన కిటికీలు, ఖాళీ ప్రదేశాలు వుంచటం, అలంకారవర్జన మొదలైన ఆధునిక వాస్తు రీతులు మన వాస్తుకళలో వ్యాప్తి చెందినాయి.

ఈ విధంగా భారతస్వాతంత్ర్యం తరువాత సంస్కృతికి సంబంధించిన ప్రతి రంగంలోను స్థూలత్వం తరగటమూ, సూక్ష్మత్వం పెరగటమూ జరుగుతూ వస్తూంది. ఇది ఒక సాహిత్యంలోనే కాదు, మిగతా లలితకళల్లోనే కాదు, మానవుని జీవన రంగంలో, విజ్ఞానశాస్త్రంలో అన్నిటిలోకూడ అంతే. భౌతిక శాస్త్రంలోని భౌతిక భారమంతా తగ్గి పరమాణుశక్తిగా రూపొందింది.

ఆశ్చర్యం ఏమిటంటే, సాంస్కృతిక రంగంలో ఇంత ఉన్నతి ప్రవేశించిన ఈ స్వాతంత్ర్యయుగోదయంలో ప్రజల గుణాల్లో ఇంత పతనం ఎందుకు ప్రవేశించిందా అని! ప్రత్యేకించి రాజకీయనాయకుల్లో, పెద్ద పదవుల్లో వారు మొదలు చిన్నపదవుల్లో వారి వరకూ స్వార్థం, పరపీడన; ఇంకా అనేక చీకటిగుణాలు విపరీతంగా పెరిగిపోయినాయి. వీరి జీవితాల్లో తమ చుట్టూ వున్న సంస్కృతి ప్రతిబింబించక పోవటం, తమలోని కరుడు కట్టిన చీకటి తమచుట్టూవున్న సంస్కృతిలో ప్రతిబింబించక పోవటం చూస్తే ఈ రెంటి మూలాలూ వేరువేరుఅనిపిస్తున్నాయి. మనుషుల్లో ఈ దుర్గుణాలను ప్రవేశపెట్టింది భారతస్వాతంత్ర్యమే కాని సంస్కృతిలో ఈ సద్గుణాలను ప్రవేశపెట్టింది మాత్రం భారతస్వాతంత్ర్యం కాదు. అంతర్జాతీయంగా మారుతున్న ఆధునిక కాల ప్రభావం మాత్రమే. దీని అర్థం స్వాతంత్ర్యం మంచిది కాదని కాదు. స్వాతంత్ర్యాన్ని ఉపయోగించు కొన్న పద్ధతి మన దేశంలో మంచిది కాక పోయింది. అంతే.

సాంస్కృతిక వాతావరణం మనదేశంలో ఈ స్వాతంత్ర్యయుగోదయంలో సంతరించు కొన్న కాంతి మనుష్యుల్లో పెరిగిన చీకటిని తెలుపు చేయటంలో తీవ్రంగా పనిచేసి స్వాతంత్ర్యయుగోదయానికి నిజమైన విలువ ఇచ్చి స్వాతంత్ర్యం అంటే రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే కాదు, భావ స్వాతంత్ర్యం, జీవనస్వేచ్ఛ అనికూడ రుజువు చేయగలదు అనతికాలంలో.

# సంస్కృత సాహిత్యం

డా. పుల్లెల శ్రీరామచంద్రుడు

## 1

భాషాసమైక్యము, జాతీయసమైక్యము వంటిపదాలకు ఈమధ్య 5 - 6 సం॥లా నుండి మనదేశంలో ఇదివరకెన్నడూ లేనంతగా ప్రచారం సాగుతున్నది. కాని దాన్ని ఇప్పటికీ సాధించలేకపోవడమేకాక ఆ సాధన కుపయోగించే ఎన్నో విషయాలను ప్రయత్నపూర్వకంగా కాలదన్నుతున్నారు. తద్విరుద్ధమైనవాటిని అమల్లోకి తెచ్చుకోవటంకోసం ప్రయత్నం చేస్తున్నారు. భారతసంస్కృతిని, భావసమైక్యాన్ని నిలుపగలిగింది సంస్కృతభాష ఒక్కటే.

**"భరతభువి చిరా దదైౖక్యసంపాదికాయాం**
**త్వయి కిల విలసన్త్యాం మన్యభాషాభిలాషాః**
**అభిలషితవిధాత్ర్యాం కల్పవల్ల్యాం స్థితాయాం**
**బత కటుపులనమ్రాం కాకతుండీం భజామః".**

(ఓ సంస్కృతభారతీ ! ఎంతోకాలంనుంచి ఐకమత్యాన్ని సంపాదించిపెడుతోన్న నీవు వుంటోండగా ఆ స్థానంలో ఇతరభాష నేదో ఒకదానిని తీసికొనివచ్చి కూర్చోపెట్టాలని అనుకోవడం చేరువనే వున్న కల్పలతను విడిచిపెట్టి కాకి దొండపండును సేవించడంవంటిది.)
అన్న ఒకఆధునికకవిసూక్తి ఈసత్యాన్ని ఘోషిస్తున్నది.

## 2

సంస్కృతభాషావాఙ్మయాలనుగూర్చి పాశ్చాత్యులు చేసిన అపప్రచారాలలో ప్రధానములైనవి మూడు. 1. సంస్కృతవాఙ్మయమంతా మతానికి మాత్రమే సంబంధించినది. 2. సంస్కృతభాషావాఙ్మయాలు కేవలం మత ప్రచారకులైన బ్రాహ్మణులకు మాత్రమే చెందినవి. 3. సంస్కృతభాష మృతభాష. స్వాతంత్ర్యోదయానంతరం భారతీయులకు కనువిప్పు కలిగింది. సంస్కృతభాషనుగూర్చిన దురభిప్రాయాలన్నీ ఇప్పుడిప్పుడు క్రమంగా దేశంలోనుంచి తొలగిపోతున్నవి. ఇరతరాష్ట్రాలలోవలెనే మనరాష్ట్రంలో కూడా ఈభాషవిషయంలో సుముఖత్వం కనిపిస్తుంది. చాలాకాలంనుంచి

సంస్కృతభాషకీ,తెలుగుభాషకీ సేవచేస్తున్న విజయనగరం సంస్కృతకళాశాల, హైదరాబాదులోని శ్రీవెంకటేశ్వరవేదాంతవర్ధనీకళాశాల, తిరుపతిలోని ప్రాచ్యకళాశాల, చిట్టిగూడూరులోని నారసింహకళాశాల, కొవ్వూరులోని ప్రాచ్యకళాశాల కాకుండా ఇంకా దాదాపు ముప్పైఆరు ప్రాచ్యకళాశాలలు మూర్తిరాజుగారివంటి వదాన్యశేఖరుల సహాయంతో స్వాతంత్ర్యానంతరం ఆవిర్భవించి సంస్కృతభాషాసేవ చేస్తున్నాయి. స్వాతంత్ర్యానంతరం ఉదయించిన సంస్కృతసేవాసంస్థల్లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సంబంధించిన సంస్కృతఅకాడమీ, తిరుపతిలో కేంద్రప్రభుత్వంవారు స్థాపించిన సంస్కృత విద్యాపీఠం ప్రధానంగా చెప్పుకోదగినవి.

ఎందరోకవులు కావ్యాలు రచించినారు. శాస్త్రపండితులు శాస్త్రగ్రంథాలు రచించినారు. సంస్కృతభాషలోనుంచి తెలుగుభాషలోనికి అనువాదితాలై వెలువడినగ్రంథాలు అత్యధిక సంఖ్యాకంగా ఉన్నాయి. సంస్కృతభాషలోకూడా అనేకరచనలు ఆవిర్భవించినాయి. స్థాలీపులాకన్యాయంగా కొందరిపేర్లు, వారి రచనలపేర్లుమాత్రమే క్రింద చూపుతున్నాం.

1. డా. గిడుగు వెంకటసీతాపతిగారి సంస్కృతకృతుల్లో ప్రధానంగా చెప్పుకోదగింది 'కవితోదయచంద్రిక'. ఇందులో వారు కొన్నిఆంధ్రప్రబంధాల నుంచి రసవత్తరాలైనఘట్టాలు అనువదించినారు. వీరు గురుజాడ అప్పారావు గారి రచనలవంటి రచనలలో వారు వాడిన దేశీఛందస్సులోనే తెలుగులో నుండి అనువదించినారు. 2. అనేకమైన సంస్కృతకావ్యాలు రచించినవారిలో మొట్టమొదట చెప్పదగినవారు శ్రీసన్నిధానం సూర్యనారాయణశాస్త్రీగారు. వీరు పూర్ణపాత్రముమొదలైన తొమ్మిదిస్వతంత్ర కావ్యాలూ, కళాపూర్ణోదయం మొదలైన మూడు ఆంధ్రకావ్యానువాదాలు, 'ఆంధ్రదేశ్యహాస్యకథాః' మొదలైన కొన్ని వచనకావ్యాలూ రచించినారు. వీరిరచనలు పండితులమన్ననలను అందుకొన్నాయి. 3. శ్రీ గరికిపాటి లక్ష్మీకాంతయ్యగారు హరస్తుతి, కీరసందేశః, భవ్యభారతమ్ మొదలైన పద్యాలుగు కావ్యాలు రచించినారు. 4. శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారు 'భక్తభూషణచంపూః' 'జీర్ణతరుః' 'శార్దూలవిక్రీడితమ్' మొదలైన కావ్యాలూ 'వ్యాఖ్యాతృచక్రవర్తీ మల్లినాథః' మొదలైననిబంధాలూ రచించినారు. 5. శ్రీ బొమ్మకంటి రామలింగశాస్త్రి గారు 'దేవయాని' యామిని మొదలైన నాటికలు, 'శ్లోకః శోకత్వమాగతః' మొదలైన ఖండకావ్యాలు, రచించినారు. 6. శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు (ఆంధ్ర) మనుచరిత్రను

చక్కగా సంస్కృతంలోనికి అనువదించినారు. 7. శ్రీ గంటిజోగిసోమయాజులు గారు రాధాకృష్ణపండితుని ఔన్నత్యం వర్ణిస్తూ తత్త్వశాస్త్రానికి సంబంధించిన భావాలతో నిండిన 'రాధాకృష్ణప్రభ' అనే కావ్యం రచించినారు. 8. వరంగల్లు వాస్తవ్యులైన శ్రీవిజయసారధిగారు దాదాపు 15 కావ్యాలు రచించినారు. తెలుగు లోని 'సీసము' మొదలైన ఛందస్సులను సంస్కృతంలో ఉపయోగించడం వీరి కవితలోని విశేషం. 9. ప్రసిద్ధవ్యాకరణపండితులైన శ్రీమాన్ రఘునాథా చార్యులుగారు (వరంగల్లు)వెంకటేశస్తుతి, మణిమాల మొదలైన కావ్యాలు రచించి నారు. 10. శ్రీ యన్. సి. యస్. వెంకటచార్యులుగారు 'యాదగిరిలక్ష్మీనర సింహప్రపత్తి' మొదలైన పద్యకావ్యాలు, 'దివ్యవాణి' అనే వ్యాససంపుటి రచించినారు. 11. శ్రీ కె. రాజన్నశాస్త్రిగారు (ధర్మపురి) పరపుష్టదశకం, బలిపుష్టవిలసితమ్, హరిహరాష్టకమ్, శర్వరీ, మొదలైన 13 స్తోత్ర, ఖండకావ్యాదులు రచించినారు. వీరిరచనలలో నిర్దుష్టమైన సంస్కృతశైలి గోచరిస్తుంది. 12. శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు (నెల్లూరు) 'ఆర్యాత్రి శతి' మొదలైన కావ్యాలూ, 'జయ' మొదలైన వ్యాఖ్యాగ్రంథాలూ, 'ధాతురూప దర్పణం' మొదలైన వ్యాకరణగ్రంథాలూ రచించినారు. 13. శ్రీమాన్ యస్. టి. జి. వరదాచారిగారు (చిట్టిగూడూరు) అనేక స్వతంత్రరచనలు చేయడమే కాకుండా'సుమతీశతక''దాశరథీశత'కాదులనుకూడా సంస్కృతంలోనికిచక్కగా అనువదించినారు. 14. డా. పుల్లెల శ్రీరామచంద్రుడు సంస్కృతంలోనికి గీతాంజలిని అనువదించినాడు. సుసంహతభారతం అనేనాటకం రచించినారు. 15. వీరుకాక సుప్రసిద్ధాంధ్రకవులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ పుట్ట పర్తి నారాయణాచార్యులుగారు మొదలైనవారు సంస్కృతంలోకూడా ఖండ కావ్యాలు (స్తోత్రరూపాలు) రచించినారు. 16. శ్రీకె. వి. యల్. యన్. ప్రసాద మూర్తిగారు (గుంటూరు) సంస్కృతంలోకూడా అష్టావధాన శతావధానాదికాలను ప్రచారంలోనికి తీసికొని వచ్చినారు. 17 శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారు వైయాకరణభూషణసారంవంటి ఉద్గ్రంథాలమీద వ్యాఖ్యానాలు రచించినారు. 18. వీరుకాక శ్రీ మల్లికార్జునరావుగారు (రాజమహేంద్రవరం), శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు, శ్రీ అప్పారావుగారు (కొవ్వూరు) శ్రీ కాశూరి హనుమంతరావు గారు మొదలైనవారు సంస్కృతభాషలో ఖండకావ్యవ్యాసాదులు రచించినారు.

తెలుగు గ్రంథరచనకి ఉపయోగించేభాష అయినదిమొదలు నేటివరకూ దానికి సంస్కృతభాషతో అతిఘనిష్ఠమైన సంబంధం ఉంది. అందుచేత

సంస్కృతశాస్త్రీయగ్రంథాలన్నీ తెలుగులోనికి అనువదించడంగాని, లేదా వాటికి విస్తృతవ్యాఖ్యలు వ్రాయడం కాని జరుగుతూనే ఉంది. గడచిన 25 సంవత్స రాలలో ఈకృషికి కొందరువిద్వాంసులు తోడ్పడినారు. శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు ఎన్నో అలంకారశాస్త్రగ్రంథాలు తెలుగులోనికి అనువదించి నారు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు, శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారు మొదలైనవారుకూడా ధ్వన్యాలోక, రసగంగాధర, ప్రతాపరుద్రీయాది అలంకార గ్రంథాలకీ, పుల్లెల శ్రీరామచంద్రుడు లఘుసిద్ధాంతకౌముదికీ విస్తృతవ్యాఖ్యలు రచించినారు.

సంస్కృతగ్రంథప్రచురణకూ, సంస్కృతభాషాదిప్రచారానికి ఎన్నో సంస్థలుకూడా ప్రయత్నం చేస్తున్నాయి. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ఇతరభాషలతోపాటు సంస్కృతానికి కూడా చేయూత ఇచ్చి ఎన్నోసంస్కృత గ్రంథాలు ప్రకటించడమేకాకుండా కొన్నిగ్రంథాలప్రచురణకోసం ధన సహాయం చేస్తున్నారు. డా. బి. రామరాజుగారు ఐదారుగ్రంథాలు సంపాదించి ప్రకటించినారు. ఈవిషయంలో అకాడమీఅధ్యక్షులైన డా. గోపాలరెడ్డి గారికీ, కార్యదర్శులైన శ్రీ రామానుజరావుగారికీ గల సంస్కృతభాషానురాగం ప్రశంసార్హం. హైదరాబాదులో రెండున్నరసంవత్సరాలక్రితం ఆవిర్భవించిన 'సురభారతీసమితి', వరంగల్లులోని 'గీర్వాణభాషాభివర్ధనీసభ' మొదలైనవి యథాశక్తిగా సంస్కృతభాషాప్రచారానికై ప్రయత్నం చేస్తున్నాయి.

పదిహేనుసంవత్సరాలక్రితం ఆంధ్రప్రదేశ్‌లో సంస్కృతభాషలో Ph.D., డిగ్రీపొందినవారే లేకుండిరి. అందుకు తగిన సౌకర్యాలు లభించడంతో ఇప్పుడు ఎందరో పరిశోధనలు చేస్తున్నారు. శ్రీ వేలూరి సుబ్బారావుగారు 'వాక్యార్థవిచారం' అనేవిషయంమీదా, శ్రీరామమూర్తిగారు 'ఆంధ్రుల సంస్కృతసేవ' అనేవిషయంమీదా. శ్రీ బి. ఆర్. శాస్త్రిగారు 'దండి' మీదా, శ్రీ ప్రమోదలాలేగారు 'దేవీభాగవతం'మీదా, శ్రీ సి. మార్కండేయశాస్త్రిగారు నైష్కర్మ్యసిద్ధిమీదా, శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు జగన్నాథుని రసగంగా ధరంమీదా, శ్రీ పీసపాటి వెంకటేశ్వర్లుగారు 'వ్యక్తివివేకం'మీదా పరిశోధనా వ్యాసాలు వ్రాసి Ph.D., డిగ్రీలు సంపాదించుకున్నారు. ఇంకా ఎందరో పరిశోధనలు జరుపుతున్నారు.

అనతికాలంలో ఆంధ్రప్రదేశ్‌లో సంస్కృతవిశ్వవిద్యాలయం అవత రించనున్నదనేవిషయం అత్యంతా మోదావహం. ఈవిశ్వవిద్యాలయం సంస్కృతం పట్ల కొందరిలోఉన్న అపోహలు పోగొట్టి ఆంధ్రప్రదేశ్‌లోనేకాకుండా మొత్తం భారతదేశం అంతటా సంస్కృతప్రచారానికి తోడ్పడుతుందని ఆశించవచ్చు.

# తెలుగు - ఉర్దూ భాషాసాహిత్యాలు

శ్రీ తే. గోపాలకృష్ణరావు

బహమనీ, కుతుబ్‌షాహి సుల్తానులకాలమునుండి తెలుగుమండలమున మహమ్మదీయుల ప్రాభవ మధికముగా నుండెను. ఆసఫ్‌జాహీలకాలమున కర్ణాటకమహారాష్ట్రప్రాంతములోని కొన్నిజిల్లాలును తెలంగాణపు జిల్లాలును కలిసి హైదరాబాదుసంస్థానముగ రూపొందియుండెను. ఉత్తర దక్షిణ భారత దేశమునకు మధ్యలోనున్న ఈ రాష్ట్రము విభిన్నభాషలకు సంస్కృతులకు కూడలిగ ప్రసిద్ధివహించెను. ఉర్దూ రాజభాషగను, బోధనాభాషగను పరిపాలన యంత్రాంగమున కాధారభాషగను, ముఖ్యమైన వ్యవహారభాషగను స్థిరపడి యుండెను.

భారతదేశ స్వాతంత్ర్యానంతరము సంస్థానవిలీనీకరణముతో ఈరాష్ట్రము స్వతంత్రప్రతిపత్తిని గోల్పోయినది. భాషారాష్ట్రముల ఏర్పాటుతో సంస్థాన స్వరూపము మారినది. ఆంధ్రప్రదేశ్ అవతరణముతో ఈ రాష్ట్రములోని కర్ణాటక మహారాష్ట్ర ప్రాంతము లాయా భాషారాష్ట్రములలో చేరినవి. ఆంధ్ర రాష్ట్రములోని జిల్లాలును, తెలంగాణములోని జిల్లాలును కలిసి ఆంధ్రప్రదేశ్‌గా రూపొందినవి. ఉర్దూకు గల రాజభాషాగౌరవ మంతరించినది. బహమనీకాలము నుండి ఇచ్చట స్థిరపడిన మహమ్మదీయుల కది మాతృభాష - ఇతరరాష్ట్రీయులకును, వర్గీయులకును, ప్రధానమైన వ్యవహారభాష - తెలుగువారికి, ప్రధానముగా తెలంగాణామండలము వారికి సుపరిచితమైనభాష - భారతదేశము లోని ఉర్దూభాషా సాహిత్యముల కేంద్రములలో హైదరాబాదు విశిష్టస్థానము వహించుచున్నది. దీని ప్రాధాన్యమును గుర్తించియే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు అధికారభాష అగు తెలుగుతోపాటు ఉర్దూకుకూడ సముచితస్థానము నొసగి యున్నారు. ఇటీవల కేంద్రప్రభుత్వమువారు ఈ భాష అభివృద్ధికై ఒకప్రత్యేక కమిటీనికూడ నియమించినారు.

తెలుగుభాషపై ఉర్దూ అధికారభాషగా అమితమైనప్రభావమును గలిగించి యుండెను. వేలకొలది అరబీ-ఉర్దూ-పారశీక పదములు తెలుగులో చేరినవి- తెలుగువారు ఉర్దూభాషా సాహిత్యములతో సుపరిచితులైరి. ఉర్దూ మాతృభాషగా గలవారును, ప్రధానవ్యవహారభాషగా గలవారును, రాష్ట్రములో తెలుగుప్రజలతో

పాటు జీవించుచున్నారు. వారి సాహచర్యమున ఉర్దూ అధికారభాషగా కాక సాంస్కృతిక స్థాయిలో ప్రభావమును ప్రసరింపజేయుట సహజమే। నేడు ఉర్దూ నిర్బంధబోధనాభాష కాదు - ఐచ్ఛికమగుభాష మాత్రమే. వ్యవహారము నందును వాఙ్మయమునందును, 'అవసరము' నిమిత్తమై వచ్చిన పదజాలము మాత్రమే ప్రయోగింపబడుచున్నది. ముద్దాయి-గుండీ-సిరా-కలము-కుర్చీ-జాబు మున్నగునవి ఇట్టివి. 'అవసరము - ప్రభావము' అనువాని తత్త్వమే చిత్రమైనది. అవి కొందరికి, కొన్నిఅవస్థలకు, కొన్నిప్రాంతములకు మాత్రమే పరిచితమై యుండును. శతాబ్దముల తరబడి రాజకీయముగను, సాంస్కృతికముగను ఆంగ్లభాషాసంస్కృతుల ప్రభావము ప్రగాఢముగా నున్నను, భారతదేశములోని మారుమూలల గ్రామములందు పాశ్చాత్యభాషాసంస్కృతుల గాలి సోకనివారుండినట్లే, మహమ్మదీయుల ఏలుబడిలో నుండిన తెలుగువారిలో ఆభాషా సంస్కృతులవాసన తెలియనివారును ఉన్నారు. నేడు ఉర్దూచదువువారిలో నాభాషలో వ్రాయువారిలో తెలుగువారితరము అంతరించుచున్నది. నేటి యువతరమువారు ఉర్దూతో వ్యవహారభాషగా మాత్రమే పరిచితులు. పారశీక లిపి తెలియనివారు హిందీ మున్నగుభాషలద్వారా ఉర్దూభాషాసాహిత్యములను పరిశీలించుచున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోని అధికసంఖ్యాకులైన తెలుగువారిప్రభావము ఉర్దూ మాతృభాషగాగలవారిపై ప్రసరించుట సహజమే. ప్రాచీనకాలమున వ్యవహారములో ఉర్దూపై తెలుగుప్రభావ మెంతవఱకు ఉండెనో, గ్రహించుటకు ఆధారములు లేవు. ఈప్రాంతములో వెలువడిన నాటిఉర్దూవాఙ్మయములో తెలుగు ప్రభావ మంతగా లేదు. గోలకొండ సుల్తానులలో ఇబ్రహీం కులీకుతుబుషా తెలుగు వారికి సుపరిచితుడు. ఈతడు విజయనగరములో నున్నప్పుడు ఈతనికి తెలుగు భాషాసంస్కృతులతో ప్రగాఢపరిచయ మేర్పడియుండును. కాని ఈతని ఉర్దూ రచనలు ఏవియును లభించలేదు. భాగ్యనగరనిర్మాత మహమ్మద్ కులీ స్థానిక భాషాసంస్కృతులపట్ల విశేషమైన ఆదరమును వ్యక్తీకరించెను. 'ఈతనికృతులలో 'ఏమిరే ఏం' 'దొర' -మున్నగు తెలుగుపదములు కన్పించును. దక్కన్ ఉర్దూసాహిత్యములో పదిపన్నెండు తెలుగుపదములు నాదృష్టికి వచ్చినవి. తెలుగునుడికారములోని ఛాయలుకూడ ప్రస్ఫుటముగా నున్నట్లు స్పష్టమగు చున్నది. ఈలోపము నింకను నిశితదృష్టితో పరిశీలింపవలసి యున్నది.

తెలుగులో సుపరిచితులైన మహమ్మదీయులును, తెలుగుభాషలో

పాండిత్యము సంపాదించి ఉత్తమగ్రంథములను రచించినవారు తెలుగుదేశములో ఎందరో ఉన్నారు - ఉర్దూ మాతృభాషగా గలవారు వ్యవహారములో తెలుగు పదజాలమును వాడుచున్నారు. వాఙ్మయములో అట్టి పదజాలముకాని సాహిత్యముపై తెలుగుప్రభావముకాని స్వల్పముగా నున్నది. ఉర్దూ రచయితలకు తెలుగులో ప్రగాఢపరిచయ మేర్పడినపు డీప్రభావ మధికము కావచ్చును. ఆధునిక ఉర్దూ కవులలో నొకరిద్దరు తమ గేయములలో మామ - అన్న - బతకమ్మ - చెంబు మున్నగుపదములను ప్రయోగించినారు. చెంబు అనుపదము విశేషార్థమున గలదు కొన్నిచెంబులవలె వెడల్పు మూతి - సన్ననికంఠము - విశాలమైన నడుము గల వ్యక్తి నుద్దేశించి ఈపదము ప్రయుక్తము.

తెలుగుపై ఉర్దూభాష ప్రభావము చిరకాలము నుండి కన్పించును. కాని ఉర్దూసాహిత్య ప్రభావము గతశతాబ్ద్యంతమున బీజప్రాయముగనుండి ఈశతాబ్ది ఆరంభమున అంకురప్రాయమై గతదశాబ్దద్వయమునుండి వివిధశాఖలలో విస్తృతమైనది. ఉర్దూకథానిక - నవల - గజల్ ప్రక్రియలు తెలుగు సాహిత్యముపై ప్రగాఢమైన ముద్రవేసినవి - స్వాంతంత్ర్యానంతరదశలో జాతీయసమైక్యత - సాంస్కృతిక సమ్మేళనము - ఆదానప్రదాన సాహిత్యవ్యాసంగము - మున్నగు ఉద్యమములు తెలుగు ఉర్దూసాహిత్యముల పరస్పర ప్రభావమునకు దోహద మొసగినవి.

మున్షీప్రేమ్‌చంద్ కథానికా శిల్పము - మానవతావాదము తెలుగువారిని విశేషముగ నాకర్షించినవి. ప్రేమ్‌చంద్‌సాహిత్య సౌరభమును తెలుగునాట గుబాళింప జేసినవారిలో కీ. శే. ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు గారు విశిష్టులు. కాలక్రమమున ప్రేమ్‌చంద్ సాహిత్యమును ఉర్దూమూలము ననుసరించి కొందరును హిందీమూలము ననుసరించి మఱికొందరును ఆంధ్రీకరింపసాగిరి. గడచిన రెండు దశాబ్దములలో ఇట్టి అనువాదము లనేకము వెలువడినవి. ప్రేమ్‌చంద్ అనువాదకులలో వల్లభ్, చావలి రామచంద్రరావు, లల్లన్, విశ్వప్రసాద్, ఛాయేశ్వర్, వేమూరి ఆంజనేయశర్మ, ఎన్. సోమయాజులు మున్నగువారు, ప్రముఖులుగా నున్నారు. నేనుకూడా "అఖరీతౌహఫా" అను పేర సంకలితమొనర్చబడిన ప్రేమ్‌చంద్ కథానికలో మూడింటిని అనువదించియుంటిని. ప్రేమ్‌చంద్ పబ్లికేషన్సు, ఉమా పబ్లిషర్సు, జనతా పబ్లికేషన్సు, విశాలాంధ్ర ప్రచురణాలయము వారు ప్రేమ్‌చంద్ అనువాదములను దేశవ్యాప్తముగ బహుళప్రచార మొనర్చుటకు విశేషముగ ప్రయత్నించిరి.

ప్రేమ్‌చంద్ తరువాత తెలుగువారికి సుపరిచితుడైన ఉర్దూ కథానికా రచయిత కృష్ణచందర్. ఈత డభ్యుదయవాది. వాస్తవికజగత్తులోని విభిన్న మనస్తత్వములకు ప్రతీక లనదగిన వీరి కథానికలలో ఎనిమిదింటిని జ్ఞానేంద్రగా రనువదించి 'కృష్ణచందర్‌కథలు' అనుపేర ప్రకటించిరి. ఈపరిచయముతో తెలుగువారికి ఉర్దూలోని మఱికొన్ని విశిష్టకథల ననువదించు సంకల్పము కలిగినది. వేమూరి ఆంజనేయశర్మగారు, ప్రొఫెసర్ ముజీబ్, జాకిర్ హుస్సేన్, రుక్తియాసిహానా, అక్తర్‌హుస్సేన్, మంటో మున్నగువారికథల నాంధ్రీకరించిరి. రవిగారు ఖాజాఅహమద్ అబ్బాస్ కథల ననువదించిరి. ఉర్దూ కథాసాహిత్య వికాసమునకు మైలురాళ్ళుగ నున్న విశిష్టకథలను చంద్రమౌళిశాస్త్రిగారిచే ననువదింపజేసి 'ఉర్దూకథలుగ' ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కృషి ఈసందర్భమున ప్రత్యేకముగ గమనింపదగినది. ఈ గ్రంథమున అహమ్మద్ అలీ, గులామ్ అబ్బాస్, అక్తర్‌హుస్సేన్ రాయపురీ, డా॥ రసీద్‌జహాం, ప్రేమ్‌చంద్, కిషన్‌చంద్, ఇబ్రహింజలీస్, సాదత్‌హసన్ మంటో, హయతుల్లా అన్సారీ, అస్మత్‌చుగ్తాయి, రాజేంద్రసింగ్‌బేదీ, ముంతాజ్‌ముఫ్తీ, ఖురతుల్‌అయిన్‌హైదరీ, మున్నగువారి కథల అనువాదములు గలవు. ఉర్దూ కథానికా శిల్పమును, వైశిష్ట్యమును గ్రహించుటకు తెలుగువారి కెంతయో దోడ్పడునట్టి కథలివి. సుప్రసిద్ధరచయితలగు డా॥ జోర్‌గారు గోలకొండ చరిత్రకు సంబంధించిన గాథలను రచించి "సైరెగోలకొండ" అను పేర ప్రకటించియుండిరి. డా॥ పల్లా దుర్గయ్యగారు ఈసంపుటిలోని కొన్ని కథలను ఆంధ్రీకరించిరి. శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారును, నేనును కొన్ని ఉర్దూకథల ననువదించియుంటిమి. పత్రికాముఖమున నెడనెడ ఉర్దూకథల అనువాదములు వెలువడుచున్నవి. అన్యాపదేశ, దృష్టాంతపూర్వకములగు నీతికథలు, హారూన్‌రషీద్ మున్నగువారికి సంబంధించినట్టివియును, వినోదహాస్య చమత్కారపూర్వకములగు అలీబాబా కథలును, ఎన్నియో అనుసరణరూపమునను అనువాదరూపమునను వెలువడినవి.

ఉర్దూనవలలు కొన్ని మాత్రము తెలుగులోనికి వచ్చినవి. ప్రేమ్‌చంద్ నవలలో నిర్మల - సేవాసదనము - మంగళసూత్రము అనునవి ఆంధ్రీకరింపబడినవి. గతసంవత్సరము రాజేంద్రసింగ్‌బేదీగారి ఉర్దూనవలకి 'ఏక్‌చాదర్ మైలీసీ' అను దానికి నే నొనర్చిన అనువాదము, దాశరథి రంగాచార్యులుగారు ఆంధ్రీకరించిన 'ఉమ్రావ్‌జాన్‌అదా' అనునవలను కేంద్రసాహిత్యఅకాడమీ

వారు ప్రకటించిరి. ఇతర వచనగ్రంథముల అనువాదములలో కీ. శే. అబుల్ కలామ్‌ఆజాద్‌గారి 'గుబారెఖాతర్' అను గ్రంథమునకు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారొనర్చిన అనువాదము విశిష్టమైనది.

ఇటీవల ఆదానప్రదాన సాహిత్యకార్యక్రమము ననుసరించి కొన్నిసంస్థలు ప్రసిద్ధములైన తెలుగుకథలను నవలలను ఉర్దూలోనికి అనువదింపజేయుచున్నవి. నేషనల్‌బుక్‌ట్రస్ట్‌వారు శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి 'పేక మేడలు' అనునవలను శ్రీమతి జీనత్‌సాజిదాగారిచే ఉర్దూలో అనువదింపజేసి ప్రకటించినారు. ఈ నవల హిందీ అనువాదముద్వారా ఉర్దూలో పరివర్తింపబడినది. నేషనల్‌బుక్‌ట్రస్టువారు శ్రీ పాండురంగారావుగారు సంకలితమొనర్చిన ఉత్తమ తెలుగుకథానికలను నాచే ఉర్దూలో అనువదింపజేసినారు. ఈ అనువాదములో ఉర్దూవారికి తెలుగుకథానికా వైశిష్ట్యము వెల్లడికాగలదు.

పారశీక గజల్ గమనమును తొలిసారిగ తెలుగులో అనువదించినవారు గురుజాడ అప్పారావుగారు. కాళోజీగారు ఉర్దూ గజల్ స్వరూపమును, ఉర్దూకవిత్వపురుచిని చూపినవారిలో ఆద్యులు. దాశరథిగారును, డా.నారాయణరెడ్డిగారును ఉర్దూకవితాంకురమును తెలుగునాట శోభిల్లజేయుటలో విశేషముగ కృషినొనర్చిరి. దాశరథిగారు 'మంజరి' రూపమున తెలుగుగజల్ వ్రాసిరి. వీరు గాలిబ్, మీర్, జఫర్ మున్నగు ప్రసిద్ధ ఉర్దూకవుల గజళ్ళలోని కొన్నిభాగములను ఆంధ్రీకరించిరి. డా. నారాయణరెడ్డిగారు ఉర్దూగజళ్ళలోని అంత్యనియమములను, కవి వర్ణనసమయములను, చమత్కృతిని, కవితాసౌందర్యమును తమగేయముల కలవడజేసిరి. ఇటీవల వీరురచించిన గేయములందు ఖవాలీ ముద్ర ప్రగాఢముగ కనిపించుచున్నది-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు కూడ ఈరంగమున ప్రశంసార్హమగు కృషి నొనర్చుచున్నారు. సదాశివగారి 'అమ్జద్ రుబాయిల' అనువాదమును మఱికొన్ని అనువాదములను వీరు ప్రకటించియున్నారు యువకవులు బుచ్చారెడ్డి ప్రభృతులు కొన్ని ఉర్దూగేయములను ఆంధ్రీకరించినారు.

తెలుగు కవితా సౌందర్యమును ఉర్దూభాషజ్ఞులకు దర్శింపజేయుటలో ఉర్దూ వచ్చిన తెలుగుకవులు ప్రయత్నించుట అవసరము. ఈరంగమున జరిగిన కృషి స్వల్పముగా నున్నది.

తెలుగులో ఉర్దూ పారశీక సాహిత్యరచనకు పునాదివేసినవారు కీ॥ శే॥ డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారు ఉర్దూ సాహిత్యచరిత్రను సదాశివగారిచే అనువదింపజేసి ప్రకటించినారు. ఆంధ్ర సాహిత్యచరిత్రను శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును, శ్రీమతి జీనత్

సాజిదగారును ఉర్దూలో రచించిరి. ఈరెండు సాహిత్యచరిత్రలు ఉర్దూ తెలుగు సాహిత్యచరిత్రల తులనాత్మక పరిశీలనమునకు, ఆయా సాహిత్యముల స్వరూపమును గ్రహించుటకు పరస్పరము తోడ్పడుననుటకు సందేహములేదు. ఆధునికాంధ్రకవిత్వము - గోలకొండనాటి తెలుగుసాహిత్యము - మొదలగు అంశములగూర్చి నేను ఉర్దూలో కొన్నివ్యాసములు వ్రాసిఉంటిని. ఇవి ఢిల్లీనుండి వెలువడు 'ఆజ్ కల్' పత్రికయందును, స్థానికపత్రికలందును ప్రచురింపబడినవి - గోలకొండనాటి అరబీ ఉర్దూకవుల గూర్చి తెలుగులో కొన్నివ్యాసములు కూడ ప్రకటించినాను.

నిఘంటువులు భాషకు మూలనిధివంటివి. ఉర్దూతెలుగు నిఘంటువు కూర్చినవారిలో శ్రీ కొండలరావుగారు ప్రథమగణ్యులు. నేటివిద్యాప్రణాళికలో ఉర్దూ మాతృభాషగా గలవారికి తెలుగు అనుబంధభాషగా నభ్యసించుసౌకర్యము కలదు. ఉర్దూవిద్యార్థులకు ఉపకరించురీతిలో అంజుమన్ తరక్కీ ఉర్దు హైదరాబాదువారు నాచేతను, డా. బి. రామరాజుగారిచేతను తెలుగు ఉర్దూ - ఉర్దూ తెలుగు నిఘంటువుగా సంతరింపజేసియున్నారు. ఇందు వివిధశాస్త్రములకు సంబంధించిన పారిభాషికపదములు ప్రత్యేకముగ జేర్చబడినవి. పండితులకును, అనువాదకులకును తోడ్పడురీతిలో బహుళార్ధసాధకముగ ప్రణాళికను రూపొందించి ప్రభుత్వఅనువాదసంస్థ కాని సాహిత్య అకాడమీకాని తెలుగు-ఉర్దు; ఉర్దు-తెలుగు బృహన్నిఘంటువును ప్రచురింపవలసిన అవసర మెంతేని కలదు.

తెలుగుపై ఉర్దూ భాషాసాహిత్యముల ప్రభావము నేను రచించిన 'తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము' అను గ్రంథములో విపులముగ బరిశీలింపబడినది. ఈ గ్రంథములోని అంశములు ఉర్దూవారికి తెలియుటకై దీనిని ఉర్దూలోకూడ వ్రాసినాను. ఈగ్రంథరచన సందర్భమున తెలుగులో ప్రవేశించిన అరబీ - ఉర్దూ - పారశీకపదములగూర్చి నూత్నాంశములు తెలిసినవి. ఈసామగ్రి ఆధారముగ తెలుగుభాషలో ప్రవేశించిన అన్యదేశ్యముల గూర్చి ప్రత్యేకముగ నొకనిఘంటువును కూర్చుచున్నాను. యూనివర్సిటీ గ్రాంట్సుకమీషన్‌వారు ఆర్థికముగా కొంతసహాయమునుకూడ ప్రకటించినారు.

తెలుగు ఉర్దూభాషాసాహిత్యముల పరస్పర ప్రభావమును గూర్చి చేయబడిన సంగ్రహసమీక్ష ఇది - గడచిన రెండు దశాబ్దములలో జరిగిన కృషిని అనుసరించి ఉత్తరకాలమున ఈ ప్రభావము వివిధప్రక్రియలరూపమున ప్రసరించి సాంస్కృతికాభ్యున్నతికి జాతీయసమైక్యతకు పటిష్ఠమైన పునాదిగా ఏర్పడునని ఆశింతము.

# యువతరం - కవిత

శ్రీ ముకురాల రామారెడ్డి

**మొదటిదశాబ్ది :**

దేశానికి రాజకీయమైన స్వాతంత్ర్యం లభించిననాటికి 20 - 30 ఏండ్ల నడుమ ఉన్నవారినీ, అదేవరుసలో ఆతర్వాత వచ్చినవారినీ ఆలోచనలతీరును బట్టి మూడువర్గాలుగా విశ్లేషించుకోవచ్చు. 1. కవితారంగంలోను, జీవిత రంగంలోను వచ్చిన మార్పులకు చాలాదగ్గరగా ఉండి, వాటిని అర్థం చేసుకొని తమ ప్రతిభతో వ్యాఖ్యానించేవారు. 2. ఈ మార్పులతో సంతృప్తిపడక రావలసినమార్పులు ఇంకా ఉన్నవని వాటిని గురించి చెప్పేవారు. 3. ఆతరం లోనే ఉన్నా ఆలోచనలో కొన్నితరాలు వెనుకబడినవారు. ఈ మూడో వర్గం వారిని ఇక్కడనే మరచిపోవచ్చు. నష్టమేమీ లేదు. పైరెండువర్గాలవారిలో ఎవరి భావాలకు ప్రథమస్థానమీయాలె అన్నది సమస్య కారాదు. క్రమంగా చూస్తూరావడం, అందులోనూ నాటికి నేటికి అవిరళంగా రచనలుచేస్తూవస్తున్న వారిని పేర్కొవడం ప్రథమ కర్తవ్యం.

"రక్త సింహాసనంకోరలు
తాగినవి మన రక్తధారలు
ఇది బుజం ఊపేసి చెప్పే ఒకనిజం !"

చబుకులవంటి గేయాలు కొత్తజలుకులు ఇట్లాంటివి. కాబట్టే కవిగా పుట్టినవెంటనే ఖైదుశిక్ష అనుభవించ వలసివచ్చింది దాశరథికి. పండితరాజు జగన్నాథుడు తనకవితాప్రతిభకు జరిగిన అన్యాయాన్ని మనసులో ఉంచుకొని అన్యాపదేశంగా 'ఓ తక్కెడా ! (మొగలాయిరాజుల ధర్మచిహ్నం) నీవు తేలిక పదార్థాలను పైకెత్తుకొంటావు, బరువైనవాటిని దిగదోస్తావు'అన్నంతమాత్రానికే జైలుకు వెళ్ళవలసివచ్చింది. ఇక నిజాంరాజు సంస్కరణలను 'ముసలినక్క' జిత్తులతో పోల్చి ప్రజలపోరాటాన్ని సమర్థించి పద్యాలు రచించిన కవి జైలుకు పోవడంలో ఆశ్చర్యంలేదు. క్రమక్రమంగా ఈయన రచనలో మార్క్సియ భావనలు ధ్వనించినాయి. నాటి ఆంధ్ర సాహిత్యవీధులలో ఈయన రెండవ శ్రీశ్రీ అనిపించుకొన్నాడు. వచనకవితను వచనదశలో చూపినాడు. నడుము విరిగిన పద్యాన్ని నడిపించి నవ్వించినాడు.

'కవితాశరథి' అయిన దాశరథి భావాలలో ఆవేశ మెంతో సంయమనం కూడా అంతే కనిపిస్తుంది. నిజామాబాదు జైలుగోడలమీద బొగ్గుతో వ్రాసిన పద్యం (నా తెలంగాణ కోటిరత్నాలవీణ) మొదలుకొని నేటివరకు ప్రచురించిన ఈయన కవితలన్నీ ఒక ప్రత్యేక పరిశోధనకు తగిన సామగ్రిగా సిద్ధంగా ఉన్నాయి. నాటికీ నేటికీ ఈయన పాఠకులగుండెలమీద రాజ్యం చేస్తూనే ఉన్నాడు.

దాశరథితోపాటే మేల్కొని పరపీడాకరుల పెరళ్ళలో పిడుగులు కురిపించిన యువకవి సోమసుందర్. వీరిద్దరి విశ్వాసాలకూ పోలిక లున్నాయి. ఇద్దరి కావ్యాలూ తొలిసారిగా 1949 లోనే ప్రచురితమైనాయి. ఇద్దరికీ ప్రజాస్వామ్యపు విలువలపై నమ్మకముంది. సోమసుందర్‌కూడా రజాకార్ల ఫర్మానాలకు ఎదరు తాఖీదులు పంపినాడు (బానిసల దండయాత్ర). ప్రజలపక్షమై అధికారపక్షాన్ని ఎదుర్కొన్నందుకు దాశరథిని జైలులో పెడితే సోమసుందర్ కావ్యం (వజ్రాయుధం) నిషేధానికి గురిఅయింది.

1953 లో సంభవించిన 'గోదావరి జలప్రళయం' ఈయన సృష్టిలో కవితాతరంగిణిగా పారింది.

"ప్రసవించిన పులివై నీ కన్నబిడ్డలను మమ్ముల
కోరలెత్తి మ్రింగుట ఇది ఏమిన్యాయమ్ తల్లీ"

వంటి పంక్తులలో కవి ప్రాణాలు అరచేతపట్టుకొన్న ప్రజలలో ఒకడై అంగలార్చినాడు. ఉప్పొంగిన గోదావరినిచూచి కవిగా పలికిన పలుకుబళ్ళు అనేకాలు.

"తాళవృంతమై వీచెడు నీ తరగలు తల్లీ
తాళవృక్షమెత్తు పొంగెనేల నేడు తల్లీ"

మరోప్రక్క ఆరుద్ర బయలుదేరినాడు. ఈయన రచనలలో గూడా తెలంగాణా ప్రజలపోరాటం ప్రతిధ్వనించింది (త్వమేవాహం). ఈయన ప్రవేశపెట్టిన సింబాలిజమ్ (ప్రతీకవాదం) టి. యస్. ఇలియట్ జాడలను జ్ఞాపకం చేస్తుంది. సంస్కృతంలోఉన్న చిత్రవిచిత్రధోరణుల నన్నిటినీ ప్రాచీనాంధ్రకవులు తెలుగులో ప్రవేశపెట్టి చూపినట్లు ఆధునిక ఆంగ్లకవిత్వంలో కనిపించిన పోకడలనన్నిటినీ తెలుగుకవు లెందరో దిగుమతిచేసి చూపినారు. 'సీతాకోకచిలుక' నాటిక ఈయన సృజనాత్మకతకు మచ్చుతునక.

"Brain లో Pain,
ప్రతి Vein లో Machine gun rain"

ఇట్లాంటివి రచించడానికి కారణ మేదైనా ఆధునిక మణిప్రవాళశైలి ఒకటి కుదిరింది. దీనిని తమాషాగా భావించవచ్చు.

"జీవితం విటీక బోధచేయువాడు లేడులే
బావి ఎండిపోయినట్టి బావి కీడుమూడులే"

నిరుత్సాహకరమైన వస్తువును ఉత్సాహవృత్తంలో రచించిన ప్రయత్నంలో ప్రాచీనుల 'ముద్రాలంకారం' పై విపరీత ప్రయోగం.

'జీవితం రేడియోసెట్టుకి
భర్త ఏరియల్ భార్య ఎర్తు'

అనువదించడానికి వీలులేని ప్రసిద్ధ పరిభాషను ఉన్నది ఉన్నట్టుగా స్వీకరించక తప్పదు. ప్రకటితమైన భావం సరికొత్తది. ఇట్లాంటి కొత్తసర్కసులు ఇంతకు ముందే చేసి చూపిన వారిలో 'పఠాభి' గణనీయుడు.

తిలక్ ప్రవేశించి స్వతంత్ర భావాలను అనుభూతుల పరిమళాలతో మిళాయించి పంచిపెట్టినాడు. ఈయన కల్పించినదంతా కవిత్వ మయింది. ఊహకు తగిన ఉక్తివిశేషాన్ని ఎన్నుకోవడం బాగా చేతనైనవాడు. కొందరు పుట్టినతర్వాత కవిత్వంలో ప్రవేశిస్తారు. కవులైపోతారుగూడా. కొందరు కవులుగానే పుడతారు. తిలక్‌నుగురించి చెప్పవలసివస్తే ఈయన కవిత్వంలోంచే పుట్టుకొనివచ్చినాడు. ఈసంగతి గుర్తించే ఈయన 'కవితాపుత్రుడు' అన్నాడు శ్రీశ్రీ. ఈయన ధ్వనింపజేసిన నిజాలలో ఇజాలెన్నో దోబూచులాడు కొన్నాయి. కవులు కాగోరిన వాళ్ళకంతా ఈయనరచనలన్నీ ఒక 'న్యూ సిలబస్'. అన్నివస్తువులనూ అవస్తువులను చేసి సమస్త వస్తువూ తానే అయిన చీకటిని వరించి, మన్వంతరాల మానవజీవిత రహస్యాలను స్మరించిన భావ శైలి కొత్తలోకెల్ల కొత్తగాఉంది.

"రావే నల్లనిదాన.... ... ...
రావె। మిణుగురు లద్దిన రమ్యచేల
ములకొసలు నేల జీరాడ మోహనాంగి।
చిత్తుగా త్రాగివచ్చిన శ్రామికుని కన్ను
రెప్పలమైకమ్ము రేకహత్తి
పాడింటి అరుగుపై పడి గతించిన ముష్టి
ముసలిపై నల్లనిముసుగు గప్పి

రమ్మ భావదుఃఖితుడ నా ప్రాంగణమున
అంధకారసుందరివి నా అనుగుచెలివి."

కాళరాత్రిలో వైదేహినిందాచరిత్రము జాలిజాలిగా కర్ణపాళికి సోకిందట. క్లియోపాత్ర సీహార సౌందర్య మలసి వ్రాలిన విషాదాంత మొరసిందట. ఫల్గుని గాండీవగుణశబ్దగానము వినిపించిందంట. సుగతుని నిర్వాణకేళా విమూఢ జగద్దైన్యమూర్తి తోచిందట, 'అబ్బబ్బ! ఎంత సునిశిత పరిశీలన రాత్రి! లేదు నీకన్న నల్లనినిజమ్ము' అంటాడు. 'ఓసి నిశాచరోత్సవమహోదయమా! గత కాల గాఢనిశ్వాస రహస్యమా! భవునిస్వాంతములో మొదలింటి ఊహాలో పోసిన శిల్పమా! సమతమూర్తిని గొన్న దయానిధానమా! నాసఖి! రాత్రిరాజ్ఞి ప్మరణైక సుఖప్రదశాలినీ నమః'. ఉదాహరణకు ఈపంక్తులు చాలు.

బాల్యదశలో తప్పటడుగులు వేసే ప్రజాస్వామ్యంలో తిండితిప్పలకు గగ్గోలుపడే పాఠకులకు సుదీర్ఘ కావ్యాలు చదివే ఓపికలేదు. అయిదారు నిమిషాల లోనో, అరగంటలోనో ముగిసి సద్యఃపరనిర్వృతిని కలిగించే ఖండికలే నచ్చినవి. 'భూతకాలగళము మరిగి కాలకూట మావిరులో'(ప్రతి ఒకడూ శివుడు నేడు) అన్న అనిశెట్టి విప్లవతత్వాన్ని సంప్రదాయఫక్కీలో వినిపించినాడు. కవులు కొందరు హ్రస్వలిపిపద్ధతిని, పజల్ పద్ధతిని మెచ్చినారు.

'అపాయం 3 తుంది
6 వైట పడుకొన్న ప్రదేశం
జనత 7 స్తుంది'

అంకెను ఉచ్చరించినపుడు మాటగా మారుతుంది. ఈఅంకెలగారడిలో సరింపొదుపు కలసి వచ్చిందేమో! పాఠకులకు కాలం పొదుపు దక్కలేదు. కాలం వెచ్చించి ఆలోచించి తెలుసుకొన్నదానిలో నేర్చుకొన్న దేమీ లేదు. ప్రాథమిక తరగతులకు వెళ్ళే విద్యార్థులు ఇది చదివి ఇట్లా మేమూ వ్రాయగలం అంటారు. ఇదిగో కవిప్రత్యేకత ఇది అని మనంమాత్రం ఏమి చూపగలం? ఇట్లాంటివన్నీ స్వతంత్ర కవితా ప్రపంచంలో విశ్వామిత్రసృష్టి వంటివి.

'తెలంగాణా' భారతాన్ని వచనపద్యంలో రచించిన కుందుర్తి ఆధునిక కవిత్వరూపం (ఫ్రీవర్స్‌ఫ్రంట్) తో దగ్గరిసంబంధం పెట్టుకొన్నాడు. ఈయన కల్పించిన ఉపమలు అలంకారప్రాయంగా ఉండడంకంటె అవసర సామగ్రిగా భాసించినాయి. 'గుడ్డపేలికలు అడ్డం పెట్టిన మంచినీళ్ళకడవ లాంటి జీవితం' వంటి కొత్తపోలికలు ఎన్నో కల్పించినాడు.

పలుకుపసందుగల గోపాలచక్రవర్తిరచనలో కొత్తభాషీయాలు వింటాము. 'ఆకాశం పాదాలతో అందుకొన్నాను.... అప్పుడు అంతరిక్షంలో ఆత్మ-ఇప్పుడు బూట్లలోగుండె.... భవిష్యత్తులో మానవుడితలపై బాధలముళ్ళకిరీటం ఉండదు. అనడం ఒక ఆధునిక కవిసమయం? అందరికీ మంచికాలం (ఎప్పుడూ రాదు కానీ) రప్పిస్తాం అనేకవుల నందరినీ ఇట్లా దుళ్ళాలువాతో విసరి సత్కరించి నాడు.

బహుశ్రుతుడై ప్రసిద్ధుడై కవితాకళలో గూడ సిద్ధుడైన కె. వి. రమణా రెడ్డికి స్పందించి, స్పందింపజేయడం బాగా తెలుసు. 'గుండెలో దాసాని పువ్వా; గొంతులో గోదారినవ్వా; చిగురుమాటా చేవచేష్టా, విత్తు నువ్వే చెట్టు నువ్వేగా.... రక్షణో భక్షణో తెలియని.... పిరికిగుండెల యములవాళ్ళకు ప్రాణు లంటే తగని భయమయ్యా' (ఎర్రపిడికిలి). వి. ర. సం. చరిత్రను విస్తరింప చేస్తున్న ప్రతిభామూర్తి ఈయన.

'శివుని జటలలో జొరబడి సురధుని విడిపించుకొన్న' కర్షకుల సాహ సాన్ని దుర్గానంద్ ప్రశంసించినాడు. ఈయన రచించిన 'మధూలిక' కావ్యం అభ్యుదయప్రబంధం. రాజు యుద్ధం చేస్తానంటాడు. ప్రజలు తిరగబడి దాన్ని మాన్పిస్తారు. వీనిలోని శాంతి కాముకమైన అభ్యుదయ మిది. ప్రబంధయుగపు రచనాకళ ఇందులో ఉంది. ఆరకంగా ఇది ప్రబంధం. 'పాలరాతిని ప్రతి ఫలించిన ఎండకూడా పండువెన్నెల' అంటూ 'ఆసేతుశీతాద్రి' కొత్తజిలుగులు చిమ్మిన యస్వీ జోగారావు ప్రశంసనీయుడు.

'మానవాళికి నిజంగానే మంచికాలం రహిస్తుందా? '—మనమంతా బానిసలం' అని వెనుక శ్రీశ్రీ ప్రకటించిన నిరాశలోనే తరువాతికవులు కొందరు పడిపోయినారు. 'ఉరిత్రాళ్ళు నాఊహాలు.... నాకు లోకం లేదు.' అన్న అజంతా, నూతిలో గొంతుకలు వినిపించిన బైరాగి ఈకోవకు చెందినవారు. కొత్తను కోరే యువకుల అభిప్రాయాలకు విలువకట్టని పెత్తనాలే ఈనిరాశామనస్తత్వాలకు కారణమనిపించినా వీటన్నిటిపై 'Waste Land' ప్రభావముందని తెలుస్తుంది:

'And voices. singing out of empty cisterns and exhausted wells—'

వర్గసంఘర్షణను పురాణకథలతో ముడిపెట్టిచెప్పే ఆలోచనలు పుట్టినాయి. రెంటాల సముద్రమథన కథను ధ్వనింపజేసిన ప్రయత్న మిట్టిదే. పెద్దతరంలో చేరిన కాళోజీయే ఈపద్ధతిని ప్రారంభించినాడు.

వ్యక్తిగతానుభూతుల వైవిధ్యంతో వివిధ యువరచయితలు చేసిచూపిన

భావసృష్టి ఎంతో మిగిలిపోయింది. ఆయా వ్యక్తుల పరిసరాలను పరిచయం చేసి వాటిని వ్యాఖ్యానించవలసి ఉంటుంది. ఈచిన్నవ్యాసంలో ఆపని సాధ్యంకాదు.

బుద్ధుని 25 వ శతాబ్ది ఉత్సవాలు అత్యంతవైభవంగా జరిగినవి ఈదశాబ్దిలోనే. యువకవులెందరో బౌద్ధ సంస్కృతి విలువలను ఆకర్షణీయంగా గానం చేసినారు. ఈ ఉత్సవాలప్రభావంతోనే 'మహాబోధి' 'నాగార్జునసాగరం' వంటి కావ్యాలు అవతరించినాయి. ఈ దశాబ్ది ముగిసేనాటికి సి. నారాయణరెడ్డికలం రాటుదేరింది.

రెండోదశాబ్ది:

యువకవులలో నవకవి, నవకవులలో అభ్యుదయకవి అయిన నారాయణరెడ్డి భావవిప్లవాన్ని ప్రసరింపజేయడానికే బయలుదేరినా విశేషించి కళాపక్షంవైపు నిలచినాడు. ఎందరో నిరాశలో పడిపోయి నిష్ఠురాలు పలుకుతూ ఉంటే ఆశలకు అత్తరులుపూసి పంచిపెట్టినా డీయన. గతానికీ ప్రస్తుతానికీ సేతువైనాడు. ఈ రెండుముఖ్యాంశాలు కారణంగానే ఈయనకవితకు పాఠకుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. కొత్తవస్తువుల నెన్నిటినో కుదిరించినాడు మాత్రాఛందస్సులను మలచినాడు. ఈయనఊహల ఉయ్యాలలో ఊగిన పాఠకులెందరో కవిత్వం రచించనేర్చినారు. ఈయన ఉపన్యసిస్తేనే అదో వచనకవితా ఖండిక విన్నట్టుంటుంది. మాటలలోనే పాటలు వినిపిస్తాయి. "వక్రజాతక నిశాతక్రకచదంష్ట్రా దళితమతిని మరల విస్మరింపజేసితిరయా ! అర్ధాంగ మది స్థాణువై పోవ కుమిలిపోయెడినన్ను మీ యెదల కెత్తుకొన్నారయా!"(గుంటూరు సన్మాన సభలో 1963), ఇట్లా సొంతసొద చెప్పుకొన్నా కాళోజీవలె, దాశరథి వలె-పదిమందిలోకి వెళ్ళి చెప్పడమే ఈయనకిష్టం. పరికించిన నిజం చెప్పడం కోసమే నిబద్ధుడైనాడు. మైత్రి ఒకటే ఈయనకు నచ్చినమతం. కవిత్వంలో విశ్వరూపాన్ని ప్రదర్శించిన నారాయణరెడ్డి ప్రత్యేకఫణుతులనన్నిటిని వింగడించి చూపడానికి వీలులేని స్థల మిది. ఆయన ఘాటుగా చెప్పదలచినప్పుడుగూడా ఎంత నీటుగా ఆలోచిస్తాడో నాలుగుపంక్తులలో చూపవచ్చు.

" ఉక్కుతీగలు పాడుతున్నవి
ఉత్తవెదురులు పాడుతున్నవి
పాడలేనిది ఒక్కటే : అది
పరుషబుద్ధి హృదంతరం" (మరోహరివిల్లు)

పోతనచరిత్ర ప్రభావంతోనే వేముగంటి నరసింహాచార్యులు 'తిక్కన' కావ్యం రచించినట్లు చెప్పవచ్చు. ఎమ్మనూరి చినవెంకటరెడ్డి, మడిపడగ బల రామాచార్య మేనక కథను చెరొక ఫక్కిలో రచించినారు. స్ఫూర్తిశ్రీ 'అహల్య' మారువేషంలో ఇంద్రునితో కలిసిన శచీదేవియే. వస్తువులో నూతనసృష్టి కని పించింది. అహల్యాపాత్రమానం దక్కింది. అయినా ఇవన్నీ అధికభాగం పాతఫక్కికి చెందినవే.

'నీనడయాడిన నేలలో పూవులు
కల్పింప మట్టిలో కలిసిపోదు'

అన్న సుప్రసన్న భక్తిభాషలో కొత్తదనం తొంగిచూచింది. సంపత్కు మారకూడా సమకాలిక సంఘటనలకు కదిలినాడు. మాదిరాజు రంగారావు భావధార కొళాయపు జలధార, నేటికాలపు నాయకునకు, పురాణకాలపు వినాయ కునకు జోడుకట్టి గొట్టిముక్కల కృష్ణమూర్తి చమత్కరించినాడు. ఉందేల మాలకొండారెడ్డి కోడిముత్తెదువు, రేడియోవలపులాడి, కాంతిచక్రాలు (గాజులు) వినదగినఖండికలు. గంగాపురం హనుమచ్ఛర్మ దుందుభి (నది) కావ్యం పరిసర చారిత్రక సంస్కృతిని స్మరిస్తూ ప్రవహించింది. సుశీలాదేవి 'ఆర్ద్ర హృదయం' లోంచి అమాయకమైన పాటలు బయలుదేరినాయి. మురళీధర్ 'భిన్నధ్రువాలు' వెలుగునీడల బ్రతుకులకు ఆకర్షణీయమైన వ్యాఖ్యానాల నందించి నాయి. మహబూబ్ 'సమత' కోసం సూటిగా ఉద్బోధించినాడు.

కథాత్మకమైన వచనకవితను మొదట రచించిన కీర్తి శీలా వీర్రాజుకే దక్కింది (కొడిగట్టినసూర్యుడు). ఈయన చిత్రకారుడు కావడంవల్ల ప్రత్యక్ష కల్పంగా రచించ గలిగినాడు. (హృదయందొరికింది).

రంధి సోమరాజు మాటకారితనంలో ఆధునిక కవితకు అదనంగా వచ్చి చేరిన ఉక్తివిశేషాలు అసంఖ్యాకాలు. 'ముక్కు మూసుకొని నోటితో చెడుగాలి పీల్చడం చాలా మందికి అలవాటైంది' (విరిగినకల్చర్) ప్రజలశైలిలో ఉన్నత కవితాశిఖరా లెక్కుతున్నాడు (పొద్దు).

'అగ్నిశిఖలు, మంచుజడులు' కురిపించిన కమ్మిశెట్టి వేంకటేశ్వరరావు 'ప్రతిప్రభాతం (యుగారంభం)లో ప్రతి నిశీథం (యుగాంతం)లో దిక్కు లదిరే రేత గుండెల మూల్గులు' వినిపించినాడు.

అరిపిరాల విశ్వం తాత్త్వికస్పర్శలేని భావాలను వినిపించడు. 'గోడలేని ఈ శూన్యపు నీడలో విడిచిచేసిన, ఆకారంలేని అనేకానేక సుప్తాత్మల అసుప్త

మనోరథాలవలె ఈ 'జిల్లేడుబూచులు' (నిదురకన్నెలు) ఈ నడుమ రచించిన 'హశేబీడు' ఈయన సృజనాత్మకతకు పతాక ప్రతిష్ఠచేస్తుంది.

ఆధునిక జీవితాన్ని పద్యంలోనే బాగా చెప్పవచ్చునన్న జ్ఞానానందం, ఉత్పల గణనీయులు.

అదిగో నెహ్రూ ఫేస్పీషావు, అదిగో బోసులాడ్జి, అది పటేలువల్లభాయి సంత, వల్లకాటికి నింక నెవని పేరుపెట్టునేమొవీడు ? (పర్జన్యము), ఉదాత్తమైన విలువల నిలువలపై వీధిధూళి కప్పుకొన్నదని ఇంకా విడమరచి చెప్పవచ్చిన ఉత్పల ఇటీవలి కావ్యం (ఈ జంటనగరాలు హేమంతశిశిరాలు) లో తన పరిశీలన ప్రతిబింబించే కథాకవితను రచించి శబ్దార్థచిత్రణలో కొత్తమలుపులు చూపినాడు.

శివప్రసాద్ జాతీయోద్రేకాలు ఢమరుకాలై వినిపించినాయి. 'బుచ్చిలింగ' మకుటంతో నీలా జంగయ్య చివికిన సంఘంలోని బూజు దులుప సాగినాడు. 'నయాజమానా' తో వచ్చిన శశాంక 'గాలి మూగనోములో గానమేదో లేచెలే' అంటూ ఇపుడు స్వరలహరిని వినిపిస్తున్నాడు. బాపురెడ్డి హృదయం నిరంతర చైతన్యరేఖలసంపుటి. 'ఆరిపోని వెలుగుజిమ్మి, ఆరిపోయిన దీపమా' అని గాంధీజీని ఉద్దేశించి ఈయన చేసినరచన తరతరాలు పాడుకోదగింది. సి. విజయలక్ష్మి ప్రచురించిన 'నేటి పేథటిక్ డెమోక్రటిక్ (సోషలిస్టిక్) విషాదభారతం' ఓటుచేసేవారికంతా పాఠం కాదగింది. కలికాలాన్నీ, ఆకలికాలాన్నీ చూచి నకనకలాడేయువకులకు ప్రణయానందభైరవి రుచిచూపిన రెండు పదుచుగుండెలు స్మరించతగ్గవి. 'ఒకతీగసంపంగి ఉప్పొంగిపోయింది, ఏతలపువెదుళ్ళయీల వినెనో' (గుంటూరు శేషేంద్రశర్మ), 'నిట్టూరుపుల వేడికెట్టు గడచు పగళ్ళు, కన్నీట తడిసియును కరగ వెంతకు నిశలు' (టి. రామకృష్ణారెడ్డి). ఈదశాబ్ది సృజనాత్మక వైవిధ్యాలు ఇట్లా....అనిచెప్పవస్తే అర్థోక్తిలో అందుకొని దిగంబరుల దిక్‌లు ధిక్కరించినాయి.

'ఇళ్ళు తగలబెట్టుకునే సహజీవనాన్నీ
బొర్ర పెంచుకు తిరిగే సెంటిమెంట్లు అంట్లవెధవల్నీ
ప్రణాళికల ప్రణాలపై మూగే ఈగలరాజకీయాల్నీ
వేలసంవత్సరాల గొడ్రాలి సంస్కృతినీ
కారంలో పొర్లించిన రోకళ్ళతో
పట్టపగలు
విషయించాలనుంది ? (నగ్నముని)

ఆవేశంలో అంతపనిచేసీ అందమైన యువకులు వీరు తమ ఆరోగ్యమే పోగొట్టు కున్నారు. ఆర్థిక సమానతకు అడ్డుపడే మేతావులు (మేధావులు) వీళ్ళ దౌక రోగమే అన్నారు కాని త్యాగంగా గుర్తించలేదు. పాలు అమ్ముకొని మందు కల్లుతాగే ఓటర్లు వీళ్ళ ప్రచారాన్ని పట్టించుకోలేరు. ఈ రెండువర్గాలవారూ కల్పించిన అవకాశంతో అధికారం చెలాయించే వాళ్ళున్నంతవరకు ఏదో రూపంలో ఈరకమైన కవిత్వం అవతరిస్తూనే ఉంటుంది. రాచమల్లు రామ చంద్రారెడ్డి అన్నట్టు ప్రారంభంలో వీళ్ళ కొక ఋజుదృక్పథం లేనిమాట వాస్త వమే. ఇక మిగిలిందల్లా వీళ్ళు బూతులు రచించారన్న అపవాదు. ప్రసంగ వశాత్తు అవి పవిత్రసాహిత్యంలోనే తప్పలేదు. 'విపరీతరతేలక్ష్మీః' (ధ్వని భేదాలకు ఇచ్చిన ఉదాహరణ). 'యోనిరుదూఖలం శిశ్నం ముశ్లం' (యజు ర్వేదం). ఈ తీగనంతా కదపడం అటుంచి చూస్తే వీళ్ళ ఆవేశంలోంచి సహేతుకమైన ఆలోచన లెన్నో పుట్టుకవచ్చినాయి. 'అవినీతిపంకిలం అందరికీ చందనమైనందుకు, ఆదర్శం అర్భకుని చరమశ్వాస' (జ్వాలాముఖి). 'ఇన్ని కోట్లు గోడ్సేలఘాతుక హస్తాలనడుమ, నిశ్చలంగా వెలిగే నీచిరునవ్వు.... బాపూ, మోస పోలేదుకదా నువ్వు' (మహాస్వప్న). 'రెండుసిద్ధాంతాల మానవ భక్షకుల నోళ్ళలో తల్లడిల్లుతున్న శాంతిపశువువారసుడిగా ప్రపంచపౌరుని అధోగతి' (నిఖిలేశ్వర్). 'ఆకాశంలో అన్నపుముద్ద...,ప్రజాశికాంతంలో శంఖుసాపనలు' (చెరబండరాజు) 'అంగట్లోంచి జారిపడిన పూలరేకులు పది లంగా ఏరుకొని ఇల్లాలికురుల నింపొచ్చు, ఆశగా చూడొచ్చు' (భైరవయ్య). దిగంబరుల పడికట్టు సమకాలిక కవులకు వాయికట్టు అయింది. వి.ర.సం. పుట్టుకకు వీళ్ళే ప్రధానకారకు లనవచ్చు. వీళ్ళ వ్యక్తిత్వాన్ని జైళ్ళు గుర్తించిన తర్వాతనే సామాన్యప్రజలకు వీరు పరిచితులైనారు. వీళ్ళకు పోటీగా వచ్చిన పైగంబర కవులది కౌమారప్రవక్తల ధోరణి.

**ఈ అయిదేండ్లు :**

తలపుల దొంతరలమీదుగా పైపైకి ప్రయాణించి తాత్విక సీమలను దర్శించినాడు అనుముల కృష్ణమూర్తి (సరస్వతీసాక్షాత్కారము). తత్త్వాలూ, ఛాందసత్వాలూ కవిత్వం కావని చెప్పి పళ్ళ (రసం) వంటి కవిత్వాహారం తెచ్చినా నన్నాడు వేగుంట మోహనప్రసాద్ (చితి-చింత). హృదయవాదియైన ఇంద్రగంటి శ్రీకాంతశర్మ విద్యార్థులుగూడా ప్రకృతిరహస్యాలను దర్శించేటట్లు గేయకథా కావ్యాన్ని వెలువరించినాడు (శిలామురళి).

కట్టిన మడి విడువని సంప్రదాయ వారసులకూ, అంచెలంచెలుగా అభ్యు దయం సాధింపదలచిన సమరసవాదులకూ, దిగంబరులకూ ఏర్పడ్డ ఘర్షణలు వి.ర.సం. ఏర్పడడానికి కారణాలైనాయి. సామాజిక ప్రగతి విషయంలో ఎవరి దృక్పథం వారికి ప్రధానమై కవిత్వంలో కళాదృష్టి గౌణమైంది. పై మూడు

వర్గాలవారూ మానవతకోసమే ఆరాటపడ్డారు. ఎవరు చెప్పేది మానవతో, ఏదేశంలో ఉందేది నిజమైన సోషలిజమో ? సామాన్యరచయిత సందిగ్ధంలో పడ్డాడు. కావ్యకర్తల మధ్య కార్యకర్తయై, కార్యకర్తల మధ్య కావ్యకర్తయైన వరవరరావు గణనీయుడు. వి.ర.సం. మలుపులు ఇప్పుడే చూపడం సాధ్యం కాదు.

బాలకవిత్వం సంగతి చూస్తే రచయితలకు ఇది లాభాల కవిత్వంగా మారింది. నార్ల చిరంజీవి, కవిరాజ్ తర్వాత కల్పనా సువాసితమైన బాలగేయాలు రచించడానికి మిరియాల రామకృష్ణ ప్రయత్నించినాడు. నిరాశతో తల బొప్పి కట్టిన యువకులకు ఈయన 'ప్రస్తుతగీతము' వినిపించినాడు.

> 'గతము నిద్రగ మరచి తెలివిగ
> బ్రతికెదను ఈ కాలమందే
> నేటి ఉదయము నాకు మెలకువ
> నిన్న రాతిరి నాకు తలగడ '.

కె. శివారెడ్డికూడా ఈ కోవలోనివాడే అయినా ఆయన పద్ధతి శివయోగి చెప్పినట్టు వక్రమనోహరంగా ఉంటుంది.

వచన కవిత బహిరంగంలో చెప్పుకోదగిన మార్పులేవీ రాలేదు. వచ్చే నమ్మకంగూడా లేదు. ఆర్థర్ కోస్లర్ అన్నట్టు ఇది మున్నూరేండ్ల ముసల్ది. తెలుగులో ఇది అడుగడుగునా మాలోపమతో, రూపకమాలతో దొగ్గడం ప్రాకంభించింది. దీని అంతరంగ శ్రుతుల కన్నిటికీ కేంద్రం అసంతృప్తి అనవచ్చు. సుప్రసన్న, ఇరివెంటి కృష్ణమూర్తి మార్గదర్శకత్వంలో వెలువడ్డ 'చేతనావర్తం' 'అక్షరాలు' సంకలనాలలో వచనకవిత ద్వారానే Indainisation ఆకాంక్షించినా అసంతృప్తి కేంద్రానికి దగ్గరగాఉన్న కవులే అందులో అధికం. ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో త్వరితమైన మార్పులు సాధ్యమే. ఆ మార్పులు త్వరగా వస్తే నేటి యువతరం సృజనాత్మకత ఒక మెట్టు ఎక్కుతుంది. నేటి భావమేళలో అదనంగా చేరిన యువకులు : రుద్రశ్రీ, తిరుమల శ్రీనివాసాచార్య, తుంగతుర్తి, సూర్యప్రకాశ్, సుధామ, శ్రీరాంరెడ్డి, ఎన్. భాస్కరావ్, వెన్ను గంగాధర్, తాళ్ళపల్లి మురళీధర్, పడాల రాములు, రఘుశ్రీ, పరంధాములు, వెలుముల రాంరెడ్డి, గౌరీశంకర్, కందాళై రాఘవాచార్య, నరసింహం, పెద్దిరాజు, చంద్రమౌళి, పాండురంగమూర్తి. యువతులు : పాలంకి కల్యాణి, స్వాతి, జ్యోతి, తిరువీధుల సుజాత, సగరం ఉమ, చిత్రపు శాంత, కొడాలి రమాదేవి, చాగర్లమూడి కుసుమ, సాంధ్యశ్రీ వినిపిస్తున్నారు.

తగిన సామగ్రి సకాలానికి అందని కారణంగా కొందరు ప్రతిభామూర్తుల ప్రసక్తి ఇందులో కనిపించకపోవచ్చు. మరో అవకాశం చూచి మనవి చేసుకొంటాను.

# ప్రచార సాహిత్యం

శ్రీ కొత్తపల్లి సుబ్రహ్మణ్యం

ప్రచారంలోని ముఖ్యోద్దేశం సందేశాన్ని అందచేయడం. ఇందుకు అనేక రూపాల సాధనాలు ఉన్నాయి. పూర్వకాలంలో శిలాశాసనాల ద్వారానూ, తామ్రశాసనాల ద్వారానూ, చాటింపుల ద్వారానూ ప్రభుత్వనిబంధనలుగానీ, ధర్మసూత్రాలనుగానీ ప్రచారం చెయ్యడం జరిగింది. ఇందుకు తార్కాణంగా ఈమధ్య మధ్యప్రదేశ్‌లోని 'మాండుసర్' వద్ద లభించిన ఒక శిలాశాసనం ద్వారా అసలు ప్రచారానికి భారతదేశమే పుట్టినిల్లు అనిబుజువు అయింది. అంతేకాక భౌగోళికంగా ఎల్లలను ప్రప్రథమంగా విశదీకరించిందికూడా మన దేశమే. ఈ శిలాశాసనం క్రీస్తుశకం 500 నాటిది. అందులో భారతదేశపు భౌగోళికపు ఎల్లలను గురించీ, మాండుసర్ ప్రాంతంలోని చేనేత ప్రవీణులకు పట్టువస్త్రాలు నేయడంలో ఉన్న ప్రతిభను గురించీ వివరించ బడింది.

ప్రచారానికి సాహిత్యంతో అంతప్రమేయం ఉండనక్కరలేదు. స్వాతంత్ర్య సముపార్జనానంతరం ప్రజలు ఎన్నుకొన్న ప్రజాప్రభుత్వాలు ఏర్పాటుకావడంతో ప్రభుత్వాలు తలపెట్టే కార్యక్రమాలకు ప్రచారంచెయ్యవల సిన ఆవశ్యకత ఏర్పడింది. బృహత్తరమైన అభివృద్ధికార్యక్రమాలు సమాజ కళ్యాణంకోసం తలపెట్టబడినాయి. దీనితోపాటు ప్రచారసాధనాలుకూడా అధికం అయ్యాయి. అవి చలనచిత్రాలు, రేడియో, టెలివిజన్, బుర్రకథలు, హరికథలు, పత్రికలు, కరపత్రాలు, చిన్నపుస్తకాలు, నృత్యనాటికలు, కవిత మొదలైనవి. ఇందులో కవితవంటివికొన్ని పూర్వంనుంచీ ప్రచారసాధనాలుగా ఉంటూ వచ్చాయి. బుర్రకథలు కరపత్రాలువంటివి మరికొన్ని ఇటీవలకాలంలో ప్రచారానికి ఎక్కువగా ఉపయుక్తం అవుతున్నాయి. వీటిలో ముఖ్యంగా ప్రజలను ఆకర్షించేవి-ఆకట్టుకునేవి చలనచిత్రాలు, రేడియో. వీటినిమించి టెలివిజను. ప్రచారానికి ఉపయోగించే భాషలో వ్యావహారికపదానికి (వాగ్రూపంలోఉండే పదం) గ్రంథస్థమైన పదానికీ, దృశ్యరూపానికీ ప్రాధాన్యం ఉన్నది. వీటిలో వ్యావహారికభాషను ఎక్కువగా ప్రచారంలోకి తెస్తున్నది ఆకాశవాణి, గ్రంథస్థ పదానికి ప్రాధాన్యం ఇస్తున్నది ప్రచురణ సంస్థలు. దృశ్యరూపానికి ప్రత్యేకత కల్పిస్తున్నవి. చలనచిత్రాలు, టెలివిజన్ మొదలైనవి.

ఇటీవలికాలంలో పరిశోధనల ఫలితంగానూ, సాంకేతిక పరిజ్ఞానం పెంపొందడంవల్లనూ, ప్రచారానికి ఉపయుక్తం కాగల సాధనాలు మెరుగు అయ్యాయి. వాటిలో ఒకటి తర్జుమా (అనువాదం). అనువాదం ఒకకళ అని నిరూపించే విధంగా అనువాదాలు జరుగుతున్నాయి. ఇందులో సాహిత్యం కంటె విషయం (వస్తువు)ప్రధానం. ప్రచారసాధనాలలో చెప్పుకోదగినసాధనం ఆకాశవాణి. దీనికార్యక్రమాలు అక్షరాస్యులకేకాక గ్రామప్రాంతాలలో ఉండే నిరక్షరాస్యులకు కూడా ఉద్దేశింపబడినాయి. అందుచేత ఈ కార్యక్రమాలు వ్యావహారికభాషమీదనే ఎక్కువగా ఆధారపడి ఉంటాయి. ఇక పత్రికలలో ప్రచారానికి ఉపయోగించే భాష సులభగ్రాహ్యంగా ఉండాలి. అందచేయవలసిన సందేశాన్ని సంగ్రహంగా, సూటిగా, తేటతెల్లంగా తెలియచెప్పాలి.

దేశభక్తి ప్రబోధానికి ఆకాశవాణిద్వారా అనేక ప్రచారకార్యక్రమాలు నిర్వహించబడినాయి. పత్రికలద్వారాకూడా అనేకవిధాలుగా ఇటువంటిప్రచారం జరిగింది. మనదేశంపై పాకిస్తాన్, చైనా దేశాలు అకారణంగా అన్యాయంగా దురాక్రమణ జరిపినప్పుడు ఆకాశవాణిద్వారా పత్రికలద్వారా వివిధాంశాలను గురించి ప్రచారంచెయ్యడం, ఎంత అవసరమో వివిధసామూహికప్రచార సాధనాలద్వారా ఎంతప్రచారం ప్రతిప్రచారం చెయ్యవచ్చునో మనం తెలుసు కొన్నాము. అలాగే ప్రభుత్వం ప్రారంభించిన వివిధానేక అభివృద్ధికార్య క్రమాలనుగురించీ, మనప్రభుత్వ విధానాలగురించీ ప్రచారం జరిగింది. ఇటీవల కొంతకాలంగా కుటుంబనియంత్రణ గురించి తీవ్రప్రచారం జరుగు తున్నది. విషయం ఏదైనా ప్రచారసాధనాలు, విధనాలు ఒక్కటే. కాక పోతే వాటిలోని సాహిత్యం వేరు. పైన పేర్కొన్నవిధంగా ప్రచారసాహిత్యం సృష్టింపకల్గితే మన ఆశయం సిద్ధిస్తుంది.

స్వాతంత్ర్యం సిద్ధించిన అనంతరం మనదేశంలో వివిధ రాజకీయ పార్టీలవారు తమ ఎన్నికల ప్రణాళికలను ప్రజలకు విశదీకరించేనిమిత్తం బుఱ్ఱకథలు, హరికథలు చెప్పించారు. నాటికలు, నృత్యనాటికలద్వారా కూడా ఇలా ప్రచారం జరిగింది.

శాశ్వతమైన విలువలు ఉండే సాహిత్యసృష్టి ఎంత కష్టమో మంచి ప్రచార సాహిత్యసృష్టికూడా అంతకష్టమే. ఇది తెలియక ప్రచారసాహిత్య సృష్టి సులభమైనదని కొందరు అనుకొంటారు. కాని అది పొరపాటు. ప్రజల అందరికీ తెలిసేలాగా, వారికి విశ్వాసం కలిగేలాగా అనుమాననివృత్తి అయ్యే

లాగా వ్రాయడం తమాషాయేకాదు. దీనికికూడా పాండిత్యం, ప్రతిభ కావాలి. అవి లోపిస్తే లక్ష్యం దెబ్బతింటుంది. ఒకచిన్నఉదాహరణ: 1948 ఆప్రాంతంలో మునిమాణిక్యం నరసింహారావు గారిలాంటి సుప్రసిద్ధకథకులే లోధ్రప్రచారం కోసం ప్రచురించిన ఒకప్రకటనలో ఒకచిన్నప్రకటనకథ వ్రాశారు. 15, 20 పంక్తులలో ముగిసిన ఆకథ ఎత్తుగడ, ముగింపు రెండూ చక్కగా ఉన్నాయి. సంఘటన అద్భుతంగా ఉన్నది. శీర్షిక ఆకర్షణీయంగా ఉన్నది. వీటిఅన్నింటి కారణంగా కథ అందరిని ఆకర్షించి, చదివించింది. తెలుగులో ప్రకటనకథలలో అదే మొదటిది. ఇతరకథలు వ్రాయడం ఎంతకష్టమో ఇదీ అంతకష్టమే అని రూఢిగా చెప్పవచ్చును. ఇంతకూ చెప్పవచ్చిన దేమంటే అందచేయదలచు కొన్న సందేశం ప్రచారం చేయదలచిన విషయం ఏదైనా దాని తాలూకు సాహిత్యం సృష్టించడం కష్టం.

ధర్మప్రచారంకోసం ఉద్దేశించిన, పంచమవేదంగా పరిగణింపబడిన భారతం తెలుగులో బహుళ ప్రచారం పొందింది. వింటే భారతం వినాలి తింటే గారెలు తినాలి అనేదాకా వచ్చింది ప్రచారం, ఆదరణ. దానిమూలంగా ఆంధ్రదేశంలో ధర్మప్రచారం జరిగింది. దానితోపాటు భాషోద్ధరణ, కవితా వికాసం ఎంటి ఇతర ప్రయోజనాలు సిద్ధించడం వేరేవిషయం. ప్రధానలక్ష్యం (ధర్మప్రచారం) సిద్ధింపచెయ్యడానికి కవిత్రయంవారి పాండిత్యమూ, ప్రతిభా అన్నివిధాలా ఉపకరించాయి.

అలాగే ఇప్పుడుకూడా ప్రభుత్వం అందచేయదలచిన సందేశాలను ప్రజలకు తెలియచెప్పడానికి పండితులు, ప్రతిభావంతులు పూనుకొని ప్రచార సాహిత్యం సృష్టించాలి. ఈ విధంగా ప్రజాసేవ చెయ్యడానికి సన్నద్ధం కావాలి. ఇదేవిధంగా ఇతర ప్రచారసాధనాలను వినియోగంలోనికి తీసుకొని రావాలి.

# అకాడమీలు - పరిషత్తులు

శ్రీ వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

**1947** వ సం. వచ్చింది. ఇదే మన స్వాతంత్ర్యయుగోదయం. 48వ సం. చివర నైజాం పోయింది. అప్పటిదాకా ఎన్ని ప్రతికూలాలలోనో వస్తూ నిజాం రాష్ట్రాంధ్రసారస్వత పరిషత్తు ఈ స్వాతంత్ర్యయుగాదే ఉగాదిగా ముందడుగు వేసింది. ఆ పేరులోని 'నిజాం' అనే మాటయున్నూ ఎప్పుడో చెప్పకుండనే పోయి, ఇది ఆంధ్రులందరి సంస్థ అయికూచుంది. ఎన్ని సభలు! మల్లంపల్లి సోమశేఖరశర్మ — విశ్వనాథా — తల్లావఝ్ఝలా — పింగళీ - ఇలా ఎందరు పెద్దలనో పిలిచి ఉపన్యాసాలూ - సత్కారాలూ - వాటిని పుస్తకాలుగా వెయ్యటం; అలాగే; చరిత్రా - విజ్ఞానాలమీదానూ।

1950 లో మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్ర, సంస్కృతీ సంగమోత్సవం హైదరాబాదులో పరిషత్తు చెయ్యటం అపూర్వకృషి।

1951 లో ఢిల్లీలో జరిగిన అఖిలభారత సంస్కృతీసంగమోత్సవంలో పాల్గొనటమూ-లక్ష్మణరాయ పరిశోధకమండలిని పునరుజ్జీవింపజేసి పరిషత్కార్యాలయంలో చోటియ్యటమూ - అలాగే 52 సం. లో అఖిలభారత గ్రంథాలయ మహాసభలు నిర్వహించటమేగాక, ఆఉద్యమానికిన్నీ బలమైన కరావలంబం ఇయ్యటమూ—

1948 సం. ముందు స్వాతంత్రఘట్టానికి తెలంగాణంలో 'పోలీసు చర్య' అని పేరు. నాటిదాకా నామమాత్రంగా ఉన్న పరిషత్‌పరీక్షలు పల్లె-పట్నం అనకుండా, రాష్ట్ర - రాష్ట్రేతర మనకుండా పందకేంద్రాలలో సమర్థంగా నిర్వహింపసాగింది. వేలాదియువజనం ఆడా మగా ఇంట్లో చదివి, ఊళ్ళోనే పరీక్షలిస్తున్నారు।

ఇవిగాక నూటపదహార్లు రాత్రిబళ్ళు పల్లెల్లోనూ, కొత్తగూడెంలాంటి కార్మికకేంద్రా లున్నచోటా నడిపించి వయోజన అక్షరాస్యతావ్యాప్తిన్నీ చేశారు.

ప్రభుత్వసహకారంతో నగరములో 11 సాంఘిక విద్యాకేంద్రాలూ నడిపారు నిరుద్యోగనివారణాపథకంక్రింద.

ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి సిలబసులో ప్రజల మాతృభాషలను నిర్బంధపఠనీయం చేయించటానికి - పరిషత్ 'విశారద' పరీక్షను ప్రభుత్వం

ఒప్పుకొనేలా చెయ్యటానికీ - పట్టభద్రులై ప్రాచ్యవిద్యాపండితులకు డిగ్రీలు పుచ్చుకున్నవారితో సమంగా వేతనాలు ఇప్పించటానికీ - హైస్కూళ్ళలోనూ మాతృభాషలో విద్యాబోధన చేయించేందుకూ_రాయబారాలు నడిపీ, గట్టికృషిచేసీ విజయం సాధించిం దీపరిషత్తు।

కేవలసారస్వతమేగాక సంగీత నాట్యాభిరుచిన్నీ కలిగించటానికి 52 సం. లో నటరాజరామకృష్ణగారిని పిలిపించి నాట్యకళాప్రదర్శనా లిప్పించీ, 55 సం. లో ప్రఖ్యాతచిత్రకారుడు కొండపల్లి శేషగిరిరావుగారి చిత్రకళా ప్రదర్శనం చేయించీ, తోడికళలను యథోచితంగా గౌరవించింది.

1950 లో నగరమధ్య భాగంలో ప్రారంభించిన పరిషత్‌భవనం, 1959 లో ఆడిటోరియంతోసహా 1962 కల్లా సుసంపన్నభవనాలు సరస్వతికి నిర్మింపజేసింది. ఈగృహారంభ _ సమాప్తాలమధ్య విశాలాంధ్ర వచ్చింది. ఆ అవతరణకాలంలో దేశంలోని ఔత్సాహికోత్సవాలవలెగాక 'ఆంధ్రభాగవత సప్తాహోత్సవాలు చేసి ఔచిత్యసంపాదకమైంది. ఇప్పటికిది 60 గ్రంథాలు వేసింది. వాటిలో ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘికచరిత్ర' - ఇది కేంద్రప్రభుత్వ అవార్డుపొందింది. ఒకటీ-జానపద సారస్వతశాఖకు చెందిన 'స్త్రీల రామాయణపు పాటలు' - 'స్త్రీల పౌరాణికపు పాటలు' ఇవి 1500 పుటల గ్రంథాలు రెండూ. ఇంత చాలును ఇక్కడ। ఇంకా ప్రాచ్యకళాశాల - ఉత్తమ గ్రంథాలయం - పఠనాలయం - ఇవన్నీ పోలీస్ యాక్షన్ పిదప నడచిన కార్యవిజృంభణ మిది।- ఇంత పనీ స్వంత పనికంటే ఇదిగా నిర్వహించింది దేవులపల్లి రామానుజరావు గారే అనంటే నిజం। కనక నిష్ఠురం కాకూడదు। ప్రస్తుతం నూకల నరోత్తమ రెడ్డిగారు అధ్యక్షులు, రామానుజరావు-రామప్పగారలు ఉపాధ్యక్షులు, రామకృష్ణ శర్మగారు కార్యదర్శి, మావంటివాళ్ళం ఓ ఇరవైమందిమి కార్యవర్గ సభ్యులం।

1953 సం॥లో అలంపురంలో జరిగిన ఆంధ్రసారస్వత పరిషద్వార్షిక సభలలోనే శ్రీశ్రీ అధ్యక్షుడుగా పుట్టిన 'అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు' మళ్లా ఎక్కడా వినబడలేదు. అది అంతే కావచ్చు।।

మోటూరు సత్యనారాయణగారు మంచి కార్యదక్షుడు. కొమర్రాజువారు విడిచి వెళ్ళిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం పునః ప్రారంభించి పూర్తిచెయ్యాలని, అప్పుడు (ఉమ్మడి) మద్రాసురాష్ట్రంలోనే ప్రభుత్వాంగీకారంతో 1947 సం.లో 'తెలుగుభాషా సమితి' అని స్థాపించారు. తోడ్తోడ సాంస్కృతిక ప్రదర్శనలూ - గ్రంథరచనా పోటీలూ జరిపించడమున్నూ అనుషంగికంగా పెట్టుకున్నారు.

1955 దాకా మద్రాసు – ఆంధ్ర సర్కారుల తరపున ఈ పనులు నిర్వహించటానికి అర్థకృతి జరిగేది. ఆ తరవాత హైదరాబాదు రావటం – చక్కని భవనం కట్టుకుని అందులో ఉంటున్నది సమితి.

అయితే ఇది కొమర్రాజువారు వేసిన ప్రణాళికలా కాక, విజ్ఞానం ఎన్నెన్ని శాస్త్రాలూ–కళలుగా ఇప్పుడుందో – వాటిని ఒక్కొక్క సంపుటంగా వేస్తూ ఇప్పటికి 15 దాకా ప్రచురించారు. ఇంకొకదానితో పూర్తి చెయ్యాలనుకుంటున్నారు. వేసేవి వేస్తూంటే అయిపొయ్యేవి అయిపోతూ పునర్ముద్రణ మున్నూ కోరుతున్నైట మొదటి 3 సంపుటాలూ– ।

ఆంధ్ర లిపి భాషా వాఙ్మయాల క్రమవికాసాన్ని చూపే ఫలకాలూ, అవీ తయారుచేయించి మన జిల్లాల్లోనే గాక పూనా – ఢిల్లీలలో సైతం ప్రదర్శించి ప్రశంసలు పొందింది సమితి.

1955 సం.లో కేంద్ర సాహిత్య అకాడమీ నడపిన అఖిలభారత గ్రంథ ప్రదర్శనమూ, ఆ యేడే మద్రాసులో తానుగా పత్రికా ప్రదర్శనమూ తృప్తిగా నడిపింది. 1900–53 దాకా భారత ప్రధాన భాషలలో ముద్రితగ్రంథ సమగ్ర వర్గీకృత సూచిక తయారుచెయ్యవలసివచ్చింది కేంద్ర అకాడమీ కోరికపైని. అనతికాలంలో ఆ పనీ నిర్వహించింది.

దీని అధ్యక్షులు బెజవాడ గోపాలరెడ్డిగారు, కార్యదర్శి మోటూరివారు.

దీని ఇతర వివరాలు కొన్ని :—బహుమతులు ఇచ్చిన గ్రంథాలు 45; ప్రతిగ్రహీతలు 38 మంది; బహుమాన ధనం దాదాపు 20 వేలు; పోటీలకు నిర్ణయించిన విషయాలు 48; పోటీ పరీక్షలలో వచ్చిన గ్రంథాలు 270; పరీక్షా పండితులు 120 మంది. పోటీలలో బహుమతు లందిన విషయాలు 38. ఈ చివరి బహుమతులూ, పోటీలూ ఆం. ప్ర. సాహిత్య అకాడమీ వచ్చాక యీ సమితి మానుకుంది. ఇదంతా మనకు స్వతంత్రం రాకముం దెలా నడుస్తుంది ?

1950కి కొంచెం అటో ఇటో ఆంధ్ర చంద్రికా గ్రంథమండలి పెట్టారు వృద్ధులైన మారపాటివారు। దాని ఆదర్శం విజ్ఞానచంద్రిక మోస్తరులో పోవటం । ఆ తరువాత దీని ప్రథమ సంపుటం వచ్చింది.

1952 లో నిడదవోలునించి అనుకుంటా ఆర్ష విజ్ఞాన పరిషత్తు ప్రభవించి–ఇటీవల హైద్రాబాదుకు చేరుకుంది. ఆర్షేయ గ్రంథ విజ్ఞానం ప్రచురణే వీరి ఆశయం. స్థాపకులు చర్ల గణపతిశాస్త్రిగారు. దీనిలో వారు, తమ జనకులు

నారాయణశాస్త్రి మహోదయుల గ్రంథాలూ—తమవీ—ఇంకా అర్షదృష్టిగల కొన్ని ప్రచురించారు. ఇంకా వేస్తారు వారి చేతిలో ఒక ప్రెస్సుంది గనుక. దాన్ని అర్జనపు గాక, ధర్మసంగ్రహార్థమే నడిపే మార్గంలో ఉన్నారు. వీరు సర్వోదయ నాయకులు గూడా!—

కొమర్రాజు లక్ష్మణరావుగారు తెలంగాణంనించే ప్రారంభించిన ఆంధ్ర విజ్ఞానసర్వస్వం, మళ్ళీ దాని జన్మస్థానంనించే పూరించబడాలని 1945 నించిన్నీ ఇక్కడి (హైద్రాబాదు) సాహిత్యకులు ఆరాటపడుతూ వచ్చిన ఫలితమే, పోలీసుచర్య అనంతరం 1953 లో 'సంగ్రహాంధ్రవిజ్ఞానకోశసమితి' అని వచ్చింది. ఉస్మానియా విశ్వవిద్యాలయ గణితశాస్త్రాచార్యులు డా. బేతనభట్ల విశ్వనాథం, అక్కడే తెలుగుశాఖాధ్యక్షులు ఖండవల్లి లక్ష్మీరంజనంగార్ల పరస్పర ప్రోత్సాహాలతో, ఆ విశ్వవిద్యాలయాధిపతుల—సహాధ్యాపకుల ఆదరాభిమానాలతో ఆభవనంలోనే ఒకగదిలో జన్మమెత్తింది సమితి.

అనుకున్నట్టు తెలంగాణమే ఆర్థికంగానూ బోణీచేసింది. అప్పటి హైద్రాబాదు ప్రభుత్వ ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు ఆశీస్సా అర్థకృతీ గలిగించారు. విశాలాంధ్ర వచ్చాక ఆ ప్రభుత్వంలో బెజవాడ గోపాల రెడ్డిగారూ, అన్నిజిల్లాలవారూ ఆర్థికంగా సహకరించారు. అలాగే భారత ప్రభుత్వమూనూ!

ఇక దీనినిర్మాణమార్గం: లక్ష్మణరావుగారు వేసిన లైనేగాని 'సంగ్రహం'గా చెయ్యదలచటంలో చాలా విషయాలు వదలి, వారు ఇవి బహుప్రయోజనం గలవి అనుకున్నవి ఉంచి సాగటంలో దీని 'సర్వస్వం' ఆశయమున్నూ కొంతసంగ్రహమే అయిందేమో! అయినా, విశ్వవిజ్ఞానాన్ని సంక్షేపరూపంలో ఆంధ్రకుటీరప్రాంగణాలకు పోవటమే ఈకోశలక్ష్యం అని సమితి అనేవుంది!! వచ్చినంతలో సుష్ఠుగా—సుందరంగా—సుసంపన్నగానే వచ్చిందనాలె!

దాదాపు ఇంకో సంపుటంతో పూర్తికావచ్చు. దీనికృషిలో మంచానబడే దాకా అహరహమూ తదేకధ్యానంతో కృషిచేసిన వ్యక్తి ఆదిరాజు వీరభద్రరావు గారు.

దీనికి ఆదినించీ అంతందాకా సంపాదకులూ, కార్యదర్శులూ, సర్వమూ శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారే!—

* * *

మనకు స్వతంత్రం వచ్చిందిగనక దానికోసంపడే ఆరాటం, బాధా తగ్గినై. కాని, స్వతంత్రం ఎందు కావాలనుకున్నామో అది తీరాలి. అస్వతంత్ర

దశలోనూ ఊరుకోక ఉత్సాహం ప్రోత్సాహం ఉన్న మేరకు ఏదో చేశాం. అది ఏమూలకు ! కనుక ఆ కార్యక్రమాలు ఒకటొకటే ప్రణాళికాబద్ధంగా—అర్థ సంసిద్ధంగా చేసుకోవాలె ! ప్రజలే ప్రభుత్వం గనక—ప్రజ లిప్పుడు మహాజరు పెట్టుకోనక్కర్లేదు మా కిది కావాలని ! దానికి తెలుసు ఏమేంకావాలో ! దరిద్రానికి ముందు భావదరిద్రం పోవాలి. అంటే సంగీతం సాహిత్యం ఇలాటివి కావాలి.

ఈ ఆలోచనతోనే జాతీయ (కేంద్ర) సాహిత్య అకాడమీ పద్ధతిలో 1957 లో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ పెట్టారు. సర్కారుది ఆర్థిక సహాయమూ—పర్యవేక్షణ మాత్రమేగాని సంస్థ స్వతంత్రప్రతిపత్తి గలదే.

దీని ఆశయాలూ—లక్ష్యాలు, సంగ్రహంగా చూస్తే :— ఆంధ్రభాషా సాహిత్యాల అభ్యుదయంకోసం సాహితీపరులమధ్య సద్భావమూ సహకారమూ పెంపొందించటంగా సామాన్యప్రజానీకంలో మంచిసాహిత్యం చదవాలనే అభిలాష కలిగించటందాకా ఉన్నై.

ఏయేటి కాయేడు గత ఐదు సంవత్సరాలలో ప్రకటించిన ఉత్తమ—సృజనాత్మక—రచన అని ఎన్నిక చెయ్యబడ్డ రచన (కవిత, కథానిక, నవల, విమర్శ) లకు తలా వేయిన్నూటపదహార్లతో సత్కరిస్తున్నారు. ప్రతియేడూ రెండువిషయాలు పోటీగా నిర్ణయించి, వచ్చి, గెలిచిన ఒక్కొక్కదానికి రెండేసివేలచొప్పున బహూకరిస్తున్నారు. 60 ఏళ్లు వెళ్ళి పేరు పొందిన కవి పండితులకు, బంగారుపతకం, శాలువాతోడి విశిష్ట సభ్యత్వం ఇచ్చి, గౌరవిస్తున్నారు. అర్హులైన రచయితలకు వారి రచనల ప్రచురణకుగాను అర్థసహాయం చేస్తున్నారు. సభలు చేసి పండితులతో వివిధ విషయాలమీద ఉపన్యాసాలు చేయించి, వారిని సన్మానించి వాటిని పుస్తకాలుగా వేస్తున్నారు. ఇంకా నానావిధసాహితీ సమావేశాలు నిర్వహిస్తున్నారు. రచయిత్రీ రత్నాలనూ బాలసాహిత్యాన్నీ—హిందీరచయితనూ సంస్కృతపండితుణ్నీ ఏటా సన్మానిస్తున్నారు. ఇంకా : భాషా—సాహిత్యాల పరిశోధనా కృషీ, పరాయిభాషలు మాట్లాడే (మళయాళ, మరాటీ, ఉర్దూ)వారిలో సదవగాహన పెంపొందే కృషీ చేస్తున్నారు. అకాడమీ ఒక ఉన్నత గ్రంథాలయమున్నూ పెట్టారు. కాగా వారు చేద్దామనుకుని చెయ్యనిదల్లా ఒక్క పత్రికాప్రచురణమే ॥

దీనికి రాష్ట్రంలోని 3 విశ్వవిద్యాలయాల ఆంధ్రశాఖాధిపతులూ, రాష్ట్ర, రాష్ట్రేతర సాంస్కృతిక సేవకులూ, స్త్రీలూ, 3 యూనివర్సిటీల హిందీ—

సంస్కృత–ఉర్దూపండితులూ, 3 అకాడమీలూ, సాహిత్యఅకాడమీ గుర్తించిన సాహితీసంస్థల ప్రతినిధులూ, ప్రాంతీయప్రతినిధులూ, విశిష్టసభ్యులూ అంతా కలిసి మొత్తం 65 గురు సభ్యులు. వీరిలోనుంచి 14 మందితో కార్యవర్గం, వారిలోనుండి ఒక అధ్యక్షుడు—ఒక కార్యదర్శి; ఇదీ దాని పాలనాచక్రం। ఈ అకాడమీకి మొదట్నించీ నేటిదాకా బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులూ, దేవులపల్లి రామానుజరావుగారు కార్యదర్శీ.

ఇప్పటికి అకాడమీ ప్రకటించిన వివిధగ్రంథాలు 147; అచ్చులో ఉన్నవి 8; సిద్ధంఅవుతూ ఉన్నవి 22; బహుమతులు పొందిన గ్రంథాలు 68; ప్రతిగ్రహీతలు 69; బహూకృతం చేసినధనం మొత్తం రు. 74, 576 లు; పోటీకి నిర్ణయించిన విషయాలు 38; పోటీకివచ్చిన గ్రంథాలు 125; రచయితలు తమ గ్రంథాలు అచ్చువేసుకుందుకు సాయం రు. 1, 72, 630 లు. భారతదేశంలో ఏఅకాడమీయున్నూ నేటివరకూ చేయని గొప్పపని ఈఅకాడమీ చేసింది. అది: 'వృత్తిపదకోశ' నిర్మాణం !!–నన్నయాదికవుల 'పదప్రయోగకోశాలనిర్మితీ।

సర్వదా దీనితోడిదే ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమీ. కార్యస్థానం హైదరాబాదు.

ఇది సంగీతనృత్య నాటకరంగాభివృద్ధికి ప్రణాళికప్రకారం అనేకచోట్ల కళోత్సవాలు ఏటా చేస్తూ – దోహదంచేస్తున్నది ఆకళలకు. 1957 జూన్ జననం.

నాటక కళాపరిషత్తు జరిపే నాటక–నాటికాపోటీలకు ఆర్థికసహాయమూ చేస్తూంది. ఆ పరిషత్సభాధ్యక్షులను 'నాటకకళాప్రపూర్ణ' బిరుదూ ఇచ్చి గౌరవిస్తూంది.

ఇప్పుడైతే ఆపోటీలున్నూ అకాడమీయే చేయబూనుకుంది. అలాగే సంగీతకళకున్నూ సంగీతగోష్ఠులూ, కచేరీలూ–కూచిపూడివారి భరతనాట్యానికి ప్రోత్సాహమూ, వృద్ధులూ – సమర్థులూ ఐన నటులకూ, గాయకులకూ ఆర్థిక సహకారమూ, ఈకళలలో ప్రసిద్ధ శాస్త్రగ్రంథప్రచురణమూ చేస్తూవస్తూంది.

నాటక కళాపరిషత్తు నడిపే 'నాట్యకళ' త్రైమాసికపత్రికను మాసపత్రికగా శ్రీశ్రీనివాసచక్రవర్తిగారి సహసంపాదకత్వంతో అకాడమీ నడుపుతూన్నది.

విజయవాడలోని (నటీనటులకు నాట్యకళాశిక్షణకు పెట్టిన) నాటకవిద్యాలయానికి 4 ఏండ్లు ద్రవ్యసహాయం చేసింది.

ఏతావతా: కూచిపూడి నృత్యసాహితికి మకుటం – సిద్ధేంద్రయోగి

రచిత 'భామాకలాపము'నూ_సంగీతశాస్త్రగ్రంథాలలో శిరోమణి శార్ఙ్గదేవుడి 'సంగీతరత్నాకరము'నూ_నాట్యశాస్త్రానికి ఆంధ్రులు సమర్పించిన అనర్ఘ పారి తోషికం 'జాయసేనాపతి' 'నృత్తరత్నావళి' నీ - కర్ణాటక సంగీతానికి విజ్ఞాన సర్వస్వంగా పేరొందిన సుబ్బరామదీక్షితులవారి 'సంగీత సంప్రదాయప్ర దర్శిని'నీ_ప్రచురించింది. అలాగే మరిపన్నెండు రచనలున్నూ ప్రకటించింది.

ప్రథమాధ్యక్షకార్యదర్శులు ఆర్. బి. రామకృష్ణరాజు_యల్.యన్.గుప్తా గారలు. ఇప్పుడు అధ్యక్షులుగా పసల సూర్యచంద్రరావుగారూ, కార్యదర్శి పద్మా రావుగారున్నూ.కార్యవర్గంవారు చూపే భరోసాతో ఎంతో చనువూ_చొరవా గలిగి సంగీతనాటక అకాడమీని సూర్యచంద్రరావుగారు ముందుకు తీసుకుపోతున్నారు.

అలాటిదే, వాటి సాటిదే లలితకళా అకాడమీ. 1961 స్థాపితం. ఈమూడు అకాడమీలూ ఒకే కళాభవనంలో నివసించటం అన్నది చూడ్డానికే ఎంతో ముచ్చటగా వుంది!

దీని అధ్యక్షులుగా మొదటినుంచిన్నీ నూకల నరోత్తమరెడ్డిగారు.

ఇదీ శిలా, లోహ, దారు, పత్ర, శిల్ప - చిత్రరచనాకళకు ఉత్తేజం,. ఉత్సాహం కలిగించే ప్రగతిపథాన పెట్టేందుకు జాతీయ లలితఅకాడమీకి అను బంధంగా వచ్చిందే!

ఇప్పుడు చెప్పిన తరగతులలోని ప్రాచీనశిల్ప, చిత్ర, సేకరణా - అర్వాచీన శిల్పచిత్రస్వీకరణా - వీట్లకు బహుమతిప్రదానాలూ - (ఎగ్జిబిషన్) ప్రదర్శనలూ - ప్రబోధాలూ - సభలూ - చేస్తూ, అన్ని అకాడమీలవలెనే ఇదీ ప్రణాళికాబద్ధంగా నడుస్తూన్న ఉత్తమస్వతంత్ర సంస్థ.

'తెలుగు_ఉర్దూ అకాడమీ,(విజ్ఞానము_చరిత్ర) హైదరాబాదు ఆవాసంగా.

దీన్ని తెలుగు అకాడమీ పేరుతో 1959 లో అయ్యదేవర కాళేశ్వరరావు గారు పెట్టారు. అప్పుడు వారే దీని అధ్యక్షులున్నూ. తర్వాత ఉర్దూను గూడా దాని కిక్కడ స్థానాన్నిబట్టి ఇందులో చేరిస్తే బావుంటుందని 1960 లో తెలుగు పక్కన ఉర్దూ తగిలించారు.

దీని ఆశయం : సైన్సూ_చరిత్రలలో ప్రామాణిక గ్రంథాలు రాయించి ఈ రెండు భాషల్లో వేయటం. (లలిత కళలకూ_మతానికి ఇందులో తావులేదు.)

సైన్సూ_చరిత్రంలో పరిశోధనా_పోటీలూ_బహుమతిప్రదానమూ_పత్రికా నిర్వహణా - తేలికైన వచనంలో తెలుగూ - ఉర్దూలలో ఇదంతా తేవాలె. ఈ ఆశయసిద్ధికి ప్రోద్బలకాలైన ఇతరకార్యకలాపాలున్నూ చేయాలె.

విజ్ఞానం ప్రాంతీయ భాషలద్వారా సామాన్యుడికిస్నీ అందించటమే దీని లాభం. అందుకే వెల సులభం ఫలమధికం ఐన పుస్తక ప్రచురణకు పూనుకుని ఇప్పటికి తెలుగులో 28 – ఉర్దూలో 8 ప్రచురించింది.

దీనికి ప్రస్తుతం పి. వి. నరసింహారావుగారు అధ్యక్షులు ; ఎన్.వి.సుబ్బారావు, హబీబుర్రహమాన్‌గారలు ఉపాధ్యక్షులూనూ । సరోజినీ రేగానిగారు కార్యదర్శినీ ।–

1960 ప్రాంతంలో హైదరాబాదునించి 'విశ్వసాహితి' వచ్చింది. పోతుకూచి సాంబశివరావుగారే సర్వప్రధానులుగా అవుపిస్తారు. ఇది సభలూ, గ్రంథాలూ, 'విశ్వభారతి' పత్రికా నడుపుతూ, అఖిలభారత ఆంధ్ర సాహిత్యసభలూ పలుచోట్ల పలుమాట్లు నడిపిం దీసంస్థ ।–

ప్రాయశః ఇదే ఉదయాలలో (పశ్చిమగోదావరి) భీమవరంనుంచీ 'రామరాజభూషణసాహిత్యపరిషత్తు' మొదలైంది. రామరాజభూషణ మహాకవిని గురించి ఉపన్యాసిప్పించటమూ, వ్యాసాలు రాయించి ప్రకటించటం చేస్తుంటారనుకుంటాను. వీరు తీసిన వ్యాససంకలనం 'భూషణకిరణావళి' ఒకటీ, మొన్నమొన్న పుట్టపర్తి నారాయణాచార్లుగారి 'వసుచరిత్ర సాహితీసౌరభం' ఒకటినీ । మంచిపనీ – మంచిపుస్తకాలూనూ ।

1963 లో అన్ని అకాడమీలవలెనే ప్రభుత్వపరంగా ఇచ్చిన స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థ ఇప్పుడు చెప్పబోయే 'సైన్సుఅకాడమీ' యున్నూ.

సైన్సు (శాస్త్రాల)లను వ్యాపించజెయ్యటమే దీనిఆశయం. దీనికి ఆది అధ్యక్షులు అప్పటి విద్యామంత్రి పి.వి.జి.రాజు, కార్యదర్శి. సి.వి.డి. మూర్తిగార్లు. ఇప్పటి ప్రెసిడెంటు కేంద్రమంత్రి కె. ఎల్. రావు, సెక్రటరీ సూరి బాలకృష్ణగార్లు.

1863 – 1965 తెలుగులో వచ్చిన వైజ్ఞానికగ్రంథాలు సమాలోకించి అకారాదిగా ఒకగ్రంథసూచికను రాయించి ప్రచురించిం దీ అకాడమీ.

ఇంకాగూడా 'ప్రపంచం మార్చిన మనుజులు'–'థియరీ ఆఫ్ రిలెటివిటీ' (సాపేక్షసిద్ధాంతము) – 'నూతన గణితశాస్త్రం' – 'సూక్ష్మజీవుల అన్వేషణ' ఇలాగా ఉత్తమశాస్త్రగ్రంథాలు ఇది తెస్తూంది.

1964 లో 'సాహిత్యసమితి' అని తిరుపతిలో స్థాపితమైంది. సభ్యులు చదివిన పరిశోధకవ్యాసాల్ని 'సాహిత్యసమితి వ్యాసావళి' 1–2–3 అంటూ

ముత్యాల్లాంటి మూడు పుస్తకాలు చక్కనివి ప్రకటించారు. ఇలా ఏటా చెయ్యాలని సంకల్పం. ఇదే వీరి ఆశయం.

అధ్యక్ష కార్యదర్శులు లేరు. సభ్యులు మాత్రం '19' మంది ఉన్నారు.

*　　　*　　　*

ఇప్పుడీ మహతిని మీటుతూన్న 'యువభారతి' యున్నూ ఆంధ్ర సంస్కృతీ సంపన్నతకి సాహిత్యం ఎలా దోహదకారి అయిందీ సామాన్య పాఠకులకూ—బీదప్రజలకూ అవగాహన అయ్యేట్టు చేసేందుకు, విభిన్న జీవితరంగాలకు చెందిన ఉత్సాహవంతులూ—విద్యావంతులూ—ఐన యువకులు 1964 లో స్థాపించారు. స్త్రీలవిభాగంతో సహా మొత్తం '75' గురు సభ్యులు దీనికి.

సాహితీ ప్రమాణమూ, స్థాయీ గల '7' గ్రంథాలు ఇప్పటికి ప్రచురించారు. నాటకప్రదర్శనలూ, ఉపన్యాసాలూ, గ్రంథసమీక్షలూ, స్వంతరచనలు వినిపించటం ఇవీ యువభారతి కార్యాలు.

1970 లో "మారుతున్న విలువలూ రచయితల బాధ్యతలూ" అనే అంశంమీద గోష్ఠి జరిపి '37' గురు ప్రముఖ రచయితలతో ప్రామాణిక వ్యాసాలు రాయించి 'రచన' అని వేశారు.

1971 లో యువభారతి ఎనిమిదో వార్షికోత్సవంలో యువకులకు ప్రాచీన సాహిత్యంమీద గౌరవాదరాలు కలిగించే ఉద్దేశ్యంతో డా. దివాకర్ల వేంకటావధాని గారితో ప్రబంధాలమీద ఉపన్యాసాలు చేయించి, వాటిని 'కావ్యలహరి' గా 11,500 కాపీలు వేయించి 2 రూపాయలకే ఇచ్చారు.

ఇక 1972 లో కార్యాలు—జులై '9' నించీ 5 ఆదివారాలు 5 గురితో, 5 గురు ప్రాచీన విశిష్టకవులమీద ఉపన్యాసాలు చేయించటం—వాటిని 'చైతన్యలహరి' పేరుతో ప్రకటించడం ఒకటీ, భారతస్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా ఆగష్టు 14 న 'మహతి' అనే నూరుగురు ప్రసిద్ధరచయితలవ్యాసాల సంపుటిని వేయటం ఒకటీ, ఇలా ఉన్నది వీరికథ.

ఇరివెంటి కృష్ణమూర్తిగారు అధ్యక్షులు, ఎస్. వెంకటేశ్వర్రావుగారు కార్యదర్శి. వి. విశ్వనాథంగారు కోశానికీ—సమావేశాలకూ కర్త, కార్యకర్తలు పరమ ఔత్సాహికులు, కార్యక్రమం సుసంపన్నమూనూ ॥—

ఇక మిగిలింది 'తెలుగు అకాడమీ' ఇదీ రాజధానిలోనే వుంది.

1960 లో తెలుగును అధికారభాషగా ప్రభుత్వం ఒప్పుకోవటం, గ్విన్

కమిటీ—కొఠారీకమీషన్‌ల సూచనలు రాష్ట్రమూ, కేంద్రమూ మన్నించటం ద్వారా, 1968 జూన్‌లో అధికారికంగా 'తెలుగు అకాడమీ' వచ్చింది.

రాష్ట్ర విద్యామంత్రి అధ్యక్షులుగా ఒకగవర్నర్లబోర్డు దీన్ని పాలిస్తుంది. అలాంటి స్వతంత్రం గల సంస్థ ఇది. 1970లో డైరెక్టరును వేశారు. దీని అన్ని విషయాలకూ డైరెక్టరే ప్రధానాధికారి. ఈయనకు సహాయోద్యోగులుంటారు, పరిపాలనా-విద్యావిభాగాలకు।

అకాడమీ విద్యావిషయాలకు సంబంధించి, సర్వే-శిక్షణ-ప్రచురణ అనే మూడు శాఖలున్నై. వీటి సమీకృత కృషి ఫలితంగా అన్ని స్థాయులలోనూ తెలుగు సమర్థవంతంగా తయారవుతుందని ఆశ.

ఇండియన్ నేషనల్ బుక్ ట్రస్టువారి కొన్నికార్యాలకూ, రాష్ట్రప్రభుత్వం లిపి సంస్కరణకు సూచనలివ్వటమన్న పనులకూ, ఈ అకాడమీ చక్కని ఆలోచనతో సహకరిస్తూ ముందుకు వెళ్తూంది.

1965 లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతను 'తెలుగుభాషా రచన'లో అనుసరణయోగ్యమైన శైలి విషయంలో నియమించిన సంఘం- 'దేశంలో ప్రసిద్ధంగా ఉన్న గ్రాంధిక వ్యావహారిక వర్గాలవారికి అంగీకార యోగ్యంగా, 'ప్రథమభాష'గా తెలుగును అభ్యసించేప్పుడు గ్రాంథికభాషా రచనలో పాఠ్యపుస్తకాలు చదవాలనీ, మిగతావి అంటే శాస్త్రగ్రంథాలు చదివేప్పుడు ఆధునికశైలిలో రాసిన గ్రంథాలు చదవాలనీ ఇచ్చిన సలహాను ప్రభుత్వం మన్నించింది. దీన్ని చూపులో పెట్టుకుని అకాడమీ ఒక కొత్తశైలిని రూపొందించి పుస్తకాలు రాయిస్తున్నదట।

శాస్త్రవిషయాలలో సృజనాత్మకరచనల ప్రోత్సాహంకోసమూ, అకాడమీ కార్యక్రమాల ప్రధాన లక్షణాలు వివరించటానికీ ఒకపత్రిక నడపటానికిన్నీ నిశ్చయించుకున్నారట।

జాతీయపుస్తక ప్రదర్శనంలో (మద్రాసులో) పాల్గొన్నారు. అంతర్జాతీయ గ్రంథప్రదర్శనలో పాల్గొనబోతున్నారుట।

అప్పటినించీ ఇప్పటికి తెలుగుఅకాడమీ డైరెక్టరు శ్రీపి.యస్.ఆర్. అప్పారావుగారు. ప్రస్తుతం అసిస్టెంటు డైరెక్టరు కొత్తపల్లి వీరభద్రరావుగారు.

'నెఫా' సంగీతనృత్య కళాపరిషత్-నెల్లూరు. నెఫా అంటే, నెల్లూరు-ఫిలిం-జర్నలిస్టు అసోసియేషన్. వీరు, నాటకం లలితసంగీతం-కూచిపూడి భరతనాట్యం, రికార్డు డ్యాన్సులలో పోటీలుపెట్టి సత్కరిస్తూ కళారాధన చేస్తున్నారు. స్థానం : నెల్లూరు టౌన్‌హాలు, న్యాయనిర్ణేతలు ; తగు సమర్థులు.

# రచయితల సంఘాలు

శ్రీ పోతుకూచి సాంబశివరావు

స్వాతంత్ర్యయుగోదయం పిదప, రచయితలకు ప్రత్యేక స్వేచ్ఛ లభించింది. పత్రికాముఖంగా రచయితలకు ఎక్కువ ప్రాధాన్యత, ఆదరణం లభించ సాగింది. తద్వారా రచయితలు కోకొల్లలుగా ఉద్భవించారు. వాడవాడలా గ్రామగ్రామాలలో కూడా చిన్న చిన్న రచయితలసంఘాలు ఏర్పడినాయి, ఉవ్వెత్తుగా యీ రచయితలసంఘాలు కృషిచేయకపోయినా, అప్పుడప్పుడు కలిసి సాహితీచైతన్యంకోసం, కావ్యపఠనాలు జరిపించడం పరిపాటిఅయింది. పత్రిక లున్నచోట పత్రికావేదికలు సారస్వతవేదికలుగా తయారయినాయి. సాహితీ పిపాసులు కొన్నితరహాలుగా రచయితల కూటములు ఏర్పరచి సాహితీవ్యాసంగం చేయ నారంభించారు.

స్వాతంత్ర్య యుగోదయం పిదప వివిధ జిల్లాల సారస్వత కార్యక్రమాలు పరిశీలిస్తే, అచ్చటచ్చట కొంత అభ్యుదయపథంలో కృషిసలిపిన సంఘాలు గురించి ప్రస్తావన చేయవచ్చు. విశాఖలో విశాఖ రచయితల సంఘం, కాకినాడలో సాహిత్యలహరి, రాజమహేంద్రవరంలో సాహిత్య గౌతమి, గౌతమీ గ్రంథాలయం, విజయవాడలో కృష్ణాజిల్లా రచయితల సంఘం, హోసూరులో ఆంధ్ర సాహిత్య పరిషత్తు, మద్రాసులో రచన, కర్నూలులో జిల్లా రచయితల సంఘం, అనంతపురంలో లలితకళాపరిషత్తు అనుబంధ సాహితీవర్గాలు, తెలంగాణాలో నవ్యసాహితీ సమితి, తెలంగాణా రచయితల సంఘం, ఆంధ్ర విశ్వసాహితి, యువభారతి మొదలగు సంస్థలు సాహితీరంగంలో కొంత గణనీయమైన కృషి సలిపినవాటిలో లెక్క కట్టవచ్చు. 1960 ప్రాంతంలో నవ్యసాహితీ సమితి ఆధ్వర్యంలో అఖిలభారత తెలుగు రచయితల మహాసభల వేదిక ఏర్పడి, ఇప్పటికి అయిదు మహాసభలు ఆంధ్రదేశంలో వివిధ ప్రాంతాలలో జరిగినవి. మద్రాసులో ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం ప్రచురించడానికి ఏర్పడిన తెలుగుభాషా సమితి, రాజధాని హైదరాబాదుకు తరలి వచ్చి, వివిధదృక్కోణాలనుండి ఉత్తమ సంపుటలు ప్రచురించింది. తెలుగు-ఉర్దూ అకాడమీ శ్రీ అయ్యదేవరవారి ఆధ్వర్యంలో స్థాపించబడి, చరిత్ర, అర్థిక, విజ్ఞానశాస్త్రరంగాలలో విశేషకృషిసలిపి,

కొన్ని ఉత్తమగ్రంథాలు ప్రచురించింది. నగరంలో యువరచయితల వేదికలు అనేకం వున్నాయి. కళాసాహితి, శ్రీనివాస సాహితీసమితి, కళాస్రవంతి, నవ్య కళారాధన, హ్యూమేనిటేరియన్ యువకసంఘం, రంజని, వివిధప్రభుత్వశాఖల్లో ఉద్యోగుల సాహితీసంఘాలు మున్నగునవి యువతరం అభ్యుదయానికి పాటుపడుతున్నాయి.ఇదేవిధంగా అఖిలభారత తెలుగురచయితల మహాసభలు ప్రారంభమైన పిదప జిల్లాలలో ముఖ్యంగా చిత్తూరు, కడప, కర్నూలు,కాకినాడ,విశాఖ,ఏలూరు, విజయవాడ, అనంతపూర్,మెదక్, మహబూబ్‌నగర్, నిజామాబాదు, వరంగల్లు, కరీంనగర్ మొదలగు జిల్లాలలో జిల్లారచయితలసంఘాలు ఏర్పడడమేకాక, వివిధసాహితీవేదికలు రచయితలు ఏర్పరచుకుని కృషిచేస్తున్నారు. ఈ సంఘాల ద్వారా ప్రధానంగా రచయితల గ్రంథాలముద్రణ, అడపాతడపా సాహితీపత్రికల నిర్వహణ,సాహితీసభలుజరిపించడం మున్నగునవి జరుగుతున్నాయి.స్వాతంత్ర్య యుగోదయం పిదప, రాష్ట్రేతరాంధ్రులు కూడా కొంతచైతన్యం పుంజుకున్నారు. బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, జబల్‌పూర్, ఖర్గపూర్, నాగపూర్, కటక్, భిలై, మద్రాసు, టాంజోరు మొదలైన ప్రాంతాలలో ఆంధ్రసంఘాలు ఏర్పడి సాహితీశాఖలు కూడా నిర్వహిస్తున్నాయి. భారతదేశంనుంచి ఇతరదేశాలకు వలసపోయిన ఆంధ్రులు ముఖ్యంగా మారిషస్, దక్షిణాఫ్రికా, మలేషియా, ఫిజీ, ట్రినిడాడ్, ఫిలిప్పీన్స్ మొదలైన దేశాలలో ఆంధ్రమహాసభలు ఏర్పరుచుకుని, సాహితీసాంస్కృతిక పురోభివృద్ధికి కృషిజరుపుతున్నారు. యూరపు, అమెరికా దేశాలలోకూడా తెలుగువారు అనేకప్రాంతాలలో వుండి, చిన్నచిన్న ఆంధ్రసంఘాలు నిర్వహించడమేకాక, అమెరికాదేశంలో ఏర్పడిన తెలుగు వారికూటమి ఒకపత్రికకూడా నిర్వహిస్తున్నారు శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ ఆధ్వర్యంలో. స్వాతంత్ర్యయుగోదయం పిదప సారస్వతచైతన్యం అనంతంగా వెల్లివిరిసింది. రచయితలు కొల్లలుగా పెరగటమేకాక, గ్రంథాలుకూడా అనేకం ప్రచురితమౌతున్నాయి. సహకారసంఘాలు గ్రంథాలు ప్రచురించాలని అచ్చటచ్చట కృషిజరిపినమాట వాస్తవమేకాని, రాజధానిలోని ఆంధ్రరచయితల సహకారసంస్థ తప్ప, తక్కిన వేవీ నిర్దుష్టస్వరూపంతో పనిచేస్తున్నట్లు కనిపించవు. సంగ్రహాంధ్ర విజ్ఞానసర్వస్వం కోసం, ఇతరపత్రికల నిర్వహణకోసం కొన్ని రచయితలసంఘాలు ఏర్పడినవి. రాష్ట్రప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని స్థాపించింది. తద్వారా ఆధునిక, ప్రాచీనసారస్వతకళకు పోషణ లభిస్తోంది.

సారస్వత సంఘాలు ఏర్పడడంవల్ల రచయితల్లో కొంత చైతన్యం పెరిగింది. సమిష్టిగా కలిసి కొన్నిగ్రంథాలు ప్రచురించే కృషి జరుగుతోంది. అయితే ఉత్సాహవంతులైన యువకులు అనేక చిన్నచిన్న సారస్వత సంఘాలుగా ఏర్పడే విచ్ఛిత్తి లక్షణాలు కొన్ని ప్రస్ఫుటం చేస్తున్నారు. అయితే రచయితల సంఘాలవల్ల ఏమీప్రయోజనం లేదనే వర్గాలు కూడా లేకపోలేదు. ఏమైనా ప్రభుత్వం, ప్రజల ఆదరణతో స్వాతంత్ర్య యుగోదయంపిదప, వివిధప్రాంతాలలో ఏర్పడిన రచయితలసంఘాలు రచయితలకు సమిష్టిగా సహాయం చేయడం, తరచు కలిసి మెలిసి సాహితీ విషయ చర్చల వలన సాహితీ చైతన్యం పొందడం జరుగుతోంది. రచయితవ్యక్తిగత ప్రతిభతో రాణించవలసిందే. రచయితల సంఘం ఆప్రతిభకు వేదిక ఏర్పరచి సమీకరించవలసిందే. స్వాతంత్ర్యయుగోదయంపిదప ఉదయించిన రచయితల సంఘాలు యీ లక్ష్యం సాధించాయి.



హెచ్చుతగ్గులున్నచోట
చచ్చిపోవు సమభావము
సమభావము లేనిచోట
సామ్యవాద ముత్తమాట.

—కాళోజి

# సాహిత్యసదస్సులు - సమావేశాలు

శ్రీ సురమౌళి

ఓ పాతికసంవత్సరాలుగా తెలుగు సారస్వతరంగంలో కొనసాగిన సాహిత్య ఉద్యమాలను ఒక్కసారి సింహావలోకనంచేస్తే విపరీతమైన 'సంచలనం' జరిగినట్లు కానవస్తుంది. ఫలితాలను లెక్కవేసుకోవడానికి కూర్చున్నప్పుడు మాత్రం మిగిలేది బహుస్వల్పం అనే చెప్పవచ్చు.

1947 ఆగస్టు 15 నాడే జాతిస్వాతంత్ర్యం ప్రకటించుకున్నప్పటికీ తెలుగుజాతికి మాత్రము సంపూర్ణస్వాతంత్ర్యము లభించలేదు. తెలంగాణాలో నిజాంనిరంకుశపాలన కొనసాగినది. 14 మాసాలపాటు నిజాంవిముక్తిపోరాటంలో తెలుగుకవులు - (కాళోజీ, దాశరథి) పాల్గొన్నారు. దాశరథిని నిజామాబాదు జైల్లో బంధించారు. కాళోజీని రాష్ట్రహద్దులనుండి బహిష్కరిస్తూ ఉత్తరువులు చేశారు. శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి రహస్యజీవితం గడిపారు.వరంగల్‌లో ఒక కవిసమ్మేళనం రజాకార్ల, నిజాం నిరంకుశపోలీసులచేత ధ్వంసం చేయబడినది. ఆంధ్రసారస్వతపరిషత్తు, గ్రంథాలయోద్యమం, ఆంధ్రమహాసభ మొదలగు సాహితీ, సాంస్కృతిక సంస్థలపేరుతో రాజకీయపోరాటాలను కొనసాగించారు.

చివరికి నిజాంరాష్ట్రము విముక్తమైనది. తెలంగాణాలో ఏర్పడిన 'తెలంగాణారచయితల సంఘం' తెలంగాణా అంతటా ఒక సాహిత్య ఝంఝూమారుతాన్ని సృష్టించింది. గ్రామగ్రామాన, పల్లెపల్లెకూ రచయితలసంఘం శాఖలు వెలిశాయి. అనేకసంవత్సరాలుగా అణగారిన తెలంగాణాగళాలకు వ్యక్తీకరణమార్గము లభించినది. కోటిగొంతులు పలికాయి. పలుక నేర్చుకున్నాయి.

తెలంగాణారచయితలసంఘం ఆంధ్రప్రదేశ్ అవతరించేదాకా కొనసాగినది. కొనసాగినన్నాళ్లూ కొత్తగొంతుకలకు వ్యక్తీకరణమార్గాలను చూపింది. సమైక్య తెలుగురాష్ట్రం ఏర్పడగానే 'ఆంధ్రరచయితలసంఘం'గా పేరు మార్చుకున్నది. పేరు మార్చుకోగానే 'సంచలనం' సన్నగిల్లినది.

హడావుడి లేకుండా తమపని తాము సక్రమంగా సాగించుకొని పోయిన మరొకసాహితీసంస్థ, సాధనసమితి. ఇందులో ఎక్కువగా కథానికా, నవలా

రచయితలు సభ్యులుగా ఉండేవారు. కవులుకూడా ఉండేవారుకాని గద్యరచయితలకు ఈ సంస్థ ద్వారా లభించినంత ప్రోత్సాహం మరే సాహితీసంస్థద్వారా లభించిఉండలేదనవచ్చు. నెలనెలా సాహిత్యసమావేశాలు జరుపుకుంటూ ఉండటం, ఏటా ఒకవార్షికోత్సవం ప్రతిసమావేశంలో సభ్యులు తమకొత్త రచనలను చదవడం దానిపై చర్చలు, ఇలా రచనకుపక్రమించే వారికి ఇది అభ్యసనకేంద్రంగా కొనసాగినది. ఆంధ్రప్రదేశ్ అవతరణతో దీని కార్య కలాపాలుకూడా సన్నగిల్లినవి. అయితే ఇటీవలివరకూ కార్యకలాపాలను కొన సాగించుకున్నసంస్థ ఇది. సారస్వతసమావేశాలుమాత్రమే-ఈసంస్థకార్యరంగం. కేవలం నెలవారీ సాహిత్యసమావేశాలద్వారా చాలా మందికి గొంతుకలను ప్రసాదించినసంస్థ ఇది.

సాధనసమితి మార్గంలోనే రూపొందినది వరంగల్ మిత్రమండలి. ఈనాటికీ దాని కార్య కలాపాలు కొనసాగుతూనే ఉన్నాయి.

తెలంగాణా రచయితలసంఘం స్థాపన జరిగి తెలంగాణా గ్రామ గ్రామాన సాహితీచైతన్యం వెల్లివిరసిననాటికే 'అభ్యుదయరచయితల సంఘం' కార్యకలాపాలు సన్నగిల్లాయి. ఆసంఘం నాయకులు తెలంగాణా రచయితల సంఘంతో సంబంధాలు నెరపుకొని అభ్యుదయరచయితల సంఘాన్ని పునరుజ్జీవింప చేసుకొనడానికి దీన్ని ఒకసాధనంగా వాడుకోవడానికి ప్రయత్నించారు. ఆగిపోయిన 'అభ్యుదయ' పత్రిక ప్రచురణను తిరిగి ప్రారంభించారు.కాని ఆయత్నాలు ఫలించలేదు.

ఇదంతా స్వాతంత్ర్యయుగోదయపు తొలి దశాబ్దపుమాట. ఆమొదట్లోనే ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'ఆంధ్రఅభ్యుదయ ఉత్సవాలు'పేర సాంస్కృతిక ఉత్సవాలకు నాంది జరిగింది. తెలుగు విద్యార్థుల సాంస్కృతిక చైతన్యానికి అభివ్యక్తీకరణ మార్గాలు లభించాయి. మొదటి నాలుగైదు సంవత్సరాలు ఈ అభ్యుదయోత్సవాలు విద్యార్థిలోకానికి, వారి సాంస్కృతిక ప్రతిభావ్యక్తీకరణకు కేంద్రమైనాయి. క్రమంగా వీనిపట్ల ఆసక్తి సన్న గిల్లజొచ్చినది. అల్లరులకూ తగాదాలకూ ఆలవాలంగా మారిపోయినవి.

స్వాతంత్ర్యయుగోదయపు రెండవ దశాబ్దం అంతా సాంస్కృతిక రంగం - ముఖ్యంగా సారస్వతరంగం సదస్సుల-సమావేశాల సంచలనానికి దూరమైనది. ఉధృతంగా డిటెక్టివ్ సాహిత్యం వచ్చింది. ఉధృతంగానే తగ్గిపోయినది. తెలుగులో నవలాసాహిత్యానికి క్రమంగా మంచిదశ వచ్చినది. తెలుగు కథకు ప్రపంచ బహుమతి లభించినది.

1964 లో 'యువభారతి' స్థాపితమైనది. వరంగల్ మిత్రమండలి కృషి వలన, సాహితీ మిత్రబృందం పక్షాన 'సృజన' ఆధునిక సాహిత్యవేదిక 'త్రైమాసిక' పత్రికగా ప్రచురణ ప్రారంభించినది.

స్వాతంత్ర్య యుగంలో రావలసిన సాంఘిక ప్రగతి రాలేదు. ప్రభుత్వాధినేతలపట్ల, రాజకీయకార్యకలాపాల పట్ల సాంస్కృతిక సాహిత్యరంగంలో మొదటినుండీ ఉండిన నిర్లిప్తత నిర్లక్ష్యభావం,ద్వేషం, ఆక్రోశం అసహ్యంగా పరిణమించినది. ఈ ద్వేషాక్రోశాల అభివ్యక్తి 'దిగంబర' కవితోద్యమానికి నాంది పలికినది.దిగంబర కవితోద్యమం పేరుతో రాజుకుంటున్న నిప్పురవ్వలను 'సృజన' పత్రిక విసిరి విసిరి జ్వాలగా మార్చినది. విప్లవ రచయితల సంఘం ఆవిర్భావం తెలుగు సారస్వత చరిత్రలో ఒక మైలురాయిగా వచ్చినది. రచయిత 'నిబద్ధుడు' కావాలన్న నినాదం ప్రాచుర్యానికి వచ్చినది.

1964 లో స్థాపితమైన 'యువభారతి' క్రమంగా పెరిగి పెద్దదౌతూ వచ్చి 1970 లో 'మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు, అన్న చర్చావేదికను నిర్వహించి 'రచన'ను ప్రకటించేనాటికి బాగా బలం పుంజుకొని సాహితీ రంగంలో ఒకే బలమైనకేంద్రానికి నాంది కాగలదన్న ఆశను చిగురింపచేసినది.

హైదరాబాదు (ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరం) నడిబొడ్డుమీద రిక్షావాడిచేత ఆవిష్కృతమైన దిగంబర కవితోద్యమం, నగరానికీ, నగరంలోని రిక్షావాళ్ళకూ విముఖమై, నగరాలకు దూరమై క్రమంగా శ్రీకాకుళం అడవులకు దారితీస్తే-రచయిత బాధ్యతలపట్ల, సమాజంలో మారుతున్న విలువలపట్ల అవగాహన పెంపుచేసుకోవడానికి విజృంభించిన 'యువభారతి' ప్రాచీన ప్రబంధాల మాయదారి వర్ణనల అడవులకు దారి చూసుకున్నది.

ఈ సంస్థలు ఇలా ఉండగా ప్రతి సంవత్సరం అఖిలభారత తెలుగు రచయితల మహాసభ పేరుతో ఒక సంత సాగుతున్నది. ఈ సంతకు రకరకాల సాహితీపరులు, రచయితలు రావడం తమ తమ దుకాణాలను తెరచి సరుకు లమ్ముకోడానికి ప్రయత్నించడం – తీర్మానాలపేర ఏవో కొన్ని సంకల్పాలు– వాటికి స్వస్తి. ఈ తీర్మానాలకు, సంకల్పాలకు క్రమానుశీలత ఉండదు. ఏఏటికాఏటి సంత ఇది.

ఇలా స్వాతంత్ర్య యుగోదయంలో ఆటుపోటులలాగా సారస్వత రంగంలో సంచలనం అధికంగానే ఉన్నదనవచ్చు. ఈ సంచలనం సాహితీ సమావేశాల రూపంలోనూ, సదస్సుల రూపంలోనూ చాలా విరివిగానూ ఉన్న

మాట నిజమే. ఇటీవల ఇంకా అనేక సాహితీ సంస్థలు వెలుస్తూ ఉన్నాయి. విద్యార్థి రచయితల సంఘాలు ఏర్పడుతున్నాయి. కళాశాలల్లో సాహితీ సమావేశాలు జరుగుతున్నాయి-కాని ఫలితం బేరీజు వేసుకొనిచూస్తే ఇదంతా 'దొల్ల' అని తేలుతుంది.

స్వాతంత్ర్య యుగోదయపు సాంస్కృతికస్థాయి అంటే ఎలా ఉండాలి? అని పరిశీలించుకొని, ఆ పరిశీలనకు ఈనాడు తెలుగు సారస్వత రంగం చేసిన దోహదాన్ని పరీక్షకు పెడితే అది నిలుస్తుందా? జాతి ఎదుర్కొంటున్న తదితర రాజకీయ, ఆర్థిక సమస్యలను అలా ప్రక్కకు పెట్టినప్పటికీ మాతృభాష పట్ల అభిమానాన్ని పెంచడానికైనా ఈ సమావేశాలూ, సదస్సులూ దోహదం చేశాయా? అన్న ప్రశ్నకుకూడా సంతృప్తికరమైన సమాధానం లభించదు.



మెరపుతీగవంటి తరుణి వచ్చునటన్న
ఇంటిదీప మేలా నవ్వె?
సాఖి కిలకిలనవ్విన సమయమందు
పానపాత్రలు కలశముల్ ఫక్కుమనెను.

—దాశరథి

* * *

గదితలుపులన్నీ మూసుకో
ఎదతలుపులన్నీ తెరుచుకో-
ఎదిగివస్తున్న మృదులసౌరభాలను
హృదయం నిండా నింపేసుకో-

—డా. సి నారాయణరెడ్డి

# యువతరం*

కుమారి సగరం ఉమ

ఏ జాతిమనుగడకైనా, ఏదేశచరిత్రఉజ్జీవనకైనా, ఏసమాజపుటభ్యున్నతికైనా, పట్టుగొమ్మవంటిది యువతరం. సమాజ పురోగమనానికి రథసారథివంటివాడు యువకుడు. భారతదేశచరిత్రపుటలలోని స్వర్ణాక్షరలిఖితాంశమైన స్వాతంత్ర్యసముపార్జనయందు యువతరం వహించినపాత్ర శ్లాఘనీయమైనది. ఇరువదియైదుసంవత్సరాల, స్వాతంత్ర్యానంతరచరిత్రలోకూడ ప్రతిపుటయందు యువతరం నిర్వహించిన గురుతరబాధ్యత కాననగును.

దాదాపు రెండుశతాబ్దాలకాలంపాటు దాస్యశృంఖలాల్లో నలిగిపోయిన భారతదేశం, స్వేచ్ఛావాయువులుపీల్చిన శుభోదయం–ఆనాటియువతరపుశ్రమకు, పట్టుదలకు, సామర్థ్యానికి లభించిన సత్ఫలితం. ఎన్నోజీవితాలు కాలగమనంలో మసిబారిపోయి, ఎందరో మహానుభావుల కలలు కన్నీరై, ఎందరో మాతృమూర్తులఅశ్రుకణాలు రక్తధారలై చింది, పునీతమై "స్వతంత్రభారతి"గా భారతదేశం విలసిల్లినక్షణం, నవశకానికి నాంది పలికింది.

ఒకయుగపుయువతరం సాధించినశ్రమకు ఫలంగా లభించిన స్వాతంత్ర్యపు పరిరక్షణ తరువాతితరంపై సహజంగానే పడినది. నవయుగోదయంలో యువతరంబాధ్యతకూడా పెరిగినది. పరపాలననుండి విముక్తులయిన భారతీయులు తమవునికిని స్థిరపరచుకోడానికి, సంపాదించుకున్నస్వేచ్ఛను కాపాడుకోవడానికి కంకణబద్ధులయినారు. ఈబాధ్యత సకలప్రజానీకంపైనేగాక, హెచ్చుశాతంలో యువతరంపైన పడినది.

స్వాతంత్ర్యయుగోదయంలో యువతరంపాత్ర బహుముఖమైనది. రాజకీయ, ఆర్థిక, సాంఘికరంగాలలో దేశం అభివృద్ధిసాధించవలసియున్నది. కాని, రెండువందలసంవత్సరములపాటు పరాధీనమైనదేశం ఒక్కసారిగా ఇన్నిరంగాలలో పురోగమించడమనేది కష్టసాధ్యం. కానయితే, జాతికి జీవనాడివంటి యువతరం తమబాధ్యతల గుర్తెరిగి, నెరవేర్చినరోజున, అభివృద్ధి గగనకుసుమం కాదు.

యువతరం, సహజంగా ఆవేశాలకు, ఉత్సాహానికి ప్రతిరూపం. ఉడుకు రక్తం పొంగుతూన్నయువతరం సాధించలేని కార్యం వుండబోదు. కాని,

---

* యువభారతి నిర్వహించిన వ్యాసరచనపోటీలో 'స్వాతంత్ర్యయుగోదయంలో యువతరం పాత్ర' అన్న అంశముపై ప్రథమబహుమతి నందుకొన్న వ్యాసం.

ప్రకృతిసహజమైన ఆవేశాన్ని కొంత అరికట్టి సవ్యమయిన మార్గములోనికి మరలించినయెడల, యువతరంచైతన్యప్రవంతియై, పురోగామియై సాగుతుంది.

ఏదేశమయినా, ముఖ్యంగా ఎదుర్కొనేది ఆర్థికసమస్య. ఈ సమస్య మిగిలినసమస్యలకన్న బలీయమైనది – యువతరాన్ని అడుగడుగునా నిరుత్సాహ పెట్టేది. విద్యావంతులయిన యువతీ – యువకులు, తమసామర్థ్యాన్ని దేశాభివృద్ధికి అనుగుణంగా వుపయోగించినఎడల సమస్య కొంతవరకు పరిష్కృత మవుతుంది. ఒకసమాజం పురోగమింపవలెననిన యువతరం తమవ్యక్తిగత సమస్యలను ప్రక్కకుపెట్టి, సమాజంకోసం పాటుపడవలసిన అవసరం ఎంతయినా వున్నది. వ్యక్తి, వ్యక్తిగానేకాక, సమాజంలో ఒకభాగంగా, ఒక సామూహికశక్తిగా వ్యవహరించిననాడు, యీసమస్య దేశాన్ని అంతగా బాధించదు.

భారతదేశం ఆర్థికసమస్యను ఎదుర్కొనడం కేవలం వనరులలేమివలన కాదు. మనకి లభించినవనరులను సద్వినియోగపరచుకోవడానికి తగినంత కృషి జరగడంలేదు. యువతరం, ముఖ్యంగా సాంకేతికవిద్యలలో ప్రావీణ్యత సంపాదించినయువత, తమవిద్యను దేశంకోసం వుపయోగించడం ఆవశ్యకం. ఉదాహరణకు, వైద్యవృత్తిలో ప్రావీణ్యత పొందినయువకుడు విదేశాలకువలస వెళ్ళి, అక్కడే స్థిరపడిపోయినయెడల, మనదేశం ఒకశాస్త్రవేత్తను, ఒక ఉత్తమవైద్యుని కోల్పోతున్నదన్నమాట. ఇదిఈనాడు జరుగుతున్నసమస్య. అయితే, ఈసమస్యకు కారణాలు వెదకిచూచిన, ముఖ్యమైనది యువతరంలో చెలరేగుతున్న అసంతృప్తి. తమవిద్యకు, సమర్థతకు తగినగుర్తింపు కలగడం లేదన్న అసంతృప్తి. యువతరం విదేశాలకు వెళ్ళయత్నించుటకు దోహదం చేస్తున్నది. ఈఅసంతృప్తి ప్రబలినప్పుడు, అరాజకమై సమ్మెలకు దారితీసి, దేశశాంతిని భంగపరుస్తుంది.

ఇక, రాజకీయరంగంలో కూడ యువతరంపాత్ర గురుతరమైనదే. ఒకఅసమర్థుడయిన రాజకీయవేత్తను ఎన్నుకునేది అసమర్థులయిన ప్రజలు కాదు – విజ్ఞానం వుండి, విముఖతతో సరియైన నాయకుని ఎన్నుకోని మంచి వారిదే ఆబాధ్యత. సమగ్రవంతంగా పరిశీలించినయెడల పైవాక్యం సముచితముగా తోస్తుంది. విద్యావంతులయిన యువతరం ఒకవిధమయిన నిర్లిప్తతతో, తమబాధ్యతను నిర్వర్తించుటకు విముఖత చూపినందున, దేశం సరియైన నాయకులకు నోచుకోలేదు.

సాంఘికపరిస్థితులదృష్ట్యాకూడ యువతరంబాధ్యత ఎంతో క్లిష్టమయినది, ముఖ్యమయినదికూడ. దేశకల్యాణానికి సమాజపురోభివృద్ధి ఎంతయినా అవసరం. సామాజికసమస్యలు యువతరంపై ఆధారపడిఉంటాయి. ఇందులో, సమస్యలు వుత్పన్నమగుటకు ప్రధానకారణం "తరాలతారతమ్యం" లేక Generation Gap. ఒకతరానికి ఒకతరానికి నిరంతరసంఘర్షణ జరుగుతునే వుంటుంది. ఈసంఘర్షణ బలీయమయినప్పుడు సాంఘికవిప్లవాలకు నాంది జరుగుతుంది.

తరాలతారతమ్యం ప్రతిసాంఘికసమస్యలోను గోచరమవుతూంటుంది. ముఖ్యమయినది 'వివాహసమస్య'. కులాంతర,మతాంతరవివాహాలను సమర్థించే యువతరం, తమముందుతరంతో సంఘర్షణకు లోనుకావడం జరుగుతూన్న విషయమే. అయితే, ఈసమస్యకు పరిష్కారం యువతరంపైనే ఆధారపడి వున్నదనుటలో సందేహంలేదు. ప్రతియువకునికి తనజీవితంపై దృఢమైన అభిప్రాయం, ఒకనిర్దిష్టమయిన ఆలోచన, తనభవిష్యత్తుపై నిశ్చితాభిప్రాయం వుండడం అవసరం. ముఖ్యంగా వరకట్నసమస్య. ప్రతియువతినీ, వారి తలిదండ్రులనీ పీడిస్తూన్న ఈసమస్యకు ఒకేపరిష్కారం, యువకులలోని దృఢాభిప్రాయం, పట్టుదల, ఆత్మాభిమానం కలబోసిన కార్యదక్షత. ఈదురాచారాలనుఅరికట్టుటకు విద్యావంతులయిన యువతరం కంకణబద్ధులు కావలెను.

నైతికవిలువలు పెంపొందించుకుని, పురాతనసంస్కృతిని పునరుద్ధరించుటలో కూడ యువతరం ఎంతోబాధ్యత కలిగియున్నది. పురాతన సంస్కృతిపై అలక్ష్యాన్ని పెంచుకోక, సమగ్రమైన అవగాహన కలిగించుకుని, దేశపుగౌరవాన్ని నిలబెట్టుటకు యువతరం కృషిచేయాలి.

అటులనే సాహిత్యరంగముకూడ - పదుగురురాజకీయవేత్తలు సాధించలేని కార్యమును ఒకసాహితీవేత్త పరిష్కరింపగలడు. ప్రజలను తేజపరచుటకు చక్కనిసాహిత్యం అవసరం. ఈనాటియువతరంలోని సృజనాత్మకశక్తి శ్లాఘనీయం, సాహిత్యాన్నికేవలం కళాత్మకదృష్టితోనేకాక,సామాజికచైతన్యానికి కూడా వుపయోగపడే పరికరంలా, యువతరం సాహిత్యసృష్టి చేయాలి. సంప్రదాయబద్ధమైన నియమాలను ఛేదించి కొంగ్రొత్తసాహితీప్రక్రియలు సృష్టిస్తున్న యువతరంలోని సాహితీపిపాస, పురోభివృద్ధికి, చైతన్యానికి తార్కాణం.

తమలోని చైతన్యలహరులతో, సక్రమమార్గాల ననుసరించి, దేశాభివృద్ధికి సర్వసన్నద్ధులై, స్వాతంత్ర్యయుగోదయంలోని బాలభాస్కరులు, ప్రచండభాస్కరులైన యువతరమే, భావితరాలకు బంగరుబాట వేయుటకు సన్నద్ధులు - సమర్థులు. యువతరం స్వాతంత్ర్యయుగోదయంలో నిర్వహించిన, నిర్వహించుతూన్న పాత్ర అద్వితీయము - ఈస్వాతంత్రయుగోదయం రానున్న చైతన్యభారతయువతరానికి శుభోదయం.

# విద్యార్థిలోకం

శ్రీ నాగినేని భాస్కరరావు

స్వాతంత్ర్యానంతరం ఆంధ్రదేశంలో విద్యార్థులసంఖ్య, విద్యాసౌకర్యాలు చాలాతక్కువ. భిన్నప్రాంతాలలో భిన్నభిన్నవిద్యావిధానాలు, బోధనా భాషలు అమలులోవుండేవి. అప్పటికి ఆంధ్ర విశ్వవిద్యాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయం వున్నా మద్రాసులోకూడా పలువురు విద్యార్థులు చదువు కునేవారు. విద్యాసౌకర్యాలు ధనవంతులకు, అగ్రవర్ణాలవారికి ఎక్కువగావుండేవి.

**సమాజము - విద్యార్థులు :**

సంఘంలో ఆనాడు విద్యార్థులంటే గౌరవం, ఆదరణ లభించేవి. సంఘంలో అప్పటిపరిస్థితుల కనుగుణంగా విద్యార్థులు ప్రజాహితకార్యక్రమా లలో పాల్గొనేవారు. తెలంగాణాలో నైజాంవ్యతిరేక పోరాటంలోనూ, ఆంధ్రలో ఆంధ్రరాష్ట్రసాధనలోనూ, రాయలసీమలో 1953 లో ఏర్పడిన కరువునివారణ లోనూ విద్యార్థులపాత్ర గణనీయమైనది. ఆతరువాత 1962, 65, 71 సం॥ లలో దేశరక్షణ నిధిసేకరణలో విద్యార్థులదే పైచేయి. 1969 లో ఆంధ్ర ప్రాంతంలో సంభవించిన వరదలసందర్భంగా విద్యార్థులు ఎంతో సహాయ పడ్డారు. 1971 లో మనదేశానికి వచ్చిన బంగ్లాదేశ్ శరణార్థులశిబిరాలలో మన విద్యార్థులు పనిచేశారు. ప్రజలకొరకు అనేకమార్లు వైద్యకళాశాలల్లో నిర్వ హింపబడిన Medical exhibitions లో 80% కార్యభారం విద్యార్థులదే.

నాటి విద్యార్థులకు ఉపాధ్యాయులంటే భక్తి, గౌరవం, చదువంటే ఆసక్తి వున్నాయి. విద్యార్థి, ఉపాధ్యాయులమధ్య సహృదయ సంబంధా లుండేవి. విద్యార్థులను సక్రమమార్గంలో నడిపేందుకు తల్లిదండ్రులకన్నా అధ్యాపకులే ఎక్కువశ్రద్ధ వహించేవారు. ఉపాధ్యాయులలో స్వధర్మదీక్ష, వారికి సంఘంలో గౌరవం ఉండేవి. కాని గతదశాబ్దంగా విద్యార్థులలో అశాంతి, అలజడి బయలుదేరినవి. తరచుగా విద్యావిధానంలో మార్పులు, అవినీతి, బంధుప్రీతి, ప్రాంతీయాభిమానం, కులాభిమానం, ధనబలం, అధికారుల ప్రాపకం, కొందరు అధ్యాపకుల అసమర్థత, మరికొందరు అధ్యాపకుల అలక్ష్యం, విద్యాలయాలో రాజకీయాలు, నిరుద్యోగ సమస్య మొ॥

నవి ఇందుకు కారణాలు. విద్యకు విలువలేకుండా పోయింది. యోగ్యతకు సరిగా గుర్తింపులేదు. తల్లిదండ్రులుకూడా తమ పిల్లలపట్ల తగుశ్రద్ధ వహించటంలేదు. ఇటువంటి కలుషితవాతావరణంలో సహజంగా ఉద్రేకులైన విద్యార్థులలో ఎక్కువశాతం ఆలోచించకుండా తిరుగుబాటు తత్త్వానికి మనోదౌర్బల్యానికిలోనై తమయిష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. కష్టపడకుండా సుఖం సంపాదించాలనుకుంటున్నారు. అయితే విద్యాసౌకర్యాలు, విద్యార్థుల సంఖ్య బాగా పెరిగాయి. మనరాజ్యాంగం ప్రసాదించిన అవకాశాల ఫలితంగా దళితజాతుల, వెనుకబడినజాతుల, గిరిజనుల పిల్లలు విద్యాలయాల్లో ప్రవేశించడం వలన విద్యార్థిలోకంలో విస్తృతి, అభ్యుదయకాంక్ష, ప్రగతివాదం తలలెత్తుతున్నవి. ఇది సంతోషకరమైన విషయం.

గత 25 సం॥లలో సినిమాలుకూడా విద్యార్థులను ప్రభావితం చేసాయి. 1960 వరకు సినిమాలు ప్రబోధాత్మకంగా వుండేవి. కాని గత 12 సం॥లుగా క్రైమ్‌థీమ్స్‌తో, అసభ్యకరమైన Sex దృశ్యాలతో, అంగాంగవిన్యాసాలతో వస్తున్న సినిమాలు విద్యార్థిమానసిక ప్రవృత్తిపై దెబ్బతీస్తున్నాయి. ఇందుకు బజారులో లభిస్తున్న సెక్సుసాహిత్యం తోడైంది.

స్వాతంత్ర్యానంతరం ఇప్పుడు ప్రజలలో కులప్రాతిపదికపై అనేక సంఘాలు వెలిశాయి. వాటికనుబంధంగా విద్యార్థిసంఘాలు వెలిశాయి. ఇది విచారకరమైన విషయం. వీటికితోడు ప్రభుత్వం ఎన్నిచట్టాలు చేసినా వరకట్నంసమస్య తగ్గలేదు సరికదా నానాటికి ఎక్కువైనది. ఎంతోమంది విద్యార్థులు, వారితలిదండ్రులే కాక, ఆడపిల్లల తలిదండ్రులుకూడా దీనిని ప్రోత్సహిస్తున్నారు. ఈమధ్య ఒకవ్యాసకర్త విద్యార్థుల వేషధారణలపై అందరూ విమర్శిస్తున్నారని వాపోయారు. 2,3 సం॥లకు మారే ఈ Fashionsకు అనుగుణంగా విద్యార్థీవిద్యార్థినులు అసభ్యకరంగా వస్త్రధారణచేయకుంటేచాలు. కాని వారిలో లోపించిన దదే. అయితే యితరరాష్ట్రాలతో పోలిస్తే మనవాళ్ళు కొంతనయం. ఇక హిప్పీలు – ఈమధ్యకాలంలో వచ్చిన ఒకబాధ్యతారహిత వ్యసన లాలసత్వ యువకవర్గంవారు. వీరు మనరాష్ట్రంలో చాలతక్కువ.

**విద్యార్థులు - రాజకీయాలు :**

రాజకీయ పార్టీలు ఎప్పుడూ విద్యార్థులను వదలివుండలేదు. తమ స్వార్థం కోసం రాజకీయ చదరంగంలో విద్యార్థులను పావులుగా వాడుకున్నారు, వాడు

కొంటున్నారు. ఆంధ్రరాష్ట్ర సాధన, విశాలాంధ్ర ఏర్పాటు, నైజాం వ్యతిరేక పోరాటం మొదలగు ఉద్యమాలలో విద్యార్థులు ఎందరోపాల్గొని జైళ్ళకు వెళ్లారు. లాఠీదెబ్బలు తిన్నారు. చదువులు పోగొట్టుకున్నారు. కొందరు ప్రాణాలను పోగొట్టుకున్నారు. వీరు చిరస్మరణీయులు. ఆ తరువాత 1966–67 లో జరిగిన విశాఖ ఉక్కుఫ్యాక్టరీ ఉద్యమంలోను, 1969–70 లో జరిగిన తెలంగాణా ఏర్పాటు పోరాటంలోనూ విద్యార్థుల పాత్ర మరువలేనిది. రెండింటికోసం ఎందరో విద్యార్థులు అసువులు కోల్పోయారు. తెలంగాణాపోరాటంలోను, 1971 లో జరిగిన లోకసభ ఎన్నికల్లో 10 మంది తెలంగాణా ప్రజాసమితి అభ్యర్థుల గెలుపులోను తెలంగాణా విద్యార్థులే ఎక్కువ కృషిచేసారు. కాని వారిని 'ఫూల్సు'చేసి తమ స్వార్థం చూసుకున్నారు కాంగ్రెసులో కలిసిన ప్రజా సమితి నాయకులు. దీనిమూలంగా విద్యార్థులు ఒక విద్యాసంవత్సరాన్ని పోగొట్టుకొన్నారు. అశాంతి చెలరేగింది.

1968–71 కాలంలో సాగిన నక్సలైట్ ఉద్యమంలో అనేకమంది విద్యార్థులు పాల్గొని ప్రాణాలను పోగొట్టుకున్నారు. ఈ ఉద్యమాలన్నిటిలోనూ విద్యార్థులు మూలకారణాలు కాక ఉపకరణాలుగా వుపయోగింపబడి తరువాత త్రోసి వేయబడుతున్నారు. రాజకీయపార్టీలు స్వార్థం చూసుకొన్నాయి. ఇది విద్యార్థులు గ్రహించాలి. ఈనాడు ఉన్నతపాఠశాలల్లోను, కళాశాలల్లోను విద్యార్థి ఫెడరేషన్ (వి.ఫె.), విద్యార్థి పరిషత్తు (వి.ప.), యూత్‌కాంగ్రెసు (యూ. కా.) అనే విద్యార్థిసంఘాలున్నాయి. ఇవి విద్యార్థిసంఘాలుగా పైకి చెలామణి అవుతున్నా వీటివెనుక రాజకీయపార్టీలున్నాయనేది నగ్నసత్యం. కళాశాలల్లో అధికారం కోసం కొట్టుకునేది ఈ సంఘాలే. అయితే ఎలక్షన్లలో ఈనాడు అభ్యర్థులు తమ ప్రత్యర్థిని Intellectual level లో కాక డబ్బుతోను, కిరాయి గూండాల భుజ బలంతోను ఎదిరిస్తున్నారు. మానవమేధస్సుకిది తీరని అవమానం. వీరికి ప్రత్యర్థిలోని ప్రతిభాపాటవాలను గుర్తించేశక్తి నశిస్తున్నది. ఎన్నికైనతరువాత కాలేజి అవసరాల కనుగుణంగా వీరు కృషిచేయక ముఠాతత్వాలతో వ్యవహరిస్తూ బాధ్యతలను మరుస్తున్నారు. కొంతమంది నాయకత్వంకోసం కాలేజీలను వదలడంలేదు. సంకుచిత మనస్తత్వాలలో కొట్టుకుంటున్నారు ఈ వి.ఫె., వి.ప., యూ.కా.లకు చెందిన విద్యార్థులను పరిశీలిస్తే ఆయా సంఘాలలో వున్నవారు తాను 'ఫలానాపార్టీ' అని బాహాటంగా చెప్పుకున్నా చాలమందికి ఆ పార్టీ ఆశయాలతోను, ఆచరణలతోను పరిచయం తక్కువని తేలింది. తెలిసిన కొంత

మంది పైకి ఆశయాలను వల్లిస్తూ ఆచరించడంలేదు. పైగా తాము నాయకులమని వాదిస్తారు. ఇలాంటివాళ్లు "PSEUDO IDEALISTS". వీళ్ళేరేపటి నాయకులైతే దేశానికి ముప్పు.

**విద్యార్థులు–విద్యావిధానం–సమ్మెలు :**

మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటినుండి ఇప్పటికి రాధాకృష్ణ కమీషన్, మొదలియార్ కమీషన్, కొఠారికమీషన్‌లు వచ్చినా విద్యావిధానంలో పెద్దమార్పులు రాలేదు. విద్యాప్రమాణాలు తగ్గిపోయాయి. బోధనాభాషలు మారుతున్నవి. విద్యాలయాలలో కావలసిన సదుపాయాలు, తగినసిబ్బంది లేవు. విద్యాలయాలు పెరిగినవి. విద్యావిధానంలో తరచు మార్పులు జరుగుతున్నవి. ఈ 5, 6 సం॥లలో జరిగిన సమ్మెలు, ఉద్యమాలు విద్యార్థులలో చదువుపై ఆసక్తిని తగ్గించివేశాయి. దానికితోడు కొందరు అధ్యాపకుల అసమర్థత, మరికొందరి నిర్లక్ష్యం, పక్షపాతం, విద్యాలయాలలో స్కాలర్‌షిప్పుల విషయంలో జరుగుతున్న అవినీతి, Professional Colleges లో బోధనాపటిమ లేకపోయినా అధికారదర్పంతో విద్యార్థుల నదిమిపడుతున్న అధ్యాపకులు, విశ్వవిద్యాలయాల్లోను, విద్యాసంస్కరణల్లోను రాజకీయనాయకుల స్వార్థం, అన్నింటిని మించిన నిరుద్యోగసమస్య వృత్తివిద్య నభ్యసించినవారికి కూడా జీవనోపాధి సరిగా కల్గని స్థితి మొదలగునవి విద్యాప్రమాణాలు పడిపోవడానికి కారణాలు. తెలివైనవిద్యార్థులకు తగినప్రోత్సాహం, జ్ఞానసముపార్జనకు తగినన్ని అవకాశాలు లేవు. అందువలన ఎంతోమంది మేధావులైనవిద్యార్థులు ఇతరదేశాలకు వెళ్ళి అక్కడే స్థిరపడిపోతున్నారు. ఇక్కడివిద్యార్థులకు లభిస్తున్నడిగ్రీలు నాలికగీచుకోవడానికూడా పనికిరావడం (యూనివర్శిటీవారు అంతమంచిపేపరు వాడతారు) లేదు. ఉద్యోగం రావడానికి కావల్సిందీనాడు, డబ్బు లేక రికమండేషను. వీటితరువాతే డిగ్రీలు, యోగ్యతలు. ఇన్నికారణాలచేత విద్యార్థుల్లో అశాంతి బయలుదేరి ప్రతిచిన్నవిషయానికి సమ్మె చేసి దౌర్జన్యంగా తమకు కావల్సింది సాధించుకో జూస్తున్నారు. పరీక్షలు వాయిదా వేయాలని; కాలేజీఫీజులు తగ్గించాలని; ప్రైవేటుకాలేజీలలో డొనేషనుపద్ధతి తీసివేయాలని; హోటలురేట్లు తగ్గించాలని; ఫలానాఅధ్యాపకుడు అక్కరలేదని; విశ్వవిద్యాలయ, కళాశాలనిర్వహణలో, విధాననిర్ణాయక కమిటీల్లో, నిర్ణయాలు తీసికునేకమిటీల్లో విద్యార్థులకు ప్రాతినిధ్యం యివ్వాలని సమ్మెలు చేశారు, చేస్తున్నారు. లోపభూయిష్టమైన పరీక్షా

విధానాలలోను, సిలబసునిర్ణయాలలోను మార్పులుకావాలని అలజడిచేస్తున్నారు. కొందరువిద్యార్థులు పరీక్షలలో కాపీకొట్టడం హక్కుగా భావిస్తున్నారు. అడ్డగించినవారిని కొట్టడమో, బెదిరించడమో చేస్తున్నారు. ఎక్కువమందిని పాసు (Pass) చేయాలని గొడవచేస్తున్నారు. ఇదికాక డబ్బులిచ్చి, రికమండేషన్లు చేయించి పరీక్షలలో తమకు కావలసినరీతిగా మార్కులు వేయించుకొంటున్నారు. ఈపరిస్థితి మారాలి. చదవకుండా కాపీకొట్టో, మార్కులు వేయించుకునో డిగ్రీలు సంపాదించడం వాళ్ళవాళ్ళశక్తి సామర్థ్యాలను కించపరచుకోవడమే. దొంగలా ప్రవర్తించడమే. ప్రజలను మోసంచేయడమే. ఉన్నతపాఠశాలల విద్యార్థులు ఇలా తయారవడానికి కారణం చుట్టూవున్నకలుషితవాతావరణమే. కానీ కాలేజీవిద్యార్థులకు ఆలోచించగలవయస్సు, శక్తి వుంటాయి. వారు దీక్ష వహిస్తే ఈఅలజడులు, సమ్మెలు వున్నా కొంతవరకైనా విద్యారంగంలో పురోగమించగలరు. అందుకు పెద్దలు అడ్డుగాలేరు. ఉన్నా నిలువలేరు. ఈవిధంగా చదివి కొంతమంది పరిశోధనలు కావించి ph.D.,D.Sc. లను పొందటం కొంతైనా ముదావహం. ఏది ఏమైనా మనవిద్యావిధానం మారాలి. ప్రభుత్వం కండ్లుతెరవాలి.

**సాహిత్యము - విద్యార్థులు :**

ఇతరరంగాలలోవలె సాహితీజగత్తులోను విద్యార్థులు విహరించారు. కాని 1947 నుండి ప్రారంభిస్తే ఈనాడు మనకున్నప్రఖ్యాతరచయితలనే పేర్కొనాలి. ఎందుకనగా ఆయాప్రాంతాలలో ఈనాటిప్రముఖరచయితలు వారి విద్యార్థిదశనుండే కాస్తోకూస్తో వ్రాస్తూవచ్చారు.

ప్రతికాలేజీలోనూ సాహిత్య, సాంస్కృతికసంఘాలుండేవి. అవి సాహితీసాంస్కృతికకార్యక్రమాలను నిర్వహించడమేకాక, సారస్వతవార్షిక సంచికలను వెలువరించేవి. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో జరిగిన అంతర్ కళాశాల, అంతర్ విశ్వవిద్యాలయ సాహితీ, సాంస్కృతికోత్సవాలు పేర్కొనదగినవి. 1950 ప్రాంతాలలో స్థాపించబడ్డ తెలంగాణారచయితలసంఘంలో ప్రధానకార్యదర్శిపదవినుండి. దానిని వ్యాప్తిచేసి కొన్ని ప్రచురణలను, సాహిత్య కార్యక్రమాలను నిర్వహించినవారు ఎక్కువగా విద్యార్థులే. ఇదికాక 1951 నుండి 1961 వరకు హైదరాబాదులో జరిగిన ఆంధ్రాభ్యుదయోత్సవాలు విద్యార్థులసాహితీసాంస్కృతికకృషికి తార్కాణాలు. గ్రంథాలయాలలో కూడా వీరి సంఖ్య ఎక్కువగా వుండేది. సాహిత్యకృషిలో విద్యార్థులు తమసృజనాత్మక

శకులను పయోగించేవారు.అయితే అప్పుడు విద్యార్థిరచయితలసంఖ్య తక్కువ. ఇప్పుడున్నన్నిపత్రికలూ లేవు. ఉన్నకొద్దిమంది పూర్వ, వర్తమానసాహిత్యాలను చదివి రచనాసాధన చేశారు. కవిత, కథ, నవల మొ॥ ప్రక్రియల్లో రచనలు సాగించారు. కొమ్మూరి వేణుగోపాలరావు వ్రాసిన 'పెంకుటిల్లు' నవలకు బహుమతి లభించింది అతనివిద్యార్థిదశలోనే.

కొన్నిసంవత్సరాలనుండి విద్యాలయాల్లో రాజకీయాలు ప్రవేశించినకారణంగా ఎలక్షన్ల కున్నంత ప్రాముఖ్యత సృజనాత్మకశక్తి ప్రధానమైనసాహిత్య, సాంస్కృతికకార్యకలాపాలకు లేదు. కాలేజిసారస్వతసంచికలను వెలువరించడం పెద్దతలనొప్పి. అందువలన సాహిత్యంలో అత్యధికాసక్తిగల విద్యార్థులు ఇతరసాహితీసంస్థల్లో చేరుతున్నారు. ఈనాడు దాదాపుప్రతిసాహితీసంస్థలోనూ విద్యార్థులు వున్నారు. దీనితో తృప్తిపడక స్వంతంగా సంఘాలేర్పరచుకొని సాహితీకృషి చేస్తున్నారు. అలా ఏర్పడినవే—ఆంధ్ర, శ్రీవేంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయవిద్యార్థిరచయితల సంఘాలు ఆ. వి. వి. వి. ర. సంఘం 1968 లోను, ఉ. వి. వి. వి. ర. సంఘం 1970 లోను స్థాపించబడినవి. ఈసంఘాలు సాహితీకార్యక్రమాలను నిర్వహించడమేకాక కొన్ని పుస్తకాలను కూడా ప్రచురించాయి. స్థాపనతరువాత ఉ. వి. వి. వి. ర. సంఘం ఒక సం॥ వరకు చక్కగా సాహితీకార్యక్రమాలను నిర్వహించింది. కాని ప్రస్తుతం నిద్రపోతున్నది. ఈనాటివిద్యార్థిరచయితలు కొందరు గత, వర్తమాన సాహిత్యాలను సరిగా చదవక రచనలు సాగిస్తున్నారు. ఇందువలన వ్యుత్పత్తి, వస్తువైవిధ్యం, శిల్పం మొదలగునవి దెబ్బతింటున్నాయి. కరీంనగర్‌నుండి 'విద్యుల్లత' అనేమాసపత్రికను, విశాఖపట్నంనుండి 'లాంగ్‌మార్చ్' అనేపత్రికను పూర్తిగా విద్యార్థులే నిర్వహించారు. కాని అవి ఇప్పుడు రావడంలేదు. మరికొంతమంది ఉత్సాహవంతులైన విద్యార్థులు లిఖితమాసపత్రికలను నడుపుతున్నారు. 1947 లో విద్యార్థులుగా వున్నవారు ఇప్పుడు మరొకతరానికి పెద్దతరమౌతున్నా, వారిలో కొందరు మంత్రులు, విద్యాధికారులు అయినా విద్యార్థిలోకం స్థితిగతులు ఆశాజనకంగా లేవని నమ్ముతున్నాను. ఇక ఈవ్యాసాన్ని నేటికొందరు విద్యార్థిరచయితల నుదాహరించి ముగిస్తాను.

ఎన్. గోపి, టంకశాల అశోక్, తాళ్ళపల్లి మురళీధర్‌గౌడ్, సుధామ. పాలకోడేటి సత్యనారాయణరావు, జంపన పెద్దిరాజు, సుమనశ్రీ, బి. సాంబిరెడ్డి, యస్. వెంకటరంగారెడ్డి, కె. ఎస్. వి. నరసింహం,చొక్కాపు వెంకటరమణ, దమ్ము శ్రీనివాసబాబు, అడపా రామరావు, అంగర వెంకటశివప్రసాదరావు, దేవరాజు మహారాజు,పాలంకి కల్యాణి,స్వాతిమొదలగువారు విద్యార్థిరచయితలైనా రచనలో చేయితిరిగినవారు. వీరిలో కొందరైనా రేపటిమహారచయితలుగా మారవచ్చు నని ఆశిస్తున్నాను.

# మహిళా లోకం

శ్రీమతి పవని నిర్మలప్రభావతి

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, త్వరితగతిని అభివృద్ధి సాధించిన రంగాలలో, ముఖ్యంగా సినిమా, సాహిత్యరంగాలను చెప్పుకోవచ్చు.

స్వాతంత్ర్యానికి పూర్వం, మహిళామణుల రచనలు చాలాతక్కువ సంఖ్యలో వుండేవి. రచనలు వ్రాయగల రచయిత్రులు లేదా కవయిత్రులు కూడా స్వల్పసంఖ్యలోనే వుండేవారు. వారయినా, అట్టి పురాణేతిహాసాలనో, చారిత్రాత్మక గాథలనో, భక్తి ప్రధానకావ్యాలనో ఎక్కువగా వ్రాస్తుండేవారు. మొత్తంమీద పద్యకావ్యాలకూ, పద్యాలకూ, గ్రాంధికభాషకూ మాత్రమే విలువ వుండే దారోజుల్లో.

కానీ ఈనాడు అలాకాదు. స్వాతంత్ర్యానంతరం, సాహిత్యం దేశ సమస్యలవేపు మరలింది. దేశంలో ప్రబలుతున్న అవినీతి, లంచగొండితనం, వరకట్నాలు, నిరుద్యోగం, ఉద్యోగినులుగా, గృహిణులుగా రెండుబాధ్యతలూ నిర్వహించే స్త్రీలకష్టసుఖాలూ.... ఇలా సమకాలీన సాంఘిక సమస్యలవేపు సాహిత్యం దృష్టిసారించింది. స్వాతంత్ర్యానికి ముందు స్వల్పసంఖ్యలోవున్న స్త్రీలరచనలు, స్వాతంత్ర్యానంతరం....ముఖ్యంగా గత పది పదిహేను సంవత్సరాలలో ఊహించనంత ఎక్కువ సంఖ్యలో వెలువడుతున్నాయి. రచయిత్రులు కూడా ఎక్కువసంఖ్యలోనే మంచిపేరు తెచ్చుకున్నారు. కథలూ, నవలలూ పెరిగాయి. వార మాస పత్రికలూ, వాటిని చదివేపాఠకులూ ఎక్కువయ్యారు. ఒక్కమాటలో చెప్పాలంటే గ్రాంథిక భాషలో, పద్యకావ్యాలలో, తలనొప్పి పుట్టించే సంధులలో, సమాసాలలో బంధింపబడి, ఏ కొద్దిమందికో మాత్రమే అర్థమౌతున్న సాహిత్యం ఈనాడు అక్షరజ్ఞానమున్న ప్రతి పాఠకునికీ అందుబాటులోకివచ్చింది. వ్యవహారికభాషలో, సులభశైలిలో, సాంఘిక వాతావరణానికి దగ్గరగా వచ్చింది సాహిత్యం.

రచయిత్రుల రచనలు ముందు సాంసారిక జీవితాలకు దగ్గరగా, కుటుంబాలలోని సంఘటనలకూ, సన్నివేశాలకూ ప్రతిబింబంగా మొదలై, స్త్రీలసమస్యలు చర్చించటం వరకూ, సాంఘిక సమస్యలను చర్చించటంవరకూ వచ్చింది.

పెళ్ళికాకముందు ప్రేమించటం మాత్రమేగొప్పనీ, పెళ్ళయ్యాక ఇక ఆ దంపతులమధ్య ప్రేమ అన్నది వుండదనీ, పిల్లలు పుట్టాక-ఇక ప్రేమ ప్రణయం అన్నవి ఆఛాయలకూడా వుండవనీ_చాలమంది యువతీ యువకులు ఆపోహ పడుతుంటారు. అలాంటివారికి కనువిప్పుకలిగిస్తూ శ్రీమతి రామలక్ష్మి ఆరుద్రగారి కథానికలు 'నీదేనాహృదయం' "హృదయం చిగిర్చింది"కి (కథాసంపుటాలు) వెలువడ్డాయి. పిల్లలున్నా, వయసుమీరినా దంపతులమధ్య ఎంత సున్నితమైన, అందమైన ప్రేమ వుండటానికి, నిలుపుకోవటానికి ఆస్కారంవుందో ఆ కథానికలు తెలుపుతాయి. అలాగే భానుమతీరామకృష్ణ గారి "అత్తగారి కథలు" అతిశయోక్తులు వున్నా హాస్యప్రధాన మైనవి. నిత్యజీవితంలోని చిన్నచిన్న సంఘటనలు-హృదయాన్ని కదిలించేలా కథలుగా మలచబడిన తురగా జానకీరాణి కథలుకూడా సాహిత్యంలో విశిష్టస్థానాన్ని అలంకరించాయి. ఇలాగే మరికొందరు రచయిత్రుల కథానికలుకూడా.

గత పదేళ్ళలోనూ నవలలమీద మోజు పాఠకులలో పెరిగింది. అందుకు అనుగుణంగానే రచయిత్రుల నవలలుకూడా కుప్పతిప్పలుగా పెరిగాయి. వాటిలో సాంఘిక సమస్యలను చర్చించే"మారిన విలువలు"(ద్వివేదుల విశాలాక్షి) "అంధ కారంలో...." (ముప్పాళ రంగనాయకమ్మ) లాటి నవలలు మణిపూసలుగా పేర్కొనవచ్చు.

అయితే మహిళామణుల రచనలలో....ఎక్కువ భాగం ఇంకా ఊహా ప్రపంచంలోనే వుండటం శోచనీయం. చాలామంది రచయిత్రులు తాము ఊహించుకొనే స్వాప్నిక జగత్తుకు అక్షరరూపం ఇచ్చి - జమీందార్లూ, జమీం దారీలూ, బంగళాలూ, కార్లూ....ఇలా ఆ స్వాప్నిక జగత్తులోనే పాఠకుల్ని గిర వాటు వేస్తున్నారు. ఆ నవలలు-సినిమాలుగా రూపొంది టీన్ఏజర్సును గిలిగింతలు పెడుతున్నాయి. కానీ - సాహిత్యదృష్టితో, నిష్పాక్షికంగా పరిశీలిస్తేమాత్రం ఆ రచనలకు సాహిత్యంలో ఏలాటి శాశ్వతవిలువా, ఉన్నతస్థానమూ వుండదని తేలిపోతుంది. వాస్తవిక సమస్యలను ఎదుర్కోలేక - ఓవిధంగా పలాయన మంత్రం పఠించే రచనలవి. ఈనాడు అవే ఎక్కువగా వెలువడటం బాధాకర మైన విషయం.

మొత్తంమీద స్వాతంత్ర్య యుగోదయంలో, సాహిత్యం, ముఖ్యంగా మహిళల రచనలు ఎంతగానో ముందంజ వేసాయి. అయితే, మహిళల రచన లలో ఇంకా ఇంకా మార్పు రావాలి. వాస్తవిక దృక్పథం ఏర్పడాలి. "ఎస్కే పిజం" కాకుండా "యథార్థవాదం" ప్రతిబింబించాలి. అప్పుడే మహిళల రచన లకు సాహిత్యంలో మహోన్నత స్థానం లభిస్తుంది.

# పాఠకలోకం

శ్రీ వంగపల్లి విశ్వనాథం

ఈ ఇరవై అయిదేళ్ళలో అక్షరాస్యులూ పెరిగారు నిరక్షరాస్యులూ పెరిగారు. అంటే తర్కానికి లొంగని వాదంలా అనిపించినా వాస్తవానికి అక్షరాలా నిజం. పాఠశాలలసంఖ్య పెరిగినా అంతకుమించినవేగంతో పెరుగుతున్న జనాభా పైన పేర్కొన్న వాస్తవస్థితికి భాష్యం చెబుతుంది. ఇది ప్రత్యేకమైన పెద్దసమస్యగా భావించి ప్రక్కకు వదిలేసినా, విచారకరమైన విషయము ఏమిటంటే అక్షరాస్యులైనవారిలోకూడా చాలామంది నిరక్షరాస్యులుగా మారిపోతున్నారు. అంటే చదువుకున్న కాస్తంతా ఉపయోగానికి రాకపోవటంవల్ల (ఆర్థికస్థితే కారణం కావచ్చు) కాలక్రమేణా ఆచదువును మరచిపోతున్నారు. మొహమాటానికి అక్షరాస్యులని అనవలసిన ఈతరహాకు చెందినవారిని వదిలివేసినా – ఆశ్చర్యపరిచే పరిణామం 'విద్యావంతులైన ఎంతమంది పఠనాసక్తిని కలిగి ఉన్నారు?' అనేది. విషయం తెలుసుకుందామన్న జిజ్ఞాస లేకపోవటం కారణం కావచ్చు; లేక ఏసినిమాలో, పేకాటో మరింతఆనందాన్ని అందించే వనిపించటం కారణం కావచ్చు – విద్యావంతులలో చాలామంది పఠనాసక్తిని కోల్పోయినవారై కన్పడుతున్నారు. విద్యావంతులైన ఎందరిఇళ్ళలో చెప్పుకోదగిన పదిపుస్తకాలు కన్పడుతున్నాయి? (పాఠ్యగ్రంథాలను మినహాయించి). 'అంటే కొని చదవడమే అవసరమా? ఎలాగో అలా చదివితే చాలదా?' అన్న తర్కం వేరేచర్చకు దారితీస్తుంది. ప్రస్తుతానికి ఆవిషయాన్ని ప్రక్కకుపెడితే ముందుగా గమనించవలసినవిషయాలు కొన్ని ఉన్నాయి.

అసలు ఎందుకు చదవాలి? అభివృద్ధికి విద్య ప్రాతిపదికఅయితే విద్యకు ప్రాతిపదిక పుస్తకం. సేకరించుకున్న విజ్ఞానాన్ని సంరక్షించుకుని, తరతరాలకు అందించటానికి ఎంతో ఉపయోగపడుతాయి పుస్తకాలు. వైజ్ఞానిక, సాంస్కృతిక, సాహిత్యరంగాలలో అభ్యుదయానికి పుస్తకపఠనం ఎంతో దోహదం చేస్తుంది. పుస్తకాలకు బూజుపట్టకుండా మనదల్చిన జాతి పుస్తకపఠనాసక్తిని పెంపొందించటానికి శాయశక్తులా యత్నించాలి. పుస్తకం – అక్షరాకృతి దాల్చిన ఆలోచనల సముదాయం.

అక్షరాస్యతపెరిగి, విద్యావ్యాప్తి విస్తృతంగా జరగడం అవసరంఅనే

విషయం స్పష్టమైన ఈరోజులలో పుస్తకాలు, పత్రికలు, వాటి నిరంతర పఠనం - బహుళార్థసాధకాలుగా ఉపయోగపడుతాయి. వైజ్ఞానికంగా ఇంత అభివృద్ధిచెందిన ఈకాలంలో పుస్తకాలు - పత్రికలు, రేడియో, సినిమా, టెలివిజన్ మొదలైనవాటితో పోటీపడగలుగుతాయా? అనే ప్రశ్నకు ముందుగా సమాధానం చెప్పుకోవాలి. పోటీ ఎంతతీవ్రమైనదైనా - పుస్తకం తనస్థానాన్ని తాను నిలుపుకోగలుగుతుందనే చెప్పాలి.

జనాభాదృష్ట్యా ఆలోచిస్తే మనం "పుస్తకక్షామం" అనుభవిస్తున్నామని చెప్పకతప్పదు. "వ్యక్తిశీలానికీ సాహిత్యాధ్యయనానికీ సంబంధంఉంది" అంటారు మన గాంధీజీ. అంటే నైతికవిలువల అవగాహనకు, పరిరక్షణకు పుస్తకపఠనం అవసరం. పుస్తకపఠనం మనస్సుకు నవనత్వం చేకూరుస్తుంది. పుస్తకపఠనం అలవాటుగాలేని మనస్సుకు నీరసమే మిగులుతుంది.

పుస్తకం అనే భవనం - రచయిత, ప్రచురణకర్త, పాఠకుడు, విమర్శకుడు అనే నాలుగుగోడలపై నిలబడివుందని భావిస్తే - ఏవర్గంవారైనా తమ ధర్మాన్ని సరిగా నిర్వర్తించకపోతే, ఆవైపు భవనం కూలిపోతుంది. మరింకేమి మిగులుతుంది? అందరి సహకారంవల్ల, సదభిరుచులవల్ల కృషికొనసాగుతే, ఆపుస్తకాలు సమాజ కల్యాణానికి తోడ్పడుతాయి. ఒక్కోపుస్తకంవల్ల ఏదో హఠాత్తుగా మార్పువచ్చి పడుతుందనికాదు. అది మంచిపుస్తకమే ఐతే, ఎప్పటికైనా తన ప్రభావాన్ని చూపించగలుగుతుంది.

"ఎప్పుడైనా, మంచికన్నా చెడుబలం ఎక్కువ. వేగం ఎక్కువ. ఆకర్షణ ఎక్కువ. మంచిపుస్తకం ప్రభావం కనపడుతుందా? అన్నది శంకించినా చెడ్డపుస్తకం ప్రభావం వెంటనే కనపడుతుందని నిస్సంకోచంగా నమ్మవచ్చు. మంచిపుస్తకం రావటానికి ఎవరుబాధ్యులో చెడ్డపుస్తకానికీ వాళ్ళే బాధ్యులు. బాధ్యత వారిదైనా, దానివల్ల బాధనుమాత్రము సమిష్టిగా భరించాల్సి వస్తుంది.

**పాఠకులంటె ఎవరు?**

వయసులో, వృత్తిలో, ధ్యేయంలో, అభిరుచిలో భేదాలున్నా - అన్నివర్గాలవారూ పాఠకులే. చదువుకునేపుస్తకాలు కావచ్చు, ఆధ్యాత్మికపరమైన గ్రంథాలు కావచ్చు, ఉబుసుపోకకు చదివే వార, మాసపత్రికలు కావచ్చు. లేదా సైద్ధాంతికమైన విషయాలను చర్చించే సాహిత్యపత్రికలు కావచ్చు, అంటే -

సాహిత్యప్రక్రియలతో నిమిత్తంలేక అచ్చయిన ప్రతిఅక్షరం పఠనీయమైతే చదవటానికి సంసిద్ధుడైన ప్రతివాడూ పాఠకుడౌతాడు.

పాఠకులు వివిధరకాలు. కొందరు విద్యార్జనకోసం, కొందరు విజ్ఞానాభివృద్ధికోసం, కొందరు చదవటంలోని ఆనందాన్ని పొందటంకోసం, కొందరు మరింకేమీ లేక కాగితాల్ని తిరగవేస్తూ బొమ్మల్ని చూడటంకోసం. చాలామటుకు పాఠకుల అభిరుచులకు అనుగుణ్యంగానే పుస్తకాలు వ్రాయబడుతాయి కనుక పైన పేర్కొన్న వివిధవర్గాలు పుస్తకాలలోకూడా కనపడుతాయి.

ఈపాతికేళ్ళలో పాఠకులు, వారి అభిరుచులు, పుస్తకాలు, వాటి ప్రచురణ, గ్రంథాలయాలు, వాటిబాధ్యత, ప్రభుత్వకర్తవ్యం-మొదలైన విషయాలనుగూర్చి ఆలోచించేముందు దిగువవిషయాలను పరిశీలించటము మంచిది.

ఈమధ్య వాణిజ్యప్రకటనలసంఘమువారి ఆధ్వర్యాన జరిగిన ఒక సర్వేలో వెల్లడియైన విషయాలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి. మనదేశంలో విద్యావంతులసంఖ్య 11.27 కోట్లుకాగా అందులో వార్తాపత్రికల, ఇతరపత్రికల పాఠకులసంఖ్య 4.3 కోట్లు మాత్రమే। అంటే చదుకున్నవారిలో సైతం ఒక మూడవ వంతు మంది మాత్రమే చదవటం అలవాటుగా కలిగి ఉన్నారన్న మాట.

మరొక్క విషయం. మన దేశంలో అమ్ముడైన ప్రతి పత్రికలో ఒక కాపీకి 9.1 పాఠకులున్నారు. అంటే ఇక్కడ 'అరువు పాఠకు' లెక్కువన్న మాట. ఇతర దేశాలలోకంటె కొనకుండా పత్రికలు చదివే జనాభా మనదేశంలో ఎక్కువగా ఉన్నట్లుకూడా తేలుతున్నది. అంటే చదివే ఆసక్తి ఉన్నా కొనగలిగే శక్తి లేకపోవటం కారణంగా పేర్కొని మనం మనని సముదాయించుకున్నా పైనచెప్పిన విషయం — అంటే కేవలం 3వ వంతు మంది విద్యావంతులకు మాత్రమే పఠనాసక్తి ఉన్నదనే విషయం—సంజాయిషీ చెప్పుకోలేని విషయం అవుతుంది.

విద్యావంతుల సంఖ్య అసలే తక్కువ. ఆ కొద్దిమంది విద్యావంతుల లోనూ విద్యాభ్యాసంతరువాతకూడా పుస్తకపఠనాసక్తిని కలిగివుండేవారి సంఖ్య మరింత తక్కువ. పఠనాసక్తి ఉన్నవారిలోకూడా ఆర్థికశక్తిలేని కొందరి కారణాన స్వయంగా కొని చదివేవారు మరీ మరీ తక్కువమంది. పోనీ కొందామని ఆసక్తిగా అనుకొన్నా ధరలు ఎక్కువగా ఉన్న కారణంగా వాస్తవంగా కొని చదివేవారి సంఖ్య ఇంకా తక్కువ. అంటే 'పంచపాండవులు మంచంకోళ్ళలా

ముగ్గురేకదా' అన్నట్లు పుస్తకాలను కొని చదివే పాఠకులు అత్యల్పమని చెప్ప వచ్చు. కొనేవాళ్ళు లేరని అచ్చువేయటం తగ్గించటం, అచ్చవుతున్న పుస్తకాలు తక్కువ అయినవని కొనిచదివేవారి సంఖ్య మరింతతగ్గటం ఒకవిషవలయంగా ఏర్పడి భావదారిద్ర్యానికి దోహదం చేస్తుంది. అచ్చవుతున్న పుస్తకాల సంఖ్య పెరుగుతున్నమాట వాస్తవమే అయినా జనాభా పెరుగుదలదృష్ట్యా విద్యావంతుల సంఖ్య పెరుగుదలదృష్ట్యా ఆ సంఖ్య గణనీయంగా లేదన్న వాదనలోని వాస్త వాన్ని అర్థం చేసుకోవాలి. సంఖ్యాబాహుళ్యం సంగతి అటుంచినా, గుణాత్మ కంగా యోచించినా, రావలసినన్ని మంచిపుస్తకాలు రావటంలేదు. 'మంచి పుస్తకాలంటే ఏమిటి?' అనేప్రశ్నకు సమాధానం చెప్పుకునేముందు సామాజిక, నైతిక విలువల పరిరక్షణలో ఇటు రచయితలకూ, ప్రచురణకర్తలకూ, అటు ప్రభుత్వానికీ, సమాజానికీ బాధ్యత ఉందన్న విషయం విస్మరించరాదు.

చౌకధరలలో చౌకబారు శృంగారం అందుబాటుతో ఉన్నంతవరకు పరి పక్వస్థితి చేరని మానసిక పరిణామావస్థలో ఉన్న వ్యక్తులపై దాని పరిణామాలు ప్రమాదకరమైనవిగా ఉంటాయి. శృంగారం కూడదనికాదు. కాని _ ఎలాంటి శృంగారం? ఎప్పుడు? ఏ సమయంలో? ఎలా? ఏ మోతాదులో అందించ బడాలి?_అన్న విషయాలు ముఖ్యం.

పదేళ్ళక్రిందటి పత్రికలు తిరగవేస్తే మచ్చుకయినా కనుపించని వింత ధోరణులు, ఈనాడు విరివిగా అమ్ముడుపోయి ఇంట్లో ఆబాలగోపాలం చదివే పత్రికలలో విరివిగా కనిపించుతున్నాయి. ఫార్ములా సినిమాలవలె నవలలలో విధిగా ఒక Rape Scene, రెండు అక్రమ సంబంధాల కేసులు, సెక్సు స్వాతం త్ర్యాన్నీ, విశృంఖలత్వాన్నీ సమర్థిస్తూ రెచ్చగొట్టే ఉపన్యాస ధోరణులూ, కథ అవసరాలకు మించిన మోతాదులో కన్పడుతాయి. ఇది నిజంగా విచారించదగ్గ పరిణామమే. ప్రభుత్వమూ, చట్టాలూ, అన్నీ చూస్తూ ఊరుకుంటున్నందుకు విచారించటం మినహా చేయగలిగిందేమిటో ఆలోచించాలి.

**మరి మంచి పుస్తకాలంటె ఏమిటి?**

కేవలం ఆనందపరచటమే పరమావధిగా కాక, ఆలోచన రేకెత్తించ గల దిగా, పాఠకుడిని కార్యోన్ముఖుడినిగా, సదాశయచిత్తుడిగా, ఉదాత్తుడిగా చేయ గలిగినదై ఉండాలి. నిజమే మరి! 'అన్ని పుస్తకాలూ Serious Reading కే

అయితే ఉబుసుపోకకుకూడా పుస్తకా లెందుకన్నా?' అన్న వాదన గమనించ వలసి ఉంటుంది.

పుస్తక పఠనం మనిషి ఆలోచనల కొక ఉదాత్తత కల్పించి, స్వార్థ పరత్వాన్నీ, సంకుచిత దృష్టినీ అణగద్రొక్కడంలో తోడ్పడటమే కాక విశ్వ మానవ సౌభ్రాతృత్వానికి అవసరమయిన మానసికస్థితిని కలిగించటంలో తోడ్పడుతుంది. జడత్వం వదలి జగదారాధ్యమయ్యే చైతన్యం పొందేందుకు అవకాశం కల్పిస్తుంది. అంటే-నవసమాజ నిర్మాణంకోసం నేడు జరుగబోతున్న ప్రయత్నానికి పుస్తకాలూ, పాఠకులూ ప్రముఖపాత్ర నిర్వహించవలసి ఉన్నది.

**ప్రచురణకర్తల బాధ్యత :**

కేవలం వ్యాపారదృష్టితో కాక, సమాజపరమైన బాధ్యత నిర్వహిస్తున్న దృష్టితో, సామాజిక స్పృహతో వ్యాపారాన్ని నిర్వహించాలి. పుస్తకాలను, మంచి పుస్తకాలను, అందంగా, ఆకర్షణీయంగా అచ్చువేస్తూ, వాటి ధరలను వీలున్నంత తక్కువగా ఉండేలా నిర్ణయించాలి. బూజుపట్టిన పాతపద్ధతులను విడనాడి ఆధునికమైన అమ్మకపు విధానాలను అవలంబించి పుస్తకాల అమ్మకా లను, పాఠకులను ప్రోత్సహించేందుకు పూనుకోవాలి. Book Club లూ, 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికలూ, పుస్తకాలను గురించి తెలిపే పుస్తకాలూ, వివరణాత్మక Catalogue లూ మొదలైన కార్యక్రమాలు చేపట్ట టమే కాక, అడపా దడపా ప్రదర్శనలు ఏర్పాటుచేసి, రచయితలు, విమర్శకులు, పాఠకులు, తాము కలిసి కూర్చుని కష్టసుఖాలను చర్చించుకుని ప్రగతిమార్గాన పయనించేందుకు సిద్ధపడాలి. ఇలాంటి చైతన్యం దేశంలో ఇప్పుడిప్పుడే కొద్ది కొద్దిగా అగుపిస్తున్నదని భావిస్తే మన రాష్ట్రంలో ఇంకా స్వల్పంగా పొడ చూపుతున్నట్లు భావించాలి.

**గ్రంథాలయాల బాధ్యత :**

కొని చదివే పాఠకులు తెలుగువారిలో తక్కువ కావటంవల్ల అసలు చదవటంలో ఆసక్తిగల మరికొద్దిమంది స్నేహితులవద్దనుండి అరువుతెచ్చుకొని గానీ, లేక గ్రంథాలయాలకు వెళ్ళిగానీ చదువుకుంటారని భావించాలి.

గ్రంథాలయాలసంఖ్య ఇంకా ఎంతో పెరగాలి. "కేవలం పుస్తకాలను ఒకచోట పోగేసి ఒక బోర్డు తగిలించితే చాలు" అనుకుని తృప్తిపడటంకన్న

పాఠకుడికి అవసరమైన సమాచారాన్ని అందివ్వటంలోనూ, అతడికి తగిన సౌక ర్యాలు కల్పించటంలోనూ మరింత జాగ్రత్త వహించటం గ్రంథాలయాధికారు లకు అవసరం.

కనీసం ప్రభుత్వధనంతో నడిచే గ్రంథాలయాల కనుబంధంగానైనా Reader's Club లు ఏర్పాటుచేయటము, అడపాదడపా రచయితలతో ఇష్టా గోష్ఠులను ఏర్పాటుచేయటము మొదలైనవి నిర్వహిస్తే ఆ గ్రంథాలయాలు నిర్జీవపుస్తకాల సమాధులవలెగాక చైతన్యపూరితమైన విజ్ఞానకేంద్రాలుగా, విశ్వ కళాపరిషత్తులుగా, రూపొందించబడటానికి అవకాశం ఉంది. అందుకే ఒక కవి "గ్రంథాలయం ఒక మౌనవిద్యాలయం" అన్నాడు.

సంచార గ్రంథాలయాలు నిర్వహించటం, ఉపన్యాసాలూ, సమావేశాలూ, ఏర్పరచటం, పుస్తకచర్చ కార్యక్రమాలు నిర్వహించటం, వీలున్నన్ని ఎక్కువ పుస్తకాలు పాఠకులకు అందుబాటులో ఉండేలా ప్రయత్నించటం, పుస్తకాలూ, పత్రికలలోని వివిధవిషయాల వివరణాత్మక సూచికలు తయారుచేయటము, అక్షరాస్యతావ్యాప్తికి తోడ్పడటము, మొదలైన వివిధ, విభిన్నసృజనాత్మక కార్యక్రమాలద్వారా పాఠకుడిలో పఠనాసక్తిని పెంపొందించి సమాజ కల్యాణా నికి దోహదపడేందుకు గ్రంథాలయాలు పూనుకోవాలి.

**ప్రభుత్వంబాధ్యత :**

ప్రత్యక్షంగా అనిపించదూ కనిపించదూకాని పరోక్షంగా ప్రభుత్వంబాధ్యత ఎంతైనాఉంది. ఎక్కువ కాగితాన్ని ఉత్పత్తి చెయ్యటం, కాగితంధరలను అదుపులో పెట్టడం, ముద్రణసౌకర్యాలను ఉత్పత్తి చేయించటం, పైనపేర్కొన్న గ్రంథాలయాలకు సంబంధించిన విషయాలలో ఇతోధికంగా తోడ్పటం, పుస్త కాలపై తపాలాఖర్చులలో ప్రత్యేకరాయితీలు చూపించటం (ముఖ్యంగా రిజిస్ట్రే షన్ ఖర్చుల్ని నామమాత్రంగా ఉండేట్టు తగ్గించటం), రచయితల సంఘాలను, ముఖ్యంగా ఆసంఘాల తరపున ప్రచురణలను ప్రోత్సహించటంలాంటి బాధ్య తలు ఎన్నో ఉన్నాయి. పుస్తకాలకూ, పాఠకులకూ మధ్య ప్రస్తుతం ఉన్న అగడ్తలనూ, అగాధాలను భర్తీ చేయటానికి ప్రభుత్వం ముఖ్యమయిన పాత్ర వహించవలసిఉన్నది. అంతేకాదు. నవసాహిత్యం విశృంఖలవిధిగా అమ్ముడు పోకుండా ఉండేందుకై అవసరమయిన కట్టుబాట్లను ఏర్పరచటంలో కూడా ప్రముఖపాత్ర వహించవలసిఉంది. అంటే ఉద్దేశించిన నవసమాజస్థాపనకు

అవసరమయిన వాతావరణం సృష్టించటంలో పుస్తక ప్రచురణను ప్రోత్స హించటం, పఠనాసక్తిని కల్పించటంలాంటివి ప్రముఖమైన విషయాలుగా పరిగణించి ప్రభుత్వవర్గాలవారు అందుకు పూనుకోవాలి.

**పుస్తకవిక్రేతల బాధ్యత :**

ఎందుకోగాని పుస్తకాల విక్రయశాలలు నిర్వహింపబడేతీరుతెన్నులు చూస్తే పాఠకులకు వెగటు కలిగిస్తాయో లేదో చెప్పలేము కానీ, ఆకట్టుకునేట్టు ఆకర్షించుకునేట్టు నిర్వహింపబడటంలేదని నిస్సందేహముగా చెప్పవచ్చు. పుస్తకాలు అమ్మేవాళ్ళలో చాలామందికి వాళ్ళ దుకాణంలో వున్న పుస్తకాలలోని విషయాలు తెలిసివుండదు. మరింకేదైనా వ్యాపారంలోనైతే వస్తువు అమ్మేవాడికి తాను అమ్ముతున్న వస్తువుగురించి పూర్తివివరాలు తెలిసివుంటాయి. విక్రేతలు పుస్తకాలగురించి తెలిసి వుండటమేకాక, పుస్తకాలను అమర్చే పద్ధతులలో క్రొత్త ఆకర్షణలు, లేని పుస్తకాలను తెప్పించి పెట్టడంలో ఆసక్తి చూపటం -మొదలైన పద్ధతులను అవలంబించడం సమాజాభివృద్ధికి ఎంతైనా అవసరం.

**రచయితలు, విమర్శకుల బాధ్యతలు :**

రచనను కేవలం ఆనందానికనిగాని, లేక వ్యాపారంగా గాని భావించే వ్యక్తులకు బాధ్యతలంటూ ఉండవు. వారికి ధనం, గాదంటే కీర్తి కావాలి. అంటే - ఆకోవకి చెందిన వారిని సాదారకంవారిగా పరిగణించాలి. దేశ శ్రేయస్సును ధ్యేయంగా కలిగిన మేధావి వర్గరచయితలుగా వీరిని గుర్తించ లేము. రచనల్లోనేకాక, వాటిపై వచ్చేవిమర్శలలోనూ నిజాయితీ లోపిస్తుంది. కొన్ని సామాన్యవిలువలకు ప్రాధాన్యం ఇస్తున్నట్లు కనపడదు.

"ఫలానారకం రచనలను సంపాదకులు అచ్చువేస్తున్నారు. కనుక మేము అటువంటి రచనలే చేస్తున్నాం" అని రచయితలు చెబుతున్నారు. 'పాఠకులు ఫలానారకం రచనలనే బాగా ఆదరిస్తున్నారు కనుక మేము అటువంటి వాటినే ప్రచురిస్తున్నాము. పాఠకుల కోసమేకదా పత్రికలు' అని సంపాదకులు అంటున్నారు. 'పత్రికలు అటువంటి సాహిత్యాన్నే అందిస్తున్నాయి. కనుక వాటినే చదువుతున్నాము. కాలక్షేపానికి ఏదో ఒకటి చదవాలి కదా !' అని పాఠకులు అంటున్నారు."

"మన పాఠకులలో అధికసంఖ్యాకులు మానసికంగా పరిణతి చెందని

వారు. అంటే - కొద్దిపాటి చదువుగల స్త్రీలు, విద్యార్థులు, ఎక్కువగా పత్రికా సాహిత్యాన్ని పోషిస్తున్నారు. రచయితలు ఎక్కువగా వారి కోసమే రాస్తున్నారు. అయితే ఆ వ్రాయడంలో పాఠకుల అభిరుచిని, సంస్కారాన్ని పెంపొందింప చేసే ఉద్దేశ్యం మాత్రం కనిపించడంలేదు. అధిక సంఖ్యాక పాఠకవర్గం వారి మానసిక బలహీనతలను రెచ్చగొట్టే ప్రయత్నమే కనిపిస్తున్నది. ప్రస్తుత సామాజిక వ్యవస్థలో స్త్రీలు పడుతున్నబాధలు, దారిద్ర్యసమస్య పిల్లల పెళ్ళిళ్ళ సమస్య, యువతరం వారి ప్రేమ సమస్యలు, త్యాగాలు, ఇటువంటిని ఈవర్గంపాఠకులని ఎక్కువగా ఆకర్షిస్తాయి. అందుచేత రచయితలు అటువంటి సమస్యలను గోరంతవాటిని కొండంతగా చిత్రించిరచనలనిండాకుండపోతగా కన్నీళ్ళు కురిపించి, పాఠకులను వశం చేసుకుంటున్నారు. సాధారణ పాఠకులు తమ ఊహకందని, కలలకు దోహదంచేసే రచనలనే అభిమానిస్తారు. వారికి రచనలలో వాస్తవికత అక్కరలేదు. భావవ్యక్తీకరణ అక్కరలేదు."

"రచయిత - సంపాదకుడు - పాఠకుడు - ఇది విషచక్రం. ఈ చక్రాన్ని భేదించ వలనసిన వాడు విమర్శకుడు. చెత్తరచనలను తెగడడం ఎంత అవసరమో, మంచి రచనలను పొగడడం కూడా అంత అవసరం. మంచి రచనలు ఎప్పుడూ అరుదుగా ఉంటాయి. అరుదైన వాటికి ప్రచారం అవసరం". "ఏది కృత్రిమమో, ఏది వాస్తవమో విశ్లేషించి చెబుతూ, సాధారణ పాఠకుల్లో అభిరుచిని పెంచవలసినవాడు విమర్శకుడు. పాఠకుల మానసిక వికాసానికి దోహదం చేయవలసినవాడు విమర్శకుడు. వ్యక్తిగత దురభిమానాలకులోను కాకుండా గొప్పరచనలకు ప్రచారం ఇవ్వడం, వాటిని పాఠకుల దృష్టికి తీకుసురావడం అవసరం."

"మంచి విమర్శకులున్ననాడు, మంచిపాఠకులు ఉంటారు. మంచి రచయితలూ ఉంటారు. ఏభాషలోనైనా సాహిత్యాన్ని సన్మార్గంలో పెట్టవలసినదీ పెట్టగలిగినదీ సద్విమర్శయే!"

**పాఠకుల బాధ్యత :**

ఎందుకు చదవాలో స్పష్టంగా తెలుసుకున్న పాఠకులు తమ హక్కుల రక్షణకై జాగరూకతతో ప్రవర్తిల్ల గలుగుతారు. పాఠకులు కేవలం ఉబుసుపోకకు కాక మంచి గ్రహించే ధ్యేయంతో చదవడం, చదివిన దానిపైఆలోచన కొనసాగించటం, నలుగురితోనూ తనఅభిప్రాయాలను చర్చించి, తెలుసుకోవడం

లాంటివి జరుపడం ఎంతైనా అవపరం. అవసరమైతే_పాఠకుల సంఘాలు ఏర్పడటం మంచి పరిణామం క్రిందే జమకట్టవచ్చు. పుస్తకాలను, కొని చదవటం మంచిఅలవాటే అని భావించాలి. ఇంట్లో చెప్పుకోదగ్గ మంచిపుస్తకాలు కనీసం పదైనా ఉండేలా జాగ్రత్తపడాలి.

ఒక సమగ్రమైనపథకాన్ని రూపొందించి, నియమితకాలంలో నిర్దుష్టమైన లక్ష్యాలను సాధించేందుకు పట్టుదలతో కృషిచేయటం అపసరం. మంచి పుస్తకాలు ఎక్కువసంఖ్యలో అచ్చుపటము, చౌకధరలకు అందించబడడం. ఎంతో అవసరం. సామాజికపరిస్థితుల దృష్ట్యా అవసరాలదృష్ట్యా, పాఠకుడు పుస్తకం దగ్గరికి రానప్పుడు పుస్తకం పాఠకుణ్ణి వెతుక్కుంటూవెళ్ళాలి. దీనికై ఉన్న మార్గాలను వివరించటానికి విషయవిస్తరణ అడ్డువస్తున్నది.



**మంచిపుస్తకం మంచిమనసుకు మరోపేరు**
**సొంతపుస్తకం మంచిమనిషికి మరోతోడు**

—ఇరివెంటి కృష్ణమూర్తి

# తెలుగు సాహిత్య పత్రికలు

శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయశాస్త్రి

స్వాతంత్ర్యపూర్వం ఇరవయ్యేళ్ళపాటు తెలుగునాట విరిసిన సాహిత్య సౌరభానికి కట్టగలిగిన విలువను స్వాతంత్ర్యానంతరం సాగిన ఇరవయ్యేండ్ల కృషికి ధైర్యంగాదత్తంచెయ్యలేము—

అభిప్రాయ ప్రకటనకు అవసరం తీవ్రమైన వ్యథలోగాని తలమున్కలయ్యే ఆనందంలోగాని కలుగుతుంది. స్వాతంత్ర్యానంతరయుగంలో అటువంటి అవసరాలు కలిగినదేతక్కువ. జాతిని ఊపివేయగలిగిన కష్టాన్ని అనుభవించక, మహానందాన్ని అనుభవించక సాహిత్యకృషి సంచలనరహితంగా సాగింది. పత్రికలు ఆసాహిత్యానికే ప్రాతినిధ్యం కల్పించక తప్పలేదు.

స్వాతంత్ర్యయుగోదయంలో సాహిత్యపత్రికలుగా చెప్పుకోదగినవాటి స్వరూపస్వభావాలు మారిపోయాయి. ఒకసిద్ధాంతలక్ష్యంతో నడిచిన 'అభ్యుదయ చీలి పీలికలయిపోయి నిర్విశేషమైంది. స్వాతంత్ర్యానికి మునుపు తెలుగు సాహిత్యానికి ప్రశస్తమైన సేవచేసిన 'ఆంధ్రవారపత్రిక', 'భారతి' పలచబడిపోవలసి వచ్చింది. తెలంగాణాప్రాంతంలో 'నీలగిరి' పత్రిక తరువాత 'సుజాత పత్రిక కొంతసేవచేసి వెలుకబడ్డాయి. 'గోలకొండ పత్రిక' వర్థమానులనెందరినో ప్రోత్సాహపరిచింది. 'కృష్ణాపత్రిక' రాజకీయాలకొాక సాహిత్యస్థాయిని సమకూర్చి క్రమంగా ఔద్ధత్యాన్ని కోల్పోయింది. ఆధునిక సాహిత్య నిర్మాణంలో "తెలుగు స్వతంత్ర" సేవలు సువర్ణాక్షరాలతో లిఖించదగినంతవి. ఆధునిక రచయితలకు కొత్తపుంతలు చూపి అనేకమంది రచయితల్ని ఆ పత్రిక తీర్చి దిద్దింది. స్వాతంత్ర్యానికి ముందున్న సాహిత్యపత్రికలు 'కిన్నెర' వంటివి కొన్ని మాసిపోయాయి. ఇప్పటి పరిస్థితి చూస్తే సాహిత్యపత్రిక కానిదిలేదు, ప్రజల అభిరుచులనుబట్టి నడవనిదీలేదు.

ఇలా పత్రికల జాబితాను ఆలోచించుకొని ఒక్కొక్క విశేషణం వాడుతూ వ్రాయడంకన్న స్వాతంత్ర్యానంతరం సాహిత్యపత్రికల తీరుతెన్నుల్ని చర్చించుకోడం మంచిదనిపిస్తుంది.

రచయితల్నిబట్టి పత్రికలు స్థాయిపెరుగుతుందా, పత్రికల స్థాయినిబట్టి రచయితలు ఎదుగుతారా అన్నప్రశ్నకు జవాబివ్వడం చాలాక్లిష్టం, భిన్నాభి

ప్రాయ ప్రతిపాదకం అవుతుంది. అయినప్పటికీ, ఒక్కవిషయం స్పష్టంగా కనిపిస్తున్నది. ఇప్పటిపత్రికల్లో సాహిత్యాన్ని గుర్తుపట్టడం కష్టమౌతున్నది. దానికి ముఖ్యకారణం పత్రికల సంఖ్య ఎక్కువకావడం, రచయితల సంఖ్య కూడా ఎక్కువకావడం. వందలకొద్దీ రచయితలనుంచి పదులసంఖ్యలో ప్రచురణమౌతున్న సాహిత్య పత్రికలనుంచి ఉత్తమసాహిత్యాన్ని ఏర్చికూర్చ దానికి తగిన శ్రద్ధాసక్తులు నేడెవ్వరికీ లేవు. కాబట్టి వచ్చినదంతా సాహిత్యంగా పరిగణించాల్సిన దశలో ఉన్నాం. దానితో పాఠకులుకూడా వర్గీకరింపబడి పోతున్నారు. రచయితలు, వారిఅభిమానులుగా పాఠకులు గిరిగీసుకు కూచుంటు న్నందువల్ల పత్రికలుకూడా వర్గ పత్రికలుగా మారిపోయే ప్రమాదంలోపడ్డాయి.

మునుపటి పరిస్థితి అలాంటిదికాదు. పత్రికలసంఖ్య స్వల్పంగాఉండడం వల్ల రచయితల్లోని సారవంతులే నిలిచి ప్రచారార్హులయ్యేవారు. పాఠకులు వారిని తేలికగా గుర్తించగలిగేవారు. ఇప్పుడెన్నెన్నో పత్రికల్ని నింపడానికి ఎందరెందరో అవసరం.అందరిలో నుంచి గుర్తించగల ప్రతిభను ఎన్నుకోడం కష్టమౌతోంది. దానితో క్లాసిక్సుకూడా పాఠకుల దృష్టిలోపడకనూపోవచ్చు, చెత్తకూడా పాఠకుల అభిమానపాత్రం కానూవచ్చు.

ఈనాడు ప్రత్యేకించి సాహిత్య పత్రికలనిపించుకోగలస్థాయిలో ఉన్నవి అరుదు. అలా అనిపించుకోగల 'త్రివేణి' ఆంగ్లపత్రికకూడా ఈనాడులేదు. 'స్రవంతి' బహుళప్రచారానికి దూరమైనట్లుంది. 'సృజన' వంటి పత్రికలు ఒకవర్గానికి పరిమితమైన పద్ధతిలో నడుస్తున్నాయి. 'నవత' ఆగిపోయింది. 'పేకువ' ఇంకా వెచ్చదనంలోకి రాలేకపోతోంది.

సాహిత్యపత్రికలు ప్రముఖంగా ప్రజాబాహుళ్యంమీద ప్రభావంవెయ్యలేక పోవడానికి హేతువేమిటి? సాహిత్యం మెదడుకు మేతవెయ్యగలిగేదేకాని, కడుపునింపగలిగేదికాదు. సాహిత్యంమీద డబ్బుచేసుకొనేకళ అబ్బిన తరువాత డబ్బుకోసం సాహిత్యంగామారిపోవడం సంభవిస్తోంది. కాగా కేవలం సాహిత్య పత్రికకు మనుగడ సాగడం కష్టం, సాహిత్యవ్యాపారంలోతాలుతప్పా సరఫరా అయినప్పటికీ కొనుగోలుదారులైన పాఠకులు చెయ్యగలిగిందేమిలేదు.

సాహిత్యసృష్టికి ఒకఆర్తి అవసరం. స్వాతంత్ర్యానికిముందు అటువంటిది ఉండేమోగాని, తరువాతమాత్రం లేదని గంటాపథంగా చెప్పవచ్చు. అందుకనే ఈ ఇరవయ్యయిదేళ్ళలోనూ వచ్చినసాహిత్యానికి ఒకముద్రపడలేదు, ఒక

ప్రభావాన్ని ప్రసారంచెయ్యడముతక్కువ. ఇదేపరిస్థితి ఈకాలపు సాహిత్య పత్రికలకు కూడా పట్టింది.

అసలు ఈనాడు సాహిత్యపత్రికలంటూ ఉన్నాయా? వస్తున్న పత్రికల్లో ఏది సాహిత్య పత్రిక కాదు?

రాజకీయాలకు సాహిత్య గౌరవాన్ని ఆపాదించిన పత్రికలుమున్నుండగా సాహిత్యానికి రాజకీయగౌరవాన్ని తెచ్చిపెట్టిన పత్రికలు ఈనాడెక్కువవుతున్నాయి. ఇందుకు ముఖ్యకారణం— పత్రికల నిర్వాహణ సృష్టిలో వచ్చినమార్పు. పత్రికలు ప్రజాసేవచేసే పేరుతో వ్యాపారపత్రికలుగా మారాయి. మన సినిమాల్లాగానే పత్రికలుకూడా నవరసపత్రికలు, సర్వతోముఖ పత్రికలయ్యాయి. దినపత్రికల సారస్వతానుబంధాలూ, వారపత్రికలూ, మాసపత్రికలూ - అన్నీ సాహిత్యాన్ని ముద్రిస్తున్నాయి. నవల, కథ, కవిత, వ్యాసం, నాటిక - అన్ని సాహిత్య స్వరూపాలకూ అన్ని పత్రికలూ ప్రాతినిథ్యమిస్తున్నాయి. అంతే కాకుండా ప్రతి పత్రికలోనూ మహిళలకు, బాలలకు, సినిమా అభిమానులకు, రాజకీయవాదులకూ - అందరి అవసరాలనూ తీర్చేందుకు కృషి జరుగుతోంది. విదేశాల్లోలాగా పత్రిక కొక ప్రత్యేకత కనిపించదు. అన్ని పత్రికలూ ఒకే ధోరణిలో నడుస్తుంటాయి. వాటి వాటి పరిస్థితినిబట్టి ప్రతి పత్రికా సాహిత్యకృషి చేస్తున్నట్లే; ప్రతి పత్రికా తన పాఠకుల్ని తాను వర్గీకరించుకున్నట్లే.

అందుకని పత్రికా రంగంలో పోటీ, వాణిజ్యదృష్టి పెరిగిన ఫలితంగా సాహిత్యకారులు కొంత లాభపడుతున్నారు. నవలలు, కథల పోటీల్లో కొత్త రచయితలనేకులు బహుమతులందుకొని ఈయుగానికి అవసరమైన సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు.

కాగా ఇప్పటి వైఖరుల ప్రకారం పత్రికల్లోవచ్చే సాహిత్యానికి వాఙ్మయ గౌరవంకన్న ఆర్థికగౌరవం హెచ్చవుతున్నది. ఇది ఒకరకంగా అభివృద్ధి సూచనమే కాని మరోరకంగా అయోమయావస్థకు దారి తీస్తున్నది.

మందెక్కువైతే మజ్జిక పల్చన-అన్న సామెతకు అనువుగావుంటున్నాయి ఈనాటి సాహిత్య పత్రికలు, సాహిత్యకారుల సామర్థ్య ప్రకటనమూ కూడా.

సాహిత్య నిర్మాణంలోకూడా సిన్సియార్టీ తగ్గుతోంది; అవసరాలు తీర్చడమే ప్రధానంగా డిమాండ్ అండ్ సప్లయి అనే ఆర్థిక సూత్రం ఆధారంగా సాహిత్య పత్రికలు, రచయితలూ వ్యవహరించడం స్వాతంత్ర్యానంతర యుగ పరిణామదశలోని ముఖ్యలక్షణమైంది!

ఏతావతా–1947 ఆగస్టు 15వ తేదీ తరువాత కచ్చితంగా సాహిత్యానికే కమిట్ అయి ఉన్న పత్రికలు ఇవీ అని చెప్పడమూ కష్టమే; ఈ పత్రిక ఒక ప్రత్యేకతను సాధిస్తున్నదీ అని చెప్పడమూ ఇబ్బందే.

ప్రచురణమౌతున్నవన్నీ సాహిత్యపత్రికలే. వేరే పత్రికలైనా యథాశక్తి సాహిత్యసేవకు పూనుకుంటున్నవే. సాహిత్యానికి కూడా కాలక్షేపం విలువ హెచ్చింది.

స్థూలంగా–స్థాలీపులాకంగా – స్వాతంత్ర్యానంతర యుగంలో సాహిత్య పత్రికలు కానీండి, పత్రికాసాహిత్యం కానీండి ముతకగొంగళిగా తయారైంది; కప్పుకున్నంతసేపే దాని విలువ; అది కూడా గుచ్చుకుంటోంది అంటూ గొణుక్కుంటూనే ।

అసలు వ్యవహారం–సాహిత్య పత్రికలకూ, పత్రికా సాహిత్యానికి మధ్య వ్యత్యాసాన్ని కొల్పోతున్నాం.



**మాధుర్యం కావ్యంలో ఎందుకు ?**
**మత్కృతిపతిస్తోత్రంలోవుంటే చాలంటాడు తెలుగులోకవి**
**మాలిన్యం మనసులోవున్నా**
**మల్లెపువ్వులా నవ్వగలగడం యీనాటితెలివి**

**—తిలక్**

# దినపత్రికలు - వారపత్రికలు

శ్రీ యస్. వెంకటేశ్వరరావు

ప్రస్తుతం తెలుగులో దినపత్రికలు, వారపత్రికలు, తదితర పత్రికలు పెక్కు ప్రచురింపబడుచున్నవి. వీటిలో సచిత్రవారపత్రికలు, కథలపత్రికలు, సినిమాపత్రికలు ప్రసిద్ధినొందినంతగా రాజకీయ, సారస్వత, వైజ్ఞానికపత్రికలు పేరుగడించటంలేదు.

స్వాతంత్ర్యసముపారనకు పూర్వము తెలుగుపత్రికా రచనావ్యాసంగము మిగతా భాషాపత్రికలవలె, జాతీయోద్యమముతో ముడిపడియున్నది. స్వాతంత్ర్యమును సంపాదించుటలోను, సంఘసంస్కరణలను ప్రోత్సహించుటలోను, భాషారాష్ట్రములను నెలకొల్పుటలోను తెలుగుపత్రికలు తమశక్తికొలది పాటుపడి ప్రజాశక్తిని కూడగట్టుటలో తోడ్పడినవి.

మొదటి, రెండవ యుద్ధకాలములలోను, స్వాతంత్ర్యోద్యమము చివరి దశయందున్నప్పుడును పెక్కుపత్రికలు పుట్టి అచిరకాలములోనే గిట్టినవి. 19 వ శతాబ్దము చివరిభాగమందు కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగముపంతులు గారిచే ప్రారంభింపబడిన వ్యావహారిక భాషోద్యమము, 20 వ శతాబ్దమారంభములో కీ॥ శే॥ గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావుగార్ల కృషితో బహుళ ప్రజాదరణపొంది పత్రికారచనను పటిష్ఠమార్గములో నడిపినది.

అనాటిపత్రికలు జాతీయోద్యమప్రభావమున, ధర్మనిరతితోను, ఉన్నతాదర్శములతోను నడుపబడినవి. కృష్ణాపత్రిక 1902 వ సంవత్సరమున బందరులో కీ॥ శే॥ దేశభక్తుని కొండా వెంకటప్పయ్యపంతులుగారిచే నెలకొల్పబడినది. ఈ పత్రిక కీ॥ శే॥ ముట్నూరి కృష్ణారావుగారి నిశితమైన ఛురియు నిష్పాక్షికమైన సంపాదకత్వాన తెలుగుప్రజలలోని జాతీయపిపాసను రెచ్చగొట్టినది. భాషారాష్ట్రోద్యమమునకు తీవ్రకృషి జరిపినది. ఆకాలమున కృష్ణాపత్రికకు సాటిగలపత్రిక మరియొకటిలేదు. అటువంటి వారపత్రికయొకటి ఇంకను వెలువడుచున్నదని తెలిసినవారు చాలాతక్కువ. ఆసక్తిగలవారెవరైనా చందాదారులుగా జేరుదమన్న, సకాలములో రానికారణముగా పత్రికయందు శ్రద్ధచూపలేకపోవుచున్నారు.

1908 లో బొంబాయిలో కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

గారిచే ప్రారంభింపబడిన ఆంధ్రపత్రిక వారపత్రిక 1914 లో మద్రాసుకు మార్చబడి అప్పటినుండి దినపత్రికగా వెలువడుచున్నది. తెలుగు పత్రికలకు కావలసిన పారిభాషిక పదజాలమును సృష్టించి, విజయవంతమైన మొదటి తెలుగు దినపత్రికగా ప్రాతికేయుఁచే ఇంకను మన్నలను పొందుచున్నది. కీ. శే. శివలెంక శంభుప్రసాద్ గారి ఆధ్వర్యమున ఆంధ్రపత్రిక మరియు దాని అనుబంధ పత్రికలు మరింత సుస్థిరపడినవి. ప్రస్తుతము శ్రీశివలెంకరాధాకృష్ణ ఆంధ్రపత్రిక (దిన, వార)సంపాదకులుగా వ్యవహరించుచున్నారు.

1938 లో ప్రచురణ ప్రారంభమయిన 'ఆంధ్రప్రభ' దినపత్రిక న్యాపతి నారాయణమూర్తిగారి సంపాదకత్వాన సముచితస్థానాన్ని సంపాదించుకొన్నది. దీనికి మెరుగులుపెట్టి, నూతనశోభతో వెలుగొందునట్లు తీర్చిదిద్దిన ఘనత శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారిది. ప్రస్తుత సంపాదకులు శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావుగారుకూడ తగుశ్రద్ధవహించి పత్రికయొక్క ప్రాముఖ్యతను నానాటికి పెంచు చున్నారు.

కమ్యూనిష్టుపార్టీయొక్క 'ప్రజాశక్తి' 1941 లో వారపత్రికగా ప్రారంభమయి 1945 నుండి దినపత్రికగా మారి మద్దుకూరి చంద్రశేఖరరావుగారి సంపాదకత్వాన వెలువడినది. పీడితజాతుల సముద్ధరణే ధ్యేయంగా అవలంబింపబడుటచే, ఈ పత్రికతో తెలుగు పత్రికారచనలో నూతన శకముప్రారంభమయిన దనవచ్చును. కాని, ఇది 1948 లోనే మూసివేయబడి, తిరిగి 1951 నుండి, దినపత్రికగా 'విశాలాంధ్ర' యనుపేర శ్రీ మోటూరి హనుమంతరావు మరియు శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావుగార్ల సంపాదకత్వానస్థిరపడినది. దీని ప్రస్తుత సంపాదకులు శ్రీ సి. రాఘువాచారి.

'తెలుగుస్వతంత్ర' 1948 నుండి గోరాశాస్త్రిగారి సంపాదకత్వాన దరిదాపు 10 సంవత్సరములు ప్రచురింనబడినది. గోరాశాస్త్రిగారి 'వినాయకుడివీణ' ప్రత్యేకాకర్షణగా నుండెడిది. తెలుగు స్వతంత్రలో తమ రచనలు రావటమే గొప్పగా ఆనాటి రచయితలు భావించెడివారు. 1957 లో ఈపత్రిక నిలిచిపోగానే, గోరాశాస్త్రీగారు హైదరాబాదు వచ్చి 'స్వతంత్ర' పేరిట కొన్నిరోజులు ఈ పత్రికను నడిపిరి. కాని, ఆర్థిక పరిస్థితులదష్ట్యా, పత్రిక కొనసాగటం కష్టమయిపోయినది.

1925 లో కీ॥శే॥ మాడపాటి హనుమంతరావుగారిచే ద్వివారపత్రికగా నెలకొల్పబడిన 'గోలకొండ పత్రిక' పుట్టుకతో, తెలంగాణా ప్రాంతములో

పత్రికా ప్రచురణమున నూతన అధ్యాయము ప్రారంభమయినది. దీనికి కీ॥ శే॥ సురవరపు ప్రతాపరెడ్డిగారు తమ గోలకొండ శైలిలో ప్రాంతీయప్రజల హృదయాలలో ప్రధాన స్థానాన్ని కల్పించినారు. తర్వాత, ప్రస్తుతపు ఉస్మానియా విశ్వవిద్యాలయపు వైస్-ఛాన్సలర్ శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి సంపాదకత్వాన దినపత్రికగా ప్రచురింపబడినది. 1966 ఆగస్టునుండి యీ పత్రిక వెలువడుటలేదు.

పై పత్రికల చరిత్రలను పరిశీలించిన, ఆర్థిక ఇబ్బందులే ఆయా పత్రికల పతనానికి కారణమని, తెలుగువారిలో పాఠకులు లేని కొరతకాదని విశదమౌతున్నది. పత్రికలు ఒక లక్ష్యశుద్ధితో నడుపబడినవే కాని, వ్యాపారదృష్టితో నడుపబడలేదు. ప్రస్తుతపు దినపత్రికలుకూడా ఎక్కువగా కాపీల అమ్మకము మీదనే నడుపబడుచున్నవే కాని, ప్రకటనలమీద ఆధారపడుటలేదు. ఇంగ్లీషు పత్రికలకును, భాషాపత్రికలకును ఉన్న తేడా ఇదియే.

1955 లో సికిందరాబాద్‌నుండి 'ఆంధ్రజనత' దినపత్రికను, విశాలాంధ్రను సాధించుటకై, శ్రీ పల్లూరి బసవరాజు మరియు కీ॥ శే॥ బూర్గుల రామకృష్ణారావుగార్లు నెలకొల్పిరి. ఇది ప్రస్తుతపు అధికార కాంగ్రెసు పత్రికగా వ్యవహరింపబడుతున్నది. ఇప్పుడు శ్రీ ఎ. చక్రపాణిగారు దీనికి సంపాదకులుగా నియమితులైరి.

ఇటులనే, విజయవాడనుండి "ప్రజాశక్తి" యను కమ్యూనిష్టు (మార్క్సిష్టు) పార్టీ దినపత్రిక వెలువడుచున్నది.

1961 నుండి 'ఆంధ్రభూమి' సంపాదకులుగా వ్యవహరిస్తూ, తమ నిశితమైన, నిష్పాక్షికమైన సంపాదకీయాలతో, గోరాశాస్త్రిగారు పత్రికను రాజధానిలోని అగ్రశ్రేణి పత్రికగా తయారుచేసినారు. ఎందరో యువరచయితలకు చేయూత నిస్తున్న పత్రికగా 'ఆంధ్రభూమి' పేరొందినది.

ఆంధ్రపత్రిక మరియు ఆంధ్రప్రభ బహుళప్రచారములో నున్నప్పుడు 1960 సంవత్సరమునుండి, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారి సంపాదకత్వాన 'ఆంధ్రజ్యోతి' విజయవాడనుండి ప్రచురింపబడుచున్నది. ఆ దినపత్రిక అచిరకాలములోనే సాటిప్రముఖపత్రికలతో సమానస్థాయిని అందుకోగల్గటానికి శ్రీ నార్లవారి ప్రతిభయే కారణమైయున్నది.

పై మూడుపత్రికల యాజమాన్యములు వారపత్రికలనుకూడా ప్రచురించుచున్నవి. ఈమూడును సచిత్ర వారపత్రికలే. చిన్న కథలు, కవితలు, సినిమా

రంగం మరియు కొన్ని వైజ్ఞానిక విషయములు ఈ వారపత్రికలలో ప్రచురింపబడుచున్నవి. పోటీల నిర్వహణ ద్వారా ప్రచురణకు కావలసిన కథలను, నవలలను ఎన్నుకొనుట పరిపాటి అయినది. ఇవికాక, రాజకీయ మరియు సాంఘిక విషయములకు సంబంధించిన కార్టూన్లు ప్రతివారము ప్రచురింపబడుచున్నవి. ఒక విధముగా నేటి వారపత్రికలు యువపాఠకులలో సాహిత్యము పట్ల ఆసక్తిని పెంపొందిస్తున్నాయనటంలో ఎటువంటిసందేహము లేదు. ఈ వారపత్రికలన్నీ వినోదాత్మకమైనవే. ఈపద్ధతులలోనే, విజయవాడ నుండి 'ప్రగతి' వారపత్రిక వెలువడుచున్నది.

కథావస్తు చిత్రీకరణ లేని వారపత్రికలలో, ప్రజామత. జయశ్రీ, జ్యోతి, చుక్కాని మొ॥ ముఖ్యమైనవి. ఇవికాక, రాజకీయాలోచనలను రేకెత్తించే వారపత్రికలలో ముఖ్యమైనవి తెలుగువెలుగు, జ్వాల, జమీన్ రైతు ప్రజాతంత్ర మొదలగునవి.

ఇదివరకటిలాగా, ప్రత్యేక కులము, జాతి పరమైన పత్రికలు నేడులేవు. కాని, 'నేత' వారపత్రిక పద్మశాలి సమాజ పురోభివృద్ధికై తోడ్పడుతున్నది.

ఆంధ్రప్రదేశ్ జనాభా 4 కోట్ల 34 లక్షలు. అందులో చదువనేర్చినవారు 24 శాతము. మొత్తము 13 దిన పత్రికలు, దరిదాపు 100 వారపత్రికలు ఉన్నప్పటికి రాష్ట్రరాజధానిలో పేరుపొందిన 6 దినపత్రికలు, మరొక 6 లేక 8 వారపత్రికలు మినహా, తక్కిన పత్రికలు లభ్యముకావు. ఆ పత్రికలను ప్రజల దృష్టికి తీసుకురావలెనన్న దీక్ష వ్యవస్థాపకులలో ఉన్నప్పటికి, ప్రజలలో చిన్న పత్రికలయెడ అనాదరణ ఎంతవరకున్నదో విశదమౌతున్నది. 1958–68 మధ్యకాలములో తెలుగు పత్రికల అమ్మకము 68 శాతము పెరిగినప్పటికి మిగతాభాషాపత్రికలతో పోల్చిచూసిన తెలుగుపత్రికారచన ఎంతయో వెనుకబడి యున్నదని తెలియుచున్నది. ప్రముఖదినపత్రికలు సంబంధించినంతవరకు, అవి అన్నివిషయములను పాఠకులకు తెలియచెప్పటంలో ఏవిధముగనైనను ఇంగ్లీషుపత్రికలకు తీసిపోవుటలేదు. కాని చిన్న పత్రికలు – ముఖ్యముగా ప్రాంతీయవార్తలను సేకరించవలసిన ఆవశ్యకత ఎంతయో ఉన్నది. అటులనే, గ్రామీణజీవితానికి కావలసిన వార్తలను ప్రచురించుటలోను, మరియు గ్రామీణ వార్తలను సేకరించుటలోను భాషాపత్రికలు శ్రద్ధవహించవలసిన అవసరము కూడ ఉన్నది.

లి గ్రంథాలయోద్యమము లన్నియు మనుజుని వికా
సించుటకే ప్రయత్నము లొనర్చుచుండ, ఆంధ్రదేశ
మనుజుని సంపూర్ణ మనుష్యత్వమును వ్యక్తీకరించుటకు
నంతయు సమకూర్చుకొని యున్నది. మనమొసగు
న్న ఆత్మనుద్దీపింపజేసి, పౌరునికిగావలసిన సన్మార్గజీవన
గ నుండవలయును. కావుననే మనయుద్యమముయొక్క
ర్యమునందు జ్ఞానాభివృద్ధిని గలుగజేసి, మనుజుని జీవ
ముగను చతుర్విధపురుషార్థ సాధకమును చేయుటయే యై

ము ఎల్లప్పుడును దృక్పథమునందుంచుకొని, ఈఉద్యమ
పనియును ఈ ఆదర్శమును కార్యరూపమున బెట్టుటకు
దియు పరిశీలించుచుండవలెను. ఈ ఆదర్శము కార్య
న్నచో, మనము అవలంబించవలసిన మార్గములు కేవలము
ముండరాదు.

ములందలి ఉద్యమములను - ఉన్నవి యున్నటుల మన
సయత్నింపరాదు. మనదేశ సాంప్రదాయములనుబట్టియు,
తరపరిస్థితులనుబట్టియు ఇట్టి యుద్యమములు ప్రచలితము
వి సజాతీయముగ నుండవలయును. అట్లని పాశ్చాత్య
భవములను మనము తీసికొనరాదనువారుండరు; కాని
మనము దాసులమై మనరూపుమారరాదు; ఆయనుభవ
మువహించి, మనయుద్యమముయొక్క సౌష్ఠవమునకు,
ాదదాయకములై యుండవలయును.

# గ్రంథాలయాలు

శ్రీ వెలగా వెంకటప్పయ్య

తరతరాలుగా సుషుప్తావస్థలో వున్న భారతావనికి స్వాతంత్ర్యం సంప్రాప్తించే నరికి తెలుగుదేశంలో వేలాది గ్రామాలలో గ్రంథాలయాలు పనిజేస్తున్నాయి. ప్రయివేటు సంఘాలు, గ్రామసంఘాలు, పంచాయతీలు, పురపాలక సంఘాలు మొదలైన సంస్థలు యీ గ్రంథాలయాలను నిర్వహిస్తున్నాయి. ప్రభుత్వం నామమాత్రంగా ఆర్థిక సాయంచేస్తున్నది. ప్రజల ఆదరాభిమానాలే యీ గ్రంథాలయాల నిర్వహణకు పెట్టనికోటగా పనిజేస్తున్నాయి. నిర్వహణలో శాస్త్రీయ పద్ధతులకు దూరంగా ఉన్నా, యీ గ్రంథాలయాలు తమ పరిధిలో సేవజేస్తున్నాయి.

అయితే యీ గ్రంథాలయాల నిర్వహణను క్రమబద్ధంజేసి, ఆధునిక విధానంలో గ్రామగ్రామానికి గ్రంథాలయ సేవను అందజేసే ఉద్దేశంతో 1948 లో మద్రాసు పౌర గ్రంథాలయ చట్టం చేయబడింది. ఆతర్వాత అవసరాన్నిబట్టి 1955 లో హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టం, 1960 లో ఆంధ్ర ప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టం రూపొందించబడ్డాయి. మొత్తంమీద 1961 నాటికి విశాలాంధ్రావని అన్ని జిల్లాల్లో గ్రంథాలయ చట్టం అమల్లోకి వచ్చింది.

**గ్రాంథాలయ విధానం :**

చట్టం అమల్లోకి వచ్చాక రాష్ట్రంలో గ్రంథాలయవిధానం 3 అంచెలుగా ఏర్పడింది. ప్రభుత్వ గ్రంథాలయాలు, జిల్లా గ్రంథాలయసంస్థల గ్రంథాలయాలు, ప్రయివేటు గ్రంథాలయాలు – యీ మూటి తరగతుల గ్రంథాలయాల నిర్వహణ సారథ్యం ప్రభుత్వంపౌర గ్రంథాలయశాఖ వహిస్తుంది. హైదరాబాదులోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, గుంటూరు, విశాఖపట్నం, తిరుపతి, వరంగల్, నిజామాబాద్‌లలో గల ప్రాంతీయ గ్రంథాలయాలను, ఏలూరులోని సంచార గ్రంథాలయాన్ని ప్రభుత్వం నిర్వహిస్తుంది. చట్టాన్ని అనుసరించి ప్రతిజిల్లాకు ఒక జిల్లా గ్రంథాలయసంస్థ ఉంటుంది. హైదరాబాదు నగరానికి ప్రత్యేకంగా ఒకటి ఉంటుంది. ఈ సంస్థల తరఫున జిల్లా కేంద్రగ్రంథాలయాలు, శాఖాగ్రంథాలయాలు, పుస్తక పంపిణీకేంద్రాలు పనిజేస్తుంటాయి. ప్రజలనుంచి వసూలుచేసే సెస్సు, ప్రభుత్వం యిచ్చే విరాళం యీసంస్థకు

ఆర్థికవసతిని సమకూర్చుతుంది. ఇవిగాక స్థానికసంస్థలు, ప్రయివేటుసంఘాలు నిర్వహించే గ్రంథాలయాలు వేలాదిగా ఉంటాయి. వీటికి ప్రభుత్వం కొంత సొమ్ము విరాళంగా యిస్తుంది. సమాచారం లభించినంతవరకు యిటీవలి కాలంలో గ్రంథాలయాల పెరుగుదల యీతీరుగా ఉంది.

| | 1956–57 | 1960–61 | 1970–71 |
|---|---|---|---|
| ప్రభుత్వ గ్రంథాలయాలు | 2 | 3 | 7 |
| జిల్లా కేంద్ర గ్రంథాలయాలు | 9 | 21 | 21 |
| శాఖా గ్రంథాలయాలు | 120 | 209 | 552 |
| పుస్తక పంపిణీ కేంద్రాలు | 126 | 220 | 504 |
| ప్రయివేటు గ్రంథాలయాలు | 880 | 1061 | 1850 |

ఇందులో ప్రభుత్వంనుండి ఏ విధమైన ఆర్థిక సహాయం పొందని గ్రంథాలయాలు చేరలేదు. అవి ఏ పరిస్థితిలోనూ సహాయంపొందు ప్రయివేటు గ్రంథాలయాల సంఖ్యకంటే హెచ్చుగా ఉంటాయి.

**గ్రంథాలయ సేవ :**

గ్రంథాలయ రంగంలోని ప్రాథమిక సూత్రాలను అనుసరించి గ్రంథాలయసేవ పూర్తిగా ఉచితం. కుల మత వర్ణ విచక్షతలేక గ్రంథాలయాన్ని ఉపయోగించుకోవచ్చు. విద్యార్థులు, ఉపాధ్యాయులు, పిన్నలు, పెద్దలు, అంధులు యథేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. తమ వృత్తులలో నైపుణ్యాన్ని పెంపొందించుకోవచ్చు. కాలాన్ని సద్వినియోగపరచుకోవచ్చు. ఈ క్రింది సమాచారాన్ని పరిశీలించినట్లయితే స్వాతంత్ర్యానంతరం గ్రంథాలయాలుఏతీరుగా ఉపయోగిస్తున్నవో స్పష్టమౌతాయి.

| సంఖ్య | వివరం | 1956–57 | 1960–61 | 1970–71 |
|---|---|---|---|---|
| 1 | పుస్తకాల సంఖ్య (లక్షలలో) | 5.61 | 12.00 | 37.30 |
| 2 | చదువరులు (రోజుకు లక్షలలో) | 0.15 | 0.21 | 151.14 |
| 3 | గ్రంథాలయంలో చదివిన పుస్తకాలు (రోజుకు–లక్షలలో) | 0.44 | 0.75 | 43.42 |
| 4 | ఇండ్లకు ఇవ్వబడిన పుస్తకాలు (రోజుకు లక్షలలో) | 0.46 | 0.55 | 48.97 |

స్వాతంత్ర్యం వచ్చాక ముఖ్యంగా పౌరగ్రంథాలయాలలో సాంకేతికంగా మంచి

అభివృద్ధిని సాధించాయి. దశాంశవర్గీకరణను ప్రవేశపెట్టడం, కార్డులపద్ధతిలో కేటలాగు తయారీ, అరువివ్వడంలో బ్రౌనీ విధానం అమలుపరచడం ద్వారా చదువరులకు ఏవిషయంమీద, ఏ పుస్తకం కావాలన్నా దాని సమాచారం యిట్టే లభిస్తోంది. వేల లక్షల సంఖ్యలో పుస్తకాలున్నా నవీన విధానాలద్వారా చదువరి సమయం వృధాకాకుండా అనేక ఏర్పాట్లు చేయబడుతున్నాయి.

**గ్రంథాలయవిద్య:**

ఉద్యమ ప్రగతి సుశిక్షితులైన సిబ్బందిమీదే ఆధారపడి ఉంది. ఉద్యమ వికాసానికి కార్యకర్తలను తయారు చేసే ఉద్దేశంతో అయ్యంకివారు 1920 లో శిక్షణతరగతులు ప్రారంభించారు. ఆతర్వాత అనేక పర్యాయాలు గ్రంథాలయ సంఘం తరపున యీ తరగతులు వివిధప్రాంతాలలో నిర్వహించబడ్డాయి. గ్రంథాలయ శాస్త్ర విషయాలకంటే యితరవిషయాలు యిందు ఎక్కువగా బోధింపబడేవి. కేవలం గ్రంథాలయ శాస్త్ర విషయాలను బోధించే ఉద్దేశంతో తొలిసారిగా ఆంధ్రవిశ్వవిద్యాలయం ఆతర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయం డిప్లమా తరగతులను ప్రారంభించింది. నేడివి డిగ్రీగా మార్చబడ్డాయి. సర్టిఫికెట్ స్థాయిలో ఇటీవల కాలంలో ఇన్స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీసైన్స్, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం, విజయవాడ; శ్రీవేంకటేశ్వరవిశ్వవిద్యాలయం, తిరుపతి మొదలైన సంస్థలలో సర్టిఫికెట్ కోర్సును శిక్షణా తరగతులు నిర్వహించబడు తున్నాయి. ప్రభుత్వం ఆర్థిక సహాయం చేస్తూ యీతరగతుల నిర్వహణను ప్రోత్సహిస్తుంది.

**గ్రంథాలయ సాహిత్యం:**

ఉద్యమప్రచారానికి చిరకాలంగా చిరుపొత్తాలు, కరపత్రాలు, మహాసభల సంచికలు, నివేదికలు అనేకం ప్రచురింపబడ్డాయి. అనేకసార్లు ఆగిపోయినా గత ఏడాదివరకు ప్రచురింపబడిన "గ్రంథాలయ సర్వస్వం" పత్రిక ఉద్యమవికాసానికి ప్రబలమైన ప్రచారసాధనంగా పనిజేసింది. కొంతకాలం ప్రచురింపబడి ఆగిపోయిన పుస్తకమిత్ర, ప్రతినెల ఇంటింట గ్రంథాలయాభిమానులకోసం ప్రచురింపబడుతున్న పుస్తకప్రపంచం, పత్రికలుగూడ ఉద్యమ ప్రగతికి యితోధికంగా దోహదపరుస్తున్నాయి. స్వాతంత్ర్యానికిపూర్వం గ్రంథాలయశాస్త్ర విజ్ఞానంమీద ప్రత్యేకంగా ప్రచురించిన గ్రంథాలంటూ లేవు.

స్వాతంత్ర్యంవచ్చిన 1947 ఆగస్టుమాసంలో తొలిసారిగా డాక్టర్ రంగనాథన్ రచించిన "ఫైవ్‌లాస్ ఆఫ్ లైబ్రరీ సైన్స్" గ్రంథాన్ని అనుసరించి పాతూరి నాగభూషణంగారు గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠాలపేరున పుస్తకాన్ని ప్రచురించారు. ఆ తర్వాత వారిచే పఠనమందిరాలు, గ్రంథాలయప్రచారం – విజ్ఞాన వ్యాప్తి మొదలైన రచనలు వెలువడ్డాయి. కేవలం గ్రంథాలయశాస్త్రపరంగా చేసిన యీవ్యాసరచయిత రచనలు గ్రంథాలయవిజ్ఞానం, పుస్తకాలభద్రత, వర్గీకరణనియమాలు, గ్రంథకర్తగుర్తులు మొదలైనరచనలు విశేష ప్రచారాన్నందుకున్నాయి. అంతేగాక యీవ్యాసకర్త సంపాదకత్వాన 1968 నుంచీ ఏటేటా వెలువడే వార్షికసమీక్ష "గ్రంథాలయదర్శిని" గ్రంథపాలకులకు కరదీపికగా ఉపయోగపడుతోంది.

**గ్రంథ సంపదలో మార్పు :**

స్వాతంత్ర్యానికి పూర్వం, ఆ తర్వాత గ్రంథ సంపదలో, గ్రంథాలయ ప్రయోజనంలో, కార్యకర్తలలో అనేక మార్పులు వచ్చాయి. ఇంతకుపూర్వం గ్రంథాలయాలలో తాళపత్ర గ్రంథాలు, వ్రాతప్రతులు, ముద్రితగ్రంథాలు, పత్రికలు ఉండేవి. ఇటీవలి కాలంలో పైవాటితోబాటు మైక్రో ఫిల్ము, మైక్రో రీడర్, దృశ్య శ్రవ్య పరికరాలు చోటు చేసుకున్నాయి. చదువరులలో విషయ పఠనాసక్తి పెరగడంతో వీటి అవసరమూ హెచ్చింది. చదువరికి కావలసిన సమాచారం సత్వరం అందజేయదలచుకున్నప్పుడు యిలాటి ఆధునిక పరికరాల ఉపయోగం తప్పదు.

వాస్తవానికి గ్రంథాలయం మహనీయుల మహిమాన్విత ఆలోచనా స్రవంతికి కూడలి. జిజ్ఞాసువులకు నిలయం. దీనిని ఎంత సక్రమంగా ఉపయోగించుకుంటే మానవాళి అంతగా ప్రగతి పథంవైపు పయనించడానికి వీలుగా ఉంటుంది. ఇప్పటికే యీ సంగతి అనుభవపూర్వకంగా గ్రహించడం జరిగింది. 1972 భారత స్వాతంత్ర్యానికి రజతోత్సవం జరుగుతున్న తరుణంలో, గ్రంథాలయాన్ని మరింత ప్రయోజనకరంగా ఉపయోగించుకోవాలి. అప్పుడే సంఘం బాగుపడుతుంది, సంస్థ బాగుపడుతుంది.

# ముద్రణకళ

శ్రీ తెన్నేటి అచ్యుతరామయ్య

స్వాతంత్ర్య సముపార్జనా నంతరం మన రాష్ట్రంలో ముద్రణా వశ్యకత చాలా ఎక్కువైంది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడినప్పటినుంచి ముద్రణా అవసరం ఇంకా పెరిగింది. రాష్ట్రంలో అనేక పరిశ్రమలు (పెద్దవి చిన్నవి) పెంపొందడంతో అచ్చుపనులుకూడ ఎక్కువైనవి. అనేకమైన ఫారములు, రిజిస్టర్లు, ధరలపట్టీలు (price lists) వంటివే గాక ఉత్పత్తుల ప్రచార నిమిత్తంకూడ ముద్రణ ఆవశ్యకత ఎక్కువైంది. (కరపత్రాలు, పోస్టర్లు బ్రోషర్లు వగైరా).

విద్యారంగంలో అనేక ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలల స్థాపనతోను, అనేక కళాశాలల స్థాపనతోను, విద్యార్థుల కవసరమైన పాఠ్య గ్రంథాలు, నోట్సు, రికార్డు పుస్తకాలు వగైరాలకు గిరాకి (Demand) పెరిగి పోయింది. వీటన్నిటిని ముద్రించుటకు, సకాలంలో అందచేయటానికి ఏకొన్ని ముద్రణాలయాలకో సాధ్యంకాదు. కనుక రాష్ట్రవ్యాప్తంగా ముద్రణాలయాల సంఖ్య చాలా బాగా పెరిగింది.

ఇంతేగాక సాంఘిక సాహిత్య రంగాలలోకూడ ముద్రణ చాలా ప్రాముఖ్యం వహించింది. ఈ రంగంలోను, సినిమారంగంలోను ముద్రణ కళాత్మకంగా వుండాలి. చూపరులనిట్టే ఆకర్షించేవిధంగా రంగులు మేళవించి కనులకింపుగా ప్రచారసామాగ్రి ముద్రించాలి. సాహితీ పరుల పొత్తములు నిర్దుష్టముగా తప్పులు లేకుండా ముద్రింపబడాలి.

ముద్రణపరిశ్రమ మనరాష్ట్రంలో ఎంత విస్తరించినా, ఉత్పత్తిని ఎంత హెచ్చించినా తనఖాతాదార్లను తృప్తి పరచలేకుండావుంది. వారిఫిర్యాదులు (1) (Getup) గెటప్ అంటే కూర్పు బాగాలేదని, (2) నిర్ణీతకాలానికి పని పూర్తి చేయటంలేదని (3) తప్పులు ఎక్కువగా వుంటున్నవని మొదలైనవి.

ఇవి పూర్తిగా నిరాధారములైన ఫిర్యాదులు కావు. గెటప్ విషయంలో ఇది ఒకవిధంగా చిత్రంగా వుంటుంది. కస్టమర్స్‌లో చాలామంది తమ కేవిధంగా చేస్తే బాగుంటుందో చెప్పరు. ప్రెస్‌వారు చేసినతర్వాతమాత్రం అది బాగాలేదు-ఇది బాగాలేదు, ఇట్లాచేస్తే బాగుండేది, అట్లాచేస్తే బాగుండేది అంటారు.

కొందరు సరిపుచ్చుకొంటారు. కొందరు మళ్ళీ అంతా మార్పిస్తారు. దీనికి కారణం కొంతవరకు ప్రెస్‌లో అజ్మాయిషీ (Supervision) లోపం కావచ్చు. ఈ పరిశ్రమలో ఇచ్చే వేతనాలు తక్కువ. ఆ వేతనాలకు సాంకేతికంగా ఉత్తీర్ణులై నిపుణులైన వ్యక్తులు రారు. మన రాష్ట్రంలో ముద్రణ విషయంలో సాంకేతిక డిప్లొమా కోర్సు గాని మరి అలాంటి ఏ ట్రైనింగ్ పొందే అవకాశాలుగాని అటు ప్రభుత్వపరంగాగాని, విశ్వవిద్యాలయపరంగాగాని లేవు. మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలో ముద్రణలో సాంకేతిక డిప్లొమా కోర్సు (LPT) వుంది. ఈమధ్య తమిళనాడులోకూడ ఈ డిప్లొమా కోర్సుకు ఏర్పాట్లు జరిగినట్లు తెలుస్తోంది. ముద్రణ అంటే ఉత్సుకత లేని విద్యావంతులు ఇతర రాష్ట్రాలకు పోయి ఈ డిప్లొమా సంపాదిస్తారా ? ఏ కొద్దిమందో డిప్లొమా పొంది వచ్చినవారున్నారు కాని వారు రాష్ట్రావసరాలకు సరిపోరు. కనుక మనరాష్ట్రంలో కూడ ప్రభుత్వ సాంకేతిక విద్యాశాఖవారో లేక విశ్వవిద్యాలయంవారో ఇందుకు వీలు కల్పిస్తే ఎక్కువమంది సాంకేతికంగా నిపుణత సంపాదించి చక్కని ముద్రణ చేయుటకు దోహదం కలుగచేస్తారు.

నిర్ణీతకాలానికి పని పూర్తి కాకపోవటానికి కారణాలు చాలా వున్నాయి. ముఖ్యంగా ఇందుకు కారకులు కార్మికులు. కొన్ని సందర్భాలలో యజమాని (Proprietor) కూడ. ఒక్కొక్కప్పుడు కష్టమర్ కూడ. మన కార్మికులలో హక్కుల సాధనపైనున్న మోజు బాధ్యతానిర్వహణలో లేదు. ఈ పరిశ్రమలో గైరుహాజరు (absenteeism) ఎక్కువ. ముద్రణాలయంలో కంపోజిటరు, ప్రింటరు, బైండరు ఈ ముగ్గురు ముఖ్యులే. ఒక ఫారం ప్రింటు చేయాలంటే కంపోజు అవాలి గదా ! Print order వచ్చినాక ఆ ఫారంకు కావలసిన కాగితం కావలసిన సైజుకు బైండరు కోసి ఇవ్వాలి. ఈ పని ప్రింటరు గాని, కంపోజిటరు గాని చేయునది గాదు. బైండరు పనికి రాని రోజున ప్రింటింగుకాదు. అట్లాగే ప్రింటరు రాకపోయినా ఫారం అచ్చుకాదు. వీరు ముగ్గురూ వచ్చినరోజున ప్రభుత్వవిద్యుచ్ఛక్తివారు, లైను రిపేర్సు తీసుకొంటారు. ఒక్కొక్కప్పుడు, 4, 5 గంటలుకూడా విద్యుచ్ఛక్తి సప్లైవుండదు. ఇదికాక శెలవులు, సమ్మెలు-వగైరా. ఖాతాదారు ప్రూఫ్ సరిచూచి సకాలంలో ఇవ్వకపోవటం. ఇవన్నికూడ నిర్ణీతకాలానికి పనిపూర్తిచేయుటకు ఆటంకాలే. అనుకున్నప్రకారం అనుకొన్నరోజుకు పనిపూర్తిచేయాలంటే కార్మికుల సహకారం చాలా అవుసరం. ప్రస్తుతం మనకార్మికులు - ముఖ్యంగా ముద్రణ

పరిశ్రమ కార్మికులు - అట్టిసహకారం అందచేయటంలేదు. ముస్ముందువారు తమ బాధ్యతలనుగుర్తించి సంపూర్ణ సహకారం అందజేసి ఈ పరిశ్రమను అభివృద్ధిపరచటంలో భాగస్వాములగుదురని ఆశిద్దాము.

ప్రొప్రయిటర్లుకూడ సకాలంలో వాళ్లకు వేతనాలిచ్చి, వారిశ్రమను, నైపుణ్యాన్ని తగువిధంగా గుర్తించి ప్రోత్సహిస్తే తప్పక వారిసహకారము లభిస్తుందని నా అభిప్రాయము.

పుస్తకాలలో తప్పులు దొర్లుతున్నాయన్నది నిజమే కాని అపప్రథకాదు. దీనికి కారణం సరియైన ప్రూఫ్‌రీడర్లను నియమించకపోవడము, తగినంత కాలవ్యవధి నీయకపోవడం. మనం అనేక, ముద్రణాలయాలలో చూస్తుంటాము. డిగ్రీకోర్సు పాఠ్యగ్రంథం ప్రూపులు చూచేది మెట్రిక్‌పాసయిన వ్యక్తో లేక తప్పినవ్యక్తో. వీళ్ళకు భాషాజ్ఞానం చాలాతక్కువ. విద్యావంతులైన వ్యక్తులు ఈ పనికిరారు. ఎందువల్ల? మొదటిది ఈ పరిశ్రమలో ప్రూఫ్ రీడర్‌కు రు. 150 లు మించి వేతనం ఇవ్వరు. ఈ వేతనానికి పట్టభద్రులురారు. రెండవది అత్యంతమైన ఓర్పు నేర్పుగలవారు ఈ పని చేయగలరు. ఒకగాలీ పుచ్చుకుంటే (గాలీఅంటే షుమారు 120 పంక్తులు) దానిని పూర్తిచేసేదాకా మరోవ్యాపకంలోకిపోరాదు. నేర్పు తప్పులుపట్టడంలో వుండాలి. కూర్చుబడిన ప్రతిమాటా తప్పే అనుదోరణిలో జోరుగా చదువుతూ తప్పులు పట్టుకుంటూ సందేహం కలిగినచోట ఓర్పుగా నిఘంటువును సంప్రదిస్తూ ప్రూఫులుదిద్దాలి. కాని ఆర్థికంగా నలిగిపోతున్న ఈ రోజుల్లో, వచ్చేజీతం బియ్యపు గింజలకు సరిపోని ఈ రోజుల్లో ఈస్వల్పవేతనోద్యోగి తన మనస్సును బుద్ధినీకేంద్రీకరించి నిశ్చింతగా తన నేర్పును ఓర్పును ప్రదర్శించగలడా? అట్లు కేంద్రీకరించిన నాడే తప్పులులేని ముద్రణ సాధ్యమవుతుంది. ఈ ప్రూఫ్‌లు చదవడంలో పురుషులకన్నా స్త్రీలు ఎక్కువ శ్రద్ధగాను, ఓర్పును, నేర్పును చూపుతారన్నది అనుభవం.

మరొకవిషయం, స్వాతంత్ర్య సముపార్జనానంతరం మనకు లభించిన మరోవరం అశ్రద్ధ. ఏపనిని ముందుగా కార్యక్రమం నిర్ణయించుకొని దాని ప్రకారం చేయలేకపోవుట. పక్షంరోజుల్లో ఆవిష్కరణ వున్నదనగా ఒక సాహితీ ప్రియుడు తనగ్రంథాన్ని ముద్రణకు వెలికితీస్తాడు. 'అయ్యా మూడు వారాలైనా వ్యవధివుంటేగాని చేయలేము, అంటే కాదండి ఫలానామంత్రిగారు ఆరోజుతమకువీలుంటుందన్నారు. కనుక అవసరమైతే రాత్రులుకూడా పనిచేసి

నాపుస్తకం 10 రోజుల్లో ఇవ్వాలంటాడు. నేనుచేయలేనంటే మరోచోటికి పోతాడు. వ్యాపారం ఒదులుకోవడమెట్లా, సరేనని ఒప్పుకొని ఏట్లాగో 10, 12 రోజుల్లో పుస్తకంబైట పడేస్తే ఇక నస, ఆపేజీలో 4 తప్పులు. ఈపేజీలో 2 తప్పులలంటూ. తప్పులులేకుండా ముద్రించాలంటే వకటికి రెండుసార్లు ప్రూఫులు సరిచూడాలి. అందుకు వ్యవధికావాలి.

ఏ విధంగా చూచినా మనరాష్ట్రంలో ముద్రణ నిర్దుష్టంగా కాని కళాత్మకంగా అభివృద్ధిపొందలేదని చెప్పాలి. సాంకేతిక నైపుణ్యం. కార్మికసహకారం కొరతపడింది. ఈలోపాలు సరిదిద్దాలంటే విద్యావంతులు చొరవచేసికొని ఈ పరిశ్రమలోని అన్నిశాఖలలో చేరి శ్రమించాలి. ప్రభుత్వంగాని, విశ్వవిద్యాలయాలుగాని సాంకేతిక విద్యారంగంలో ముద్రణ విభాగాన్ని నెలకొల్పి సాంకేతికంగా మంచి Supervisor లను, నిపుణులైన కార్మికులను మలచి ఈ పరిశ్రమ నిర్దుష్టంగాను కళాత్మకంగాను అభివృద్ధి చెందెందుకు దోహదం చేయాలి, త్వరలోనే చేస్తారని ఆశిద్దాము.



ఎవరో నాటిన మొక్కలు
ఇంకా వృక్షాలు కాలేదు
ఎవరో చూపిన చుక్కలు
ఇంకా ఇందుబింబాలు కాలేదు
ఎక్కడున్నావు గొంగడి అంటె
అక్కడే ఉన్నానంటే సరిపోదు.

—డా. సి. నారాయణరెడ్డి

# ఉద్యోగుల సంఘాలు

శ్రీ ఏ. శ్రీరాములు

వైట్‌కాలర్ వాళ్ళకు సరియైన నిర్వచనం సమకూర్చడం కష్టసాధ్యమైనపని. నైపుణ్యం, నిర్వహణం, వర్గం, అధికారం, ప్రతిపత్తి లాంటి ఏకొలత బద్దల సహాయంతోనూ వీళ్ళ కలరూపును నిర్ణయించడం సాధ్యంకాదు. తమ కాలాన్నే కాక తమవ్యక్తిత్వాన్ని అమ్ముకునే జీతగాళ్ళే ఉద్యోగులని నిర్వచించవచ్చును. ఈ వైటుకాలర్ వాళ్లు ముఖ్యంగా ప్రభుత్వోద్యోగాల్లో ఉన్నవాళ్లు. ప్రత్యక్షచర్యకు గాని పోరాటానికి గాని అట్టే పూనుకునే స్వభావంకలవాళ్లు కారు. ప్రజాసేవపట్ల విశ్వాసం ఉన్నవాళ్లు. దేశానికి సేవ చేస్తున్నామనే ఆత్మవిశ్వాసం, గర్వం వీళ్ళల్లో ప్రాయికంగా ద్యోతకమవుతూ ఉంటుంది. తమపట్ల ప్రభుత్వధోరణి ఎలా ఉన్నా పలువురు ఉత్సాహవంతులు, సేవాపరాయణులు వీళ్ళల్లో ఉండటం చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. సహజంగానే అమాయకులూ, సాధువులూ అయిన ఈ వర్గంవారు కడచిన పదేళ్లుగా పోరాటానికి సంసిద్ధులయ్యారు. ఏమిటీ పరివర్తనకు కారణం ?

1968 లో శ్రీ వి. వి. గిరిగారు ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు ఒక గ్రంథ ఉపోద్ఘాతం వ్రాస్తూ, ఉద్యోగుల సంఘాలకు తిరుగబడే లక్షణం, ఉద్యమ నిర్వహణ దక్షత ఉండవనే అభిప్రాయాలు సన్నగిల్లిపోతున్నాయన్నారు. 62 రోజులుగా ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు సమ్మె సాగించారు. సమ్మె ముగిసిన పిదప ఆయన ఈ అభిప్రాయం ప్రకటించారు. ఆ మహోద్యమం తర్వాత 1970 లో ఆంధ్రప్రదేశ్‌లోను, మహారాష్ట్రంలోను, 1971 లో కేరళ - ఆంధ్రప్రదేశ్‌లలోను దీర్ఘకాలంగా సమ్మెలు కొనసాగినవి.

సంప్రదాయసిద్ధంగా 'బాబూ'లుగా వ్యవహరింపబడుతున్న ఈ ఉద్యోగులు అసాధారణ జాగరూకులు-నిరంతర నిర్నిద్రులు-ముఖ్యంగా తమ ఉద్యోగం ఉంటుందో ఊడుతుందో అన్న భయం కలవాళ్ళు-ఏ శిక్షనైనా అనుభవించడానికి సంసిద్ధులు కావడం మహా అద్భుతమైన విషయం. వందలాది ఉద్యోగులు కారావాసాన్ని అనుభవించారు. పోలీసుల లాఠీదెబ్బలకు, బాష్పవాయు ప్రయోగాలకు, ఇంకా రకరకాలైన బెదరింపులకు గురి అయ్యారు. వీళ్ళల్లో ఇంత ప్రతిఘటనశక్తి ఎలా కలిగింది ?

కేంద్ర ప్రభుత్వోద్యోగుల సంఘాలు చాలా ముందుగానే ఏర్పడినవి. తంతి తపాలాశాఖ, రైల్వేశాఖ సంఘాలు చాల శక్తివంతంగా ఉండేవి. అయినా ఈ వైట్‌కాలర్‌వాళ్ళల్లో తొలిరోజుల్లో సౌభ్రాత్రం అంతగా కనిపించేదికాదు. సంగ్రహంగా చెప్పాలంటే ఢిల్లీ సెంట్రల్ సెక్రెటరేటు, ఆడిట్, ఇన్‌కంటాక్స్ శాఖల్లోని పలువురు క్లర్కులు 19 సెప్టెంబరు 1968 లో జరిగిన ఒకరోజు సమ్మెలో దేశంలో ఇతరులవలెనే ఎదురుతిరిగారు కాని 1960 లో జరిగిన సమ్మెలో వీళ్ళ పాత్ర చెప్పుకోతగ్గంతగా లేదు.

రాష్ట్రప్రభుత్వఉద్యోగులు సంఘాలేర్పరచుకొని ఉద్యమాలుసాగించడానికి కారణం పరిస్థితులే. ఆకాశాన్నంటుతున్న ధరలు, వాస్తవికవేతనాల్లో తగ్గుదలలు, ఈ తక్కువ ఆదాయవర్గాలను ఆదుకొనడంలో రాష్ట్రప్రభుత్వాల వైఫల్యాలు ఉద్యోగులను వివశులను చేసినవి. సంఘాలుగా ఏర్పడి పోరాటానికుద్యుక్తులయ్యారు. గత్యంతరంలేదుమరి. మద్రాసురాష్ట్రంలోను పిమ్మట ఆంధ్రప్రదేశ్‌లోను ప్రభుత్వ ఉద్యోగుల ఉద్యమాలచరిత్ర ఈ అభిప్రాయాన్నే తెలుపగలుగుతున్నది. కొన్ని సూక్ష్మభేదాలుంటే ఉండవచ్చునుకాని మొత్తం మీద ఇందుమించు ఇక్కడజరిగిందే అన్నిరాష్ట్రాల్లోను జరిగింది.

ఇంగ్లీషువాళ్ళపరిపాలన సాగుతున్న రోజుల్లోనే అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఒక ఎన్.జి.వో ల సంఘం ఉండేది. కాని వాళ్ళు సామూహికంగా ఏదైనా చర్యతీసుకున్నట్టు తెలుపగలిగే ఆధారాలేవీ లేవు.

1947 లో ఎన్. జీ. వోలు నిరవధిక సమ్మె సాగించడంతో ప్రశాంత జిల్లాల్లో తొలికెరటం పొటమరించింది. ఆ సమ్మె ఐదురోజులుగా సాగింది. నిర్దాక్షిణ్యంగా అణచివేయబడింది. ఈ సమ్మెకు దారితీసిన కారణాలనుక్లుప్తంగా వివరిస్తాను.

అప్పటి రెవెన్యూమంత్రి శ్రీకాంత్ అధ్యక్షతన ఒక క్యాబినెట్‌స్కాలరీస్ కమిటీ ఏర్పడి కొత్తజీతాల స్కేళ్ళను కరువుభత్యాన్ని సూచించింది. 160 మరి 180 పాయింట్లనడుమ ఎక్కడో ఒకదశలో జీవనస్థాయి సూచిక (INDEX) స్థిరీకరింపబడుతుందని ఈ కమిటీ హామీ ఇచ్చింది.అప్పుడు(1947) ఈ సూచిక 272 పాయింట్లు (1936-100) అందు కున్నది. దాదాపు అదేసమయంలో మరింత వాస్తవిక దృక్పథంతో మొదట సెంట్రల్ పే కమీషన్ రిపోర్టు వెలువడింది. దీని పర్యవసానం కేంద్రప్రభుత్వం క్లర్కుకు 90 రూపాయలు, రాష్ట్రప్రభుత్వంలో క్లర్కుకు 67 రూ.కేంద్ర ప్రభుత్వోద్యోగు

లకు రాష్ట్రప్రభుత్వోద్యోగులకు మధ్య వ్యత్యాసాని కిదినాంది. బ్రిటిష్‌పాల నంలో ఈ వ్యత్యాసం మృగ్యం. ఈవిధంగా స్వతంత్ర భారతంలో రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు మొట్టమొదటి సమ్మె జరిపారు.

యాదృచ్ఛికంగా ఈ వ్యత్యాసం ఏండ్లతరబడి అధికాధికమౌతూ దేశంలో రాష్ట్రప్రభుత్వోద్యోగుల్లో నానాటికి అసంతృప్తికి కారణమౌతున్నది. కరువుభత్యానికి సబంధించినంతవరకు జాతీయస్థాయిలో ఏకైక సూత్రం ఏర్పడాలని ఉద్యోగులకోరిక.

ఈ సమ్మె అణచబడినా, చెలరేగిన విమర్శలను, ప్రచారాలను మామూలుగానే ప్రభుత్వాలు పెడచెవినిపెట్టుతూవచ్చినవి. ఈ ఆందోళనలకు హేతుభూతమవుతున్న పరిస్థితులను తొలగించలేదు. ధరలు రానురాను అందని మ్రాని పండ్లుగా, కొరకరాని కొయ్యలుగా తయారైనవి.

1947 లో సూచిన 272 పాయింట్లుంటే 1958 లో 401 దాకా ఎక్కికూర్చుంది. ఈలోగా అవతరించిన ఆంధ్రప్రభుత్వంగాని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంగాని తమ ఉద్యోగులకష్టాలను నిర్మూలించలేకపోయినవి. ఈపరిస్థితి, 1957 లో ఉద్యోగులంతా మూక ఉమ్మడిగా క్యాజువల్‌లీవ్ పెట్టడానికి, 1959 లో క్విట్ వర్క్‌కు ఉద్యమించడానికి దారితీసింది. 1959 లో ఈ రాష్ట్ర ప్రభుత్వం అవలంబించిన దమన నీతి విధానాలు ఉద్యోగుల సంఘాలు మరింత శక్తివంతంగా, బలీయంగా రూపొందడానికి తోడ్పడినవి.

ధరలలో పెరుగుదల వలనకలిగిన, ఆర్థికమైన ఇబ్బందులు, అనివార్య పరిస్థితులు కృత్రిమ మర్యాదలకు స్వస్తి చెప్పినవి. ముఖ్యంగా ఉద్యోగి వర్గంలో తమలోఉన్న తారతమ్యాలు అంతరించడమే కాకుండా తమకంటె కింది ఉద్యోగులకు, తమకు నడుమఉన్న అంతరాలు నశించిపోయినవి. ఉదాహరణకు 1959 లో, కొంచెం ఎక్కువ జీతంరాళ్లుతెచ్చుకుంటున్న ఉద్యోగులు, తమకంటె తక్కువ జీతం తెచ్చుకునే వారితో చెట్టపట్టాలు పట్టుకుని నిరసన ప్రదర్శనలకు, ఊరేగింపులకు వీధుల్లోకి వచ్చేవారుకారు. కరుడుగట్టిన పాత కాలపు విద్యావిధానంవల్ల సంక్రమించిన మిథ్యాగౌరవ భావం, కల్లరివిలువలు, సామాన్యునితో చేయి చేయికలిపి వ్యవహరించగలిగే భావాలకు అడ్డువచ్చినవి. ఇదంతాగతం, కూలీనాలీ చేసుకుని బ్రతికే వర్గాల్లో కూడా సభ్యతపెంపొందుతున్నది. మహానిదర్శనం. ఆంధ్రప్రదేశ్‌లో 1971 లో జరిగిన సమ్మెలో రోడ్లూడ్చేవాళ్లు, పాకీవాళ్ళు స్థానిక డిప్యూటీ తహసీల్దార్లతో, అసిస్టెంటు కమర్షి

యల్ టాక్స్ ఆఫీసర్లతో కలిసి వీధుల్లో ప్రదర్శనలు జరిపారు. 1961 లో ఏది ధర్మద్రోహమో అదిప్పుడు అవశ్యాచరణీయమైనధర్మం - సత్యం. ధరలు మృత్యువులాగే సమత్వానికి ప్రతీకలు. ఇది నిజం.

ఉద్యోగుల ఉద్యమాలకు, ఆందోళనలకు రాజకీయ ప్రమేయాన్ని, ప్రేరణను అంటగట్టుతూ చేస్తున్న విమర్శలు వింటున్నప్పుడు నాకు నవ్వొస్తుంది. కొన్ని రాజకీయ పక్షాలు తాము అధికారంలో ఉన్నప్పుడు ఉద్యమాలను సర్వవిధాలా నిర్మూలించడానికి ప్రయత్నించడం, అధికారంలో లేనప్పుడు బలపరుస్తూ ఉండటం మన దేశంలో అసాధారణ విషయమేమీకాదు. ఉద్యోగులీ విషవలయంలో చిక్కుకోలేదని, ఉపకరణాలుగా మారలేదని నాకు తెలుసు. ఆ మాటకొస్తే మన దేశంలో పలువురు రాజకీయ నాయకులకంటే ఉద్యోగులే రాజకీయంగా ప్రౌఢులేమో ! సమగ్రావగాహన గలవారేమో ! బ్రిటిషు పరిపాలన ఉద్యోగులకు నేర్పిన రాజకీయ అలీనత Political Nutrality మన దేశవాళీ అధికారులుకూడా పాటిస్తూ ఉండటంవల్ల ఈ విషవలయానికి దూరంగా ఉండగలుగుతున్నారనడం ఒక తథ్యం.

వైట్‌కాలర్ ఉద్యోగుల సంఘాలు దేశంలో ఇంకా పురోగమించవలసి ఉంది. సామాన్య ఉద్యోగి ఇంకా సంఘంలో చేరడానికి అనిష్టత కనబరుస్తున్నాడు. తనకేదో సద్యోలాభం కలుగుతుందనే ఆశ ఉంటేనే తప్ప అతడు తన చందాకూడా కట్టడు. వీళ్ళనంతా ఏకంచేయడానికి 'సమ్మె' ఏకైకమార్గం. ప్రభుత్వాల ఆలోచనారహితమైన ధోరణుల, విధానాలు ఒకవిధంగా మేలే చేసినవి. తరుచుగా సమ్మెలు అనివార్యమైన అవసరాలుగా రూపొంది ఉద్యోగులను సంఘటిత పరుస్తున్నవి.

సోషలిజం తీసుకురావాలని తహతహలాడుతున్న మనదేశంలోని ప్రభుత్వం విద్యార్హతలు గల ఉద్యోగుల శక్తిసామర్థ్యాలను ఉపయోగించుకోలేకపోతున్నదని నా విచారం. అజ్ఞానంవల్ల ఇలా జరుగుతున్నదో లేక కావాలని ఇలా చేస్తున్నారో తెలియదు.

భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుందని నాకిప్పటికి నమ్మకమే. అవినీతికి ఆటపమైన ఒక దోషజుష్టమైన పద్ధతితో పోరాడుతున్నామనీ, దాన్ని కూలద్రోయాలనీ, నామరూపాలు లేకుండా చేయాలనీ ఉద్యోగులిప్పుడిప్పుడే తెలిసికొని సన్నద్ధులౌతున్నారు. అభ్యుదయకరమైన ఆశయాలకూ, ఆచరణలకూ వాళ్లు ఉన్ముఖులౌతున్నారు. భవితవ్యం ఆశావహంగానే ఉన్నది.

(స్వేచ్ఛానువాదం : శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి)

# తెలుగువారి తీరని సమస్యలు

శ్రీ యస్. శ్రీనివాస్

"తెలుగువారి తీరని సమస్యలేవి?" అని ఆలోచించినట్లయితే ఒక అనుమానంరావచ్చు. "తెలుగువారికి తీరని సమస్యలు కానివేవి?" అని. నిజమే, తెలుగువారి జీవితం సమస్యలమయం. ఎన్నో సమస్యలతో సతమతమౌతూ, పూర్వవైభవాన్ని తలపోస్తూ, వర్తమానంలో మాత్రం వివిధరంగాలలో తక్కినవారికంటె కొంతవరకు వెనకపడుతూ, నత్త నడకతోముందుకు సాగుతున్నారు తెలుగువారు. మనని మనం హీనంగా చూసుకోవడంగాని, మనలోని గొప్పదనాన్ని గుర్తించుకొనకపోవడంగాని నా ఉద్దేశ్యంకాదు. కానీ మనం భవిష్యత్తులో అభివృద్ధిమార్గంలో పయనించాలంటే, వర్తమానంలోని మన లోపాలేమిటో, సమస్యలేమిటో జాగ్రత్తగా గమనించాలి. మనకున్న వివిధసమస్యలలో కొన్ని మనలోని లోపాలవల్ల కలిగినవి. మరికొన్ని భౌగోళికపరిస్థితులవల్ల, దేశపరిస్థితులవల్ల కలిగినవి. మన సమస్యలలోకొన్ని ముఖ్యమైనవాటిని గురించి పరికించుదాము. మననిగురించి మనం ఆలోచించుకొనేటప్పుడు నిష్పాక్షికమైన దృష్టితో ఉన్నది ఉన్నట్లుగా ఆలోచించాలి.

ముందు మన ప్రస్తుతసమస్యలన్నింటిలోను ముఖ్యమైనది ప్రాంతీయతాభేదములవల్ల కలిగినది. మన తెలుగుదేశంలో తెలంగాణా, రాయలసీమ, సర్కారు అని మూడుభాగాలున్నాయి. తెలంగాణా, రాయలసీమలు సర్కారు జిల్లాలకంటె కొంతవరకు వెనకపడ్డప్రాంతాలు. సర్కారుజిల్లాలవారు (ఆంధ్రులు) తెలంగాణాకువచ్చి ఉద్యోగాలుచేసి, భూములుకొని వ్యవసాయంచేసి, వ్యాపారాలు చేసి కొంత స్థిరపడ్డారు. ప్రతిరంగంలోను వారు ప్రముఖపాత్రవహించడంవల్ల, వెనకపడిన తెలంగాణాప్రజలు కొన్నినష్టాలుపొందారు. ఉద్యోగావకాశాలు, మొదలైనవాటిల్లో ఆంధ్రులవల్ల తెలంగాణావారికి నష్టంకలుగుతోంది. కాబట్టి ఆంధ్ర, తెలంగాణాలు రెండు ప్రత్యేక రాష్ట్రాలుగా విడిపోవాలని ఉద్యమం లేచింది. ఆ ఉద్యమంవల్ల రాష్ట్రభవిష్యత్తు పెక్కు విధాలుగా దెబ్బతిన్నది. ప్రస్తుతానికి ఆ ఉద్యమ తీవ్రపరిస్థితులు చల్లారి నాయకులమధ్య కొంతవరకు సంప్ర

---

యువభారతి నిర్వహించిన వ్యాసరచనపోటీలో ఈఅంశముపై ప్రథమ బహుమతి నందుకొన్నవ్యాసం.

దింపులు జరుగుతున్నా, ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలమధ్య చెలరేగిన సంఘర్షణా సమస్యకు తగిన పరిష్కారము జరగలేదు. అంతేకాకుండా ప్రస్తుతం తెలంగాణాలో అమల్లోఉన్న "ముల్కీ" నిబంధనలుకూడా హైకోర్టు చెల్లడానికి వీలులేదని తీర్పునిచ్చింది. దానివల్ల తెలంగాణాకు కొంతనష్టం కలుగుతోంది. ఆంధ్ర, తెలంగాణాలు రెండు ప్రత్యేకరాష్ట్రాలుగా వెలసి, మన తెలుగుగడ్డను రెండు ముక్కలుగాచేసి బలహీనపడడమూ, లేక మనలోనే ఒకరివల్ల ఒకరునష్టపోవడమా అన్నది పెద్ద సమస్య. మనదేశంలో పూర్వం ఐకమత్యంలేక చిన్నచిన్న ముక్కలుగా దేశం విభజింప బడడంవల్లనే ఎన్నో కష్ట నిష్ఠురాలకు గురియైన సంగతి మనకు తెలుసు. ఒకవేళ రాజ్యాంగాన్ని సవరించి, ముల్కీనిబంధనను చెల్లించినా అప్పుడు మరి ఐక్యరాష్ట్రవిధానంవల్ల ఒరిగే దేముంది? ప్రతి విషయం దగ్గరా ఈ అభ్యర్థి ఆంధ్రుడా, తెలంగాణీయుడా, ముల్కీయుతుడా, ముల్కీరహితుడా ఈ విభేదాలు కలుగుతాయి. ఈ విధమైన ప్రాంతీయతా సమస్య మనను "ముందుకువెళ్తేనుయ్యి, వెనక్కి వెళ్తే గొయ్యి" అన్న పరిస్థితిలో ఉంచుతోంది.

తెలుగువారి ముఖ్యసమస్యలలో భాషాసమస్య యొకటి. తెలుగువారు నాలుగున్నరకోట్లున్నా ఆంధ్రరాష్ట్రం 1956 లోనే ఏర్పడ్డా రాష్ట్రవ్యవహారాల్లోనే తెలుగుకి సరియైన ప్రాధాన్యం లేదు. ఇకజాతీయస్థాయిలోను, మన తెలుగెక్కడుందో వెతుక్కోవాలి. ఇంతమంది తెలుగు వారిలోను తెలుగుతప్ప మరోభాషరానీ వారు ఎంతోమంది ఉన్నారు. వారే కార్యాలయానికెళ్లాలన్నా ఆంగ్లభాష తెలిసిన వారి కాళ్ళు పట్టుకోవలసిందే. అంతదాకా ఎందుకు యావదాంధ్రదేశానికి ముఖ్యపట్టణమని మనం గర్వంగా చెప్పుకునే మన హైదరాబాదులోనే మనభాషకు తగిన ప్రాతినిధ్యంలేదు. అదేమద్రాసువెళ్ళి చూస్తే, అక్కడా అనేక భాషలవారు నివసిస్తున్నా వాళ్ళ రాష్ట్రభాషఅయిన తమిళమే ప్రధానపాత్ర వహిస్తూ కనపడుతుంది.

ఇక బోధనాభాష విషయంలో చూద్దామా ఇప్పుడు బోధనాభాషగా డిగ్రీస్థాయిలో తెలుగు విరాజిల్లుతున్నా, చదివేవారే తక్కువగా కనిపిస్తున్నారు. మన తెలుగులో రాయబడ్డ శాస్త్రీయగ్రంథాలుచూస్తే, సాంకేతీక పదాలు కొన్ని ఆంగ్లానివే యథాతథంగా కన్పిస్తాయి. కొన్ని "అంతర్బహిః ప్రకోష్ఠిక (రేడియో – అల్మా)" లాంటి దీర్ఘమైన కఠినపదాలు, మధ్యలో సగం వ్యావహారిక భాష, కొంతగ్రాంథికభాష, ఈ విధంగా అతి లోపభూయిష్ఠంగా

ఉన్నాయి మన పుస్తకాలు. పైగా తెలుగులో శాస్త్రపాఠాలు చదివితే, ఒకవేళ పైరాష్ట్రాలకుగాని అంతర్జాతీయ స్థాయికిగాని వెళ్తే మనజ్ఞానం వాళ్ళకి వ్యక్తీకరించడం వీలుకాదు. అదీకాక మనం తెలుగులో శాస్త్రగ్రంథాలు, సాంకేతిక గ్రంథాలు ఆంగ్లములోనుండి అనువాదం చేసుకొని పోతూంటే మనం "డాల్టన్ పరమాణు సిద్ధాంతం" పూర్తి చేసేసరికి పైదేశాలవారు చంద్రమండలంలో నివసిస్తూ ఉండవచ్చు. పోనీ అలాకాదని ఆంగ్లమునే బోధనాభాషగా పెట్టుకుంటే విద్యార్థులు పుస్తకాలు కంఠస్థముచేస్తారు, పరీక్షల్లో కృతార్థులవుతారు గాని అసలైన జ్ఞానం వారికి కలగదు. వారు నేర్చుకునే దొకవిధంగా కృత్రిమ విద్యఅని చెప్పవచ్చును. ఎందుకంటె ఆంగ్లం మన మాతృభాషా కాదు, దగ్గర భాషా కాదు. మనలో ఆంగ్లంలో తమ భావాలన్నింటిని ఉన్నవి ఉన్నట్టుగా చెప్పగలవారు, ఇతరులు ఆంగ్లంలో ఏమి చెప్పినా సరిగా పూర్తిగా గ్రహించ గలిగిన వారు చాలా కొద్దిమంది మాత్రమే అనడం సత్యదూరం కాదు. మరి మిగిలినవారి గతి ఏమిటి? వారు ఆంగ్లంలో గ్రంథాలు చదవడం ద్రావిడ ప్రాణాయామం లాంటిది. బోధింప బడిన విషయాలు వారి హృదయాంత రాలలోకి చేరి ముద్రవేసికొని పోలేవు. ఉదాహరణకు అధ్యాపకులు ఆంగ్లంలో పాఠాలు చెబుతూంటే ఆ ప్రవాహానికి విద్యార్థులు తలలూపుతూ కూర్చుంటారు. చెప్పినదాన్ని గురించి వారికేమీ సందేహాలు రావు. అదే తెలుగులో పాఠం చెబితే వారికి చెప్పింది అర్థమైఅనుమానాలుకూడా కలుగుతాయి. అనుభవజ్ఞులైన కొందరు శాస్త్రోపధ్యాయుల పరిశీలనా ఫలితం ఇది.

సాహిత్యంకూడా తెలుగువారికి సమస్యాయుతమైనది. కొందరు ప్రాచీన, సాంప్రదాయ సాహిత్యాన్ని పఠించాలంటే, మరికొందరు పాతకాలపు సాహిత్యం పఠనీయంకాదు, నవీన మార్గంలో సాహిత్యం పయనించాలంటున్నారు. కొందరు పాతరాతియుగం దాటిరామంటే మరికొందరు ప్రాచీన గ్రంథాల నగ్ని కాహుతి చేయాలంటున్నారు. సామాజికులలో వివిధ రకాల దృక్పథాలుండవచ్చును. కాని పాతకొత్తలను సంధించే సమ్యక్‌దృష్టి, ఇతరుల భావాలనుగూర్చిన సహనం ప్రతివారికీ అవసరం. కాని మన తెలుగు సాహిత్యంలో ప్రాచీన సాంప్రదాయాలకు, నవీన మార్గాలకు ఆయా సిద్ధాంతాలకు సంబంధించిన వ్యక్తుల మధ్య సిద్ధాంత భేదాలకు తోడు వ్యక్తిగత ద్వేషాలు రగుల్కొటంకూడా జరుగుతోంది. సాహిత్యం విషయంలో అనేకరకాలైన భేదాభిప్రాయాలు కలిగి, విరోధాలుకూడా రగిలి మన సాహిత్యరంగం మాధుర్యాన్ని, చైతన్యాన్ని, హృదయస్పందనాలని,

వివేకాన్ని, ప్రజలకి అందించడానికి బదులు తగవులకు నిలయమైంది. వాదోప వాదాలు, పరస్పర నిందలు మొదలైనవాటితో మహాకవులైనవారుకూడా, సామాన్యులకన్నా హీనంగా అసలు సాహిత్యంవిషయం మర్చిపోయి, వ్యక్తిగత ద్వేషాలకు గురిఅయి,తగవులాడుకునే దురవస్థకు గురిఅయింది తెలుగుసాహిత్యరంగం. ఛందోకవిత్వం, భావకవిత్వం, అభ్యుదయకవిత్వం, విప్లవకవిత్వం, అ. ర.సం, వి. ర. సం. ఇన్నిరకాల కవిత్వాలు బయల్దేరి, సృజనాత్మక సాహిత్యం కరువై పనికిరాని చెత్త ఎక్కువై ప్రజలకు ఏది చదవాలో అర్థంకాక అసలు సాహిత్యమంచేనే తలనొప్పి కలిగేలా తయారయింది పరిస్థితి. సహనం, సామరస్యం లేక "నేను చెప్పినది మాత్రమే వేద" మనేభావం ప్రముఖ సాహితీవేత్తలలో కలగబట్టి, కలిగింది సాహితీ అసహన సమస్య.

అలాంటిదే మరొకసమస్య మన గ్రంథాలు రాయడానికి గ్రాంధికభాష వాడాలా, వ్యావహారికభాష రాయాలా అన్నది. పూర్వంనుంచి గ్రంథరచనకు వాడబడుతున్న వ్యాకరణబద్ధమైన భాష గ్రాంధికభాష. మన నిత్యవ్యవహారాల్లో మాట్లాడడానికివాడే వాడుకభాష వ్యావహారికభాష. మాట్లాడడానికి ఒకభాషేమిటి, వ్రాయడానికి వేరేభాష ఏమిటి, వ్రాతకుకూడా వ్యావహారికాన్నేవాడాలి, లేకపోతే గ్రంథాల్లో వాడేభాష ప్రత్యేకంగా సాహిత్యం పఠించినవారికేగాని సామాన్య పాఠకులకర్థంకాదు. ఈ గ్రంథరచన వ్యావహారికభాషలోనే సాగితే చదివేవారికి తేలికగా ఉండి సరిగ్గా అర్థమవుతుందని కొందరిభావన. ఈవాదనాసత్యమే. తెలుగులోవ్రాయబడ్డా, ఎంతోమంది తెలుగువారికే అర్థంకానివిధంగా ఉండడం గ్రాంథికభాషలోని లోపం. కాని మరికొందరు నిత్యవ్యవహారంలో భాష ఎన్నో మార్పులు, చేర్పులు చెందుతూ ఉంటుంది. వాటినన్నిటిని క్రమబద్ధంచేసే వ్యాకరణంలేకపోతే భాష ఒక్కొక్కప్రాంతంలో ఒక్కొక్కమాదిరిగా మారుతూపోతే, చివరికి ఒక జిల్లాభాషకు పక్కజిల్లా భాషకు కూడా సంబంధం లేకుండా అసలు తెలుగే చిన్నాభిన్నామై పోవచ్చు, కాబట్టి వ్యాకరణయుక్తమైన గ్రాంధిక భాష అన్నిచోట్ల గ్రంథరచనకు ఉపయోగపడితే మొత్తంమీద భాషాస్వరూపం మారిపోదంటారు. అదీనిజమే. మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం తీసుకుంటే రాష్ట్రమధ్యభాగంలో ఉన్న కొన్ని జిల్లాలలో తప్పించి, రాష్ట్రసరిహద్దుల్లో వున్న జిల్లాలలో ఇతర భాషల ప్రభావ మెక్కువగా ఉంటుంది. ఉదాహరణకు ఒరిస్సా సరిహద్దులలో ఉన్న శ్రీకాకుళం జిల్లాలో ఒరియా ప్రభావం, తమిళనాడు సరిహద్దులలో నున్న చిత్తూరు

మొదలైనచోట్ల తమిళపు ప్రభావం, మైసూర్‌కి దగ్గర్లో ఉన్న గుంతకల్లు ప్రాంతాల్లో మైసూరీ ప్రభావం, తెలంగాణా ప్రాంతాల్లో ఉర్దూ ప్రభావం మన తెలుగుభాష మీద ఉన్నాయి. ఏప్రాంతంలోని వ్యావహారికాన్ని ఆ ప్రాంతపు గ్రంథాల్లో ఉపయోగిస్తే కొన్నాళ్ళయేసరికి ఒకేరాష్ట్రంలో ఒకేభాషయినా ఒక ప్రాంతంభాష మరోప్రాంతాని కర్థంకాకపోవచ్చు. కాబట్టి ఈ పరభాషాప్రభావాన్ని భాషలో మార్పుల్ని క్రమబద్ధంగా ఉంచడానికి గ్రాంథికభాష అవసరమే. కొంతమంది వ్యావహారికభాష పుస్తకాల్లోవాడితే, తెలుగుభాష మైలపడిపోతుందేమోనని భయపడుతుంటే, కొందరు గ్రాంధికభాషను నాశనం చెయ్యాలంటే, భారతరామాయణాలను తగలబెడితే చాలుతుందా, చాలదా అని ఆలోచిస్తున్నారు.

ఆర్థిక సమస్యలుకూడా తెలుగు వారికి ఎక్కువే. ఆంధ్ర రాష్ట్రం వ్యావసాయికరాష్ట్రం. కాని ఈ రాష్ట్రంలోని చాలా జిల్లాలలో సరియైన నీటి పారుదల సౌకర్యాలు లేవు. తగిన పరికరాలు విత్తనాలు మొదలైన వాటిని కొనడానికి, రైతులు చాలా ఆర్థిక ఇబ్బందులలోనుండి కొనలేకపోతున్నారు. శూన్యంలో అధికమాస మన్నట్టు, వారిని కరువులు లేక వరదలు తికమక పెడుతున్నాయి. ఆంధ్రదేశంలో తినడానికి సమీకృతాహారం దొరకని వారి సంఖ్య చాలా అధికం. వ్యావసాయిక సమస్యలకి తోడు మనరాష్ట్రం పారిశ్రామికంగా కూడా వెనుక పడిందనే చెప్పాలి. పూర్వం ఆంధ్రరాష్ట్రంలో అత్యధికంగా ఉండి, దేశాన్ని సస్యశ్యామలం చేసిన కుటీర పరిశ్రమలు ఇప్పుడు చాలావరకు నశించిపోవటం జరిగింది. పల్లెసీమల్లో ఇబ్బందులకు గురి అవుతున్న సన్నకారు రైతులకు, ప్రభుత్వం చేయదలచినసహాయం, వారికి సక్రమంగా చేరక మధ్య దళారీల అవినీతికి ఆహుతై పోతున్నది. ఈ ఆర్థిక సమస్యలనెదుర్కోటం, అవినీతిని అంతమొందించడం ఎలాగన్నదో పెద్ద సమస్య. నిరుద్యోగ సమస్య అధికంగా ఉన్న రాష్ట్రాలలో మనరాష్ట్రం కూడా ఒకటి.

ఇక సాంఘిక సమస్యల విషయానికొస్తే వరకట్నాలు, కులమత భేదాలు, ఆంధ్రప్రదేశ్‌లో చాలా ఎక్కువని గణాంక కారులు చెప్తున్నారు. ఇకమూఢ నమ్మకాల సంగతి చెప్పనే అక్కరలేదు. ఒకేభాష మాట్లాడేవారిలో ఎన్నోకులాలు, ప్రతికులంలో మళ్ళీ కొన్ని వర్గాలు, ప్రతివర్గంలో కొన్ని శాఖలు, ఈ విధమైన అవాంఛనీయమైన విభజన మనలో కనిపిస్తోంది. ఎన్నో సాంఘిక సమస్యల్ని పరిష్కరించడానికి ప్రభుత్వం శాసనాలు చేస్తోంది.

కాని ఆ సమస్యలు అంతర్వాహినులుగా మననింకా బాధిస్తూనే ఉన్నాయి. తెలుగువారిలో ఐకమత్యం లేకపోబట్టి పూర్వంలోను, వర్తమానంలోను కూడా ఎన్నోసమస్య లెదురౌతున్నాయి.

భౌగోళికపరిస్థితుల దృష్ట్యా ఉష్ణదేశస్థులైన తెలుగువారు శారీరకంగా దుర్బలులు. దాని కితర సమస్యలు తోడై వారిని మరింత కృంగదీస్తున్నాయి. మానసికంగాను, మన తెలుగువారికి ఎక్కువ దౌర్బల్య మున్నది. తక్కిన వారినుండి నేర్చుకొనడం తక్కువ. కేంద్రప్రభుత్వానికి సంబంధించిన ఐ. ఎ. యస్. మొదలైనవాటి ఎన్నికల్లో మనతెలుగు వారు విజయం పొందడం చాలా అరుదని లెక్కల ప్రకారం తెలుస్తున్నది. వారిలో తగినంత ఉత్సాహం, పట్టుదల తక్కువ అవడమే దానికి కారణం. వేగినాడులో విహరిస్తూ కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వేంగిరాజ్యపు రోజులలోని తెలుగు వారి స్థితిని నేటితెలుగువారి స్థితిని తలపోసి అప్పటిస్థితి నాలోచించి "అశ్రువులు జార్తుజీ వచ్చువాంధ్ర జనులు" అని వ్రాసినారు. అట్లే శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు "చెక్కుచెదరని, ఏనాడు మొక్కవోని, ఆంధ్ర పౌరుష మిప్పుడద్ధ్వాన్నమయ్యె" నని బాధపడినారు. వీనివలన మనతెలుగువారిప్రస్తుత పరిస్థితి కొంతవరకు బాధాకరమైన దనిపిస్తుంది.

ఈ విధంగా ఎన్నో సమస్యలతో సతమత మవుతున్న మనం మన పరిస్థితిని సరిగ్గా ఆకళించు కోవాలిగాని నిరుత్సాహపడకూడదు. సమస్యలను యథాతథంగా అర్థం చేసుకొని వాటిపరిష్కారానికి కృషిచెయ్యాలి. ఇనప కండరాలు ఉక్కునరాలు సంపాదించుకుని వివేకంతో, పట్టుదలతో, ఐక్యతతో కృషి చేస్తే ఏసమస్యలయినా పరిష్కరింపబడతాయి. మనము సరిఅయిన ప్రయత్నం చేసి "దేశభాషలందు తెలుగులెస్స," "దేశవాసులందు తెలుగువారు గొప్ప" అని మరొక్కసారి అనిపించాలి.

# జాతీయ సమైక్యభావం

శ్రీ ఎన్. ఇన్నయ్య

భారతదేశంలో జాతీయసమైక్యతాభావం లోపించింది గనుకనే విదేశీయులు సులభంగా జయించి పాలించగలిగారని ఒకవర్గం భావించింది. మన దేశంలో అనాదిగా సాంస్కృతిక, మతపరమైన సమైక్యత ఉన్నదని మరొకవర్గం అంటున్నది. కాని నేడు జాతీయసమైక్యత అనగానే రాజకీయ పరమైన సమస్య అని విస్మరిస్తున్నారు. రాజకీయ సమైక్యత ఉంటేగాని ఆర్థిక, సామాజిక అభివృద్ధి సాధ్యపడదు.

నిష్పాక్షికంగా చూస్తే భారతదేశం, ఒక ఉపఖండంలో నివసిస్తున్న నానాజాతి సమ్మేళనంతో కూడినది. బ్రిటిష్‌వారు రానట్లయితే మనంకూడా నేటి ఐరోపాదేశాలవలె ఉండేవాళ్ళం. స్వాతంత్ర్యపోరాటంవలన ఒకవిధమైన రాజకీయ వత్తిడి యేర్పడి, భిన్నజాతులు సైతం ఒక కేంద్రప్రభుత్వాన్ని అంగీకరించవలసి వచ్చింది. కనుక మన జాతీయవాదానికి గతచరిత్రలేదు.

స్వాతంత్ర్యానంతరం, రెండు సందర్భాలలో జాతీయసమైక్యతాభావం యేర్పడినట్లు అగుపించింది. చైనా - భారత సరిహద్దుసమరంలో ఒక్క కమ్యూనిస్టులు మినహా మిగిలినవారంతా, చైనాను ఖండించటానికి ఐక్యమైనారు. రెండవపర్యాయం పాకిస్తాన్‌కు భారతదేశానికి సంభవించిన పోరాటసందర్భంగా కొందరు ముస్లింలు మినహా మిగిలినవారంతా ఒకత్రాటిపై నిలబడినట్లగుపించారు. అయితే ఈ రెండు సందర్భాల సమైక్యతకూడా పరోక్షమైంది. విదేశాల భయంవలన దేశంలో ఐక్యత ఏర్పడటం ఆత్మరక్షణ ప్రయోజనాన్ని సూచిస్తుంది. ఈ సమైక్యతకూడా తాత్కాలికంగా మాత్రమే నిలచింది. విదేశీ భయం క్షీణించగానే, అంతఃకలహాలు యధావిధి విజృంభించినవి.

భారతదేశం భాషారాష్ట్రవిభజనకు గురైనప్పటినుండి సమైక్యతకుబొత్తిగా అవకాశంలేకుండా పోయింది. రాజకీయంగా సమైక్యత తీసుకురావటానికి కొన్ని పక్షాలు, మతపరంగా రాబట్టటానికి మరికొన్నిపక్షాలు ప్రయత్నించాయి. కాని విఫలమైనవి. అందుకు ప్రధానకారణం విషయాన్ని సాంగోపాంగముగా అవగాహన చేసుకొని, పరిష్కారానికి పూనుకోపోవటమే.

ఆధునిక విజ్ఞాన ప్రభావం పెరుగుతున్న రోజుల్లో మతపరంగా విజ్ఞప్తి

చేసి, ఐక్యత తీసుకురావటం అసంభవమేగాక, అశాస్త్రీయంకూడా. భిన్న మతాలమధ్య పైపై విభేదాలుగాగ, అసలు మూలంలోనే తేడాలున్నవి. సాంస్కృతికంగా భిన్నత్వం ఉన్నది. కనుక ఈశ్వర అల్లా తేరేనాం అనే నినాదం పూర్తిగా పెడచెవిన బెట్టారు.

ఇక మిగిలింది ఒక్కటే మార్గం. మన రాజ్యాంగపరంగా సమైక్యత సాధించుకోవాలి. మనిషిని కేంద్రంగాపెట్టుకొని ప్రగతిని సాధించాలనే ధోరణి గల రాజ్యాంగం ప్రజలలో బాగా ప్రచారం గావాలి. కాని కాలేదు.

జాతీయ సమైక్యత విషయంలో స్వాతంత్ర్యానంతరం తెలుగులోవచ్చిన సారస్వతం అనల్పమేగాక, ఎవరి దృష్టినీ ఆకర్షించలేదు. విదేశీ దాడుల ప్రమాదం ఉన్నప్పుడుమాత్రం కవులు, రచయితలు కొందరు పాతపాటలు, నినాదాలు యథాశక్తి ప్రచారం చేశారు. ప్రభుత్వ ప్రసార సాధనాలు వినియోగించుకున్నారు. ప్రజల ఉద్వేగాన్ని కదలించే మతపరమైన ప్రచారం జరిగింది. ఈ విషయంలో తెలుగుకవులు, రచయితలు సమకాలీనులుగా మనజాలక, గతంలో బ్రతికారు. మానవ విలువల ఆధారంగా సమైక్యత తీసుకురావాలనే విచక్షణ వారెవరూ పాటించలేదు. వైజ్ఞానిక దృక్పథం లేకపోవటమేగాక, సమాజ చైతన్యంకూడా గ్రహించకపోవటం మన రచయితల, కవుల ప్రధాన లోపం.

ఈ విషయంలో కొంతవరకు కృతకృత్యులైన రచయితలు లేకపోలేదు. ముఖ్యంగా మూఢనమ్మకాలను ఎదుర్కొంటూ, దేవునిపేరిట జరుగుతున్న మోసాల్ని చూపుతూ సాంఘిక న్యాయంకోసం తమ రచనల వాడిని చూపిన వారున్నారు. అలాంటివారిలో పేర్కొనదగినవారు: నార్ల వెంకటేశ్వరరావు ("నార్లవారి మాట"), రాచకొండ విశ్వనాథశాస్త్రి (నిజం, ఆరు సారా కథలు, ఆరు సారో కథలు, బాకీ కథలు, రాజు మహిషి), బీనాదేవి (హేంగ్ మి క్విక్, బీనాదేవి కథలు), కె. వి. రమణారెడ్డి, దిగంబరకవుల రచనలు, వి.ర.సం. రచయితలు కొందరు ఈ కోవలో చేర్చదగినవారు.

సమాజంలో జరుగుతున్న అన్యాయం, దోపిడీలపై యీ రచయితల దాడి పరోక్షమైనదైనా అందరూ అంగీకరించేదే. అంటే విమర్శద్వారా సమైక్యతకు దారితీసే విధానం కనబడుతుంది. సమాజంలో ఉంటూ, పోకడలు చూస్తూ, వాస్తవ దృక్పథంతో రచనలుచేయటం, తద్వారా పాఠకులలో విచక్షణాయుత ఆలోచల్ని రేకెత్తించటం యీ రచనల విశిష్టత. టీవివలన తక్షణమే సమైక్యత

